# శ్రీమద్భాగవత మకరందము

## (1 నుండి 12 స్కంధములు)

## (గేయకవిత)



రామదర్శన ప్రభాసి-రాజకవి-గేయకవితా వాల్మీకి

**సూరంపూడి రాధాకృష్ణమూర్తి**

# శ్రీమద్భాగవత - మకరందము

## (1 నుండి 12 స్కంధములు)

(గేయకవిత)



## శ్రీ సీతారామచంద్ర పాదాంకితము

నా స్వామి రాముడు - నా మనోహరుడు,
ఈస్వామి - జగములను కాపాడ గలడంచు,
మాసీత లీలగా - వామాంక మందున,
ఆసీనురాలయ్యె - ఆ - శోభ కనువిందు.

చల్లని రాముడు అమ్మతో నాడు
అనుగ్రహించగ అదే వరమయి
ఈ గ్రంధమ్ము వెలుగు చూచినది
రామపాదముల కంకితమైనది.

(భద్రాద్రిశోభ)
సూరంపూడి రాధాకృష్ణమూర్తి.

2002, కార్తీకమాసం

వెల : అమూల్యం

డి.టి.పి. మరియు ప్రింటింగ్
**రాజ్ ప్రింటర్స్**
1-10-122/3/1/ఎ
అశోక్‌నగర్, హైదరాబాద్.
**ఫోన్ : 7639837**

ప్రతులకు :
సూరంపూడి రాధాకృష్ణమూర్తి
అడ్వకేట్
'ఆమని' 16-11-418/3/1,
దిల్‌సుక్‌నగర్ - 2,
హైదరాబాద్ - 500 036.
**ఫోన్ : 4045361**

# వినాయక స్తుతి



ఏకదంతము శూర్పకర్ణము
చలువచూపుల చిన్నవాడా
పార్వతమ్మకు ముద్దుకొమరుడ
విఘ్నరాజా వందనమ్ము.



లలితస్కంధము కృష్ణమూలము శుకాలాపాభిరామంబుమం
జులతా శోభితమున్ సువర్ణ సుమనస్సుజ్ఞేయమున్ సుందరో
జ్వల వృత్తంబు మహాఫలంబు విమలవ్యాసాలవాలంబునై
వెలయున్ భాగవతాఖ్యకల్ప తరువుర్విన్ సద్విజశ్రేయమై

- (బమ్మెరపోతనామాత్యులు)



తరణికులేశ నా నుడులదప్పులు గల్గిన నీదు నామ స
ద్విరచితమైన కావ్యము పవిత్రముగాదె వియన్న దీజలం
బరగుచు వంకయైన మలినాకృతి బాఱిన దన్మహత్వముం
దరమె గణింపనెవ్వరికి దాశరథీ కరుణాపయోనిధీ:

- కంచర్ల గోపన్న గారు (రామదాసు)

# భద్రాద్రి శోభ

నా స్వామి రాముడు - నా మనోహరుడు,
ఈస్వామి - జగములను కాపాడ గలడంచు,
మాసీత లీలగా - వామాంక మందున,
ఆసీనురాలయ్యె - ఆ - శోభ కనువిందు.

మా అన్న రాముడు - సీతమ్మ మావదిన
పట్టాభిషిక్తులై జగమేలు శుభవేళ
నావంతు సేవ - నే - తలచు కొని పులకింతు
అన్నట్టు సౌమిత్రి భక్తిగా నిలచాడు

పవన నందనుడిపుడు తండ్రితో తా కలసి
సుమగంధమును - మేన పూయుచున్నాడు
భద్రమూర్తీ! నిన్ను భద్రాద్రిలో గాంచి
పులకరించానయ్య - జన్మ - సార్థకమయ్యె

***



**ది. 3-7-2001 న రచయితకు జరిగిన**

**షష్ట్యబ్ది మహోత్సవ సందర్భంగా**

**అవధాన సహస్రఫణి**

**అవధాన సరస్వతీ పీఠాధ్యక్షులు**

**బ్రహ్మశ్రీ డా॥ మాడుగుల నాగఫణిశర్మ గారి ఆశీస్సులు.**



సూరంపూడి కులోద్భవ
ధీరునకీ షష్టిపూర్తి దివ్యోత్సవమీ
తీరున - జయలక్ష్మీయుత
సారంబై 'వి' నుతి కెక్కె సౌందర్యకళన్

రాముడు కరుణాధాముడు
స్వామియు తాను గ్రరథుని సత్కృపజిందన్
ప్రేమైక జీవనముతో
రామాయణమూర్తి యయ్యె రామునిరూపై

అరవైరేకుల పద్మము
సరసము మీ జీవితమ్ము సాహస్రదళో
త్కర మౌచు సహస్రారా
ద్వర బంభరమౌను - మారుతాత్మజు దయతో

ఆయురారోగ్యైశ్వర్యము
శ్రీయును సత్కీర్తి విభవ చిత్రిత పదమున్
ధీయుత భక్తియు రాగము
లాయన రామాయణ కృత మమృత ఫలములౌ.



# కళాప్రపూర్ణుని ఆశీస్సులు

జీవితం భక్తి ముక్తి దాయకం అన్నారు పెద్దలు. భక్తి లేనిదే ముక్తి లేదు. ఆధ్యాత్మిక చింతనలో మునిగే ప్రతి జీవి, జీవిత సాగరాన్ని తరించడానికి ఒక నావ వెతుక్కుంటాడు. ఆ నావ తప్పక కైవల్య తీరానికి చేరుస్తుందని విశ్వసిస్తాడు. చీకటి గోళంలో మునిగి ఉన్న ప్రాణికి ముందుగా వెలుగు అందాలి. అది జీవితమంతా చిందాలి. ఆ వెలుగులో నుంచే చూడగలుగుతాడు దూర దూరానగల నావను. పరమాత్మను స్మరిస్తూ అటువైపు పరుగులు తీస్తాడు, నావలో జేరతాడు. కైవల్య తీరం వైపు నావ పయనిస్తుంది. జీవి పరవశిస్తాడు. చేతులెత్తి దైవాన్ని ప్రార్థిస్తాడు. ఐహికాలకు దూరంగా నడుస్తుంది నావ. ఆముష్మికపు గాలివీచి, పారలౌకికపు తెరచాపను జాపి పడవను వడివడిగా నడిపిస్తుంది. జీవి-దేవుని చేరే మార్గమిదే.

ఎక్కడిదీనావ? ఎవరు పంపిన నావ? ఈ నావ పయనించే త్రోవ, కైవల్యానికి ఎలా చేరుతుంది? ఇవన్నీ ఈ చిన్ని మనస్సుకు సమాధానాలు అందని ప్రశ్నలు. భక్తి పారవశ్యంలో బ్రతుకును ముందుకు నెట్టుకొంటూ పయనించేవారికి అవగత మవుతుందేమో ఈ రహస్యం. అవును అవుతుంది. నామస్మరణతో ఈ నావను దర్శించవచ్చు. ఈ నామము ఒక్కటేగాదు, ఎన్నెన్నో నామాలు. అందులో ఉత్కృష్ట మైనది రామనామము. ఏనాటినుండో ఎందరెందరో జపించి తపించిన నామము. వాల్మీకి ప్రవచించిన నామము. ప్రస్తుతించిన నామము. నరులకు సొత్తుగా అందించిన నామము. వాల్మీకి నుంచి నేటి వరకూ ఎందరెందరో రామనామం ఆలపించారు.

వాల్మీకి వారసుడు త్యాగయ్య. మరియొక వారసుడు పోతన. ఇలా ఎందరెందరో రామకవిత పేరిట రసవాహినిని, మానవ జీవితపు మాగాణులలో, వాహినిగా ప్రవహింపచేస్తున్నారు. ఇంకిపోని వాహిని ఇది. పంకిలములను క్షాళన చేసే నామం ఇది. గుండెలలో పీయూషం కురిపించే నామము ఇది. బ్రహ్మాండము నిండిన రామనామము ఇది. భక్తుల బ్రతుకులు పండించిన రామనామము ఇది.

*రామకథ ఎందరి హృదయాలలోనో కదిలి, మెదిలి, ఘంటాలద్వారా, కలాలద్వారా, అక్షర రూపంగా సాక్షాత్కరించి శాశ్వతత్వాన్ని సంతరించుకొన్నది. ఈ శక్తిని చాలా మందికి రాముడే అందిస్తాడు. ఎందరెందరి చేతనో తన చరిత్ర వ్రాయించుకోవడం ఆయనకు ఉబలాటం. అదే రచయితలకు జీవిత సాఫల్యాన్ని అందిస్తుంది. రామాయణం యుగ యుగాలుగా వడలిపోని, వాసన వీడని పారిజాతము.*

*చిరంజీవి* **"రామదర్శన ప్రభాసి" శ్రీ సూరంపూడి రాధాకృష్ణమూర్తి** *కనబడని రామభక్తుడు. ఆయనవంక చూస్తే కనిపించేది, అకలంకోజ్వల దివ్యమూర్తి శ్రీరామచంద్రమూర్తి.* ***రాధాకృష్ణమూర్తిగారు** తొలుతగా **'సుందరకాండ'** గేయరూపంలో వ్రాశారు. దానిని శ్రీపరాసేని రామచంద్రరావు ప్రభృతులు అనేక తావులలో గానం చేసి విశేష ప్రచారం గావించారు. ఇప్పుడు **'బాలకాండ'** వెలుగులోకి వచ్చినది. దీనిని భక్తకోటికి సమర్పించే భాగ్యం భాషా కుటీరానికి లభించినందులకు నేనెంతో సంతోషిస్తున్నాను. **రాధాకృష్ణమూర్తిగారు** తక్కిన కాండలను త్వరలో రచించి, ముద్రించి, శ్రీరామునికి అందించి, తరిస్తారని భావిస్తున్నాను. నా పక్షాన గూడా వారిని దీవించమని శ్రీరామచంద్రుని ప్రార్థిస్తున్నాను.*

**కళాప్రపూర్ణ డా॥ రావూరు వెంకట సత్యనారాయణరావు**

అధ్యక్షులు

భాషా కుటీరం, హైదరాబాదు.

(కళాప్రపూర్ణులు, ఆనాడు అందించిన ఆశీస్సుల బలంవల్ల - శ్రీరామానుగ్రహం వల్ల - పూర్తిగా శ్రీమద్రామాయణ మకరందము మరియు శ్రీమద్భాగవత మకరందము గేయకవితగా వ్రాసే భాగ్యం కలిగింది.

**– రాధాకృష్ణమూర్తి**



**డా॥ Er. చండిక సాంబశివరాజు, Ph.D.**

B.E.(Hons) M.Tech. M.B.A., L.L.B.
M.S.E. (Lond), A.M. Ex. A (Eng)

కృష్ణాతరంగిణి చల్లగా పాడింది
అల్ల, అరశేపల్లి ఉల్లమే పొంగింది
ఆనందనందనం కమలాంబ తల్లిదే
ఈ నందివర్ధనం శ్రీ సుబ్బరాజుదే.

నిండైన విగ్రహం భక్తిపై నిగ్రహం
మనసెంతో స్వచ్ఛము నెయ్యంపు గుచ్ఛము
విద్య, వినయములందు ఎన్నికైనవాడు
ఆ ఉషారాణినే ఎన్నుకున్నవాడు.

శ్రీకృష్ణ సేవలో నేముందు అన్నాడు
ఈ పూవు విరియంగ నేనుందు నన్నాడు
నిండుగా నూరేళ్ళు చల్లగా వుండాలి
మారాజు– మనరాజు– ఈ సాంబశివరాజు.

– రాధాకృష్ణమూర్తి

# ఉడతా భక్తి

– చండిక సాంబశివరాజు

సం॥ 2002.

ఆత్మ సోదరీ, సోదరులకు నమస్సుమాంజలులు,

తెలుగు భాష చరిత్రలో ఇదొక శుభదినం. శ్రీ సూరంపూడి రాధాకృష్ణమూర్తి గారి సుదీర్ఘ అకుంఠిత దీక్ష, శ్రమ ఫలించిన శుభ సమయం. శ్రీ మహా భాగవతము, సంస్కృతంలో శ్రీ వ్యాసమునీంద్రులు, సంస్కృత+ఆంధ్రలో శ్రీ భక్త పోతన గారు మానవాళికి అందించారు. ఈ రెండు గ్రంధములు మిక్కిలి కఠినమైన సంస్కృతము, మరియు తెలుగు పదములు కలిగియున్నవి. అందువలన వీటి ఫలము పండితులకు మాత్రమే పరిమితమయినది. సామాన్య ప్రజలకు అర్ధముకాక, వాటిని బీరువాలలో భద్రపరుచుట జరుగుచున్నది. ఇది గ్రహించి కొందరు కవులు వచనము, పద్యరూపములుగ అనువదించిరి. ఇవి ఇందులోని విషయము, కథలు తెలియ పరుచుట వరకు కొంతవరకు ఉపయోగపడుచున్నవి. కాని, ఇంతవరకు సామాన్య వాడుక భాషలో కవిత రూపంలో ఎవరు ప్రయత్నం చేయలేదు అని నా నమ్మకం.

సూరంపూడి రాధాకృష్ణమూర్తి గారు కొత్త ప్రయోగం చేసి ఈ లోటును తీర్చినారు తన సహజ కవిత్వంతో తనదైన బాణీలో తీయని తెలుగు పదాలతో, చక్కని తేలిక వాక్యాలతో, తెలుగు భాష తెలిసిన ప్రతి మామూలు మానవుడు కూడా అర్ధంచేసికొని ఆనందించగల రీతిలో, కవిత రూపంలో భాగవతమును తెలుగు జాతికి అందించారు. త్వరలో రిలీజు కానున్నది మిక్కిలి సంతోష సమయము.

1978 సం॥ నుండి, రాధాకృష్ణమూర్తి గారు, తీయని తేటతెలుగులో కవితలు వ్రాయుట మొదలిడినారు. మొదట, శ్రీ వాల్మీకి రామాయణంలోని "సుందర కాండము" వ్రాశారు. తర్వాత మా ప్రోత్సాహంతో మిగిలిన అన్ని కాండములు వ్రాసినారు. ఇంత చక్కని గ్రంధాన్ని, మానవ సేవ మాధవ సేవగా భావించి, నేను

అచ్చువేయించి, భక్తులకు ఉచితంగా అందించినాను. తదుపరి, శ్రీ షిర్డిసాయినాథ భాగవతం, శ్రీమహా భాగవత దశమ స్కంధము వ్రాసినారు. వాటిని నేను అచ్చు వేయించి భక్తులకు అందించినాను. శ్రీ మూర్తిగారిని ప్రోత్సహించి, శ్రీ మహాభాగవతం అన్ని స్కంధములు వ్రాయించి, సంపూర్ణ మహాభాగవతమును అచ్చు వేయించి, ఇప్పుడు మీ ముందుంచుచున్నాము.

వాల్మీకి రామాయణం, వేద వ్యాస మహాభాగవతము మనకు పవిత్ర కావ్యములు, శుభముల రాశులు. ఇవి చదివిన వారికి, వినిన వారికి, శుభములు కలుగునని మన నమ్మకం. రాధాకృష్ణమూర్తి గారి కవితా గ్రంథములను ఎందరో చదువుట – పాడుట జరుగుచున్నది.

కేవలం సేవాభావనతో, ఎటువంటి ఫలాపేక్ష లేకుండ ఈ పవిత్ర తెలుగు కవితా "మహా భాగవతము" ను అచ్చువేయించి మీ ముందుంచుచున్నాము. అందరు దీనిని చదివి శుభములు పొందగలరని ఆ పరమేశ్వరుని ప్రార్ధించుచున్నాను.

ఈ మధ్యనే, ప్రపంచ వ్యాప్తంగ, డిజిటల్ లైబ్రరిలో చోటు చేసికునే తెలుగు గ్రంథాలలో, మన సూరంపూడి రాధాకృష్ణమూర్తి శ్రీ మద్రామాయణ మకరంద గ్రంథము ఉన్నదని తెలిసింది చాలగర్వకారణం. తెలుగు భాషకు, తెలుగు జాతికి అమూల్యమైన గ్రంథాలను అందించుచున్న శ్రీ రాధాకృష్ణమూర్తి గార్కి, భగవంతుడు ఆయురారోగ్య ఐశ్వర్యములు ప్రసాదించకోరుచున్నాను.

"సర్వేజనాస్సుఖినోభవన్తు"

16-12-674, మలక్‌పేట్,
హైదరాబాదు – 36.
ఫోన్ : 040 – 4558596

ఇట్లు
చండిక సాంబశివరాజు
03.10.2002



సూరంపూడి రాధాకృష్ణమూర్తి (రచయిత)
శ్రీమతి విజయలక్ష్మి

గోస్తనీ నది ఉన్న - తణుకు పుట్టిన ఊరు

జన్మనిచ్చిన పుణ్యమూర్తి - మహాలక్ష్మమ్మ

నాపాలి దేవుడు - కామేశ్వరుడు - తండ్రి

శ్రీరామచంద్రుడు - ఆరాధ్యదైవమ్ము.

# భాగవతోత్తములకు నమస్సుమాంజలి

"భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు
శూలికైన తమ్మిచూలికైన
విబుధజనుల వలన విన్నంత - కన్నంత
తెలియ వచ్చినంత - తేటపరతు"

అని సహజకవి శ్రీ బమ్మెర పోతనగారన్నారు. కాబట్టి భాగవతం ఎంతగొప్పదో – రచయితలకు ఎంత గట్టిదో తెలుస్తుంది.

భక్తి – వేదాంతములు అపారసముద్రాలు పూర్తిగా తెలుసుకోడాన్కి ఒక జీవితకాలం చాలా చిన్నది. అలా – అని, అవి ఊరుకోనీయవు కొంతైనా తెలుసుకునే అవకాశం యిస్తాయి. ఆ తరువాత ఆచరణచేస్తూ – మననం చేసుకుంటుంటే మరికొంత తెలుసుకోవచ్చు.

భాగవతంలో, నాకు గ్రహింపు అయినది అనన్య భక్తి. శ్రీహరినామ – కీర్తన అదే ప్రధానం. యజ్ఞ – యాగాది క్రతువులు – నిష్టలు నియమాలు కఠోరవ్రతదీక్షలు – శాశ్వత సుఖాన్ని ఇవ్వవు. జన్మరాహిత్తి కలుగజేయవు. శాశ్వత సుఖం, పరంధాముని పాదపద్మాలవద్ద దొరుకుతుంది – భక్తి – నామ సంకీర్తనలతో.

గత 25 సంవత్సరాల ఆధ్యాత్మిక వ్యవసాయంలో శ్రీమద్రామాయణ మకరంద గేయ రచన (6 కాండములు) – ఈ భాగవత మకరంద (గేయ కవిత) ద్వారా నాకు అర్థమయింది ఏకాగ్ర భక్తి – పరిశుద్ధ మనస్సుతో హరి కీర్తన – భూతదయ – విన్నది ఆచరించటం అంతే. ఎవరి కయినా అర్థమవ్వటం అన్నది వారి అభిరుచి – సంస్కారం – పాండిత్యం మొదలైన వాటిమీద ఆధారపడివుంటుంది. అందువల్ల నాకు తెలిసింది చాలా తక్కువ.



పోతన మదిలో పోసిన భక్తికి
పాతుకు పోయెను హరిపై భక్తి
కైతలు అన్నీ రామునివేనని
కైవల్యముకని చాటి చెప్పెను.

పో తనువనుచు తెలిసినవాడు
పోవును సిరులని తెలిసినవాడు
పోనిది కవితని నమ్మినవాడు
అమ్మక సమ్మతి నిచ్చెను హరికి

*అది పోతన గార్కి – భాగవతానికి వున్న సంబంధం అని నా ఆలోచన.*

1996 లో భాగవత దశమస్కంధం వొకటే వ్రాశాను అది 1998 లో ముద్రించారు భక్తులు. అమూల్యంగా అందరికీ అందించాం. అది ముద్రించటం చాలా ఆలస్యమైంది. నేను అడగటం బాగుండదని యిస్తానన్న భక్తుల్ని మరలా హెచ్చరించలేదు. కానీ ఒకసారి భద్రాద్రి శ్రీరామచంద్రమూర్తి వారి దర్శనానికి వెళ్ళినపుడు. D.T.P. లో వున్న ప్రూఫ్ కాగితాలు పట్టుకొని వెళ్ళి, స్వామి వారిపాదాల ముందుంచాలి. అంతేచాలు, ప్రింటు కాకపోయినా ఆయన సొమ్ము ఆయన కిచ్చినట్లవుతుంది అని నిర్ణయించుకొని తీసుకు వెళ్ళాను. ముక్కోటి ముందురోజు – లోపలచాలా రద్దీగా – ముఖ్యంగా గర్భగుడిలో ఎవరో ప్రముఖ భక్తులతో హడావిడిగావుంది. ఆ సమయములో ఏం చేద్దాం అనుకుంటుండగా ఒక అపరిచిత వ్యక్తి పండితునిలాగ వుంటాడు ఆయన నావద్దకు వచ్చి అది భాగవతమా! అని అడిగి – తీసుకొని తన శిరస్సుమీద పెట్టుకొని – నేరుగాలోనికి వెళ్ళి స్వామివారి పాదాల మీద పెట్టించి – నన్నుపిలచి – హారతిప్పించాడు – హారతి అద్దుకొన్నాను. ఆ సంఘటనతో నాకు పులకరింత కలిగింది. లోపలకు వెళ్ళిన నాకు – స్వామి కలిగించిన అనుభూతి లేదా నాకు కనిపించిన సుందరమూర్తికి ఈ చిన్న కవితలో అక్షరరూపం కల్పించి – నాహృదయములో పదిలపరచుకున్నాను.

నా స్వామి రాముడు నా మనోహరుడు
ఈ స్వామి - జగములను కాపాడగలడంచు
మా సీత - లీలగా వామాంకమందున
ఆసీనురాలయ్యె - ఆశోభ కనువిందు

మా అన్న రాముడు-సీతమ్మ మావదిన
పట్టాభిషిక్తులై జగమేలు శుభవేళ
నావంతు సేవ-నే-తలచు కొని పులకింతు
అన్నట్టు సౌమిత్రి భక్తిగా నిలచాడు

పవన నందనుడిపుడు తండ్రితో తా కలసి
సుమగంధమును-మేన పూయుచున్నాడు
భద్రమూర్తీ! నిన్ను భద్రాద్రిలో గాంచి
పులకరించానయ్యా-జన్మ-సార్థకమయ్యె

చాలు. అంతకన్నా వివరించనక్కర్లేదు. ఈ నాగరిక యుగంలో అది సాధ్యమా - నిజమా - అన్న ప్రశ్నలు - వాటికి సమాధానాలు ఎవరికి వారే చెప్పుకోవాలి. అందుకే ఇది శ్రీరాములవారి సొత్తు - ఆయనది ఆయనకే యివ్వటం. అంకితం అనే పేరు పెట్టటం.



**శ్రీ కృష్ణ చరితము - కర్ణపేయము**
**వ్యాసమౌనికే - శాంతినొసగినది**
**పోతనయ్యే - పులకించి పలికినది**
**భవభయహారిణి భాగవతమ్ము**

ఈ గేయ రచనకు మకుటం అది. అదే ఫలశృతి గా -

భగవంతుడు - పూజనీయుడు ఆరాధ్యుడు - నిత్యస్మరణ సంతృప్తుడు అలాగే భాగవతం అంటే - భగవంతుడే - పూజనీయం - పారాయణయోగ్యం - అందుకే శుభప్రదాయిని - సుఖదాయిని, మోక్షప్రదాయిని. బాగుచేసెడిది భాగవతం.

ఈ గ్రంధం వ్రాయడాన్కి కొన్ని సంవత్సరాలు పట్టింది ఎంత వ్రాస్తే అంతేచాలు అని ప్రారంభించాను దైవానుగ్రహంతో పూర్తి చేయగలిగాను. ప్రింటుచేయాలని ఆశలేదు కానీ ప్రింటు చేయాలని - నాకు సన్మానంచేయాలని మిత్రుల కోరిక. అది దైవనిర్ణయం. జరిగింది నాజన్మ చరితార్థమైంది. ఎందరో మహానుభావులు, న్యాయవాద మిత్రులు, భాగవతోత్తములు, బంధు, మిత్ర - హితకాంక్షులు, ముద్రణ దాతలు, ప్రచారం చేస్తున్నవారు - చేయించినవారు, ముఖ్యంగా నా శ్రీమతి విజయలక్ష్మి, - శ్రీ సాంబశివరాజు గారు, శ్రీ పారుపల్లి అంజిరెడ్డి గారు శ్రీ చల్లూరి శ్రీనివాస రెడ్డి గారు, శ్రీ కనుమూరి పెద్దిరాజు గారు మొదలైన వారందరికీ వందన శతములు - ఆశీర్వచన సుమములు.

పాఠ్యపుస్తకానికి గైడ్ వంటిది నాచిన్న ప్రయత్నం. ఏమైనా దోషములుంటే అవి నా అవగాహన - భాషా పరిజ్ఞానలోపమే - దాన్ని పెద్ద మనస్సుతో గ్రహించి - అనుగ్రహించ ప్రార్థన.

ఇట్లు

**బుధజన విధేయుడు**

**- సూరంపూడి రాధాకృష్ణమూర్తి**

# శ్రీమద్రామాయణ మకరందంలోని
# మాణిక్యమకుటాలు

## 1. బాలకాండము

శ్రీ రఘురాముని రమ్యచరితము
మునితిలకుడు మనకొసగిన మంత్రము
రామచంద్రు డుదయించి జానకిని
పరిణయమాడుట బాలకాండము

## 2. అయోధ్యాకాండము :

శ్రీ రఘురాముడు వనముల కేగుట
సత్యవర్తిగా తండ్రిని నిలపుట
రామపాదుకలు రాజ్యమేలుట
రామాయణమున అయోధ్యాకాండము.

## 3. అరణ్యకాండము :

శ్రీ రఘురాముని– రమ్య చరితము
ముని జనములకు– అభయ ప్రధానము
సీతాపహరణము– రామునివేదన
జటాయుమోక్షము– అరణ్యకాండము

## 4. కిష్కింధాకాండము :

శ్రీరఘు రాముని రమ్యచరితము
మారుతి రాముని సందర్శనము
సీతాపతికై అన్వేషణము
కపుల సేవ కిష్కింధా కాండము.

## 5. సుందరకాండము :

సుందరమైనది సుందర కాండము
అందరు పాడుదు ఆనందముగా
మృదు మధురము మరి రసవత్తరము
మారుతి సీతను గాంచిన వివరము.

## 6. యుద్ధకాండము :

శ్రీరఘు రాముని – రమ్యచరితము
శ్రీపతి– నరుడై వెలసిన చరితము
శ్రీరాముడు– దశకంఠుని దునిమి
శ్రీని గ్రహించుట– యుద్ధ కాండము.





# వాయు పుత్రాయ నమః



# హనుమాన్ చాలీసా

## (మూలం గోస్వామి తులసీదాస్)

### ప్రార్థన

అసమాన బలా అంజనిపుత్రా
మేరునగము నీవజ్ర శరీరము
అసురులపాలిటి కాలుడ వీవు
అగ్రగామివి జ్ఞానము నందు.

గోష్పదమును గావించు తీరున
వారిధి దాటిన దైత్యమర్దనా
రామాయణమను సుందరమాలకు
అందములొలికే కొలికి పూసవు

సద్గుణ ఖని ఓ భక్తులధనమా!
హనుమా వానరశ్రేష్ఠుడ వినుమా
నిలుమా నాహృది అనిలకుమారా
రాముని ప్రియతమ భక్తుడ రావా.

ముకుళిత కరములు వంచిన శిరసు
కన్నుల నిండుగ ప్రభువు రూపుతో
ముందర ఉందువు - రాముని కీర్తన
ఎందు చేసినా మరి సందియమా?

నీ చరణ కమలముల దివ్యరజముతో
మది పవిత్రముగ చేసి నిలచితి
బలమును బుద్ధిని విద్యా యశమును
మా కొసగుము ఓ కేసరి నందన.



జయహనుమంతా జ్ఞానసముద్రా
జయము నీకు ముల్లోకములందు
రామునిదూతా అతి బలాశాలీ
అంజనపుత్రా అనిలకుమారా!

వజ్రకరమున ధ్వజము వెలయగ
మేనున సొగసుగ మౌంజియు నమరగ
శివాంశజాతా కేసరితనయా
జగముల వందన మందెడి తేజము.

మంచిని పెంచి చెడునే త్రుంచే
వజ్రశరీరా విక్రమధీరా
స్వర్ణవర్ణము చెవి కుండలములు
చక్కనివేషము సుందరజటివి.

॥జయ॥

విద్యాఖని - ఓ సుగుణ చతురుడా
రామకార్యమును, తీర్చగ ఆతృత
సీతారాముల - సుమిత్ర పుత్రుని
సతతము మదిలో నిలిపి స్తుతింతువు.

॥జయ॥

చిరురూపముతో సీతకు కనబడి
గురురూపముతో లంక కాల్చితివి
భీకర రూపుతొ అసురుల త్రుంచి
రామకార్యమును తీర్చినవాడవు.

సంజీవినితో లక్ష్మణు కావగ
రాముని కౌగిటి భాగ్యము కలిగెను
ప్రభువు చేతనే ప్రశంసలంది
సోదర భరత సముడవైతివి ॥జయ॥

వేయి రీతుల రాముడు పొగడెను
లక్ష్మీపతి తన కౌగిటి నిడెను
సనకాదులు బ్రహ్మాదిమౌనులు
నారద శారద ఆదిశేషులు

కాలుడు కుబేర దిక్పాలకులు
కవులు పండితులు అందరు పొగడిరి
రాముని మైత్రి - రాజ్యభోగము
సుగ్రీవునికి కలిగించితివి. ॥జయ॥

నిన్ను నమ్మిన విభీషణాఖ్యుడు
లంకను ఏలుట జగమెరిగినదే
రెండువేల యోజనముల దూరము
ఎగిరి భానుని ఫలముగ గొనగా

ప్రభువు ముద్రికను నోటను దాచి
జలధి దాటగ అచ్చెరువేమది
జరగనివెన్నో నీదయ వున్న
జరుగును జగమున అతి సులువుగను

॥జయ॥

రాముని చేరెడి మార్గము నిడెదవు
నీ దయ లేక రాము డందడు
నిను శరణంటే సుఖములు కొదవా
రక్షకుడవు నువు - భయమస లెందుకు

నీ తేజము నువు భరించువాడవు
నీ గర్జనకే వణకు లోకములు
భూతప్రేత పిశాచ గణములు
నీ జయనామము విని హడలునుకద ॥జయ॥

ఆధి వ్యాధులు అన్ని పీడలు
తొలగును నిరతము నిన్ను తలంచిన
మనసున-మాటల- ధ్యానమునందు
నిన్నే నమ్మిన సంకటహరణము

ఎన్నిక రాజు-మునులకు ఏలిక
రామచంద్రునికి నమ్మినబంటువు
అన్ని అభీష్టము లింపుగ తీరును
సొంపుగ నీ గుణ గానము జేసిన ॥జయ॥

నాలుగు యుగముల నీ ప్రతాపము
నిలచును నిరతము జయహనుమంతా
సతతము సాధుల రక్షణ చేతువు
రామదూత ఓ- రాక్షసహరణా!

అష్టసిద్ధులకు నవనిధులకును
దాతవు నీవు-మాతవరము కద
రామసుధా మధువన్నది నీదే
రాముని దాసుడ వంటే నీవే.

॥జయ॥

నిను తలంచుటది రాముని సేవ
జన్మజన్మలకు దుఃఖహరణము
శ్రీపతి భక్తులు ఎచట పుట్టినా
చేరుట చివరకు రామపాదములు

ఎవరు చదివినా స్వామి చాలిసా
సిద్ధికలుగు శివశక్తుల సాక్షిగ
తులసీదాసు-హరికేదాసు
స్వామీ నాహృది నీమందిరము ॥జయ॥

అన్యదైవముల తలచక నిన్నే
కొలచుట సౌఖ్యములన్నీ పొందుట
బలవిక్రమ సంపన్నుడవగు నిను
స్మరియించిన హరియించు పీడలు. ॥జయ॥

హనుమ పాదములె మనకు శరణము
హనుమ స్మరణమె మనకు కరణము
హనుమ ధ్యానమే మనకు తరణము
హనుమ చింతనమె సంకట హరణము

జయహో-జయహో జయహనుమంతా!
కృప జూడుమయా ఓ గురుదేవా!
నూరుమార్లు మది పఠించినంతనె
బంధములన్నీ తొలగి సుఖమగు

మంగళమయ్యా మారుతపుత్రా!
మంగళమూర్తీ మంగళమిదిగో
సుందరమూర్తీ శుభ మంగళము
అందుకొనుమిదే నిత్యమంగళం.

ఆపదామపహర్తారం-ధాతారం సర్వసంపదాం
లోకాభిరామం శ్రీరామం - భూయో భూయో నమామ్యహం.



# శ్రీహనుమంతుని ద్వాదశ నామములు

హనుమా నంజనా సూను : వాయుపుత్రో మహాబల :
రామేష్ట : ఫల్గుణసఖ : పింగాక్షో అమితవిక్రమ :
ఉదధిక్రమణశ్చైవ సీతాశోక వినాశక :
లక్ష్మణప్రాణ దాతాచ దశగ్రీవస్య దర్పహా
ద్వాదశైతాని నామాని కపీంద్రస్య మహాత్మన :
స్వాపకాలే పఠేన్నిత్యం-యాత్రాకాలే విశేషత :
తస్యమృత్యుభయంనాస్తి-స్వర్వత్ర విజయీభవేత్.





# సుందరకాండము

## గ్రంధావిష్కరణ సభ

19-6-79 (శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయం సుల్తాన్ బజారు) హైదరాబాద్.

(కుడినుండి రెండవవారు)

గ్రంధావిష్కర్త : ఆంధ్రప్రదేశ్ హైకోర్టు అప్పటి ప్రధాన న్యాయమూర్తి గౌ॥ శ్రీ చల్లా కొండయ్యగారు

ఒకటవవారు : శ్రీ M.S.K. శాస్త్రిగారు, (సీనియర్ అడ్వకేట్)

మూడవవారు : రచయిత సూరంపూడి రాధాకృష్ణమూర్తి (అడ్వకేట్)

నాల్గవవారు : శ్రీ విజయ రాఘవాచారి గారు (అడ్వకేట్)



# బాలకాండము

## గ్రంధావిష్కరణ సభ

తేది : 21-11-1980 శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం

సుల్తాన్ బజారు హైదరాబాద్

(కుడినుండి ఒకటవవారు)

గ్రంధావిష్కర్త : ఆంధ్రప్రదేశ్ హైకోర్టు

అప్పటి ప్రధాన న్యాయమూర్తి గౌ॥ శ్రీ అల్లాడి కుప్పుస్వామి గారు

రెండవవారు : శ్రీ కోకా రాఘవరావుగారు (అడ్వకేట్)

మూడవవారు : రచయిత సూరంపూడి రాధాకృష్ణమూర్తి (అడ్వకేట్)

నాల్గవవారు : కళాప్రపూర్ణ శ్రీరావూరు వెంకట సత్యనారాయణ రావు గారు.



# అరణ్యకాండము

## గ్రంథావిష్కరణ సభ

తేది : 22-10-1982 మారుతి మందిర్ (దిల్‌సుక్ నగర్)

(కుడినుండి రెండవవారు)

గ్రంథావిష్కర్త : ఆంధ్రప్రదేశ్ హైకోర్టు అప్పటి ప్రధాన న్యాయమూర్తి

గౌ॥ శ్రీ కొండా మాధవరెడ్డి గారు

మొదటివారు : కళాప్రపూర్ణ శ్రీ రావూరు వెంకట సత్యనారాయణరావు గారు

మూడవవారు : శ్రీ యడవల్లి శివరామ శాస్త్రిగారు (అడ్వకేట్)

నాల్గవవారు : డా॥ శ్రీ॥ వి.వి. యల్. నరసింహారావు గారు.



## సాయినాథ భాగవతం - గ్రంధావిష్కరణ సభ

### గణేష్ ఆంజనేయస్వామి దేవాలయం, దిల్‌సుక్‌నగర్

కుడినుండి :

శ్రీ G.శ్రీధరరావు గారు – ఆలయ పాలకవర్గం సభ్యులు

శ్రీ చల్లా సాంబిరెడ్డి గారు – (అధ్యక్షులు, శ్రీ పావని సేవాసమితి)

శ్రీ లక్ష్మయ్యగారు M.R.O.

శ్రీ T.S. రావుగారు (Retd. D.G.P.)

న్యాయమూర్తి గౌ॥ శ్రీ పి. రామకృష్ణరాజుగారు (Judge A.P. High Court)

రచయిత సూరంపూడి రాధాకృష్ణమూర్తి

శ్రీ N. సుబ్బరాజుగారు (Retd. Chairman A.P.A.T.)

శ్రీ కనుమూరి పెద్దిరాజుగారు (Builder)

శ్రీ చండిక సాంబశివరాజు గారు (గ్రంధ ముద్రణ దాత)

శ్రీ G.C.H. రామారావుగారు (శ్రీపావని సేవాసమితి, కార్యదర్శి)



## రచయితకు జరిగిన సన్మాన సభ

తేదీ : **12.8.1995** శ్రీ శృంగేరి శంకర మఠం, నల్లకుంట

కుడినుండి : శ్రీ V. జోగయ్య శర్మగారు (సీనియర్ అడ్వకేట్)

శ్రీ M.S.K.శాస్త్రిగారు (సీనియర్ అడ్వకేట్)

శ్రీ చల్లా పూర్ణయ్య గారు (సీనియర్ అడ్వకేట్)

శ్రీ P.బాలకృష్ణమూర్తి గారు (సీనియర్ అడ్వకేట్)

రచయిత :- సూరంపూడి రాధాకృష్ణమూర్తి (అడ్వకేట్)

శ్రీ చల్లా సాంబిరెడ్డిగారు (అడ్వకేట్)

ఆంధ్రవ్యాస బ్రహ్మశ్రీ ఏలూరిపాటి అనంతరామయ్య గారు.

# శ్రీమద్భాగవత మకరంద గ్రంథావిష్కరణ

## హుడా కాంప్లెక్స్ - రామాలయం

(సమయం - తేదీ : సాయంత్రం 6 గంటలకు, 17-11-2002)



(కుడి నుండి ఎడమకు)

శ్రీ **ఆచార్య ఉత్పల సత్యనారాయణాచార్యులు** గారు (భాగవత పరిచయకర్త)

న్యాయమూర్తి గౌ॥ శ్రీ **వై. భాస్కరరావు** గారు (గ్రంథావిష్కర్త)
(Retd. Chief Justice - Karnataka High Court)
Now Chairman, State Human Rights Commission.

శ్రీ **తలారి అనంతబాబు** గారు (ముఖ్య అతిథి)
(Advocate General, State of A.P.)

సాహిత్య బ్రహ్మ డా॥ **వి.వి.ఎల్. నరసింహారావు** గారు (సభాధ్యక్షులు)

**సూరంపూడి రాధాకృష్ణమూర్తి** గారు (గ్రంథ రచయిత)

# శ్రీమద్భాగవత మకరంద గ్రంధావిష్కరణ

## సైదాబాద్, నవంబర్ 17 (ప్రభాతవార్త):

(వార్త, డైలీ)

కొత్తపేట్ హుడా కాంప్లెక్స్‌లోని సీతారామాంజనేయస్వామి దేవస్థానంలో 'శ్రీమద్భాగవత మకరందం' గ్రంధావిష్కరణ మహోత్సవం ఆదివారం సాయంత్రం ఆడంబరంగా జరిగింది. ఈ ప్రారంభానికి రాజకవి-గేయకవితా వాల్మీకి - సూరంపూడి రాధాకృష్ణమూర్తి రచించిన 'శ్రీమద్భాగవత మకరందం' గ్రంధాన్ని రిటైర్డ్ చీఫ్ జస్టిస్ స్టేట్ హ్యూమన్ రైట్స్ కమిషన్ ఛైర్మన్ భాస్కరరావు ఆవిష్కరించారు. ఈ గ్రంధావిష్కరణ మహోత్సవానికి ముఖ్య అతిథిగా విచ్చేసిన ఆంధ్రప్రదేశ్ హైకోర్టు అడ్వకేట్ జనరల్ తలారి అనంతబాబు మాట్లాడుతూ సామాన్య మానవులకు అర్థమయ్యే భాషలో రాసిన ఘనత రాధాకృష్ణమూర్తికే దక్కిందని అన్నారు. భాషాపరంగా, అక్షరపరంగా, భక్తిపరంగా, సాహిత్యపరంగా గ్రంధాన్ని రాశారన్నారు. భక్తిభావం, గొప్ప లక్షణం ఉన్న వారికి ఇది సాధ్యమవుతుందని అన్నారు. సభాధ్యక్షులు సాహిత్యబ్రహ్మ వి.వి.ఎల్.నర్సింహారావు మాట్లాడుతూ గ్రంథ రచయితను అపరపోతనగా అభివర్ణించారు. తణుకు జన్మస్థలమైన రాధాకృష్ణమూర్తి పది సంవత్సరాలు శ్రమించి 12 స్కంధములు గల శ్రీమద్భాగవత మకరందాన్ని రాశారన్నారు. ఈ కార్యక్రమంలో గ్రంథ రచయిత రాధాకృష్ణమూర్తికి హైదరాబాద్-రంగారెడ్డి జిల్లాల రైస్‌మిల్లర్ల అసోసియేషన్ ప్రధాన కార్యదర్శి పి.అంజిరెడ్డి, స్వర్ణకంకణం బహుకరించి సన్మానించారు. అనంతరం ఆచార్య ఉత్పల సత్యనారాయణాచార్యులు, భాగవత పరిచయం చేశారు. ఈ కార్యక్రమం శ్రీసీతారామాంజనేయ సేవా సమితి ఆధ్వర్యంలో నిర్వహించారు. ఈ కార్యక్రమంలో సమితి నాయకులు ఎన్.ఆర్.కె.మూర్తి, పి.ఆర్.కె.మూర్తి తదితరులు పాల్గొన్నారు.



# శ్రీమద్రామాయణ మకరంద గ్రంథావిష్కరణ

(తేది : 01-04-2001)

(స్థలము : శ్రీప్రసన్నాంజనేయస్వామివారి ఆలయం, కొత్తపేట క్రాస్ రోడ్స్.)



(Left to Right Sitting)

Hon'ble Justice Sri **S. Dasaratha Rama Reddy** Garu (ముఖ్య అతిథి)
(Retd. Judge A.P. High Court)

Hon'ble Justice **Sri J. Chelameswar** Garu (విశిష్ట అతిథి)
(Judge A.P. High Court)

Hon'ble Justice Sri **P. Ramakrishna Raju** Garu (సభాధ్యక్షులు)
(Retd. Judge A.P. High Court)

Hon'ble Justice Sri **B. Prakash Rao** Garu (గ్రంథావిష్కర్త)
(Judge A.P. High Court)

Sri **S. Radha Krishna Murthy**
(Advocate) Author of this book

ఈ గ్రంథ ముద్రణకు ఆర్థికంగా - హార్దికంగా ముందునిలచి ప్రోత్సహించిన భక్తులు, సహృదయులు - వారందరికీ శ్రీ కృష్ణపరమాత్మ అనుగ్రహం కలగాలని స్వామికి ప్రార్థన:-



**శ్రీ చల్లూరి శ్రీనివాస రెడ్డి గారు, శ్రీమతి అన్నపూర్ణ గారు**

(హరిహర క్షేత్రం - ఆలయ నిర్మాత, విద్యుత్ నగర్, దిల్‌సుక్‌నగర్)

శ్రీమతి అన్నపూర్ణ గారు సుందరకాండ గానం చేసి ఆడియో కేసెట్లు ఎన్నో దేవాలయాలకి బహుకరించారు.



**శ్రీ కనుమూరి పెద్దిరాజుగారు శ్రీమతి సీతాదేవి గారు**

( భద్రాచలంలో కనుమూరి కాటేజి నిర్మాత

దత్తసాయి దేవాలయం (నాచారం) ప్రధాన నిర్మాత.



**శ్రీ పారుపల్లి అంజిరెడ్డి గారు, శ్రీమతి బాలామణి గారు**

(Managing Director. అన్నదాత పార్ బాయిల్డ్ రైస్ మిల్ (ప్రై. లిమిటెడ్)

పెద్ద అంబర్‌పేట్, రంగారెడ్డి జిల్లా.

**జనరల్ సెక్రటరీ - హైదరాబాద్ & రంగారెడ్డి.**

జిల్లాల రైస్‌మిల్లర్స్ అసోసియేషన్

అధ్యక్షులు శ్రీ ప్రసన్నాంజనేయస్వామి దేవస్థానం - కొత్తపేట.

**పారుపల్లి అభినవరెడ్డి**

(శ్రీ అంజిరెడ్డి గారి మనుమడు)



**బాలకృష్ణుని పాదసేవలో లగ్నమైన చిన్నారి భక్తుడు**



కాళ్ళకూరి వెంకటరత్నమ్మ గారు

(అనేకమార్లు భాగవతపారాయణము చేసిన భక్తురాలు)



శ్రీ ప్రభల సుబ్బారావు గారు (అడ్వకేట్)

శ్రీమతి సీతాదేవి గారు



**M.V.S.S. రామకృష్ణరావు, శ్రీమతి భారతి**

(గత 20 సంవత్సరాలుగా రామసేవలో, తోడు నిలచిన మిత్రుడు)



**శ్రీ వనం యాదయ్య గారు, శ్రీమతి వెంకటమ్మ**

(Proprietor. రామకృష్ణా బిన్ని రైస్ మిల్ & రుచిక రైస్ ఇండస్ట్రీస్),

కర్మన్‌ఘాట్.



**శ్రీ కె.వి. రంగా రెడ్డి గారు, శ్రీమతి కె. పద్మావతి దేవి**

(రిటైర్డ్ ఎగ్జిక్యూటీవ్ ఇంజినీర్) పంచాయితీ రాజ్.



**శ్రీ పొద్దుటూరి రాజేశ్వర్ గారు, శ్రీమతి శేషేంద్రమణి**

(Proprietor. అనూరాధ పార్ బాయిల్డ్ రైస్ మిల్)

మాన్‌సాన్ పల్లి, రంగారెడ్డి జిల్లా.



శ్రీ నాగబంది శ్రీనివాసులు గారు, శ్రీమతి నాగబంది జయమ్మ

(Proprietor. శ్రీ సప్తగిరి రైస్ మిల్) లింగోజిగూడా, రంగారెడ్డి జిల్లా.



శ్రీ చందా నాగభూషణం గారు, శ్రీమతి బాలమణి

(Proprietor. కృష్ణార్జున పార్ బాయిల్డ్ రైస్ మిల్) లాల్‌గడి మలక్‌పేట.



**శ్రీ బొజ్జ గురువయ్య గారు, శ్రీమతి భారతమ్మ**

(నాగేంద్ర రైస్ మిల్), కర్మన్‌ఘాట్.



**శ్రీ గుండమరాజు శ్రీధరరావు గారు**

గణేష్ ఆంజనేయస్వామి దేవస్థానం - (దిల్‌సుక్‌నగర్)

స్వామి సేవాతత్పరులు



**శ్రీ శెట్టి యెల్లయ్య గారు, శ్రీమతి శకుంతల**

(మహాలక్ష్మి రైస్ ఇండస్ట్రీస్), కర్మన్‌ఘాట్.

**Treasurer :** Hyderabad & Ranga Reddy Districts Rice Millers Association.



**శ్రీ గార్లపాటి జితేంద్రకుమార్ గారు, శ్రీమతి విజయలక్ష్మి**

(Proprietor. గాయత్రి & శ్రీ లక్ష్మీనరసింహ ఇండస్ట్రీస్) కర్మన్‌ఘాట్.

**Joint Secretary :** Hyderabad & Ranga Reddy Districts Rice Millers Association.



**శ్రీ అమరవాది లక్ష్మీనారాయణ గారు, శ్రీమతి పద్మావతి**

(అధ్యక్షులు: హైదరాబాదు, రంగారెడ్డి జిల్లాల రైసుమిల్లర్స్ అసోసియేషన్)

(Proprietor. పద్మావతి రా & పార్ బాయిల్డ్ రైస్ ఇండస్ట్రీస్), తుక్కుగూడ.



**శ్రీ నాగబంది రాములు గారు, శ్రీమతి శ్యామల**

(Proprietor. సాయి శ్రీనివాస రైస్ మిల్), లింగోజిగుడా.



**శ్రీ సూరిశెట్టి సింహ్మాయ్య గారు, శ్రీమతి సూరిశెట్టి బాలమ్మ**

(శ్రీ లక్ష్మీ రైస్ మిల్), లింగోజిగూడా.

(అక్షయ బిన్ని రైస్ మిల్, కర్మన్‌ఘాట్.



**శ్రీ గార్లపాటి యాదయ్య గారు, శ్రీమతి భారతమ్మ**

(Proprietor. మహేశ్వరి రైస్ మిల్), చంపాపేట్, సంతోష్‌నగర్.

మహావీర్ రైస్ మిల్, సరూర్‌నగర్.



**శ్రీ మంచన బాల్‌రాజు గారు, శ్రీమతి మంచన వజ్రమ్మ**

పద్మిని రైస్ మిల్, కర్మన్‌ఘాట్.



**శ్రీ మాడ్గుగులబాల్ రెడ్డి గారు, శ్రీమతి రంగమ్మ**

Proprietor. శ్రీ లక్ష్మి రైస్ మిల్, లింగోజిగూడ.

**Vice President :** Hyderabad & Ranga Reddy Districts Rice Millers Association.

1. శ్రీ చల్లాసాంబిరెడ్డి గారు - అడ్వకేట్. (అధ్యక్షులు పావని సేవాసమితి)
2. శ్రీ ప్రసన్నాంజనేయస్వామి దేవస్థానపాలకవర్గం (సైదాబాద్, జైల్‌గార్డెన్స్)
3. శ్రీ కంది మురళీధర్ రావుగారు శ్రీమతి అనూరాధగారు
4. శ్రీ ఆకెళ్ళ రవిప్రసాద్ - శ్రీమతి శ్రీదేవి
5. చి॥ సూరంపూడి శ్రీకాంత్ - చి॥సౌ॥ సుధాలక్ష్మి (I.O.C.L. Vijayawada)
6. చి॥ సూరంపూడి శ్రీనాథ్ (Advocate) చి॥సౌ॥రాజ్యలక్ష్మి
7. శ్రీ A. రామరాజుగారు (Retd. N.T.P.A. - P. Raj)
8. శ్రీ ఎమ్. శ్రీరామ మూర్తిగారు
9. శ్రీ తెలికిచర్ల మల్లికార్జున రావు గారు
10. శ్రీ అరిపిరాల చంద్రశేఖర రావు గారు శ్రీమతి రాజేశ్వరమ్మ గారు
11. డా॥ శ్రీ వి. సత్యనారాయణ గారు శ్రీమతి విజయలక్ష్మి గారు (పుత్తూరు)
12. శ్రీ పెట్టుగానితిరువాయి గుప్త గారు శ్రీమతి నవనీతంగారు
13. శ్రీ కస్తూరి సీతారామాంజనేయులు గారు శ్రీమతి పద్మావతి
14. చి॥ సూరంపూడి వెంకటరమణా రావు (Advocate) శ్రీమతి రామలక్ష్మి (తణుకు)
15. చి॥ సూరంపూడి విశ్వేశ్వర రావు - శ్రీమతి శోభ (తణుకు)
16. శ్రీ సూరంపూడి వెంకట సత్యనారాయణ గారు
17. శ్రీ ఎన్. రాజన్న గారు (Retd. District & Sessions Judge)
18. శ్రీ మేకల మల్లారెడ్డి గారు (Spoorthy Degree College) అధినేత
19. శ్రీ కరెడ్ల లక్ష్మీనారాయణ గారు శ్రీమతి కామేశ్వరిగారు
20. చి॥ వంగూరి వెంకట నారాయణమూర్తి శ్రీమతి రాధాకృష్ణవేణి, హైదరాబాద్
21. శ్రీ రామాలయ పాలకవర్గం - శ్రీ సీతారామాంజనేయ సేవాసమతి (Huda Complex) హైదరాబాద్.

22. శ్రీ శ్రీధర వెంకటరమణ గారు (అడ్వకేట్)

23. శ్రీ దాసుత్రివిక్రమ నారాయణ రావు గారు

24. శ్రీమతి ఆదూరి నాగమణి - కాకినాడ

25. శ్రీమతి మారెళ్ళ సావిత్రమ్మ గారు - ఐభీమవరం.

26. శ్రీ చేపూరు వెంకట రామమోహనరావు గారు శ్రీమతి శారద

27. శ్రీ జి. నారాయణబాబు గారు - నెల్లూరు.

28. శ్రీ E.V.S. రామకృష్ణ శాస్త్రి గారు (Dy. Registrar APAT)

29. శ్రీ Ch.V. సూర్యనారాయణమూర్తి (Advocate)

30. శ్రీ కె. శ్రీధర్ గారు శ్రీమతి లక్ష్మి

31. శ్రీ కొల్వి కృష్ణారావు గారు (Automotive Manufacturing Co.) Sec-bad.

32. శ్రీమతి వేమవరపు లీలావతి గారు - హైదరాబాద్.

33. శ్రీ A.V.V.సత్యనారాయణమూర్తి గారు - శ్రీమతి రుక్మిణీ మణి హైదరాబాద్

34. చి॥ పోలేని రామారావు శ్రీమతి సుమతి - HUDA Colony, Saroornagar.

35. శ్రీ కర్నాటి పాండు గారు శ్రీమతి మహాలక్ష్మి, సైనిక్‌పూర్.

36. చి॥ కర్నాటి శ్రీనివాస్ - రాజ్‌ప్రింటర్స్, హైదరాబాద్.

37. శ్రీ వి. బిక్షమయ్య గారు - మానస రైస్‌మిల్, కొత్తపేట్.

38. శ్రీ టి. సుధాకర్ గారు - శ్రీ సాయి రైస్ ఇండస్ట్రీ, కొత్తపేట్.

39. శ్రీ వనం రంగయ్య గారు - శ్రీ వెంకటేశ్వర రైస్ ఇండస్ట్రీ, కొత్తపేట్.

40. శ్రీ జి. జగదీశ్వర్ గారు - వికాస్ ఇండస్ట్రీస్, కొత్తపేట్.

41. శ్రీ బి. గంగాధర్ గారు - కళ్యాణి రైస్ ఇండస్ట్రీస్, కొత్తపేట్.

42. శ్రీ బి. ప్రభాకర్ గారు - పవిత్ర ఇండస్ట్రీస్, కొత్తపేట్.

43. శ్రీ ధనంజయ గారు - వివేక రైస్ మిల్లర్స్, కొత్తపేట్.

44. శ్రీ కె. వెంకటేశ్వర్లు గారు - స్వాతి రైస్ మిల్, కొత్తపేట్ క్రాస్ రోడ్.

45. శ్రీ కె. శ్రీనివాస్ గారు - ఆనంద్ ఇండస్ట్రీస్, కొత్తపేట్ క్రాస్ రోడ్.

46. శ్రీ బి. విజయ్ కుమార్ గారు - విధ్యాలక్ష్మీ రైస్‌మిల్, కొత్తపేట్ క్రాస్ రోడ్.

47. శ్రీ కె. కృష్ణయ్య గారు - పూర్ణా రైస్ మిల్, సరూర్‌నగర్.

48. శ్రీ ఎస్. కృష్ణ మూర్తి గారు - శివ ఇండస్ట్రీస్, సరూర్‌నగర్.

49. శ్రీ ఎమ్. గోవర్ధన్ రెడ్డి గారు - శ్రీ రామ రైస్ ఇండస్ట్రీస్, సరూర్‌నగర్.

50. శ్రీ జి. జయ రాములు గారు - విశ్వేశ్వర రైస్‌మిల్, సరూర్‌నగర్.

51. శ్రీ ఎమ్. శ్రీనివాసులు గారు - రేవతి రైస్ ఇండస్ట్రీస్, సరూర్‌నగర్.

52. శ్రీ పాండయ్య గారు - యశోద ఇండస్ట్రీస్, లింగోజిగూడ.

53. శ్రీ వై. సత్యనారాయణ రెడ్డి గారు - విఘ్నేశ్వర రైస్ మిల్, లింగోజిగూడ.

54. శ్రీ బి. బుచ్చయ్య గారు - సాయిరామ్ రైస్ మిల్, లింగోజిగూడ.

55. శ్రీ ఎన్. దామోదర్ రెడ్డి గారు - శ్రీ బాలాజీ రైస్ మిల్, లింగోజిగూడ.

56. శ్రీ జి. జయ రాములు గారు - నరసింహ స్వామి రైస్‌మిల్, లింగోజిగూడ.

57. శ్రీ కె. కుమారస్వామి గారు - దుర్గ రైస్ మిల్, లింగోజిగూడ.

58. శ్రీ బుచ్చయ్య గారు - దేవి రైస్ మిల్, లింగోజిగూడ.

59. శ్రీ బి. క్షత్రయ్య గారు - సాయినాథ్ రైస్ ఇండస్ట్రీస్, లింగోజిగూడ.

60. శ్రీ పి. వెంకటేశం గారు - కన్యకావాసవి రైస్ ఇండస్ట్రీస్, లింగోజిగూడ.

61. శ్రీ జి. కోటేశ్ గారు - అక్షయ రైస్ & ఆయిల్ మిల్, లింగోజిగూడ.

62. శ్రీ వి. సూర్యనారాయణ గారు - సుధా రైస్ ఇండస్ట్రీస్, కర్మన్‌ఘాట్.

63. శ్రీ బి. రామ్ రెడ్డి గారు - శారద రైస్ ఇండస్ట్రీస్, కర్మన్‌ఘాట్.

64. శ్రీ ఎన్. యాదయ్య గారు - భాగ్యలక్ష్మీ రైస్ మిల్, కర్మన్‌ఘాట్.

65. శ్రీ జి. వెంకట్ రెడ్డి గారు - న్యూ ధనలక్ష్మీ ఇండస్ట్రీస్, కర్మన్‌ఘాట్.

66. శ్రీ జి. యాదయ్య గారు - అక్షయ బిన్ని రైస్ మిల్, కర్మన్‌ఘాట్.

67. శ్రీ వి. వేణు గోపాల్ గారు - సవిత రైస్ మిల్, కర్మన్‌ఘాట్.

68. శ్రీ వి. సుదర్శన్ గారు - హిమగిరి ఇండస్ట్రీస్, కర్మన్‌ఘాట్.

69. శ్రీ పి. మధుసూదన్ గారు - పార్థసారథి ఇండస్ట్రీస్, కర్మన్‌ఘాట్.

70. శ్రీ పి. పాండు రంగా రెడ్డి గారు - స్వప్న ఇండస్ట్రీస్, కర్మన్‌ఘాట్.

71. శ్రీ బి. రంగయ్య గారు - లలితాంబిక బిన్ని రైస్ మిల్, కర్మన్‌ఘాట్.

72. శ్రీ కె. శ్రీనివాసులు గారు - శ్రీ సాయి లక్ష్మి రైస్ ఇండస్ట్రీస్, కర్మన్‌ఘాట్.

73. శ్రీ జి. చంద్రమౌళి గారు - సాయి భాను రైస్ మిల్, చంపాపేట్.

74. శ్రీ Ch. వెంకట రమణ గారు - విజయ దుర్గా రైస్ మిల్, చంపాపేట్.

75. శ్రీ వై. శంకర్ రెడ్డి గారు - కావేరి రైస్ మిల్, ఫాలక్‌నూమా.

76. శ్రీ సిద్ధి రామ్ రెడ్డి గారు - లలిత రైస్ మిల్, ఫాలక్‌నూమా.

77. శ్రీ Ch. రాములు గారు - వాగేంద్ర రైస్ మిల్, శంషేర్‌గంజ్.

78. శ్రీ సుధీర్‌కుమార్ గారు - దేవి రైస్ మిల్, శంషేర్‌గంజ్.

79. శ్రీ నేతి రాములు గారు - లక్ష్మి రైస్ మిల్, ఉప్పల్ క్రాస్ రోడ్.

80. శ్రీ చాడ కృపాకర్ రెడ్డి గారు - శ్రీ లక్ష్మి రైస్ మిల్, కర్మన్‌ఘాట్.

81. శ్రీ వి. నరసింహ గుప్తా గారు - బ్రాన్ ఏజంట్, దిల్‌సుఖ్‌నగర్.

82. శ్రీ వినోద్ కుమార్ రాగ్‌తా గారు - బ్రాన్ ఏజంట్, మలక్‌పేట్.

83. శ్రీ రాజేశ్వర్ గారు - బ్రాన్ ఏజంట్, శంశీర్‌ఘంజ్.

84. శ్రీ సకినాల రమేశ్ గారు - బ్రాన్ ఏజంట్, దిల్‌సుఖ్‌నగర్.

85. శ్రీ వెంకటేశ్వర్లు గారు - బ్రాన్ ఏజంట్, చంపాపేట్.

86. శ్రీ హరి బజాజ్ గారు - బ్రాన్ ఏజంట్, మలక్‌పేట్.

87. శ్రీ కె. వెంకటేశ్వర్లు గారు - (Proprietor. లక్ష్మిహోంనీడ్స్).

88. శ్రీ తల్లా ప్రగడ హనుమంతరావు గారు శ్రీమతి కల్పవల్లి.

89. శ్రీ కె. పట్టాభిరాములు గారు (Retd. Supervisor Telephone).

90. శ్రీ తల్లా ప్రగడ నరసింహమూర్తి గారు శ్రీమతి వెంకటలక్ష్మి సుభద్రశేషారత్నం.

91. చి॥ గుమ్మడి నరసింహ రెడ్డి - హైదరాబాద్.

# పోతనామాత్యునికి సుమాంజలి

పోతన మదిలో పోసిన భక్తికి,
పాతుకు పోయెను హరిపై భక్తి,
కైతలు అన్నీ రాముని వే - నని,
కైవల్యముకని చాటి చెప్పెను

పో - తనువంచును తెలిసిన వాడు,
పోవును సిరులని తెలిసిన వాడు,
పోనిది - కవితని - నమ్మినవాడు,
అమ్మక - సమ్మతి నిచ్చెను హరికి.



# ఇష్టదేవతాస్తుతి

శ్రీరామచంద్రుడు అనుగ్రహించగ
శ్రీరామాయణ మకరందమొలికెను
శ్రీకృష్ణచరితము - వ్రాయమనుచును
భద్రాద్రిలో - ఆదేశమైనది

నాస్వామి రాముడు-నా మనోహరుడు
ఈ స్వామి జగములను కాపాడగలడంచు
మా సీత - లీలగా-వామాంకమందున
ఆసీనురాలయ్యె - ఆశోభ కనువిందు

మా అన్న రాముడు - సీతమ్మ మావదిన
పట్టాభిషిక్తులై జగమేలు శుభవేళ
నావంతు సేవ-నే-తలచు కొని పులకింతు
అన్నట్టు సౌమిత్రి భక్తిగా నిలచాడు

పవన నందనుడిపుడు తండ్రితో తా కలసి
సుమగంధమును-మేన పూయుచున్నాడు
భద్రమూర్తీ! నిన్ను భద్రాద్రిలో గాంచి
పులకరించానయ్య-జన్మ-సార్థకమయ్యె

వేదరాసిని - విభజన చేసి
మహా పురాణములన్నీ వ్రాసి
మనశ్శాంతికై - భాగవతమ్మును
వ్రాసిన - వ్యాసునికిదె వందనము

వినుట - కనుట-పలుకుట-కదలుట
కరములు రెండు - కలిగియుండుట
హరిభక్తి కని - నొక్కిచెప్పిన
భాగవతోత్తమ్ములకు - నా ప్రణతులు

పలుకుల రాణి - పదములంటిన
గలగలపారే - సెల ఏరువలె
కమ్మని కవిత జాలువారునని
నమ్మితి - నే నిది, వాణిప్రసాదము

సగమేనిచ్చిన సాంబశివునకు
ఉరమున చోటిడు రమాధవునకు
వేదనాదముతొ వెలిగెడి ధాతకు
పదే - పదే - నా వందనమ్ములివె

త్రిమూర్తిరూపము దత్తాత్రేయుడు
త్రిభువన పోషకుడా పరమాత్మ
తలపులొ నిరతము తానే నిండి
వ్రాసెడి శక్తికి - ప్రార్థింతునిదే -

తెలియని యట్టి ఆవేశముతో
తెగింపుతో - యీ బృహత్కార్యము
తరతరాలకిది తరించు త్రోవని
తలంచి - వ్రాయగ - తలపెట్టితిని

ముందుగ ఎన్నోవందనమ్ములు
సహజకవికి - నే - నందించితిని
తనువు నిలవదని - కవిత నిలచునని
పలికిన పోతన పేరే **మంత్రము**

ఆ మంత్రమును ఉచ్చరించితి
మంత్రసిద్ధికై హరి పదములబడ
ఫలించి నిలచెను గేయకవితగా
నాదన్నది అసలేదీలేదు -

కృష్ణుని చరితము - తలపులో హరుడు
కన్నుల ముందర సీతారాములు
అమ్మగ వలదను - అమ్మ సరస్వతి
**కలసిన రూపము బమ్మెర పోతన**

సిరిమగనికి మరి మించి యిచ్చెడి
సిరిగలవాడు - ఇలలోలేదు
శ్రీకైవల్యమ్మది తన సిరియనుచు
**తెలిపిన పోతన - కృంగని భానుడు**

హరికీర్తనము - హరునిపూజలు
దయాసత్యములు కలిగియుండనిచో
ప్రసవవేదన తల్లికి మిగిలి
కడుపుచేటు సంతానమగుననె

అంతటి పోతన హర - బ్రహ్మాదులు
చెప్పుట చిత్రము - భాగవతంబని
విబుధులు చెప్పగ - విన్నది - కన్నది
వినిచెదనని వినయమ్ముగ చెప్పెను

రామభద్రుడే పలికించునని
రామునిదే - తన - కావ్యమనుచును
రామునిపైనే భారమునిడగా
రాముడె గంటపు - కదలిక ఆయెను

భాగవతమ్మును - తెనిగించుటది
జన్మరాహిత్యగ తలంచి వ్రాయుచు
కవులందరికీ వందనమిడిన
సహజకవికి - నావందనశతములు.

విఘ్నగణపతి అనుగ్రహించగ
నిర్విఘ్నముగా వ్రాయగలిగితి
వ్రాతలో వ్యాసుని మెప్పునందిన
విజయ గణపతికి - వందన శతములు.



(మకుటం)

శ్రీ కృష్ణచరితము - కర్ణపేయము
వ్యాసమౌనికే - శాంతినొసగినది
పోతనయ్య - పులకించి పలికినది
భవ భయ హారిణి - భాగవతమ్ము॥

# శ్రీమద్భాగవత - మకరందము
## (ప్రథమస్కంధము)

### విషయ సూచిక

సర్గము — పేజీ

శ్రీరామ

ఓం - నమో - వాసుదేవాయనమః

# శ్రీమద్భాగవత - మకరందము

## (ప్రథమస్కంధము)

శ్రీకృష్ణుడు - తా - మూలము ఐన
భాగవతమ్మొక కల్పవృక్షము
శుకపికరవముల వృక్షమ్మునకు
అడిగినదిచ్చెడి శక్తియున్నది

అటులే వ్యాసుడు విస్తరించిన
శుకయోగీంద్రుని పలుకుల ఒలికిన
భాగవతమ్మది అడుగక యిచ్చెడి
దివ్యశక్తియది - ముక్తినొసగునది

సృష్టిస్థితి లయకారకుడైన
బ్రహ్మకు సృష్టిని చేయగ జెప్పిన -
ఆగమాలకు పుట్టుక నెలవగు
ఆ పరమాత్మకు అంజలియిదిగో!

యోగమాయతో మోహపెట్టెడి
ఎండమావిలో నీరు ఉన్నదను
భ్రాంతి మాదిరి సృష్టిలొ తాను
ఉన్నటు భ్రాంతిదు ప్రభువుకుజోతలు!

తామరాకులో నీటి బొట్టులా
అంటక - సృష్టిలొ నెలకొను స్వామి
స్వయంప్రకాశము కలిగిన యట్టి
సత్యస్వరూపునికిదె వందనము

గాయత్రి మంత్రమును ప్రతిపాదించెడి
భాగవతమ్మొక దివ్యవరమిది
సర్వధర్మముల భాండాగారము
భగవంతుని మరి చూపించునిది.

॥శ్రీ కృష్ణచరితము॥



## 1 భాగవతప్రశస్తి

మోక్షమిచ్చెడి మహా మంత్రమిది
భక్తి ప్రపత్తుల వినిన చదివినా
ధర్మమూర్తి - తా - వశుడగు తథ్యము
వ్రాసిన కలుగును బ్రతుకుకు తృప్తి

భాగవతమ్మును కాదని మిగిలిన
శాస్త్రములన్నీ చదివిన కాని
ఈశ్వరానుగ్రహము లభించ దిలలో
పరమార్ధమును తెలుపును యిదియే

వేదమనెడి ఆ కల్పతరువున
పండినపండే భాగవతమ్ము
శుకుడను చిలుకతొ అమృతతుల్యము
రసము చిందునీ రమ్యగాధలో

వ్యాసుడు దీనిని మానవాళికి
అందించెను తను విశ్వశ్రేయముకు
చదివి సుఖములు శుభములందుకొని
దివ్యధామముకు చేరుట కనువిది

నైమిశారణ్యమునందున మునులు
హరిసాయుజ్యము అభిలషించుచు
మహాయజ్ఞమును ఆరంభించిరి
వేయిఏండ్లుగా సాగుయజ్ఞమది

దైనందిన కృత్యమ్ముల చేసుకు
మహామునులు వారందరు అచట
బ్రహ్మతేజముతొ వెలిగెడి సూతుని
ప్రశంసించి – మరి పలికిరి భక్తిగ

"మహానుభావా! నీకు తెలియని
ఇతిహాస పురాణము లేవియులేవు
వ్యాసుడు ఆదిగ మునుల జ్ఞానము
కలిగియుంటివి జ్ఞాన నిధివయా!

కలియుగమందు అల్పాయుష్కులు
మందబుద్ధులు రోగపీడితులు
అయినజనులకు శుభప్రదమైనది
క్షేమము ఏదో – తెలుపుము స్వామీ!

భూతకోటికి ముక్తినిడునది
భవబంధములు త్రెంపజాలినది
వేదమ్ములచే కీర్తింపబడి
మృత్యుపాశములు తగులనీయనిది

దివ్యచరిత్రను వివరించుమయా!
దేవకి వసుదేవుల పుణ్యము
ఫలించి – వెలసిన నారాయణుని
రమ్య–రసమయ–గాధను తెలుపుము

కల్మషహారిణి – ఆనంద ప్రదాత
శాశ్వత మోక్షము అందించునది
కృష్ణుని చరితము వినకోరితిమి –
వద్దని – అనెడి వాడే వుండడు.

శ్రీహరిస్మరణ కార్చిచ్చువలె
పాపారణ్యము నంతము చేయును
సంసార జలధిని దాటించగల
ఒకేసాధనము నారాయణ మంత్రము

లీలామానుష విగ్రహుడా హరి
బలరామునితో కలసి పుడమిని
లోకోత్తరమగు పనులు చేసెను
అవి విన మనసై అడుగు చుంటిమి

ధర్మ రక్షణకు వెలసిన కృష్ణుడు
తిరిగి తాను – నిజవాసమునకు
వెడలగ – ధర్మము ఎటవెలసినది?
చెప్పుము అనుచు సూతుని అడిగిరి

చాలాకాలము జీవించితివి
గ్రంధములెన్నో చూచిన ఘనుడవు
వినదగినవి మరి వినిన యోగ్యుడా!
పెద్దలసేవ చేసిన ధన్యుడ!

కలిదోషమును నివారించెడి
అఖండ యశము సమకూర్చెడిది
హరి కథయనెడి అమృతంబును
వలదని పలికెడి వారుండరయా!

కమలనాభుని కథామృతంబది
దుఃఖము అనెడి మత్తగజమునకు
సింహము వంటిది - ఆనామముచే
అరిషడ్వర్గపు చీకటి తొలగును.

॥శ్రీ కృష్ణచరితము॥



## 2 సూతుడు నారాయణ కథా ప్రశంసచేయుట

మునుల కోరిక తెలిసిన సూతుడు
రోమహర్షణుని తనయుడాతడు
హర్షపూరిత కంఠముతోను
ముందుగ శుకునికి ప్రణతులనిడెను

సర్వజీవుల సమతను తెలిసిన
భవబంధములకు లొంగనివాడు
శుకుడు - వనములో సాగుచుండగా
పుత్రవాత్సల్యము నిండిన వ్యాసుడు

తనయుని పైన మమకారముతో
నాయనా శుకా! అనుచు పిలవగా
ప్రకృతి యంతయు ప్రతిధ్వనించెను
అట్టియోగి - శ్రీ శుకునికి ప్రణతులు!

వేదసారమై - పరంధాముని
ఏకత్వమును తెలుపుజ్ఞానము
పురాణజ్ఞానము కలిగిన - శుకునికి
మనసునిండుగా వందనమ్ములు

విరాట్పురుషుడు లోకశ్రేయముకు
అవతరించె నర నారాయణలుగ
వారికి - భక్తిగ వందనమిడితిని
పలుకుల రాణికి - నమస్కరించితి

వేద విభజన చేసిన ఘనుడు
కృష్ణ ద్వైపాయనునకు ప్రణతులు
భవబంధములు త్రెంపగ జాలిన
భాగవత గ్రంథమ్ముకు - ప్రణతులు.

“మునులారా! మీరడిగిన ప్రశ్న
మీకూ నాకూ - సకల లోకములకు
మంగళప్రదమై శ్రీకరమైన
మోక్షసాధనకు త్రోవచూపునది

ఇహసంబంధము త్రెంపగలిగిన
ఆత్మప్రసన్నత కలగజేయగల
హరిభక్తిని మరి కలిగియుండుట
మానవజన్మకు ఉత్తమ ధర్మము

కృష్ణభక్తియది స్థిరముగ నిలచిన
వైరాగ్యము మరి ఆత్మ జ్ఞానము
లభించగలవు - ఓ మునులారా!
గురువులు చెప్పిన విషయము చెప్పెద

కృష్ణలీలలతొ పొంతన లేని
ధర్మములవ్వి ఫలమునీయవు
కనబడునట్టి ప్రలోభమ్ములవి
మోక్షమీయగా చాలనివగును

ధర్మము కాదను - అర్ధమనర్ధము
జ్ఞానము తత్త్వము అనెడి విషయము
బ్రహ్మము అని - మరి ఉపనిషత్తుల
సారమెరిగిన వారు - చెప్పెదరు

బ్రహ్మవాదులు అట్టిదానిని
పరమాత్మయందురు దానినేమరి
సాత్వతులందురు - పరమాత్మయని
వైష్ణవ ఆగమమగును - సాత్వము.

ధర్మానికి మరి ఫలము - భక్తియగు
స్వధర్మపాలన హరికి ప్రీతియగు
శ్రీహరి ధ్యానము అనెడి ఖడ్గమున
కర్మబంధముల తెగకోయవలె

శ్రీహరిపైన శ్రద్ధ బలపడు
మోక్షమునొసగెడి విష్ణుకథలను
మించిన పుణ్యము నొసగ వేవియును
కావున కథలను - కాదనరెవ్వరు

మోక్షము అన్నది విష్ణు భక్తితో
సాధ్యమన్నది తెలియగవలెను
సత్త్వగుణముతో దుఃఖసాగరము
దాటించగలదు కథాశ్రవణము

సృష్టి చేయుటకు రజోగుణముతో
పాలించుటకు సత్త్వగుణముతో
తమోగుణముతో లయము చేయుటకు
త్రిమూర్తులందరు శ్రీహరి రూపము

గుణములన్నిటిలో సత్త్వగుణమది
ప్రధానమైనది దానిసాయమున
బ్రహ్మపదార్థము దర్శనమగును
కావున మునులు - సత్త్వప్రధానులు

ఐహిక సుఖములు కోరిన కొందరు
దేవతలందర నాశ్రయింతురు
జీవికి ముఖ్యము ముక్తి నొందుట
అది సాధ్యము మరి శ్రీహరి భక్తితో

వేదము యాగము-యోగము మొదలగు
సత్కర్మలన్నియు హరికి ప్రియములు
గుణరహితుడగు పరమేశ్వరుడు
మాయతో గుణముల ప్రవర్తించును.

లోకకర్తయగు పరమాత్మకు మరి
సర్వజీవులు ఆయన అంశలు
కనబడునట్టిది లీలావిశేషము .
లోకరక్షణ - ఆయన ధ్యేయము

మహత్తు - అహంకార గుణములతోను
పదారుకళలతో భాసించును - శ్రీహరి
పంచభూతముల లీనమై మరి
కనబడువాడు పరమపురుషుడు

ఆయన రూపము అపురూపమది
పదములు భుజములు ముఖములు చెవులు
కన్నులు ముక్కులు శిరములు వేలు
హారకుండల కిరీట శోభితుడు

అట్టి ఈశ్వరుడు అనంత మూర్తికి
ఆదిమధ్యాంతములన్నవి లేవు
యోగ నిద్రలో సంద్రమధ్యమున
నెలకొని - భువనమ్ముల-తా-నేలును

అధినాయకుడు అవ్యయుడైన
అక్షరమూర్తి భువన పోషకుని
దివ్యరూపమును యోగులు గాంతురు
ఆయన అవతారమ్ముల వినుడు.

॥శ్రీ కృష్ణచరితము॥



# 3 భగవంతుని ఇరవై ఒక్క అవతారములు

పరంధాముని నాభికములమున
సృష్టికర్తయగు బ్రహ్మపుట్టెను
విరించి అవయవస్థానమ్ముల
లోకమ్ములు సృష్టించబడినవి

యజ్ఞేశుండై భూమిని - లీలగ
ఉద్ధరించిన ఆదివరాహము
రెండవ అవతారమ్ముగ నిలచెను
ఆపై మూడుగ - కౌమారుండు

కౌమారమును ఆధారముగా
బ్రహ్మచర్య మనుష్ఠించె - కౌమారుడు
మూడవ అవతారమ్ము - నారదుడు
వైష్ణవతంత్రము వెల్లడిజేసెను

నరనారాయణులు నాల్గవ రూపము
దుష్కరమైన తపమొనరించెను
ఐదవ అవతారమ్ము - కపిలుడు
తీయగ - సాంఖ్యము నుపదేశించెను

అత్రి అనసూయలకు - దత్తాత్రేయుడు
ఆరవ అవతారమ్ముగ పుట్టి
అలర్కునికి మరి ప్రహ్లాదునికి
ఆత్మవిద్యను ఉపదేశించెను

ఏడవ అవతారమ్ము యజ్ఞుడు
రుచికి అకూతియందు పుట్టెను
యమాది దేవతల కూడి అతడు
స్వాయంభువమన్వంతరమును కాచెను

ఉరుక్రమావతారము - ఎనిమిది
నాభి - మేరుదేవుల తనయుడు
మహా విద్వాంసుడు - ఆకుమారుడు
పరమహంస మార్గమ్ము తెలిపెను

పృధు చక్రవర్తి - తొమ్మిదవ రూపము
భూమిని గోవుగ చేసి అతడు
సమస్త ఓషధులను పితికి మరి
జీవతేజము సృష్టికి నిడెను

మీనావతారము - పదియవదై మరి
భూమిని నావగ జేసి అంతట
ప్రళయములో - వైవస్వతుని
నావపైకి గొని ఉద్ధరించెను

సంద్రమధ్యమున మందరగిరిని
మోసిన కూర్మము - పదునొకండగు
పన్నెండవ అవతారము - ధన్వంతరి
అమృతభాండమ్ముతొ పుట్టెనాతడు

అమృతమధనమ్మున పుట్టిన
మోహిని పదమూడవ రూపమ్ము
దేవదానవుల మభ్యపెట్టి మరి
అమృతమిడెను దేవగణముకు

హిరణ్యకశిపుని సంహరించుటకు
స్తంభములోన ఉద్భవించిన
అవతారమ్మది నృసింహరూపము
పదునాల్గవ అవతారమైనది

వామన అవతారమ్ము పదిహేనవది
భార్గవరాముడు పదునారవది
వేదభిక్షను పెట్టిన యట్టి
కృష్ణద్వైపాయనుడు పదునేడవది

దశకంధరుని శిరములు దునిమి
ధర్మమూర్తిగా పేరుగడించిన
దశరథ కౌసల్యమ్మల తనయుడు
శ్రీరాముడు పదునెనిమిదవతారము

పందొమ్మిది ఇరవై అవతారమ్ముల
యదువంశవర్ధనులు బలరామ కృష్ణులు
ఆపై బుద్ధుని అవతారమ్మది
ఇరవై ఒకటిగ చెప్పబడినది

కాలక్రమమున యుగసంధిలో మరి
రాజులు ధర్మము విడచి చోరులవ
వారిమదమునడగించుట కొరకై
విష్ణుయుతునికి – కల్కిగ పుట్టును

శ్రీహరి అవతారమ్ము లనంతము
ధర్మ రక్షణకు పుట్టిన వన్నీ
అన్నిటియందు శ్రీకృష్ణుడు – తా –
కలసియుండును జగత్ హితముకై

రూపరహితుడు – జీవుడు – ఆతడు
ఆత్మయని మరి పిలవగబడును
పరమేశ్వరుని దివ్యమాయతో
మహదాది రూపము చేతను అంత

ఆత్మస్థానమున నెలకొని యుండి
స్థూలరూపము కలిగియుండినది
నింగిని – గాలితొ మేఘములున్నటు
గాలిలొ – పరాగ మున్నయట్టుల

ఆత్మకలసిన స్థూలశరీరమును
వివరముగా మరి తెలియగవలెను
స్థూలస్వరూపము కన్నను – కంటికి
కనిపించని ఒక పరమసూక్ష్మము

కరచరణములు లేక యున్నది
కనబడనట్టి గుణములుకలది
వ్యక్తముకానిది – విననట్టిదియగు
మరియొక రూపము – జీవునికున్నది

నిష్క్రమణా గమనమ్ముల వలన
తిరిగిజన్మ మరి కలుగుచున్నది
స్థూల సూక్ష్మరూపమ్ములు రెండును
తమ – తమ రూపుల తెలియగచాలి

ఒకదానికి మరి రెండవ రూపము
వేరు అనుచును తెలియగ నగునో
అపుడే జీవుడు బ్రహ్మదర్శనము
చేయగ - సర్వత కలిగిన వాడగు

జగన్నాటక సూత్రధారి - తను
పాత్రలో ఎన్నడు చిక్కుపడకను
భూత కోటికి ఆత్మగ నెలకొని
అరిషడ్వర్గమ్ములకు దూరమగు

అవిద్య - అనెడి మాయ - కేవలము
పరమాత్మ కల్పితము-అతడే దానిని
ఎన్నో విధముల నాడించుచుండును
అవిద్య తొలగిన - తెలియును నిజము

ఆకాశము వలె నిర్మలుడా హరి
ఇంద్రియాల నడిపించు శక్తియే -
కానీ వాటితొ సంబంధము లేదు
హరి జన్మ కర్మలవి - ఊహాజనితము

అవిద్య తొలగిన - ఆ సమయములో
స్థూల సూక్ష్మరూపమ్ములుపోయి
కట్టె మండగా ప్రకాశించెడి
అగ్నితీరుగా జీవుడు వెలుగును

రూపనామములు సంకల్పముతో
ధరించగలిగిన - అక్షరమూర్తి
ఎంతతెలిసినా హరితత్త్వమది
అంతుపట్టని - అనంతమైనది

ఉపాధినుండి - వేరై - జీవుడు
ఆనందములో లీనమ్మగును
ఆత్మ దర్శనము అందురు దానిని
బ్రహ్మప్రాప్తియని విజ్ఞులందురు

ఏకాగ్రతతో స్థిరమగు భక్తితొ
హరిపాదమ్ముల సేవచేసిన
పురుషోత్తముని లీలలు తెలియును
వారికి చాలరు - బ్రహ్మాది దేవతలు

సంయమీంద్రులు మీరందరును
ఎంతటి పుణ్యము చేసిరోమరి
విష్ణుకథలపై మనసు కలిగినది
వివరించెదను పావన గాథలు."

॥శ్రీ కృష్ణచరితము॥



## 4 శ్రీ మహాభాగవతరచనాదివృత్తాంతం

భాగవతపురాణమ్మది - మిన్న
శ్రీహరిచరితము పరమ పవిత్రము
మహదానందము మంగళప్రదము
వ్యాసుడు - శుకునకు ఉపదేశించెను

వేద ఇతిహాసముల సారముఅయిన
భాగవతమ్మును పరీక్షిత్తునకు
ముక్తిమార్గముగ - శ్రీ శుకుడు చెప్పగా
దివ్యధామము - రాజుకు లభించె

శ్రీ కృష్ణుడు ధర్మ జ్ఞానములు
జేర్చుకు – వైకుంఠ ధామ మేగగా
కలిదోషములు చీకటివలెను
లోకమంతయు ఆక్రమించెను

వివేక హీనులు అయిన – ప్రజలకు
వెలుగుచూపెడిది – భాగవతమ్ము
వ్యాసుని వలన నేర్చిన దానిలో
శక్తికి తగ్గటు వినిపించెదను

అంతట – శౌనకు డడిగె సూతుని
ఏయుగమందు ఎక్కడ ఎందుకు
ఈపురాణము చెప్పగ వలెనని
వ్యాసుని కోరిరి ఓపుణ్యాత్మా!

భాగవతమ్ము వ్యాసమునీంద్రుడు
వ్రాయవలసిన కారణమేమి?
పరీక్షిత్తునకు వ్యాసకుమారుడు
ఏలచెప్పెను భాగవతమ్మును

సర్వభూత సమ హితుడగు యోగి
శ్రీశుకయోగి నిర్వికారుడు
దిగంబరుడుగా సాగుచుండగా
జలకాలాడే దేవకన్యలు

లజ్జపడకను తానమాడిరి
అదే అచ్చరలు – వ్యాసుని గాంచి
సిగ్గుతొ – చీరలు ధరించినారు
అంతట అడిగెను వ్యాసమునీంద్రుడు

భక్తిగ చెప్పిరి ఆ స్త్రీలచట
స్వామీ! శుకుని సమానదృష్టి
స్త్రీపురుషులను – భేదమెరుగనిది
అతనికి నీకు తేడాయున్నది

అట్టిశుకుడు – తా – హస్తినాపురము
వెళ్ళుట ఎటుల – అట్టి విరాగి
జడునిగ తోచే వాడు – ఎట్టుల
పరీక్షిత్తుతో సంభాషించెను.

గోవుపాలను పిదికినంతటి
సమయము కూడా – నిలవని శుకుడు
అంత సమయమా రాజు సన్నిధిని
ఎటుల చెప్పెనీ భాగవతమ్మును

పాండవ వంశోద్భవుడు పరీక్షిత్తు
అతిబలవంతుడు – ఓటమి నెరుగడు
భీష్మాదులను ఎదిరించినయట్టి
కిరీటి కాతడు మనుమడు అగును

అస్త్రాచార్యుని – ద్రోణుని మొదలగు
విలువీరులను ఎదిరించి నిలచిన
అభిమన్యు కుమారుని వీరకిశోరుని
జన్మమెట్టిది ఆ పుణ్యాత్ముడు

అనంతభోగములన్నీ వదలి
గంగ ఒడ్డున ప్రాయోపవేశమున
ఉండుటకేమి హేతువు స్వామీ!
సందేహములు తీర్చుము అనిరి.

॥శ్రీ కృష్ణచరితము॥



## 5 వ్యాసుడు వ్యాకులచిత్తుడై విచారించుట

అంతట పలికెను సూతపౌరాణికుడు
యుగములయందు-మూడవ దైన
ద్వాపరమ్ము ముగియు సమయము
ఉపరిచరమనువు-తా-తేజము నింపెను

వాసవి యనబడు సత్యవతికిని మరి
పరాశరునికి - హరి అనుగ్రహమున
వేదవ్యాసుడు ఉద్భవించెను
కృష్ణద్వైపాయనుడు అందురాయనను

బదరికాశ్రమమునందున వుండెడి
వ్యాసుడు - సరస్వతీ నదిలో శుచియై
సంధ్యనియమము తీర్చుకొని అట
ఏకాంతముగా కూర్చొనియుండగ

బాలభానుడు లేచుసమయమున
వ్యాసునిమదిలో లేచె తరంగము
కాలవేగము తెలియదెవ్వరికి
భవితలొ యుగముల ధర్మము చెదరును

వచ్చుయుగముల మానవులు యిల
సత్యదూరులై మందమతులునై
అల్పాయుష్కులు దుర్బలు లగుదురు
అన్నచింతన - మెదలె వ్యాసునికి

త్రికాలమ్ములను తెలిసిన వ్యాసుడు
భవిష్యత్తులోని విషయము తెలిసి
మదిలో ఎంతో చింతనొందెను
తనుచేసిన పని ఆలోచించెను

వేదవిభజన జరిగెను తీరుగ
పంచమవేదము పురాణమ్ములని
ఇతిహాసమ్ములు అని ప్రవచించెను
ప్రజల హితముకై తపన - ఫలితమవి

ఋగ్వేదమును పైలుడుచదివెను
సామవేదము జైమిని నేర్చెను
యజుర్వేదమును వైశంపాయనుడు
అధర్వవేదము చదివె సుమంతుడు

పైలాదులాదిగా శిష్యులందరూ
వారి శిష్యులకు బోధించగను
విస్తరించిన వేదవిజ్ఞానము
తరిగిపోయెడి కాలము వచ్చెను

సర్వజనులకు ముక్తినిచూపగ
వేదధర్మ ప్రతిపాదితమైన
మహాభారతము రచియించె ఘనముగా
అంతజేసియు శాంతినందక

వ్యాకులచిత్తము కలిగియుండెను
కారణమేమని ఆలోచించెను
అన్నిచేసియు అసలు మూలమగు
శ్రీహరి పరముగ రచించకుంటిని

యోగులకు మరి నారాయణునకు
ప్రియమగు నట్టి భాగవత ధర్మము
కూలంకషముగ చెప్పనైతినని
మధననిండెను మౌని చంద్రుడు

॥శ్రీ కృష్ణచరితము॥



# 6 వ్యాసుని వద్దకు నారదుడు వచ్చుట

ధర్మవిశారదుడైన నారదుడు
నారాయణ మంత్రమ్ము జపించుచు
తులసి మాలతో మహతీవీణతో
నదీతీరమున కరుగుదెంచెను

వ్యాసుడుగాంచి సంతసమందెను
ఉచితరీతిని పూజలొనర్చెను
ఆనందించిన బ్రహ్మకుమారుడు
వ్యాసునిగాంచి పలికెనచ్చట

"వేదభిక్షనిడి వెలుగునింపితివి
భారతమ్మును ఒసగిన బ్రహ్మవు
యోగులనేతవు విరాగివి నీవు
వర్ణాశ్రమధర్మమ్ములొసగితివి.

వ్యాకులమ్ముతో అశాంతితోను
నీవున్నటుల కనబడుచున్నది
కారణమేమి వ్యాసభగవానుడ!"
అనగా పలెకెను మునికులతిలకుడు

"నీకు తెలియని విషయము కలదా!
హరి కీర్తనలో పండిపోతివి –
భక్తాగ్ర గణ్యుడవైన నారదా!
నా అశాంతికి – కారణ మేదియొ?

అంతట పలికెను నారదమౌని
ఆలోచించుమ తెలియును నీకు
అయినా అడిగితివీవు తెలిపెద
అనంత వేదము లొంగ దీసితివి

అనంత మూర్తి శ్రీహరిగూర్చి
తెలుపక పోతివి విపులముగాను
ధర్మాలతొమరి శాంతి కలుగదు
హరి కీర్తనయది వేదన నణచును

శ్రీహరిలీలలు నిండిన కావ్యము
బంగరు పద్మమ్ములతో నిండి
రాజహంసలతొ సోయగ మొలికెడి
మానస సరస్సువలె భాసిల్లును

అట్టిది కాక హరికీర్తన లేక
పుట్టిన కావ్యము – పుట్టను బోలి
పాములునిండి అయోగ్యమగును
ఆదరించబడక – మూలనుబడు

హరిగుణగానము చేసెడి పలుకుల
అపశబ్దములు హరించిపోవును
పాపపంకిలము క్షాళనచేయును
కైవల్యమ్మది అందుట తథ్యము.

సకల ధర్మములు తెలిసినవాడవు
కర్మల ఫలితము శ్రీహరి పరముగ
ధారపోయవలె భక్తి ప్రపత్తుల
భక్తిలేని పూజ యది పత్రిచేటుగద!

సత్యము నిత్యము అక్షరమైన
అనంతమూర్తిని ఆనందముతో
అడుగడుగున – తా – లీలలుజూపే
దివ్యమూర్తిని వర్ణనచేయుము

.అటులచేసిన హరికరుణించి
ఆనందధామమున అడుగిడజేయును
కోర్కెలు నిండి కర్మలు చేసెడి
విధి విధానములు ప్రవచించితివి

అట్టివి - కామ్యము ప్రధానమనుకొని
ప్రక్కత్రోవకు తీసుకు పోవును
భక్తి విషయము మరచిపోదురు
అది చివరకు మరి నాశహేతువగు

సుఖదుఃఖములను లెక్కచేయక
నమ్మకమ్ముతో - హరి భక్తి వదలక
కర్మల ఫలితము శ్రీహరియనుచు
తెలిసినవానికి ముక్తిలభించును

విశ్వమనగా మరి విష్ణువేయగు
విష్ణువు కాని విశ్వములేదు
విశ్వసృష్టి మరి వృద్ధి - క్షయములు
విష్ణువువలననె జరుగుచున్నవి

నీవనగా మరి విష్ణు అంశయే
నీకు తెలియనిది చెప్పుటలేదు
లోకశ్రేయముకు జ్ఞానబోధన
చేయగపుట్టిన పుణ్యాత్ముడవు

దాన తపస్సులు చదువులసారము
కలిగినజ్ఞానము అంతయు కూడా
పుణ్యశ్లోకుని కీర్తించుటకై
అన్నటు - అర్చించుము ఆహరిని

అన్ని కర్మల ఫలితము మోక్షము
అట్టి మోక్షము హరిభక్తి వల్లను
కలుగునన్నది జగతికి తెలుపుము
అందుకు చెప్పెద - నా వృత్తాంతము.

॥శ్రీ కృష్ణచరితము॥



## 7 నారదుని పూర్వజన్మవృత్తాంతము

పూర్వజన్మలో దాసీపుత్రుడ
వేదవిద్వాంసుల గృహములందున
పనిచేయు దాసికి - తనయుడనైతిని
సత్పురుషుల సందర్శన మందితి

పుణ్యమూర్తుల గృహమునందున
చాతుర్మాసపు వ్రతములు సలిపెడి
యోగిజనులను దర్శించితిని
వారి సేవలు చేయగలిగితి

వారు భుజించి - పరిహరించిన
ఆహారమునే గ్రహించుచుంటి
నిరతము వారి సేవచేయుచు
భక్తిప్రపత్తుల మెలగుచుంటిని

విష్ణు సేవలు వారు చేయుచు
హరికీర్తనలు గానము చేయుచు
శ్రీహరి గాధలు చర్చించుకుని
గడిపెడి యోగులు నా బ్రతుకు-మార్చిరి.

హరిసేవకు నాహృదినర్పించి
మనస్సులగ్నము చేసి - వినుటచే
బ్రతుకు నైజము - నిజముతెలిసితి
మాయబొమ్మ ఈ తనువనితలచితి

యాత్రకు వారు సాగిపోవుచు
నమస్కరించి నిలచిన నాపై
దయావృష్టిని కురిపించుచును
ఈశ్వరతత్త్వము నుపదేశించిరి

కర్మలవలయము సంసారలంపటము
అన్నవిషయ మవగాహనైనది
హరికీర్తనము నిశ్చలధ్యానము
మోక్ష మార్గమును చేర్చు - జీవుని

ఆ పుణ్యాత్ముల అనుగ్రహమ్మున
అలవడినట్టి భక్తిపెంచుకు
బ్రతుకు బాటలోనడువ సాగితి
అపురూప జ్ఞానము ఈశ్వరుడొసగెను

కావున మౌనీ! నీవు కూడను
విరాట్ పురుషుని కీర్తన చేయుము
మునులలోమేటివి ఓ పుణ్యాత్మా!
నీ వలనను మరి తరింతురెందరొ

అంతట అడిగెను వ్యాసుడు తిరిగి
నీ బాల్యమును తెలియజెప్పితివి
ఆ పైకాలము గడిచెను ఎటుల
తనువు నెట్టుల విడచి పెడితివి

బదులు పలికెను నారదమౌని
హరిభక్తి నిండిన హృదయముతోను
ఆనందముగా కాలముగడిపితి
తల్లిసేవలు చేయుచుంటిని.

అంతట ఒక చీకటి ప్రొద్దున
పాలుపితుకుటకు అమ్మవెళ్ళినది
చూడక - ఆమె పామునుత్రొక్కెను
కాటువేసినది విషకీటకము

కేకను పెట్టి నేలను బడినది
పరుగున పోయి చూచిన నాకు
కొన ఊపిరితో తల్లి కనబడె
విషమున కామె బలియైపోయెను

కన్నుమూసెను - నాప్రియజనని
నామనస్సు కది విధియనిపించెను
ఉన్న బంధము తెగినది అనుచు
హరి నామమును స్మరించి సాగితి

గమ్యము నెరుగని ప్రయాణమ్మది
అడవులు పల్లెలు కొండలు - కోనలు
తిరిగితి తిరిగితి - అలుపునెరుగను
దొరికిన పండో ఫలమోతింటిని

చల్లనిగాలి స్వచ్ఛజలమ్ము
వనసౌందర్యము గాంచి సాగితి
అటుల నడిచి ఒక కికారణ్యము
చేరుకొంటిని భయంకరమ్మది

కాలుకదపగా సాధ్యముగాని
తీగలు పొదలు విషకీటకములు
క్రూర మృగమ్ములు భీకరధ్వనులు
గుండెలవిసెడి - వాతావరణము

నడచి నడచి ఒక రావి చెట్టును
చేరుకొంటిని - కూర్చొంటి నట
హరిధ్యానములో నిమగ్నమై మరి
అంతరాత్మలో హరిని వెదకితి

నాలోనున్న నారాయణుని
అన్వేషించగ ధ్యానమునుంటిని
అంతటిలోన నామనస్సది
ఆనందధామముగ మారిపోయినది

పులకరించినది మేనంతయును
ఆనందబాష్పములు ధారలు కట్టెను
నాశరీరమది తేలికయైనది
మనస్సువదలెను దేహభ్రాంతిని

ఆ సమయములో ఆత్మసాక్షాత్కారము
అనుభవించితి - చెప్పనసాధ్యము
అంతటిలోన ఆ స్థితి తొలగి
అంతా కనబడె తెలివి వచ్చెను.

శ్రీహరి కొరకు వెదక జొచ్చితి
కొమ్మకొమ్మను రెమ్మరెమ్మను
తీగలు పొదలు తరులు గిరులు
అన్నీ వెదుకగ నారంభించితి

హరి - మరి యిక నాకగపడ డాయని
కుమిలి కుమిలి నే ఏడ్చితి వనమున
అంతట నింగిని దివ్యశబ్దమది
"'కుమారా' - యని పిలచినట్లయె

విచారించకు ఈ జన్మలోమరి
నన్నుచూడగ చాలవు నీవు
అరిషడ్వర్గములణచివేసి మరి
కర్మత్యాగి యగు ముని కనగలుగును

నాపైనున్న భక్తికి మెచ్చి
ఒక పరినీకు దర్శనమిడితిని
నీమది కోరిక నాకుతెలియును
నీలో దోషములన్నీ పోయెను

మరో జన్మను ఎత్తెద వీవు
భక్తి మరింత బలపడియుండును
నీవుతొందరలొ దేహము వదలి
హరిభక్తితొ మరి పుట్టెద వీవు

జరిగెడి సృష్టి లయమై పోయి
వేయియుగములు పూర్తికాగనే
చీకటి పడును సృష్టి మొదలగు
అప్పుడు తిరిగి జన్మించెదవు

భక్తులందున శిరోరత్నముగ
భాసిల్లెదవు సాత్వికమూర్తిగ."
అనుచు పలికెను ఆగమవినతుడు
వినతాసూనుని నాయకుడాతడు -

అభయహస్తము తలపై నున్న
అనుభూతిని నే పొందగలిగితి
ఆనందముతో మదిలో ప్రణమిలి
అరిషడ్వర్గమ్ముల నణగించితి

శ్రీహరి ధ్యానము కీర్తనచేయుచు
ఆనంద సీమలో నడచు చుంటిని
నేను తిరగని చోటులేదు ఇల
ఆ పరమాత్మ పిలుపుకు నిలచితి

అంతటిలోన మెరపు మెరసినటు
వచ్చి చేరినది మృత్యువు నాకు
ఆనందముతో తనువు నొసగితి
పంచభూతముల కప్పగించితి.

శ్రీహరి చలవతొ శుద్ధ సత్త్వమగు
భాగవతదేహము ధరించినాను
అంతటిలోన ప్రళయమేర్పడె
సృష్టివినాశము అయిపోయినది

ఆసమయములో ఆది దేవుడు
యోగనిద్రలో సంద్రమధ్యమున
పవళించెను ఆ నలువవిడచిన
నిట్టూర్పుతొ - నే లోనజేరితిని

వేయి యుగముల కాలముసాగెను
విరించి లేచెను సృష్టిమొదలయె
బ్రహ్మదేవుని ప్రాణవాయువున
మరీచి మొదలగు మునులు పుట్టిరి

ఆమునులతొ పాటు - నేను పుట్టితి
మహావిష్ణువు అనుగ్రహమ్మున
మూడు లోకములు తిరుగ జాలుదు
దివ్య వీణను దేవుడొసగెను

మహతీవీణకు మహత్తువున్నది
స్వరములు పలుకును మీటకుపోయిన
బ్రహ్మతత్త్వము తెలుపును స్వరములు
హరికీర్తనము చేయు చుండును

ఓ పుణ్యాత్మా అసమానుడవు
నాకూ నీకూ భేదములేదు
హరి గుణకీర్తన చేసెడినాకు
తలచిన - దర్శనమిడును మనస్సున

యమ నియమాదుల కఠిన దీక్షల
ఆత్మను స్వాధీనము చేయు సాధనలొ
కామ రోషముల వాసన నుండి
బయట పడుటది కష్టసాధ్యము

దానివల్లను దీక్షల వల్లను
శాంతి కలుగదు అంత ఎందులకు -
హరిలీలలను వర్ణించుమిక
అనుచు పలికి - ఆ నారదుడేగెను

అంతట శౌనకుడడిగె సూతుని
ఆపై వ్యాసుడు ఏమి చేసెను
అనగా పలికెను పౌరాణికుడు
సరస్వతీనది పడమటి దిక్కున.

శమ్యాప్రాసం అను ఆశ్రమము
రేగుచెట్లకు ప్రసిద్ధికెక్కెను
అరముగ్గిన ఆ ఫలములు చెట్లు
నయనానందము కలిగించునట

అచ్చట ఋషులు సత్రయాగము
నిర్వర్తించిరి అచ్చట వ్యాసుడు
సంధ్యనియమము తీర్చుకు నిష్టగ
ఈశ్వరదేవుని మదిలో గాంచి

త్రిగుణమ్ములకు అతీతుడనయి
జీవతత్త్వమును తెలుసుకుందును -
అని - నియమమున సాధనతోన
ఉత్తమస్థితికి చేరినంతనే

వ్యాసుడు వ్యాకులచిత్తము మరచి
నిర్వికారుడయి నిశ్చలభక్తితొ
ఈశ్వరదేవుని ఉపాసించి - తా
భాగవతమ్మును వ్రాసె భక్తిగా -

మహా వేదమీ భాగవతమ్ము
వినినవారికి శ్రీహరిపైన
అచంచలమ్మగు భక్తి ఏర్పడి
భవబంధములను తృంచివేయును

విశ్వశ్రేయమీ భాగవతమ్ము
అంతటిగొప్ప గ్రంధము నాతడు
తనయుడైన శుకయోగి చేతను
చదివించెను అని సూతుడు చెప్పగ

సకలశుభప్రదమీ భాగవతమ్ము
శ్రీహరి కీర్తన శుకున కిష్టము
హరికి అంకితము తానను భావన
కలిగిన శుకుడు చదివెను గ్రంధము

అదియును గాక వేలగ్రంధముల
పఠనమువలన లభించనట్టి
ముక్తిలభించును భాగవతమ్మున
కావున అందరు చదవదగినది.

॥శ్రీ కృష్ణచరితము॥



## 8 అర్జునుడు పుత్రహంత అయిన అశ్వద్ధామను అవమానించుట

సూతుడంతట - రాజర్షియగు
పరీక్షన్నరేంద్రుని - జన్మకర్మలను
ముక్తి ప్రాప్తినీ పాండవ మహాప్రస్థానమ్ము
కృష్ణ కథలను వినుమని చెప్పెను

కురుపాండవ సంగ్రామమందున
పేరు మోసిన వీరులు మడసిరి
కౌరవ పక్షమునందు మిగిలిన
దుర్యోధనునికి దుఃఖమెగసెను

భీమ సుయోధన గదాయుద్ధమున
రాజరాజుకు తొడలు తెగినవి
మానైకూలెను రణరంగమున
రాజునుచూడగ వచ్చె నశ్వత్థామ

ద్రోణతనయుడు అశ్వత్థామకు
అమిత ప్రేమ - ఆ సుయోధనునిపై
రాజుకు కూడా అంతియెప్రేమ
అశ్వత్థామ - ఓదార్చెను రాజును

నీకు సంతసము కలిగించెదనని
ప్రతిజ్ఞచేసి కదలిన విప్రుడు
నిద్రలోనున్న ద్రౌపది తనయుల
తలలునరకి తన రాజుకు చూపెను

ఆవిధముగను ప్రభు ఋణమ్మును
తీర్చుకొంటినని తలచెను విప్రుడు
లోకదృష్టిలో దుష్కృత్యమ్మది
పాండవులెవ్వరు లేరుఅచ్చట

తెల్లవారగను ద్రౌపది గాంచెను
రక్తపు మడుగుల కళేబరమ్ములు
శిరసులు లేని శిశువులగాంచెను
తల్లడిల్లెను విలపించె దీనముగ

నోటమాటలు రాకనిలచిరి
అందులొకొంత ధైర్యము తెచ్చుకు
కిరిటి-ముందుకు వచ్చి - ద్రౌపదిని
ఊరడించెను - పలువిధమ్ముల

మాటలురాక నిలచెను ద్రౌపది
అంతట శపథము చేసె కిరీటి
అశ్వత్థామ తలనరకెదను -
తెచ్చిచూపెద శోకమునాపుము

అనుచు కిరీటి కృష్ణుని చూడగ
సరియనినంత బయలు దేరిరి
పార్థసారధి రథము నడిపెను
గాండీవముతో కిరీటి నిలచెను

వాయువేగమున రథము సాగినది
అశ్వత్థామను చేరుకున్నది
కపిధ్వజమును గాంచి భయపడి
పరుగుతీసెను ప్రాణభీతితో

ఇంద్రకుమారుడు-హరుని జయించెను
తనపై పగగొని వచ్చుచుండెను
పసిబాలురను నరకిన తనకు
చావుతప్పదని పరుగిడజొచ్చెను

అంతటిలోన రథవేగమది
మందగించెను అదిగమనించి
బ్రతుకు జీవుడా అని గురుపుత్రుడు
అచ్చట గలవొక నీటివసతిగని -

ఆచమించి మరి అదే శరణని
బ్రహ్మశిరో నామకాస్త్రము
గాండీవిపైన ప్రయోగించెను
తేజోరాసిగ అస్త్రము సాగెను

దానినిగాంచి కిరీటి అంతట
దిగ్భ్రాంతినందెను కలవరపడెను
ఆగక ముందుకు వచ్చెడి కాంతి
వివరము తెలియక తికమకపడెను

ఆశ్రితవత్సల కాపాడుమయా!
కారుణ్యాలయ ఆదుకోవయా!
ధర్మమార్గమున నడిపెడివాడవు
నీకు తెలియని విషయములేదు

అనగా కృష్ణుడు పలికె - బావతో
బ్రతుకుపైన మరి ఆశచావక
బ్రహ్మశిరోనామకాస్త్రమును
ప్రయోగించెను అశ్వత్థామ

ఉపసంహారము తెలియదువానికి
కావున ప్రతిగా నీవు కూడను
బ్రహ్మశిరోనామకాస్త్రమును
సంధించుమయా - అభిమంత్రించి

అనగా పార్థుడు ఆచమించెను
అమోఘాస్త్రమును సంధించగను
రెండూ త్రోవలా కలిసి పోరినవి
ప్రళయమేమొ యని - తల్లడిల్లిరి

భూమ్యాకాశములందున తేజము
నిండి పోయినది - గిరులు వణకినవి
భూమి గిర్రున తిరిగినట్లయె
సర్వజగత్తు కలవరపడెను

అంతట కృష్ణుడు కిరీటితోననె
ఉపసంహారము తెలియదువానికి
ఉపసంహారము చేసి రెంటిని
నీవు గ్రహించుము అనుచు చెప్పెను

కిరీటి - వాటిని మంత్రబలముతో
ఉపసంహరించి గ్రహించినాడు
అదిగ్రహించి-తా-పరుగిడె విప్రుడు
వెంబడించి బంధించె కిరీటి

బలిపశువును మరి బంధించినటు
అశ్వత్థామను బంధించి తను
తలనరకుటకు సిద్ధపడినను
చంపక రథముననిడుకొని సాగెను

చంపక ఆగిన కిరీటిగాంచి
రెచ్చగొట్టెను మధుసూదనుడు
అర్ధ రాత్రిలో నిద్రలోనున్న
పసికూనలను చంపెను దుష్టుడు.

ఇతరులజంపి బ్రతక జూచిన
వానికి శిక్ష - మరణదండనే
చివరకునిన్నే చంపనెంచెను
ఉపేక్షించకు ఈఉన్మాదిని

ఎంతచెప్పినా తప్పుచేసినా
బ్రాహ్మణుడు అని మదిలోతలచి
బావతొ పలికెను - ధనంజయుండు
ఊగిపోతిని - ఆవేశముతో

గురుపుత్రుడు మరి సొదరసముడు
కావున చంపగ మనస్సురాదు
వీనిని - ద్రౌపది కప్పగింతును
అనుచునిలపెనట ఆ శిశుహంతను

శోకమూర్తిగా నిలచెను ద్రౌపది
తలను ఎత్తగా లేకను విప్రుడు
తేజోహీనము అయిన ముఖముతో
నిలచెను అచట - జీవచ్ఛవమై

కంటినీటిని తుడుచుకు ద్రౌపది
కరములుముడిచి నమస్కరించి
పలికెను అచట అశ్వత్థామతో
ఈటెలవంటి మాటలు విసరెను.



॥శ్రీ కృష్ణచరితము॥

## 9 ద్రౌపది అశ్వత్థామను అధిక్షేపించుట

“పంచపాండవుల గురువగు ద్రోణుడు
పూజనీయుడు మాకందరకు
ఆయన తనయుడవైన నీవును
గురువుతో సముడవు అవునా! కాదా!

అంతటినీవు కనికరముంచక
శిష్యుల బిడ్డల చంపుట తగునా!
సత్త్వగుణముతో పూజనీయుడు
బ్రాహ్మణుడనుచు గౌరవింతురు

దయా ధర్మములు సత్ప్రవర్తన
మీ సహజగణమది – వదిలి వేసితివి
యుద్ధనీతిలో ఆరితేరితివి
ఈ శిశుహత్యలు నీకు తగినవా!

రాక్షసులైనా శిశుహత్యకు మరి
వెనుకాడెదరే – తెలియదనీకు?
ఆయుధాలను ధరించి తనయులు
నీతో పోరగ రాలేదు కదా!

ముద్దులొలుకు పసికందులగొంతులు
నరకగ నీకెటు మనసువచ్చెను
యుద్ధమెరుగని అమాయకులను
మట్టుపెడితివి మగధీరుడవా!

పుత్రశోకమున మునిగిన నేను
పట్టితెమ్మని కోరితినయ్యా!
కానీ – నీదుతల్లికి తెలియగ
ఎంత బాధలో నున్నదొ పాపము

నాదుఃఖమును చూడలేకను
కిరీటి నిన్ను పట్టి తెచ్చెను
చచ్చిన నిన్ను – ఇంకేమందును
పుత్ర భిక్ష నీ తల్లికిడెదను –

అనుచు ద్రౌపది బాధనుమ్రింగుకు
శాంతించగను పలికె కిరీటితొ
ఈతనితల్లి ఈతని చూచుకు
సహగమనమ్ము చేయలేదట

బ్రాహ్మణహింస మంచిదికాదు
రాజుకే మరి కీడుచేయును
కావున వీనిని విడచి వేయుడు
అనుచు కరుణతో పలికె ద్రౌపది

పంచపాండవుల – భీముడు మాత్రము
ఆవేశముతో ఆగలేకను
చంపెదననుచు గదనుఎత్తెను
ద్రౌపది – అడ్డునిలచినదపుడు

అంతట కృష్ణుడు భీమసేనుని
శాంతపరచెను ధర్మ వాక్కుల
బ్రాహ్మణహంతగ మిగిలిపోదురా!
దుర్మార్గుడీతడు బ్రాహ్మణుడాయెను

బ్రతికితి వీవని వదలె భీముడు
అంతట కృష్ణుడు చెప్పిన మీదట
భీమ ద్రౌపదుల ఇద్దరి మనసుకు
శాంతి కలుగునటు - శిఖనుగోసెను

అశ్వత్థామకు ముండనంబును
నున్నగ జేసి ఆతని తలపై
వెలిగెడి రత్నము గ్రహించి-గెంటెను
నేలనుబడెను - ఆ శిశుహంత

ఈ అవమానము కన్నను తనకు
చావుమేలని తలచె నాతడు
పైగాశిశువుల చంపిన పాపము -
శిరమున వెలిగే రత్నము పోయెను

సిగ్గుతో నాతడు పరుగిడిపోయెను
బ్రాహ్మణుడెంతటి తప్పుచేసినా
వధించకుండా - మరియొక శిక్ష
అమలుజరుపుట ధర్మసమ్మతము

బ్రహ్మహత్యా దోషము తగలక
వధించక మరి తరిమివేయుటో
వానిధనమును గ్రహించుటయో మరి
తల గొరిగించుటో వేయుశిక్షలవి.

తంద్రులైదుగురు తనయులకోసము
కుమిలిఏడ్చిరి - అంతట కృష్ణుడు
వారందరిని ఓదార్చి - వారిచే
తదుపరి కార్యములను చేయించెను

గంగలో మునిగి తర్పణమ్ములిడి
వారికి శాంతిని కలుగజేసిరి
పుత్రశోకమున మునిగిన యట్టి
గాంధారి ధృతరాష్ట్రుల-కృష్ణుడు గాంచి

వారందరినీ కృష్ణదేవుడు
ఊరడించెను చల్లని మాటల
ధర్మదూరులై కౌరవులందరు
చరించ - ఆయువు క్షీణించినది

చివరకు యుద్ధము చేయుటకొరకై
ముందుకు వచ్చిరి - ఆ కౌరవులు
పాండునందనులతోడై కృష్ణుడు
కీర్తి ప్రతిష్టల నొసగెను వారికి

నిరాటంకముగ పుడమిపాలన
చేయించె కృష్ణుడు - ధర్మరాజుచే
అశ్వమేధములు చేయించెను మూడు
సమస్తసుఖముల సమకూర్చె కృష్ణుడు

వ్యాసాది మహర్షులు కృష్ణదేవుని
భక్తిమీరగా పూజలు చేసిరి
వారందరికీ వీడ్కోలిచ్చిన కృష్ణుడు
ప్రయాణమయ్యె ద్వారకకు

ఉద్ధవ సాత్యకి - మొదలగు వారు
ప్రయాణమునకై కృష్ణదేవునికి
తగు ఏర్పాటులు ఒనర్చినారు
రథమును సిద్ధము చేసిరి వారు

అంతటిలోన పరుగు పరుగున
ఉత్తర వచ్చి కృష్ణునిగాంచి
ప్రార్థించినది బాధనుతెలిపి
కాపాడమని పదములబడెను.

॥శ్రీ కృష్ణచరితము॥



## 10 శ్రీకృష్ణుడు ఉత్తర గర్భములోనున్న శిశువును రక్షించుట

"ఆశ్రితపాలా! అఖిలాండేశ్వర
దీనశరణ్యా! దయాసాగరా!
రక్షించుమయా! అభయమునిమ్ము
దివ్యశరమది తరుముచున్నది

కాలాగ్ని జ్వాలలతో మహాబాణము
మీదకువచ్చి పడుచున్నదయా!
కాల్చివేయును అతి తొందరలో
అదిగో స్వామీ! కాపాడుమయా!

నీ మేనల్లుడు యుద్ధభూమిలో
వీరస్వర్గము అలంకరించెను
నిండుచూలింతను - ఈకార్ముకము
శిశువును కాల్చును-రక్షించుమయా!

కడుపులో శిశువు సుడులు తిరుగుచు
అమిత బాధకు లోనగుచుండెను
బ్రహ్మాండమును భరించు భర్తవు
అబల గర్భమును కాపాడుమయా!

అపాండవమ్ము - చేసెద ననుచు
అశ్వత్థామ - సుయోధనునికి
మాటయిచ్చెను - దాని ఫలితము
గర్భస్థశిశువుపై - శరము దూకుట" -

సర్వము గ్రహించె సర్వేశ్వరుడు
అచట పాండవులు - అస్త్రమ్ములతో
అశ్వత్థామ వేసిన శరముల
తృంచుచుండిరి - చాకచక్యముగ

ఇచ్చట మాత్రము బాణమువచ్చి
ఉత్తర గర్భము కాల్చనెంచెను
గర్భమ్మును మరి ఆవరించినది
కబళించుటకు సిద్ధపడినది

వెంటనె కృష్ణుడు తేజోమయమగు
సుదర్శనమ్మును లీలగ వదలెను
గర్భములోన రక్షాకవచము
ఏర్పరచినది దివ్యచక్రము

అంతట చక్రము బ్రహ్మాస్త్రమును
నిలువరించి - శాంతింపజేసెను
జగద్రక్షకుడు గర్భపిండమును
రక్షించుటది - దైవలీలయగు

ఆనందించిన ఉత్తర - భక్తిగ
భక్తబంధువు పదములంటెను
అందరు అచట కృష్ణ దేవుని
పాదమంజరుల నమస్సులుంచిరి

అంతట కృష్ణుడు చిరునగవులతో
బయలుదేరగా కుంతి వచ్చినది
ఆప్యాయముగా - శలవును కోరగ
ఆనందసీమలో కడుగిడె కుంతి

ఆనంద బాష్పములు కారుచుండగా
ముకుళితకరముల - కుంతీదేవి
కృష్ణ దేవునికి నమస్కరించుచు
స్తోత్రముచేసెను బ్రతుకు ఫలించగ.

॥శ్రీ కృష్ణచరితము॥



## 11 కుంతి - శ్రీకృష్ణుని స్తోత్రముచేయుట

పొంగిన గుండెతొ పరవశమ్ముతో
పరంధాముని గాంచిన కుంతి
ఆనందముతో అభిమానముతో
అనన్యభక్తితొ స్తుతించెనిటుల

వాసుదేవ ఓ - దేవకినందన!
పంకజనాభా! గోవిందా హరి!
నందగోపకుల వందిత చరితా!
పద్మలోచనా - వనమాలాధర!

"కారుణ్యాలయ - అభయప్రదాతా!
అక్షరమూర్తీ - అఖిలాండేశ్వర
పాపనివారక - పావనచరితా
ఆర్తినిబాపే - ఆగమవినుత!

హృషీకేశ - ఓ శ్రీవత్సాంకిత!
లక్ష్మీనాథా! పన్నగశయనా
పతితపావనా! పరమదయాకర
తిరిగి తిరిగి - నావందనమయ్యా

వందనమయ్యా! మునిజనవందిత
మాయానాటక సూత్రధారివి
పరమ యోగులే - నినుగనలేరు
మూర్ఖులమగు - మా మాటయేలనిక

నిండుకొలువులో - నీచ బుద్ధితో
నిలువున - వలువలువొలుచుచుండగా
నిలువరించిన - నీరజనాభా!
నిన్నేమాటల స్తుతించగలను -

నందనందనా భక్తి నిండిన
పారవశ్యమున పలుకుచుంటిని
లక్కయింటిలో నాటి ఆపద
కాచినదేవా! కరుణాసింధూ!

భీష్మద్రోణ కృపాదియోధులతొ
దేవదానవులె తలపడలేరు
అంతటివారితొ అలుపులేకనే -
నాకొడుకులచే - ఆడించితివి

విషాన్నమును జీర్ణించుకొని
వజ్రకాయుడై భీముడునిలబడ
నీకరుణయది! కాళియమర్దన!
మానిని మానము - కాచిన దొరవు!

విజయమునందగ విజయునికీవు
సారథివైతివి సామాన్యుడవా!
పార్థసారథిగ ఇలవెలసితివి
పరమపూజ్య నీకిదెవందనము!

క్షణముక్రిందట బ్రహ్మాస్త్రమును
అణచివేసి మరి అవలీలగను
ఉత్తరగర్భము కాపాడితివి
అభయ హస్తము చాచి నిలచితివి

కంస బాధలు తల్లికి బాపిన
కందర్పసుందర - కాంచనచేలా!
కౌరవ - నిరసన జ్వాలలనుండి
కాపాడితివి - కమనీయమూర్తీ!

ధన మదాంధులు నిన్ను గానరు
నీకథలను వినక చెడిపోయెదరు
సామాన్యమగు యాదవుండవా!
ఇంద్రియ వికారము లేనివాడవు

నిత్యానంద ప్రభలతొ వెలిగే
విరాణ్మూర్తివి - స్వార్థమెరుగవు
అలభ్యమైన మోక్షమునిచ్చే
మహాదాతవు - దేవవందితా!

జన్మ లయములు లేని వాడవు
ప్రాణుల వృద్ధి - లయములు నీవి
కాలమ్మును శాసించువాడవు
నీ నటనయది తెలియ నసాధ్యము

తిర్యక్ జీవుల - వరాహ మొదలగు
అవతారమ్ములు ఎత్తితి వీవు!
మానవులందు రాముడు మొదలగు
దివ్యావతారము లెత్తిన స్వామివి

ధర్మరక్షణ సాధుపోషణ
నీధ్యేయముగా అవతారమ్ములు
ధరించినావు - దయామయుడవు
మాకొరకెంతటి బాధలు పడితివొ!

దధి భాండమును పగులగొడితివని
తాడుతొ నిన్ను బంధించగను
కాటుక కన్నులు నులుముకు నీవు
నిలబడ యశోద పులకరించెనే!

ఆదిమధ్యాంత రహితుడ వీవు
ధర్మజుకీర్తిని మంచిగంధముగ
దశదిశలావ్యాపింప జేస్తివి
నీ సహాయము లేక - నిలువరు

దేవకి వసుదేవులిద్దరి యొక్క
తపోఫలముగా పుట్టిన నీవు
అసురుల తృంచి అవనిగాచితివి
అనఘుల రక్షగ నిలచిన స్వామీ!

జలధిని మునిగిన భూమిని ఎత్తి
ఉద్ధరించగా బ్రహ్మకోరగా
అవతరించితివి అందురు కాదా!
లోకశ్రేయమే నీ ఆశయము

నీ చరితను విని నీ కీర్తనతో
నిరతము గడిపే భక్తులందరికి
నీ పదసేవ అనుగ్రహింతువు
పరమయోగులను మించిపోదురు

కోపముతో నువు కనబడు నట్టి
పెరుగు కుండను, బ్రద్దలుకొట్టగ
తల్లి యశోద త్రాటితొ కట్టగ
కన్నులకాటుక నీరునిండగా

చేతితొ తుడుచుచు ఎగబీల్చుచును
బట్టతొ వొత్తుచు – బాలభావము
ప్రకటించుటది – ఎంత చోద్యమో
నామదినిండిన ఘట్టము – కృష్ణా!

ఓ శ్రీకృష్ణా! యదుకులతిలకా!
నరసఖా – ఓ శృంగార సాగర
లోకద్రోహులగు ధరణీధవుల
వంశమ్ములను దహించు అగ్నివి

ఓ లోకేశ్వర! ఆర్తినివారక!
నీకు మ్రొక్కితి – కౌస్తు భహారా!
భవబంధమ్ములు త్రెంపివేయుము
బ్రతుకు భారమును మోయగలేను

చల్లగ మమ్ముల కాచుచుంటివి
మమ్ముల వదలి సాగిపోదువా!
నీపద స్పర్శను పొందిన భూమి
పులకరించి – తా – కళకళలాడెను

ప్రకృతి అంతయు పరవశమ్ముతో
కన్నులు విప్పుకు చూచుట – నిన్నే
గలగలపారే నదులసవ్వడి
నీకీర్తనలే చేయుచున్నది.

అనుచు పలుకుచు ప్రార్థించె నిటు
తనయులపైన బంధులపైన
మమకారమ్ములు త్రెంచివేయుము
నీ పదస్మరణ కలుగజేయుము

సంసారలంపటము లంతరించగా
చల్లనిచూపుల చూడుము తండ్రీ!"
అనుచు పలికిన కుంతితొ పలికెను
అత్తా ! వింటిని – ఆర్తి గ్రహించితి

అనుచు చల్లని చూపులతోను
నల్లనయ్య అట – కుంతినిచూడగ
పరవశించినది పదములబడినది
బ్రతుకుకు అర్థము తెలుసుకున్నది

అందరు కలసి హస్తినకొచ్చిరి
అచ్చటినుండి ద్వారక కేగగ
ధర్మరాజు మరి కొన్నిరోజులు
వుండగ కోరెను కృష్ణదేవుని

వ్యాసుడు ధౌమ్యుడు కృష్ణుడు అచట
వేదాంత విషయములు – ధర్మరాజుకు
తెలియబరచుచు నుండిరి గాని
ధర్మజు మదిలో చింత తొలగదు

బంధునాశనము చేసి పొందిన
రాజ్యము అనుచు బాధమిగిలెను
ఆత్మరక్షణకు అనేక మృగముల
చంపించినట్టి ఒక కిరాతకునికి

రాజ్యముకొరకై బంధులజంపిన
కిరాతకునికీ – భేదములేదని
ఎంతటి నరకము తనకున్నదొయని
కుమిలిపోయెను ధర్మనందనుడు

ధర్మయుద్ధమున ప్రజలమేలుకై
యుద్ధము చేసి రిపుల హరించిన
పాపము రాదని – ధర్మము చెప్పును
మనశ్శాంతికది నిలబడనట్టిది

అక్షౌహిణుల బలములు సమసెను
నోరులేని జీవమ్ములు ఒరిగెను
పసుపు కుంకుమలు చెరిగిన స్త్రీలకు
ఎంతటి ద్రోహము కలిగెను నావల

గృహస్థు తాను మంచి మనస్సుతొ
అశ్వమేధక్రతువంటివి చేయగ
బ్రహ్మహత్య పాపమ్ముతొలగును
కానీ అది మరి – స్వార్థపుచర్య

స్వలాభమ్ముకై అన్నీ తెలిసి
జీవహింసను చేయువానికి
ఎన్నియాగములు చేసినగాని
విముక్తి కలుగదు నిశ్చయమ్మిది –

బురదవల్లను బురదనేలకు
కల్లువల్లను – కల్లుకుండకు
శుద్ధిఎటుల మరి కలుగును – గాన
పాపఫలము – నే ననుభవించవలె

అటుల తలంచి ధర్మనందనుడు
ఆజిలొఒరిగిన తాత భీష్మని
చూడగ తాను బయిలుదేరెను
తమ్ములు – కృష్ణుడు అనుసరించిరి

యుద్ధరంగమున గాంగేయుండు
దివినుండి రాలిన దేవతవలెను –
నేలను ఒరిగెను – గాంచిరి వారు
పరశురామ – నారద మహా ఋషులును

దేవర్షి బ్రహ్మర్షి రాజర్షిసంఘములు
శిష్యులగూడి వచ్చిరచటకు
వారందరికి గాంగేయుడట
నమస్కరించెను – వినయముతోను

వారందరిలో – మనిషిగ పుట్టిన
పరమాత్మను గాంచి – పరవశించెను
పాండవులందర – దగ్గర జేర్చుకు
పలికెను వారితో – కరుణపొంగగా

"ఎన్నిఆపదలు ఎదుర్కొంటిరో –
హరియేదిక్కని – నమ్మిరి మీరు
మీ జీవితములు తలచుకొన్నచో
ఆవేదన ఆశ్చర్యము కలుగును

మృగశాప వశుండయి మీ నాయన
అకస్మాత్తుగా అసువులువీడగ
పసికందులగు మీ అందరిని
శ్రమలకు ఓర్చి పెంచెను కుంతి

సుఖమన్నది మరి తెలియక రోజులు
గడిచిపోయినవి - మీకందరకు
కుంతి బాధలు - చెప్పగరానివి
కాలమహిమ మరి అంతటిదయ్యా!

కాలము మీరి నడవగలేము
కావున - ఇంతటి ధర్మరాజును
మేటి విలుకాడు ఇంద్రకుమారుడు
గాండీవమ్ము ధరించు పార్థుడు -

మహాబలుడు ఈ భీముడు మరియు
సాక్షాత్ చక్రియె - అండగనున్నను
ఎన్ని బాధలు పడినారోకద!
కాలప్రభావము అనక తప్పదు.

కావున ఈశ్వరలీలకు వగచుట
వ్యర్థము కావున అనుభవించవలె
విష్ణులీలలు తెలియగ వశమా!
ఆడుచుండవలె - ఆయన ఆజ్ఞతొ

యదువంశములో పుట్టెను - లీలగ
ఇంతనాటకము ఆడించెను కద!
స్వపరభేదము లేని ఈశ్వరుడు
లీల లెరుగుదురు - నారద కపిలులు

దూతగ - హితునిగ బంధువుగాను
బావగ - మంత్రిగ - మీరు కోరినటు
మీకై ఆతడు నడుచుచుండెను
ఆయన గారికి ఒరిగెడి దేమి?

హెచ్చు తగ్గులు హితులు విరోధులు
లేనివాడు - ఈ నందనందనుడు
భక్తి పరీక్షలొ నెగ్గినవారిని
ప్రేమించి భక్తునిగ స్వీకరించును

అనన్య భక్తితొ మనస్సువశముతో
హరినామస్మరణ చేసినచొ
కామ్యకర్మల పరిత్యాగమున
ముక్తి పథమును అందగలుగును

సర్వదేవతల శిరోరత్నము
గోపాలదేవుడు ఆయన కృపకై
నామస్మరణతో వేచియుంటిని
నేటికి దొరకెను దివ్యదర్శనము

నాకొరకై - తా - కదలివచ్చెను
ఎంతటి కరుణాధాముడు శ్రీహరి
ఎంతటి పుణ్యమొ అనుచు పలుకుచు
అంపశయ్య పై నుండి మ్రొక్కెను.

ధర్మరాజును చెంతకు పిలచి
ధర్మమార్గము - భక్తి - విరక్తులు
దానధర్మములు రాజధర్మములు
స్త్రీధర్మములు పురుషార్థములు

అనేకమైన ఇతిహాసములు
ఉపాఖ్యానములు ఉపదేశించెను
అంతటిలోన ఉత్తరాయణము
ప్రవేశించగా గ్రహించె భీష్ముడు

ఇచ్ఛా మరణము కలిగిన భీష్ముడు
దేహత్యాగము సంకల్పించి
మౌనవ్రతమును అవలంబించి
హరిధ్యానమును ఆరంభించెను

చూపులు ముందర నిలచిన హరిపై -
మనస్సునంతయు చతుర్భుజునిపై
చిత్తమంతయు శ్రీకృష్ణునిపై
గుండెనిండుగా గోపాలరూపముతో

దివ్యానుభూతికి లోనై భీష్ముడు -
శరములబాధ తొలగిపోవగా
కమలనాభుని శ్రీవత్సాంకుని
మరి మరి చూచెను - మంగళ మూర్తిని

మరింత భక్తి పులకరింతతో
ఆనందసాగరము హృదిలో పొంగగ
దివిజగంగలా కృష్ణుని దయయది
జాలువారగా స్తుతించె భీష్ముడు.

॥శ్రీ కృష్ణచరితము॥



## 12 శ్రీకృష్ణుని భీష్ముడు స్తుతించుట

"త్రిభువనమ్ములను మోహపరచెడి
నీలవర్ణముతొ విరాజిల్లెడి
బాలభాను ప్రభ తక్కువ అనెడి
పసిడి చేలమది తళుకులీనగా

తుమ్మెదరెక్కల ధిక్కరించెడి
ముంగురులవ్వి ముఖమున ఆడగ
ముద్దులొలికెడి సుందర వదనము
మనసులు దోచే మందహాసము

వన్నెలాడు - నాకన్నులతేడు
కిరీటికాశ్రయమైన ఘనుండు
పరంధాముడు పరమాత్ముడు హరి
మనోపీఠమున స్థిరుడగుగాక!

కదనరంగమున అశ్వపుడెక్కల
ఎగసిన ధూళి ముఖమును ముద్దిడ
చెమట జలమ్ము ముత్తెములన్నటు
స్వామి చెక్కిళుల కులుకుచుండగా

చూచువారిని మోహపాశముల
కట్టే చూపులు కలిగిన వీరుడు
నాశరఘాతములన్నీ భరించి
చిరునవ్వుతొ నన్ననుగ్రహించుచు

విజయము తప్పక విజయునకిత్తును
అన్న పట్టుతో - పగ్గములట్టుకు
నిలచిన మూర్తి మంగళమూర్తిని
మనసు నిండుగా ప్రార్థింతునిదే!

గురువుల బంధుల వధచేయనని
ధనుర్బాణములు సన్యసించి మరి
దాసుడనని - తా - పదములబడిన
పార్థుని - చేతుల లేవనెత్తుచు

అనంత సేనావాహినులుండగ
మధ్యలొ రథమును-నిలపి తీక్ష్ణము
చూపుల-రిపుల-కాల్చుచునే మరి
కృష్ణగీత బోధించిన గురువు!

మనిషిని మనిషిగ చేయుట కొరకు
మహామంత్రమును చెప్పిన గురువు
మనో సరస్సున రాజహంసగా
భాసిల్లగను ప్రార్ధింతునిదే!

ఒక్క ఉదుటున క్రిందకు దూకగ
కుండలమ్ముల కాంతి పుంజములు
గగన తలంబున పరుగులెత్తగా
సూర్యచంద్రులే తికమకపడగా

భువనమ్ములు తన బొజ్జను నిలపి
దూకిన బరువుకు భూమి వణకగా
పచ్చనైన తన జిలుగు చేలమది
జారగ – చక్రము చేత ధరించి

ముందుకు దూసుకు వచ్చువీరుని
అభాసు చేయకు – నామాటయని
పాదములంటి పలుకు పార్ధుని
లక్ష్యపెట్టక ఉగ్రమూర్తియై

నాశరవర్షముతోన – భీష్ముని
కడిగివేతును – తృంచివేతును
అనుచు – దర్శనము – నాడు యిచ్చిన
దేవదేవుడే – దిక్కునాకిక!

నన్ను నమ్మిన బంటు కిరీటి
నమ్మిన బంటుగ రథముతోలెద
అని విలాసముగ పగ్గములట్టుకు
అశ్వమ్ములను అదలించుచును

చిరునవ్వు బాణములు రిపుజనములపై
సంధించి – వారిని హడలగొట్టెడు
భువన మోహన మూర్తికి జోతలు
ప్రచండ భానుని–కివి నా ప్రణతులు –

చిరునగవులతో మనసులు దోచే
మన్మధమూర్తికె తండ్రి తానెయై
తనచూపులను విరిశరములను
తనయునికిచ్చి సాగనంపి మరి

గొల్లపడుచుల మనోరాజ్యములు
కొల్లగొట్టిన గోపిమనోహర!
కొండగొడుగును ఎత్తిన దేవుని
మనసునిండుగా సేవింతునిదే!

ధర్మనందనుని రాజసూయమున
దివ్య మహిమను చూపిన స్వామికి
దేవకి ముద్దుల పట్టికి నేను
అనన్య భక్తితొ నమస్కరించితి!

ఒక్కసూర్యుడే అనేక రూపుల
చూచువారికొక విశేషమూర్తిగ
అగపడునట్లు వాసుదేవుడు
లీలామానుష విగ్రహుడాతడు

తన సృష్టియగు జీవులన్నిట
అన్నిరూపముల భాసిలుదేవుడు
దేవదేవుని మనశ్శుద్ధిగా
పాహి పాహియని – ప్రార్థింతునిదే"!

అనుచు పలుకుచు అనంతమైన
ఆనందమును అనుభవించుచు
అగపడు కృష్ణుని - నగవను-నరదము
నధిరోహించి - బ్రహ్మముచేరెను.

సాయుజ్యమును విష్ణు పథమును
భీష్ముడు చేరగ అచ్చటివారు
మౌనముద్రలో నిలచిపోయిరి
దేవదుందుభులు మ్రోగె - నింగిని

ధర్మనందనుని పరివారమ్ము
దుందుభులను మ్రోయించిరప్పుడు
పుష్పవృష్టి కురిపించిరి సురలు
ప్రశంసించిరి గాంగేయునట

కృష్ణుని ఆనతి నంది ధర్మజుడు
భీష్మునికి అంత్యక్రియలను చేసెను
మనస్సు నిండుగ దిగులునిండెను
తమను పెంచిన మహాను భావుడు

అంతటి వానిని స్వయముగ జంపితి
అనెడి చింతయది బాధించినది
మునులందరును కృష్ణకీర్తనతొ
తమతమ ఆశ్రమములకు సాగిరి.

కృష్ణునితోను ధర్మరాజు - తా -
హస్తినాపురము చేరి అచ్చట
పెదతలిదండ్రులు గాంధారి ధృతరాష్ట్రుల
దర్శించి వారిని ఊరడించెను

వారి అనుమతితొ పెద్దలిచ్చిన
రాజ్యము నేలగ సంకల్పించెను
ప్రజారంజకముగా పరిపాలన
జరపసాగెను ధర్మ నందనుడు

అనగా శౌనకుడడిగెను సూతుని
అంత వినాశము తనవల్లనని
తలచిన యట్టి ధర్మ రాజు - తా
రాజ్యము నేలగ ఎటుల సిద్ధపడె?

అంతట పలికెను సూతుడచ్చట
పేరుకు రాజ్యమునేలుట గాని
ఉత్తర తనయుడు పరీక్షిత్తును
రాజుగ చేసి - ప్రతినిధి ఆయెను

ధర్మజుపాలన ధర్మబద్ధము
నెలకు మూడుగా వానలు కురిసెను
సస్యసంపదతొ నిలచె వసుంధర
పాలవృష్టిని ధేనువులొసగెను

తరువులు పొదలు లతలు తీగలు
అన్నిఋతువుల కళకళలాడెను
మధుర ఫలములు ఒసగుచుండెను
ఈతిబాధలు ఎరుగరు ప్రజలు

సత్యవ్రతమ్ము జీవకారుణ్యము
ధర్మరాజు చేపట్టిన వ్రతములు
కొంతకాలమట కృష్ణుడు వుండి
ద్వారకకంత బయలు దేరెను



॥శ్రీ కృష్ణచరితము॥

# 13 శ్రీ కృష్ణుడు ద్వారకకు వెళ్ళుట

కృష్ణుని విడచి వుండలేకను
ధర్మరాజు తన కంటనీరిడి
ఆప్యాయముగా కౌగలించుకొనె -
తమ్ములందరు పదముల మ్రొక్కిరి

రథమువద్దకు కృష్ణుని తోడుగ
సుభద్ర-ద్రౌపది-కుంతి-ఉత్తరలు
గాంధారి ధృతరాష్ట్ర-విదుర-కృపులును
పంచపాండవులు-ధౌమ్యుడు - చేరిరి.

కృష్ణుని కెడబాటన్న సత్యముతో
కృంగదీసెడి బాధకలిగినది
కలిసి వుండిరి మనసులు కలిసి
మధురానుభూతిని పొందిరివారు

వైకుంఠములో వాసుదేవునితో
కలసియున్నటు సంతసపడిరి
కదలిపోయెడి కృష్ణునిగాంచి
సజలనయనముల నిలచిపోయిరి

రథముకదిలెను-దిగులు పెరిగెను
హస్తినాపురము నిస్తేజమయ్యెను
రాచబాటలో అరదము సాగగ
పరవశమ్మున పౌరులు చూచిరి

బంగరు సౌధములందలి భామలు
దోసిళ్లతొ నట పూలు జల్లిరి
వెల్లగొడుగును ధరించి పార్థుడు
నిలచెను గుండియ పులకరించగా

ఉద్ధవ సాత్యకి లిద్దరు భక్తిగ
చామరమ్ములతో వీచుచుండిరి
శంఖ భేరుల ధ్వనులెగసినవి
వేదగానము నింపిరి విప్రులు

కౌస్తుభహారి గోపకిశోరుడు
శ్రీవత్సాంకుడు పద్మనేత్రుడు
చక్రపాణిని చూతమురండని
మేడల నిలబడి కాంతలుచూచిరి

లోకములన్నీ చీకటి అయిన
ప్రళయసమయమున ఈ పుణ్యాత్ముడు
ఒక్కడె -- తాను మిగిలి యుండునట
తిరిగి సృష్టి - తా - చేయించునట

వారిలొవారు పరమాత్మతత్త్వమును
చర్చించుకొని సమాధానపడ
త్రికరణశుద్ధిగ లీలలుపాడుచు -
నమ్మిన భక్తుడు-స్వామికి హితుడట

అంతటి భక్తుని కొరకై తాను
స్వయముగ వచ్చి దర్శనమిడునట
అనుచు చెప్పుచు కృష్ణతత్త్వమును
వివరించినది ఒక పురకాంత

మెల్లగ రథము సాగుచున్నది
చల్లగ మాటలు - వారి చర్చలు
కృష్ణతత్త్వపు సంభాషణలు
ముసి ముసి నవ్వుల వినెను ముకుందుడు

నిరతముచూచే నీలవర్ణుడు
శిఖిపింఛముతో కనబడు స్వామి
కదలిపోవుచు నుండెను గనుడు
మన అదృష్టము వదలి పోవునిక

పట్టణాలలో దివ్యసౌధముల
మిగిలియుండునిక నిరాశ మనకు
కావున కదలి స్వామితో వెడలి
సేవచేసెదము రండి రండనిరి

అవునే ఆయన సేవచేయుటకు
దాసీజనము వేలువుందురట
కావున నీకాభాగ్యము సున్న
అన్నది మరియొక అంగనామణి

నీవన్నది మరి సత్యము సత్యము
సాధారణమగు యాదవుడైనచొ
కోటి సూర్యుల వెలుగులు చిమ్మున?
కావున – కారణజన్ముడు అగును

లోకాలన్నీ సృజించి వాటితొ –
బంతులాటను ఆడగచాలిన
జగన్నాథుడు జగదాధారుడు
దర్శనమ్మున తరించితి మనె

తమోగుణముతొ చరించురాజుల
మదమణగించెను – సంహరించెను
భూభారమును తీర్చినయట్టి
దేవదేవుడే అనెనొక కాంత

పద్మనేత్రుడు – పద్మనాభుడు
శుభలక్షణముల సుందరమూర్తిని
పూర్వపుణ్య ఫలసౌభాగ్యముచే
రుక్మిణి భర్తగ పొందగలిగినది

నోముల ఫలముగ మిగిలిన భార్యలు
పొందిరి – కృష్ణుని తమ భర్తగను
అటుల తలచుచు వందనమ్మొలిడి
నిలచినకాంతల మాటలు వినుచు

కృష్ణుని రథము సాగుచుండగా
రాచమర్యాదగ ధర్మనందనుడు
చతురంగబలమ్ముల తోడుపంపెను
కొంతదూరము సాగనంపిరి

వెంటవచ్చెడి కౌరవులను మరి
మరలిపొమ్మని కృష్ణుడు చెప్పగ
వారందరును తిరిగి వచ్చిరి
రథవేగమది పెరిగినదపుడు

కురు, జాంగల, పాంచాల,
శూరసేన, యామున, బ్రహ్మావర్త,
కురుక్షేత్ర, మత్స్య, సారస్వవత్ర
మరుధన్వ, సౌవీర, రాభీర సైంధవ

భూములదాటి – అరదముసాగెను
ఆదేశముల నృపతులు – ప్రజలు
కృష్ణునిగాంచి వందనమ్మొలిడి
భక్తిగ కాన్కలు సమర్పించిరి

దయతో వాటిని స్వీకరించుచు
ఆనందముగా పలుకరించుచు
సాయంసంధ్యా సమయమ్మునకు
ద్వారక జేరెను కృష్ణుని రథము

పాంచజన్యము కృష్ణుడు ఊదగ
ద్వారక జనులు ఆనందముతో
మేళతాళముల స్తోత్రపాఠముల
ఎదురువచ్చిరి కాన్కలొసంగిరి

వారి హారతులు అందిన కృష్ణుడు
వాత్సల్యముతో వారందరినీ
పలుకరించెను పొంగిపోయిరి
పరంధామునికి అందరు ఒకటే

ఆనందముగా నుంటిమిస్వామీ!
నీదయవల్ల సుఖముగనుంటిని
ఇన్నాళ్ళకు నీ చిరునవ్వుల మోము
చూడగలిగితిమి అనుచు పలికిరి

విరించి – కడుగునట నీ పాదమ్ములు
అతనికి నీవు తండ్రి వగుదువట
సంసార సంద్రము తరింప జేతువు
నీ అనుగ్రహము సర్వసుఖములిడు

బ్రహ్మాదులు నిను వర్ణించగను
ఇంతని చెప్పగ చాలకపోదురు
అటులయినచొ మరి మేము అల్పులము
నిన్ను తెలియగ తగినవారమా!

హస్తిని వాసము – కొన్ని రోజులే
అయినను – వేల ఏండ్లనిపించెను
మమ్ముల వదలకు మాతోనుండుము
అనగా సరియనె నందనందనుడు

అంతటిలోన ఉగ్రసేనుడు
మంగళవాద్యమ్ములతో వచ్చెను
భద్రగజమ్ముతొ బలభద్రాదులు
ఉత్తమాశ్వముల స్వాగతమిడిరి.

స్వస్తివాచకము చదివిరి విప్రులు
వేదఘోషను నింపిరి అపుడు
వందిమాగధులు స్తోత్రముచేసిరి
దిక్కుల కెగసెను దివ్యనాదములు

పెద్దలందరకు నమ్ములిడి
పిన్నలందరకు ఆశీస్సులనిడి
హితులందరను పలుకరించుచు
పురప్రవేశము చేసెను కృష్ణుడు

రాజ మార్గమున సాగు కృష్ణునకు
రంగవల్లులు స్వాగతమిడినవి
మంగళహారతులిచ్చిరి మగువలు
పూలుజల్లిరి మేడలనుండి

ముకుందునందము గాంచిన ద్వారక
వసంతాగమనము అయినటుతోచి
వసంతోత్సవము జరుపుకున్నటు
కళకళలాడెను కనులపండువుగ

కలిమికి రాణి కోరిన దేవుడు
రుక్మిణిదేవికి మనోహరుండు
దయాసంద్రము మదిలో నింపుకు
పాలసంద్రమున పడుకొనుతేడు

ఆగమ లతలలొ కీర్తింపబడు
యోగుల హృదిలో కొలువుతీరెడు
కమలనాభుడు పుష్పవృష్టిలో
మునిగిపోవుచు సాగె ముదముగ

తల్లిదండ్రులకు ముందుగ మ్రొక్కి
మ్రొక్కెను - మిగిలిన పెద్దలందరకు
తల్లులందరూ ఆప్యాయముగా
ముద్దిడినారు మురిసిపోయిరి

మాతృవత్సలత అనుభవించెను
అనురాగవార్నిధిని తేలిపోయెను
అచ్చటినుండి నేరుగసాగి
అంతఃపురమున అడుగుబెట్టెను.

॥శ్రీ కృష్ణచరితము॥



## 14 శ్రీకృష్ణుడు అంతఃపురకాంతలను చూచుట

ముందుగ ఏ సతి గృహమునకేగవలె
అని ఆలోచించి నందనందనుడు
అన్నీతెలిసిన అతిచతురుండు
అన్నిరూపులు ధరించె ఒకడే -

అంతమంది శ్రీకృష్ణులు గానై
అందరి గృహముల కొకేమారుగ
అడుగిడి-అందరి హృదయమ్ములను
ఆనందడోలల ఊగజేసెను

నానాధుడు నా గృహమునుండెను
నన్నెంతగ - తా - నభిమానించునొ
అన్నభావన - కలిగిరందరు
జగన్నాటకము నాడించును కద!

సల్లాపముల చతురోక్తులతో
తనయుల లాలనచేయుచు నొకచో
యోగక్షేమము లరయుచు వారిని
ఆనందసీమలో అడుగిడ జేసెను

అందచందముల సుందరాంగులకు
కృష్ణునితోడు సర్వస్వమ్ము
ఆయన గారిని విడచి వుండుటన
ఊహించని పరితాపమువారిది.

గాఢానురాగము కనబరచుచును
వక్షస్థలమున నిలచెను లక్ష్మి
అంతటి ప్రేమ అభిమానములు
కలిగియుండిరి కాంతలందరు

భార్యలతో సంసారము చేయుట
దేవదేవుని లీలయగునది
నిర్వికారుడు కోర్కెలులేని
కరుణాధాముడు - కనబడునటుల

ఆలోచనలకు అందనియట్టి
అద్భుతమైనవి కృష్ణలీలలు
అన్నిరకముల బంధుత్వములు
అన్నీ - నిలయము - అనన్యభక్తికి

అంతట అడిగెను శౌనకుడచట
అశ్వత్థామ వదలిన అస్త్రముల
అదుపు చేసి మరి గర్భముకాచెను
అంటివి - వివరము తెలుపుము స్వామీ!

 ॥శ్రీ కృష్ణచరితము॥

## 15 ఉత్తరకు పరీక్షిత్తు జన్మించుట

నాల్గుసంద్రములనడుమ భూమిని
ధర్మనందనుడు ఏలుచుండెను
కీర్తిచంద్రికలు వెలిగె దిక్కుల
చదువులరాణి కొలువుదీరెనట

అతిథి అభ్యాగతు లందరికాతడు
పట్టుకొమ్మలా నిలబడి ఏలెను
కృష్ణదేవుని మదిలో నిలిపి
ధర్మసమ్మతిగ రాజ్యమేలెను

ఆ సమయములో అభిమన్యుని భార్య
ఉత్తర గర్భము ఫలించి ఆమెకు
పదియవనెలయది దాటుచుండగా
ప్రసవసమయ మాసన్న మవ్వగా -

అశ్వత్థామ వేసిన అస్త్రము
ఆమెగర్భమును బాధించసాగెను
ఏడువసాగెను ఆ పసికందు
దిక్కెవ్వరని విలపించసాగెను

బాణాగ్నిశిఖలను దూరముచేసి
ననుకాపాడెడి ఏలిక ఎవరు?
నను కనలేక తల్లి ఏమగును
తల్లికింతటి కష్టముతెచ్చితి

భక్తుల బ్రోచే పరమదయాళువు
కృష్ణదేవుడని కొలుతురుగాదా -
ఆ పరమాత్మ ముందుకు రాడా!
నా అపరాధము ఏమో తెలియదు -

శిశువు రోదన ఆలకించిన
ఆర్తరక్షకుడు శ్రీహరి అంత
దర్శనమిడెను దివ్యకాంతితో
అంగుష్టమంతగ అగబడినాడు.

మెరపుతీగతో - దిగిన మేఘమన
మకరకుండల మణికాంతులతో
బాలభానుని వెలుగుల మించిన
మకుట కాంతియది వెలుగుచుండగా

బ్రహ్మాస్త్రకీలలను పారద్రోలుచు
నిలచినట్టుగా నున్నతేజము
గదాదండము వెలుగుచుండగా
వనమ్మాలతొ - తా - దర్శనమిడెను

గర్భములోన - కంటిముందర
కనక చేలమున - కరుణాధాముడు
అస్త్రబాధను అణచి వేయగా
భక్తిగ మ్రొక్కెను - గర్భస్థశిశువు

తిరిగిచూచెను దివ్యమూర్తిని
అదృశ్యమయ్యెను - ప్రాణముపోసి
అప్పుడు నొప్పులు ఆరంభమయి
శుభలగ్నమున పుత్రుడు పుట్టెను

పుత్రోదయముకు సంతోషముతో
దానధర్మములు సంతర్పణలు
ధర్మరాజు చేయించె రాజ్యమున
ఆనందమును ప్రజలకు పంచెను

గో - భూ - సువర్ణ అగ్రహారములు
దానము చేసెను ధర్మనందనుడు
ఆనందించిన వేదవేత్తలు
ఆశీస్సులను ఒసగిరి శిశువుకు

కౌరవ వంశము నిలబెట్టగను
అంకురించిన ఆనందధామునకు
'విష్ణురాతుడు' అనెడి పేరది
నిర్ణయించిరి దైవజ్ఞులట

శత్రుసంహారముచేసివీరుడు
నిష్కంటకముగ రాజ్యమేలెడి
చక్రవర్తియగు ననుచు పలికిరి
అంతట పలికెను ధర్మరాజట

మహాత్ములారా! మీదీవనలు -
ఫలించి తీరును కానీ తనయుడు
మాపూర్వీకుల ఒరవడి కలిగి
విష్ణుభక్తిని కలిగియుండునా!

బాలుని భవితను చెప్పగ కోరితి
అనగా పలికిరి - వేదవిదులట
రాజా వినుము నీమనుమడు మరి
ప్రజారంజకుడు ఇక్ష్వాకువుసముడగు

వేదవేత్తలను ఆదరించుటలో
శ్రీరామచంద్రునికి సాటియగునయా!
శిబిని పోలి శరణాగత గుణుడగు
దాతృత్వమున ముందుగనుండును

భరతునివలెను బంధులహితుడగు
కార్తవీర్యుని మించినయట్టి
శరనైపుణ్యము కలిగియుండును
అగ్నివంటి - తేజస్సు కలుగును

సంద్రమువలె గంభీరుడీతడగు
పరాక్రమమున కేసరి సముడు
క్షమకు ఈతడు వసుమతిబోలును
ప్రతాపమున మరి-రెండవ సూర్యుడు

సర్వభూతహిత మందు-వాసుదేవుడగు
తలిదండ్రులవలె మరి సహిష్ణువగును
విధాతవలెను సమదర్శనుడు
భర్గునివలెను - పరమ ప్రసన్నుడు

లక్ష్మీపతివలె సద్గుణరాసి
యయాతిపోలి ధర్మమునెరపును
ధైర్యమునందు బలిని మించును
విష్ణుభక్తులలో ప్రహ్లాదుని మించును

ఔదార్యమున రంతిదేవుడగు
ఆశ్రితులకును హిమగిరియగును
కీర్తిచంద్రికలు ప్రాకు లోకముల
పెద్దల మన్ననచేయు యోగ్యుడు

అశ్వమేధములు చేయును ఎన్నో
దుష్టశిక్షకుడు శిష్ట రక్షకుడు
యోగ్యులైన సంతానము బడయును
మానధనుడు మరి మాన్యుడీతడగు

కలిదోషములను అణచివేయును
రామరాజ్యమును నెలకొనజేయును
విష్ణుపదములు ధ్యానము చేసెడి
పరమయోగ్యుడీ పసికందయ్యా!

ఎంతో కాలము జీవించి తదుపరి
విప్రశాపమును దాటలేకను
తక్షక విషముకు బలియగునని–విని
కలతచెందక–ముకుందు తలచుచు

సర్వసంగియై ముక్తికాంతకై
ఎదురుచూచుచు ఆనందముగా
ముక్తిని ఆహ్వానించగ చాలిన
ధైర్యవంతుడు – ఈతడు భువిలో –

నందనందన పాదారవిందముల
ధ్యానించుచును పుణ్యవశమున
దర్శనమిడిన శుకయోగీంద్రుని
అనుగ్రహముతో జ్ఞానము నందును

జాతక ఫలములు విజ్ఞులు చెప్పి
శలవుదీసుకొని వెడలిపోయిరి
మనుమనిగాంచి ఆనందముతో
తేలియాడిరి బంధువులందరు

తల్లికడుపులో కారుణ్యముతో
గదనుత్రిప్పుచూ కాపాడినయట్టి
కనక చేలుడు – ఎక్కడెక్కడని
పరీక్షగా మరి చూచెడిబాలుని

'పరీక్షిత్తు' యని పిలువజొచ్చిరి
భగవంతుని పరీక్షలో కృతార్థుడయ్యెను
పరమయోగుడీ పసికందు మరి
కళ్ళుతెరచినది–హరిని చూచుటకు –

అనుచు అందరూ అభిమానించి
అల్లారుముద్దుగా పెంచసాగిరి
శుక్లపక్షపు చంద్రుని వలెను
పెరుగుచుండెను పరీక్షిత్తట

బంధువధను చేయించితినని
ధర్మరాజుతన మదిలో చింత
తొలగిపోవుటకు అశ్వమేధము
సంకల్పించెను – ఆలోచించెను

ఉన్నధనమది చాలదుకావున
మార్గముగానక చింతలోనుండి
విష్ణుదేవుని ప్రార్థనచేసెను
వెంటనె దర్శనమిడెను శ్రీహరి

మార్గము చెప్పెను శ్రీహరి-రాజుకు
పూర్వకాలము మరుత్తుఅనెడి ఒక
మహరాజు-యజ్ఞము చేసిన వాడు
మిగిలన ధనము - భూమిలో దాచెను

అనుచు పలుకుచు నందనందనుడు
ఆప్రదేశము తెలుపగ నంత
భీమార్జునులు తెచ్చిరి ధనము
మూడు యజ్ఞములు చేసె ధర్మజుడు

కృష్ణదేవుని అనుగ్రహముతో
యజ్ఞము చేసెను ధర్మనందనుడు
అంతట బావల కోరిక మేరకు
కొన్నిదినములట కృష్ణుడుండెను

ధర్మరాజుకడ వీడ్కోలుగొని
పార్థునితో మరి కృష్ణదేవుడు
ద్వారక కేగెను హితులందరితో
అచటకు వచ్చెను విదురుడంతట

తీర్థయాత్రలు ముగించి విదురుడు
మైత్రేయునివలన జ్ఞానమునంది
హస్తినాపురము చేరగనంత
ధర్మరాజాదులు ఆహ్వానించిరి

ఉత్సవమ్మును చేసిరి ప్రియముగ
విందు భోజనము ఆరగించి - తా -
విశ్రాంతిగ నట విదురుడు కూర్చొనె
అంతట అడిగెను ధర్మరాజట

"ఏ తీర్థములను సేవించితివి
నందనందనుని మదిలో కొలువుగ
ప్రతిష్ఠించిన - నీవొక తీర్థమె
నీదర్శనమది పాపహరణము

తండ్రి గతించగ పిల్లలందరిని
కాపాడితివి కరుణామూర్తివి
కౌరవ హింసల బారినుండి మరి
గట్టెక్కించిన పుణ్యమూర్తివి

నీయాత్ర భాగముగ - ద్వారకలోన
కృష్ణదేవుని దర్శనమైనద!
యాదవులందరు సుఖముగ నుండిర"
అనగావిదురుడు యాత్రలు చెప్పెను

అంతటిలోన యాదవనాశన
అశుభావార్తను వినలేడనుచు
సందేహించి చెప్పకుండెను
ధర్మనిధియగు విదురుడు అతడు

మాండవ్యుని దూషణ ఫలితముగాను
నీచగర్భమున యముడు జనించెను
అతడే విదురుడు-అపుడు సూర్యుడు
యమునిగ - పాపుల శిక్షించెనట

ఆపై ద్వారక నందలివారు
సుఖముగ నుండిరి అనితలంచుచు
ధర్మనందనుడు మనుమని ప్రేమగ
పెంచుచుండెను రాజ్యమేలుచు

కాలగమనము - క్రిందుమీదుగా
ప్రయాణించుట దానిస్వభావము
అటుపోటులను జీవితాలు మరి
అనుభవించును - సుఖదుఃఖములతో.

॥శ్రీ కృష్ణచరితము॥

❋❋❋

## 16 గాంధారీ ధృతరాష్ట్రుల దేహ త్యాగం

విదురుడంతట ధృతరాష్ట్రునిగని
వేదాంత బోధను చేసెను వినుమని
"కాలమహిమను దాటగలేరు
లొంగక తప్పదు ఎంతటి వారు

జన్మాంధుడవు సుఖములన్నిటిని
అనుభవించితివి తృప్తినందవలె
ముసలితనమది - పులిలా మీదకు
ఉరికెను - నిన్ను లొంగదీసినది

బంధువు లెందరొ సాగిపోయిరి
వంశాంకురములు అంతరించెను
మా వదిన బ్రతికెనిట జీవచ్ఛవమై
ఎంతకాలమీ బ్రతుకు ప్రయాణము

మిగిలిన పాండవు లైనా నీఎడ
వాత్సల్యమును చూపరెందుకన
వారి ఎడల నువు - ఆచరించిన
దుష్కృత్యములు - మరిచిపోతివా!

లక్కయింట కాల్పించిరి వారిని
కులకాంతను మరి అవమానించిరి
దాని ఫలితమే నూర్గురు కొడుకులు
ఆహవసీమలో - నేలకొరిగిరి

అట్టివారిడిన తిండి తిందువా!
గొంతులో ఆగి - ప్రాణాంతకమగు
ఎన్నాళ్ళీ బ్రతుకు బ్రతుకుట
ఏమి సుఖము నీవనుభవించుట

తనువు శాశ్వతముకాదని తెలిసి
బంధమ్ములను త్రెంచుకు నిలబడు
ముక్తిమార్గము చూచుకో యిక
నాకు తోచినది చెప్పితిననెను."

విదురుని బోధన తలకెక్కినది
విరక్తి మార్గము అగపడె కన్నుల
సర్వసంగపరిత్యాగియై నిలచె
వెంబడించెను గాంధారి - భర్తను

హిమవత్ పర్వత ప్రాంతము సాగిరి
తనువు త్యాగము చేయగ తలచిరి
సాగుచుండిరి - విదురుని వెంట
అడవులనుండి సాగుచుండిరి

ధర్మనందనుడు ఉదయమెలేచి
నిత్యకృత్యము తీర్చుకు నాతడు
పెదతండ్రి గృహమునకు వచ్చి చూచెను
తల్లిదండ్రులు లేరాగృహమున

అర్థముగాక అంత దూరమున
ఆసీనుడగు సంజయుగాంచి
వివరములడిగెను ఆత్రము నిండి
"కన్నబిడ్డలుగ కాపాడిరి మము

నిరాశతో - తా - నిలబడలేక
అఘాయిత్యము చేసుకొనుటకు
అడుగిడినారా బయటకు తెలుపుము"
అనుచు అడిగెను కంటనీటితో

బావురుమనుచు పలికె సంజయుడు
రాత్రి - విదురునితొ సంభాషించిరి
అంతే - ఉదయము ఆముగ్గురును
అదృశ్యమైరి - అనుచు ఏడ్చెను -

నిశ్చేష్టుడయి నిలచె ధర్మజుడు
అంతలొవచ్చిరి నారద, తుంబురులు
నారదమౌనికి పూజనుచేసి
కూర్చొన బెట్టి అడిగె ధర్మజుడు

తండ్రీ! ఎంతో కష్టముకలిగెను
బయట పడెడి మార్గమ్ము చెప్పుము
నా పెదతండ్రి పెదతల్లియును
నన్ను వదలి మరి పోయిరెచటికో -

ధర్మరాజు - తా - చింతించుట గని
పలికె నారదుడు అర్థవంతముగ
ఈశ్వరతత్త్వము తెలిసిన - నీవే
ప్రకృతి స్వభావమునకు లొంగెదవ?

ఒకచో కలుపును మరి విడదీయును
ఈశ్వరు లీల నీకు తెలియదా!
సర్వజీవుల బంధించు ఈశ్వరుడు
ఆయన ఆటలొ పావులందరూ!

కొండచిలువకు దొరకినవాడు
మరెయొకరి నెటు కాపాడునయా!
అటులే కర్మల గుణముల - దేహము
మరియొకరిని మరి రక్షించుటెటు!

చేతులు గలిగిన జంతువులకును
చతుష్పాదములు - ఆహార మగు
వాటికి తిండి - గడ్డి గాదములు
పులులకు తిండి - లేళ్ళు జింకలగు

అన్నిదేహముల జీవుడుండును
జీవుని కాహారము జీవుడగు
అన్నిరకముల జీవుల నుండెడి
జీవుడు ఒకటే - ఈశ్వరుడాతడు

కావున రాజా! తల్లిదండ్రులు
ఏమైనారో అన్నయోచన
విడిచిపెట్టుము వివేకమ్ముతో -
భగవంతుని లీలలొ ఎన్ని ఘట్టములొ

విషయముతెలియకే మమకారవికారము
తెలిసినచోయిక అవి దరిరావు
విష్ణువు - అసురుల నంతముచేయగ
భువిలో పుట్టెను - కృష్ణునిగాను

ఆయన భువిలో ఉండువరకును
మీరు వుందురీ భూలోకములో -
కృష్ణుడు ఇచట లేకపోయినచో
మీకును - పనిలేదీ లోకములో -

కావున ఎందుల కొరకీ వేదన
భ్రాంతి ఎందుకు ధర్మనందనా!
విదురునితో వారిద్దరు సాగిరి
హిమవత్ పర్వత ప్రాంతము జేరిరి

అక్కడగల ఒక ఆశ్రమమ్మున
సప్తఋషులు మరి కోరినంతనే
ఆకాశగంగ ఏడుపాయలుగ
ప్రవహించినదా దివ్య ప్రదేశము

అచట ధృతరాష్ట్రుడు సుస్నాతుడయి
యధావిధిగ హోమమ్ములు చేయుచు
జలాపానముతో గడుపుచుండెను
ఆహార నిద్రలు - వదలి పెట్టెను

మనశ్శాంతితో వెలుగుచుండెను
కోర్కెలన్నిటిని తృంచివేసెను
ప్రాణాయామ నియమమునుండెను
ఇంద్రియాలను వశపరచుకొనె

సాధనతో మరి - యోగి ఆయెను
ఈశ్వరు దర్శన మందగలిగెను
అడుగో నాకు అగపడుచుండెను
పర్ణశాలలో ధ్యానమునుండెను

యోగాగ్నికి తనువంకితమ్మిడి
ఈశ్వరునిలొ మరి లీనముఅగును
అదిగాంచిన - గాంధారి వెంటనే
అదే అగ్నిలో ఆహుతిఅగును

వారిద్దరటు దేహత్యాగము
చేయగ గాంచిన విదురుడంతట
కొంతసేపు మరి చింతలొమునిగి
తిరిగి యాత్రలకు సాగిపోవును.

అనుచు నారదుడు విషయము జెప్పి
ధర్మరాజుకు తత్త్వముచెప్పి
మహతీవీణ మోగుచుండగా
నారాయణ ధ్యానమ్మున సాగెను.



॥శ్రీ కృష్ణచరితము॥

## 17 ధర్మరాజు దుర్నిమిత్తములు గాంచుట

విదురాదుల వృత్తాంతమ్మును విని
ఖిన్నుడయ్యెను ధర్మనందనుడు
ప్రక్కనవున్న భీముని గాంచి
"పలికెను - కాలము బలమైనదనె

ఒక కాలములో పండెడి పంటలు
మరొక కాలము నందున పెరగవు
కాలక్రమమున మార్పులు వచ్చి
లోభ క్రోధ అసత్యమ్ములు ప్రబలును

భార్యాభర్తల ప్రేమ సన్నగిలు
తనయులు-తండ్రిని ధిక్కరింతురు
స్నేహము వుండును-మోసముతోను
శిష్యులు-గురువుల తూలనాడెదరు

న్యాయమార్గమున ప్రవర్తించరు
శాస్త్రవిధానములంతట సాగవు
ఆవిధముగను మార్పులువచ్చును
అనుచు నుడివినది జరుగుచున్నదా!

కృష్ణుడు ద్వారక నందే యుండెన!
ఏడునెలలుగా సంగతి తెలియదు
వార్తాహరుడు ఒక్కడు రాడే!
కృష్ణదేవుడు సుఖముగనుండెన

మన గోడుచెప్పకనె - తానైవచ్చి
ఆదుకొనిన - మన దైవము అతడు
మన మాన ప్రాణములు కాపాడిన ఆ
నందనందనుడు సుఖముగ నుండెన!

దుర్నిమిత్తములు అగపడుచున్నవి
నాకెదురుగను - కుక్కమొరిగె విను
సూర్యుని కెదురై - నక్కఅరచెను
గ్రద్దలు వ్రాలెను గృహములపైన

గాడిదమూకలు రోదననిండెను
అశ్వములవ్వి కంటనీరిడె
మదజలమ్ము మరి గజములు విడువవు
పావుర మొకటి నన్ను ఢీకొనెను

అగ్నిహోత్రములు మండుట లేదు
వల్లమాలిన పొగ లెగసినవి
సూర్యుడునింగిని వెలవెలబోయెను
భూమి అదరుచు నున్నటులున్నది

దుశ్శకునములతొ కలతచెందితి
సుడిగాలులవి విజృంభించెను
మేఘము లేకనె పిడుగులు పడెను
రక్తముకురిసెను మబ్బులనుండి

ఎడమ భుజము మరి ఎడమకన్నది
అదరుచున్నది - అశుభసూచనగ
పంచభూతములు పోరు సలుపగా
అగ్నిహోత్రము - పుట్టినట్లయె

పాలు చేపవు పాలుయివ్వవు
పిదికిన రక్తముకారుచున్నదని
గోపాలకులు చెప్పుచుండిరి
రోగమ్ములతో పశువులు కృంగెను

దేవమందిరమ్ములలో గల
విగ్రహమూర్తులు - కదలుచున్నవి
కంటనీటిని కార్చుచున్నవి
కాకులు - గృహముల వాలి ఏడ్చెను

పట్టపగలులో గుడ్లగూబలు
అంతఃపురమున దూరిపోయి అట
చెవులు చిల్లుపడ అరచుచున్నవి
ప్రళయసూచనని - మదికి తోచును

శంఖ చక్ర పద్మమ్ముల వెలిగే
పాదరేఖల పొంగిన అవనికి
అవ్వి దూరమగు ననిపించెనయా!
వాసుదేవుని వివరము తెలియుము

అదేసమయమున ద్వారకనుండి
ఖిన్నవదనమున వచ్చె కిరీటి
వచ్చుచు నచట అన్ననుగాంచి
పాదమ్ములబడి భోరున ఏడ్చెను.

అయోమయంబై నిలచె ధర్మజుడు
వివరము చెప్పగ నడిగె తమ్ముని
"ఫాలాక్షునితో పోరినప్పుడును
కాలకేయులతొ సంగ్రామముననను

గంధర్వులతో పోరి - సుయోధనుని
విడిపించినప్పుడును-ఓసోదరుడా!
కంటనీటిని పెట్టని - ధైర్యము
గాండీవమునకు వన్నె తెచ్చితివి

జగన్మంగళమూర్తి కృష్ణుడు
మన పెన్నిధి మన బహిః ప్రాణము
క్షేమముగా మరి వున్నాడా! అది -
చెప్పుము త్వరగా - ఆలసించక

సాత్యకి ఎటుల వున్నాడయ్యా!
ప్రద్యుమ్నుడు మరి క్షేమమేకదా!
కృష్ణసోదరులు కుశలమేకదా!
బలరాముడెటుల ఉన్నాడయ్యా!

ఉద్ధవాదులు క్షేమమేకదా!
సునందాదులు కుశలమేకదా!
యాదవసేవలు-అందున శోభిలు
జగత్ ప్రభువు - తను - క్షేమమేకదా!

పారిజాతమును పెరటిచెట్టుగా
నాటి - సత్యను - సంతసపరచిన
సత్యా ప్రియుడు - వాసుదేవుడు
నందనందనుడు కుశలమేకదా!

గోకులనేత - అభయ ప్రదాత
సుధర్మ పీఠము నందు కొలువగు
కమలనాభుడు - వైకుంఠవాసుడు
కుశలమేకదా! తెలుపుము సోదర!

ఎందుకు దిగులుతొ కుములుచుంటివి
దోషకార్యము చేసినాడవా!
సాధునిందను చేసినాడవా!
పరకాంతను మరి స్పృశించినావా!

మాటయిచ్చి మరి తప్పినాడవా!
కూటసాక్ష్యము చెప్పితివా మరి!
విప్రుల-గోవుల-రోగుల-అబలల
బాధించితివా - కృతఘ్నుడైతివ!

బ్రాహ్మణ హత్య చేసినాడవా!
తెలియక - అంతటి అఘము చేసితివ
పరధనమ్మును అపహరించితివ!
అనుచు అడిగెను - గద్గదస్వరముతొ"

దిక్కులుచూచుచు బిక్కముఖముతో
మాటలురాని వేదన తోను
పలికెను పార్థుడు - పలుకలేకను
"అన్నా! విడచెను-మనల నీశ్వరుడు

సారథి,సచివుడు,నెయ్యము,చుట్టము
ప్రభువుగ మనలను ఏలినవాడు
ఆత్మబోధను చేసిన గురువు
మనల - ననాథల చేసిపోయెను

మత్స్యయంత్రము ఛేదింపజేసెను
ఖాండవ దహనము-చేయించెను నాతో
అప్పుడు-పావకుడొసగె గాండీవము
రాజులందరిని గెలువ గలిగితిమి

మయసభ నలంకరింపజేసెను
రాజసూయము చేయించెను తను
అంతటి ప్రభువు-మనపాలిటి దేవుడు
నిజవాసమునకు సాగిపోయెను.

మానిని - మానము కాచిన వాడు
పగతుర గొంతులు కోయించినవాడు
కలుములతేడు - కన్నులకాంతి
కదలిపోయెను వైకుంఠమునకు

దూర్వాసుని - ఆకలి తీర్చినవాడు
ఒక్కమెతుకు - తా - భక్షించినంతనె
మౌనియు శిష్యులు పదములబడిరి
అంతటిఘనడు మనకిక లేడు

సశరీరముగా ఇంద్రుని యొక్క
అర్థసింహాసన మధిరోహించెడి
భాగ్యము కలిగెను - బావవల్లనే
నివాతకవచులను చంపగలిగితి

ఉత్తర గోగ్రహణమ్మున నాడు
కౌరవసేనల - తోలగలుగుదున?
కురుపాండవుల యుద్ధసమయమున
కర్తవ్యముతో తత్త్వము చెప్పెను!

భీష్మద్రోణుల దివ్యాస్త్రములతొ
అలుపునాకు మరి రానీయకను
కాపాడుచును కరుణామూర్తి
పోరించెను కద సామాన్యమా అది!

సైంధవు చంపి ఆతని శిరస్సును
నేలను బడనీయకుండగను
బంతిలాగ మరి ఆటాడించి
వాని జనకుని చేతులొ పడునటు

శరములు వేయగ చాలిన విద్య
నావశమా - మరి ఆయన భిక్ష!
ఎన్నొ ఎన్నో ఎన్నెన్నో మరి
ఆపదలను - తా - దాటించెగద!

స్నేహితుడా! యిటురావోయీ! అని
కౌగిలించుకొని ఆదరించెను
అప్యాయముగా పలికెడి వాడు
కర్తవ్యము బోధించిన గురువు

జీవరహస్యము నుపదేశించెను
ఒకేపాన్పుపై పడుకొను - నాతో
తప్పుచెప్పి - సరిదిద్దెడివాడు
తండ్రి అంతటి బాధ్యత గొనెను

విజయా! ధనంజయా! ఫల్గుణాయని
కపికేతనా ఓ! మహేంద్రతనయా!
మిత్రమా-అర్జునా అని ప్రియముగను
పిలచెడి వాడు - పరమదయాళువు

అంతటి ఆదర అభిమానములు
ఒలకపోసిన ప్రియబాంధవుడు
ఒంటిగ జేసి - సాగిపోయెను
ఎంతటిపాపము చేసితినో మరి!

అవతార సమాప్తి అయిన తదుపరి
పదారువేల భార్యల నిచటకు
తీసుకు వచ్చెడి ప్రయత్నమ్మది
విఫలమైనది - త్రోవలోననే

వచ్చెడిత్రోవలొ అరణ్యమందున
అడవి బోయలు మూగిరొక్కపరి
వారందరినీ అపహరించిరి
బొమ్మలాగ - నే నిలబడిపోతిని

అదే అరదము అవేగుఱ్ఱములు
అవే అస్త్రములు - ఆగాండీవము
నిరుపయోగమై నిలచినవవ్వి
చవిటినేలలో - విత్తుగ మారెను.

మిగిలిన యాదవులందరుకూడ
కాలానికి మరి బలియైపోయిరి
మద్యవశులయి ఒళ్ళుతెలియక
వారిలొవారే - పోరి - ఒరిగిరి

వారెని అంతము చేయుట కొరకు
ఈశ్వరుడే మరి ఎత్తువేసెను
దానికి - వారు లొంగిపోయిరి
దారుణమ్ముగా అసువులు వీడిరి

తానువచ్చిన పనితీరినదని
తెలిసిన వెంటనె పరంధాముడు
మాయాతీతుడు - అన్నియు తాను
చక్కపెట్టెను చాకచక్యముగ

కృష్ణుడు నాడు ఉపదేశించిన
గీతాతత్త్వము స్ఫురణకువచ్చెను
వేదసారమా భగవద్గీత!
ద్వైత భ్రాంతిని తొలగించినది

ద్వైత భ్రాంతికి నెలవు శరీరము
గుణ ప్రకోపముల కాది - ప్రకృతి
నేనే బ్రహ్మను - అని తెలిసినచో
ప్రకృతి - తాను లొంగిపోవును

నిర్గుణత్త్వమది సిద్ధించగనే
కార్య లింగములు సమసిపోవును
దానివల్ల మరి జన్మవుండదు
స్థూలశరీరము జీవి ధరించదు

అట్టి అవస్థను చేరుకున్నచో
ఆత్మదర్శనము లభించి - అతనికి
సాయుజ్యమది లభించగలదు -
అటుల కీరీటి విముక్తుడయ్యెను.

మత్స్య కూర్మ వరాహ నారసింహ
అవతారములు ఎత్తిన వానికి
లక్ష్యసాధనే కర్తవ్యమ్మది
వాటిపైన మమకారము కలుగదు

సర్వము వినిన ధర్మనందనుని
మదిలో మెదిలెను నారదు పలుకులు
మనస్సు దిటవు చేసుకు నిలచెను
స్వర్లోకయాత్రకు సిద్ధమయ్యెను

తన శరీరము పరుని శరీరము
అన్నది లేని - ఆ పరమాత్మ -
లీలానాటక సూత్రధారియై
ఆడించు జీవులను - మాయాతెరపై.

యాదవనాశము - అవతార సమాప్తి
వినిన కుంతి - తా - కృష్ణస్మరణతో
సంసార బంధముల త్రెంపుకు నిలచి
విరక్తురాలై పోయినదంతట

అనుచు సూతుడు - శౌనకునకును
అచటి మునులకు తెలియ బరచెను
ఆపైగాధను వినిచెను వారికి
ఆనందముగా ఆలకించిరి.

॥శ్రీ కృష్ణచరితము॥



## 18 ధర్మరాజు పరీక్షిత్తునకు పట్టము కట్టి మహా ప్రస్థానము చేయుట

కృష్ణావతారము సమాప్తి కాగనే
అమంగళమ్ము అడుగు బెట్టినటు -
కలి ప్రవేశము జరిగినంతనే
క్రౌర్యము హింస అసత్య-దంభములు

ధర్మపాలనము చేయగ నుడివి
ఆశీస్సులనిడి ధర్మనందనుడు
అనిరుద్ధతనయుడు వజ్రునకంత
మధుర రాజ్యముకు రాజుగజేసెను

కౌటిల్యము మొదలుగానగు
అధర్మసంతతి ఆక్రమించెను
అంతయు గ్రహించి ధర్మనందనుడు
మనుమని - రాజుగ చేయదలంచెను

చతురంగ బలములు ధనసంపదలు
బంగరు వస్తు సముదాయములు
హితులు పురోహితు పండిత శ్రేష్ఠుల
వివరములన్నీ - విశదపరచెను

పురోహితుడగు ధౌమ్యుని బిలచి
పుణ్యజలములు తెప్పించుకొని
శుభముహూర్తమున పరీక్షిత్తునకు
రాజ్యాభిషేకము చేసె ముదముగ

రాజ్యభారము మనుమనిపైనిడి
ధర్మరాజు - తా - ప్రశాంత మనస్సుతో
ప్రాజాపత్యము అనెడి యిష్టిని
యధావిధిగను చేసి - అంతట

త్రేతాగ్నులను రగుల్కొల్పి - తను
ఆత్మార్పణను చేసుకు నిలచి
అహంకార మమకారములన్నీ
త్రెంచుకు-ఇంద్రియ నిగ్రహమ్ముతో

మనస్సును మరి ప్రాణములోను
ప్రాణమునంత అపానమ్ములో
అపానమ్మును మిత్తియందున
పాంచభౌతిక దేహమునందు-మిత్తిని

దేహమునంత గుణత్రయమ్ముల
త్రిగుణాలను మరి విద్య యందున
విద్యనంతట జీవుని యందున
లీనము చేయుట అన్న ప్రక్రియలో

జీవునంతట అవ్యయమైన
బ్రహ్మమునందు లీనముజేసెను
బాహ్యవ్యాపారమ్ములు వదలి
ఉన్మత్తునిలా - అవధూత ఆయెను

బ్రహ్మపదార్థము - పరబ్రహ్మమును
ధ్యానించుచును బయలుదేరెను
విజ్ఞాన నిలయమగు ఉత్తరదిశకు
సాగిపోయెను ధర్మనందనుడు

ఏకాకిగ - తమ అన్నవెడలగ
గాంచిన తమ్ములు భీమాదులంతట
కలితాకిడి అది విజృంభించెనని
సర్వసంగ పరిత్యాగము చేసిరి

శ్రీహరి పరముగ పుణ్య కర్మలను
ఆచరించి మరి పాపము తీరి
తేజోమూర్తులు గానయి వారు
నారాయణ పథమును జేరిపోయిరి

విదురుడు యాత్రలు ముగించి వచ్చి
ప్రాభాసతీర్థము నందున అడుగిడి
విషయములన్నీ తెలిసిన వాడై
క్షణములో శరీరత్యాగము చేసెను

భర్తలు చేరిరి పరమపదమని
తెలిసిన ద్రౌపది శ్రీహరియందు
మనస్సునిలపి ధ్యానించుచును
విష్ణుపథమును చేరుకున్నది.

కృష్ణావతార పరిసమాప్తియు
పాండవుల ప్రస్థానగాథను
శుద్ధమనస్సుతో పలికిన - వినిన
సంసార సంద్రమును దాటును లీలగ -

పుణ్యగాథను చదివిన వ్రాసిన
సుఖశాంతులతో - ఆరోగ్యముతో
భోగభాగ్యములు కలిగి - చివరకు
మోక్షపథమును అందుకొందురు

రాజ్యభారము తలను ధరించి
పరీక్షిత్తు - తా - చల్లగ నేలుచు
సకలవిద్యలలో ఆరితేరెను
భాగవతోత్తముడయ్యెను తేడు

ఉత్తరుని తనయ 'ఇరావతి' అను
కన్యామణిని వివాహమాడెను
జనమేజయుడు ఆదిగా గల
నలగురు తనయుల పొందెను రాజు

అశాశ్వతమ్మగు తనువు ధరించి
శాశ్వతమైన విష్ణుకథలను
వినుట అన్నది తెలియగవలెను
సాక్షాత్ యముడే వినుచుండెను గను

కృపాచార్యుడు - ఆచార్యుడుగా
గంగ ఒడ్డున అశ్వమేధములు
మూడు చేసెను - ఆయాగములలొ
స్వయముగ దేవతలందిరి హవిస్సులు

జడులు మూర్ఖులు అల్పాయుష్కులు
వ్యర్థప్రసంగములన్నీ చేయుచు
కాలము గడిపెదరది వృధాగద!
విష్ణు నామ పానమ్ము చేయవలె

విప్రోత్తములకు - వేదవేత్తలకు
దండిగదాన దక్షిణలిచ్చెను
ఆపై నాతడు దిగ్విజయ యాత్రకు
బయలుదేరెను చతురంగ బలములతొ

అనగా సూతుడు చెప్పదొడంగెను
చల్లగ రాజ్యమునేలు పరీక్షిత్తు
కలిపురుషుడు - తా - ప్రవేశించి మరి
యుద్ధము చేయగనున్నటు తెలిసెను

ఆయాత్రలొ ఒక ప్రదేశమ్మున
గోమిధునమును శూద్రుడొకండు
కాలితొ తన్ని - అపచారము చేయుట
గాంచె పరీక్షిత్తు కలత చెందెను

వెంటనె రథమును అధిరోహించెను
అమోఘువిల్లు చేత ధరించెను
సింహగర్జన చేయుచు కదలెను
చతురంగబలములు వెంటనడచెను

రాజ లక్షణములున్న శూద్రుడు
అపచారమ్మది చేయుట గాంచెను
ఆతడె కలియని - అతనిని రాజు -
శిక్షించెనని సూతుడు చెప్పగ

జైత్రయాత్రలో పరాక్రమమ్మున
నాల్గుసంద్రముల నడుమ భూమిని
జయించి - రాజుల లొంగదీసుకొనె -
కట్నకానుకలు దండిగ నొసగిరి

వివరములడిగెను శౌనకుడచట
విష్ణుకథలవి మనోహరమ్ములు
పాపహరణములు సంతసమిడునవి
కాలము సద్వినియోగము కథలతొ

పరిక్షిన్నరేంద్రుని విజయగాధలు
పలుకుచుండిరి ముదముగ నందరు
విష్ణులీలలను వందిమాగధులు
పాడగ వినెను ఆనందముతో

వారందరిని విశేషధనముతొ
సత్కరించెను పులకరింతతో
అటుల వచ్చుచు సరస్వతీనది
ఒడ్డున గాంచెను గో వృషభమ్ముల

ఒంటిపాదమున కంటనీటితో
వత్సపోయినటు దిగులునిండిన
గోరూపమున నున్న ధరణితో
ఒంటిపాదముతొ ధర్మదేవత

పలికె నిట్టుల ఊరడింపుగా
"తల్లీఎందుల కావిచారము
దుర్మార్గులు మరి బాధించెదరని
కలత చెందియా కంటనీరది.

నీ దుఃఖమును కనలేకుంటిని
యజ్ఞయాగములు జరుగవు అనియా!
నీతి నియమములు తప్పి పోవునని
మదిలో కలత చెందుచుంటివా

సకాల వర్షములవ్వి కురవక
సస్యసంపద క్షీణించుననా!
రాజ్యపాలనలొ న్యాయ ధర్మములు
అడుగంటునని ఆరాటమాయది!

మాధవుడే - తా - మానవునిగను
పాపులత్రుంచి శాంతినిడెనని
అనాధనైతిని - అనియా వేదన
ఎంతటి దుర్దశ అనియా దుఃఖము!

తల్లీ! వగచి ఫలితము ఏమి!
కృష్ణదేవుడు వైకుంఠమేగెను."
అనగా పలికెను-అట-భూమాత
ఒంటిపాదమున నుంటివి నీవు

శ్రీవత్సాంకుడు - భువిలో తాను
సంచరించగా నాల్గుపాదముల
నడచిన నీవు - ధర్మదేవతవు
అవిటిగ - ఒంటి పాదమునుంటివి

సత్యము శౌచము దయా ఓర్పులు
త్యాగ సంతోష ఋజువర్తనము
శమ దమ తపస్సు సమత్వమున్ను
ఇతరుల అపరాధమ్ము సహించుట

సుఖముల పొంగక - శాస్త్రచర్చలు
జ్ఞానము - విరక్తి - ఐశ్వర్యమ్ము
శౌర్య తేజము సామర్థ్యమ్ములు
స్మృతి - స్వేచ్ఛ మరి కాంతి ధైర్యములు

సరళస్వభావము ప్రతిభ-నమ్మకము
శీలము మరియు మనోబలమ్ము
ఇంద్రియనిగ్రహము సౌభాగ్య గాంభీర్యము
స్థైర్యము, శ్రద్ధ, కీర్తి, మానము

నిగర్వమనుచు - ముప్పదితొమ్మిది
దొడ్డగుణముల - నెలవు శ్రీహరి
ఆయన సాగగ - పాపములన్నీ
ప్రజలను క్షోభకు గురిచేసినవి

అదిగాంచి మరి కలత చెందుచు
కంటనీటితో ఏడ్చుచుంటిని
కలిబాధయది మనకే కాక
సురలకు - పితృదేవతలకును మరి

ఋషులకు - పరమ ధీమంతులకు
అన్నివర్ణముల జనులందరికీ
గోవులకున్ను - వచ్చె ననుచును
దుఃఖిలు చుంటిని - దీనగాథయిది

భువన పావనుడు కలిమికి తేడు
ఆగమాలకు అందనివాడు
యోగిపుంగవుల మనోభిరాముడు
స్వామి పాదముల స్పర్శ కలుగ దిక

పద్మనాభుని పాదస్పర్శతో
పులకరింతతో స్థిరముగ నుందును
అనుచు నేను మరి పొంగిపోతిని
కానీ గర్వము హరించిపోయెను

దుష్టులదునిమి శిష్టుల బ్రోవగ
నాల్గుపాదముల ధర్మము నడువగ
అవతరించెను అనంతుడిలలో
పాదమ్ములను శిరమున దాల్చితి

అంతటి భోగము నందిన నాకు
అదృష్టమ్మది దూరమైనది
ఆయన అడుగులు కోమలమైనవి
అడుగడుగున నే పులకరించితి

చేవ చచ్చిన - మట్టిని నేను
భాగ్యము తరిగిన భూమిని నేను
చవిటి నేలగా మారిపోతిని
చివరకు దుఃఖము మిగిలెను నాకు

అటులా వృషభ - గోవులురెండును
మాటలాడు కొను విషయము వినెను
దగ్గరగా మరివచ్చె పరీక్షిత్తు
అంతటిలోన భీకర రూపము

శూద్రుడొకండు అతి కర్కశముగ
కాలితొ తన్నెను ఆ వృషభమును
గడగడవణకెను వృషభరాజము
ఆవు ప్రాణములు పోయినట్లయె

హడలిపోయిన ధేనువంతట
దద్దరిల్లునటు - అంభా అనుచు
అరచెను - దిక్కులు మార్మోగినవి
కంటిధారయది కురవజొచ్చెను

తిరిగి ఎద్దును తన్నుట కొరకు
రాజవేషమున నున్నదుష్టుడు
కాలునెత్తగా గాంచిన రాజు
ఆగుమాగుమని వారించె వానిని

విల్లును తీసి నారిని మ్రోచెను
కృష్ణావతారము సాగిపోయెనని
సాధుద్రోహము చేయదలచితివ!
దుష్టబుద్ధికి గుణపాఠము చెప్పెద

అనుచు పలుకుచు వృషభరూపమున
అచ్చటనున్న ధర్మునిగాంచి
అనునయించెను అభయమునిచ్చెను
ధర్మరక్షణకు నిలచితిననెను

ఆపై త్రేతలో మూడు పాదములు
ద్వాపరమున మరి రెండు పాదములు
కలియుగ మందున మూడుపాదములు
చెడిపోయి మిగిలితివి ఒక్కపాదమున

నాల్గుపాదములు ధర్మమునడువగ
దీక్షపూనితిని విచారించకు
నిన్ను బాధకు లోనుచేసిన
దుష్టుని అంతము చేసెద వినుము!

ఆపాదమును తెగకొట్టగను
అధర్మమ్మది తలపెట్టినది -
అదే విధముగా ఈ భూమాత
అతి బాధకు - తా - లోనైనది కద!

అనుచు అచట గల - గోరూపమున
నిలచిన భూమిని చూచి పలికెను
కంటనీరు మరి విడువకు తల్లీ
రాజుగ నావిధి - దుష్ట శిక్షణ

నీచ రాజులు పాలించెదరని
పరంధాముడు రక్షించడని
తెలిసి - కుములుచు నున్నది తల్లి -
మీరక్షణ మరి - నా కర్తవ్యము

అపుడు పలికెను ధర్మదేవుడు
రాజా! నీవు పలికిన పలుకులు
సమయోచితము - నీపూర్వీకుల
యశమును పెంచగ చాలితివయ్యా!

అనుచు పలుకుచు నిశిత ఖడ్గమును
మెరపుతీగలా వెలిగెడి దానిని
తీసి నిలచెను దుష్టుని త్రుంచగ
వెంటనె వాడు వదములబడెను

రాజా వినుము! ప్రాణులందరు
సుఖదుఃఖములకు బాధ్యులగాము
సర్వేశ్వరుడు సర్వనియంత
ఆయన వలన కలుగునన్నియు

తల నరకగను సిద్ధపడగను
తేని పదముల వ్రాలిన - దుష్టుని
కనికరించెను - అభయమునిడెను
కటువుగ పలికెను పారిపోమని

రాజు పలికెను ధర్మదేవతతో
నీవు చెప్పినది అంతయు సత్యము
తపము శౌచము దయ సత్యముల
నాల్గుపాదముల కృతయుగ నడక

గోహింస చేసిన పాపివి నీవు
నాపాలనలో నుండగ తగవు
పారిపో యిక - ప్రాణమునిలువగ
అధర్మవర్తన నెలవైతివి నువు

రాజరూపుతో నున్నను - నీలో
అసత్యలోభములు చౌర్య దౌర్జన్య
కలహ కపటములు కలుషము-మాయ
నిండియున్నవి-యుండగ తగవు

సత్యధర్మముల నెలవీ దేశము
యజ్ఞయాగములు చేతురు యిచట
శ్రీహరి రక్షగ - సర్వభూతముల
నిండియుండును కోర్కెలు తీర్చును

మెరసే కత్తిని గాంచి వణకుచు
స్వామీ! నీవు లేనిచోటది
నాకంటి కగపడదు భూలోకములో
అన్నిచోటులా - కత్తితొ నీవే!

నేను వుండెడి నెలవది నాకు
సెలవీయవయా! ధర్మస్థాపకా!
అనగా చెప్పెను-ప్రాణివధ-మరి స్త్రీలలొ
ద్యూతము - త్రాగుడు లేయనె -

అంతేనా అని గొణుగుచునున్న
కలిని గాంచి అట రాజు పలికెను
ధనకాంక్షతొ జరుగు అసత్యము-మత్తు
కామము హింస వైరమ్ములవి.

పైన చెప్పిన తావులు తప్ప
మరొక చోట - నీవునికి సహించను
అనగా కలి అట రాజుకు మ్రొక్కి
ప్రదక్షిణించి సాగి పోయెను

అంతట రాజు తపో శౌచములు
దయయు - మూటిని ధర్మదేవతకు
కలిగించి-అంతట సంతస పరచెను
భూమికి ధైర్యము గొలిపి వెడలెను

హస్తినాపురము తిరిగి వచ్చిన
పరీక్షిత్తట ప్రజలుమెచ్చగా
న్యాయధర్మముల పాలన నెరపెను
ధర్మవిరుద్ధము తలంచలేదు

తల్లి గర్భమున నున్న సమయమున
చల్లనయ్య యగు నల్లనయ్య - తా -
అనుగ్రహించగ ఉదయించిన ఆ
పరీక్షిత్తు మరి కలిని అణచెను -

ధర్మదేవతకు అభయ మొసంగిన
మహానుభావుడు పరీక్షిత్ భూపతి
విప్రుని శాపకారణమ్ముగా
తక్షక విషము హరించునని - తా -

తెలిసినవాడై చింతలేకను
సర్వసంగ పరిత్యాగముచేసి
శుకయోగీంద్రుని శిష్యుడాయెను
విజ్ఞానముతో తనువును వదలెను

శ్రీహరి చరిత్ర తెలిసిన వారికి
హరిపాదముల కొలచువారికి
హరి కథలను మరి వినువారలకు
మరణభయమ్ము - బాధలుండవు -

విష్ణువు భూమిని వదలిపోయినను
దుష్ట భూపతుల నెదగనీయక
ధర్మసమ్మతిగ పరీక్షిత్తు - తా -
రాజ్యమేలెను ప్రజలు మెచ్చగా

నాల్గుసంద్రముల నడుమ భూమిని
ఏకచ్ఛత్రముగ - నిరాటంకముగ
పాలించిన ధీరుడు అభిమన్యుసుతుండు
కలికి అభయము నిచ్చిన ఘనుడు

కలిని చంపక - ధర్మము చెడక
దయాభిక్షనిడి వానికి - నెలవును
చూపిన యట్టి - దయాపూర్ణుడు
జీవహింసను చేయని యోగ్యుడు

పిరికి వారిని కలి బాధించును
ధైర్యవంతుని దరికి చేరదని
పరీక్షిత్తునకు తెలియును కావున
బుద్ధిగరపి మరి పొమ్మని విడచెను

అనుచు ముదముగా సూతుడు చెప్పగ
తిరిగి అడిగిరి ఋషులు పొగడుచూ -
పౌరాణిక శిరోమణి వీవు కావున
పుణ్య చరిత్రను చెప్పుచుంటివి

ధీర్ఘాయుష్షుతో జీవించెదవు
శిథిల శరీరము కలిగిన మాకు
పరంధాముని కథలను చెప్పి
అమృతమయముగ మార్చి వేసితివి

ప్రకృతి గుణముల కందనియట్టి
శ్రీహరి లీలలు - బ్రహ్మరుద్రులును
తెలియగలేరు - అట్టివాటిని
చాలును అనెడి-మూర్ఖులుందురా!

కావున స్వామీ! పరీక్షిన్నరేంద్రుడు
ఆత్మజ్ఞానము శుకునివల్లను
ఎటులపొందెను - ముక్తిపొందెను
వివరించుమయా! వీనులవిందుగ

ఓ మునులారా! మీకోరికది
జ్ఞానవంతులగు మీకుతగినది
శ్రీహరి గాథలు చెప్పెడి భాగ్యము
నాకు కలిగెను - నా పుణ్యమది

జ్ఞానవంతునిగ నన్ను తలంచి
అడుగుచుండిరి - అంతటి అర్హత
నాకులేదని - నా సందేహము
విష్ణు కథలను చెప్పుట శుభము

అట్టివాడు మరి కులములో పెద్దగు
విరించి - తానే శ్రీహరి మహిమలు
చెప్పలేకను - సర్వేశ్వరుడు
అనంతుడనుచు - వ్యాఖ్యానించెను

ఇంద్రాది దేవతలు దాసోహమందురు
సాక్షాత్ రుక్మిణి - హరి పదమంజరుల
పాద ధూళిని శిరమున దాల్చును
బ్రహ్మకడుగునా - విష్ణుపాదమును

రెక్కలు గలిగిన పక్షి నింగిలో
ఎగురునుగాని నింగి అంతమును
చూడగలుగునా - అటులే శ్రీహరి
లీలలు చెప్పగ - ఎవరికి సాధ్యము!

నాకు తెలిసినది చెప్పెద మీకు
అనుచు తెలిపెను-సూతుడు వారికి
కలిని అణచి - భూదేవి నలరించి
ధర్మబద్ధుడై రాజ్యమేలుచు

ఒక దినమున ఆ రాజవరేణ్యుడు
వేటకు వెడలెను పరివారముతో
అడవిలొ తిరిగి కనబడు మృగముల
నేలకూల్చెను నిశిత శరముల

పరీక్షిత్తునకు కనబడి బ్రతికిన
జంతువు లేదా అడవియందున
బోయవారు ఆశ్చర్యపడునటు
లాఘవమ్ముగా వేటాడెనట

అటులా రాజు వేటాడి అలసెను
ఆకలి - దాహము పెరిగి పోయెను
చెంతనె వెదకెను - నీటి కోసమై
పురిసెడు నీళ్ళు - లభించలేదు

॥శ్రీ కృష్ణచరితము॥

❊❊❊

## 19 పరీక్షిత్తు శమీకమునిపై చచ్చినపాము వేయుట

నీటి కోసమై వెదకుచు వెదకుచు
నిర్జనమైన ప్రదేశమందున
ముని ఆశ్రమమును గాంచెను రాజు
నీరు దొరకునని ఆశపెరిగెను

ఆతిథ్యమది లభించగలదని
నమ్మిన రాజు - ముందుకు సాగి
ఆశ్రమమ్మున అడుగుపెట్టెను
ఎదురుగ గాంచెను మునిపుంగవుని

నిశ్చల తపమున ఆముని వుండెను
బాహ్య ప్రపంచము-తెలియదాయనకు
శాంత గంభీరము ఆకారమది
చలనము లేక కనుపించినది

బాహ్య ప్రకృతితొ సంబంధమది
కలిగియున్నటు కనబడలేదు
నిద్ర జాగరణ సుషుప్తుల దాటిన -
దివ్యావస్థలొ నున్నటు తోచెను

వ్రేలాడుచును జడలు వున్నవి
లేడిచర్మము దాల్చి కూర్చొనె
ధ్యాననియమమున మునిగిపోయెను
మునినిగాంచి మరి దూరము నిలచెను

గొంతుక తడి ఆరిపోవుచు
దాహబాధ అది పెరిగిపోవగా
నమస్కరించి దూరమునుండే
దాహముతీర్చగ ప్రార్థనచేసెను

రాజు మాటలు వినబడలేదు
గాలిలోనికి పోయెను ప్రార్థన
తపోదీక్షలో నున్న మౌనికి
ఈ ప్రపంచము పట్టనట్లయె

తిరిగి అడిగెను - నీళ్ళను - రాజు
నిశ్శబ్దమది తాండవించెను
దురహంకారి యని-తలచెనురాజు
ఆశ్రమధర్మ విరుద్ధమనుకొనె

మౌనవ్రతమున మౌనియున్నచో
చేతి సంజ్ఞలతొ నీరు చూపడే!
నిర్లక్ష్యమిది - డాంబిక తపము
అనుచు పరీక్షిత్తు మదిలో తలచెను

దాహము-ఆహములు దహించసాగెను
అవమానమది కలిగెననుకొనె
నిర్లక్ష్యమది మౌనికి తగదని
ఆవేశమది పెరిగెను రాజుకు

ప్రతిక్రియగా తన కోపమణచుకొన
ప్రక్కనవున్న చచ్చిన పాము
కళేబరమ్మును - వింటితొ తీసి
మౌనిమెడలొ మరి వేసె కోపమున

తన కోపమె తన శత్రువు అనెడి
సత్యము - దానిని గ్రహించలేరు
ఆత్మధ్యానమున యున్న మౌని అట
పట్టనట్టుగా కూర్చొనియుండెను

శరీర దృష్టి వదలి - దీక్షలో
కండ్లుమూసుకొని జ్ఞాననేత్రమున
పరంధాముని చూచెడి మునికి
రాజు చర్య అసలేమియు తెలియదు

ఆవేశములో అటులచేసి మరి
మరలిపోయెను హస్తినాపురము
అంతట కొందరు ముని బాలకులు
అటుగా వచ్చిరి ఆటపాటల

మెడలో పాముతొ ధ్యానమునున్న
శమీకమునిని గాంచిరి వారు
వెంటనె అతని తనయుడు-శృంగికి
తెలియబరచిరి-భయముతొ వణకుచు

పరుగున వచ్చి శృంగి గాంచెను
క్రోధావేశము లెగసి పడినవి
తపోవంతుడు శృంగి అంతట
భరించలేక శాపమునిడెను

మదాంధుడై - తా - దుష్టచర్యను
చేసిన వాడు - ఫలితమందవలె
బుద్ధి చెప్పుటన - మరణదండనే
అనుచు తలంచెను ఆవేశముతొ

ఎచటో అడవిలొ ఆశ్రమమ్మున
అహింస వ్రతముగ తపముననున్న
మునికి యిట్టి అవమానము జరుగుట
సహించరానిది - శిక్షించవలె

అనుచు క్రోధమున - కన్నులెర్రబడె
కృష్ణుడు భువిని వదలినంతనే
ధర్మపాలన చేసెడివాడు
లేకపోయి - యీదుష్కృత్యములు

రాచగర్వము హరించిపోవలె
అనుచు తలంచి - ప్రక్కన నదిలో
మున్నీటితో ఆచమించెను
కొంత జలమును - చేతిలోగొని

నిర్భయమ్ముగా చచ్చిన పామును
నాజనకుని మెడలో వేసిన యట్టి
దుర్మదాంధుడు - ఏడవ రోజున
చచ్చును తప్పక - తక్షక విషమున

నేటికి ఏడవ రోజున వాడు
శివకేశవులు అడ్డుపడినను
తక్షక కాటుకు - గురియై చచ్చును
తిరుగులేనిదీ శాపము అనెను

శాపమునిచ్చిన - కోపముతగ్గెను
ఆశ్రమమ్మునకు తిరిగి వచ్చెను
పామును గాంచి భయమున బాలుడు
ఏడ్వదొడంగెను కాపాడమని

శృంగి ఏడ్పుకు ఆశ్రమమంతయు
తల్లడిల్లినది - అంతట తండ్రి
కన్నులు మెల్లగ విప్పి గాంచెను
మెడలోపామును పారవేసెను

దూరముగా మరి నిలబడినట్టి
తనయుని రమ్మని పిలచెను తండ్రి
ఎందులకటుల రోదించుటది
మనమెవ్వరికీ హానిచేయము

పాము నాకు ఏ కీడునుచేయదు
ఎందలకంత కలవరమయ్యా!
అయినా ఎటులీ పాము నామెడను
చేరినదో మరి ఆశ్చర్యమది

తెప్పరిల్లిన శృంగి అంతయు
తండ్రికి తాను తెలియబరచెను
దుర్మదాంధునికి బుద్ధిచెప్పగా
శాపమునిడితిని అనుచు చెప్పెను

ఒక్కక్షణము ఆ మౌనిపుంగవుడు
దివ్యదృష్టితో అంతయు తెలిసెను
ధర్మరాజుకు మనుమడాతడు
పరీక్షిత్తు రాజవరేణ్యుడు

పాండవ వంశాకురమా రాజు
కృష్ణదేవుని అనుగ్రహమందెను
ధర్మమ్మును మరి నాల్గుపాదముల
నడుపగ నిలచిన రాజోత్తముడు

శమీకుని నేత్రమ్ములనుండి
బాష్పములవ్వి జారిపడినవి
ఎంతటి తప్పును చేసితివయ్యా!
అనెను-తనయుని చూచి పలికెను

అంతట అడిగెను శృంగి తండ్రిని
తను చేసిన ఆ తప్పిదమెట్టిది
అనగా పలికెను - శమీకమహర్షి
తొందర పడితివి - పసితనమ్ముతో

నీవు శాపమిడినట్టి రాజు - తా -
తల్లిగర్భమున శ్రీహరి కరుణతొ
బ్రహ్మాస్త్ర కీలలనుండి బయటపడె
పాండవ వంశ వర్ధనుడాతడు

పరీక్షిత్తు అను నామధేయుడు
విష్ణు పదధ్యాన తత్పరుడు
కలివల్లను మరి కష్టము కలుగక
ప్రజలనేలెడి దయాపూర్ణుడు

తండ్రిమాటలు వినిన శృంగి అట
చిత్తరువువలె నిలబడి పోయెను
తనయా! వినుము ప్రజాపాలనము
ఎంతో కష్టము అట్టిపాలకులు

తెలిసియొ-తెలియకొ తప్పులు చేసిన
సంయమనమ్ము ప్రజలుచూపవలె
కృష్ణావతారము భువిని వదలగా
రక్షణలేక - ప్రజలు మిగిలిరి.

అట్టి కష్ట సమయమ్ములోన తను
ధర్మపాలనకు గద్దెనెక్కెను
ఆదుకొనెను ఈ వసుంధరనయా!
కలిని అణచెను - ప్రతాపవంతుడు

అనాలోచితము - నీవు చేసినది
రాజ ద్రోహముగ పరిణమించెను
పాపము మనకు చుట్టుకొనునయా!
రాజు నశించగ ప్రజలందరును

రక్షణలేక - యిడుమల పడెదరు
అరాచకంబై పోవును రాజ్యము
వారిలొ వారు కొట్టుకు చత్తురు
ఎంతటిస్థితి అది కలుగును నీవల

భాగవతోత్తముడా పరీక్షిత్తు - తా -
దేహియని యాచించిన అతిథి
అతిథిసత్కారము చేయుట మాని
ఘోరశాపము నొసగితివయ్యా!

ఇంతటి క్రోధము ఆవేశములు
ఆశ్రమవాసికి తగునా తనయా!
తిరిగి తాను మరి అపకారమ్మును
చేయని ఘనుడా భక్తశిఖామణి

తనదే తప్పని కుమిలిపోవును
పశ్చాత్తాపము నందున మునుగును
అనుచు శమీకుడు మనసునిండుగా
చక్రధారిని తలంచుకొనెను

యోగివందితా! భక్తబంధువా!
త్రిలోక పూజిత అక్షరమూర్తీ!
తెలియక తనయుడు విపత్తుతెచ్చెను
మన్నించుమయా! మంగళమూర్తీ!

అనుచు శ్రీహరిని వేడెడి తండ్రిని
చూచుచు నిలబడె శృంగి అచ్చట
కుమిలిపోయెడి-తనయునంతట
ఊరడించెను - శమీక మహర్షి

విధి లిఖితమని సర్దిచెప్పకు
శిష్యుని పిలచి జరిగిన దంతా
పరీక్షిత్తునకు చెప్పి రమ్మనెను
అటుల చెప్పిరి విషయము రాజుకు.
॥శ్రీ కృష్ణచరితవ



## 20 పరీక్షిత్తు ప్రాయోపవిష్టుడగుట

దేహవాసనలు బంధములన్నీ
త్రెంపుకు శ్రీహరి సన్నిధికేగగ
సాధనమైనది శాపము అనుకొని
తనతప్పుకు - తా - కుమిలెను రాజు

స్వర్గభోగమే తలంచలేదు
రాజ్య పరిత్యాగము చేసెను
నిరశన వ్రతము సంకల్పించెను
మాధవలోక నివాసము కోరెను

మూర్ఖత్వముతో వివేకము వీడి
మెడలో-చచ్చిన పామును వేయుట
సంయమీంద్రుని - అవమానించుట
దానికి తగిన - ఫలితము - శాపము

విష్ణుపాదోద్భవి పరమపావని
శివ జటా జూటము నుండి
పాపులబ్రోవగ - నేలకు దిగిన
కలుషవిభంగ - గంగలోమునిగి

గోబ్రాహ్మణుల సాధువర్తనుల
రక్షణచేసే రాజును - నేను
అహంకారమున చేసిన పాపము
కాల్చివేయదా కార్చిచ్చు వలె -

సర్వసంగములు పరిత్యజించెను
ఆహారమును విసర్జించెను
మునివలె మంగళమూర్తిని గనవలె
అన్నపట్టుదల కలిగియుండెను

తిరిగి క్రోధమున శృంగికి తాను
ప్రతిశాపమిడి తృప్తినందగల
సమర్థుడైనను రాజసింహుడు
సంయమనమ్ము కలిగి యుండెను

ప్రాయోపవిష్టుడు రాజుఅయ్యెనని
తెలిసిన యట్టి బ్రహ్మఋషులు మరి
దేవ - రాజ ఋషులు వచ్చిరి
పావన మూర్తులనందర గాంచి

శృంగి శాపము తెలిసి తక్షకుడు
సమయము కొరకు వేచియుండెను
చావుతప్పదని తెలిసిన రాజు
ఐహిక సుఖముల ఆశ వదలెను

పరవశించిన పరీక్షిత్తు పలికెను
పుణ్యతీర్థములు అన్నీకలసి
ఒక్కచోట మరి చేరినట్టుగా
దర్శనమిడిరి దయామూర్తులు

అనుచు భక్తిగా మునిపుంగవులకు
వారిశిష్యులకు వందనమిడెను
ఉచితరీతిని పూజలుచేసెను
ఆనంద బాష్పముల కడిగెను పదములు

ఓమునులారా! శారీరకమగు
దాహపు బాధను భరించలేక
క్షణిక కోపమున ముని కంఠమున
చచ్చిన పామును వేసితి నేను

ఆచర్యతొ మరి బ్రతికినపామను
పాపమ్మును - నే తగుల్చుకొంటిని
పాపారణ్యము దగ్ధము చేయగ
శక్తిమంతులు మీరందరును

నా పాపము నాశము అయ్యేడి మార్గము
సెలవీయమని ప్రార్థించుచుంటిని
మీపాదధూళి నా శిరమున దాల్చితి
ధన్యుడనైతిని శాంతిగ నున్నది

భయంకరమ్మగు ఇహబంధములవి
తెగుట కష్టము - కానీ నాకు
తక్షకవిషాగ్ని శాపము - వరమే
భవబంధములు త్రెంపును-సులువుగ

పుణ్యమూర్తుల ఆశీస్సులతో
బ్రతకనెంచిన - ఎంతకాలము?
ఏదో రోజు - తప్పదు మృత్యువు
కావున దానిని - ఆహ్వానింతును

స్వామీ! నాదు కోరిక యిదియే!
తిరిగి జన్మమది కలిగినచో మరి
శ్రీహరి పదముల పైనభక్తిని
కలుగునట్టుగా అనుగ్రహించుడు

దయగొని - దీనుని ప్రార్థన వినుడు
శ్రీహరి భక్తుల గాధల చెప్పి
హృదయమునందు భక్తి పొంగునటు
అనుగ్రహించుడు - అంతియె చాలు

పొమ్మా! అనుచు ముక్తి పథమునకు!
పంపగ జాలెడి తోయమ్ములతో
పరుగలుతీసే గంగను గాంచెను
రమ్యతరంగ - దివిజ గంగయది

జగన్మంగళదాయిని పావని
పరమశివుని - తలకెక్కియు గూడ
పాపుల బ్రోవగ - గర్వము నెరుగక
కలుష విభంగగ ఖ్యాతిగాంచితివి

నన్ను నీవు నీ దయాదృష్టితో
అనుగ్రహించి ఉత్తమగతిని
కలుగజేయుము కరుణాంతరంగా!
అనుచు భక్తిగా - ప్రార్థనచేసెను

దర్భలుతీసుకు తూర్పుముఖముగా
కొసలుండునటు - పరచి వాటిపై
ఉత్తరముఖుడై - కూర్చొనె రాజు
జనమేజయుని అభిషేకించెను

అంతటితో - సంసారబంధములు
పూర్తిగ తెగినటు - భావించుకొని
హరిధ్యానములో ప్రాయోపవిష్టలో
పరీక్షిత్తు అట కూర్చొని యుండగ

దేవదుందుభులు మ్రోగె నింగిని
పుష్పవృష్టి కురిపించిరి సురలు
రాజు కీర్తిని - శ్లాఘించిరి నింగిని
అంతట పలికిరి అచ్చట ఋషులు

ఓ మహరాజా! నీతాత తండ్రులు
విష్ణుసేవాభాగ్యము కలిగిరి
ఆయనచలవతొ నిరాటంకముగ
భూమినేలిన పుణ్యాత్ములయా!

వారినిమించిన భక్తుడవీవు
హరి అనుగ్రహము పుట్టక ముందే
పొందిన ఘనుడవు-నీసరి ఎవ్వరు?
త్వరలో హరిని చేరనుంటివి

నీవు శరీర త్యాగము చేసెడి
పుణ్యఘడియను దర్శించెదము
అంతటి వరకూ యిచటేవుండి
పుణ్యలోకమును చేరుట చూతము

అటుల పలుకుచు హోమాగ్నులవలె
ఆగమాలవి ఆకృతిగొన్నటు
అగపడు మునులు హరికీర్తనమును
ఆరంభించిరి - రాజు వినగను

విష్ణు కథలను విన కోరికతో -
పలికెను వారితొ వందనముంచి
ఏడుదినములలొ ముక్తిని పొందెడి
దివ్యమార్గము తెలియబరచుడు

అన్నిట మీరు అగ్రగాములు
అహర్నిశము శ్రీహరిని కొలతురు
అసలగు భక్తులు మీరు అగుదురు
అనుగ్రహించుడు-మార్గము చెప్పుడు

అంతటవారు ఆనందముతో
రాజుకోరిక తీర్చగనెంచి
వారిలొ వారు ఆలోచించిరి
అంతట వచ్చెను - శుకమహర్షి

పెన్నిధివోలె - ముక్తిధామమది
ముందుకు వచ్చి - నిలచినట్టుగా
వ్యాసకుమారుడు శుకయోగీంద్రుడు
అరుగుదెంచెను - పిలచినట్టుగా

బ్రహ్మతేజముతొ దిగంబరముగా
తిరిగెడి జ్ఞాని - అవధూత ఆతడు
కోపతాపములు ఎరుగనివాడు
బాహ్యప్రపంచము చూడని మౌని

నిస్సంగి ఆతడు - బంధములుండవు
ముక్తికాంత మరి వరించె నతనిని
సృష్టి అంతయు తానే అనుకొను -
భేదభావములు తెలియని జ్ఞాని

అంతటివాడు దైవవశమున
అచటకు రాగా మునులు మ్రొక్కిరి
ఆ మహరాజు భక్తి ప్రపత్తుల
అతిథిపూజలు చేసి మ్రొక్కెను

శుకమహర్షి - తారలమధ్యలో
చందమామలా ఆసీనుడయె
అంతట పలికెను పరీక్షిన్నరేంద్రుడు
స్వామీ! భాగ్యము ఫలించి వస్తివి

నీనామస్మరణే - పాపహరణమగు
నీ దర్శనము పరమపథమిడు
పుణ్యాత్ములలో అగ్రగణ్యుడవు
నన్నుకృతార్థుని చేయ వచ్చితివి

నా తాతల హితము గోరినవాడు
జీవితగమ్యము చూపినవాడు
రక్షగ నిలచి కాచినవాడు
కరుణాధాముడు శ్రీవత్సాంకుడు

నిరతము మదిలో కొలువుతీరెను
బ్రతుకుయానమును మొదలు పెట్టుటకు
ఆయన కరుణ - తల్లి గర్భమున
కలిగిన వాడిని - వదలనివాడిని

నా గమనమది ఆగును యింక
ఆగమ వినతుని దరికిచేరెడి
మార్గము నాకు తెలియ పరచుము
ఏగాథలు మరి గమ్యము చూపును?

నీదర్శనమది వృథాకాదుగద!
నాకోరికది సఫలమగుటకే
అరుగుదెంచిన - పుణ్యరాశివి
పుణ్యపథమును చేరుట ఎట్లు!

యోగీశ్వరుడు జగద్గురువగు
శ్రీహరి నుపాసించిన జ్ఞానివి
ఆవు పాలను - పిదుకు సమయమే
అనుగ్రహించి దర్శనమిత్తువు

అంతకుమించి నిలచిన సమయము
అనురాగ మమకారము కలుగచేయునను
అమోఘ సత్యము చాటిన ఘనుడవు
అనఘుడవీవు - వ్యాసనందనా!

నాసందేహము తీర్చుము స్వామీ!
నా కోరికది సఫలము చేయుము
దాసుని - నీవు కరుణించుమయా!
దయామయా! నీ పదముల మ్రొక్కితి

అనుచు అడిగిన పరీక్షిత్తునకు
శుకయోగీంద్రుడు ఆనందముగా
చెప్పదొడంగెను విష్ణు కథలను
భవభయహారిణి భాగవతమ్మును.

॥శ్రీ కృష్ణచరితము॥



శ్రీ కృష్ణచరితము - కర్ణపేయము
వ్యాసమౌనికే - శాంతినొసగినది
పోతనయ్యే - పులకించి పలికినది
భవ భయ హారిణి - భాగవతమ్ము॥

ఓం శాంతి - శాంతి - శాంతిః





సర్వేజనాస్సుఖినోభవన్తు
లోకాస్సమస్తాస్సుఖినోభవన్తు





**సర్వం శ్రీ సీతారామచంద్ర పాదార్పణమస్తు**



(మకుటం)

శ్రీ కృష్ణచరితము - కర్ణపేయము
వ్యాసమౌనికే - శాంతినొసగినది
పోతనయ్య - పులకించి పలికినది
భవ భయ హారిణి - భాగవతమ్ము॥

# శ్రీమద్భాగవత - మకరందము

## (ద్వితీయస్కంధము)

### విషయ సూచిక

సర్గము — పేజీ







శ్రీరామ

ఓం - నమో - వాసుదేవాయనమః

# శ్రీమద్భాగవత - మకరందము

## (ద్వితీయస్కంధము)

శుకయోగీంద్రుడు చెప్పదొడంగెను
బ్రహ్మవేత్తలు మెచ్చుకొందురు
అంతటి ఉత్తమమైన ప్రశ్నను
అడిగితివీవు అవధరింపుము

ఆత్మవివేకము భక్తియోగము
నిర్ణీతకర్మలు మూడింటితొ మరి
జీవించుచును - శ్రీహరి స్మరణతొ
తనువును త్యాగము చేయగవలెను

బంధవిమోచన కలిగించుచును
మేలుచేసెడి దివ్యమార్గము
నీకుచెప్పెద ముక్తి మార్గమది
తప్పక వినవలె సర్వజనులును

నరజన్మ సఫలము చేసుకోవలె
సనకసనందన మునిపుంగవులును
జ్ఞానకాంతితో త్రోవ తెలుసుకు
హరికథలతొ మరి గడుపుచుందురు

గృహస్థులై జీవించువారు ను
ఆత్మతత్త్వమును తెలియగలేరు
కాంతా గృహములు అర్థములే తమ
పరమావధిగా తలచి ంతురు

హరి కథ వివరము తెలిపెద వినుము
నా జనకుడగు వ్యాసునివద్ద
ద్వాపరయుగమున పుణ్యవశమున
భాగవతమ్మును చదివితి నేను

కంటి ముందర తనువులుసాగుట
చూచియు దానిని లక్ష్యపెట్టరు
భస్మమయ్యెడి శరీరమ్మునకు
పరమావధి మరి సుఖములందురు

బ్రహ్మముతో మరి సమానమైనది
అసత్యమ్ము విడమరచి చెప్పినది
భాగవతమ్ము చదివితినయ్యా!
గుణాతీతుడను అయినా - నాకు

విష్ణువు సర్వము - సర్వాత్ముడాతడు
అనుచునమ్మి - తా - విష్ణు కథలతో
హరి భక్తితొ మరి తరించగలరు
మోక్షార్థిగ జీవించుట ధన్యత

రామకృష్ణావతారములపై
కలిగిన మక్కువ - కుతూహలమ్ము
చదివించినది - హరిభక్తుడవగు
నీకది తెలిపెద - ఆలకించుము

భాగవత పఠన శ్రవణమ్ములు
విష్ణుభక్తిని కలిగించునవి
విష్ణుసేవను చేయగ మనసగు
మోక్షప్రదాత భాగవతమ్ము

సంసార బాధలను దూరముచేయును
వాసుదేవుని సంకీర్తన మించి
చేయగదగిన వ్రతములులేవు
యోగులకిది మరి మోక్షసాధనము

హరిని తెలియగ లేని మూర్ఖునికి
తనువు నిలవదని తెలియని వానికి
ఎన్నివేల సంవత్సరమ్ములైనను
ముక్తికలగదు నిస్సందేహము.

రెండు ఘడియల హరిస్మరణమ్మున
ముక్తి కల్గును ఆవిషయమును
ప్రాచీన గాథ తెలుపును వినిచెద
ఖట్వాంగుడను - ఏలిక గలడు

ఆమహారాజు పరాక్రమవంతుడు
సప్తద్వీపములు గెలచి ఏలెను
ఇంద్రాదిదేవతలు అపజయమంది
సాయము చేయగ - రాజును కోరిరి

వెంటనె రాజు సాయము చేసి
విజయలక్ష్మిని అందించె - సురలకు
ఆనందించిన సురలు - రాజుకు
వరము నిత్తుము కోరుకోమనె

అంతట రాజు వారినడిగెను
ఏమియు కోరను - కానీ నాదు
ఆయుర్దాయము-ఎంతయొచెప్పుడు!
అంతట పలికిరి రెండు ఘడియలని

సంతోషమని - సురలతొ పలికె
భూలోకమునకు వచ్చెను రాజు
సిరిసంపదలకు లోటు ఎరుగడు
ప్రేమమూర్తులు రాజు భార్యలు

కవులు పండితులు సచివోత్తములు
కోటలు పేటలు - ధనధాన్యములు
అన్నీవదలి విరాగియయ్యెను
గోవిందస్మరణతొ సమాధినిష్టుడయె

రెండు ఘడియలా పరంధాముని
ధ్యానమునుండి మోక్షమునందెను
కావున రాజా! నామ మహత్యము
భాగవత పఠన - శక్తివంతము

రాజా నీకు కాలపరిమితి
ఏడుదినములు - కావున నీవు
పారలౌకిక మేలును పొందెడి
ముక్తినందెడి సమయ మదియగు

దేహధారి మరి చేయదగినది
చావు దగ్గర పడెనని తెలిసి
బెదరిపోకను - ధైర్యవంతుడై
భవలతలన్నీ త్రెంచుకోవలె

నిష్కామమ్మను నిశిత ఖడ్గమున
మోహవృక్షమును నరకి వేయవలె
అంతట - అశాశ్వత దేహమ్ముకు
ఆశ్రయమిడిన - గృహము వదలవలె

అట్టి మనస్సుతొ పరంధాముని
పాదపద్మముల ధ్యానించవలె
అంతట అడిగెను రాజవరేణ్యుడు
ధారణ అనగా నెట్టిది స్వామీ!

పుణ్యనదులలో స్నానము చేసి
పవిత్రమైన ఏకాంత స్థలమున
కృష్ణాజినమున ఆసీనుడయి
పరిశుద్ధమనస్సుతొ ప్రణవము చేయుచు

ఎటుల నిలచును ధారణ అన్నది
మనస్సును ఎటుల నిర్మలమొనర్చు -
ఆరంభించెను శుకయోగీంద్రుడు
ఆసన స్థిరత్వమది కలిగి మరి

ఓం కారమును జపించు కొనుచు
శ్వాసను బంధించు యత్నమొనర్చుచు
శబ్దాదివిషయముల స్వేచ్ఛగతిరిగే
ఇంద్రియాలను - బుద్ధిని, తెలివిగ -

రేచక పూరక కుంభక క్రమమున
ప్రాణవాయువును నిరోధించుటలొ
అభ్యాసమ్ము కలిగిన వాడు
పదకొండింద్రియమ్ములను జయించి

సారధిగా - తా - నియమించుకొని
మనస్సు అనెడి పగ్గము గ్రహించి
కర్మలవైపు లాగు మనస్సును
వివేక మొదవగ నిగ్రహించవలె

దారాపుత్ర బంధము త్రెంచుకు
జగదాధారుని రూపమునందు
బుద్ధితొ పాటు మనసు నిలపవలె
భగవంతుని పై ఏకాగ్రత - ధారణ

సత్తు - అసత్తు అను వివేకము
మనస్సునకు మరి కలిగించవలె
అంతట మనస్సునదుపు చేసుకొని
భగవంతుని రూపుకు సంధింపవలె

భగవంతుడు శ్రీహరి - సర్వవ్యాపకుడు
భూత భవిష్యత్ వర్తమానములు
విశ్వమంతయు ఆయన యందున
దర్శనమగును సాధనతోను

అంతట మనస్సు ఇంద్రియమ్ముల
వికారమ్ములను దూరముచేసుకు
కర్మవాసనల వదలించుకొని
శుద్ధ మనస్సుగ వెలుగుచుండును

పంచభూతములు అహంకార మహత్తులు
ఆవరించిన అండ కోశమగు
శరీరమ్ములో ధారణ చేతను
విశ్వవంద్యుడు ప్రకాశించును

అట్టి - ఆ భగవానుని యొక్క
సూక్ష్మరూపము వర్ణించెద విను -
వైరాజితరూపుని అరికాళ్ళగు-పాతాళమ్ము
పాదాలు-పైన ప్రక్కల-రసాతలమ్ము

దౌడలు జలము - నాలుక రసము
బ్రహ్మరంధ్రము - వేదమ్ములగు
దంష్ట్రలు అగును - దండధరుండు
దంతములవ్వి - పుత్రాది స్నేహకళలగు

చీలమండలు-మహాతలమ్ము
జంఘలు - తలాతలమ్మగు
రెండు జానువులు సుతలమ్మగును
వితలాతలము - తొడలగు రాజా!

జనుల భ్రాంతులను చేయు మాయలవి
నవ్వులుగా మరి వెలుగుచుండును
కడగంటి చూపులు సృష్టియెఅగును
పెదవులు - సిగ్గు - లోభమ్ములగు

జఘనము భూమి-వివరము నాభి
వక్షస్థలమ్ము నభస్తలమ్ములు
గ్రహతారాదుల నక్షత్రలోకము
మహర్లోకము కంఠము అగును

స్తనములు ధర్మమార్గములగును
అధర్మ పద్ధతి - వెన్నుఅగును మరి
గుహ్యావయవము ప్రజాపతియగు
బీజములవ్వి మిత్రావరుణలు

జనలోకమ్మది ముఖమండలము
తపోలోకము నొసలుఅగును మరి
సత్యలోకము శిరస్సు అగును
ఇంద్రాదులు స్వామికి బాహువులగుదురు

ఉదరము అగును సముద్రమ్ములు
ఎముకలు కొండలు - నాడులు నదులు
తరువులు రోమమ్ములు అగును
నిశ్వాసములు వాయువుఅగును

వైరాజిత రూపుని - దిక్కులు చెవులు
శ్రవణేంద్రియశక్తి - శబ్దమ్మగును
నాసికాపుటలు - అశ్వనిసురలు
గంధము ముక్కు-ముఖము అగ్నియగు

అనంతమైన కాలము - వయస్సు
అనేక జంతువుల జీవనగమ్యము
కర్మలుగా మరి చెప్పగవలెను
కేశములవ్వి మేఘములగును

అంతరిక్షము - కన్నులు అగును
నేత్రేంద్రియము సూర్యదేవుడు
కనురెప్పలవి - రాత్రింబవళులు
కనుబొమ్మలవి బ్రహ్మపదమ్మగు

ధరించు వలువలు సంధ్యలు అగును
హృదయము - ప్రధానమగును మరి
మనస్సు చంద్రుడు - చిత్తము మహత్తు
అహంకారము రుద్రుడు అగును

అశ్వాశ్వతర ర్యుష్ట్రగజములు - గోళ్ళు
కటిప్రదేశము - పశుమృగమ్ములు
విచిత్రమైన ఆలాపములు-పక్షులు
బుద్ధి మనువు-మరి నివాసము పురుషుడు

షడ్జాది స్వరవిశేషములవ్వి
గంధర్వ చారణ విద్యాధరాప్సరసలు -
ప్రహ్లాదుండు స్మృతియగును మరి
వీర్యము అసురులు-విరాట్‌రూపమిది

వేదవేత్తలు - ఈశ్వరు వదనము
భుజములు క్షత్రియులు-తొడలు వైశ్యులు
పాదమ్ములు మరి శూద్రులగుదురు
అందరు విరాట్‌రూపుని అంశలు

నామమ్ములు వసు రుద్రాది దేవతలు
ద్రవ్యములవ్వి హవిర్భాగములు
కర్మటయజ్ఞ ప్రయోగంబులగు
సమన్వయరూపము సర్వేశ్వరుడు

అట్టిరూపమును మోక్షకాంక్షి - తా -
మనస్సులో మరి ప్రతిష్టించుకొని
ఆరాధించగవలెను వింటివా!
వైరాజితపురుషుని రూపము తెలిసెన?

విశ్వమంతయు హరిమయమగును
హరిలోనే మరి విశ్వమున్నది
హరిమయముగాని వస్తువు లేదు
అణువుకూడను హరిమయమయ్యా!

ఓ నరపాలా! తత్త్వమ్మును విను
కలలో - జీవుడు ఎన్నోదేహముల
నాశ్రయించుకొని ఇంద్రియాలతో
అనేక వ్యాపారమ్ములు సలుపును

తెలివి కలుగగా! కలయని తెలుసుకు
నిజస్థితికి - తా - వచ్చునట్లుగా
సర్వాత్ముడైన ఈశ్వరదేవుడు
అన్నిజీవుల హృదయమ్ములలో

వసించియుండి వాటిగుణములకు
బుద్ధివ్యాపకములన్నిటి కిన్నీ
లొంగక-దూరమునుండి చూచుచు
పరిశీలకునిగ నిలచియుండును

అన్నీ లయము అయిపోయెడివే
సత్యము తాను - ఆనందమూర్తి
ఇంద్రియవ్యాపారముల బంధువులు
శోక బంధము లన్నవి-రాజా!

ఈశ్వరదేవుడు విజ్ఞానమ్మగు
ఆయనసేవ మోక్షప్రదాయిని
విష్ణుసేవయను నావ ఒక్కటే
సంసారసాగరము తరింపజేయును

సృష్టికర్త - తా - సృష్టిచేయుటది
సాధ్యముగాక శ్రీహరి కరుణతొ
మనోవికాసము కలిగిన తదుపరి
జంతుజాలమును సృజించగలిగెను

జాగ్రదవస్థలో అనుభవాలను
నెమరువేయుచు కలలను గనుచు
శబ్దప్రధాన వేద కర్మలను
ఆచరించుచు ఫలితము కోరుచు

స్వర్గములో మరి లభించగలుగు
సుఖములు కొరకై - ఎదురుచూచుచు
మాయ తనను నడిపించినట్టుగా
నడచుచుండును - మూర్ఖత్వముతో

బుద్ధిమంతుడు అప్రమత్తుడై
దేహము నిలువగ-తగిన పనులను -
నిర్వర్తించుచు కోర్కెలువదలి
మోక్షకామియై సంచరించును

చల్లని జలముల నిచ్చెను - ప్రభువు
పవ్వళించగా - నేలను యిచ్చెను
గుహలు కొండలు ఫలవృక్షములు
అన్నీఒసగెను పరంధాముడు

ఆయన చింతన మానివేసి మరి
యాచకునిగను మారి! పరులను
అర్థించుచును బ్రతుకుట హేయము
అన్నీ ఒసగెడి వాడా శ్రీహరి!

శరణాగతియని నిలచిన భక్తుని -
రక్షించెదనని - నిలచిన హరిని
మదిలోతలచక తానే తాను
రక్షించుకొన యత్నము - వ్యర్థము

జ్ఞానముకలిగిన వాడు తెలివిగా
సంసారహేతువగు మాయనుదాటును
అటులచేయక ఇంద్రియలోలత
పెంచుకు - భ్రష్టుడు అగుట జరుగును

అట్టివానిని యమకింకరులు
యమబాధలకును గురిచేసెదరు
అప్పుడు వానికి తన తప్పు అది
తెలియును కానీ - ఫలితము శూన్యము

హరిభక్తులు నిరతము హృదయమునందు
హరిని ప్రతిష్టించుకు నుందురు
అట్టి అవ్యయుడు పరమేశ్వరుడు
ఎటులనుండునో చెప్పెదరాజా!

అంగుష్టమంతగ దివ్యదేహమున
ప్రకాశమానుడు విరాజిల్లును
శంఖ, చక్ర, గద, ఖడ్గమ్ములవి
నాల్గుభుజముల ధరించియుండును

కోటి మన్మథుల మించు నందమున
పద్మనయనములు కరుణాలయములు
భాలభాను ప్రభ - తక్కువ అనెడి
వెలుగులు చిమ్మును వజ్రమకుటము

శ్రీవత్సలాంఛిత వక్షము గలిగి
కౌస్తుభమణితో - వనమాలతొ మరి
మంగళప్రదముగ అగబడువాడు
మకరకుండలము లమరినవాడు

నల్లని కురులతొ చల్లని నగవుతొ
మహాయోగుల మానస వీధుల
విలాసమ్ముగా చరించువాడు
మందస్మిత వదనారవిందుడు

అట్టి ఈశ్వరుని ధ్యానించుచును
చరణకమలముల దర్శించుచును
నిరంతరధ్యానము చేయు భక్తుడు
హరినామమ్మే శ్వాసగ తలచును

యతియను వాడు మరణసమయముకు
దేశకాలములు తలచడు మదిలొ
దర్భాసనమున మృగ చర్మమున
ఆసనమ్మును సిద్ధముచేసుకు

ప్రాణవాయువును మనసుతొ జయించి
చెదిరే మనసును నిరోధించును –
బుద్ధిని జీవుని వశమొనర్చి మరి
జీవుని ఆత్మలొ జేర్చును అంతట

ఆత్మను బ్రహ్మలొ విలీనమొనర్చి
ఆ అనుభవము పొందునాతడు
శాశ్వత సుఖమును ఆకాంక్షించును
మోక్షార్థియైన యతి–గతియిదియగు

అహంకార మమకారమ్ములు వదలి
లౌకిక సంబంధమ్ములు త్రెంచుకు
హరిపాదములను మదిలో నిలపి
విష్ణుపథముకై జ్ఞాని నిలచును

పాదము యొక్క పై భాగముతో
మూలాధార చక్రమ్మును మరి
వాయువు క్రిందకు రాని విధముగా
అణచిపెట్టును అభ్యాసజ్ఞానముల

ఆపైఆతడు ప్రాణవాయువును
బిగబట్టి – నాభికి జేర్చును దానిని
మెల్లగ దానిని హృదయము వద్దకు
జేర్చి పైకి మరిసాగనిచ్చును

మెల్లగ దానిని ఉరముకు పంపి
ఆపై దౌడలవద్దకు పంపును
అంతట దానిని భృకుటికి జేర్చును
కన్నులు చెవులు ముక్కు పుటములు

ఆపై – నోటిని బంధించి అంతట
ఒక్క గడియసమయమ్ము దాటగా
భ్రూమధ్యమున నున్న వాయువును
బ్రహ్మరంధ్రము దరికి జేర్చును

ఆస్థితి కలిగిన వెంటనె – యోగి
బ్రహ్మరంధ్రమును ఛేదించి అంతట
బ్రహ్మమునందు కలిసిపోవును
మోక్షకాంక్షి తను చేయును యిటుల

తపోయోగ సమాధినిష్టులై
సూక్ష్మశరీరము దాల్చిన యోగి
బ్రహ్మాండమునకు లోపల – వెలుపల
నెలకొను మహర్లోకము జేరును

యోగి తాను తన సాధన ఫలితము
ఆకాశమార్గమున బ్రహ్మలోకమును
జేరుచు – సుషుమ్నానాడిని అగ్నిని
అధిదేవతగా చేసుకు నంత

జ్యోతిర్మయమగు తేజముతోను
తారామండల మధిగమించుచు
సూర్యాది ధృవమండలమ్ముల సాగి
శింశుమార చక్రమ్మును జేరును

శ్రీహరి సంబంధమైన చక్రమది
తానొక్కడె అట నెలకొనియుండును
అంతట అతడు పరమాణురూపమగు
సూక్ష్మశరీరము సంతరించుకొని

బ్రహ్మవేత్తలకు నిలయము ఐన
మహర్లోకమున ప్రవేశించును
ఆలోకమున మహా కల్పాంతముగా
ఆనందముగా వశించు – రాజా!

కల్పాంతమది జరిగినంతనే
అనంతాగ్నిలో నిలబడలేక
బ్రహ్మపథమును జేరుకొనునయా!
బ్రహ్మపథమ్ము మహిమ తెలిపెద

భూలోకములో పదునాల్గు సంఖ్యలో
మనువులు పరిపాలించిన కాలము
బ్రహ్మపథమున ఒక్క దినమగు
విమానమ్ములట వెలుగు–తేజముతొ

జరామరణము దుఃఖభయములు
రోగములన్నవి – వుండవచ్చుట
శ్రీహరి నామము తలచనివారి
ఏడ్పులచ్చుట వినబడు చుండును

శ్రీహరి గుణవర్ణనామృతము
పొంగిపొరలును బ్రహ్మపథమున
అచటకు జేరిన యోగి అచ్చటే
శాశ్వతముగను వసించియుండును

వారుచేసిన పుణ్యబలముతో
బ్రహ్మాదులను సేవించి–ముక్తులగు
శ్రీహరి భక్తులు స్వతంత్రులై మరి
సర్వోన్నత విష్ణుపథము జేరెదరు

ఈశ్వరులోగల ప్రకృతి అంశతొ
మహత్తు అను–తత్త్వమేర్పడు
దానితో మరి అహంకారము
అహంకారముతొ శబ్దమేర్పడు

శబ్దాంశతొ మరి గగన మేర్పడు
•గగనాంశవల్లను స్పర్శగలుగును
స్పర్శవల్లను వాయువు ఏర్పడు
వాయువువలన రూపమేర్పడు

రూపముతో – తేజస్సు పుట్టును
తేజోఅంశతొ – రసము దానితో
జలము–దానితొ గంధము పుట్టును
గంధాంశతొ మరి–పృధివి పుట్టును

ఈతత్త్వముల సమ్మేళనమున
పదునాల్గు భువనములకాత్మగ నుండే
విరాడ్రూపము వుండును రాజా!
కోటి యోజన వైశాల్య ముగలిగిన

సప్తావరణములు పృధివితో కలిసి
ప్రకృతి వాటిని ఆవరించినది
కావున బ్రహ్మాండము - విశాలమైనది
దానిని ఛేదించి-విష్ణుపథము కేగవలె

అండము-విరాడ్రూపము కుండును
మొదటి ఆవరణము పృథివి అదియగు
యాబది కోట్ల యోజన విస్తృతి
అనుచు కొందరు చెప్పుచుందురు

పరమ భాగవతులు విష్ణుపథమును
సాధనతో మరి పొందగలుగుదురు
అటులజేరినచో తిరిగి రాకను
శాశ్వతమ్ముగా నుందురు అచటే

పృథివియను ఆవరణముపై
జలము తేజము వాయురాకాశ
అహంకార మహత్తు - లావరణములై
ఒకదానికి ఒకటి పదిరెట్లుగనున్నవి

ఓ మహరాజా! రెండువిధముల ముక్తి మార్గములు
సద్యోముక్తి - క్రమముక్తియనునవి
ప్రియముగ వాటిని వాసుదేవుడు
బ్రహదేవునికి తెలియబరచెను

సంసారి-మోక్షమును పొందుట కొరకై
తపస్సు - యోగము - మొదలగు వాటిలో
భక్తిమార్గము సులభమైనది
అనుచు తెలిపెను వ్యాసనందనుడు

 ॥శ్రీ కృష్ణచరితము॥

## 1 భక్తి మార్గము సులభమని వ్యాసుడు చెప్పుట

మోక్షమందగ సులభమార్గమును
వేదమ్ములలో వెదకెను బ్రహ్మ
పరిశీలించి చర్చలు జరిపి
నిశ్చయించెను భక్తి మార్గమని

అటుల భక్తితో మురళీధరుని
సేవించినచో అనాయాసముగ
తనువునువిడచి విష్ణు సాయుజ్యము
జేరుకొందురు నిస్సందేహము

అంతట బ్రహ్మ పరంధాముని
భక్తి మార్గమున సేవించెనయా!
కావున శ్రీహరి భక్తి గలిగినచొ
ముక్తిపొందుట సులభము అగును

బ్రహ్మవర్చస్సుకు - బ్రహ్మను కొలతురు
ఇంద్రియబలముకు ఇంద్రుని కొలతురు
దక్షాది ప్రజాపతులను-సంతతి కొరకై
భోజన సుఖముకు-అదితిని కొలతురు

స్వర్గ వాసముకు ఆదిత్యులను
రాజ్యకాముకుడు - విశ్వదేవతల
దేశప్రజాసాధనకు-సాధ్యుల కొలతురు
శ్రీ కాముకుడు-తా-దుర్గనుసేవించు

తేజస్కాముడు అగ్నిని మరియు
పసుకాముకుడు వసువుల కొలచును
వీర్యకాముడు రుద్రుల కొలచును
ఆయుష్కాముడు అశ్విని సురలను

పుష్టిని కోరిన - భూమిని కొలతురు
ప్రతిష్టకొరకు నింగీ - నేలలను
సౌందర్యమునకు గంధర్వులను
స్త్రీకాముకుడు కొలుచు నూర్వశిని

సర్వాధిపత్యము కోరుకున్నచో -
బ్రహ్మదేవుని ఆరాధింతురు
కీర్తికాముకుడు యజ్ఞపురుషుడగు
విష్ణుదేవు నారాధించగవలెను

ధనాకాంక్షి - పూజించు ప్రచేతనుని
విద్యాకాముడు శివు నారాధించును
దాంపత్య ప్రీతికి - ఉమాదేవిని
ధర్మార్థములకు విష్ణుదేవుని

సంతానకాముడు - పితృదేవతల
రక్షాకాముడు యక్షుల గొలచును
బలకాముకుడు మరుద్గణముల
రాజ్యముకొరకు మను రూపదేవతల

శత్రు మరణము కోరిన వాడు
గోణపాలకుడగు రాక్షసు కొలచును
భోగ కాముకుడు చంద్రుని భజించు
చివరకు కోరుట ముక్తి కలుగునటు

రాజా! వినుము వేల్పులెందరినొ
కొలచుట కన్న - విజ్ఞత కలిగి
పరంధాముని - శ్రీహరిని భజించి
ముక్తినందుట వివేకమగును

వాసుదేవుని కథామృతంబును
వినుచు గడిపెడి భక్తుని ఆయువు
తెలియకుండనే సూర్యుడు పెంచును
సంసారబద్ధునికి తగ్గించునయా!

నిరర్థకంబై భక్తిరహితమై
బ్రతికినవాడు - అంత్యకాలమున
యమదూతల బాధలు ఓర్వగలేక
రోదించినను ఫలితము శూన్యము

భవిత తెలియదు మానవుల కిల
మూర్ఖత్వముతో సమయము గడిపి
ఇహ పరములకు దూరమగుదురు
మానులాటి - బ్రతుకగును చివరకు

ఇంద్రియ సుఖముల కారాటపడే
బ్రతుకు - బ్రతుకగా చెప్పగరాదు!
తినుచు బ్రతికెడి - పశుతుల్యమ్మగు
గమ్యములేని ప్రయాణమగును

శ్రీహరి కీర్తన - వినని చెవులవి
కొండగుహలుగా చెప్పగవలెను
హరి కథ చదవని నాలుక - కప్పయె
కాంచని కన్నులు - నెమలికన్నులు

పూజించని కరములు చలన రహితములు
హరిపదములపై నిలచిన యట్టి
తులసివాసన - తెలియని నాసిక
సూకరనాసికతో సమమగును

హరిక్షేత్రములకు వెళ్ళనికాళ్ళు
తరువుల వ్రేళ్ళతొ సమానమగును
నామస్మరణతో పులకరించని
గుండెఅగును ఒక బండరాయియే

శ్రీహరి పదముల మ్రోకరిల్లని
శిరస్సునున్న వజ్రమకుటమది
కట్టెల మోపుగ గణించవచ్చును
వానిభాగ్యమది అడవిన వెన్నెల

మాధవసేవ చేయని వాడు
జీవచ్ఛవముగ మిగిలిపోవును
వాని బ్రతుకు మరి మేడిపండుగా
పైన మెరుగుతో-లోపలక్రిములు -

అటుల వినగను ఆనందించిన
పరీక్షిత్తు - తా - సర్వభోగములు
బంధు బంధములు 'నిశ్చలమనసుతొ
త్రెంపుకు - మదిని హరికర్పించెను

చావు మీదపడునన్న ధ్యాసను
వదలి వేసెను - దృఢచిత్తముతో
శ్రీహరి కథలతొ నామస్మరణతో
శేషజీవితము గడపనెంచెను

ఆపై రాజు వాసుదేవుని సృష్టివివరము
పాలన వివరము ఏశక్తులతో
భగవానుడు మరి అవతరించెను
ఒక్కడె అన్ని రూపులనుండెన

ఆవివరములు తెలియ బరచమన
ఆనందించిన శుకయోగీంద్రుడు
ఆవిషయమును చెప్పగ తలచి
అనంతమూర్తిని స్తుతించెనిటుల

॥శ్రీ కృష్ణచరితము॥



## 2 శ్రీ శుకుడు భగవంతుని స్తుతించుట

లోకములకావల వెలిగెడి మూర్తి
జ్యోతిర్మూర్తికి వందనమ్ములివె -
త్రిగుణమ్ములకు మరి సృష్టిస్థితిలయ
కారకుడైన హరికి జోతలు!

విరించి వాసవ సురలకు అందని
మహోన్నతమ్మగు మంగళమూర్తి
పాదమంజరుల వందనమిడితిని
తత్త్వార్థమును తెలుపగ వేడితి

భక్తుల పాపము క్షాళనచేసి
దుర్మార్గుల శిక్షించెడి వాడు
సర్వసృష్టికి రూపముయైన
మునిజనహృదయ జ్యోతిరూపునకు

భక్తరక్షకుడు కళ్యాణధాముడు
భక్తిహీనులను చేరనివాడు
బ్రహ్మపథమున విహరించువాడగు
సర్వనియంతకు మ్రొక్కుచుంటిని!

వందనార్చన భక్తిచర్చలు
నామ సంకీర్తన మార్గమ్ములలో
సేవించువారికి అందెడివాడు
ఆనందాబ్ధిని తేల్చెడువాడు

తన కథలను - గాథలు వినెడి వారికి
సంసారక్లేశము - తాపత్రయముల
అణచి వేసి మరి అనుగ్రహించి
అనంతమూర్తితొ కలుపుకొనుచును

భక్తవరదుడై అభయమునిడెడి
కమల పత్రనేత్రమ్ముల వానిని
ఆశ్రయించుచు నుంటిని నేను
శుభచరితుని నే స్తుతించు చుంటిని

తపోదానముల కందనివాడు
భక్తిహీనులను ఉపేక్షించని
భక్తకల్పకము రమాకాంతుడు
అట్టి స్వామికి వందనశతములు

శ్రీపతి - ప్రజాపతి - జగత్పతి మరి
యదుకులపతియగు వాసుదేవునికి
ఉత్తమగతికై వందనమిడితిని
విరాడ్రూపునికి నమస్సులివిగో!

అణువుకాదని బ్రహ్మముఅనుచు
గుణవంతుడని నిర్గుణుడనుచును
తత్త్వము తెలియక కవులు చెప్పుచు
భక్తిమార్గమున కొంత తెలిసెదరు

సృష్టిచేయగా విరించి - తలంచగ
క్రియాశక్తిగా వాణిని పంపి
భార్యగజేసి లోకసృష్టిని
చేయించిన హరి - ప్రసన్నుడగును!

పరిపూర్ణుడై మరి పంచభూతముల
సంయోగముతో శరీరమ్ములను
పురములలో - తా - పురుషభావమున
నెలకొనియున్న యోగికి జోతలు

పంచభూతముల ఇంద్రియమ్ముల
ప్రకాశింపగా చేసెడివాడు
పాపసంహారుడు మురళీధరుడు
మనుగడ మంచిగ సాగనీయవలె!

గీతా శాస్త్రము అనెడి గంగను
పవిత్రవంతుల చేయగ తలచి
ఒలికించిన హరి ముఖకమలమున
శుద్ధిచేయబడి పారెను పృథివిని

భక్తకల్పకము ఆనందధామము
అఖిలజగత్తుకు ఆధారుడగు
హరి అవతారము అగు నాజనకుడు
వేదవ్యాసునికి వందన శతములు

అనుచు భక్తిగా హరిని స్తుతించి
పలికెను శుకుడు రాజుతొనంత
నారదమౌని నాకు చెప్పినది
వినిపించెదనని ఆరంభించెను

॥శ్రీ కృష్ణచరితము



## 3 ప్రపంచ ప్రకారము గూర్చి నారదుడు బ్రహ్మనడుగుట

బ్రహ్మనుగాంచి పలికె నారదుడు
తండ్రీ నీవు లోకమ్ములకు
పితామహుండవు సృష్టికర్తవు
వేదమ్ములవి పలుకు ముఖములు

స్థావర జంగమమైన సృష్టిని
చేయుటలోమరి తొట్రుపడగను
అనుగ్రహించి నాకీ శక్తిని
ప్రసాదించెను పరంధాముడు

చదువుల వాణి – నీ గృహిణి కదా
తత్త్వార్థములు తెలిసిన వాడవు
నాసందేహములన్నియు నీవు
తీర్చగ చాలిన సమర్థుడవయా!

అట్టి నాయకుడు జగన్నాయకుడు
తేజోమూర్తి పరాత్పరుండు
ఆయన చల్లని చూపులవల్లను
జీవకళతొ మరి సృష్టివెలుగును

జ్ఞానముకలుగును ఎవరివల్లను
అజ్ఞానమునకు మూలమెవ్వరు
హేతువు ఏది నీపై మరియొక
శక్తియున్నదా? ఎవ్వరువారు?

మాయతొ తెలియక – నన్ను అందరు
లోకేశ్వరుడని కీర్తించెదరు
జగద్వంద్యుడు అందరి దేవుడు
నేనుకాదు-శ్రీహరి యని చెప్పెద

సృష్టిచేయగా నీకే ఫలితము
ఉన్నది స్వామీ – వివరించుమయా!
దీనినిపెంచి త్రుంచెడి దెవ్వరు
ఎటులవుండునా ప్రభువు–తెలుపుము

వాసుదేవుడు లేనిది లేదు
సర్వనియంతగ చెప్పును – హరిని
జ్ఞానమువలన అట్టి విషయము
గ్రహించగలిగి భక్తులగుదురు

అంతట పలికెను విరించి అచట
నారదు నభినందించి పలికెను
సృష్టికి ప్రభువును అన్నమాటది
కొంతవరకునే సత్యమగునయా!

దేవతలందరు నారాయణాంశలు
యజ్ఞ తపో యోగ జ్ఞానములు
నారాయణుడే ప్రభువని తెలుపును
ఆయనచలవే నా సృష్టియిది

నిర్గుణుడాయన త్రిగుణమ్ములవి
ఆయన వలన ఉద్భవించెను
లీలానాటక సూత్రధారిగా
జగన్నాటకము నాడించునా హరి

అట్టి ఈశ్వరుడు ఆది మధ్యాంతరహితుడు
నారాయణుడు - నీకూ నాకూ
కనబడునట్టి లోకమ్ములకు
సర్వజీవులకు ప్రభువాతడగు

ఈశ్వరునందలి - మహత్తు తత్త్వము
దానినుండి మరి - కాలమువచ్చెను
దానివల్లను కర్మ వచ్చెను
కర్మలవల్ల జన్మలు వచ్చెను

త్రిగుణమ్ముల సమ్మేళనమ్ముతో
మార్పుచెందిన మానవత్వమున
తమోప్రధాన-అహంకారము వచ్చెను
దాని రూపములు-ద్రవ్య-క్రియా-జ్ఞానశక్తులు

తామసాహంకారము వల్లను
ఆకాశమ్ము కలిగెను మొదట
దాని గుణమ్ము శబ్దమైనది
ఆకాశముతో వాయువు పుట్టెను

శబ్దస్పర్శలు - వాయు గుణములు
ఆవాయువే మరి ప్రాణవాయువుగ
తనువులందున నెలకొని యున్నది
వాయుగుణములతొ తేజము కలిగెను

రూప, స్పర్శ శబ్దములు వాయువు వలన
తేజము అనెడి అగ్ని కలిగెను
రస, రూప, స్పర్శ, శబ్ద గుణముల
జలము కలిగెను - తొలుత - సృష్టిలో

అంతట సాత్వికాహంకారమువల్లను
చంద్రదైవతమగు - మనస్సు-దిక్కులు
వాయువు-సూర్యుడు-వరుణు డశ్వినులు
అగ్ని-ఇంద్ర-ఉపేంద్రులును మరి

మిత్రుడు - ప్రజాపతి అనెడి దేవతలు
ఉద్భవించిరి - ఆపైనంతట
రాజసాహంకారము వల్లను
శ్రవణేంద్రియమును ఆపైన మరి

వాయుదైవత త్వగింద్రియమ్ము
సూర్య దైవత నయనేంద్రియమ్ము
వరుణదైవతము రసనేంద్రియమ్ము
అశ్వినిదైవత ఘ్రాణేంద్రియమ్ము

వహ్నిదైవతము వాగింద్రియమ్ము
ఇంద్రదైవతము హస్తేంద్రియమ్ము
ఉపేంద్రదైవత పాదేంద్రియమ్ము
సూర్యదైవత అసనేంద్రియమ్మును

అనెడి ఇంద్రియము లుద్భవించెను
అంతఃకరణలొ తెలివి కలిగించు
బుద్ధియు క్రియా జనితమ్మగు
అంతః కరణ రూపమగు ప్రాణము కలిగెను

ఇంద్రియమ్ములుమనోగుణములు
విడిగా బ్రహ్మాండము నిర్మించగ చాలవు
అందుల కన్నీ కలిసి ఒకటిగా
చేతనాచేతన రూపము ఐన

బ్రహ్మాండము సృష్టించగగలిగినవి
అట్టి బ్రహ్మాండము వేలఏండ్లట
జలములో మునిగి వుండి పోయెను
అంతట ఈశ్వర దేవుడు తాను

జీవరూపమున జలమధ్యమున
బ్రహ్మాండములో ప్రవేశించెను
విస్తరింపజేసె బ్రహ్మాండము
అంతట పగిలెను - హరి బయిటపడె

ఆ అండమునకు పదునాల్గు రంధ్రములు
గావించి ఈశ్వరుడు పగులగొట్టెను
అనేక పదములు చేతులు కన్నులు
కర్ణములున్న్ని కలవా స్వామికి

అన్నిదేహుల దేహమ్ములను
ఆశ్రయించి - తానుండునీశ్వరుడు
ఊహతొ కవులు ఈశ్వరరూపము
అనేక విధముల వర్ణించెదరు

ఆ దేవదేవుడు ఆగమ నుతుడు
యోగులందరికి ఆరాధ్యదైవము
స్థావరజంగమ గ్రహ నక్షత్రములు
లోకము లాయన - అంగములగును

వినుము నారదా! నీకూ నాకూ ఫాలాక్షునకు
సనక సనందన ముని పుంగవులకు
సత్త్వబుద్ధి తత్త్వమ్ములన్నిటికిన్నీ
ఆధారము ఆ పరమాత్ముడగు

సర్వవిషయముల నాయకుడా హరి!
సురాసురులును దేవగంధర్వులు
పశుపక్ష్యాదులు నదులు మృగములు
గిరులు సంద్రములు లతా తరువులు

నేను - శివుడు - నీవు - భూమియు
ఆకాశమ్ము జలచరమ్ములు
అన్నీనిండిన విశ్వమంతయు
విష్ణుమయము మరి సందియమేల

కుమారా! విను ఈబ్రహ్మాండము
ఈశ్వరునందు లీనమైనది
సామాన్యబుద్ధికి అందనితత్త్వము
సర్వలోకములు ఈశ్వరాధీనము

సూర్యుని మాదిరి ఈశ్వరదేవుడు
బ్రహాండములో నెలకొని యుండి
లోపలవెలుపల వెలుగు నొసగును
వివరముగా మరి నీకు తెలిసెనా!

ఆపరమాత్ముని నాభికమలమున
జన్మించితిని అంతట నాకు
యజ్ఞముచేయగ కోరిక కలిగెను
ఈశ్వరుదయతో చేయగలిగితి

నాసోదరులు నవబ్రహ్మలు
అవ్యక్త పురుషుడు పరంధాముని
సంకల్పించి ఆయన చలవతొ
యజ్ఞమ్ములు చేసి కృపనుపొందిరి

అంతటనేను విరాడ్రూపుని
అనుగ్రహముతో సృష్టిచేసితి
పోషకుడాయన ఆయన మదిని
తెలిసిన హరుడు - లయకారకుడయె

కావున సృష్టి స్థితి లయములన్నిటికి
మూలము శ్రీహరి - తెలుసుకోవయా!
నేనాస్వామికి అంకితమైతిని
వేదమయుడను అయితినందులకు

ఆయన తనయుడనైనా నేను
నాజన్మ ప్రకారము తెలియగనైతిని
ఆయన తత్త్వము తెలియగ తరమా!
తెలిసిన కొంత తెలిపెద నీకు

॥శ్రీ కృష్ణచరితము॥



# 4 శ్రీమన్నారాయణుని లీలావతారములు

హిరణ్యాక్షుడు చాపచుట్టలా
భూమినిచుట్టి జలధిని ముంచగ
శ్రీహరి - యజ్ఞవరాహమూర్తిగ
అసురునిజంపి - కాచె పుడమిని

ప్రజాపతికి మరి స్వాయంభువమనువు
కూతురైన - ఆకూతి యందున
సుయజ్ఞుడను పేరున పుట్టెను
ఆతడు-దక్షిణ యందున-సురలనుగనె

ఆపై ఆతడు ఇంద్రుని గానై
లోకుల పీడలు హరించినాడు -
ఈచరిత్రను తెలిసిన యట్టి
మాతా మహుడు స్వాయంభువుడు-తా

హరి - యని పలికెను-ఆవిధముగను
శ్రీమన్నారాయణమూర్తి వారికి
యజ్ఞమూర్తియగు హరిగా వెలిసెను
ఆపైవచ్చెను - కపిలావతారము

కర్దమ ప్రజాపతికి - దేవహూతికి
జన్మించెను హరి - కపిలునిరూపున
సాంఖ్యయోగము తల్లికిచెప్పెను
మోక్షమార్గము చూపెను తల్లికి.

అత్రి మహాముని తపోఫలముగ
విష్ణువు తాను సాక్షాత్కరించి
నీకు దత్తుడను ఐతిని అనెను
అదియే దత్తావతారమైనది

హైహయ - యదువంశీకులందరు
దత్తభక్తులై ఇహపరములందిరి
ఆపై సనకాద్యవతారమ్ముల వివరము
కల్పాంతములో లోకసృష్టికై

శ్రీహరి గూర్చి తపము చేసితి
అప్పుడు నాల్గుతడవలు ఇమ్ము-ఇమ్మన
సనందన-సనక-సనత్కుమార మరి
సనత్సుజాతులు ఉద్భవించిరి

ఆత్మతత్త్వమును ఉద్ధరించిరి
జగత్ సృష్టికి దోహదపడిరి
ఒకడే విష్ణువు గలడు వారిలో
విష్ణుకళలతో నలుగురాయిరి

ధర్మునికిల్లాలు - దక్షునితనయ
వారికి పుట్టిరి నరనారాయణులు
విష్ణువు అవతారమ్ములు వారు
జగత్వంద్యులు - కళ్యాణమూర్తులు

లోకహితముకై నరనారాయణులు
బదరికాశ్రమమందున భక్తిగ
తపస్సు చేయగ ఇంద్రుడు భయపడి
అప్సరసలను పంపె-తపోభంగముకు

ఆటలపాటల - ముగ్ధమోహినులు
ముందరవున్నను చలించలేదు
వారికంతట బుద్ధిచెప్పగా
నారాయణుడు వారిముందరే

తన తొడ చీల్చగ ఆశ్చర్యముగా
దివ్యసుందరులు ఉద్భవించిరి
ముందుగ వచ్చిన సుందరి-ఊర్వశి
వారిని గాంచిరి - వారి అందముకు

ఇంద్రుని సుందరులందరు లొంగిరి
సిగ్గుతొ తలను వంచుకు నంత
ఆమెను నాయకిగా - నెంచుకొని
ఇంద్రలోకమున కరిగిరందరు

కాముని గెలువగ నిటలాక్షుండు
కోపమ్మును మరి ప్రయోగించెను
కానీ యిచట నరనారాయణులు
కరుణతొ - జాలితొ కాముని గెలచిరి

శివునికన్నను మిన్నగ వారు
శాంతమునిండిరి - గెలుపునందిరి
అందగత్తెల అందమ్మునకు
అందము తోనే జవాబు నిచ్చిరి

ఆపై ధ్రువుడు హరి అవతారము
ఉత్తానపాదుడు మేటి ఏలిక
అతనికి సునీతి-సురుచి యిద్దరు భార్యలు
సునీతియందు ధ్రువుడుపుట్టెను

తండ్రితొడను తన అధిష్టించగ
పినతల్లి సురుచి-తా-సహించలేక
పోటుమాటల కించపరచగా
అవమానముగా తలంచి-ధ్రువుడు

కారడవులలో తపస్సు చేసి
తపోఫలముగా హరిని దర్శించి
సశరీరుడయి నింగిని సాగి
సప్తర్షి మండలము దాటి అంతట

ఉన్నతమైన ధ్రువ మండలమున
స్థిరుడైనిలచెను విష్ణుభక్తుడై
శ్రీహరి సముడని సప్తఋషులు మరి
ప్రశంసింతురు ధ్రువుని - ఘనముగా

మరియొక అవతారమ్మది–పృథువు –
వేనుడు అనెడి రాజు – క్రూరుడై
బ్రాహ్మణశాపమునంది నశించెను
అతనితనయుడుగా జన్మించి

తనజనకుని పున్నామనరకము
జేరకుండ మరి ఉద్ధరించెను
సమస్తభూమిని ప్రజలు మెచ్చగా
పరిపాలించిన చక్రవర్తి పృథువు

భూమిని గోవుగ జేసి అంతట
సమస్త వస్తువులన్నీ పిదికి
వసుధకు–పృథివి అనెడిపేరును
కలిగించి–ప్రసిద్ధిని పొందెను పృథువు

మాగ్నీధ్రుని తనయుడు నాభి
నాభి మేరుదేవుల తనయుడు ఋషభుడు
శ్రీహరి ఋషభునిగా జన్మించి
యోగముతో అవధూత అయెను

తిరిగి పలికెను బ్రహ్మ–తనయునితొ
నా ముఖమునుండి మరి హరి జన్మించి
హయగ్రీవునిగ పేరుగాంచెను
పసిమివన్నెల ఛాయతొ వెలిగెను

హయగ్రీవుని ఊర్పులనుండి
ఆగమాలవి ఉద్భవించినవి
హయగ్రీవుడు వేదమయుండు
నారాయణాంశ గల యజ్ఞపురుషుడు

యుగాంతమందు జలధులేకమై
జలప్రళయమది సంభవించగా
వైవస్వత మనువంతట నీటిలొ –
పడవ ఒకటి అట వచ్చినంతనే

అధిరోహించి సాగుచుండగా
పడవమునిగెడి దుస్థితిలోన
సంభ్రమంతటి ఘనశరీరమున
మత్స్యరూపుడై హరి ఉదయించెను

పడవమునగక – మత్స్యావతారుడు
కాపాడగను – వేదములవ్వి
నాముఖమున మరి ఉద్భవించగా
వాటిని – తాను రక్షించి అంతట

ఆవేదములను శాఖలు చేసెను
ఆనాడా హరి – అటుల రానిచో
మనువు – నేను – వేదములవ్వీ
జలధిలోన మరి మునిగియుందుము

అమృతమ్ముకై దేవదానవులు
క్షీరపయోధిని తరచుచుండగా
మందరగిరిని వీపున మోసిన
ఆదికూర్మమే – శ్రీహరి వింటివ!

చాకచక్యముగ అమృతమ్మును
దివ్య మోహినిగ అవతరించి మరి
సురలకు పంచిన పరంధాముడు
లీలామానుష విగ్రహుడా హరి

# ద్వితీయస్కంధము

బలగర్వమున సురలను బాధించ
హిరణ్యకశిపుని మరి ఉపేక్షించక
దంష్ట్రాకరాళ భీకరమూర్తిగ
నరసింహునిగా అవతరించెను

అవలీలగను అంతటి వీరుని
చీల్చివేసి మరి పుడమినిగాచెను
అంతట లోకములన్నీ తిరిగి
కళకాంతులతో వెలగసాగెను

మకరిబారి పడు గజరాజును మరి
పరుగునవచ్చి రక్షించెను హరి
కరి వరదునిగా - పేరుగడించెను
భక్తవత్సలుడు అని స్థిరపడెను

అదితి కశ్యపుల ఆఖరి సంతతి
వామనుడై మరి - హరి పుట్టి తను
మూడడుగులుగా నేలను అడిగి
బలిభూవిభుని త్రొక్కివేసెను

యజ్ఞయాగముల నిర్వర్తించెడి
బలిని గెలువగ వుచితరీతిని
వటువుగ వచ్చి-యాచన నెపమున
పాతాళమునకు త్రొక్కి అంతట

అచ్చుట - బలిని రాజుగ జేసి
ఆయన - రక్షణ భారము గ్రహించిన
అమోఘమైన అవతారమ్మది
మనసులు దోచే - వామన రూపము

నీభక్తికి మెచ్చి హంసరూపియై
తన తత్త్వమును - ఆపైనంత
భాగవత పురాణమ్మును చెప్పెను
సర్వముతానని తెలిపెను శ్రీహరి

మన్వవతారము ధరించి శ్రీహరి
తేజమునిండి - దుష్టుల వధించి
శిష్టుల కాచిన ఆ హరి నామము
కీర్తి చంద్రికలు - నిండె జగముల

ధన్వంతరిగా అవతరించెను
సర్వరోగముల హరింపజేసెడి
ఆయుర్వేదము ననుగ్రహించి
అవని జనులకు క్లేశము తీర్చెను

జమదగ్ని తనయునిగ అవతరించెను
ఇరువది ఒక్క తడవలు వరుసగ
దుష్ట భూపతుల శిరములునరికి
భూమిని గెలచి - దానము నిచ్చెను

తనయా వినుము! అవతారముల
రామావతారము దివ్యలీలలతొ
నిండియున్నది మరపురానిది
వివరించెదను ఆలకించుము

లక్ష్మీపతి - తా - శ్రీరామునిగా
అవతరించెను - రావణుత్రుంచగ
సూర్యవంశ పావనునిగను
అవతరించెను అయోధ్యలోన

దశరథ విభుని పుత్రకామేష్టిలో
అనుగ్రహించి పాయసమొసగి
నాల్గు అంశలతొ నేలకు దిగెను
కౌసల్యా ఆనంద వర్ధనుడు

లక్ష్మణ - భరత - శతృఘ్నులుగా
తన అంశలవి శేషుడు, శంఖ చక్రమ్ములను
తనతో పుట్టగ - ఆదేశించి
ఉద్భవించెను పుణ్య ఘడియలో

హరు విలువిరచి పేరోలగమున -
వీర్యశుల్కయగు సీతను గ్రహించి
పరిణయమాడి జగత్తునకు మరి
కల్యాణ శోభను కలిగించాడు

జనని కైక మరి కోరిన కోర్కెల
వనవాసమునకు బయిలు దేరెను
రాజ్యమకుటము వలదని చెప్పి
కానకు కదిలిన - ధీరసత్తముడు

దండకాటవిని సతి సోదరులతొ
వనవాసమ్మును చేయుచుండగా
మునులను బాధలు పెట్టెడి అసురుల
ఖరదూషణులను దుర్మార్గులను

అంతము చేసెదనని అట మునులకు
అభయమునిచ్చి రామచంద్రుడు
శూర్పణఖ శిషంబున జనస్థానమున
అసురుల జంపి శాంతినొసంగెను

విషయము తెలిసి రావణాసురుడు
ఆగ్రహించెను బయలుదేరెను
మారీచుని మరి సాయమిడమన
రామ భయము - మారీచుడు చెప్పగ

వినక - ఆతనిని భయపెట్టి మరి
బంగరు లేడిగ మారి అచ్చట
ఆశ్రమతావుల విహరించి అంతట
సీత మనస్సును హరించగోరెను

మారీచు డటుల సాయపడగను
బంగరు లేడిని గాంచిన సీత
మక్కువజూపి తెమ్మని కోరగ
బయిలుదేరెను రామచంద్రుడు

అంతట రాముని శరఘాతమునకు
చచ్చెడి లేడి - సీతా - లక్ష్మణా
అని అరవగను భయపడి సీత
లక్ష్మణునంపెను అన్న సాయముకు

అదే అదనని దశకంధరుడు
అపహరించెను రామపత్నిని
త్రోవలొ జటాయువడ్డు పడగను
అంతముజేసి హరించె నసురుడు

అన్నదమ్ములు ఆశ్రమమ్ములో
సీతను వెదకి దిగులతొనంత
ఘోరాటవిలో వెదుకగ సాగిరి
జటాయువువలన విషయము వినిరి

అటులా సోదరులిద్దరు వెదకుచు
ఋష్యమూకమున సుగ్రీవునితో
చెలిమి చేసిరి–హనుమ సాయమున
వాలిని చంపెను - రామచంద్రుడు

సుగ్రీవుని కపిరాజుగ జేసెను
సీతాన్వేషణ కంపెను రాజు
దక్షిణదిశలో సంద్రము దాటి
అమ్మను గాంచెను ఆంజనేయుడు

అంతట వారు లంక జేరగా
కపులందరితో బయిలుదేరిరి
దారినిమ్మని జలధిని కోరగ
పలుకలేదని రామచంద్రుడు

ఆగ్రహమ్ముతో శరము తీయగా
గడగడవణకిన సముద్రుడంతట
సేతువు కట్టగ మార్గము జెప్పి
నిలచె వినయముగ రామసేవలో -

నలుడు నిలవగా కపియోధులట
జలధిగుండెపై సేతువు కట్టిరి
సంద్రముదాటి రామలక్ష్మణులు
లంకలొ సమరము ఆరంభించిరి

రామరావణ ఘోరయుద్ధమున
దేవవిరోధి - అబలహర్తయగు
రావణాసురుని రాముడు కూల్చి
సీతను చేకొని అయోధ్యకేగెను

అయోధ్యలోన అతి విభవముతో
పట్టాభిషిక్తుడు అయ్యెను రఘుపతి
రామరాజ్యము సుఖశాంతులకు -
భోగభాగ్యముల నెలవై నిలచెను

ఈతి బాధలు ఎరుగరు ప్రజలు
ఇహపరసాధక మంత్రముగా మరి
రామనామము వెలసియున్నది
నాకును - ఎంతో విభూతి కలిగెను

సాంబశివుడు–తా–అంబకు స్వయముగ
తారక మంత్రము నుపదేశించెను
మునులు - యోగులు రాముని కృపకు
నిరంతరమ్ము తపించుచుందురు

చిరునవ్వులతో శుభకరుడైన
రాముని సుందర రూపమమోఘము
పుంసాంమోహన రూపుడాయన
ధర్మస్వరూపము రామచంద్రుడు

శత్రువుకైనా శరణనగానే
అభయమునిచ్చిన అభయ ప్రదాత
దయాభిరాముడు దానశోభితుడు
ధర్మావతారుడు సత్యవిక్రముడు.

ఆపై అవతారమ్ము వినుమయా!
రామకృష్ణులుగ హరి జన్మించి
ధరణి భారము తీర్చెను లీలగ
ధర్మమునిలపగ అవతరించిరి

వసుదేవుని భార్య రోహిణియందు
బలరామునిగా శ్రీహరి పుట్టెను
దేవకి గర్భమునందు కృష్ణునిగ
అవతరించెను పరంధాముడు

సితకేశుడు ఆ బలరాముడయా
కృష్ణకేశుడు కృష్ణుడు – వింటివ!
దుష్ట రాజులను దునుమాడుటకై
తెలుపు నలుపుగల వర్ణములవ్వి

రెండురంగులే – ధరను కాచునను
అవతారతత్త్వము ఆత్మతత్త్వము
తెలుపురీతిగా రెండు వర్ణముల
వర్ణధారులు ఆయిరాయిద్దరు

కృష్ణావతారమునందున శ్రీహరి
అద్భుతమ్ములను ఎన్నోచేసెను
లీలామానుష విగ్రహుడాయన
ఆత్మద్రష్టలకు పరమేశ్వరుడు

కంసుడు – దేవకికన్నగారగు
చెల్లెలి అష్టమగర్భము తనను
చంపును అని ఆకాశవాణి చెప్పగా
బావను – చెల్లిని బంధించాడు

ఎన్నో బాధలు పెట్టెను వారిని
కానీ కృష్ణుడు దేవకి దేవికి
అష్టమగర్భముగా జన్మించి
లీలతొ అన్నీ నిర్ణయించుకొని

వ్రేపల్లెయందున యశోదమ్మకు
తనయుడుగాను పెరిగెను చక్కగ
కనబడినట్టి అష్టమగర్భము
ఆడుబిడ్డగా తలంచి కంసుడు

చంపగనెంచగ – యోగమాయతను
కంసుని కందక నింగికి ఎగిరి
నిన్నుచంపెడివాడు చల్లగా
పెరుగుచుండెను అనుచు చెప్పెను

అంతట కంసుడు క్రోధవశుండయి
పసిపిల్లలను హతమార్చగను
ఆనతిచ్చెను తన సేవకులకు
వారిలొ – పూతన అనునొక రక్కసి

వాడవాడలా తిరుగుచు తిరుగుచు
వ్రేపల్లెకు మరి వచ్చి అచ్చట
విషయము తెలిసి కామరూపిగా
సుందరాంగిగా రూపముదాల్చి

పసి వానిని – తా – ఎత్తుకున్నటు
లాలించినటు నాటకమాడి
విష స్తన్యమును ఈయనెంచగా
బాలకృష్ణుడు తెలియనట్టుగా

స్తన్యము త్రాగుచు – పీల్చె నసువులు
అంతటరక్కసి విగత జీవియై
నేలను బడెను అచ్చెరువాయెను
కంసుని క్రోధము పెరిగిపోయెను

ఎందరెందరో రాక్షసులను అట
బాలకృష్ణుని మట్టుపెట్టగా
వినియోగించెను వారందరును
కిమ్మనకుండా చచ్చి పోయిరి

శకటాసురుడు - బకాసురుడు
అఘాసురుడు తృణావర్తులను
అవలీలగను చంపెను కృష్ణుడు
భూభారము తగ్గించి వేసెను

అల్లరి భరించ లేనిక అనుచు
గొల్లవనితలు గోలపెట్టగా -
తల్లి - బాలుని - రోటికి కట్టి
ఆగడాలను ఆపుము అనెను

ఆపరమాత్మ - భక్తబంధువు
మద్దిచెట్లుగా శాపగ్రస్థులగు
గంధర్వులకు శాపముతీర్చగ
జంట మద్దుల - సందునుండి మరి

రోలును లాగి - తరువుల గూల్చెను
శాపముతొలగిన గంధర్వులట
బాలకృష్ణుని స్తుతించిరి భక్తిగ
సాగిపోయిరి - వారి లోకముకు

మన్నుతినెను మన కృష్ణుడనుచును
గోపబాలురు తల్లికి - చెప్పగ
దండించెదనని తల్లిరాగను:
వారిమాటలు నమ్మవద్దని

కల్లమాటలు చెప్పిరి వారు
ననుకొట్టించగ యత్నము అనగా -
బాలుని - తల్లి మురిపెముచేయగ
నోరువాసన చూడుము అనుచు

నోరుతెరవగా బ్రహ్మాండమును
చిన్నినోటిలో గాంచె యశోద
భక్తి ప్రపత్తుల నిండిపోయినది
కలయా - మాయా - అనితలంచినది

కాళీయుడను కౄరసర్పము
యమునా జలముల వసించియుండి
విషజ్వాలలతో ప్రాణులన్నిటిని
బాధించగను కృష్ణుడు తెలిసి

మర్దనమగును గుణవర్ధనమని
ఆఫణిరాజును మర్దించి వానిని
మడుగునుండి మరి వెడలగొట్టెను
దివ్య జలములుగ మార్చెను వాటిని

మరియొక సారి గోపాలురందరు
అడవిలొ నుండగ రాత్రి యందున
కార్చిచ్చు అది ఎగసి అడవిని
కాల్చసాగెను ఆక్రందించిరి

భక్తవశంకరుడా పరమాత్మ
వారందరికి ధైర్యము గొలిపి
కండ్లుమూసుకొన మని చెప్పి అంతట
వెన్నముద్దలా మింగె నగ్నిని

ఒకదినమున మరి నందుడంతట
స్నానము చేయగ నదికివెళ్ళగా
వరుణుని బంటు-మాయతొ నంత
అపహరించెను-అది విని కృష్ణుడు

సకలచరాజగత్తంతయును
కొండమీద మరి విరిగిపడినను
కేలల్లాడదు అని ధైర్యముగా
పలికి నిలచెను - పరంధాముడు

వరుణలోకమున అడుగుబెట్టగా
గడగడవణకి వరుణుడంతట
దాసుని తప్పు క్షమించమనుచు
పదముల వ్రాలి-తండ్రినొసంగెను

కన్నులుతెరచిన సురనాయకుడు
బృందావనమున బాలకృష్ణుని
పాదమంజరుల మోకరిల్లెను
మకుటకాంతితో అభిషేకించెను

హయసూనుడు అను రక్కసుడొకడు
గోప బాలురను కొండబిలములో
బంధించగను కృష్ణుడంతట
అసురునిజంపి బాలురు తెచ్చెను

శరదృతువులో వెన్నెల రాత్రిలొ
బృందావన మది - మది విరబూసి
ఆనందముగా నవ్వుచుండగా
యమునానదియది సొగసుగ సాగుచు

గర్వమదాంధుడు ఇంద్రుని కంత
గర్వము దించగ యోచన చేసి
ఇంద్రయాగమును వలదనిచెప్పి
కొండకు యాగము చేయించగను

తరంగ ధ్వనులతొ పులకరింతతో
ప్రకృతికాంత కన్నులు విప్పుకు
నందనందనుని రాకకు నిలచెను
మందమారుతము ఎదురు చూచెను

ఆగ్రహించిన నాకలోకపతి
రాళ్ళవానను కురిపించగను
లీలగ - కృష్ణుడు గిరిని ఎత్తెను
గోవుల - గోపాలకులను గాచెను

ఆసమయములో ఆనందముతో
నందనందనుడు వేణువునూదగ
తరువులపూలు జలజల రాలెను
పులుగులు నిలబడి వినసాగినవి

గోవులన్నిటిని కాపాడెను గిరి
గోవర్ధనమని పేరున బరగెను
ఏడు రాత్రుల రాళ్ళవానకు
కొండగొడుగది చెదరకనిలచెను

సన్నగసాగి వేణునాదము
గోపికలను మరి కదిలించగను
పరుగునవచ్చిరి స్వామి సన్నిధికి
కిసలయించినవి ఎండిన మ్రోడులు

కృష్ణగీతిక – వంశీపలుకగ
ప్రకృతి అంతయు మైమరచి మరి
పరబ్రహ్మయగు కృష్ణుని పాటకు
హృదయతంత్రిని మ్రోగించినది

స్వరాలపొత్తు గతులసొంపులు
గమకమ్ముల ఛణుకులు మైమరపించగ
బ్రహ్మగీతమది – విశ్వగీతము
జీవకోటిని అలరించినది

గోపికలందరు కృష్ణుని గాంచి
పరవశమ్ముతో పరుగున వచ్చిరి
అటులా స్వామి వారందరితో
నాట్యమాడెను – రాసలీల యది

శంఖచూడుడను గంధర్వుండు
మైమరచిన ఆ గోపసుందరుల
అవహరించెను అదృశ్యముగా
గ్రహించి కృష్ణుడు వారిని గాచెను

ప్రతితనువూ – అది కృష్ణుని కర్పణ
అన్నటు గోపికలుండిరి అచట
భక్తి పండిన మనసులు వారివి
పరంధామునితొ కలిసిన మనుగడ

ఆవిధముగను ప్రేపల్లెతొ మరి
కృష్ణుని బాల్యము ముడిపడియున్నది
అప్పటి లీలలు చెప్పగ తరమా!
అందినంతనే చెప్పితినీకు

ధనుర్యాగము నెపముగ పెట్టుకు
రామకృష్ణులను మట్టుపెట్టుగా
కంసుడు – వారిని రప్పించగను
రామకృష్ణులు మధురకువచ్చిరి

చాణూరముష్టికుల కంసమామను
నరకాది రాక్షసుల శిశుపాలదంతవక్త్రుల
బంధు విరోధుల నంతముజేసి
కృష్ణుడు పరిణయమాడె రుక్మిణిని

మహాలక్ష్మికి ప్రతిరూపమగు
రుక్మిణియందు పూవిలుకాడగు
మన్మథుడంతట తిరిగి పుట్టెను
ప్రద్యుమ్నుడను పేరున బరగెను

కురుపాండవులు రాజ్యభాగముల
తగవులాడుకొని సమరము కాగా
శ్రీకృష్ణుడు తను – పార్థసారథిగ
రాజసంహారము చేయించె రణమున

భూభారమును దింపగకోరి
భారత యుద్ధనెపమున కృష్ణుడు
సూత్రధారునిగ నాటకమ్మును
ఆడించెను అతి చాకచక్యముగ

వచ్చిన పనియది పూర్తిచేసుకొని
భూమిభారము తక్కువజేసి
తిరిగినెలవుకు సాగెను కృష్ణుడు
ఆత్మ విద్యను చెప్పె – పార్థునకు

అంతా తానై - దేనికి అందక
చక్రముత్రిప్పిన చక్రధారియగు
కృష్ణ ప్రభువుకు నావందనము
రామకృష్ణులకు ప్రణామమ్ములు

తదుపరి అవతారమ్ము చెప్పెద
పరాశర ముని పుంగవునికి
కృష్ణద్వైపాయనునిగ పుట్టెను
వేదమ్ములను విభజనచేసెను

కలియుగమ్మున దుష్టబుద్ధులై
ధర్మదూరులై అల్పాయుష్కులగు
జనులకు - మార్గము చూపగనంత
ఆగమాలను విభజన చేసెను

వేదవ్యాసునిగ కీర్తినందెను
పురాణమ్ములను ఎరుక పరచెను
తనసంకల్పమున వేదమ్ములవి
పుట్టెను గనుక - హరి విభజించెను

నాస్తికవాదులు అసత్యవంతులు
భోగలాలసులు ఆచారహీనులుగ
లోకమ్మునకు కీడుచేయగా
నిలచిన దైత్యుల నంతము జేయగ

నారాయణుడు అవతరించి - తా -
ధర్మరక్షణకు బుద్ధునిపేరున
ప్రసిద్ధికెక్కును పుడమికి ముదముగ
పరంధాముని అవతారములవి -

కులాచారముల మంటలొగలిపి
జప తపో నియమాలను వదలి
యజ్ఞయాగముల నాచరించక
పాషండులుగా మారిపోదురు

వర్ణసంకరము జరిగిపోవును
విప్రులు సత్యదూరులగుదురు
హీనకులములో ఉద్భవించి మరి
రాజ్యపాలనము చేసెడి వారు

పెరిగిపోయిన - తరుణములోన
విష్ణువుతిరిగి - ఉద్భవించును
కల్క్యవతారముగా పిలవబడు
అటులచెప్పిన - బ్రహ్మపలికెను

కుమారావిను! నారాయణుడు
అవతారముల ధ్యేయము - పూర్తవ
మన్వంతరములు ఎన్నో జరిగెను
ఇంకా కొన్ని జరగనున్నవి

సృష్టికి ముందు - తపము సృజించి
వెంటనె నన్ను - ఋషులను అపై
తొమ్మిది మంది ప్రజాపతులను
సృష్టించి మాచే సృష్టి చేయించును

ధర్మము-విష్ణువు-యజ్ఞము-మనువులు
ఇంద్రాది దేవతలు ప్రజాహితముగా
పరిపాలించే రాజులు తానై
లోకరక్షణము చేయును శ్రీహరి

అధర్మము-రుద్రుడు-పెనుసర్పములు
అసురులు తానై - లయముజేయును
సృష్టి - స్థితి - లయ కారకుడా హరి
ఆయన క్రియలను లెక్కిడలేము

వామనావతారమునందున శ్రీహరి
త్రివిక్రమునిగా అవతరించగా
ఆయన పాదము అతివేగముగా
ఊర్ధ్వలోకముల నాక్రమించగా

ఆలోకమ్ములు చితికిపోగను
ఆపైనున్న సత్యలోకమది
తలక్రిందులగు స్థితిఏర్పడెను
అదిగమనించి శ్రీహరి తాను

పాదమునందలి బొటన వ్రేలితో
సత్యలోకమును తిన్నగ నిలిపెను
అట్టి మహానుభావుడు శ్రీహరి
ఎటుల నేను వర్ణించెద తనయా!

వేయితలలుగల ఆదిశేషుడే
ఆయన లీలలు వర్ణింపగ జాలడు
సనకసనందన మునులు కూడను
ఆలీలలు వర్ణింపగలేరు

ఇతర దేవతల - ఇతర కాంక్షల
మనస్సునిలపక దృఢచిత్తముతో
హరిని కొలచిన కృపాసముద్రుడు
అనుగ్రహించగ - మాయను గెలతురు

సృష్టికర్తనను రజోగుణమది
నాలోపెరిగిన - కనబడదా హరి
ఆయన పాదములవి శరణాగతి -
అని తలంచిన - దరికి చేర్చును

విష్ణుమాయను దాటెడివారు
నీవును సనకసనందనులున్నా
జ్ఞానశీలుడు రుద్ర ప్రహ్లాదులు
స్వాయంభువ మనువు శతరూపలును

వారి తనయుడు ప్రియవ్రతుండు
ఉత్తానపాదుడు ప్రాచీనబర్హి
ఋషియగు ఋభువు అటుపిమ్మటను
వేనుని తండ్రి అంగుడు-ధ్రువుడును

విష్ణుమాయను గెలచి తరింతురు
గాది - ఇక్ష్వాక-ముచికుందులు మరి
జనకుడు-మాంధాత-దిలీపుడు-రఘువు
భీష్ముడు-శుకుడు, యయాతి-రంతిదేవులు

శృతదేవ - సౌభరి - బలి - ఉదంకులు
శతధన్వ - పిప్పల - విభీషణులు
శిబి-పార్థ - విదుర అంబరీష - పరాశ
అలర్క - దేవల - ఆమిధివేశ్వరాదులు

అభిమన్యుండు-లార్ష్ణిషేణులు మరియు
స్త్రీపురుషులు ఏజాతియైనను
నారాయణ భక్తి బలపడిన
మాయాజలధిని దాటగలుగుదురు

కావున నారద! సర్వేశ్వరుడు
శాశ్వతమూర్తి సచ్చిదానందుడు
జ్ఞానరూపుడు విశ్వాత్ముడగు
హరిని మదిలో మరి ప్రతిష్టించుకో!

కుమారావిను! భాగవతమ్ము
కల్పవృక్షముతో సమానమైనది
వేదధర్మముల చెప్పు గ్రంధము
మోక్ష ప్రదాయిని భాగవతమ్ము

శీలసంపన్నులు హరిభక్తి తత్పరులు
పుణ్యాత్ములయి మనుగడ గడపగ
మాయ – వారిదరి చేరదు వినుము
విష్ణుధ్యానము ముఖ్యమైనది

విష్ణువు నాకు చెప్పగ – దానిని
సంక్షిప్తముగా నీకు చెప్పితి
విశ్వమందున విస్తరించెడి
ప్రయత్నమది నువు చేయగవలెను

స్థిరచిత్తముతో విష్ణుభక్తితో
గడిపెడివారు జ్ఞానవంతులై
సుఖదుఃఖములను లెక్కజేయరు
మరణభయము మరి వారికుండదు

మానవజన్మ – సర్వోత్కృష్టము
వ్యర్థముగాకను విష్ణుసేవకై
వినియోగించిన ఫలితము దొరకును
యజ్ఞ యాగముల మించిన ఫలమది

సర్వాంతర్యామి మహావిష్ణువు
జీవకోటి మరినశించినను – తా –
ఆకాశమువలె స్థిరముగ నుండెడి
శాశ్వతమూర్తి అక్షరుడాయన

స్వచ్ఛమనస్సుతో సత్యస్వరూపుని
విష్ణుదేవుని కొలిచిన – ముక్తి
అజ్ఞానము అంటదు కోరికలుండవు
వలయునదిచ్చును పద్మనయనుడు

అని వాణీపతి – తన తనయుండైన
నారదునికి మరి తెలియజెప్పెనని
శుకుడు జెప్పెను పరీక్షిత్తునకు
వినిన రాజు – తా – నడిగెను శుకుని.



॥శ్రీ కృష్ణచరితము॥

## 5 పరీక్షిత్తు ప్రపంచోత్పత్తి మొదలైనవాటిని గూర్చి శుకయోగినడుగుట

మౌనిచంద్రమా! శ్రీహరి కథలను
వినుటకు మనస్సు తొందర చేసెను
పద్మాక్షుని గాథలు మహిమలు యింకా
ఏమి చెప్పెను–బ్రహ్మ తనయునకు

నీ బోధనలతో హరిగాథలతో
ఈ శరీరము దానిసుఖములు
సిరిసంపదలు అస్థిరమనుచు
జ్ఞానముకలిగెను మనసు స్థిమితపడె

లక్ష్మీపతిని మదిలో నిలపి
నిశ్చల భక్తితొ అర్చించుచును
అస్థిరమైన నీచముఅయిన
ఈ తనువును వదలెద తేలికగాను

భక్తి శ్రద్ధలతొ విష్ణు గుణకీర్తన
వినినవాని మది - ఆసనమ్ముగా
పరంధాముడు వచ్చికూర్చొను
మదిమాలిన్యము క్షాళన చేయును

శ్రీమన్నారాయణుని గాథలు
అవతార కథా విశేషమ్ములను
వినిపించుమయా! మనసు చల్లబడు
దేహతాపములు తొలగిపోవును

ఆత్మ-ఏ ప్రాణికి సంబంధము కాదని
చెప్పితివీవు అట్టి ఆత్మకు
భూత సంబంధము ఎట్లు కలిగెను
కారణమున్నద? లేక కర్మల సంబంధమ?

సృష్టికర్త తన వునికికి నెలవగు
విష్ణు స్వరూపము చూడగలిగెనెటు?
తండ్రీ కొడుకులకు ఏమైనామరి
భేదమున్నదా - భావగతులలో

సృష్టి - స్థితిలయకారణమైన
మాయను విడచి లక్ష్మీకాంతుడు
ఎచ్చటెచ్చట వసించి - శయనించె
లోకపాలురు లోకము లెట్లయె?

మహాకల్పములు - అవాంతరకల్పములు
భూత భవిష్య ద్వర్తమాన కాలములు
దేవతలు - మరి పితృదేవతలు
మనుష్యులు మొదలగువారి ఆయువు

బృహత్సూక్ష్మకాలవర్తన మెంత
ఏఏకర్మలు చేసిన జీవులు
ఏఏ లోకముల వాస మేర్పడును
ఏకర్మలతో సురలయ్యెదరు

కర్మల యొక్క స్వరూప మెట్టిది
ఏఏ రూపము జాతుల కొరకు
ఎట్టి కర్మలు ఆచరించవలె
ఎవరి పరముగా కర్మలు చేయుట

కర్మలను మరి గ్రహించునెవ్వరు
నింగీ నేలా - నదులు ద్వీపములు
గ్రహనక్షత్ర - పర్వతమ్ములవి
ఏవిధముగను ఏర్పడినవవి

ఆయాతావులనుండెడివారు
ఎటుల చేరెదరు స్వర్గాదిస్థానములు
బ్రహ్మాండ ప్రమాణము ఎంత వున్నది
మహాత్ములెవరు - వారి చరిత్రలెట్టివి.

వర్ణాశ్రమ నిర్ణయమ్ములు మరి
వాటితొవచ్చే శ్రీహరి చరిత్రలు
యుగములు - వాటి ప్రమాణమ్ములు
యుగధర్మములు - విశేషధర్మములు

మహత్తు మొదలగు తత్త్వములెన్ని
వాటి లక్షణము - హేతువులేవి
భగవదా రాధన విధాన మెట్టిది?
అష్టాంగ యోగములు అనగానెట్టివి?

అణిమాది సిద్ధుల వివరములేమి?
యోగుల తేజోరూపము-దానివిధానము
లింగ శరీర విధము ఎట్టిది?
వేదమ్ములు మరి ఉపవేద మాయుర్వేదము

ధర్మ శాస్త్రములు - ఇతిహాస పురాణమ్ములు
ఎటుల పుట్టినవి - ప్రళయ మెట్టిది
మహాప్రళయము ఎటుల వచ్చును
ఇష్టాపూర్తములనగా నెట్టివి?

యోగము మొదలగు వేదమార్గముల
కర్మలుచేయు విధాన మెట్టిది
వాపీకూపతటాక - దేవాలయాది
నిర్మాణము అది ఎటుల చేతురు

స్మార్త కర్మల పద్ధతి ఎట్టిది
అన్నదాన మారామప్రతిష్ట
అగ్ని హోత్రపూజలు ఎట్టివి?
పాషండ మత స్వరూపమెట్టిది

ఆపాపపు మతము ఎటుల వచ్చినది
జీవులన్నిటి బంధ మోక్షములు
ఎటుల సంభవము-దేవుని రూపమెట్టిది
ఆ రూప అవస్థా స్థితులు ఎట్టివి?

సర్వస్వతంత్రుడు ఈశ్వరుడంటిరి
అట్టివాడు మరి మాయకు వశుడై
కర్మసాక్షియై తిరిగి మాయను
వదలినవాడై తటస్థుడగుటెటు!

తటస్థుడగుచు సర్వాధికారిగ
ప్రాణులనాడించు సూత్రధారియై
ఎటుల నిలచును వివరించుమయా!
బ్రాహ్మణశాప భయము విడచితి

ఆపదలో మరి పడితి ననుచును
ప్రాణ భయమది - కలిగె ననుచును
తలచకు స్వామీ! మనస్ఫూర్తిగా
వినగా నెంచితి - వంత మరచితి.

విష్ణు కథా సుధను గ్రోలగా
ఉవ్విళ్ళూరుచు నుంటిని స్వామీ!
సుఖదుఃఖములను ద్వంద్వములవ్వి
ఎన్నడో - నను విడచి పోయినవి

కృతార్థునిగ నను చేయుము స్వామీ!
బ్రహ్మవేత్తవు - పుణ్యఫలముగా
లభించినట్టి పెన్నిది వీవు
ముక్తి మార్గము చూపెడి గురువువు

పరీక్షిత్తు - తా - భక్తి ప్రపత్తుల
అడుగగ నంత శుకయోగీంద్రుడు
బ్రహ్మ నారదున కుపదేశించిన
భాగవతమ్మును చెప్పదొడంగెను

భూతహితుడు మరి జ్ఞానస్వరూపుడగు
ప్రాణికి - ఈశ్వరమాయ వల్లను
దేహ సంబంధము కలుగును రాజా!
బాల్యయౌవ్వన కౌమార వార్ధక్యములవి

మాయలో పడగనె వయోవస్థలు
దేహికి కలుగును వాటితొ వెంటనె
నేను-నాది అను అహంకార మమకారమ్ములు
కలుగును-అది - సంసార బంధమగు

ప్రకృతి పురుషుల కతీతమైనది
బ్రహ్మస్వరూపము అచటకు జీవుడు
ధ్యానయోగము తోను - సాధనతొ
చేరగ - నతని అజ్ఞానము నశించు

దానితొ అహంకార మమకారములు
వదలిపోగనే - సంసార బంధమది
అవలీలగను తెగిపోవునయా!
అప్పుడు ముక్తి లభించు జీవికి

ఆ విధముగను స్వరూపమ్మును
తెలిసిన జీవుడు ముక్తుడగుటది -
జీవేశ్వరులకు దేహసంబంధము
వుండకపోదు - కానీ జీవుడు

మాయకులొంగి కర్మ సంబంధపు
అశాశ్వతమ్మగు దేహమ్మును తను
ఆశ్రయించుకొని యుండుట జరుగును
భగవంతుడు తన మాయా కల్పిత

చిద్రూపముతో వెలుగు చుండును
సదాశ్రయుండు జీవుడైనచో
చిదాశ్రయుడు ఈశ్వరుడగును
కావున ముక్తికి - భక్తి సాధనము

బ్రహ్మతపోవృత్తాంతము వలన
సందేహములు తొలగును వినుము
బ్రహ్మదేవుడు తన పుట్టుకకు
నెలవగు పద్మము గాంచినవాడై

ఆపద్మమునకు మొదలు చూడగా
నీళ్ళలో దిగి శోధించి తెలియక
నిరాశతో తను పద్మము పైన
కూర్చొనియుండగ ఆయన మదిలో

లోకసృష్టిని చేయు తలంపు
కలిగినంతనే ఆలోచించెను -
త్రోవతెలియక నిస్పృహచెందెను
తన శక్తిపైన మరి ఆశతగ్గెను

అంతటిలోన జలమునుండి అట
దివ్య శబ్దమొకటుద్భవించినది
మహామునులకు ఆత్మ జ్ఞానముకు
సాధనమైనది అక్షరమ్ములవి

తప - తప - అను శబ్దమ్మదియగు
రెండు మార్లు - అట విన వచ్చినది
ఉత్సాహమ్మది కలిగెను బ్రహ్మకు
వెదకెను-శబ్దము వచ్చిన తావును

తిరిగివచ్చి తన ఆసనమ్మున
కూర్చొనగానే మనసుకు తట్టెను
తప - అనగా మరి తపము చేయమని
ఆజ్ఞాపించిరి ఎవరో తనను

నిర్విఘ్నముగా కొనసాగించెను
అంతటి తీవ్ర తపస్సునెవ్వరు
ఆచరించగ చాలరు అన్నటు
చేసిన తపముకు ఈశ్వరుడగబడె

వెంటనె - బ్రహ్మ ప్రాణాయామ
నియమమ్మును మరి ఆరంభించెను
చిత్తము - ధారణ పరము జేసెను
వేయి దివ్యవత్సరమ్ముల తపము

ప్రసన్నుడైన ఈశ్వరదేవుడు
బ్రహ్మకు జ్ఞానము కలిగించుటకు
తానెవరో మరి బ్రహ్మ తెలియుటకు
దివ్య ధామము చూపెను బ్రహ్మకు.

॥శ్రీ కృష్ణచరితము॥



## 6 వైకుంఠవర్ణన

పరిసరమంతా ధగధగలాడెను
వెలుగులు చిమ్ముట అగపడె బ్రహ్మకు
మెల్లగ కన్నులు విప్పిచూచెను
కన్నుల ముందర దివ్యనగరమది

చక్కని మేడలు బాటలున్నవి
కోటిసూర్యుల వెలుగులు చిమ్మెను
సూర్యచంద్రుల అగ్నితేజమును
మించిన కాంతితొ నున్నది నగరము

త్రిగుణమ్ములకు అతీతమైనది
శుద్ధసత్త్వమది నిండి యున్నది
జరా మృత్యువు - లోభ మోహములు
ఆర్భాటములు లేవు అచ్చట

సౌధములున్న - మంటపాలును
గోపురమ్ములు నవరత్నములతొ
మిరిమిట్లుగొలిపెడి కాంతితొనున్నవి
పసిడి కేతనము లాహ్వానించును

సర్వలోకముల మేరువు అగునది
దివ్య తేజముతొ వెలుగులు చిమ్మె
దేవత లచట - ద్వారపాలకులు
అన్నిపనులవి చేయుట సురలే

చక్కనిచెట్లు ఫలముల విరిసి
తీయతేనియలు అందించుచును
గ్రోలిన వారికి ఆనందమును
సుఖసౌఖ్యములు యిచ్చుచున్నవి

జయజయ ధ్వనులతొ ఆనందముగా
శ్రుతిహితమైన గీతాలాపన
అచటకు చేరినవారు అచ్చటే
శాశ్వతమ్ముగా వుండిపోదురు

విరిసిన కమలములున్న సరస్సుల
రాజహంసలు వయ్యారముగా
రెక్కలు దులుపుకు నిలచియున్నవి
పూతోటలలో విరసిన ఆమని

ఆపురమందు పూతోటలలో
కాపురమున్నశుకపికములవి
ముకుందు మించిన దైవములేదని
మునులకు బోధన చేయుచున్నవి

గోరువంకలు జగత్తంతయు
విష్ణుమయమని చెప్పుచున్నవి
పంచమ స్వరముల పరంధాముని
నామముపాడుచు నుండె కోకిలలు

లక్ష్మీకాంతుని గనుచున్నటుల
ఆడుచున్నవి నెమళ్ళు ముదముగ
తుమ్మెద ఝుంకారమ్ములొ - వేదము
వినబడు చున్నది మంగళ కరముగ

ఎచ్చట గాంచిన విష్ణుతేజము
ఎచ్చటవినినా విష్ణునామము
వైకుంఠమున దివ్య భవనమది
మేఘమ్ములతో నున్న నింగివలె

మంగళ కరముగ నిలచి యున్నది -
ఆ సౌధమున నల్లకలువల
కాంతితొ - దేహము కలిగినవారు
పట్టుబట్టలు ధరించి సొగసుగ

కలువరేకుల కన్నులుకలిగి
నవరత్నహారములు - స్వర్ణహారములు
ధరించినట్టి నిత్యయౌవ్వనులు
నిర్మల చరితులు హరిని తలపించు

సునంద నంద అర్హణు ప్రబలులు
ఇరుపార్శ్వముల నిలబడియుండి
సేవలుచేయగ దివ్యశయ్యపై
దివ్యమూర్తిని గాంచె విరించి

మంగళమూర్తి పొన్పుగ నచట
పాపరేనిని అమర్చుకొనెను
వాహనమ్ముగా పాముల పగతుర
గరుత్మంతుని నియమించుకొనె

జగత్పావని పాపభంగయగు
ఉత్తుంగతరంగ గంగాభవాని
ఆ పుణ్యాత్ముని పాదమంజరుల
ఉద్భవించిన ముద్దుల కొమరిత

సిరులకు నిలయము మంగళకారిణి
రత్నగర్భలో జన్మించి తను
పరంధాముని వక్షసీమలో
వాసము చేయగ వచ్చిన లక్ష్మి

జగముల చీకటి పారద్రోలెడి
పరమేశ్వరుని యింటి దీపములు
సూర్యచంద్రులు కనుదోయిగను
అమర్చుకొనెనా అన్నటులుండి

విశ్వసృష్టికి మూలకారణుడు
బ్రహ్మపుట్టుకకు కారణమైన
దివ్యపద్మమది నాభిని వెలుగగ
మకరకుండల మణి మకుటముతో

మహామునులు మరి నిరంతరమ్ము
అనుగ్రహమ్ముకు వేచియుండి అట
సేవలుచేతురు సర్వనియంతకు
భక్తిని బోధించు పరమగురువగు

యజ్ఞమూర్తియై యజ్ఞకర్తయై
యజ్ఞఫలము మరి యజ్ఞ భోక్తయగు
అనంతమైన శక్తి మంతుడగు
భక్తవరదుడు దర్శనమిడెను

సర్వలోకముల సౌందర్యరమణుల
సౌందర్యమ్మును సొంతము జేసుకు
మృదు కరకమలమ్ములతో రమ–తా–
రమాధవుని పదమంజరులొత్తగ –

అంతటిలోన దృశ్యము మారెను
కనకరత్నమయ సింహాసనమున
జగన్నాయకుడు అక్షరమూర్తి
ఆసీనుడయె మంగళకరముగ

అంతటి మహిమోపేతుని అచట
కన్నుల నిండుగ గాంచెను బ్రహ్మ –
వెంటనె–మారిన దృశ్యము – కనబడె
బంగరు రత్నపు తూగుటుయ్యల

భక్తుల స్తుతులు – ప్రార్థనలన్నీ
ఆలకించుచు దరహాసముతో
కరుణారసము ఒలికే చూపుల
చూచుచుండెను భక్తవరదుడు

అనూహ్యమైన కాంతి పుంజముతొ
కనుపించినదా ఊయల అచట
అందులో ఒక ప్రక్కగ – లక్ష్మి
మంగళగీతిక పాడుచు కూర్చొనె

సర్వలోకముల సౌభాగ్యమది
ముఖ కమలమ్మున వెలుగుచున్నది
పట్టుపంచెయది పసిడి కాంతుల
మెరయుచు మంగళకరముగనున్నది

మంగళకారిణి కొప్పునందలి
పారిజాత సుమ సౌరభాలవి
గండుతుమ్మెదలను పిలిపించి అట
గానసభను మరి నిర్వహించమనె

మకరకుండల మణి కిరీటము
కస్తురి తిలకము వనమాలతొ నట
త్రిభువనమ్ములను పరిపాలించే
ఠీవిగ దర్శనమిడెను బ్రహ్మకు

ఆ ఊయలలో ఊహలనూగుచు
నిజకాంతామణి సేవలు చేయగ
జ్ఞానము కీర్తి బలమైశ్వర్యము
రమాకాంతుని నగవుల వెలిగెను

సింహాసనమునకు ఒకప్రక్కగను
సునందాదులు నిలబడి భక్తితొ
సేవచేయుచు నుండిరి స్వామికి
మరియొక ప్రక్కనాల్గు – శక్తులు

ప్రకృతి-పురుషుడు-మహత్తుమరి
అహంకారము అనెడి శక్తులు
భక్తి ప్రపత్తుల నిలబడి యున్నవి
కర్మేంద్రియములు జ్ఞానేంద్రియములు

పంచ భూతములు మనస్సు మరియు
పంచ తన్మాత్రలు వెలసియున్నవి
కోటి సూర్య ప్రభా భాసమానమై
విరాజిల్లెడి మూర్తిని గాంచెను -

చతుర్ముఖ బ్రహ్మ పులకరించెను
ఆనంద బాష్పములు రాలెను కన్నుల
పరమహంసలకు లభ్యమాయెడి
దివ్య దర్శనము కలిగెననుకొనె

ఆనందమది పొంగి పొరలగా
శిరసులు నాలుగు తగులునట్టుగా
పాదములంటి - ప్రణామ మిడెను
దర్శనమ్ముతో ధన్యుడయ్యెను

పాదములంటిన తనయుని గాంచి
ఆదరించి మరి పలికె ప్రియముగా
కుమారా! విను నా దర్శనమది
కపట వ్రతములకు లభించదయ్యా!

అకుంఠిత దీక్షతొ మహాకాలమ్ము
నీవు చేసిన తపముకు మెచ్చితి
దర్శనమిడితిని - శుభ మగు నీకు
నీకోరికది తెలియపరచుము

నిన్ననుగ్రహించగ - దర్శన మిడితిని
నీ తపోవిధానము నాసంకల్పము
నాస్వరూపమే తపస్సు అగును
తపో తరువుకు - ఫలమును నేను

పెరుగుట నశించుటన్నవి రెండును
జరుగుటన్నది నావలనే విను!
నాపై భక్తికి - తపస్సు మూలము
నీతపస్సది ఫలించె నయ్యా!

నీ దరి - అజ్ఞానమ్ము చేరదు
అనుగ్రహించెద వరము కోరుమన
ఆనందముగా బ్రహ్మపలికెను
“నానమస్సులు - అందుకో యివి.

తపస్సుతో నువు తృప్తినందితివి
ఆనందవార్నిధిని తేలిపోతిని
స్థూల సూక్ష్మమరి నీరూపమది
రెండు విధములుగ వెలసియున్నది

అవ్విగాక మరి అనేకరూపములు
ధరించుచుందువు లోకేశ్వరుడవు
సృష్టి స్థితిలయ కారకుడవు నువు
నీ సంకల్పము అమోఘమైనది

నీలీలలవి తెలియగ తరమా!
దయగొని నాపై అనుగ్రహించి
నీ మహిమను తెలియగ జ్ఞానమొసగుము
అహంకారము కలుగనీయకు.”

ఆనందించిన విష్ణువు పలికెను
"కమలసంభవా! నీకోరికది
ఉదాత్తమైనది క్షేమకరమది
అందుకు ఎంతో సంతోషించితి

శాస్త్రార్థములను స్వయముగ గ్రహించు
శక్తిని - ఆపై చెదరని భక్తిని
ఆత్మ సాక్షాత్కారము పొందుజ్ఞానము
అనుగ్రహించితి నీకు - నాయనా!

నా మహిమలు మరి అవతారములు
నాలీలలు మరి అంతరార్థములు
స్వరూప స్వభావములన్నీ నీకు
తెలియగలవు నా అనుగ్రహమ్మున

సృష్టికి ముందు - వుందు నొక్కడిని
స్థూలసూక్ష్మ రూపమ్ములు - ప్రకృతి
నాఅంశములు వాటియందున
సంకల్పమున నెలకొని యుందును

నన్నుకాదని వుండదేదియును -
జగత్తంతయు నాస్వరూపమే
కల్పాంతమున అన్నీలయమై
నేనొక్కడనే మిగిలియుందును

ఆసమయములో విశాల సృష్టిని
నాయందున నే లీనము చేతును
లేనిది వున్నటు కలిగించుటయే
నాదగు మాయా ప్రభావమగును -

ఉన్నసత్యము తెలియుట జ్ఞానము -
లేనిది వున్నటు కనుపించుటది
వున్నది లేనటు కనుపించుటది
చీకటి విశేషము - అటులేమాయ

అన్ని పదార్థములందున - నేను
సత్త్వాది రూపమున కలిసియుందును
భూత భౌతికమ్ములవి వేరుగనుండవు
కలిసియుండియు-వేరుగనుండును

పంచభూతముల ఏర్పడినట్టివి
వేరుగ నున్నటు కనబడుచున్నను
కలిసియుండును తెలియగవలెను
అటులే నేను - కనబడుచుందును

సర్వకాలముల సర్వప్రాంతముల
తెలియగ దగిన జ్ఞానము నేను
నేనగా మరి - పరబ్రహ్మను
దీనిని నీవు మదిలోనుంచిన

అహంకార మమకారము లంటవు
అనిశము జ్ఞప్తిలొ నుంచుకోవలె."
అనుచు అంతర్ధానమయ్యెను శ్రీహరి
అగపడినట్టి లోకము చెదరెను

బ్రహ్మచేసిన తపో ఫలితమది
అనుచు శుకుడు అట రాజుకు చెప్పి
ఆపై గాథను ఆరంభించెను
ఆనందడోలికల నూగెను బ్రహ్మ

విష్ణుతత్త్వమది విష్ణుముఖతః
తెలుసుకు - బ్రహ్మ పరవశించెను
అంతట బ్రహ్మ - హరి కరుణించగ
జీవసృష్టిని చేయగలిగెను

సృష్టిచేసిన తృప్తినిండెను
బ్రహ్మలోకము క్షేమముకొరకై
తిరిగి బ్రహ్మ తను తపమొనరించెను
అంతటవచ్చెను నారదుడటకు

సనకాదులమించిన భక్తాగ్రగణ్యుడు
నారదుడటకు వచ్చి - తండ్రికి
తృప్తికలుగునటు సేవచేసెను
బ్రహ్మ-తనయునకు ప్రసన్నుడయ్యెను

అంతట నారదుడు తండ్రినిగాంచి
విష్ణుమాయా విశేషమ్ములను
నీవు అడిగినటు - అడిగె భక్తిగా
అంతట బ్రహ్మ మృదువుగచెప్పెను

భాగవతమ్మది మహాభాగ్యమది
దశలక్షణమ్ములు కలిగియున్నది
భగవల్లీలావ తారములున్నవి
అందులకైనది భాగవతమ్మది -

స్వయముగ విష్ణువు బ్రహ్మదేవునికి
దర్శనమిచ్చి చెప్పిన గాథ
పురాణముగను మరి చెప్పబడినను
వేదముతో మరి సమానమైనది

కావున దీనిని చదివిన - వినినా
ముక్తిలభించును నిస్సంశయము
నారదుడంతట భాగవతమ్మును
నా జనకునకు చెప్పెను రాజా!

తపోధనుడగు నాజనకుండు
వ్యాసమహర్షి - ఆనందముగా
నాడువినిన ఈ భాగవతమ్మును
నాకు చెప్పగా - చెప్పుచుంటిని

విరాట్ పురుషుని వలనను ఎటుల
లోకమ్ములవి పుట్టెననుచును
ఎన్నో ప్రశ్నలు అడిగితివీవు
సమాధానమీ భాగవతమ్మగు

ప్రాచీనమైన మహాపురాణము
నీకు చెప్పెద - నాలకించుము
పదిలక్షణమ్ములు కలిగియున్నది
దానిని నీకు వివరించెదను

మహత్తహంకార పంచభూతములు మాత్రలు
శబ్దస్పర్శ రూప రస గంధములు
ఇంద్రియమ్ములు - ఆధారముగా
జరుగు సృష్టియది - సర్గము అగును

విరాట్ పురుషుని వలన బ్రహ్మ తను
జన్మించిన స్థానము - ఆపై బ్రహ్మ
జంగమాత్మక సృష్టిని చేయుట
విసర్గముగా చెప్పబడినది

దుష్టరాజులను సంహరించి మరి
లోకములో ధర్మమ్ము నిలపుటది
విజయస్థానము - భక్త రక్షణకు
చేసెడి క్రియలు - పోషణ అగును

కర్మవాసనలు - 'ఊతుల' నబడును
నారాయణుని కరుణవల్లన
లోకపాలకుల క్రియలు వర్ణనలు
'మన్వంతరములు'-అనుచు చెప్పబడు

భువనపాలకుని అవతార చరిత్రను
వివరించుటది "ఈశాను చరితము" -
తపోశక్తులను గ్రహించి - తాను
శేషపాన్పుపై యోగ నిద్రలో

పరంధాముడు పడుకొనియుండుట
అప్పుడు జీవులస్థితిని చెప్పుటది
'నిరోధ' మని చెప్పబడునయా!
ఆయనలీలలు అపురూపములు

జన్మల బంధము త్రెంపుకు జీవుడు
పుణ్యపాపముల క్షాళన జేసుకు
దివ్య మంగళరూపముతోను
హరిని జేరుట 'ముక్తి' అందురు

సృష్టి - స్థితి - లయముల విధానమ్మది
ఆశ్రయమందురు అది పరమాత్మ
తన స్వరూపమును బోధించుటకు
మూడు విధములుగ ఆత్మయైనది

ఆధ్యాత్మికము - అధిదైవతము
అధిభూతంబు లన్నవి మూడు —
మూడు ఒకటిగ చూచిన ఫలమది
వాటి అర్థము గ్రహించవలెను

సృష్టిచేయు సంకల్పము కలిగి
పరంధాముడు బ్రహ్మాండమును
చీల్చుకు-వెలువడి సుఖస్థానముకు
నీటిని ముందుగ సృజించినాడు

పరిశుద్ధుడగు పరాత్పరుండు
జలరాశిలో - తా - పడుకొని నాడు
అందులకాయన నారాయణుడు
జలము - స్థానముగ కలిగినవాడు

పిమ్మట మేల్కొని నారాయణుడు
ఓజస్సు మొదలగు వాటిని సృజించె
అంతట ప్రాణమ్ములు - ఆకలి
దౌడలు-నాలుక-ముఖమున సృజించె

అటుపిమ్మట వాగింద్రియమ్మును
దేవతగా మరి అగ్నిభాసిల
ఆరెంటివల్లను - భాషణకలిగెను
ఆపై పంచభూతమ్ముల సృజించె

వీరందరును పరంధాముని
ఇచ్ఛవల్లను జన్మించి మరి
కర్మవలయమున చిక్కుకుపోయి
ఫలితమ్ములను అనుభవింతురు

పంచభూతముల ఆధారముగా
వికారమ్ములలో ఇంద్రియమ్ములు -
చర్మరోమములు - మొదలగువన్నీ
ఒకదానితొ - ఒకటుద్భవించినవి.

సురాది రూపముల రక్షకుడై తను
లయము చేసి కాపాడుచుండును
దేవదేవుని విలాసమిదియగు
అనుచు శుకుడు-అట రాజుకు చెప్పెను

ఆవిధముగను విరాట్ పురుషుడు
నారాయణుడై జగతి సృజించెను
ఆయన - స్థూల సూక్ష్మరూపములు
మహామునులు మరి తెలియగ లేరు

ఆగాధను మరి సూతుడు అచటి
శౌనకాదులకు చెప్పుచుండగా
ఆనందముగా వినెడి శౌనకుడు
అడిగె భక్తిగా పౌరాణికుని

నారాయణుడే వాచ్య - వాచకములు
నామరూపములు ధరించినంతనె
ఈశ్వరుడగును - ఈజగత్తును
నియమించువాడై వెలుగుచుండును

"మహానుభావా! విదురుడు - తాను
బంధుమిత్రులను విడచి పెట్టి మరి
తీర్థయాత్రలను సందర్శించుకు
మైత్రేయుని గని ఆయనవల్లను

ఆయనసృష్టి ప్రజాపతులు మరి
ఋషులు-పితరులు-దేవగణమ్ములు
మానవ - దానవ - పశుపక్ష్యాదులు
మాతృకాగణము మొదలగువారు

ఆధ్యాత్మవిద్యను గ్రహించెననుచు
వింటిని స్వామీ! ఆవృత్తాంతము
వివరముగా వినిపించ గోరితిని"
అనగా - తెలిపెను తీయగనంత -

మౌని చంద్రమా ఈ విషయమును
పరీక్షిన్నరేంద్రుడు జిజ్ఞాసనిండి - తా -
శుకయోగీంద్రుని అడిగి తెలుసుకొనె
దానిని మీకు - చెప్పెద వినుడనె.

**శ్రీ కృష్ణచరితము - కర్ణపేయము**
**వ్యాసమౌనికే - శాంతినొసగినది**
**పోతనయ్య - పులకించి పలికినది**
**భవ భయ హారిణి - భాగవతమ్ము॥**

**ఓం శాంతి - శాంతి - శాంతిః**





సర్వేజనాస్సుఖినోభవన్తు
లోకాస్సమస్తాస్సుఖినోభవన్తు





**సర్వం శ్రీ సీతారామచంద్ర పాదార్పణమస్తు**



(మకుటం)

శ్రీ కృష్ణచరితము - కర్ణపేయము
వ్యాసమౌనికే - శాంతినొసగినది
పోతనయ్య - పులకించి పలికినది
భవ భయ హారిణి - భాగవతమ్ము॥

# శ్రీమద్భాగవత - మకరందము
## (తృతీయస్కంధము)



విషయ సూచిక

శ్రీరామ

ఓం - నమో - వాసుదేవాయనమః

# శ్రీమద్భాగవత - మకరందము

## (తృతీయస్కంధము)

## 1 విదురుని తీర్థయాత్రలు

శ్రీపతి అందగ భూమండలమును
పరిపాలించెడి ధర్మనందనుని
కీర్తిదిక్కులలో వ్యాపించినది
ధర్మపాలనే - ధర్మజుపాలన.

పాండవులకు - తా - పినతండ్రియగు
విదురుడు భారత యుద్ధమునకును
ముందుగ-యాత్రలు చేయునెపంబున
హస్తినాపురము వదలి పెట్టెను

విదురు డచ్చట అడవియందున
మైత్రేయుడను ఋషిపుంగవు గాంచి
వందనముంచి భక్తి వినయముల
ఉచితరీతిని ఋషితో పలికెను

"మౌని చంద్రమా! పరంధాముడు
సంధి కొరకునై హస్తిన కొచ్చి
నాయింటిలొ మరి ఏలవుండెను!
అని ప్రశ్నించిన - విదురుని గాంచి

మైత్రేయుండు చెప్పుచుండెనని
శుకుడు రాజుకు చెప్పుచుండగా
రాజు భక్తిగా అడిగెను శుకుని
కురుపాండవులను సమర్థించక

యుద్ధము మొదలు కాకపూర్వమే
తీర్థ యాత్రలకు విదురుడు వెడలెన!
ఏఏ తీర్థములాతడు గాంచెను
మైత్రేయుని - తా - నేమి అడిగెను

అంతట నవ్వుచు శుకుడు పలికెను
నీవడిగెదవని నాకు తెలుసు - విను!
ధృతరాష్ట్రుడు - తా - పుట్టు అంధుడు
జ్యేష్ఠ కుమారునిపైన మక్కువ

దుర్యోధనుని ప్రియముగ నెంచి
నీతినేత్రమును మూసిన రాజు
తన తనయులు తన నుద్ధరింతురని
నమ్మి పెంచెను గారాబముగా

పాండురాజు మరి - మీ ముత్తాత
ఆయనపోయిన సమయమునకు మరి
మీతాతలందరు పసివారయ్యా!
సహగమనమ్మును చేసెను - మాద్రి

పెద్దభార్యయగు కుంతీదేవి
బిడ్డలందరితొ - బావగారగు
ధృతరాష్ట్రునింటికి వచ్చి చేరినది
పంచపాండవుల పెంచసాగెను

ధృతరాష్ట్రనందనులు-పాండునందనులు
ఒక్కచోటనే పెరుగుచుండిరి
అసూయతోనే పుట్టిన యట్టి
దుర్యోధనుడు పాండవ ద్వేషి

పాండునందనుల ప్రశంస గిట్టక
పసికందులనే చంపనెంచెను
అందుకు-తమ్ములు దుశ్శాసనాదులు
వంతపలికిరి దుర్యోధనునికి

మహాబలుడగు భీమసేనుని
చూచిన - మరింత అసూయపెరిగెను
విషాన్నమును తినిపించె భీమునితా
తాళ్ళతొకట్టి - మంటల త్రోసెను

అర్ధరాత్రమున నిద్రలోనున్న
భీమసేనుని గంగలొ విసరగ
దుష్టబుద్ధితో ఆనతిచ్చెను
పాములతో కరిపించె క్రూరుడు

కృష్ణదేవుని కరుణకు పాత్రులు
పాండవులందరు - అందువల్లను
ఆపదలన్నీ తొలగిపోయినవి
దైవబలము కాపాడెను వారిని

మరియొక యోచన వారందరినీ
సమూలమ్ముగా అంతము జేయగ
లక్కయింటిని నిర్మించి అందులో
మట్టు బెట్టగా నిర్ణయించుకొనె

వారణాసి అది పుణ్యక్షేత్రమని
అచ్చటి యింటికి వెళ్ళునట్టుగా
మంత్రులచేత చెప్పించగను
వారందరును సిద్ధమాయిరి

ధృతరాష్ట్రుడును ప్రోత్సహించగా
వారందరును అచటకు జేరి
నూతన గృహమగు లక్కయింటిలో
నివశించగను ఆరంభించిరి

పాండవహితుడగు విదురుడు విషయము
పాండునందనుల కెరుక పరచగా
భీముడు చక్కని సొరంగమార్గము
తయారుజేసెను రక్షణకొరకు

ఆమార్గముగా సోదరులను మరి
తల్లి కుంతిని - ఆపదనుండి
కాపాడెను భీముడు - భీమబలుండు
హతులైనారని తలచె సుయోధనుడు

బ్రాహ్మణవేషమ్ములను ధరించి
భిక్షాటనతో రోజులుగడుపుచు
పాంచాలనృపతుని కూతురుఅయిన
ద్రౌపది స్వయంవరమునకేగి

స్వయంవరములో గెలచినవారై
ద్రౌపదిని మరి ఆలిగగైకొని
ఇంద్రప్రస్థమున - అగుపించగనే
కలవరపడెను దుర్యోధనుడు

అంతటవారు రాజుల జయించి
రాజసూయము చేసిరి ఘనముగ
దుర్యోధనుడును ఆహ్వానముపై
ఆ యాగమునకు వచ్చె తమ్ములతో

మయనిర్మితమగు సభలో నంత
భంగపాటుకు గురియైనట్టి
దుర్యోధనుని గాంచిన స్త్రీలు
ద్రౌపది మొదలగు వారు నవ్వగా

అవమానముగా తలంచి ఆతడు
మేనమామయగు శకుని పథకమున
అతని కోరికతొ నడచు - పాచికలు
సిద్ధపరచుకొని జూదమాడగా

ధర్మరాజును ఆహ్వానించి
ఆటనేర్పరికాని - ధర్మజుని
గెలువగ - శకుని యోచన నంత
అమలు పరచిరి - ఓడె - ధర్మజుడు

పందెము వేసుకు ఆడిరి జూదము
ధర్మరాజు - తా - ఓడిపోయెను
రాజ్యము హరించి చివరకు పందెము
పదురెండేళ్ళు వనవాసమ్మును

ఆపై ఒక ఏడాది పాటు మరి
అజ్ఞాతవాసమ్మను కట్టడి తో
ఆ పందెమును గెలచి - కౌరవులు
అడవుల - పాల్జేసిరి పగతుర

అవమానమునకు ప్రతిగా నంత
సుయోధనుండు నిండు సభకు మరి
ఏక వస్త్రయగు ద్రౌపదిదేవిని
పిలిపించి - వలువలు తీయించనెంచగా

అంతటి సభలో నిస్సహాయయగు
కులస్త్రీ నటులఅవమానించగ -
ఆదుకొనెను అట - నందనందనుడు
అక్షయమ్ముగా చీరల నిడెను

కొండలంతటి ఎత్తుగ సభలో
చీరలుపడగా దుశ్శాసనుడు
సిగ్గుతొ - తలను వంచి నిలచెను
అవమానముతో పాండవులు నిలచిరి

మాటకు నిలచి - అరణ్యవాసము
ఆపై - అజ్ఞాత వాసమ్మును మరి
ఎన్నోబాధల కోర్చి నెరపిరి
మాటతప్పని మానధనులుగా -

గడవుదాటిన సంగతి తెలిసి
రాజ్యభాగము పంచి యిమ్మని
రాయబారిగా కృష్ణునంపిరి
జగన్నాటక సూత్రధారి చనె

సర్వలోకముల - ప్రభువా రాధ్యుడు
ఆశ్రితులందరి పారిజాతము
ధర్మరక్షణకు పాండవదూతగ
రాయబారిగా హస్తిన కేగెను

నిండుకొలువులో సింహాసనమున
ధృతరాష్ట్రుండు ఆసీనుడయె
భీష్మద్రోణులు కురువృద్ధులును
అలంకరించిరి ఆ సభలోన

శ్రీవత్సాంకుడు - పద్మనేత్రుడు
మత్తగజములా సభలోనడుగిడె
భీష్ముడు ముందుగ ఆహ్వానించి
వాసుదేవునికి ఆసనమిడెను

సభలోపలికెను జగన్నాథుడు
“కురువంశమణీ! - నాప్రయత్నము
కురుపాండవులకు మేలు కలుగుట
భరతవంశము సుఖముగ నుండుట

నీకు తెలియని విషయము లేదు
కౌరవనాథా! ధర్మరాజు - తన
తమ్ములగూడి అడిగిన - దిదియే
రాజ్యభాగము పంచియిమ్మని

కౌరవపాండవు లిద్దరిలోన
భేదభావము నీకు లేదుకద!
సత్య - ధర్మములు - న్యాయ పాలనలో
ఎన్నికైనది భరత వంశము

అన్నదమ్ముల తనయులందరూ
కలిసియుండుట శ్రేయస్కరము
యశోవంతులు పాండునందనులు
నీయెడ ఎంతో భక్తితత్పరులు.

అస్థిరమైన ఆస్థికోసమై
స్థిరమగు బంధుత్వము తెగకూడదు
తనయుల తప్పులు దిద్దగలిగిన
పెద్దవు - తండ్రివి - యోగ్యుడవీవు

త్రోవదప్పిన - నిన్నే అందురు
నలుగురు మెచ్చెడి నిర్ణయమ్మును
తీసుకోవలె - దిద్దుకోవలె
తమ్ముని తనయులు - నీకును తనయులె

వారికి వచ్చెడి రాజ్యభాగము
పంచియిమ్ము నువు ఆనందముగా
అటులచేసిన బంధులు హితులు
రాజలోకము శ్లాఘించును నిను!

నాల్గుసంద్రములు అన్నటులున్న
నల్గురుతమ్ములు సేవించగను
ధర్మనందనుడు నీకు విధేయుడు
నీమాటపైన మరి నడచునాతడు

తప్పుత్రోవలో పయనించినచో
ఆ సంద్రములు పొంగిపొరలగా
ప్రళయకాలము సంభవించును
మేలుకాదు అది - రాజలోకముకు

ధర్మబుద్ధితో నీతి నేత్రముతొ
నీలోనీవే విమర్శించుకొని
ఏదోమార్గము ఎంచుకోవయా!
కీర్తి ప్రతిష్టలు నిలుపుకోవయా!”

దుర్యోధనునికి భయపడి కొందరు
ధర్మము చెప్పగ ముందుకురారయె!
ధృతరాష్ట్రుడంతట - కృష్ణా! నేను
చెప్పితి గానీ తనయుడు వినడు

మూర్ఖత్వముతో దుర్యోధనుడు
నామాటను పెడచెవిని పెట్టెను
అనిపలికి అంతట - ఊరకుండెను
కృష్ణుడు - విదురుని పిలచి పలికెను

అన్నగారికి బోధించవయా!
నీమాటను మరి మన్నించునొ ఏమో!
కృష్ణుని మాటను కాదనలేక
అన్నతొ పలికెను ధర్మకోవిదుడు

"అన్నా! వచ్చిన వాసుదేవుడు
సాధారణమగు యాదవుడనుకొని
ఉపేక్షించకు జగత్కర్తయే!
విరించి జన్మకు కారణభూతుడు

సర్వజీవుల ఆత్మగనుండి
పోషించెడిది జగదాధారుడు
బ్రహ్మేంద్రాదుల కందనివాడు
దేవతలందరు - ఆయన అంశయె

అజేయులైన కంసాదులను
అవలీలగను మట్టుబెట్టెను
ముర నరకాది అసురులజంపుట
అసాధ్యమని మరి నీకు తెలియదా!

మన మేలుకోరి మరి చెప్పుచుండెను
పాండవులకు - తా - బంధువు ఆపై
చెల్లిని అర్జున కిచ్చి బావగా
వియ్యమందిన బంధుహితుండు

కంటిరెప్పలా ప్రాణప్రదముగా
కృష్ణుని - వారు చూచుకుందురు
కానిచొ అంతటి మహానుభావుడు
రాయబారిగా వచ్చుట జరుగున!

విశాలరాజ్యము విస్తరించుటకు
పాండురాజు తను మూలము కాదా!
తమ్ముని పిల్లల జేరదీసితివి
బాధలు సహించి బట్టకట్టిరి

నీతో కలసి కాలము గడపగ
కోరికతో వారందరుండిరి
కావున వారి రాజ్య భాగమును
వారికి యిచ్చి మంచిచేసుకో!

నినుకాదనెడి వారిట - ఎవ్వరు?
బంధునాశము, కక్షలు - యుద్ధము
దానివల్లను సర్వ ప్రజలకు
హానియగును మరి యోచించుమయా!

నీపెద్దకుమారుడు అన్నీ తెలిసి
ఎన్నిబాధలు వారికి పెట్టెనో
అన్నీ తలచిన వారు తిరగబడి
అంతు జూచెదరు నివారించుమది

భీమసేనుని భీకర గదయది
భీభత్సము సృజించగలదయా!
అంతవరకును రానీయకుమా!
ఆ సమయములో–సంధి నిష్ఫలము

ముక్కంటిని గెల్చిన విజయుడు వీరుడు
పాశుపతంబును గ్రహించినాడు
ఇంద్రుని అర్థ సింహాసనమును
అధిష్టించిన యోగ్యుడాతడు

భీకర ధనుష్టంకార మెగయగ
కౌరవసేన కలవరపడును
అసువులు వీడే ఆఖరిఘడియలో
పొత్తుపొసగదు – నిరుపయోగము

పార్థసారథిగ – రథమున కృష్ణుడు
శ్వేతాశ్వములను నడుపుచుండగా
సాక్షాత్ యమునిగ దర్శనమిడును
అగ్నిహోత్రమా అర్జునుడగును

గాండీవముతో శరపరంపర
వదలుచుండగా పార్థుని ముందు
నిలబడు వీరుడు ఎవ్వరు రాజా!
చావు కేకలలో – సంధి ఎందులకు?

కావున – నాదు మాటను వినుము
జగన్నాథుని మాట మన్నించుము
నీకొడుకు నమ్మిన నయవంచకులు
నట్టేటిలో మరి ముంచి వేతురు

దుష్టతనయుని సమర్థించుకు
కులధ్వంసము చేయుట మూర్ఖత!
నీదుతనయుడు వినుము! మూర్ఖుడు
వాని కొరకు – కులమంత పతనమగు

సృష్టిస్థితి లయ కారకుడైన
వాసుదేవుని కాగ్రహమొచ్చిన
అగ్నికణములు రాలుచుండగా
వీరులు – మిడుతల వోలె దగ్ధమగు."

అనుచు విదురుడు – నిష్కర్షగను
నిండుసభలో మరి చెప్పి – అంతట
మెల్లగ అన్నకు చెప్పెను తిరిగి
కృష్ణు డడిగినది యిత్తునంటివి

కావున నీవు మాట నిలపుకో!
అనుచు హెచ్చరిక చేయగనంత –
దుర్యోధనుడు రెచ్చిపోయెను
పండ్లు పటపట కొరుకుచు నిలబడె

"దుశ్శాసన శకునుల నిద్దరచూచుచు
ఎంతటి తప్పును మీరు చేసిరి
దాసీపుత్రుని ఎందులకొరకు
సభలోనికి మరి ఆహ్వానించిరి

వచ్చినవాడు కిక్కురుమనక
మర్యాదగ తను మెలగుట ధర్మము
కాదని వదరుట అహంభావము
కావున వీనిని గెంటివేయుడనె"

విదురుని నీతి వాక్యమ్ములకు
దుర్యోధనుని కటుభాషణకు
ధృతరాష్ట్రుడు - తా - చలించలేదు
అంతట విదురుడు పలికె బాధతో

దుర్మదాంధుడా! ననుగెంటింతువ!
సాధుదూషణ నీ నైజమది
వాసుదేవుని మాటలు చెప్పి
నీతండ్రిని మార్చగ నా ప్రయత్నము

కృష్ణుని మాట కాదనలేక
చెప్పితి ధర్మము - హితమును-సభలో
వచ్చెడి కష్టము లనుభవించుము
అనుచు విల్లును శరములనచటే

అస్త్రసన్యాసము చేసిన - విదురుడు
యుద్ధము తప్పదు అని మదితెలిసి
తీర్థయాత్రలకు సాగిపోయెనన
యాత్రల వివరము - రాజు అడిగెను

అస్త్రమ్ములతో - కలిపి కోపమును
వదలిన విదురుడు - అవధూతరీతిగా
అడవులలోనికి సాగిపోయెను
విష్ణువు పుట్టిన - స్థలములచూచెను

శ్రీహరి నడచిన స్థలముల గాంచెను
దేవతలు మరి ప్రతిష్టించిన
విష్ణ్వాలయముల సందర్శించెను
గంగాది పుణ్యనదుల గ్రుంకెను..

సిద్ధులనొసగే పుణ్యాశ్రమముల
వసించినాడు - పరవశమ్మున
గంధమాదనాది కుల పర్వతముల -
కొండల - లోయల - సంచరించెను.

విదురుడు తిరగని అడవులు లేవు
నడవని పల్లెలు పట్నమ్ములు లేవు
యజ్ఞయాగములు జరుగుచోటుల
హరిధ్యానముతొ కూర్చొనువాడు

దొరికిన ఫలములు - జలములతోనే
కడుపునింపుకొని - కోరికమరచి
దేహభావన పూర్తిగవదలి
అవధూతరీతిగా తిరగజొచ్చెను

భరతవర్షముల పుణ్యనదులలో
స్నానముచేసి - స్థలములచూచి
ప్రభాసతీర్థము చేరి అచ్చట
స్నానముచేసి ధ్యానమగ్నుడయె.

అంతటిలోన తీర్థయాత్రలకు
వచ్చిన యాత్రకులెవరో అనుకొను
కురుపాండవ సంగ్రామ విషయము
కౌరవంశ నాశము వినెను

ధర్మరాజు పాలించుచుండెనని
వారు అనుకొను మాటలు వినెను
యుద్ధభీభత్సము తెలియగ నంత
దుఃఖ సంద్రమున మునిగిపోయెను

వెంటనె సరస్వతి నదికి వెళ్ళెను
స్నానము చేసి బంధువులకునట
జలములు విడచెను దుఃఖతప్తుడై
తిరిగి యాత్రను ఆరంభించెను

అటులా విదురుడు పుణ్యపురుషుడు
పుణ్యభూముల సంచరించుచు
మత్స్యకురుజాంగల భూములుదాటి
యమునానది ప్రాంతమ్ము జేరెను

ఆ ప్రదేశమున ధ్యానమగ్నుడై
కూర్చొనియున్న వ్యక్తిని గాంచెను
దగ్గరజేరి చూడగనంతట
కృష్ణ సఖుడగు ఉద్ధవుడాతడు

కృష్ణుడు తప్ప దైవములేదని
నమ్మికొలిచెడి భక్తుడాతడు
కృష్ణుని ఆంతరంగిక మిత్రుడు
అతనిని గాంచి పొంగెను విదురుడు

విదురుని గాంచిన ఉద్ధవుడంతట
ఆనందబాష్పముల స్వాగతించెను
వెంటనె విదురుడు దగ్గర జేరి
కౌగిలించెను పరవశమ్ముతో

అంతట అడిగెను విదురుడు అచట
"కృష్ణుని నమ్మిన భక్తాగ్రగణ్యులు
అడుగుజాడలో నడిచేవారు
పాండవులందరు క్షేమమేగదా!

యదువంశపావకుడు బలరామకృష్ణులుగ
అవతరించె ధర నుద్ధరించుటకు
అనుచు పెద్దలు నీసరివారు
చెప్పెదరు కద! వారు కుశలమా!

వసుదేవుడు రుక్మిణి ఉగ్రసేనుడు
అందరు సుఖముగ నున్నారుకదా!
సాంబ ప్రద్యుమ్నులు క్షేమమేకదా!
సాత్యకి తాను కుశలమేకదా!

కృష్ణపదముల వందనమ్ములిడి
పాదరేణువులు శిరమున దాల్చే
ప్రియతమ భక్తుడు అక్రూరుండు
సుఖముగ కాలము గడుపుచుండెనా!

వేదమాతవలె ఆగమ నుతుని
కడుపున మోసిన పావన చరిత
దేవకి – సుఖముగనుండెన స్వామీ!
వారితలపులు పులకరింతలు

చిత్తాహంకార, బుద్ధి మనస్సులని
అంతఃకరణల అధిదైవతములు
వాసుదేవ–సంకర్షణ–ప్రద్యుమ్నానిరుద్ధులు
కుశలమేకదా! తెలుపుము దయతో

మనశ్శుద్ధిగా ఉపాసించిన
కోర్కెలు తీర్చెడి వాడ నిరుద్ధుడు
శబ్దశాస్త్రముకు కారణుడతడు
అనుచు దేవతలు స్తుతించుచుందురు

అంతటి వాడా అనిరుద్ధుండు
అతడు కుశలముగ నున్నాడా మరి!
దర్మవర్తనులు పవిత్ర చరిత్రులు
సత్యభామకు పుత్రరత్నములు

చారుధేష్ణుడు గదుడు కుశలమా!
మయసభలోమరి కొలువు దీరగా
అసూయనిండి సుయోధనుండు
ఎన్నోయిడుములు పెట్టెను వారికి

అన్నీఓర్చుకు శాంత మూర్తియై
ధరనేలెడి ఆ ధర్మనందనుడు
క్షేమమేకదా! తెలియపరచుము!
భీమబలుడు ఆ భీముడు కుశలమ!

పాశుపతాస్త్రము పొందిన పార్థుడు
శతృవిజేత క్షేమమేకదా!
కురువంశమును దగ్ధము చేసిన
నకుల సహదేవులు కుశలమేకదా!

పసిపాపలను పెంచుట విధియని
సహగమనమ్మును మాని వేసిన
పవిత్రమూర్తి - కుంతి క్షేమమా!
మోదఖేదముల నామది నిండెను

జ్యేష్ఠుని మీద మమకారముతో
తమ్ముని తనయుల కష్టములన్నీ
తెలిసిన అంధుడు - పరమమూర్ఖుడు
నేడు పాండవుల పంచనుండెకద

నిండు సభలో ఆ నాడు తనయుడు
ననుదుర్భాషలు పలుకుచుండగా
సోదరుడనని గౌరవించక
తనయుని ఘనతకు సంతోషించెను

ఆ ధృతరాష్ట్రుడు పాపఫలితముగ
ఘోరనరకము అనుభవించును
శాంతమూర్తిని - సుఖదుఃఖములకు
అతీతుడనగు - నేనిటు పలుకుట

నీకు - వింతగా తోచుచున్నదా!
స్వామీ! నాకును మోదఖేదములు
ఉండును - అది ఆ విష్ణుమాయకద
వాటికి లొంగిన సాధారణుడను!

సర్వేశ్వరుని అనుగ్రహమ్మది
పరిపూర్ణముగా కలిగినప్పుడు
నిర్వికారముగ నుండగలిగెద
బ్రహ్మాదులె ఆ మాయకులోబడు

ఆ మహాత్ముని కరుణా మృతమును
పానము జేసిన ధన్యుడ నేను
పరిపూర్ణత్వము లభించలేదు
కావున దానికి - నా నిరీక్షణ.

కౌరవ సభకు దూతగ వచ్చిన
వాసుదేవుని బంధించుటకు
యోచన చేసిన దుర్మార్గులను మరి
తలచిన - నాడే - బుగ్గిచేయడా!

కాలముపండి హింసనుచేసెడి
దుర్మార్గులను దండించి మరి
భూభారమును తగ్గించవలె
అందుకు శ్రీహరి ఉపేక్షచేసెను

ఉద్ధవా మరి నీకు తెలియదా!
అభవుడు పుట్టుట విశ్వశ్రేయముకు
కర్మలతో సంబంధము లేక
చేసినట్టుగా కనబడు మనకు

లీలలు చూపగ ఉద్భవించెను
సంసార బంధములు అంటనివాడు
నమ్మికొలచిన కాపాడెదనని
నొక్కిచెప్పిన – లీలావతారుడు

అంతటి మహిమోపేతుడు ప్రభువు
అన్నతొ సుఖముగ ద్వారకనుండెన!"
అనుచు పలుకగా ఉద్ధవుని
కన్నుల నీరు కురియ జొచ్చెను

కృష్ణుని పేరు వినినంతటనే
పులకరించి మరి మేను మరచెడి
ప్రియభక్తుడాతడు బహిఃప్రాణము
అంతట వానికి దుఃఖమెగసెను

నోటమాటలు పెగలుటలేదు
పెదవులు పొడారిపోవుచుండెను
పరంధాముడు యిక లేడనుచును
చెప్పెను – భోరున ఏడ్చె ఉద్ధవుడు –

అనుచు శుకుడు అట రాజుకు చెప్పెను
రాజా! వినుము ఆ ఉద్ధవునికి
కృష్ణుడన్నచో అమిత భక్తియది
ఎదుట కృష్ణుడు వున్నటు తలచును.

ఉద్ధవు – కైదవ సంవత్సరమున
బాలురుతో – తా – నాడుచుండగా
ఒకబాలకుని కృష్ణునిగాను
తలంచి ఆతని సేవ చేయుచు

అన్నహారములు మరచిపోయెను
ధ్యాననిష్టలో మునిగి పోయెను
తల్లిపిలచిన పిలుపు వినబడని
సమాధిస్థితిలో నుండె నాతడు –

అంతటివాడు కృష్ణుడు లేడను
వార్తచెప్పుట సామాన్యమైనదా!
విదురా ఏమని చెప్పెదనింక
కాలసర్పము కాటు వేసినది

యాదవులందరు సమసిపోయిరి
క్షేమము చెప్పే భాగ్యములేదు
మునులవ్యాకులము పెరిగిపోయినది
చోరులు స్వేచ్ఛగ తిరుగుచుండిరి

యోగుల కష్టము లారంభమయె
రాక్షస చీకటి అలముకొన్నది
ధర్మకార్యములు తలక్రిందైనవి
తేజోమూర్తి లేని ఫలితమది

హలికులిక పద్మరేఖలతో - తను
ప్రకాశించెడి ఈ వసుంధర
మంగళకరము అగబడకున్నది
వచ్చెడిక్షోభకు కుములుచున్నది

తమతో తిరిగెడి ఆ పరమాత్మను
యాదవులందరు గ్రహించలేక
సోదరభావము నిండిపోవగా
తమ తోటివాడని తలంచినారు

యదుకుల మణి ఆ పరాత్పరుండు
వైకుంఠమునకు సాగిపోయెను
దౌర్భాగ్యుడను - నన్నువదలెను
అనుచు దుఃఖమున కుమిలె ఉద్ధవుడు.

సుందరరూపము భువనమోహనము
దుష్టులు గర్విష్ఠుల కందనిదది
రాజసూయమును చూచిన ధన్యులు.
దివ్యతేజమును చూచిరి అచట

శాంతమూర్తి-తా-మారు ఉగ్రునిగ -
జన్మనెత్తుట లేకపోయినను
సృష్టికొరకునై ఉద్భవించును
అవతార ప్రయోజన మాయన ధ్యేయము

సర్వస్వము శ్రీకృష్ణుడనుకొని
సర్వేశ్వరుడే తాము అనుకొని
సకలచరాచర జగత్తునంతట
కనిరి - గోపికలు పరంధామునిలో

కులము ధనము బలవిక్రమములు
చూచుకు - గర్వమదాంధులు అయిన
శిశుపాలాది భూపాలురు మరి
దుర్భాషలను పలికిరి మూర్ఖులు

అన్నిమాటలు పడెనాస్వామీ!
చిరునవ్వుతొ వారి అవివేకమునకు
మదిలో - జాలి కనబరచుచును
చివరకు - మోక్షమునిడెను వారికి

మనఃకమలముల ప్రతిష్టించుకు
ఏకాగ్రతతో ధ్యానము చేసెడి
యోగులపైన కరుణించి తను
దివ్యసాక్షాత్కారము నొసగెను

దేవతలకు మరి మాటయిచ్చెను
కావున వసుధలొ పుట్టె - నరునిగా
వసుదేవునిఇంట జన్మనెత్తియు
నందునిఇంట పెరిగెను స్వామి -

జరాసంధునికి లొంగక పరుగిడె
సంద్రమధ్యమున నగరము కట్టుట
అన్నీతలచిన ఆశ్చర్యమగు
లీలలు తెలియగ ఎవ్వరితరము

సమర్థులైన తనయులమయ్యును
మీబాధలను - తీర్చకపోతిమి
క్షమించమనుచు - వసుదేవునితో
కృష్ణుడనుటది విడ్డూరముకద!

కృష్ణలీలలు తరగని నిధులు
కనుబొమలు ముడిచిన ప్రళయకాలమగు
కరుణాధాముని కథలు తలచుకొని
పరవశించిచూ బ్రతికి యుంటిని

విదురా! వినుమా! పరాత్పరుసకి
స్వ పర భేదములన్నవి లేవు
ఇష్టులు దుష్టులు అని తలంచడు
అందరికీ అందించు మోక్షము

శ్రీహరి చర్యలు అనూహ్యామైనవి
ఉగ్రసేనునికి పట్టము కట్టి
నమ్మినబంటుగ సేవచేయుట
ఊహకు అందని విషయమేకదా!

విష స్తన్యమును ఇచ్చిన పూతన
ముక్తినందుట మహాయోగము
పగతో గాని భక్తితొ గాని
వచ్చినవారిని కరుణించును శ్రీహరి."

ఏమందువయా! అనగా విదురుడు
భక్తి ప్రపత్తుల నమస్కరించి
ఉద్ధవుని అట అడిగె - నీవిధి
పాపకర్ములెటు ముక్తిని పొందిరి.

అంతట ముకుందుని మదిలో తలచి
ఆరంభించెను ఉద్ధవుడచట
"విదురా వినుము విష్ణుతత్త్వమది
మహా మహులు మరి చెప్పగలేరు.

అంతటి దానిని - అందని దానిని
నాకు తోచినది చెప్పెద నీకు
దుర్భాషలతో హరినెదిరించి
చక్రాయుధమున ముక్తులగుదురు

రాక్షసాంశతో పుట్టిన రాజులు
భూమికి బరువై దుష్టులాయిరి
భూదేవత - తా - బ్రహ్మను శరణని
ప్రార్థించగను విరించి అంతట

పరంధాముని ప్రార్థించగను
నారాయణుడు అభయమునిచ్చెను
దేవకి వసుదేవుల పుణ్యాము
పుత్రునిగా చెరసాలలొ పుట్టెను

బిడ్డకు హాని కలుగు ననుచును
దుఃఖించెడి తన తలిదండ్రులగాంచి
జరగవలసినది - చెప్పెను తండ్రికి
నందగోకులము గొనిపోయిఅట

యశోదప్రక్కన నుంచగ చెప్పెను
అటులా రాత్రి - పసివానిని గైకొని
యశోద ప్రక్కన నుంచి అచ్చటి
ఆడ శిశువుతో చెరసాల జేరెను

రోహిణి గర్భమునందున శ్రీహరి
బలరామునిగా ఉద్భవించెను
గొల్ల పిల్లలలొ తానొకడై హరి
పదునొకొండు ఏండ్లు గడిపెను

పరంధాముడు ఎవరితొ నున్నదొ
తెలియనీయక కలిసిపోయెను
పాలు, మీగడలు ఆరగించుచు
గోధనముతొ అట గడిపె - హాయిగా

ఆసమయములో చేసిన లీలలు
చెప్పచాలను అంత గొప్పవవి
బృందావనము యమున ఒడ్డున
అరవిరసిన నవవసంతమైనది

నందనందనుని పదములస్పర్శతొ
కొత్త అందములు సంతరించుకొని
మనసులు దోచే మధురానందము
కలిగించును ఆ బృందావనము

దట్టమైన ఆ తరుఛాయలలో
సురపొన్నల సొగసులు వెల్లి విరియగా
గోపాలకులతొ కృష్ణుని ఆటలు
చూడగ - వేల్పులు నిలచిరి నింగిని

రాక్షస సంహారమ్ము ధ్యేయమై
పసితనము నుండే ఆరంభించెను
పూతన మరియు శకటాసురుడు -
అటుల చంపెనా కంస భృత్యులను.

కాళీయుడను సర్పరాజు - తను
కాళియమడుగున వసించి విషమును
గ్రక్కుచుండగా మదమణగించి
మడుగునుండి మరి వెడలగొట్టెను

ఇంద్రయాగము ఆచారమని
చేసెడి - గొల్లల నాపుచేసెను
కొండయాగముగ దానిని మార్చి
దేవేంద్రునికి మదము దించెను

శిలావర్షము కురియుచుండగా
కొండగొడుగును ఎత్తినిలబడి
ఆదుకొనె తన ఆర్తులందరిని
గోవర్ధనోద్ధరణ అన్న లీలతో

రాసక్రీడయని రమణులందరిని
అనురాగవార్నిధిని ముంచి వేసెను
ప్రకృతి అంతా పులకరించెను
అంతా తానని నిరూపించెను.

జంతు జాలము తరువులు లతలు
తరుణులు గోవులు గోపాలకులు
కృష్ణమయముగా ఆనందించుట
రాసలీలగా నిలచె జగమున

అన్నతొ కలసి మధురకువెడలి
గర్వమదాంధుడు అగు కంసునట
మట్టుపెట్టి తన తలిదండ్రులను
బంధవిముక్తుల చేసెను కృష్ణుడు

సాందీపనిని గురువు గనెంచి
సకలవిద్యలు నేర్చెను లీలగ
మృత - గురు పుత్రుని-బ్రతికించి తెచ్చి
గురుదక్షిణగా సమర్పించెను.

భీష్మకుపుత్రిక సుగుణాలగని
కృష్ణ నామముకు అంకితమైన
ఒప్పులకుప్పను వీరోచితముగ
గ్రహించి - పరిణయమాడెను లీలగ

గరుత్మంతుడు అమృతంబును
హరించి తెచ్చిన రీతిగ బాలను
స్వయంవరములో రాజుల ముందే
గ్రహించె కృష్ణుడు జగత్కల్యాణముగ

నాగ్నజిత్తిని పరిణయమాడగ
ఏడు ఎద్దులను చిత్తుచేసెను
గొల్లవాడని మీదకు వచ్చిన
రాజుల మదమును త్రుంచి వేసెను

ఆవిధముగను బలపరాక్రమము
చూపి - కృష్ణుడు వివాహమాడి
భార్యలతో తను ద్వారక కేగి
ఆనందముగా గడపసాగెను

సాత్రాజితిని పరిణయమాడి
ఆమెకోరిన కోర్కెతీర్చగా
పారిజాతమును పెరటి చెట్టుగా
నాటెను - కృష్ణుడు పురుషోత్తముడు

భూదేవి పుత్రుడు నరకాసురుడు
రాక్షస కృత్యములారి తేరెను
వానిని లీలగ త్రుంచి వేసెను
అంతట ధరణి ప్రార్థించగను

నరకుని సుతుడు భగదత్తుని మరి
సింహాసనమున అభిషేకించి
నరకుని చెరలో నున్నకాంతల
పదహారువేల మందిని చెరవిడిపించి

దిక్కుతోచక నిలచిన కన్యల
వివాహమాడి బ్రతుకును చూపి
పరమాత్మునికి అందరు ఒకటే -
అనుబంధమది - భక్తి బంధమనె

కాంతలందరికి సంతునొసంగి
తేజోవంతుల తండ్రి ఆయెను
కాలయవను డాదిగా గల
బలపరాక్రముల నంతము జేసెను

ధర్మజుచే రాజసూయమును
చేయించి అప్పుడు జరాసంధుని
తుదముట్టించెను - భీమసేనునితొ
దంత వక్త్ర సాల్వ,మురయోధులజంపెను.

కౌరవపాండవ యుద్ధము తప్పక
గాండీవికి - తను సారధిగానై
భూభారమును తీర్చెను కృష్ణుడు
యాదవ బరువుకు మార్గము చూపెను.

అశ్వద్ధామ వదలినయట్టి
అపాండవమ్మను అస్త్రమునుండి
ఉత్తరకడుపులొ నున్నశిశువును
రక్షించి-వంశమును నిలబెట్టి కృష్ణుడు

భూమండలమునకు ధర్మరాజును
చక్రవర్తిగా అభిషేకించి
ధర్మపాలన - చేయించినవాడు
యజ్ఞయాగముల జరిపించినవాడు

జీవిత నౌకను నడిపేవాడు
జీవన్మరణ సమస్యలు తీర్చగ
జీవితమంతా కృష్ణాంకితమని
రాజ్యమేలును ధర్మనందనుడు.

దివ్యమాయను తెలియకుండగను
ప్రయోగించుచు పద్మాక్షుడు - తను
అందరితో-తా-కలసి మెలసి మరి
హితుడు స్నేహితుడు అన్నటు మెలగెను

తానొకడైనా తలకొక రీతిగ
భామలందరిని అనుభూతులకు
గురిచేయుచును వసంత శోభల
ఆనందమును అనుభవించెను

ముని శాపము అను వంకను చూపి
సాంబుని కడుపున ముసలము పుట్టగ
ఆనందమది హద్దులు దాటి
క్రోధావేశము లందడుగిడి మరి

వారిలోవారు యాదవులందరు
కొట్టుకు - పొడుచుకు అంతమొందిరి
కళ్ళముందుగా జరిగెను ఘోరము
గాంచెను కృష్ణుడు సూత్రధారుడు

మిగిలిన యాదవ భారముదించి
చెక్కుచెదరక మనసు దిటవుతో
ప్రభాసతీర్థము నందున మునిగి
స్నానము చేసి పరంధాముడు

చెట్టుక్రింద విశ్రాంతిని గొనుచు
నన్నుగాంచి మరి పలికె నిట్టుల
"ఉద్ధవా! యిక చేయున దొకటే
బదరికావనము చేరుము నీవు"

అనుచు నాకు తను అనతినిచ్చెను
అంతట కన్నులు మూసుకు నేను
చేతులు ముడిచి ప్రణమిడి తిరిగి
కండ్లుతెరచితిని - స్వామి పలుకడు

స్వామీ! అనుచు ఆక్రందించితి
లీలామానుష విగ్రహుడాతడు
మాయానాటక సూత్రధారి తను
అంతర్ధానము అయ్యెను లీలగ

వచ్చిన పనిని చక్కబెట్టుకొని
చల్లగ సాగెను నందనందనుడు
జీవచ్ఛవమై మిగిలి యుంటిని
చావగలేక బ్రతికి యుంటిని.

అంతటినుండి గమ్యము లేకను
తిరుగు చుంటిని కొండలు కోనలు
శ్రీకృష్ణుని గన - నా ఆశయది
సన్నగిల్లక తిరిగి - అలసితి

ఒక తరు ఛాయలో విశ్రమించితి
తిరిగి వెదకగా నా ఆలోచన
అంతటిలోన కళ్ళను తెరచితి
విదురా! నన్నే నేను మరచితి

ఎదురుగ స్వామి లీలగ గనబడె
ఎడమ తొడపై కుడి పాదముంచుకొని
ఆసీనుడగు తేజోమూర్తి
దర్శనమిడెను ధన్యుని చేయగ

నిడుపగుకన్నులు పొడవగు భుజములు
వెలుగులుచిమ్మే పచ్చని చేలము
ఆశ్రితమందారమా పరమాత్ముడు
పున్నమిచంద్రుని పోలిన ముఖము

విశాలఫాలము శ్రీవత్సమ్ము
తీర్చిన కస్తురి ఘుమఘుమ లెగయగ
శంఖముపోలిన కంఠము కలిగి
కరివంద్యుడు నా కగబడినాడు

నంద కిశోరుడు భక్త కల్పకము
నాబాధ గ్రహించి అనుగ్రహించి
దర్శనమిడెను ధన్యుడనైతిని
పారవశ్యము నందితి నేను

తనివి తీరగా స్వామిని గాంచుచు
నిలచిపోతిని అచేతనముగా
కన్నులముందర కోటిస్వర్గములు
వెలసినట్టి ఆనందమందితి.

అంతటిలోన ఆప్రదేశముకు
మైత్రేయుడను పుణ్యాత్ముడొచ్చెను
భగవద్భక్తుల - అగ్రగణ్యుడు
ఉత్తమ తపస్వి - తేజోవంతుడు

తీర్థయాత్రలు చేయుచు - ఆ ముని
అచటికి వచ్చెను కృష్ణునిగాంచి
కన్నులు మూసుకు ధ్యానించుచును
నిలబడియుండెను పరవవశమ్ముతో

ఆ మైత్రేయుడు వినుచుండగను
పలికెను అప్పుడు - పరంధాముడు
పూర్వ జన్మలో వసుబ్రహ్మలువారు
సత్రయాగము చేసిరి వారిలో

నీవొక వసువుగ - కోర్కెలులేక
నాపాదసేవను మదిలో తలచుచు
నీమది నాకు సమర్పించితివి
నీ భక్తికి మెచ్చి - నిలచితి మనసున

భక్తుని మదిలో నిలచియుందును
వాదోపవాదములవ్వి నిలబడవు
భక్తిఒక్కటే ననుబంధించును
దివ్యసాధనము భక్తియొక్కటే

ఆశ్రయించిన భక్తుడ వీవు
జన్మరాహితి కలిగించితిని
సంచితపుణ్యము కలదు కనుకనే
అనుగ్రహించి - దర్శనమిడితిని.

పద్మకల్పమున నాభికమలమున
పుట్టినయట్టి విరించి ఆదిగ
పుణ్యాత్ములకు కలిగెడి జ్ఞానము
దివ్యజ్ఞానము కలిగించెద ననె -

బ్రహ్మదేవునికి నీ వొసంగిన
తత్త్వము వినెడి యోగ్యత నిడుము
నీ ఆనతితో జీవయానమున
ఆవలిగట్టుకు చేరుకొందును."

అటులాపలుకులు వినినంతటనే
పరవశించితి దయావృష్టికి
కరములురెండూ జోడించితిని
పలికితి భక్తిగ జగన్నాధునితొ

అటుల కోరిన - నాపై దయగొని
పరతత్త్వమును ఆమూలాగ్రము
బోధపరచెను పరాత్పరుండు
అనేకవిధముల స్తోత్రముచేసితి.

"సరసిజనాభా! శరణు శరణిదే!
పరమపురుష! నీకిదె వందనము
లోకమ్ములకు శాసనకర్తవు
నిన్నుభక్తితో కొలచిన - ధన్యులు

బ్రహ్మకల్పమది లయమగువరకు
విష్ణుసాయుజ్యము నాకు లభించదు
హరినామముతో పుణ్యభూములలో
తిరుగుచు యిచటకు వచ్చితినయ్యా!"

సంసార సంద్రమును దాటించితివి
ఇంతటిదయ మరి నాపై గలదని
తలంచలేదు - మూర్ఖుడ నేను
నిన్ను తెలియుట విరించి వశమా!

ఉద్ధవుగాంచి విదురుడు పలికెను
స్వామీ! నీవు మహాభక్తుడవు
శ్రీకృష్ణ భక్తిని గ్రోలిన ధన్యుడ
పరమాత్ముడు - తా - మెచ్చిన ధన్యుడ

నిత్యానందము నీ రూపమది
నీలీలలవి తలచిన కొద్దీ
ఆనంద సంభ్రమము కలుగు చుందును
మాకొరకై నువు క్లేశము లోర్తువు

స్వామి చెప్పిన తత్త్వమునందు
కొంత చెప్పి - నను ధన్యుని చేయుము
శిష్యుడ నేను దయ చూపించుము
నా కోరిక మన్నించుము స్వామీ!

రూపము మరియు ఇంద్రియమ్ములవి
ఉన్నటులున్నను లేనివాడవు
దివ్యతేజమది - నీరూపమది
నిర్మల భక్తికి అందునట్టిదది

అంతట పలికెను ఉద్ధవుడచట
విదురా! వినుము ఆ మైత్రేయుడు
కనబడినట్టి మహానుభావుడు
విష్ణుసాయుజ్యము పొందును త్వరలో

అట్టి దీక్షలో నున్న - సాధకుని
అడిగి నీవు - నీ కోర్కె తీర్చుకో!
అధ్యాత్మిక రహస్యమ్ము లన్నియు
సమగ్రమ్ముగా చెప్పగ యోగ్యుడు!

అతనిని నీకు చూపించెదను
రమ్మని పిలచి సాగిరి యిద్దరు
పావన యమునలొ స్నానము చేసిరి
బదరికావనము చేరిరి వారు -

అటుల చెప్పగా పరీక్షిన్నరేంద్రుడు
అడిగెను శుకుని-స్వామీ! ఉద్ధవుడు
శ్రీకృష్ణ వియోగము భరించెనెటుల
ఏవిధముగను బ్రతికియుండెను?

శుకయోగీంద్రుడు తెలిపె తీయగా
సముచితమైన ప్రశ్నవేసితివి
కార్యార్థమయి కృష్ణుడు పుట్టి
భూభారమును తీర్చి - సాగెను.

కృష్ణ తత్త్వమును నాలుగు మూలల
విస్తరింపగా చేయగ చాలిన •
భక్తుడగు - ఉద్ధవుని - అందుకు
ధరలోనుంచి - కృష్ణుడు సాగెను

కృష్ణ నిర్ణయము కాదనలేక
కష్టమైనను స్వామిని వదలి
భువిలో మిగిలెను ఉద్ధవుడటుల
అనుచు తెలిపెను ఆపై గాథను

అటులా యిరువురు బదరికావనము
చేరిరి - అంతట విదురుడు భక్తిగ
ఉద్ధవునికి - తా - మ్రొక్కి నడచెను
మైత్రేయుని దర్శించగసాగెను

పుణ్యభూములను దర్శించుచును
పుణ్యనదులలో స్నానమాడుచు
శ్రీహరి క్షేత్రమ్ములను చూచుచు
నిర్మల మనసుతొ ముందుకుసాగి

పాపభంగ ఉత్తుంగ తరంగ
పావన గంగలొ స్నానముచేసి
ఒడ్డున నిలవగ ఆప్యాయముగా
గంగ తోయములు పలుకరించెను

పాపపంకిలము క్షాళనకొరకు
వేచియుంటిని రండి రండని
చేతులుచాచి పిలచుచున్నటు
హరి పాదోద్భవి అగుపించినది

గంగనువదలి ముందుకు సాగగ
మనసు ఒప్పక అటులేనిలచి
అంతరంగమున పొంగిన భక్తితొ
తిరిగి తిరిగి ఆ గంగకు మ్రొక్కెను

సైకత వేదిక లల్లనల్లన
సువిశాలమ్ముగ అమర్చినట్లయె
అచ్చటనిలచి అల్లంతదూరమున
పద్మాసనమున కూర్చొనియున్న

దివ్యమూర్తిని గాంచి - అచటికి
వడిగాసాగి - ఆ తపోమూర్తిని
కన్నుల గాంచగ పరవశించెను
చెదరని నిష్టతొ - కనబడె నాతడు

బ్రహ్మతేజమది ముఖమున వెలుగగ
బాలభాస్కరుని తీరుగ నుండెను
ఆయన వయస్సు - అంతుపట్టదు
దేవతేజమే - దిగినటులున్నది

పద్మాసనమున ప్రాణాయామము
నాచరించుచు ఆసీనుడయె
బాహ్యేంద్రియములు ప్రకృతివశమయె
కృశించి - పండిన ఆకుగ నిలచెను

విదురుడు తలచెను - యోగిని గాంచి
ఉద్ధవుడచట తెలిపిన యట్టి
మైత్రేయుడీతడని - అంతట అతడు
అడిగెను వినయము నిండిన మాటల -

మైత్రేయుడను తానని చెప్పి
ఏమి కోరిక - అనుచు అడిగెను
వాత్సల్యమ్మది ఒలికే పలుకుల
సందేహములను అడుగగ చెప్పెను.

॥శ్రీ కృష్ణచరితము॥



## 2 విదుర మైత్రేయసంవాదం

విదురుడు భక్తిగ మ్రొక్కిపలికెను
మహానుభావా! జనులందరును
సుఖభోగములు అనుభవించగ
కోర్కెలునిండి కర్మలుచేతురు

స్వామీ! యిలలో మనుజులందరు
సతీ-సుతా-ఆలయమ్ములని
ఎన్నో బంధము లమర్చుకొందురు
నిరర్థకంబగు బ్రతుకీడ్చెదరు

వాటి ఫలితములు తృప్తినిచ్చెనని
తలంచి వారు చెడిపోయెదరు
నిజముగచూచిన అట్టి కర్మలవి
దుఃఖ హేతువులు - తెలియరు వారు

అట్టి వారిని గట్టెక్కించగ
నిలచిన ధన్యులు - మీరేస్వామీ!
నను శిష్యునిగా ఆదరించుడు
నా సందేహమ్ములు - తీర్చుడు

అట్టిమూర్ఖులను ఉద్ధరించుటకు
విష్ణురూపముగ - మీవంటి యోగులు
లోకమునందు తిరుగుచుందురు
మిమ్ముల గనుట - జన్మకు ధన్యత

త్రిగుణమ్ములలో నెలకొను మాయ
అట్టి మాయకు నియంత - శ్రీహరి
అట్టి స్వతంత్రుడు - రూపము దాల్చుట
అవతారము లెత్తుట వింతయె కాదా!

ఏఏ అవతారమ్ముల నెత్తెను? •
ఏఏ పనులు శ్రీహరి చేసెను?
మాయతీతుడు మాయకు వశుడై
ఎటుల చరించును వివరములేమి?

బ్రహ్మాండమును నడిపెడివాడు
బ్రహ్మాది రూపములు ధరించుటెటుల?
గోబ్రాహ్మణులను దేవతలను మరి
రక్షించు యత్నము అవతారములట

లోకమ్ములను లోకపాలకుల
చరాచరమ్ములను ఎటుల సృజించెను?
జీవకోటి మరి సేవించు నెవరిని?
ఏ ఏ కర్మలు నిర్దేశించిరి?

పురుషోత్తముడు యోగీశ్వరుడగు
శ్రీకృష్ణదేవుని చరిత్ర విననిదే
దుఃఖభాజక భవబంధమ్ములు
విడివడి – ముక్తి లభించదుకాదా!

వేద విభజన చేసిన వ్యాసుడు
శాంతి నందుటకు నారదు హితమున
విష్ణు కథలను వివరించి ధన్యుడై
శాంతినందెనట – అంతటి చరిత్ర

జగన్మంగళా కారుడు శ్రీహరి
ఆయన గాథలు వద్దని అనుట
అమృతమ్మును కాలదన్నుకొని
కాలకూట విషపానము చేయుట

జీవితయానము నిరర్థకంబై
విష్ణు కథలను వినని వాడయి
నరకబాధలు పడెడి సమయమున
ఏడ్చిన – లాభము శూన్యమేకదా!

కావున స్వామీ! అనుగ్రహించి
విష్ణు తత్త్వము – కథలను చెప్పుడు
అనగా వినిన మైత్రేయుండు
మృదువుగ పలికెను వాత్సల్యముతో –

“విదురా! నీవు పుణ్యాత్ముడవు
ఈశ్వర ధ్యానమునందు నుంటివి
శ్రీకృష్ణ కథలను చెప్పగ కోరుట
అతి సహజమ్ము – నీ పుట్టుక విను

విదురా నీవు! మాండవ్య మహర్షి
శాపమువలన – శూద్రకాంతకు
జన్మించినట్టి – యముడవు తెలియుము
ప్రజాశాసనము – ధర్మపాలనము

భూభారమును తగ్గించుటకు
కృష్ణుని వెనుక నీవు చేయుపని –
అందులకొరకై అవతరించితివి –
పరతత్త్వజ్ఞానము – జన్మతొ వచ్చెను

అవతార సమాప్తిలో దరికి జేరిన
నాకు – శ్రీహరి ఆధ్యాత్మిక తత్త్వము
ఉపదేశించెను – నీకు చెప్పమనె
కావున నీకు తెలిపెదనంతయు.

జీవుల-తనువు-ఆత్మ-అధికారము
శ్రీహరి ఒకడే - అక్షరుడాతడు
సృష్టికి ముందు వున్నది అతడే
చిత్ - గా - ఒకడే ప్రకాశించును

సృష్టి చేయగ సంకల్పించిన
మాయతొ తాను పురుషుడై మరి
కార్య - కారణము సాధించుటకు
రూపముదాల్చి - సత్ - గా అగబడు

పిమ్మట సృష్టికి - ఉపక్రమించెను
విష్ణుమాయ అది అవ్యక్తమ్ము
అదే ప్రకృతి - అట్టి దానిని
కాలరూపమున నడుపుచుండును

ప్రకృతినుండి మహత్తత్త్వమును
ఉద్భవించగా చేసెను శ్రీహరి
దానినుండి పుట్టె - నహంకారము
త్రిగుణమ్ములకది ఆశ్రయమైనది

సత్త్వగుణ మేళనతొ - దేవతాసృష్టి
తేజోహంకారముతొ జ్ఞానేంద్రియములు
తమోహంకారమునందు పుట్టినవి
శబ్ద - స్పర్శ - రూప - గంధములు

శబ్దమువలన ఆకాశమ్మును
స్పర్శవల్లను వాయువు పుట్టెను
వాయువువలన అగ్నియు - ఆపై
రసముతొ నీరు - గంధముతో భువి

ఆవిధముగను పంచభూతములు
తన్మాత్రలును - ఆవిర్భవించెను
మహత్తు వలన కలిగిన సురలు
విష్ణ్వాంశను కలిగియుందురు

అటుల పుట్టిన మహదాదితత్త్వములు
సృష్టిచేయగ శక్తిచాలక
యోగీశ్వరుడగు శ్రీహరినంత
భక్తిగ నిటుల స్తోత్రముచేసెను

"జగత్కారకా - రమానాయకా!
ఆశ్రితమందార - భక్తజనరక్షా!
పద్మనయన ఓ - పతితపావనా!
మునిజన వందిత - ఆగమవినుతా!

సాత్త్విక గుణాభరణ - చిన్మయరూపా!
ధర్మసంస్థాపక - యోగివందితా!
రాగాదిద్వంద్వ వినాశక! ఓ హరి!
అభివందనమిదె - అందుకోవయా!

గుణరహితుడవై గుణవికారముల
పుట్టించితివి - కానీ మాకు
సృష్టిచేయగల శక్తియున్నదా!
అట్టి శక్తిని నీవు ఈయవలె

మాకు అందెడి శక్తి అంతయు
నీవద్ద నున్నది పురాణపురుషా!
నీ అనుగ్రహము లేకను మేము
అశక్తులమయా! ఆపద్బాంధవ

ఆధ్యాత్మతత్త్వము - పరంజ్యోతియు
సకలప్రపంచము అన్నియు నీవే -
నీ తేజస్సది మాయతొ కలసి
అన్నిటికీ అది మూలమైనది

పరతత్వమైన శాశ్వత పదార్థము
నీవే అని మే మెరుగుదుమయ్యా!
యోగులు-సాధనతో నిన్నుగాంతురు
ఇంద్రియ దాసుల కందవు నీవు!

కావున స్వామీ! సృష్టి చేయగల
శక్తిని మాకు ప్రసాదించుము."
అని ప్రార్థించగ హరి ప్రసన్నుడై
తత్వమ్ములకు మైత్రి పొసగగా

ఒక్కసారిగా తత్త్వములందు
ప్రవేశించెను - శాసించె ప్రకృతిని
దానియందు తన తేజస్సునంతట
లీనమొనర్చి - సమకూర్చె నైక్యత

తత్వములన్నీ హరిలో కలిసెను
అంతట శ్రీహరి - ప్రకృతి యందున
తను నెలకొల్పిన తేజముఅంత
బ్రహ్మాండమను పేరుగలిగినది

వేయివత్సరములున్నది నీటిలో
ప్రాణశక్తులు దానికి లభించె
జీవశక్తి కాధారమైనదది
దానినుండి మరి జనించె జీవులు

పురుషోత్తముని ముఖమునుండి మరి
వాయుసఖుడగు 'అగ్ని' పుట్టెను
కన్నులనుండి సూర్యుడు పుట్టెను
త్వగింద్రియమ్మున వాయువు జనించె

చెవులనుండి మరి కలిగెను దిక్కులు
దౌడలనుండి - వరుణుడు పుట్టెను
ఘ్రాణేంద్రియమున అశ్వనిసురలు
భుజములనుండి ఇంద్రుడు పుట్టెను

మనస్సునుండి చంద్రుడు పుట్టెను
అహంకారమున రుద్రుడు పుట్టెను
శిరస్సునుండి స్వర్గము పుట్టగ
భూమి పుట్టె - పాదమ్ములనుండి

నాభినుండి - ఆకాశముపుట్టెను
సత్వాదిగుణములతొ సురలు పుట్టిరి
సత్వగుణ ప్రధానులు స్వర్గమునుండిరి
రజోగుణముతో మనుజులు - భువిలో -

తమోగుణాశ్రయులు - రుద్రుడు
పారిషదులు - రోదసి వాసులు
విరాట్ పురుషుని ముఖకమలమున
వేదమ్ములవి - వుద్భవించినవి

వేదబ్రాహ్మణుల రక్షణకొరకై
భుజమున పుట్టిరి - క్షత్రియులపుడు
కృషి గోరక్షణ వాణిజ్యముకై
ఊరువులందు వైశ్యులు పుట్టిరి

జాతులందరికి అభిమానముగా
నారాయణ సేవగ - పుట్టిరి కొందరు
కావున అందరి యందున ఒకడే
విరాట్ పురుషుడు-అందరు ఒకటే

విదురా! వినుము పురుషోత్తముడు
తనమాయలను తానే తెలియడు
అన్నటు - మనకు కబడుచుండును
మరియింకొకరికి తెలియగవశమా!

అంతట అడిగెను - భక్తిగ విదురుడు
కర్మకలాపము లేనివాడు హరి
ఎటులవాటిలో బద్ధుడు అగును
వాటిబాధలు ఎందుకు పడుటది?

బదులుగ పలికెను మైత్రేయుండు
నీటిలొ-చంద్రుని బింబముకదలును
కానీ చంద్రుడు కదలడు - నింగిని
అటులే శ్రీహరి కంటవేవియును

శరీరమ్ములలొ ఉన్నను గానీ
కర్మలఫలితము శరీరమ్ముకే!
అటులే శ్రీహరి భక్తుడు కూడా -
ఎట్టివికారము లనుభవించడు

విదురా! భక్తిగ హరిని భజించుచు
హరిస్మరణతొ ఆ కథలను వినుచు
అవలీలగను ఒడ్డుచేరెదరు
దివ్యధామము చేరుకొందురు

అంతయు వినిన విదురుడంతట
నారాయణుని మదిలో తలంచి
తనసందేహముతీరిన దనుచు
పలికె భక్తిగా మైత్రేయునితో

నిశ్చలమైన భక్తి మార్గమును
అవలంబించిన హరి కరుణయది
లభించునన్నది నిస్సందేహము
జప తపాదులను మించును - భక్తి

అటుపిమ్మటను ప్రజాసృష్టియది
ఎటులజరిగెనో తెలుపుము స్వామీ!
బ్రహ్మాది ప్రజా పతులందరిచే
ఏవిధముగ చేయించె - సృష్టిని

తొమ్మిదిమంది ప్రజాపతులు మరి
ఎటుల సృష్టిని - చేసిరివారు?
మనువంశ అధిపతులు వారిచరిత్ర
ఊర్ధ్వ అధోలోకమ్ముల వివరము

పశుపక్ష్యాదులు ఎటుల ఏర్పడెను?
ఏ ఏ అవతారమ్ములనెత్తెను శ్రీహరి?
ఆయాఅవతారమ్ముల లీలలు
పరాక్రమమ్ము - వినగోరితిని

వర్ణాశ్రమములు వాటి ధర్మములు
యోగమార్గము లెన్నియున్నవి
జ్ఞాన మార్గపు ఘనత ఎట్టిది
పాషండధర్మము ఎట్టిది స్వామీ!

పితృమేధము అనగా నెట్టిది
పితృ దేవలోక స్థితి ఎటులుండును
గ్రహ - తారలు మరి కాలచక్రము
దానియొక్క - స్థితిగతులు ఎట్టివి

ఆచరించదగు ధర్మములెవ్వి?
ప్రజలు చేయదగు కర్మలెట్టివి?
ఆపదలవ్వి ఏలాటివగును?
ఎందులకవ్వి వచ్చుచుండును

ఏ ధర్మమది విష్ణుప్రీతియగు?
ఎవరికి శ్రీహరి దర్శనమిడును?
ఉపనిషత్తులు జెప్పెడి జ్ఞానము
ఎట్టిది స్వామీ! తెలియబరచుడు?

అనుచు అడిగిన విదురునికచట
మైత్రేయుడు-తా-తెలిపె వివరములు
అనుచు శుకుడు అట రాజుకు చెప్పెను
భాగవతమ్మిది దివ్యమంత్రమనె

"అల్పసుఖములు అనుభవించుచు
సంసారతాపమును భరించువారికి
ఉపశమనమ్ము భాగవతమ్ము
ముకుందు కథా గీతామృత మిది

అనేక విధముల వేదార్థమును
విప్పిచెప్పునది భాగవతమ్ము
పండిత పామరులందరికీ యిది
నిశ్చల భక్తిని కలిగించునది

భాగవతమ్మును ధరించి ఒకపరి
వాసుదేవుడను పేరునబరగు
సంకర్షణుడు పాతాళమున
నిశ్చలదృష్టితొ ధ్యానమునుండెను

కళ్ళుతెరచి మరి చూచినంతనే
సనందాదులు ఎదురు నిలచిరి
నాగకన్యలు సుస్నాతులయి
పురుషోత్తముని పతిగా కోరిరి

వారిభక్తికి ఆనందించిన
పురుషోత్తముడు వారిని చేకొనె
అంతట ప్రార్థన ఆలకించి హరి
సనత్కుమారునికి చెప్పె భాగవతము

సాంఖ్యాయనునకు భాగవతమ్మును
సనత్కుమారుడు ఉపదేశించెను
పరాశరునికి ఆయన చెప్పగ
పరాశరుండు నాకు చెప్పెను

అట్టిదానిని దివ్య చరితమును
పాపపంకిలము క్షాళన చేసే
పరమ పురాణము నీకు చెప్పెద
నీపరితాపము తీరును రాజా!

భగవంతుడు-తా-స్వయముగ పలికెను
భాగవతమ్ము భాగ్యపు గనియిది
భవబంధమ్ముల ఛేదించునిది
శ్రద్ధాభక్తుల - యోగ్యుడ వినుము!

॥శ్రీ కృష్ణచరితము॥



## 3 బ్రహ్మ - విష్ణువు నాభకమలమునుండి జన్మించిన విధము

జగత్తు అంతయు జలమయమ్మయె
నీటి మధ్యలో పాలనురుగులా
వెలిగెడి శేషుని తల్పమందున
నిర్ణిద్రుడు అట నిద్రనటించెను

తన కుక్షిలొనున్న లోకమ్ములను
తిరిగి సృజించగ యోచనచేసెను
తొలుత సృజించెను-రజోగుణమును
దాని ప్రభావము పద్మోద్భవము

నారాయణుని నాభినుండి ఒక
తామరనాళము ఉద్భవించినది
దానిచివరగలమొగ్గయందున
తనతేజమ్మును ప్రసరింప జేసెను

మొగ్గ విరసినది పద్మములోన
నాల్గుముఖములు వికసించగను
చతురాననుడు ఉద్భవించెను
నాల్గువైపులకు చూచెను బ్రహ్మ

జలమయమై వున్నదంతయు
గాలికి పద్మము వూగుచున్నది
అంతా చిత్రముగా తోచినది
ఏవిధముగను పుట్టెను తాను

అనేక ప్రశ్నలు మదిలో మెదలగ
పద్మనాళపు మొదలు చూడగా
నాళరంధ్రమున క్రిందకు దిగెను
అంతావెదకెను జల ప్రళయమ్మది

నీటిలో దిగి - తా - మొదలు వెదకెను
దేవమానము లెక్కలొ కాలము
వేయివత్సరములైనను - కాని
అన్వేషణయది పూర్తికాదయె

అలసిపోయిన బ్రహ్మదేవుడు
తిరిగి పద్మమున ఆసీనుడయె
అన్వేషణ ఆలోచనలనుమాని
ధ్యానమ్మును - తా - చేయసాగెను

ప్రాణాయామము ఆరంభించెను
అష్టాంగసాధన ప్రారంభించెను
నూరు ఏండ్లట తపము సాగెను
జ్ఞానజ్యోతి అది వెలిగె విరించిలొ

పరంధాముడు సాకారుడయి
దర్శనమిడెను చతుర్ముఖునకు
శేషతల్పమున దివ్యప్రభలతో
ఓరగ పడుకొని దర్శనమిడెను

పీతాంబరమది నీలి మేఘమును
అందగించిన సంధ్యగ తోచెను
మణిమయ మకుటము వెలుగుచున్నది
మత్యాలహారములు కులుకుచున్నవి

దివ్యసుగంధపు తులసిమాలలు
అందములొలికే సుందర వదనము
పద్మమ్ములను పోలెడిపదములు
ఠీవిగ వెలిగెను బాహువులవ్వి

సర్వలక్షణ శోభితుడైన
మంగళమూర్తిని గాంచినంతనే
ఆనందముతో బ్రహ్మదేవుడు
పరవశించెను - మరిమరి చూచెను

శ్రీకారమునకు ఆకారముఅన్నటు
కర్ణములున్నవి భక్తుల - మొరవిన
నీలగిరి శిఖరాగ్రమునందున
ఉదయభానునిగ వెలిగె మకుటము

దివ్యాయుధములు - దుష్ట శిక్షణకు
నిరతము సిద్ధము అన్నటు-స్వామిని
భక్తి ప్రపత్తుల - కొలుచుచున్నవి
సుదర్శనమ్మది సు-దర్శనమ్మయె.

మణిమయ హారములున్నవి మెడలో
భుజ కీర్తులవి - కీర్తి పతాకలు
అంగుళీయకము లానందపు మొలకలు
దివ్య పురుషునికి చేతులు - వేయి

ఊహలకందని చూపులకందని
ఎత్తుగనున్న దివ్య విగ్రహము
దివ్యసుగంధము లెగసెడి మాలలు
కరుణారసము ఒలికే చూపులు

కమల సంభవుడు కన్నులగాంచెను
దివ్య పురుషుని కీర్తిగానమును
వేదశృతులవి చేయుచున్నవి
ఆనందవార్నిధిని తేలె విరించి

ధన్యుడనైతిని అని తలంచెను
ఆనందములో కర్తవ్యముతోచక
సంభ్రమమ్ములో మునిగి తేలెను
భక్తి ప్రపత్తుల స్తుతించె నిటుల

ఆశ్రితమందార! ఆపన్నివారక!
భువనపోషకా - మునిజనవందిత!
త్రిగుణాతీతా! భక్తవత్సలా!
వందనమిదిగో - రమానాయకా!

నీ దివ్యరూపమిది అని చెప్పగను
చాలినవారు లేరు - సృష్టిలో
అంతా నీలో వున్నది నిజమే
అటులేనీవు - అన్నిట వుంటివి

జ్ఞాన దాతవు - విశ్వనియంతవు
నీ దివ్య రూపము చూచితి - ధన్యుడ
నా అజ్ఞానము నశించిపోయెను
వివేకమొదవెను దీనశరణ్యా!

శిష్ట రక్షణకు అవతారములను
ఎత్తుచుందువు అంతా లీల!
నాభి కమలమున జన్మించిన నే
దర్శించితి నిను మున్ముందుగను

జ్ఞానానందమయమగు రూపము
మాయకు లొంగని మంగళప్రదము
సృష్టికి భిన్నము కాని రూపమది
సృష్టిని చూసెడి చిద్రూపమది

నమ్మికలేక వాదన చేసెడి
అజ్ఞానులు నిను కనలేరుగదా!
వేదవందితమైన పదయుగళి
ప్రతిష్టించుకొను హృదయము ధన్యము-

అట్టివాడు పుణ్యాత్ముడు అగును
నీ అనుగ్రహము పొందగలుగును
అటులనీవు ఆ భక్తిలతలకు
బంధింపబడి అనుగ్రహింతువు

ఇంద్రియ సుఖముల వలలో చిక్కి
కామ్యకర్మలు చేసెడి వారు
వాతపిత్త కఫ ప్రకోపమ్ముల
రోగగ్రస్తులై బాధలుపడెదరు

నీమాయ తెలియక జీవుడు తాను
సంసారసంద్రమునమునుగును తేలును
మహామునులును స్మరణమానిన
వారి తపస్సు నిరర్థకంబగును

యోగముతో మరి యోగులు నిన్ను
ధ్యానించినచో వారికి నీవు
వారిధ్యానముకు తగిన రూపముతొ
అనుగ్రహింతువు అంబుజనాభా!

దేవవందితా! యజ్ఞయాగములు
జపతపాది దాన సమాధులు
ఎన్ని చేసినా దర్శనమిడవు
పాదసేవకు ఫలములభించును

సృష్టి స్థితి లయకారణమైన
భువన చక్రమును త్రిప్పెడివాడవు
లోక క్షేమముకు అవతారములను
ఎత్తెడి స్వామీ! వందనశతములు!

సంసార లంపటమునందు మునిగిన
జీవుడు తాను అంత్యకాలమున
నిన్ను తలంచి – గుణకీర్తన చేసిన
జన్మజన్మల పాపము లడగును

భక్తుల నుద్ధరించుట కొరకు
లీలావతారములెత్తి – బ్రోచెడి
భక్త కల్పకము నీవే స్వామీ!
భువన తరువుకు ఆకారమునువు

నీదు ఆత్మ ఘనవృక్షపు మూలము
నీవుయు నేను హరుడును దానికి
ప్రధానమైన శాఖలగుదుము
మనువు మరీచి, సుర – లుపశాఖలు

నీ పాదపద్మముల సేవించనిమూఢుడు
పశుతుల్యుడగు ఓ పరాత్పరా!
కాలరూపివగు నీవు లీలగా
జరామరణములు కల్పించి తృంచెదవు

నీ స్వరూపము చూడగ నేను
పెక్కుఏండ్లుగా జపము చేసితిని
ఫలితములేక దీనుడనై మరి
ప్రార్థించితిని – నీదయ కలిగెను

నీవు సృజించిన లోకములన్నియు
నీ కుక్షిలోనుంచుకు కాపాడెదవు
భీకరసంద్రము మధ్యలోనున్న
భయంకరమ్మగు పన్నగమ్ముపై

యోగనిద్రలో నుందువు దేవా!
నీవు మేల్కొని లోకమ్ములను
వ్యక్తము చేసెడి సూత్రధారివి
నీపదములను ఆశ్రయించితిని!

జగన్నాయకా! సృష్టిచేయుటకు
మనసు కలిగియు అశక్తుడనయా!
సృష్టిచేయగల శక్తినొసగుము
నీ అనుగ్రహము కలిగితి – ధన్యుడ!

సృష్టిచేసిన తదుపరి నాకు
కర్మసంబంధము కలుగును తప్పక
ఆసమయములో దానివల్లను
పతనము కాకను నను కాపాడుము!

నీ పదములను ఆశ్రయించుకొని
పూజను సలిపే ప్రథముడ – భక్తుడ
నీ గర్భ జనితమగు పద్మమునందున
ఉద్భవించిన – మురిపెపు బిడ్డను

నీ కరుణావీక్షణము లభించెగాన
సృష్టిచేయగా సిద్ధపడితిని
నాకార్యము సిద్ధింపజేయుము!
అనుచు భక్తిగా పదములనంటెను

బ్రహ్మదేవుని అనుగ్రహించెను
అజ్ఞానతిమిరము తొలగించుటకై
సృష్టి చేయు – సామర్ధ్యము నొసగి
ఈవిధముగను పలికెతీయగా

"ఓ చతురానన! నీ కోరిక తీరును
నిశ్చలతపము నిర్మల భక్తితో
ననుసేవించుము – ఆరాధించుము
తపోశక్తియది కావలసినది

లోకాలలో నాస్థితిని గాంచెదవు
జీవుల – నేను వుండుట గాంతువు
అంతట నీకు నాలో వెలసిన
లోకములన్నీ తీరుగ అగపడు

ఆయాకర్మల ఫలితముచేత
వాటికి తగిన రూపము దాల్చెడి
ప్రాణుల – నీవు సృష్టించెదవు
నాపాదస్మరణతో – పాపము అంటదు

సర్వభూతములు, ఇంద్రియాలకు
గుణాలకున్ను – ఆత్మను నేను
జగత్తునంతయు నిండియుందును
నాస్వరూపము చూపితి నేను

సురలకు సైతము ఊహకందనిది
నాస్వరూప–స్వభావము తెలియుము
నిర్గుణుడనగు నేను సగుణునిగ
లోకసృష్టికై అగపడెదనని

---

తెలిసిన నీవు సగుణమూర్తిగా
నను భావించి స్తుతించినావు
ఆనందించితి అనుగ్రహించితి
నీమదికోర్కెలు అన్నియు తీరును

నీవు స్తుతించిన ఈస్తోత్రమది
ముల్లోకముల పావనమొనర్చు
మంగళప్రదమిది వినిన చదివినా
దర్శనమిడెదను కోర్కెలు తీర్తును

జపతపాదులు-భూదానము మొదలగు
పుణ్యకార్యముల వచ్చెడి ఫలమును
మించిన ఫలమది - నాస్తోత్రముతో
నాపై భక్తితో - లభించగలదు

నాలోనున్న - లోకమ్ములను
అహంకారాది తత్వమ్ములను
గ్రహించి - సృష్టిని చేయుము నీవు
సృష్టికర్తగా అనుగ్రహించితి."

అంతట విదురుడు అడిగె మైత్రేయుని
"స్వామీ! విధాత భువన సృష్టిని
ఎటుల చేసెను సెలవీయవలె"
అనగా పలికెను మౌనివర్యుడు

పద్మనాభుడు అంతర్హితుడయె
పద్మాసనుడు తపములొ కూర్చొనె
నూరు దివ్యసంవత్సరమ్ములుగ
హరిపరముగను తపస్సుచేసెను

కన్నులుతెరచెను బ్రహ్మదేవుడు
పెనుగాలెగసెను పద్మముకదిలెను
తపోశక్తితో జ్ఞానముపెరిగెను
ముందుగ - గాలిని బంధించెనట

అంతట చుట్టూ కదలెడి నీటిని
ఆపోశనము పట్టివేసెను
అప్పటికే మరి నింగి వరకును
వ్యాపించినది నీరంతయును

కన్నులు మూసి ధ్యానించెను హరిని
పద్మాసనము నింగిన వున్నది
అందులో ముద్దగ లోకములన్నీ
వున్నవి - గనెను - చతురాననుడు

తామరపూవులొ ప్రవేశించెను
మూడు జగములవి వేరువేరుగా
అగుపించినవి బ్రహ్మదేవునికి
హరి - కర్తవ్యము చూపెననుకొనె -

అంతట బ్రహ్మ - హరి అనుగ్రహమున
పదునాల్గులోకముల సృష్టిచేసెను
సురలను నరులను పశుపక్ష్యాదుల
స్థావర జంగమ సృష్టిచేసెను

అని మైత్రేయుడు చెప్పగనంత
విదురుడడిగెను స్వామీ! మీరు
కాలము ఆ పురుషోత్తము దనిరి
కాలవిశేషము తెలియపరచుడు

సృష్టిచేయగ హరి తలంచగ
మూలతత్త్వమది త్రిగుణమ్ములను
దశేంద్రియమ్ముల కల్పనచేసెను
కాలము-మహత్తు - మొదలగునట్టి

భౌతిక-ఆధ్యాత్మిక - తత్త్వములవ్వి
మూలతత్త్వమును ఆశ్రయించెను
అంతట శ్రీహరి కాలమ్మునకు
తన కళనొసగి కాలరూపిఅయె

కావున - కాలము బలమైనదది
కాలముతోనే జరుగునన్నియు
కాలరూపమున సృష్టిచేసెను
కావున అన్నిట ఈశ్వరుడుండును

కావున వినుము - విశ్వమంతయు
పురాణపురుషుని మాయవల్లనే
పుట్టి-పెరిగి మరి - ముగిసిపోవును
ఇటులే సృష్టి-జరిగెను-జరుగును

॥శ్రీ కృష్ణచరితము॥



# 4 బ్రహ్మనిర్మితమైన దశవిధసర్గములు

తొమ్మిది విధముల సృష్టియున్నది
కాల, ద్రవ్య, గుణములు అనుచు
మూడు భేదముల కలసియుండును
మహత్తుఅన్నది మొదటి సృష్టియగు

నారాయణుని గుణ భేదములతో
మహత్తు అన్నది ఏర్పడుచుండును
ద్రివ్య, జ్ఞాన, క్రియల ఆశ్రయము
అహంకారమను - రెండవ స్కందము

పృథివిమొదలగు పంచ భూతములు
మూడవదిగను - చెప్పబడునది
శబ్ద, స్పర్శ, రూప, రస, గంధమ్ములవి
పంచ తన్మాత్రలుగా - నిలచియన్నవి.

ఆకాశ మాత్ర - శబ్దముఅగును
వాయువు స్పర్శ - అగ్నిరూపము
జలమాత్ర - రసము అయినది
పృథివీ మాత్ర గంధముఅగును

త్వక్కు-చక్షువులు-కర్ణ-జిహ్వాలు
నాసిక అనునవి జ్ఞానేంద్రియములు
వాక్కు-పాణి-పాద-పాయు
ఉపస్థములు కర్మేంద్రియములు

జ్ఞాన,కర్మేంద్రియములు నాల్గవ సర్గము
సుమనసుల సృష్టి - ఐదవదగును
సాత్వికాహంకార ప్రధానము
మనస్సు దానికి ఆశ్రయమగును

తమోగుణ ప్రధానము ఆరవదగును
మతి ప్రధానము కాని - వికారమ్ములు
దాని నాశ్రయించుకొని వుండును వినుము
ఈ ఆరుసర్గములు ప్రాకృతమ్ములగు

వైకృతసర్గములన్నవి వినుము
పూలు లేక మరి ఫలించు తరువులు
రావి, మఱ్ఱి మొదలగునట్టివి
పుష్పించి పండి - నశించు సశ్యము

మాలతి మల్లికాది లతాకుంజములు
వెదురు మరియు పొదలును ఆపై
పూసి పండెడి మామిడి మొదలగు
తరువులు ఏడవ సృష్టిగ నగును

వృషభమ్ములును ఎనుబోతులును
మేకలు పందులు లేళ్ళు గాడిదలు
అశ్వములున్ను ఐదుగోళ్ళుకల
కుక్కలు-నక్కలు-తోడేళ్ళు మరియు

పులులు-పిల్లులు - చెవులపిల్లులు
కోతులు సింహమ్ములు ఏనుగులు
తాబేళ్ళు-మొసళ్ళు జలచరమ్ములగు -
ఆపై-గ్రద్దలు-డేగ-భల్లూకములు

నెమళ్లు - హంసలు - చక్రవాకములు
కాకులు మరియు గుడ్లగూబలు
మొదలగు పక్షులు - ఎనిమిదవ సృష్టి
మానవ సృష్టి తొమ్మిదవదగు

దేవసృష్టి అది పదవదైనది
సురలు - దేవతలు - పితృదేవతలు
గంధర్వ - అప్సరస - సిద్ధచారణులు
కిన్నర-కింపురుషులు చేరెద రందులో

బ్రహ్మనిర్మిత దశ విధసృష్టి
తెలిపితి - ఆపై చెప్పెద వినుము
మనువులు-మరియు-మన్వంతరములు
అనుచు పలికెను మైత్రేయుండు -

ప్రతియుగమునకు నారాయణుడు
స్వయంభువుగను - రజోగుణముతో
స్రష్టఅగును - తన రూపమునంతట
విస్తరించుచు నుండును వినుము

ఈ కల్పములో నుండెడివారగు
దేవాసురులు ప్రతిమన్వంతరమున
ఇప్పటి నామరూపులతోను
ఉందురు - వారు తెలియగవలెను

దేవ గణసృష్టిలొ నున్నదైనను
ప్రాకృత-వైకృత-సృష్టిభేదములు
కలసి-దేవత్వము మరి మానవత్వముగ
నుండెడి సర్గము - కౌమారసర్గము

దానిని-సనత్కుమారాది సర్గమందురు
పరాత్పరుని - లీలయే యిది
ఇకపై విషయము కాల లక్షణము
తెలిపెద వినుము - అనుచు తెలిపెను.

ఇతర వస్తువుల కలయికలేక
సృష్టికి తాను – ఆధారభూతమై
సూర్యకిరణమున ఎగురుచు అగపడు
రేణువులో–అరవవంతు–పరమాణువగు

పరమాణువులో – సూర్యగమనము
పట్టెడికాలము సూక్ష్మకాలము –
ద్వాదశరాశుల సూర్య మండలము
దానివలనను ఏర్పడుచుండును

సూర్య భ్రమణ మాధారముగను
జరుగు నట్టి ఒక సంవత్సరమ్మది
మహత్కాలముగ – పరిగణింతురు
రెండు పరమాణువులొక–అణువగును

మూడు అణువులొక – త్రసరేణువగు
మూడు త్రసరేణుపు–లొక తృటియగును
వేయితృటిలు వొక వేధయనబడు
మూడు వేధలొక – లవము అనబడు

మూడు లవములొక–నిమిషమ్మగును
మూడునిమిషములు–ఒక్క క్షణమగు
ఐదుక్షణములొక – కాష్ట అనబడు
పదికాష్టలను – లఘువు అందురు

పదునైదులఘువులు–ఒక నాడియగు
రెండునాడులొక ముహూర్తమనబడు –
ఆరు ఏడునాడులు మానవ గణమున
ఒక ప్రహరము లేక ఝాముఅనబడును

నాడికలతో దినసరిపరిమాణమ్మును
ఈవిధముగను తెలుసుకొందురు
ఆరుపలముల రాగి పాత్రను
ముందుగ సిద్ధము చేసుకు – దానికి

నాలుగు మాషల బరువు కలిగిన
బంగారముతో నాలుగంగుళముల
పుడకనుచేసి – రాగి పాత్రకు
రంధ్రముచేసి – అమర్చవలెను

రాగిపాత్రలో నీటినిపోసి
బొట్లుబొట్లుగా – జారనీయవలె
నీరుపూర్తిగా కారుటకైన
సమయము – నాడిగ – పరిగణింతురు

నాల్గుఝాములు ఒక పగలగును
నాల్గుఝాములు అటులే రాత్రి
రేయింబవళులు మానవ – దివసము
పదునైదు దినములు – పక్షము అగును

కృష్ణ, శుక్ల, రెండు పక్షములు
ఒక మాసముగా లెక్కింపబడు
పితృదేవతలకది – యొకరోజు
రెండు మాసములు వొకఋతువగును

ఆరుమాసములు వొక ఆయనమగు
ఉత్తర, దక్షిణ – అయనమ్ములొక ఏడాది
దేవతలకది వొక దివసము అగును
నూరుఏండ్లు మరి మానవ పరమాయువు.

కాలాత్మకుడు ఈశ్వరదేవుడు
సూర్య, గ్రహ, నక్షత్ర - తారా చక్రముల
మధ్యనెలకొని కాలగమనమును
పన్నెండురాశుల నడకతొ కూర్చి

సౌర - బార్హస్పత్య - సాయన చంద్ర
నాక్షత్రములను మానవభేదముల
సంవత్సర - పరివత్సర, ఇడావత్సర
అనువత్సర మిద్వత్సర నామమ్ములతో

కాలగమనమును తాను గ్రహించి
కాల చక్రమును త్రిప్పుచుండును
మానవశక్తి ఆయువు తగ్గగ
సుఖ విరక్తిని కలిగించుచును

సర్వ సుఖములు కోరెడి వారికి
యజ్ఞయాగముల మోజు పెంచుచు
ఆకాశమున విశ్వమునందు
తిరుగుచుండును విశ్వంభరుడు

విదురా! నీవా కాలస్వరూపుని
సూర్యభగవాను నారాధించుము
అని ముని చెప్పగ - విదురుడడిగెనట
ప్రియముగ దయతో చెప్పుచుంటివి

మూడు లోకముల పైన వసించు
పుణ్యాత్ములు మరి యోగసిద్ధితో
బాహ్య జ్ఞానమున లోకమ్ములగను
వారి కాలగమనము-వివరించుమయా!

విదురా వినుము-కృతయుగసమయము
నాల్గువేల దివ్య వత్సరమ్ములయా!
ఎనిమిది వందల ఏండ్లు-దానిసంధ్యలు
త్రేతాయుగము-మూడు వేలవత్సరమ్ములు

త్రేత సంధ్యలు ఆరువందల వసంతమ్ములు
ద్వాపరయుగము రెండువేల ఏండ్లయా!
సంధ్యలు నాలుగు వందల ఏండ్లు -
కలియుగ పరిమితి వేయివత్సరములు

కలియుగ సంధ్యలు రెండువందలేండ్లు
సంధ్యాంశ మధ్యకాలమున
ధర్మము పెరుగును విదురా వినుము!
అంత్యమునందు ధర్మముతగ్గును

కృతయుగమందు ధర్మము - తాను
నాల్గుపాదముల వర్తించునయా!
త్రేతలొ - మూడు పాదములనడచును
ద్వాపరమందున - రెండుపాదములు

కలియుగమందు ధర్మదేవతకు
మూడు పాదములు వినష్టమగును
ధర్మబలమది తగ్గిన కొలదిని
అధర్మబలమది పెరుగుచుండును

ఏకపాదమున ధర్మము నడిచే
కలియుగ మందున భూసురులున్ను
పాపబద్ధులై - పాపకార్యములు
ఆచరించెదరు - యుగ మహాత్మ్యమది

భూ-భువర్-స్వర్లోకములకు
పైనవున్నది సత్యలోకమది
సృష్టికర్తయగు బ్రహ్మవుండునట
నాల్గుయుగముల వేయి-బ్రహ్మకు పగలు

నాల్గుయుగములు వేయిగడచిన
అటులే బ్రహ్మకు రాత్రియగునయా!
ఆ రాత్రియందున బ్రహ్మనిద్రించును
బ్రహ్మ నిద్రయది ప్రళయ సమయము

మేల్కొనినంత సృష్టిమొదలగును
మేల్కొన్నరోజుకు మనువులు
పదునాల్గుమంది మరి సాగిపోదురు
మనువులు సాగు కాలమానమిది

దేవయుగములు - డబ్బది వొకటిగ
చెల్లిపోవగా - వొకమనువు చను -
మనువులు-సురలు-మునులు-సప్తర్షులు
భగవదంశతో పుట్టి - ఏలెదరు

అయాదేవ పితృదేవ సుర నర
తిర్య గ్రూపమ్ములలో విష్ణువు పుట్టి
మన్వంతరముల పరిపాలించును
ఇదియే మనువుల సృష్టివివరము

ప్రళయసమయమున నాటి రాత్రిలో
గాడాంధకారము నిండి పోవును
లోకమ్ముల - తేజమంతయు
సూర్య చంద్రులలొ కలసిపోవును

అంతట శ్రీహరి శక్తి - అగ్నియై
మూడులోకముల దహించి వేయును
ఆ వేడికి మరి మహర్లోకవాసులు
జనలోకమునకు సాగిపోదురు

మహావాయువు వీచుట మొదలిడు
సంద్రపుటలలు విజృంభించగ
మూడులోకములు జలమయమగును
ఆసమయములో పరంధాముడు

శేషతల్పమున జలరాశిపైన
మేనువాల్చి తను లోకమ్ములను
కుక్షిలొ నింపుకు యోగనిద్రలో
నుండును - ఆయన జగద్రక్షకుడు

బ్రహ్మదేవునికి - దేవమానమున
నూరువత్సరములు పరమాయువగు
పూర్వాపరార్థము మరి ద్వితీయ పరార్థమని
రెండుభాగములుగా విభజింతురు

పూర్వాపరార్థమది పూర్తియైనది
ద్వితీయ పరార్థమ్మది జరుగుచున్నది
పూర్వపరార్థ కాలమ్మునకు
బ్రహ్మకల్పమని పేరుబెట్టిరి

విష్ణువు నాభికమలము నుండి
బ్రహ్మపుట్టిన కాలమ్మునకు
బ్రహ్మకల్పమని చెప్పుచుందురు
పూర్వపరార్థమ్మునకు - మొదలది

ద్వితీయపరార్ధపు ఆదికాలమున
వరాహరూపమును హరి ధరించెను
కావున అది మరి వరాహకల్పము
వరాహకల్పము నడచుచున్నది

ఇల్లూ - వాకలి - ఇల్లాలనుకొను
మమతలపైన - కాల పెత్తనము -
పరాత్పరునికి కాలమంతయు
వశమై యుండును జగన్నియంత

పరమాణువు మొదలుగ సృష్టియందలి
యుగ పరార్ధపు కాల మంతయు
ఈశ్వరునికి ఒక నిమిషముగానగు
ఆ విశేషము తెలియగవలెను

బ్రహ్మాండకోశము వివరములివి యని
తిరిగి పలికెను మైత్రేయుడట
పదునారు వికారమ్ములు, పంచభూతముల
యాబదికోట్ల విస్తీర్ణము కలిగియున్నది.

బ్రహ్మాకోశమున శ్రీహరి తాను
పరమాణురూపమున నెలకొని యుండును
మహాండకోశములు ఎన్నో హరిలో
అణగియుండును ఆశ్చర్యమది.

 ॥శ్రీ కృష్ణచరితము॥

## 5 మైత్రేయుడు విదురునకు సృష్టిమహిమ తెలుపుట

బ్రహ్మదేవుడు జీవులందరికి
మోహ-మహామోహము-అంధతామిస్రము
తామిస్రమ-మరి-చిత్త విభ్రమము
అనెడి లక్షణము లైదేర్పరచెను

అవిద్యాపంచకము అనెడివి ఐదు
నేను-అనుచు దేహాభిమానమది
కలిగించునది - మోహలక్షణము
మహామోహమది - భోగాసక్తి

స్త్రీ - పుష్పమాలికా - సుగంధచర్చల
భోగము లేనిచొ - కలిగెడి కోపము
అంధతామిస్రము - అని పిలువబడు
వాటి కోస మారాటము తామిస్రము

భోగములమరక వ్యాకులమ్మది
చిత్తవిభ్రమము గా చెప్పబడు
అవిద్య ఫలితము వల్ల కలుగునవి -
అట్టి సృష్టిని గాంచిన బ్రహ్మ

అసంతృప్తితో వంతనొందెను
అంతట ధ్యానము చేసె శ్రీహరిని
శుద్ధ మనస్కుడుఅయ్యె విరించి
తిరిగి సృష్టిని ఆరంభించెను

అట్టిసృష్టిలో సత్వమూర్తులగు
మహామునులు మరి ఉద్భవించిరి
దివ్యతేజముతొ ప్రకాశించిరి
చల్లనిచూపుల - లోక పూజ్యులు

ధీర గంభీరులగు దివ్యమూర్తులు
సనక - సనందన - సనత్కుమార
సనత్సుజాతులు - శ్రీహరి భక్తులు -
పరమ పవిత్రులు - మానసపుత్రులు

తనయులగాంచి ఆనందించి
బ్రహ్మపలికెను - కర్తవ్యముచెప్పెను
ప్రజాసృష్టిని చేయుడు మీరు
ప్రపంచమును మరి వృద్ధిచేయుడు

అంతట పలికిరి వినయము నిండి
మోక్షసాధన తప్ప - మరింకొకటి
తమకు హితవు మరి కాదని చెప్పిరి
దానితొ బ్రహ్మకు కోపము కలిగెను

తన కోపమది అనర్థమనుకొని
వెంటనె బ్రహ్మ శాంతి వహించెను
కానీ ఆయన కనుబొమలవ్వి
ముడిపడె - పుట్టెను నీలలోహితుడు

చిరుకోపములో ముడివడినట్టి
కనుబొమలనుండి మరి పుట్టిన యట్టి
నీలలోహితుడు - రోదించె బిగ్గరగ
అంతట బ్రహ్మనుగాంచి పలికెను

దేవా! నేను వుండెడి దెచట
నా నామధేయము ఏమది తెలుపుము
అంతట బ్రహ్మ శిశువునుగాంచి
లాలనచేసి పలికెనప్పుడు

విశేషధ్వనితో రోదించితివి
కావున రుద్రుడు-అని ప్రసిద్ధియగు
మిగిలిన పేర్లు-మన్యువు-మనవు
మహాకాలుడు-మహత్తు-శివుడును

ఋతధ్వజుడు మరి ఉరురేతనుడు
భవుడు-కాలుడు-వామదేవుడు
దృఢవృతడను అను నట్టివగు
ఏకాదశనామమ్ము లుండును

ఏకాదశరుద్రులుగా ప్రసిద్ధికలుగును
ధీ-వృత్తి-ఉశన-ఉమనియుతి-నర్పి
ఇల-అంబిక-ఐరావతి-సుధ-దీక్ష
అనువారు మరి నీకు భార్యలగుదురనె

చంద్ర-సూర్యులు-అగ్ని-వాయువు
జలము-గగనము-పృధివి-ప్రాణము
తపస్సింద్రియ - హృదయమ్ములు మరి
నీకు స్థానములుగా నుండును విను

పై - నామములతొ - నీ భార్యలతో
నీస్థానములలొ వసించి నీవు
ప్రజాసృష్టిని చేయుము అనుచు
బ్రహ్మదేవుడు చెప్పె - రుద్రునకు

బ్రహ్మ ఆనతిని రుద్రుడంతట
తనతో సమమగు రుద్రుల సృజించె
వారందరును విజృంభించిరి
కనబడునట్టిది మ్రింగజొచ్చిరి

రుద్రగణమది విశ్వమునంతయు
బాధించుటది బ్రహ్మకుతెలిసి
వారిని పిలచి వారిసృష్టియది
చాలని పలికి - శాంతించమనె

ఇకపై సృష్టి - చేతును నేను
మీరందరును లోకశ్రేయముకు
దీక్షగ తపస్సునాచరించుడు
విష్ణుప్రియముగ తపముచేయుడనె

బ్రహ్మమాటను శిరమున దాల్చి
అహంకారమును అంతము చేసి
విష్ణుపరముగా తపస్సుచేయగ
నిశ్చయించిరి రుద్రులందరు

అటుపిమ్మట ఆ - విరించి తాను
విష్ణుధ్యానము చేసి - భక్తిగా
పదిమంది సంతతిని సృష్టి చేసెను
అంగుష్టము నుండి - దక్షుడు పుట్టెను

ఊరువులలో నారదుండును
నాభినుండి మరి పులహుడు పుట్టెను
చెవులనుండి మరి పుట్టె - పులస్త్యుడు
చర్మమునుండి - భృగువు పుట్టెను.

అరచేతినుండి మరి పుట్టెను క్రతువు
అంగీరసుడు పుట్టెను ముఖమున
ప్రాణమువలన జనించె వశిష్టుడు
మనస్సునుండి - మరీచి పుట్టెను

కన్నులనుండి అత్రి జనించెను
బ్రహ్మతేజమున భగవద్భక్తితొ
వారందరును అతిసమర్థులై
లోకముసృజించు శక్తికలిగిరి

అంతట విరించి దక్షిణ హస్తమున
ధర్మ ప్రాదుర్భావము జరిగెను
వెన్నునుండి మరి మృత్యువు మరియు
అధర్మమ్మును ఉద్భవించినవి

ఆత్మనుండి మరి కాముడు జనించె
కనుబొమలనుండి కోపము పుట్టెను
పెదవిని లోభము-ముఖమున వాణియు
గుహ్యావయమున - జలధులు కలిగెను

అపానమ్మున పాపాశ్రయుడగు
నిర్మృతి కలుగగ - నీడ వల్లను
దేవహూతి - కర్దము లుద్భవించిరి.
బ్రహ్మమనస్సును - దోచెను వాణి

అందగత్తెను ముందర గాంచి
తనవల్ల పుట్టెను - అన్నది మరచి
ఆలింగనము చేసుకొనగను
మరీచి మొదలగు వారికి నచ్చక -

కన్నకూతురును కామించుటది
కానిపనియని - సూటిగ పలికిరి
ధర్మదూరమగు పని అని వారు
కటువుగ ననిరి సృష్టికర్తతో -

కథనోక్తులను వినిన విరించి
సిగ్గుతొ క్రుంగి కుమిలి పోయెను
తనువు - త్యాగము చేసెను బ్రహ్మ
అంతలొ దిక్కులు తనువున చేరెను.

చీకటి - మంచు - అన్నవంతట
బ్రహ్మతనువున - ఉద్భవించినవి
వేరొక తనువును బ్రహ్మ ధరించి
శ్రీహరిధ్యానము చేసి - అంతట

తిరిగి సృష్టికై యోచనచేసెను
గాఢముగా నిట్టూర్పు విడవగా
నాల్గుముఖములనుండి అప్పుడు
వేదములవ్వి ఉద్భవించినవి

వాటివల్లన - యజ్ఞ కర్మలు
ఆశ్రమధర్మమ్ములు - తంత్రములు
వెలుగు చూచినవి - అని చెప్పగను
విదురుడు భక్తిగ అడిగె మైత్రేయుని

స్వామీ! విరించి ఏముఖము నుండి తా
ఏ సృష్టిచేసెను తీరుగ చెప్పుడు -
అంతట పలికెను మైత్రేయుండు
ఋగయజుస్సామాధర్వ వేదములు

హోతృకర్మలగు అప్రగీతయు
మంత్ర స్తోత్రములగు శాస్త్రమ్ములును
అధ్వరుకర్మయగు యజ్ఞము మరియు
సంప్రగీత స్తోత్రమగు స్తుతులున్న

ఉద్గాతృప్రయోజ్యము ఋక్కులమయమగు
స్తోత్రము మరియు ప్రాయశ్చిత్తమగు
బ్రహ్మకర్మమును - ఆయుర్వేదము
ధనుర్ గాంధర్వ వేద ఉపవేదములు

విశ్వకర్మ శాస్త్రమగు - శిల్పశాస్త్రము
విరించి - ప్రాగాది ముఖముల పుట్టెను
పంచమ వేదమనబడు పురాణేతిహాసములు
నాల్గుముఖముల నుండి పుట్టినవి

షోడశి - ఉక్థ్య జయన - అగ్నిష్టోమ
ఆప్తోర్యామ అతిరాత్రములును
వాజపేయ గోమేదాదములను
కర్మతంత్రములు ఉద్భవించినవి

విద్య-దానము-తపస్సు-సత్యము
అనునవి అగును ధర్మపాదములు
బ్రహ్మచర్య-గార్హస్థ వానప్రస్త
యత్యాశ్రమములు నాలుగాశ్రమములు

ఒక్కొకదానికి నాల్గువిధములగు
వృత్తులున్నవి వివరించెదను -
సావిత్రము అన బ్రహ్మచర్యము
ఉపనయనము నుండి గాయత్రి జపించవలె

వేదవిహితమగు వ్రతములు నాలుగు
ప్రాజాపత్యము అనిపిలవబడు
వేదవ్రత దీక్ష కలిగిన వారు
ఒక్కొక వసంతము పాటించవలె

వేదాధ్యయనము పూర్తిచేయుట
బ్రహ్మము అందురు విదురా! వింటివ!
వేదమార్గనిష్టను కలిగియుండుట
బృహత్తు అందురు – వేదవిహితములు

బ్రహ్మచర్యాదిగా నాల్గువ్రతములు
కృషి, వార్తయు, శాలీన వృత్తి,
ఉంఛ వృత్తి యను గృహస్థవృత్తులు
వైఖానస – వాలఖిల్యులును

ఔదంబరులు – ఫేనవులున్ను
వానప్రస్థులలో విభజింపబడి
బ్రహ్మదేవుని పూర్వాదిముఖముల
ఉద్భవించిరి – అంతియె గాక

కుటీచకులును – బహూదుడున్ను
హంసుడు మరియు–నిష్క్రియుండును
సన్యాసుల తెగలకు చెందినవారు
ప్రాగాది ముఖములనుండి పుట్టిరి

అన్వీక్షకి అను మోక్షప్రద విద్య
వేదవిద్య–మరి జీవనమార్గము చూపి
కృషి, వ్యాపారము తెలిపెడి విద్య
వార్తయను విద్యలు మరియు

దండనీతియు ధర్మార్థకామమోక్షముల
సాధించగల – న్యాయవిద్యలు –
భూర్భువస్సువ – అను వ్యాహృతులున్ను
పూర్వాది ముఖములనుండి పుట్టినవి

హృదయమునుండి ఓంకారము పుట్టెను
ఉష్ణిక్ఛందస్సు పుట్టె రోమముల
చర్మమువలన గాయత్రి ఛందస్సు
మాంసముతో త్రిష్టుప్ఛందస్సు

సూక్ష్మనరములగు స్నాయువు వలన
అనుష్టుప్ఛందస్సు పుట్టగా
ఎముకలనుండి జగతీ ఛందస్సు
మజ్జ అను కొవ్వునుండి పంక్తియు

ప్రాణమువలన బ్రహతీనాయకమగు
ఛందస్సులవి ఉద్భవించినవి –
కకారాది పంచవర్గాత్మకముల
స్పర్శమువలన జీవుడు మరియు

అకారాది సర్వాత్మకి మగు దేహము
ఊష్మములను పేరున బరగు
శష–సహ–అను నాల్గువర్ణముల
రూపము గలిగిన ఇంద్రియమ్ములు

అంతస్థములను సంజ్ఞలుకలిగిన
యరలవ–అను వర్ణమ్ములతో
షడాది సప్తస్వరూపములను
సప్తస్వరములు సరిగమపదని

ఆత్మబలమున శబ్ద బ్రహ్మము
విరించి లీలా విశేషమున పుట్టెను
వ్యక్తావ్యక్తము అయినది మరియు
వైఖరీ ప్రణవాత్మకమైనది అగుటచె

శబ్దబ్రహ్మచే పరమాత్ముడు తాను
అవ్యక్తాత్ముడు అగుట చేతను
పరిపూర్ణునిగా దర్శనమిడుచు
వ్యక్తాత్ముడు మరి అగుట వల్లను

ఇంద్రాది శక్తులతొ విభక్తునిగా
అగపడుచుండును – పరంధాముడు –
అంతట బ్రహ్మ ఆలోచించెను
సృష్టి జోరుగా సాగుటలేదని

దైవానుకూలము అవసరమనుకొని
త్రోవవెదకుచూ నుండెను బ్రహ్మ
రెండు తనువులు – బ్రహ్మ ధరించెను
వాటినుండి మరి పుట్టినవారు

స్వాయంభువమనువు మరియు
శతరూపయను కన్యకామణియు
వారిద్దరున దంపతులాయిరి
వారుపొందిరి దివ్యసంతతిని

స్వాయంభువ – శతరూపలకు
ప్రియవ్రత – ఉత్తానపాదులను
తనయులిద్దరు – ఆపై వారికి
ఆకూతి,దేవహూతి,ప్రసూతి ఆడసంతతి

రుచికునకు – ఆహూతినిచ్చెను
దేవహూతిని – కర్దమున కిచ్చెను
ప్రసూతిని మరి దక్షునకిచ్చి
పెండ్లి చేసెను స్వాయంభువ మనువు

వారి సంతతితొ ప్రజావృద్ధిఅయె
అనగా విదురుడు ఓ పుణ్యాత్మా!
స్వాయభువమనువు పుణ్యచరిత్రుడు
ఆయన చరితముసెలవీయవలె

విష్ణు సేవానిరతుల చరితలు
వినిన – పాపములు నశించిపోవును
అనుచు పెద్దలు నీ సరివారు
అందురు కావున – ఆలకింతును

విదురా! నిజమే నీవు చెప్పినది
కేవలమొక్క శాస్త్ర పఠనము
ఫలితమునీయదు – కానీ వినుము
భక్తి ఒక్కటే ఫలితమునీయును

భాగవత కధవినెడివానికి
కలిగెడి ఫలము అనంతమైనది
అనుచు తాను మరి పరవశించుచు
పలికెనప్పుడు మైత్రేయుండు

స్వాయంభువుడు పతివ్రతయగు
ధర్మపత్నితో బ్రహ్మదేవునకు
భక్తి – వినయముల వందనముంచి
కర్తవ్యమును బోధించమనె

"తనయుడు – తాను – తండ్రి కిష్టమగు
పనులు చేయుట – విద్యుక్త ధర్మము
ఇహపరములు సాధించినవాడగు
ధన్యుడ నేను – ఆదేశించుము."

ఆనందించిన బ్రహ్మపలికెను
"తనయునిగా నువు లెస్సపలికితివి
తండ్రి యాజ్ఞను తలదాల్చవలె
నారాయణుని సేవించవలె

ముఖ్యవిషయమిది పరంధాముడు
యజ్ఞము మరియు యజ్ఞమూర్తియు
యజ్ఞఫలమును ఆతడె యగును
ఆ పరమాత్ముని తృప్తి పరచవలె

సర్వేశ్వరుని కాదని చేసెడి
కర్మలన్నియు నిరర్థకమ్ములు
నిష్కామ్యకర్మగా విష్ణుపరముగా
యజ్ఞయాగములు చేయగవలెను

స్వర్గాది కామ్యములు మదిలో తలచి
యజ్ఞయాగములు చేయుట అన్న
కేవలమది మరి ధన నష్టమగు
వలయు ఫలములను ఈయజాలవవి.

అన్యచింతనలు అన్నీ వదలి
విష్ణు విధేయత కలిగియుండుము
నీవూ నీతనయులు కూడా
విష్ణు భక్తితో క్రతువులు చేయుడు

సాధు హృదయములు పంకజనాభుని
నెలవులు – కావున సేవించవలె!"
ఆమాటలకు తనయుడు ఎంతో
ఆనందించెను తండ్రికి మ్రొక్కెను

అంతట బ్రహ్మ కలయజూడగా
అంతాజలమై అగుపించినది
నిలచుట కచట చోటేలేదు
ముందు కార్యము తోచకున్నది

తనయుని గాంచి పలికెనప్పుడు
నా ప్రథమసృష్టి అది–జలమే వినుము
రెండవ సృష్టి భూమి అయినది
ఆ భూమి జలములలో మునిగియున్నది

పాతాళమునకు పోయిన భూమిని
పైకి తెచ్చుట ఎటుల సాధ్యమని
భక్తిగా హరిని విరించి తలంచె
పరంధాముని దర్శన మందెను

నిశ్చలభక్తితొ తండ్రిని తలచగ
వెంటనె – బ్రహ్మ నాసికనుండి
అగుష్టమంత – రూపముతోను
వరాహ శిశువు – ఉద్భవించెను

ఒళ్ళు గగుర్పు కలిగె విరించికి
ముందర గాంచెను వింతరూపును
గుర్గురుమనును వరాహ నలుసు
అటునిటు తిరుగుచు అగపడెనచ్చట

స్వాయంభువాదులు విస్తుపోయిరి
అంతటిలోన వరాహరూపము
విపరీతముగా ఎదిగి పోయినది
నింగినంటెడి రూపుతొ నిలచెను

మరీచ్యాది మహామునులును
మనుపుత్రులును తికమకపడిరి
బ్రహ్మపలికెను పులకరింతతో
నాజనకుని దయ-ఉదయించెనాయనే"

నా మది వేదన తీర్చుటకొరకై
నా సంకల్పము నెరవేరుటకై
నాజనకుడగు శ్రీహరి యిటుల
అవతరించెను అవనిని గావగ

ఆ మాటలు విని పరవశించిరి
అనంతమూర్తిని స్తోత్రముచేసిరి
అది విని ఎంతో పొంగిపోయిన
ఆదివరాహము యింకా ఎదిగెను

మెడపై రోమములన్నీనిలబడె
విదిలించగను ముఖము వెలిగెను
కాలిగిట్టలతొ నేలను తన్నగ
రసాతలములో శేషుడు వణకెను

వాడి కోరలలొ వేడి పుట్టెను
నిప్పురవ్వలవి రాలుచున్నవి
గుర్గురు శబ్దము సముద్రాలనే
కలంచివేసి బురదనీరయె

పొరలుచు ఎగురుచు గర్జించుచును
ఆకాశమునే హడలెత్తించి
లోకాలన్నీ కలంచివేసెడి
భీకర రూపము సంతరించినది

పదునాల్గు భువనములు ఒరిగిపోవునటు
కోరలతో అది తోయుచుండెను
తోకవిదల్చగ కలిగిన శబ్దము
నింగిని - చీల్చి వేసినట్లయె

కనుగొలకులలో రాలెడి రవ్వలు
బ్రహ్మాండమునే పేల్చివేయునా -
అన్నటు అగపడి - వరాహమూర్తి
అమోఘశక్తిని ప్రదర్శించెను

అంతటిలోన ప్రసన్న దృక్కుల
యోగివంద్యునిగ ఆగమ నుతునిగ
దర్శనమిడెను ధన్యులచేయగ
ఆదివరాహము - అది వరాహమా!

అగణిత కీర్తికి - ఆలవాలమై
అవనిని తిరిగి ఉద్ధరించుటకు
అనుపమ బల - విక్రమమ్ముల నెలవు
ఆ వరాహము - భక్త కల్పకము

నీటిలొ మునిగెను ఆ వసుంధర
ఆమెను - ఒడ్డుకు జేర్చగవలెను
అనుచు తలంచిన ఆదివరాహము
అమోఘ విలాసమ్ములు చేసెను

తలపైకెత్తి ఊపిరివిడువగ
ప్రళయకాలమున ఎగసిన యట్టి
ఝంఝామారుత మన్నటుతోచెను
కడలి కెరటములు నింగినంటినవి

గట్టిగ శ్వాసను లోనికి లాగగ
సకలజలమ్ములోనికి పోయి
తిరిగి శ్వాసను విడచుచుండగా
వెలికివచ్చినటు - కడలి కలతపడె

అటుల నిలబడిన వరాహమూర్తి
చెవులురెండును విదిలించగను
కలిగిన శబ్దము తరంగమ్ములుగ
నింగినితాకి చీల్చునట్లయె

భూమిని తిరిగి ఉద్ధరించగా
రసాతలమునకు జారిన భూమిని
వెలికితీయగా సంకల్పించి
దివ్యవరాహము జలముల మునిగెను

సంద్రజలములలో ప్రవేసించిన
వరాహమూర్తి అట్టహాసమును
భరించలేక సముద్రుడంతట
గడగడలాడెను నిలబడలేక

కులపర్వతములు అన్నీకలసి
దిగ్గజమ్ములు ఒక్కుమ్మడిగా
తనలో కురికిన తీరుగ నపుడు
కలతపడెను ఆ సాగరుడంతట

ఆబాధను మరి భరించలేక
త్రాహి - త్రాహి - ఓ వరాహమూర్తీ!
ఆదుకోవయా! ఆదివరాహమ!
అనుచు చేతులను ఎత్తి వేడుకొనె

సాగరఘోషను లెక్కించకను
మేనును తిరిగి పెంచి - వరాహము
కాలిగిట్టలతొ బలముగ నీటిని
చీల్చి - లోనికి చొరబడిపోయెను

ఉదధిలొ ఉరికిన వీరరూపమును
ఉగ్రమూర్తి ఆ వరాహమూర్తిని
గాంచెను అచటి రాక్షసుడొకడు
తనకాపద మరి కలిగెననుకొనె

అదుపుతప్పిన వరాహమనుకొని
అతిబలవంతుడు తానే అనుకొని
ఆ రాక్షసుడు అతి క్రోధముతో
అయినది నీపని అని గద - విసరెను

గదా ప్రహారము తప్పుకు నిలచి
కట్టలు తెగిన కోపమునిండి
మృత్యుదేవతను తలపించెడి తన
భీకర దంష్ట్రమ్ముల - కొట్టె - నసురుని

హరి తన పంజా విసరి బలముగ
కరి కుంభస్తలము చీల్చినటు
వరాహస్వామి దంష్ట్రఘాటికి
అసువులువీడి - ఒరిగె నసురుడు

రక్తధారలతొ వరాహస్వామి
ముఖము - మూతి - ఎఱ్ఱబడినవి
అంతట స్వామి అవలీలగను
బంతిమాదిరి భూమిని ఎత్తెను

బలమగు కోరల ఒడుపుగనంత
భూమిని భరించి పైకి వచ్చెను
కస్తురి బంతిగ శోభిలె – ధరణి
ఆరూపమును గాంచెను విశ్వము

కోరలమధ్యన ఇరికించుకొని
భూమితొ నిలచిన పరబ్రహ్మమును
బ్రహ్మాదులట గాంచి భక్తితొ
పరవశమ్ముతో స్తోత్రముచేసిరి.

॥శ్రీ కృష్ణచరితము



## 6 ఆదివరాహమును బ్రహ్మాదులు స్తుతించుట

"లోకరక్షకా! దీనశరణ్యా!
జగదాధారా! లక్ష్మీనాయక
జగన్నియంతా! జయోస్తునీకు!
మంగళములివె! మంగళనాయక!

ఉదరమునందు ఇడాపాత్రతో
చెవుల వక్త్రమున ప్రాశిత్రమ్ములు
కంఠమునందు ఇష్టులు మూడు
నాలుకలో ప్రవర్గ్య – మగ్నులు

రాక్షస మర్దన! రాజీవాక్షా!
సూకర రూపము భూమినిమోసెను
ఆదివరాహము యజ్ఞవరాహము
అహరహము మము కాపాడునది

నెలకొనియున్న – దివ్య స్వరూపా!
యజ్ఞమూర్తివి యజ్ఞేశ్వరుడవు!
నీ చర్వణము సభ్యాసధ్యులు
శిరస్సు అసువులు చ్యవనమ్ములయి

జలములొ మునిగిన భూమిని తీసి
సృష్టిచేయుటకు మార్గముచూపి
మమ్మందరినీ ఉద్ధరించిన
మంగళమూర్తీ! అనుగ్రహించుము

నీవు పుట్టుటది – దక్షిణీయము
నీదంష్ట్రలు ప్రాయణీయేష్టి
దీక్షానంతర మాచరించునది –
పరిసమాప్తి అది ఉదయనీయము

నీరూపమది యజ్ఞము స్వామీ!
పాపకర్మలకు అగోచరుండవు
వేదమ్ములు నీత్వక్కున నిలచెను
రోమములందు బర్హిస్సులుండును

నీ తేజస్సు అది సోమరసమ్ము
నీ ఉనికి అది ప్రాతస్సవనము
నీదగు త్వగ్మాంసాది సప్తధాతువులు
అగ్నిష్టోమాదులుగా వెలుగును

నీకన్నులలో ఆజ్యమ్ముతోడను
పాదములందు యజ్ఞకర్మలతొ
మోరయందున స్రుక్కువెలుగును
నాసికయందు స్రువమునెలకొను

ద్వాదశాహాదులు యాగములున్న
యజ్ఞములన్నియు శరీరసంధులు
సోమసహిత సోమరహితమగు –
యజ్ఞములన్నీ – నీవే స్వామీ!

యజనాది బంధముల నెలకొనియుండు
యజ్ఞరూపుడవు నీవే స్వామీ!
నీరూపమ్మది హవనము అగును
హవ(ప్రభుడవు నువు హవరక్షకుడవు

భూమిని గాచిన భువనమోహనా!
భక్తిబంధముల లొంగిన నీవు
భవబంధమ్ముల (త్రెంపివేతువు
బలవి(క్రమముల చంపితి వసురుని

దంతా(గ్రమున అవలీలగను
ధరణినెత్తి ఆ ధరి(త్రికాంతకు
భర్తవైతివి - భారము మోసి
ఆ దృశ్యమది అమోఘమైనది

భూమాతకు మావందనమ్ములు
జలములోమునిగి ఉనికి తెలియని
మాతను నీవు ఉద్ధరించితివి
కావున మాకు తల్లిదం(డులు

పావనమైనది మీ దాంపత్యము
ధరణీలలామ నీకోరలపై
కులుకుచు నిలచిన దృశ్యమ్మ అది
కన్నులనిలచి మరువనీయదు

యాజ్ఞకుండు తను అరణిలోనను
అగ్నిని (ప్రతిష్ఠించినట్టుగా
నీతేజమును ధరణిలోనుంచి
భూతకోటిని (బతికించితివి

నీ కుక్షిలొ నిలచిన లోకమ్ములను
వెలికి తెచ్చి మరి సృష్టించుటది
ఆలోచనలకు అందని లీల
ఆదివరాహము - అమోఘ సృష్టి!

నిలచి నేను మరి సృష్టిచేయుటకు
నాతనయులును సృష్టిచేయుటకు
తగిన వసతిని కలిగించితివి
నీవాత్సల్యము - గతి చూపించెను

వేదశాస్త్రములు యజ్ఞయాగములు
వైదిక కర్మ కలాపమంతయు
రాశిగపోసిన - సూకరరూపము
భూమిని భరించి వెలికివచ్చుచు

మేను విదిల్చగ - జలవర్షమ్మది
సత్యలోకము వరకు ఎగిరినది
పవి(త్రమైన నీటి ధారలలో
మేమందరము తడియుట ధన్యత

దాస పోషకము - కరుణా భరితము
నీ చూపులవి - జ్ఞానకాంతులు
చిత్తవి(భ్రమము తొలగించునవి
మనస్తాపములు (త్రోసి - హాయినిడు".

అనుచు భక్తిగా - (బ్రహ్మాదులు అట
అనుపమానము అ(ప్రమేయమగు
ఆదివరాహము ఐన శ్రీహరిని
అఖిలజగములు వినగ - స్తుతించిరి.

బ్రహ్మాదులస్తోత్రమ్ములు వినిన
యజ్ఞవరాహమూర్తి – ప్రియముగ
తన సంతోషము తెలిపెను ధ్వనితో
కరుణావర్షము కురిపించెనట

ఒక్కసారిగా నాల్గుకాళ్ళను
విదిలించి నిలవగ–జలమంతయును
కాలిగిట్టలలొ యిమిడిపోయెను
యధాపూర్వముగ భూమిని నిలపెను

మృదువుగ ధరణిని బుజ్జగించినటు
స్పృశించె స్వామి – అనుగ్రహించి
అటుల అందరిని అనుగ్రహించి
యజ్ఞవరాహము అదృశ్యమయ్యెను

యజ్ఞవరాహ రూపమునంది
విశ్వనాధుడు భూమిని తిరిగి
ఉద్ధరించిన కథ శుభప్రదము
చదివిన వినిన శుభములు కలుగును

శ్రీహరి అవతారమ్ముల కథలు
చదివిన వినిన – వ్రాసిన వారికి
సర్వాభీష్టములీడేరు తప్పక
దానిలొ సందియమసలే లేదు

శ్రీహరి కథలు లీలామృతమును
వీనులవిందుగ వినెడి భక్తులు
అన్యచరిత్రలు వినగ నొల్లరు
మధుపము కోరదు – వేపపండ్లను

అంతట అడిగెను విదురుడు భక్తిగ
స్వామీ! శ్రీహరి లీలలు వినగా
పరవశమ్మది కలుగుచున్నది
జన్మధన్యము – మీరు లభించుట

నాసందేహము తీర్చుడు స్వామీ!
కడలి గర్భమున వరాహమూర్తి
రక్కసు నొకనిని సంహరించెనని
తెలిపిరి నాకు వివరము తెలుపుడు?

విష్ణు కథలను – విన మనసున్న
విదురుని గాంచి ముదమునందిన
మైత్రేయుండట పలికె తీయగా
హరిమాయ అది తెలియ కష్టమనె

లోగడ యిటులే ధృవుడు భక్తిగా
నారదునడిగెను విష్ణు కథలను
ఇహపరముల సాధించిన ఘనుడు
ధృవుడు – హరికి – అతి ప్రీతిపాత్రుడు

ఆ కథ నీకు వినిపించెదను
ధృవుని చరిత్రను దేవతలకును
బ్రహ్మదేవుడు – వినిపించెనయా!
అంతటి భక్తుడు ధృవుడు – వింటివా!

❋❋❋ ॥శ్రీ కృష్ణచరితము॥

## 7 హిరణ్యాక్ష-హిరణ్యకశిపుల వృత్తాంతము మైత్రేయుడు చెప్పుట

దక్షప్రజాపతి తనయలిద్దరు
దితి - అదితి - కశ్యపు భార్యలు
దితి ఒకదినమున భర్తతొ అన్నది
సంతులేక మరి వంత అన్నది

సంధ్యకృత్యములు తీర్చుకునంత
ధ్యానమునున్న భర్తనుగాంచి
మన్మధువశమున చిక్కిన వనిత
మదిలో కోరిక తెలియబరచెను

శ్రీహరీ - అని - పలికిన భర్త
తిరిగి మౌనమును అవలంభించెను
దయా మయా! నను కరుణించమని
సంతుకలుగగా వరమొసగుమనె -

నాసవతులలో - చిన్నతనమది
సంతులేక - నే మనుగడ గడపుట -
మన్మధుశరముల బారి పడితిని
వాని ఆగడము - మించిపోయినది

అబలను - నీ అర్ధాంగిని స్వామీ!
నన్ను నీవు - కరుణించుట ధర్మము
నీకు తెలియని ధర్మమున్నదా!
సంతానకాంక్షతో శరణంటిని నిను

మౌనముద్రలో కశ్యపుడుండెను
జాలిగ ఆమెను చూచుచుండెను
ముందుకు వచ్చి మదనునిశరమన
భర్తచేతులు గ్రహించి పలికెను

అందరి ముందు నిలబడగలిగే
శక్తికలుగును - సంతు కలిగిన
పతి తన ప్రతిరూపమ్మును ఆలితొ
తనయునిగా మరి పొందునుకాదా

ఒకటే అగ్ని అయినను కానీ
ఒక దీపముతో మరొక దివ్వెను
ముట్టించినచో - రెండు అగును కద!
నాపై నీకు గల ప్రేమ తెలియును

అక్కచెల్లెళ్లము అందరమున్న
నిన్నే పతిగా కోరుకొంటిమి
కశ్యపుడనగా రెండవ బ్రహ్మయె
వేదవేత్తయు తపశ్శాలియు

నీరూపమది దర్శనీయము
నీ నామమది జపించయోగ్యము
నాకడుపు మాత్రము పండక పోయెను
పుత్రకాంక్షతో కుమిలెను కాంత

అంతావినిన భర్త పలికెను
నీవు పలికినవి సత్యములే విను
ధర్మార్ధకామములు స్త్రీవల్లను మరి
కలుగును గనుక గృహస్థాశ్రమము

అన్నిటియందు మిన్నయైనది
ఎంతోగొప్పది - ఆశ్రయ మిడునది
దానివల్లను - నాల్గవదైన
మోక్షముకూడా లభించగలదు

నీమదినాకు తెలియును లలనా!
సంతుకొరకు నీ వంత నెరుగుదును
కొంచెము తడవు ఓపిక పట్టుము
ఇల్లాలికోర్కెను తీర్చుట నావిధి!

ఒక్కముహూర్త కాలమాగుము
ఇప్పుడున్నది సంధ్యాకాలము
హరుడు వృషభమును అధిరోహించి
భూతగణముతో తిరుగుచుండును

ఈ సమయమది కామమ్మును మరి
సఫలము చేసెడి - కాలము కాదు
అన్నీ తెలిసిన నేను సమయమును
పాలించకుండుట - ధర్మముకాదు

అగ్ని కార్యములు దైవకార్యములు
ఆచరించెడి సమయము యిదియగు
రుద్రునిగా మరి శివుడు వుండును
నీ మరదియని - తేలిక వలదు

రుద్రభూమిలో చితాభస్మముతొ
ధూమ ధూసర జటలు ముడుచుకొని
ఉగ్రమూర్తియై ఆవేశముతో
సంధ్యానాట్యము చేయుచుండును

అదిగోచూడు త్రినేత్రమ్ములవి
అగ్నిగోళములు - చంద్రుని వెన్నెల
రవి తీక్షణత అన్నీ కలసిన
వేడి చూపులు విసరుచుండెను

బంధుత్వములు తలచని సమయము
తిరిగి నీకు మరి చెప్పుచుంటిని
ఈ సమయమది కామభోగముల
ఆలోచించే సమయము కాదు

భర్త చెప్పిన ధర్మసూక్ష్మమును
లెక్కచేయక కామవశమున
భర్తను మై మరపింపజేసెను
కామబలముతో - జయించె భర్తను

సమయము గ్రహించి చింతిలె భర్త
చేతులు ముడిచి నిలచెను భార్య
స్వామీ! నేను తప్పు తెలిసితి
హరుడు నిజముగా ఆగ్రహించునా?

మదిలో కలత నిండిన దితి - తా -
కరములు ముడిచి రుద్రునితలచి
"భూతపతీ! నా వందనమిదిగో!
నా అవివేకము క్షమించవలెను

నా పతి మాటలు కాలదన్నితిని
నీ శక్తిని నే అలక్ష్యపరచితి
చాపల్యముతో నడిచితినయ్యా!
పతి నియమమునే భగ్నపరచితి

నాలో కామము నశింపజేసి
జ్ఞానజ్యోతిని వెలిగించుమయా!
నా గర్భమును కాపాడుమయా!
భక్తసులభుడవు నామొరవినుము"

అంతట దితి-తా-గర్భముదాల్చెను
ఆనందించెను - భర్తను గాంచెను
ఆగ్రహమ్ముతో భర్త పలికెను
అనుభవించవలె దుష్కర్మ ఫలితము

ధర్మదూరమగు పనిచేసితిమి
ఫలితము నీకు కడుపు ఫలించెను
కానీ నీకు పుట్టెడి తనయులు
ఇద్దరు - వారు ఉగ్ర కర్ములు

రుద్రాకారుడు భూతపతి మరి
తిరిగెడి సమయము అన్నను-వినని
ఫలితముగాను - పుట్టెడి కొడుకులు
బలశౌర్యలతో - రాక్షసులగుదురు

భద్రుడు - అనుభద్రుడు అనువారిద్దరు
గర్వమదాంధులు సాధుహింసతో
యుక్తా యుక్తము మరచి పోదురు
భూమికి వారు భారమగుదురు.

కలవరపడినది దితి అంతటను
లోకకంటకుల కనుట జరుగునా!
అనుచు బిగ్గరగ రోదించినది
మనసు కరగిన భర్త పలికెను

విలపించుటచే ఫలితములేదు
జరిగెడి విషయము చెప్పెద వినుము
నీ తనయుల బాధ భరించలేక
సురలు శ్రీహరికి మొరపెట్టెదరు

అంతట విష్ణువు లోకరక్షణకు
వారిద్దరినీ కడతేర్చగను
భూమికి - భారము తీరిపోవును
నీసంతానపు విషయము అది అనె -

అవాక్కుగా మరి నిలచిన దితి - తా
కంటనీటితో పలికె భర్తతో
కడుపు ఫలించుట - భూభారముకా!
దుష్టులు పుట్టుట కొరకా - ప్రసవము

ఆశ్రమమ్ములో వేదము చదువుచు
ఉపనయనముతో అనుష్ఠానముతొ
కిలకిలలాడుచు కదిలే బాలురు
పుట్టుట - తల్లికి ఆనందము నిదు

అంతేగాని సజ్జనహింసకు
తలపడు దుష్టులు - తనయులగు టది
శ్రీహరి చేతిలో చంపబడుటది
భరించరాని దుఃఖము స్వామీ!

అనుచు భార్య - అట దుఃఖించగను
కశ్యపుడంతట అనునయించెను
కంటనీటితో భార్య అడిగెను
నాసంతతి అంతా రక్కసులగుదుర!

॥శ్రీ కృష్ణచరితము॥



# 8 కశ్యపుడు దితి దుఃఖాన్ని మళ్ళించుట

అనునయ వాక్కులు పలికె కశ్యపుడు
జరిగిన తప్పుకు వగచుట ఏల!
హిరణ్యాక్ష - హిరణ్యకశిపులు
అనెడి పేర్లతో తనయులు ప్రసిద్ధులు

విష్ణు భక్తితో - నిండిన నీవు
పతి భక్తితొ నా సేవలు చేసిన
ఫలితము-అది నీ మనుమడు మాత్రము
విష్ణు భక్తునిగ - ఖ్యాతిగడించును

హిరణ్యకశిపుని తనయుడు వొకడు
హరిపద సేవలొ - అగ్రగామియగు
వాని కీర్తి యది - వెలుగు దశదిశల
వంశపావనుడు ఆతడు అగును

మహాయోగులకు మార్గదర్శియగు
ఆతనివలెనే భక్తి బాటలో
పయనించగను తలంచుచుందురు
భాగవతోత్తముడాతడు అగును

హరిని మించి మరి జగము లేదని
హరియే జగమని పరాత్పరుండని
త్రికరణ శుద్ధిగ నమ్మి కొలుచును
దేహధ్యాసయది వదలును భక్తుడు

లక్ష్మీపతియే జగదాధారుడు
సృష్టికి మూలము రమాపతి యని
కౌస్తుభహారుని అంతర్ముఖముగ
దర్శించ గలిగిన భక్తశిఖామణి

తనమదిలో దర్శించు - శ్రీహరిని
హరితో తాను సంభాషించును
అంతటి యోగ్యత కలిగిన వాడగు
అనుచు కశ్యపుడు దితికి చెప్పెను

భర్త మాటలకు మోద భేదములు
కలిగిన దితి-తా-పలుకకున్నది
ఆమె పరిస్థితి తెలిసిన పెనిమిటి
అనేకవిధముల ఊరడించెను

నూరువత్సరములా యిల్లాలు
గర్భము మోసెను పుత్రులకొరకు
దుష్టులు అగుదురు అని మదినెంతో
వంతనొందుట మానకున్నది

ఒక దినమున ఒక దివ్యతేజమది
దితి గర్భములోనుండి పుట్టినది
నింగికి ప్రాకి దిశలన్నిటిని
కలవరపరచెను సురలు గాంచిరి

సూర్యచంద్రుల కళలుతప్పినవి
గ్రహముల గతులు మారజొచ్చినవి
కలవరపడిన సురలందరును
బ్రహ్మదేవుని చెంతకు జేరిరి

బ్రహ్మపలికెను వేల్పులందరితొ
నాదగు సృష్టిలొ తొలుతపుట్టిన
సనక సనందనాదులు వినుడు
జ్ఞాననిధులు మరి మోక్షకాంక్షులు

కోర్కెలు లేని పుణ్యమూర్తులు
ఎచటకునైనా పోగలవారు
ఒకదినమున వైకుంఠమునకును
పాదచారులై బయిలుదేరిరి

ఎన్నో ప్రాంతము లన్నీ చూచుచు
అడుగు పెట్టిరి - వైకుంఠమది -
సర్వలోకముల శిరోరత్నము
హరి పదములను ధరించు రత్నము

జనన మరణములు లేని ధామము
పునర్జన్మ అట జీవులకుండదు
నిత్యకల్యాణము పచ్చతోరణము
అన్నది అచ్చట యదార్థమైనది

పద్మనేత్రుని భక్తరేణువులు
ముక్తికాంక్షతో పరంధాముని
స్తుతించి చర్చలు జరుపుచుందురు
సుఖముల - శుభముల కాలవాలమది

తరువులు లతలు విరగబూయుచు
పద్మనాభుని పదముల స్పర్శకు
తహతహలాడుచు - వాయుదేవుని
సాయపడమని కోరుచుండును

మధువు గ్రోలిన మధుపములన్నీ
గోవిందనామము రంగరించి మరి
తియ్యని సవ్వడి చేయుచుండును
మధుర ఫలములు మెండుగ నుండును

చిగురులు, పూవులు-లతాకుంజములు
లక్ష్మికి నిలయము లా - పూతోటలు
నేత్ర పర్వముగ నిలచి - సొగసులు
ఒలకబోసుకొని - పలుకరించును

కోర్కెలు తీర్చే కల్పతరువులే
అన్నటు అగపడు - తరువులచ్చట
తరువుల క్రింద చందన చర్చతొ
ముకుంద నామము చేయుచుందురు

జలకమ్ములలో రాజహంసలు
పలుకులు రాని కారణమ్మున
పలుకకుంటిమి - హరినామమును
అన్నటు - జాలిగ చూచుచుండును

భక్తులలోన మేము వుంటిమని
పరవశమ్మున కోయిలలన్నీ
కోటి గొంతుకలు ఎరువు తెచ్చుకొని
కుసుమబాణుని జనకుని - స్తుతించు

మధ్య మధ్యలో తాళము వేసెను
అన్నటు - అచ్చటి రామచిలుకలు
పలుకులలోఅతి మెలకువగాను
నారాయణ మంత్రమ్ము పలుకును

పవిత్ర తులసి - నిండుగ నిలువగ
భగవంతుని గళసీమ వెలుగునని
భక్తిభావము - పెంచుకు విరులు
పూలజల్లులను కురిపించె - తులసిపై

విష్ణు సహస్రనామ పారాయణము
నిష్టగ భక్తులు పూదోటలలో
సుఖాసీనులై చేయుచుండిరి
తన్మయత్వమున మునిగి యుండిరి

లక్ష్మీదేవి నిశ్చల మనసుతొ
నడబావిలొ దిగి స్నానముచేసి
తులసిమాలలు స్వయముగ కట్టి
హరి - కంఠసీమను అలంకరించి

భక్తి ప్రపత్తుల స్తోత్రముచేసి
శ్రీహరి పదములు శరణము అనుచు
మణి దీపములతొ హారతులిచ్చి
మంగళకారిణి మురిసిపోవును

కలిమికి రాణిని - ఆప్యాయముగా
లేవనెత్తి తన కౌగిట జేర్చి
ఆనందవార్నిధిని చేరిపోవగా
పాలసంద్రమది - తెల్లబోవును

పుణ్యమ్ములకు నెలవుగ నుండి
ధర్మమ్మునకు ఆలవాలమై
అలరారెడి ఆ వైకుంఠమది
మాటలకందని మహిమాన్వితము

ధర్మదూరులు - పాపకర్ములు
విషయవాంఛల సుడిగుండములోపడి
వైకుంఠమును తలంచలేరు
చేరెడి ప్రశ్నే - ఉద్భవించదు

నిష్కామకర్మతో హరి పదసేవతొ
ముకుందు నామమే మనుగడ అనుకొని
నామస్మరణతో మైమరచి పోయెడి
హరి భక్తులు వైకుంఠ వాసులగు

వైకుంఠనగరము లక్ష్మీనిలయము
సిరిసంపదలకది కాపురమైనది
ప్రతియిల్లాలు లక్ష్మిగ భాసిల
ఆనందమది తాండవించు నట

వనమాలతో మరి పీతాంబరముతొ
తులసి మాలలతో ఊర్ధ్వపుండ్రముల
సిరులొలికెడివగు వదన పద్మముల
హరి కాసారము - ఆ వైకుంఠము

ముత్యాలముగ్గులు పదముల స్పర్శతొ
మురిసిపోవును ముకుందు తలచి
చెట్టుచేమలు - లతలు - సుమములు
హరి పదసేవకు ఎదురుచూచును

రామచిలుకలు పరంధాముని
కీర్తనచేయును పేరుకు తగ్గటు -
శ్రీపురుషసూక్తములు నిరంతరమ్ము.
వినబడుచుండును వైకుంఠమున

సనకసనందన యోగిపుంగవులు
తపోశక్తితో వైకుంఠమున
అడుగుపెట్టిరి నిరాటంకముగ
కక్ష్యలు దాటి సాగుచుండగా

ద్వారపాలకులు యిద్దరు గాంచిరి
గదాయుధములు చేత ధరించిరి
చతుర్భుజములతొ వెలుగుచుండిరి
క్రోధమెగసెను వారిద్దరిలో

అంతటిలోన యోగులు అచ్చట
ఐదు ఏండ్లుగల బాలకులైరి
వారిని లోనకు అనుమతింతురని
సాగుచుండగా - ఆపిరి వారు

పరుషముగా మరి మాటడగను
ద్వారపాలకుల వింతచేష్టలకు
కోపించిన వారచట పలికిరి గట్టిగ
హరిభక్తులను అడ్డగింతురా!

అనర్హులము - అన్నటు మీరు
ఆపివేసిరి చోరులమాదిరి
అజ్ఞానులు మీరు మమ్ముతెలియుడు
మీప్రభువుకు మాకు భేదములేదు

నిరతము హరికి సేవచేతురు
మీబుద్ధి మాత్రమది వికసించదయె
తలబిరుసుగా నడచుచుండిరి
దుర్బుద్ధులుగా అగపడుచుండిరి

మము నిందించిన దుష్కార్యమునకు
శిరస్సుకెక్కిన నేత్రములున్న
మీరు పుట్టెదరు భూలోకములో
కామక్రోధ లోభమ్ముల నెలవుగ

కన్నులు తెరచిన ద్వారపాలకులు
పదములపడిరి యోగీశ్వరులకు
"హరిపద కింకరులము అను - గర్వము
మాకన్నులను మూయించినది

మీ శక్తి తెలియక అడ్డగించితిమి
అనుగ్రహించుడు మీకింకరులము
హరిపద సేవకు దూరమై మరి
బ్రతుకుట అన్నది దుర్లభమైనది."

ఆసమయములో జగన్నాథుడు
అచటకు వచ్చెను రమతో కూడి
అడుగులు వడిగా వేయుచువచ్చెను
రమాకాంతుడు భక్తవత్సలుడు

కరుణాధాముడు కదలువేగముకు
దివ్యాభరణములు సవ్వడిచేసెను
మణికుండలముల దివ్యకాంతులవి
పరాకుచెప్పుచు - ముందుసాగినవి

పరంధాముని ప్రసన్నవదనము
గాంచిన మునులు పరవశించిరి
జ్ఞానతేజమున వెలిగెడి మునులు
జ్ఞాననిధిని గని ముగ్ధులాయిరి

చిదానందుడు జగన్నాయకుడు
జగదాధారుడు భక్త వత్సలుడు
అనుగ్రహించి దర్శనమిడెనని
ఆనంద రాగమున స్తోత్రముచేసిరి

"భక్తవత్సలా శ్రీవత్సాంకిత!
బ్రహ్మదేవునికి జన్మకారకా!
ఆ విరించికి తనయుల మేము
నీదర్శనమున ధన్యులమైతిమి

నీవు లేని - చోటన్నది లేదు
నిన్నుకాదని బ్రతుకగ లేరు
హృది గదిలో నిను చూడగలిగెడి
యోగ్యత కలుగదు దుర్జనులకును

భక్తియోగమున పుణ్యమూర్తులు
నిన్నుగాంతురు జన్మసఫలముగ
ఆశ్రితమందార దయాసాగరా!
నీపదసేవ తరించు త్రోవ

నీదర్శనము చేయగవచ్చి
నీకింకరులకు శాపమునిచ్చి
అపరాధమును చేసినారము
నీ సేవకులు దుష్టులు కారు

దుష్టకోపముకు లొంగిన మేము
చేసిన పనికి మము రక్షించుము
నీభక్తుల దోషము మన్నించుమయా!
వరదా! నీకు వందనమ్ములివె!

ఆత్మయందు నీరూపముగాంచియు
తృప్తినందక వచ్చితిమిటకు
నీదివ్య పాదసందర్శన కాంక్ష
నిలువనీయక నడిపించినది

నీముఖకమలము నుండి వెలువడు
అమృతవాక్కులు వినగా వచ్చి
ధర్మదూరమగు పనిచేసితిమని
మా మది - కలవర మందుచున్నది

కుటిలత్వమది లేనివారము
తొందర పాటులో చేసిన తప్పును
మన్నించవయా! మంగళమూర్తీ!
అనుచు భక్తిగా వేడిరివారు."

॥శ్రీ కృష్ణచరితము॥



## 9 శ్రీహరి - మునులకు ఆత్మబోధ చేయుట

"ఓ మునులారా! శాంతితొ వినుడు
మీరు ప్రసన్నులు కావలెనిపుడు
నాసేవకులు అనెడి గర్వమున
మిమ్ముల చులకన చేసిరి వారు

అహంకారముకు తగిన శిక్షయది
లభించెవారికి - సరిగా జరిగెను
దాసులతప్పు నాదిగ - తలచి
నన్ను మీరు - మన్నించగ వలెను

భువనపావనము ఈ వైకుంఠము
స్మరించినంతనె - పవిత్రులగుదురు
అంతటి మహిమ మిమ్ములబోలిన
సాధుజనుల వలన - కలిగెను వింటిర

కావున నేను - ఎల్లవేళలా
సాధుజనులకు రక్షగనుందును
వారికి కష్టము కలిగించినచో
ఎంతవారినీ - వదలను నేను

మీవంటి భూసురుల సేవవల్లనే
నాకుకూడ దివ్యత్వము కలిగి -
పాపభంగ ఉత్తుంగతరంగ
నాపాదముల ఉద్భవించినది

వేదవేత్తల సేవలవలన
వైకుంఠమును ఏలుచుంటిని
భార్యయైనది లక్ష్మీదేవియె
భూసురోత్తముల అనుగ్రహమ్మిది

బ్రాహ్మణోత్తముడు ఒక్కనికైనా
అన్నదానముచేసిన - పుణ్యము
భక్తితొనొసగిన - కబళమువలన
సంతుష్టుడను అగుదును నేను

బ్రహ్మతత్వమును తెలియగలిగిన
బ్రాహ్మణోత్తముల పాదపరాగము
నాశిరస్సున వెలుగు మకుటమున
ధరించి - ఎంతో సంతోషింతును

జీవులలోన - దీనులలోన
భూదేవులలో నెలకొనియుందును
వారిని సరిగా ఆదరించని
దుష్టబుద్ధులు అధోగతికి చను

వేదవేత్త - తా - దురుసుగనున్నను
గౌరవించిన - సంతసింతును
భృగువుతన్నెనని కోపగించక
పాదసేవను చేసితి గాదా!

మీరునాకు మరి పూజార్హులయా!
అట్టివారిని - అహంకారమున
నాసేవకులు - అవమానించిరి
అట్టివారికి - శిక్షతప్పదు

అయినా నాదగు విన్నపమ్మిది
భూలోకములో పుట్టిన గాని
అచిరకాలమున నాసన్నిధికి
వచ్చెడి వీలు కల్పించవలె"

విష్ణు వినయముకు ముగ్ధులాయిరి
దుష్టులగాంచి క్రోధమెగసెను
అంతట హరిని చూడగనంత
వినయ - శాంతములు వచ్చి చేరినవి

రమారమణుని మాటలలోన
మందలింపది లేదని తెలిసిరి
తమప్రవర్తనకు తప్పు పట్టని
చక్రాయుధుని ప్రార్థించిరిటు

"ఓ గోవిందా! గోకులనేతా!
భక్తవత్సలా! లక్ష్మీరమణా!
నీ విలాసములు తెలియగలేము
మాదోషమును మన్నించితివి

ధర్మోద్భవము ధర్మరక్షణ
చేసెడివాడవు నీవే స్వామీ!
అవతారములు ఎత్తెదవందుకె
ఆపన్నులను కాచెద వనిశము

నీ అనుగ్రహము పొందిన యట్టి
మునిబృందములు-మిత్తిని గెలుతురు
వైదిక రక్షణ చేయు విప్రులను
రక్షించెదవు అభయముద్రతో

పతితపావనా! సర్వసమర్థుడ!
మా శాపమును త్రిప్పగచాలిన
శక్తిమంతుడవు కావున నీవు
నీకుతోచినటు చేయుము స్వామీ!"

అనగా పలికెను జగన్నాయకుడు
"మునిపుంగవులు వేదవేత్తలు
మీ శాపమది జరిగితీరవలె
వారు అసురులుగ పుట్టక తప్పదు

అందువలననే - వారి కొరకునే -
భువిలోపుట్టి - వారిని చంపెద
నాలో - వారిని కలుపుకుందును
నాసన్నిధికి చేర్చుకుందును

వదలని పగతో - నన్ను స్మరించి
వైరభక్తిలో నన్ను తలంచుచు
నాచేతులలో అంతమయ్యెదరు
నాసాయుజ్యము చేరుకొందురు."

సనకాదులంతట భక్తి ప్రపత్తుల
స్వామికి - రమకు నమస్సులుంచి
ప్రదక్షిణించిరి పాదములంటిరి
సెలవుగైకొని నెలవులకరిగిరి.



॥శ్రీ కృష్ణచరితము॥

## 10 భగవానుడు జయవిజయులను ఓదార్చుట

కరములు రెండూ జోడించుకొని
గడగడలాడుచు నిలబడియున్న
జయవిజయులను రమ్మనిపిలువగ
పరంధాముని పదములబడిరి

"ఆర్తరక్షకా! కాపాడుమయా!
కన్నుకానక దురుసుగ మేము
ప్రవర్తించితిమి అనుగ్రహించుము
నీ కింకరులము వదలము నిన్ను"

అంతట పలికెను అరవిందాక్షుడు
"వేదవేత్తల శాపము తప్పదు
నాపై పగతో నాతో పోరి
నాచేతులలో అంతమొందదెరు

ఆవిధముగను నా సన్నిధికి
వచ్చిచేరెదరు - కావున మీరు
రక్కసులై మరి పుట్టకతప్పదు."
అనుచు పలుకుచు అదృశ్యమయ్యెను

శాపగ్రస్తులగు ఆ జయవిజయులు
దితి గర్భములో పెరుగుచుండిరి
త్వరలో వారు ఉదయించెదరు
వారితేజమది కలవర పరచెను

లోకకంటకులు పుట్టుచుండిరని
లోకములన్నీ కలవర పడెను
కరుణాధాముడు శ్రీహరి కాచును
కావున మీరు దిగులు వదలుడు

అనుచు విరించి సురలకు చెప్పగ
భయమును వీడి వారందరును
బ్రహ్మదేవునికి వందనమ్ములిడి
స్వర్గమార్గమున - నెలవుల కరిగిరి

❋❋❋ ॥శ్రీ కృష్ణచరితము॥

## 11 జయవిజయులు దితికి హిరణ్యాక్ష హిరణ్యకశిపులై జన్మించుట

బలవంతులగు పుత్రులు అని విని
క్రూరులయ్యెదరు అని వినినట్టి
దితి మదిలోన - మోద ఖేదములు
మేళవించి మరి కలవరపరచెను

ఆ విధముగను దితి గర్భమును
వంద ఏళ్ళుగా మోసి అంతట
ఇద్దరు మగబిడ్డల ప్రసవించెను
ప్రకృతి గడగడ వణకెనప్పుడు

ఆ ఉత్పాతము గ్రహించినట్టి
కశ్యపమహర్షి అగ్నిశాలలో
భగవంతుని తా స్తుతించమొదలిడె
ప్రసవవార్త విని "శ్రీహరీ" అనెను

తిరిగి భూమియది కంపించినది
కుల పర్వతములు కదలిపోయినవి
ప్రళయసూచన అన్నటుగాను
సముద్రమ్ములు కలవరపడినవి

నింగిచుక్కలు కొన్ని తెగిపడెను
కారుమేఘములు ఉరిమె భయమున
యజ్ఞశాలలో అగ్ని ఆరినది
భీభత్సముగా ధూమ మెగసెను

మధ్య మధ్యలో మేఘములవ్వి
నెత్తుటివాన వర్షించినవి
గ్రహములు తారలు కళదప్పినవి
నక్కలు భయముగ అరవసాగినవి

దేవాలయముల - ప్రసిద్ధమైన
విగ్రహమ్ములవి - ఒరిగెను కొంచెము
వాటికండ్లలో నీరు తిరిగినది
ఆవుల పిదకగ - రక్తము కారెను

మదగజమ్ముల మదజలమ్మది
ఇంకిపోయెను అశుభసూచనగ
అశ్వపు తోకలు అగ్నిలేకనే
కాలిపోయెను - మొండివైనవి

తపోవంతుడు కశ్యపుడంతట
ఉత్పాతములకు కలవరపడెను
సనకాది మహర్షులు తక్క మిగిలిన
సంయమీంద్రులు తల్లడిల్లిరి

పుట్టుకతోనే హడలెత్తించే
ఆకారములు - ఆ బిడ్డలవి
కులపర్వతముల మించిన కఠినము
వారి శిరస్సులు అనిపించినవి

ఉక్కుస్తంభముల తుక్కుచేసెడి
శక్తితొ భుజముల భుజకీర్తులతో
రత్నఖచిత మకుటమ్ములున్నవి
అడుగుల భూమి చలించునట్లయె

ప్రచండభానుని ధిక్కరించెడి
వెలుగులు చిమ్మెను మేనికాంతులు
పసికూనలు అరచిన-అరపులకంతట
గుండెలవిసెను జీవకోటికి

పుత్రప్రేమయది పెల్లుబకగను
ఆనంద - దుఃఖ - బాష్పమ్ములతో
పెద్దవానికి - హిరణ్యకశిపుడు
అనుచు - పేరును పెట్టెనంతట

రెండవ వానిని కరములగ్రహించి
హిరణ్యాక్షుడు అని పేరిడెను -
తనయులిద్దరిని అతిలాలనగా
పెంచి పెద్దగా చేసెను తల్లి

పెరిగిన బాలురు అతి దీక్షగను
బ్రహ్మగురించి తపస్సుచేసిరి
చతురాననుడు ప్రత్యక్షమయ్యెను
వారుకోరిన వరములనిడెను

దుస్సాధ్యములగు వరములు పొందిరి
నాకెదురెవ్వరు అన్నటు మదమున
హిరణ్యకశిపుడు లోకమ్ములబడెను
లోకపాలకులు దాసులాయిరి

హిరణ్యాక్షుడు తక్కువవాడా -
వరబలగర్వము - భుజముల దురద
గడగడలాడెను సర్వ ప్రాణులు
వంగి వంగి మరి పాదములంటిరి

ఘనమగు గదను గిర్రునతిప్పిన
విశ్వంభర తా సుడులు తిరుగును
గదా దండమును ఎదిరించగల
ధీరులు లేరు - పోరు తలంచరు

నన్నెదిరించే శూరులు లేరా!
అని ఆశ్చర్యము ఆగ్రహమ్ములతొ
నాకలోకము నేరుగసాగెను
సింహ గర్జనతొ వణకిరి సురలు

దిక్కుతోచక సురలు నాకమున
పరుగులెత్తిరి ప్రాణభీతితో
నందన వనముకు పరుగులెత్తిరి
కల్పవృక్షమును ఆశ్రయించిరి

గొలుసులు త్రెంచుకు ఐరావతము
పరుగులెత్తెను పిచ్చిదానిలా
అమరకాంతలు అరవసాగిరి
కొప్పులు విడివడి పరుగులెత్తిరి

కలయచూచెను అమరావతిని
అగపడరెవ్వరు ఎదిరిపోరగా
ఆశాభంగము కలిగిన అసురుడు
ఆలోచించగ వరుణుడు తట్టెను

సముద్రాలకు అధిపతి – వరుణుడు
ఘనపాశములు కలిగియుండెనట
సత్తాచూచెద అని తలపోసి
గిరిమాదిరిగా పడెను కడలిలో

ఆపదతెలిసి వరుణుడు తాను
మారుమూలను దాగె – భయమున
వరుణసైనికులు చెల్లాచెదరవ
నిరాశకలిగెను హిరణ్యాక్షునకు

కల్లోలమయి సుడులు తిరుగుచు
కనబడినట్టి కడలిని గాంచి
కసితీరగను గదతో మోదగ
కిమ్మనకుండా చచ్చె జలచరములు

అటులా అసురుడు కొన్ని ఏండ్లట
సంద్రమునందు వీరవిహారము
చేయుచుండెను వరుణుని కోసము
వరుణుడు మాత్రము కనబడలేదు

విసిగిపోయిన హిరణ్యాక్షుడు
వరుణపురమగు విభావరికిని
గదాయుధముతో అడుగు పెట్టెను
భీకర సింహ నాదముచేసెను

కాలయమునిలా ముందునిలచిన
అసురుని గాంచిన వరుణుడంతట
గడగడలాడెను నిలబడలేక
వణకుచు కనబడ అసురుడుగాంచి

హేళనగా మరి పలికెనప్పుడు
"బిక్కముఖముతో నిలబడినావు
బలమగు పాశములున్నవట కదా!
ఎంతటి వారిని బంధింతువట"!

ఆమాటలకు క్రోధమెగసినను
సమయముకాదని – వరుణుడంతట
పలికెను – ఎంతో వినయమునిండి
నీ వన్నదిమరి – నిజమే – వీరుడ!

కానీ – సమయాసమయము లున్నవి
నామాటలు నువు విను – శాంతముగా
నేను యిప్పుడు యుద్ధము వదలితి
నీవు కోరినటు – తీయ నాయుధము

నీవు పోరుట జరుగ దిచ్చట
నీ అభీష్టము యుద్ధమే కదా!
అందుకు నీకొక త్రోవచూపెద
వైకుంఠమది నీకు తెలియునా!

తెలియు ననగనే - పలికె వరుణుడు
అచ్చుటగలడు వీరవతంసుడు
అన్ని విధములా నీకు తగునయా!
అనగా అసురుడు చులకన జేసి

వాడు నాకుమరి ఈడుగానిచో
నిన్నూ వానిని - కలిపి కట్టెదను -
అంతట పలికెను వరుణుడసురునితో
అంతవరకు మరి రానే రాదులె -

శ్రీహరి అనెడి మహాత్ముడాతడు
నీ బోటివారికై ఎదురుచూచును
నీలాగనె మరి ఎదిరించు నైజము
ఆయన కున్నది - నమ్ముము నన్ను

ఆనందించిన హిరణ్యాక్షుడు
వైకుంఠముకు సాగెను - విసురుగ
గదాదండముకు ఆ - శ్రీహరియో -
లేదా - వరుణుడొ తప్పదు అనుకొనె

శ్రీహరి - వాడట - ముకుందు డతడట
వెఱ్రి మునులు మరి కీర్తింతురట
మూలదాగిన - ఆ మగధీరుని
వనమాలి యని పిలచుకొందురట

అంతటిలోన - మహతి మీటుచు
కనబడెనచట నారదమహర్షి
హరిస్మరణచేయునది నీవేనాయని!
అడిగె నారదుని - హిరణ్యాక్షుడు

అయితే చెప్పుము - ఆ హరి ఎక్కడ
వానితో పోరగ భుజముల తీట
తీరుననుచును - వరుణుడు చెప్పెను
ఎక్కడ నక్కెనొ తెలుపుమునీవు

అంతట పలికెను నారదమౌని
హరి కోసము నువు వైకుంఠమునకు
శ్రమపడి వచ్చితి వెంత అజ్ఞానివి
హరియిచ్చటను లేనేలేడు

రసాతలములో ఆతడుండెను
ఆదివరాహపు రూపమునుండెను
నీకొరకై మరి చూచుచుండెను
అనగా అసురుడు విసురుగసాగెను

❊❊❊ ॥శ్రీ కృష్ణచరితము॥

## 12 హిరణ్యాక్షుడు యజ్ఞవరాహముతో పోరుట

ఎవడా శ్రీహరి టక్కరివాడు -
పందిరూపమున దాగినాడట
రసతలమ్ములో దాగుటెందుకన -
నా భుజబలముకు నిలబడలేకనె -

అనుచు అరచుచు పర్వతకాయుడు
సంద్రమధ్యమున గదతో దూకెను
జలమునింగికి - ఎగిరి - అంతట
జలచరములవి - క్షోభించినవి

అంతటిలోన యజ్ఞవరాహము
దంష్ట్రాగ్రమ్ముల భూమిని ధరించి
చంద్రశేఖరుని తలపించుచును
నీటిని త్రోయుచు - పైకి ఎగసెను

ఓహో! వీడా! శ్రీహరి అనెడి
పేరున బరగెడి మాయలమారి
మనిషిగ నాతో పోరగలేక
జంతువాయెను - దయ దలతునని -

ఎన్నో జంతువులున్నవి వాటిలో
నీచమైనది - ఎంచుకొనెను కద!
భక్త రక్షకుడు - దీన శరణ్యుడు
అనెడి పేర్లు - తగిలించుకొన్నవే!

యజ్ఞవరాహ స్వామి అంతట
తనచూపులు ప్రసరింప జేయగా
హిరణ్యాక్షుని - తేజముతప్పెను
గడగడలాడెను వానిగుండియ

ధైర్యము తెచ్చుకు బలముపుంజుకు
లంఘించెనొక్క పరి - ఒడిసి పట్టగా
ఒక్కసారిగా యజ్ఞవరాహము
జలములపైకి - వచ్చి నిలచెను

హిరణ్యాక్షుడు వెంబడించుచు
పైకిరాగనె - శ్రీహరి అంతట
సంద్రజలమ్ముల మునిగి పోయెను
తిరిగి అసురుడు వెంబడించెను

అటులా శ్రీహరి హిరణ్యాక్షుని
తిప్పలు పెట్టెను - అలసె నసురుడు
అంతట వాడు - నిప్పులు గ్రక్కుచు
పలికెను హరితో పోరుకు పిలచుచు

"నీవో టక్కరి - వేషగాడివి
దక్కుట కొరకై - భూమిని వదలుము
బ్రహ్మవరమది - మేదిని కంతకు
నేనే - అధికారిని వినుము!"

ఆమాటలు విని యజ్ఞవరాహము
ఘుర్ఘురించెను - హోయని ఒకపరి
ధ్వనిచేయగను - హిరణ్యాక్షుడు
అదిరి పడెను - తా - వెనుకకు తగ్గెను

వెంటనె అసురుడు ధైర్యముతెచ్చుకు
"నాబలమిదిగో చవిచూచెదవు
హీనజంతువని - నా సంకోచము
మృత్యుదేవతకు మృత్యువు నేను

నీ ఆటలిక సాగవు వినుము
గదాప్రహారమున - పొడి పొడిచేతును
ఆపై - నీపై ఆధారపడెడి
దేవతలందరి అంతు జూచెద."

అంతట శ్రీహరి తలచెను మదిలో
వీనిని వదలిన - అమాయకులగు
సురలను యిడుముల బెట్టగలడని
అంతుచూడగా నిశ్చయించుకొని

నీటిపైకి మరి వచ్చి నిలచెను
వెంబడించిన అసురుడు పలికెను
రక్కసులను హతమార్చెద ననుచు
ప్రతిన చేసితివి పిరికిపందవు

నిలబడలేక పరుగిడు చుంటివి
వీర లక్షణము కానేకాదు -
అంతట శ్రీహరి భూమి నచ్చట
నిలబెట్టెను తన తేజముతోను

అటుల భూమిని ఉద్ధరించిన
యజ్ఞవరాహుడు అసురునిగాంచి
"సజ్జన శాత్రవ - మిగలవు యింక
నేటితొ నీ కథ సమాప్తముసుమా!

సాధుహింసను చేసెడి దుష్టుడ!
దేవవిరోధీ! వదరుటచాలు!
బుద్ధిగరపగా - వచ్చితి నిపుడు
క్రూరకర్మలకు ఫలితము నిడెదను

రాక్షసాధమా! ఘనమగు గదయని
విర్రవీగుచు నుంటివి నీవు
నీభుజబలమును గదాదండమును
గాంచి - భయపడు భీరుడగాను

లోకభీకరా! చాలు నాగడము
అల్లకల్లోలము చేయుచుంటివి
నీవలె ఎగిరిన రక్కసులందరి
తలలు ఎగిరినవి - నాచక్రమున

వారందరినీ కలుసుకొనుటకు
ఆత్రుత - నీవు పడుచుంటివి కద!
ఏదీ! నీగద - ప్రయోగించుము
నీ శక్తినిచూడగ - నాకుత్సాహము."

అనుచు తేలికగ శ్రీహరి పలుకగ
కన్నులెర్రబడె - హిరణ్యాక్షునకు
పండ్లుకొరుకుచు గిరగిరత్రిప్పి
గదతో కొట్టెను - వరాహమూర్తిని

ఒడుపుగ తప్పుకు శ్రీహరి అంత
తన గద త్రిప్పి - అసురుని గదను
కొట్టగ - రెండుగ - విరిగిపోయినది
అసురుని కంత - చెమటలు పట్టెను

గుండె పగిలిన బాధకలిగెను
నమ్మిన గదయది - నేలకూలినది
అంతట అసురుడు - మాయతొ నపుడు
మరియొక గదను గ్రహించి - నిలచి

బలముగ కొట్టగ వరాహమూర్తి
అసురుని రణపాండిత్యమ్మును తెలిసి
ఒడుపుగ తప్పుకు - తిరిగి గదతొ మరి
కొట్టగ - అసురుని గద భిన్నమయె

అంతట ఆగక - వరాహమూర్తి
నింగి వరకును ఎదిగి నిలచినటు
నిలబడి అసురుని కొట్టెవక్షమున
విలవిలలాడెను హిరణ్యాక్షుడు

అంతటిలోన తెలివి తెచ్చుకొని
మరియొక గదతో ముందుకు రాగా
యజ్ఞవరాహము నిండుగ నిలువగ
బలముగ కొట్టెను అసురయోధుడు

వారిద్దరును జయాభిలాషులు
రణపాండిత్యము కలిగినవారు
భీకరమైన పోరుసలిపిరి
రక్తసిక్తమయె శరీరమ్ములు

మల్లయుద్ధము - గదాయుద్ధముల
పోరిరిద్దరు - విజయముకోరి
పూచిన అశోకవృక్షమ్ములవలె
భాసిల్లిరి వారు - రక్తసిక్తమై

భీకరయుద్ధము చూడగ నింగిని
బ్రహ్మాది దేవతలు-ఋషులు నిలచిరి
ఆలశ్యమ్మది జరుగుచున్నదని
హెచ్చరించెను - బ్రహ్మ శ్రీహరిని

"జగన్నాయకా! ఆలసించకు
అసురవేళయది - వచ్చుచున్నది
ఆసమయములో అసురుని బలము
మాయాబలమది - లొంగనీయదు

సాధుహంతను - యజ్ఞవిఘాతను
మట్టు బెట్టుము - మంగళమూర్తీ"!
అనగా శ్రీహరి - చిరునగవులతో
చల్లగచూచెను వారందరినీ

అంతట అసురుడు అమితశక్తితో
అతిలాఘవముగ గదను గ్రహించి
శ్రీహరి గదను కొట్టినంతనే
ఎగిరిపడినదది - సముద్రమ్ములో

ఆశ్చర్యపడె శ్రీహరి అపుడు
అసురుని నేర్పుకు మెచ్చుకొనుచును
నిలచిన హరిని గాంచిన సురలు
హాహా కారము చేసిరొక్కపరి

తిరిగి కొట్టగా ముందుకు వచ్చి
"ఓ వరాహమా! తెలియుమునన్ను
నిరాయుధుడవు - పోరను నీతో
మరియొక గదతో నన్నెదిరించుము"

అసురుని రణ ధర్మమ్మున కచట
ఆనందించెను వరాహ స్వామి
వెంటనె శ్రీహరి సుదర్శనమ్మును
తలంచినంతనె ఉదయించెనట

చక్రకాంతులకు ఆగలేకను
కనులు మూసికొనె హిరణ్యాక్షుడు
సంద్రపుఘోషను మించినహోరుతొ
చక్రము నిలచెను హరిచేతులలో

అంతట అసురుడు కండ్లను తెరచి
అమితబలముతో గదను విసరగా
శ్రీహరి దానిని తన పాదముతో
అడ్డగించగా - విరిగె రెండుగా

శ్రీహరి పలికెను - వీరవతంసమ!
నిరాయుధుడవు కావున నీకు
సమయమిచ్చితి గ్రహించు గదను
అనగా అసురుడు గ్రహించె శూలమును

అసురుడు శూలము విసరగ-చక్రము
తునకలు చేసెను - అవలీలగను
అంతట అసురుడు ముష్టియుద్ధమున
వరాహమూర్తిని కొట్టె వక్షమున

కదలక నిలచిన హరిని గాంచిన
అసురుడు ఆశ్చర్యములో మునిగెను
కులపర్వతమ్ములు పిండగు-దెబ్బకు
వరాహమొకటి - తట్టుకు నిలచెను

వెర్రివానిలా చూడెడి - అసురుని
గేలిచేయుచు పలికెను శ్రీహరి
"మాయలునేర్చిన వీరుడవటగా!
ప్రయోగించుము గాంచెద - వింత."

అంతట అసురుడు ఆలసించక
మాయాజాలము నారంభించెను
భీకరమైన ధ్వని ఎగసినది
పెను చీకటి అది పుట్టుకొచ్చినది

చీకటినుండి రక్తమాంసములు
ఘనమగు శిలలు-ఎముకలు పుర్రెలు
రక్తపు వాన కురియ జొచ్చెను
మెరపులు - పిడుగులు భీభత్సమయె

పిడుగులు ఆగెను - మెరపులుండెను
హోరుగాలి యది వీయసాగెను
ఘనమేఘములు చీల్చుకునపుడు
భూతగణమ్ములు బైటకొచ్చినవి

విరబోసిన జుట్టు - వికృత రూపులు
మృత్యుదేవతను ధిక్కరించినటు
పెద్దకోరలు - పెద్దపెదవులు
మిడిగ్రుడ్లతొ నట నిలబడె నవ్వుచు

నాల్కలనటు నిటు నాడించుచును
వికృతనాట్యము చేయసాగి నవి
ఆయుధాల వర్షమ్మును అవ్వి
కురిపించసాగెను - శ్రీహరిపైన

మధ్యమధ్యలో అసురుడంతట
అట్టహాసములు చేయుచుండెను
లీలగ నవ్వుచు వరాహమూర్తి
అసురుని ఆఖరు శక్తి - మాయయని

గ్రహించి - చక్రము వంకచూడగా
రెప్పపాటులో భూతగణమ్మును
తరిగివేసినది అవలీలగను
అసురుడొక్కడే నిలచెను అచట

ఆశ్రమమ్ములో దితికి తోచిన
దుశ్శకునములకు - కలతచెందినది
కుడి కన్నదరెను - పయ్యెద అంతట
రక్తసిక్తమై - భయము గొలిపెను

చిన్న కుమారుడు ఏమైనాడో
వివరము తెలియక తల్లడిల్లెను
అక్కడ అసురుడు తనమాయయది
కరిగిపోవగా కలవరపడెను

దిక్కుతోచక ఒక్క ఉదుటున
శ్రీహరిపైకి - లంఘించి స్వామిని
తనభుజములతో మర్దించ నెంచెను
గ్రహించి శ్రీహరి - తప్పుకు నిలచెను

ఒడుపుగ తప్పుకు వరాహమూర్తి
నడుముపైన మరి గ్రుద్దగ నసురుడు
గిరగిర తిరిగి ఎగిరిపడెనట -
తిరిగి వచ్చెను పగతో అసురుడు

అది గ్రహించిన యజ్ఞవరాహము
లీలగ అసురుని గూబమీదను
వజ్రఘాతమగు గ్రుద్దుగుద్దెను
అసురుని కండ్లు రాలిపడినవి

దంతము లూడెను నరములు తెగెను
రక్తము గ్రక్కుచు హిరణ్యాక్షుడు
పెనుగాలికి కూలిన ఘన తరువన్నటు
దూరముపడెను - అసువులు వీడెను

బ్రహ్మాదులందరూ మరిమరి చూచిరి
అసువులూడిన హిరణ్యాక్షుని -
మరణసమయమున అసురుని చూపులు
శ్రీహరిపైన నిలచియున్నవి

శ్రీహరి కింకరు డీతడుగావున
దర్శనమ్మది లభించెవీనికి
స్వయముగ శ్రీహరి వీనికోసమై
పుట్టెను - వీనికి సద్గతినిడగా

అనుచు దేవతలు తలంచి అంతట
జయజయధ్వనులు పలికిరి ప్రియముగ
రక్షించితివని హరిపదములపై
వ్రాలిరి భక్తిగ - స్తోత్రముచేసిరి

యజ్ఞవరాహుడు భక్తసులభుడు
మంగళమూర్తి - రమారమణుడు
వారిస్తోత్రముల - చల్లగచూచి
వైకుంఠమునకు సాగిపోయెను

హిరణ్యాక్షుని అంతముగాంచి
ఆనందించిన వేల్పులు నింగిని
దేవదుందుభులు మ్రోయించగను
కల్పవృక్షముకురిసె సుమములను

హోమాగ్నులవి జ్వలించెనపుడు
సూర్యచంద్రులు తేజమునందిరి
దేవవిరోధి - శాపమునంది
శాపముతీరగ హరిని జేరెను

వరహావతార గాథను నాడు
సురలకు చెప్పెను బ్రహ్మదేవుడు
ఆగాథను మరి మైత్రేయుండు
విదురునికంతట వివరించెనని

శుకయోగీంద్రుడు రాజుకు చెప్పెను
అనుచుసూతుడు అచటి మునులకు
తెలియబరచెను సవిస్తరముగా
వరాహస్వామి మంగళచరితము

ఈ కథ చదివిన - చెప్పిన - వినినా
సిరిసంపదలు కీర్తి ప్రతిష్ఠలు
లభించి - ఇహమున సుఖములనంది
పుణ్యధామము చేరుకుందురు

శ్రీహరిగాథలు చెప్పుచునున్న
శుకయోగీంద్రునికి వందనముంచి
రాజవరేణ్యుడు అడిగె నంతట
బ్రహ్మదేవుని సృష్టి తెలుపమనె

"మౌని పుంగవా! హిరణ్యాక్షుని
వధించి శ్రీహరి భూమిని కాచెను
అంతట బ్రహ్మ తిర్యగ్జాతులను
జంతుజాలమును ఎటుల సృజించెను?

విదురుడు తాను తీర్థయాత్రలు
చేసెననుచును సెలవిచ్చిరికద!
ఆపై విదురుడు మైత్రేయ మునిని
ఏమిఅడిగెనో సెలవీయమనె -

నిర్మలచిత్తుడు విదురుడంతట
భక్తిగ అడిగెను మైత్రేయ మౌనిని
ప్రజాపతులను సృజించినట్టి
బ్రహ్మ - సృష్టిమరి చేసెను తదుపరి

వేటిని సృజించ తలచెను బ్రహ్మ
మరీచి మొదలగు పుణ్యమూర్తులు
తండ్రి ఆజ్ఞను తలను ధరించి
జగత్ సృష్టిని ఎటుల చేసిరి?

సపత్నియుతముగ స్వయముగవారు
వేటిని సృజించినారో తెలుపుము?"
అంతట ప్రేమగ విదురుని గాంచి
ప్రియముగ పలికెను మైత్రేయముని

॥శ్రీ కృష్ణచరితము॥



## 13 బ్రహ్మసృజించిన దేవగణం

పరమేశ్వరుడు నిర్వికారుడు కాలరూపుడు
మాయనువశమున నుంచుకొన్నను
ఒక్కొక సారి మాయలొ తాను
కలసియుండును కనబడునటుల

కావున ప్రాణుల నుండుట సత్యము
పరంధాముని మొదటి సృష్టియది
సత్వ రజోస్తమోగుణములగు
వాటినుండి మరి పుట్టెను మహత్తు

రజోగుణమును మహత్తుచేరగ
అహంకారమది జనియించినది
అహంకారమది గుణ విశేషముల
శబ్ద స్పర్శ రస గంధములేర్పడె

పంచభూతముల సృష్టికి అవ్వి
మూలమైనవి - అన్నీ కలసి
పరమేశ్వరుని అనుగ్రహమ్ముతో
బ్రహ్మాండమ్మును ఏర్పరచినవి

జలములో నుండిన బ్రహ్మాండమది
పెరుగుచున్నది అంతట శ్రీహరి
వేయిఏండ్లుగా జలమధ్యమున
యోగనిద్రలో నుండెను వినుము

శ్రీహరి నాభిని - పద్మము పుట్టెను
పద్మమునందు బ్రహ్మపుట్టెను
నారాయణుని స్తుతించి - బ్రహ్మ
శక్తినిపొంది సృష్టి మొదలిడె

తమస్రము - అంధతామస్రము
తమో-మోహనము-మహామోహనము
అనెడివి ఐదు - సృజించె బ్రహ్మ
వాటినిగాంచి వంతనొంది మరి

తమోమయమ్మగు తన శరీరమును
విరించి అంతట విసర్జించెను
ఆశరీరమ్ము నాధారము - చేసుకు
తమోమయమగు - రాత్రి పుట్టెను

రాత్రికిగలవి రెండు గుణములవి
ఆకలి - దాహము - ప్రధానమైనవి
వాటితొ-అసురులు యక్షులు పుట్టిరి
బ్రహ్మనె - మ్రింగెదమనుచు వచ్చిరి

వారిలో కొందరు ముందుకు రాగా -
పలికెను బ్రహ్మ తండ్రిని తాననె
మామా భక్షత రక్షత - అనుచు -
భక్షించకను రక్షించండనె

ఆపదములతో యక్ష - రాక్షస
పేర్లుకలిగినవి - ఆగణములకు
అటులపలికిన చతుర్ముఖుండు
తనదేహమును త్యాగము చేసెను

అటుపిమ్మటను కమలాసనుడు
మరొకదివ్య శరీరము దాల్చెను
ఆశరీరముతొ సాత్విక మూర్తులు
తేజశ్శాలుర సృజించినాడు

వారివల్లను - పుట్టిరి సురలు
ఆవిధముగను దేవతలను - తా
సృజించి బ్రహ్మ - విడిచె శరీరము
ఆ శరీరముతొ పుట్టెను పగళ్ళు

బ్రహ్మ జఘనమున అసురులు పుట్టిరి
వారందరును కామరూపులై
విషయ సుఖముల కాముకులైరి
కామశాంతికి త్రోవనడిగిరి

వారందరును విరించి చుట్టు
ఆవరించిరి అరచుచుండిరి
వారందరున వెంబడించగా
పరుగిడి బ్రహ్మ - హరిని శరణనె

అంతట శ్రీహరి బ్రహ్మకుచెప్పెను
వారు తనను మరి ముట్టడించగా
శరీరమ్మును త్యజించమనెను
ఉభయులకు అది మంచిది అనెను

వారి మధ్యకు వచ్చిన బ్రహ్మ
తనువు త్యజించగ తికమకపడిరి
అంతటిలోన కోటికాంతులతొ
కనుపించెనొక కమలలోచన.

❋❋❋ ॥శ్రీ కృష్ణచరితము॥

# 14 సంధ్యాసుందరీజననం

అతిలావణ్యము అందముకందము
అనిపించెడి ఆ సుందరినచట
గాంచిరివారు – మురిసిపోయిరి
ముగ్ధమనోహరి – మనసులుదోచెను

ఆనందముతో – కౌగలించిరి
అంతట అడిగిరి ఆమె వివరము
మీకొరకై నే నవతరించితిని
అనగా నందరు పరవశించిరి

అంతటిలోన దివ్యసుందరి
పేరుకు తగినటు అవతరించెను
నడుము – ఆమె ఆకాశమ్మయె
తామరపూవది – సూర్యుడాయెను

ధమ్మిల్లమది అంధకారమయె
మెరపుచూపులు తారలుగాను
మేనివన్నె అది సంధ్యారాగమై
స్త్రీరూపమున వచ్చిన – సంధ్యయె

ఆమెఅందము మత్తెక్కించగ
అసురులామెను కౌగిలించుకొని
తీసుకుపోయిరి – ఆసమయమ్ము
సృష్టిలొ – సంధ్యాకాలమైనది

ఆవిధముగను అసురులు సాగగ
తెరిపిని బడిన విరించి మదిలో
ఉపాయమ్ముతో అపాయమ్మును
తప్పించిన హరికి – నమస్సులిడెను

అటుపిమ్మటను చతుర్ముఖుండు
తన అరచేతిని ఆఘ్రాణించగ
అప్సరసలు – గంధర్వులు పుట్టిరి
అంతట బ్రహ్మ తనువును త్యజించె

అటుపిమ్మటను బ్రహ్మదేవుడు
అసహ్యమైన – మైక – ఉన్మాదముల
ఆవులింతలు – నిద్దుర కలిగిన
శరీరమ్ముతో సృష్టిచేసెను

అప్పుడు పుట్టిరి పిశాచ – గుహ్యకులు
సిద్ధులు మరియును భూతమ్ములును
గణనామమ్ము తగినదివారికి
దిగంబరముగా గంతులేసిరి

వికారముఖములు విరబోసిన జుట్టు
గాంచినంతట బ్రహ్మకలతపడి
ఆ సృష్టికి–తా–నసహ్యించుకొని –
వదలిన తనువును వారు గ్రహించిరి

అటుపిమ్మటను చతుర్ముఖుండు
అన్నమయముగా తను-భావనచేసుకు
అదృశ్యదేహమున పితృగణములను
సాధ్యులను మరి సృజించినాడు

విరించి యొక్క అదృశ్యదేహమును
ఆలంబనగా చేసుకు వారు
దేవత్వమున పొందగలిగిరి
శ్రాద్ధమ్ములలో ఆహ్వానించి

దేవతలకును హవ్యము మరియు
పితృదేవతల కవ్యము నిడెదరు
శ్రాద్ధకర్మలలొ వారినుద్దేశించి
హవ్యకవ్యముల సమర్పింతురు

బ్రహ్మ తిరోధాన శక్తితో - బ్రహ్మ
నరుల - సిద్ధల - విబుధ కిన్నరుల
సృజించినాడు కావున వారు
తిరోధానులమని - దేహముగొనిరి

బ్రహ్మతన ప్రతిబింబ రూపముతొ
కిన్నర, కింపురుషుల సృజించినాడు
కావునవారు ఆరూపముగొని
బ్రహ్మను గురించి గానముచేతురు

అంతజేసియు తృప్తినందని
విరించి అలసట నిండి - కోపమున
కరచరణములను విదిలించగను
కొన్నిరోమములు రాలిపడినవి

ఆరోమములు సృజించె - సర్పముల
అంతట బ్రహ్మకు సంతోషమయి
పడకనుండి మరి లేచి చూచెను
అప్పుడు పుట్టిరి మనువులంతట

ఆ మనువులందరు జగత్పావనులు
వారికి బ్రహ్మ - పురుషరూపమగు
తన దేహమును ప్రసాదించెను
వారు పలికిరి బ్రహ్మదేవునితొ

జనకా - నీదగు దయావృష్టితో
జన్మించితిమి - దేవుడవీవు
హవిర్భాగములు అందుచున్నవి
అటులే మమ్ము అనుగ్రహించుము

ఆపై బ్రహ్మ - తపోయోగములు
యోగ సమాధి - విద్యలతోను
ఋషి వేషమును ధరించినాడు
ఋషులనంతట సృజించినాడు

విరించి అంతట - అర్ధదేహమును
వారికి యిచ్చెను - అని మైత్రేయుడు
చెప్పగ విదురుడు ఆనందించెను
అంతట అడిగెను వినయమునిండి

"స్వామీ! మీరు చెప్పిన దానిలొ
స్వాయంభువమను వంశమ్మదియే -
గొప్పదన్నది నాకుతోచినది
ఆయన తనయులు ప్రియ ఉత్తానపాదులు

ఆ తనయులెటుల జన్మించిరయా!
వారు ధరణిని ఎటుపాలించిరి
మనువు కుమార్తె దేవహూతి - తా -
వివేకశాలి యోగనిష్టయని

నీవు నుడువగా వింటిని నేను
ఆమె వివాహము కర్దమ మునితో
ఎటుల జరిగెను - వివరించుమయా!
వారిసంతతి వివరము లెవ్వి?

వారిసంతతి ఆడబిడ్డయగు
రుచిని - ఆలిగా - దక్షప్రజాపతి
కొసగెనంటివి - వివరము లేమి
వారిసంతతి ఎవ్వరు స్వామీ!"

అనగా నంతట మైత్రేయుండు
వివరించెనట విదురున కపుడు
కర్దమ మహర్షి - బ్రహ్మ ఆనతిని
ప్రజా సృష్టికై సంకల్పించెను

మునులలొ కర్దము డుత్తముడగును
యోగవిద్యలో ఆరితేరెను
పరమదైవమని విష్ణువునెంచును
కృతయుగమందు బ్రహ్మఆనతిని

సృష్టిచేయుటకు సంకల్పించి
సరస్వతీనది తీరమందున
నిశ్చల భక్తితొ రమాధవునికై
తపస్సమాధిలొ లగ్నమయ్యెను

అండజవాహనుడై శ్రీహరి
లక్ష్మీదేవితొ ప్రసన్నుడయ్యెను
దివ్యమంగళ విగ్రహమ్ముగని
సాష్టాంగముగ ప్రణామమిడెను

"రమాధవా! నువు జీవుల ఆత్మవు
మహాయోగులే - దర్శించగలరయా!
నా సుకృతమది నిన్ను గాంచితిని
వందన శతములు - ఓ పరాత్పరా!

ఓ పరమేశా! నీకుమారుడు
నాకు జనకుడు - చతుర్ముఖుండు
ప్రజాసృష్టిని చేయగ పలుకగ
గృహస్థాశ్రమము నెరపగ దలచితి

కాలాత్ముడవగు నీ శాసనము
అమలు చేయగా నాసంకల్పము
శరీర సుఖములు అపేక్షించను
నీ భక్తులను - మృత్యువు జేరదు.

నీ కటాక్షము అపేక్షించితి
సృష్టిచేయగల శక్తినొసగుము
అని ప్రార్థించగ - నారాయణుడు
ప్రీతిగ పలికెను కర్దమ మునితో

"ఓ ముని సత్తమ! నీ మదితెలుసును
నీకోరికను తీర్చగ వచ్చితి
బ్రహ్మ తనయుడు స్వాయంభువ మనువు
పాలించుచుండెను భూమండలమ్మును -

ఆయన కూతురు సౌశీల్యవతి
దేవహూతి - అను పేరున బరగును
స్వయముగ తండ్రి తనయతొ వచ్చి
అల్లునిగా నిను ఆహ్వానించును

ఆ శుభ లక్షణ-కరము గ్రహించుము
ఆమె - నన్ను ఆరాధించునయా!
నీవల నామెకు - తొమ్మిది మంది
ఆడు సంతతి ఉద్భవింతురు

వారందరును గుణవంతులయి
మునుల భార్యలై పేరుగడించి
సత్సంతానము బడయుదురయ్యా!
అవిధముగను సృష్టి జరుగును

అటుపిమ్మట నువు - నాపరముగను
సర్వకర్మలు నిర్వర్తించుచు
నీలో - నన్నుగాంచెడియోగిగ
నన్ను చేరుదువు అంత్యకాలమున

దిగులుపడకయా! మౌనిపుంగవా!
ఆపైనీకు తనయుడు కలుగును
ఆతనయుడను - నేనే అనుకో
పరతత్వ బోధను చేసెద నేను."

ధన్యోస్మియని కర్దమమౌని
ప్రణామమిడెను పరంధామునకు
శుభములు పలికి శ్రీవత్సాంకుడు
గరుడవాహనము నధిరోహించెను

మనసునిండుగా మగువ నిండగా
మోహపరవశము నందిన మౌని
ఆమెతలంపుతొ వేచియుండెను
ఆమె పేరు విని పరవశించెను

అంతటిలోన సంశయ మొదవెను
చక్రవర్తికి అనుంగుతనయ -
సంయమీంద్రుని జటాధారిని
పరిణయమాడుట జరుగునాయది!

అనుచు కర్దముడు ఆలోచించుచు
దేవహూతిని తలంచుకొనుచు
మరుసటి రోజుకు వేచియుండెను
అంతటిలోన తెల్లవారినది

॥శ్రీ కృష్ణచరితము॥



## 15 స్వాయంభువ మనువురాక

చక్రవర్తియగు స్వాయంభువుడు
ఆడుబిడ్డకు తండ్రిగావున
తగిన వరునికై వెదకసాగెను
సతి తనయలతో సాగె రథమున

భూమియంతయు వెదకుచుండెను
తగిన వరుడు మరి దొరకక పోయెను
అటుల సాగుచు ఆ పుణ్యాత్ముడు
బిందుసరోవర తీరము చేరెను

బిందుసరోవర జలముల ప్రక్కగ
సాగుచున్నది సరస్వతీ నది
కర్దమ మునికి దర్శనమిడిన
నారాయణుడు ఆనందముగా

కర్దమమౌనిని గాంచినంతనే
రమాధవుని కనుగొలకులనుండి అట
రాలినట్టి - ఆనంద బిందువులు
బిందు సరస్సుగ ఉద్భవించినవి

సర్వపాపముల క్షాళనచేసే
పవిత్ర జలములు నెలకొనెనందు
నింగిని తాకే తాళ వృక్షములు
గంధపు చెట్లు - రసాల వృక్షములు

చిక్కని లతలు - పూలగుత్తులతొ
పరవశ మిడునా దివ్య ప్రదేశము
సూర్యుడు తాను తన చేతులతో
అచటి ఫలములను - తాకగలేడు

అంతటి చక్కగ తరుసంపదతో
పండ్ల రసములు త్రాగుచునచటి
రామచిలుకలు తియ్యని పలుకుల
వేదార్థమును చెప్పినట్లయె

పంచమస్వరముతొ కోకిల పాడగ
పురులు విప్పి అట ఆడె నెమళ్ళు
ఆనందడోలికలు మదిలో నూపుచు
జలతరంగముల నూగెను హంసలు

పద్మమ్ములపై తుమ్మెదలన్నీ
ఝంకారమ్ము ఆలపించగా
ప్రకృతికాంత నిద్రలేచి - తా -
పసిడి చీరను అరవేసుకొనె -

సహజవైరములు మరచె జంతువులు
క్రూరమృగమ్ములు సాధువులైనవి
పులికి సేవలు చేసెను దంతి
లేళ్ళతొ ఆడెను పులి పిల్లలట

అట్టిసరస్సుకు కుడివైపునగల
గట్టునవున్న కర్దమాశ్రమము
పలుకరించినటు రాజుకు కనబడె
చేరెను భార్య - తనయతొనంత

ఆసమయములో కర్దమ మహర్షి
ఉపనిషత్తును పఠించుచుండెను
బ్రహ్మ తేజముతొ వెలుగుచుండెను
భాస్కరుడేమో అన్నటులుండెను

మునిని గాంచిన రాజు మ్రొక్కెను
అతిథి సత్కారము చేసెను మౌని
ఉచితాసనముల కూర్చొనియుండగ
మనువుతొ పలికెను కర్దమ మౌని

"నీ పేరువింటిని - యోగ్యుడవీవు
ధర్మబద్ధముగ ధరను ఏలెడి
ధరణీ ధవునిగ ఖ్యాతి గాంచితివి
కావున నీవు - శ్రీహరి సముడవు

నా వందనము అందుకోవయా!
అనుచు భక్తిగా నమస్కరించి
తిరిగి పలికెను కర్దముడపుడు
కుశలప్రశ్నల పలుకరించెను

ధర్మపాలన మదిలో నెంచిన -
రాజ్యసంచారము - రాజు చేయవలె
ఆయుధమ్ముతో సంసిద్ధుడయి
దుష్ట శిక్షణకు పూనుకోవలె

అదిసరెగానీ! ఓపుణ్యాత్మా
నీవు వచ్చుటకు కారణమేమి
ఊరకరారు మహానుభావులు
బ్రహ్మచారి కడకొచ్చితివీవు."

ఉచితరీతిని మౌని పలుకగా
పరవశించిన మనువు అంతట
తనయకు ఆతడు తగినవరుడని
మదిలోనే మరి నిర్ణయించుకొని

"నీకు తెలియని దుండదు గాదా!
తను పలికిన ఆ ఆగమాలను
ధరలోవ్యాప్తికి - చతుర్ముఖుండు
ముఖమునుండి-తా-సృజించెమిమ్ముల

పాపులనుండి ఆపదరాకను
ధరావలయమును కాపాడుటకు
బాహువులనుండి మమ్ముల బ్రహ్మ
సృజించినాడు సృష్టిరచనలో -

కావున మనము శ్రీహరి హితులము
బ్రహ్మ దేవుని అవయవమ్ముల
ఉద్భవించిన మనయిద్దరికీ
బంధుత్వమది ముందే యున్నది

వేద మూర్తివగు నిను దర్శించి
ధన్యతనందితి మహానుభావా!
నీ పలుకులతో వీనులు ధన్యము
నీపాదరజముతో శిరస్సుధన్యము

నేవచ్చిన పని వివరించెదను
ఈ జవ్వని - నా పుత్రిక స్వామీ!
గుణశీలముల ఎన్నికైనది
నా పేరు నిలపెడి - మంగళకారిణి

ఆమెకుతగిన వరుడుదొరకక
తిరుగుచుంటిని భూమండలము
నారదమౌని నీగురించి మరి
చెప్పగ సరెయనె ఈ సౌశీల్య

కావున స్వామీ! నా కూతురును
నీ కర్పింతును నీసమ్మతితో
కన్యాభిక్షను స్వీకరించి నను
ధన్యుని చేయుము సంయమీంద్రుడా!

గుణగణములను చెప్పుట ఏల
అన్నిటనీకు అనువగునయ్యా!
నిరతమునిన్ను పూజించుచును
పతివ్రతా ధర్మమ్మున నుండును

ఛాయలాగ నిన్ననుసరించును
గృహస్థాశ్రమ ధర్మమ్ము నెరపుచు
మనుగడనీతో గడుపును మౌనీ!
అనుగ్రహించి - పరిగ్రహించుము"

"అంతట పలికెను కర్దమమౌని
మనుసార్వభౌమా! నీ మాటలకు
ఆనందించితి - వినయమూర్తివి
నిన్నుగనుట నాభాగ్యవశమయా!

నీకు తెలియని విషయము చెప్పెద
నాదివ్య దృష్టికి అందిన సంగతి
నీ తనయ మరి సౌందర్యరాశియే
ఆమె చెలియలతొ ఆడుచుండగా

బంతి ఆట తను రాజసౌధమున
ఆడుకొనుచును నున్న సమయమున
విశ్వావసు అను గంధర్వుడు గాంచి
అందచందముకు ముగ్ధుడాయెను

నింగిని సాగే ఆ గంధర్వుడు
నేలను బడెను ఆశ్చర్యముగా
ఆవిషయము నీ తనయకు తెలియదు
అంతటి గొప్ప అందమీమెది

నన్ను భర్తగా స్వీకరించుట
నా అదృష్టము అదియునుగాక
శ్రీహరి ఆజ్ఞకు బద్ధుడ నేను
కానీ నాదొక ప్రతిజ్ఞవినుము

సంసార సుఖమది పొందుచున్నను
సంతానవతి అగువరకు మాత్రమే
నీ తనయను ఆలిగ - గ్రహించగలను
ఆపై నేను విరాగి నగుదును

శ్రీహరి ఆజ్ఞను పరిపాలించుచు
బాహ్యేంద్రియ వికారమ్ములువదలి
సన్యాసిగను గడిపెద నేను
తనయ సమ్మతిని గొనుము అందుకు

ఆ మాటలకు మనువు అంతట
కూతురు ముఖమును చూచినంతనే
ఆమె సరియని శిరసునూపగా
యధావిధిగను పెండ్లి జరిగినది

శతరూప అంతట తనకూతురుకు
దివ్యాంబరములు ఆభరణమ్ములు -
మనువు అల్లునికి వివిధకానుకలు
అందజేసిరి - వేడుకచేసిరి

కూతురు దూరము - అన్నవిషయము
భరింపరాని బాధ రగిల్చెను
తప్పదు కనుక మనువు - తనయకు
కీర్తి ప్రతిష్టతెమ్మని చెప్పెను

పుట్టినింటికి - మెట్టినింటికి
వన్నెతేవలె అనుచు దంపతులు
కంటనీరిడి తనకూతురును
అల్లునిచేతికి అందించి వెడలిరి

రథమున సాగుచు మనువు అచ్చట
బిందుసరస్సు సొగసులు గనుచు
బ్రహ్మావర్త దేశము జేరెను
పుణ్యప్రదేశము ఆగెనచ్చట

ఋషులు అచ్చట యజ్ఞేశ్వరుడగు
మహావిష్ణువుకు సమర్పణగను
యజ్ఞము చేసిరి ఆసమయములో
వచ్చిన అసురుల చంపిరి వాటితొ

శ్రీహరి యజ్ఞవరాహముగాను
అవతరించి అట హిరణ్యాక్షుని
వధించి అంతట ఆవేశముగా
ఒడలుదులుపుకొన రాలె రోమములు

మనువు అచ్చట విష్ణుప్రీతిగా
యజ్ఞముచేసి - జేరెను నగరము
ఆవిధముగను స్వాయంభువమనువు
తగిన వరునికి ఒసగెను కన్యను

ఆరోమములు పచ్చని రెల్లుగ
దర్భలగాను మారి పోయిఅవి
మహామునులకు బర్హిస్సులుగా
ఉపయోగపడె వాటితొ నంత

అంతట మనువు జీవితమ్మును
విష్ణుసేవకు అంకితమిడెను
హరికీర్తనలతొ హరి భక్తులతో
సమయముగడపుచు నుండెను హరికై

వర్ణాశ్రమధర్మమ్ములు చెడకను
కాపాడుచును జనరంజకముగ
మనువు రాజ్యమునేల సాగెనని
మైత్రేయుండు తెలిపె - విదురునకు

॥శ్రీ కృష్ణచరితము॥



## 16 కర్దమప్రజాపతి యోగ మహిమచే విమానం కల్పించుకొని భార్యతో విహరించుట

పతి శుశ్రూషలు పరమ ధర్మమని
అదియే పరమావధిగా నెంచి
ఈశ్వరునకు ఆ పార్వతివోలె
సేవచేయుచునుండె దేవహూతి

వేకువనే తను నిద్ర లేచును
బిందుసరోవరతీర్థమునుండి
దివ్యతీర్థమును తెచ్చి అంతట
పూవులు సమిధలు సిద్ధముచేయును

ఆమెసేవలకు కర్దమమౌని
పరవశించుచు మదిలో తలచెను
గారాబముగా పెరిగిన యట్టి
రాకుమార్తెకు కష్టమనుకొనె

లేడికూనను చేరదీయుచు
లేతపచ్చిక చిగురులు పెట్టును
తల్లిలేడి – తా – పొడిచిన గాని
తల్లి ప్రేమయని సరిపెట్టుకొను

భార్య శరీరము కృంగిపోయినటు
గ్రహించినట్టి – భర్త పలికెను
నియమనిష్టలతొ నా సేవలతో
నీ ఆరోగ్యమును మరచిపోతివి

మదిలో దిగులు కలిగియుంటివా!
కృశించినటుల కనబడుచుంటివి
అనుచు లాలనగ భర్త అడుగగా
నీ భార్యగ – నాకు దిగులెందుకనె

కృశించినటుల నీదేహమది
తెలియబరచును దాచుటెందులకు
అనితరమైన యోగశక్తిని
కలిగియుంటిని – నాతపస్సుచే

నీవు కోరినది ఏదైనను – విను
తలచినంతనే సమకూర్చెదను
దివ్యదృష్టిని కలిగించెదను
సర్వము కనబడు నీకన్నులకని

దివ్యదృష్టిని ప్రసాదించెను
ధన్యురాలను అని వందనమిడె
తిరిగి అడిగెను భర్త లాలనగ
ఏమికావలెనొ తెలుపుము అనెను

అంతట పలికెను ఆ సాధ్వీమణి
"నాకు వలయునది – నీకు తెలియనిది
ఏమున్నదయా! తపోవంతుడా!
దాంపత్య జీవితము నను గ్రహించుము

నీ స్పర్శయది కలుగని – నేను
కృశించి పోవుటకది కారణము."
అంతట భర్త అనునయించుచు
నీ కోర్కెను నేను కాదనగలనా!

అనుచు ఆమెను దరికిచేర్చుకొని
ఆమెతొ పలికెను దాంపత్యమునకు –
సరిపడు శాస్త్రము తెలియదు – అనగా
అనుగ్రహించెద ననుచు ఒసగెను

దివ్యశక్తి ఒకటా స్త్రీమూర్తిలొ
చోటుచేసుకొని మెరసెను కళ్ళు
అంతట భర్త యోగశక్తితో
దివ్యవిమానము నొకటి రచించెను

యోగమాయతో దివ్య విమానము
అన్నిహంగులతొ దివ్యసౌధముతొ
కన్నులముందర నిలచి – పిలచినది
అవరావతినే చిన్నబుచ్చినది

వజ్రపుగోడలు రత్నస్తంభములు
పద్మరాగపు గవాక్షములతో
పూలమాలికల సుమగంధముతో
తుమ్మెద ఝుంకారమ్ముల పిలచెను

కృత్రిమ పర్వత శ్రేణులున్నవి
పూ ఫల వృక్షమ్ములు నిండినదై
కోకిల పాటల వసంత ఋతువై
నేత్ర పర్వమై నిలచె విమానము

భర్త మహిమకు పొంగెను భార్య
కానీ – కన్నుల ఆవేదనయది
గ్రహించి మహర్షి ఆమెకంతటా
బిందుసరోవర జలములచూపుచు

లలనా! వినుము దివ్యసరస్సిది
రమాధవుని కను గొలకుల పుట్టెను
ఇచటి స్నానము అభీష్టప్రదము
కావున నీవు స్నానము చేయుము

ఆపై మనము విమానమ్మును
అధిరోహించి ఆనందించుచు
సంసారజీవితము సాగించెదమన
అతివ జలముల జలకములాడెను

భర్తృసేవలో దేహధ్యాసయది
మరచిన మగువ జడలను దాల్చి
దేహసంస్కారము మరచి పోయినది
తాపసి వనితగ – మెలగుచున్నది

ఆమెసరస్సున మునగబోవగా
నీటిలోనుండి సుందరవనితలు
పైకివచ్చిరి ఆశ్చర్యముగా
నీ సేవలకు నిలచితి మనిరి

వారందరును స్నానముకాగనె
దివ్యాభరణము వస్త్రమ్ములతో
రతీదేవిలా అలంకరించిరి
ప్రకృతికే మరి కన్ను కుట్టినది

చక్కని భోజన మమర్చినారు
కప్పురవిడెము సమకూర్చిరట
దివ్యమాలలు సిగనుచుట్టిరి
రత్నాసనమున కూర్చొనబెట్టిరి

ఎదురుగ అద్దము చూపగ నంత
ఆమె అందముకు తికమక పడినది
వెంటనె భర్తను స్మరించినంతనె
ఆమె ప్రక్కన నిలచె కర్దముడు

భర్త లాలనగ విమానమ్మును
అధిరోహించగ ఆమెయు చెప్పెను
వారిద్దరును దానినెక్కగా
పరచర్యలకై కాంతలు ఎక్కిరి

గరుత్మంతుని పోలిన వేగము
కలిగిన యట్టి ఆ విమానము
గగన తలమున సాగుచున్నది
మేరుపర్వత ప్రాంతము జేరెను

అచ్చటనున్న గంధపు చెట్ల
దివ్యసౌరభము ఆహ్వానించెను
అచట విహరించు దిక్పాలకులు
పుణ్యజంటకు నమస్సులిడిరి

అచ్చటినుండి దివ్యవిమానము
సుర ఉద్యానములందునసాగెను
ఆప్రదేశములు పరవశమిడగా
భూమండలమును త్రిప్పె విమానము

అటులా దివ్య విమానము త్రిప్పి
నేలకు దిగెను - ముని ఆనతితో
దివ్య ప్రదేశములన్నీ చూచి -
తిరిగి భూమిపై అడుగు బెట్టిరి

భర్తదింపగా దేవహూతి - తా -
మెల్లగదిగెను దివ్య విమానము
భర్తస్పర్శతో పులకరించినది
బాహుబంధమున యిమిడిపోయెను

భర్త తనను మరి అనుగ్రహించెను
అని ఆనందముపొంగులు వారెను
అంతటిలోన ఆశ్రమసీమలో
దివ్యసౌధమది వెలసెను వింతగ

ఫలభరితమగు తరుసంపదతో
నడబావులతో లతాకుంజముల
వసంతఋతువు విరిసెనచ్చట
హంసతూలికా తల్పము వెలసెను

భక్ష్య-చోష్య-లేహ పానీయములు
అనేకరుచుల పిండివంటలతో
ఆహ్వానించుచు నున్నటులున్నవి
పరిచారికలు నిండియుండిరి

కర్దమ ప్రజాపతి ప్రజా సృష్టికై
శ్రీహరి ఆనతి నెరవేర్చగను
కామపూజను నెరవేర్చెనచ్చట
ఆనందసీమలో అడుగు బెట్టిరి

మునిదంపతులు అన్యోన్యముగా
వేయివత్సరమ్ములచట గడిపిరి
అంతట కర్దమ ప్రజాపతి తన
దివ్యశరీరము తొమ్మిదిగ జేసి

మౌని - తనదగు తేజమునంతట
తొమ్మిది విధములుగా విభజించి
దేవహూతిని అనుగ్రహించగ
తొమ్మిది మంది తనయల కన్నది

పుత్రికలను గని సంతోషించిన
కర్దమ ప్రజాపతి హరిని తలంచుచు
ఆయన కరుణచె ఆయన ఆనతి
నెరవేర్చితినని తృప్తినందెను

భార్యతో పలికెను మృదుమధురముగా
"సంసారబంధములు త్రెంపుకు నేను
సన్యాసి జీవితము ఆరంభింతును
అందుకు నీ అనుమతి కావలె."

బాలింత కొంత సంశయించెను
నిరాశలో తను కదలిపోయినది
అంతటిలోన తెలివి తెచ్చుకొని
భర్త పాదముల మ్రొక్కిపలికెను

"స్వామీ! మీరు వదలివెళ్ళిన
ఈ పసికందుల పెంచుట ఎట్లు!
తండ్రి యొక్క క్రమశిక్షణవీరికి
చెప్పెడి శక్తినాకు వున్నదా!

ఆడుదానిని – వీరందరికీ
తగినవరులను – తేగలనా మరి!
అంతవరకును మీ అనుగ్రహము
నాపై నిలపి – నిలవుముయిచట

అదియునుగాక వంశాంకురము
పరతత్వోపదేశము చేసెడి తనయుడు
కలిగినచో నా బ్రతుకు ఫలించును
ఇహసుఖములపై మక్కువలేదు

నీ అనుగ్రహము నాపై కలుగగ
జ్ఞాననిధియగు తనయుని నాకు
ప్రసాదించుము మహిమాన్వితుడా!
అనుచు ఏడ్చెను దుఃఖపూరిత

సతి దుఃఖమును గాంచిన భర్త
కరగిపోయెను జాలి కలిగెను
పలికెను ప్రియముగ భార్యామణితో
"నీపలుకులవి సమంజసమ్ము

నీకోరికది నెరవేర్చెదను
పరమేశ్వరునికి తల్లివగుదువు
అక్షర పరబ్రహ్మ – శ్రీహరి నీకు
తనయునిగాను ఉద్భవించును

నేటినుండి నువు శుచి నియమములు
ఇంకా పెంచుకు నిష్టగనుండుము
నిరతము శ్రీహరి ధ్యానముచేయుము."
అనుచు ధ్యానమును బోధించెనామెకు.

॥శ్రీ కృష్ణచరితము॥



## 17 విష్ణువు దేవహూతికి కుమారుడై పుట్టుట

అంతట దేవహూతి నియమనిష్టలతొ
హరి పదపూజను చేయుచుగడిపెను
పతిసేవలను చేయుచుండెను
తనయల శ్రద్ధగ పెంచుచుండెను

కొన్నిఏండ్లట గడచినయంత
దేవహూతి – తా – ధరించెగర్భము
దివ్యతేజముతొ వెలుగుచుండెను
సాక్షత్ హరికే తల్లియగునుకద!

గర్భభారము మోయుచునున్న -
భార్యతొ పలికెను కర్దమ ప్రజాపతి
పదునాల్గుభువనములు మోసిడిబాలుడు
పెరుగుచుండె – నీగర్భమునందు

శ్రీహరి నాడు వరమునొసంగెను
తొమ్మిదిమంది తనయల వెనుక
తానే పుట్టెద తనయునిగా నని
అంతట భార్య మ్రొక్కెవినయముగ

ప్రసవ సమయమాసన్నమైనది
దేవకన్యలు వేయిమంది అట
సపర్యచేయగ ఆ పుణ్యవతి
దివ్యబాలునికి జన్మనిచ్చినది -

ఆపసి కందు వేయిసూర్యులట
దిగిన తేజముతొ - వెలుగుచుండెను
వేల్పుల మంగళవాద్యములెగసెను
మందార పుష్పముల వాన కురిసెను

అచ్చరకన్యలు నాట్యమాడిరి
సంద్రములన్నీ ఎగసె ముదమున
అగ్ని హోత్రములు వెలిగె తేజముతొ
సస్యసంపదతొ నిండెను ధరణి

పుత్రోత్సాహము కలిగెను జగతికి
అంతట బ్రహ్మ - మరీచి మొదలగు
మునిపుంగవులతొ స్వయముగ తాను
కర్దమ మునిని చూడగవచ్చెను

వారందరికీ కర్దమ మౌని
నమస్కరించి - పులకరించెను
బ్రహ్మ అంతట పురిటిగదికి చని
బ్రహ్మానందము నిండి పలికెను

"తల్లీ! నీవు ధన్యచరితవు
నాజనకునికే జనని వైతివి
అనుచు పలుకుచు మునిదంపతులతొ
పలికెను బ్రహ్మ మృదుమధురముగా

చరితార్థులు మీరిద్దరాయిరి
మీపూజలవి ఫలించినాయి
పరాత్పరునికే జన్మనిచ్చిన
ధన్యాత్ములు - మీ బ్రతుకు ఫలించెను

కర్దమమౌనీ! నీ కుమారుడు
సాక్షాత్ శ్రీహరి నిస్సందేహము
తత్వబోధను చేయును నీకు
నీ సందేహములన్నీ తీర్చును

కపిలునిగా మరి నామధేయము
సాంఖ్యయోగమును ప్రతిష్ఠించును
ముల్లోకములకు - ఆచార్యుడగు
జ్ఞానసిద్ధి కలిగించు - జగతికి

మరియొకమాట నీ తనయలను
ధర్మచరితులగు మునులకు యిచ్చి
పెండ్లిచేయుము ప్రజాసృష్టికై
అనుచు చెప్పి-తా-సాగెను బ్రహ్మ

అంతట మౌని వివాహమ్ములను
నిశ్చయించి మరి జరిపెను విధిగా
కళయను తనయను - మరీచి కిచ్చెను
అనసూయను మరి అత్రి కొసగెను

శ్రద్ధను యిచ్చెను అంగీరసునికి
హవిర్భువును మరి పుస్త్యున కిడె
గతి అను కన్యను - పులహంసకు నిడె
క్రియను ప్రియముగా క్రతువున కిడెను

ఖ్యాతిని ఒసగెను భృగుమహర్షికి
అరుంధతిని మరి వశిష్టునకిడె
శాంతిని యిచ్చెను అధర్వునకును
అటులా మునులు జామాతలాయిరి

దినదిన ప్రవర్ధమానముగాను
కపిలుడు పెరుగుచు సంతస పరచెను
ఏకాంతముగా నున్న కపిలుని
గాంచి – కర్దముడు పలికెనిట్టుల

"పుత్రరూపమున నున్న పరాత్పర
హృదయపూర్వక వందనమ్ములివె!"
చిరునగవొలుకుచు ఆబాలుండు
కూర్చొనమనచు – పలికె తీయగా

ఎదురుగ కూర్చొని పలికె కర్దముడు
"నీలీలలవి అనంతమైనవి
కర్మవలయముల సంసారబంధముల
చిక్కినవారికి అందవు నీవు

ఎన్నోజన్మల యోగ, ధ్యానముల
తపోఫలముగా ఆత్మయందున
నినుదర్శించగ యోగ్యులు – యోగులు
అంతటివాడవు తనయుడవైతివి

మాటనిలుపుకొన మరుమాటాడక
మందస్మిత వదనారవిందముతొ
మమ్ముతరింపగ పుట్టితి వింట
మాభాగ్యమది ఏమని చెప్పెద!

కపిలావతారా! శరణువేడితిని
జగుత్తుఅంతయు నీవేస్వామీ!
జగత్తునంతయు కుక్షిలొనుంచుకు
కాపాడెదవు – కరుణాంతరంగా!

కర్మసాక్షివి – ప్రాణులక్రియలు
కదలికలన్నియు – నీ అధీనమే!
దేవ పితృ ఋణములు తీర్చుకు
ధన్యుడనైతిని దయాసముద్రా!

అనుగ్రహించిన – యిక నే సాగి
పుణ్యభూముల సంచరించుచు
నిశ్చల ధ్యానమునందు లగ్నమై
హృదయములో–నిను నిలుపుకొందును"–

ఆమాటలకు ఆదరమ్ముగా
పలికెనంతట – కపిలావతారుడు
"నీకుయిచ్చిన మాటకొరకునై
నీ తనయునిగా ఉద్భవించితి

అంతకుమించిన కారణమేదియు
కపిలావతారముకు లేదు మునీంద్రా!
దయాళువును – నే – కోర్కెలు లేవు
మునిగా పుట్టుట కిది కారణము

నా కొరకీ రూపము కాదు
మునులగు నట్టి – నీబోంట్లకు మరి
ఆత్మవివేకము కలిగించుటకు
కనబడు రూపము ధరించినాను

నావల నీకు తెలియ దగినదిది
నాపాదమ్ములపై నిశ్చల భక్తి
మనస్సునందున ననుధ్యానించుచు
గడుపుట చాలును – తత్వబోధయిదె!

ఇంద్రియ వికారమ్ముల త్యజించి
నాపదములపై భక్తి నిలచిన
మోక్షము నీకు తేలికయగును
కావున నన్ను హృదిలో నిలపుము!"

ఆనందముతో – ఆ ప్రజాపతి
ప్రదక్షిణించి నమస్కరించెను
భార్యకుచెప్పి హరిధ్యానముతో
తపోవనముకు సాగిపోయెను

మౌనవ్రతముతో కాంక్షలు త్రెంచుకు
పరాత్పరుని తనలోన గాంచుచు
ఆయన వేరుగ లేదని గ్రహించి
ప్రసన్న హృదయము నిండినవాడై

అణువు అణువు ఆ వాసుదేవుడని
ఆతని సన్నిధి పరమావధియని
అందులకే తన జన్మ అనుచును
అంతరంగమున తలచి తరించెను

అనుచు విదురునకు మైత్రేయుండు
తెలియబరచి – ఆపై గాధను
తల్లికి కపిలుడు తత్వజ్ఞానమును
బోధించుటది తెలిపె తీయగా.



॥శ్రీ కృష్ణచరితము॥

## 18 దేవహూతి కపిలుని వల్ల తత్వజ్ఞానమును పొందుట

తండ్రి అడవులకు సాగిపోగనే
తల్లికొరకునై కపిలుడంతట
బిందుసరోవరతీర్థమందున
వసించియుండెను – అంతట తల్లి

బ్రహ్మచెప్పిన మాటలు తలచుకు
తనయుడు తనకే కాక – జీవులకు
తత్వజ్ఞానమున మార్గదర్శియని
పొంగిపోయినది పలికె కొడుకుతో

"తండ్రీ నీవు నిర్వికారమగు పరబ్రహ్మవు
కర్దమ ప్రజాపతిని అనుగ్రహించి
నేలకుదిగితివి నా తనయునిగా
అట్టి నీవు – నన్నుద్ధరింతువని

బ్రహ్మ చెప్పిన పలుకులు నిజము
తండ్రికి నీవు బోధచేసితివి
కృతకృత్యుడయ్యెను – సాగె తపముకు
నాబ్రతుకును ఒడ్డుకు జేర్చుము నాయన!

అజ్ఞానతిమిరమున అంధులు అయిన
జీవకోటిని ఉద్ధరించగా
అవతరించిన జ్ఞానజ్యోతివి
ఉద్ధరించుము దేవవందితా!"

అనుచు పలికిన తల్లినిగాంచి
ఆప్యాయముగా పలికె కపిలుడు
"నీవు కోరినది అనుగ్రహించగ
ఇచటకు వచ్చితి బోధను – వినుము

చిత్తము మూలము కర్మబంధముకు
ఆచిత్తమది అదుపుదప్పిన
త్రిగుణమ్ములవి వచ్చిచేరును
వాటి ఫలితమే – సంసార బంధము

ఆ బంధమది ఇంద్రియ వశమున
నుండక – లొంగక నిలబడియున్న
మనస్సంయమనము కలిగించునమ్మా!
మోక్ష ద్వారము చేరుట జరుగును

ఆ చిత్తమును శ్రీహరి పదముల
నిలపగ సాధన చేసినచో మరి
మోక్షము సుగమము–కావున చిత్తము
బంధ – ముక్తికి ప్రధానహేతువు

కావున ఇలలో విద్వాంసులు మరి
సంగము అనెడి కలయిక నెంతో
చాకచక్యముగ లొంగ దీసుకొని
నా పాదమ్ములు శరణని అందురు

అహంకార మమకారమ్ముల
కామక్రోధములు కలుగుచుండును
ప్రశాంత చిత్తము కలిగినచో యిక
సుఖదుఃఖములు ఒకటిగ నెంచును

కష్టసుఖములు ద్వంద్వము సహించి
జీవకోటిని ప్రేమించుచును
శాంత మూర్తులు దయాపరులునై
కర్మలు – వాటి ఫలముల – నెంచక

సూక్ష్మరూపుడు తటస్థుడైన
తానొక్కడయి వెలిగెడివాడు
ఆపరమాత్మను – ఆత్మమయుని మరి
జ్ఞాన – భక్తి – వైరాగ్యయుక్తమగు

నాపాదమ్ములు – గతియని నమ్మి
నా గుణగానము – ధ్యానముచేయుచు
నాకథలను వినుచు పరవశించుచు
పరమభాగవతునిగ – మెలగువానికి

ప్రశాంత చిత్తములో దర్శించిన
యెగులు – వారు పరతత్వ ప్రాప్తికి
భక్తి యోగమును మించిన దింక
లేదని – అదియే త్రోవని అందురు

ఆధ్యాత్మిక – ఆధిభౌతిక – ఆధిదైవిక
తాపములంటవు – దోషరహితులగు
సత్సంగము మరి నా కథాశ్రవణము
చేసెడి మనస్సు – మోక్ష పథమునిడు

విద్వాంసుల మార్గము చెప్పెద తల్లీ!
బలీయమైన – ఇంద్రియాలకు
జీవుడు వశమైయున్నచో నిక
బంధమ్మునకు లొంగిపోయినటు

నాసృష్టియగు ఈజగత్తును
విమర్శించుకు జ్ఞానముపెంచుకు
సుస్థిర భక్తితొ నను తెలుసుకొన
చింతన కలిగిన – ధన్యులగుదురు

వైరాగ్యగుణముతో వికసించు జ్ఞానమున
మనోచింతలు మూలకు నెట్టి
మనఃపీఠమున ప్రతిష్ఠించుకొను
భక్తుడు - నన్ను దర్శించ గలుగును."

దేవహూతి అటపలికె భక్తిగా
"మహానుభావా! ఏకర్మలను
ఆచరించుటో తెలియని దానను
నీ ఉపదేశము భక్తినొసగును

ఎట్టి భక్తియది నీగుణములచర్చ
చేయగ - మనస్సులగ్నముచేయును
పాపక్షాళము చేసి - ముక్తిని
ప్రసాదించునో తెలుపుము - దయతో

తనయా! నీవు చెప్పదలచిన
యోగమార్గము దాని స్వరూపము
శాస్త్రజ్ఞానము లేని దానను -
అర్థమగునటు తెలియబరచుము."

"అమ్మావినుము! జ్ఞానకర్మేంద్రియములు
రెండువిధములు అందులో మొదటిది
జ్ఞానేంద్రియము దేవతలాధీనము
కర్మేంద్రియమ్ములు వేదకర్మల నిర్వర్తించును

ఆరెంటికిని - మనస్సు ముఖ్యము
ఆ మనస్సది స్వభావసిద్ధమగు
భక్తిని కలిగిన - చాలును తల్లీ!
ముక్తికంటె మరి - భక్తి గొప్పది

తినిన అన్నమును జఠరాగ్నియది
జీర్ణింప జేసిన తీరుగ - తల్లీ
భక్తి శక్తియది పాపపుణ్యరూపమ్ముల
కర్మవాసనల దహించివేయును

ముక్తికంటెను భక్తి గొప్పదను
భక్తులు కొందరుండగా మరి
ప్రాచీనమగు అవతారమ్ముల
గాథలు వినుచు కొందరుందురు -

నాలీలలను గానముచేయుచు
మోక్షేచ్ఛయది లేకను వారు
ఆనందమును అనుభవించుచు
నా అధీనమున మనసు నుంచెదరు

అటుల సాధనతొ అట్టివారికి
అణిమాదిసిద్ధులు కలిగిన యట్టి
శాశ్వతమైన ఆనందధామము
ఊహలకందని మోక్షములభించు

స్నేహముతో మరి తత్వజ్ఞానము
విశ్వాసముతో స్నేహధర్మమును
మంచి కార్యముతొ ఆప్త హృదయము
మంచి మంత్రమిదు గురుత్వమున్ను

కలిగి - వారికి ఇష్టదైవముగ
ఆ భక్తులతో - కలసి యుందును
అట్టివారికి కాలగమనమున
కలిగెడి బాధలు కలుగవు జననీ!

ఎన్నోజన్మలు జీవులకుండును
నాయిల్లాలు - నాయిల్లనుచు
బంధమ్ములకు కట్టుపడకను
నేనే శరణని భజించువారికి

ప్రత్యక్ష నరకమగు సంసారకూపమున
జారనీయక చేర్చుకుందును
భగవంతుడనగు నన్నుకాదనిన
నీచాశ్రయమగు - దుఃఖవలయమిడు -

అగ్నిమండును సూర్యుడు వెలుగును
ఇంద్రునివర్షము - నా సంకల్పము
నాపేరు వినిన మరి-మిత్తి పరుగిడు
కనుక - నన్ను మరి జగత్ ప్రభువుగా

మదిలోనెంచి - ఆత్మజ్ఞానమున
వైరాగ్యయుక్తమగు భక్తితో యోగులు
ముక్తికొరకునై - నాపాదయుగళిని
భజించు వారిని - కాపాడెదను

ఒక్కమాటలో చెప్పెద తల్లీ!
సుస్థిరభక్తితో నిండు మనస్సుతో
నను సేవించిన వారిని - భువిలో
కాపాడెదను - మోక్షమునిడెదను

అనుచు భక్తియోగపు మహిమనుచెప్పి
కపిలుడంతట మాతృమూర్తికి
తత్వయోగమును ఉపదేశించెను
అనాది పురుషుడు గుణ రహితుండు

ప్రకృతి గుణ విలక్షణుండు
ప్రత్యక్షరూపుడు స్వయంప్రకాశుడు
అనుచు ఆత్మయది తెలుపుచున్నది
ఆ ఆత్మయది విశ్వవ్యాప్తము

ఆత్మతాను ఈ ప్రకృతియందు
ఇచ్ఛా ప్రకారము ప్రవేశించి - అంతట
ప్రకృతి మూలముగ సృష్టిచేయును
మోహకల్పితము - ప్రకృతి అగును

ఆ మోహములో విజ్ఞానముపోయి
ప్రకృతి గుణముల నారోపించుకు
ఆత్మఅంతట తాను కర్తనని
సంసార బంధమున చిక్కడిపోవును

ఈశ్వర దేవుడు మోహరహితుడు
కర్మలు చేయక - సాక్షిగనుండును
కావున కార్య - కారణమ్ములవి
ఆత్మకు చెందును - అనితెలియనగు

సుఖదుఃఖముల రూపము అయిన
ప్రతిఫలమ్మది ప్రకృతినంటని -
పురుషునకు మరి - వచ్చిచేరును."
అంతట అడిగెను - భక్తిగ తల్లి

"ఓ పురుషోత్తమ! ఈ ప్రకృతి పురుషులు
ప్రప్రంచమునకు కారణభూతులు
వాటికి చెందిన సత్తు - అసత్తులు
తెలియు విధమును విశదపరచుము."

బదులు పలికెను కపిలుడు తల్లితొ -
"మాతా! వినుము త్రిగుణమ్ములును
అవ్యక్తము-నిత్యము-సదసదాత్మకము
ప్రధానమైన - ప్రకృతి అంశలు

ఇరువదినాల్గు తత్వాలు ప్రకృతికి
పంచమహా భూతమ్ములను-తన్మాత్రలును
కర్మ-జ్ఞానేంద్రియ పంచకమ్ములును
మనో, బుద్ధి - చిత్తా హంకారములు

ప్రకృతి తాను బ్రహ్మ పదార్థపు నెలవగు
కొందరు ప్రకృతికి - కాలము చేర్తురు
పురుషుడు అనగా - ఈశ్వరుడనుచు
పురుషత్వము-కాల మందురు కొందరు

ఇటు-కాలమ్మునకు మరి ప్రకృతికిన్నీ
చేరును పురుషుడు-అహంకారమున -
ఆ భగవంతుడు - ప్రకృతితోను
ప్రకటించు చర్యయది-కాలమ్మగును

కావున తల్లీ! - ఆ భగవంతుడు
జీవుల ఆత్మ - పురుషుడు అనుచు
వెలుపలి సృష్టితొ కలిసి తాను మరి
కాలము అనుచు చెప్పగబడును

తత్వమ్ములతో కలిసిన జీవుడు
మాయామయుడై ప్రకృతియందు
కలిసినంతనే పరంధాముని
తేజము ప్రకృతి యందు కలవగా

మహత్తు అనెడి తత్వము పుట్టెను
వాసుదేవవ్యూహం - అనునది మూలము
శుభ్రమైనది - శాంతినిండినది
సత్వగుణ ప్రధానమైనదది

ఆకలి, తృష్ణ-దుఃఖ-మోహములు
జరా - మృతియను ఆరింటికిని
దూరముగానది వుండును తల్లీ!
స్థిరమైనదది ఎల్లవేళలా -

భక్తులందరికి సేవించదగినదది
ఆ వ్యూహమది మహత్తునుండి
క్రియాశక్తి రూపము అయిన
అహంకారమును జనింపజేసెను

వైకారిక-తేజస-తామసమ్ములని
అహంకారము - మూడు రకములు
వైకారికమ్మది మనో-ఇంద్రియ-పంచభూతముల
ఆధారమైన దైవతమైనది

బుద్ధి-ప్రాణములమూలము తేజసము -
తామసాహంకారము అనునది
ఇంద్రియమ్ములతో కలిసినదై మరి
అర్థమాత్రమై నెలకొనియున్నది

అహంకార తత్వమ్ములతోను
వేయిపడగలతొ భాసిలువాడు
అనంతుడనుచు - సంకర్షణుడని
చెప్పదగిన ఆపురుషుడు తాను

మనో యింద్రియము లావరించుకొని
కార్యకారణ భావముతోను
శాంతము–క్రూరము–పామర–ఘనమను
లక్షణమ్ముల ప్రకాశించును

వాసుదేవవ్యూహ చతుష్టయమ్మున
అనిరుద్ధమనునది ఒకటిగ భాసిలి
హృషీకేశుడుగ చెప్పబడినది
హృషీక మనగా – ఇంద్రియమ్మగు

ఇంద్రియాలకు అధిపతిగావున
హృషీకేశుడని – సేవించబడు
వైకారికాహంకారమున–మనస్తత్వము పుట్టెను
తైజసమ్మున–బుద్ధితత్వమది వుద్భవించెను

తైజసాహంకార శక్తివల్లను
జ్ఞాన, కర్మేంద్రియ క్రియాసాధనములు
కలిగియుండును – ప్రాణమ్ములకు
తామసాహంకారము వల్లకలుగు నవి

గగనాది పంచభూతములు
శబ్దస్పర్శాది తన్మాత్రలును
మహదాది తత్వము ఏడును మరియు
ఈ సమ్మేళనమున–అండము పుట్టెను

దానినుండి మరి శక్తిమంతుడు
విరాట్ పురుషుడు ఉద్భవించెను
అనుచు–కపిలుడు విరాట్ పురుషుని
సృష్టిని – తల్లికి తెలిపెను తీయగ

అటుపిమ్మటను యోగము మరియు
భగవదర్చన విధములు తెలిపెను
జననీ వినుము! యోగమన్నది!
తెలియని నిగూఢమైనదికాదు

విద్వాంసులకైనను ఎంతచదివినా
యోగపద్ధతి – శాంతినొసగును
మనస్సునిర్మలమై ప్రసన్నమగును
భక్తి బలపడి – నా సన్నిధికొత్తురు

నిషిద్ధకర్మలు చేయగరాదు
విహితకర్మలు – వదలగ రాదు
సంతృప్తిని కలిగి భగవద్భక్తుల
పాదపూజలు – సలుపుచుండవలె

భగవంతుని పూజకన్నను
భగవద్భక్తుని పూజ – ముఖ్యము
కామముగెలచి మోక్షముకొరకై
తపనపొందుచు – నుండగవలెను

పరిమితము మరి పరిశుద్ధమగు
ఆహారమును సేవించవలె
ఏకాంతముగా బాధలులేని
ప్రదేశమున – తా – జీవించవలె

జీవహింసను చేయకూడదు
సత్యవాక్య పరిపాలన కావలె
చోరత్వమది తలంచరాదు
వలయు ధనమునే ఆశించవలె

బ్రహ్మచర్యము తపస్సు మరియు
చిత్తశుద్ధియు వేదాధ్యయనము
ఈశ్వరార్చన - మౌనవ్రతమ్ము
స్థిరత్వమున్ను - ప్రాణాయామము

ఇంద్రియ నిగ్రహమ్ముతో మరి
ఆధార చక్రముల స్థానము నుండు
మనస్సుతో - ప్రాణమ్ము ధరించి
వైకుంఠవాసుని - ధ్యానించవలె

వ్రతములు దానమ్ములను చేయుచు
ప్రాణవాయువును స్వాధీనపరచుకు
శుచియగునట్టి ప్రదేశమ్మున
కుశలను పరచి - వాటి పైనను

మృగచర్మమును - తెల్లనివస్త్రము
చక్కగ పరచి - దాని పైనను
స్వస్తిక్ - ఆసన పద్ధతిలోను
సుఖాసీనులై - కూర్చొనవలెను

నిటారుగాను కూర్చొనవలెను
ముకుళించి యో - మరి వంకరగానో
కూర్చొనరాదు - ఆపైమెల్లగ
కుంభక-రేచక-పూరకాలతో

ప్రాణవాయువును ఎదురెదురు గను
నడిపించుచును చిత్తమునంతట
స్థిరముగ చేసి - సాధన చేసిన
వాతపిత్త శ్లేష్మమ్ములు తొలగును

నా సాగ్రమున దృష్టినిలపి
పరమేశ్వరమూర్తిని ధ్యానించవలె
అప్పుడు మాత్రమె - కౌస్తుభహారి
కనక కుండల మంగళమూర్తి

విశాలవక్షము - కోమలదేహము
దరహాసముతో - కరివరదుండు
తారహారములు వెలుగులీనగా
కనబడుకంటికి - ధ్యానించవలె -

పచ్చని - పట్టుచేలము గట్టి
పగతుర తరిగే - సుదర్శనమ్ము
దివ్యశంఖము శార్ఙ్గము గదతో
పద్మము ధరించి - కనబడు చుండును

ఇడుమలు బాపి కలిమినొసంగే
భువనపావనుడు సుందరగాత్రుడు
సర్వవంద్యుడు నిత్యకౌమారుని
నాసాగ్రదృష్టితో ధ్యానించవలె

నారాయణుని అంగధ్యానము
తెలిపెద ననుచు - విశదపరచెను
తొలుత శ్రీహరి పాదపద్మముల
మనశ్శుద్ధిగా ధ్యానించవలె

ఆపాదమ్ములవి జగముల నేలెడి
సార్వభౌమ శోభలొలకునట్టివి
హల కులిశములు జలజాంకుశములు
ధ్వజ-ఛత్రముల-రేఖలమరినవి

కాలిగోళ్ళవి వెలుగుపుంజములు
భక్తుల యొక్క అజ్ఞానతిమిరములు
పటాపంచలు చేయుచుండును
పాదమంజరుల - గంగపుట్టెను

హరి పాదోద్భవి - పావనగంగ
హరుజటముడిలో మురిపెములందెను
పాదధ్యానమది పాపహరణము
కోర్కెలు తీర్చే కల్పతరువులవి

పిమ్మట శ్రీహరి జానువులను మరి
ధ్యానించవలె - భక్తిమీరగా
శ్రీ నిలయమగు లక్ష్మీదేవి
అంకమునుంచుకు ఒత్తుచుండును

హరిజానువులు మోక్ష ప్రదాతలు
ఆపై - ఊరువులను ధ్యానించుచు
వరుసగ స్వామి - నితంబములు-నాభి
వక్షస్థలము - స్తనములు - కంఠము

భుజ యుగళమ్మును ధ్యానించవలె
ఆపై శ్రీహరి - ఆయుధాలను
అటుపిమ్మటను కౌస్తుభమణిని
ప్రత్యేకముగా ధ్యానించవలె

మకరకుండలశోభతొ - వెలిగే
చెక్కిళ్ళను మరి ధ్యానించవలె
అభయ హస్తముతొ ఆర్తిని బాపే
పాణి పద్మముల - తలంచవలెను

ఆధ్యాత్మిక - ఆధి దైవిక - ఆధిభౌతిక
తాపముతీర్చే - కరివరదుని ఆ
చల్లని చూపులు - చిరునగవులను
చల్లగ - మదిలో ధ్యానించవలె

హరి చిరునవ్వు - అమృతపు జల్లు
శోకహారిణి - కల్మషనాశిని
ఆపై - శ్రీహరి కనుబొమలను మరి
సుందరమైన పలువరసను - గనవలె -

నేను చెప్పిన విధముగ తల్లీ!
శ్రీహరిని నువు - ధ్యానము చేయుము
అటుల హరిని మరి ధ్యానించినచో
నిశ్చలమైన నిష్ఠ అలవడును

ఆత్మానందము అవధులు దాటి
క్రమముగ - మోక్షమార్గము దొరకును
ఆత్మధ్యానమున కోర్కెలు వదలి
జీవన్ముక్తుడుగా భక్తుడగు

తనశరీరము నశించిపోవును
అన్నధ్యాస అది కలిగినంతనే
అహంకార మమకారము లణగి
ఆత్మసాక్షాత్కారము నందగలుగును!"

అంతట తల్లి తనయునిగాంచి
భక్తియోగము గొప్పదంటివి
దాని స్వరూపము స్వభావమ్ములు
తెలిపి నన్ను నువు ఉద్ధరించుమనె.



॥శ్రీ కృష్ణచరితము॥

# 19 కపిలుడు దేవహూతికి భక్తియోగము తెలుపుట

"తామస-రాజస-సాత్విక మనుచు
మూడు విధములుగ భక్తియున్నది
హింస-దంభము-మచ్చర-రోష మజ్ఞానముల
నను సేవించుట - తామస భక్తి

ఐశ్వర్యలోలుడై - పేరుప్రతిష్టలు
కోరుచు - పూజలు - రాజసభక్తి
పరాయివారి మేలును కోరుచు
పాపహరణుడు విష్ణువు అనుచు

సద్బుద్ధితొ తన కర్మఫలములు
నాకు సమర్పణ చేసి నన్ను - మరి
సేవించుటది - సాత్విక భక్తి -
ఆతడు సాత్విక భక్తుడగును విను!

నాగుణములు విని - భక్తిపెంచుకు
సర్వ శుభకరుడు శ్రీహరి అనుచు
మదిలో నమ్మి ననుసేవించిన
వారిజన్మమది సఫలము అగును

భక్తి కలిగి నువు - వుండుము తల్లీ!
గుణత్రయమ్ములను దూరము చేసుకు
శ్రీహరి ఒకడే ప్రభువని నమ్మి
ననుసేవించిన - నా దరికి వచ్చెదరు

డాంబిక భక్తితొ వేషధారణతొ
చేయు - మూర్ఖుని పూజలన్నియు
బూడిద పోసిన - నేయి చందమగు
అన్ని ప్రాణులకు ఆత్మను నేను

అటుల సాధనతొ జీవులన్నిట
నన్ను గాంచిన ధన్యుడు అగును
అటుగాక మరి ద్వేషించినచో
వారు నాకు మరి శత్రువులగుదురు

అచేతనమ్ముల - సచేతనమ్ముల
సచేతనమ్ములు - శ్రేష్ఠమైనవి
చైతన్యవృక్షమ్ములను మించిమరి
రుచి జ్ఞానములు కలిగిన జీవులు

శ్రేష్టమైనవని - తెలియగ వలెను
వాటికన్న - గంధజ్ఞానము కలిగినయట్టి
జీవులు శ్రేష్ఠము - తెలియుము తల్లీ!
వాటిని మించి - శబ్దజ్ఞానము

కలిగిన జీవులు - ముఖ్యమైనవి
రూపము తెలిసి - జ్ఞానము కలిగిన
జీవులు శ్రేష్టము - వాటియందున
కాకులు మొదలగు నట్టివి జేరును

వాటి కంటెను బహుపాదమ్ముల
ప్రాణులు ముఖ్యము - వాటిని మించి
చతుష్పాదులు వాటి కన్నను
ద్విపాదమ్ముల మనష్య లధికులు

మనుష్యులందు నాల్గువర్ణములు
వేదవిదులగు బ్రాహ్మణులు శ్రేష్టులు
వేదార్థమును తెలిసిన ముఖ్యులు
శాస్త్రార్థముల మీమాంసకులు మిన్నయగు-

వారిని మించి - స్వధర్మజ్ఞానులు -
సంగరహితులు - వారిని మింతురు
వారికన్నను సద్ధర్మపరులు ఘనమగు
వారందరి కన్నను - తల్లీ వినుము!

సర్వధర్మములు - నాకై త్యజించి
సమభావనతో భూతహితమ్ముతొ
చరించువాడు - పుణ్యాత్ముడగు
వానిని గాంచిన-ముదముగలుగును

అట్టి ఉత్తముని భగవంతుడు తప్పగ
అనుగ్రహించును వానియందున
జీవరూపమున ప్రవేశించును
ఆత్మద్రష్టయై సారూప్యమునందును

ఆ పరమాత్మకు అందరు వొకటే
ఇష్టులయిష్టులు అనుచు వుండరు
ఇంద్రియ - లోలతలో మునిగిన
మందబుద్ధులను శిక్షించునాతడు

విష్ణువు సర్వము నిండినవాడు
విష్ణువు అనగా - నేనే అనుకో!
పంచభూతములు నా కనుసన్నలొ
చరించునమ్మా! అధినాయకుడ!

గిరులు నిలచినా - భూమి కృంగదు
నాకరుణతొ - నింగి నేలపై పడదు
గాలిబలమును మేఘ మెరుగ నటు
ఈశ్వరుశక్తిని తెలియ రెవ్వరును

విష్ణువు కరుణతొ సుఖదుఃఖములు
ఇల్లూ-వాకిలీ-సుతులు-సుదతులు
అంతా - తనతో వచ్చెడివారని
తలంచుకొనుట మూర్ఖత్వమది

జనన మరణ వలయములో పడి
విరక్తినందక నరకబాధలు
పడుటకు - తాను సిద్ధపడుచును
తిరిగి పుట్టెడివాడు - మూర్ఖుడే!

క్షణిక సుఖములు శాశ్వతమ్మని
బాధలు పడుచు - బాధలుపెట్టుచు
బ్రతుకుచు చచ్చి - తిరిగిపుట్టుచు
ఆనందమని భ్రమలోపడును

ద్రవ్యసంపాదన సన్నగిల్లగా
భార్యబిడ్డలు - ఈసడింతురు
బ్రతుకు భారమై చావలేకను
ఆశపెంచుకు - బ్రతికి చచ్చును

చిక్కిశల్యమై గ్రుక్కెడు నీళ్ళకు
ముఖమువాచి మరి బ్రతక లేకను
చావు ఎప్పుడు వచ్చునాయని
రోగము - ఆకలి - హీనబ్రతుకది -

కాలధర్మమును అనుసరించి మరి
మరణకాల మాసన్నమైనచో
భీకర రూపులు యమకింకరులు
నిర్దాక్షిణ్యముగా - హింసింతురు కద!

కర్మఫలమును అనుభవించగా
జాలిచూపక హింసలుపెట్టుచు
యమపురిత్రోవలొ ఈడ్చుకు పోదురు
తొమ్మిది వేల యోజనమ్ములది

సామాన్యమైన పాపముచేసిన
రెండు ఘడియలు ముందుగ చేరును
అచటి కష్టములు - కొరవుల కాల్తురు
కత్తులతో మరి - తెగ నరకెదరు

గుద్దుచు తన్నుచు కుక్కల నొదలుచు
ఏడ్చిన కొద్దీ - తిరిగి బాదుచు
అయ్యో - ఎంతటి పాపిష్టి నైతినని
అరచిన - ఏడ్చిన - జాలిచూపరు

నిప్పులగుండము - లోకి నెట్టెదరు
పదములతో మరి త్రొక్కివేతురు
సలసలకాగే - నీటిలొ వేతురు
ప్రేగులుచిట్లగ - రోకళ్ళ దంచెదరు

సొమ్మసిల్లుచు తేరుకొనుచును
తిరిగి బాధలు అనుభవించుచు
పాపకర్ముని - ఆరు ఘడియలలొ
యమపురికి మరి చేర్చెద - రచట

గజములచే త్రొక్కింతురు వారిని
విష పన్నగముచె - కరిపించెదరు
వాని శరీరము కండలుకోసి
వానిచేతనే - తినిపించెదరు

వివిధ నరకముల బాధలుపడుచు
తిరిగి మనిషిగా - జన్మనెత్తును
మానవ జన్మను వ్యర్థపరచెడి
వాని బ్రతుకిటు బ్రద్దలుఅగును."

॥శ్రీ కృష్ణచరితము॥



## 20 కపిలుడు పిండోత్పత్తి క్రమమును తల్లికి చెప్పుట

అంతటకపిలుడు తన జనని కట
ప్రాణి జననమును విశదపరచెను
కర్మల బట్టి జన్మల నొసగును
ఈశ్వరుడనుచు తెలియగవలెను

మూడవనెలలో గోళ్లును మరియు
రోమమ్ములును - ఎముకలు చర్మము
మర్మావయము ఏర్పడు చుండును
సప్తధాతువులు నాల్గవ నెలలో -

తండ్రి తేజమున తల్లి గర్భమున
ప్రవేశించగా నెల రోజులకు
శిరస్సు ముందర ఏర్పడుచుండును
రెండునెలలకు చరణములేర్పడు

ఐదవనెలలో ఆకలి దప్పులు
ఆపై ఆరవ నెలలో జీవి
మావియందును కప్పబడి మరి
కుడివైపునకు కదలిక ఏర్పడు

తల్లి గ్రహించిన ఆహారపానీయముల
తాను గ్రహించును - ధాతువులంతట
పెరుగుచు - మలమూత్రమ్ములతో
హేయముగా-తా-తిరుగుచుండును

రక రకమ్ముల పురుగులు క్రిములు
లోపల - వానిని కొరుకుచుండును
వాటి బాధకు ఏడ్చుచు - అలసి
సొమ్మసిల్లును - తిరిగి - తేరుకొను

తల్లిగ్రహించిన వాటిని గొనుచు
మావియందున చుట్టుకుపోవును
పైభాగమున ప్రేగులు అవ్వి
పాశమ్ములుగా చుట్టుకునుండును -

కడుపులోన తన తల దూర్చుకొని
నడుము మెడ మరి పిరుదులు వంగి
పంజరమ్ములో - పక్షిమాదిరి
కాలుచేతులు కదపని స్థితియది

దైవ ప్రసాదిత జ్ఞానమువలన
పూర్వజన్మకృత పాపమ్ములను
తలచుకు - కుములుచు నిట్టూర్చుచును
సుఖమన్నది మరి తెలియక నుండును

ఏడవ నెలలో జ్ఞానము వచ్చి
కదలిక గలిగి క్రిముల తోడుగా
అటుయిటు కదలుచు దొర్లుచుండును
ప్రసూతి వాయువుల - బాధనుపడు

అవాయువుల వత్తిడి కింక
రోదించుచును గర్భవాసము
గర్భనరకమని - వద్దువద్దని
వాపోచుండును - వేదన నిండును

సప్తధాతువులు బిగి బంధించును
చేయునదింక ఏమీలేదని
తన గర్భవాసముకు హేతువు అయిన
ఈశ్వరదేవుని ప్రార్థించునిటు.

॥శ్రీ కృష్ణచరితము॥



## 21 గర్భస్థుడైన జీవుడు ఈశ్వరుని స్తుతించుట

"సంకల్పముతో అవతారమ్ముల
ధరించి జీవుల నుద్ధరించెడి
విష్ణుదేవుని పాదపద్మములు
మదిలో తలచి నమస్కరింతును

నీవు కల్పించిన మాయకు లొంగక
లొంగినట్టుగా లీల చూపెదవు
నిర్వికారుడవు పరాత్పరుండవు
సర్వప్రాణుల ఆత్మవునీవు

ప్రసన్నమూర్తీ! పరమదయాకర!
కరుణారసము ఒలికించుమయా!
గర్భనరకమును భరించలేను
ఉద్ధరించుము దేవవందితా!"

అనుచు జీవుడు ప్రార్థనచేయును
అనుచు కపిలుడు తల్లికి చెప్పగ
తల్లి అడిగెను దివ్యకుమారుని
కర్మవశమున మాయకులొంగి

సంసారవలయమున చిక్కుకుపోయి
నిస్సారముగా బ్రతుకు నీడ్చుచు
హరి భక్తిని మరచి – ఏడ్చెడివాడు
దేవదేవుని ఎటుల స్మరించును

చిరునగవులతో పలికె కపిలుడు
"అమ్మా! వినుము – ఈశ్వరదేవుడు
కాలనిర్ణయము లేకుండగనే
స్థావర జంగమమ్ములనుండును

ఏకర్మచేసినను ఈశ్వరు దయయది
కలుగుటన్నది – ఆయన లీల
దానివలననే ఆయాజీవులు
ఈశ్వరధ్యానము – చేయగలుగుదురు

తల్లి కడుపులో – జఠర శయ్యలో
గర్భవాస నరకమ్మున నుండి
సూక్ష్మ-క్రిములవి కొరుకుచుండగా
జఠరాగ్నికి మరి కమిలిపోవుచు

అనాథరక్షకా! రక్షించవయా!
నరకమునుండి విముక్తినిడుము!
అనుచు నమ్మి – మరి త్రోవలేకను
ప్రార్థన చేయుచు బయటకువచ్చును

నను రక్షించిన పరంధామునికి
వందనమ్ములివె అనుచు స్తుతించుచు
ఆయన దయతో బయటపడెదను
అదియే గమ్యము – అని తలంచును

అటుల ధ్యానముచేయుచుండగా
తొమ్మిదినెలలు క్రమముగ నిండును
పదవనెలలో గర్భస్థశిశువు – తా –
అధోముఖముగానుండునచ్చట

ఊపిరివిడచుట కష్టము అగును
విలవిలలాడును అంతట అచటి
గర్భస్థవాయువులు వాటిబలముతో
ఒక్కటి కొట్టి – బయటకు విసరును

భూపతనమయి తెలివిని తప్పి
పేడపురుగులా చుట్టుకుపోవును
అంతటిలోన – తెలివి కలుగును
రోదించుటది – ఆరంభించును

ఆపై వాడు మదిలో ఊహలు
చెప్పలేకను బాధలు పడును
కష్టము కలిగిన చెప్పలేకను
బాధ భరించి బ్రతుకుచుండును

చీమలు దోమలు – కరచినగాని
అవయవాలను అటులేవదలి
వాటి బాధను భరించవలెను
రోదించినను చెప్పగలేదు

తల్లి సంరక్షణ పెన్నిధిగాను
మెల్లమెల్లగా పెరిగి పెద్దగు
శైశవ దశకు చేరుకొనుచును
అప్పటి చేష్టలు చేయుచుండును

క్రమముగ పెరిగి విద్యనేర్చును
యౌవ్వనమ్మున అడుగు బెట్టును
అహంకార మమకారము లెగయును
కామక్రోధములు ఆశ్రయించును

దుష్ట చెలిమి యది-భ్రష్టుచేయునది
దయాశౌచముల - లజ్జా - మౌనముల
క్షమాకీర్తులను - శమదమాదులను
తృంచివేయును - ఎదగనీయదు

ఆపై కలుగును - స్త్రీ సంగమమది
దానిని మించిన చెడుపు లేదుకద!
సృష్టికర్తయే కన్నుగానక
కానిపనిని - తా - చేసెనుగాదా!

ఆడ లేడిగా నున్న - వాణిని
గాంచిన వెంటనె మతి భ్రమించి
తానొక లేడిగ - వెంబడించెను
సిగ్గు, లజ్జలు - గాలికి వదలెను

సర్వదోషముల కా సంగమము
తల్లివేరుగా నుండును కాదా!
స్త్రీమోహమది లేనివాడు మరి
నారాయణ ఋషి ఒక్కడే సుమా!

స్త్రీఅనగా మరి - ఎవరో కాదు
నా మాయకది ప్రతిరూపమగు
గడ్డితొ కప్పిన బావి వంటిది
వివేకమ్ముతో చరించవలెను

కొందరు గృహస్థులుందురు వారు
ధర్మార్థకామములు పరమార్థమని
వాటికొరకునై తపించుచుందురు
భక్తి విషయము దరి రానీయరు

అశాశ్వతమ్మగు సుఖములు కోరి
ఇతర దేవతల నారాధించుచు
పితృదేవతల సంతర్పణలతొ
శిష్టులుగా మరి గణన కెక్కెదరు

అట్టివారు మరి చంద్రలోకమున
పుణ్యఫలమది అనుభవించుచు
ఆపుణ్యమది క్షీణించగనే -
తిరిగి భూమి పై జన్మించెదరు

తిరిగి పుట్టుచు - చచ్చుచు అటులే
వలయములో మరి చిక్కుకొందురు
వారికి ముక్తి - అందని ఫలము
అంతదూరమున నుంచును వారిని

కొందరు మాత్రము ఎటుల పుట్టియు
బుద్ధి జ్ఞానములు అలవరచుకొని
సర్వేశ్వరుని - హరిని గ్రహించి
అనన్యమైన భక్తితొ నుందురు

శుద్ధ మనస్సుతొ హరిని స్మరించుచు
కర్మలు - శ్రీహరి పరముగ జేయుచు
నిర్మలభక్తితొ విష్ణుకీర్తనతొ
విష్ణుధ్యానమున లగ్నమయ్యెదరు

అహంకార మమకారమ్ముల త్రెంపుకు
ముకుందుడే మరి గతియని నమ్మి
ఆటల - పాటల కీర్తించుచును
భాగవతోత్తములుగ బ్రతికి

తిరిగి రానిదగు దివ్యపథమది
విష్ణుసాయుజ్యము చేరుకుందురు
తల్లీ వినుము! ఈశ్వరుని మించి మరి
ఎవరూ లేరని - బ్రహ్మకూడను

ఈశ్వరుడేనని - ఉపాసించుచు
సత్యలోకము చేరుకుందురు
ప్రళయము వరకు అచట వసించి
బ్రహ్మను ఈశ్వరుడని ధ్యానించుచు

పంచ భూతాత్మకమగు ఈ ప్రపంచము
లీనముకాగనె - పరమాత్మతొపాటు
ప్రళయకాలమున బ్రహ్మతొపాటు
విరాట్ పురుషుని చేరుకుందురు

కావున మాతా! ఆ సర్వేశ్వరుడు
ఆనందమయుడు - నిర్వికారుడు
విష్ణువు కావున - గతియని నమ్మి
వేడుకొనుము మరి - భక్తిప్రపత్తుల

అన్నియోగముల మించిన దైనది
భక్తియోగమని చెప్పితి తల్లీ!
శాస్త్ర పఠనము - జపతపమ్ములు
క్షేత్రదర్శనము - దానధర్మములు

యజనాధ్యయనములన్నీ వినుము
నిరర్థకమ్ము - వాటి వల్లను
నారాయణుడు తృప్తినందడు
మనస్సును మరి స్థిరముగ నుంచుకు

బాహ్యేంద్రియముల కట్టడి జేసుకు
మంచిచెడ్డలు అన్నది తలచక
సర్వకర్మలను పరిత్యజించి
ఆత్మతత్వమున జ్ఞానముకలిగి

బంధ ముక్తుడై వైరాగ్యముతో
నిష్కామ కర్మలు ఆచరించుచు
ఈశ్వర పరముగ ధారపోయుచు
శ్రీహరి ధ్యానము చేయుచుండవలె

హరికీర్తనము నిరతము చేయుచు
కథలను వినుచు పరవశించుచు
హరితత్వమును దర్శించినచో
పంకజనాభుని దరికి చేరెదరు

అమ్మా! నీకు నేను చెప్పినది
అతిగోప్యమగు సాంఖ్యయోగము
నీచునకు మరి - నీతి భ్రష్టునకు
భక్తి హీనునకు మూర్ఖునకున్ను

డాంబికాచారము కలిగిన వారికి
స్త్రీవ్యామోహము కలిగినవారికి
దీనిని చెప్పుట నిషిద్ధమైనది
ఫలితము వారికి లభించదమ్మా!

శ్రద్ధా–భక్తులు–వినయము–నీతి
చిత్తశుద్ధి మరి పెద్దలమన్నన
గురుశుశ్రూషలు చేయువారికి
దీనిని చెప్పగవలెను వింటివా!

విష్ణుభక్తిగల పురుషులు మరియు
పతివ్రతలగు స్త్రీలు వినవలె
అట్టివారికి భక్తిబలపడి
అంత్యకాలమున నన్నుచేరెదరు."

తనయుడు చెప్పిన బోధన విన్నది
తనుపులకింతతొ పలికె భక్తిగా
"తల్లిని తరింప – జేయు సుతునిగా
తనువు ధరించిన – అక్షరమూర్తీ!

ఆనందసాగరము నందున తేలితి
ఆనందవర్ధనుడు కొడుకైనాడని
ఆగమాలలో అందని దేవుడు
అనుగ్రహించి కడుపున పుట్టెను

వందనమయ్యా! ఓ పరమాత్మా!
పుత్రరూపమున వున్ననీకు – మరి
సాష్టాంగవందనము లివె గొనుమయ్యా!
నీ దర్శనమున ధన్యనైతిని

నీ బొడ్డుతామరలొ ఉద్భవించిన
నీ తనయుడగు చతుర్ముఖుండు
నిను దర్శించగ సాధ్యపడకను
నీతత్త్వమును తెలియక పోయెను

యుగాంతములలో లోకములన్నీ
కుక్షిలొనుంచుకు రక్షణజేసే
జగద్రక్షకా! నా కడుపున నువు
ఉద్భవించుట లీలయేసుమా!

దుష్టశిక్షణ–శిష్టరక్షణకు
వరహాద్యవతారమ్ములనెత్తే –
నీదు మహిమ వర్ణించగ తరమా!
నీబోధనతొ తరించినాను."

అనగా తనయుడు నమస్కరించి
తల్లీ! నీదు భక్తికి మెచ్చితి
ముక్తి – నీకు మరి సులభమ్మగును
భక్తి ముఖ్యము – అన్నది వింటివి!

నేను చెప్పిన యోగము ఎంతో
ముఖ్యమైనది – ముక్తి నొసగునది
దీనిని కాదని తిరస్కరించిన
ముక్తి దుర్లభము – నిస్సందేహము."

తల్లీ శలవు! అనుచు కపిలుడు
సాగిపోయెను – అని మైత్రేయుడు
విదురున కంతట తెలియబరచుచు
ఆపైగాధను వివరించెనిటు

తనయుడు సాగెను – ఆశ్రమమ్మది
దివ్యభవంతులు నిర్జీవమయె
భర్త తాను – తన త్రోవచూచుకొనె
తనయుడు తనకు త్రోవచూపి – చనె

ఒంటరిదైనది ఆ బాధలోమరి
జ్ఞానియైనను - కంటనీరిడె
తనయుని - భర్తను తలచి ఏడ్చెను
దిక్కుతోచని స్థితిలోపడెను

సృష్టికర్తకు తనయుడు - భర్త
సృష్టికర్తకే - తండ్రి - తనయుడు
కొడుకు చెప్పిన త్రోవతొక్కెను
పరిసరమ్ములను తేరిచూచెను

సింహములేని అడవిగ నుండి
రాజహంసయది లేని కొలనులా
యోగశక్తితో భర్త సృజించిన
భవనములన్నీ అగబడినాయి

వెంటనె లేచి - ఎదురుగనున్న
బిందుసరస్సు లోనికి దిగెను
అఘమర్షణ మంత్రమ్ములు చదువుచు
స్నానముచేసి - కురులను ముడిచెను

జటలు జటలుగా ముడిచె కేశముల
ఉపవాసములతొ దుష్కరమైన
తపస్సుచేసి - దేహాభిమానము
పూర్తిగ వదలెను-తపమున మునిగెను

బాహ్యప్రపంచము తెలియక పోయి
కనులు తెరచినా మూసిన గాని
కమలాక్షుని - తా - గాంచగలిగినది
అటుల భక్తి అది పరిణతచెందెను

గడిచిన కాలము తెలియదామెకు
పరబ్రహ్మమును ఉపాసించుచు
పండిన భక్తితొ యోగశక్తిని
పెంచుకొన్నది ధన్యురాలయె

తనయుడు చెప్పిన భక్తియోగము
అక్షరాల - తను మననముచేసి
యోగశక్తితో గగనము కెగసి
తేజోరూపిగ - కలిసె శ్రీహరిలొ -

అటులదేవహూతి - తా -
ముక్తిపొందిన దివ్యస్థలమది
'సిద్ధిపథము'గా - ప్రసిద్ధిచెందెను
దివ్య చరిత్రము - పుణ్యప్రదమిది

తల్లికి బోధన చేసిన కపిలుడు
ఆమె ఆజ్ఞతో ఆశ్రమ సీమను
వదలి సాగెను దేవగణంబుల
స్తోత్రపాఠములు వినుచు సాగెను

సాగరుని సత్కారములందుకు
లోకశ్రేయముకు - శాంతిని కోరి
సాంఖ్యయోగము అవలంభించి
ఉత్తరాభిముఖుడై వెడలెను

అనుచు విదురునకు మైత్రేయుండు
తెలియబరచెను - పలికెను తీయగా
విదురా - నాకు గోచరించినది
చెప్పితినయ్యా! ఆలకించితివి

ఈ వృత్తాంతము పుణ్యప్రదమిది
కపిలదేవహూతి సంవాదమును
కపిలప్రోక్తమగు ఈ యోగమును
చదివిన - వినిన పాపవిముక్తి

సుఖసౌఖ్యములు అనుభవించి మరి
హరిసాయుజ్యము జేరుకుందురు
అని మైత్రేయుడు చెప్పె-విదురునకు
అనుచు శ్రీశుకుడు చెప్పెను రాజుకు

అనుచు - సూతుడు పరవశమ్మున
మహర్షులకును తెలిపెను భక్తిగ
వారందరును పులకితులాయిరి
పరమపావనము - గాధలు అనిరి

మౌనిపుంగవా! నీవు చెప్పిన
విష్ణు కథలవి - సర్వశుభములిడు
ఆనందామృత పానము చేసిన
మేము నీకు మరి మ్రొక్కుచుంటిమి

శ్రీహరి వృత్తాంతములన్నియును
వినగా కోరిక - కలిగియుంటిమి
కరుణాధాముని - శ్రీవత్సాంకుని
లీలలు చెప్పుము అనుచు అడిగిరి.

**శ్రీ కృష్ణచరితము - కర్ణపేయము**
**వ్యాసమౌనికే - శాంతినొసగినది**
**పోతనయ్యే - పులకించి పలికినది**
**భవ భయ హారిణి - భాగవతమ్ము॥**

**ఓం శాంతి - శాంతి - శాంతిః**





సర్వేజనాస్సుఖినోభవన్తు
లోకాస్సమస్తాస్సుఖినోభవన్తు





**సర్వం శ్రీ సీతారామచంద్ర పాదార్పణమస్తు**



(మకుటం)

శ్రీ కృష్ణచరితము - కర్ణపేయము
వ్యాసమౌనికే - శాంతినొసగినది
పోతనయ్యే - పులకించి పలికినది
భవ భయ హారిణి - భాగవతమ్ము॥

# శ్రీమద్భాగవత - మకరందము

## (చతుర్ధస్కంధము)



శ్రీరామ

ఓం - నమో - వాసుదేవాయనమః

# శ్రీమద్భాగవత - మకరందము

## (చతుర్థస్కంధము)

శ్రీకరుడైన రామచంద్రుడు
శ్రీతో కదలి పోతన కడకు
శ్రీపతి చరితము భాగవతమ్మును
శ్రీచరణాలకు సమర్పించమనె.

శ్రీరామాంకిత మీ భాగవతమ్ము
అనుచు భక్తిగా అంకితమిడెను -
ఆ రాముడు నా భాగవతమ్మును
అందుకొనగను అర్తిగపిలచితి -

శ్రీ శుకయోగి పరీక్షిత్తునకు
చెప్పిన యట్టి భాగవతమ్మును
సూతుడు మునులకు చెప్పుచుండెను
ఆపై గాథను తెలిపె నిట్టుల.

అటుపిమ్మటను మైత్రేయముని
విదురునకిట్లు చెప్పెను వినుడు
అనుచు సూతుడు ఆరంభించెను
స్వాయంభువమను ప్రజాపతికి మరి

శతరూపయందున ఆకూతియును
దేవహూతి ప్రసూతి అనెడి తనయలు
ప్రియవ్రత - ఉత్తానపాదులని
ఇద్దరు తనయులు అని చెప్పితిని

ఆకూతిని - రుచియను ప్రజాపతి కిడె
వారికి తనయుడు విష్ణుండగును
విష్ణుసుతుండు యజ్ఞుడు అగును
తనయపేరది - దక్షిణ యైనది

సాక్షాత్ లక్ష్మియె దక్షిణయైనది
మనువు అంతట - దౌహిత్రుడగు
యజ్ఞుని తెచ్చుకు పెంచసాగెను
దక్షిణ ఎంతో శక్తి కలిగినది.

తండ్రి వద్దనే విద్య నేర్చుచు
శ్రీహరిపతిగా కావలెననుచు
ఆరాధించుచున్నది దక్షిణ
యజ్ఞుడె విష్ణువు అన్నది తెలిసిరి

రమాధవుడును రమాదేవియు
ఎడబాయని జంట కావున పెద్దలు
సమ్మతించిరి - పెండ్లి జరిపిరి
యజ్ఞుని భార్య - దక్షిణయైనది

వారిద్దరికి పన్నెండు మంది
తనయులు - వారు తోష - ప్రతోషులు
సంతోష-భద్రులు-శాంతి-ఇడస్పతి
ఇధ్మదు-కవి - మరి విభుడ - వహ్నిలు

ఆపై - సుదేవ - రోచనులు అను
తనయులు అమిత బలాఢ్యులన్నిట
స్వాయంభువ మన్వంతరమున వారు
తుషితులు అనెడి దేవత లాయిరి

రెండవ కూతురు దేవహూతిని
మనువు - కర్దముని కిచ్చెను భార్యగ
ప్రసూతి అనెడి మూడవ కన్యను
దక్షప్రజాపతి కిడెను భార్యగా

దక్షప్రజాపతి దంపతుల సంతతి
విస్తరించి ముల్లోకముల వెలసెను
కర్దమ తనయలు బ్రహ్మర్షుల భార్యలు
వారి సంతతి వివరించెదను



॥శ్రీ కృష్ణచరితము॥

# 1 కర్దమ ప్రజాపతి సంతతి

కర్దమ ప్రజాపతి పెద్దకూతురు
కళయను నామె మరీచి భార్య
వారికి కశ్యపు డనియెడి తనయుడు
పూర్ణిమ - అనెడి కూతురు-కలిగిరి.

శ్రీహరి పాదతీర్థమువలన
కళ తా - గంగగ వుద్భవించెను
దేవకుల్య అను తనయను మరియు
విరజుడు అనెడి కొడుకును కన్నది

కర్దముని తనయ అనసూయ మరి
అత్రిమహాముని భార్య అయినది
ఆదంపతులకు త్రిమూర్తులంశతొ
ముగ్గురు తనయులు వుద్భవించిరి

అనగా విదురుడు త్రిమూర్తులటుల
అత్రిపుత్రులై పుట్టుటేలననె. -
ఆనందముగా - మైత్రేయుడట
ఆరంభించెను దివ్య గాథను

అత్రి మహాముని అనసూయమ్మతొ
అనుకూల దాంపత్యము నెరపుచుండెను
ఆశ్రమధర్మమ్ముల నాచరించుచు
అందరి శ్రేయము కోరుచుండిరి

ఆదంపతులకు సంతుకలగనిచె
ఆలితొ కలిసి అత్రి మహాముని
తపము చేసుకొన ఋక్షపర్వత
ప్రాంతము జేరెను - ఆప్రదేశమున

నందనవనమును తలపించు వనమట
పూలతొ - పండ్లతొ - పూతీవలతో
పలుకరించెను మునిదంపతులను
స్వచ్ఛజలమది స్ఫటికముపోలును

కఠోర తపమును అత్రి మహాముని
ఒంటికాలిపై నిలబడి చేసెను
గాలిని మాత్రమే పీల్చ సాగెను
కఠోర - ఉపవాసమ్మును చేసెను

అటుల అత్రి–తా–దేవమానమున
నూరువత్సరములు తపమొనరించగ
తపోగ్నికీలలు శిరస్సునుండి
ఉద్భవించినవి – దీక్ష వదలడయె!

అంతట – త్రిమూర్తులాలోచించిరి
ఉపేక్షించిన జగత్ ప్రళయమని
ఆశ్రమమ్మునకు – ముగ్గురు వచ్చిరి
దేవగణంబులు అనుసరించిరి.

సందడి వినిన అత్రిమహాముని
మెల్లమెల్లగా కనులు విప్పెను
బంగరు రంగుతొ – నీలివర్ణముతొ –
తెల్లని పున్నమి ఛాయలతోనట

ఆ త్రిమూర్తులు దర్శనమిడగా
భార్యతొ మహర్షి ఆముగ్గురకు
సాష్టాంగనమస్కారము లాచరించెను
శిరస్సులపై పూలుచల్లెను

వచ్చిన యట్టి దేవగణమునకు
తగుమర్యాదలు చేసిరి వారు
ఆనంద పరవశము నిండి పోవగా
అత్రి మహాముని స్తోత్రము చేసెను

జగత్కారణులు రూపము దాల్చుట
జగత్తునే – మరి – ఉద్ధరించుటకు
అట్టి మిమ్ములను ఒకే మారుగా
దర్శించుటచే – ధన్యుడనైతిని.

దేవదేవులే మీముగ్గురును
ఎవరిని ఎటుల పూజించుటయో!
తెలియకున్నది ఆనందముతో
ఒకరిని తలచిన – ముగ్గురొచ్చిరి

తపోఫలముగా త్రిమూర్తులొచ్చుట
జరగని యట్టి దివ్యసంఘటన –
నా ఎడ మీకు గలవాత్సల్యము
తెలుపగ – నాపై కరుణించి రిటు

మీ అనుగ్రహము కలుగునట్టుగా
కరుణా వృష్టిని కురిపించండి
దోసిలి యొగ్గి నిలచిన యట్టి
పాద దాసుడను పదములంటితిమి

ఆ మాటలకు ఆనందించిరి
పలికిరివారు ముగ్గురమైనా
ఒక్కరమే అని నీకు తెలియును
అందుల కొరకై అనుగ్రహించి

మా అంశలతో ముగ్గురు తనయులు
**అత్రిమూర్తులు** కలుగును మీకు
అనుచు తీయగా అనసూయకు చెప్పి
మునివందనములు గ్రహించి సాగిరి.

ఆనందపారవశ్యము నందున తేలిరి
ఆమని విరసెను – అన్నటు వనమంది
ఆత్రి దంపతుల ఆశీర్వాదము
అందుకొనగను శోభగ నిలచెను

తరువులు పూలజల్లులు రాల్చెను
శుక పికరవములు పలుకరించెను
లేడి జంట యది సిగ్గుతొ కనబడె
మదనుడు-అదనని తొంగిచూచెను.

అనసూయమ్మ గర్భము ఫలించి
చందమామలను పోలిన యట్టి
ముగ్గురు తనయుల తల్లియైనది
ఆశ్రమవాటిక పులకరించినది.

బ్రహ్మ అంశతొ పుట్టిన సుతునకు
చంద్రుడు అనుచు పేరుపెట్టిరి
విష్ణు అంశతొ పుట్టిన బాలుడు
దత్తుడు అనెడి పేరునబరగెను

శూలి అంశతో పుట్టిన తనయుని
దూర్వాసుడని పిలచిరి వారు
అటుల త్రిమూర్తులు ఆదంపతులకు
తనయులాయిరని మైత్రేయుడు చెప్పెను

కర్దమ ప్రజాపతి కుమార్తెలందున
శ్రద్ధను పెండ్లాడె - అంగీరసుండు
సినీవాలి - కుహు - రాక-సుమతి
అనెడి కుమార్తెలు కలిగిరి వారికి

అటుపిమ్మటను ఆదంపతులకు
ఉచథ్యుడును - బృహస్పతియను
ఇద్దరు కొమరులు - ఉద్భవించిరి
భగవంతునితో సములాయిద్దరు

హవిర్భుక్కు అను మరో తనయను
పులస్త్యునికిడి - పెండ్లి చేసెను
ఆదంపతులకు పుట్టె నగస్త్యుడు
జన్మాంతములో - జఠరాగ్ని-అగస్త్యుడు

పులస్త్యున కంతట మరియొక కొడుకు
ఉదయించెనాతడు విశ్రవసుండు
ఆతని భార్య ఇలబిల అగును
వారి తనయుడు కుబేరుడయ్యా!

విశ్రవసునికి - కైకసి అనెడి
మరియొక భార్యతొ ముగ్గురు తనయులు
రావణ - కుంభకర్ణ - విభీషణులను
పేరులు వారివి అతిప్రసిద్ధులు

కర్దమమునికి మరియొక అల్లుడు
పులహుడు - ఆతని భార్య గతి యగు
కర్మశ్రేష్టుడు - వరీయాంసుడు
సహిష్ణుడు అని వారికి తనయులు

మరియొక అల్లుడు క్రతువు అను ముని
ఆతని భార్య క్రియ యగునయ్యా!
బ్రహ్మతేజముతొ అరవై వేల
తనయులు పుట్టిరి ఆ దంపతులకు

వారినందురు వాలఖిల్యులని -
మహాఋషులుగా ప్రసిద్ధిగాంచిరి
ఊర్జ అనునొక కర్దమ తనయకు
వశిష్టమహర్షి భర్త ఆయెను

చిత్రకేతుడు - సురోచి - విరజుడు
మిత్రుడు ఉల్బణుడు వసుభృద్యానుడు
ద్యుమంతుడను-వారేర్గురు వశిష్ఠ తనయులు
సప్తఋషులుగా ప్రసిద్ధినందిరి

వశిష్ఠునకు గల రెండవ భార్యకు
శక్తి మొదలగు తనయులు పుట్టిరి
కర్దమ సుతయగు చిత్తిని - భార్యగ
అథర్వుండు - గ్రహించినాడు

వారి కుమారుడు దధ్యుండగును
భృగుమహర్షికి కర్దమ ప్రజాపతి
ఖ్యాతి అనెడి - తన కన్యనిచ్చెను
ధాత విధాతలు వారి తనయులు

ఆపై వారికి శ్రీయను కన్యక
ఉద్భవించెను ఆ లక్షణవతి
నిరతము విష్ణు ధ్యానలోనుండును
మదిలో హరినే ప్రతిష్ఠించెను

భృగుపుత్రులగు ధాత విధాతలు
మేరువు తనయలు అయతి నియతిలను
వివాహమాడిరి శాస్త్ర విధిగను
ధాతకు తనయుడు మృకండుడగును

విధాతకు సుతుడు ప్రాణుడు అగును
ప్రాణుని సుతుడు వేదశిరుండు
మృకండుసూనుడు మార్కండేయుడు
ఆ ఇద్దరు మునులు చిరంజీవులు

భృగుమహర్షి మరియొక భార్య
ఉశన యందున శుక్రుడు కలిగెను
అటుల సృష్టి అది జరిగెను వినుము
పాప హరమ్ము దివ్య చరితమిది

❋❋❋ ॥శ్రీ కృష్ణచరితము॥

## 2 దక్ష ప్రజాపతి వంశము

స్వాయంభువుడు తన చిన్న కూతురగు
ప్రసూతినంత బ్రహ్మ తనయుడగు
దక్ష ప్రజాపతి కాలిగ నిడెను
వారికి పదారు మంది కుమార్తెలు

వారిలో శ్రద్ధ-మైత్రి-దయ-శాంతియు
తుష్టి - పుష్టి - ప్రియ-ఉన్నతులను
బుద్ధి - మేధ - తితిక్ష-హ్రీ-మూర్తి
అనెడి కన్యలను ధర్మరాజుతో పెండ్లిచేసెను

మిగిలిన ముగ్గురు కన్యామణులను
అగ్నికి - పితృదేవతలకును
ఇచ్చి - వివాహము చేసి అంతట
మిగిలిన కన్యను శివునకు యిచ్చెను

శ్రద్ధయందున - శ్రుతమను తనయుడు
మైత్రియందున ప్రసాదమ్మును
దయయందు మరి అభయము మరి
శాంతియందున సుఖము - ఆపై

తుష్టియందున - ముదము మరియు
పుష్టియందున - స్మయము కలిగి
క్రియయందున - యోగము ఆపై
ఉన్నతియందు దర్పము కలిగిరి.

బుద్ధి మేధల అర్థము స్మృతియు
తితిక్షయందు క్షేమము మరియు
హ్రీయందున ప్రశ్రయమను వారలు
ధర్మరాజుకు సంతతి కలిగిరి

మూర్తియందున మంగళమూర్తులు
నరనారాయణ ఋషులు పుట్టిరి
వారిపుట్టుకకు ప్రకృతి పులకించె
దేవదుందుభులు మ్రోగె నింగిని

బ్రహ్మాది సురగణము ఆనందముగా
నరనారాయణ స్తోత్రము చేసిరి
ఓపరమాత్మా - మాయను గ్రహించి
సృష్టి చేసిన విరాణ్మూర్తివి.

ఆత్మ శక్తిని వెల్లడించుటకు
ముని రూపముగా ధర్మరాజుకు
పుణ్యఫలముగా ఉదయించితివి
వందనమిదిగో - మునిజన వందిత!

నా సృష్టియది సన్మార్గమున
నడిపించుటకై అవతరించితివి
నీ కటాక్షముతొ మమ్మందరినీ
ధన్యుల జేయుము దయాంతరంగా!

భూభారమును తగ్గించుటకై
నరనారాయణ ఋషులిద్దరునూ
కురు-యదు-వంశములందున తిరిగి
కిరీటి-కృష్ణులుగా ఉదయించిరి

దక్షపుత్రిక స్వాహాయందున
అగ్నికి పుట్టిరి ముగ్గురుతనయులు
పావక - పవమాన - శుచి లనువారు
ఆ - అగ్నులవి నలుబది ఐదయె.

బ్రహ్మావాదులు - యజ్ఞక్రతువులను
ఆయాఅగ్నుల పేర్లతొ చేతురు
ఆ అగ్నుల వివరములివియగు
అగ్ని ష్వాత్తులు - బర్హిషదులును

సౌమ్యులు - పితలు -ఆజ్యపులున్న
సాగ్నులు-నిరగ్నులు అను ఏడువిధములు
దక్షుని మరియొక కుమార్తె యగు
స్వధకు-కుమార్తెలు - వయవ-ధామణి

॥శ్రీ కృష్ణచరితము॥



## 3 దక్షునకు ఫాలాక్షునికి కలిగిన వైరం

దక్షప్రజాపతి కూతురు సతిని
శంకరునకిడి పెండ్లి చేసెను
పాతివ్రత్యమున ఎన్నికగన్నది
పరమశివునికి ప్రాణసమానము

సంతుకలగని చింతలొ వుండగ
తండ్రి మూర్ఖతతొ అల్లునిపైన
విరోధమది పెంచుకొని మరి
భర్తను ఆతడు నిందించగను

భర్తపదములే పెన్నిధి అనుకొను
పావన చరిత - భరించలేక
యోగాగ్నికి తా నాహుతియైనది
అనగా విదురుడు వివరములడిగెను

జగదారాధ్యుడు - అభయప్రదాత
పిలచిన పలికే ప్రసన్న మూర్తితొ
వైరము - ఎటుల పెంచుకొనెనయా!
కన్నకూతురును కష్టపెట్టెనా?

అంతట పలికెను మైత్రేయుండు
ఫాలాక్షునితో వైరము తెలిపెను
విదురా! ఒక పరి సత్రయాగము
బ్రహ్మలందరు చేయుచుండిరి

ఆయాగమునకు త్రిమూర్తులున్ను
సురలు-మునులు-ప్రజాపతులును
ఎందరొ పెద్దలు ఆహ్వానముపై
ఉచితాసనములు అలంకరించిరి

అంతటిలోన దక్షుడు వచ్చెను
బ్రహ్మ - శివుడు - తప్ప - మిగిలిన
అందరు లేచి - మన్ననచేసిరి
దక్షుడు ప్రణమిలె బ్రహ్మదేవునికి

ప్రక్కనవున్న ఆసనమ్ముపై
కూర్చొని దక్షుడు కలయజూడగా
శివుడు తనను గని లేవలేదని
గ్రహించినాడు అవమానమనుకొనె

తన తలతీసిన యంతటి పనియని
తనగౌరవమునకు మాయని మచ్చని
పరాభవాగ్నిలొ ఉడికి పోయెను
కోపము అనెడి వైరి - గెలచెను

వెంటనె సభలో - దిగ్గున లేచెను
కలవరపడిరి గాంచిన వారు
గుస గుసలను మరి ఆపమనుచును
గర్జించుచును పలికె నిట్టుల

జగత్పూజ్యులు మీరందరును
అందరిముందు ఈ మగధీరుడు
అనుచు శివుని - తా - వ్రేలితొచూపుచు
అవమానించెను - దురహంకారి

వివేక మెరుగడు మన్నన తెలియదు
దిక్పాలకులకు మచ్చతెచ్చెను
మాన మర్యాదలు విడచిన యట్టి
దిగంబరుడు - ఈ బూడిద రాయుడు

పశువాహనుడు - దానిబుద్ధులు
వీనికివచ్చెను - శ్మశానవాసి
పుర్రెచేతగొని బిచ్చమెత్తుకొను
లోకద్రిమ్మరికి - పిల్లనిచ్చితి

సర్వమంగళ - సుమసుకుమారిని
వీనికి యిచ్చితి - పరువుపోయినది
శౌచభ్రష్టుడు - భూతహితుండు
నన్నుగాంచి - తను గౌరవించడే!

నా - రాకనుగని నిలబడవలెగద
గర్వమదాంధుడు నావల్లనె మరి
వీనికి పేరు ప్రతిష్టలు వచ్చెను
ప్రజాపతికి మరి అల్లుడందురు

ఒక్క శాపమున కళ్ళు తెరచునటు
చేసెద వీనికి - అనుచు మూర్ఖముగ
హవిర్భాగములు అందవు అనుచు
యజ్ఞ - యాగముల - స్థానములేదనె

కొందరుపెద్దలు దక్షుని మాటల
నొచ్చుకొనిరట - హితవుచెప్పగా
అటులే - వాడు - యజ్ఞములందు
ఉండవలెనన - నేనుండనని

రుసరుసలాడుచు - లేచిపోయెను
శివుడు కూర్చొనె చిరునగవులతో
ఆవేశముతో నంది అంతట
పలికెను అచట సభలో వినగా

సదస్యులారా! కంటిరి - వింటిరి
కండకావరము - దురహంకారము
ప్రజాపతినని మిడిసి పాటిపె
భూతహితునికి శాపమునిడెను

యాక్తాయుక్త విచక్షణ మరిచి
విశ్వ ద్రోహము చేసెను - దుష్టుడు
మహాదేవుడు సంయమనమ్ముతొ
కూర్చొనుటయది - బలములేకనా!

ఫాలనేత్రుడని మరచిపోయెను
హాలాహలము మ్రింగెననుచును
హరి బ్రహ్మాదుల స్తుతుల నందెనని
తెలియని మూర్ఖుడు-మామెటులయ్యెనొ!

పెద్దరికమ్మును మంటగలిపిన
వివేకహీనుని కిదె నాశాపము
ఆత్మజ్ఞానము నశించి పోవును
కామముతో మరి - స్త్రీలోలుడగు

పశుత్వమ్మును ప్రదర్శించెను
కావున త్వరలో మేష ముఖుడగు -
వీని అనుచరులు జరామరణములు
కలిగి - బంధముల బాధనందెదరు

అంతియెగాక - వివేక మెరుగక
స్తుతిప్రాయములగు వేదమ్ములనే
పట్టుకు వ్రేలాడు - మనస్తత్వమున
శివద్వేషులై బ్రాహ్మణులున్న

మనోవైకల్యము పొందిన వారై
వేదవిద్యను అమ్ముకు తినుచు
ఇంద్రియవశులై - యాచకులగుచు
పశువులమాదిరి జీవించెదరు

అనుచు దక్షుని - బ్రాహ్మణులను మరి
శపించినట్టి - నందికేశ్వరుని
చూచిన - భృగువు ఆవేశముతో
సభికుల - సవ్వడి నాపమనుచును

నోటికి వచ్చిన కూతలు కూసిన
నీ నోటిని మూయించలేమనా!
శాపము పెట్టుట మాకురాదనా!
ఇదిగో వినుము - నాశాపమును

ఇలలో - శివుని ఆరాధించిన
శివభక్తులను ఆదరించిన -
శాస్త్రనిరసన చేసినచో మరి
పాషండులై పోదురు - అనెను

ఋషిసమ్మతమగు - సాంప్రదాయమున
నిలపెను వేదము వేదవేత్తలు
వారిని నిందించి శివుని కొలచిన
పాషండులగుదురని ప్రతిశాపమిడెను

అటులాసభలో రభస జరిగెను
శాప ప్రతి శాపము లెగసెదూకుడుగ
ఈశ్వర కటాక్షమున్నది గనుక
ఎట్టి దుర్దశ కలుగలేదచట

శివుని మనస్సు నొచ్చుకున్నది
క్షణకాలమచ్చుట వుండలేకను
అనుచరులతొ - తా - సాగిపోయెను
మిగిలిన యజ్ఞము ముగించె బ్రహ్మ.

॥శ్రీ కృష్ణచరితము॥



## 4 సతీదేవి దక్షయజ్ఞమునకు వెళ్ళగోరుట

శివుని పేరు మరి వినినంతటనే
దక్షుడు విజ్ఞత కోల్పోవుచును
అల్లుడు అన్న బాంధవ్యమ్మును
మదిలోనుంచక అరచెడివాడు

అందువలననే ఆలోచించి
అవమానమ్ము మరింత చేయగ
శివుడు లేకనే యజ్ఞము తలంచి
అందరికీ ఆహ్వానములంపెను

శివనింద చేయుచు శివద్వేషముతో
నిండిపోయినది ఆతని మనస్సు
రుద్రుని విడచిన యజ్ఞములుండవు
కానీ - తలంచెనొక యజ్ఞమును

ఆహ్వానములు అందినవారు
దుష్టబుద్ధితో - పోగాలముతో
తలంచెనిట్టి యజ్ఞమనుకొనిరి
తప్పదు కనుక వచ్చిరి వారు

యజ్ఞభాగములు అందకూడదని
శపించెగనుక అన్ని యజ్ఞములు
శివుడు లేకనే చేయవలెననె -
ప్రజాపతులలో ముఖ్యుడు తానని

ప్రజాపతులును ఋషులు దేవతలు
సకుటుంబముగా వచ్చిరచటకు
ఆహ్వానమందియు విరించి విష్ణువులు
యజ్ఞమ్మునకు రాకపోయిరి

ఆకాశమార్గమున సందడి పెరిగెను
దక్షయజ్ఞముకు వాహనాలపై
దేవ గంధర్వ-కిన్నర-కింపురుషాదులు
ఆనందముగా బయలుదేరిరి.

పసిడి సొమ్ముల - సన్నని సవ్వడి
పరిహాసములతొ విరిసిన మోములు
పట్టు వస్త్రముల సొగసులు వొలికి
పలుకరించునటు నిలచెను నింగి.

అంతసందడి నింగి మార్గమున
గాంచిన సతి-తా-విషయము తెలియక
ఆశ్చర్యముగా చూచుచుండగా
చేటిక వచ్చి - విషయము చెప్పెను

మీనాయన-తా-యజ్ఞముచేయుచు
ఆహ్వానించగ వెళ్ళుచుండిరి
అమాటలకు సతీదేవి తను
అవాక్కుఅయ్యెను - నిజమా అనెను!

నిజమే అని మరి తెలిసినంతనే
మనస్సు కొంచెము దిగాలుపడినది
పిలుపు ఎందుకు రాలేదనుచు
తిరిగి విషయము బోధపరచుకొనె

మొండి పట్టుగల తండ్రి - తానుగా
పిలవ నంపడు నిస్సందేహము
అయినా పిలవక వెళ్ళుటతగదా!
తనయకు - పిలుపు కావలెనా మరి!

భర్త అనుమతి అడిగి చూచెద
అనుకొని లోనికి అడుగిడినంత
ఎదురుగ - భర్త కనబడగానే
వివరము తెలిపెను సంతోషముగా

మనకు తెలియదు ఏలనొ స్వామీ!
అనగా శివుడు నవ్వుచు పలికెను
మనకు చెప్పక చేయరాదని
కట్టడి ఏమియు లేదు వింటివా!

స్వామీ! మిమ్ముల తూలనాడిన
ప్రజాపతిని - నే గౌరవించను -
కానీ తండ్రిగ తనయను పిలవక
యజ్ఞము చేయుట తప్పే వొప్పను

కానీ మనము తప్పు క్షమించి
అడుగు బెట్టిన ఆనందించడ!
కావున శంకర - భక్తవశంకర!
యజ్ఞము చూడగ వెళ్ళెదమయ్యా!

అంతట పలికెను సాంబశివు డట
నీవు వెళ్ళినా అచ్చటనీకు
ఆహ్వానమది లేకపోవగా
అవమానమగు ఆలోచించుము

బంధుజనమును తోబుట్టువులను
తల్లిని మొదలగు వారిని చూడగ
మక్కువ స్వామీ - రక్త బంధమది
అనెను శాంభవి - తలవంచుకొని

వెళ్ళవలెనను - కోరికయున్నది
భర్తవలదనిన - మాటయున్నది
దుఃఖ బాష్పములు కనులనిండగా
కమలలోచన నిట్టూర్పులు విడువగ

మనస్సు తెలిసెను సాంబశివునకు
వెళ్ళమన్నచో అవమానమగు
వలదన్నచొ మరి నిరాశయగును
అనుచు పలుకక - మిన్నకుండెను

నీవు తనయవే అయినను గాని
శతృవుకీవు భార్యవైతివని
నీపై కక్ష సాధించును అని
మరుమాటాడక వూరకుండెను

అంతట సతి తా నిర్ణయించుకొని
బంధువు లందరి ముందర తనకు
అవమానమని చెప్పిన గాని
వినక - పట్టుదల తెలిపె ముఖమున

పయ్యెద కొంగు బిగించి అంత
బయలు దేరుటకు ముందుకు నడచెను
పద్మాసనమున కూర్చొనె శివుడు
పంజరమ్ములో చిలుక మధనపడె

వృష భేంద్రుడు - తా - రంకెవేసెను
రజతాద్రి అంతట కదలినట్లయె
రుద్రానుచరులు పరుగున జేరిరి
స్వామికి చెప్పిరి సాగుచున్నదని

హుంకరించెను ఫాలాక్షుండు
నందిని పిలచెను అరపుమాదిరిగ
అమ్మవెంబడి వలయు వస్తువులు
తీసుకు సాగుము దింపు అనెను

అంతట ఆమెకు లాంఛనమ్ములు
అమరిన వచ్చుట - రుద్రగణములవి
శంఖ - దుందుభులు మ్రోయించిరట
నందివాహనము అమ్మతొ కదిలెను

శివుడు ఒంటిగా మిగిలెను గిరిపై
సాగిన సతి అట యజ్ఞశాలగని
వాహనమ్మును దిగి లోనికిచనె
తల్లి వచ్చి తన కుశలమడిగినది

తోబుట్టువులు ముక్తసరిగను
యోగక్షేమములడిగి - సాగిరి
సభ్యులెవ్వరూ - పలుకరించక
భయమున - చూపులు దాటవేసిరి

దక్షుడు గాంచి ముఖము త్రిప్పెను
మాటవరసకు క్షేమమాయని
తనయను అడగని తండ్రి ప్రవర్తన
గుచ్చుకొన్నది సతి హృదయమున

మహాదేవుని అర్ధాంగిని మరి
సభ్యులెవ్వరూ పలుకరించరే
పతిని పిలవక పోవుటతప్పు
తనను చూడక పోవుట ఘోరము.

యజ్ఞకలాపము అతిమెళకువగా
రుద్రనామము రానీయకను
ఆచరించుచు నుండిరచ్చట
అభవుని అలక్ష్యపరచుట అదియగు

సర్వజీవులను పవిత్రులనుగా
చేసెడి మంత్రము - శివనామమ్ము
పలికినంతనే పాపహరమ్మగు
పరమశివుడు సామాన్యుడు గాదు

భరింప రాని ఆవేదనతో
కట్టలుతెగిన ఆవేశముతో
దక్షుని ముందు నిలచెను ఆ సతి
తండ్రి చూపులో ఈసడింపుగనె

ప్రజాపతినని గర్వమునిండి
జగన్మంగళుని - తూలనాడితివి
వివేక శూన్యుడ వైతివి నీవు!
తనయను పిలవని - అహంకారివి!

రుద్రానుచరులది గాంచి మండి పడి
అంతుజూచెదము అనుచు లేవగా
ఆమె వారిని వారించి తండ్రితో
పలికె తీవ్రముగ సందర్భముగా

సృష్టికర్త - తా - హరుని సేవించును
పాదపద్మములు భజించువారికి
కల్పవృక్షమై కోర్కెలు తీర్చును
కరుణాంతరంగుడు బోళాశంకరుడు

శివుని తలచని జన్మ నీచజన్మ
హరుని గొలవని రోజు-బూజుపట్టు
అభవునామము లేని నోరు ధక్క
నీలకంఠుని కాదనిన యజ్ఞమగున?

పుణ్యాత్ములు శ్రీకంఠుని తలంచి
పాదరజమును శిరమున దాల్తురు
నీవు దప్ప మరి యింకెవ్వరును
శివనిందను చేయరు వినుము

నీచ భ్రష్టుడని - చర్మాంబరుడని
భిక్షుకుడనుచు - కపాలియనుచు
కారు కూతలు కూసితి వీవు
మతిహీనుడవై పలుకుట తగునా!

ధర్మవర్తనులు సహించరానిది
శివదూషణము తెలియకపోతివి
నీ నాలుక నింక కోయకుండిరి
కర్ణ రంధ్రములు మూసుకునుండిరి

శివద్వేషివి - నీ యజ్ఞమ్మునకు
వేదవిదులు మరి దేవగణంబులు
వచ్చిరి వీరు సదాచారులా!
శివరూపము నీ శరీరమయ్యా!

దేవతలకు ఆకాశ గమనము
మానవులకు భూతల గమనము
స్వభావికము లన్నటు వినుము
ప్రవృత్తి - నివృత్తి మార్గములందు

ప్రవృత్తి మార్గము నందురాగము
నివృత్తి మార్గము - వైరాగ్యలక్షణము
ప్రవృత్తి మార్గము నున్నవారు మరి
వేదకర్మలను ఆచరింతురు

నివృత్తి మార్గమునందు చరించగ
వేదకర్మలతొ పొత్తువుండదు
ఆత్మజ్ఞానమే - వారి సాధన
ఆమార్గములు లేనిది - శివునికి

ఆత్మారాముడు శంకరుడయ్యా!
అణిమాది సిద్ధులు-అష్టైశ్వర్యముల
నిలయము అగునా - నాగాభరణుడు
చలనశక్తియే శంభుడు తెలియుము!

చేతనా చేతనములన్నియు కూడా
తండ్రీ వినుము భూతములయ్యా!
వాటికి ఆత్మ - భూతపతి గద!
భువన పావకుడు పరమశివుడయా!

ఈ వైభవము - పదవీ గర్వము
నిండిన నీవు తూలనాడితివి
నీకు తప్పును చెప్పరెవ్వరిట
నీ భృత్యులుగా మసలుచుండిరి

నీలకంధరుని పరుషములాడిన
నీదు తనయనన సిగ్గుగనున్నది
మహాత్ములకిల కీడొనరించిన
వారిజన్మములు కాల్చగ వలెను

దక్ష తనయనని పిలిపించుకొన
ఆనందించుట బదులుగ నేను
కృంగి పోయి మరి మనుట కన్నను
చావుమేలగు - అనుచు పలుకుచు

క్రోధావమానము లెగసిపడగను
సభామధ్యమున ఉత్తరముఖముగ
ఆచమించి - తా - మౌనముద్రలో
యోగమార్గమున తనువు వీడగను

ప్రాణాపాన వాయువుల బంధించి
వాటిని - నాభిలొ చేర్చి అంతట
శివనామమును జపించు కొనుచు
యోగము నంతట అవలంబించగ

యోగాగ్ని అది ఉద్భవించినది
పెను జ్వాల అచ్చట ఉవ్వెత్తుగలేచెను
క్షణకాలములో సతీదేహము
దగ్ధమైనది ఆ యోగాగ్నిలొ -

హాహాకారము లెగసెను సభలో
కొందరు - దక్షుని - ఈసడించిరి
రుద్రగణమ్ములు ఆవేశముతో
ముందుకురికిరి అంతుచూడగా

ఆసమయములో భృగుమహర్షి
రుద్రగణములను అంతము చేయగ
అభిచార హోమము అచ్చట జరపగ
అగ్ని కుండమున వేలకువేలు

దేవయోధులు ఆయుధాలతో
ఉద్భవించిరి పోరుకుదిగిరి
వారి ధాటికి నిలువ లేకను
రుద్రగణంబులు పారిపోయిరి

దక్షయజ్ఞము దగ్ధమైనది
కన్నకూతురు ఆహుతి అయినది
ఫాలాక్షునితో వైరము ముదిరెను
అల్లకల్లోలము అయినదంతయు

విషయము శివునకు నారదమహర్షి
విశదపరచెను - పూసగుచ్చినటు
అనుచరులు అట పరాజితులైరి
అనుంగుసతి-తా-ఆహుతి అయినది

రెండువార్తలు ఫాలలోచనుని
చలింప జేసెను - జ్వలింపజేసెను
ఢమరుకమ్మది మ్రోగెనొక్కపరి
నాగాభరణము బుసలువిడచినది.

వెండికొండ-తా-కదలె - కరగునటు
పరమశివుడు-తా-ఉగ్రశివుడయె
గిరివలె ఉన్నతకాయుడయ్యెను
శ్వాసనుండి అట అగ్ని కురిసినది

చిరునవ్వొకటి ఆపై గర్జన
వణకిపోయినది ప్రకృతి అంతయు
జటాబంధనమునుండి వెంటనే
జటనొక్కటి - తా - పెరకి విసరగా

అఖండాకృతితొ దివ్యపురుషుడు
ఉద్భవించెను జటాబంధమున
కారుమేఘమును పోలు శరీరము
ప్రళయాగ్నిని బోలి వక్త్రమున్నది

మంటలచిమ్ముచు నున్నకేశములు
కపాలమాల భయము గొలపగా
వేయిచేతుల ఆయుధాలతో
వినయముగా - తా - నిలచి పలికెను

భువన భీషణమైన నవ్వుతో
నిలచియుండెనట నీలకంధరుడు
జటలో పుట్టిన వీరభద్రుడు
ఆనతీయమని కోరె - వినయముగ -

అంతట పలికెను పరమశివుండు
రుద్రగణములతొ దక్షని యొక్క
యజ్ఞశాలకు సాగుము వేగమె
నాశము చేయుము దక్షుని కలిపి

నా అంశతొనీవు ఉద్భవించితివి
బ్రహ్మతేజమది హాని చేయదనె -
ప్రదక్షిణించి బయిలుదేరెడి
వీరభద్రునికి శూలము నొసగెను

మహాప్రళయమన మహాకాయుడు
భూమి వణకునటు అడుగు లేసెను
సృష్టినంతను ఒక్క ముద్దగా
మ్రింగి వేయునా అనిపించినది

వెనుక వచ్చెడి రుద్రగణముల
భీకరమైన ధ్వనులకు నంత
గ్రహముల గతులు తప్పునట్టయె
ప్రళయకాలమే వచ్చునట్లయె.

 ॥శ్రీ కృష్ణచరితము॥

## 5 దక్షాధ్వర ధ్వంసం

రుద్రసైన్యపు పదఘట్టనతో
లేచిన దుమ్ము ఉత్తర దిక్కున
కావిరంగును పూసివేసినది
ఆరంగును గని హడలిపోయిరి

సదస్యులందరు బిక్కముఖముల
నిలచిపోయిరి చీకటి గాంచి
అంతట తెలిసిరి ధూళి అనుచును
ప్రళయ సమయమది కాదని తెలిసిరి

కారణ మరయగ సదస్యులందరు
చర్చలొపడిరి - భయకంపితులై
ఆ పరాగమును గాంచిన యట్టి
దక్షుని భార్యయు - విప్రకాంతలు

ప్రమాద మేదో సూచన అనుకొని
దక్షని దురుసును - నింద చేసిరి
కన్నకూతురును కడతేర్చిన ఘనుడు
మహాదేవునికి అపచారమనిరి.

దక్షుడు ఖిన్నుడు తానై నిలచెను
దుర్నిమిత్తములు అగబడె నతనికి
పరాగమును చీల్చుకునంత
మండేమంటల రుద్రుని భటులు

ఒక్కసారిగా యజ్ఞశాలలో
భీభత్సమట సృష్టించగను
అవాక్కుగా మరి నిలచిరందరు
అరిభీకరులా శివకింకరులు

నల్లని - పచ్చని రంగుదేహములు
చక్రములంతటి వుబికిన కండ్లు
మకర ముఖులును - కురచ దేహులు
బానకడుపులతొ కొందరుండిరి

ద్వారబంధములు కూలుచున్నవి
పై కప్పులవి నేలబడినవి
యజ్ఞ సాధనములన్నీ చెదరెను
అగ్ని హోత్రములు ఆరిపోయినవి

పరుగిడు మునులను హింస బెట్టిరి
దేవతలందర భరతము పట్టిరి
దక్షుని బంధించె - వీరభద్రుడు
భృగువును బంధించె మణిమంతుండు

చండీశు డంతట పూషుని బంధించె
భగుని బంధించెను నందీశ్వరుడు
ఆహూతులను రెక్కలు విరచి
బంధించి మూలలకు నెట్టివేసిరి

చితకబాదిరి ఎముకలు విరుగగ
అరచేతులతో చరిచిరి కొందరు
దక్షుని నిందకు ఆజ్యముపోసిన
భగుని కండ్లను పీకెను - నంది

శివుని - దక్షుడు శపించుచుండగా
వెకిలిగ నవ్విన పూషుని యొక్క
దంతమ్ములను జల జలరాలగ
చండీశ్వరుడు గ్రుద్దె ముఖమున

శివ నిందను ఆ దక్షుడు చేయగ
విలాసముగ నిలచిన భృగువుకు
గడ్డము పెరకెను వీరభద్రుడు
అందట దక్షుని దరికిజేరెను

ఘనశౌర్యమ్ము భుజబలమ్మును
కలిగిన యట్టి వీరభద్రుడు
గుండె పగులగా తన్నెను దక్షుని
త్రొక్కెను పీకెను కంఠము కోయగ

ఎంతప్రయత్నము చేసినగాని
కంఠము తెగదు చర్మము నలగదు
వానిని చంపెడి విధమదికాదని
వీరభద్రుడు యోచన చేసి

గొంతుక పిసికి మెలిపెట్టి అంతట
తామరపూవును త్రుంచినట్టుగా
కంఠము త్రుంచెను - నరములు తెగెను
శిరస్సువిసరెను - హోమకుండమున

రుద్రానుచరుల జయ జయ ధ్వనులతో
నింగి యంతయు మార్మోగినది
దక్షుని బంధుల బ్రాహ్మణులనట
చితక బాదిరి రుద్రునిసేనలు

భీభత్సమట జరిపిన యంత
తనసైన్యముతో వీరభద్రుడు
కైలాసమునకు సాగిపోయెను
రుద్రుని కంతయు తెలిపె విషయము.

॥శ్రీ కృష్ణచరితము॥



## 6 దేవతలు తమ పాట్లు బ్రహ్మకు చెప్పుట

రుద్రసైన్యము వెడలగనంత
దేవతలందరు కట్టు విప్పుకొని
విరించి పదముల వ్రాలిపోయిరి
వారిగోడు వివరించిరి బాధగ

జరిగెడి విషయము తెలియును గనుక
విరించి విష్ణువులా యజ్ఞమునకు
వెడలగలేదు - అంతట బ్రహ్మ
సజ్జనాపచారపు ఫలమది అనెను

దక్షుడు తాను తనకేగాక
అందరికీ మరి కష్టము తెచ్చెను
రుద్ర రహితమగు యజ్ఞమున్నదా!
దక్షుని దృష్టిలో కానివాడయె.

జనవంద్యుడగు యోగి పశుపతి
అష్టైశ్వర్యము లాతనిసొత్తు
అంతటివానికి యజ్ఞ భాగము
లేకుండగను యజ్ఞము మొదలిడె

మీరు కూడను అవివేకులయి
ఇన్ని బాధలు అనుభవించిరి
శివద్వేషిని అనుసరించి మరి
మీరుకూడను విరోధులాయిరి

కనుబొమ ముడిపడినంతనె వినుడు
లోకపాలకులు - లోకములన్నీ
నాశనమగునని తెలియద మీకు
అంతటి అభవుని కాగ్రహ మొచ్చెను

త్రిపురాసుర సంహారకుడు
క్షోభనెరుగని దయాంతరంగుడు
హాలాహలమును గ్రహించినట్టి
సుగుణశీలుడు శూలియగును కద!

ఆయన మదికి బాధ కలిగెను
మీ అందరికి తగిన శిక్షయది
అవమానించగ చేసిన యజ్ఞము
అడుగంటినది - సరిగాయైనది

అమ్మదూరమై అభవుడుండెను
అమిత బాధలో నిండి యుండును
అయినా ఆయన దయాసింధువు
ఆయన మదిని శాంతపరచుడు

పశ్చాత్తాపము కలిగిన మీరు
పాదములంటి ప్రార్థనచేయుడు
పన్నగహారుడు కరుణించంగా
పాదములింక పట్టుడు - పొందు

అంతట సురలు పలికిరి బ్రహ్మతొ
వాణీనాధా! ఏముఖముతొ మరి
అర్ధనారీశ్వరు చూడగలమయా
ఏదో మార్గము నీవు చూపమన

బ్రహ్మ పలికెను వారందరితో
ఏ విధముగ మరి దరికిచేరుటో
చెప్పగ తగిన వాడను కాను
దాసుల తప్పు దండముతో సరి

నిటలాక్షుండు - భూతహితుండు
పన్నగహారి - పాపసంహారి
భస్మధారి - ఐశ్వర్యప్రదాత
జటాధారి - తా - జగదాధారుడు

మీతో వచ్చెద కదలండింక
కరుణాధాముని దరి జేరెదమని
చతుర్ముఖుండు దేవతలతొ - తా -
కలిసి చేరెను - కైలాసమును.

॥శ్రీ కృష్ణచరితము॥

❋❋❋

## 7 కైలాసవర్ణన

భక్తులందరికి పారిజాతము
అష్టైశ్వర్యముల కాణాచియది
శివతాండవముతొ పునీతమైన
వెండి కొండయది విజయకేతనము

సిద్ధులు కిన్నర కింపురుష సాధ్యులు
గుహ్యకులును మరి యక్షులుందురు
మహాదేవుని దర్శనమ్ముకై
వేచియుందురు - నిరంతరమ్ము

మందార పారిజాత సరళ వృక్షములు
సాల తక్కోల కోవిదార శిరీషార్జున
చూత కదంబ నింబ నాగపున్నాగ
చంపక పాటలాశోక తరువు

వకుళ - కుంద-కురవక కనకామ్ర
శతపత్ర - కింశు కైలా లవంగ
మాలతీ మధూక మల్లికా పనసలు
మాధవీ కుటజోదుంబ అశ్వద్ధములును

ప్లక్ష - వట - హింగుళ భూర్జ
జంబూ కర్జూ రామ్రాతకములును
ప్రియాళు నారికేళాంగుద - వేణు
కీచకీ - ముఖర తరువుల విలసిల్లి

శాఖా మృగముల విడిదిగ నిలచి
కోకిల శుకపిక కోలాహలముతో
సింహ వ్యాఘ్రముల ఠీవి నిండినది
కలహంస కారండవ చక్రవాకములు

బక జల కుక్కుటమ్ముల సరస్సులుండి
ఆత్మద్రష్టలకు పుణ్యాత్ములకు
ఆశ్రయమిచ్చెడి రజితాద్రి - అచ్చట
ఈశ్వరోపాసన ఫలితము-నివాసమగును

ఫలభరితమయి తరువులు వంగి
వినయవంతునిగ అగుపడుచుండును
పూల రాశులవి మరియొక గిరిగా
గిరిజారమణుని పదముల నిలచును.

తుమ్మెదలన్నీ శివనామమ్మును
నిరంతరమ్ము నింపును గిరిపై
కలుషవిభంగ పావన గంగ
సొగసుగ మగని చూచుచుండును

తలచిన తలపే పాపహరమ్ము
పిలచిన పిలుపే పరమపదము నిడు
అది కైలాసము - కరుణాంతరంగుడు
ఆది దేవుని - నిజవాసమ్ము

అలకానగరపు అందము దాటి
పుండరీకాక్షుని సేవించుకొను
నంద - అలకనందలా పావన నదులు
జంటగ పారును - శోభలీనగా

ఆ నదులను దాటి తీరమున గల
సౌగంధిక వనమున ప్రవేశించిరి
ఆవనముకు దగ్గరగలదొక
నూరుయోజన విస్తృత మర్రి

దట్టమైన ఆ మర్రి చెట్టును
గాంచిరచ్చట - వీతరాగులు
యోగులెందరో - శివతత్వమును
చర్చించుకొనుచు పరవశించుచు

ముముక్షువులతో నిండియున్నది
దివ్యధామము అన్నటులున్నది
దానిని గాంచి బ్రహ్మాదులందరు
ఆశ్చర్యములో మునిగిపోయిరి

తపోవేషమున శంకరుడచట
దర్భాసనమున స్థిరముగ కూర్చొనె -
చర్మాంబరుడు భస్మభూషితుడు
తపోధనులతో నారదమౌనితో

తత్త్వచర్చలో నిండియుండగా
కుడితొడపైన ఎడమపాదమును
ఎడమ మోకాలుపై ఎడమచేయినిడి
తర్కముద్రలో నున్న శంకరుని

నాగాభరణుని నందివాహనుని
బ్రహ్మనిష్ఠా గరిష్టునంతట
గాంచిరి - వచ్చిన బ్రహ్మాదులందరు
పాదమ్ములకు ప్రణామ మిడిరి

శివుడంతటను లేచి భక్తిగా
బ్రహ్మదేవునికి నమస్కరించగ
వామనుడప్పుడు కశ్యపమునికి
నమస్కరించిన చందము తోచెను

అచట కూర్చొనిన సిద్ధులు ఋషులు
బ్రహ్మకు భక్తిగ నమస్కరించిరి
వారందరినీ కూర్చొన మనగా
ఆసీనుడయి పలికెను బ్రహ్మ.


॥శ్రీ కృష్ణచరితము॥

## 8 బ్రహ్మశివుని స్తుతించుట

శరణు! శరణు! ఓ భక్తవశంకర!
అపరాధమును క్షమించు శంభో!
విశ్వనాథుడవు నిర్వికారుడవు
సృష్టి - స్థితి - లయ కారకుండవు

నీలకంధరా! సర్వేశ్వరుడవు
భగవంతునిగా నిను భావించిన
భక్తులపైన - నీకు కోపమా!
లోకపాలకా! కోపము నెరుగవె.

నీ అంశలతో శివశక్తి రూపముల
విశ్వవలయమున చరించువాడవు
వేదవిస్తరణ నీ సంకల్పము
దక్షుని యజ్ఞము నీ లీలయది

మూర్ఖతనిండిన జనులను జూచి
పామరుడని జాలిచూపెడి
కరుణాసింధువు - నీవే స్వామీ!
మాయకు లొంగిన వారిని కావుము

యజ్ఞ రక్షకుడ వీవేనయ్యా!
సర్వమంగళము లిడెదవు నీవే
పుణ్యపాపముల ఫలముల నొసగే
కర్మసాక్షివి - భూతహితుడవు

విష్ణుమాయకు వశమైనచొ మరి
మహాత్ములను - తా - నిందచేయును
గమ్యము తప్పి చరించుచుండును
అట్టివారిని - కనికరింతువు.

యజ్ఞము నందు హవిర్భాగము
అందనీయక కఠినోక్తులతో
అహంకరించిన దక్షుడు తాను
ఫలితమునందెను అంతటితో సరి

భగునకు తిరిగి కండ్లను యిచ్చి
పూషునకంత దంతము లొసగి
కరుణించుమయా! కారుణ్యాలయ
మిగిలిన వారిని అనుగ్రహించుము

చంద్రశేఖరా! దయాళువై నువు
తిరిగి దక్షుని బ్రతికించవయా!
దక్షయజ్ఞము పూర్తి అగునటు
అనుగ్రహించుము ఓ గంగాధర!

ఋత్విక్కులును దేవతలును మరి
అంగవికలులై బాధలొనుండిరి
ఆరోగ్యమును వారి కొసగుము
నామాట మరి మన్నించవయా!

యజ్ఞము నడువగ ఆదేశించి
నీ భాగమును గ్రహించుమయ్యా!
అనుచు విరించి వేడుకొనగను
చిరునవ్వుతొ పలికెను నందివాహనుడు.

❋❋❋ ॥శ్రీ కృష్ణచరితము॥

## 9 శివుడు దక్షాదులననుగ్రహించుట

కమలాసన! నీ తియ్యని మాటల
ఆనందించితి – అయినా వినుము
దురహంకారిని ధర్మదూరులను
దండించవలె – ఆపని చేసితి

రాలిన యట్టి దంతములవ్వి
పూషునకింక రావు – కావున
క్రతువులందున యజమాని దంతముల
పిండిని నమిలి మ్రింగుచు బ్రతుకును

దక్షుని – నేను – బ్రతికించెదను
వానితల అది – దగ్ధమైనది
కావున – వాని కళేబరమునకు
మేక తలను – అతికించిన బ్రతుకును

యజ్ఞభాగము నొసగిరి కనుక
దేవతలందరు బాగుపడెదరు
అంగవైకల్యము కల్గిన యట్టి
ఋత్విక్కులు గతి ఈ విధముగనగు

భగునికి తిరిగి కండ్లు రావిక
మిత్రనామమున నుండును తమ్ముడు
వాని కండ్లతో సమస్తమున్ను
భగుడు చూచును అది చాలుకద!

అశ్వనీ దేవతల సాయమువలన
బాహువుల వలన – పూషుని యొక్క
చేతుల వలన – బాహు హస్తములు
కలిగి – వారు మరి బ్రతుకుచుందురు

భృగువు గడ్డముకు గతి లేదింక
చీంబోతు గడ్డమును అతికించండి
అనుచు శంకరుడు - వారికి చెప్పగ
సంతృప్తులయి ఆనందించిరి

అంతట బ్రహ్మ శంకరదేవుని
సవినయముగా ఆహ్వానించి
యజ్ఞశాలకు తీసుకు వెళ్ళెను
ఋత్విక్కులును - సురలు మ్రొక్కిరి.

మేక తలను అట తెచ్చి దక్షుని
మొండెమ్మునకు అతికించగను
నిద్రనుండి - తా - మేల్కొని నటుల
లేచి నిలచెను దక్షుడు అచట

దయాసముద్రుడు రుద్రుడు అగపడె
శివ ద్వేషమది అంతరించినది
పరిశుద్ధమైన మనస్సు నిండెను
అంతట - అతనికి సతి విషయమది

యోగాగ్నిలొ అట భస్మమగుటది
తలపుకు వచ్చి - కంటనీరిడె
కంఠము పూడుకు పోయెనాతనికి
శివుని ప్రార్థన చేయకష్టమయె

కొంతసేపటికి - దుఃఖమునంతను
దిగమ్రింగుకొని - పలికె భక్తిగా
"వివేకహీనుడనైతిని శంకర!
నీకు తీరని అపచారమొనర్చితి

క్షమించుమయ్యా! కారుణ్యాలయ
సంప్రదాయమును కాలరాసితి
తత్వజ్ఞానము లేకపోయినను
ఉన్నటు - నేను మిడిసి పడితిని

గోపాలకుడు గోవులన్నిటిని
వేయికళ్ళతో కాపాడినటు
వ్రతపరాయణుల - బ్రహ్మవేత్తలను
కాపాడెదవు - నీ ధర్మమది

శివద్రోహిని - మహాపాపిని
మహాత్ములెందరొ చూచుచుండగా
నిండుసభలొ - నే నిను నిందించితి
అయినా నన్ను ఉద్ధరించితివి

ప్రతిగా నీకుపకారము చేయగ
చాలినవాడను కాను - పశుపతీ!
శరణని నీకు నమస్కరించితి
అభయమిచ్చి నను కాపాడుమయా!"

అటుల పలికిన దక్షుని గాంచి
చిరునగవొలకగ క్షమించి శూలి
యజ్ఞము తిరిగి కొనసాగించగ
విరించి కంతట చెప్పి - శంకరుడు

భృగుమహర్షిని అధ్వర్యునిగా
నియమించి-యజ్ఞమును పూర్తి చేయగా
దక్షుని కంత ఆనతినొసగెను -
తిరిగి యజ్ఞము ప్రారంభమయె.

మహావిష్ణువు అధిదేవతగా
శుద్ధమనస్సుతొ యజ్ఞకర్మలో
శ్రీహరినంతట ఆహ్వానించగ
చక్రధారి అట దర్శనమిడెను

నీలిమేఘము నేలకు దిగినటు
విద్యుల్లతలవి ముఖమున నున్నటు
పీతాంబరము - వజ్ర కిరీటము
వైజయంతి మరి కౌస్తుభమ్ములతొ

శ్రీవత్సాంకము సొగసు లొలకగా
కస్తురితిలకము అభయమునిడగా
వైకుంఠభామినులు సేవలుచేయగ
పన్నగశయనుడు - నచ్చెనచటికి

ప్రత్యక్షమైన గోవిందుని గని
బ్రహ్మదేవుడు - శంకర దేవుడు
ఇంద్రుడు మొదలగు దేవతలందరు
భక్తిగ నిలచి ప్రార్థన చేసిరి.

॥శ్రీ కృష్ణచరితము॥



## 10 శ్రీహరిని దక్షాదులు స్తుతించుట

దక్షుడు హరిని కీర్తించెనిటు
"దేవా! స్థిరుడవు అక్షరుండవు
సామాన్యులకు వున్నటువంటి
రాగాది అవస్థలు - నిన్ను అంటవు

చిద్రూపముతో భాసించెదవు
ధర్మరక్షణకు మాయతొ నీవు
త్రిగుణమ్ములకు సంబంధించిన
అవతారములను ఎత్తుచుందువు

బ్రహ్మరుద్రాదులు నీవు కాదని
వారు వేరని - భ్రమలో పడితిని
భేదబుద్ధితో - ప్రవర్తించితి
నా అజ్ఞానము క్షమించుమయ్యా!

బ్రహ్మరుద్రాదులు - దిక్పాలకులు
స్థావర జంగమ జగత్తు అంతయు
నీవే స్వామీ! తెలిసితి నేను
క్షమించమనుచు - పాదములంటెను"

ఋత్విక్కులందరు భక్తిప్రపత్తుల
నమస్కరించి పలికిరంతట
సజ్జనపూజిత - మేమందరము
విజ్ఞతమరచి ప్రవర్తించితిమి

వామదేవుని - శాప ఫలితముగ
కర్మతంత్రమును పట్టుకు నడిచే
అవివేకులమయి అసలు విషయము
వేదప్రమాణము మరచిపోతిమి

ఈ యజ్ఞములో ఇంద్రాది రూపులలొ
సురల రూపముల నీవుందువని
యజ్ఞభోక్తవు - కర్తవు నీవని
సూక్ష్మతత్వమును విస్మరించితిమి

నిర్గుణుడవు నువు - రమానాయకా!
ఆగమాలలో నుతులనందెదవు
మా అపరాధము క్షమించు స్వామీ!
మమ్మందరను కటాక్షించుము."

సదస్యులందరు పాదములంటి
కరివరదునట స్తోత్రము చేసిరి
మాదేహములు పాపకూపములు
కొండల వంటి కష్టములున్నవి

యమదండమది నెత్తిన ఆడును
దుఃఖములనెడి పన్నగమ్ములవి
పాపకర్మలను - పులులు వురుకుచు
భవారణ్యమున నుంటిమి స్వామీ!

కాలమృత్యువు కోరలయందు
నలిగిపోయెడి బ్రతుకులుమావి
నీ దయామృతమ్మును కురిపించవయా!
కారుణ్యాలయా కాపాడుమయా!"

అంతట శివుడు ఎదురుగ కూర్చొని
నారాయణుని నుతించెనచ్చట
"ఆశ్రితమందార - యోగివందితా!
నీ అనుగ్రహము నిరతము కోరుదు

నీపద మంజరులను నిరతము
హృదిలోనుంచుకు సేవించెదను
మాయామోహిత మూఢులు మాత్రము
అమంగళ మూర్తినని నిందించెదరు

అట్టివారిపై జాలి పడుచును
వారిని నావలె భావించెదను
నీవు వారిని అనుగ్రహించుము
శేషశయన! నీదాసుల చేయుము!"

భృగుమహర్షి సిగ్గుతొనిండి
రమాకాంతుని ప్రార్థన చేసి
అపరాధమును మన్నించమని
రక్షించమని పాదములంటెను.

ఆపై విరించి తండ్రిపాదముల
సాష్టాంగముగా నమస్కరించెను
భక్తి ప్రపత్తుల స్తుతించెనచట
జగదాధారా! జగన్నియంతా!

కర్మ చక్షువుల కందని యట్టి
మాయాతీతము నీ రూపమది
కనబడురూపము మాయామయము
నిర్మలమైనది నిర్గుణమైనది"

అనుచు తిరిగి అట వందనమిడెను
అంతట ఇంద్రుడు - స్తుతించెనిటుల
"దైత్యుల తృంచగ వెలసిన రూపము
దివ్యబాహువుల - జగద్రక్షయది

యోగీశ్వరుల హృదయసీమలో
స్వేచ్ఛగతిరిగే - తపోరూపమది
ఆదిపురుషడవు తెలిసితి స్వామీ!
అందుకొనుమునా నమస్సులనెను."

అంతట అచ్చటి ఋత్విజులున్న
వారి భార్యలు భక్తిగ మ్రొక్కిరి
పగతో దక్షుడు అరుద్రమ్ముగా
యజ్ఞము చేయగ పొసగుట ఎట్లు

నీదు మూర్తియే యజ్ఞము స్వామీ!
దయతో నీవు అనుగ్రహించి
సవ్యముగా మరి జరుగు నట్టుగా
ఆశీస్సులనిడు - అనంతమూర్తీ!"

మా పాపమ్ముల నాశము చేసి
సంసారలంపటము తొలగించవయా!
శిరస్సులేని నాపతిదేవుడు
ఇకపై చేరును పూర్వపు స్థితికి."

అపై భక్తిగ - ఋషులు స్తుతించిరి
"వైదిక కర్మల నాచరింతువు
కర్మల ఫలము ఆశించవు నువు
కానీ మేము దానికి భిన్నము

లోకపాలకులు సిద్ధులు మరియు
యోగులందరూ నుతించినారు
మాకూ నీకూ భేదము చూపని
కరుణాసింధువు నీవే అనిరి

నిన్ను తెలియగా మావశమగునా!
నారాయణ - నువు అనుగ్రహించి
యజ్ఞము పూర్తిగ జరుగునట్లుగా
ఆనతినిమ్ము అనుచు నుతించిరి."

అగ్నిదేవుడు దేవతలందరు
గంధర్వ విద్యాధరులును మరియు
శబ్దబ్రహ్మ - బ్రాహ్మణులందరు
లక్ష్మీకాంతుని స్తోత్రముచేసిరి

అంతట దక్షుని అర్ధాంగి యగు
'ప్రసూతి' - భక్తిగ ప్రదక్షిణించి
అశ్రు పూరిత లోచనమ్ములతొ
గద్గదకంఠముతో పలికెనిటు

"పరాత్పరా! ఓ అవ్యయమూర్తీ!
ఆదిపురుష ఓ జగదాధారా!
నిగమాగమవంద్యా! నీరజనాభా!
నీతత్త్వమును తెలియగ వశమా!

నా పతి - విజ్ఞత వదలి నడచెను
యజ్ఞపురుషుడవు నిన్నుకాదని
అహంకరించి అవమానించెను
అందుకు యజ్ఞము ఆగిపోయినది

యజ్ఞమునీవే - కర్తవు - భోక్తవు
నీ ఆనతితొ హవ్యభాగములు
అందుచుండును సురలందరకు
కావున యజ్ఞము జరిపించుమయా!"

ఆగ్రహమ్మును వదలి - మమ్ములను
అనుగ్రహించుము ఓ భూతపతీ!
తాపత్రయముల దూరము చేసే
నీ దర్శనము కలిగించితివి

వారందరికీ అభయము నొసగి
శివాగ్రహముకు ఆహుతియైన
యజ్ఞము తిరిగి నిర్విఘ్నముగా
జరిపించెను ఆ రమాధవుడట.

యజ్ఞభాగమును గ్రహించి శ్రీహరి
దక్షుని పిలచి పలికె నిట్టుల
ప్రజాపతీ! నీకు - తెలియని దుండదు
త్రిమూర్తులము మేమందరమొకటే

సృష్టి-స్థితి-లయ-కారకులమయా!
గుణత్రయలతొ సంబంధములేని
నేను - వాటిలో చరించుటన్నది
సృష్టికోసమే - మాయావిలాసమె!

సృష్టికోసమే బ్రహ్మదేవునిగ
లయము కోసమే రుద్రునిగాను
కనబడుచుందును కావున వేరను
భావనతప్పు గ్రహించుమయ్యా!

ఈ జీవరాశియది నా అంశయేయగు
అందరిలో నను చూడగలిగిన
బుద్ధిమంతుడు నాకు యిష్టుడగు
కావున మాలో భేదము లేదు

అనగా దక్షుడు అజ్ఞాన జనితమగు
అహంకారమును పూర్తిగ వదలి
విష్ణుదేవుని ప్రీతిగనంత
యజ్ఞమ్మును - తా - పూర్తిచేసెను

అంతట హరిని పూజించె - భక్తిగా
ఆపై మిగిలిన యాగక్రతువును
నెరవేర్చి సురలను తృప్తిపరచెను
రుద్రుని పూజతొ - అనుగ్రహమందెను

యజ్ఞసమాప్తి అయిన వెనుకను
ఋత్విజులతొ - తా - శాస్త్రోక్తముగా
అవబృధస్నానము నాచరించగా
కృతార్థుడయ్యెను దక్షప్రజాపతి.

త్రిమూర్తులున్నూ - దేవతలందరు
నిజవాసములకు సాగిపోయిరి
సతి అంతట తను మేనక హిమవంతుల
పుత్రిక - పార్వతిగా నుదయించెను

ఆమె భక్తిగా - తపోదీక్షతో
శివుని భర్తగా పొందగలిగినది
శుభముగ భర్తతొ కైలాసమున
ఆనందసీమలో - విహరించసాగెను

దక్షాధ్వర ధ్వంసగాథను
బృహస్పతి తన శిష్యుండైన
ఉద్ధవునకు తెలియబరిచెను
ఉద్ధవుడంతట నాకు చెప్పెను

దానిని తీయగ నీకు చెప్పితి
అని మైత్రేయుడు చెప్పె విదురునకు
విదురా! అటుల శివ దక్షులకు
వైరముతొలిగి సుఖాంతమైనది.

ఈ కథ వినిన ఆయురారోగ్య
భోగభాగ్యములు కలుగును వినుము!
పాపహరణమిది బంధముక్తినిడు
చిత్త శాంతిని కలుగ జేయును.

సనకసనందనాదులు మరియు
నారద–హంసుడు అరుణి బుధ యతులు
బ్రహ్మకు మానస పుత్రులు వారు
నివృత్తి మార్గమున సాగిపోయిరి

ఆపై సృష్టి వినుమని పలికి
మైత్రేయుండు తెలిపె విదురునకు
అధర్మునకు – మృషయను భార్యతొ
దంబుడు సుతుడు–మాయను కూతురు

ఉద్భవించిరి – వారిద్దరును
అధర్మసంతతి కావున వారు
వివాహమాడిరి – వారినంతట
నిర్‌ఋతి – సంతతి లేక గ్రహించెను

ఆదంపతులకు – లోభుడు సుతుడు
నికృతి సుతయు వుద్భవించిరి
వారిద్దరును వివాహ మాడిరి
వారికి–క్రోధుడు–హింసను వారలుపుట్టిరి

వారిద్దరును దంపతులాయిరి
కలి – దురుక్తి – వారికి సంతతి
వారిద్దరును వివాహమాడిరి
భయ – మృత్యులు మరి వారి సంతతి

వారిద్దరును వివాహమాడిరి
వారికి పుట్టిరి నిర్దయ – యాతనలు
ఈ సంతానము సంసారకారక
అధర్మతరువుకు శాఖలైనవి.

మంచిని కోరెడి బుద్ధిమంతుడు
వీరిని దరికి రానీయకూడదు
ప్రతిసర్గ క్రమమిది – దీనిని
సంగ్రహమ్ముగా చెప్పితి విదురా!

దీనిని శ్రద్ధగ మూడు మారులు
వినినచొ – వాని పాపములన్నీ
పటాపంచలై సుఖములనందును
ఆరోగ్య–భాగ్యములు సమకూరునయా!



॥శ్రీ కృష్ణచరితము॥

## 11 ధృవోపాఖ్యానము

బ్రహ్మదేవుని ఆదిమ సృష్టిలొ
స్వాయంభువమనువతి ప్రసిద్ధుడు
చంద్రకిరీటుని అంశతొ పుట్టెను
ఆతని భార్య – శతరూపయగు

ముగ్గురు తనయలు ఇద్దరు తనయులు
ఉదయించిరి ఆ దంపతులకును
ప్రియవ్రత–ఉత్తానపాదులు కుమారులగుదురు
ఉత్తానపాదుడు శాంతస్వభావి

ఉత్తానపాదుని భార్యలు–సునీత–సురుచి
సునీతి కుమారుడు–ధ్రువుడు అగునయా!
సురుచి కుమారుడు ఉత్తముడగును
సురుచిపైన ఆ రాజుకు మక్కువ

సురుచి తోటిదే లోకమ్మనుకొని
అంతఃపురమును దాటుట మానెను
ఒకదినమున తన తనయుడుత్తముని
అంకముపైన కూర్చొన బెట్టుకు

ముద్దుచేయుచు బుజ్జగించుచు
ముచ్చటాడుచు నున్న సమయమున
ధ్రువుడు అచటకు వచ్చి ప్రియముగ
తండ్రి తొడపై కూర్చొన వలెనని

పైకి ఎక్కగా గాంచిన సురుచి
భర్త అతని చేరదీయనిచె
అదే అదనని – దురుసుతనమ్మున
క్రిందకు లాగెను ధ్రువుని–బలముగ

"సవతి కొడుకువు హద్దుమీరకు
నీతల్లి చేసిన పూజాఫలమది
దాని కడుపున పుట్టిన నీవు
గర్భదరిద్రుడవని తెలియగవలె

నీకాభోగము పట్టవలె నన –
నాకడుపున మరి పుట్టియుందువు
నీకోరికది జరగనట్టిది
పోయి శ్రీహరి పాదముపట్టుము

శ్రీహరి తపస్సు చేసినచో నిక
నీకాభాగ్యము కలిగించునేమొ మరి!
దౌర్భాగ్యుడవు హద్దుమీరకు."
అనుచు చులకనగ ఈసడించెను

పసివాడైనా ధృవుని మనస్సు
గాయపడినది పినతల్లి తిట్లకు
తండ్రి మాత్రము చలించలేదు
వెక్కి వెక్కి – తా – నేడ్చెను ధ్రువుడు

"నిన్నెవ్వరును బుజ్జగించరు
నీ ఏడుపునకు కరగరిచ్చట
జాలిగ తండ్రి వంక జూచెను
ముఖము త్రిప్పుకొని తండ్రికూర్చొనె

అంతఃపుర పరిచారికలకును
బాధ కలిగినది రాణి ప్రవర్తన
వారిలో వారు గుసగుసలాడుచు
దురుసు తనముకు వంతనొందిరి

అవమాన భారము భరించలేక
పసిహృదయమ్మది గొల్లుమన్నది
తల్లివద్దకు పరుగునబోయి
ఒడిలోవాలెను – వలవలలాడుచు

కొంతసేపటికి తెప్పరిల్లెను
తల్లికి చెప్పెను జరిగినదంతా
తనయా! వింటిని ఆమె పలుకులు
అనగా ధ్రువుడు తల్లితొననె

విని మౌనముగా తండ్రి వుండెను
నా అవమానము పట్టనట్టుగా
ప్రవర్తించెనన – తల్లి పలికినది
దాసీకన్నను హీనము తాననె

తిరిగి పలికెను అనునయమ్ముగా
"తనయా! నీ పినతల్లి పలికినది
సత్యము వినుము కర్మల ఫలితము
అనుభవించుట జరుగుచుండును

పూర్వజన్మకృత పాపఫలితము
కష్టమ్ములు మరి అవమానములు
చిత్తక్షోభయు అనారోగ్యములు -
ఇతరులు - వాటికి బాధ్యులుకారు

ఆ బాధలవి తొలగి పోవుటకు
నీ పినతల్లి చెప్పినట్టుగా
చేయుటనీకు - యుక్తమైనది
శ్రీహరి పదముల నాశ్రయించవలె!

బ్రహ్మ స్వయముగా హరిసేవలతో
బ్రహ్మపీఠమును అధిష్టించెను
మీతాత గారగు మనువు - భక్తిగా
శ్రీహరి పరముగ చేసె యజ్ఞములు

నారాయణాను గ్రహము వల్లనే
భువిలో సుఖములు అనుభవించెను
ఆపై-సురలకు కూడా లభ్యముగాని
ముక్తినందెను మదిలో మరువకు

క్షీరసాగరకన్య - విష్ణు భక్తితో
సర్వలోకముల అధినాయకుడని
మదిలోనమ్మి - మంగళమూర్తిని
పూజించి - పతిగా పొందగలిగెను

సుర లెవ్వరును ఈయగలేని
దివ్య పథమును యిచ్చును శ్రీహరి
నీ దుఃఖమును అంతము జేసి
కోర్కెతీర్చెడిది నారాయణుడే!

కావున తనయా! సుస్థిర భక్తితొ
శ్రీహరి పదముల నాశ్రయించుము."
అనగా ధ్రువుడు అమాయకముగా
తల్లీ! ఎచ్చట ఆ హరి వుండును

ఆమాటలకు తల్లి - బాలుని
బుగ్గలు నిమిరి ముద్దు పెట్టుకొని
ఎక్కడ వెదకిన అక్కడ గలడు
ఒక్కడె శ్రీహరి - పెక్కుచోటుల

తపోధ్యానమున - కారడవులలో
ఏకాంత వాసమున మునిపుంగవులు
నిష్ఠగ తపమును ఆచరింతురు
నీవు అచటకే వెళ్ళవలెనయా!

ఎటులవుండును రూపమెట్టిది
అనగా - తల్లి ధ్రువునితొ పలికెను
ఎటుల నీవు మది భావించినచో
అటులే అగపడు - ఆగమ వినుతుడు

వెంటనె బాలుడు నిశ్చయించుకొని
దీవించమని తల్లికి మ్రొక్కెను
శ్రీహరి కరుణకు పాత్రుడవగుము
అని దీవించెను అశ్రునయనముల

గట్టి పట్టుదల మదిలోనున్నది
తల్లిమాటపై నమ్మకమున్నది
ఎందులకింక ఆలశ్యమ్మని
వడిగాసాగెను ధ్రువకుమారుడు

॥శ్రీ కృష్ణచరితము॥



## 12 నారదప్రవేశం

రాజ్యమువదలి - పొలిమేరదాటెను
నారదమౌని ఎదురువచ్చెను
నారాయణస్మరణతో కనుపించిన ఆ
దివ్యపురుషుని గాంచెను ధ్రువుడు

బాలకా! అని పలుకరించెను
నారదుడందురు అని చెప్పగను
భక్తిగ ధ్రువుడు వందనమిడెను
తల్లి చెప్పినది మీ విశేషము

నేటికి మీ దర్శనమైనది
అనగా ధ్రువుని విషయమడుగగా
తనకు జరిగిన అవమానము చెప్పెను
శ్రీహరి కరుణకు ప్రయాణమనెను

నవ్వుచు పలికెను - నారదుడంతట
పిన్న వయస్సున పట్టుద లేమిటి
అడవుల ఇడుములు భరించగలవా!
భగవధ్యానము తెలికయినదా!

అనగా పలికెను ధ్రువుడంతటను
పినతల్లి మాటతో గాయపడితిని
దానిని మించిన బాధలుండునా!
శ్రీహరి పదములు - బాధలు తీర్చవ!

అదిసరెగాని - సుఖదుఃఖములు
దైవసంకల్పము వల్లనె కలుగును
"స్వామీ! అది మరి నిజమే అయినను
నామది - ఆటలు పాటలు కోరదు

అంతఃపురముల రాజభోగముల
ఆలోచించదు నామనస్సు - విను
శ్రీహరి దర్శన కాంక్ష నిండిన
నాకు కష్టములు సుఖములేయగు"

తిరిగి పలికెను నారదమౌని
పరమయోగులు పట్టువదలక
ఎన్నో జన్మలు తపస్సు చేసిన
ఈశ్వర దర్శన మందక పోయిరి.

అట్టి శ్రీహరి అంత తేలికగ
నీకు దర్శనము యిచ్చున? వినుము!
నీ ప్రయత్నము విరమించి తిన్నగా
తండ్రి చెంతకు చేరుము శ్రీఘ్రమె."

సడలని దీక్షతొ పలికెను ధ్రువుడు
స్వామీ! మీరు ఎన్ని చెప్పినా
నామది నిశ్చయమది మారదయా!
అమ్మ చెప్పినది నమ్మితినేను

మహోన్నతమ్మగు దివ్యపథమది
శ్రీహరి పదములు అనినమ్మితిని
హరి భక్తులు మీరు - వెనుకడుగిడమని
బోధించుటది - వింతగనున్నది!

ఆమాటలకు నారదమహర్షి
ఆనందించెను ఆశీర్వదించెను
"దివ్యబాలకా! నీకీ కోరిక -
కలుగుట అది మరి శ్రీహరి ప్రేరణ!

నేరుగ నీవు - యమునానదికి
చేరి - అచ్చట దివ్య వనమది
మధువన మున్నది హరికి-ప్రియమది
అచ్చట నీవు ధ్యానము చేయుము

పావన యమునా తోయములందు
స్నానముచేసి - మధువనమందు
శ్రీహరి ధ్యానము చేయుచుండుము.
నివృత్తి మార్గము చూపించు-వనమది.

యమనియమాలను పాటించుచును
శ్రీహరి ధ్యానము చేయుచుండుము
వేదోచితమగు కర్మలు చేయగ -
వేదాధ్యయనము - లేదు కనుకను

దర్భలపైన మృగ చర్మముపై
స్వస్తికము మొదలగు యోగాసనముల
మూడు ఆవృత్తుల ప్రాణాయామము
చేయుచు - దీక్షగ అందులొ తిరిగి

ఇంద్రియ-ప్రాణ-మనో సంబంధపు
మలినములన్నీ దగ్ధము చేసుకు
చిత్త భ్రమణమును అరికట్టుకుని
మనస్సు స్థిరముగ - నుంచుకోవయా!

అనుచు నారదుడు ధ్రువుని కంతట
ఆసనాల స్వరూపమ్మును
ప్రాణాయమము చేయు విధానము
తెలియ జెప్పెను - త్రోవచూపెను

అభిమానముగా నారదమహర్షి
జప విధానముకు తగినట్టుగను
సంపుటీకరణ విధానమ్ముగా
నారాయణ మంత్రమ్ము నొసగెను

ద్వాదశాక్షరమైన మంత్రము
నారాయణమంత్రమ్ము నంతట
ఉపదేశించెను ధ్రువునికి ప్రియముగ
ఓంకార సంపుటీకరణము - చెప్పెను

"ఈ మంత్రమ్మును జపించుకొనుచు
నారాయణుని దివ్య రూపమును
నీమదిలో భక్తిగ - ప్రతిష్ఠించుకో!
ఆయన రూపము అమోఘమైనది

దయాసింధువు - పద్మనయనుడు
మకరకుండల కాంతులు వెలుగగ
చక్కని నాసిక ఎర్రని పెదవులు
తీర్చిదిద్దిన కనుబొమలుండును

దివ్య ప్రభలతో వెలిగే ముఖము
శ్రీకారమ్ముగతోచు కర్ణములు
కస్తురితిలకము అభయమునిడునటు
వెలుగుచుండునా ముఖపద్మమున

శంఖము పోలెడి కంఠము కలిగి
అభయము నొసగే పొడవగు కరములు
బాలభాను ప్రభ తక్కువ అనెడి
కాంతితొ మెరిసే రత్నమకుటము

విశాలవక్షము శ్రీవత్సమ్ముతొ
వనమాలతొ మరి మణిహారములతొ
పీతాంబరముతొ పాదమంజరుల
భువనమోహనము శ్రీహరి రూపము

వెన్నెలకురిసే మందహాసము
ఆశ్రితపోషకుడా పరమాత్మ
పురుషోత్తముడు సర్వవందితుడు
సర్వేశ్వరుడు లోకనాయకుడు

సుగుణాలగని సుందరమూర్తి
గాంచినంతనే తాపము తీర్చే
దయాసముద్రుని వరదుని మదిలో
ప్రతిష్ఠించుకొని జపించవలెను

ఏ మంత్రమైనను ఏకాగ్రతతో
ఏడురోజులు ధ్యానము చేసిన
ఆకాశ గమనులను చూచెడి శక్తి
కలుగును వినుము-మంత్ర బలమది

తులసీదళములు పూలు మొదలగు
పవిత్రమైన సంబారములు
సమకూర్చుకొని నారాయణ మంత్రము
జపించవలెను సిద్ధికలుగును

మన్నుతొ గాని రాయితొ గాని
లేదా కట్టెతొ - స్వామి రూపమును
ఏర్పరచుకొని శుచిగా భక్తిగ
మితభాషిగ మరి మితాహారముతొ

శ్రీహరి గుణముల కీర్తించుచును
అవతారమ్ముల దర్శించుచును
సర్వక్రియలను శ్రీహరి పరముగ
అర్పణచేసిన కోరిక తీరును

ఆనందముతో పొంగెను ధ్రువుడు
నమస్కరించి దీక్షవహించి
మునిజన నిలయము మధువనమ్మునకు
సాగిపోయెను - దృఢచిత్తముతో

నారదు డంతట ఉత్తానపాదుని
పలుకరించగా నగరికి వచ్చెను
అర్ఘ్యపాద్యముల పూజలనంది
ఉచితాసనమున ఆసీనుడయె

విషయము తెలిసియు నారదమహర్షి
రాజును అడిగెను-దిగులుతొ నుంటివి
కారణమేమి అనగానంత
విషయముతెలిపెను ఉత్తానపాదుడు

స్త్రీలోలుడనై - పసిహృదయమ్మది
గాయపడినను ఉపేక్షించితి
అడవుల తపముకు సాగెను ధ్రువుడని
వింటిని నేను కలవరమదియే!

ఘోరాటవిలో ఆ పసికందును మరి
ఏమృగమో - తా - భక్షణచేయునొ!
అనగా పలికెను దేవమునీంద్రుడు
రాజా! ధ్రువునికి రక్షణ శ్రీహరి

సర్వలోకముల అధినాయకుడు
అన్నివిధములా తన భక్తుడగు
ధ్రువుని - చల్లగా కాపాడునయా!
కారణ జన్ముడు దివ్యబాలకుడు

శ్రీహరి భక్తితో ఆయన చలవతో
అఖండమైన కీర్తిని పొంది
అమోఘమైన వరములు పొంది
నీ యశస్సును పెంచును రాజా!

తనయుని భవితకు ఉత్తానపాదుడు
ఆనందించెను మదిలో ఎంతో
అయినా మమకారమ్ము వదలక
తనయుని తలచుచు గడపసాగెను.

❋❋❋ ॥శ్రీ కృష్ణచరితము॥

## 13 ధ్రువుని తపస్సు

కరుణాధాముని - భక్తవరదుని
కరుణపొందగా కఠోర దీక్షతో
కన్నులలో హరి రూపము నింపి
హృదిలో నామము స్మరించుచుండెను

ఆపై మనస్సు బంధించి అంతట
ఊపిరి పట్టి - ఒంటి కాలిపై
శిలాప్రతిమలా నిలబడి - ధ్రువుడు
శ్రీహరి తపమును చేయసాగెను

మూడు రోజులకు ఒక్కతడవయే
రాలిన పండు - ఆరగించుచు
నెల రోజులు అట చేసినపిమ్మట
ఆరురోజులకు ఒక్కమారునే

ఆవిధముగను దేహస్థితిని
లక్ష్యపెట్టక అకుంఠితముగా
నారాయణ మంత్రమ్ము జపించుచు
మనఃపీఠమున - ప్రతిష్ఠించుకొని

రాలిన ఆకులు-తృణములు తినుచు
విష్ణుధ్యానమున నుండెను ధ్రువుడు
ఆపై మరియొక నెల గడవగను
తొమ్మిది దినముల కొక్క తడవయే

తపము చేసెడి ధ్రువుని దీక్షకు
మూడులోకములు కంపించినవి
తపోశక్తితో నిలచిన బాలుని
బరువు భరించక - క్రుంగె వసుంధర

ఆకలిమంటను చల్లార్చుచును
అటుల పెంచె మరి పన్నెండు రోజులకు
అటుల నాలుగునెలలు గడవగా
దీక్షను పెంచి తపము చేసెను.

కరివరదుడు - తా - కదలెనొక్కపరి
జగములన్నియు కంపించినవి
లోకపాలకులు తల్లడిల్లిరి
శ్రీహరి సన్నిధి కొచ్చిరివారు

భక్తిగ స్తోత్రము చేసి పలికిరి
శరణుశరణని పదముల బడిరి
లోకమ్ములను కావగవేడిరి
ప్రళయమ్మును తప్పించగ కోరిరి

అభయమునిచ్చి శ్రీహరి పలికెను
ఉత్తానపాదుని - వంశవర్ధనుడు
ధ్రువుడు తపనతో నాపై గురితో
చేయుచునున్న తపోఫలితమిది

లోక క్షేమము కోరిన నేను
తపోఫలమది కోరిన వరములు
ఒసగుటె యగును - కావున నేను
బాలుని తపమును మాన్పించెదను

అంతట విష్ణువు ఖగపతినెక్కి
మధువనమునకు బయిలుదేరెను
తీవ్రతపమున మునిగిన ధ్రువునికి
ఆవేదన పెరిగెను హరిని గాంచగా

తండ్రీ! నీదయ కలుగుట ఎట్లు
నాకు తెలిసిన త్రోవలొ నేను
చేసెడి తపము తక్కువాయెనా?
అనుచు ఏడ్చుచు కనులు తెరచెను

ఆశ్చర్యముగా లక్ష్మీపతి అట
దర్శనమిడెను కన్నుల ముందర
దివ్యమంగళ మూర్తిని గాంచెను
చక్రధరుడు అట ప్రత్యక్షమయ్యెను

తననే తాను నమ్మలేకను
మదిలో తిరిగి వెదకెను స్వామిని
కనబడలేదు - కానీ మూర్తి
కనబడె - కన్నుల ముందుగ తనకు

ఆనంద పరవశము అలలై పొంగెను
మాటలు పలుకని స్థితిలో నుండెను
కన్నులలో తన పద్మాకరుని
పాదమంజరుల పూజను చేసెను

ఆస్థితి గాంచిన రమాధవుడట
శంఖముతో - తా - స్పృసించె బాలుని
ఆస్పర్శతొ మరి వేదశాస్త్రముల
పాండిత్యమ్ము నిండెను ధ్రువునిలో

అంతరంగమున ఎగసిన అలయది
జాలువారెను తీయని స్తుతిగా
అచేతనముగా పలుక జొచ్చెను
ఆనందసీమలో విహరించుచును

"పాహి పాహి! ఓ పన్నగశయనా!
పరుగునవచ్చే పరమదయాకర!
పతిత పావనా పావనచరితా!
పలుకుల నిన్ను పొగడగ వశమా!

పాపరేనిపై పవ్వళించితివి
పాపరేనిపై నాట్యమాడితివి
పాముల పగర వాహనమైనది
పసివాడనే పొగడగ వశమా!

నా ఆత్మయందున నెలకొని యున్న
చిద్రూపమది జన్మతరించగ
సాకారముగా దర్శించితిని
నీలో కలిసే వుంటిని స్వామీ!

అనుగ్రహించి నన్ను తిరిగి నువు
ఈ ప్రపంచములోనికి వదలుము
ఒక్కడివైనను మహదాది శక్తులతొ
మాయా శక్తితొ పరిపాలింతువు

జీవుల నుందువు ఆత్మశక్తిగా
కట్టెలొనున్న అగ్ని తీరుగా
కనబడకుండగ నడిపించెదవు
సాధనతో నిను గాంచగలుగుదురు

జనన మరణముల కారణుండవు
భక్తుల కల్ప వృక్షము నీవు
గుణత్రయములలొ చిక్కిన జీవుడు
దేహములో సుఖదుఃఖములందును

నీ భక్తులకు నరకము వుండదు
అచ్చట కూడా సుఖాను భూతియగు
నీసేవల ఫలితము అనంతమయ్యా!
అందుకె నీవు అనంతుడవు కద!

స్వర్గసుఖములు తలంచుకొనుచు
విజ్ఞతలేని కర్మలు చేయగ
దుష్కర్మలుగా పరిణమించగ
యమకింకరులకు దొరికిపోదురు

నీ భక్తులతో చెలిమి కలుగునటు
అనుగ్రహించుము ఆశ్రితపాలా!
నీ గుణకీర్తన చేసుకొనుచును
ఆనందనృత్యముతో జీవించెద

నిజముగ నీపై భక్తి కలిగిన
నీపద సేవానురక్తి కలిగిన
దారాపుత్ర – ధన భాగ్యములు
మరచిపోదురు అదియొక భాగ్యము

పంకజాక్ష – ఓ – మునిజనవందిత!
సాదుజనుల హృది నీ నివాసము
సకలజీవులలొ నెలకొని యుండెడి
విరాడ్రూపమును గాంచితి స్వామీ!

శబ్దాది క్రియలలో అందనట్టిది
శోకవిదూరము చిదానందమగు
బ్రహ్మస్వరూపము దర్శించలేదయా!
ఎన్నటికిత్తువొ అందటి భాగ్యము

ప్రళయకాలమున విశ్వమునంతయు
ఉపసంహరించుకు శేషపాన్పుపై
యోగనిద్రలో నిర్వికారముగ
నిద్రించెడి మూర్తికి వందనమిదిగో!

నాభికమలమున నాల్గు ముఖముల
బ్రహ్మదేవునికి జన్మనిచ్చిన
దివ్యజనకుడవు విశ్వజనకుడవు
వీతరాగుడవు – గుణరహితుడవు!

జీవుల ఆత్మవు సర్వజ్ఞుడవు
క్షేత్రజ్ఞుడవు ప్రధాన దైవము
కావున గుణములు లొంగియుండును
జీవులకంటె - విలక్షణుండవు

ఆది అంతములు లేనటువంటి
ఒకే పదార్థము అన్నటు వెలిగెడి
నిర్వికారుడవు పరబ్రహ్మవు
పాదములంటి ప్రణామమిదిగో!

సర్వకర్మల ఫలితము నీవని
ధ్యానించువారు నిష్కామ కర్మలు
అన్ని ఫలములను-మించిన ఫలము
నీపదసేవ అని తలంతురు"

భక్త ధ్రువుడు అటచేసిన స్తుతికి
ఆనందించెను అభయ ప్రదాత
నీమదిలో కోరిక దుర్లభమైనది
అయినా మెచ్చి అనుగ్రహించెద

నేటినుండి మరి అరువదివేల
సంవత్సరములు గడిచిన తదుపరి
అట్టి పదవి మరి లభించగలదు
ధ్రువక్షితి - యని-అందురు దానిని

కట్టుకొయ్యకు చుట్టు తిరిగెడి
గోవుగ ఆ ధ్రువపథము చుట్టున్సు
తారలు ధర్ముడు - అగ్ని కశ్యపులు
శుక్రుడు - సప్తర్షులు ప్రదక్షిణింతురు

ఆ ధ్రువపథమది ప్రళయకాలమున
నశించ నట్టిది శాశ్వతమైనది
తేజోవిరాజితమైనట్టిదది
అనంత ఖ్యాతికి నెలవైనదది

ఆధ్రువపథము వచ్చువరకును
నీ తండ్రి తపముకు వెడలినంతనే
సింహాసనము అధిష్టించుము
ధర్మపాలన చేయుచుందువు

నీ సోదరుడగు ఉత్తముడు అట
వేటకు వెడలి మరణించగను
అతనిని వెదుకగ ఆతనితల్లి
అడవికి వెడలి - కార్చిచ్చులొ పడును

యజ్ఞమూర్తినగు నన్ను భక్తిగా
పూజించెదవు యజ్ఞమ్ములునెరపి
ఐహిక సుఖములు పూర్తిగ పొంది
ధ్రువక్షితిని నువు చేరుకుందువు

నారాయణుని అనుగ్రహమ్ముతొ
దివ్యవరములు పొందిన ధ్రువుడు
సంతృప్తి కలుగక నగరముకేగెను
అనుచు విదురునకు మైత్రేయుడు చెప్పగ

ఎంతటి తపమో చేసిన గాని
లభ్యముగాని మహోన్నత పదవి
పొందియు ధ్రువుడు ఆవిధముగను
అసంతృప్తితో నుండె నెందులకు?

అను సందేహము విదురున కొచ్చెను
అడుగగనంత మైత్రేయుడు తెలిపెను
తల్లిదుర్భాషలు కారణమై మరి
తపోదీక్షతో హరిని గాంచినను

భవబంధములను త్రెంపగచాలిన
ఈశ్వరదర్శనమందియు కూడ
అస్థిరమైన కోర్కెను కోరితి
దురదృష్టము పరమమూర్ఖత

ముక్తిని కోరగలేక పోతినని
మదిలో చింత ధ్రువుని కున్నది
అవకాశమ్మది విడచుకుంటినని
అసంతృప్తి అది వదలకపోయెను

నామతి అటుల చలించుటకును
కారణమా దేవతలగుదురు
వారిపదవులకు ముప్పు వచ్చునని
నామనస్సు నటు మార్చి వేసిరి

సనకసనందన యోగిపుంగవులు
ఎందరెందరో మహాయోగులు
జన్మజన్మల యోగ దీక్షతో
లభించగలిగెడి దివ్యదర్శనము

నారదమహర్షి హెచ్చరిక మరచితి
నేను ఈశ్వరుడనని మరచితిని
తమ్ముడు నాకొక శత్రువు అనుచు
అవమానము అని మదిలోనమ్మి

ఆరుమాసముల తపస్సుతోనే
దర్శించగలిగిన సుకృతమ్మది
కలిగిన నేను - కాంచన చేలుని
గాంచియు - తెలివిని కోల్పోయితిని

అస్థిర భోగములడిగితి హరిని
ఆయువు తీరిన రోగికి - ఔషధము
ఎంతటి పనిని చేయునో - అటులే
నిరర్థకమ్మగు సుఖములడిగితిని

అనుచు జరిగినది తలంచుకొనుచు
మూర్ఖత నిండి ప్రవర్తించితిని
అను విచారము వెంబడించగా
రాజ్యము చేరెను భక్తధ్రువుండు.

॥శ్రీ కృష్ణచరితము॥



## 14 ధ్రువుడు నగరమునకు వచ్చుట

ధ్రువకుమారుడు వచ్చుచున్నటు
వార్తాహరుడు రాజుకు చెప్పగ
ఆశ్చర్యములో మునిగెను రాజు
సజీవమ్ముగా నుండెన బాలుడు

కారడవులలో క్రూరమ్మృగమ్ముల
బారిపడకను బ్రతుకుట సాధ్యమ!
అనుచు రాజు ఆశ్చర్యపడగను
నారదమహర్షి మాటలు స్ఫురించె

వెంటనె రాజు వార్తాహరునకు
విలువగు బహుమతులొసగెను ప్రీతిగా
ఆలసించక రథమును తెమ్మని
భార్యలతో – తా – నెక్కెనరదము

మంగళవాద్యపు మోతలెగయగా
హితులు పురోహిత బంధుజనమ్ము
అనుసరించగా వివాహమ్మునకు
సాగెడి ఆనందముతో – సాగెను

దివ్యతేజమున వెలుగులు చిమ్మే
భక్తధ్రువుని వారందరు గాంచిరి
రథమును దిగి ఆ రాజుపరుగిడి
తనయుని గట్టిగ కౌగలించుకొనె

ఆనందబాష్పముల పసికందు శిరస్సును
తడిపివేసెను ఉత్తానపాదుడు
గుండెకు బాలుని అదుము కొనుచును
బుగ్గలు నిమిరి పరవశించెను.

ఆనందవార్నిధిని తేలెను ధ్రువుడు
మునుపెన్నడు–తా–నెరుగని ప్రేమ
తీయగ ధ్రువుని హృదయముకదిపెను
కంటినీటితో అభిషేకించెను

వినయసంపదలు ఒలక పోయుచు
తండ్రిపాదముల నమస్కరించి
దీవనలంది తల్లులిద్దరికి
వందనమ్ములిడి ఆశీస్సులందెను

అవమానపు మాటల గాయపరచిన
తనపినతల్లి అన్నీ మరచి పోయిమరి
అభిమానమును కురిపించుచును
దీవించినది దివ్యబాలకుని.

విష్ణుభక్తితో పండిన ధ్రువుని
ఆదరింతురు పగవారైనను
అంతటి బలిమి హరిభక్తికున్నది
అనుచు విదురునకు చెప్పె మైత్రేయుడు

తమ్ముడు ఉత్తముడంతట వచ్చి
అన్నగారికి వందనమిడగా
ప్రేమగ ధ్రువుడు లేవనెత్తి తన
హృదయమ్మునకు జేర్చుకొనెనట

సునీత తనయుని కౌగలించుకొని
పుత్రోత్సాహము నందుకొనగను
గాంచిన పౌరులు బంధుహితులట
ఆనందబాష్పముల నిలబడి చూచిరి.

వారందరును సునీతతోను
పలికిరి ప్రియముగ ఓమహరాణీ!
నీ విష్ణుసేవల ఫలితము – తనయుడు
చిరకాలము ఈ భువినేలును విను

భద్రగజముపై కూర్చొన బెట్టుకు
ఉత్తానపాదుడు నగరము చేరెను
ధ్రువ పట్టాభిషేకమ్మునకు
దివ్యశోభల వెలిగెరాజ్యము

మంగళవాద్యపు సవ్వడులెగయగ
స్తోత్రపాఠములు శుభముగ వినబడ
మందగమనమున భద్రగజమ్ము
రాజమార్గమున సాగుచుండగా

పౌరకాంతలు సౌధమ్ములపై
నిలబడి చూపుల శుభములు కలిపి
సుమవర్షము కురిపించిరి అంతట
పుత్రప్రేమతో దీవనలొసగిరి

తేజోరాసిగ వెలుగులు చిమ్మే
ధ్రువుని తేజము మరింత పెరగగ
రాజ్యమకుటము అలంకరించిరి
దేవేంద్రునిరీతి భాసిలె ధ్రువుడు.

తనయుని రాజుగ అభిషేకించి
తపోదీక్షకై ఉత్తానపాదుడు
తపోవనమునకు సాగిపోయెను
ప్రజారంజకము ధ్రువుని పాలన

శింశుమార ప్రజాపతి కూతురు అయిన
భ్రమ–అను కన్యను ధ్రువమహరాజు
పరిణయమాడెను శాస్త్రవిధిగను
కల్ప–వత్సరులు–తనయులు కలిగిరి

వాయుతనయ యగు ఇలను–భార్యగా
గ్రహించె ధ్రువుడు ఆమె సంతతి
ఉత్కల అనెడి కుమారుండును
అందాల రాశియగు కుమార్తె కలిగిరి.

ఉత్తముడు తను అవివాహితుడు
అడవికి వేటకు వెడలి అచ్చట
యక్షునొకనిచే చంపబడగను
వార్తను తెలిసి సురుచి వెదకుచు

దుఃఖభాజయై విలపించుచునామె
అడవిలొ వెదకుట ఆరంభించగ
హఠాత్తుగా కార్చిచ్చు ఎగయగ
ఆహుతియైనది ఆయిల్లాలు.

యక్షుని చేబడి తమ్ముడు కూలెను
అనెడి వార్తయది వినగా ధ్రువుడు
అమిత కోపము ఎగసిపడగను
శస్త్రాస్త్రములతొ రథమును ఎక్కి

అతి వేగముగా అలకాపురమున
అడుగుబెట్టెను నగరమంతయు
అల్లకల్లోలము అయిపోయినది
శంఖధ్వనితొ అట కలవరపడిరి

అబలలు భయపడి పరుగులు తీసిరి
ఉత్పాతమ్మది తెలియక పోయిరి
యక్షసైనికులు తెలివి తెచ్చుకొని
యుద్ధసన్నాహము చేసుకు నిలచిరి

॥శ్రీ కృష్ణచరితము॥



## 15 ధ్రువుడు యక్షులతో యుద్ధము చేయుట

పదమూడు వేలగు సంఖ్యలో నంత
యక్ష సైనికులు ధ్రువునెదిరించిరి
మహోగ్రుడైన ధ్రువుడంతటను
నిశిత శరములు ప్రయోగించెను

తడవకు మూడు నారాచములు
సంధించి వదలగ వారందరును
క్షణకాలమ్ము నివ్వెరపోయిరి
తిరిగి ధైర్యము పుంజుకునిలచిరి

ఎడతెరపి లేకను శరపరంపర
యక్షసైనికులు విడచుచుండిరి
నింగిని సిద్ధులు దృశ్యము గాంచి
కలవరపడిరి ధ్రువుని గురించి

బాణవర్షములొ ధ్రువుడు చిక్కుకొని
పోరుచునున్న సమయము గాంచి
మరింత ఉత్సాహముతో యక్షులు
వారి శరముల జోరుపెంచిరి

అంతట చీకటి అలముకొన్నటుల
నింగి కనబడగ ధైర్యముతోను
సూర్యునిమాదిరి ధ్రువుడు నేర్పుగా
ఆ చీకటి ఛేదించి నిలచెను

యక్షసైనికుల ఆయుధాలను
నిశిత శరముల రాల్చెను ధ్రువుడు
ఆశరనైపుణ్యము చూసిన సిద్ధులు
పోరున ఇంద్రుని మించెను అనిరి

తెగిన కంఠములు కరచరణమ్ములు
దొర్లెడి రత్నకిరీటమ్ములు
మణికంకణములు రక్తపుటేరున
తేలియాడెను భీభత్సముగా

చావగ మిగిలిన కొందరు యోధులు
పలాయనమ్ము చిత్తగించిరి
యక్ష - గుహ్యకులు మాయలయందు
రాక్షసులను మరి మించిపోదురు

అంతటిలోన రాక్షసమాయ
చిత్రముగానట కమ్ము కొన్నది
రథము ముందుకు కదలక పోయెను
అచేతనుండై నిలచెను ధ్రువుడు

నింగినుండి అట పిడుగులవర్షము
భీభత్సముగా కురియజొచ్చెను
ఆయుధాలు మరి కొండలు రాలెను
కొండచిలువలు భీకరమృగములు

నింగినుండి అట కురియుచున్నవి
అంతటిలోన దుర్గంధముతో
రక్తమాంసములు కురియుచున్నవి
ఆ మాయతొ ధ్రువుడు - నిశ్చేష్టుడయె

ఆ సమయములో మునులు వచ్చిరి
మను-మను-అనుచు దీవనలొసగిరి
విష్ణుదేవుని నామస్మరణతో
మృత్యువునే మరి గెలవవచ్చును

తెలివి తెచ్చుకో శ్రీహరి భక్తుడ!
విష్ణుశక్తితొ పోరాడుమయా!
అనగా ధైర్యము తెచ్చుకు నిలబడి
నారాయణాస్త్రము వదలెను ధ్రువుడు

రాక్షసమాయ మాయమైనది
రిపుల తలలవి నేలకు రాలెను
కపాలమ్ములు పేలిపోయెను
రాక్షసులందరు భస్మమాయిరి

తీవ్రమైన ఆ ధ్రువబాణమునకు
తల్లడిల్లిరి గుహ్యకాదులు
రణభూమిలొ మరి నేలకూలగా
స్వాయంభువుడు మునులతొ వచ్చెను

ఆగుము తాతా - అనుచు ఆపెను
మారణకర్మము నాపగ కోరెను
విడిచి పెట్టుము నీక్రోధముననె
పాపమూలము కోపమె అనెను

నీకోపముతో మారణకాండ
ఎంతో జరిగెను ఆపుచేయుము
ఒక్కతమ్ముని కొరకై నీవు
ఎంత మందిని బలిచేసితివో

మనవంశమునకు తగని పనియిది
వేలమంది మరి అసువులు వీడిరి
హరిభక్తులు అతి సాధువులయ్యా!
హరిని మెప్పించిన అనఘుడవీవు

మహోన్నతమగు పదివిని - శ్రీహరి
ఒసగెను నీకు - అసమాన్యుడవు
భాగవతులలో అగ్రగణ్యుడవు
సమ దృష్టియది కావలసినది

మహాత్ముల ఎడ ఓర్పుచూపుచు
సమానులతో స్నేహము నెరపుచు
అల్పులయందు కనికరము చూపుచు
నడచిన మెచ్చును - నారాయణుడు

భగవదనుగ్రహము పొందిన వాడు
ప్రకృతి వ్యామోహమ్ములు త్రెంచుకు
లింగశరీరము వదలించుకొని
బ్రహ్మానందము నందుకొనునయా!

కనబడు విశ్వము ఈశ్వరునిఎడ
ఆకర్షింపగ బడును - విను మిది
అందు ఈశ్వరుడు నిమిత్త మాత్రుడు
పంచభూతములు ఈశ్వరుమాయ

వాటితొ పుట్టెను స్త్రీపురుష బేధములు
సృష్టి-స్థితి-లయ మాయని లీల
అట్టివానికి స్వపరమనెడి
భిన్నదృష్టి యది ఉండదు వినుము

కర్మలబట్టి వచ్చెడి ప్రాణులు
నడచుచుండును - అస్వతంత్రములు
సర్వమయుండు ఈశ్వరదేవుడు
జీవులవృద్ధి క్షయముల కందడు

జీవునిగా తను కట్టుబడినటు
కర్మస్వరూపము తానై కనబడు
అట్టి ఈశ్వరుని ప్రకృతి అనియు
కర్మ - కాల - దైవ-కామమందురు

సర్వస్వరూపుడు - కర్మసాక్షియు
రెండూ ఒకరే - ఈశ్వరదేవుడు
లోపలవెలుపల సృష్టియు తానై
సర్వశక్తి సంపన్నుడె - శ్రీహరి

అట్టి ఈశ్వరుని దివ్యలీలలు
బ్రహ్మాదులే - తెలియగ లేరు
స్థితిలయములవి ఈశ్వరు లీలగు
కనుక నీసోదరుని చంపిన దెవరు?

భూతాత్మకుడు-భూతేశుడు హరియే
భూతభావనుడు సర్వేశ్వరుడా పరాత్పరుండే!
మాయతొ సృష్టి స్థితి లయమొనర్చునాతడు
గుణక్రియలకు అంటక నిలచును

ప్రజాపతులను - నియమించె నీశుడు
ఆయన ఆజ్ఞతొ నడవగవలెను
స్వతంత్రులు వారెన్నడు కాదు
సర్వస్వతంత్రుడు ఆపరమేష్ఠి

చిన్నతనములో తీవ్రనిష్ఠతో
శ్రీహరి కరుణచె దివ్య పదవిని
వరముగ పొందిన భాగవతుడవు
సమదర్శనుడవు - కోపమేలయా!

కోపఫలితము గుహ్యాకాదులను
చంపిన దానికి - కుబేరాపరాధము
శివసఖుడైన - కుబేరుని నీవు
ప్రసన్నునిగా చేసుకోవయా!

అంతటిలోన యక్షాది జగణములతొ
కుబేరుడటకు రాగా - ధ్రువుడు
రథమునుదిగి - తా - నమస్కరించెను
కుబేరుడు గని - సంతోషించెను

పలికెను ధ్రువునితొ ధనపతి అపుడు
నీతాత మాటను - మన్నించితివి
పగను విడచి నువు ప్రణామమిడితివి
ప్రసన్నుడను అయితిని నేను!

నీ తమ్ముని చంపెను కాలమే - విను
యక్షులు ఎంతమాత్రము కాదు
అటులే యక్షుల చంపెను కాలము
నీవు మాత్రము కానేకాదు -

కావున నేను యక్షుల కొరకు
తమ్ముని కొరకై నీవును కూడా
విచారించుట అవివేకమగు
కాలముఅనగా ఈశ్వరుడేకద!

నేను - నీవు - అనెడి భావన
కర్మవిహితమగు సుఖదుఃఖములకు
నెలవై ఆత్మతొ కూడిన యట్టి
దేహమ్మునకు అనుభవమగును

అట్టిభావన మదిలో వదలి
సర్వప్రాణుల ఆత్మగ వెలిగే
ఈశ్వరదేవుని ప్రార్థించుమయా!
కోరిన వరము ఒసగెదనడుగుము

ధ్రువుడు భక్తిగా ప్రణామముంచి
అజ్ఞానమును అంతము చేసి
ఆత్మవికాసము భగవధ్యానము
స్థిరముగ నుండగ-అనుగ్రహించుడు!

ఆ విధముగను వరమును పొంది
యక్షకిన్నరుల ప్రశంసలంది
రధ మధిరోహించి నగరము చేరి
రాజ్యపాలనము చేయసాగెను.

ధ్రుఢమగు భక్తితొ ధ్రువరాజంతట
యజ్ఞయాగములు నిర్వర్తించెను
భూరిధక్షిణలు భూసురుల కిడె
భక్తి - రక్తిలో పరమాత్మను గనుచు

ప్రజాపాలనలొ మిన్న నిపించుచు
ధర్మార్థకామములు యధోచితముగా
సాధించుచును పుణ్య కర్మలతొ
సుఖభోగములను అదుపుచేసెను

పాపపంకిలము క్షాళన చేసే
పరమాత్ముని భక్తిలొ అగ్రగామిగా
యజ్ఞయాగముల సాటిలేనటు
ఆనందధాముని - హరిని గాంచుచు

అరువదివేల వత్సరమ్ములు
నిరాటంకముగ రాజ్యమునేలి
తనయునికంత రాజ్యభారమిడి
పట్టాభిషిక్తుని చేసెను తృప్తిగ

ఐహిక జీవితవలయము నుంచి
బయటపడుటకు నిశ్చయించుకొని
సర్వసంగపరిత్యాగము చేసి
బదరికావనము చేరెను ధ్రువుడు

సుస్నాతుడయి పద్మాసనమున
ప్రాణవాయువును బంధించి - అంతట
కనులు మూసికొని హృదయసీమలో
శ్రీహరి పదములు ప్రతిష్టించుకు

నిశ్చల భక్తితొ ధ్యాన నిష్టతో
దేహభావన పూర్తిగ వదలి
పులకిత దేహము హరి అర్పణగా
నిర్వికారుడై యోగము నుండెను

అంతట అచటికి దివ్య విమానము
వెలుగులుచిమ్మెడి కాంతిపుంజముగ
పూర్ణశశాంకుని ధిక్కరించునట
ధగధగలాడుచు నేలకుదిగెను

చతుర్భుజములతొ నీలవర్ణులు
శ్రీహరిభక్తులు యిద్దరు దిగిరి
మకుటమ్ములతో మణిహారములతొ
మణికుండలముల శోభిలుచుండిరి

గోవింద నామము చేయుచుండిరి
ఆనామమునకు ధ్రువుడంతటను
బాహ్యస్మృతికి-తా-వచ్చెను వెంటనె
లేచినిలబడి నమస్కరించెను

సునంద - నందులు వారిద్దరును
విష్ణుభక్తులు చిరునగవులతో
భాగవత రత్నమ! - శుభమని పలికిరి
తిరిగి పలికిరి యోగి ధ్రువునితో

విష్ణుదేవుడు అజ్ఞాపించగ
నినుగొని పోవగ వచ్చితిమయ్యా!
పసివయస్సున పరంధాముని
పదములునమ్మిన - పుణ్యాత్ముడవు

విబుధుల మన్ననలందునట్టిది
తారాగ్రహములు ప్రదక్షిణించెడి
జగద్వందితము అలభ్యమైన
విష్ణుపథము నీకమరినదయ్యా!

దయతో నీవు విమానమెక్కుము
అనగా ధ్రువుడు పులకరించెను
సుస్నాతుడయి అచటి మునులకు
వందనముంచి ఆశీస్సులనందుకు

విమానముకు ప్రదక్షిణించెను
మనస్సులోనే హరిని చూచుచు
విమానమునకు దగ్గర చేరి
అధిష్టించగా నున్నసమయమున

ధ్రువుని తనువది బంగరుమయమయె
దేవదుందుభులు మ్రోగె నింగిని
పుష్పవర్షమును కురిపించిరి సురలు
కిన్నర గంధర్వులు గానము చేసిరి

ఆ సమయములో మదిలో కొంత
దిగులుకనబడ వదనములోన
అదిగ్రహించిన విష్ణుదూతలు
మీతల్లి గురించి వంతవలదిక

ముందుసాగెడి విమానమ్మున
నీ జనని కూర్చొనెను అనగా ధ్రువుడు
ఆనందముగా విమానమెక్కెను
సాగెను - రెండు విమానమ్ములు

ముందు సాగెడి తల్లిని గాంచెను
తల్లి తనయుని చూసినదంత
ఆనంద బాష్పములు నిండెను కన్నుల
తల్లిని తరింప జేసెను తనయుడు

వేగముగా ఆ విమానమ్ములు
శ్రీహరి పదముల చేరి ఆగెను
ధ్రువపథమది దివ్యపథమగు
ముల్లోకముల వెలుగునింపునది

ఆత్మశుద్ధులు భూత హితులును
శ్రీహరికెంతో ప్రీతిపాత్రులు
సుశ్లోకులు మాత్రము చేరగలిగినది
జ్యోతిశ్చక్రము ప్రదక్షిణించును

విష్ణు భక్తులలో అగ్రగామియగు
ధ్రువునకు కలిగెను అంతటి భాగ్యము
ప్రచేతసులయాగములోన
దానిని పాడెను నారదమహర్షి

అనుచుచెప్పెను మైత్రేయుండు
విదురా! వినుము ధ్రువచరిత్రము
పరమపావనము సాధుసమ్మతము
కీర్తి ప్రదము మరి స్వర్గధామ మిదు

ఆయుర్భాగ్యము పెంచును చరితము
పాపహరణము - శుభప్రదాయిని
మనోవికాసము కలిగించునది
ధ్రువపథమునకు చేర్చగలిగినది

శ్రద్ధాభక్తుల రెండు పూటలా
పూర్ణిమా అమావాస్యలయందున
ఆదివారము-శ్రవణ నక్షత్రమందున
సంధ్యాసమయము నందున మరియు

సూర్యసంక్రమణ పర్వసమయముల
నిండుసభలలో మరి-వినిన చదివినా
అన్ని కష్టములు విడిపోయి-అంతట
మనశ్శాంతి సౌశీల్యమ్ములందును

తేజస్సుకోరిన సమకూర్చు చరితము
వివేకమ్మది కోరిన దొరకును
తత్వజ్ఞానము నిష్కామున కిడు
దీనిని చెప్పిన-దైవానుగ్రహమందును

అటుల మైత్రేయుడు విదురనకచట
తెలియబరచెనని శుకమహర్షి
పరీక్షిత్తునకు తెలిపెననుచును
సూతుడు తెలిపెను శౌనకాదులకు

అంతట పలికెను విదురుడు భక్తిగ
స్వామీ! నీవు అనుగ్రహించి
అందించెడి హరి లీలామృతము
ఎంతగ్రోలినా తనివితీరదు

నారదమహర్షి ధ్రువచరిత్రను
ప్రచేతసుల యాగమునందు
గానము చేసెను అని చెప్పితిరి
వారు ఎవ్వరు ఏ వంశీయులు?

జననీ జనకులు ఎవ్వరు స్వామీ!
ప్రచేతసుల యజ్ఞమెట్టిది
ఏవిధముగ యజ్ఞ పురుషుడగు
మహా విష్ణువును - పూజించిరి వారు

అనగా తెలిపెను మైత్రేయుండు
ధ్రువనందనుడగు ఉత్కలుడాతడు
పట్టాభిషేకము చేసికొన్నను
రాజ్యపాలన విముఖతకు

గద్దెనెక్కి పరిపాలించక
రాచకార్యముల మనసుచూపక
సర్వజీవుల సమానత్వముతొ
యోగసమాధి అలవరచుకొని

జితేంద్రియుండై అంతర్ముఖుడై
నిశ్చలత్వముకు నెలవై యుండెను
ప్రశాంతచిత్తుని గాంచిన - సచివులు
పెద్దలు - తలచిరి - అనర్హుడని

రాజ్యపాలనకు తగని పిచ్చితో
రాజ్యమ్మునకు మేలు జరగదని
ఉత్కలు తమ్ముని వత్సరుని మరి
రాజ్యమునకు రాజును చేసిరి

ఐహిక భోగమ్ములను కాదని
విష్ణు పథమది మదిలో నిలపి
ఆనందముతో బ్రతికెడి వానిని
ఉన్మత్తుడని తలతురు మూర్ఖులు

రాజ్యపాలనము చేసె వత్సరుడు
పుష్పార్ణుడు - చంద్రకేతుడు -
ఇషుడు-ఊర్జుడు వసువు జయుండు
అనెడు కుమారుల ఆర్గర బడసెను

పుష్పావర్ణుని కిద్దరు భార్యలు
ప్రభ-దోష అనెడి వారయా!
ప్రాతర్మధ్యందిన సాయములన్నవి
ప్రభ సంతానము వినుమో విదుర!

దోష సంతతి ప్రదోష-నిశీధి-వ్యుష్టులు
పుష్కరిణి యను భార్యయందున
వ్యుష్టునికి పుట్టెను - సర్వతేజుడు
సర్వతేజుని భార్య - ఆకూతియగు

సర్వతేజ - ఆకూతిల తనయుడు
చక్షువు - అతడు మనువుగ ప్రసిద్ధి.
ఆ మనువునకు నడ్వల భార్య
పన్నెండు మంది - తనయులు వారికి -

పురువు-కుత్సుడు-త్రితుడు-ద్యుమ్నుడు
సత్యవంతుడు - ఋతుడు - వ్రతుడు
అగ్నిష్టోముడు అతి రాత్రుండు
సుద్యుమ్న-శిబి-ఉల్ముకులగుదురు

ఉల్ముకుతనయులు ఆరుగురయ్యా!
అంగుడు-సుమనుసుడు-ఖ్యాతి-క్రతువు
అంగిరసుడు గయుడు అనెడి పేర్లవి -
అంగునికి సునీథకు పుట్టెను వేనుడు

అంగ నందనుడు వేనుడు విదురా!
చిన్న తనమునే దుష్టునిగాను
ప్రవర్తించగా - తండ్రి దుఃఖపడె
బాధ భరించలేక - వదలె రాజ్యమును

అంతట వేనుడు - రాజుగానయి
దుర్మార్గమునకు ఆలవాలమయె
మునులు విసిగి మరి శాపము నిడగా
ఆ శాపముతో - మడసెను వేనుడు

రాజులేకను రాజ్యమంతయు
అల్లకల్లోలమై - చోరులు పెరిగిరి
అంతట మునులు వేను కళేబరపు
బాహువులను మరి మథించినారు

మథనము నుండి శ్రీహరి అంశతొ
బాలుడొకడు అట వుద్భవించెను
అతడే పృథువు - చక్రవర్తి అయె
ఆదిరాజుగా ప్రసిద్ధుడయ్యెను

ఆశ్చర్యముగా విదురుడడిగెను
సాధుస్వభావి బ్రహ్మవేత్తయగు
అంగరాజుకు దుష్టుడు అయిన
వేనుడు ఎటుల పుట్టెను స్వామీ!

ఏల అంగుడు రాజ్యము వదలెను
రాజును జనులు అవమానించరె!
అట్టి ఋషులు-మరి వేనునెందులకు
శపించినారు - అంతము చేసిరి

అనగా వేనుడి - చరిత్ర చెప్పెను
ఆనాటి రాజులలొ అంగుడు-ఋషివలె
విష్ణు భక్తితో శుద్ధమనస్కుడు
అశ్వమేధమును సంకల్పించెను

శాస్త్రవిధిగను యాగము నెరపిరి
హవిస్సులందగ సురలనంతట
ఆహ్వానించగ - రాకపోవగా
ఆశ్చర్యములో పడిరి ఋత్విజులు

పలికిరి రాజుతొ - ఆ ఋత్విక్కులు
రాజా! యాగము సక్రమమ్ముగా
నిర్వర్తించితి మందర మొకటై
సుస్వరమ్ముతో సాగె ఛందస్సులు

మాతో నున్న ఈ బ్రాహ్మణుల
ఉచ్చారణలో దోషములేదు
క్రియలో ఎంతయు లోటులేదయా!
అన్నీ మేము గ్రహించినాము

అన్నీ సవ్యముగా నిట జరుగగ -
ఆహ్వానించిన దేవతలందరు
అందుకొనగను ఈ హవిస్సులు
అగపడరయ్యా! కారణమేమి?

అంతట అంగుడు మౌనవ్రతమ్మును
వదలి ఆర్తిగా దేవతలనట
ఆహ్వానించగ రాకపోవుటకు
హేతువు ఏది అని కోరగను

దేవతలెవ్వరు ముందుకు రానిచె
తిరిగి పలికిరి ఆసదస్యులు
రాజా! నీవు - తప్పునెరుగవు
క్రతువున ఎట్టి దోషము లేదు

నీ పూర్వజన్మ కృత దోషమువలన
పుత్రులు నీకు లేకపోయిరి
అనపత్యుడు చేసిన యజ్ఞమ్ములలో
హవిస్సులను మరి సురలు గ్రహించరు.

పుత్రకామేష్టితొ పుత్రుల పొందిన
దేవతలందరు హవిస్సులు గొందురు
యజ్ఞ పురుషుడగు హరిని తలచిన
సర్వము జరుగును నిర్విఘ్నముగా!

అనగారాజు సంతాన కాంక్షియై
శాస్త్ర విధిగ హోమంబు చేయగ
హోమకుండమున దివ్య పురుషుడు
బంగరు నగలు పసిడిచేలముతొ

ఉద్భవించెను బంగరు పాత్రలొ
దివ్యపాయసము రాజుకు నొసగెను
ఆనందముతో రాజచంద్రుడు
భార్యకు ప్రీతిగ పాయసమిడెను

అంతట భార్య దానిని గ్రహించి
గర్భము దాల్చి తనయుని గన్నది
ఆబాలుండు అధర్మవర్తియై
చరించసాగెను వేను డాతడు

బాల్యమునందు తన ఈడు బాలురను
హింసించుచును క్రూరమ్ముగను
చంపుచుండెను – భీతిలేకను
తండ్రి – తనయుని మార్చగలేక

దుఃఖముతో–తా–కుమిలి పోయెను
దుర్మార్గుని తనయునిగా పొందుట కన్న
అనపత్యునిగా బిడ్డలులేని
దుఃఖము – భరించ తేలికైనదని

మదిలో మధన పెరిగిపోవగా
మార్గము గానక ఆ మహరాజు
నిశీథిలోన – భార్యను రాజ్యము
వదలి సాగెను – విరక్తితోను

గ్రహించి ఋషులు అమాత్యులున్ను
రాజులేని రాజ్యమ్ము ఘోరమని
అల్లకల్లోలము అయిపోవునని
వేనుని రాజుగ అభిషేకించిరి

దానితొ వేనుడు రెచ్చిపోయెను
దుర్మార్గమునకు అంతులేదయె
సురలు భూసురుల బాధలు పెట్టెను
భరింప లేకపోయిరి జనులు

పాముకు పాలు పోసినట్టుగా
జరిగిన దనుచు మునులందరును
మదిలో ఎంతో చింతిలిరపుడు
పట్టాభిషిక్తుని చేయట తప్పయె –

దుర్మార్గుడని తెలిసియు కూడ
చోరాదులతో రాజ్యము చెడునని
రాజుగ చేయుట అపరాధమ్మయె
రెండు కష్టములు కలిసి – మీదపడె.

అనుచు బాధలో మునిగినవారు
మంచి మాటలు చెప్పజూచిరి
రాజును గాంచి పలికిరి ప్రియముగ
"రాజా! మాదొక విన్నపమ్ము విను!

త్రికరణశుద్ధిగ చేసిన ధర్మము
మానవలోకమ్మునకే కాక
అన్ని లోకముల వారికి శుభమగు
చివరకు మోక్షము కలిగించునది

ప్రజాక్షేమ కర మగునట్టిదగు
ధర్మము నీలో నశించకుండా
మనవలె ననుచు మా ఆకాంక్ష విను!
ధర్మము చెడిన రాజ్యము చెడును

కష్టములేక ప్రజల నేలిన
ఏలిక తాను-ఇహపర సుఖములు
అనుభవించును సద్గతి నందును
రాజ్యపాలనకు-ధర్మము-మకుటము

పురుషోత్తముడు ఆది దేవుడు
యజ్ఞమూర్తియగు హరిని గురించి
యజ్ఞయాగములు జరిగినచో మరి
యజ్ఞేశ్వరుడు - గాచు రాజును

సర్వసుఖములు శుభములు రాజుకు
సమకూర్చును ఆ నారాయణుడు
కావున రాజా! రాజ్యమంతటను
యజ్ఞయాగములు జరిపించుమయా"!

అనగా వేనుడు - నవ్వె హేళనగ
అమిత కోపమున మునులతొ పలికెను
రాజుకు ధర్మపన్నమ్ములను
బోధించుటకు - ఎంత సాహసము?

అజ్ఞానులు మీరు - మూర్ఖత్వముతో
నాకు ధర్మములు నేర్పుచుండిరి
నేనెవరో మరి తెలియుడు ముందు
రాజురూపమున నున్న - దేవుడను

నన్నుకాదని మరెవ్వరోయిక
భగవంతుడు గలడని సేవించెదరా!
అటుల చేసిన మీరందరును
ఇహపరములకు దూరమగుదురు

యజ్ఞ పురుషుడని మీరు చెప్పిన
మహానుభావుడు - నేనే వినుడు!
నన్ను మించిన పూజ్యుడెవండు!
పొండి మీరిక - బుద్ధిగ బ్రతుకుడు

అటుల దురుసుగా వేనుడు పలుకగ
ఆగ్రహమ్మది కట్టలు తెగినది
ప్రజాభక్షకుడు - రక్షకుడనుచు
భ్రమలో పలుకుట - దోషమైనది

ఇటులే వీడు రాజ్యము నేలిన
అధర్మమ్మది తాండవించును
కావున వీడు పాలనకెంతయు
అర్హుడుగాడు - వదలించుకోవలె

నరహంతకుని - దైవదూరుని
రాజరూపమున నున్న పాపిని
నిప్పులురాలే కళ్లతొ ఋషులు
గాంచిరి - వెంటనె కూలెను వేనుడు

రాజసేవకులు విషయమంతయు
తల్లి సునీథకు తెలియబరచగా
మొదలునరకిన మ్రానై కూలెను
దైవభక్తిగల ఆ ఇల్లాలు

బాధను కొంత దిగ మ్రింగుకొని
యోగశక్తితో కళేబరమ్మును
కాపాడినది - మాతృ హృదయమున
మునులు గృహములకు సాగిపోయిరి

యజ్ఞ కార్యములు నిర్విఘ్నముగా
జరుగును అనుచు ఆనందించిరి
విష్ణు కథలతో కాలము గడుపుచు
అగ్నికార్యముల లగ్నమాయిరి

అంతటిలోన అపశకునములు
ఉత్పాతములు అగపడసాగెను
సుడి గాలులతో ధూళివర్షమై
కురవసాగినది దిక్కులు మాసెను

తేజో విహీనము అయినది నింగి
అడవులలో మరి వేను భయమున
దాగిన దొంగలు హంతకులున్ను
విచ్చల విడిగా సంచరించిరి

అరాచకమ్మయె రాజ్యమంతయు
హింస పెరిగెను అవినీతి పెరిగెను
సుఖముగ బ్రతికే తావు లేకను
బ్రతుకు భారమై పోయెను ప్రజలకు

విషయమంతయు గ్రహించిరి మునులు
మార్గోపాయము నాలోచించిరి
ఉపేక్షించిన భీభత్సమగునని
తపోధనులకు తగదని తలచిరి

విష్ణు భక్తితో పునీతమైన
అంగరాజు వంశమ్మును నిలపగ
మునిపుంగవులు రాజ్యము చేరిరి
రాజ ప్రాసాదములోనికి వచ్చిరి

వారిని గాంచి సునీథ భక్తిగ
అర్ఘ్యపాద్యముల పూజను సలిపెను
వంశము నిలపగ ప్రార్థించినది
అంతట మునులు సరియని పలికి

వేనుని కళేబరమ్మును గాంచి
ఊరువులను మరి మథించినారు
ఆమథనములో తొడలోనుండి
కుబ్జరూపుడొక దుద్భవించెను

నల్లనిఛాయ కురుచ రూపమది
విరూపిగాను వుండెను వాడు
అన్ని అవయవములతి చిన్నవిగా
వికృతరూపి పలికెనప్పుడు

నేను చేయదగు కార్యము ఏమి?
అనుచు అడిగెను ఆ మరుగుజ్జు
షీష - నిషీద - అని ఆ మునులు
కూర్చొనమనుచు చెప్పిరి వానికి

నిషీద - అన్నది వాని పేరయి
వాని వంశము నిషాదవంశమయె
కొండల-అడవుల స్వేచ్ఛగ తిరుగుము
అనుచు పంపిరి మునులు వానిని

వేనుని పాపము ఆరూపములో
అవతరించెనని గ్రహించినారు
పాపకార్యముల నాచరించుచు
బ్రతుకుచుందురు వారందరును.

అంతట మునులు యోగశక్తితో
శ్రీహరిని మనస్సుల ధ్యానించుచును
వేను కళేబరపు బాహువులను
మధించసాగిరి హరితత్పరులై.

॥శ్రీ కృష్ణచరితము॥



# 16 పృథు జననం

అటుల మహఋషులు హరిని తలంచుచు
వేనుని బాహువులను మధించగ
ఒకమగబిడ్డ - ఆడుబిడ్డయు
దివ్యతేజముతొ ఉద్భవించిరి

మంగళ శాసనములు పలికిరి మునులు
అచ్చర కన్యలు నాట్యమాడిరి
ప్రకృతి అంతా పులకరించెను
పుడమి పొంగె పలు సస్యసంపదతొ

వారినిచూచి మునులందరును
పరమానందము పొందిరప్పుడు
ఆపిల్లవాడు మరి సాక్షాత్ శ్రీహరి
ఆడుబిడ్డయగు లక్ష్మీదేవి

సుర దుందుభులు మ్రోయుచుండెను
హోమగ్నులవి జ్వలించె నంత
ఆసమయములో విరించి అచటకు
దేవగణములతొ అరుగుదెంచెను

అపారమైన విద్యా శ్రవణము
పృథుయశస్సు కలిగియుండునని
పృథువుగ బలికిరి - ప్రసిద్ధుడయ్యెను
ఆడుబిడ్డకు - అర్చి అనిపేరు

వారిని గాంచి ఆనందపరవశము
కలిగిన దంత సునీథకపుడు
మునులు భక్తిగా వందనమ్మొలిడి
సత్కరించిరి ఉచిత రీతిని

పురాణ దంపతులా యిద్దరు మరి
దంపతులైరి జగత్ కల్యాణముకు
వేల్పులు కీర్తన చేయుచు భక్తిగ
పుష్పవర్షము కురిపించి రప్పుడు

పృథువును గాంచి బ్రహ్మదేవుడు
సాముద్రిక పరముగ పరిశీలించెను
బాలుని కుడి చేతియందున
సుదర్శన చక్రపు రేఖలున్నవి

అడుగులలో వజ్ర హలంపద్మ-శంఖ
రేఖలువున్నవి సుస్పష్టముగా -
ఆడుబిడ్డకు గల శుభలక్షణములు
గాంచి-బ్రహ్మాదులు సంతసమందిరి

శ్రీహరి అంశతొ బాలుడు పుట్టెను
లక్ష్మీకళతో - బాలిక పుట్టెను
అని విరించియు దేవగణంబులు
నిర్ణయించుకొని - పరవశించిరి

బ్రహ్మ ఆనతిని బ్రహ్మవేత్తలు
పృధువును పట్టాభిషిక్తుని జేసిరి
భూ సుర లోకవాసులు వచ్చి
ఎన్నో విలువగు కాన్కల నిచ్చిరి

సింహాసనమున అలంకారముల
వజ్రమకుటముతొ తన దేవేరితొ
కూర్చొనియున్న పృధువునుగాంచి
లక్ష్మీనారాయణలిద్దరు అనిరి

లోకపాలకులు భక్తి మీరగా
విలువగు కాన్కలు అందజేసిరి
కనక మణులతో తీర్చిదిద్దిన
దివ్యాసనమును కుబేరుడిచ్చెను

సంద్రమునకధిపతి వరుణుడు
చల్లని జల బిందువులను రాల్చెడి
శ్వేత ఛత్రమును సమర్పించెను
వింజామరలు అనిలుడు యిచ్చెను

వజ్రకిరీటము నొసగె నింద్రుడు
ధర్మదండము యముడు వొసగెను
వేదమయ కవచము విరించి యిచ్చెను
నవమౌక్తిక హారము వాణియిచ్చెను

సుదర్శనమ్మును యిచ్చెను విష్ణువు
అగణిత ఐశ్వర్యమిచ్చెను లక్ష్మి
శశాంకుడొసగెను దివ్య ఖడ్గము
ఉత్తమ రథము త్వష్టయిచ్చెను

తేజోమయమగు శరములనంత
దినకరుడొసగెను ఆనందముగా
శివధనుస్సును పోలెడి - ధనస్సు
అగ్నిదేవుడు సమర్పించెను

యోగమయమగు దివ్యపాదుకలు
వసుంధర - తా - సమర్పించినది
చక్కని శంఖము సముద్రుడిచ్చెను
దివ్యదీవనలు మహర్షులొసగిరి

పూలజల్లులు కురియునట్టుగా
ప్రకటించినది ఆకాశమ్ము
రథ గమనమ్ముకు అడ్డములేక
త్రోవ నిడెదమనె నదులూ - గిరులూ

దివ్యకానుకలు పృధు చక్రవర్తికి
లభించినవి పట్టాభిషేకమున
మంగళ గీతిక లాలపించిరి
చల్లని నగవుతొ వారిని గాంచెను

వందిమాగధులస్తుతులను వినిన
పృధువు పలికెను అతివినయముగా
నుతింపదగిన సద్గుణమ్ములవి
నాలో లేవు - వ్యర్ధ ప్రశంసలు

గొప్పవాడనని తలంచుకొనుట
హాస్యాస్పదము అవివేకమ్ము
వానిని గాంచి నవ్వుకుందురు
ఆ మూర్ఖుడు - తా - గ్రహించలేదు

చతుర్ముఖబ్రహ్మ - నుతుల కర్హుడు
పెద్దవారితో సఖ్యమువలన
అల్పుల - పెద్దగ భావించినను
ఆ ఘనతయది పెద్దవారిదే

ఆత్మస్తుతియు - పరనిందయును
నీచగుణములుగ తలతురు విజ్ఞులు
వందిమాగధుల స్తుతులకు - రాజు
అర్హుడైనను - పొగడ్త చెడ్డది

కావున నేను - సామాన్యుడను
నన్ను మీరు స్తుతించగ వలదని
వినయ మొలకగా స్తుతిపాఠకులకు
హెచ్చరించెను - పృధుచక్రవర్తి

॥శ్రీ కృష్ణచరితము॥



## 17 వందిమాగధులు చక్రవర్తిని స్తుతించుట

వినయసంపద నిండిన యట్టి
పృధువు పలుకులకు మునులు ముదముతో
స్తోత్రపాత్రుడవు అనుచు పలుకుచు
వందిమాగధుల ప్రోత్సహించిరి

వేనసంభవుడు పృధుచక్రవర్తి
కన్నబిడ్డలుగ ప్రజలనేలుచు
రాజశబ్దము సార్ధక పరచును
ధర్మమునెలకొను కృతయుగమన్నటు

“పుణ్యాత్ములు ఈ మునిపుంగవుల
యోగబలముతో హరిమనస్కులై
వేనరాజు శరీరమ్మును భక్తిగ
మధించ - పుట్టిన పుణ్యచరితుడవు

పూర్వ రాజులకు వన్నె తెచ్చును
భావి రాజులకు త్రోవచూపును
పగతుర కీతడు సింహస్వప్నము
పాపరహితుడు పరమగుణాఢ్యుడు

రెండవ శ్రీహరి వీవేనయ్యా!
సుగుణరాసివి - సౌజన్యమూర్తివి
నీదొడ్డగుణములు నుతించతగును
మునులు మమ్ము మరి ప్రోత్సహించిరి

ఇంద్రప్రీతిగా - యజ్ఞమ్ములు చేసి
సస్యానుకూలము కలుగునట్లుగా
సకాలవర్షమ్ములవి కురిపించును
ఈ వసుంధర పులకరించును

## చతుర్థస్కంధము

ధనధాన్యములకు లోటు కలుగదు
ఈతిబాధలు ప్రజలకుండవు
సుంకము వసూలు చేసి దానిని
తిరిగి ప్రజలకై వినియోగించును

ఓర్పున కీతడు పృధివీ సముడు
కరుణాసముద్రుడు నిత్య సంతోషి
ఇంద్ర - చంద్రుల సాటి పాలనలో
మదిలో విషయము తెలియనీయడు

ధైర్యమునందు హిమగిరి సముడు
తన ఆలోచన అమలు పరచెడి
దీక్షాపరుడు దృఢనిశ్చయుడు
అగ్నివంటి ప్రతాపవంతుడు

నిర్దోషులను దండించకను
దోషులనెంతయు వదల నీయక
ధర్మరక్షణ - న్యాయ రక్షణ
కర్తవ్యము మా పృధుమహరాజుకు

బ్రహ్మ నిష్టాగరిష్టులందరి నెలవై
సూర్యదేవుడు తనకిరణమ్ముల
ఎంతవరకును తేజమొసగునో
అంతవరకును మారాజు ఏలును

దీనవత్సలత పరస్త్రీ మన్నన
సత్యవర్తన - బ్రహ్మనిష్ఠయు
స్థిరనియమములు వినయవర్తన
విజయకేతనము పృధు చక్రవర్తికి

దండ నీతిలో రెండవ యముడై
సాక్షాత్ శ్రీహరి అవతారమని
పురుషోత్తముడని పుణ్యశీలుడని
పుడమిలో అందరు - కీర్తించెదరు

నాల్గుసంద్రముల నడుమ భూమిని
ఏకచ్ఛత్రాధి పతిగా నిలబడి
పరిపాలించును తిరుగులేనటు
భూమి పొంగునీ రాజు పాలనకు

జైత్రయాత్రను చేసిన రాజు
విజయోత్సవమునకు నాడు
దిక్పాలకులు రాజులందరు
ముదముగ కాన్కలు అందజేతురు

రధమునందు విల్లంబులతో
నిలచిన వీరుని పృధువును గాంచి
దాసోహమ్మను రిపులందరును -
త్రిలోక విజేతగ కీర్తినందును

భూమాతను మరి గోవుగజేసి
సమస్త సంబారమ్ములు పిదికి
విబుధులకీర్తి మన్ననలంది
జీవాధారము అగు మారాజు.

ఈ మహరాజు విజయచంద్రికల
భూమినేలుచు విష్ణు ప్రీతిగా
నూరుసంఖ్యలో అశ్వమేధములు
చేయును ఖ్యాతి ఇనుమడించగా

నూరవ యాగమునందున ఇంద్రుడు
యాగాశ్వమును అపహరించును
సనత్కుమారుని వల్లను పృధువు
ఆత్మవిద్య ఉపదేశము నందును

తపోధనులగు మహామునులును
ఆ సమయములో అచటకువచ్చి
సనత్కుమారుని వల్లను వారును
ఆత్మవిద్యను తెలుసుకుందురు

మహేంద్ర భోగము లనుభవించును
అర్ధనారీశ్వరుడన్న రీతిగా
సహధర్మిణిని గౌరవించుచు
తల్లుల వోలి స్త్రీలను తలచును

ఎక్కడ విన్నా మారాజనుచు
మా మహరాజును కీర్తించెదరు
మన మహరాజు మను మహరాజుగ
మహరాజులకు మహరాజగును."

వారిస్తుతులకు పృధు మహరాజు
ఉచిత రీతిని వినయ మొలకగా
సత్కరించెను వారందరినీ
వేదవిదులను - సత్కరించెను

అని మైత్రేయుడు చెప్పగవినిన
విదురుడడిగెను ఆనందముగా
"ఓ పుణ్యాత్మా! పుండరీకాక్షుని
చరిత్రలన్నియు మహిమోపేతము

పృధువుఎటుల-తా-గోరూపిణియగు
భూమినుండి మరి పిదికె వస్తువులు
భూమి ఎందులకు గోరూపమెత్తెను
పిదికిన యట్టి వస్తువులెట్టివి?

ఇంద్రుడెందులకు యాగాశ్వమును
అపహరించెను తెలియబరచుము
సనత్కుమారుడు తెలియ బరచిన
జ్ఞానమెట్టిది వివరించుమయా!"

॥శ్రీ కృష్ణచరితము॥



# 18 పృధు చక్రవర్తి గోరూపిణియగు భూమి నుండి ఓషధులు పిదుకుట

విదురునకచట తెలిపె మైత్రేయుడు
"విదురా! వినుము పృధు చక్రవర్తి
ధర్మసమ్మతిగ రాజ్యమేలుచు
ప్రజాహితునిగా కీర్తి గడించెను.

ఆ సమయమునకె వేనుని యొక్క
దుశ్చర్యలకు ఘాతుకాలకు
ధర్మము చెడి - తా - బలహీనమయె
భూమి యంతయు నిస్సారమయె

పంటలు పండక క్షామమేర్పడె
తిండి కొరకునై అల్లాడుచును
ప్రజలు రాజుకడ మొరపెట్టుకొని
పట్టెడన్నము పెట్టగ కోరిరి

జాలిగొలిపెడి వారి వేదన
లోతుకండ్లలో జాలి చూపులు
కదిలించినవి పృధు చక్రవర్తిని
అభయమునిచ్చి కదలె నొక్కపరి

ధనుర్బాణములు ధరించి నిలచి
క్షామమా - మరి నారాజ్యమునా!
అనుచు అదరెడి పెదవుల పలికి
అడుగులేయగా భూమి వణకెను

గోరూపముతో భూమి అంతట
పరుగిడ జొచ్చెను - గాంచెను రాజు
వెంబడించెను ఆవేశముతో
గోరూపిణి - తా - అలసిపోయెను

దిక్కుతోచక దీన వదనమున
నిలబడి ప్రార్థన చేసెను రాజును
శరము వదలకు ధర్మపాలకా!
ఆపన్నులను ఆదుకోవయా!

దీనురాలిని ఆడుదానిని
నన్నుచంపిన జీవులన్నియు
నీటమునిగి మరి మరణించునయా!
అది సమ్మతమా! ఓ పుణ్యాత్మా!

పలికెను పృధువు ఆ గోమాతతో
నీవు చెప్పినది యదార్థమైనను
నా ఆజ్ఞను మీరి - నడచుకుంటివి
ప్రజా రక్షణ నా కర్తవ్యము

యజ్ఞయాగముల - నీ భాగమగు
హవిస్సు మాత్రము గైకొను చుండి
ప్రాణుల కొరకై వలయునట్టివి
ఆహార - ధాన్యములు ఫలించవద్దా!

గోరూపమున నీలోనున్న
తృణౌషధమ్ములు మేసివేసితివి
పాలను తిరిగి అందజేయక
నీలో వాటిని దాచుకొంటివి

భూతకోటికి గడ్డుసమస్య
రాజును నేను మిన్నకుందునా
దేహీ అనెడి - ప్రజలకు తిండి
సమకూర్చని ఆ రాజు ఎందులకు

దురాత్మురాలవు నిను ఖండించెద
ఆమాంసముతో అన్నార్తులకు
ఆకలి తీర్తును - ఆగను యింక
ఆడుదానినని నీతి చెప్పితివి

భూతదయను మరి వదలివేసి - తా -
స్వలాభమ్ముతో దయదాక్షిణ్యము
మదిలో తలచని దుర్మార్గులు విను
వారెవ్వరైనను దండన కర్హులు

స్త్రీసహజమగు దయా శాంతములు
వదలివేసి నువు గోరూపముతో
పారిపోవగ తలంచు చుంటివి
నాయోగ శక్తితో ప్రాణులకాచెద

నిన్ను వదలను అనుచు యమునిలా
బాణప్రయోగము చేయనెంచగా
నిలబడినట్టి పృధువును గాంచి
గడ గడ వణకి పలికెను భూమి

రక్షించుమయా! దీనశరణ్యా!
పరమ పురుషుడవు పరంధాముడవు
సమస్త జీవికి ఆధారభూతముగ
నీవే - మున్ను సృజించినావు

చంపగతలచిన నీకు అడ్డమా!
తెలిసితి నిన్ను దయాసముద్రా!
భువిలో పుట్టిన శ్రీహరి వీవు
ఆది దేవుడవు అనంతుడవు నువు

నీదు మాయయది నీకు తప్ప మరి
ఇంకెవ్వరికీ తెలియదు స్వామీ!
బ్రహ్మను సృజించి సృష్టిని చేయగ
ఆదేశించిన అవతారమూర్తీ!

పంచభూతములు ఇంద్రియమ్ములు
చేతన అహంకారములనెడి శక్తితో
సృష్టి-స్థితి-లయ కర్తవు నీవు
నీకు భక్తిగా వందనమిదిగో!

రసాతలమ్మున వున్న భూమిని
ఉద్ధరించిన ఆదివరాహము
నీవేస్వామీ! తెలిసితి నిన్ను
ఇప్పుడు నన్ను కావ వచ్చితివి

నీటిపై మరి నావతీరుగా
నిలబడి యుంటిని కావున నాపై
వసించు జీవుల రక్షించగను
పృధువుగ నీవు అవతరించితివి

అదరెడి పెదవుల క్రోధము చూచి
బెదరుచుంటిని శాంతి వహించుము
నా బాధ తెలిపెద ఆలకించుము
మోసగత్తెను కానే కాదు

బ్రహ్మ సృజించిన ఓషధులన్నీ
నియమనిష్టలు లేని అయోగ్యులు
అనుభవించుచు పెచ్చుపెరిగిరి
వారిని వారించు రాజేలేదు

సత్పాత్రయోగ్యముగా ఓషధుల
కాపాడు వాడు - మరి లేకపోయెను
కావున నేను - నిస్సారమైతిని
యజ్ఞయాగములు జరుగుటలేదు

ఏనాటికైనా యజ్ఞము జరిగిన
ఆనాటికి మరి మిగిలిన యట్టి
ఓషధులవ్వి ఉండవనుకొని
వాటిని నేను భక్షించితిని

నాలో అవ్వి జీర్ణించియున్నవి
నేటికి నీవొక రక్షకుడవుగా
అగపడినావు – ఆ ఓషధులు
వచ్చెడి మార్గము చెప్పెద వినుము

చక్కని దూడను తీసుకువచ్చి
యోగ్యమైన వొక క్షీరపాత్రను
పిదుకు వానిని – ఏర్పాటుచేయుము
ధర్మస్థాపనకు అవతరించితివి

అప్పుడు నేను – నాలో నున్న
సారము నిత్తును – క్షీరరూపముగ
నిమ్నోత్తముగా వుంటిని నేను
నాలో క్షీరము నిలచునట్టుగా

సమతలముగను ఏర్పరచుమయా!
నీ అభీష్టము తీరును రాజా!
నాలో సారము పిదుకు కోవయా!
అని ఆదరమున – గోమాత చెప్పెను

వెంటనె రాజు మనువునంతట
దూడగ చేసి – తనచేతులలో
ఓషధులనట పిదికె శ్రద్ధగా
అటులే–అందరు పిదికిరి ముదముగ

బృహస్పతిని మరి దూడగ చేసుకు
ఋషులు పిదికిరి ఛందోమయక్షీరము
సురలు ఇంద్రుని వత్సను చేసి
వోజో బల వీరామృతమును పిదికిరి

ప్రహ్లాదుని మరి వత్సమ్ముగ జేసి
దైత్యదానవులు ఘన సురావసను పిదికిరి
అచ్చర గంధర్వులు విశ్వావసుతో
గాంధర్వ క్షీరమును పిదికిరి ముదముగ

రవిని వత్సము చేసి – పితృదేవతలు
గవ్యమ్ము క్షీరముగ పిదుకగ నంత
కపిలుని దూడగ చేసి – సిద్ధులు
నింగి పాత్రలో అణిమాది సిద్ధులు

విద్యాధరాదులు అదేవిధముగా
ఖేచరత్వరూపమ్ము దుగ్ధముగ
కింపురుషాదులు ఆత్మ పాత్రలో
మయుడు దూడగా పిదికిరి మాయను

యక్షరక్షోభూత పిశాచములు
భూతపతి మరి వత్సమ్ముగను
కపాలపాత్రలో రక్తాసవ రూపమ్మైన
క్షీరమునంత పిదికిరి అచట

తక్షకుని వత్సమ్ముగ చేసుకు
బిలపాత్రమున నాగులంతట
విషరూపమగు క్షీరము పిదికిరి
అడిగిన విచ్చుచు నుండెను గోవు

పశువులు వాటి వత్సమ్ములతో
అరణ్యపాత్రలొ తృణ దుగ్ధమ్మును –
మృగములు సింహ వత్సమ్ముతొ నంత
ఆత్మకళేబర పాత్రలొ క్రవ్యదుగ్ధమును

గరుడుడు దూడగ పక్షులంతటా
తమశరీరమున కీటక రూప క్షీరమ్మును
వటవృక్షము వత్సగ తరువులంతటా
బీజరూపమగు పాలను పిదికిరి

అంతట భూమిని - పృధ్విగ పిలచిరి
అటులా పృధువు సర్వభూతముల
తండ్రిగ - బలమును కల్పించగను
జీవదాతగా గణుతింపబడె

హిమవంతుడు వత్సమ్ముగ గిరులు
తమచరియలలో వివిధ ధాతు క్షీరములు
పిదికిరి అటులే జీవులన్నియు
వలయు దినుసులు పొందిరి పాలుగ

వలయు తావుల గ్రామమ్ములను
పల్లెలను మరి పట్టణాలను
కోటలు - పేటలు - వాడలనెన్నో
నిర్మించి - బ్రతుకులు చక్కదిద్దెను

పరమానందము నందెను పృధువు
ముద్దు పట్టిగా భూమిని తలచి
గిరి శృంగములను పొడిపొడి చేసి
సమతలమ్ముగా భూమిని చేసెను

విదురా అటుల పృధు చక్రవర్తి
అమోఘమైన పనులను చేసి
తన చరిత్రను స్తుతిపాత్రముగా
శ్లాఘనీయముగ చేసెను వింటివ!

ఆనందించిన విదురుడడిగెను
పృధు చరిత్రము అత్యద్భుతము
ఆయన చేసిన అశ్వమేధమున
అశ్వాపహరణ తెలుపుము ప్రియముగ.

॥శ్రీ కృష్ణచరితము॥



## 19 పృధుచక్రవర్తి అశ్వమేధంలో ఇంద్రుడు అశ్వమునపహరించుట

రాజర్షిగా వినుతికెక్కిన
పృధు చక్రవర్తి అశ్వమేధములు
నూరుచేయగా సంకల్పించెను
దీక్ష వహించెను - యాగస్థలమది

బ్రహ్మావర్త దేశమునందున
సరస్వతీనది ఒడ్డున అనుచు
విజ్ఞులు చెప్పగ రాజు మొదలిడె
యజ్ఞసంబారమ్ములు వచ్చెను

## చతుర్థస్కంధము

యజ్ఞకర్తయు - యజ్ఞభోక్తయు
యజ్ఞపురుషుడు శ్రీహరి రూపము
తానే అయినను యజ్ఞమహిమను
అందరు తెలియగ నారంభించెను

యజ్ఞమ్మునకు వలయు వస్తువులు
పృథివి చక్కగా అమర్చుచుండెను
వృక్షమ్ములవ్వి లీలగ పెరిగి
పాలు పెరుగు నేయి తేనెలు

మధురఫలములు మంగళ సుమములు
ఆనందముగా యిచ్చుచుండెడివి
మేలగు నవరత్నమ్ములనంతట
జలనిధులు భక్తిగ అందించినవి

భక్ష్య-భోజ్య-లేహ్య-చోష్యములు
సమృద్ధిగా మరి గిరులొసగినవి
భూసురలోక వాసులందరు
ధన కనక వస్తు సముదాయములిచ్చిరి

అటుల దీక్షగా నిర్విఘ్నముగా
తొంబదితొమ్మిది యాగమ్ములను
నిర్వర్తించెను పృథుమహరాజు
శ్రీహరి అర్పణగా జరిగిన వన్నియు

తనపదవికి మరి ముప్పువచ్చునని
కలవరపడిన నాకలోకపతి
పాషండునిగా రూపముదాల్చి
యజ్ఞాశ్వమును హరించినాడు

అశ్వాపహరణ తెలిసి సదస్యులు
కలవరపడగా అత్రిమహాముని
విషయము గ్రహించి పృథువు తనయు
ప్రేరేపించి అశ్వముతెమ్మనె

ధనుర్ధారియై బయిలుదేరిన
పృథు తనయుని గని ఇంద్రుడంతట
జటాధారిగా వేషముమార్చెను
వాని వేషమది ధర్మవిరుద్ధము -

పరివ్రాజకుని జటాధారిని
చంపుట వొప్పదు రాజధర్మమని
సందేహములో శరము వదలక
నిలచిపోయెను రాకుమారుడు

అత్రి మహాముని విషయము గ్రహించి
హెచ్చరించెను - మాయవేషమని
యజ్ఞవిఘ్నము చేయనెంచినది
జటాధారి మరి కానే కాదు

అతడే ఇంద్రుడు దొంగవేషమిది
నూరవ యజ్ఞము పాడుచేయగా
సంకల్పించెను - కావున వానిని
వదలకుమయ్యా! అని బోధించగ

పృథుతనయు డంతట ఆవేశముతో
భీషణ ధనుష్టంకారము చేయగ
హడలిపోయిన అశ్వచోరుడు
దిక్కుతోచక పరుగిడ సాగెను

జటాధారివగు జటలు ముడి విడివడి
ఒక్కటొక్కటే రాలుచున్నవి
పారిపోయెడి ఇంద్రుని గాంచి
హేళనచేసెను పారుబోతువని

అంతట అచ్చట నున్న గుల్మమును
తీసుకు వచ్చెను పృధుతనయుండు
బాణము విడువక అశ్వముగెలిచెను
కావున అతనిని - జితాశ్వుడనిరి

పారిపోయిన ఇంద్రునికింకా
అసూయ అది పెరిగిపోయినది
ఏదోవిధముగ నూరవ యజ్ఞము
జరగకూడదని యోచన చేసి

అకస్మాత్తుగా యజ్ఞము జరిగెడి
ప్రాంతమంతయు చీకటి చేసెను
యజ్ఞశాలకు లోపల వెలుపల
చిమ్మచీకటి ఇంద్రజాలమయె

ఉత్పాతమునకు తెల్లబోయిరి
అంతటిలోన వెలుగు వచ్చెను
కానీ యూపస్థంభమునకు గల
యాగాశ్వమది - కనబడలేదు

తికమక పడిరి సదస్యులందరు
మాయాజాలము ఇంద్రజాలమని
ఆశ్చర్యముగా చూచుచుండగా
ఇంద్రజాలమని అత్రి పలికెను

జితాశ్వునిగని అత్రి పలికెనట
వత్సా గనుము - పారిపోయెడి
ఇంద్రుడు అదుగో! చేతిలొపుర్రె!
వంకరకర్ర అది మరియొక చేత

ఉపేక్షించకని అత్రి మహాముని
హెచ్చరించగా ధనుర్బాణముల
బయలుదేరెను జితాశ్వుండు
గాడాంధకారము మధ్యమధ్యలో

ఇంద్రుడు కనబడు అంతటిలోన
అంధకారమది అలుము కొనుచును
ఇంద్రుని కనబడకుండ చేయగా
అచేతనుండయె - జితాశ్వుడపుడు

అత్రి మహాముని ధైర్యము గరిపెను
అది అంతయును ఇంద్రజాలమే
త్వరపడి శరమును వదలుము వత్సా!
శుభమగు నీకు అనుచు పలుకగా

విజృంభించెను వీరవరేణ్యుడు
వింట బాణమును సంధించగనే
తన మాయ రూపమును యాగాశ్వమును
విడచి పరుగిడె నాకలోకపతి

ఇంద్రుడు వదలిన మాయరూపము
పాషండ రూపము - ఆ చిహ్నములు
వాటిని కొందరు గ్రహించినారు
కొందరు దిగంబర జైనులాయిరి

కాషాయ వేషము ధరించి కొందరు
బౌద్ధులాయిరి - మరికొందరట
కపాలాంగిక చిహ్న భస్మముతొ
కాపాలికులుగ జీవించసాగిరి

ఇంద్రుడు చేసిన దుష్కర్మలకు
ఆవేశముతో పృధువు లేచెను
ధనుర్బాణములు ధరించి నిలచి
ఒక్క శరముతో కూల్తును అనెను

అంతట - అచ్చటి ఋత్విజులందరు
యజ్ఞదీక్షలో - పోరు తగదు-విను!
యజ్ఞవిఘాతము జరుగును రాజా!
ధర్మదూరమగు పని అగుననిరి

ఇంద్రవధ రూపమగు-అధర్మమ్మది
ఆచరించుట తగదని పలికిరి
మంత్ర బలమున-వానిని యిచటకు
ఆహ్వానింతుము - తప్పక వచ్చును

అపుడే మేము - ఆ వాసవుని
అగ్నికుండముకు ఆహుతిచ్చెదము
అనుచు పలుకుచు - శాంత పరచిరి
అదే త్రోవలో సాగె మంత్రములు

క్షణకాలములో నాకలోకపతి
మంత్రబద్ధుడై యజ్ఞకుండమున
ఆహుతి అగును అది గ్రహించిన
విరించి - తాను బయలుదేరెను

ఇంద్రుడు కూడా బంధనమ్ములతొ
బ్రహ్మవెంబడి యజ్ఞశాలకు
వచ్చె నాతనిలొ - కళ దప్పినది
దొరకిన దొంగగ నిలబడినాడు

బ్రహ్మవేత్తలగు ఋత్విక్కులను
హోమకలాపము ఆపుచేయమనె
మంత్రోచ్చారణ ఆగిపోయెను
అంతట బ్రహ్మ - పలికె నచ్చట

ఇంద్రవధ అది మంచిది కాదు
అన్నీ తెలిసిన మీరు ఎందులకు
ఘాతుకమ్మును - ప్రోత్సాహింతురు
ఇంద్రుడు - శ్రీహరి అంశయే కదా!

ఇంద్రుడు చేసిన కార్యము తప్పే!
ధర్మవిరుద్ధపు కార్యమ్మదియగు
అయినా ప్రతిక్రియ చేయగ తగదు
యజ్ఞఫలము నే రాజుకొసగెదను

అనుచు పృధువును చూచిపలికెను
రాజా! నీవిక యజ్ఞమ్ములను
చేయగ వలసిన పనిలేదయ్యా!
మోక్షమొసగెడి ధర్మమ్ములెరుగుదువు

యజ్ఞము చేయుట ఇంద్రుని తృప్తికె
ఆవిషయము మరి తెలియును నీకు
అయినా ఎందుకు సమ్మతించితివి
ఇంద్రవధను నీవెట్లు సహింతువు

ఇంద్రునిపైన వైరము తగదు
భూ సురలోకమ్ములను తీరుగా
పరిపాలించెడి మీరిద్దరును
కక్షలు మానుడు-శుభము కలుగును

నీవీ నూరవయజ్ఞము చేయుట
దైవమ్మునకు ఇష్టము లేదు
అందువల్లనే - కలిగె విఘ్నము
పట్టుదలతొ మరి తప్పులు చేయకు

ఇంద్రుడు చేసిన అధర్మమ్మున
అతని వేషములు పాషండమతముకు
స్థావరమ్ములై - కీడు చేయును
అంతియెగాక ఇంద్రుని చంపిన

లోకములన్నీ అధర్మమ్మునకు
ఆటపట్టులై - నాశనమగును
వేనునివల్ల ధర్మము నశించ
నిన్ను పొందిరి - శ్రీహరి చలవతొ

ధర్మస్థాపనకు ధర్మరక్షణకు
శ్రీహరి అంశతొ జన్మించితివి
కావున ధర్మము చెడిపోనీయక
కాపాడుటది - నీకర్తవ్యము!"

అటుల విరించి శాంతపరచగా
రోషము వదలిన పృథుమహరాజు
ప్రియముగ ఇంద్రుని కౌగలించుకొన
ఆనందించిరి మునులందరును

అవబృథస్నానము చేసిన పృథువు
ఋత్విక్కులకు వేదవేత్తలకు
దానదక్షిణలు దండిగ నిడెను
తృప్తిగ వారు ఆశీస్సుల నిడిరి

ఆసమయములో యజ్ఞ కర్తయగు
శ్రీమన్నారాయణుడటకు వచ్చెను
పృథు చక్రవర్తిని అనుగ్రహించగ
అరుగుదెంచెను అధినాయకుడు.

॥శ్రీ కృష్ణచరితము॥



## 20 నారాయణుడు పృథు చక్రవర్తిని అనుగ్రహించుట

శ్రీహరి అచట దర్శనమిడగా
పరవశమ్మున పృథుచక్రవర్తి
పాదములంటి నమస్కరించెను
యజ్ఞఫలమునకు పొంగి పోయెను

కరముల పృథువును లేవనెత్తెను
పలికెను ప్రియముగ-రమాధవుడట
"నూరవ యజ్ఞము జరుగలేదని
చింతిలవలదు - సఫలమైనవవి

ఇంద్రుని నీవు క్షమించవలెను
సిగ్గుతొ ఇంద్రుడు తలనువంచెను."
అనగా పృథువు నమస్కరించి
పలికె నింద్రునితొ పరవశమ్ముతో

ఓ సురనాయక! 'శతమఖ' పేరది
నీకే చెల్లును - మరి యింకొకరికి
అట్టిపేరది వుండకూడదని
ఈశ్వరదేవుని సంకల్పమగు

నీవు చేసిన తప్పు లేదిక
నీవల్లను మరి దోషములేదు
అనుచు పలుకుచు భక్తిగ హరిని
తనసింహాసన మధిష్టించమనె

చిరునగవులతో మధుసూదనుడు
పృధుసింహాసనమున కూర్చొనె
బ్రహ్మేంద్రాదులు ఉచితాసనములు
అలంకరించగ పలికెను విష్ణువు

"రాజా! వినుము సజ్జనులు తమ
అస్థిరమైన - తనువుపైనను
మమకారమెంతయు కలిగియుండరు
స్వ-పర- భేదములుండవు వారికి

సజ్జనులందున శ్రేష్టుడవీవు
ఉదారుడవు మరి జ్ఞానవంతుడవు
భూత ద్రోహము చేయతలంచుట
పెద్దలసేవల ఫలితము తొలగును

అవిద్య - కామము - కర్మలవలన
ఏర్పడినట్టి దేహముపైన
జ్ఞాని ఎంతయు మమకారము పెంచడు
దారాపుత్ర బంధము పెంచడు

అ విద్యమరి కామకర్మలతొ
ఏర్పడినట్టి ఈ శరీరమే
ఆత్మకునిలయము ఆత్మ శాశ్వతము
ఆత్మకు - ఎట్టి రూపము లేదు

గుణరహితమ్ము ఆత్మయగును విను
గుణములు - ఆత్మను ఆశ్రయించును
జీవి చేసెడి మంచి చెడ్డలకు
ఆత్మ - సాక్షిగా నిలబడు చుండును

ఆత్మను మోసము చేయుట జరగదు
శరీరమ్మును - ఆత్మను - విడిగా
తెలియగలిగిన - నన్ను తెలియుటే
అట్టి జ్ఞాని మరి కృతార్ధుడగును

నిర్మల మనసుతొ నిరంతరమ్ము
ననుసేవించిన త్రిగుణమ్ములలో
వికారమ్ములు దరికి చేరవు
దేహకర్మల బాధలు భక్తులజేరవు

అట్టి భక్తుడు సమత పెంచుకొని
అన్నిటి యందు - నన్ను గాంచును
ఆ అదృష్టము కలిగిన వారు
నాకడ శాశ్వతానందము పొందును

దేహ - దేహి - క్రియా - ప్రాణముల
కలయికయే ఈ సంసార యంత్రము
వాటికి నిజమగు స్నేహమువుండదు
పురాకృతకర్మలు సుఖ దుఃఖములిడు

ఆత్మను తెలుసుకు నన్నునమ్ముకొని
సేవించిన వారికి సుఖదుఃఖములు
మానావ మానములన్నవి వుండవు
కావున మెలగుము జ్ఞానముతోను

సుఖదుఃఖములకు తావీయకను
వ్యత్యాసములు దరిరానీయక
ఇంద్రజయముతో మంత్రిసామంతుల
హితులతొ-రాజ్యము పాలించుమయా!

నీ ధర్మపాలనే - నీకు రక్షనిడు
గద్దెనెక్కిన ప్రభువు - ధర్మముగ
ప్రజలనేలిన వారి పుణ్యమున
ఆరవ వంతు - రాజుకు చేరును

అటుల గాక మరి తన ఏలుబడి
ధర్మబద్ధము కాకపోయినచొ
రాజు పుణ్యమది ప్రజలకు చేరును
అధోగతికి - తా - పోవును రాజు

కావున నీవు నీ హితకాంక్షులు
వేదమూర్తుల బోధనలు విని
అర్ధకామముల సమముగపొందుము
ఏ ఒకటీ మరి మించుటతగదు

ధర్మార్ధకామములు సమపాళ్ళలొ మరి
సాధించునటు సమతపెంచవలె
పక్షపాతము తగదు రాజుకు!
అది పాపమ్ముకు త్రోవతెరచును

సిరిసంపదల - పొంగుట క్రుంగుట
జరగనీయక దృఢచిత్తముతో
ప్రజారంజకము కలుగునట్టుగా
పరిపాలించుము యశము గడించుము

కొంతకాలమటు జరిగిన పిదప
సనకాదులు మరి నీకడకొచ్చి
వలయునట్టిదగు బోధను చేతురు
నిశ్చల భక్తికి - నేను బద్ధుడను

యోగ భోగముల లొంగను నేను
జపతపాలకు దొరకను - నేను
యజ్ఞయాగముల - కట్టువడనయా!
సత్పురుషుల మదిలో వసింతు నేను -

కోరి నీకు నే దర్శనమిడితిని
శీలసంపన్నత కలిగిన వాడవు
మాయ మచ్చరము లేనివాడవు
కావున వచ్చితి కోరుము వరము."

పుండరీకాక్షుడు అనుగ్రహించగ
పృధుచక్రవర్తి పొంగిపోయెను
రెప్పవేయక రమాకాంతుని
గాంచుచు తననే తాను మరచెను

వైకుంఠనగరము నందున భక్తిగ
ద్వారమువద్ద ఇంద్రాది దేవతలు
ముకుళిత హస్తమ్ములతో నిలచి
దర్శనమ్ముకై వేచియుందురు

అంతటివాడు దర్శనమిడెను
మహాయోగులు నిశ్చల తపమున
హృదయపీఠముల ప్రతిష్ఠించుకొని -
దర్శనమ్ముకై పరితపింతురు

ఆత్మస్వరూపుడు అఖిలాండనాయకుడు
జగద్గురువును యోగీశ్వరుడు
ఆగమాలకే నుతులకందని
అందగాడు – నాకందెను పుణ్యము

చక్రవర్తి అట పద్మనాభునికి
శ్రద్ధాభక్తుల పూజను చేసెను
ఆనందబాష్పముల ఆ కరివరదుని
పాదమంజరుల నభిషేకించెను

భక్తవరదుడు – రమారమణుడు
ఆశ్రితరక్షకుడాపరమాత్మ
శంఖచక్రగద అభయహస్తమున
మకరకుండలశోభతొ కనబడె

తడిసిన కన్నుల ముడిచిన కరముల
మాటలురాని దివ్యాను భూతితొ
పరంధాముని హృదయసీమను
విహరించగను ఆహ్వానించెను

అనురాగ వార్నిధి పొలుకునట్టుగా
ఆశీస్సుల జల్లు కురియునట్టుగా
అనంతమూర్తి అనుగ్రహించి
అడుగుము వరమనె ఎంతటి పుణ్యము!

భక్తబంధువు కరములు జాపగ
అచేతనముగా ఒదిగిపోయెను
తన శరీరమ్మది విడిగాలేదు
పరంధాముని తనువులొ ఇమిడెను

అటులానంద సీమలొ పృధు చక్రవర్తి
విహరించెను – జోడించెను చేతులు
ఆనందబాష్పముల పూలజల్లుతో
పాదపద్మముల పూజచేసెను

క్షణకాలమటు గడచిపోయినది
ఖగపతి నెక్కగ కనబడె శ్రీహరి
పలికెను పృధువు పరవశమ్మున
"కౌస్తుభహారీ! కాంచనచేలా!

కొంతసేపటికి చక్రవర్తి – తా –
బాహ్య ప్రపంచములోనికి వచ్చెను
తనపదముల కడ సురనాయకుడు
కూర్చొని యుండుట గాంచి వెంటనే

భక్తకల్పకము – పాహిముకుందా!
వరమొసగెదనని అంటివి – దయతో
నేను కోరదగు నాకు వలయునది
ఏది లేదని కోరెద స్వామీ!

తనకరములతో లేవనెత్తెను
గుండెకు హత్తుకు గౌరవించెను
ఆ దృశ్యముగని సుదర్శనుండు
చల్లని చూపుల చూచె నిద్దరిని

దర్శనమిడితివి ధన్యునిచేసి
దివ్యబోధన చేసితి వీవు –
దేహమస్థిరము దాని కొరకునై
దేబిరించి – నే సుఖములడగనా!

వరము అడగనిచొ ధిక్కారమగు
కావున స్వామీ! అనుగ్రహించి
నాకర్ణద్వయము నీ లీలామృతమును
నిరతము వినెడి - భాగ్యమొసగుము

యోగాభ్యాసము నిగ్రహమ్ముతో
దీక్షలొనుంటిమి - మాకు శ్రీపతి
దర్శన మిడునని దంబములాడెడి
వారికి - కళ్ళుతెరిపించితి వీవు

ఎందరు దేవతలున్నను గాని
అధికుడ వీవు వరించె లక్ష్మి
నీ కీర్తి విని గానము చేసెడి
జ్ఞాని ఒక్కడే - గుణవంతుడగు

నీ పదములనే కొలవగవలెను
నీనామమునే కీర్తించవలె
నీచరిత్రలే చదవగ వలెను
నిఖిలలోకముల మించరెవరు నిను

ముందే లక్ష్మి - పదములసేవ
చేయుచున్నది - కావున నాకు
సమయము చూపి కరుణించవయా!
సేవచేసెడి - భాగ్యమునిడుము

భేద భావములు లేనివాడవు
భక్తులందరూ వొకటే నీకు -
లక్ష్మిఅమ్మతో కాస్తచెప్పి నువు!
నాకు సమయము కేటాయించుము."

.పృధుచక్రవర్తి మాటలు లీలగ
వినుచు నిలచెను విష్వక్సేనుడు
మరింత ఆనందముతో పొంగి
పలికెను - భక్తిగ - హరిని గాంచుచు

నిను ప్రేమించి ఆరాధించే
భక్తులందరూ నీమాయలొ పడక
మాయలొ త్రోయగవలదని కోరుచు
నీ సేవలనే కోరుచుందురు

వరములు కోరగ అనుమతించెదవు
మాయలొ త్రోసి - త్రోవ మార్చెదవు
ఐహికసుఖముల చిక్కినవారు
కోరెదరవ్వి మూర్ఖత్వముతో

జనన మరణముల వలయములోన
చిక్కుకొందురు - మాయప్రభావము
మాకేది కావలెనొ - నీకు తెలియదా!
మరెందు కింక వరములడుగుట."

అనగా శ్రీహరి ఆనందించెను
"నీవు జ్ఞానివి - ప్రసన్నహృదయుడ!
నీవు పలికినవి - దైవము నీలో
పలికించినట్టి మాటలే సుమా!

వివేకమ్మది కలిగెను నీలో
నీభక్తి శక్తితో అసాధ్యమైన
నాదుమాయను దాటగలుగుదువు
ధర్మముతప్పక - పాలన చేయుము

నిజమగు భక్తులు - స్వర్గనరకములు
మోక్షముకూడా సమముగతలతురు
నీవు అంతటి వాడవు - తెలియుము
నీ రోష - క్రోధములు వదలివేస్తివి

నీయందు నే ప్రసన్నుడనైతిని
నీ భక్తిస్థిరమగును అనుగ్రహించితి."
అనుచు తీయగా లక్ష్మీకాంతుడు
చక్రవర్తిని ప్రశంసించెను

తిరిగి భక్తిగా పృథువు విష్ణువును
పూజించెనట వేదోక్తముగా
పూజలనంది - పరంధాముడు
ప్రయాణమయ్యెను నిజవాసమునకు

ఆసమయములో పృథువు భక్తిగా
సిద్ధ-చారణులు-మునులకు మరియు
పన్నగ-సాధ్య-గంధర్వ-పితృదేవతల
పూజించి - వారికి కాన్కల నిడెను

నారాయణుని పరిజనములకు
యథోచితముగా పూజలొనర్చి
తగుకాన్కలను వొసగె - ప్రియముగా
వారందరు - కీర్తించిరి ప్రియముగ

జగన్నాటక సూత్రధారుడు
గరుత్మంతుని అధిరోహించెను
జయజయధ్వనులు మిన్నుముట్టగా
వైకుంఠమునకు సాగెవేగముగ

నూరవయజ్ఞము జరుగలేదని
వంతమరచెను పృథు చక్రవర్తి
ఆనందముగా నగరికి జేరెను
యజ్ఞ ఫలమది లభించెననుకొనె

అలభ్యమైన దర్శనమ్మును
యజ్ఞశాలకు దిగివచ్చి యిచ్చెను
సత్కర్మ అటుల మరి ఫలించి నిలచెను
అంతకు మించిన ఫలము లభించదు

చిత్తశుద్ధిగా భగవత్ ప్రీతిగ
తలచిన కార్యము సత్కార్యమ్ము
అది తప్పక నెరవేరునన్నది
పృథువు గాథ మరి నొక్కి జెప్పును.

చక్రవర్తి వేంచేయుచుండె నను
వార్త తెలిసిన పురజనులందరు
ఆనందముతో రాజ్యమంతయు
మంగళకరముగ అలంకరించిరి

ముత్యాల సరముల సుమమాలలతో
పచ్చతోరణము లలంకరించుకు
నవవధువువలె నగరితోచెను
సుగంధమ్ముతో పవనుడు కదిలెను

చల్లని జలకము చల్లిరి వీధుల
ముత్యాలముగ్గులు తీర్చిదిద్దిరి
అరటిస్తంభములు అలంకరించి
ప్రతిగృహ మొక ముత్తైదువైనది.

రాజ మార్గమున తీవిగ రాజు
సాగు చుండగా శంఖ భేరుల
మంగళ స్వనములు నింగికెగసెను
సురలు ముదముగా గాంచిరి రాజును

భూసురోత్తములు - వేదమూర్తులు
మంగళాశీస్సుల నొసగిరి ప్రియముగ
సౌధమ్ములపై నిలబడి కాంతలు
లాజలు సుమములు శుభముగ జల్లిరి

బంగరు పళ్ళెములందు హారతులు
సౌభాగ్యవతులు తీసుకువచ్చిరి
విష్ణు నామసంకీర్తన మెగసెను
విజయ గీతికలు తీయగ వినబడె

తనపై ప్రజలకు గల అభిమానము
పృధు చక్రవర్తిని ముగ్ధుని చేసెను
వినయసంపదల వేదవేత్తలకు
పాదములంటి నమస్కరించెను

రాజుపాలనలొ ప్రజలందరును
పితృప్రేమను చవిచూడగను
ఈతిబాధలు మరచిపోయిరి
భోగభాగ్యముల ననుభవించిరి

సస్యసంపదతొ నిలచె వసుంధర
యజ్ఞయాగములు విరివిగ జరిగి
హవిర్భాగముల సురలు తృప్తిపడి
క్షామబాధ లేకుండగ జేసిరి.

ఏకచ్ఛత్రాధిపతిగా పృధువు
పరిపాలించెను భూమండలమును
శతృ రాజులకు సింహస్వప్నమై
విజయకేతనము ఎగురవేసెను

పెక్కువత్సరము లావిధముగను
సుఖశాంతులతో రాజ్యమునేలి
తత్వవేత్తయై కీర్తిగడించి
పరతత్వమున స్థానమందెను

అనుచు విదురునకు మైత్రేయుండు
తెలియ పరచెనని శుకయోగీంద్రుడు
పరీక్షిత్తునకు తెలియ బరచెనని
సూతుడు తెలిపెను శౌనకాదులకు

 ॥శ్రీ కృష్ణచరితము॥

# 21 పృధు చక్రవర్తి సభ్యులకు ధర్మోపదేశము చేయుట

పృధు చరిత్రను ఆతనికీర్తి
వినిన విదురుడు అడిగె మైత్రేయుని
పృధువు చేసిన సత్కార్యములు
వినగ - మనసయె వినిపించమనె

పాపరహితులుగ ప్రజలను చేయగ
జనన మందెను శ్రీహరి - పృధువుగ
ఆయన చరిత భావితరములకు
ఉత్తమపాఠము మరి కీర్తనీయము

తెలిసియో తెలియక పాపకార్యములు
జీవిచేయును కావున వాటిని
క్షాళన చేయగ మనస్సు కలిగి
గంగా యమునల శక్తిని తెలిసి

గంగాయమునల జలములనడుమ
తన నివాసము ఏర్పరచుకొని
ఫలములు తినుచు సాత్వికమూర్తిగ
సాగించెను - తను పరిపాలనను

అటుల భక్తిగా శక్తివంతముగ
వేదగౌరవము పెంపొందించుచు
రాజ్యమేలుచు చక్రవర్తి - తా -
యజ్ఞము నొకటి చేయదలంచెను

సంబారములు సమకూర్చుకొని
దేవ బ్రహ్మ ఋషులను సురలను
పితృదేవతల భూదేవతలను
ఆహ్వానించెను విధివిధానముగ

వచ్చినవారికి యధోచితముగా
సత్కారములు చేసెను రాజు
శుభకరగుణముల విరాజిల్లెడి
రాజును చూడగ పరవశించిరి

విష్ణువు అంశతొ జన్మించెనాతడు
శ్రీహరి అందము పుణికిపుచ్చుకొనె
నీలమేఘ - శరీరముతోను
అజానుబాహువు సుందరమూర్తి

సాక్షాత్ శ్రీహరి అన్నటు లుండెను
పాదములుండును చిగురాకులవలె
నిడుపగు కన్నులు కంబుగ్రీవము
నిరుపమాన లావణ్య ధామమది

యజ్ఞదీక్షలో మరింత అందము
సంతరించుకొనె పృధుమహరాజు
కృష్ణాజినము పట్టు వలువలు
చల్లని చూపులు జగద్రక్ష అయె

వేదవేత్తలతొ భూసురులతొ మరి
మునులు వేల్పులతొ యజ్ఞవాటిక
వేదరాశిలా అగ పడుచుండెను
మంగళశోభల వెలుగు చున్నది

తారల మధ్యన చందమామలా
వేదవేత్తల తారల నడుమ
రాజచంద్రుడు వెలుగుచుండెను
సభ్యులు - ఆనందముతో చూచిరి

దర్భలు చేకొని చక్రవర్తి - తా -
లేచి నిలచెను సభనుగాంచెను
నిశ్శబ్దముగా సభయున్నదట
సభకు వందనము చేసెను రాజు

సభనుద్దేశించి పలికెను పృధువు
"సభికులార! మీకందరకున్ను
నాకు తెలిసిన ధర్మవిషయములు
కొన్ని చెప్పగా సంకల్పించితి

ధర్మమార్గమది కారడవి వంటిది
తెలిసినట్టుగా అగబడు – కానీ
అంతుదొరకని అగాధమైనది
తెలుసు కొనుటకాసక్తి మంచిదే –

పూర్తిగ తెలియగ కోరిక గలిగిన
తనకు తెలిసిన విషయము మాత్రము
వివేకశీలురు ఉత్తములకును
ముందుగ చెప్పుట–ముఖ్యవిషయము

రాజుగ – నన్ను బ్రహ్మనిలపెను
రాజధర్మమది తలదాల్చవలె
వర్ణాశ్రమ ధర్మమ్ములు చెడక
ధర్మమార్గమున ప్రజల నడపవలె

వారి వృత్తులను ప్రోత్సహించుచు
అన్నోదకములు వస్త్రమ్ములకు
లోపములేక కాపాడవలె
నావిద్యుక్తమగు – రాజ ధర్మమది

అట్టిరాజుకు పరమేశ్వరుడు
యజ్ఞయాగముల ఫలితమ్మొసగును
ధర్మ పథమును వీడనుగనుక
సద్గతినాకు కలుగును తప్పక

అంతియెగాక ప్రజలందరును
స్వార్థత్యాగులై ఈర్ష్యలేకను
నారాయణార్పణ – అన్నతలంపుతో
స్వధర్మమ్మును అనుష్ఠించవలె

అటుల ప్రజలు మరి సంచరించిన
నన్ను ధన్యుని చేసిన వారగు
మీరందరును పితృదేవఋషి సమానులు
నాకొరకై సత్కర్మలు చేయుడు.”

అనగా సభ్యులు భక్తిగ పలికిరి
నారాయణార్పణగా కర్మలను
అనుష్ఠించగ నుడివితి వీవు
నీవుగాక మరి ఆయనెవ్వరు!

అనగా రాజు చిరునవ్వుతొ పలికెను
“మీ ప్రశ్న అది ఆశ్చర్యము గదా!
మీకా శంక ఎందుకు కలిగెను
నారాయణుడే సర్వేశ్వరుడు

మతసాంప్రదాయము వేరైనాను
నారాయణుడు ఒకడే వినుడు
యజ్ఞేశ్వరుడు యజ్ఞము ఆతడే
కర్తయు – భోక్తయు నారాయణుడే

నారాయణుని నమ్మనియట్టి
సిద్ధాంతములు – పాషండ ధర్మములు –
జ్ఞానవంతులు వాటినెన్నడు
ప్రమాణమ్ముగా స్వీకరించరు

కనబడు సృష్టి సర్వేశ్వరునిది
ఆయన కళయే – జీవ కళయగు
పాంచభౌతిక దేహమ్మునకు
ఆటపట్టు శ్రీనారాయణుడే

జీవులు చేసెడి కర్మకాండలవి
నారాయణుని కల్పితమేయగు
ఆయనలేడు - అన్నచో మరి
ఇవి యన్నియును లేనట్లేయగు

నారాయణుడు కలడా లేడా!
అనుసందేహము అణగద్రొక్కునది
అటులయినచొ-మరి కర్మవాదమగు
ఉనికిలేనటు - వీగి పోవును

ప్రియవ్రతుండు - ఉత్తానపాదుడు
ధృవ స్వాయంభువ మనువులును
మాతాత అయిన ఆ అంగరాజును
ఎందరొ రాజులు పాలించి సాగిరి

బ్రహ్మ-రుద్రులు-ప్రహ్లాద-బలి మొదలగు
భాగవతోత్తములెందరొ - తిరిగి
శాశ్వతమైన ముక్తి భాగ్యమును
పొందగలిగిరి - నారాయణ కరుణచె

వేనుడు మొదలగు దుర్మార్గులెందరో
ధర్మదూరులై దుర్గతినందుట -
ఆదిదేవుడు - ధర్మస్వరూపము
అయినటువంటి నారాయణలీల

ధర్మపరులకు చేయందించి
ఆవలగట్టుకు చేర్చునాతడు
వాసుదేవునికి పగవారెవ్వరు!
కుటుంబమును ద్వేషించున తండ్రి!

జగత్ కుటుంబమునకాయన జనకుడు
నారాయణుడు కలడా అనెడి
సందేహమ్ము అట్టివాదనలు
వదలి వేయమని నాదు ప్రార్థన

భగవద్భక్తుల కోర్కెలు తీర్చి
ముక్తిపథము నందించును శ్రీహరి
సర్వాధికారి - సర్వనియంత -
అక్షరుడాతడు - భక్తసులభుడు

అకుంఠిత తపోదీక్షతొ మునులు
వాసుదేవుని పదపద్మమ్ముల
దర్శించగను - సేవచేయగ
ఎదురు చూతురు తహతహలాడుచు

నారాయణుని పదసేవ యది
సంచిత పాపము హరింపజేయును
పాపక్షాళన చేయు గంగయది
గంగేపుట్టిన పవిత్రపదములు

హరి పదసేవచేయు భక్తుడు
అజ్ఞాన తిమిరము నుండి బయటపడు
జనన మరణముల వలయములోనికి
రానేరాడు అది నిశ్చయము

ఆయనసాటి వేల్పు మరొక్కడు
లేడు లేడు - మరి లేనేలేడు
నారాయణునికి కానిది లేదు
ఆయన లేనిది లేదు జగత్తున

శ్రీహరి ఆజ్ఞతో చేయుచుంటిమని
కర్మలు చేయుడు భక్తి ప్రపత్తుల
నిండు మనస్సుతో కీర్తనచేయుడు
భక్తి ఒక్కటే త్రోవచూపునది

యజ్ఞమూర్తి అని శ్రుతులు చెప్పును
వ్రీహి మొదలగు ద్రవ్యమ్ములును
శుక్లాది గుణములు అవఘాతక్రియలు
మంత్ర సంకల్ప - ఉపకారమ్ములు

పదార్థశక్త - జ్యోతి ష్టోమము
మొదలగువన్నీ యజ్ఞరూపములు
అట్టి యజ్ఞము నారాయణుడే!
యజ్ఞము చేయుట హరిని భజించుట

కర్మానుభూతి అదృష్టమ్మను
కారణమ్ములతొ జనించు దేహమున
ఈశ్వరుండు - తా - దేహి చేసెడి
క్రియలవల్లను ఫలితమ్ములను

వ్యక్తము చేయుచు నుండును అతడు
ఆనంద రూపుడు ఫలములు కోరడు
జగత్తు ఈశ్వరమాయ జనితము
జ్ఞాన కాంతిలో నిజము తెలిసెదరు

హరిభక్తులు మరి ఉత్తమోత్తములు
జగన్నాయకుని దృఢమగు భక్తితొ
ఆరాధించెడి వారు కనుకనే
పుణ్యాత్ముడను అయితిని నేను

అట్టివారికి నా కృతజ్ఞతలు
మరి యొకమాట - సిరిసంపదలు
అధికారములు - ఐశ్వర్య ప్రతాపము
రాజుల తేజము మొదలగువన్నీ -

శమ దమాదిశాంత గుణములతొ
తపోదానములు విద్యా విభవము
కలిగియుండి మరి విష్ణుభక్తులగు
బ్రాహ్మణోత్తముల - శాసించవు వినుడు!

వేద వేత్తయగు బ్రాహ్మణుడెంతయొ
ప్రీతిపాత్రుడు - మహావిష్ణువుకు
వారి అనుగ్రహ మందుట వలనే
లక్ష్మిభార్యగా దొరికిన దనును

వేదవేత్తల సేవా ఫలితము
జగద్విఖ్యాతియగు కీర్తియనుచును
వారిసేవలు చేసినవారికి
ప్రసన్నుండను అగుదును - అనెను

యోగ విద్యలు తెలియకపోయిన
వేద విప్రుని సేవల వలన
మోక్షము కలుగును అనిసెలవిచ్చెను
అట్టి సేవలు అమోఘమైనవి

ఆత్మతత్వము తెలిసిన జ్ఞానులు
ఇంద్రాదులపేరున-బ్రాహ్మణముఖమున
సమర్పించిన హవిస్సు - విష్ణువు
సంతుష్టిగ - తా - స్వీకరించును

సర్వమయుండు శ్రీహరియగును
హుతవాహనుడు గొప్పకాదు మరి
కేవలమగ్నిలొ వ్రేల్చిన హవిస్సున
విష్ణువు కెంతయు ప్రీతికలుగదు

విశ్వమంతయు అద్దమువలెను
వేదములో మరి దర్శనమిడును
బ్రహ్మస్వరూపము వేదము అగును
పరిశుద్ధమది శాశ్వతమ్మది

అట్టివేదమును వేదవేత్తలగు
బ్రాహ్మణోత్తములు ఉపాసింతురు
వేదార్థమును తెలుసుకు వారు
ఆరాధింతురు – నిశ్చలవ్రతముగ

అట్టివారిదగు పాదధూళియది
తలను ధరించిన పునీతులగుదురు
నేనుకూడ ఆ పాదరేణువును
నామకుటమున ధరించుచుందును

గో – బ్రాహ్మణుల – హరి ప్రసన్నుడు
అట్టి శ్రీహరి నాయందు నిరతము
ప్రసన్నుండై ఉద్ధరించవలె
మిమ్మందరినీ రక్షించవలె."

అనుచు ప్రియముగా చక్రవర్తి అట
పలికిన పలుకుల పరవశించిరి
శుభము – శుభమని సభికులందరూ
అభినందించిరి ఆ మహరాజును

"రాజా! నిన్ను పొందిన ఫలితము
వేనుడు తరించె – నరకముకేగక
అతనిపాపములు హరించి పోయెను
నిస్సందేహము నిర్మలమూర్తీ!

సత్సంతానము బడసిన తండ్రి
లోక విజేత అగునను – వేదము
విష్ణువిరోధి హిరణ్యకశిపుడు
తరించె తనయుడు ప్రహ్లాదునిచే

నీ పాలనలో క్రమశిక్షణతో
మెలిగెడి జనుల ఆశీస్సులతో
వేయి వసంతములు రాజ్యమేలుము
భావితరములకు – నీవొక స్ఫూర్తి

విష్ణుపాదముల చెదరని భక్తి
కుదిరెను గనుకే భాగవతులలో
అగ్రగామిగా కీర్తినందితివి
ఈశ్వరులీల – చెప్పితివీవు

సామాన్యమగు క్షత్రియుండవు
అనుకోమయ్యా! శ్రీహరి వీవే
నీవు మాకు మరి ఏలిక కాగా
హరికింకరులము ధన్యులమైతిమి

దైవ కల్పితము మాయవల్లను
అజ్ఞానములో చరించుమాకు
ధర్మబోధతో వెలుగుచూపిన
దివ్యతేజము నీవైతివయా!

వేదవేత్తలను ఆదరించి మన్నించుచును
వారిసేవలు చేయుట యందలి
పరమార్థమును తెలిపితివయ్యా!
హృదయపూర్వక నమస్సులందుము."

అటుల సభికులు జయజయ ధ్వనులు
పలుకుచుండగా ఆకస్మికముగ
బాలభాస్కరుడు ఉదయించినటు
వెలుగులు చిమ్మెను ఆప్రదేశమున.

॥శ్రీ కృష్ణచరితము॥



## 22 పృధు చక్రవర్తి వద్దకు సనకాదులు వచ్చుట

బ్రహ్మజ్ఞాన సంపన్నులు వారు
తేజోపుంజము నడచినట్లుగా
ప్రాప్తసిద్ధులు సనకాదులచ్చటకు
అరుగుదెంచిరి వెలుగులు సాగగ

పృధు చక్రవర్తి భక్తి వినయముల
ఋత్విక్కులతో స్వాగతమిచ్చి
నమస్కరించెను శిరస్సువంచి
ఉచితాసనమున కూర్చొనజేసెను

పులకరింతతో పదములు కడిగి
శిరస్సున ధరించె - జన్మ తరించగ
రూపుదిద్దిన అగ్నిహోత్రమగు
దివ్యమునులతో పలికెను రాజు

"శుభములరాసులు - వేదస్వరూపము
మహాయోగులకు దర్శనీయమగు
మీముఖ పద్మము గాంచెడి భాగ్యము
కలుగ జేసిరి దయగొని నాపై

బ్రాహ్మణోత్తములు - శివకేశవులు
హరిభక్తులును వాత్సల్యముతో
అనుగ్రహించిన - జన్మధన్యత
స్వర్గమర్త్యలోకమ్ముల-అసాధ్యమెరుగరు

లోకసంచారము చేసెడి - మీరు
నన్ననుగ్రహించగ వచ్చుట వలన
నాజీవితమ్మది పునీతమైనది
గృహస్థులందున మిన్నగనైతిని

ఆత్మవేత్తలు భూతహితులగు
మీవంటివారి పాదధూళియది
లేని గృహము అది సంపదలున్నను
పాములుచుట్టిన వృక్షమువంటిది

పిన్నవయస్సునే బ్రహ్మోపాసన
భగవద్భక్తి సంసార విరక్తి
కఠోరవ్రతము నాచరించిన
యోగిపుంగవులు శుభములనెలవు

త్రోవతెలియక అజ్ఞానముతో
సంసారలంపటము నందు చిక్కిన
సారములేని సంసార జీవులము
మాక్షేమమ్మది మీ అనుగ్రహము

సుఖదుఃఖములు పొంగి క్రుంగుటలు
చిత్త విభ్రమ కల్పించు సుఖములు
లేనిమీకు మరి బాధలుండవు
యోగక్షేమములు అడుగుటెందుకిక -

తరించ శక్యము గానటువంటి
సంసార జలధిని దాటించగల
శక్తిమంతులు - దయతో నాకు
మార్గోపాయము సెలవీయవలె!

తనభక్తులను ఉద్ధరించుటకు
సాక్షాత్ శ్రీహరి మీవంటి వారివలె
దర్శనమిచ్చి ధన్యుల జేయును
కావున మార్గము సెలవీయుడనె!





## 23 సనత్కుమారుడు పృథు చక్రవర్తికి తత్వబోధ చేయుట

రాజు పలుకులకు చిరునగవులతో
పలికె నంతట - సనత్కుమారుడు
"ఆర్షధర్మము ఆకళించుకొని
ఆచరణలొ పెట్టిన-నీతి మంతుడవు

సర్వజీవులను సమముగ చూచే
సద్గుణసంపద కలిగిన వాడవు
ధర్మము నీ పరిపాలనలోన
వృద్ధినందినది రాజచంద్రమా!

సకల శుభములకు నెలవు నీగృహము
ధర్మమార్గమున చరించు వాని
జీవితమిటులే సాగు సుఖముగా -
ఉత్తమమైన ప్రశ్నవేసితివి

ఉభయతారకము నీ ప్రశ్నయది
లోకులందరకు క్షేమకరమది
మోక్షకాంక్షివి - విను మహరాజా!
అనుచు పలికెను మునిపుంగవుడు

మాధవసేవాను రక్తియన్నది
ధ్యాన - వివేక - సద్బుద్ధి ఉత్సుకత
సద్గుణచింతన స్థిరవైరాగ్యము
పుట్టుకతో నీ కొచ్చినదయ్యా!

లోకక్షేమముకు రెండు హేతువులు
నిర్మోహమ్ము - బ్రహ్మజిజ్ఞాస
తనకుకానిది వలదను వైరాగ్యము
ఆత్మోపానన - ఆత్మశోధన

వాటిని మించి మానవున కిల
శాశ్వతపథము పొందగలిగిన
సాధనాలు మరి లేనేలేవు
హరి ఆనతితో వివరించ వచ్చితిమి.

బ్రహ్మోపాసన యందున - రక్తి
భగవంతుని పలికే ధర్మమ్ములను
ఆచరించుట తెలియ గోరుట
అట్టి యోగమున స్థిరత్వమున్ను -

ఓంకారరూపుని ఉపాసించుట
శ్రీహరి కథలను వినుట - చెప్పుట
అర్థ దాసులు ఇంద్రియలోలుర
స్నేహమెంతయు చేయకపోవుట

అర్థకామముల నిరాసక్తియు
హరిగుణ కీర్తన పైననె కాంక్ష
చిద్రూపమగు బ్రహ్మ పదార్థము
చర్చించుటయు - శోధించుటయు

ఏకాంతవాసమునందు మక్కువ
అహింస బుద్ధి - శమదమాది రక్తి
యమ నియమమ్ముల నాచరించుచు
పరా భక్తి మార్గమును నిందించగరాదు

దేహ సుఖములకు ప్రాధాన్యమివ్వక
ద్వంద్వమ్ములను సహించు ఓర్పు
ఈ గుణములతో భక్తిమార్గమును
స్థిరము చేసుకు వైరాగ్య బుద్ధితో

నిర్గుణ పరబ్రహ్మము నందనురక్తి
కలిగినచో మరి గురువు వల్లను
ధర్మోపదేశము గ్రహించవలెను
అటుల గురుకృప - పొందిన వాడు

బ్రహ్మనిష్టలో చరించు చుండి
ఈషణత్రయముల నంతము చేసుకు
ప్రకృతి సుఖముల కందకుండను
జ్ఞాన వైరాగ్యములు పెంచుకోవలె

భక్తి పరముగా జ్ఞాన వైరాగ్యములు
తీరుగ పెరిగిన - భక్తియోగమది
మరింత బలపడి-స్థిరముగనుండును
జీవధార బంధమ్ముల త్రెంచగ

సద్ధర్మమది అవగతమగును
దానితొ సుఖముల విరక్తి కలుగును -
ఫలితము జీవికి బంధములన్నీ
విడిపోవును అది - చివరిమెట్టగును

శరీరము నిలబడ - ఉపాధి ఎటుల
భిన్నమగునన - వివరించెదను
స్వప్న జగత్తు చెరిగిపోగనే
యదార్థ మెట్టుల నిలబడి యుండునొ

అటులే - హృదయపు గ్రంధివిడివడి
ఉపాధి తొలగగ జ్ఞానముకలిగి
బాహ్యాంతర గుణభేదములడగి
అప్పుడు కలుగును ఆత్మజ్ఞానము

చూచున దాత్మ చూచెడి దింద్రియార్థము
అహంకారము వాటి బంధమది
అహంకారమ్ముతొ భేదము కనబడు
అట్టిభేదము తొలగిపోవలె -

ఇంద్రియమ్ములు కోరు-విషయ సుఖమ్ములు
దానికి మనస్సులొంగిపోయిన
ఆత్మవిచారణ శక్తి నశించును
దానితొ పరతత్వ జ్ఞానముచెడును

విజ్ఞాన వినాశమున ఆత్మ దూరమగు
విషయ సుఖములకు లొంగిపోయిన
సర్వము ఆత్మకు ప్రియమే అగును
ఆత్మ అట్టుల మోసగింపబడు

ఆది అంతములు లేనటు వంటి
సంసార కూపమున బయటపడగను
ధర్మార్థకామ మోక్షములకు భంగమగు
త్రోవలొ - తాను నడవ కూడదు

అన్నిటిలోన మిన్నయైనది
మోక్షము అనెడి పురుషార్థమ్మగు
గుణముల మార్పుతొ-మాకు-విరించికి
మొదలగువారికి - కాలరూపియగు

ఈశ్వరదేవుని వలన - కలిగెడి
భయము అన్నది-ఉండును రాజా!
కుశలము అన్నది-మాకు లేదు విను
పరమార్థము-ఒక్క మోక్షమే-విను!

దేహేంద్రియములు-ప్రాణము బుద్ధి
అహంకారములు సమ్మేళనము-సృష్టి
అందులొ ఈశ్వరు డంతర్యామి
నడెపెడివాడు - నడిచెడి దతడే

కర్మయు మరియు కర్మసాక్షియు
రూప ప్రతిరూపములు ఈశ్వరుడేయగు
కనబడు నట్టిది - లోన వెలుగునది
ఈశ్వరుడే యగు నారాయణ తత్వమిది!

ప్రకృతి వికారముల కందనివాడు
గుణవిముక్తుడు - పరిశుద్ధుడును
ఉత్తమశ్లోకుడు భక్త రక్షకుడు
దుష్ట శిక్షకుడు - దయాసముద్రుడు

పాప పంకిలము క్షాళనచేసే
విశ్వనాథుడు - విమల చరిత్రుడు
మనసా వాచా - సేవించుమయా!
అహంకార మను - రిపుని గెలతువు

ఇంద్రియ నిగ్రహమ్మది సాధించిన
ముక్త సంగులగు యతులకు కూడా
చేర నసాధ్యము అయిన శ్రీహరి
భక్తికి వశుడై భక్తసులభుడగు

భాగవత ప్రియుడు - సర్వనియంత
అట్టి ఈశ్వరుని మనఃపీఠమున
ప్రతిష్ఠించుకు అత్యంత భక్తితో
నీవేశరణని - ఆహ్వానించుము

యజ్ఞయాగముల ప్రక్రియలన్నీ
పాపక్షాళనకు ఉపకరించినను -
అరిషడ్వర్గపు అలలతొనిండి
కోర్కెలు అనెడి మకరులు నిండి

భయంకరమ్మగు భవసాగరమును
దాటించి - ఈశ్వరుని దరికి చేర్చునది
లక్ష్మీపతి పద సేవను నావయె!
అది - మది నిలపి - గమ్యము చేరుము

భక్తి పండి మరి పరవశమ్మున
కీర్తించిన కొలదీ దగ్గర కొచ్చును
యోగ యాగములు ఆ పరమాత్మని
దగ్గరకు మరి తీసుకు రావు!”

అనుచు ప్రియముగ సనత్కుమారుడు
పరతత్వమును విశదపరచెను
ఆనందవార్నిధిని తేలెను పృథువు
అనేక విధముల స్తుతించె - మునిని

"పూర్వజన్మకృత పుణ్య విశేషము
మహానుభావులు మీరాకయిది
జన్మసిద్ధులు భాగవతోత్తములు
ఈశ్వరానుగ్రహ మందిన ఘనులు

నామనవిని మీరు అవధరించుడు -
నాదేహము-రాజ్యము-విభవములన్నీ
వేదమూర్తుల ఆశీర్వాదమె
వారి అనుగ్రహము లేక - లేవివి

కావున - నావి అన్నవి ఏవియు
లేవను భావన - కలిగి యుంటిని
నా సమస్తము వేద విదులకు
బ్రాహ్మణోత్తముల కంకితమైనది

తత్వబోధతో జ్ఞానము పోసిన
భక్తశిఖామణులు - మీరందరును
ఏ విధముగ - నే పూజించెదను?
నాది అనెడిదిక ఏమియులేదు!

సర్వలోకముల కాధి పత్యము
వేదమూర్తులు బ్రహ్మణులదగు
అని నా నిర్ణయ మది మదినుంచితి
వారి అనుగ్రహ మీ భోగములు

అంతయు అంకిత మనుచు నిప్పుడు
వేదవిదులకు అర్పించితిని
నాకు ఏమియు హక్కులేదు మరి
మిమ్ముల నెటుల సత్కరింతును

అయినా నా మదిలోని భావన
ప్రత్యుపకారము కోరని మునులు
భక్తాను గ్రహ కోర్కెతో నాకు
ఉపదేశించిన దానికి నేను

ఏదోమీకు యివ్వ బూనుట
హాస్యాస్పదము అనిపించును కద!
కావున నేను భక్తి ప్రపత్తుల
మీపదములంటెద - పావనమూర్తులు!

నిండుమనస్సుతొ ఆశీస్సులనిడ
శ్రీహరి స్వయముగ అనుగ్రహమ్ము
చూపినట్టగు - అనుచు మ్రొక్కెను"
ఆనందించిరి సనకాదులట

రాజు పలుకులు వినయసంపదకు
ముగ్ధులాయిరి సదస్యులందరు
సాక్షాత్ - శ్రీహరి సన్నిధినుంటిమి
అనుచు భక్తిగా - రాజుకు మ్రొక్కిరి



॥శ్రీ కృష్ణచరితము॥

## 24 పృధు చక్రవర్తి కైవల్యమొందుట

యజ్ఞసమాప్తి చేసుకు పృధువు
నగరమ్మునకు తిరిగివచ్చెను
బ్రహ్మమానస పుత్రులవలన
ఆత్మతత్వము తెలిసినవాడు

తన అభీష్టము నెరవేరినదని
ఆనందమును సంతృప్తిని పొందెను
గుణాను భూతికి లొంగక - తాను
వివేకముతో పాలన చేసెను

భోగభాగ్యముల కాంక్షపెంచక
అహంకారమును - దరి రానీయక
నిర్మలమనస్సుతొ విష్ణుభక్తితో
రాజ్యపాలన కొనసాగించెను

తామరాకు పై నీటి బొట్టులా
సంసారములో నున్నను - రాజు
వాటి ప్రలోభమ్ములకు లొంగక
నిరంతరమ్ము హరిని తలంచును -

చక్రవర్తికి - దేవేరి - అర్చి - యగు
ఆమెకు తనయులు-విజితాశ్వుండు
ధూమ్రకేశుడు - హర్యశ్వుండు
ద్రవిణుడు-వృకుడు అనెడి యోగ్యులు

కిరణమ్ములతో నీటిని గ్రహించి
తిరిగి యిచ్చును భాస్కరదేవుడు
అటులే రాజు - ప్రజలసొమ్మును
వారి శ్రేయముకు వినియోగించును

అగ్ని తేజము కలిగిన రాజు
పరాక్రమములో రెండవ ఇంద్రుడు
ఓర్పున కాతడు భూదేవతయగు
కోర్కెలు తీర్చగ - నాకము పోలెను

గాంభీర్యమున - సాగరసముడు
సంపదలందు కుబేరుడు - చాలడు
ధర్మవిషయమున ధర్మజు మించును
వాయుదేవునిగ సర్వవ్యాపకుడు

రుద్రుని మించును తేజమునందు
అందమునందు మన్మధుమించును
శౌర్యమునందు కేసరి సముడు
ప్రజావాత్సల్యమ్మున - మనువగు

విరించి వలెను చక్రవర్తి - తా -
భూలోకమునకు విధాత అయ్యెను
బ్రహ్మవాదిత్వమున బృహస్పతి చాలడు
జితేంద్రియుండు - విష్ణుభక్తుడు

శుభకర గుణముల నెలవే తానై
గిరులు తరువులు పృధుమహరాజు
కీర్తిగానమున - అలసిపోయినవి
ముల్లోకములు కీర్తించె - ముదముగ

యశోవిక్రమము - రూపసంపదల
శ్రీరాముని మరి కీర్తించినటు
రాజ శబ్దము సార్ధకమైనటు
పృధు చక్రవర్తిని కీర్తించె - జగములు

జ్ఞానమ్మునకు తగు - శాంతమున్నది
గంభీరమునకు - తగు ప్రసన్నత
పరాక్రమమ్ముకు తగు సంయమనము
పండితపామర ప్రశంసలందెను

అటుల తండ్రివలె - అనురాగముతో
పరిపాలించిన చక్రవర్తి - తా -
వయోభారము మీద పడగను
రాజ్యభారము తనయుల కిడెను

రాజర్షి - తా - సహధర్మిణితో
తపోయోగ్యమగు వేషము దాల్చి
తపోభూములలొ కందమూలముల
అకుంఠిత దీక్షతొ తపము చేసెను

రాలిన ఆకులు ఆహారముగా
తీవ్రతపమును ఆచరించెను
పిమ్మట - జలముతో కొంతకాలము
ఆపై - వాయుభక్షణ చేసెను

మండుటెండలో అగ్నివలయమున
సూర్యునిపైన దృష్టి నిలపి మరి
కుంభవృష్టిలో ఆరుబయిటన
తీవ్ర తపమును ఆచరించెను

చలిలో - నీటిలొ నిలబడి తపమును
కొనసాగించిన పృథువును గాంచి
ప్రకృతి - తాను నివ్వెరబోయెను
సుకుమారుని కెటు-సాధ్యమయ్యెనని

మహామునులు ఆ తపోదీక్షకు
ఆశ్చర్యచకితులై నిలచిపోయిరి
తపోధనుని - తపమది ఫలించి
అరిషడ్వర్గము అంతరించినది

శరీర బంధములన్నీ సడలెను
సనత్కుమారుని యోగ క్రమమును
ఆచరించి - కృతకృత్యుడయ్యెను
హరిని గాంచెను-లోపల వెలుపల

పరిణతనంది జ్ఞానయోగమును
అధిగమించి - తా - ఆత్మను ఆత్మతొ
అనుసంధానము చేసి అంతట
బ్రహ్మానుభూతి నందెను పృథువు

ఆపై మిగిలిన కళేబరమ్ముతొ
పనితీరినదని - గ్రహించి రాజు
మూలాధారమునుండి వాయువును
ఊర్ధ్వముఖముగా సాగనిచ్చెను

నాభికిజేర్చి అచ్చటినుండ
హృదయాది స్థానమ్ములకు
పంపి - అంతట బ్రహ్మరంధ్రముకు
పంపగ - ప్రాణము నిష్క్రమించినది

పంచభూతముల - తన శరీరమును
ప్రాణవాయువును - లీనముచేసి
ముక్తుడయ్యెను - పృథుచక్రవర్తి
మాధవ లోక నివాసము కేగెను

భర్తవెంబడి నీడగ సాగిన
అర్చాదేవి అతి సుకుమారి
నియమనిష్టల - నిశ్చలభక్తితొ
భర్త అడుగుల నడచె భక్తిగా

అంతఃపురముల రాజ్యభోగముల
తేలి ఆడెడి - సుమసుకుమారి
పతితలపులతో - నుండెడి సాధ్వి
కఠోర దీక్షకు అలవాటుపడె

పతితోతాను ఆహారనియమము
పాటించుచును శుష్కించుచును
పతిశుశ్రూషల పరవశించుచు
దేహసుఖములు - మరచిపోయినది

తనతో మనుగడ సాగించిన భర్త
తనదారిన - తను సాగిపోవగా
తనముందున్న మృతకళేబరము
కర్తవ్యము - బోధించె సాధ్వికి

మానవ సహజపు మమకారముతో
రోదించినది - భీకరాటవిని
ఊరడించుటకు ప్రకృతి కాంత
నడుముకట్టినటు - కట్టెను రోదన

క్రీకారణ్యము నందున నీకు
చేయగదగిన ఏ - కార్యములేదు!
కర్తవ్యము నీ ముందువున్నది
అన్నటు - ఆత్మ ప్రబోధించినది

వెంటనె లేచి మనస్సును బిగించి
మందర పర్వత సానువులందు
చితి నేర్పరచి జీవితేశునికి
ఉదకదానము చేసి - పతివ్రత

వేల్పులందరకు మ్రొక్కులు తీర్చి
చితాగ్ని చుట్ట - ప్రదక్షిణించి
దివ్యయానమున - సాగెడి పతికి
ప్రక్కన పడుకొనె - చిరునగవులతో

పరమ పతివ్రత - పావన చరిత
పావనునికి మరి పవిత్రత - నిడ
పయన మగుటగని అగ్నిహోత్రుడు
ఆహ్వానించి - ధన్యుడాయెను

అర్చాదేవి - సహగమనమునకు
నింగిని - సురలు కీర్తించిరి భక్తిగ
మందార సుమముల జల్లులు చితిపై
కురిపించిరి - ఆ జంటకు మ్రొక్కిరి

భక్తి గీతములు - దేవనృత్యము
చేసిరి - సిద్ధ గంధర్వులు - నింగిని
దేవదుందుభులు మ్రోగించిరి భక్తిగ
సుమంగళిని - కీర్తించిరప్పుడు.

అర్చాదేవి తేజో రూపిణిగా వెలుగుచు
దివ్యవిమానము నధిరోహించి
గగనయానమున భర్తకు ముందుగ
ఉత్తమలోక ప్రయాణము చేసెను

పతికి వెనుక - తా - సహగమనమ్మును
చేసిన సాధ్వి - భర్తకు ముందే
ఉత్తమగతికి ప్రయాణ మగుట
ఆశ్చర్యముగా గాంచిరందరు

యోగీశ్వరులు ఆత్మోపాసనతొ
పొంద నసాధ్యము అయిన పథమది
పతివ్రతా ధర్మమ్మున - చరించి
సాధించినది అర్చాదేవి

పతివ్రతకిల అసాధ్యమన్నది
లేదని - తాను నిరూపించినది
అనుచు - లోకములు శ్లాఘించినవి
శాశ్వతపథముకు - అర్చ్వరాలనె

మోక్షసాధనకు మానవజన్మ
అనుచు నమ్మిన హరి భక్తునికి
అనుంగుసతియగు అర్చాదేవి
జన్మసార్థకత చేసుకున్నదని

మైత్రేయుడట విదురుని కంతయు
విశదపరచి మరి పలికె తీయగా
ధర్మస్థాపనకు ఇలలో పుట్టిన
శ్రీహరి అవతారమ్ము పృథువగు

శ్రీహరి యొక్క లీలావతారముల
పృథు అవతారము శ్రేష్టమైనది
ఈ చరిత్రను వినిన - చదివినా
వ్రాసినవారి పాపక్షాళనగు

పృథు చక్రవర్తిని పోలినవారై
పాపవిముక్తితొ ఉత్తమగతిని
పొంద గలుగుదురు నిస్సందేహము
ఆనంద సౌఖ్యములు దండిగ నిడును

భక్తి యుక్తుడై బ్రాహ్మణోత్తముడు
ఈ చరిత్రను పఠించినంతనె
బ్రహ్మతేజమది వచ్చిచేరును
రాజు చదివిన - భూపతి అగును

వైశ్యుడు చదివిన కుబేరుడగును
ఎవ్వరు దీనిని భక్తితొ చదివిన
ఉత్తమ జీవిత గమనము సాధ్యము
ముమ్మారు చదివిన కుబేరుడగును

అనామకుడు యశోవంతుడగు
నిస్సంతుకు-కలుగును ఉత్తమ సంతతి
మూర్ఖుడు తాను జ్ఞానిగ మారును
మాననీయము - మంగళప్రదమిది

ధనధాన్యవృద్ధిని యశస్సుపెంచును
కలికాల దోషముల కడిగివేయును
పురుషార్థసాధకము లైనటువంటి
సర్వసుఖములు అందజేయును

ఆయుర్భాగ్యము పెంచును చరితము
శత్రువిజయము కలుగ జేయును
హరి భక్తితొ - పృథు చరిత్ర చదివినా
సంసార సాగరము తరించగలిగి

శ్రీహరి కటాక్ష సౌభాగ్యముతో
సుఖసౌఖ్యములు మనశ్శాంతియు
ఆరోగ్యముతో పూర్ణజీవితము
అనుభవించి-తా-పొందు మోక్షమును

తండ్రి తపమునకు వెడలగ నంత
విజితాశ్వుడు - తా - గద్దెనెక్కెను
ధైర్య స్థైర్యముల పరాక్రమమ్మున
తండ్రినిపోలిన - వాడై ఏలెను.

విజితాశ్వుడు అను బిరుదము వచ్చిన
విషయము నీకు చెప్పియుంటిని
మరి యొక పేరు 'అంతర్ధానుడు'
నూరవదైన అశ్వమేధమున

అంతర్ధాన గతిని ఇంద్రుడు
అశ్వము హరించ వచ్చెను గనుక
పృధు తనయుడు-తా-తెచ్చెనశ్వమును
అందుల కాతడు అంతర్ధానుడయె

జితాశ్వునికి తమ్ములు - నలుగురు
హర్యశ్వునికి తూర్పురాజ్యము
ధూమ్రకేతుకు - దక్షణ భూములు
వృకునికి పశ్చిమ రాష్ట్రములున్న

నాల్గవాడగు ద్రవిణుని కంతట
ఉత్తర దిక్కులొ రాజ్యము లిచ్చి -
తమ్ములందరిని ప్రేమగచూచెను
వారి పాలన సాగె చల్లగా

విజితాశ్వునికి పెద్ద భార్యయగు
శిఖండిని - తా - ఉత్తమురాలు
ఆమెకు కలిగిన ముగ్గురు తనయులు
పావక - పవమాన-శుచిలను వారు

వశిష్ఠ శాపము నందిన యట్టి
త్రేతాలాగ్నులు ఆవిధముగను
మానవ - గర్భవాస జనితులు
ఆత్మశక్తితో స్వస్వరూపములందిరి

విజితాశ్వుని రెండవ భార్యయగు
నభస్వతికి పుట్టెను - హవిర్ధానుడు
హవిర్ధానుడు పుట్టిన వెనుక
విజితాశ్వునిలో మార్పువచ్చెను

ప్రజలను దండించి పన్ను గ్రహించుట
తగదని - మదిలో యోచన చేసెను
పాపపంకిలము పారద్రోలగా
ప్రాయశ్చిత్తము యజ్ఞమనుకొనె

సంకల్పమది వచ్చినంతనే
రాచకార్యములు ప్రక్కకు పెట్టి
యజ్ఞము నొకటి నిర్వర్తించెను
యజ్ఞఫలము శ్రీహరికి వొసగెను

పురుషోత్తముని ఆరాధించుచు
పునీతుడై - తా - నిశ్చలమనసుతొ
హరియందు - మనస్సును లగ్నముచేసి
పాపరహితుడై - పరమపదముగొనె

ఆతని తనయుడు హవిర్ధానుడు
రాజై - రాజ్యము నేలసాగెను
ఆతని భార్య - హవిర్ధానియగు
ఆమెకు తనయులు ఆరుగురయ్యా!

బర్హిష్మదుడు - గయుడు - శుక్లుడు
కృష్ణుడు - వత్యుడు జితవ్రతుండు -
అందులొ జ్యేష్టుడు బర్హిష్మదుడు
అ విచ్ఛిన్నముగ చేసె యజ్ఞములు

నాల్గుదిక్కులలొ యజ్ఞశాలలు
కట్టించి - దర్భలు సంబారముల
ఏదోయజ్ఞము చేయుచుండెను
శ్రీహరి ప్రీతిగ - చేసెను సర్వము

ధ్యానమూర్తియై బ్రహ్మనిష్టుడై
బ్రహ్మదేవుని పోలెను రాజని
బర్హిష్మదుని కీర్తించిరి ప్రజలు
సుఖసౌఖ్యముల గడపసాగిరి

ప్రాచీనాగ్రముగా యజ్ఞము కొరకు
తూర్పుదిక్కుకు కొసలుండునటు
దర్భలు పరచినాతడు గావున
ప్రాచీన బర్హి - అని పిలవబడె

ప్రాచీన బర్హికి భార్య - 'శతధృతి'
రత్నాకరుని కుమార్తె ఆమె
ఆమె అందముకు దేవతాపురుషులె
ముగ్ధులాయెడి అంతటి రూపము

సౌందర్యమునకు రతి-సమానమగు
చదువుల కామె - వీణాపాణి
తేజమునందు - భాను ప్రభయగు
నడకల హంసలు తలవంచుకొను

వివాహసమయము నందున ఆమె
అగ్ని ప్రదక్షణ చేయుసమయమున
ఆ సౌందర్యమునకు అగ్నిదేవుడే
మోహపాశముల బద్ధుడాయెను

సుందరమూర్తిని సుగుణాలరాశిని
వివాహ మాడిన - ప్రాచీన బర్హి
ధర్మాత్ముడని సురలు పొగడిరి
వారి పెండ్లికి - విరించి పెద్దయె.

శతధృతియందు ప్రాచీన బర్హికి
పదిమంది తనయులు వుద్భవించిరి
ధర్మతత్పరులు - నియమనిష్టల
ప్రసిద్ధులాయిరి - తగిన తనయులని

తండ్రి ఆనతిని తపోదీక్షతో
వనముకు వారు - సాగుచుండగా
రుద్రుడు మెచ్చి దర్శనమిడెను
హరిపరమైన-యోగస్తుతిని - తెలిపెను

ఆ స్తోత్రములో జప ధ్యానముల
పూజల నిష్టతొ ప్రచేతసులు మరి
జగన్నాధుని - పదివేలేండ్లు
ఆరాధించిరి - అని మైత్రేయుడన

విదురుడడిగెను వినయమునిండి
"మౌని చంద్రమా - అడవికి తపముకు
వెడలిన యట్టి ప్రచేతసులకు
మహాదేవుని దర్శన మెటులయె

మహేశ్వరుండు ప్రసన్నుడై మరి
వారికి ఉపదేశించిన యట్టి
శ్రీహరి స్తోత్రము ఎట్టిది స్వామీ!
ఆయన దర్శన భాగ్యమె కష్టము."

చిరునగవులతో పలికె మైత్రేయుడు
నీవడిగెదవని నాకు తెలియును
నీకు చెప్పమని ఈశ్వరాదేశము
దాచుటకేమియు లేనిది వినుము.

 ॥శ్రీ కృష్ణచరితము॥

## 25 రుద్రుడు ప్రచేతసులకు హరిస్తవము తెలుపుట

తండ్రి ఆనతిని తలను ధరించి
వివేకనిధులు సౌజన్యమూర్తులగు
ప్రచేతసులు తపోదీక్షతో
పడమటి దిక్కుకు నడచుచుండగా

కొంత దూరమున వారి కచటనొక
విశాలమైన సరస్సుకనబడె
సముద్రమ్ముతో సమముగ నున్నది
ముత్యములన్నటు జలములున్నవి

తెల్లతామరలు కొల్లలు కొల్లలు
మందమారుతము పూలపుప్పొడితొ
నాసికాపుటలకు విందొనరించెను
జలపక్షులట సొగసుగ నున్నవి

కలకూజితాలతొ పరవశమిడుచు
తెల్లని హంసలు సొగసుగ నీదుచు
గట్టున నున్న వివిధ లతలతో
విరబూసిన ఆమని – అన్నటులున్నది.

సిద్ధచారణ గంధర్వులు అచట
ఆ సరస్సును ఆశ్రయించుకొని
ఆనందడోలల తేలుచుందురు
పుణ్యరాశిలా నుండెను సరస్సు

సాధుపురుషుని హృదయమ్మును పోలి
విశాలమై అది స్వచ్ఛమైనది
హరిపదమువలె దేవగణములకు
విహారయోగ్యము అయినది సరస్సు

ఉదాత్త చరిత్రుని భాగ్యము వలెను
అభిమాన ధనుని – అంతరంగముగ
ఆ హిమకిరణుని కరములన్నటు
హరి కథలవలె – కల్మష హారిణి

ప్రచేతసులు ఆ సరస్సుగాంచి
పరవశించుచు నిలచి పోయిరి
అంతటిలోనొక దివ్య పురుషుడు
సరస్సునందు దర్శనమిడెను

గంధర్వులు వేణువు నూదుచుండిరి
అనువుగ – నాట్య మాడిరి కొందరు
మృదుమధురముగ మృదంగనాదమున
వీనుల విందొనరించెను గానము

ఆసమయములో దివ్యపురుషుడు
సరస్సునుండి వెలుపలి కొచ్చెను
ఆనంద స్వరూపుడు చల్లని చూపుల
జగములనూపెను అన్నటులుండెను.

అష్టైశ్వర్యమ్ములకు నెలవుగా
భక్తుల పాలిటి కల్పతరువుగా
ఆర్తినిబాపే అభయ ప్రదాతగ
సనకసనందుల ప్రార్థనలందెడి

కరుణాధాముడు భద్రమూర్తియగు
రుద్రుడె - 'శంభుడె-దివ్య పురుషుడు
ప్రచేతసులు స్వామిని గాంచి
ఆశ్చర్యముతో పులకరింతతో

పాదములంటి వందనమిడిరి
వారి వినయముకు సంతసించిన
అంబాపతి - తా - పలికెవారితో
వారిని అనుగ్రహించగ తలచెను

"రాజనందనుల కాశీస్సులివె!
మీకోరికది తెలుసుకుంటిని
అందులకొరకై స్వయముగ వచ్చితి
శ్రీహరి భక్తులు - నాకు ఇష్టులు

గుణత్రయాన్విత ప్రకృతి కంటెను
జీవుని తనలో లీనము చేసెడి
సూక్ష్మరూపముతొ జీవుల వెలిగే -
వాసుదేవుని - పదభక్తులు యిష్టులు.

వారిని ఎంతో ఆప్యాయముగా
చూచుచుందును - మేలుచేతును
ముకుందు పదముల అనన్య భక్తి
కలిగిన మీరు - యోగ్యులు కనుక

హరిస్తవమును ఉపదేశించగ
దర్శనమిడితిని - వినుడు భక్తిగా
"శ్రీహరి పదములు పరమావధియని
నమ్మిన వారికి అసాధ్యము వుండదు

స్వధర్మాచరణతొ పురుషుడు
అనేకజన్మల పుణ్యకర్మలతొ
చతుర్ముఖ తత్వము పొందగలిగి మరి
పుణ్యఫలముతొ నన్ను చేరును

అటుపిమ్మట హరి పథమును చేరును
అనగా - సురలు నేనును కూడా -
చేరగ యత్నము చేసెడిదొకటే
అదే వినుడు - హరిపథము - దానిని

భాగవతోత్తము డవ లీలగను
పొందగలడు - తా - పుణ్యశాలియై
కావున మీరు - భగవద్భక్తితొ
వాసుదేవాంకిత చిత్తముతోను

నాకు సంతసము కలిగించవలె
భాగవతోత్తములను ప్రేమించినటు
మరొకరెవ్వరిని ప్రేమించను వినుడు
హరిస్తవమది - పూర్ణ భక్తినిడు

శ్రీహరి స్తవము పరమ రహస్యము
నిర్మల బుద్ధితొ జపించు మంత్రము
దానిని మించిన శుభఫల మిడెడి
వేరొక మంత్రము లేనేలేదు

పరమపావనము పాపహరణము
మోక్షకారకము మంగళ ప్రదము
బ్రహ్మదేవుడు – తా – సృష్టి ఆదిలో
దీనిని వినిచెను – తన తనయులకు

దానితొ పరమ భాగవతోత్తములైరి
బ్రహ్మ తన మానస పుత్రులగు
సనకాదులకు–తా–చెప్పిన విధముగ
మీకు చెప్పెదను అనుచు చెప్పెను

"ఓ జగదీశ్వరా! ఆత్మజ్ఞానులకు
నీ మహిమలు ఎంతో మేలుచేయును
ఆనంద లాభమును అందజేయును
అట్టిలాభము కలిగించ ప్రార్థన

శాశ్వతమైన సంపూర్ణమైన
ఆనందరూపము నీ చిద్రూపము
అట్టి దైన రూపమ్ముకు – ప్రణతులు
సరసిజనాభా! ఓ సంకర్షణ!

విశ్వ వందితా! శాంత స్వరూపా!
విశ్వగురూ – ఓ – విశ్వనాయకా!
విశ్వేశా – ఓ – విశ్వప్రబోధాయ!
మనస్ఫూర్తిగా అభినందనలివె!

సూక్ష్మరూపుడవు సూక్ష్మజీవుడవు
వాసుదేవ – నువు పరిపూర్ణుడవు
పరమ పుణ్యుడవు నిర్వికారుడవు
నిగమవందితా! మంగళమూర్తీ!

కర్మరహిత ఓ కర్మోద్ధరాయ!
నీపాదమంజరుల కిదె వందనము –
నిర్వికార – ఓ – కర్మనిస్తారకాయ
క్షేత్రపాలక – ఓ – త్రిలోకపాలాయ

సోమరూపాయ – తేజోబలాఢ్యాయ
స్వయంజ్యోతి షుండవు – ఓ పద్మనాభా!
దురన్త్యాయ – కర్మ సాధనాయ
పురాపురుషాయ – యజ్ఞయరేతసే!

జీవతృప్తాయ పృధ్వీరూపకాయ
లోకాయ – నభసేన్తకాయ ఓ గోవిందా!
విశ్వయోనయే విష్ణుజిష్ణవే నమః
నమోస్తు నారాయణ జగద్రక్షకాయ!

స్వర్గాపవర్గ ద్వార కాయ
సర్వరసాత్మనే – పరమహంసాయ!
కర్మపాకాయ – ఫలరూపకాయ
కృష్ణాయ ధర్మాత్మనే నమో నమః

సర్వశక్తిదాయ ఓ సాంఖ్యయోగీశ్వరాయ
హిరణ్యవీర్యాయ–రుద్రాయ–శిష్టనాధాయ
దుష్టవినాశాయ శూన్య ప్రవృత్తాయ
కర్మణా మృత్యువే – విరాట్ శరీరాయ

ధర్మస్వరూపా వాగ్విభవసంపన్నా!
నివృత్తి కారకాయ పుణ్యరూపాయ గోపాల
బ్రహ్మరూపా! సద్గుణఖనీ – ఓ నిర్గుణా
సమస్త పదార్థలింగ స్వరూపాయ!

ఓ సర్వవంద్యా సర్వజ్ఞుడ వీవు
జ్ఞానరూపుడవీవు క్రియాస్వరూపుడవు
హృదయాంతర్వర్తివీవు విశ్వహేతవునీవు
నందనందనా నీకు నమస్కార సహస్రము

ఆత్మస్వరూపా! నీ పదపద్మమ్ముల
చూచి తరించెడి భాగ్యము కలుగగ
దర్శనమిచ్చి అనుగ్రహించుము
నీరూపము పరమవైష్ణవ సత్కారమాన్యము

నీ పదయుగళి స్తుతిపాత్రమ్మది
జగన్మంగళము చల్లనిచూపులు
ఇంద్రియ వికారమ్ముల తీర్చి
దివ్యజ్ఞానమును కలిగించు నామమది

నీవేగతియని పదపద్మమ్ముల
సేవించు భక్తులకు ఆనందమొదవును
నీలమేఘశ్యామ దివ్యరూపమది
దర్శించగను అనుగ్రహించుము

జగన్మోహనమైన రూపమది
సర్వసౌభాగ్యముల కాలవాలమది
దానిని దర్శించినంత మాత్రమున
మా తాపత్రయములు అడగును స్వామీ!

సర్వమంగళ దివ్యమూర్తివి
ముంగురులాడెడి ఫాలభాగమది
గండుతుమ్మెదల ధిక్కరించెడి
శిరోజాలవి - సరోజనేత్రా!

మకరకుండల మంగళశోభలు
తీర్చిదిద్దిన కనుబొమ్మలకు
క్రొత్త అందమును దిద్దుచున్నవి
సంపంగిపూవువలె సొగసగు నాసిక

నీ నగుమోము కనగా - మనసగు
మోహనమూర్తివి విశ్వమోహనా!
కెంజాయల వెలిగెడి అధరములవ్వి
నవనీత సమము ఆ చెక్కిళ్ళు

మల్లెపూవులను పోలుపలువరస
చిరునవ్వుపూలను - చల్లెడి నవ్వు
చల్లని చంద్రుని పోలిన వదనము
దర్శించగను అనుగ్రహించుము

శంఖము పోలిన కంఠముకలిగి
దివ్యసుగంధము పుట్టుకనెలవగు
కస్తురితిలకము తళుకులీనగా
తులసిమాలయది మరచె పరిమళము

తారలమించి వెలుగులునింపే
తార హారములు కౌస్తుభ హారము
బాహుపురులతో మణికంకణముల
మంగళమూర్తీ! దర్శనమొసగుము

శంఖ - చక్రగదా పద్మమ్ములతో
భవబంధముల నంతముజేసే
అభయ హస్తమున నిలచిన స్వామీ!
మమ్ముల నీదరి చేర్చుకోవయా!

విశాలవక్షము కలిమికి నెలవు
భద్రత గూర్చెడి కరుణాధామము
మా బాధలను తృంచివేయుము
అందుకొనుము మాస్తుతి సుమములను

గర్వమదాంధుల దరికి జేరవు
ఆత్మసాక్షాత్కారము కొరకు
సాధన చేసే వారికి మాత్రము
దగ్గర య్యెదవు - దర్శనమిడెదవు

జగములన్నిటిని మోసెడి కుక్షి
తీర్చిదిద్దిన నాభిస్థానము
అంతకుమించిన రక్షణనొసగే
స్థానములేదని చెప్పక చెప్పును

తర్క - వితర్క - సంశయమ్ములు
నిండిన వారికి - అగపడ వీవు
నిన్నారాధించెడి త్రోవ తెలియని
అజ్ఞానులము - అనుగ్రహించుము

తీర్చిదిద్దినటులున్న బాహువులు
అందములొలికే అవయవ సంపద
బ్రహ్మకు సృజించ సాధ్యము కాదని
నీకై నీవే సృజించుకుంటివి

నీపద రేణువు తలను ధరించుట
బ్రహ్మపదవిని మించిన - భోగము
అనుచు విరించి - స్తుతించినాడు
స్వర్గ రాజ్యమును కోరడెవ్వడు

అజ్ఞానతిమిరమును అంతముచేసే
నఖములు నిగమము లన్నటు వెలుగును
మేఘముపైన మెరపుతీగ వలె
మెరిసెడి మకుటము విశ్వమునేలును

భక్తి అనెడి వొక దివ్య సాధనము
నిన్ను చేర్చెడిది - నిస్సందేహము
నీపద దాసుడు భయంకరమ్మగు
కాలదండముకు వశుడుకాడు గద!

పద్మనాభ - నీ మంగళరూపము
వర్ణించగను శేషుడు చాలడు
ఆనందసీమలో విహరించుటకు
ధ్యానించుటయే - తగినది జగతికి

అవ్యయుడవు నువు అనంతమూర్తీ!
ఆర్తిని బాపే - ఆగమ వినుత
అనుగ్రహించి దర్శనమిడుము
అంతకుమించిన పదవి దొరకదిల

ముల్లోకముల దొరలకు దొరవు
నినుకాదనిన నాకలోకపతి
అధోగతికి - తా - పోవలెను కదా!
నీ పదసేవ భువనాధిపత్య మిడు

నీగుణకీర్తన కల్మష హారిణి
నీ పదముల సేవ పరంధామ మిడు
పన్నగ శయనా! పతితపావనా!
పాహిముకుందా! అనుగ్రహించుము!

భూతదయ యది నీ భక్తులనైజము
ద్వంద్వాతీతులు సత్యవర్తనులు
ఋజుమార్గమున చరించుచుందురు
అట్టివారి స్నేహమ్ము నొసగుము

భక్తి యోగమున నిశ్చల మనసున
సాధించిన వారికి బాహ్య సుఖముల
ఎంతమాత్రము కోరిక వుండదు
అస్థిరమవియను జ్ఞానమొదవును

నేను గ్రహించిన ఆత్మ తత్వమిది
అవధరించుము అంబుజోదర –
కనబడు విశ్వము – నీలోనుండును
విశ్వమునందు – నీవే వుందువు

శాశ్వతమైనది తిరుగులేనిది
ఆకాశమువలె సర్వవ్యాపకమగు
బ్రహ్మపదార్థము – నీతత్వమగు
నీస్వరూపము అదియే యగును

త్రిగుణమ్ములకు లొంగక నిలచి
సృష్టికొరకును మాయను చేకొని
విశ్వము సృజించు విశ్వనాధుడవు
అంతర్యామిగ నుందు వందులో

అంతా శాశ్వతమన్న భ్రాంతిని
కలిగించును – నీ మాయాచిత్రము
నిత్యము సత్యము అక్షరుడవు నువు
సృష్టి – స్థితిలయ కారుడ వీవు

యోగ పరాయణులందరి గురిగా
నిలచినవాడవు యోగమగుదువా!
వేదోపనిషత్తుల జ్ఞానము నంతయు
అందించెడి వాడవు – జ్ఞానమూర్తివా!

నీ మాయకు వశుడై ఆత్మ అంశతో
దేహమునందు ప్రవేశించిన
పురుషుడు – భోగము లనుభవించును
అతడే జీవుడు – మాయకు వశుడు

సృష్టిని లయము చేయగ తలచిన
అహంకారము పెరిగిపోగను
ప్రాణులయందు వైరము సృజించి
సంహార యజ్ఞమును చేయించెదవు

ప్రాణికోటి అది నీవైనా మరి
త్రిగుణమ్ములకు లోబడి పోయి
నీకు వేరుగా కనబడుచుందును
అది నీలీల – అమరవందిత!

కాలరూపమున విశ్వమునంతను
మ్రింగివేతువు లయకాలములో –
అనుచు రుద్రుడు శ్రీహరిస్తవము
ప్రచేతసులకట ఉపదేశించి" –

శ్రీహరిపదముల ప్రార్థించెనిటు
"ఓ పద్మాక్షా – పరతత్వజ్ఞానమున
నాకు జనకుడు – ఆచార్యుడు అయిన
కమలసంభవుడు – మనువులందరు

ఆత్మానాత్మవిచారము వదలి
సర్వాత్మకుడవగు నిన్నేనమ్మి
నీపదములు సేవించుచుందురు
నిత్యమంగళమూర్తివి నీవు

నీ అనుగ్రహము కోరుకొనుచును
కరములు జాచిన వొద్దుచేరెదరు
సందేహములు అంతము జేసి
అనుగ్రహించుము నీవే గతియిక"

అనుచు రుద్రుడు ప్రచేతసులతో
పలికెను ప్రియముగ–మీరందరును
'యోగాదేశము' అనెడి–యీస్తుతిని
చదివి – మనస్సున పదిల పరచుడు

హృదయ ఫలకమున యీస్తుతినిలపి
క్రియాఫలము – ఆ ఈశ్వరునకిడి
ధ్యానదీక్షతో పూజించవలె
స్తుతులందున యిది శిరోరత్నము

తొలుత బ్రహ్మ యీ దివ్యస్తవమును
సృష్టిచేయుటకు మాకూ – భృగువుకు
మునిపుంగవులకు ఉపదేశించెను
దీనితో – సృష్టిని చేయగలిగితిమి

ఈ కవచ మందరికి పఠనీయమ్ము
జీవకోటికిది రక్షాకవచము
ఏకాగ్రచిత్తముతొ దీనిని జపింప
అచిరకాలమున శ్రేయమునందును

శ్రీహరి కృపతో దుఃఖనిలయమగు
సంసారసాగరము తరించగలరు
హరికరుణయను – అఖండ భాగ్యము
అవలీలగను లభించగలదు

ప్రాతఃసంధ్యలొ శుచియై నిరతము
శ్రద్ధాభక్తుల స్తవము చదివిన
వినిన – వారికి కర్మవిముక్తితొ
ఆనందధామము – లభించగలదు

ఈశ్వరారాధన కోరి వచ్చిరి మీరు
మీకు శ్రీహరి అనుగ్రహమ్మది
కలుగుట కొరకీ స్తుతిని తెలిపితి
ఏకాగ్రచిత్తమున జపించుకొనుడు

అసాధ్యమైన ఫలము లభించును –
అని ఆశీస్సుల నిడెను శంభుడు
అంబాపతి – తా – అదృశ్యమవ్వగ
అమిత భక్తిగా ప్రచేతసులట

జలమధ్యమున కఠోర దీక్షతొ
వేల ఏండ్లు యీ హరిస్తవమనెడి
దివ్యస్తవమును జపించినారు
తపోధ్యానమున జపించినారు.

॥శ్రీ కృష్ణచరితము॥



# 26 నారదుడు ప్రాచీనబర్హికి జ్ఞానమార్గము తెలుపుట

తనయులు తపస్సు చేయుచుండిరి
తండ్రియైన ఆ ప్రాచీనబర్హి
యజ్ఞయాగములు కొనసాగించెను
తృప్తినంది ఆ మహరాజంతట

తిరిగి మరియొక యజ్ఞము తలచెను
అంతట - అచటకు దేవర్షియగు
నారదమహర్షి - జ్ఞానమార్గమున
రాజును - కర్మవిముఖుని చేయగ

అరుగుదెంచగా - ఆ మహరాజు
స్వాగతమిచ్చి అర్ఘ్యపాద్యముల
పూజలుచేసి ఆశీనుని చేసెను
తృప్తినందిన నారదుడంతట

తీయగ రాజును చూచిపలికెను
"ఓమహరాజా! నీ సంకల్పము
అవిచ్ఛన్నమగు కర్మకాండలతొ
పొసగదు వినుము-శ్రమయే మిగులును

యజ్ఞయాగములు కట్టిపెట్టుము
అనగారాజు - అడిగె భక్తిగా
మునికులతిలకా - నీమాటలవి
నా అజ్ఞానము నణచుచున్నవి

కర్మాచరణల వలయములో పడి
జ్ఞాన సముపార్జన మరచి పోతిని
వీటివలననే - మోక్ష ప్రాప్తియని
ఆగక చేసితి - యజ్ఞయాగములు

నీరాకతొ నా కర్తవ్యమది
తెలిసెను నాకు - తెలివి కలిగినది
పూర్వజన్మకృత పుణ్యఫలముగా
నీకై నీవే - దర్శనమిడితివి

కర్మబంధముల దూరముచేసే
జ్ఞానమార్గము చూపి కావుము
అస్థిరమైన దేహ గేహములు
దారాపుత్రులు భోగభాగ్యములు

పురుషార్థములని భ్రమలోపడిన
బుద్ధిహీనుడు - ముక్తికనర్హుడు
కర్మలతోనే సంసారబంధముల
చిక్కువడితిని అలసిపోతిని

కరుణామూర్తీ! ఉద్ధరించుము
అనుచు జాలిగా వేడెను రాజు
అంతట పలికెను ప్రేమగ మౌని
హరికటాక్షము కలిగెను నీకు

కావున నీకు - నీకార్య కలాపము
నిరర్థకమ్ము అనిపించినది
నీ యజ్ఞకర్మలో ఎన్నిజంతువులొ
మూగజీవులు - బలిఅయినవయా!

అవియన్నియును-నీకపకారము చేయగ
పరలోకమును నీవు చేరగనె
ఇనుపకొమ్ముల - కుమ్మి వేయుటకు
వాడిగిట్టలతొ - చీల్చి వేయుటకు

ఎపుడా ఎపుడా - అను ఆత్రుతతో
ఎదురు చూచుచు నుండును వినుము!
ఆ పాపక్షాళనకు ప్రాచీనమగు
గాధను చెప్పెద - ఆలకించుము.
॥శ్రీ కృష్ణచరితము॥



## 27 పురంజనోపాఖ్యానము

పూర్వకాలమున పురంజనుండను
కీర్తిమంతుడగు రాజువుండెను
అవిజ్ఞాతుడను రాజుమిత్రుడు
ఆశ్రితులందరి కాశ్రయమయ్యెను

నివాసయోగ్యమగు పురము వొక్కటి
అన్వేషించుచు రాజు అంతట
భూమి అంతయు గాలించినను
దొరకకపోయి - దిగులుచెందెను

అటుల తిరుగుచు ఆ మహరాజు
హిమవత్పర్వత ప్రాంతము చేరెను
అచ్చట దక్షణ సానువులందు
కనుపించిన దొక నచ్చిన పురము

తొమ్మిది సంఖ్యలొ ద్వారములున్నవి
చక్కని తలుపులు - గవాక్షమ్ములు
తోరణాలతో సొగసుగనున్నది
గోపురాలవి శుభముగనున్నవి

యంత్రములమర్చిన కోటగోడలు
పాతాళమును పోలు అగడ్తలు
ఉపవనమ్ములు వెండిపూతగల
ఎత్తగు శిఖరము లమరియున్నవి

కొలువు కూటములు అంగడి వీధులు
రచ్చబండలు క్రీడా గృహములు
స్వాగతించెడి కేతనమ్ములు
ముత్యాల ముగ్గులతొ ముంగిళ్ళుండి

లక్ష్మికినిలయము అన్నటులన్నియు
అమరియున్నవి అవియన్నియును
మరకత మాణిక్య - శోభలవెలుగు
విశాలమైన దివ్య భవనములు

వైడూర్యములతొ వెలిగె నరుగులు
నాగరాజుకు రాజధానియగు
భోగవతివలె నున్నది పురము
ఆపురమందు - లక్ష్మికాపురము

ముందుగ నున్నది ఉద్యానవనము
పూదీవలతో లతల సోకులతొ
పెనవేసిన ఆ తరుసముదాయము
ప్రేమకు ప్రతీక అన్నటులున్నవి

తోటమధ్యన విశాలమైన
కోనేరు వున్నది శోభలీనుచు
గండుతుమ్మెదల ఝుంకారమ్మది
మంగళగీతిక పాడునట్లయె

సుమగంధముతో నీటితుంపరలు
శిరమున మోసుకు–మలయానిలుడు
తరువు తరువును పలుకరించుచు
సాగుచున్నటు కదలెను ఆకులు

వసంతసోయగ మెల్లపుడిచటని
చాటుచున్నటు – కూసె కోయిలలు
చిలుకలు తీయని కంఠస్వరముల
ఆహ్వాన గీతికలు పాడుచున్నవి

మరొక ప్రక్క మునిచంద్రులట
తపోదీక్షలో మునిగి•యుండిరి
సహజవైరము మరచి జంతువులు
స్నేహభావమున మునులుగ మారెను

అందముచిందెడి సుందరవనమున
అడుగు పెట్టెను పురంజనుండు
ఆ రమణీయత ముగ్ధుని జేసెను
ఆశ్చర్యముగా నిలచి చూచెను

అంతదవ్వులో యాదృచ్ఛికముగ
కనుపించినదొక లలనామణి అట
పదిమంది అనుచరులును తిరిగి వారికి
వందవందగా సేవకులుండిరి

సుందరి ముందు ఐదుతలలుగల
సర్ప ప్రతీహారి – నడచుచుండెను
ఆమెను గాంచిన అజవ్వని – తా –
వరాన్వేషణలొ నున్నటు లున్నది

కామరూపిణి అనిపించు చున్నది
అందమునందు చక్కని చుక్క
చెవికుండలములు నునుపు చెక్కిళ్ళకు
సొగసులద్దుచు నున్నటులున్నవి

సొగసగు కన్నులు విసరిన చూపు
పురంజనుని హృదయమ్మున తూపై
నాటుకున్నది చలించెనొకపరి
బంగరు ఆభరణమ్ములు వెలిగెను

పదమంజరుల చిరుసవ్వడియది
కుసుమ బాణుని పిలచుచున్నది
లలనామణి ప్రతి వొంపుసొంపది
సుమ బాణములు విసరుచున్నది

ప్రతికదలిక యది పురంజనునికి
మన్మధగీతిక వలె వినిపించెను
మెల్లగ దగ్గర జేరిన రాజుకు
తీయని చిరునవ్వందించినది

వెంటనె రాజు నిగ్రహమ్ముతో
ఎవ్వర వీవు జనకుడెవ్వరు?
ఏ వంశము పావనమొనర్చు చుంటివి?
సేవకు లెవ్వరు ఫణిరాజెవ్వరు?

ఆమాటలకు సిగ్గు మొగ్గలవి
ఓరచూపులలొ - కలిపి చల్లెను
తలనువంచి అట నిలచిన జవ్వని
మోహపరవశుని చేసెను రాజును

కుసుమకోమలీ! నిన్నుగాంచిన
రుద్రుని వెదకెడి శాంభవిగానో
బ్రహ్మను వెదకెడి శారదగానో
హరిని వెదకెడి లక్ష్మీదేవివా

అనిపించును - మరి వివరము లెవ్వి!
తిరిగి జవ్వని శిరస్సు నెత్తి
ఓరగచూచి తలదించుకొని
చెలికత్తెవంకను చూడగనంత

ఆమె వచ్చెను ప్రక్కనిలచెను
ఆమె భుజమున కరమునిడుకొని
క్రీగంట గాంచెను ఆ మహరాజును
అంతట రాజు ధోరణి మార్చెను

దివ్యసుందరీ! గ్రహించినాను
నీవాసుందరులందున చేరవు
పతిని వెదుకగా వచ్చిన నెలతవు
అవునా కాదా! పలుకుము చిలకా!

తిరిగి జవ్వని రాజును గాంచెను
అంతట రాజు పలికెను తిరిగి
రమణీ! నేనీ పురముకు రాజును
నీ కటాక్షము కోరుచుంటిని

నీవు వల్లెయన - ఈపురమే మరి
వైకుంఠముగా నగునో - నెలతా!
నిజము పలికెదను నేను మన్మధుని
చేతిలోన - మరి ఓడిపోతిని!

మృదు భాషణతో నాలో నున్న
మన్మధ తాపము నుపశమింపుము!
అనుచు ప్రియముగా అడిగెను రాజు
ఆనంద పరవశము నందెనాతడు

చిరునగవులతో ఆ మహరాజును
మోహించినటు తెలియ బరచెను
పలికెను తీయగ వీణాస్వరముగ
“పురుష శ్రేష్ఠుడా! వివరమడిగితివి

తల్లిదండ్రులూ కులమూ - తెలియదు
ఈపుర నిర్మాత ఎవరో తెలియదు!
నేను వసింతును ఈ పురమందు
కుల నామమ్ముల ప్రశ్నలుతగవు

వీరందరును నాసఖులగుదురు
పన్నగరాజు నానిద్ర సమయమున
ఈపురమును - తా - పరిపాలించును
నా అభీష్టము నెరవేరినది

నీవుయిచటకు వచ్చినాడవు
సర్వశుభములు నీకు కలుగును
సుఖభోగములు అనుభవించగా
తగిన సమర్థుడ వీవేనయ్యా!

నవద్వారముల ఈపురమునకు
అధిపతివీవే - అగుదువు రాజా!
నీకు దీనిని అప్పగించితిని
నిన్నుమించి మరి దొరకరెవ్వరును

ఈపురమందు కాపురముండి
సర్వసుఖములు అనుభవించుము
హాయిగ నీవు నూరేళ్ళుండుము
అనుచు పలికెను అనురాగవతి

రాజవరేణ్యా! నేను కోరినటు
నాకు లభించిన అందగాడవు
నిన్నుమించి మరి నాకిష్టులెవ్వరు
వేరొక్కరిని వరించనయ్యా!

గృహస్థాశ్రమ విలువ నెరుగుదును
పురుషార్థములు సాధించు సాధనము
సంతాన భాగ్యము కలిగించునదే
పుణ్యలోకముల చేర్చు మార్గమది

పితృదేవతలు దేవతలకును
ఋషులకు నరులకు భూతజాలముకు
శ్రేయమునిడునది - గృహస్థాశ్రమము
సర్వసుఖములు కలిగించునది

గృహస్థువై నువు ఆనందముగా
గడిపెడియోగ్యుడవని నే తలతు
వీరత్వమది నిండిన మూర్తివి
మోహన రూపము మంగళప్రదము

నిన్ను మించి మరి కోరరెవ్వరిని
కావున నీవు - కరము గ్రహించి
పురాధిపత్యము గ్రహించవయ్యా!
దయాసత్యముల నెలవుగ నేలుము

దీనుల భయమును బాపుము నీవు
ఆశ్రితులందరి కాశ్రయమ్మునిడు
నీకీర్తి నిండును సకలలోకముల
అని - అభీష్టము తెలిపెను జవ్వని!

ఆనందించిన పురంజయుండు
ఆమెతొ అడుగిడె పురములోనికి
సర్వసంపదలు నిండియున్నవి
సమస్త భోగము లమరి యున్నవి

ఆనందముగా - ఆ సుకుమారితొ
ఇంద్రుని పోలిన భోగభాగ్యముల
కాలము గడుపుచు నుండెను రాజు
ఆనందసీమలో - విహరించుచుండెను

కనుసన్నలతో పరిజనమంతా
చేసెడి సేవలు ముగ్ధుని చేసెను
హంసతూలికా తల్పము దిగెడి
అవసర మసలే కలుగకుండెను

వందిమాగధుల మేలుకొలుపులతో
ఆరంభమయి దినచర్యయది
పరిజన సేవతొ సుఖభోజనముల
ప్రియురాలి సన్నిధి స్వర్గమాయెను

విహరించుటకు ప్రమదావనము
జలక్రీడకునట దిగుడు బావియు
క్రీడాపర్వత మమరియున్నవి
అంతటి సుఖమది రాజుకుచాలు

జలకేళి సలుపుచు సరోజాక్షితో
విహరించు– తా–సుఖములందుచు
మన్మధబాధను హరింపజేయుచు
గడపసాగెను పురంజయుండు

ఆ పురమునకు నాల్గువైపులా
కోటవాకిళ్ళు అమరియున్నవి
తూర్పున – ఐదు వాకిళ్ళున్నవి
దక్షిణోత్తరము లందొక్కొక్కటి

పడమట దిక్కున రెండు ద్వారములు
మొత్తము తొమ్మిది ద్వారములున్నవి
ఊర్ధ్వముగా ఏడును–క్రిందున రెండు
వేర్వేరుగను అమరియున్నవి

వాటిలొ – ప్రభువు ఈశ్వరదేవుడు
వుండెను–అతడే పురంజనుడనుకొను
తూర్పుద్వారముల పేర్లువినుమయా!
ఖద్యోత – అవిర్ముఖి అనునవి రెండు

ఆరెండు ద్వారముల ద్యుమత్సఖుడై
నేత్ర ప్రధానుడు విభ్రాజితమను
జనపదమును చేరును వినుము
ఆపై వినుము – పుర వివరములు

నళిని నాళిని అను రెండు వాకిళ్ళు
వాటియందు అవధూతసఖుడై
వాయుసఖుడై ఘ్రాణేంద్రియమ్ముల
వ్యాపారమ్ముల ననుభవించును

అయిదవ ద్వారము ముఖ్య అనబడు
దానివల్లను ముఖ సంబంధపు
నోటివల్లను ఆహారమ్మును
స్వీకరించి మరి రసజ్ఞుడగును

రెండు కండ్లు మరి నాసికారంధ్రములు
రెండును ఆపై – నోటితొ కలిపి
ఐదు ద్వారములు వేర్వేరుగను
శరీర పురమున నెలకొని యున్నవి

దక్షిణ దిక్కున వెలసిన ద్వారము
పితృహూ – దాని సాయమున
శ్రుతధర సహాయుడై దక్షణపాంచాల
రాష్ట్రమ్మును – తా – పొందుచుండును

ఉత్తర దిశలో ద్వారము – దేవహూ
దాని వల్లను శ్రుతధర సహితునిగ
ఉత్తర పాంచాలము అనెడి రాష్ట్రమును
పొందుచుండును వినుమహారాజా!

పడమటి దిక్కున రెండు ద్వారములు
అందులొ నొకటి-అసురి-అనునది
దానివల్లన - దుర్మదసమేతుడై
గ్రామకమనెడి విషయము పొందును

రెండవ ద్వారము నిర్ఋతి - అనునది
లుబ్ధక సమేతుడై వైశన మనెడి
విషయము పొందును అట్టిపురములో
నిర్వాగ్యశస్కరులు అనెడి అంధులు

ఆ అంధులవలన గమన కరణ
అను వ్యాపారమ్ములు నడపును
పురంజనుడట విషూచి సహితుడై
కళత్ర-పుత్ర-సంబంధము అయిన

మోహ-ప్రసాద-హర్షము లన్నవాటిని
పొందుచుండును ఆ పురంజనుడు
కర్మాసక్తుడు - కామాత్మకుడై
బుద్ధి - అనెడి ఆ - మహారాణిచే

వంచితుడై-తా-నుండును పురమున
ఆమె తిననచో తానును తినును
ఆమె త్రాగిన త్రాగును నీరు
నవ్వుట - పలుకుట - ఆట పాటలు

వినికిడి - చూపుల కోపతాపములు
స్పర్శ - వాసన - మోదఖేదములు
అన్నీ రాణిపై ఆధారపడు
అతని జీవితము ఆమె ఆధీనము

ఆమె ఎదుట మరి కనబడుచుండగా
ఆనంద తాండవము చేయును కన్నులు
ఆమె కాననిచొ అంధకారమే -
ఆమె చేతిలో కీలుబొమ్మ అయె

అటుల పురమున గడపుచునున్న
పురంజయుండొక రోజున తాను
విల్లమ్ములతో రథమును ఎక్కి
ప్రయాణమ్మును ఆరంభించెను

విచిత్రమైనది ఆ అరదమ్ము
అయిదు గుఱ్ఱములు పూన్చినరథము
ఐదు త్రాళ్ళను - కట్టిరి దానికి
రెండు చక్రములు రెండు పూజులు

అమోఘ - వేగము కలిగిన రథమది
ఏకాక్షము మరి నొగలు రెండును
మూడు పతాకలు ఒక కళ్ళెమది
సారథి ఒకడు సప్త వరూథమ్ములు

ఏడు రేకులవి స్వర్ణభూషా శోభితము -
పంచ విక్రమము - ఏకనీడము
పంచ ప్రహరణములున్న రథమది
బంగరు కవచము మేనధరించి

అక్షయతూణీరమ్ములు దాల్చి
ఏకాదశసంఖ్యలొ సేనానులతో
మహావేగముగ సాగి అంతట
పంచ ప్రస్థమను - వనమును చేరెను

అసుర ప్రవృత్తితొ రాజమదముతో
వేటనెపమ్మున అనేక మృగముల
నంతము చేసెను దయాదూరుడై
వేట ఎంతయో - క్రూరకర్మయగు

విహిత కర్మగా చెప్పగ రాదు
అటుల మృగములను కుప్ప తెప్పలుగ
నేలకూల్చెను - అలసిపోయెను
రాజ భవనముకు వచ్చి చేరెను

రాజో చితమగు భోజనమ్ముతో
సుగంధమ్మును మేన పూసుకొని
బడలిక తీరగ పాన్పును జేరెను
పూలపాన్పుపై వొరిగెను రాజు

అటునిటు చూడగ తనయిల్లాలు
కనబడలేదు కలవరపడెను
నవ్వులపువ్వులు వెదజల్లెడి ఆ
జవ్వని లేనిచొ దిగులుకలిగెను

బయటకు వచ్చి అచ్చట నిలచిన
పరిచారికలను-అడిగెను విషయము
కొంత భయముతో వారుమూగగా
మూలన వున్న - నెలతను చూపిరి.

కటిక నేలపై పొరలుచున్నది
పలుక కున్నది అనుచు చెప్పిరి
కొంత ధైర్యము వచ్చిన రాజు
అనునయించగా దరికి చేరెను

అనునయించెను - బుజ్జగించెను
అంతులేని అనురాగము చూపెను
ఆమెలేక తను బ్రతుకను అనెను
ఆమె కష్టము తనకష్టమనె

ఆమెకు ఎవరో కీడు చేసినచొ
అంతము చేతును వారందరిననె
అతివ ముఖమది చంద్రబింబమనె
అది మాయుట - తను చూడలేననె

కన్నీళ్ళతొ ఆ సుందర వదనము
కళావిహీనము అయినది అనెను
ఒక్కడే తను చెప్పక - వేటకు
వెళ్ళుట తప్పని - క్షమించ వేడెను

కఠోర దండన భరించలేననె
బ్రతుకు బండిని నడిపించమనె -
ఆమాటలకు మెత్తబడినది
ప్రసన్నమైన చూపులు విసరెను

అపరాధమ - నీవలన లేదనె
స్నానము తీర్చి గంధపుపూతల
మోహనమూర్తిగ అవతరించెను
భర్తను తీసుకు శయ్యను జేరెను

మన్మధ శరముగ మగువతోచెను
మైమరచిపోయెను పురంజయుండు
యధాస్థితికి - తా - వచ్చిచేరెను
భార్యతొ బ్రతుకే - పరమార్ధమని

మన్మథ భోగము లనుభవించుచు
ఆనందముగా నుంటిననుకొనె -
కాలము ఆగదు అన్నజ్ఞానమది
తలపుకు రాక గడిపెను రోజులు

యౌవ్వనమ్మది దాటిపోయినది
కుమారులకు-తా-తండ్రి ఆయెను
పదకొండు వందల సంఖ్యలొ తనయులు
ఉద్భవించిరి పురంజయునకు

ఉద్దండ పిండములు వీర విక్రములు
పగతుర పాలిటి మృత్యుదేవతగ
తనయులుండిరి - ఆపై రాజుకు
తనయలు కూడా ఉద్భవించిరి

నూటపది మంది తనయలు కలిగిరి
సద్గుణ రాశులు సౌశీల్యవంతులు
వారికి తగిన వరులను తెచ్చెను
కుమారులకును వధువుల తెచ్చెను

వారందరును సుఖముగ నుండిరి
తన బాధ్యత అది తీరిన దనుకొనె
తాత అయ్యెను తనయు లొక్కరికి
వందమందిగా కొడుకులు పుట్టిరి

బలపరాక్రమమున తండ్రికి సములు
పురంజనుని ఆ మనుమలందరూ -
అటుల వంశము-పురంజనవంశము
పెరిగి పెద్దదై - విస్తరించెను

వయసుమళ్ళినా పురంజనునికి
భార్యా పుత్రుల బంధము వదలక
భార్య వదనమున అహర్నిశమ్ము
చిరునవ్వులనే వెదకు చుండెను

అటుపిమ్మటను పురంజనుండు
యజ్ఞమ్ములను చేయదలచెను
అవిచ్ఛన్నముగా చేసి యజ్ఞములు
విశేష సంఖ్యలొ పశువులచంపెను

రాజా! నీవలె అతని యజ్ఞముల
బలులు - గిరులవలె-నిలచిపోయినవి
యూపస్తంభముల కట్టిన పశువుల
రోదన - సంద్రపు ఘోషగ ఎగసెను

యౌవ్వన ముడిగెను శక్తిసన్నగిలె
ప్రాయము - పడమటి దిక్కుకు వాలెను
భార్యపైన మరి మోజుతగ్గినది
అదేవిధముగా భార్యసంగతి

అంతటిలోన గంధర్వుడొకండు
చండవేగుడు విరచుకుపడెను
హాహాకారము లెగసెపురమున
సంద్రపుకెరటము అన్నటుపడెను

భార్యలతో తన సైన్యముతొ నట
గంధర్వరాజు విరచుకుపడెను
దానిని గాంచి పురందరు భక్తుడు
పురాధ్యక్షుడు ప్రజాగరుండు

## చతుర్థస్కంధము

ముందుకు దూకి నిగ్రహించెను
ఎడతెరపిలేకను సమరము జరిపెను
నూరు ఏండ్లు ఆరీతి - పురాధ్యక్షుడు
గంధర్వులను కట్టడిచేసెను

అంతటిలో బలహీనుడయ్యెను
సర్వకామ నిర్మితమైన ప్రజాగరుడు
గంధర్వ బలముకు లొంగి పోయెను
పురంజనుండది గ్రహించలేదు

సుఖాపేక్షతో కాలముగడపుచు
ఉన్నదానితొ కామినీమణుల
తృప్తి పరచుచు నుండెను రాజు
అంతలొవచ్చెను మరొక - కష్టము

కాలపుత్రిక అనెడి భామిని
వరాన్వేషణలొ తిరిగి తిరిగి - తా -
యయాతి రాజును చేపట్టమనె
అంతట యయాతి పలికె నామెతో

తన తనయులలో వొకరినివరించి
సుఖముగనుండుము అని చెప్పగను
తనయులు కాదన మార్గముతోచక
చిన్నకొడుకును తిరిగి అడిగెను

తండ్రిమాటను కాదనలేక
పూరుడు - అంత వరించె నామెను
తండ్రి రాజ్యము ఆతనికి అందగ
వరమునిచ్చెను కాలపుత్రిక

కొంతకాలము జరిగినవెనుక
వానితొ తాను వుండలేకను
దౌర్భాగ్యురాలై పోయెను వనిత
దుర్భగ - అనెడి పేరు కలిగెను

తిరిగి వరునికై వెదుకసాగెను
బ్రహ్మలోకమున బ్రహ్మచారియగు
నారద మౌనిని గాంచిన వనిత
చేపట్టగను కోరుకున్నది

అంతట పలికెను నారదమౌని
జన్మయంతయు బ్రహ్మచారిగా
వ్రతమున నుంటిని - అని నారదుడ
ఆమె కోర్కెను తిరస్కరించెను

కోపించిన ఆ - దుర్భగ దురుసుగ
శపించినది ఆ - నారదమౌనిని
మాయవ్రతమని నిందించినది
దేశభ్రమణము - స్థిరమగు ననెను

శాంతముగా మరి తథాస్తు అనిన
నారదుగాంచి కోపము దిగగా
వరుని చూపమని ప్రార్థించినది
యవనేశ్వరుడను వానిని అడిగిన

త్రోవ చూపునని పలికె నారదుడు
వెంటనె వానిని సమీపించినది
రాజా! నీవు యవనకులముకు
ప్రభువని వింటిని వరించవచ్చితి

నాకోరికది సజీవ బంధము
కోరి నిన్ను మరి చేరిన దానిని
స్వీకరించుట పురుష ధర్మము
జడస్వభావి - తా - కాదను వినుము

నవ్వుచు పలికెను యవనరాజట
కోరికలన్నవి ప్రాణిసహజములు
నిను చేపట్టుట యిష్టములేదు
అమంగళవు - నువు చేరనీయరు

జ్ఞానదృష్టితో అంతయు తెలిసితి
నీకు పతిని నే చూపించెదను
నాసైన్యమ్మది నీకు తోడగు
ప్రజల నీవు - నశింప జేయుచు

అదృశ్యముగా వుండుము నీవు
కర్మలవలన ఏర్పడినట్టి
జీవలోకమును ఆశ్రయించుకొని
నీకోరిక నెరవేర్చుకో! అనె -

ప్రజ్వారుడను - నాసోదరుడు
నిను తోబుట్టువుగా తలంతును
మీయిద్దరి సాయము కలిగిన నేను
బయట పడకను ప్రవర్తింతును

భీమసైనికునిగా నుందును
ఆలోచించుము అంతకుమించి
నీకు నేను మరి సహాయపడను
అనగా నామె తలవూపినది

యవనరాజు కింకరులకును
కాలపుత్రిక - సహకరించగా
బలము పెరిగినది - వారి వెంబడి
ప్రజ్వారుండు మరింత బలమై

ప్రాణికోటిని పీడించుచును
విరుచుకు తినుట ఆరంభించిరి
కాలపుత్రిక చూపంతయును
పురంజనునిపై వేసియున్నది

యౌవ్వనపొంగులు జారిపోయిన
పురంజనునిలో పురుషుని తాను
లొంగదీసిన కార్యము పూర్తగు
అనుచు తలంచెను కాలకన్యక

ప్రచండవేగము కలిగి పురమును
ఆక్రమించెను - అతిశీఘ్రముగా
అశక్తుడయ్యెను - వృద్ధపన్నగము
కాలపుత్రిక తనలోనున్న

యవన సైన్యముకు పురమునిచ్చెను
నిరాటంకముగ వారు జొరబడి
ద్వారమ్ములను బంధించి అంతట
చిందర వందర చేసివేసిరి

పురంజనుండు గ్రహించినాడు
కానీ కదలని స్థితిలో నుండెను
కాలకన్యక విజృంభించెను
రాజు సంపద - హరించిపోయెను

బుద్ధికూడను జారుకున్నది
విషయలోలత తగ్గలేదది
దైన్యముతో మరి దరిద్రుడాయెను
గంధర్వులు - ఆపై ముష్కరులొచ్చిరి

పిలచిన పలికే దిక్కేలేదు
సచివులు గాంచి తప్పుకుందురు
అనాదరణ అది పెరిగిపోయినది
ఆప్యాయత అది చూపరెవ్వరును

ఈ పరిస్థితిలో కాలకన్యక
రాజుకు కనబడె అప్తురాలుగా
అంతటి భోగము కామప్రవృత్తి
కలిగిన వాడను - తానేనా అని

కుళ్ళికుళ్ళి - తా - నేడ్వసాగెను
భార్యబిడ్డలకొరకు వేదన
ఏమైనారో అని ఆరాటము
పురమును విడువగ నిర్ణయించెను

అంతటిలోన ప్రజ్వారుండు
ప్రభంజనములా దూసుకువచ్చి
పురమునంతను దగ్ధము చేసెను
నింగివరకును ఎగసె జ్వాలలు

కాలెడి - పురము-అనాదరణ యది
శత్రుసైనికుల గర్జనలున్ను
కాలకన్యక కరాళనృత్యము
ఆమంటలలో చిక్కిరి తనయులు

తనకళ్ళముందరనే - జరిగె నంతయు
భీభత్సమునకు కుమిలిపోయెను
అయినా - నేను - నాదనునట్టి
మమకారమ్మది వదలక యున్నది

నాపిల్లలు మరి నాయిల్లాలు
దిక్కులేని వారయ్యెదరనుచు
ఆవేదనతో తలబాదుకొనె
పతివ్రతా తిలకమ్ము భార్య అనె

అటుల భార్యను తలంచుకొనుచు
దొడ్డగుణములు నెమరు వేయుచు
నిలచెను పురంజయుడు - అంతట
భయుడు వచ్చిపడె అశనిపాతమై

పురమంతయును శూన్యమైనది
పన్నగమ్మది వదలిన పురము
పురంజనుని - తా - వదలివేసినది
శిథిలమైనది కలిసె ప్రకృతిని

యవనుడు తనను ఈడ్చుకు పోవగ
మరుమాటాడక నడిచె పురంజనుడు
అయినా వాని అజ్ఞానమ్మది
వదలక పోయెను అందువల్లను

తనపూర్వ స్నేహితుని ఈశ్వరదేవుని
తెలియగ లేక పరలోకమేగెను
ఆలోకములో అతనిచేత బడి
యజ్ఞములో మరి మడసినయట్టి

పశువులన్నియు అమిత క్రోధమున
కుమ్మి కుమ్మి మరి-ఖండించి వేసెను
స్త్రీసాంగత్యము పురంజనుని అట
అధోగతికి మరి తీసుకుపోయెను

తమో అహంకారము వలన
జ్ఞానహీనుడై పరలోకములో
అనేకబాధలు అనుభవించెను
భార్యను మాత్రము మరవకపోయెను

స్త్రీతలంపులో అదేధ్యాసతో
శిక్షలన్నియు అనుభవించెను
అందువలన ఆ పురంజయుండు
మరుజన్మలో మరి స్త్రీగాపుట్టెను

విదర్భరాజుకు తనయగ పుట్టెను
పెరిగిన బిడ్డకు వివాహమ్మును
తండ్రిచేయగా నిర్ణయించుకొని
వీర్యశుల్కయని వెల్లడిజేసెను

ఎందరొ రాజులు ఆజవ్వనిని
అందగ మనసు పడినను-వారిలో
పాండ్య భూపతి మలయకేతనుడు
పరాక్రమముతో కన్యను గెలిచెను

విదర్భరాజు తన కూతురును
మలయకేతునికి ఇచ్చి ఘనముగా
వివాహమ్మును జరిపించి అంతట
బరువుతీరెనని సంతసించెను

మలయకేతునికి ఆమెయందున
కుమార్తెవొకతె కుమారులేడ్గురు
ఉద్భవించిరి - వారందరికి
అనేకమంది సంతతి కలిగిరి

కూతురు-ధృతవ్రత-సాధుశీలయై
కృష్ణభక్తిలో మిన్ననిపించెను
అగస్త్యు డామెను పరిణయమాడెను
అగస్త్యతనయుడు దృఢచ్చుతుండగు

పిమ్మట రాజు మలయ ధ్వజునికి
సంసారముపై విరక్తి జనించెను
రాజ్యము తనయుల కప్పగించెను
వైరాగ్యముతో తపముకు వెడలెను

కృష్ణసేవా తత్పరతను కలిగి
మలయపర్వతము చేరెను రాజు
ఆతనిభార్య మరి అనుకూలవతి
పతినే నీడగ అనుసరించెను

భార్యతొ కలిసి తపముకు సాగి
చంద్రమస - తామ్రపర్ణి పుణ్యజలముల
స్నానముచేసి బాహ్యంతర శుచియై
తపోదీక్షను ఆరంభించెను.

కందమూలములు రాలిన ఫలములాకులు
నిర్మల జలము గ్రహించుచుండి
ఎండావానలు చలి అనిచూడక
కఠోరతపమును ఆచరించెను

## చతుర్థస్కంధము

సుఖ దుఃఖములు కోర్కెలు వదలెను
కఠోర నియమము లాచరించుచు
తపస్సుతో మరి పండిపోయెను
పరబ్రహ్మమున ఆత్మను నిలపి

చెట్టు-పుట్ట-మృగములు-గిరులు
తానూ వొకటను భావైక్యమ్ము
కలిగియుండి - తా - ప్రాణమ్ములను
వశమున నుంచుకు తపమును చేసెను

నూరుదివ్య సంవత్సరములు
మలయ ధ్వజుడు తపముచేసెను
వాసుదేవుని సాయుజ్యమ్మది
గమ్యము అనుచు నిర్ణయించుకొనె

స్ఫటికమువలె మది నిర్మలమైనది
ఆత్మసాక్షాత్కారము కనువై - మది
ఆత్మవిద్యాగురువు హరియని
గురుకృప కొరకై తపనపెరిగెను

ఆర్తి ఫలించి తపము ఫలించి
వివేక దీపము వెలిగెను రాజుకు
పరబ్రహ్మమున తనను గాంచెను
తనలో ఆ పరబ్రహ్మను గాంచెను

దుఃఖభాజకము అయినటువంటి
సంసార సాగరము దాటగలిగెను
ఆత్మసాక్షాత్కారము నందిన రాజు
ఉత్తమగతికి చేరెను గతియది

ఆయన భార్య అతి పుణ్యవతి
పతి అడుగులలో నడచి వచ్చెను
కఠోరదీక్షను గ్రహించెనామె
నిద్రాహారములు మరచిపోయెను

కోరిన భోగము లనుభవించెను
వాటన్నిటికి స్వస్తిచెప్పినది
చింతలేక - తా - హరిచింతనతో
అగ్నిజ్వాలవలె ప్రకాశించెను

తనపతి దేవుడు పరతత్వమున
చేరిన విషయము గ్రహించలేదు
పరిచర్యకయి దగ్గర జేరగ
విషయము ఆమె గ్రహించెనచట

ఒక్కసారిగా దుఃఖమెగసెను
కన్నీరు మున్నీరుగ రోదించినది
ప్రకృతి ఆమె బాధను గాంచి
కంటనీటిని పెట్టుకున్నది

అనేకవిధముల పతిని తలచుకొని
రోదించినది తెలివితప్పినది
తిరిగి తెలివది వచ్చినంతనే
కర్తవ్యమ్మది మనసుకు తోచెను

పతితో సాగుట తనత్రోవయని
తెలివితెచ్చుకొని చితినేర్పరచి
పతికళేబరము దానిపై నుంచెను
దానికి అగ్నిని ముట్టించినది

ముమ్మారు ప్రదక్షిణచేసి అంతట
సహగమనమ్ము చేయనెంచెను
అంతటిలోన ఆగు - మాగుమని
కేకవినబడె - ఆగిచూచినది

వెంటనె అచటకు ఒక బ్రాహ్మణుడు
వచ్చినిలచెను గాంచెను సాధ్వి
ఎవరా అనుచు తేరిచూడగా
చెంతకువచ్చి పలికె - బ్రాహ్మణుడు

అబలా నీవు ఎవ్వరి దానవు?
రోదన వలన ఫలితము ఏమి?
ఈకళేబరము ఎవరిది అనుచు
అడిగెను ఆమెను - అంతట ఆమె

బదులు పలుకక నిలచియుండగా
పలికె బ్రాహ్మణుడు-అబలా నీవు
నను గుర్తించకను నిలచిపోతివి
పూర్వజన్మలో - నీ సఖుడను నే

అర్థముగాక నిలచెను అతివ
తిరిగి పలికెను వివరము చెప్పెను
పూర్వజన్మమున హంస లైతిమి
మానస సరస్సున వసించు వారము

వేయి ఏండ్లట సఖులమైతిమి
అంతటనీవు - భూలోకములో
సుఖములనందగ మక్కువగలిగి
భూవలయమ్ము తిరుగుచు పోయి

కామిని వొకతె నిర్మించిన యట్టి
పురముజేరితివి - పంచారామమది
నవద్వార - ఏకపాలకం - త్రికోష్టమ్ము
షట్కులమ్ము పంచవిపణమున్ను

పంచప్రకృతి మరి స్త్రీనాయకమ్ము
వాటిని తిరిగి వివరించెదను
పంచారామమది పంచేంద్రియముల
ప్రయోజనమ్ము కలిగినట్టిది

నవద్వారములవి నవరంధ్రములు -
ఏకపాలమన - ప్రాణముచే మరి
పాలింపబడునది - అనియు
తేజోభిన్నములు - త్రికోష్ఠమ్ములు

ఇంద్రియసంగ్రహమ్ము షట్కులమ్ములు
కర్మేంద్రియమ్ములు విపణమ్ములగు
పంచభూతములు పంచప్రకృతి
స్త్రీనాయకమన - ప్రకృతి అధికారిణి

ఆపురమందు - స్త్రీపరతంత్రుడై
అజ్ఞానిగ మారిన పురుషుడ వీవు
ఆపురమందలి స్త్రీసుఖములతో
వైదర్భిగ నువు పుట్టితివిచట

నాటి స్త్రీభోగమ్ముల తగిలి
వాటి వాసన వదలక పోయి
స్త్రీగాపుట్టి దుర్దశ నందితివీవు
అనుచు పలికెను ఆ బ్రాహ్మణుడు

విదర్భ తనయవు నీవు కావు మరి
మలయధ్వజుడును - నీ మగడేకాదు
ఆపురమందు బంధింపబడిన
పురంజనుడవు నీవుకాదు విను

పూర్వజన్మలో పురుషుడవనుచు
ఈజన్మలో మరి స్త్రీవనుచును
చెప్పుటన్నది అసత్యమగును
నేనాడించెడి నాటకమ్ము అది

ఒక్కటినిజము పూర్వజన్మలో
మనమిద్దరము హంసలమైతిమి
నేనే నీవు - నీవే నేను అన్నది నిజము
బుద్ధిమంతులది గ్రహించగలరు

రెండుమూర్తులుగ అగబడు చున్నను
అసలు పదార్థము వొకటే వినుము
అంతా వినగా - తెలివి తెచ్చుకొని
పూర్వజ్ఞానమును పొందెను-అనుచు

తెలిపి - నారదుడు పలికె రాజుతో
ప్రాచీన బర్హీ! కథనెపముతో మరి
ఆధ్యాత్మతత్త్వము బోధించితిని
అనగా నతడు పరవశించెను

స్వామీ నీవు దయగొని నాపై
అపూర్వమైన బోధచేసితివి
కర్మానుగత జీవులమైన
మాకు అర్థముకావు మహాత్మా!

తిరిగినారదుడు పలికె రాజుతో
ఏసందర్భములో నైనాగాని
ఆత్మవల్లను - ఒకటిరెండు మరి
మూడునాల్గు పాదాలు కలిగిన

లేక అనేక పాదమ్ముల నిలచిన
అసలు పాదమ్ములవి లేకపోయినా
ఆకారణమ్మున పురంజయుండు
పురుషుడు అగును - అట్టివానికి

నామక్రియారూప గుణముల
తెలియగబడిన వాడని సఖుని
అజ్ఞాత శబ్దమున చెప్పగబడెడి
సఖుడు అతడే ఈశ్వరుడగును

దేహ స్వీకారము చేయగ దలచిన
నవద్వారకలితము ద్విహస్త పాదముల
ఏ సిద్ధాంతము అయినను కానీ
అదియే మేలగు పదవి అగునయా!

ఆపుర దేహమునందున పురుషుడు
అహంకార మమకార మింద్రియ సుఖముల
హేతువైన ఆ బుద్ధి అను నతివకు
వశుడై తాను చరించు చుండును

జ్ఞానకర్మలకు కారణమైన
ఇంద్రియ గుణములు బుద్ధికి - సఖులు
పంచముఖ సర్పమన పంచావృతిగల
ప్రాణము అన్నది తెలియగవలెను

ఏకాదశభటులన బృహద్బలుండు
జ్ఞాన కర్మేంద్రియ నియంత-మనస్సు
నవద్వార పురము చుట్టిన పాంచాలదేశము
అనగా నవ్వి పంచ విషయములు

నవద్వారములన నాసికాపుటములు
చెవులు కన్నులు మలద్వార గుహ్యావయవమ్ము
తొమ్మిది ద్వారము లవిగా లెక్కిడు
అనుచు నారదుడు తెలుపుచుండెను

ముక్కు పుటములు-కన్నులు ముఖము
తూర్పుదిక్కునకు వున్నద్వారములు
చెవులు రెండు దక్షిణోత్తరములు
మల గుహ్యావయవమ్ములు పశ్చిమ ద్వారములు

వీటియందున ఒక్కచోటనే
నిర్మితమైన ఖద్యోత అవిర్ముఖులు
కన్నులు అగును - ఆపైనున్నది
విభ్రాజితము అన-రూపము అగును

ద్యుమంతుడన చక్షురింద్రియము
నళినీ నాళినులు నాసికాద్వారములు
అవధూత అన ఘ్రాణేంద్రియమ్ము
ముఖ్యము అనగా ముఖము అగునయా!

విపణమ్మనగా వాక్కు అగును విను
రసజ్ఞుడన - రసము అగునది
అపణమనగా వ్యవహారమ్ము
బహూదనమన వివిధాన్నమ్ము

పితృహూ అన దక్షిణ శ్రవణము
దేవహూ అన ఉత్తర శ్రవణము
చండవేగుడు కాలవాచక సంవత్సరమ్ము
గంధర్వులన పగటి కాలము

గంధర్వీజనమన రాత్రికాలము
పరివర్తన అన - ఆయుహరణము
కాలపుత్రిక అనగా - వృద్ధాప్యమ్ము
యవనేశ్వరుడన మృత్యువు అగును

అతనిసైనికుల అధివ్యాధులు
ప్రజ్వారుండన ప్రాణిహింసలో
శీతోష్ణభేదముల జ్వర రుగ్మతయగు
దక్షిణ ఉత్తర పాంచాలములు

ప్రవృత్తి నివృత్తి సంజ్ఞిక శాస్త్రమగు
పితృ దేవలోక ప్రాపకమ్ములగు
శ్రుతధరు డనగా చెవియనదగును
అసురీనామకం-పడమటిద్వార గుహ్యావయవము

గ్రామకమ్మన సురత సుఖమగు
దుర్మదుడనగా గుహ్యేంద్రియమ్మగు
నివృత్తినామక పశ్చిమ ద్వారమన
మలయద్వారము అనబడు నట్టిది

వైశసమనగా నరకమ్మగును
లుబ్ధకుండన - పాయువు అగును
సంధులు అనగా చేతులు కాళ్ళు
అంతఃపురమన హృదయమ్మగును

విషూచి అనగా మనస్సు అగును
భార్యా పుత్రులు అను గుణములతో
బుద్ధివికారము కల్పించుచుండును
వాటికి లొంగి చరించు-పురుషుడు

అదే మహిషికి లొంగుటయన
రథమనగా నది దేహమ్మగును
ఇంద్రియమ్ములు అశ్వములగును
ఈషాద్వయము సంవత్సరమగు

దానితొ ముడిపడియున్నది వయస్సు
పుణ్యాపాపమ్ములు చక్రములగును
వేణుత్రయ మన త్రిగుణమ్ములవి
పంచబంధములు పంచప్రాణములు

రశ్మి అనగను మనస్సు అగును
బుద్ధి సారథి-రథికుడు ఆశీనుడగు
స్థానము అనగా హృదయమ్మగును
శోకమోహములు కూబరమ్ములు

పంచేంద్రియ ప్రవృత్తులు పంచప్రహణమ్ములు
పంచవిక్రమనమ్మన కర్మేంద్రియములు
సప్తధాతువులు సప్త వరూథములు
హైమోపస్కరమది రజోగుణమ్మగు

అక్షయతూణీరములన అనంతవాసనల
అహంకారమున కుపాధి యగును -
ఏకాదశ సైన్యాధిపతియన
పదియింద్రియమ్ముల కధిపతి మనస్సు

అసురీవృత్తి అన బాహ్య విక్రమము
పంచేంద్రియములతో వేట జరుగును
హంసతొ విషయ సుఖములు పొందుట
వేటగాను మరి చెప్పగబడును

అటుల జీవుడు దేహమునందు
స్వప్న - సుషుప్త - జాగ్రదవస్థల
ఆధ్యాత్మిక - అధిదైవిక అధిభౌతిక
బహువిధములగు దుఃఖమ్ములతో

క్లేశమ్ములను అనుభవించుచు
అజ్ఞాన వృతుడై నూరుఏండ్లవి
ప్రాణేంద్రియ - మనోధర్మములు
తనలోనే మరి ప్రతిష్టించుకు

కామలేశములు ధ్యానము చేయుచు
అహంకార మమకారమ్ములతో
కర్మాచరణ జరుపు చుండును
కర్మపరతంత్రుడు అగుచుండును - విను

సాత్విక కర్మల దివ్యలోకములు
రాజసకర్మల - దుఃఖలోకములు
తామస కర్మల శోకమోహలోకమ్ములు
అనుభవించుచు జన్మనెత్తును

కర్మల ఫలితము క్రిందు - మీదకు
లోకములకు చేరుట - జారుట
జరుగుచుండును ఓ మహరాజా!
మరియొక మాట విను ధరణీశా!

సుఖములకొరకు గుణబద్ధుడయి
ఈషణ త్రయముల వచ్చు దుఃఖమును
అనుభవించును జీవుడు ఇలలో
దానికి ప్రతిక్రియ లేనేలేదు! -

దుఃఖహేతువు కర్మయగునది
దానికి ప్రతిక్రియ కర్మే యగును
జీవిత మనునది స్వప్నము అగును
ఇటుల జరిగిన వాసనలడగవు

దేహము మిధ్య-దానికి ఆయాసము
కష్టసుఖములా - అనితలంచకు
మనస్సు దీనిని నడపువరకును
మిధ్య అగును - మరి కాకపోవును

సంసార బంధముల తెగిపోవుటకు
జగద్గురువగు ముకుందు పదములు
ఆశ్రయించుట - అట్టి భక్తియే -
ముఖ్యసాధనము అన్నది నిజము

అచంచల భక్తి హరిపై కుదిరిన
వైరాగ్యమ్మది పిలువక వచ్చును
అట్టి భక్తితో శ్రీహరి కథలను
ఆనందముగా వినుచుండవలె

వాసుదేవుని గుణకీర్తనమున
నమ్మినదేవుడు - శ్రీహరి అనుచు
దృఢ విశ్వాసము కలిగియుండవలె
అప్పుడు - మనస్సు పరిశుద్ధమగు

శ్రీహరి గుణకీర్తన - కథలు
వినెడి భక్తులకు - ఆకలి తృష్ణ
శోకభయంబులు అజ్ఞానమ్ములు
వుండవు అన్నది - గ్రహించురాజా!

సజ్జన సహవాసమ్మది లేక
ఒంటరిగా మరి కథాశ్రవణము
గుణకీర్తనము చేసినచో మరి
ఫలితము - శ్రీఘ్రముగా లభించదు

విరించి శివుడు-మనువులు ప్రజాపతులు
నిష్ఠాగరిష్ఠులు సనకసనందనులు
పులస్త్యుడు భృగువు - పులహుడు అత్రి
అంగిరస - క్రతువు మరీచి వశిష్ఠులు

తపోధనులును బ్రహ్మావాదులు
పావన జీవన దీక్షాపరులును
వారి సాధనల - సర్వసాక్షియగు
ఈశ్వర దేవుని - దర్శించకపోయిరి!

అనంతమైన వేద కర్మలను
అనుసరించుచు మంత్ర సాయమున
ఇంద్రుడే దైవమని శుభకరుడనుచు
సేవించిన - దొరకదు హరి దర్శనము

తనకు తానుగా లక్ష్మీపతి - తా -
అనుగ్రహించిన దర్శనమగును
తపోసేవలు కఠోరదీక్షలు
ఎంతచేసిరని యోచించడు - విను

పరంధాముని ఆరాధనలో
లగ్నమైనచో - ఆ పుణ్యాత్ముడు
వైదిక కర్మకాండ అంతయును
నిరర్థకమ్మని - వదలిపెట్టును

రాజా! నువుయిక కర్మకాండను
వదలివేయము జ్ఞాన దృష్టితో
మోహపరచెడి యజ్ఞ కర్మలు
మోక్షమొసగునని భ్రాంతికలుగును

వాసుదేవుని వివరించును వేదము
కర్మల కోసము వేదమున్నదని
అందుకె వేదముపుట్టె ననుచును
చెప్పెడివారు వేదవేత్తలుకారు

ఆత్మతత్వమును చెప్పుట కొరకు
వేదములవ్వి ఉద్భవించినవి
అది తెలియక మరి చదివిన చదువు
నిష్ప్రయోజనము-విను మహరాజా!

వేద అవగాహన సరిగా లేక
తూర్పుదిక్కుకు కొసలనుపరచి
రాజ్యమంతయు యజ్ఞశాలగా
మార్చివేసి - పశు వధ చేసితివి

నీకర్మాచరణలో అహంకారమది
కొట్టవచ్చినటు కనబడు చున్నది
వాసుదేవుని తృప్తి పరచునది
సే కర్మగ గుర్తించబడు

వాసుదేవునిలో బుద్ధినిలపునది
అదియే విద్యగ గ్రహించవలెను
వాసుదేవుడే జీవుల ఆత్మ
శ్రీపతి పదముల సేవ క్షేమమిదు!

భగవంతుని స్వరూప అవగాహనయది
కలిగినవాడే విద్వాంసుడగు
అతడే హితవును చెప్పెడి గురువు
గురురూపమ్మగు హరియే అతడగు

రాజా! పురుషుడు అడవి మృగముతో
పోల్చగ దగిన వాడయ్యా! విను
దాని బ్రతుకది తెలియును గాదా
నివాస మేమో క్రీకారణ్యము

ప్రకృతి సోయగ మొలకెడి
లతలు పూవులు - తరువులున్నను
దాని మనస్సది ఆడు మృగముకై
ఆరాటమును పడుచుండును - విను!

ముందుగ దానిని చంపు మృగములు
వెనుక విల్లుతో బోయ అగపడు
ముందు నూయి వెనుకను గొయ్యిగ
దాని బ్రతుకది ప్రాణసంకటము

అటులే పురుషుడు సుఖభోగములు
అనుభవించుచు నుంటిని అనుచు
అజ్ఞానములో కాలము గడుపును
అతని నెత్తిపై యమదండముండును

ఏరోజో! మరి ఏక్షణమో! - అది
నెత్తినబడిన - అంతే ఆఖరు
భోగభాగ్యములు ఒక్కనిమిషము
ఆగనీయవు - అదియే జ్ఞానము

కనుక నీవు ఈ జీవుని మరి
అడవిలొ లేడిగ భావించుకొని
సర్వమయుండు - జీవుల జీవము
ఆ పరమాత్మను ఉపాసించుము."

అనుచు నారదుడు చెప్పగావిని
ప్రాచీన బర్హి - పలికె భక్తిగా
"నారదమౌనీ! భగవంతుడని
నిన్నే తలతును - వేరుగలేడు -

ఆత్మతత్త్వమును అతివిపులముగా
బోధించినవారు ఎవరూలేరు
శ్రద్ధగవింటిని - ఆకళించుకొని
అజ్ఞాన తిమిరమును పాలద్రోలితి.

నీరూపములో ఈశ్వరదేవుడు
ఆత్మతత్త్వము ఉపదేశించెను
అని నే నమ్మితి - అయినా నాకు
కలిగిన సందేహమ్ములు తీర్చుము

ఈలోకములో చేసిన కర్మల
ఫలితము జీవుడు మరోలోకమున
మరో దేహముతొ అనుభవించుట
ఎటుల పొసగునో వివరించుమయా!

ఆయాజీవుల కర్మలు యిచటే
దేహముతో మరి దహించబడినచొ
మరో దేహమును మరోలోకమును
అనుభవించుట - ఎటుల జరుగును."

అనగా పలికెను నారదమౌని
"రాజా! జీవుడు స్వప్నములోన
లింగ దేహమును వదలి మరొక
దేహముతో కర్మానుభవ మందును

అటులే జీవుడు - ఏ లింగశరీరమున
కర్మలు చేయునొ-అదే లింగదేహముతో
లోకాంతరమున కర్మల ఫలితము
అనుభవించుట జరుగుచుండును

ఇచ్చిపుచ్చుకొనుట అన్నవి -
స్థూల దేహముకు చెందినట్టివే!
అయిననుకానీ - ఒక విషయము విను!
అహంకార మమకారమ్ముల తోను

మదికితోచినటు కర్మలు చేయనిచొ
వాటి ఫలితము - చేరు జీవునకు
కావున సూక్ష్మ శరీరముతో అవి
అనుభవించుట జరుగుచున్నది

మనస్సు నడపగ - జీవుడే తన
కర్మలు చేసి - ఫలితము నందును
ప్రధాన హేతువు మనస్సు అగును
లేనిచొ - తిరిగి పుట్టుట ఎటుల!

పునర్జన్మకు హేతువు మనస్సగు
అదే సంసారబంధమ్ముల మూలము
కర్మలు చేయును మనస్సు ప్రేరణతొ
వాటివల్లను మాయలొపడును

మాయవల్ల కల్పించిన వన్నియు
దేహము మరియు కర్మబంధములు -
మాయజయించు సాధనమ్మది
హరి భక్తి వొక్కటే-బలమగు అస్త్రము

ఇకపై నీవు నాబోధనలు
మదిలో నుంచుకు ఈశ్వరసేవలొ
ముక్తసంగునిగ జీవించుమయా!"
అని పలికి - సాగెను నారదమౌని

ప్రాచీన బర్హికి కనువిప్పయినది
రాజ్యము తనయుల కందించి తను
నియమ నిష్టలు పాటించుచును
సర్వసంగ పరిత్యాగము చేసెను.

దేహభావన పూర్తిగవదలి
విష్ణుపథమును చేరగ తలచి
గట్టి పట్టుతో భక్తి బలముతో
హరిపద సేవా నిరతినిండెను

అన్యచింతన మదిలో లేని
పరమ భాగవతునిగా మారి
ఆ పరమాత్మ అనుగ్రహమ్మున
ఆనంద ధామముచేరెను - అనుచు

మైత్రేయుండు విదురున కచట
తెలియబరచెను దివ్యగాధను -
లోకపావనము - పాపహరణము
వినినా - చదివిన - మనోవికాసమగు

ఈ ఆధ్యాత్మిక బోధన విశేషమైనది
అమోఘ ఫలము నొసంగునట్టిది
కర్మాచరణల వలన వచ్చెడి
పునర్జన్మ దుఃఖము తొలగును

అనగా వినిన విదురుడంతట
పరవశమ్మున పలికెను మునితో
మైత్రేయా! నువు నాకు లభించిన
పరమేశ్వరుడవు సందియమేల

కనుకనె నాడు ఉద్ధవుడు తను
నీకు నన్ను మరి అప్పగించెను
నీదయవలన తెలిసితినంతయు
నాకానందము దొరకినట్లయె

రుద్రుని వలన హరిస్తవమ్మును
గ్రహించినట్టి ప్రచేతసుల
వివరము లేమి - వారందరికీ
హరి అనుగ్రహము ఎటుల లభించెను!

వివరించుము స్వామీ! వినితరింతును
ముకుందు గాధలు మంగళ ప్రదములు
పాపహరణములు చిత్తశాంతి నిడు
ఆయురారోగ్యమ్ములను పెంచునవి."

॥శ్రీ కృష్ణచరితము॥



# 28 ప్రచేతసుల తపస్సుకు మెచ్చి భగవానుడు వరములిచ్చుట

తండ్రి ఆనతిని ప్రచేతసులందరు
తపముచేయగా నిశ్చయించుకొని
సంద్రమధ్యమున ప్రారంభించిరి
వాసుదేవస్తుతియే వారి మంత్రము

అటుల దీక్షగా పదివేలేండ్లు
తపస్సు చేసిరి వారి తపముకు
జపయజ్ఞమునకు నారాయణుడు
ఆనందించి ప్రత్యక్షమయ్యెను

దివ్య మంగళమూర్తిని కనగా
దివ్య కాంతులతొ తాపముతీరెను
గరుడవాహనము - రత్నమకుటము
శంఖ చక్రగద పద్మమ్ములతో

పట్టుపీతాంబరము - భుజకీర్తులతో
మంజేతి కడియములు పాదమంజరులు
చిరునగవొలికే వదన సరోజము
అభయమునిచ్చే కస్తూరి తిలకము

పరంధాముని ప్రసన్నరూపము
గాంచి ముగ్ధులై నిలచిపోయిరి
వారి మనస్సుకు ప్రశాంతత నిడె
పలికెను శ్రీహరి అతిమధురముగా

"ప్రచేతసులారా! మీతపముకు మెచ్చితి
ఉత్తమ సోదరులు మీరందరును
అనుగ్రహించగ దర్శనమిడితిని
మీకోరికది నెరవేర్చెదను

మీసఖ్యత మరి భ్రాతృప్రేమయది
భువనాదర్శము - ఎన్నికైనది
నిద్రసమయమున మిమ్ముతలచిన
సోదర ప్రేమతొ సజ్జనుడగును

రుద్రుడు చెప్పిన స్తవమును నిరతము
భక్తిశ్రద్ధల పఠించువారికి
క్షేమమునొసగి కోర్కెలు తీర్తును
విశేషమైన ప్రజ్ఞ నిడెదను

తండ్రి ఆజ్ఞను పరిపాలించిన
మీయశస్సును అన్నిలోకముల
శ్లాఘించుచుండును - మీకు తనయుడు
ఉత్తమోత్తముడు ఉద్భవించును

కండు మహాముని తపోభంగముకు
ఇంద్రుడు పంపును "ప్రమోచ' అనెడి
దేవకన్యను - ఆ సుందరితో
కండు మహర్షికి తపోవిఘ్నమగు

గర్భవతి అగు ఆమెను మహర్షి
వదలిపెట్టగా ఆ సుందరి - తా -
ఆడ శిశువుకు జన్మనుయిచ్చి
ఒక తరువున నుంచి - స్వర్గమేగును

ఆకలితో ఆ బిడ్డ ఏడ్వగను
చంద్రుడు వచ్చి - తన చూపుడు వ్రేలిని
పాప నోటిలో నుంచి - దానితో
అమృత పానము చేయించగను

క్రమముగ పిల్ల పెరిగి పెద్దదగు
ఆమె పేరు మరి 'మారిష - అగును
అటుపిమ్మటను ప్రజాసృష్టికి
ప్రాచీన బర్హి మిమ్మందరినీ

గృహస్థాశ్రమము స్వీకరించమను
అంతటమీరా సుందరి - మారిషను
పరిణయమాడుడు-సమానధర్ములు
కావున - పెండ్లి శాస్త్రసమ్మతము!

ధర్మాచరణతొ మీకందరికీ
మారిష - ప్రియముగ సహకరించును
వేల ఏండ్లు మీరందరు సుఖముగ
ఐహిక భోగము లనుభవించుడు

ఆవిధముగను వరము నిచ్చితి
అటుపిమ్మటను భక్తిబలపడి
సంసార జీవితము నందు విరక్తితొ
నాస్థానమునకు చేరుకుందురు

సంసార జీవితము అనుభవించుచు
నాగుణకీర్తన కథలను చెప్పుచు
ధర్మమార్గమున చరించుచుందురు
అట్టివారికి బంధములుండవు

నేనే బ్రహ్మను - పరాత్పరుండను
బంధమ్ములను సడలించుటయు
నావల్లనె మరి జరుగును - వినుడు
భోగములిత్తును - దూరముచేతును

నాగుణ కీర్తన చేసెడి భక్తుల
వెంటనుండి నే కాపాడెదను
సంసార బంధముల బ్రతుకు చున్నను
అభయహస్తమున కాచుచుందును."

అని పరమాత్మ పలికిన యంత
పరవశించిరి ప్రచేతసులు
ఆనందబాష్పముల ముడిచిన కరముల
నమస్కరించిరి మూగగొంతులతొ

కొంతసేపటికి గొంతులు పెగల్చి
పరంధాముని స్తుతించిరిటుల
"ఈశ్వరదేవా - భువనపోషకా!
దీనశరణ్యా - భక్తమందార!

కటాక్షించుము కందర్పసుందర
మామ్రొక్కులను గ్రహించు స్వామీ!
మా అదృష్టము ఏమని చెప్పుట
మహాయోగులకు అలభ్యమైన

దివ్యదర్శనము కలిగించితివి
భక్తవత్సలుడు అన్నమాటది
అక్షరాల మరి సత్యమైనది
మమ్ముల నీవు దరికిజేర్చుకో

భవభయ హారక - భక్తసులభుడా!
నీదర్శనమున ధన్యులమైతిమి
అజ్ఞానములో మేము చేసిన
పాపములన్నీ హరించి వేయుము

నీదర్శనమది పాపక్షాళనము
కావున-నీపద మందగ తగుదుము
నమ్మిన వారి ఇడుములు బాపే
కరుణాసింధువు నీవేస్వామీ!

మాటలకందని జ్యోతిరూపుడవు
ఊహలకందని అనంతమూర్తివి
విరించికీవు జనకుడ వైతివి
జనక శబ్దముకు సార్ధకతనిడ

సత్యగుణమది పుట్టెను నీలో
జగముల సృష్టి నీ అరచేతనున్నది
లోకోద్ధరణ నీ అభీష్టము
నీ కోపమది – లయకాలమగు

భువనవందిత చరణారవిందా!
పావని పుట్టిన పదములునీవి!
బ్రహ్మకడిగిన దివ్యపాదములు
కన్నులగాంచితి మెంత ధన్యులము

నిగమాంతవందితా! ఆ వేదములే
ఒక్కనోట వర్ణించగ లేక
నాల్గుముఖముల ధాత సాయమున
ప్రయత్నించి మరి ఓడిపోయినవి

మాబాధలవి నీకు తెలియదా
మా అభీష్టము అడగగ వలెనా
ఎందరెందరికొ అలుపులేకను
దర్శనమిడి నువు అలసి పోవుగద!

నావాడని – నీవనుకున్నచొ మరి
వాడు ధన్యుడే లక్ష్మీరమణా!
దయతో దర్శనమిడితివి మాకు
అంతకు మించి కోరిక ఏమి!

కోరిక ఏమని అడిగితివీవు
కరుణా వార్నిధిలోన తేలితిమి
ఉత్తమ మార్గము నిచ్చెడి గురువువు
విశ్వగురుడవు విరాడ్రూపుడవు!

కోరవలసినది ఏమివున్నది!
కాంచనచేలా! నీకుతెలియదా!
మహాయోగులు యోగనిష్టలో
నీ అనుగ్రహము కోరుకుందురు

నీ అనుగ్రహము అనుభవించితిమి
నీపదములను దర్శించితిమి
నీ అభిమాన సుధ గ్రోలుచుంటిమి
నీవారముగా అయితిమి మేము

అంతకు మించి కోరెడిదేమి
నిరంతరము నీ కరుణాదృష్టి
మాపై దయతో ప్రసరింపజేయుము
మనుగడ కదియే పరమార్ధమ్మగు

మాధవా! ఓరమాధవా! విను
నిరంతరము నీ భక్తులతోను
నెయ్యము కలిగి – నిలచునట్టుగా
అనుగ్రహించుము – అదియేచాలు!

నీపద భక్తి అన్నవరమది
స్వర్గవాసము మించిన సుఖమిదు
నీచెలికాడు చంద్రశేఖరుని
దర్శనమ్ము నీ అనుగ్రహమ్మే!

దేవదేవుడు నీదయవలన
భగరోగ హరమ్మగు ఔషధమ్మును
అందించెను మరి ఆ ఔషధమును
సృష్టించిన ఘన వైద్యుడ వీవే!

మా తపోదీక్షలు జలముల ధ్యానము
చదువులు జపతప యోగమార్గములు
అంతా నీ దయ పొందుట కొరకే
నీ సంతోషము భక్తుల పెన్నిధి

శ్యామసుందరా! కాళియమర్దన!
పాప పన్నగము మర్దించబడె
మమతా బంధములన్నీ - నీ ఎడ
కలుగునట్టుగా అనుగ్రహించుము

బ్రహ్మరుద్రాది యోగులు ధ్యాననిష్టులు
నీ అనుగ్రహము పొందగ కోరి
శక్తికి తగినటు స్తుతించు చుందురు
మాబుద్ధికి తగిన మాస్తుతినందుము

దీనవత్సలా - నారద సన్నుత!
భక్త మందార - ఆపన్నకల్పకమ -
నమస్సు లివిగో! నందనందనా!
అంజలువివిగో! అనంతమూర్తీ!"

అనుచు భక్తిగా చేసినయట్టి
ప్రచేతసుల స్తుతులనందుకు
అడిగిన వరములు అనుగ్రహించి
వైకుంఠత్రోవలో సాగె రమాపతి

అంతట ప్రచేతసులు సంద్రజలముల
నిలచిన వారు ఒడ్డుకు చేరగ
భూమి అంతయు నింగికి సాగిన
తరువుల నిండి కనబడ కుండెను

వృక్షమయమ్ముగ నుండె వసుంధర
వారికి కోపము ఆశ్చర్యము కలిగెను
ఆగ్రహావేశము తోను - హుంకరించగా
నిప్పుకణములు రాలెను కన్నుల

భయంకరమ్మగు గాలులు వారి
ముఖమునుండి మరి బయిటకు వచ్చి
ఘనతరువులను పెల్లగించెను
దగ్ధమైనవి తరువులచ్చట

అ భీభత్సము భరించలేక
గిర్రున తిరిగెను భూమి అచ్చట
అకాల ప్రళయము అని తలంచెను
సృష్టికర్త - తా - గ్రహించె సర్వము

హుటా హుటిని తన హంసవాహనము
అధిరోహించి నిలచెను ముందర
బ్రహ్మను గాంచి ప్రచేతసులట
శాంతి నందిరి - అంతట బ్రహ్మ

చల్లగ పలికెను వారందరితో
"వాసుదేవుని అనుగ్రహమ్మును
పొందిన భక్తశిఖామణులు కద!
భూత సంహారము తగునా మీకు!

శాంతినందుడు అనుచు వారిని."
చల్లనిమాటల నిలువరించెను
ప్రసన్నులుగా ప్రచేతసులవ
అగ్నిగాలులు అణగిపోయినవి

అంతట బ్రహ్మ - వృక్షాధి దేవతను
మారిషను మరి తెమ్మని చెప్పగ
వృక్షాధి దేవత నిలపె జవ్వనిని
బ్రహ్మ - తరుణిని వారికి చూపుచు

ప్రచేతసులారా! ఈశ్వరాదేశము
ఈమెను - మీరు యిల్లాలిగను
స్వీకరించుడు - ఈలలనామణి
అమృతపానము చేసిన - నెలత

పతులను దైవము కన్న మిన్నయని
భయభక్తులతో సేవచేసెడి
ధర్మచరిత యీ - సౌభాగ్యవతి
మీరు యీమెను - పరిణయమాడుడు

బ్రహ్మమాటను పరిపాలించుచు
ఈశ్వర వరమే అది అని తలచి
మారిషను మరి వివాహమాడిరి
గృహస్థాశ్రమము - స్వీకరించిరి

అంతమంది మగవారికి ఒకతే
భార్యఅన్నది వింతగనున్నను
ఈశ్వరుమాయ - అపరంధాముని
నాటకమ్ములు - అటులేవుండును

మరో విశేషము ఆజవ్వనితో
ప్రజాసృష్టిని చేయువారిలో
సమర్థుడైన దక్షుని - వారు
తనయుని గాను పొందగ వలెను

ఆవిధముగ దక్షుడు వారికి
తనయునిగాను జనించినాడు
దక్షుడు అనెడి నామధేయమును
ప్రచేతసులు వుంచిరి శిశువుకు

శిశువుగ నుండగ దక్షుని తేజము
గాంచినవారు చకితులాయిరి
విధి నిర్వహణలొ దిట్ట అగునని
దక్షుడు - అనుచు పేరునుంచిరి

దక్షుడు పెరిగి సృష్టికర్త అయె
అంత ప్రచేతసులాలోచించి
భార్యను - తనయుని కప్పగించిరి
వనవాసదీక్షతో తపముకు నడచిరి

పశ్చిమ సంద్రపు తీరమ్మున గల
ఆశ్రమమ్మున జాబాలి మహర్షి
తపోసిద్ధిని పొందెను - దానిని
ఆశ్రయించుకొని తపము చేసిరి

అంతట తిరిగి నారదమహర్షి
దర్శనమిడెను ఆసమయమునకు
వారితపస్సు పరాకాష్టకు చేరుకున్నది
పరిణతి చెందెను ఆత్మవిమర్శతొ

ప్రాణము-మనస్సు-వాక్కును చూపును
నిష్టగ వొకచో నిలపగలిగిరి
మనోమాలిన్యము జ్ఞానాగ్నిలొ మండెను
మూర్తీభవించిన శాంతమూర్తులయె

నారదు గాంచి ఆనందముగా
లేచి నిలబడి అంజలులొసగి
యాధావిధిగను పూజనుచేసిరి
భక్తి ప్రపత్తుల పలికిరి వారు

"మౌనిచంద్రమా! నీవడుగిడిన
నేల పునీతము అగునది స్వామీ!
నీదర్శనము దివ్య జ్ఞానమును
కలిగించునది తరింపజేయును

రవి కిరణమువలె నీదర్శనము
అజ్ఞానతిమిరమును అంతము చేయును
మాభాగ్యమది నిన్ను గాంచితిమి
పుణ్యతీర్థమే నిలచెను ముందర

గృహస్థులకును అలభ్యమైనది
ఆత్మతత్వము - శివ కేశవుల
అనుగ్రహమ్మున - లభ్యమైనది
గృహస్థాశ్రమమ్మున-మరచి పోతిమది

తాపత్రయములు సంసార వాసనలు
హరించిపోవగ దయగొని నీవు
ఆత్మజ్యోతిని వెలిగించవయా!
ఆత్మతత్వమును బోధించుము దయతో."

అందులకొరకై వచ్చె దేవముని
వారినిగాంచి పలికె ప్రియముగా
"రాజవంశముల రత్నదీపికలు
శివకేశవుల అనుగ్రహ పాత్రులు

ఏ జన్మయినా - ఏకర్మలొ నైనా
ఏది పలికినా - ఎట్టిఅవస్థలొ
ఒకటే - ఒకటే - హరిభక్తి యది
ప్రాణికోటికి తరుణోపాయము

ముకుందుపదముల భక్తిలేనిదగు
జన్మ ఎందులకు - యజ్ఞము లెందుకు
ఆ భక్తిలేకను వేదకర్మలను
ఆచరించినా ఫలితము శూన్యమె

హరి భక్తి లేనిదగు - చదువు వ్యర్థము
ఇంద్రియ పటిమ నిష్ప్రయోజనము
చురుకగు బుద్ధికి - ఫలితము శూన్యమె
యోగ - సాధనలు - నిరర్థకమ్ము

ఒక్కమాటను వినుడు శ్రద్ధగా
రమాపతి మరి సర్వేశ్వరుడగు
సర్వభూతముల రక్షకుడాతడు
సర్వవ్యాపకుడు అక్షరుడాతడు



తరువు మూలమున నీరుపోసినచొ
కొమ్మలు రెమ్మల కిడినట్లగును
అటులే - కేశవ పూజచేసిన
సర్వదేవతల పూజించినటు

వర్షకాలమున కురిసిన నీరు
సూర్యకిరణముల - చేరును రవిని
అటులే భూమిని పుట్టిన యట్టి
సకలప్రాణులు చేరును హరిని

తాను సృజించి మాయను కమ్మి
లోభమోహముల దాసులచేసి
లీలానాటక మాడుచు అతడు
వినోదించును - ఆ ఆటలొ మరి

ప్రాణి జయించిన తన విజయమ్మగు
అటుల జయించు సాధనమొకటే
ముకుంద పదముల అచంచల భక్తి
అదిలేకున్న - ఓటమి తప్పదు -

సజ్జనులని మరి వేరుగ పుట్టరు
ఈశ్వరభక్తి - భూతదయయది
కలిగియుండెడి వారు సజ్జనులు
ధన-బల గర్వమదాంధులు చెడెదరు

జ్ఞానవంతులు - ఇంద్రాదిసురలను
సేవింపరు విను - వారందరును
వాసుదేవుని ఆజ్ఞానువర్తులు
శ్రీహరి ఒకడే - సర్వస్వతంత్రుడు

నీవే దిక్కని వేడిన వారిని
గ్రక్కున గ్రహించి - ఆర్తి చూపును
అక్కరలో మరి ప్రక్కనిలచెడి
దైవము ఒకడే - అతడే శ్రీహరి

మీవంశమున జననమందిన
ధ్రువుడు - భక్తిగా హరిని భజించెను
సవతితల్లి మాటనెపంబున
కలిగెను దీక్ష - సడలక పోయెను

త్రోవలో నేను పరీక్షించితి
వెనుకకు మరలక మనసుమారక
ముందడుగేసి మహోన్నతంబగు
పునరావృత్తి రహిత లోకమ్ముచేరెను

ఆవంశములో జననమందిన
మీరు కూడా ఆ రుద్రుడు నాడు
ఉపదేశించిన పద్ధతిలోను
ఈశ్వరదేవుని ఆరాధించుడు."

అటుల నారదుడు వారికి చెప్పి
సాగిపోయెను–నారాయణ జపమున
ప్రచేతసులు ఆ దివ్యతత్వమును
గ్రహించినారు నమ్మకమ్ముతో

రుద్రుడు చెప్పిన హరిస్తవమ్మును
త్రిసంధ్యలందు పఠించు చుండి
విష్ణు కథలతో కాలము గడిపి
సర్వము శ్రీహరి అనుచు చూచుచు

ఆనంద ధామము – మదిలో నిలపి
ఆర్త రక్షకుడు ఆపన్నుడని
అహర్నిశము శ్రీహరియే ఊపిరి
అనుచు స్మరించిరి – ప్రచేతసులు

భక్తసులభుడు పరుగున వచ్చి
ఆదుకొనెడి ఆ అభయప్రదాత
ఆనందముతో ఆహ్వానించగ
హరి పదమునకు చేరిరివారు

అని మైత్రేయుడు విదురుని కంత
తెలియబరచి మరి పలికె వారితో –
ప్రచేతసులకు నారదమునికి
జరిగిన సంభాషణము చెప్పితి

ఉత్తానపాదుని వంశక్రమము
ప్రియవ్రతు చరిత – జ్ఞానము పొందు
అన్నీ తెలిపితి – ప్రియవ్రతుడు మరి
చక్కగ నేలి వృద్ధాప్యములో

రాజ్యభారము తనయులకిచ్చి
ముక్తి ధామము చేరెను శాంతిగ
అనుచు విదురునకు మైత్రేయుండు
తెలిపెను భక్తితొ – పరవశమ్ముతో

ధన్యుడ నైతిని నీదయవలన
హరితత్వమును వివరించిన నీకు
ప్రతిఫల మేమియు ఇవ్వగలనయా!
భగవ దంశతో పుట్టితి వీవు!

అనుచు విదురుడు అనన్యభక్తితొ
గుండెలుపొంగిన ఆనందముతో
శిరస్సునుంచెను మైత్రేయుని పదముల
భక్త్యంజలి అని పొంగిపోయెను.”

ఈ విదుర మైత్రేయ సంవాదమును
వినినా చదివినా దీర్ఘాయుష్షుతొ
ఆరోగ్య – భోగభాగ్యములందును
అనన్యమైన యశస్సు కలుగును

మనశ్శాంతిని కలిగించునిది
పరిపూర్ణమైన ఆరోగ్యమునిడు
దేహాంతమున శుభస్థితికలుగును
అతని జన్మ - చరితార్థము అగును

అనుచు ప్రియముగా వ్యాసనందనుడు
పరీక్షిత్తునకు తెలిపెను అనుచు
సూతుడు అచటి శౌనకాదులకు
వినిపించెను శ్రీహరి గాథలను.

**శ్రీ కృష్ణచరితము - కర్ణపేయము**
**వ్యాసమౌనికే - శాంతినొసగినది**
**పోతనయ్య - పులకించి పలికినది**
**భవ భయ హారిణి - భాగవతమ్ము॥**

**ఓం శాంతి - శాంతి - శాంతిః**





సర్వేజనాస్సుఖినోభవన్తు
లోకాస్సమస్తాస్సుఖినోభవన్తు





**సర్వం శ్రీ సీతారామచంద్ర పాదార్పణమస్తు**



(మకుటం)

శ్రీ కృష్ణచరితము - కర్ణపేయము
వ్యాసమౌనికే - శాంతినొసగినది
పోతనయ్య - పులకించి పలికినది
భవ భయ హారిణి - భాగవతమ్ము॥

# శ్రీమద్భాగవత - మకరందము

## (పంచమస్కంధము)



విషయ సూచిక





శ్రీరామ

ఓం - నమో - వాసుదేవాయనమః

# శ్రీమద్భాగవత - మకరందము

## (పంచమస్కంధము)

## 1 ప్రియవ్రత చరిత్ర

ఓ మహరాజా - ప్రియవ్రతుండను
ధరణీనాధుడు - హరిపదసేవలో
గృహస్థుడయ్యును - మోక్షమునందెను
అనుచు ముదముగా-శుకుడు చెప్పగా

రాజు అడిగెను - మహానుభావా
సంసారలంపటము నందా జ్ఞాని
ఎటుల పడెనయా - తీరా పడినచొ
హరిపై ధ్యానము - ఎటుల నిలపెను.

నీ సందేహము - సమంజసమ్ము
హరిపదసేవామృతమును గ్రోలే
సజ్జనులకు మరి అవాంతరమ్ములు
అవలీలగను తొలగిపోవును.

నారదమౌని దివ్యబోధనతొ
హరిపై మనసు లగ్నము చేసి
ప్రియవ్రతుండు - తా - గడపసాగెను
తండ్రికి మదిలో చింత మొదలయె

రాజమకుటము శిరమున దాల్చి
ప్రజాపాలనము చేయగ చెప్పిన
చెవిని పెట్టక - దీక్షలొ నున్న
తనయుని గాంచి తల్లడిల్లెను

అరాచకంబై రాజ్యము చెడునని
బ్రహ్మతలంచి - ప్రియవ్రతునికి
మనసు మార్చగ - మదిలో నెంచి
సత్యలోకమును - వదలి భువికి దిగె

హంస వాహనము నధిరోహించి
వేద శృతులవి వెంట సాగగా
మునులందరును ముదముతొ నంత
సృష్టికర్తను ప్రశంసించిరి.

సిద్ధులు - సాధ్యులు - గంధర్వులును
గరుడ - చారణ - కిన్నరులున్ను
కింపురుషులును విరించి వెంబడి
స్తోత్రము చేయుచు - బయలు దేరిరి.

గంధమాదన గిరిపై బ్రహ్మ
దిగినంతటనే నారదమౌని
స్వాయంభువుని మరి ప్రియవ్రతుని అట
విరించి సన్నిధిలోనికి తెచ్చెను.

అందరి స్తుతులను అందిన బ్రహ్మ
ఆసీనుడయి - మందహాసమున
పలికెను ప్రియవ్రతు నుద్దేశించి
"నీ దీక్షకు మరి సంతసించితిని.

నీతో బాటు నా జనకుడగు
పద్మనాభుడు పులకరించెను
ఆయన ఆనతి తలను ధరించి
నీతో పలుకగ వచ్చితినయ్యా!

నా పలుకులివి పరంధామునివి
నీకు తత్వమును బోధచేసిన
నారదుడైనను - నేనైనను మరి
ఈశ్వరాజ్ఞగా చేసెద మంతయు

నేను చెప్పెడి మాటలన్నియు
ఈశ్వరదేవుని వని - మదినమ్మి
ఆచరించుము" అనిన ప్రియవ్రతుడు
వినయమునిండి పలికె భక్తిగా.

నీ ఆనతిని శిరమున దాల్తును
ఆనందముతో నెరవేర్తునని -
అంతట విరించి పలికెనిట్టుల
"జీవుడు స్వతంత్రుడెంతయుకాదు

సృష్టి స్థితి లయ గతులన్నియును
ఈశ్వరేచ్ఛతో జరుగుచుండును
తపస్సు, విద్య, యోగ, జ్ఞానములు
అర్థ, ధర్మముల జీవి తరించడు.

కష్ట సుఖములు - శోక మోహములు
భయమును జీవికి ఒసగు నీశ్వరుడు
వాటిని జీవుడు దాటగలేడు
ఈశ్వరువాక్కులు - వేదములగును

త్రిగుణమ్ములవి - కట్టుత్రాళ్ళగు
వేదమ్ములలో - త్రిగుణమ్ములలో
సృష్టికర్తనగు నేనైనను మరి
ఈశ్వరాజ్ఞకు బద్ధుడనయ్యా!

కలలో చూచిన దంతా భ్రమయని
వివేకితలచును ఆ విధముగను
ఆత్మవేత్త తా సుఖదుఃఖములు
అనుభవించుచూ ముక్తినందును.

ఆత్మజ్ఞానికి జరామరణముల
వలయమునందు విముఖత కలుగును
ఈశ్వరు ధ్యానమునందున మునిగి
బంధమ్ములను త్రెంచుకొనవలె!

అన్నీవదలి అడవిలోనున్నను
ఇంద్రియాలను జయించకున్న
సంసారమను వలయమునందు
పడుట జరుగును మునుగుచుండును.

గృహస్థుడైనను జితేంద్రియునకు
ఆత్మజ్ఞానము లభించునయ్యా!
అది లభించిన మోక్షమునకును
దారి సుగమమై గమ్యము జేర్చును.

బలవంతుడగు రిపునిగెలువగ
కోటను వదలక - బలముగనున్నచొ
జయించ వీలగు - అటుగాకున్న
కోటవదలిన వోటమితప్పదు.

కావున నీవు గృహస్థుడవై
శ్రీహరిపదములు అనెడి కోటను
ఆశ్రయించుకుని హరినామమ్మను
ఆయుధమ్ముతో రిపులజయించుము

హరినామమ్మను సుదర్శనముతో
అంతఃశ్శత్రుల నంతముజేసి
ఈశ్వర కల్పిత భోగములందుచు
మోక్షరాజ్యమున అడుగుబెట్టుము."

ప్రియవ్రతుండు తన సమ్మతి తెలిపెను
స్వాయం భవ మనసెంతయొపొంగెను
తన కోరికది తీరినదనుచు
విరించి నెంతో స్తుతించె నాతడు.

నారదు నసుమతి పొందినవాడై
రాజ్య భారము కొడుకు కొసంగి
మోక్షగామియై తపోదీక్షతో
వనము కేగెను స్వాయంభువుడు.

రాజ్యభోగములు కష్టసుఖములు
ఈశ్వరు కల్పితమని ధ్యానించి
నిరంతరమ్ము ముకుందు స్మరణతొ
చల్లగ నేలెను ప్రియవ్రతుండు.

రాగద్వేషములు మోహబంధముల
మనసును మాత్రములొంగనీయక
నిత్యానందము ననుభవించుచు
ప్రజల మనస్సుల నేలసాగెను.

ప్రియవ్రతునికి యిల్లాలైన
బర్హిష్మతి - పతి అడుగులనడిచే
పరమ పతివ్రత పావనచరిత
విశ్వకర్మకు ముద్దులపట్టి.

పతిసేవలలో పరవశమందెడి
పుణ్యవతికి మరి నోము ఫలించి
పదిమంది తనయులు ఆపై కూతురు
పరమయోగ్యులు పుట్టిరి రాజా!

అగ్నీధ్రుడు మరి ఐధ్మజిహ్వుడు
యజ్ఞబాహువు మహావీరుడు
హిరణ్యరేతస ఘృతపృష్ఠులును
సవనుడు మేధాతిథి యను ఎనిమిది

ఆపై యిద్దరు వీతిహోత్రుడు
కవియను పేరుల బరగెడి వారు!
గుణశీలముల ఔదార్యముల
తేజమునందు తండ్రికి తగుదురు.

మహావీరుడు - కవియు - సవనుడు
విరక్తిభావము నిండి జ్ఞానులై
బాల్యమునుండే - యోగసాధనతొ
కాలము గడిపి - హరిలో కలిసిరి

కొంతకాలముకు ప్రియవ్రతుండు
మరియొక కన్యను - వివాహమాడి
ఉత్తమ - తమస - రైవతులనెడి
ముగ్గురు పుత్రుల నందె ముదముగా

విషయ వాంఛల మనసులొంగెను
రాజ్యకాంక్షయది పెరిగిపోయెను
రిపులజయించి రాజ్యముపెంచెను
భార్యలిద్దరితొ సుఖములతేలెను.

ఒక దినమున తన ఆలోచనలు
సూర్యునిపైకి దూసుకుపోయెను
మేరుగిరిని తా ప్రదక్షిణించుచు
తిరుగును కాదా భాస్కరదేవుడు

మేరువు కద్దరి ప్రదేశమంతయు
చీకటిమయమై యున్నది గావున
ఆ చీకటిని పారద్రోలగా
యత్నము చేసెద అని తలంచెను.

అసాధ్యమైన ఆలోచన యది
మదిలోమెదిలెను - దైవకృపయిది
ఈశ్వరు నారాధించిన తనకు
అసాధ్యమన్నది లేదని తలచెను.

దివ్యరథమును అధిరోహించెను
అంతటిలోన అమోఘకాంతి
వచ్చిచేరెను - రాజును - ఘనముగ
రెండవ రవిగా అని పించునటు

రాత్రులన్నిటిని పగలుగ మార్చగ
చీకటి నంతయు పారద్రోలగా
బయలుదేరెను ప్రియవ్రతుండు
దివ్యరథమది సాగుచున్నది.

రథము నడచిన గాడులలోన
ఏడు సంద్రములు ఉద్భవించినవి
వాటి సందులో భూమియంతయు
సప్త ద్వీపములుగా విలసిల్లెను

జంబూ, ప్లక్ష, కుశ క్రౌంచ
శౌక, శాల్మలి, పుష్కరమ్ములవి
వాటిలో మొదటిది జంబూద్వీపము
లక్ష యోజన విస్తీర్ణమది!

మిగిలిన ద్వీపములన్నీ కూడను
ఒకటికి మరొకటి పోటీ పడినటు
రెండురెట్లుగా విస్తీర్ణముతో
అమోఘ ద్వీపములై అలరారెను.

లవణసంద్రము - ఇక్షుసంద్రము
సుర, ఆజ్య - క్షీరసంద్రములు
దధి ఉదక సంద్రమ్ములని
సప్తసంద్రములు ఏర్పడె నపుడు

ద్వీపములకు అడ్డుగోడలుగ
అలరారెడి ఆ సంద్రములెపుడును
పొంగి పొరలవు కలసిపోవవి
ఆశ్చర్యమ్మును కలిగించునది.

ఆద్వీపములను పరిపాలించగ
తనకుమారులకు పట్టము గట్టెను
తనకూతురగు పూర్జస్వతిని
శుక్రునకిచ్చి పెండ్లి చేసెను.

శుక్రునికంతట కలిగినబిడ్డ
దేవయానిగా పిలువబడినది.
ఆవిధముగను బ్రహ్మ ఆనతిని
గృహస్థుడయ్యెను ప్రియవ్రతుండు.

అంతటిలోన ఆత్మవికాసము
కలిగె నతనిలో ఆలోచించెను
నారదు బోధన మదిలో నిలపియు
వైరాగ్యమది నిలబడ లేదు

సంసారలంపటము నందున చిక్కితి
జ్ఞానకాంతికి దూరమైతిని
కాంతాసుఖముల కీలుబొమ్మనై
వివేకహీనుడనైతి ననుకొనె.

ఆతని మది - అది ఆక్రోశించెను
త్రోవ ఏదని - ఆర్తిగచూచెను
ఓ గురుదేవా! వెలుగుజూపమని
నారదమౌనిని ప్రార్థనచేసెను.

అనుభవించిన శిక్షచాలును
సంసార సంద్రమును ఈదలేనిక
అని మది గట్టిగ నమ్మి నంతనే
పూర్వపుజ్ఞానము వెలుగునింపెను.

భార్యాబిడ్డల పరిత్యజించెను
రాజ్యభారము వదలించుకొని
నారదమౌని నాడు ప్రియముగ
బోధన చేసిన ఆశ్రమమేగెను.

ఆత్మవిద్యను ఆకళించుకొని
హరిపదములను మదిలోనిలపి
మది మందిరమున స్వామిని గనుచు
పాదపద్మముల చెంతచేరెను.

అతిబలశాలి హరిభక్తుండు
రథమార్గమున సప్తద్వీపముల
సప్తసంద్రముల నెలకొన జేసి
అపరసూర్యుడై వెలిగినవాడు

మేరువుకద్దరి వెలుగులునింపి
ద్వీపములకు సంద్రములకు
హద్దులుదిద్దిన ప్రియవ్రత చరిత
పృధ్వీతలమున మరపురానిది.

సుఖభోగముల తేల సమర్థుడు
కానీ విముఖత కలిగినవాడై
ఆత్మజ్ఞానియై గమ్యముచేరుట
సామాన్యులకు తెలియ నసాధ్యము.

రాజావినుము దుష్టస్వభావుడు
హరిని తలచియు తరించగలడే!
హరి సేవలలో పండిన రాజుకు
పరమ పథమది దుర్లభమగునా!

జంబూద్వీపము నేలుచుండెడి
అగ్నీధ్రుడు అతితేజోవంతుడు
న్యాయ, ధర్మములు నెలకొనజేసి
కన్నతండ్రివలె ప్రజలనేలెను.

బిడ్డలులేని కొరతతొ నాతడు
రాజ్యభారము మంత్రులపై నిడి
మందరపర్వత ప్రాంతమునందు
ఆశ్రమమొకటి నిర్మించుకొని

నిష్టతొ బ్రహ్మను ఆరాధించగ
తపసుకు మెచ్చిన వాణీనాధుడు
పూర్వచిత్తి యను అచ్చరకన్యను
రాజు వద్దకు పొమ్మని చెప్పెను.

"ఆ మహారాజు మదిని దోచుకొని
వంశమునిలపగ కొడుకులగనుము
లోకోత్తరమగు బిడ్డలగుదురు
నా ఆనతి మరి నీకు వరమనె"

కోకిల పాటల మదిపులకించుచు
పక్షుల కిలకిల పరవశమగుచు
పూదీవలలో లతల సోకుతో
తరువులశోభతొ వెలుగులుచిందెడి

ఆశ్రమప్రాంతము చేరెను ఆమె
తపోదీక్షలో నున్న రాజును
పలుకరించుటకు పన్నాగముగా
అందెలసవ్వడి వినబడచేసెను.

రాయంచవలె అడుగులేయుచు
గజ్జెల గలగల వినబడ నడిచెను
కన్నులు మెల్లగ తెరిచెను రాజు
సుమ సుకుమారిని కన్నులగాంచెను

పూదీవలతో ఆటలాడునటు
పూలగుత్తులను కోయునెపమున
రాజుకు దగ్గర చేరెను సుందరి
మెరపుతీగయని తలంచె రాజు.

నేలకు దిగిన అచ్చరకన్యను
తిరిగి తిరిగి మరి – చూచెను రాజు
మదిలో తీయని ఊహలు రేగెను
ధ్యానదృష్టియది తొలగినిలచెను.

గెంతుచు పూలను కోయుచు సాగెడి
చంచలాక్షి తన ఓరచూపుతో
రాజు మనస్సును కొల్లగొట్టెను
తీయగ రాజు పలుకరించెను.

ముగ్ధమోహినీ! సుమసుకుమారీ!
దివినివదలి ఈ భూమికే దిగిన
దేవకన్యవా! దివ్యసుందరీ!
సాధారణమగు నెలతవు కావు

కన్నులునీవి కమలములేయగు
అన్నులమిన్నా! ఆ కన్నులపై
కనుబొమలవ్వి సుమశరువిల్లయి
చూపుల విరులను సంధించినవి.

నడుము వునికి యది సందేహమ్ము
ఉందో లేదో తెలియకున్నది
ఆపైపొంగులు అమరియున్నవి
విరించి పంపిన వనదేవతవా!

దివ్యగంధము వెదజల్లెడి నీ
మేనికాంతి వన దేవకాంతవని
తెలియు చున్నది నిజముగ నీవు
మానవ కాంతవు కానే కావు

చిరునగవులతో వెలిగేపెదవులు
చంద్రబింబమై నిలచిన వదనము
సుమలావణ్యము మించిన మేను
సరసకు రమ్మని నను పిలచినది

పలుకవేమి నువు చిలకలకొలికీ
విరించి పంపిన అచ్చరకన్నెవ!
అనగా ఆమె నిజమే నన్నటు
కనుసైగలతో తెలియపరచెను

అంతట వనిత తీయగ పలికెను
వీణాతంత్రులు మ్రోగినట్లయె
రాజా నన్ను క్షమియించుమయా!
నీతో పలుకుట తేలిక గాదు.

తపోశాలివి – నీతోపలుకుట
ఎటులో తెలియక మిన్నకుంటిని
విధాత నన్ను నీకర్పించెను
దాసిని నేను దయామయా విను!

ఆనందముతో అక్కున జేర్చుకు
జంబూద్వీపము తిరిగివచ్చెను
వందల ఏండ్లు పూర్వచిత్తితో
మన్మధ రాజ్యము నేలెను రాజు

నాభి, కింపురుష, హరివర్షుడును
ఇలావృతుడు మరి రమ్యకుడున్ను
హిరణ్మయుడును, కురువు మరియు
భద్రాశ్యుడును, కేతుమాలుడను

తొమ్మిదిమంది పుత్రసంతతి
రాజుకు కలిగిరి ఆనందించెను
అపుత్రకుడని కుమిలిన రాజు
పితృఋణమును తీర్చగలిగెను.

విధాత ఆనతి నెరవేర్చితి నని
తనయులందరిని రాజుకు ఒసగి
వాత్సల్యమును వారికి పంచి
బ్రహ్మలోకమున కేగెను తల్లి

పూర్వ చిత్తిని మరువగలేక
వేదవిహితమగు కర్మలు చేసి
బ్రహ్మదేవుని లోకమేగెను
పూర్వచిత్తిని కలిసెను రాజు

తల్లి మహిమతో కొమరులందరు
తేజోవంతులు బలవంతులయి
జంబూద్వీపము నేల సాగిరి
వివాహమాడి సుఖముగనుండిరి.

మేరుదేవి మరి ప్రతిరూపయని
ఉగ్రదంష్ట్ర లత రమ్య శ్యామలు
నారి, భద్ర మరి దేవి అనునని
వరుసగ వారి భార్యల పేర్లు

॥శ్రీ కృష్ణచరితము॥



# 2 నారాయణుడు ఋషభావతారమెత్తుట

అగ్నీధ్రునికి జ్యేష్ఠ కుమారుడు
నాభి అంత తన సహధర్మిణియగు
మేరుదేవితో నారాయణుని
హృదిలో నిలపి సేవలొనర్చెను.

వాసుదేవుని ప్రీతి కొరకునై
యజ్ఞక్రతువులవి విధిగా చేయగ
సంతసమందిన జగన్నాథుడు
దర్శనమొసగెను ఆదంపతులకు

ధగధగలాడే మేనికాంతితో
నాల్గుభుజములతొ శ్రీవత్సముతో
మకర కుండల మణిహారములతొ
వనమాలతొ మరి కౌస్తుభమణితో

శంఖ చక్ర గద పద్మమ్ములతో
నవరత్న ఖచితమగు మకుటమువెలుగగ
చిరునగవులలో వెన్నెల కురియగ
పసిడికంకణ ధ్వనులెగయగను

పీతాంబరము పాదమంజరుల
పద్మనయనుడు పతితపావనుడు
దివ్యమంగళ రూపముతో నట
దర్శనమిడగా పులకరించిరి.

నాభి దంపతులు ఋత్విక్కులును
పరవశమ్ముతో ప్రస్తుతించిరి
"దేవా! నీదు మహిమలు తెలియగ
బ్రహ్మేంద్రాదులు చాలగలేరు.

నిన్నుతెలియకే నిన్ను స్తుతించెడి
అజ్ఞానులపై అనుగ్రహముతో
దర్శనభాగ్యము కలిగించితివి
పెద్ద మనసుతో కరుణించితివి.

ప్రకృతి పురుషుల కందనియట్టి
మహా పురుషుడవు మహిమాన్వితుడవు
నామరూపములు పూజాక్రియలు
మాకైమేమే కల్పించినవి.

తులసి దళమిడి గద్గదస్వరముతొ
నినుకీర్తించిన అందును నీ కది
క్రతువులు క్రియలు - కామ్యము కోరి
మేము చేయునవి కోరవు నీవు.

నీ మెప్పుకోరుచు మూర్ఖత్వముతో
చేయుక్రియలతో తృప్తి నొందెదము
నీవు తృప్తి పడి దర్శనమిడెనని
తలంచుటన్నది అవివేకమయా!

పూర్వజన్మమున చేసిన యట్టి
సుకృతమ్ముల ఫలితము నీదయ
ఆ పుణ్యమది ఫలించి నీవు
దర్శనమిడితివి దయాసాగరా!

ఆశతో వెళ్ళి ధనవంతుని కడ
విషయము మరచి ఊక నడిగినటు
మోక్షప్రదాతను అడిగెడి కోరిక
రాజుకు సంతతి నొసంగమనుచు

మోక్షముకోరక యిహసంబంధపు
కోరిక కోరుట నీ విలాసమే
అనుచునందరూ పదముల బడిరి
రాజదంపతులు పదములంటిరి

వాత్సల్యముతో శ్రీవత్సాంకుడు
పలికెను వారితొ సంతసమందితి
క్రతువుల ఫలితము నొసంగ నెంచితి
నన్నుబోలిన తనయుని కోరిరి

నాతో ఈడగు వారేలేరు
నాకు తగుదును నేనే వినుడు
నాదు ముఖముగా భాసిలునట్టి
బ్రహ్మవేత్తల మాట చెల్లవలె.

కావున నేనే తనయునిగాను
జన్మించెదను ఈ మహారాజుకు
అనుచు రాణిని చల్లగచూచి
యజ్ఞరూపమున లీనమయ్యెను.

తపశ్శీలురు, జ్ఞానులు మరియు
జితేంద్రియులను తరింపజేయగ
యెగధర్మములు బోధించుటకై
రాణి గర్భమున జేరెను శ్రీహరి

శుభఘడియలలో మంగళమూర్తి
శుభలక్షణముల మేరుదేవికి
తనయునిగా జన్మించెనప్పుడు
లోకోత్తరుడని పొంగిపోయిరి.

దివ్యతేజము బలపరాక్రమము
కలిగిన బాలుని గాంచిన రాజు
జన్మతరించెను అనుచు పొంగెను
ఋషభుడనుచును పేరుపెట్టెను

దివ్యబాలకుని గాంచినవారు
కన్నులార్పక చూచెడివారు
వేదవిదులు ఆశీర్వదించిరి
మంత్రుల ప్రశంశలందెను బాలుడు

ఎన్నడు రాజై పరిపాలించున!
అనుచ జనులట ఎదురుచూచిరి
సూర్యకాంతిలా వెలిగే ఋషభుడు
సద్గుణయుతడు - ధర్మనిరతుడు

ఋషభుని కీర్తి భువిపైనిండి
ఆపై నాకమువరకు సాగినది
అంతట ఇంద్రుడు అక్కసు కక్కుచు
మూర్ఖత్వమును ప్రదర్శించెను.

అనావృష్టిని కల్పించగను
నీరులేకను పైరులుఎండెను
త్రాగుటకైనా చుక్కలేకను
గిలగిలలాడెను జీవులన్నియు

విషయము తెలిసిన ఋషభుడంతట
ఇంద్రుని మూర్ఖత్వమునకు నవ్వెను
సంకుచితమ్మగు స్వభావమనుకొనె
సంకల్పించెను జీవుల కావగ

యోగమాయ అట ఋషభుని దేశము
పరిభ్రమించి తిరిగి వచ్చెను
చెరువులు బావులు జలసమృద్ధమై
కళకళలాడుచు పైరులునిలచెను

ధనధాన్యములు నిండిపోయెను
పాడిపంటలతొ పులకరించిన
నేలను గాంచిన ఇంద్రుడంతట
సిగ్గుతొ ఎంతో కుమిలిపోయెను.

ప్రజలు ఋషభుని శ్రీహరిగానే
మదిలో ఎంచి స్తోత్రముచేసిరి
నారాయణుడే కొడుకై పుట్టుట
తండ్రికి ఎంతో సంతోషమిడె

జగన్నాధుడే పుట్టెను అన్నది
మరిచిన తండ్రి పులకరింతతో
కుమారాయని తండ్రీయనుచు
బుజ్జగింపుగా పిలచెడివాడు

యుక్త వయస్సుకు ఋషభుడురాగా
ప్రజాపాలనము నప్పగించెను
ధర్మపాలనకు వలయు వివరములు
తెలియబరచెను తన తనయునకు

అంతట నాభి మేరు దేవితో
బదరికాశ్రమముచేరి అచ్చట
ఆదిఋషిగను అవతరించిన
శ్రీహరి ధ్యానమునందు మునిగెను

యజ్ఞయాగముల హరి కరుణించగ
హరినే బిడ్డగ పొందగలిగిన
నాభి-అంతట హరిలో కలియుట
అబ్బురమేమియు కాదు నరేంద్రా!

ఋషభుడంతట జ్ఞానవంతుడై
కర్మభూమిగా రాజ్యము – నెరిగి
కర్మతంత్రమున ప్రజలను నడుపగ
తగిన శక్తికై విద్యనునేర్వగ

గురుకులవాసమునందున శ్రద్ధగ
శృతులను స్మృతులను పూర్తిగ చదివి –
గురు ఆశీస్సుల ఇంద్రతనయ యగు
జయంతి నంతట వివాహమాడెను

ఋషభునికంతట నూర్గురు కొమరులు
అందులో భరతుడు పెద్దకుమారుడు
ఆతనిపేరున భరతవర్షమని
పేరుపొందినది ఈ వసుంధర

కుశావర్తయు ఇలావర్త మరి బ్రహ్మావర్తయు
ఆర్యావర్తయు మలయసేతుయని
భద్రసేన మరి ఇంద్ర స్పృకీయని
విదర్భ కీటకను కొమరులుగలిగిరి

తనయులందరిని వారిపేరులు
కలిగిన భువికి రాజుల చేసి
మిగిలిన తొంబది మంది తనయులను
వారి ప్రధానులగా నియమించెను.

తనయులలోన కవి హరి మరియు
అంతరిక్ష ప్రబుద్ధ పిప్పలాయన
అవిర్‌హోత్ర ద్రమీడ ఛమిస
కరభాజనుడు తొమ్మిదిమంది.

భాగవత ధర్మము లాకళించుకొని
ధర్మప్రచారముచేయసాగిరి
వారిలో తిరిగి ఎనభైయిద్దరు
బ్రహ్మ కర్మలతో బ్రాహ్మణులైరి

ఋషభుడు ధర్మము నాచరించుచు
మనుజ లోకమున వలయు విధులను
మహితమూర్తి తా నిర్వర్తించెను
ప్రజలకు తాను త్రోవచూపెను.

సాక్షాత్ శ్రీహరి రాజుగ పుట్టి
పట్టము గట్టుకు పరిపాలించగ
సుఖసౌఖ్యములతొ బ్రతికిరి జనులు
ఇహముకన్నను పరమునె తలచిరి.

॥శ్రీ కృష్ణచరితము॥



## 3 ఋషభుడు కొడుకులకు నీతి చెప్పుట

భూతలస్వర్గము అన్నటు ప్రజలను
చల్లగనేలెను ఋషభుడు నాడు
ధర్మహాని మరి కలుగనీయక
పరిపాలించుచు తలచెను మదిలో

తనువుతొ చేయగ తగిన కార్యములు
నెరవేర్చితినని తృప్తినందెను
తనయుల బిలిచి రాజ్యము నిచ్చెను
సర్వసంగియై కాంక్షలువదలెను.

బ్రహ్మావర్తనమునందలి మునులను
బ్రహ్మనేత్తలను రావించుకొని
దివ్య సభను తా నలంకరించి
తనయులకీ విధి నీతిని గరపెను

"తనయులార ముమ్ముందుగ మీరు
కామనివృత్తి కలిగియుండవలె
కోర్కెలవలలో చిక్కినచో మరి
దుష్టులు దరికి వచ్చి చేరెదరు

బ్రహ్మానందము నందజేసెడు
తపస్సు చేసిన దివ్యసుఖమిదు
శారీరకమగు – సౌఖ్యములన్నీ
బుద్బుద ప్రాయములన్నవి తెలియుడు

కర్మాచరణము వల్లనె తనువు
కానీ కర్మాచరణయె మేలని
తలంచి మీరు ఆ వలయమున
భ్రమించవలదు తెలివిగ మసలుడు

దేహసౌఖ్యమును ఆశించినచో
అనేక కర్మల తగులు కొందరు
అట్టివారుమరి తిరిగి పుట్టుచు
కర్మవలయమున చిక్కుకొందురు

వత్సలార! మీరందరు వినుడు
నేనే శ్రీహరి అన్నది తెలియుడు
నన్ను తెలియని సమయమంతయు
దేహబంధమున దుఃఖములిడును.

చదువుల మర్మము తెలియనివాడు
గమ్యము నెరుగక మూర్ఖత్వముతో
పుట్టలోనున్న పురుగు రీతిగా
సంసార జలధిని మునిగియుండును.

అవిద్యకు ను మరి అజ్ఞానమునకు
మారురూపమే కర్మయగునయా!
దానివల్లనే బంధము లేర్పడు
జ్ఞానఖడ్గమున వాటిని త్రెంచుడు.

గృహస్థాశ్రమము నందు చరించుచు
మనస్సు మోక్షమునందు నిలపిన
కోర్కెలకాతడు లొంగిపోకను
సంసార బంధములు త్రెంచుకు నిలచును

క్షణభోగములు శాశ్వతమ్మని
ఇహలోకములో వాటిని వదలరు
గురువు అంధునికి త్రోవచూపినటు
జ్ఞానమార్గము చూపును త్రోవ

నాపై నిశ్చలతత్వము కలిగి
తృష్ణను చంపుకు మెలగవలయును
త్రికరణ శుద్ధిగ హింసను వదలి
ఈశ్వరతత్వము తెలుసుకోవలె.

గురువు తల్లి తండ్రియు అప్పుడు
మరియు దైవము త్రోవచూపెదరు
వారు అటుల మరి చేయకపోయిన
వారితో బంధము అర్ధ రహితము

నాదులీలలు గానముచేయుచు
నాదు కథలను నిరతము వినుచు
పరమగురువును పరదైవమని
నన్నునమ్మి - మరి భజించవలెను

నాశరీరము అనూహ్యమైనది
సత్యమూర్తిని ధర్మనిరతుడను
పాపము నాకు అంటదు వినుడు
అందుకె ఋషభుడు అందురు పెద్దలు

పరబ్రహ్మము అన్వేషించెడు
శోధన నిరతము చేయుచుండవలె
బ్రహ్మచర్య వ్రతమాచరించవలె
మితభాషిత్వము అతిముఖ్యమయా!

నాదు తనువును ఆశ్రయించుకొని
పుట్టిన మీరు సత్త్వమనస్సుతో
మీ అగ్రజుడు భరతుని భక్తిగ
సేవించి మరి నన్నుగ తలచుడు.

కనబడుసృష్టి నా అంశయని
తెలియగ వలెను వివేకమ్ముతో
జ్ఞాన యోగముల స్థూలదేహమును
జయించి మేలును పొందవలెనయా!

భరతుని మీరు పూజించినచో
నను పూజించిన ఫలితము కలుగును
మరియొక విషయము శ్రద్ధగవినుడు
బ్రహ్మవేత్తలను గౌరవించుడు

ప్రాణికోటిలో స్థావరమ్ములగు
తరువులు ఎంతో శ్రేష్ఠమైనవి
వాటి కన్నను చరించు నట్టి
సర్పమ్ములు మరి ముఖ్యమైనవి

వాటినిమించి జ్ఞానముకలిగిన
జంతువులెంతో ముఖ్యమైనవి
వాటిని దాటి మనుజ జన్మయది
ఉత్తమమైనది - తీరుగ వినుడు

మనుజుల మించిన వారు తెలియుడు
గంధర్వులు, సిద్ధులు, దేవతలగుదురు
సురలలో మిన్న ఇంద్రాదులగు
దక్షాదులు, మునులు, వారినిమించిరి.

వారికన్నను మిన్న శంకరుడు
ఆయనమించిన వాడు స్రష్టయగు
వానికన్నను అధికుడు విష్ణువు
ఆ హరి భక్తులు వేదవేత్తలు

కావున వినుడు మనుజులందరికి
కనబడు దైవము బ్రాహ్మణోత్తముడు
వేదపరముగా లభించునట్టి
ఆహారమునకు హోమము చాలదు.

ఈ దేహమది బ్రాహ్మణరూపము
వేదరూపము - అనాదియైనది
నను గుర్తించెడి వారు బ్రాహ్మణులు
తత్వజ్ఞానము వారి ధనమగు

బ్రాహ్మణుడతడు సద్గురువగును
శమదమాదులు దయాసత్యములు
జపతపాదులు చేయు బ్రాహ్మణుల
భక్తితొ మీరు పూజించవలె

మోక్షపదవిని పొందగోరినచొ
కోర్కెలునిండిన మానవుడెపుడు
సద్బ్రాహ్మణుని పూజించవలె”
అనుచుతీయగా బోధనచేసెను

ఋషులందరకూ మునులందరకూ
తనయులందరికి బోధనచేసి
పెద్దకూమారుడు అయిన భరతునికి
పట్టాభిషేకము చేసెను ఋషభుడు.

అంతటఋషభుడు అవధూతగానై
దేహవాసన పూర్తిగ వదలి
దిగంబరముగా మౌనవ్రతముతో
మూగవానిలా తిరుగజొచ్చెను.

జనులందరును హేళనచేయుచు
అదరించుచును బెదిరించుచును
ఎన్నోబాధలు అవమానములు
చేయుచున్నను మరచెను వాటిని

కరచరణములు తామరలన్నటు
సుకుమారముగా మెరయుచుండగా
లక్ష్మికి నిలయము వక్షస్థలము
అన్నటు వెడదగ - అగుపించగను

ఆజానుబాహుడు పద్మముఖముతో
బ్రహ్మతేజముతొ నిడుపగు - కన్నుల
చల్లనిజల్లుగ కురిసేచూపులు
మరింత మోహనమూర్తిగ తోచెను

ధూళినిండిన శరీరమ్ముతో
సంస్కారమెరుగని నల్లనిజుట్టుతొ
కనబడగానే మనుజోత్తముడని
మునులుసైతము తెలియగలేరు

భక్తులుమాత్రము రూపముచూచి
దివినుండిమరి భువికేదిగిన
దివ్యమూర్తియని తలంచువారు
హృదయ తంత్రియిది భక్తిపలికెడిది.

అటులచరించే ఋషభుడు తలచెను
యోగసంచారము తను చేయుటది
జనులకు తెలియదు కావున ఇకపై
దానిని ఆపగ నిర్ణయించుకొనె

స్థాణువులా అట చలనములేక
కొండచిలువలా పడివుండెనట
భయంకరమగు రూపముదాల్చెను
మలమూత్రములకు లేచుట మానెను

ఆతడువిడిచిన మలినమునుండి
దివ్యసుగంధము వెలువడ జొచ్చి
పదియోజన విస్తీర్ణమునిండెను
వింతచేష్టలు చేయదొడంగెను.

కాకిలాగ తను కూసెడివాడు
జంతువులాగ గెంతెడివాడు
చెట్టులాగను లతలాగను మరి
సృష్టిలోజీవులు తను అనుకొనెను

అన్నిటిలోన హరినిగాంచుచు
ఆనందములో మనిగిపోయెను
అష్టసిద్ధులు స్వయముగ రాగా
వాటినివలదని వదిలించుకొనె

అంతటరాజు అడిగెను శుకుని
"మహాయోగులకు అలభ్యమైన
దివ్యసిద్ధులను వలదని ఋషభుడు
తిరస్కరించెను ఎందుకుస్వామీ!"

అంతట శుకుడు బదులు పలికెను
"ఓ మహారాజా! మనస్సుఅన్నది
చంచలమైనది - ఊహలకందదు
అడవిజంతువుతొ పోల్చగవచ్చును.

జిత్తులమారి నక్కవంటిది
జారులపాలిటి మోహిత స్త్రీయై
అధఃపతనముకు త్రోవచూపును
ఇంద్రియలోలత పెంచి - ముంచును

కామక్రోధ లోభమ్ము - మొదలగు
వ్యసనమ్ములకది పునాదివంటిది
కావున విజ్ఞులు మనస్సునెంతయు
నమ్మరు - దానిని నిరోధింతురు

మహాపురుషుల గౌరవమందే
అవధూతగా తా తిరుగజొచ్చెను
నారాయణుడే ఋషభునిగా ఇల
అవతరించెనని మరువకు రాజా!

దేహాభిమానము - కలిగినవానిని
మనస్సుఏలును - వశపరచుకొను -
పురాణయోగి - మదినిజయించును
మనస్సుఆతని వశమైయుండును.

కుమ్మరి - సారెను త్రిప్పుట ఆపిన
కొంతవరకది తిరిగినట్టుగా
పూర్వజన్మలో సంస్కారములు
జీవిని నడుపును - విను మహరాజా!

విష్ణునిర్మిత యోగమాయను
విడువని యోగి ఋషబుడు తాను
కోరక, వెంక, కుటకము లనెడి
దక్షిణ కర్ణాటక భూముల కేగెను

లోకమంతయు తనుగాతలచి
తనలో - లోకము కలదని తలచిన
అవధూత-ఋషభుడు ఆనందమూర్తి
నారాయణుడే నేలకుదిగెను

కుటకము అనెడి కొండదరిని గల
తోటలోనికి ఋషభుడు చనెను
లీలగ రాళ్లను నమలిమ్రింగెను
వింతచేష్టలు చేయదొడంగెను

దిగంబరుడై తిరుగజొచ్చెను
అంతట అడవిలొ పెనుగాలెగసెను
చెట్లరాపిడికి అగ్నిపుట్టెను
మింటికెగసెడి జ్వాలలులేచెను

కార్చిచ్చుమధ్యలో ఋషభుడు చిక్కెను
తొట్రుపాటు అది సుంతయులేక
ఆనందముగా అగ్నిజ్వాలలకు
అర్పణచేసెను - శరీరమ్మును.

అవతారసమాప్తిని చేయదలచెను
జరామరణములు లేని యోగియై
రుగ్మతలెవ్వి రాకపోవుట చె
తనువును వదలుట తేలికకాదు.

సర్వముతెలిసిన యోగి ఋషభుడు
సంకల్పంబున అగ్నిరగిల్చి
స్వయముగ దానికి ఆహుతి అయ్యెను
ఋషభావతారము సమాప్తిజేసెను.

ఋషభావతారము సమాప్తియైనటు
రాజుకు తెలిపిరి చూచినవారు
అర్హుడు - అనెడి రాజు ఆతడు
పాషండమతమున చరించువాడు.

ధర్మదూరమై భోగలాలసతొ
నియమనిష్ఠలు పూర్తిగ మరచి
దేవ బ్రాహ్మణ యజ్ఞ క్రతువులను
నిందచేయుట పాషండమతము

అటుల చరించెడి అంధులందరికి
ధర్మకాంతిని చూపించుటకై
ఋషభుడు సాక్షాత్ అవతారమూర్తియై
ఇలలో వెలిసెను వింటివ! రాజా!

వేదశృతులకు స్మృతులన్నిటికి
సకల విద్యలకు గురువే ఋషభుడు
భూలోకములో నిరర్థకంబగు
కర్మకాండలను దూరము చేసి.

ప్రజలందరకు భక్తియోగమున
మోక్షపథము చూపించుటకై
ఇలలో వెలసిన ఋషభుడు శ్రీహరి
ఆయన చరిత్ర అతి రమణీయము.

ఋషభుని చరిత్ర వినిన వారికి
భక్తిగ మరి వినిపించినవారికి
సర్వశుభములు సమకూరునయా!
సడలని భక్తి హరిపై కలుగును.

సంసార కూపమును దాటి బయటపడు
పురుషార్థములు సమకూరునందరికి
మోక్షపదవిని అందుకొందురు
అందులకందరు చరిత్రవిందురు

ఓమహరాజా! ఆ మహితాత్ముడు
కృష్ణునిగాను అవతరించెను
యాదవులకును మీకును గురువు
భక్తసులభుడగు మోక్షప్రదాత

రాజశేఖరా! ధర్మనిరతుడవు
భాగవతోత్తము లగ్రగణ్యుడవు
నాడు నిన్ను మరి ఉద్ధరించిన
మహానుభావుడు నిన్నుగాచును.

మరియొకసారి ఋషభునితత్త్వము
వినిచెద వినుము మంగళప్రదమది
మాయకు లొంగక శుద్ధమనస్కుడు
కామక్రోధముల లొంగనివాడు

కన్నబిడ్డలుగ ప్రజలను ఏలి
ఆశ్రితులందరి కాలవాలమై
ఆపన్నులను ఆదరించిన
ధరణీధవుడు ఋషభుడు రాజా!

అవ్యయంబగు ఆనందమునిడి
అనుపమానము దివ్యముఅయిన
అందరికందని మోక్షమార్గమును
అందజేసిన విష్ణువు ఋషభుడు

ఋషభావతారము దివ్యమనుచును
మహావిష్ణువుగ మదిలో తలచి
ముకుందుస్మరణ చేసినవారు
మోక్షమందెదరు - హరికి నమస్సులు.

॥శ్రీ కృష్ణచరితము॥



# 4 భరతోపాఖ్యానము

ఋషభుని జ్యేష్టకుమారుడు భరతుడు
రాజ్యభారమును వహించినాడు
విశ్వరూపుని కుమార్తెయైన
పంచజనిని - తా - పరిణయమాడెను

రాష్ట్రభృత్తు, సుదర్శనుండు
అచరణుడు, మరి ధూమ్రకేతువు
అనెడి కుమారులు ఉద్భవించిరి
తండ్రికి తగిన తనయులువారు

భరతుని రాజ్యము అజనాభమ్ము
కాలక్రమమున భరతుని పేరుతొ
భరతవర్షమని పిలువబడినది
ధర్మపాలనము భరతుడు చేసెను.

శ్రీహరిపైన మనసును నిలిపి
యజ్ఞయాగములు చేసెను భరతుడు
యజ్ఞఫలమును పద్మనాభునికి
సమర్పించెను శాస్త్రోక్తముగ

హరి సేవలతో తృప్తినొందుచు
కన్న బిడ్డలుగ ప్రజలనేలుచు
యశముగడించిన భరతుడు తాను
వానప్రస్తమున కేగగ తలచెను

తన సంపదను తనయులకిచ్చి
పులహాశ్రమముకు తరలి వెళ్లెను
అప్రదేశము హరికి నిలయము
పిలచిన పలుకును పరంధాముడు

ఆశ్రమమ్మునకు సమీపమ్ముగా
గండకీనది ప్రవహించునది
పవిత్రమైన సాలగ్రామములు
పుట్టును నదిలో - దివ్య జలములవి

నియమనిష్ఠతో హరిసేవలలో
మనసులగ్నము చేసెను భరతుడు
సుమసంపదతో కిలకిలనవ్వుచు
మనసుకు శాంతిని కూర్చు ప్రదేశము

కందమూలములు దండిగదొరకును
తులసివనమట శోభగపెరిగెను
విరిసిన కమలములెన్నోనిండుగ
దొరుకును అచట స్వామిసేవకై

శ్రద్ధాభక్తుల హరిసేవలలో
మునిగిన భరతుడు తలచును మదిలో
ఈసేవలవి తృప్తి నిచ్చునో!
తెలియదుస్వామీ! అని వంతపడు

నిశ్చలభక్తితొ భరతుడుతాను
ఇంద్రియాలను జయించినాడు
శీతోష్ణములు కష్టసుఖములు
ఒకటిగనెంచే జ్ఞానియయ్యెను.

అనన్యభక్తితొ మనస్సులగ్నమై
అనుభూతికి తా గురియైనాడు
ఆనందభాష్పములు ధారలుకట్టగ
ఆనందాబ్ధిని ఓలలాడెను.

భాగవతోత్తముడాతడయ్యెను
లేడిచర్మము ధరించినాడు
త్రికాలస్నానము నాచరించుచు
రవిబింబములో హరినే గాంచెను

సవిత్రుమండల మధ్యవర్తిని
సప్తహయముల రథమునుఎక్కి
జగములనేలెడి సూర్యదేవుని
ప్రార్థనజేయుచు పులకరించును

ఒక దినమున భరతుడు తాను
స్నానముతీర్చి జపమొనరించుచు
నీళ్లను త్రాగెడి లేడినిగాంచెను
నిండుచూలి ఆమృగము అప్పుడు

అంతటలోన భీకరగర్జన
చేయుచువచ్చెను సింహము ఒకటి
ప్రాణభయమున లేడిపరుగిడె
కడుపులో బిడ్డ – జారి నేలబడె

గెంతిన లేడి రాతిమీద పడె –
ఆదెబ్బకు అది అసువులు విడచెను
రెప్పపాటులో జరిగినదంతయు
అనాథయైన పిల్లను గాంచెను

నీటిప్రవాహమునందున మునుగుచు
ప్రాణాపాయములోన నున్న ఆ
లేడిపిల్లనుగాంచెను భరతుడు
జాలిపొంగి తా జేరదీసెను

ఆపసికూన నీటిని త్రావి
ప్రాణాంతకముగు బాధలోనుండగ
భరతుడు మెల్లగ కడుపునొక్కుచు
మేను నిమిరి మరి వెచ్చబరచెను

జాలిపొంగిన భరతునిప్రేమకు
లేడికూన తా కోలుకొన్నది
వణకెడికూనను గుండెకు హత్తుకు
ఆశ్రమమ్మునకు జేరెనుభరతుడు

ఆశ్రమమ్ములో అగ్గిసెగలతో
లేడిపిల్లకు చలినిబాపెను
దైవవశమున బ్రతికినదనుచు
పొంగిపోయెను భరతుడు తాను

లేడిసేవలో నిమగ్నుడయ్యెను
కంటిపాపలా పెంచసాగెను
లేతపచ్చిక తినిపించుచును
అతిప్రేమగను పెంచసాగెను

లేడికూనపై దృష్టినిలపిన
భరతుని ధ్యానము చెదరిపోయెను
ధ్యాననిష్ఠతో కనులు మూసినచొ
వెంటనెతెరచును మమకారముతో

స్నానార్థమై నది కేగినచో
క్రూరమృగములు వచ్చుననుచును
స్నానసంధ్యలు వదలి వేసెను
గెంతెడి లేడితొ మనస్సుగెంతును

పచ్చిక తినుట మానినచొ మరి
రుగ్మతఏమో! అనుచు కుములును
తిరిగి తినినచొ పరవశించును
అటులా లేడికి దగ్గరయ్యేను.

లేడితినినచో తను ఫలములుతిను
లేడితిననిచో తనుమానుచును
ప్రక్కన కూన పడుకొనియున్నచొ
అపుడే వచ్చును నిద్ర భరతునికి

హరిపైధ్యాస హరించిపోయెను
లేడినిచల్లగ చూడమనుచును
సకలదేవతల ప్రార్థనజేయును
పుణ్యకార్యమది అనుచు తలంచెను

మెడపై లేడిని మోయుచునతడు
ఆనందముతొ తిరిగెడివాడు
అంతటలోన దానిని దింపి
ధ్యాననిష్ఠకై కూర్చొనువాడు

కనులు మూసిన వెంటనె లేడి
తన కన్నులలొ గంతులేయగా
ఏ ఆపదలో చిక్కనొ యనుచు
కన్నులు తెరచి చేరదీయును

కట్టిపడేసిన కాళ్లుసాగవని
కొంతదూరము - నడిపించును-తను
ప్రేమగ పెంచిన యంతట లేడి
కాలక్రమమున పెరిగి పెద్దదయె

ఒకదినమున అది దౌడుతీసినది
జాడతెలియక కుమిలెను భరతుడు
కనులుకాయలుగ ఎదురు చూచెను
నిద్రహారములు మరచిపోయెను

ఎంతసేపటికి లేడి కనబడదు
భరతుని దుఃఖము శ్రుతిమించినది
కన్నబిడ్డ మరి దూరమైనటు
విలవిలలాడెను ధరణీధవుడు

ఎదురుచూచెను నిదుర మానెను
అదరి లేచుచు వెదుకసాగెను
ఏధ్వని విన్న లేడివచ్చెనని
పొంగిపోవుచు వెదకెడివాడు

శ్రీహరి ధ్యాసలొ పండిన భరతుడు
ప్రారబ్ధవశమున త్రోవమారగా
అన్నీవదలి అపురూపముగ
లేడిపైన మరి మమతను పెంచెను

తిరిగి గెంతుచు వచ్చెను లేడి
పొంగిపోయెను పరవశించెను
అటులాభరతుడు అంత్యకాలమున
లేడిని తలచుచు తనువువిడచెను

మరణసమయమున కోర్కెలున్నచో
మరుజన్మలొ మరి పుట్టెదరనుచు
పెద్దలుచెప్పిన రీతిగ భరతుడు
లేడిపిల్లగా జన్మనెత్తెను.

పూర్వజన్మకృత ఫలమువల్లను
లేడిపిల్లగా జన్మనెత్తినను
పాతస్మృతులవి నిలచియున్నవి
ఆలోచించెను మదిలో తాను

జప తపాలకు మెచ్చినవారు
రాజర్షియని ప్రస్తుతించిరి
లేడియందలి మమకారముతో
భ్రష్టుడనైతిని లేడిగపుట్టితి

ఉన్నతకులమున జన్మనెత్తియు
ఆదర్శముగా రాజ్యమేలియు
అణుకువగలిగిన పుత్రులబడసియు
యోగభ్రష్టుడనైతి ననుకొనె

అటులవేడ్చిన లేడిపిల్ల తా
తల్లినివదలి పరుగునసాగి
పులహాశ్రమమును చేరెనప్పుడు
ఎండిన ఆకులు భక్షణచేసెను

ఆశనువదలి హరినే తలచుచు
శుష్కించుచును నదిలోమునుగును
హృదయ సీమలో మాధవునిగని
ధ్యానించుచును తనువునువదలెను

॥శ్రీ కృష్ణచరితము॥



## 5 హరిణజన్మను విడచిన భరతుడు బ్రాహ్మణజన్మనెత్తుట

వేదమూర్తియగు అంగిరసునికి
తనయుడుగాను పుట్టెను భరతుడు
రెండవ భార్యకు పుట్టిన భరతుడు
పూర్వజన్మస్మృతి కలిగి యుండెను

తనయులందరికి శాస్త్రోక్తముగ
ఉపనయనాది సంస్కారములను
అంగిరసుడు తా చేయించునెడ
అయిష్టముగను భరతుడునిలచెను

కర్మలవలలో చిక్కుపడకను
హరిపైలగ్నము చేసెనుమనసు
హరిసంకీర్తన జరిగెడి తావుకు
నిరతముసాగుచు అనుభూతిపొందును

త్రికాల సంధ్యావందనమ్ములు
స్వాధ్యాయ జప తపములన్నియు
చేయుచున్నను అతని మనసు
హరిపై ధ్యాసను విడచుటలేదు

బ్రహ్మానందము ననుభవించెడి
విప్రకుమారుని చూచినజనులు
పిచ్చివాడని మూగవాడని
హేళనచేసిరి విషయము తెలియక

విషయము తండ్రి గ్రహించినాడు
అన్యమనస్కుని గానే తనయుడు
అన్నీచేయుట గ్రహించియున్న
అశక్తుడుగా నిలచెను తండ్రి

కాలవశమున తండ్రి గతించగ
సహగమనమును చేసెను తల్లి
సవతి అన్నలు ఈసడించుచు
వెట్టి చాకిరి చేయించగను

ఆనందముతొ విప్రకుమారుడు
నిమగ్నమయ్యెను తన పనులందు
పెట్టిన తిండి పరమాన్నమని
హరిప్రసాదముగ తిని సంబరపడు

వేరొకచోట పనిచేయమని
కూలిడబ్బులు సంగ్రహించిరి
తిండిపెట్టక యాచనచేసి
కడుపునింపుకొన - దురుసుగ పలికిన

చిరునగవులతో బయటకువచ్చి
హరిప్రార్థనతో కడుపునింపుకొని
కనబడు గృహమున దొరికినదానితొ
తృప్తిపడుచును కాలముగడపెను

గ్రామములోన పిల్లలందరు
వెట్టిగఅరచుచు హేళనచేయుచు
వెంటబడినను కోపించకను
హరిప్రార్థనతో గంతులేయును

కష్టసుఖముల లెక్కించకను
జడివానలలో తిరిగెడివాడు
మండుటెండలొ బండరాళ్లను
ఆనందముగ మోసెడివాడు

శరీరధ్యాస పూర్తిగ మరచెను
విరాగిగా తా తిరుగ జొచ్చెను
అన్నలు మాత్రము కనికరించక
ఎన్నొబాధలు పెట్టసాగిరి

సుఖభోగముల అన్నలు తేలుచు
అన్నము నిడక - పస్తుపెట్టినను
ఆనందముతొ హరినే తలచుచు
గడపసాగెను రోజులన్నియు

దుమ్ముధూళితో వలువలు చిరిగెను
యజ్ఞోపవీతము తెగిపోయినది
సంస్కారమ్మది లేకను - జుట్టు
చిక్కులువడెను జడలుకట్టెను.

హరిభజనలు జరిగెడి స్థలమునందున
భక్తిగ అతను కూర్చొనియుండగ
కర్మభ్రష్టుడవు వుండగ తగవని
కసిరికొట్టుచు గెంటెడివారు

తిండిపెట్టక అన్నలు తరుమగ
హేళనచేయుచు బాలురుకొందరు
ఊకనుతెచ్చి తినమనియివ్వగ
హరినితలంచి తియ్యగతినును.

పని ఎగవేసి తిరుగుచుండెనని
అన్నలుపట్టుకు చితుకబాదగా
మరుమాటాడక పొలముకు వెళ్లి
గొడ్డువలెను పని చేసెడివాడు

నాగలిదున్నుచు నున్నఎద్లలో
ఒకదానికి మరి దెబ్బతగిలిన
వీనిని - రెండవ ఎద్దుగ చేసి
పొలమును దున్నగ చేసెడివారు.

ఎద్దుకు పెట్టెడి చిత్తూ, తవుడు,
ఎండుగడ్డిని ఆరగించును
నిద్రను మరచి పొలముగట్టున
హరినితలంచుచు కూర్చొనువాడు.

బాలునిముఖమున బ్రహ్మతేజమది
వెలుగుచుండగా చూచినవారిలొ
సంస్కారవంతులు గ్రహించువారు
మట్టిలో పుట్టిన మాణిక్యంబని.

॥శ్రీ కృష్ణచరితము॥



## 6 వృషల రాజు భృత్యులు భరతునిగొనిపోవుట

జడునిపోలి తా తిరిగెడి భరతుడు
జడభరతునిగ పేరుగాంచెను
ఒకదినమున తా పొలముగట్టున
చేనుకు కావలి కాయుచుండెను

అంతటలోన కునుకుపట్టెను
బలిపశువునకై వెదకుచునున్న
రాజసేవకులు భరతునిగాంచి
ఆనందముతొ తీసుకుబోయిరి

ఆదేశమును ఏలు రాజునకు
బిడ్డలులేక చింతలొనుండి
పురోహితులను మార్గముకోరగ
నరబలి యిమ్మని చెప్పిరివారు.

పురుష పశువుకు పూజలుచేసి
కాళికి - బలిగా నర్పించినచో
బిడ్డలు కలుగును అన్న యోచనతొ
రాజసేవకులు భరతుని తెచ్చిరి

శుచిగా భరతుని తయారుచేసిరి
క్రొత్తబట్టలు ఆభరణమ్ములు
పూలమాలలు అలంకరించి
బలియిచ్చుటకై సిద్ధము చేసిరి

దేవి ముందర నవ్వుచు భరతుడు
కూర్చొనియుండెను ఆశ్చర్యమది
దేవిని ప్రార్థన చేసిన రాజు
కత్తినెత్తెను బలియిచ్చుటకై

అంతటిలోన పిడుగుల ధ్వనియది
వినవచ్చినది ఆ గుడియందు
పునాదులతో గుడీ కంపించెను
భీకర రూపుతొ కాళి నిలచెను

జ్వాలనేత్రముల జగన్మాత - తా
ఆగ్రహించి ఆ రాజును భృత్యుల
తలలు నరకినది అట్టహాసముతొ
భరతుడు మాత్రము ధ్యానమునుండెను

కొంతసేపటికి కండ్లుతెరచెను
ఎదుటనుగాంచెను కాళీమాతను
భక్తిప్రపత్తుల వందనమిడెను
ఆశీర్వదించి అదృశ్యమయ్యెను.

శిష్టరక్షణ చేసెడి తల్లి
దుష్టశిక్షణ చేసెడి మాత
భరతుని తాను కాపాడినది
భరతుడు కూర్చొనె చేనుగట్టుపై.

జరిగినదంతా మరచెను భరతుడు
మదిలో హరిని మరచుటలేదు
అన్నలుచెప్పిన పనులను చేయుచు
రోజులుగడుపుచు నుండెను భరతుడు

కాలముఅటుల జరుగు చుండగా
సింధుదేశము ఏలెడి రాజు
రహువుగనుడు తా కపిలమహర్షిని
సందర్శించి జ్ఞానము పొందగ

అందలమెక్కి ప్రయాణించగ
బోయిఒకడు అట భరతుని జూచెను
బలిష్టదేహము గలిగినవాడని
పల్లకి మోసెడి పనిని చెప్పెను

నిర్వికారముగ భరతుడు తాను
పల్లకిమోయుచు నడచుచుండెను
అనుభవమ్మది లేకపోవుటచే
అడుగు – అటునిటు–పడగా నడచెను

పల్లకిలోన రాజుకు – కుదుపుతో
ఆగ్రహమొచ్చి విషయము నడిగెను
క్రొత్తగ చేరిన బోయీవలన
అసౌకర్యము కలిగినదనిరి

బుద్ధిశాలి ఆ రాజుయైనను –
ఆగ్రహమ్ముతో భరతుని తిట్టెను
అన్నిమాటలు వినియు భరతుడు
నిశ్చలమ్ముగ మోయుచుండెను.

శరీరమ్మునకు కలిగెడిబాధ
దూషణ భూషణ తిరస్కారములు
అహంకార మమకారములన్నియు
జ్ఞానియైన ఆ భరతుడు తలచడు

సరిగా మోయని భరతునిగాంచి
బుద్ధిచెప్పక వదలను నిన్నని
ఆగ్రహమ్ముతో పలుకుచుండగా
బ్రహ్మవేత్త తా పలికెనురాజుతో

"రాజా! నీవు పలికినవన్నీ
యదార్థమ్మలే – ఈతనువునకు –
బరువు మోయుట – నిందలుపడుట
కేవలము మరి శరీరమ్మునకు

జరామరణములు కోపతాపములు
అహంకార మమకారములన్నీ
శరీరమునకే – తెలియుము నీవు
విషయము తెలియక నిందించితివి

జీవచ్ఛవమని దూషించితివి
జరామరణములు అందరికుండును
రాజును నేనని అహంకారముతొ
పలికితివటుల అజ్ఞానముతో

శిక్షించెదనని పలికితివీవు
జడునిమాదిరి సంచరించెడి
నన్ను - శిక్షలు ఏమియుచేయవు
ప్రకృతినే - నే - జయించినాను"

అటులపలికి ఆ విప్రకుమారుడు
తిరిగిపల్లకి మోయుచు నడచెను
ఆపలుకులవి రాజు మనస్సున
తత్త్వజ్ఞానము వెలిగించినవి

వెంటనె పల్లకి ఆపగజెప్పెను
విప్రుని పదముల సాష్టాంగపడె
అంతట భరతుడు లేవదీసెను
రాజువు నీవు వంతనొందకుము

ముడిచినకరముల రాజు పలికెను
క్షమాభిక్షను కోరెను భక్తిగ
"అవధూతవేషమున నున్న జ్ఞానివి
కపిలమహామునివగుదువొ ఏమో!

బ్రాహ్మణకోపము అతి వాడియది
వజ్రాయుధమును యమదండమును
మించినయట్టి - వాడి గలిగినది
క్షమించకున్న దుస్థితినొందెద

ప్రశాంతమ్ముగా భరతుడుపలికెను
క్షమించునర్హత కలిగినవాడు
పరమాత్ముడని తెలియుము నీవు
కావున నీవు భయపడవలదు

అంతటరాజు పలికెనమ్రతగ
తనవృత్తాంతము తెలిపెను తీరుగ
కపిలమహాముని దర్శనమంది
ఆత్మజ్ఞానము బడయగనెంచితి

జడుడ నంటివి నిజముకాదది
మహాత్ముడవు నువు నిస్సందేహము
అంతటిశక్తి లేకపోయినచొ
అటులపలుకవు భూసురోత్తమా!"

అంతటభరతుడు పలికెనుతీరుగ
రాజా! వినుము లోకపు నడక
అగమ్యగోచరమైనది తెలియుము
వివరముగా వినిపించెద వినుము

"అగ్నివల్లను కుండవేడియగు
అందలి నీరు మరిగినంతనే
పోసినబియ్యము వుడుకును గాదా
అదేవిధముగా మన శరీరమది

ఇంద్రియాలను ఆశ్రయించిన
జీవుడు తాను ప్రాణేంద్రియముల
చలనమువల్ల సర్వము జరుగును
అనుచు తప్పక తెలియుచుండును

ఈసంసారమ్మొక కుండవంటిది
దానిని సృజించి రక్షించి మరి
పగులగొట్టెడిది ఆపరమాత్మ
కావున దేవుని ఆశ్రయించవలె

ఈశ్వరదేవుని పాదములంటిన
పునర్జన్మ మరి వుండదురాజా!
అనుచు భరతుడు చెప్పగ వినిన
రాజుపొంగెను ఆనందముతో

ఓ మహరాజా! మనుజుడు ఇలలో
కర్మేంద్రియముల లొంగిపోవుచు
అధర్మమార్గమునందు చరించుచు
ధర్మమార్గమే అని భ్రమనొందును

వేదాంత ధర్మములన్నియు కూడ
తత్త్వజ్ఞానమును తెలియ బరచును
యజ్ఞ - వేదములు తత్త్వవాదనకు
నిలబడవయ్యా! ఓ ధరణీశా!

కాలక్రమమున జీవుడు - తాను
సుఖదుఃఖములను అనుభవించుచు
కర్మఫలములను అనుభవించుచు
శరీరమ్ములో వసించి యుండును

త్రిగుణమ్ములను జయించుమనస్సుకు
ముక్తి మార్గము సుకరము అగును
నేయి - వత్తిని జ్వలింపజేయును
ఉత్తి వత్తి అది - క్షణములో కాలును

అదేవిధముగా గుణకర్మలతో
అనేక జన్మలు ఎత్తును జీవుడు
ఆ గుణకర్మల వదలి వేసిన
పరతత్త్వమ్మది దగ్గరగునది

జ్ఞానేంద్రియములు కర్మేంద్రియములు
మొత్తము కలసి పదియగునయ్యా!
పదకొండవది అభిమానమ్ము
వీటిలో మనస్సు చరించుచుండును

వాటివల్లనే జన్మలుకలుగును
వాటిని జయించి నిలబడువాడు
నారాయణుని రూపముఅగును
జీవుడు, ఆత్మకు సంబంధమ్మది

జ్ఞానకాంతి అది చేరక పోయిన
జీవుడు - ముక్తికి అర్హుడుకాదు
అరిషడ్వర్గములంతరించిన
జ్ఞానోదయము కలుగును అపుడు

ఇంద్రియసుఖముల తగిలిన మనసుతో
సంసారచక్రమున తిరుగును జీవుడు
కావున ఎంతటి ధీరుడైనను
తనలో రిపుని కనిపెట్టవలె."

ఆవిధముగను భరతుడుచెప్పగ
ఆమహరాజు ముగ్ధుడయ్యెను
జ్ఞానోదయము కలిగినదనుచు
పరవశించెను పదములంటెను.

"ఓ పుణ్యాత్మా! నీదర్శనముతొ
అజ్ఞానమను - రోగము వదలెను
మనుజరూపమున నున్న దేవుడవు
కావున అంతటి జ్ఞానముకలదు

తిరిగి తిరిగి నా వందనమిదిగో
స్వామీ! నాకు తత్త్వవిషయమున
సందేహములు వున్నవి వాటిని
తీర్చుము స్వామీ! అని పదములబడె."

అంతటపలికెను భరతుడు రాజుతొ
"తత్త్వయోగము అతి తేలికగా
అందనిదయ్యా! మనుజుని కిలలో
సంసార లంపటము బలవత్తరమది

రాజును అనెడి అహంకారమున
ప్రజలనేలెడి అధికుడ నేనని
పల్లకిలోన కూర్చొనియుంటివి
ప్రజలబాధలు ఏమి తెలియును

సుఖదుఃఖముల బ్రతుకు పోరులో
బరువుగ - తనువును లాగెడి జనులకు
దిక్కువు నీవను - అహంకారివి
నీవు పూజ్యుడవు కానేకాదు

అయినా నీవు అహమునువదలి .
సామాన్యునివలె అడిగితివయ్యా!
కనుక నీకు - నే తెలియ బరచెద
ఆలకించుము తెలివినికలిగి

చరాచరములగు ప్రాణికోటికి
స్థావరమగును ఈ భూమాత
పరమాణువుల సముదాయమిది
మాయాకల్పిత మైనది జగత్తు

ఈజగత్తది రెండవ సృష్టిగ
పరిగణించబడు తెలియుమునీవు
లోపల వెలుపల స్వయంప్రకాశము
కలిగిన బ్రహ్మము సత్యమైనది

మాయాకల్పిత జగత్తు మరియు
జప తపాదులు దానధర్మములు
వేదాధ్యయనము ఆరాధనలు
బ్రహ్మమ్మునకు జేర్చగ లేవు.

బాహ్యసౌఖ్యముల విముఖతపెంచుకు
పుణ్యాత్ములతో నెయ్యముచేయుచు
హరిగాథలతో మనసునింపుకొన
పరంధామపు తలుపు తెరచుకొను.

రాజును నేనను అహముఎందులకు
పూర్వజన్మమున - నేను రాజునే!
పుణ్యజీవనము చేసెడివాడను
భరతుడు అనెడి - నామధేయుడను.

లేడి యందున మమతపెంచుకు
ఆజన్మమది ఎత్తితి నేను
పూర్వజన్మకృత పుణ్యవశమది
తిరిగి - మానవ జన్మయిచ్చినది.

మానవులకు మరి దూరముగను
ఏకాకిగను తిరుగుచుంటిని
ఇతరచింతన మదిలోవదలి
హరిని స్మరించిన - ముక్తుడు అగును.

మాయలొచిక్కిన - జీవుడు తాను
గుణకర్మలలో ఈదులాడుచు
లాభార్జనలో తిరుగు వణిజునిగ
సంసారపు టడవిలొ చరించుచుండును.

అట్టి అడవిలో నున్న దొంగలు
కామ, లోభములు, వీలుచూచుకొని
ధర్మసంపదను - హరించివేతురు
సంసార మోహము అంతటిదయ్యా!

సంసారపు టడవిలొ చరించునట్టి
ఆలుబిడ్డలు స్నేహితులనెడి
నక్కలు - నిరతము అదను చూచుకొని
మానవ మేకను కొరికి తిందురు.

మరియొక విషయము విను మహరాజా!
సంసారపుటడవిలొ దుర్మార్గులను
తేనెటీగలు - నిరతము కుట్టును
వాటిబారిని పడును మనుజుడు.

అడవిలొ నున్న కొరివి దయ్యమును
అగ్ని అనుకొని చేరినరీతిగ
సంపన్నులను ఆశ్రయించుచు
దీనునిగా మరి చేయిజాచును.

ఓ మహరాజా! మానవులు ఇల
కుటుంబపోషణ పరమార్థముగా
తరించుమార్గము అదియేననుచు
జీవితకాలము వృథాజేతురు

ఎండమావులను నీటిగ తలచే
భ్రాంతిలొ పడెదరు గమ్యముతప్పి
నేత్రంబులలో దుమ్ముపడినచో
కన్నులుండియు అంధుడైనటు

నీచాశ్రయముల దరికి చేరుచు
తిరస్కారముతొ కుమిలిపోవును
నిప్పును త్రొక్కి రక్షించుకొన
దావాగ్నిలొ - తా - పడినట్లగును

రాజ్యకాంక్షతో అన్నదమ్ములను
చివరకు తండ్రిని హతమార్చెదరు
బలవంతునిచే ఓటమినంది
దిక్కులేక మరి దీనుడు అగును

దుఃఖవలయమున మునిగిపోవుచు
సుఖము కలిగెనని భ్రమలొపడును
సంసారపు నడకలొ కష్టములన్నీ
సుఖములేయని నమ్మించుకొను

ఆకలిబాధతొ అలమటించుచు
ఆలుబిడ్డలను ఈసడించుచు
వైరాగ్యమును తెచ్చుకొన్నను
తిరిగిరాత్రి - తా - గృహమును జేరును

గడ్డిపరచిన బావిని మనుజుడు
సమప్రదేశమని దానిలోపడును
అందలి పాము కాటువేసినటు
సంసారకూపమున చిక్కుకుపోవును.

ధనకాంక్షకై - పరదారలకై
పరుగులెత్తుచు బ్రతుకునుగాని
తరుణోపాయము కానగలేడు
మనోనిగ్రహము మదిలోతలచడు

యౌవ్వనమందున ధనమునుకూర్చి
ఖర్చుచేసి - మరి ముదిమి చేరగా
దిక్కుతోచక వ్యాకులపడినటు
బ్రతుకువిలువను తెలియగలేరు

సంసార జీవితము తెలుపుచుంటిని
శ్రద్ధగ వినుము ఓ ధరణీశా!
వున్నదిచాలక దురాశనిండి
మనోవ్యధకు తా గురియగునయ్యా!

సహనములేక ఆవేశముతో
చిన్నగొడవలు పెద్దవిచేసుకు
ప్రాణాంతకమగు స్థితికివచ్చును
సంయమనము మరచిపోవును

విప్రుడుకూడా ఈవిధముగను
మార్గముతప్పి చెడిపోవునయా!
కులాచారములు శ్రౌతకర్మలు
తృప్తినిచ్చునని భ్రమలోపడును

విష్ణుసేవను తలచడు మదిలో
భార్యాబిడ్డల మోహములోపడి
శరీరసౌఖ్యము లమర్చుకొనుచును
సంసారవలయమున తిరుగుచుండును

ఎదురుగవచ్చు గజమునుగాంచి
పరుగిడి - ప్రక్కన నూతిలొ పడినటు
సంస్సారమృత్యువను దంతికి భయపడి
అజ్ఞానంబను - గుహలోపడును

కావునరాజా! ప్రభువును నేనను
అహంకారమును వదలివేసి - యిక
ప్రాణులన్నిటిని నీవలెచూచుచు
జ్ఞానఖడ్గముతొ ముందుకు సాగుము

శ్రీహరిధ్యానము - హరిపదసేవ
కథాశ్రవణము నిరతమువదలకు
ముక్తిమార్గముకు చేర్చును అవ్వి
ఇంతకుమించి చెప్పెడిదేమి.

నేనుచెప్పునది ఏమియులేదు
నీవు వినేది యిక అసలే లేదు"
అనెను భరతుడు - అంతట రాజు
సాష్టాంగముగా ప్రణామమిడెను.

"ఆత్మ జ్ఞానివి - యోగి దర్శనము
జన్మ సఫలము జేయును - అందురు
అంతటి యోగము - కలిగెనునాకు
నీపద ధూళితొ - పాపముతొలగెను

నీబోధనతో జ్ఞానముకలిగెను
హరిభక్తియది పరిమళించినది
అవధూతవేషమున మహాయోగులు
తిరిగెద రనునది యదార్థమైనది"

తిరిగిరాజు తా వందనమిడెను
యోగిభరతుడు ముందుకుసాగెను
మార్గమధ్యమున పుణ్యవశముతో
రహూవుగనుడు తా సిద్ధిని పొందెను.

అటుల శుకుడు తా తెలియపరచగా
పరవశించెను రాజవరేణ్యుడు
భరతునిచరిత్ర వింటిని నేను
ప్రస్తుతించుటకు శక్తిచాలదు

పూర్వజన్మస్మృతి కలిగిన భరతుడు
లేడిగపుట్టియు హరిని తలచుచు
పరంధామునికి నమస్కరించుచు
జంతువయ్యును సిద్ధినిపొందెను.

భరతునికథను చెప్పినవారిని
వినినవారిని – వాసుదేవుడు
నిరతము రక్షణ చేయుచుండును
ధీర్ఘాయువును ఆరోగ్యమునిడు.

పుష్కలధనము లభించువారికి
పుణ్యలోకముల స్థానముదొరకును
అనుచు శుకుడు తా రాజుకు చెప్పెను
అని సూతుడు తా ఋషులకుచెప్పెను

ఓమహారాజా! భరతునిపాలన
ధర్మబద్ధముగ సాగుచున్నను
పాషండ మతంబది విస్తరించెను
భరతుని మంచిని అలుసుగ నెంచిరి.

పాషండమతమును నూరిపోసిరి
పొగడ్తలతో లొంగదీసిరి
తమ మతమ్మది గొప్పదనుచును
పూర్తిగ తమలో – కలిపిరి రాజును

పాషండమతంబును రాజు గ్రహించి
కులాచారములు ధర్మకార్యములు
గాలికివదలి – సుమతి యంతట
ఆ మతంబది గొప్పది అనుకొనె

ధ్రువసేన యను భార్యయందున
సుమతికి తనయుదుద్భవించెను
దేవతాజిత్తుగా పేరుబెట్టెను
ఆతని భార్య అసురిసుందరి

వారికి తనయుడు దేవద్యుమ్నుడు
ఆతడెంతో మరి తెలివిమంతుడై
వైదికధర్మము నవలంభించి
వివేకమ్ముతో చరించినాడు

దేవద్యుమ్నునకు ధేనుమతియను
భార్యయందున తనయుడుపుట్టెను
బ్రహ్మ అంశతో పుట్టినవానికి
ప్రతీహుడనుచు పేరుపెట్టెను.

హరిభక్తులలొ అగ్రగణ్యునిగ
ప్రతీహుడెంతో పేరుగాంచెను
జ్ఞానోపదేశము చేయుచు నతడు
నిర్మల మనసుతొ గడుపజొచ్చెను

సత్యగుణముతో ఆత్మజ్ఞానిగా
గయ మహరాజు పేరుగడించెను
సుగుణాలకు ఆత దాలవాలమగు
ఆతనిచరితము వినిచెద - వినుము

ప్రతీహర్త యని ప్రస్తోత, ఉధాత యని
ముగ్గురు తనయులు ఆతనిసంతతి
యజ్ఞక్రతువులో సిద్ధహస్తులు
ప్రతీహర్త భార్యను స్తుతియని పిలతురు

కన్నబిడ్డలుగ ప్రజలనేలుచు
ధర్మమార్గము తప్పనీయక
కులాచారముల కుంటుపరచక
ప్రజలు మెచ్చగా పాలను చేసెను

ఆదంపతులకు ఇద్దరు కొమరులు
వ్యోముడు, భూముడు అనునవిపేర్లు
భూముని భార్య ఋషికుల్య యగు
వారికి తనయుడు ఉద్గీథుండు.

శరణుజొచ్చిన శత్రువుకైనను
అభయమునిచ్చెడి విజ్ఞుడాతడు
శిక్ష అమలులో అందరు ఒకటే
ఆశ్రితులకును పారిజాతమగు

ఉద్గీథునకు దేవకుల్యతో
ప్రస్తోతకుడను తనయుడు పుట్టెను
ప్రస్తోతకునకు వరఋత్సతొ మరి
విభుడు - అనియెడి తనయుడుపుట్టెను

యజ్ఞకార్యముల నిర్వర్తించుచు
యజ్ఞపురుషుని మదిలో నిలపి
శ్రీహరిపదములు చేర్చును అవియని
నమ్మినయట్టి యోగ్యుడు గయుడు.

విభునకు భార్య భారతి యనబడు
వారికిపుట్టెను పృథుషేణుండు
ఆతని భార్య ఆకూతి యనబడు
ఆదంపతులకు నక్తుడు పుట్టెను

రిపుల నెంతయు ఎదగనీయక
ధర్మపాలన చేయుచుండగా
వలయువస్తువులు ఆ వసుంధర
అందించెడిది ఆమహరాజుకు

నక్తుని తనయుడు గయుడనువాడు
ప్రసిద్ధిపొందెను ఓమహరాజా!
గయమహరాజు హరిఅంశతొ తా
ఉద్భవించెను ఇలలో - వినుము

యజ్ఞభాగములు స్వీకరించుచు
ఆనందించిన దేవతలందరు
కృపావృష్టి కురిపించెడివారు
కరువు కాటకము లచ్చటలేవు.

మహాపురుషుల సొంతముఅయిన
సద్గుణమ్ములకు నెలవా గయుడు
జయంతి ఆయన ధర్మపత్నియగు
భర్తకు తగిన – పరమపతివ్రత.

చిత్రరథుడును, స్వాతియు మరియు
అవరోధనుడు అనెడి తనయులు
ఆదంపతులకు ఉద్భవించిరి
చిత్రరథునికి తనయుడు సమ్రాట్.

సమ్రాట్టునకు, ఉత్కళయందు
మరీచి అనెడి కొమరుడు కలిగెను
మరీచి తనయుడు బిందుమంతుడు
అతని తనయుడు మధువు అనబడు

మధువు తనయుడు వీరవ్రతుండు
మన్యు, ప్రద్యుమ్నులు ఆతని తనయులు
మన్యువు భార్య సత్య అనబడు
వారి తనయుడు – భువనుడు – రాజా!

భువనుని భార్య – దోష యందున
తృష్ట – అనెడి యోగ్యుడుపుట్టెను
తృష్ట తనయుడు విరజుడు రాజా!
విరజుని కంతట నూర్గురుకొమరులు

వారివెంబడి ఆడుబిడ్డయు
ఉద్భవించెను ఆదంపతులకు
ప్రియవ్రత వంశమునందున రాజా!
ఆఖరివాడు విరజుడె అగును.

ప్రియవ్రతవంశపు కీర్తిప్రతిష్టలు
పెంచినవాడు విరజుడు రాజా!
అంతట భక్తిగ ఆ మహరాజు
భూగోళ వివరములడిగెను మునిని

సూర్యచంద్రుల కాంతులు అవ్వి
సాగినంతటను ప్రియవ్రత రథము
సాగిన చోట సప్తద్వీపములు
సప్తసంద్రములు ఏర్పడె ననిరి

ఆద్వీపముల ఆసంద్రముల
పరిమాణములు ఎంతవున్నవి
వినగా – నాకు కోరిక కలిగెను
అనగా – శుకుడు ఆరంభించెను.

ఓ మహరాజా! సప్తద్వీపములు
సప్తసంద్రములు హరి విలాసమే –
వివరించుటకు నేను చాలను
తెలిసినంత మరి వినిచెద వినుము.

॥శ్రీ కృష్ణచరితము॥



# 7 భూగోళ చరిత్ర శ్రీ శుకుడు తెలుపుట

జంబూద్వీపము మొదటిది రాజా!
భూమికి నడుమన ఉన్నద్వీపమది
లక్షయోజన వెడల్పుగలదది
నిడుపుకూడను అంతే యున్నది

తామరాకులా వర్తులమ్మది
తొమ్మిదివేల యోజనమ్ములుగ
తొమ్మిది వర్షమ్ములు గలిగినది.
సరిహద్దుకొండలు ఎనిమిదిగలవు.

నవవర్షముల మధ్యనున్నది
ఇలావర్షము అని పిలవబడు
దానిమధ్యన బంగారపుగిరి
అది మేరువుగా చెప్పవచ్చును

భూమిఅంతయు పద్మమనినచో
మధ్యభాగము మేరువు అగును
గిరులందున ఆ మేరుపర్వతము
దేవతలకును ఆలవాలము

లక్షయోజన నిడుపు గలిగినది
పదహారువేల యోజనంబుల
విస్తీర్ణముతో మేరువుగలదు
ముప్పదిరెండు యోజనంబులది

మేరువు కుత్తర భాగమందున
తెలుపు నీలపు కొండలుగలవు
రెండువేల యోజన వెడల్పుతొ
నలుదిక్కులకు విస్తరించినవి

తూర్పుపడమరల – లవణసాగరపు
దాపున కవ్వి విస్తరించినవి
ఆ కొండలకు మధ్య – రమ్యకము
హిరణ్మయమ్మును–కురువర్షములున్నవి

మూడువర్షముల విస్తీర్ణమ్మది
తొమ్మిదివేల యోజనమ్ములు
ఇలావృత వర్షమ్మునకు – దక్షిణము
నిషధ, హిమవత్, హేమకూటములు

మూడుగిరులవి – నలుదిక్కులకు
విస్తరించి మరి నిలచియున్నవి
వాటినడుమన హరివర్ష , కింపురుష
భరతవర్షములు వెలసియున్నవి

ఇలావృతమునకు పడమరదిశగా
మాల్యపర్వతము నిలచి యున్నది
తూర్పుదిక్కున గంధమాధన
దివ్యపర్వతము విస్తరించినది

రెండువేల యోజనముల దూరము
విస్తీర్ణముతో నిలచిన గిరులవి
నీల, నిషిధ పర్వతమ్ములను
కలుపుచుండెడి గిరులవి రాజా!

మాల్యవంతముకు పడమర సంద్రము
హద్దుగ నచట – నిలచియున్నది
సంద్రపుహద్దుగ, కేతుమాల వర్షమ్మది
శోభతొనున్నది ఓమహరాజా!

మేరువుతూర్పున మందరగిరియది
దక్షిణమ్మున మేరు మందర
పడమట దిక్కున కుముదపర్వతము
పదివేలయోజన ఎత్తున నున్నవి.

మేరుగిరికి మరి నాలుగు దిక్కుల
నిలచి యున్నవి ఆ పర్వతములు
గిరులపైనను జంబు కదంబ
న్యగ్రోధ వృక్షములు విరాజిల్లును

పదకొండు యోజన పొడవునుకలిగి
నూరు యోజన విస్తీర్ణములవి
కుముద పర్వత శిఖరమ్ములపై
పాలు, తేనెల సరస్సులున్నవి

వాటికి ప్రక్కన ఇక్షు సరస్సది
నూరు యోజన విస్తీర్ణమున్నది
అందలిస్నానము యోగైశ్వర్యము
సమకూర్చునయా ఓమహరాజా!

నందన వనము – చైత్రరథమును
వైభ్రాజికము సర్వతోభద్రము –
సుర వనములవి గిరిశిఖరముల
కన్నుల కింపుగ వెలసియున్నవి

దేవతలచ్చట తమ ప్రియురాండ్రతొ
ఆనందముగా విహరించెదరు
గంధర్వుల ఆటపాటలు వినుచు
పరవశమ్మున మునిగియుందురు

తీయ మామిడిపండ్ల రసముతో
మాకందఫలముల రసమది కలసి
ప్రవాహమ్ముగా జాలువారును
అరుణోదయమని పిలతురు దానిని

మందరగిరిపై జారి ప్రవాహము
ఇలావృత వర్షమ్మును ఒరుసుకు
తూర్పుదిక్కుగా ప్రవహించునది
రసప్రవాహము జలముగసాగును

అరుణోదయ ప్రవాహమ్మున
పార్వతిదేవి చెలికత్తెలట
జలకాలాడుచు పరవశింతురు
మేని సుగంధము వ్యాపించునచ్చట.

మేరు మందర గిరులపైనను
జాంబూఫలములు విరివిగ పండును
కరి శిరస్సుతో మించును ఫలములు
ఫలములు చితికి రసముపారును

అటులసాగిన రసప్రవాహము
జంబూనదిగా ప్రసిద్ధికెక్కెను
జంబూరసముతొ నానిన నేల
సూర్యకిరణముల ప్రకాశించును

ఆ మట్టియది స్వర్ణమైనది
జంబూనదమని బంగరునందురు
స్వచ్ఛమైన ఆ బంగారముతో
ఆభరణమ్ములు సురలు ధరింతురు

సుపార్శ్వగిరి పైనుండి జారిన
ఐదునదులవి అమోఘమైనవి
అమృతతుల్యము లాజలములవి
త్రాగిన – నోట సుగంధమెగయును.

ఆ సువాసన – ఓ మహరాజా!
నూరుయోజన విస్తృతిసాగును
కుముదపర్వత శిఖరముపైన
అమోఘమైన మట్టి కలదయా!

మణ్ణిశాఖలలో నిరంతరమ్ము
పాలూ పెరుగూ నేయి బెల్లములు
కలిపిన తీయని అన్నముదొరకును
దివ్యతరువది కోరినవిచ్చును

చక్కనివలువలు ఆసనమ్ములు
బంగరునగలు దివ్యశయనములు
అడిగినంతనే ప్రసాదించును
అచ్చటిప్రజలు సుఖముగనుందురు

కుముదపర్వత ప్రాంత నివాసులు
ముసలితనమది ఎరుగరు వారు
మృత్యుభయమది తెలియదువారికి
నిత్యయౌవ్వనము నుందురువారు

సురలు దానవులు దివ్యమౌనులు
గంధర్వులును కలిసియుందురు
వారిలో వారు భేదములెరుగరు
పూర్ణానందము ననుభవింతురు

కురంగ, కురర, కుసుంభ మరియు
వైకంకత – త్రికూట – శిశిర,
పతంగ, రుచక, నిషధ సితివాస,
కపిల శంఖ – గిరులట వెలసినవి

మేరుపర్వతము అనెడి తామరకు
కేసరమ్ములుగ నుండును గిరులు
మేరువుతూర్పున – జఠరము మరియు
దేవకూటము గిరులు కలవవి

మేరువుపడమర – పవనము మరియు
పారియాత్రము గిరులు నిలచినవి
పదునెనిమిది యోజన నిడుపుతో
రెండువేల యోజన విస్తృతమ్ములవి.

మేరువుదక్షిణ దిక్కున నున్నగిరులవి
కరతీరము మరి కైలాసమ్ము
ఉత్తరమ్మున త్రిశృంగ, మకరము
అనెడిగిరులవి – వెలుగుచున్నవి.

పదునెనిమిది యోజనమ్ముల
నిడుపుతో నిలచెను ఆ కొండలవి
రెండువేల యోజనమ్ములుగ
విస్తరించి అవి వున్నవి రాజా!

మేరుశిఖరమున బ్రహ్మపురమది
వెలుగులుచిమ్ముచు వెలసి యున్నది
పదియోజనమ్ముల నిడివి – వెడల్పుతో
విశాలమైనది బ్రహ్మపురమయా!

బ్రహ్మపురముకు ఎనిమిది దిక్కుల
లోకపాలుర గృహములున్నవి
త్రివిక్రమునిగా ఎదిగిన శ్రీహరి
కాలిగోటికి నింగిచిట్లగా

ఉద్భవించిన జలప్రవాహము
శ్రీహరిపదములు కడిగి పారెను
సర్వలోకముల పాప పంకిలము
క్షాళనచేసే పవిత్ర జలమది.

భగవత్పాది అనెడి ఆ నది
స్వర్గములొ బహుకాలమున్నది
సప్తఋషులును ధృవుడు నిరతము
స్నానమాడెడి పావనజలములు

దేవమార్గమున ఆ నది సాగి
చంద్రమండలము ప్రవేశించినది
మేరుశిఖరమునందున వెలసిన
బ్రహ్మపురమున ప్రవేశించినది.

నాల్గుపాయలై ప్రవహించి అది
లవణసంద్రము వరకును సాగి
అందలిజలముల కలిసెను – ఆనది
సీత అందురా – నది – పవిత్రము

బ్రహ్మపురమున తూర్పుగ సాగి
గంధమాదన గిరిని చేరుకొని
ద్వాదశవర్షము నందున – పారి
లవణజలధిని జేరును నీరు.

పశ్చిమద్వారము సాగిన నీరు
చక్షువు అనుచు పిలువబడినది
మాల్యవంతము – కేతుమాలముల
సాగి – పశ్చిమ జలధిని జేరును

ఉత్తరద్వారము సాగిన నీరు
భద్ర యనుచును పిలువబడినది
కుముద – నీల – శ్వేతగిరులలో
ప్రవహించి – నది క్రిందకు దిగి మరి

శృంగనగరము ప్రక్కన పారుచు
మానస సరోవరము ప్రక్కనేగల
కురుభూములపై – పరుగులుతీసి
ఉత్తరసంద్రమునందున జేరును.

దక్షిణద్వారము సాగిన నీరు
అలక నందగా పిలువబడినది
హేమకూట హిమకూటములను దిగి
భరతవర్షము చేరుకొనునది.

కర్మభూమియగు భరతవర్షమును
పుణ్యభూమిగా మార్చి – సాగుచు
దక్షిణ పాదోనిధిని జేరును
వేల తీర్థములు వెలసియున్నవట.

జంబూద్వీపమునందున నున్న
భరతవర్షము – కర్మభూమియది
స్వర్గవాసము పూర్తికాగనే
పుణ్యవర్షముల ఉద్భవింతురు.

భూతలస్వర్గములా వర్షములు
సుఖభోగముల జనులుండెదరు
త్రేతాయుగపు సుఖము లందుచు
పుణ్యమూర్తులై బ్రతుకుచుందురు.

సురలుసైతము తమకాంతలతో
రమ్యములైన కుటీరాలలో
ఈవర్షముల – కులపర్వతముల
సురభోగములు అందు చుందురు.

లోకనాథుడు శ్రీహరిదేవుడు
ఆవర్షములలొ ఉద్భవించుచు
భక్తులందరికి జ్ఞానబోధతో
కర్తవ్యము బోధించుచుండును

హరివర్షమున వసించుజనులకు
ఇష్టదైవము నృసింహస్వామి
దైత్య దానవులు ప్రహ్లాదునితో
నృసింహస్వామిని ఆరాధింతురు.

ఇలావృత వర్షంబునకు
ప్రభువు ఈశ్వరుడు అంబిక తోను
ఆనందముగా విహరించుచును
పరవశమ్మున మునిగి యుండును

నృసింహప్రీతిగ జప తపాదులు
శ్రద్ధాభక్తిగ ఆచరించుచు
ఐహికమ్మును ఆముష్మికమును
అతితేలికగా అందుకొందురు

శివపార్వతుల ఏకాంతమునకు
భంగపరచగ వచ్చిన పురుషులు
స్త్రీలైపోదురు – అంబిక శాపము
అందువలన అతిమెలకువ కావలె

కేతుమాల వర్షపు – దైవము
శ్రీదేవికి తా ఆనందమునిడ
"కామదేవుని" గ అవతరించెను
దేవేరిని తను సంతసపరచును

పరమపతివ్రత – పర్వతపుత్రి
పరమభక్తితో పరమశివుని తా
ప్రార్థనచేయుచు ప్రణవమంత్రమున
పన్నగభూషణు పూజలుచేయును.

ప్రజాపతి పుత్రికలందరు
శ్రీదేవికి మరి సేవలొనర్తురు
రాత్రులుగాను సేవజేతురు
పుత్రులు – పగళ్లుగ సేవలుజేతురు.

భద్రాశ్వవర్షపు పరిపాలకుడు
భద్రశ్రవుడు – ధైర్యవంతుడు
గాంభీర్యమున సాగర సముడు
హయగ్రీవుని పరమభక్తుడు

రమ్యక వర్షపు అధిదేవత మరి
మత్స్యావతారుడు శ్రీహరి దేవుడు
పరిపాలకుడు మనువు – నిత్యమూ
ఉపచారములతొ ప్రభువును కొలచును

జనులందరును ధ్యాననియమముల
హయగ్రీవుని అర్చనచేయుచు
పరిపాలకుని జగత్పాలకుని
అనుగ్రహమ్మును పొందుచుందురు.

హిరణ్మయవర్షపు అధిదేవత మరి
కూర్మావతారుడు శ్రీహరియగును
పరిపాలకుడు ఆర్యముడగును
భక్తిప్రపత్తుల హరిని కొలుతురు.

ఉత్తరకురుభూముల దేవుడు
వరాహరూపుడు విష్ణుమూర్తియగు
పరిపాలకుడు ప్రజలందరును
పుణ్యజీవనము చేయుచుందురు

కింపురుషవర్షపు ఆరాధ్యదేవుడు
కోదండధారి శ్రీరామచంద్రుడు
ఆంజనేయుడు అచటి ప్రజలతో
తనప్రభువుకు తా సేవలొనర్చును

భరతవర్షపు అధిదేవత మరి
నారాయణుడై అవతరించి తా
బదరికాశ్రమమునందు విడిసిన
శ్రీహరిదేవుడు - కల్పవృక్షమగు

నారదాది ముని ముఖ్యులందరు
బదరికాశ్రమము చేరుకొనుచును
స్వామినికొలచి - సాంఖ్యయోగపు
ఉపదేశమును పొందుచుందురు

ప్రజలందరును భక్తిప్రపత్తుల
నారాయణుని సేవించుచును
సుఖసౌఖ్యములు ముక్తినందెదరు
భరతవర్షము మిన్న అన్నిట.

భరతవర్షమున పవిత్రమైన
నదులు శైలములు వెలసియున్నవి
వాటి వివరములు - మనోహరములు
వివరించెదనని ప్రారంభించెను.

॥శ్రీ కృష్ణచరితము॥



## 8 భరతవర్షములో వెలసిన పుణ్యగిరులు

మలయ పర్వతము - మంగళప్రస్థము
మైనాకము - మరి త్రికూటగిరియు
ఋషభపర్వతము - కూటరమను గిరి
గోల్లము - సయ్యము వేదగిరియును

ఋష్యమూకము - శ్రీశైలమ్ము
వేంకటాచలము - మహేంద్రగిరియును
వారిధరమ్ము - వింధ్యపర్వతము•
శుక్తిమత్పరము - అనెడి గిరులును.

ఋక్షగిరియును - పారియాత్రము
ద్రోణపర్వతము - చిత్రకూటము
గోవర్ధనగిరి - రైవతకాద్రి
కుకుంభగిరి మరి - నీలగిరులును

కాకముఖమ్ము - ఇంద్రకీలాద్రి
రామగిరియను - పుణ్యగిరులవి
పేరుగాంచినవి - ప్రముఖములవ్వి
దర్శనీయములు - నదులకుపుట్టక

### పుణ్యనదుల వివరము

పుణ్యశైలముల - పుత్రికలవ్వి
పుణ్యనదులుగా - ఖ్యాతిగాంచినవి
చంద్రపటముమరి - తామ్రపర్ణినది
నవటోదయును - క్రుతమాలనది

వైహోయసియును - కావేరి మరి
వేణీనదియు - సయశ్వినీనది
పయోదనదియు - శర్కరావర్తము
తుంగభద్రనది - కృష్ణానదియును

వేణి - భీమనది గోదావరులును
నిర్వింధ్య - పయోష్ణి తాపీనదులు
శిలానది మరి - రేవ నదియును
మంగళప్రదమగు - సురనదులున్నవి

చర్మన్వతియును - వేదస్మృతియును
ఋషికుల్యము మరి-త్రిసమానదియు
మందాకినియును-యమునానదులు
సరస్వతీనది - తృషద్వతియును

గోమతినదియు-సయువు-భోగవతి
శరదృతువుమరి - చంద్రభాగ నది
సుషుమ, మరుద్వృద-వితస్థ-అసిక్న
విశ్వనదియును -పాపహరణములు.

సింధుశోణముల - నదములందురు
భరతవర్షమున - ప్రవహించునవి
వాటిలొ గ్రుంకిన ముక్తులగుదురు
జనులపాలిటి - వరములు అవ్వి.

త్రివిధకర్మలు - ఆచరించుచు
దేవ మానవ నరక వాసములు
పొందుచుందురు జనులీ భువిలో
పుణ్యపాపముల కర్మలు అవ్వి

జగన్నియంత - జగదాధారుని
శ్రీహరి దేవుని - మదిలొ నిలపి
భక్తియోగమున ఆరాధించిన
ఉత్తమగతిని - చేరుకొందురు

కావునరాజా! భరతవర్షము
అన్నిటియందు ఉత్తమమైనది.
శ్రీనివాసుడు భరతవర్షమున
వివిధావతారము - లెత్తుచుండును.

అవతారమ్ముల - కీర్తనజేయుచు
అనిశము భక్తిలొ మునిగితేలుచు
భారతీయులు - తరించుచుందురు
కృష్ణదేవునికి - ప్రియతములగుదురు.

శ్రీహరినామము స్మరించినంతనె
సకలపాపముల - విముక్తులగుదురు
నామస్మరణను కాదని చేసిన
తపోయజ్ఞములు - ఫలితములిడవు

మిగిలిన వర్షములందున జనులకు
పునర్జన్మ మరి కలుగుచుండును
హరినామముతో - భరతవర్షమున
జన్మరాహితి లభించగలదు.

కావునరాజా! జనులందరును
శ్రీహరినామము నిరతము వినబడు
భరతవర్షమున జన్మించుటకై
తహతహలాడుచు నుందురు వినుము

ఓమహరాజా! విష్ణుస్మరణయది
వినబడనట్టి స్వర్గమైనను
నివాసయోగ్యము కాదని తెలియుము
పుణ్యఫలము - ఈ మానవజన్మము

మానవుడై మరి పుట్టినందులకు
మాధవస్మరణ చేయగవలెను
సంసారబంధముల - చిక్కుకుపోయి
తన బంధములను - తానే కోరును

భరతవర్షమున చేయు యజ్ఞముల
హవిస్సునంతయు శ్రీహరి తాను
వివిధనామముల గ్రహించుచుండును
నిశ్చల భక్తిని ప్రసాదించును.

ఓ ధరణీశా! శ్రద్ధగవినుము
జంబూద్వీపము - విభజింపబడి
ఉపద్వీపములు - ఎనిమిదైనవి
స్వర్ణప్రస్తము - చందశుక్లము

అవర్తనముమరి - రమణకమ్మును
మందేహారుణము - పాంచజన్యము
సింహళమ్ము మరి లంక అనునవి
జంబూద్వీపపు ఉప ద్వీపములు

సగరుని కొడుకులు-యాగాశ్వమును
వెదకుచు భూమిని త్రవ్వగ నపుడు
ఈ ద్వీపములు ఏర్పడె రాజా!
ద్వీప వివరములు తెలిపెద వినుము.

జంబూద్వీపము - విశాలమైనది
లవణసంద్రము - చుట్టియుండును
లక్షయోజన - విస్తృతిగలదది
దానినిమించెను - పక్షద్వీపము.

పక్షద్వీపమున వసించు వారికి
అగ్నిదేవుడు ప్రియతముడగును
ఇధ్మజిహ్వుడు - ఆద్వీపమును
ఏడువర్షములు - చేసె - కొడుకులకు.

కుమారు లేడుగురుండిరి రాజుకు
వారిపేర్లతో వెలుగువర్షములు
శివ, యశస్య, సుభద్ర, శాంత
క్షేమ, అభయ, అమృతులనబడు.

ఏడువర్షముల పాలన నిచ్చి
తపసుకు వెళ్ళెను - ఇధ్మజిహ్వుడు
ఆ వర్షముల ప్రసిద్ధమైన
ఏడుకొండలు వెలసియున్నవి

మణికూటము మరి వజ్రకూటము
ఇంద్రసేనము, జ్యోతిష్మంతము
ధూమ్రవర్ణము - హిరణ్యగ్రీవము
మేఘమాలగా - కొండలపేర్లు.

ఏడువర్షముల ఏడునదులవి
అరుణ, నృమణ, అంగిరస
సావిత్రి, సుప్రభాత - ఋతంభర
సత్యంభర యను మహానదులవి.

నదులలో గ్రుంకుచు - పాపము తొలగి
హంస, పతంగ - పూర్ధ్వాయన
సత్సంగులను పేర్లను కలిగిన
నాల్గు - వర్ణములవారు వుందురు.

వేయివత్సరము లాయుర్దాయము
కలిగియుందురా పురుషులచ్చట
సురలనుపోలిన పుణ్యమూర్తులు
వారిదర్శనము శ్రేయోదాయిని

వేదత్రయాత్మకుడు దివ్యపురుషుడు
స్వర్గమార్గమును చూపెడివాడు
ఆద్వీపముల జనులందరును
సూర్యదేవుని ఆరాధింతురు.

అ ద్వీపవాసులగు పురుషులందరకు
దీర్ఘాయువును - జవ సత్వములు
దివ్యతేజము యింద్రియపటిమ
పుట్టుకతోనే లభించగలవు.

పక్షద్వీపముతొ సమము శాల్మలి
ఇక్షుసంద్రమును చుట్టియుండును
అందలితరువు శాల్మలి యనునది
పక్షమంత విస్తీర్ణముకలది.

భూరితరువునకు క్రిందిభాగమున
పక్షిరాజగు ఖగపతి వసించు
అంతటి ఘన తరువున్నది - శాల్మలి
కావున అదియగు శాల్మలిద్వీపము

ప్రియవ్రత సుతుడు యజ్ఞబాహువు
శాల్మలిద్వీపము పరిపాలించును
ఆద్వీపమును ఏడుగ జేసి
వాటిపాలన తనయుల కిచ్చెను

సూరోగరుడు సౌమనస్సుడు
రమణకుడున్ను దీవబర్హుడు
పారిబర్హుడు - ఆప్యాయనుడు
అభిజ్ఞాతుడు తనయుల పేర్లు.

ఆవర్షముల ఏడుకొండలవి
స్వరసము మరియు తశ్శృంగమ్ము
వామదేవ మరి కుముద మకుందము
పుష్పవర్షము - శతశ్రుతులవ్వి

అనుమతి మరియు సినీవాలియు
సరస్వతి గుహువు రజని, నందయు
రాక యనునవి - ఏడునదులవి
ఏడువర్షముల ఖ్యాతినొందినవి.

శ్రుతధర, విద్యాధరలు వసుంధర
ఇద్మధరులు అను పేర్లుగలిగి మరి
ఆత్మస్వరూపుడు - చంద్రుని భక్తులు
వేదమంత్రముల ఆరాధింతురు

అటుపిమ్మటది - కుశ ద్వీపము
సురాబ్ధిచుట్టు ఆవరించినది
ఎనిమిది యోజన విస్తృతిగలది
అందు కలదొక కుశస్తంభము

ఆ కుశస్తంభము దివ్యతేజముతొ
వెలుగులు నింపును - ఆద్వీపమున
కావున దానిని కుశ ద్వీపముగ
పేరుపెట్టిరి - ఏడుగ చేసిరి

ప్రియవ్రతు సుతుడు హిరణ్యరేతసు
రాజుగ దానిని పరిపాలించును
ఏడుకొండలు - ఏడునదులతో
వెలుగును అది - అటు ఏడువర్షముల

వసుదానుండు దృఢరుచి మరియు
నాభి, గుప్తుడు - సత్యవ్రతుండు
విప్రుడు మరియు వామదేవుడు
కొడుకులు వాటికి పాలకులైరి

బభ్రు - చతుశ్శృంగ - కపిల మరియు
చిత్రకూటము దేవానీకము
ఊర్ధ్వరోమ మరి ద్రవిణము అనెడు
ఏడుకొండలవి వెలసియున్నవి.

రసకుల్యము మరి మధుకుల్యమ్ము
శృతివిందయు మిత్రవిందలు
దేవగర్భ - ఘృతచ్యుత మరియు
మంత్రమాలయను నదులుగలవట

అచ్చటిజనులు పుణ్యనదులలో
స్నానమాడుచు - అగ్నిని కొలతురు
కుశద్వీపముకు ఆవలగలిగిన
ఘృతాబ్ధి - ఎనిమిధి లక్షలవెడల్పు.

ఘృతసంద్రమును జేరి వెలసిన
క్రౌంచద్వీపము - అతి విస్తీర్ణము
పదునారులక్షల యోజనపరిమితి
మధ్యనున్నది - క్రౌంచాద్రి యది

కుమారస్వామి దివ్యశరముతో
క్రౌంచపర్వతము నంతట చీల్చెను -
పాలసంద్రము గిరిని తడుపును
వరుణుడు దానిని రక్షణచేయును

ఆమోదుడును - మధువహుండు
మేఘాపృష్టుడు - సుదాముడున్నూ
ఋషిజ్యుడు మరి లోహితార్ణుడు
వనసృతియను వారేడ్గురు కొమరులు.

ఘృతపృష్టునికి ఉద్భవించిరి
క్రౌంచద్వీపమును ఏడుగ చేసి
తనయులందరికి ఏలగ నిచ్చెను
వారిపేర్లతో పిలువబడునవి

శుక్ల - వర్ధమాన - భోజన మరియు
ఉపచ - బర్హణ - ఆనంద - నందన
సర్వతో భద్రము - అనెడికొండలు -
అటులే గలవు ఏడు నదులవి

అభయ, అమృతాఘ అవ్యక మరియు
తీర్థవతియును - తృప్తిరూపయు
పవిత్రవతియు శుక్లఅనునవి
దివ్యనదులట వెలసె వర్షముల

అందలిజనులు జలముల గృంకి
వరుణదేవుని కొలుచుచుందురు
క్రౌంచద్వీపమును చుట్టియున్నదగు
పాలసంద్రము - అతివిస్తీర్ణము

పదహారులక్షల యోజనమ్ముల
విస్తీర్ణమ్మది - పాలసంద్రము
ముప్పదిరెండులక్షల యోజన విస్తృతి
శాకద్వీపము - ప్రక్కనగలదు

శాకద్వీపమును - మేధాతిథియను
ప్రియవ్రతు తనయుడు - ఏలుచుండును
అతనికి - ఏడ్గురు తనయులుండిరి
ఏడువర్షములు చేసెను ద్వీపము

పురోజవ మరి మనోజవయు
వేపమానయు ధూమ్రానీక
చిత్రరధయు మరి బహురూపయును
విశ్వచారు - ఆ రాజుకు సంతతి

ఈశాన ఉరుశృంగ బలభద్రయును
శతకీసర మరి సహస్రశోత
సదేవపాలయు మహానస యని
ఏడుకొండలు హద్దుగ నిలచెను.

అనఘ, ఆయుర్ధ, అభయవృష్టియు
అపరాజిత మరి పంచపదియును
సహస్రమతియు - నిజధృతియను
ఏడునదులవి - అచ్చటనెలకొను

ఋతవ్రతులు - సత్యవ్రతులని
దానవ్రతులు - సువ్రతులనుచు
అచ్చటిజనులు - పుణ్యమూర్తులై
వాయుదేవుని ఆరాధింతురు

శాకద్వీపమును అంటిపెట్టుకొని
దధిక సముద్రము వెలసియున్నది
ఆసంద్రమునకు చుట్టియుండునది
పుష్కరద్వీపము - ఎంతోపెద్దది

అరువదినాల్గు లక్షల విస్తృతి
కలిగియున్నదా - పుష్కరద్వీపము
బ్రహ్మకు ఆసనమైన పద్మము
ఆద్వీపములో వెలసియున్నది.

ఆద్వీపమునకు నడుమ నున్నది
ఉత్తమగిరి యది మానసోత్తరము
పదివేలయోజన విస్తృతిగలది
లోకపాలకుల గృహములు గలవు

మానసోత్తరపు నాల్గుదిక్కులా
లోకపాలకుల గృహములున్నవి
దానికి చివర - రవి - రధచక్రము
రాత్రింబవళులు ప్రదక్షిణించును

వీతిహోత్రుడు ఏలిక దానికి
రమణక - ధాతకు లాతని తనయులు
ఆద్వీపమును రెండుగజేసి
తనయులిద్దరికి ఇచ్చెనువానిటి

వీతిహోత్రుడు అన్నల వలెనే
హరిని స్మరించుచు తపసుకువెడలెను
ఆ ద్వీపవాసులు అద్వైతమార్గమున
బ్రహ్మదేవుని ఆరాధింతురు.

తారతమ్యములు లేవాప్రజలలో
సరళస్వభావులు కర్మ తత్పరులు -
ఆద్వీపమును జేరియున్నదట
స్వచ్ఛజలముల సముద్రమ్మది

సంద్రముకద్దరి గలదొకగిరి యది
లోకాలోక - అని పిలువబడు
గిరికి సంద్రముకు నడుమ భూమియది
రెండుకోట్ల యోజన విస్తృతి.

ఆప్రదేశము నిర్జనమైనది
సురలుమాత్రమే సంచరింతురు
లోకాలోక గిరి కద్దరిని
భూమియంతయు బంగరుమయము

ఎనిమిదికోట్ల యోజనవిస్తృతి
కలిగిన బంగరు భూమికి పైన
సూర్యునిమొదలు ధ్రువునివరకును
జ్యోతిర్గణము వెలసియుండును

యాబదికోట్ల యోజన విస్తృతి
కలగియున్నది భూమండలము
అందునాల్గవవంతు విస్తృతితో
లోకాలోక పర్వతమున్నది

లోకాలోక గిరికి నల్దెసల
బ్రహ్మలోకమును రక్షించుటకై
విరించి నిలపెను నాల్గుఏనుగుల
ప్రసిద్ధమైన దిగ్గజమ్ములవి

ఋషభము మరియు పుష్కరచూడము
వామనము మరి అపరాజితమ్ము
అనెడిపేర్లతో బరగు గజములు
శివుని తేజమున పుట్టిరి సురలు

అచటి సురలను విష్వక్సేనుడు
విష్ణువు మరియు పుణ్యమూర్తులు
కాపాడుచును కల్పాంతముగ
గిరిపై వారు విడిసియుందురు

మంత్రశక్తులు గిరిలో కలవు
దేవదేవునికి - గిరిని దాటెడి
శక్తికలదు మరి సామాన్యులకు
గిరిని దాటెడి శక్తివుండదు

బ్రహ్మాండమునకు మధ్యన సూర్యుడు
విరాజిల్లును - ఇరుప్రక్కలను
బ్రహ్మాండభాండమది ఇరువదిఐదు
కోట్లయోజన విస్తృతిగలదు.

సూర్యునివలనే ఆకాశము మరి
దిక్కులన్నవి ఏర్పడుచుండును
స్వర్గ నరకములు నిర్ణయించబడు
సర్వజీవులకు - ఆత్మ సూర్యుడే!

ఓ మహరాజా! భూపరిమాణము
నదీనదముల గిరి - వర్షముల
చరిత్రచెప్పితి - ఆపైచెప్పెద
దేవమండల చరిత్రవినుమనె.

॥శ్రీ కృష్ణచరితము॥



# 9 భూగోళచరిత్ర

బ్రహ్మాండమునకు మధ్య నిలబడి
ప్రచండభానుడు విరాజిల్లును
మాంద్య తీవ్ర సమానమ్ములని
మూడుగతులవి కలిగియుండును

ఉత్తరాయన దక్షిణాయన
విషువులనెడివి సంజ్ఞలుకలిగి –
ఆరోహణ–అవరోహణ–పొట్టిపొడుగులు
సమానమ్ములుగ ఏర్పడుచుండును

మేష, తులా, రాసులయందు
రాత్రింబవళులు సమముగ నడచును
వృషభ, మిధున, కర్కాట – సింహ
కన్యారాసుల గమనము మారును

ఆ రాసులలో రాత్రులయందు
ఒక్కో గడియ తక్కువ జరుగును
వృశ్చిక, ధనుర్మకర, కుంభ,
మీనరాశుల గడియ పెరుగును.

అవిధముగను వృద్ధి – క్షయములు
కలుగుచుండును – సూర్యగమనమది
తొమ్మిదికోట్లు డెబ్బదిఒక్క
లక్షల యోజన పరిమితిగలిగిన

మానసోత్తర పర్వతమ్ముపై
సూర్యరధమది తిరుగుచుండును
ఆగిరి కుత్తర దిక్కునందున
'దేవధాని' యను వాసవు నగరము

దక్షిణమ్మున యముని సంయమని
పడమర విమ్లొచని వరుణుని నెలవు
ఉత్తర విభావరి చంద్రునిస్థానము
నెలకొని యున్నవి ఓ మహరాజా!

ఉదయ, మధ్యాహ్న– అస్తమయి–నిశీధి
కాలభేధములు జనులకుండును
సూర్యునిరధము ఇంద్రుని నెలవున
బయలుదేరును దాని వేగము

పదిహేను గడియలకు రెండుకోట్లపై
ముప్పదిఏడు లక్షలు – ఆపై మరియొక
డెబ్బది ఐదు యోజనమ్ములుగ
సాగుచుండును అంతటి వేగము.

ఇంద్ర, యమ, వరుణ నగరముల
చంద్రాదిగ్రహములు తారలతో మరి
పన్నెండుఅంచులు ఆరుకమ్ములు
మూడుత్రోవలతొ – సంవత్సరములుగ

ఏకచక్రముతొ సూర్యుని రధము
ముహూర్తకాలమున సాగువేగము
ముప్పదినాలుగు లక్షలు ఆపై
ఎనిమిదివందల యోజనమ్ములు

మానసోత్తర గిరిని – చక్రము
ఇరుసు – మేరువున నిలచియుండును
రెండవ కమ్మి పవనపాశముల
బంధింపబడి సాగు ప్రయాణము

ధృవమండలమును అంటి తిరుగును
ముప్పది ఆరు లక్షల యోజన
విస్తృతి గలిగి యుండును రథము
దివ్యరథమది దేవవరమది.

ఎంతోఘనమగు కాడిని నిరతము
అశ్వములవ్వి భరించుచుండును
గాయత్రిఛందము మొదలుగనుండి
ఏడుఛందములు - ఏడుగుర్రములు

అరుణుడు - సూర్యుని రథ చోదకుడు
వాలఖిల్యులను సూక్ష్మదేహులగు
ఋషులు ముందుగ సౌరసూక్తములు
పఠించుచుండగ సాగుప్రయాణము.

గంధర్వ కిన్నరులు కింపురుషులును
అచ్చరులున్ను - పతంగులున్ను
నెలనెల క్రమముగ సూర్యుదేవుని
అనుసరించుచు స్తుతించుచుందురు

తొమ్మిదికోట్ల యాబదిఒక్క
లక్షలయోజన భూమండలమున
దివ్యరథముపై సూర్యుదేవుడు
అహోరాత్రములు ప్రయాణించును

అనుచుచెప్పెను శుకయోగీంద్రుడు
అంతట అడిగెను - రాజవరేణ్యుడు
సూర్యగమనము రాసుల జరిగెడి
విధము తెలియగ కోరితిననెను

అంతట పలికెను వ్యాసకుమారుడు
కుమ్మరిసారె తిరుగుచుండును
దానిని బట్టి బారులుతీరి
చీమలుతిరుగుట మదిలో నిలపుము

నక్షత్రరాసులతొ కాలచక్రము
ధృవ మేరువులకు ప్రదక్షిణముగా
తిరుగుచుండగా - సూర్యాదిగ్రహములు
నక్షత్ర-రాసుల నడుమనుండుటచె

ఆయాగ్రహములు గతిభేదముతో
చక్ర గతిని మరి అనుసరించును
కాలగమన మేర్పాటుచేసెడి
నారాయణుడే సూర్యదేవుడు

లోకక్షేమమా దివ్యరూపము -
వేదత్రయాత్మకమైన రూపమది
కర్మఫల సాధక రూపము
దేవఋషిగణ పూజ్యుడు రవియగు

తన స్వరూపమును వివస్వంతుడు
పదిరెండుభాగముల విభజించుకొని
వసంతాది ఋతువులు మొదలగు
కాలవిభాగము ఏర్పడజేసెను.

సర్వజనులకు ఆరాధ్యుడు రవి
జీవశక్తికి నెలవు సూర్యుడు
రాసులయందు ఆరవభాగపు
కదలిక ఋతువుగ పేర్కొనుచుందురు

రాసులకదలిక సగము ముగియగా
కాలగమనము - ఆయన మగును
పన్నెండురాసులలొ కదలిక ముగియగ
ఆకాలమును వత్సరమందురు.

శీఘ్ర మంద సమ గతులకదలిక
సంవత్సరము - పరివత్సరము
ఇలావత్సరము - అనువత్సరము
ఇద్వత్సరముగ - పేర్కొనుచుందురు.

అదేవిధముగ చంద్రగమనము
వృద్ధిక్షయములు గలుగుచుండును
పితృగణములకు పూర్వపక్ష మరి
అపర పక్షముల కాలము ఏర్పడు

రవికి లక్ష యోజన దూరము
చంద్రమండలము ప్రకాశించును
సంవత్సర పక్ష రాశి తారలలొ
శీఘ్రగతిని ఆ చంద్రుడు నడచును.

అరవది ఘడియలు ఒక్కొక తారలొ
పదునారుకళల చంద్రుడుండును
అన్న మనో అమృతమయముగ
చంద్రునిదేహము వెలుగుచుండును

పశుపక్ష్యాదులు మానవులకును
పితృదేవతలు, ఉరగ, పతంగుల
వృక్షజాలముకు ఓషధులకును
జీవాధారము చంద్రుడుఅగును

చంద్రునిపైన లక్షయోజనపు
దూరమునుండును తారాగణము
అభిజిత్తారతొ కూడి మండలము
మేరువుచుట్టును తిరుగుచుండును.

నక్షత్రగణముకు పైన దూరముగ
రెండులక్షల యోజనమ్ములలొ
శుక్రుడుండును ఆతడు రవికి
ముందు వెనుకల నడచుచుండును

వర్షకారకుడు శుక్రుడు అగును
శుభములనొసగే వాడు ఆతడు
రెండులక్షల యోజనమ్ముల
ఎత్తునుండును బుధుడు నరేంద్రా!

సూర్యునికెంతొ ఎత్తుగనున్నను
ఉపద్రవమ్ములు కలుగు బుధునిచే
రెండులక్షల యోజనదూరము
ఎత్తునుండును కుజుడు నరేంద్రా!

ఒక్కొక రాశిలొ మూడుపక్షములు
సంచరించుచు నుండును కుజుడు
సమ మృదు, శీఘ్ర గతులును ఆపై
వక్ర ఋజు గమనములుండును

రెండులక్షల యోజనమ్ములకు
ఎత్తున వుండును గురు గ్రహమ్ము
ఒక్కొక్కరాశిలొ వత్సరముండును
వక్రగమనము కూడను గలదు

వేదవేత్తలకు బ్రాహ్మణులకును
శుభఫలములను ఇచ్చును గురుడు
గురునికి పైన రెండులక్షల
యోజనమ్ములలో శనిగ్రహమున్నది.

ఒక్కొక రాశిలో ముప్పదినెలలు
శని తా నుండును ఆతనివలని
సామాన్యముగా బాధలుకలుగును
ఆపైనుందురు సప్తమహర్షులు

పదకొండులక్షల యోజనమ్ములా
శనికి పైన వారేడుగురుందురు
సప్తఋషులు మరి నిరంతరమ్ము
లోకశ్రేయమును కోరుచుందురు

ముప్పదిలక్షల యోజనమ్ముల
ఎత్తున గలదు శింశుమారము
ఆచక్రమునకు మధ్యభాగమును
భాగవతశ్రేష్టుడు ధృవుడువుండును.

ఆకల్పాంతము ఉండును ధృవుడు
అతని గుణములను వర్ణించగను
ఆదిశేషునికి సాధ్యముగాదు
అంతటి యశము గలిగినవాడు

జ్యోతిశ్చక్రము గ్రహములు తారలు
ధృవునిచుట్టును ప్రదక్షణించును
ఆవిధముగను సంచరించగా
ఆదేశించెను ఈశ్వరదేవుడు

మేఘములున్న పక్షులు నింగిని
వాయుబలముచే తిరుగుచున్నటు
ప్రకృతిపురుష యోగబలముచే
జ్యోతిశ్చక్రము తిరుగుచుండును

శింశుమార చక్రమునందున
జ్యోతిర్గణములు నిలచియున్నవని
వాదనగలదు - వివరించెదనని
వ్యాసకుమారుడు ఆరంభించెను.

శింశుమార చక్రపు చివరభాగమున
ధృవుడు నిలచునని ఒకరివాదన
చక్రపు తోకను ప్రజాపతియును
అగ్ని ఇంద్రుడు, ధర్మజుడుందురు.

ధాతవిధాతలు - సప్తఋషులును
ఉత్తర - దక్షిణ - సంచారపు చుక్కలు
దేవమార్గ - మాకాశగంగయు
ఆచక్రమునకు వాలము నుండును.

ఉత్తరభాగము - పునర్వసు - పుష్యమి
దక్షిణముకు ఆర్ద్ర - ఆశ్లేషలు
దక్షిణ పాదమునందు - అభిజిత్
ఎడమపాదమున - ఉత్తరాషాడ.

కుడినాసిక రంధ్రమ్మున శ్రవణం
ఎడమ రంధ్రమున పూర్వాషాడ
కుడికంటను మరి ధనిష్ఠ నిలచును
ఎడమకంటను - మూలాతారయు

కుడిచెవిలో మఖ పుబ్బ, ఉత్తరహస్తలు
చిత్త – స్వాతి విశాఖ అనూరాధలు
ఎడమచెవిని మరి నిలచియుండును
ఎడమపార్శ్వమును దక్షిణాయనము.

దక్షిణ భాగమునందున కృత్తిక
రోహిణి, మృగశిర ఉత్తరాయణము
ఎడమమెడను మరి శతభిష వెలయును
కుడిమూపున మరి జ్యేష్ఠయుండును.

కుడి దవడయందున అగస్త్యుడుండును
ఎడమ దవడను యముడు వుండును
ముఖమున నుండును అంగారకుడు
గుహ్యావయవమున శని–తా–నెలకొను.

అటుప్రక్కన మరి బృహస్పతియును
ఉరము యందున సూర్యుడుండును
బొడ్డుయందున శుక్రుడు నెలకొను
మనస్సులో మరి చంద్రుడుండును.

వక్షోభాగమున అశ్వనిసురలు
ప్రాణాపానము లందున బుధుడు
గళమున రాహువు వెలసియుండును
సర్వావయవముల కేతువుండును

రోమములందు తారలుండును
శింశుమార చక్రమ్మదియే అగును
సర్వదేవతల నెలవుగవెలసిన
శ్రీహరి దివ్యశరీరము అదియగు

సర్వవ్యాపకుడు శ్రీహరియగును
దివ్యశరీరము విష్ణుపదమది
ధృవుడు అనుచును పిలువబడునది
శింశుమారచక్రమ్మిదియేరాజా!

శింశుమార చక్రమ్మును భక్తితో
మదిలో నిలపి ధ్యానించినచో
సర్వశుభములు లభించగలవు
అంత్యకాలమున మోక్షముదొరకును.

సూర్యమండలము క్రిందిభాగమున
పదివేల యోజన దూరములోను
రాహుగ్రహమది నిలచియున్నది
అపసవ్యముగా తిరుగుచుండును.

బ్రహ్మవరమున నీచ రాక్షసుడు
రాహువు పొందెను అమరత్వమును
గ్రహమండలమున గ్రహముగ వెలిగే
యోగ్యత రాహువు కలిగియుండెను.

పదివేలయోజన విస్తృతిగలిగిన
సూర్యమండలము ఆపై నిలచిన
పన్నెండుయోజన విస్తృతికలిగిన
చంద్రమండలము రెంటిని రాజా!

పదమూడువేల యోజనమ్ములకు
రాహువు తాను ఆక్రమించును
దానినందురు గ్రహణసమయమని
పట్టిన రాహువు భయమున విడచును

సూర్య, చంద్రులను రక్షించుటకై
కరుణాధాముడు శ్రీహరి తాను
చక్రముపంపును అన్నిభయమున
వారిద్దరినీ రాహువు విడచును.

రాహుగ్రహముకు క్రిందిభాగమున
పదివేలయోజన దూరమునందు
సిద్ధచారణ, విద్యాధరులు
సంచరించుచు నుందురు రాజా

పదివేలయోజనములకు క్రిందుగను
యక్ష రాక్షస గణములుమరియు
భూత, ప్రేత, పిశాచ గణములు
కలిసి తిరుగుచునుండును రాజా!

విద్యాధర గణముల క్రిందభాగము
భూమండలముకు పై భాగమున
మేఘమండలము ఉండును రాజా!
దానిపైన అది ఆధారపడు.

భూమండలమునకు క్రిందిభాగమున
పదివేలయోజన దూరమునందు
అతల వితల సుతల రసాతల
తలాతల–మహాతల–పాతాళములున్నవి

అధోలోకములు విశాలమైనవి
బ్రహ్మాండమంత ఒక్కొక లోకము
బిలస్వర్గములు – అందురువాటిని
దైత్యులుందురు – మొదటి లోకమున

దానవులు మరి కద్రువ సంతతి
నాగులు మొదలగు వారి నెలవులు
మిగిలినయిట్టి అధోలోకముల
భోగములందున మునిగియుందురు.

మాయాబలము కలిగినవారు
స్వయముగ సుఖములు కల్పించుకొని
ఆటలపాటల – ఆనందముతో
స్వేచ్ఛగ వారు బ్రతుకుచుందురు.

మయునిర్మితమయ లోకములన్నీ
పట్టణాలతో – ప్రాసాదాలతో
సభాభవనముల – కళానిలయముల
విశాలమైన – వీధుల వెలుగును.

పూలతోటలతో – ఫలవృక్షములతో
శుక పిక రవముల సందడినిండి
పురివిడి ఆడెడి నెమళ్ళునిండి
మనసుదోచెడి లోకములవ్వి!

ఆనందపరవశులు లోకవాసులు
భోగములందు మునిగియుందురు
రాత్రి పగలు భేదములేక
స్వర్గసౌఖ్యముల తేలిపోదురు.

సర్పరాజగు శేషుడు మరియు
వాసుకి మొదలగు వారి శిరస్సున
వెలుగులుచిమ్మే శిరోరత్నముల
చీకటిఅన్నది జేరదచటకు

ఆలోకములో వసించువారికి
దివ్యౌషధ రస మాహారమ్మగు
కావునవారికి రోగములుండవు
ముదిమిజేరని యౌవ్వనవంతులు

వారిభయమది విష్ణుచక్రము
ఆచక్రమ్మది దర్శనమిడినచొ
దైత్యాంగనల గర్భములన్నీ
దాని వేడికి కరగిపోవును

అతలలోకమున - మయునితనయుడు
బలుడనువాడు వసించుచుండును
అనంతమైన మాయలు తెలుసును
అందులొ - తొంభై వాడికి రక్షణ

క్రమముగ కొన్ని మాయావిద్యలు
భూలోకములో ప్రవేశించినవి
బలునికి చెందిన మాయలు అవ్వి
పరంపరగను నేర్చిరి కొందరు.

బలాసురుడు - ఆపలించగా
స్వైరిణులు మరి కామినులున్ను
పుంశ్చలు లనెడి స్త్రీలజాతులు
ఉద్భవించిరి - వారొకనాడు

ఒక మగధీరుని లొంగదీసుకొని
హాటక రసమను గుళికనిచ్చిరి
దానినిమ్రింగి అమోఘబలుడై
వారితొ రోజులు గడుపుచుండెను.

మాయాబలము అతిబలమైనది
అసురవిద్యలవి తెలియగవలెను
మనుజుని అవ్వి పతనముచేసి
అధోగతికిని త్రోసివేయును.

విరించిసృష్టి ముగియునప్పుడు
శివుడు అంబికతొ క్రీడించగను
తేజముజారగ - హాటకయనెడి
నది ఒకటచ్చట ఉద్భవించినది.

శివతేజమును - అగ్ని, వాయువులు
మ్రింగిరి - దానిని భరించలేక
తాగి ఉమిసిరి - అదిహాటకమని
ప్రసిద్ధిచెంది బంగరు అయినది

హాటకేశ్వరుడు అనబడుశివుడు
శుద్ధ సువర్ణము - జనులుధరింతురు
అంతటినుండి మేలిమిబంగరు
హాటకమనుచు పిలువబడినది.

వితలలోకము దిగువను సుతల
దానికి అధిపతి బలిరాజేంద్రుడు
వామనమూర్తిగ శ్రీహరివెలసి
బలినర్థించి - అణచెనుక్రిందకు

దానవుడైనను బలి భూవిభుడు
సద్గుణయుతుడు పరమగుణాఢ్యుడు
కావున జాలితొ - రమానాథుడు
అతనిని - సుతలకు అధిపతిజేసెను.

హరితత్పరుడై నిరంతరమ్ము
పుణ్యకర్మలు ఆచరించుచు
భక్తాగ్రగణ్యుడు బలిరాజేంద్రుడు
పుణ్యచింతనతొ సుఖముగనుండెను.

హరిప్రీతిగను భూదానమ్ము
ఆచరించిన మోక్షముదొరకును
జప తపాదులు చాలవు దానికి
అందుకు బలియే నిదర్శనమ్ము

ఒకలోకమునకు అధిపతియగుట
సామాన్యమైన విషయముగాదు
పుణ్యచింతనతొ ఆత్మజ్ఞానియై
వెలిగెడి బలిని ఉద్ధరించుటకు –

యాచన నెపముతొ శ్రీహరి వచ్చి
సర్వసంపదలు – రాజ్యవిభవము
తొలగించగను బలిభూవిభుడు
మదిలో తలచెను ఈవిధముగను

సంపూర్ణుడైన ఈశ్వరునకును
అన్నీవచ్చి – సమకూరినను
నాకెందుకని వదలివేయును
అడిగినవారికి ఇచ్చివేయును

ఇంద్రుడు మొదలగువారు అడిగినవి
వారందరికీ అనుగ్రహించెను
కోరికలన్నవి లేనివాడుగద
కాలమహిమతో జరుగుసర్వము

కాలస్వరూపుడు ఈశ్వరదేవుడు
బంధవిముక్తులు కలుగునాయనచె
మంచిగుణమది తనలోచూచి
అనుగ్రహించగ వచ్చెననుకొనె

త్రిలోకములకు ఆధిపత్యము
మన్వంతరపు ఆధిపత్యము
ఎందుకు – నాకు హరి కరుణించెను
అన్నీవదలెద అని తలంచెను.

కరుణాసాగర కనికరించుము
నీఆనతి అది శిరోధార్యము
మా తాతయగు ప్రహ్లాదుడు కోరిన
నీపదసేవ అనుగ్రహించుము.

క్షణభంగురమగు సౌఖ్యములన్నీ
కాలదన్ని – నీ కరుణ వేడిన
మా తాత ధన్యుడు – ఓ పరమేశా!
నీవుకాదనిన – నిలువ వెవ్వియును.

నారాయణుని అనుగ్రహమ్ముతో
సుతలలోకమున కధిపతి అయ్యెను
శ్రీహరి స్వయముగ గదాపాణియై
భలి భవనమును రక్షణచేయును

ఒక పరి – దశ కంధరుడు – వచ్చెను
లోకమ్ములను జయించెనాతడు
లోనికిబోవగ ప్రయత్నించగా
ద్వారమునందు హరి వారించెను.

వినక రాక్షసుడు ముందుకురాగా
బొటనవేలితో నారాయణుడు
తన్నగ - ఎగిరెను - దశకంధరుడు
పదహేనుయోజన దూరముపడెను

ఆవిధముగను - బలికి నిరతము
రక్షణచేయుచు నుండును శ్రీహరి
భక్తబంధువు - కోరెడి దొకటే
శరణాగతియని - పదములబడుట.

సుతలలోకమున కధోభాగమున
తలాతల - లోకముగలదు
మయుడు - దానికి అధిపతి-ఆతడు
రమణీయమ్ముగ తీర్చిదిద్దెను

త్రిపురమ్ములను నిర్మించుకొని
మయుడు సుఖముగ నున్న సమయమున
హరి ఆనతితో శంకరదేవుడు
త్రిపురమ్ములను దగ్ధముచేసెను

అంతట మయుడు హరిపదములబడ
తలాతలమునకు అధిపతిచేసెను
సుదర్శనమ్ముకు భయపడు నంతే
మిగిలిన భయములు లేవు మయునకు

తలాతలముకు దిగువనున్నది
మహాతలమ్ము - నాగుల నెలవు
గుహక, తక్షక, కాళీయ, సషేణ
మొదలగు - ఉత్తమజాతులుండును.

సుదీర్ఘమైన దృఢశరీరులు
అయినా వారికి ఖగపతిభయము
ఆ భయముతొ వారుందురు అనిశము -
సంతతితో ఆనందముగాను -

మహాతలమునకు - దిగువనున్నది
రసాతలమ్ము - అనెడిలోకము
నివాత, కవచ, కాలకేయులు
అందువసించు ముఖ్యులు రాజా!

తేజోవంతులు వారందరును
శ్రీహరి భయముతొ బ్రతుకుచుందురు
పుట్టలొ పాములు తీరుగ వారు
హరిభయముతొ నట వసించుచుందురు.

ఇంద్రదూతిక - సరమ - అచ్చట
ఇంద్రుని స్తుతించి శక్తినిపొంది
దిగ్బంధమొనర్చెను వారందరినీ
అనుచు వేదము తెలుపును రాజా!

రసాతలమునకు క్రిందనున్నది
పాతాళమ్ము నాగులుందురు
వాసుకి మొదలగు మహానాగులు
అచ్చటవసించి యుందురు రాజా!

శంఖ, కుళిక మరి మహాశంఖ యు
శ్వేత, ధనుంజయ - ధృతరాష్ట్ర మరి
శంఖచూడ, కంబళ, అశ్వతరయు
దేవదత్తాదులు - ముఖ్యజాతులు.

ఆరు, ఏడు, మరి పదిశిరస్సులు
నూరు శిరస్సులు వేయితలలతో
దివ్యమణులతో విరాజి ల్లెదరు
మణుల కాంతికి చీకటి జేరదు.

పాతాళముకు పాదులోనుండు
శేషుని తోక అతినిడుపైనది
ముప్పదియోజన వెడల్పుగలదది
చుట్టచుట్టుకొని విరాజిల్లును.

ఆపుణ్యాత్ముని అనుగ్రహించగ
నారాయణుడు పరవశించును
అనంతుడనుచు – సంకర్షణుడని
అనంతనామము లుండును – ఫణికి.

ఆదిశేషుని దివ్యపడగల
నెలకొని యున్నది భూగోళమ్ము
తెల్లని – ఆవ గింజ – యనునటు
భూమండలము శిరసున నుండును

లోకదగ్ధము శేషుడుకోరిన
ఏకాదశరుద్రుల సృష్టి చేయును
మూడునేత్రముల శూలాయుధముల
నిప్పులుగ్రక్కుచు నుందురువారు

నాగరాజులు భక్తి ప్రపత్తుల
సేవించెదరు అనంత మూర్తిని
దివ్యమణులతో ఫణులన్నియును
పాదసేవను చేయుచుందురు.

నాగకన్యలు అలంకరించుకు
దివ్యగంధమును మేననలదుచు
సుమ హారములతొ – శేషసుందరుని
పూజించుచును పరవశింతురు.

శరీరస్పర్శతొ పులకరింతురు
పూవిలుకాని బారిపడెదరు
వారిసేవలకు మణివిరాజితుడు
శేషుడు – ప్రసన్నమూర్తిగ తోచును.

ఆ మగధీరుని – శేషఫణీంద్రుని
తనివితీరగా దర్శించుచును
ఉపచారమ్ములు స్వయముగచేయుచు
ధన్యులైనటు తలంచుచుందురు

వారిసేవలకు తృప్తినందినటు
ప్రసన్నమైన చూపులతోను
నాగకన్యల మనసులుదోచే
శేషుడు గాచును – భూమినంతను

తెలివి తెచ్చుకొని సిగ్గుమొగ్గల
నిలచినయట్టి నాగకన్యలను
శేషుడు చల్లగ లాలించుచును
పరవశమ్మును కలుగజేయును

సురాసురులును, సిద్ధులు మరియు
విద్యాధరులు గంధర్వులును
మునులందరును బారులుతీర్చి
భక్తిప్రపత్తుల స్తోత్రముచేతురు.

వారిస్తోత్రములు ఆలకించుచు
ప్రసన్నదృష్టితొ చూచు ననంతుడు
దివ్యసుగంధ మాలికలన్నీ
విరసిన కన్నుల పులకరించును.

వైజయంతి నవ మాలికలున్న
తులసిమాలల మధ్యనుండగా
పరవశించిన తుమ్మెదలన్నీ
దివ్యనాదమున స్తోత్రముచేయును.

నీలాంబరుడు - నారాయణుడా -
నీలకంఠుడా - అనిపించగను
మోక్షార్థులు - ఆ రమాధవుని మరి
దర్శించుచును - పరవశింతురు.

మోక్షార్థుల ఏకాగ్రతకు
సంతసించిన అనంతమూర్తి
హృదయగ్రంధిని భేదించుచును
ఆత్మదర్శనము అనుగ్రహించును.

నారద తుంబురు లాదిగాగల
నిండుకొలువులొ విధాత యిటుల
స్తోత్రముచేయును - దేవదేవుని
అనంతమూర్తిని - ఆదిశేషుని

"అంతానీవే అనంత - దేవా!
సృష్టి స్థితి లయ కారణుండవు
త్రిగుణమ్ములు నీకన్నుల పుట్టెను
లోకనాధుడవు - సర్వనియంతవు.

లోకరక్షణకు అనేకరూపులు
సంతరించుచు ఒకటిగచేసుకు
ఆశ్రితపాలకుడై యుండెదవు
అనంత నామములున్నవి నీకు

తెలిసియొ తెలియక ఆనామములు
ఉచ్ఛరించిన పాపహరణము
నీ లీలలు కీర్తించగ వశమా!
సాత్వికమూర్తిగ కాపాడెదవు.

యాదృచ్ఛికముగ శేషునితలచిన
ఆపదనుంచి బయటపడును కద!
పాపక్షాళనతొ సుఖము లభించును
దుఃఖములన్నవి దరికిచేరవు

మోక్షకాములు ధ్యానముచేసిన
సంసారబంధములు తొలగిపోవును
మోక్షములభించు - అంతటి శేషుని
వేయినోళ్ళు మరి పొగడగలేవు.

పాతాళములో నున్నశేషుడు
లోకహితముకై భూమిని మోయును
అనుచు పలుకుచు - వ్యాసకుమారుడు
రాజా! ఇంకను ఏమి విందువన.

భక్తి-వినయముల రాజు పలికెను
"స్వామీ! నాకు లోకచరిత్రను
సవిస్తరముగా తెలియపరచిరి
అడిగెడిశక్తి నాకు ఉన్నదా!

మీదయకలిగి చెప్పదలచినది
చెప్పిన విందును - జన్మతరించగ"
అనగా మౌని చిరునగవులతో
ఆరంభించెను వినుమని రాజును

గుణత్రయమును బట్టిప్రాణులు
కర్మలన్నియు నిర్వర్తింతురు
నిషిద్ధకర్మలు చేయుటయందు
ఉత్సాహమ్మది కలిగియుందురు.

అధర్మవ్యాప్తికి - అదికారణము
అట్టికర్మల చెడుఫలితములు
విపరీతమ్ములు వాటివివరములు
వినిపించెదనన - రాజుపలికెను

"మౌనిపుంగవా! మనవిని - వినుము
నరకములన్నవి - ఎచ్చటనున్నవి
మూడులోకముల నడుమ నున్నవా
పైనవున్నవా - మూలనున్నవా

నింగినున్నవా - నేలనున్నవా
నాసందేహము తీర్చుముస్వామీ!"
అనగామౌని పలికెరాజుతో
నేనుచెప్పునది అదియే అనెను.

॥శ్రీ కృష్ణచరితము॥



## 10 నరకలోక విశేషాలు చెప్పుట

విశ్వాంతరాళపు దక్షిణదిక్కున
మూడులోకముల కావలనున్న
నరకములన్నవి తలచిన భయమగు
వాటిగురించి వివరించెదవిను!

దక్షిణదిక్కు పితృగణములు
నిరంతరము తమ గోత్రీకులకు
దీవనలిచ్చు చుందురు రాజా!
వారికి అధిపతి యముడు అగునయా!

సమవర్తియని - శమరుడు - ధర్మువు
పితృగతియని - పిలతురు యముని
కర్మలబట్టి జీవులన్నిటికి
తగిన దండన విధించు - యముడు

తామిస్రము - అంధతామిస్రము
కారవము మరి మహాకారవము
కుంభీపాకము - కాలసూత్రము
అసిపత్రవనము మరి సూకరముఖము.

అంధకూపము - క్రిమిభోజనము
సందంశము మరి తప్తోర్మియును
వజ్రకంటక - శాల్మలియు - వైతరిణియును
ఊయోధము మరి ప్రాణారోధము

విశసనము మరి లాలాభక్షము
సారమేయోదనము - ఆవాచిరయము
కాతఃపానము అను నరకములు
ఇరువది ఒకటిగ నున్నవి రాజా!

క్షారకర్దమము - రక్షోగలభోనము
శూలప్రోతము - దంతశూతము
అవటనిరోధము - అపర్యావర్తనము
సూచీముఖము అను నవి ఏడు

ఆ విధముగను ఇరువదెనిమిది
నరకములున్నవి - అందురు రాజా!
ఏ ఏ శిక్షలు - పాపులందెదరు
వివరించెదను రాజవరేణ్యా!

పరకాంతలను - పరుల సంతును
హేళనచేసి - అవమానించిన
తామిస్ర నరకము - నందు జేర్చెదరు
కొండలనుండి - క్రిందకుతోయుచు

కర్రలబాదుచు - హింసపెట్టుచు
తిండిపెట్టక మాడ్చివేతురు
ఆ బాధలకు స్మృతితప్పినను
వదలరు - బాధలు అనుభవించవలె

పరకాంతను మోహించి - తెలివిగ
భర్తను - మోసముచేసి - అంతట
బలాత్కరించిన అంధతామిస్రము
అనెడి నరకము - ఆహ్వానించును

స్వార్థముతొ - తన పోషణకొరకు
ద్రోహముచేసే - పాపాత్మునికి
రౌరవ నరక వాసము తప్పదు
నరకబాధలు చెప్పనసాధ్యము

స్వేచ్ఛగ తిరిగే పశుపక్ష్యాదుల
బాధించిన - కారవ - మహాకారవ
నరకవాసమున - హింసకులోనగు
దుప్పి కొమ్ములతొ చీల్చుచుండును.

రౌరవ, మహారౌరవమ్ములని
దేహ గేహముల రక్షణకొరకై
ఎలుకల-బంధించి-చంపిన కలుగును
కుంభీపాక నరకవాసమది -

ఆ నరకములో మరగెడి నూనెలొ
పారవేతురు - హింసించెదరు
తల్లిదండ్రులకు బ్రాహ్మణులకును
అపకారముచేసిన వాని గతి యది.

కాలసూత్రమను నరకబాధలు -
పైనసూర్యుడు - క్రిందమంటలు
దాహము అనుచు అరచును జీవి
ఆకలో - యని అలమటించును.

యమకింకరులు వదలరు వానిని
ఇనుప మూకుళ్ళ - పడవేసెదరు
కాలిన చువ్వల వాతలుపెట్టుచు
స్మృతి తప్పినను బాధలుతప్పవు.

ఎత్తులేని బరువెత్తి గెంటుచు
ఇనుపగదలతో మోదుచుందురు
పశురోమములు ఎన్ని వుండునొ
అన్నిఏండ్లు ఆ పాపి వుండునట.

వేదవిహితమగు మతమునువదలి
పాషండమతమను - నాస్తికమతమును
అనుసరించిన - అసిపత్రవనమ్మున
అనేక బాధలు పొందును జీవి.

అట్టివారిని యమకింకరులు
ఇనుప పట్టెలతో బాదుచుందురు
ఇరుకుసందులో రంపపుకోరల
మధ్య నడువగా జేతురు వారు.

గోలు గోలున ఏడ్చుచుండగా
ఎటులవుందిరా! నీ మతమనుచు
గేళిచేతురా యమకింకరులు
చావనివ్వరు - శిక్షతప్పదు.

శిక్షకర్హులు కానివారిని
శిక్షించినను - బ్రాహ్మణోత్తముల
దండించినను - నరకముతప్పదు
కాలసూత్రమను నరకమది యగు -

అట్టివారిని యమకింకరులు
చెరుకు విరిచినటు విరచుచుందురు
జంతుహింసను చేయువానికి
అంధకూపమను - నరకముతప్పదు

చీకటినూతిలొ - క్రూరమృగములచె
క్రిమికీటకముల - పదునుముక్కులతొ
కరిపించెదరు - పొడిపించెదరు
వానిబాధ - వర్ణించనసాధ్యము.

సంపన్నుడయ్యును పరులకుపెట్టక
కాకివలె - తను తినువానికి మరి
క్రిమిభోజనమను నరకముతథ్యము
పురుగుల గుంటలొ పడివుండుటయే

లక్షయోజన విస్తీర్ణముగల
పురుగులగుంటలొ పురుగులుతినును
దొంగతనమును చేసినవానికి
కాల్చి - శూలముల వాతలువేతురు.

ఇనుపగుళ్ళను భుజములనుంచి
నరకవీధులలొ నడిపించెదరు
మన్మథతాపము భరించలేక
తప్పిదమ్మును ఆచరించిన

అగ్నిగోళముతొ సమానమైన
ఉక్కుబొమ్మలకు - చేతులు కట్టి
బాదుచుందురు - కరకుకత్తుల
చెట్టుకు కట్టి - మర్దించెదరు

పాషండమతముతో - మతద్వేషులవ
వైతరిణీనది నందున వేతురు
భయంకరమ్మగు మొసళ్ళు వానిని
తినుచుండును మరి చావనీయవు

రక రకమ్ముల చీము, నెత్తురులు
దుర్గంధపూరిత క్రొవ్వు, మాంసము
మలమూత్రములు - ఎముకలు, మేధస్సు
గుట్టలుండునా వైతరిణియందున.

శుచి, ఆచారము వదలి బ్రాహ్మణుడు
పరస్త్రీతో తను - భోగమునందిన
వైతరిణీనది యందున మునుగుచు
తేలుచు - శ్లేష్మము తినుచుండవలె

కుక్కలపెంచి - వేటకువెళ్ళి
జంతుహింసను చేయువానిని
యమకింకరులు పదును అస్త్రముల
నరకబాధకు గురిచేసెదరు.

వేడుక కొరకు పశులను చంపి
యజ్ఞముచేయు జీవిని వదలక
యమకింకరులు మొండికత్తులతొ
కోయుచుందురు జాలిచూపరు.

కామదాహమున భార్యచేతనే
చేయగరాని పనిచేయించగ
రేతోహదమను - నరకమందున
రేతస్సును - తా - త్రాగగవలెను.

దుష్టరాజులు - దొంగలుగాని
ధనవంతులిండ్లను - కాల్చివేసినా -
పరులచేతను చంపించినచో -
ఘోరనరకము సంప్రాప్తమగు.

ఏడువందల కుక్కలు వానిని
ముక్కలుగా మరి పీకుచుండును
దొంగసాక్ష్యము లంచముగొని మరి
చెప్పిన - తప్పవు నరక బాధలు.

అటుల సాక్ష్యము చెప్పిన - పాపి
వీచి - నరకమున తోయగబడును
తాళ్ళతొకట్టి నూరుయోజన
ఎత్తునుండి తలక్రిందుగ త్రోతురు.

అటుల రాతిపై పడిన శరీరము
తునాతునకలై తిరిగి ఒకటగు
తిరిగిఅటులనే త్రోయుచుందరు
శిక్షతప్పదు - చావనీయరు.

సోమయాజి యగు బ్రాహ్మణోత్తముని
భార్యను చెరచిన - కల్లుద్రావినా
అగ్నిలొకాల్చి - గుండెలతన్నుచు
ద్రావకమ్మును పోతురు భటులు

హీనబ్రతుకుతో వేదవేత్తలను
అవమానించిన - క్షామకర్దమను
నరకమునందు - బాధలనందును
నరకబాధ - వర్ణించనసాధ్యము.

తనసుఖమే మరి ముఖ్యమనుకొని
బలులను యిచ్చిన వారిని పొడిచి
యమకింకరులా రుధరము త్రాగుచు
భయంకరముగా నాట్యమాడెదరు

శూలమ్ములతో పశువులజంపిన
శూలసూత్రమను - నరకమందును
శూలమ్ములతొ గుచ్చు చుండగా
వానిబాధ వర్ణించ నసాధ్యము.

జంతువులను మరి హింసించినచో
దందశూకమను - నరకమందును
ఏడుశిరముల పాములువారిని
కరచుచుందును వదలిపెట్టవు.

పెరటియందున ఇంటియందున
పశువుల పక్షుల లేళ్లనుగాని
ఖండించి చంపిన యమకింకరులు
విషాగ్నికీలల త్రోసివేతురు

ఇంటికివచ్చిన అతిథిని తిట్టిన -
తూలనాడినా - అట్టివానిని
ఇనుప ముక్కల కాకులుపొడిచి
చీల్చి చీల్చి మరి - భక్షణచేయును

ధనముగలిగియు - పిసినారిగను
ధర్మకార్యములు - చేయుటమాని
పరోపకారము చేయక - చచ్చిన
సూచీముఖమను - నరకవాసము

అట్టివానిని యమకింకరులు
సింహద్వారముకు కట్టివేతురు
కొరడాలతొ కొట్టి - బాధించెదరు
పరులమేలు మరి తలంచవలెను

రాజా! నరకములెన్నోకలవు
ధర్మదూరులు యమలోకమున
చిత్రహింసలకు గురియయ్యెదరు
పాపఫలము మరి అనుభవించవలె

ఆపై తిరిగి జన్మించెదరు
ధర్మవర్తనతొ సత్కార్యములు
ఆచరించిన స్వర్గముదొరకును
సుఖములనంది తిరిగి పుట్టెదరు

మోక్షమునందిన పుట్టుక వుండదు
ఆవిషయమును చెప్పితి రాజా!
ఈలోకములు బ్రహ్మాండమున
పదునాల్గుకోశముల భాసిలుచుందును

చతుర్దశ భువనమ్ము లనుచును
వ్యవహరింతురు - అట్టిదానిని
వర్ణించుట మరి ఎవ్వరివశము?
తెలిసినంతయే తెలిపితి నీకు

ఈ చరిత్రను వర్ణించినను
విన్నవారు విని పించినవారు
మదిలొ హరిని - తలచినవారు
సకలశుభములు పొందెదరయ్యా!

ఈశ్వరదేవుని స్థూలశరీరము
బ్రహ్మాండమిది - దీని సృష్టిని
తెలిసినవారికి - సూక్ష్మశరీరపు
మర్మము తెలియును - తేలికగాను.

భూమి, ద్వీపములు - వర్షమ్ములును
నదులు - కొండలు - ఆకాశమ్ము
సముద్రమ్ములు - పాతాళములు
దిక్కులు - నరకము - నక్షత్రములు

నిలచుటకనువగు ఆధారమ్ములు
స్థావర జంగమ జంతుజాలమును
భరించు అద్భుతమైన వివరము
శ్రీహరిస్థూల శరీరము చెప్పితి

ఆవిధముగను రాజవరేణ్యుడు
అవధూత - చెప్పిన భాగవతమ్మున
పంచమస్కంధము విని నంతటనే
మునికిమ్రొక్కెను పులకరింతతో.

శ్రీ కృష్ణచరితము - కర్ణపేయము
వ్యాసమౌనికే - శాంతినొసగినది
పోతనయ్య - పులకించి పలికినది
భవ భయ హారిణి - భాగవతమ్ము॥

ఓం శాంతి - శాంతి - శాంతిః





సర్వేజనాస్సుఖినోభవన్తు
లోకాస్సమస్తాస్సుఖినోభవన్తు





సర్వం శ్రీ సీతారామచంద్ర పాదార్పణమస్తు



(మకుటం)

శ్రీ కృష్ణచరితము - కర్ణపేయము
వ్యాసమౌనికే - శాంతినొసగినది
పోతనయ్య - పులకించి పలికినది
భవ భయ హారిణి - భాగవతమ్ము॥

# శ్రీమద్భాగవత - మకరందము

## (షష్ఠమస్కంధము)

### విషయ సూచిక





శ్రీరామ

ఓం - నమో - వాసుదేవాయనమః

# శ్రీమద్భాగవత - మకరందము
## (షష్ఠమస్కంధము)

హరిపదములపై భక్తినిలపిన
శౌనకాదిమును లంద రప్పుడు
సూతుని అడిగిరి హరిగాధలవి
పుణ్యతీర్థములు పులకరింతలు

ఆపైగాధ శుకయోగీంద్రుడు
పరీక్షిత్తునకు అనుగ్రహించెను
దానిని తమకు వినిపించమని
మ్రొక్కి పలికిరి - మునులు సూతుని

భాగవతమ్మును వినిపించుచును
భవబంధమ్ముల విడిపించుచును
బ్రోవగ వచ్చిన శుకయోగీంద్రుని
పరీక్షిత్తు - తా మ్రొక్కి పలికెను

పరబ్రహ్మాచరితము పరమపవిత్రము
శాశ్వాత సుఖముల నందించునది
స్వర్గసుఖముల మించిన సుఖము
కలుగునుస్వామీ - హరిలీలలతో

త్రిగుణమ్ములును - కర్మఫలితము
పాపఫలమును ఇచ్చెడి నరకము -
స్వాయంభువ మను - వాదిగాగల
మన్వంతరముల వివరము వింటిని

ప్రియవ్రత ఉత్తానపాదుల
వంశక్రమమును తెలిపితివయ్యా!
ద్వీపమ్ములును వర్షమ్ములును
నదుల సంద్రముల పుట్టుక వింటిని

భూమండలము దానివిస్తీర్ణము
జ్యోతిశ్చక్రము దాని నడకను
పరమేశ్వరునితొ సంబంధమును
వివరించితివి ధన్యుడనైతిని

అయినా! మౌనీ - నాసందేహము -
నరకబాధలు తెలిసియుకూడా -
దుష్టచేష్టల నాహ్వానింతురు
హాయిగ బ్రతికెడి మార్గము ఏది?

ఓ మహరాజా! చక్కని ప్రశ్నే!
తప్పుచేయక - నడచుట ముఖ్యము
తప్పుకు తగిన - ప్రాయశ్చిత్తము
చేసిన వానికి ఫలితము కలుగును

మనో వాక్కాయ కర్మలవలన
చేసిన తప్పులు దుర్మార్గములు
తెలుసుకు - జీవుడు సాగులోపలే
ప్రాయశ్చిత్తము చేసుకోవలె

మౌనిపుంగవా! పాపముతెలిసియు
ఆచరింతురు ఇలలో – జనులు
తప్పు తప్పుఅని – పైకి పలుకుచు
దానిని చేతురు నిర్భయమ్ముగా

మంచిచేసిన వారికి సైతము
పాపపు పాలు ఎక్కువైనపుడు
పాపఫలితము అనుభవించవలె
విజ్ఞత కలిగిన మూర్ఖత్వమది –

ఓ మహరాజా! పాపకర్మల
ఫలితము తొలగగ జీవులు ఇలలో
సత్కర్మలను ఆచరించవలె
రోగ రహితమగు తిండి తినునటు.

వైద్యుడుతెలుసుకు – రోగకారణము
సమూలమ్ముగా – నిర్మూలించును
అటులే–పాపపు మొదలు తెలుసుకొని
పాపపు తరువును కూల్చి వేయవలె

తపస్సు మరియు బ్రహ్మచర్యము
సత్పాత్రదానము శమ దమాదులు
జప హోమములు సత్యవర్తనము
సత్ప్రవర్తన – భూతదయయును

కలిగినయట్టి బుద్ధిమంతులు
త్రికరణశుద్ధిగ చేయుపాపములు
సులువుగ అంతము చేసుకొందురు
పాపపు టడవిని కాల్చును అగ్ని.

మరి కొందరిల శ్రీహరిస్మరణతో
పాదార్చనతో లీలలు వినుచు
పుణ్యవర్తనము కలిగినవారై
పాపపు మంచుకు రవివలె నుందురు.

శ్రీహరిపైన నిలచిన భక్తి
పాపపుటడవికి కార్చిచ్చగును
పాపపుచీకటి చీల్చెడి వెలుగై
భక్తిప్రవాహము త్రెంచు – పాపమును

శమదమాదులు మొదలగునట్టి
సాధనమ్ముల ఫలితముకన్న
భక్తి – బలమగు సాధనమయ్యా
రాజమార్గమగు తిరుగు లేనిదది.

విష్ణుభక్తియది లేని పుణ్యమన
తనుగా తాను మోసపోవుటే
కల్లుకుండను పుణ్యనదులలో
ముంచిన రాదు దానికి మంచి

నిరతము హృదిలో హరిపదములను
నిలపి – భక్తిగా ప్రార్థించినచో
యమ లోకమది దరికి చేరదు
పాపపులెక్కలు మండిపోవును.

తెలసియొ తెలియకొ చేసినపాపము
హరిగుణ కీర్తనతో అంతమగు
అంత్యకాలమున మోక్షపథమును
చూపించెడిది శ్రీహరి భక్తియె.

విపులముగా మరి తెలియజెప్పగా
అజామీళుని గాధచెప్పెదను
విష్ణు-యమదూతల సంవాదమది
నామోచ్చారణ స్వర్గమిడినది.

॥శ్రీ కృష్ణచరితము॥



## 1 అజామీళోపాఖ్యానము

కన్యాకుబ్జము నందొక విప్రుడు
అజామీళుడను నామధేయుడు
దురభ్యాసముల కాలవాలము
అంతకుమించిన పాపివుండ డిల

శుచి శుభ్రతలు దయదాక్షిణ్యము
వెదకిన దొరకవు - అంతటిభ్రష్టుడు
ఇష్టురాలు ఒక శూద్రవనిత మరి
ప్రాణముకన్న మిన్నగచూచును

దానిని విడచి నిముసము వుండడు
దానితొసంతతి పదిమందయ్యా
ఇల్లుగడచుటకు కష్టముకాగా
ఆమెనుగాంచి పరవశించును

అటులా ధూర్తుడు జీవితమంతా
విలాసమ్ముగా గడపివేసెను
వార్ధక్యమ్మది మీద కురికినది
దానికి వాడు లొంగిపోయెను

అధిక దగ్గుతో మెలికలు తిరుగుచు
మరణము మేలను స్థితికివచ్చెను
మరణించినచో దారాపుత్రుల
గతి ఏమిటని దుఃఖిలసాగెను

కొడుకులలో కడగొట్టువానికి
నారాయణ - యని పేరుబెట్టెను
వానియందు అతి మక్కువకలిగి
పిలచి పిలచి మరి లాలనచేయును

తిన్నావా - మరి తింటావా! యని
దగ్గర రమ్మి పరుండమనుచు
రోజుకు ఎన్నోపర్యాయములు
వానిపేరును ఉచ్చరించును

నారాయణ నామము - పవిత్రమైనది
అన్నధ్యాస అది - మదిలో లేదు
కేవలమాతని కొడుకును పిలచుచు
ఆ నామమును ఉచ్చరించును.

అంతటి పాపి పరమభ్రష్టుడు
అజామీళునకు తెలియకుండగనె
నారాయణనామము - ఉచ్చరించగా
పుణ్యగతులను కలిగించినది

అవసాన కాలము దాపురించెను
యమదూతలు వానికి - కనబడినారు
హడలిపోయెను - నారాయణాయని
వణకుచు పిలచెను - వచ్చెను కొడుకు

దగ్గరకూర్చొన బెట్టుకు వానిని
వెన్నునిమురుచు పేరుపిలచుచు
యమదూతలను స్వయముగ గనుచు
మరణబాధను అనుభవించెను

అంతట ఆ యమదూతలప్పుడు
నిర్దాక్షిణ్యము నిండినవారై
సమవర్తి ఆజ్ఞకు బద్ధు లాయిరి
సూక్ష్మశరీరము లాగివేసిరి

ఆసమయములో విష్ణుదూతలు
అమాంతమ్ముగా వచ్చిపడి మరి
యమదూతలకు భయముగొలుపునటు
సూక్ష్మశరీరము వదలగ పలికిరి

మాటవినని ఆ యమదూతలపై
కలయబడిరట విష్ణుదూతలు
సూక్ష్మశరీరము తిరిగి బొందెలో
ప్రవేశపెట్టిరి - యమదూతలు ఓడిరి.

॥శ్రీ కృష్ణచరితము॥



## 2 విష్ణు - యమదూతల సంవాదము

వందనముంచి ఆ యమదూతలు
పలికిరప్పుడు విష్ణుదూతలతొ
అయ్యా మీరు దివ్యస్వరూపులు
నాల్గుభుజములతొ అగపడుచుండిరి

నిగనిగలాడే యౌవ్వనమ్ముతో
పద్మమాలలు తులసిమాలలతొ
దేవమూర్తులుగ అగబడుచుండిరి
భువిలొ యింతటి వారు కనబడరు

ధర్మశాసనము అమలుచేయగా
సమవర్తిఅగు యముని దూతలము
సూక్ష్మశరీరము గొని పోచుండగ
మా కర్తవ్యమునకడ్డుపడితిరి

మకుటమ్ములతో మణిశోభలతో
భుజకీర్తులతో దివ్యనామముతొ
నిజముగ మీరు వైకుంఠవాసులు
నీలిమేఘపు వన్నెశరీరులు

మీతేజముతో చీకటితొలగును
శాంతమూర్తులుగ అగపడుచుండిరి
తృణహీనముగా మమ్ముల త్రోసిరి
యమశాసనమది - కాదనతగునా!

అంతట పలికిరి వైకుంఠవాసులు
చిరునగవులతో పలికిరి వారితొ
దండధరునికి దూతలైరికద
మాప్రశ్నలకు జవాబులీయుడు

పాపపుణ్యముల స్వభావమెట్టిది
పాపమ్మునకు ఎట్టిదండన
మీరు గ్రహించిన జీవికి ఏగతి?
పాపకర్ములు ఎవరోచెప్పుడు?

ప్రత్యుత్తరముగ పలికిరంతట
వేదప్రమాణము నిర్ణయమ్మది
వేద విహితము ధర్మముఅగును -
వేద విరుద్ధము అధర్మమగును -

వేదవేద్యుడు శ్రీహరి గనుక
హరికి విరుద్ధములన్నియు తప్పే!
త్రిగుణాత్మకముల ప్రాణులుచరించు
సృష్టిఅంతయు కర్మకు సాక్షి

రవిచంద్రులును నింగీ నిప్పు
ఉభయసంధ్యలు వాయుదేవుడు
కాలము భూమి – యివ్వి – సాక్షులు
పాపపుణ్యముల గుర్తించునట్టివి

వాటిసాక్ష్యమున – మా నాయకుడు
శిక్షలు వేసి అమలుచేయును
జీవుడు దేహిగ వుండువరకును
శుభాశుభ కర్మలుతప్పవు

వాటిఫలితము దేహాంతమున
అనుభవించక తప్పదుకాదా!
కర్మలఫలితము జన్మలెత్తుట
పాపపుణ్యముల ననుభవించుట.

కర్మఫలముల నిర్ణయమ్మది
యముడు చేయును నిరంతరమ్ము
జీవులకర్మలు పరిశీలించుచు
తగిన ఫలములు శిక్షలనిడును

మాయలోపడిన జీవుడు తాను
దేహము వేరని మరిచిపోవును
త్రిగుణాలకును వశుడు తానయి
కర్మలుచేసి ఫలితముపొందును

జ్ఞానేంద్రియములకు బద్ధుడు తానై
తమోగుణ సంబంధము కలిగిన
శబ్ద స్పర్శ రూప గంధాదులు
ఆదిగాగల పదునైదుగుణములతొ

పదునారవదగు మనస్సుతోటి
తనుగా పదునేడవ వానిగ నిలచి
జ్ఞానేంద్రియ కర్మేంద్రియ ఫలములు
అనుభవించుచు నుండును – ఇలలో

ఆవిధముగను జ్ఞాన కర్మేంద్రియ
సంబంధమును కలిగిన జీవుడు
అరిషడ్వర్గము జయించగలిగియు
కర్మలు తాను ఆచరించును

పూర్వజన్మ సంస్కారమువలన
కర్మలుతప్పక చేయుచుండును
స్థూల సూక్ష్మదేహమ్ములు రెండును
మాతాపితరుల వంటివి అగును

ప్రకృతి సహజము అయినమార్పులు
దేహికి కలుగును పై విధముగను
శ్రీహరిపదములనాశ్రయించిన
ప్రకృతినే తను జయించగలుగును

మహాత్ములారా! అజామీళుడు
మహాపాపియు కిరాతుడయ్యెను
ఉత్తమ బ్రాహ్మణ కులమున బుట్టియు
వైదిక మార్గములోన చరించియు

కామవశమున చిక్కెను వీడు
సుఖభోగముల మునిగితేలెను
తల్లిదండ్రులను - దైవభీతిని
పూర్తిగ వదలి కట్టడితప్పెను

లోకధర్మమును కాలరాసెను
మమతాబంధము - తలిదండ్రులను
దయదాక్షిణ్యము - లంతరించెను
యౌవనపొంగులు స్థిరమని తలచెను

మన్మధుడే ఇల దేముడు అనుకొని
మదనాగ్నిలొబడి దహింపబడెను
సమిధలు, పూలు, పండ్లకొరకునై
తండ్రిపంపగా వనమునకేగి.

అచ్చటగాంచిన శూద్రవనితను
అచ్చరకన్యగ భావించాడు
అన్నులమిన్న తనను చూడగా
అనేక విధముల ప్రయత్నించెను

కోరిక ఫలించి - ఆ జవ్వనితో
పొందు పెట్టుకొని సర్వమువదలెను
కన్నతల్లిని తండ్రిని - చివరకు
కట్టుకున్న - తన ఆలిని మరచెను

పుత్రప్రేమను ఈసడించెను
దాంపత్య ధర్మమును గేలిచేసెను
చివరకు - కన్నతల్లిదండ్రులే
బరువైపోయిరి - ఈ భ్రష్టునికి.

శూద్రవనితను ఇంటిలొపెట్టెను
రాణివి నీవని పలుకజొచ్చెను
తల్లిదండ్రులు - భార్యయు కూడా
పదములొత్తునటు చేయింతుననె.

ఇంటిలొ - నగలు అలంకరించెను
పాన్పు దిగుట మరి నిషిద్ధమనెను
రూపురేఖలు మార్చివేసెను
దాసుడయ్యెను ఈ కామాంధుడు

వేదాధ్యయనము వదలిపెట్టెను
నిత్యకర్మలను మరచిపోయెను
కామకేళిలో కరగిపోయెను
కరగిపోయినది స్థిరాస్థిఅంతయు

నగలుతీసెను - కుదవబెట్టెను
తీర్చలేక నవి - జారవిడచుకొనె
నచ్చజెప్పగా వచ్చిన వారిని
పరుషములాడి సాగనంపెను.

తిండి గడచుట కష్టమయ్యెను
బందిపోటుగా మారిపోయెను
జూదము - త్రాగుడు - పెరిగిపోయెను
ప్రజలకు వీడొక రాక్షసుడయ్యెను.

ఇరుగుపొరుగులు ఇండ్లనొదిలిరి
పెరిగిన సంతానమ్ము పోషణకు
చెయ్యని దారుణ మసలే లేదు
పాపి - ధూర్తుడు - క్రూరకర్ముడు

అయ్యా వీనిని తీసుకుపోయి
పాపాలకుతగు శిక్షవిధించగ
నిర్ణయమైనది కానీ మీరు
మా కర్తవ్యము నడ్డగించిరి"

అంతట పలికిరి విష్ణుదూతలు
"ఎంతో కథను వినిపించారు
మీ అవివేకము తెలియదు మీకు
పుణ్య - ధర్మముల వివరమునెరుగరు

వాటి నిర్ణయము చేయు వివేకము
లేకపోయినది - తీరుగ వినుడు
దయాపూర్ణుడు - సర్వేశ్వరుడు
దారితప్పిన తనయుల మరచున!

తప్పిదమనుచు వేడుకున్నచో -
ఆర్తరక్షకుడు ఆదుకొనునుగద -
ప్రతీకారము పట్టుదలలు మరి
పరంధామునికి ఉండవుకాదా!

పాపపంకిలము క్షాళనచేసి
పరమేశ్వరుడు ఆదరించుకద
ఎనలేనన్ని పాపములవ్వి
నామస్మరణతో నాశనమగును

అంత్యకాలమున స్మరణచేసిన
పాపపుచిట్టా - కాలిపోవును
ధర్మసూక్ష్మమిది బోధపడదు మరి
పాపపులెక్కలు - శిక్షలెతెలియును

భ్రూణహత్య - మరి బ్రహ్మాహత్యయు
మద్యపానము స్వర్ణచౌర్యము
మొదలగునట్టివి - పాతకమ్ములు
వాటికి విరుగుడు యిచటేగలదు

హరికీర్తనము నామస్మరణము
పంచమహాపాతకమ్ములను
అవలీలగను హరించివేయును
దానిపుణ్యము అనంతమైనది

జన్మజన్మల తపోఫలమును
మించిన ఫలము హరిసంకీర్తన
ముక్తిపదమది దొరకును వారికి
సుఖసౌఖ్యములు వొసగును అదియే.

నామసంకీర్తన - నామోచ్చారణ
ఇష్టముతో మరి పలకనివానికి
పాపక్షాళన జరుగుట ఎటులని
మీరు - తిరిగి ప్రశ్నించవచ్చును!

తనయునిగాని - తనవారనుగాని
తెలియకనో మరి తెలిసియుండియో
పిలచిన పలికే పరంధామునికి
నామోచ్ఛారణ సంతసమిడును

శక్తివంతమగు ఔషధమ్మది
రోగవిముక్తిని కలిగించినటు
మనసారా మరి హరినితలచిన
మొండిపాపములు మంటగలియును

పరిహాసముననొ - అవివేకముననొ
హరినామమును ఉచ్చరించినచొ -
పరవశించిన భక్తవరదుడు
పరమపుణ్యునిగ చేయును వానిని.

అన్నీవుడిగి ఊడిపోయెడి
అంత్యకాలమున హరితలంపది
పూర్వజన్మకృత పుణ్యఫలమయా!
అందుకు హరిని-పిలచెను-తలచెను.

ధర్మసూక్ష్మము వివరించితిమి
అజామీళుని పాపములన్నీ
హరించిపోయెను హరితలంపుతో
యమపాశముల విడివడినాడు"

మారుమాటాడక ఆ యమదూతలు
వందనముంచి సాగిపోయిరి -
దండధరునికి సర్వముతెలిపిరి
అంతటలేచెను అజామీళుడు

నిద్రనుండి తా మేల్కొనినటుల
కళ్ళు నులుముకొని తెరచి చూడగా
మందస్మిత వరనారవిందముల
విష్ణుదూతలు కనబడినారు

అచేతనమ్ముగ చేతులనెత్తి
నమస్కరించెను అజామీళుడు
చిరునగవులవి ఆశీస్సులుగా
అంతర్ధానము అయ్యిరి వారు

అంతదూరమున నీడమాదిరిగ
సాగెడి యమదూతలను - గాంచెను
చుట్టూమూగిన బంధులగాంచెను
యమ - విష్ణు దూతల సంవాదముతెలిపెను

పాపకూపమున మునిగినవానికి
మనస్సుప్రశాంతత నిండిపోయినది
పూర్తిగ తెలివి కలిగి లేచెను
గంగాస్నానము అయినటుతోచెను

గతము మెదిలెను మనస్సులోన
పశ్చాత్తాపము ఎగసిపడగను
కన్నులవెంబడి అశ్రుధారలు
జారుచున్నవి అరచేతులహత్తెను

"ఆడుదాని ఆ అందముగాంచి
ఆటలాడి - నే భ్రష్టుడనైతిని
అడుగులనడచిన ధర్మపత్నిని
అవివేకముతో దూరముచేసితి

అధర్మవర్తన కలిగిన నేను
అక్రమ సంతానమ్ము కొరకునై
అఘములు ఎన్నో ఆచరించితి
అతివతొ బ్రతుకే ఘనమని తలచితి

బ్రాహ్మణకులమున పుట్టిన నేను
అనాచారములు అక్రమాలకు
ఆలవాలమై పాతాళమున
అడుగుబెట్టితి - అఘములపుట్టను

నలుగురు ముఖమున ఉమిసినగాని
నన్ను నేను మరి తెలియగకపోతిని
నన్నుగన్న - నాతల్లిని గెంటితి
నా తండ్రి నే నవమానించితి.

విద్యాబుద్ధులు నేర్పినతండ్రి
గాయత్రిమంత్రము చెప్పిన జనకుని
నన్నో గృహస్థుచేసిన నాన్నను
దుఃఖపెట్టిన పితృద్రోహిని.

బందిపోటుగా మారిపోతిని
వ్యసన పరునిగా నిలచిపోతిని
నాపాపాలకు యముడు యిచ్చటే
కఠినముగా శిక్షించి తీరును

స్త్రీలోలుడనై ఉనికే మరచితి
శాస్త్రజ్ఞానము మంట గలిపితి
నాదుష్కృతములు కాల్చవేలనో -
నాప్రాణములవి పోవెందులకో -

రౌరవాది నరకమ్ములన్నవి
నాకొరకే మరి ఏర్పడినవవి -
వాటిలోపడక ననుకాపాడిన
దివ్యపురుషులు కనబడరేమి -

యమపాశములతొ భయంకరముగా
ముగ్గురు భీకరకాయులు కట్టిరి
వారుయిప్పుడు కనబడరేమి
బంధనాలు సడలించిరెందులకొ

పుణ్యమూర్తులు - నాకు కనబడి
బంధనాలను విడిపించారు
పీతాంబరములు కనకహారములు
కుండలాలతో చిరునగవులతో

కస్తూరితిలకము ఊర్ధ్వపుండ్రములు
నీలిమేఘమును పోలినదేహము
నిగనిగలాడే మంగళవదనము
తులసిమాలలు తీయనిచూపులు

నిజముగవారు విష్ణుదూతలు
శంఖచక్రముల విరాజిల్లెడు
మహితమూర్తులు వైకుంఠవాసులు
నన్నీబొందెతొ నిలబెట్టిరట

వారిద్దరి సంవాదము వింటిని
హరినామోచ్చారణ వల్లను
ఘోరపాతకము లెగిరిపోవును
పుణ్యలోకములు అందును అనిరి

నిజముగ నేను నాబుడుతనికి
నారాయణయని - పేరుపెట్టుకొని
తెలియక దాని ప్రభావము నాడు -
పిలచిన - పిలుపుతొ-దాటితి నరకము

చచ్చేముందు నారాయణ యని
ఉచ్చరించిన పుణ్యమువలన
రౌరవాదినరకమ్ములు దాటితి
ఎంతటిమహిమో తెలిసితి నిపుడు!

"పూర్వజన్మపు సుకృతమ్మది
హరినామమును అనిపించినది
కానిచొ దుష్టుడనైన నేను మరి
నారాయణయని అనగలుగుదునా!

శ్రీహరి అనుగ్రహమున్నది కనుకనె
నారాయణయని అనగలిగితిని
సర్వభ్రష్టుడనైన నాకు అంతటి
అర్హతనిడెను వాసుదేవుడు

శ్రీహరి కరుణ ప్రసరించిన ఈ
తనువు – శ్రీపతికి అంకిత మనుకొనె
ఎదురుగ నున్న శోకమూర్తిని
శూద్రవనితను గాంచెనంతట

"నీకూ నాకూ – ఋణముతీరెను
నేనెవరో మరి తెలిసితి నిపుడు
నన్నుగెలిచిన మాయను గెలచితి
నీత్రోవ మరి నీవుచూచుకో"

అనుచుపలుకగా అవాక్కుగానై
ఆమె పిల్లలు చూచుచుండిరి
భవబంధములు త్రెంపుకునిలచెను
హరిభక్తులను ఆశ్రయించెను

మురారిగాథలు ముదముగవినెను
కంసారి లీలలకు పరవశించెను
ఆముష్మికపు త్రోవ అదియని
నమ్మికొలిచెను నారాయణుని

హరితత్వమది ఒంటబట్టెను
భక్తిరుచిని మరి చూడగలిగెను
గంగదిగిన ఆ ప్రదేశమ్ముగని
అచట ధ్యానము చేయగతలచి.

అచ్చటనున్న తాపసోత్తముల
బోధలు విని – తా – పరవశించెను
హరితేజస్సును మదిలోనింపెను
సర్వమునిండిన హరినిగాంచెను

భక్తి అనెడి ఆ పవిత్రాగ్నిలో
పుటమువేయబడె ఆతనిమనస్సు
మలినము పోయి నిర్మలమైనది
దివ్యధామము చేరెను రాజా!

దేహత్యాగము చేయక ముందే
దివ్యవిగ్రహుని హరిని గాంచెను
యోగమార్గమున తనువు వదలెను
దివ్యవిమానము వైకుంఠముజేర్చెను.

కులమును చెరిచిన వ్రతభ్రష్టుండు
అతివ సుఖముతో బ్రతికిన దుష్టుడు
నరకవాసమున శిక్షలు లేక
విష్ణుపదమును చేరెను రాజా!

అజామీళుని గాథను భక్తిగ
చదివిన – వినిన – పాపహరణమై
పరమయోగులు చేరెడి నెలవు
చేరుకొందురు నిస్సంశయము.

నారాయణయని కొడుకునుపిలచి
ఘరమపాపి తా పునీతుడవగా
నిరతము నామము చేయు యోగ్యుడు
మహోన్నతంబగు స్థానము చేరడ!

విష్ణునామ సంకీర్తనచేయని
మనుజుని పాపము క్షాళనగాదు
కర్మఫలములు నశించవయ్యా!
జన్మజన్మల అనుభవించవలె

అనుచుచెప్పగా పరిక్షిత్తు తా
అడిగెను శుకుని అతి వినయముగా
అయ్యా నీవు చెప్పిన గాథలో
అజామీళునికి నరకము తప్పదు

అని నమ్మితిని – అంతటిలోన
అంతా – తారు మారుయైనది
అందని లోకము అందెనతనికి
ఆశ్చర్యమగు హరిలీలయది.

అదిసరిగాని యముని దూతలు
అందించిన ఆ సమాచారమున
ఆ సమవర్తి కినుక వహించడ!
ఆతడు ఎటుల సమాధానపడె

చక్కని ప్రశ్నను వేసితివీవు
అనుచు పలికెను శుకయోగీంద్రుడు
రాజా! యమకింకరులపుడు ప్రభువుకు
తమపరాభవము తెలియబరచిరి

"ఓ యమరాజా! నీశాసనము
ధిక్కరించుట జరుగదుకాదా!
దండధరుడవు – నీపని నీవు
చేయుట జరుగక పోయినదయ్యా!

జగముల జీవుల కర్మఫలములను
అనుభవించగ జేతువు నీవు
నీనిర్ణయము కాదనువారు
కనరారయ్యా! ఓ యమరాజా!

నీశాసనమును ధిక్కరించగా
దివ్యపురుషులను పంపినదెవరు
ఆమహనీయుడు నిన్నుమించెనా!
నిన్నే ఆతడు కాదనగలడా!

యమపాశములు పుటుక్కుమనునటు
త్రెంపినవీరులు ఎవ్వరు స్వామీ!
అంతటివారు మనుజలోకమున
కలరని తెలియదు మహానుభావా!

వారు మమ్ములను శాసించిరయా!
జీవిని వదలగ నాజ్ఞాపించిరి
వారి చూపులకు వణకి పోతిమి
వారి త్రోపుకు నేలబడితిమి.

నిన్నుమించిన వేలుపు గలడా
నీశాసనము కాలదన్నునా!
ఎంతటివాడు ఆమహనీయుడు
వివరించుమయా! అనుచుఅడిగిరి

అంతట యముడు మదిలోపొంగెను
శ్రీహరిపదములు హృదిలోతలచెను
పరమభక్తితో వందనమిడుకొని
తన కింకరులకు తెలియజెప్పెను

కింకరులారా నా శాసనమది
చెల్లలేదని - అవమానమని
మదిలొ తలచుట మానివేయుడు
మీరుచూచిన వారసమాన్యులు

వారిదర్శనము అలభ్యమైనది
మీకాభాగ్యము కలిగెను నేడు
వారిప్రభువు అతి ప్రధానవ్యక్తి
నాకును ఆతడు - ప్రభువగు వినుడు!

ఆమహరాజు విశ్వనేతయగు
తానే విశ్వము - విశ్వమె తాను
కావునాయన విశ్వనాధుడు
సర్వజీవులను నడుపును ఆతడు

విషయము వినుడు నేను నిత్యము
పూజించెడిది - ఆపుణ్యాత్ముని
అయన దయయే ఈ అధికారము
సర్వజగత్తు ఆయన లీల

లయకారకుడు - సృష్టికర్తయు
అపుణ్యాత్ముడు - తెలియుడుమీరు
ఆయన నామ స్మరణ చేసిన
కర్మబంధముల విముక్తులగుదురు.

పంచభూతములు రుద్రగణములు
దిక్పాలకులు మునులు సిద్ధులు
అమహనీయుని దివ్యమూర్తిని
దర్శించగను సాధ్యముకానిది.

సత్వగుణమది చూపునాయనను
సాత్విక గుణసంపన్నులు యిష్టులు
సర్వజగత్తుకు మూలము అతడే!
సర్వమునిండిన సర్వేశ్వరుడు

అనంతవిశ్వము నిండినవానిని
చర్మచక్షువులు చూడగలేవు
కర్మబంధముల త్రెంచునాయన
శ్రీహరిదూతలు అంతటివారు

దివ్యతేజముతొ విరాజిల్లెడు
హరిసేవకుల చూచిరి మీరు
విష్ణుసమముగా వారిని అందరు
మన్నించెదరు గౌరవించెదరు

మీవల్లను మరి నావల్లను తన
విష్ణుభక్తులకు కలిగెడికష్టము
తొలగించుటది దూతల పనియగు
వారికి అదియే నిత్యకృత్యము

కింకరులారా! వారుచెప్పిన
ధర్మసూక్ష్మము తెలియుటకష్టము
కనబడినట్టే కనబడు మనకు
అందనియట్టి అనంతమైనది

## షష్ఠమస్కంధము

విరించి, శివుడు, స్కందుడు మరియు
కపిల, నారద, భీష్మ మనువులు
బలి, జనక, ప్రహ్లాద శుకులకు
వ్యాసులవారికి కొంత తెలియును

పరమరహస్యము పరిశుద్ధమది
అగమ్యగోచర మన్నటు తోచును
భక్తియోగులకు - చేరువ శ్రీహరి
అన్యులాయనను చేరగలేరు

మహాపాపియగు అజామీళుడు
విష్ణునామము జపించగానే
మీపాశములవి విడిపోయినవి
నామోచ్చారణ బలము తెలిసెగద!

హరికీర్తనమును మించినశక్తి
లేదని మనకు తెలియుచున్నది
మృత్యుపాశమును త్రెంచగచాలిన
మంత్రసమానము హరినామమ్ముగు

మనుజులు దానిని తెలియగ లేరు
కృష్ణదేవుని నామ జపమది
భవబంధమ్ముల త్రెంపగ చాలును
ముక్తిపథమును చేర్చగ చాలును

ఏలోకములో ఎవ్వరుకూడా
చేయనియట్టి అకృత్యములు
ఆచరించిన అజామీళుడు
నరకబాధలను తప్పించుకొనె

అవివేకముతో జనులందరును
రాజమార్గమును అవలంబించక
అష్టకష్టముల పాలగుదురుకద!
వారికర్మలకు వారే కర్తలు.

పశ్చాత్తాపము నిండిన వారై
బుద్ధిమంతులై మనెడివారును
హరిభక్తులును దేవవంద్యులు
వారిజోలికి - పోవల దింక

శంఖచక్రములు గదాఖడ్గములు
ధరించినట్టి హరి కింకరులు
వారిని సతతము రక్షించెదరు
వారి వద్దకు మీరు చేరకుడు!

వాసుదేవుని భక్తుల విషయము
తెలిపెద వినుడు కింకరులారా!
వేదవేదాంతముల సారమునెరిగి
హరియే సర్వము అని కీర్తింతురు

సర్వలోకముల స్వేచ్ఛగ తిరిగే
సనకాదులను పోలినయట్టి
హరిధ్యానమది వారిసొత్తగు
ఆధ్యానముతో పరవశింతురు

హరిభక్తులు మరి వున్నతావుల
ఎట్టిపాపములు చేరవు వినుడు
ఐహికసుఖములు తృణముగనెంచి
శాశ్వతసుఖముకు తపనపడెదరు

హరినామోచ్చారణచేయని
కలలోనైనా హరినితలంచని
దేవాలయమున అడుగుబెట్టని
అధములు మీకు దొరుకుచుందురు

హేళనతోను హరిని కాదను
హీనుడు మీకు దొరకును వినుడు -
హరిభక్తులను ఈసడించెడి
ధూర్తుల - వదలక ఈడ్చుకురండి.

పాపకూపమగు సంసారమ్మది
పరమ గమ్యమని తలంచు వారు
దానిని తరించు మార్గముగానని
అంధుల - మీరు బంధించండి

మోక్షమ్మును మరి ఈసడించుచు
కాంతా కనకపు మోహములో బడి
సాధు సంతులను అలక్ష్యపరచే
అయోగ్యులను-నా ముందుకు తెండి.

హరి కథలను విని హరిని తలంచుచు
నిండుభక్తితో కొలిచెడివారిని
వారి హితులను స్నేహితులను
చేరగమీరు సాహసించకుడు"

అనుచు యముడు తన కింకరులకును
తిరిగిచెప్పెను హరి మహత్త్వము
"పాపారణ్యము కాల్చెడి అగ్ని
సంసారజలధిని దాటించునది

అప్రమేయమగు హరిపరాక్రమము
హరిలీలలను కీర్తనచేసిన
ఎట్టిరోగములు దరికి చేరవు
నరకబాధలు కలుగవు వానికి

ముక్తిపథమును అందుకొనుటకు
దివ్యమైన సోపానము భక్తి
విష్ణుపాదములు హృదిలోనిలపి
కైంకర్యమగు భక్తులు ధన్యులు"

అనుచు వివరములు ఆ సమవర్తి -
తనకింకరులకు హరినిగురించి -
హరికీర్తన మరి హరిభక్తులన
తెలియజెప్పగా - హరికి మ్రొక్కిరి.

విష్ణుతత్త్వమును విపులమ్ముగను
అగస్త్య మహర్షి నాకు చెప్పెను
దానిని చెప్పితి ఓ మహారాజా!
అనగా రాజు పరవశించెను.

శుకయోగీంద్రా! హరిమహాత్మ్యము
వివరించితివి - ధన్యుడనైతిని
అజామీళునికి నరకముతప్పదు
అనుకొంటిని మరి హరి దాటించెను.

స్వాయంభువ మనువు కాలమును
సురాసురులు ఎటు సృజించబడిరి
వివరముగా మరి తెలుపుడుస్వామీ!
అనగా శుకుడు ఆరంభించెను.

ప్రాచీనబర్హి తనయులువారు
ప్రాచేతనులు అనెడి వారట
సంద్రమునుండి బయటకువచ్చి
నలువంకలను భూమినిచూచిరి.

చీకటిమయమై చెట్లు చేమలతో
నిండినభూమిలో సృష్టిజరుగుటెటు
అనుచు - క్రోధము నిండిపోవగా
ముఖములనుండి అగ్నివెలువడెను

పెల్లుబికిన ఆ అగ్నివెంబడి
నిట్టూర్పులవి పెనుగాలైనవి
అగ్ని, వాయువు రెండూ కలసి
దగ్ధముచేసెను వృక్షసంపదను

అంతట - చంద్రుడు - ఓషధికర్త
వారిని మృదువుగ శాంతపరచెను
తేజోవంతము అగు హరి తత్త్వము
ధ్యాన సమాధిలో గాంచిన మిమ్ముల

సృష్టిచేయగా ఈశ్వరుడంపెను
దానినివదలి ఈఓషధులను
దగ్ధము చేయుట తగదుసుమా మరి
ప్రభుసంకల్పము నెరవేరదుకద!

పూవులు లేకనె కాయలు కాచే
రావి - మేడి - మొదలగుచెట్లను
ఓషధులను శ్రీహరి సృజించెను
వాటినుండి - మరి భక్తినేర్పరచె

పాదచారులు జీవులన్నిటికి
ఆహారమును హరి సృజియించెను
దానిని మీరు ధ్వంసముచేయుట
సరిగాదుసుమా ఆలోచించుడు

పాపరహితులు ప్రజాసృష్టిని
చేయవలసిన వారలు మీరు
కినుక వహించి దహించ - ధర్మమ?
ఓషధులవ్వి అంతరించు కద!

ఈశ్వరు ఆదేశమ్మును మీరు
నిర్లక్ష్యమ్మును చేయగ తగునా!
పూర్వస్మృతిని మరి పొందుడుమీరు
మీతాత తండ్రులు కోపదూరులు

తన కోపమె - తన శత్రువు కాదా!
ప్రజలకు రాజు - అతివకు భర్త
సంతానముకు తల్లిదండ్రులు
యాచకులకు మరి గృహస్థు అండ

ఆర్తులను మరి ఆదుకొననిచో
బంధువుగా ను చెప్పగతగదు
సర్వజీవులు హరి అంశములే
హరిని చూడవలె అంతరాత్మలో

అట్టిహరిని మరి దర్శించితిరి
కోపము నాపి మిగిలినవాటిని
దగ్ధము కాకను చూడండిపుడు -
మరియొక ప్రార్థన వినుడు శాంతముగ

నాతో వచ్చిన ఈ సుకుమారి
మారిష - అనెడి పేరున బరగెడి
1 వృక్ష సముద్భవ - అచ్చరకన్య
పిల్లను పెంచితి అమృత ధారల

ఈమెనుమీరు ఆలిగ గొనుడు
అనుచు పలికి చనె - శశాంకుడంత
ప్రచేతనులు శాంతినందిరి
'మారిష' నంతట భార్యగనెంచిరి.

మారిష గర్భము ఫలించి రాజా!
దక్షుని గన్నది - ఆయన వలన
మానసిక తపో ప్రజా సృష్టిగా
సృష్టియంతయు జరిగెను-వింటివ!

ఖేచర - భూచర రాత్రించరులు
దక్షుని సృష్టికి చెందినవారే
జలచర వనచర భూతకోటియది
దక్షప్రజాపతి సృష్టియేనయా!

నరులు - కిన్నెర - కింపురుషలును
సుర గంధర్వులు యక్షులు పక్షులు
గిరులు - తరువులు-మొదలగునట్టి
స్థావర జంగమ సృష్టి దక్షునిది.

అనంత సృష్టిని చేసిన దక్షుడు
తృష్తినందక - మగ సంతతికై
విష్ణుప్రీతిగా తపస్సుచేయగ
వింధ్యపర్వత ప్రాంతముచనెను

అచ్చట దక్షుడు - అఘమర్షణ
అనెడి - తీర్థమును ఆశ్రయించుకొని
యజ్ఞమ్ములను నిర్వహించి తా
కఠోర తపమును ఆచరించెను.

తపముకు మెచ్చి హరి దర్శనమిడ
'హంసగుహ్యం' అనుస్తోత్రముతో
హరిని సుతించెను అది వినురాజా!
సర్వోత్తమునకు వందనమిదిగో!

"గుణబంధముల తత్త్వమునెరుగని
మనుజుల కందని దివ్యధామమున
జీవుని మాయను నడిపించుచును
నెలకొనియున్నహరికి ప్రణామము!

ఆదిపురుషునకు ముక్తిధామునకు
మోహము లేక అన్నిజీవులలో
ఆత్మగ వెలుగు పరంధామునకు
శిరసునువంచి ప్రణామమిదిగో!

దేహము ప్రాణము ఇంద్రియాలను
అంతఃకరణలు పంచభూతములు
తెలియుటసాధ్యము కాదు కావున
వాటిలో వుండక వాటిని నడిపే

సర్వేశ్వరునికి అంజలి యిదిగో
నామరూపముల ఉనికిని - చెప్పే
మనస్సు-చూపు-స్మృతిని దాటుకొని
జ్ఞాన స్వరూపముగా దర్శనమిడు

శుద్ధస్వరూపము మూలపురుషునకు
శిరసునువంచి ప్రణామ మిదిగో!
గూఢముగా ఈ మనస్సులొ నున్న
పరమపురుషుని దర్శించుటకు -

జ్ఞానులు అనేక ఉపాధులతో
విరాడ్రూపును దర్శించెదరు
మాయను త్రుంచే మహాత్మునకును
మనసునిండుగా వందనమిదిగో!

మనసుకు మాటకు ఇంద్రియాలకు
బుద్ధికిసైతము ఊహకందక
వెలిగెడియట్టి రూప, గుణ, రహితుని
సృష్టి స్థితిలయ కారకుడైన

అన్నీతానై - దేనిలొనుండక
సర్వవ్యాపకుడు అనాదియైన
శాశ్వతమైన పరబ్రహ్మను
ప్రసన్నుడవగా అర్థించితిని -

ఎవరికితోచిన గుణములు వారు
అంతులేనటు చెప్పకుందురు
కానీ వారి ఊహలకందక వర్ణనకందక
వెలిగెడి శుభకరమూర్తికి జోతలు!

పరస్పర విరుద్ధమైన వాదనల
శాస్త్రమ్ములకు - సాంఖ్య యోగముకు
సమమున కనబడు కరుణామూర్తికి
తిరిగి తిరిగి నా వందనమిదిగో

నామరూపములు లేనివాడును
భక్తులకొరకే వాటిని దాల్చి
పుణ్యవర్తనుల మదిలోనుండెడి
మంగళమ్ముల నెలవుకు ప్రణతులు!

వాయువు మాదిరి విశ్వమునందు
సంచరించెడి విరాడ్రూపుడు
నాకుప్రసన్నుడు కావలె నిపుడు
నాదు కోర్కెలు సఫలము కావలె

అటుల దక్షుడు స్తోత్రముచేయగ
భక్త వరదుడు - తృప్తినందెను
దర్శనమ్మును ఒసగె భక్తునికి
అండజమ్ముపై అగబడె నపుడు

మేరుగిరివలె నున్న గరుడుని
వీపుపైన మరి అష్టభుజముల
ఆయుధాలతో నీలిమేఘమన
నేలకుదిగెను - దర్శనమిడెను

పీతాంబరము వనమాలతొ మరి
వైజయంతము వెలుగుచుండెను
మణికుండలములు రత్నకిరీటము
బాహుపురులతో మంజీరాలతొ

త్రిపుండ్రమ్ములు వెలుగుచుండగా
చిరునగవులవి వెన్నెల జల్లుగ
నారదాది ముని ముఖ్యులు కొలువగ
జగన్మోహనుడు దర్శనమిడెను

మహావిష్ణువును ముందర గాంచి
మాటలు రాక సంభ్రమమ్ముతో
దక్షప్రజాపతి పరవశించెను
అంతులేని అనుభూతినందెను.

ఆనందముతో పులకరించెను
మాటలురాక తడబడిపోయెను
తెరచిన కన్నులు ముడిచిన కరముల
అచేతనముగా నిలబడె దక్షుడు

అన్నీతెలసిన పరంధామునికి
మదిలోకోరిక తెలియనిదా మరి
"ప్రచేతసా – నీ తపముకుమెచ్చితి
అనన్యమైన తపముచేసితివి

తపోదీక్షను విడువుము నీవు
సృష్టి నీవలన ఉన్నతమగును
విరించి – శివుడు ప్రజాపతులును
మనువులు మరియు సర్వభూతములు

అభివృద్ధికి వారందరు తోడగు
నాకళలే – వారందరు దక్షా!
యమ నియమాదుల సంధ్యావందన
తపస్సు–నాదగు హృదయముఅగును

ధ్యానము – దానితొ చేయుపనులవి
నాశరీరము – నా ఆకారము –
యజ్ఞము నాదగు అవయవమ్ములు
ధర్మము – ఆత్మ–సురలు ప్రాణమగు

వేదము – నాదగు స్వరూపమయ్యా!
జగత్తు – పుట్టుక ముందువుందును
నిద్రావస్థలొ లీనముకాగా
సంజ్ఞామాత్రుడ అవ్యక్తుడను.

అనంతుడను నే – మాయను సృజించి
అనంతగుణములు కల్పించితిని
గుణసంయోగములో బ్రహ్మాండము
సృజించబడెను – బ్రహ్మపుట్టెను

తొలుత బ్రహ్మ తా సృజించమొదలిడ
జరుగకపోయెను సృష్టిఅన్నది
అంతట నేను తపముచేయమన
తపస్సుచేసి సృష్టి మొదలిడె

అదిసరి గాని ఆ కన్యను గను
పంచజన ప్రజాపతి కూతురుఅగును
అసిక్ని – ఆమెను పరిణయమాడి
గార్హస్థజీవితము సాగించవయా!

సత్సంతానము కలుగును నీకు
వారుకూడ మరి గృహస్థులయ్యి
గృహస్థాశ్రమధర్మము పెరుగును
వారందరు నా భక్తులగుదురు"

అనుచు పలికి హరి అదృశ్యమయ్యెను
నిండుజవ్వని ముందు నిలచెను
హరి మాటలను వినినవారట
గాఢాలింగన సుఖమునందిరి

కొంతకాలముకు పదివేలమంది
కుమారులంతట ఉద్భవించిరి
వారిని హర్యశ్వులందురు రాజా!
పరమానందము నందెను దక్షుడు.

అంతట దక్షుడు యోగ్యులుఅయిన
తనయులపిలచి హరి పరముగను
తపముచేయగా ఆదేశించెను
సృష్టిచేయవలె అనుచు చెప్పెను.

అంతటవారు పడమటిదిక్కున
సింధు సముద్ర సంగమమ్మున
పావన సరస్సు - నారాయణ సరస్సు
దానినిగాంచి నమస్కరించిరి

ఆసరస్సున స్నానముచేసి
తపముచేసిన ముక్తిసులభమగు
సరస్సుపైన వీచెడిగాలికి
పాపములన్నీ హరించబడును

నిశ్చలమతులై తపములోనుండగ
నారదమహర్షి వచ్చెనచ్చటికి
వారిలో ఒకరిని విషయముఅడెగెను
అందరు - కళ్లను తెరచి చూచిరి

నారాయణ ధ్యానమ్మునన్నున్న
నారదుడనెను వారినిగాంచి
నవ్వుచు పలికెను మీనాయన మరి
నిజముగ మీకు శ్రమకలిగించెను

భక్తిగ అడిగిరి వారందరును
స్వామీ ఎవ్వరు తెలుపుడు అనగా
నారదుడందురు అనగానే మరి
మరింత భక్తిగ వందనమిడిరి.

స్వామీ మీరు ధర్మకోవిదులు
నాయనగారు చెప్పిరి మాకు -
అనగావారితొ పలికెనారదుడు
ధర్మబోధను చేసెద మీకు

మీరు ఇంకను పసివారు కద
భూమి పూర్తిగా తెలియదుమీకు
మీరు ప్రజలను సృష్టించుటది
వృధాప్రయాస యని తెలియుచున్నది.

నాయన మాట కాదనలేక
అష్టకష్టముల కోర్చియిచ్చటకు
వచ్చిపడితిరి - వినుడు తిన్నగా
బలరూపమగు రాష్ట్రమొక్కటి

కత్తులతోను వజ్రముతోను
నిర్మించినట్టుగా వున్నది రాష్ట్రము
అందులోగలడొక మహాపురుషుడు
బహురూపమ్ములు గల ఒక స్త్రీ

ఆ స్త్రీ - కులట - ఆ రాష్ట్రముకు
రెండువైపులా నది పారునట
అందులొ కలదొక రాజహంసము
దానికి ఇరువది ఐదుతత్వములు

ఆ తత్వమును తెలియని మూర్ఖులు
దానిని తెలియక తపములుచేయుట
వృథాప్రయాస అన్నది తెలియుడు
అనుచు నిగూఢముగ తత్వముచెప్పెను.

తిరిగిప్రవాహమునందున పడిన
జనన మరణ వలయమ్ములొ పడును
దానితొ – మోక్షము అసంభవమ్ము
ఆనందధామము జేరుట జరగదు.

హర్యశ్వులంతట అందలితత్వము
ఆకళించుకొని రంతటవారు
మహాపురుషుడు క్షేత్రజ్ఞుడుగా
అజ్ఞానబంధమున ఉన్నజీవుడు

కులటయగు భార్యతోడను
సంసారమ్మును చేయుచున్నటు
బుద్ధికిలొంగిన వాని మనుగడ
అస్వతంత్రమై విల విల లాడును

మహాత్ముడైన ఆత్మయన్నది
అజ్ఞానమునకు లొంగనిదగును
ఆత్మజ్ఞానము కొరవడినట్టి
కర్మలన్నియు కొరగానివగు

అటుల జీవుడు సంసారవలయమున
తిరుగుచున్నచో బంధమోచనము
జరుగుటన్నది గాలిమాటయగు
వ్రత నియమాదులు వృధాయేయగు

పురుషుడు బిలద్వారముచేరిన
తిరిగివచ్చుటది జరుగదు యింక
అట్టిపరబ్రహ్మను తెలియక
స్వర్గభోగములు అందుటవ్యర్థము

పంచవింశతి తత్వాలతొ నున్న
పదార్థమ్మును తెలియగవలెను
బంధవిముక్తితొ ఈశ్వరులీలల
తెలియకపోయిన ఫలమదిశూన్యము

బ్రహ్మనిష్ఠ అది ఒక్కటి మాత్రము
సన్మార్గమునకు త్రోవచూపును
బుద్ధి – మనుజుని ఆడించుచును
దానిప్రతాపము చూపించునది.

అట్టి విభూతిని తెలియకపోయిన
యజ్ఞయాగముల ఫలితము లేదు
నివృత్తిమార్గము ఆలోచించక
గుణముల లొంగిన అశక్తుడగును.

సృష్టి – ఆగని ప్రవాహమగును
గట్టుకుచేరగ తలంచినపుడు
ముందుగ మాయను జయించవలెను
మాయకు–అహము కలిసిన–దుర్గతి

నారదుపలుకుల సారము నెరిగి
ప్రదక్షిణించి నమస్కరించి
హరిసేవా నిరతులాయిరి
దివ్యధామము చేరిరి వారు.

తనయులసంగతి తెలియకపోయి
తల్లడిల్లెడి దక్షునిగాంచి
నారదమహర్షి దక్షతనయులు
విష్ణుపదముల చేరుట తెలిపెను.

దక్షుడు – వేదన భరించలేక
హరి వరమది వ్యర్థమైనదని
సృష్టి జరగకపోయిన దనుచు
దుఃఖిలుచుండగ విరించివచ్చెను.

వాణీనాథా! తెలియును నీకు
హరి తనుగా తను వరమునిచ్చెను
తపముచేయగ వారికిచెప్పితి
వారు చేరిరట కైవల్యమ్ము

కొడుకుల స్థితికి సంతోషించన!
సృష్టి ఆగెనని – విచారించన!
అంతట బ్రహ్మ అనునయించెను
తిరిగి కొడుకులను బడయగచెప్పెను

అసిక్ని యందు దక్షుడంతట
వేలకొలదిగా పుత్రులగనెను
కబళాశ్వులని పేరుపెట్టెను
తపముచేయగా చెప్పెనువారికి

సృష్టిచేయుటకు తపోశక్తియది
అతిముఖ్యమని పంపెను తపముకు
వారుకూడ ఆ సరస్సువద్ద
అన్నలమాదిరి తపముచేసిరి

తీవ్రతపస్సును చేయసాగిరి
ఒంటికాలిపై నిలబడివారు
వాయుభక్షణతొ సూర్యునిముందు
నిలబడి చేసిరి ఘోర తపస్సు

కొంతకాలముకు వాయుబంధనతొ
కొనసాగించిరి వారి తపస్సు
దేవతలందరు తల్లడిల్లిరి
జగము భస్మమగు ననుచు తలంచిరి

అంతట తిరిగి నారదమహర్షి
వారివద్దకు వచ్చి వారికి
నివృత్తిమార్గము నుపదేశించెద
అనుచు చెప్పెను కంబళాశ్వులకు

మీఅన్నలకు మార్గముచూపితి
వారుసాగిరి దివ్యధామముకు
అన్నలపైన అభిమానమున్నచో
మీరును చేరుడు హరిపదములను

శమ దమాదులను జయించి చేసిన
తపస్సువల్ల ఫలితములేదు
హరినామముతో మరి అనుగ్రహమ్ముతొ
దేవతలై మరి భాసిల్లెదరు

వారటు చేయగ దక్షుడు తెలిసి
దుఃఖిలుచుండగ బ్రహ్మవచ్చెను
ఊరడించెను సృష్టిచేయగ
గార్హస్త్యమును స్వీకరించమనె

అంతట అసిక్నికి అరవైమంది
తనయలు పుట్టిరి వారందరిలో
పదిమందిని మరి ధర్మునకిడెను
కశ్యపునకు పదముగ్గురి నొసగెను

చంద్రునికంతట ఇరువదిఏడు
అంగీరస కృశాశుల కిద్దరిద్దరు
భూతున కిద్దర నిచ్చి - మిగిలిన
నలుగురిని మరి తార్క్ష్యునికిచ్చెను

ధర్మునిభార్యల పేర్లు వినుమయా!
భానువు, లంబ కకుప్ప - జామి
విశ్వ - సాధ్య మరుత్వతి వసువు
ముహూర్త-సంకల్ప-పదిమందయ్యా!

వారిసంతతి వినుమహారాజా!
భానువునకు మరి వేద - ఋషబుడు
అతని తనయుడు ఇంద్రసేనుడు
లంబ కుమారుడు - విద్యోతుడయా!

విద్యోతుని సుతుడు స్తనయిత్నువు
కకుబ్దేవి సుతుడు సంకుటుండగు
అతనికి తనయుడు కిటకుండయా!
కిటకు తనయలు దేవతలైరి.

జామిదేవికి పుట్టినవారు
దుర్గభూముల కధిష్టాన దేవతలు
వారితనయులు స్వర్గుడు - నంది
విశ్వేసురలు - విశ్వసంతతి

విశ్వేసురలకు సంతతిలేదు
సాధ్యగణమది సాధ్యసంతతి
వారితనయుడు అర్థసిద్ధియగు
మరుత్వతు జయంతులు మరుత్వతి సంతతి

వాసుదేవుని అంశతొ పుట్టిన
జయంతుడాతడు ఉపేంద్రుడాయెను
మౌహర్తికులు ముహూర్త సంతతి
వారివల్లనే శుభా శుభములగు.

సంకల్ప సుతుడు సంకల్పుండు
వానికి తనయుడు - కాముడు రాజా!
వసుదేవికి మరి ఎనిమిదిమంది
ద్రోణుడు, ప్రాణుడు, ధ్రువుడు, అర్కుడు

అగ్ని - దోషుడు - వసు - విభావసులు
వారేరాజా! అష్టవసువులు
ద్రోణున కంతట అభిమతియందు
హర్ష - శోక - భయాదులు పుట్టెను

ప్రాణుని భార్య పూర్జస్వతియగు
సహుడు, ఆయువు, పురోజవుండు
ప్రాణుని సంతతి - ఓ మహరాజా!
ధ్రువుని భార్య మరి ధరణి అగునయా

ధ్రువుని సంతతి పురులనువారు
అర్కు - భార్య - వాసన - యగును
వారిసంతతి తర్షాదులయా!
అగ్నికి - వసోర్ధార - భార్యయందున

ద్రవిణకాదులు ఉద్భవించిరి
అగ్నివలన మరి కృత్తికలకును
స్కందుడు పుట్టెను ఓ నరపాలా!
స్కందుని సంతతి విశాఖాదులు

దోషుని భార్య శర్వరి యందు
హరి కళతో - శింశుమారుడుపుట్టెను
వసువునకు మరి అంగిరసందు
విశ్వకర్మ అను తనయుడు పుట్టెను

విశ్వకర్మకు ఆకృతి - యందు
చాక్షుషుండను తనయుడు పుట్టెను
మనువులలోన అతడొక డయ్యెను
వానికాలము చాక్షుష కాలము

చాక్షుష మనువుకు విశ్వులు, సాధ్యులు
విభావసునకు ఉషయను భార్యతో
వ్యుష్టి - రోచి - అతపుడు పుట్టిరి
అతపుని తనయుడు పంచయాముడు

పంచయాముడు దినముకు దేవత
భూతుడు పుట్టెను శంకరు అంశతో
దక్షుడు - ఇద్దరు తనయల నంత
భూతునకిచ్చి పెండ్లిచేసెను

భూతునకు మరి సురూపయందు
కోట్లకొలదిగా రుద్రగణమ్ములు
ఉద్భవించిరి - ఓమహరాజా!
గుద్రగణముల - రైవతుండును.

అజుడు-భవుడు-భీముడు - వాముడు
ఉగ్రుడు - వృషాకపి అజైకపాదుడు
అహిర్బుధ్న్యుండు - బహురూపుండు
మహామంతుడు - మొదలగువారును

వారితోపాటు రుద్రానుచరులు
భయంకరమ్మగు ప్రేతగణములు
వినాయకులును ఉద్భవించిరి
అటులసృష్టి మరి జరుగుచున్నది.

అంగిరసుండను ప్రజాపతికి మరి
స్వధ యందున పితృగణములు
సతి యందున మరి అధర్వవేద
అభిమానులగు - సురలు పుట్టిరి

కృశాశ్వునికి అర్చి వలనను
ధూమ్రకేతుడను తనయుడు పుట్టెను
వేదశిరునకు - ధిషణయందున
దేవలు - వయన - మనువులుపుట్టిరి.

పతంగి సంతతి - పక్షులుఅగును
యామిని సంతతి శలభములగును
వినతకు కొడుకులు గరుడ అనూరులు
కద్రువసంతతి వివిధ నాగులు

వారందరును తార్క్ష్యుని సంతతి
దక్షప్రజాపతి తన తనయలలో
ఇరువదిఏడు సంఖ్యలోవారిని
చంద్రునికిచ్చెను వింటివరాజా!

చంద్రుడు - వారిలో రోహిణియందు
అధిక ప్రేమను చూపుచుండగా
ఆగ్రహించిన దక్షప్రజాపతి
క్షయరోగి గను కమ్మని శపించె -

ఆవిధముగను చంద్రుడు తాను
నిస్సంతు అయ్యెను రాజవరేణ్యా!
అంతటదక్షుడు అనుగ్రహించగ
షోడశ కళలతొ వెలిగె చంద్రుడు

కశ్యపుసంతతి విను మహరాజా!
పదముగ్గురు కాంతలు-వారి వివరము
తిమి సంతతి మరి జలచరములగు
సరమ సంతతి క్రూరమృగమ్ములు, పులులు

సురభి సంతతి ఆలమందలు
తామ్రసంతతి - డేగలు గ్రద్దలు
మునికి పుట్టిరి - అచ్చరలందరు
ఇళసంతానము వృక్షాదులగు

సురస సంతతి రాక్షసులగుదురు
క్రోధవశకు మరి క్రూరసర్పములు
అరిష్ట సంతతి గంధర్వులగు
దనువు సంతతి దానవులైరి.

ఆ దానవులు పదునెనిమిదిగా
ద్విమూర్ధ-శంబర-అరిష్ట-హయగ్రీవులు
విభాసు అయోముఖ, శంకు శిరుడును
స్వర్భానువు-కపిల, అరుణి-పులోముడు

వృషపర్వుడును - ఏకచక్రుడు
అనుతాపకు ధూమ్రకేశు విరూపాక్షుడు
దుర్జయు విప్రచిత్తి లనువారయ్యా!
అమితబలాఢ్యులు వారందరును

వీరిలో స్వర్భాను కూతురు పేరు
సప్రభ - ఆమె - నముచికి భార్య
వృషపర్వుని తనయ శర్మిష్ఠయగు
యయాతి ఆమెకు భర్తయగునయా!

దనువు పుత్రులలొ వైశ్వానరునకు
తనయలు నలుగురు ఓమహరాజా!
వారిలొ - కన్య - ఉపదానవిని
హిరణ్యాక్షునికి - పెండ్లిచేసిరి

మరియొక కూతురు హయశిరసను
క్రతవనువాడు - పెండ్లియాడెను
పులోమ - కాలక అనుయిద్దరినీ
బ్రహ్మమాటపై పెండ్లాడె - కశ్యపుడు.

వారికి పుట్టిన సంతతివారే
పౌలోమ - కాలకేయులు - ఓనరపాలా!
అజేయులగు వారిద్దరికిని
అరవైవేల అసురులు పుట్టిరి.

లోకకంటకులు వారందరినీ
జూచి భయపడిరి సురలందరును
మీ తాత - అర్జునుడు ఇంద్రాణికోరగా
నాకలోకమున - చంపెనువారిని.

ప్రవిచిత్తతాను సింహకయందు
రాహువుమొదలుగ కేతువు వరకు
నూరుమందిని పుత్రుల బడసెను
వారందరును గ్రహములాయిరి.

కశ్యపుభార్యల - అదితి - పుణ్యవతి
కులకాంతలలో మేలుబంతియగు
ఆమెగర్భమున హరియేపుట్టెను
ఆమెయందున వివస్వంతుడు

ఆర్యముడు పూషుడు త్వష్ట భగులును
పవిత - ధాత - విధాత మరియు
మిత్రుడు వరుణుడు శక్రు ఉరుక్రములు
పన్నెండు మంది మరి ఉద్భవించిరి

వివస్వంతునకు సంజ్ఞయందున
శ్రాద్ధదేవుడు-అయిన మనువుపుట్టెను
అటుపిమ్మటను యముడు యమి యను
జంట పుట్టెను - వింటివ రాజా!

అనంతరమ్ము సంజ్ఞాదేవి - తా -
ఆడుగుఱ్ఱము రూపముతోను
అశ్విని సురలను గన్నదిరాజా!
వివస్వంతునికి రెండవభార్య

ఛాయ యందున - శని-సావర్ణులు
తపతియను తనయ కలిగెను
సంవరణుండు తపతినిచేకొని
సావర్ణిమనువుల - ఒకడైనాడు

ఆర్యము భార్య మాతృక యగును
వారిసంతతి - చర్షణులగుదురు
లోకుల పాపపుణ్యము లెరిగెడి
మేధావులుగా చర్షణులాయిరి

చర్షణులవలన - ఓమహరాజా!
స్థిరముగ మానవజాతి యుండునటు
బ్రహ్మదేవుడు నిర్ణయించెను
పూషుడు - పండ్లను పొగొట్టుకొనె

దక్షయజ్ఞమున - పూషుని పండ్లు
రాలిపోయిన విషయము తెలిపితి
పిండిపదార్థము లాతడు తినును
అతనికి - సంతతి లేదు నరేశా!

త్వష్ట భార్యను రచన అందురు
దైత్యుల కామె సోదరి యగును
ఆమె తనయుడు విశ్వరూపుడు
అమోఘమైన బలవిక్రముడు

బృహస్పతి తా కోపముతోను
సురలను విడువగ - విశ్వరూపుని
వైరుల - మేనల్లుడు అయినను
ఆచార్యునిగా సురలు ఎంచిరి

అంతట అడిగెను రాజవరేణ్యుడు!
మౌనీ! ఎందుకు దేవగురుండు
సురలను వదలెను వివరములేమి!
విశ్వరూపుడు మేలుచేసెనా?

వినుమని చెప్పెను శుకయోగీంద్రుడు
ఇంద్రుడు గర్వ మదాంధుడయ్యెను
నాకలోకపతి నని గర్వించెను
ఉచితా నుచితములన్నవి మరచెను

ఒక దినమున తన సుధర్మఅనెడి
దివ్యసభలొ అట కనక పీఠిని
అధిష్టించెను మిగిలినవారు
ఉచితాసనముల కూర్చొనినారు

రుద్రగణములు - ఆదిత్యులును
మరుత్తులు మరి అశ్వినీయులు
సిద్ధచారణ ముని గంధర్వ - కిన్నర
కింపురుషులును కూర్చొనియుండిరి

నవరత్నఖచితమగు సింహాసనమున
భార్యతొ ఇంద్రుడు కూర్చొనినాడు
ఏలిక నన్న - దర్పమంతయు
ముఖమునుండి అట వొలుకుచున్నది

దివ్యచ్ఛత్రము వెలుగుచుండగా
వింజామరలు వీచు చుండగా
సౌందర్యరాశి - రంభ అచ్చట
అపూర్వనృత్యము సలుపుచుండగా -

ఉల్లాసమది పెల్లుబికి అట
చిరునవ్వులను వొలికించుచును
సభ్యులముఖములు వెలుగుచుండెను
ఇంద్రుడు - తననే తాను మరచెను

ఆసమయములో ఆ సభలోనికి
దేవగురుండు అడుగు బెట్టెను
దేవనాథుడు గౌరవించక
ఆహ్వానమది పలుకుట మరచెను

అడుగులువేసి ముందు నిలచిన
బృహస్పతిని మరి గాంచియు కూడ
గౌరవించక - గద్దె దిగకను
నృత్య గానముల మునిగిపోయెను.

అవమానమ్మది నిండుసభలోన
జరిగినదంత - దేవగురువుకు -
నిలబడలేక - తనగృహమునకు
ఆవేశముతో తిరిగిపోయెను

అంతదూరమున - వెడలిపోయెడి
గురువునుగాంచెను - శచీనాథుడు
స్పృహకలిగినది సభలోనందరు
గుసగుసలాడుట వినిపించినది.

దిగ్గునలేచెను - తప్పుతెలిసెను
గురుకృపవలనే మనుగడఅన్నది
తెలియును గనుక - తల్లడిల్లెను
ముఖబింబమది కళదప్పినది

మహాపాపిని దుర్మదాంధుడను
గురువుకు ద్రోహము చేసినాడను
ఆయన చలువ లేకపోయిన
ఇంద్రపదవి యది నిలవదనుకొని

వడిగా సాగె – గురుగృహమునకు
సభలోవారు – దిగులుతోనుండిరి
ఇంద్రుడు వచ్చుట తెలిసి బృహస్పతి
పొగరు దించగా – ఆలోచించి

అదృశ్యమయ్యెను గృహమునుండియే
వెదకి వెదకి మరి అలసెను ఇంద్రుడు
పిలచి పిలచి – తా తల్లడిల్లెను
ఓదార్చువారలు – లేకపోయిరి

విషయమంతయు అసురులకందెను
దేవగురువు తా కినుక వహించుట –
తెలిసిన వారు – సంతసపడిరి
తలచిరి సురలను తృణహీనులుగా

పగతీర్చుకొన యోచనతోను
శుక్రాచార్యుని ఆశీస్సులుగొని
అమితబలాఢ్యులు – గురుకృప గలిగి
అమరావతిపై విరుచుకుపడిరి

భీకరమైన పోరుజరిగెను
శక్తికి తగినటు పోరిరి సురలు
గురుకృప లేక నీరసపడిరి
గురుదీవనల బలము అసురులది

అఖండవిజయము అసురులందిరి
బ్రతుకుజీవుడా అనుకొని సురలు
పరుగుతీసిరి – వారి నాయకుడు
దిక్కుతోచక – బ్రహ్మనుచేరెను

ఆర్తనాదములు చేసిరి సురలు
పాహి పాహి! యని పదములబడిరి
ఇంద్రునిగాంచి – సురలనుగాంచి
విషయము తెలిసెను వాణీనాధుడు

తప్పిదమ్మును ఎత్తిపొడిచెను
గురుద్రోహమునకు శిక్షపడెననె
అనుభవించక తప్పదు అనెను
నమ్మకద్రోహము ఐనది అనెను

మీ బాగోగులు నిరతముచూసి
మంత్రబలమును మీకు ఒసంగి
కంటిరెప్పలా కాచే గురువును
అవమానించిన దాని ఫలితమనె

గురుద్రోహముతో బలముతగ్గినది
శుక్రుని – మంత్రబలము గొప్పది
అజేయమైనది – దానిని గెలువగ
మూడు త్రోవలు – చూపెదమీకు.

విప్రానుగ్రహము – ఈశ్వరుకరుణ
గోదేవత – తా – ననుగ్రహించుట –
వాటిలో ఒకటి నేరుగబోయి
మను నందనుని – ఆశీస్సులందుట

విశ్వరూపుడు – మను నందనుడు
శరణువేడి మరి కరుణపొందుడు
తపోశక్తితో ధృడమగు నిష్టతో
మునులలో – యిప్పుడు అగ్రగణ్యుడు

విశ్వరూపుని దయనుపొందగా
తృప్తిగ నాతని సేవించండి
దాసుల తప్పులు దండముతో సరి
అని - ఆతని పదముల వ్రాలుడు

బ్రహ్మబోధన చెవికెక్కినది
మార్గోపాయము తలకెక్కినది
నేరుగ పోయి గాంచిరి వారు
విశ్వరూపుని - తపోరూపుని

సురలనుగాంచి గౌరవించెను
ఆనందముతో పొంగిరి సురలు
కుశలమడిగిన - మునికిచెప్పిరి
తమకు కలిగిన దురవస్థను

"పితృవర్గముకు చెందినవారము
నీ అనుగ్రహము కోరుచుంటిమి
కాదనకుండా కరుణించవలె
అయినవారము అది మది నుంచుము

పితృశుశ్రూష - చేసెడితనయులు
పుణ్యాత్ములలో అగ్రగణ్యులగు
బ్రహ్మనిష్టను మించిన పుణ్యము
పితృ సేవయది నీకు తెలియును

గురువు రూపమగు-పరతత్వమునకు
బ్రహ్మకు ప్రతినిధి తండ్రియగును కద
మరుద్గణ ప్రతినిధులు సోదరులు
భూదేవత - ప్రతి రూపము తల్లి

దయకు సాటియగు సోదరి ఇలలో
ధర్మరూపము సద్భావమ్మగు
అర్థి అభ్యాగత అగ్ని తానె - యగు
భూతములన్నీ హరిరూపములు

అమరావతిలో సుఖముగనుంటిమి
కానీ ఇప్పుడు ఆపన్నులము
పితృజనములో చేరిన వారము
నీ తపోబలమున బాధలు తీర్చుము.

బ్రాహ్మణుండవగు నిన్ను - గురువుగా
ఆచార్యునిగా కోర వచ్చితిమి
నీ తేజోబలముల రిపులహరించుము
చిన్నవాడివి - గుణమున్నవాడివి.

వయసులొ చిన్న - తపమునపెద్ద
కావున వందన మిడవచ్చును కద!
అర్థి ప్రణామము చేయుట సరియగు
కావున గొనుము మా ప్రణామములు."

నియమనిష్టల ఎన్నికయైన
విశ్వరూపుడు దయాపూర్ణుడై
తప్పక సాయము చేసెదననెను
గురుత్వమ్మును నెరపెద ననెను

త్రికరణశుద్ధిగ వలయుసాయములు
నావలన జరిగెడి ఉపకారమ్ము
తప్పక చేతును అని పలుకుచును
విజయ రహస్యము తెలిపెనింద్రునకు

మంత్రసమమగు నారాయణకవచము
ఉపదేశించగ సురనాయకునకు
దానిని పఠించి అవలీలగను
సురరాజ్యమును పొందెనింద్రుడు.

అనగారాజు అమితభక్తిగా
ఆకవచమ్మును ఉపదేశించగ
ఆర్తిగ అడుగగ - సరియని శుకుడు
అమోఘకవచము నుపదేశించెను.

॥శ్రీ కృష్ణచరితము॥



## 3 శ్రీనారాయణకవచము

సురవిభవమ్మును రాజ్యలక్ష్మిని
సురనాయకునకు లభింపజేయగ
విశ్వరూపుడు సుస్నాతుడయి
తూర్పుముఖముగ ఆశీనుడయె

అంగన్యాస కరన్యాసముల
నారాయణకవచమ్మును అంతట
స్మరించినాడు విశ్వరూపుడు
తపోవంతుడు దయామయుండు

పాదాలను మరి ఊరువులను
ఉదరము హృదయము ఉరము ముఖమును
శిరస్సుమొదలగు అష్టాంగముల
ప్రణవముతో అష్టాక్షరి జపించె -

విన్యాసమును చేసి అంతట
ద్వాదశాక్షర మంత్రముతో మరి
కరన్యాసమును గావించె - తీరుగా
అంతట నిష్టగ - తపోవంతుడు

మంత్రరూపము భగవచ్ఛబ్దము
అయినటువంటి -ప్రణవమంత్రమును
యకారాంతమగు-మహామంత్రముతొ
స్వరసంధులలో న్యసించినాడు

హృదయమునందు 'ఓ'ంకారమును
శిరస్సునందు 'వి'కారమ్మును
కనుబొమలందు 'ష'కారమ్మును
కన్నులలోన 'వే'కారమ్మును

స్వరసంధులలో 'న'కారమ్మును
మకారమ్మగు అస్త్రము ధరించి
పలికినంతనే మంత్రరూపముగ
స్వరము నావిధి ఉచ్చరించి మరి

'అస్త్రాయఫట్' అనుమంత్రముతో
దిగ్బంధమును - చేసి అంతట
సర్వేశ్వరుడగు నారాయణుని
నిండుగ మదిలో నిలపినవాడై

తపోమూర్తియగు నారాయణునిగ
విద్యామూర్తియగు శ్రీహరిగాను
తానై - అంతట - మంత్రసమమగు
నారాయణ కవచమ్ము - పఠించెను

ఆరుశక్తులగు ఈశ్వరదేవుని
షడ్గుణమ్ములు కలిగియుండునిది
దీనిని పఠించు ముందర తాను
'ఓం విష్ణవేనమః' - అని స్మరించవలెను.

అటులచేసిన ఈకవచమ్ము
అమోఘమంత్రముగా వెలుగొందు -
అంతటట భక్తిగ నిష్టగ దీనిని
అంతరంగమున స్మరించవలెను

"శంఖ - చక్ర - గద - ఖడ్గ, వర్మము
శరము - శార్ఙ్గము - పాశధారియై
గరుడుని మూపున - అధివసించిన
అష్టబాహు డైశ్వర్యప్రదాత.

కృపాసముద్రుడు అన్నివిధముల
నాకు రక్షణ - కల్పించవలె
మత్స్యమూర్తి యగు నారాయణుడు
జలములనుండి - వరుణ పాశముల

ఎట్టి ఉపద్రవ మెదురు రాకను
నన్ను సర్వదా కాపాడవలె -
రమాకాంతుడు వామనుడై మరి
బలిగర్వమును హరించె - నాడు

ఆ ఘన వటువు - త్రివిక్రముండు
నింగి నేలను - నన్ను కావవలె
దిగంతములలో వ్యాప్తిచెందెడి
రాక్షస కాంతల గర్భము లుడిగే

అట్టహాసమును చేసినయట్టి
భీకరమూర్తి - నృసింహమూర్తి
విషమస్థలముల అడవుల అగ్నిలో
యుద్ధరంగమున - రక్షణ నిడవలె

ప్రళయకాలమున - లయకాలమున
రసాతలమునకు జారిన భూమిని
దంష్ట్రాగ్రముల ఎత్తి నిలపిన
యజ్ఞవరాహుడు - రక్షించవలె

అన్నిబాటలలో అనిశమునన్ను
ఆదివరాహము కాపాడవలె -
రాజవంశముల కార్చిచ్చు యగు
భూమీనాథుల గుండెల నిద్రించు

భార్గవరాముడు - దయాభిరాముడు
అద్రిశిఖరముల కాపాడవలె -
తాటక ద్రుంచి క్రతువునుగాచి
హరువిలు విరచి ధైర్యము చూపి

విరాధ కబంధుల - అసురల తృంచి
ఖరదూషణుల నంతముచేసి
వానరపతిని - వీరునిచేసి
వాలిని - కోలను నేలకురాల్చి

జలధిగర్వమును అంతముచేసి
గుండెలమీద - సేతువు కట్టి
ఘటకర్ణ రావణ యోధుల గూల్చి
విభీషణునికి పట్టము గట్టి

భూమీసుతను ముదముగ జేకొని
సాకేతమునకు సుఖముగచేరి
రాజ్యమునేలెడి - పట్టాభిరాముడు
కాపాడవలె - ప్రవాసగతుల.

శ్రీమన్నారాయణమూర్తి నిరతము
మారణకర్మ తంత్రము నుండి
కాపాడవలె కరుణాదృష్టితొ
గర్వమునుండి నరుడు కావవలె.

యోగనాథుడగు దత్తాత్రేయుడు
యోగభంగమునుండి కావవలె
గణేశుడైన కపిలుడు తాను
కర్మబంధమునుండి కావవలె

కాముని నుండి సనత్కుమారుడు
దేవహేళన నుండి – హయగ్రీవుడు
దేవ తిరస్కారము బారిపడకను
నారదమహర్షి కాపాడవలె

కూర్మవతారుడు – పాపకర్మల
బారిపడకను – కాపాడవలె
ధన్వంతరి అగు ఆ భగవానుడు
అపత్య దోషమునుండి కావవలె

విజితేంద్రియుడగు ఋషబుడు నిరతము
ద్వంద్వబాధలలొ – పడక – కావవలె
జనాపవాద – బాధలనుండి
అగ్నిదేవుడు కాపాడవలె

చావు పుట్టుకలు కలగజేసెడి
కర్మల కాచును – బలరాముండు
కాలమునుండి యముడు కావవలె
శేషుడు రక్షణ – పాముల వలన

అజ్ఞానమునుండి – వేదవ్యాసుడు
పాషండషండము నుండి బుద్ధుడు
మహాపురుషుడు ధర్మరక్షకుడు
కలి – కావవలె కలి బాధలలో

పూర్వాహ్ణమున కేశవ దేవుడు
మధ్యాహ్నమున నారాయణుడు
అపరాహ్ణమున గోవిందుండు
సాయంసమయము విష్ణువు రక్షణ

ప్రదోషకాలము మధువైరి మరి
అర్ధరాత్రమున త్రివిక్రముడును
అపరరాత్రమున వామనమూర్తి
నిరతము – నన్ను కాపాడవలె

పద్మనాభుడు సంధ్యలయందు
శ్రీవత్సలాంఛనుడు అగు పరమాత్మ
సర్వేశ్వరుడు జనార్దనుండు
ప్రాభాతమున – రక్షించవలె

ప్రళయకాలమున పెనుమంటలతొ
విజృంభించి అడవి కాల్చినటు
రాక్షసవలయము నంతముచేయగ
చాలినయట్టి సుదర్శనమ్మా!

చక్రధారి మరి ఆనతీయగా
అఖండ విక్రమస్ఫురణతొ నీవు
అసురలనంతము చేయుము ఇపుడే
రాక్షససేనల ఉక్కడగించుము!

గదాదండమా! విలయకాలమున
నింగినుండి మరి నేలకు ధ్వనితో
ప్రచండాగ్నిని కురియునట్టుగా
విజృంభించి - అట్టహాసముగ

విరామమియ్యక తేజోరాశిగ
వెలుగులుచిమ్మి విజయము గూర్చగ
అంతులేని నా శత్రుసేనలను
పిండి పిండిగా గావించవలె.

వీరవిహారము గావించుచును
గదాదండమా! నిశ్శేషముగా
యక్ష రక్ష వైనాయక ఆదిగా
భూతగణమ్ముల నిర్మూలించుము!

దివ్యశంఖమా! పాంచజన్యమా!
మదించిపోయిన శత్రుమూకను
ప్రేత పిశాచ విప్రగ్రహాది
క్రూరగ్రహములను హడలెత్తించి

గుండెలుప్రీలి అసువులూడునటు
అతిభీకరముగ గర్జించవలె!
భూనభోంతరాళమ్ములు నిండగ
శంఖఘోషనిడు - పాంచజన్యమా!

అరిభీకరమగు ఓనందకమా!
శత్రుపక్షపు పక్షమ్ములను
తెగ నరకవలె - నిర్దయతోను
ఆక్రందనలవి మిన్నుముట్టవలె.

దివ్యచక్రమా! శ్రీహరి కరముల
వెలుగులుచిమ్మే విజయరూపమా!
రక్కసిమూకల ఉక్కడగించుము
ఉక్కిరి బిక్కిరి చేసి త్రుంచుము!

పాపగ్రహముల క్రూరదృష్టిని
నర - మృగ - నాగ - భూతాదులచే
వచ్చెడి బాధలు నారాయణాస్త్రమ!
తుత్తునియలుగా - గావించవలె.

బృహద్రథ తరాది సామగానమున
స్తోత్రములందగ అర్హతగలిగిన
గరుత్మంతుడు - నను రక్షించగ
వేడుచుంటిని - వందనమంటిని!

శ్రీహరి నామ - రూప - వాహన
దివ్యాయుధ పార్షదులు - నాదగు
బుద్ధిని మనస్సును ఇంద్రియాలను
ప్రాణమ్ములను రక్షించవలె!

భగవానుడగు - శేషుడునన్ను
సర్వ ఉపద్రవ బాధలనుండి
చల్లగచూసి కాపాడవలె!
అనంతసుఖమును అనంతుడిడవలె!

జగమును తానును ఒకటేఅనుకొని
భావించుచును ధ్యానముచేసే
వికల్పరహితుడు రక్షించవలె
నగలు - ఆయుధ లింగములనెడి

రిపుల - తనదగు మాయతొ దాల్చి
ప్రకాశించెడి - శ్రీపతి - శ్రీహరి
వికల్ప విగ్రహ బారినుండి - నను
నిరంతరమ్ము కాపాడవలె -

భీకరమైన అట్టహాసముతొ
విలయాగ్ని సదృశము అయినటువంటి
తేజఃపుంజము అయినవదనముతొ
నరసింహుడగు నారాయణుడు

నిరంతరమ్ము నను రక్షించగ
ప్రార్థనచేయుచు నుంటినిప్పుడు
తప్పులుగాచి యిడుములుబాపి
మనశ్శాంతిని కలిగించవలె."

నారాయణ కవచమ్మిదియే రాజా!
విశ్వరూపుడు ఉపదేశించగ
నాకలోకపతి ధ్యానించి - తను
అప్రమేయ బలవంతుడాయెను

అరిభీకరుడై అసురులందరిని
ఆలములో మరి నేలకూల్చెను
అఖండ విజయము అందుకొనెనయా!
అంతటి దయ్యా - దివ్యకవచమిది.

శ్రద్ధాభక్తుల నారాయణకవచము
ప్రతిదినమూ మరి పఠించినంత
ఘోరయుద్ధముల జయించగలరు
అసాధ్యమగు రోగమ్ములు తగ్గును.

ఆయురారోగ్యము లమరునువారికి
సర్వగ్రహముల బాధలడగును
మారణకర్మ బాధలనుండి
భూతగణముల బారినుండి మరి

బయటపడుటకిది రాజమార్గము
పాపకర్మలకు ప్రాయశ్చిత్తము
మరియొకటింక అవసరపడదు
సర్వపాపములు హరించిపోవును.

మనశ్శాంతికిది - దివ్యౌషధము
విజయసిద్ధికిది దివ్యసాధనము
కవచమాహాత్మ్యమ్ము వినుమహరాజా!
అనుచు పలికెను శుకయోగీంద్రుడు

పూర్వకాలమున కౌశికుడనెడి
విప్రుడు - దీనిని పఠించినాడు
ధ్యాన నిష్టల ఉపాసించెను
యోగమార్గమున తనువు వీడెను

శిథిలమైనది - ఆతనిచర్మము
ఎముకలు మాత్రము - నేలనున్నవి
కొన్నిదినములకు ఒక గంధర్వుడు
కాంతలతో తా నింగిని సాగెను

గంధర్వవిమానము ఆకాశమున
విప్రుని - ఎముకలపైన - ఎగిరినది
ఎముకలపైన నీడ పడినది
తెలియక - జరిగిన దాసంఘటన

అంతే - గిర్రున తిరిగి - విమానము
నేలనుబడెను - అతిచిత్రముగా
చిత్రరథుడను - ఆ గంధర్వుడు
కాంతలతో అట నేలనుబడెను

కదలలేక బంధించినట్టుపడె
దిక్కుతోచక వంతలొనుండగ
వాలఖిల్యముని అటుగా సాగుచు
విషయము సర్వము గ్రహించినాడు

చిత్రరథుని దరి జేరి - పలికెను
ఇదిగో గనుము ఈ ఎముకలివి
కౌశికుడనియెడి యోగి - అస్థులు
నారాయణ కవచమ్ము శక్తియిది

ఈ ఎముకలకు దివ్యశక్తియది
నారాయణకవచమ్ముతొ వచ్చెను
వీటిపైన మరి దాటెడి శక్తి
లేదు ఎవ్వరికి - తెలిసినదా మరి

విష్ణుభక్తుని వంకచూడగా
ఎంతటివారికి సాధ్యముకాదు
వారి నెదిరించు శక్తి అన్నది
వాణీపతికే లేదు - వింటివ!

ఒక ఉపాయము చెప్పెద నీకు
ఈశల్యములను - భక్తిశ్రద్ధల
తూర్పుదిక్కుగా ప్రవహించేటి
సరస్వతీనది జలముల కలుపుము

ఆ జలములలో అస్థులుకలిపి
స్నానముచేసి దైవప్రార్థన
చేసినంతనే - నీ బంధములు
తొలగిపోవును అనుచు చెప్పెను

మునిచెప్పినటు మంత్రాస్థులను
విమానమ్ములో గొనిపోయి అట
సరస్వతీ నది జలముల కలిపి
హరినిస్మరించి - కృతార్థుడయ్యెను

అంతటిగొప్ప మంత్రమ్మిదియగు
దీనిమహిమ మరి అంతటిదగును
నిత్యముదీనిని పఠించినంతనె
భూతములవ్వి పరుగిడి పోవును

దుష్టశక్తులు - క్షుద్రశక్తులు
గ్రహబాధలవి తొలగిపోవును
క్లేశహరణము - రోగనాశనము
ఎదురువచ్చిన వారు - మ్రొక్కెదరు

ఐశ్వర్యకారకము ఈకవచమ్మును
విశ్వరూపుని దయతో పొంది
సామ్రాజ్యమును పొందెనింద్రుడు
అటులావిప్రుడు సురల గురువయె.

అనుచుతెలిపిన దివ్యకవచమిది
నారాయణకవచమ్ము సర్వదా -
సర్వజనులకు - పఠించదగినది
లేదు లేదు మరి - సందియమెంతయు

అనుచు పలికిన శుకయోగీంద్రుడు
ఆపై గాధను ఆరంభించెను
విశ్వరూపునికి మూడుశిరస్సులు
త్రిశిరుడాతడు - విచిత్రమైనవి.

ఒక తలచేయును సురాపానము
సోమపానము చేయు మరొక్కటి
మూడవది మరి అన్నముతినును
హవిర్భాగములు అందుచుండెడివి.

సురలగురువు మరి అర్హుడు గనుక
సురలతోబాటు హవిర్భాగములు
అందెడి శక్తి కలిగెనాతనికి
ఆతడు వాటిని సరిగావాడక

తల్లివైపుగల బంధువులైన
అసురలు కవ్వి రహస్యమ్ముగా
అందజేయుట జరుగు చుండెను
చాలాకాలము అటుల జరిగెను

విశ్వరూపుడు గురువే ఐనను -
దివ్యశక్తిగల మంత్రమిడినను -
అఖండవైభవ మందించినను -
అమరావతినే దక్కించినను -

రాక్షసులకు మరి సాయముచేసి
రాక్షసగుణమును తెలియబరచుకొనె
ఉపేక్షించిన - అపాయమ్మును
వెంటనుంచుకొని-బ్రతుకుటె యగును.

అని తలంచెను - అమరనాధుడు
అంతముచేయుట మార్గముఅనుకొనె
అంతకుమించిన యోచనలేదని
అంతులేని తెగింపుతెచ్చుకొని

మూడుతలలను నరకివేసెను
అమరగంగలో కత్తిని కడిగెను
ఆనందించెను మంచి పనియని
గురువును చంపుట అన్నది మరచెను

కోపవశుడయి చంపెను గానీ -
బ్రహ్మహత్యయను పాపము లేచెను
మూడుశిరస్సులు మూడుపక్షులయె
బ్రహ్మహత్య అది వెంబడించెను

సోమముత్రాగే శిరము 'కౌజు' అయె
సుర త్రాగెడిది - కలివిలు మాయెను
అన్నముతినెడిది 'తిత్తిరి' ఐనది
అటుల పక్షులుగ పాపము నిలిచెను.

ముందునిలచిన ఘోరపాపమును
గాంచె నింద్రుడు 'వణకిపోయెను
దోసిలిపట్టి దానిని గొనెను
అంతట - బాధలు ఆరంభమయె

ఒకఏడాది భరించినాడు
ఆపై దానిని భరించలేక
భూమిని, జలమును, తరువుల, స్త్రీల
ప్రాధేయపడె - సాయ పడగను

గొయ్యి స్వయముగా పూడునట్టుగా -
జలముల శుద్ధి జరుగునట్టుగా
నరకిన - చిగురులు పుట్టునట్లుగా
అనంత - కామసుఖములు ఇమ్మని

నలుగురు వరములు కోరి రింద్రుని
వల్లెయని మరి ఇచ్చెను సురపతి
అటుల భూమికి చవిటి ఏర్పడె
బుడగ - నురుగు - జలముల పాపము

జిగురు అయినది - చెట్లపాపము
రజోవికారము - స్త్రీలపాపము
వారు నలుగురు వల్లెయనగను
పాపము తొలగెను సురనాథునకు.

॥శ్రీ కృష్ణచరితము॥



# 4 వృత్రాసురవృత్తాంతము

ఇంద్రుని చేబడి తనయుడు ఐన
విశ్వరూపుడు చంపబడినటు
తండ్రి"త్వష్టకు" తెలిసినయంత
కోపతాపములు కట్టలు తెగినవి

ఆయుధాలను వాడు అడుగగా
నీ ఆయుధమది - శూలముచాలును
వజ్రాయుధము మరి అస్త్రములన్నీ
నీముందసలు - పనికిరావనె

నిప్పులు కురిసే కళ్ళతొనంత
భీకరముగ హోమమ్ముచేయగ
అగ్నికుండమున అమోఘబలుడు
ప్రళయాగ్నిసదృశుడు ఉద్భవించెను.

శలవు తీసుకొని బయలుదేరుచు
పెడబొబ్బ పెట్టగను దిక్కులవిసెను
నింగి చీలునటు భూమిపగిలినటు
అరచిన అరపుకు - పక్షులురాలెను

నిడుపగు శూలము వాడికోరలు
కొండవంటి ఘనశరీరమ్ముతో
భూమివణకునటు అడుగులేయుచు
వికటాట్టహాసమున ముందునిలచెను

ఒక్కఉదుటున అమరావతిపై
విరుచుకుపడెను వృత్రాసురుడు
దొరకినవారిని దొరకినట్టుగా
కూల్చమొదలిడె - నాకవాసులను

ఆనందించిన త్వష్ట అంతట
పేరడుగ గను - వృత్రుడు అనెను
వెంటనె సురలను హతమార్చగను
ఆనతినిడెను - త్వష్ట అంతట

అకాల ప్రళయము అనిపించినది
యుద్ధముచేయగ నిలచిరి సురలు
ఆయుధాలను విరచి వృత్రుడు
జబ్బలుచరచుకు - నిలచె నింగివలె

ఆయుధాలనే మ్రింగదొడంగెను
మహాభూతమని తలచిరి సురలు
విసిగిన వృత్రుడు శూలముతో మరి
వందలు వేలను కూల్చసాగెను

భువనపోషకుని స్తోత్రముచేసిరి
నిన్నుమించిన వేల్పులేదనిరి
నాకలోకమును కావగవేడిరి
రాజ్యలక్ష్మిని నిలపగ కోరిరి.

చెల్లాచెదరై పోయిరి సురలు
బ్రతుకు పైన మరి ఆశ వదలిరి
అంతట ఇంద్రుడు సందుచూచుకొని
పారిపోయెను - అసువులు నిలపగ

ప్రళయములో ఈ భూమినిగాచిన
మత్స్యావతారుడు రక్షణ అనిరి
వటపత్రముపై - లీలగ పడుకొని
అలలఊగెడి - స్వామి కావ వలె!

ఆయుధాలవి మ్రింగబడినవి
అఖండసేన అంతమైనది
ఆగక అసురుడు రేగుచుండెను
అరిభయంకర రూపము దాల్చెను.

దీనశరణ్యా! అసురులబాధ
నుడువగలేము నిలబడలేము
రాజ్యరమను మరి హరించినారు
ఆదుకో వలె - అనాధరక్షక!

దిక్కుతోచక వారందరును
దిక్కని వేడిరి - దీనబంధువును
జగద్రక్షకుని - జగదాధారుని
నారాయణుని - పద్మనయనుని.

అనుచు ఆర్తిగా సురలు కోరగా
అనుగ్రహించిన లక్ష్మీకాంతుడు
దివ్యదర్శనము నొసంగినాడు
దివిజ వాసులు పరవశించిరి

పాలసంద్రమున - శేషతల్పమున
పవ్వళించిన పరంధాముడు
కరుణాధాముడు - కలిమికి నెలవు
ఆగమాలతో స్తుతులనందెడు

ఆజానుబాహుడు - అరవిందాక్షుడు
కనకచేలము రత్నకిరీటము
కరుణారసము ఒలికే వదనము
కరి వరదుని మరి గాంచిరి వారు

శ్రీవత్సాంకుడు - కాంచన చేలుడు
చతుర్ముఖునికే - జన్మదాతయగు
ఆశ్రితజన మందారము - ఐన
అక్షరమూర్తితో - పలికిరిభక్తిగ

ఆర్తరక్షకుడు అగబడినాడు
అనంతుడు తా దర్శనమిడెను
పాదపద్మముల మోకరిల్లిరి
పరమ పురుషునికి వందనమిడిరి

తనివితీరని ఆనందముతో
స్తుతించి రంతట - లక్ష్మీపతిని
సుగుణఖనివి నువు - సుందరమూర్తీ!
స్వర్గ సుఖములు నిడెదవు నీవే.

సుదర్శనమ్ము - అరిభీకరము -
గదాయుధమ్ము - రిపులహరించును
శార్జ్గము గాంచిన రిపులుమిగలరు
నీ ఆయుధములు శక్తిమంతములు

రిపులపాలిటి యమదండములై
ఆపన్నులను ఆదుకొనునవి
అంతటిశక్తి కలిగిన స్వామీ!
బాధలు బాపుము ఓ భగవంతా!

అరిభీకరమగు ఆకారముతో
శూలాయుధముతొ విజృంభించి
వృత్రాసురుడు - హింసలుపెట్టెను
బ్రతుకుజీవుడా అని పరుగిడి

నీపాదముల - మ్రోకరిల్లితిమి
మా ఆయుధములు ముద్దగ చేసి
మ్రింగివేసెను - భీకరభూతము
సృష్టినంతము చేయగ - చాలును

అంత కంతకు పెరిగె నాగడము
వానిని అణచగ - వశముగాకను
ఆర్తులమై - నీ పదములంటితిమి
కాపాడవలె - కారుణ్యాలయ!

సృష్టి స్థితిలయ కారుడవీవు
ఆదిమధ్యాంత రహితుడ వీవు
ఆనందరూపా! అభయప్రదాతా!
అరిభయంకరా! అనుగ్రహించుము

సగుణ రూపము నిర్గుణరూపము
రెండూ నీకే సాధ్యమైనవి
అందుల కొరకు ఉంటివ లేదా!
అను జిజ్ఞాసలొ - కొందరుందురు

భువనాలను నీ కుక్షిలొనుంచి
రక్షణచేసే కరుణాధామా!
బిడ్డలకష్టము తీర్చుముస్వామీ!
నిన్నుమించిన వేల్పు మరెవ్వరు.

పదే పదిగను - ప్రార్థనచేసిరి -
పరమాత్మతత్వమును గానముచేసిరి
అవతార తత్వమును ఆకళించు కొని
పొంగిన గుండెతొ - రక్షణ కోరిరి.

వారిస్తోత్రమును వినెను ముకుందుడు
•వారిబాధలు పూర్తిగ తెలిసెను
పలికెను వారితొ మీదగుశత్రువు
మారణ హోమకుండ జనితుడు

వాని ఆయుధము శూలము అగును
మీ ఆయుధములు పనికిరానివగు
ఆవిధముగను తండ్రి వరమది
కావున వాడు - లొంగక పోయెను

పాత ఆయుధములిక పనిచేయవు
క్రొత్తఆయుధము నిర్మించవలె
ఉపాయమ్మును చెప్పెద వినుడు
దధీచి అనెడి – మహాముని మరి

నిర్మల హృదయుడు ధ్యానతత్పరుడు
ఆముని – తనువు శక్తిమంతము
నాసంబంధపు మహత్వమ్మును
ఆముని అస్తులు – కలిగియున్నవి.

ఆమునిఎంతటి ఘనుడో వినుడు
అశ్వనిసురలకు ఆ పుణ్యాత్ముడు
అశ్వశిరో నామకమైన
బ్రహ్మవిద్యను ఉపదేశించెను

ఆ విద్యతొ మరి అశ్వనిసురలు
జీవన్ముక్తికి అర్హులాయిరి
వారు కోరిన – ఆమునితప్పక –
తనశరీరమును – త్యాగముచేయును

మరియొక రహస్య విషయము వినుడు
విశ్వరూపునికి – దధీచి మహర్షి
నారాయణకవచమ్ము ఒసగెను
అతనిని మించిన దాతలుండరు

ఆ ముని ఎముకలు ఉపయోగించి
నూరంచులుగల – ఆయుధమ్మును
తయారు చేసి విశ్వకర్మ తా
ఇంద్రునికిచ్చును 'శతకోటి' అందురు

ఆ శతకోటిలొ – నా అంశయది
వ్యాపించి – చేయును దివ్యాయుధము
దానిసాయమున – ఇంద్రుడు తాను
ఖండించును – ఆ వృత్రాసురుని.

వృత్రునివధ మరి జరిగిన వెనుక
మీ ఆయుధములు మీకు లభించును
శతకోటి కలిగిన ఇంద్రునెవ్వరూ
జయించలేరు అజేయుడగును.

అటులపలికిన కమలాక్షుండు
అంతర్ధానము ఐనంతటను
ఆనందించిరి సురగణమంతయు
తలచిరి వృత్రుని చంపినట్టుగా

దధీచి దర్శనమందగ సురలు
ముని ఆశ్రమమున కేగి అచ్చట
దివ్యతేజముతొ అగ్నితీరుగా
భాసిలు మౌనిని గాంచి మ్రొక్కిరి

బ్రహ్మనిష్టా గరిష్టు డంతట
స్వాగతవచనము పలికి సురలను
యధోచితముగ సత్కరించెను
ఉచితాసనమున కూర్చొనజేసెను

ఏమికార్యమున వచ్చిరనుచును
మధురవాక్యముల పలుకరించిన
మౌనిని గాంచి పులకరించిరి
మదిలొ కోరిక మూలబడినది

మాకొరకై - నువు మరణించవలె
మాబ్రతుకులకై అంతముగావలె
తనువు నొసగవలె - అనెడి కోరిక
కోరగ - ఇంద్రుడు జంకె నంతట

అశ్వినిసురలు మిగిలిన సురలు
వరుసగ నందరు ప్రణామముంచిరి
ప్రసన్నదృష్టితొ వారిని గాంచెను
వచ్చిన పనిని తిరిగి అడిగెను

అంతటవారు చిన్నగ పలికిరి
బ్రహ్మవేత్తవు భవిత నెరుగుదువు
నీకుతెలియని విషయము లేదు
ఐనా మరి - మానోట చెప్పెదము

బిడియము విడచి మేమందరము
బ్రతుకుపైన మరి ఆశలుపెంచుకు
అర్థించగను వచ్చినారము
కోరెడిదిదియే - నీ శరీరము

తాపోసత్తమా! నీశరీరము
మాకు ఒసంగిన - కార్యముతీరును
అనగా నంతట దధీచి వారితొ
ప్రసన్నవదనముతోను - పలికెను

నా శరీరము అశాశ్వతమ్ము
మీకు ఒసగిన - శాశ్వతమగును
ఉత్తములైన మీదు కోరిక
ఆనందముగా నెరవేర్చెదను

సుఖదుఃఖములకు హేతువు - తనువ
చివరకు మట్టిలొ కలిసిపోవును
కాపాడగను వశముగానిది
దేహము అనగా దహింపబడునది

సంతోషముగా మీరు కోరినటు
తనువును గొనుడు - అనుచు మహా
యోగమార్గమున - తనువును వదలె
జీవుని కలిపెను - అనంతమూర్తిలొ

సాధువాదములు పలికిరి సురలు
అంతట ఇంద్రుడు దధీచి ఎముకలు
విశ్వకర్మకు ఇచ్చి - వాటితో
ఆయుధమ్మును చేయగ కోరెను

ఆతడుచేసెను వజ్రాయుధమును
దానిని ఇంద్రుడు ధరించినాడు
విష్ణుతేజము వచ్చిచేరగనె
వెలిగిపోయెను విజయకాంతితో

శుభముహూర్తము నిర్ణయించిరి
వృత్రుని వధకై - బయలుదేరెను
యుద్ధభేరి అది మ్రోగుచుండగా
ఆనందముగా సేన కదిలెను

ఐరావతమున ఇంద్రుడు ముందు
ఆపై - ఆతని దేవసేనలు
బయలుదేరగా - వృత్రుని నెలవును
ముట్టడించగా సాగిరంతట

వెన్నుచూపిన నాక లోకపతి
తన్నుతానుగా - పోరుకురాగా
కన్నులెర్రబడి క్రోధవశుడయి
ఘనశూలముతో వృత్రుడు వచ్చెను

భీకరమైన పోరుసాగెను
వజ్రాయుధముతొ ఇంద్రుడునిలబడి -
శూలాయుధముతొ వృత్రుడునిలబడి -
పోరగసాగిరి - జయాభిలాషులు

రుద్ర - మరుద్గణ - అశ్వని సురలు
పితృదేవతలు - విశ్వదేవులు
వరుణ - వాయు - కుబేరసేనలు
సిద్ధ సాధ్య కిన్నర - కింపురుషాదులు

గంధర్వాదులు సురలందరును
నాకలోకపతి సేనాబలము -
ఆపై వృత్రుని సేనాబలములు
సముచి-శంబర, అన్వర-ద్విమూర్ధుడు

అంబర-వృషభ-హయగ్రీవ-అయోముఖ
పులోమ-వృషపర్వ-హేతి-ప్రహేతులు
ఉత్కట, ధూమ్ర, విరూపాక్ష, కపిలుడు
దందశూరుడు వృషధ్వజుండు

కాలనాభుడు - మహానాభుడు
వృకుడు-మాలి-సుమాలి, మరియును
భూతసంతాపను డాది గా గల
ీరవతంసులు రాక్షససేన -

ఆయుధాలతో కలిగిన రాపిడి
అగ్ని వర్షమును - కురిపించెనట
తెగిన శిరములు కరచరణములు
రక్తపుటేరది - పారెనచ్చట

సమఉజ్జీలై - పోరసాగిరి
విజయలక్ష్మి మరి ఎవరిది అగునో
అనెడి శంకయది కలుగజొచ్చెను
అస్త్రశస్త్రముల - సమానబలులు

పిశాచములు ఆ రణరంగమున
వీర విహారము గావించుచును
మృతకళేబరముల నారగించుచు
ఆనందముగా అరచుచున్నవి

ఒకసమయములో సురలు ధాటిగా
అసుర సేనలను పరుగిడజేసిరి
వారిని తిరిగి - వృత్రాసురుడు
పోరుకుసిద్ధము చేసెను - మాటల

పగర గెలచిన నిలబడు కీర్తి
పగర తెగిన మరి శాశ్వతకీర్తి -
వెన్నుచూపుట భీర లక్షణము
నా బల గౌరవ కీర్తి - నిలపుదు

ఒక్కపెట్టున భుజములు చరచి
అట్టహాసమును వృత్రుడు చేయగ
ప్రాణికోటి యది తల్లడిల్లెను
సత్యలోకమే కళదప్పినది.

దేవసేనలు మూర్ఛపోయినవి
ఆయుధాలవి జారిపోయినవి
ఇంద్రుడొక్కడే స్పృహతోనుండెను
వృత్రాసురుని విక్రమమ్ము గనె

వికటాట్టహాసము వికట నృత్యముల
రణభూషుని ఆ వృత్రాసురుడు
శూలపాణియై విజృంభించెను
బలముగ ఇంద్రుడు గదను విసరెను

వచ్చెడి గదను ఒడుపుగ పట్టి
ఐరావతముపైకి - విసరగా
మత్తేభమ్ముకు తల పగిలినది
రక్తముకారగ - గిర్రున తిరిగెను

గురువును చంపిన ఘాతకుడవనె
ఇంద్రలోకమున నుండగ తగవనె
నమ్మిచేరి - మరి పదవిని పొంది -
నాదు అన్నను - చంపిన దుర్మతి -

పోరున మడసిన శాశ్వత పదవి
శ్రీహరితేజము నిండిన వజ్రము -
గెలుపు - నీదెయగు - అయినా నేను
హరినామ స్మరణతొ పోరెద

భక్తరక్షణా! దీనశరణ్యా!
జగదాధారా! నీదు స్మరణతో!
నీ పదసేవతొ దాసులసేవతొ
తరించకోరెద - ఇహమును కోరను.

నీకొరకై - నా తపన - పెరిగెను
నీలో కలియగ ఆత్రుత - పెరిగెను
శాశ్వత సుఖమును ఇచ్చెద వీవు
అది కోరితిని - అని స్మరించుచు

యుద్ధముచేయగ నిలచెను వృత్రుడు
ఘనశూలమును - విసరగ నంత
చలించిపోయెను సర్వప్రకృతి
వజ్రాయుధమున త్రుంచె - నింద్రుడు

ఆసమయములొ ఇంద్రుడు తెలివిగ
వృత్రాసురుని కరమును త్రుంచెను
అంతటఅసురుడు పరిఘనందుకు
ఇంద్రుని మోదెను వజ్రము జారెను

ఐరావతమును మోదగ నంత
గిర్రునతిరిగి అచేతనమ్మయె
దిక్కుతోచక ఇంద్రుడుండగా
వజ్రము గొనుము - పిరికిని - చంపను

అనుచు అసురుడు పలుకగనంత
ఇంద్రుడు వానిని గాంచిపలికెను
నీవుఅసురుడవు - అయినను గాని
దానవ గుణముల కతీతుడవయా!

హరిభక్తియది నెలకొనియున్నది
మనస్సుకలిగి - కీర్తించితివి
జగదాధారుని పదములపైన
అనన్యభక్తి - కుదిరిన యోగ్యుడ!

అనుచు పలుకగా – వృత్రాసురుడు
అమిత కోపము – రెండవచేతితొ
పరిఘను విసరగ – వజ్రపాణి అట
త్రుంచె పరిఘను – కరమును త్రెంచెను

అంతట అసురుడు క్రోధవశుడయి
గుహవలె నోటిని తెరచి వచ్చెను
ఆశ్చర్యముగా – ఇంద్రుని అపుడు
ఐరావతముతొ కలిపి – మ్రింగెను

అదిరిపోయిరి దేవతలందరు
గ్రహముల గతులు తప్పిపోయినవి
సూర్యచంద్రులు అగ్నిదేవుడు
వెలవెలబోయిరి నిల్చబడిపోయిరి

ప్రకృతినిలచెను అచేతనమ్మయి
అంతట ఇంద్రుడు వివేకమ్ముతో
నారాయణ కవచమ్ము పఠించగ
చలనము కలిగి – కదిలెను వజ్రము

వజ్రాయుధమున వృత్రాసురుని
కడుపుచీల్చెను – వెలికి – వచ్చెను
వెంటనె వృత్రుని కంఠముత్రెంచెను
గిరి శిఖరమువలె ఎగిరెను శిరము

వృత్రుని – వధను గాంచిన సురలు
దేవదుందుభులు మ్రోగించిరట
పుష్పవృష్టి కురిపించిరి ముదమున
ప్రకృతియంతయు శాంతించినది.

ఆసమయములో వృత్రాసురుని
దేహమునుండి – దివ్యతేజమది
లీలామానుష విగ్రహుడయిన
శ్రీహరిలోన కలసిపోయినది

దేవగణంబులు – పితృగణములు
దేవర్షిగణములు ఇంద్రుని – వదలి
పరుగిడిపోయిరి – అనగా – రాజు
వివరము లడిగెను శుకయోగీంద్రుని

ఇంద్రుని వారు త్రొక్కొనిపోయి
అమరావతిలో గౌరవించక
పారిపోయిరి – కారణమిదియే –
పాపము వచ్చి – చేరిన దింద్రుని

వృత్రునివధకు – ఇంద్రుడు జంకెను
బ్రహ్మహత్యపాపమ్మని – తలచెను
లోగడ పాపము – స్త్రీలు – భూమి
జల – వృక్షములు – పంచుకొన్నవి

మరలచేరెడి – పాపము నెవరు
భరింతు రనుచు – మిన్నకుండగా
అశ్వమేధము – చేయించెదమని
ఒప్పించిరి – ఆ వృత్రుని వధకు

వృత్రునివధ మరి జరిగె సవ్యముగ –
ఇంద్రునిచేత అశ్వమేధమును
చేయించుటయది కష్టము అనుచు
వాని బాధకు – వానిని వదలిరి.

ఎక్కువసేపు అచ్చటవున్నచొ
పాపపు గాలి తగులు ననుకొని
పారిపోయిరి - ఇంద్రుని వదలిరి
అంతటవచ్చెను - ఘోరపాపమది

ఛండాల కాంతగా - ముసలి వగ్గుగా
సర్వరోగముల నిలయముగాను
వళ్ళు గగుర్పు కలుగు రూపమున
క్రిములునిండిన వ్రణముల నిలచెను

దుర్గంధమది ఎగయుచున్నది
ప్రేగులు మెడలో దాల్చి - నిలచినది
ఇంద్రుని వలచి వచ్చితిననెను
తికమకపడెను నాకలోకపతి

గుర్తుపట్టుటకు యింతసమయమా!
సుందరుడవని - దరికి చేరితి
అనుచు భీకర నృత్యముచేసెను
బ్రహ్మహత్యపాపమ్మని తెలిసెను

మీదకు వచ్చెడి వికృతరూపిని
భయపెట్టుటకు వశముగాకను
పరుగిడె ఇంద్రుడు - తప్పించకొన
వదలక పాపము - వెంబడించెను

మోసగించకు - నిలబడు స్వామీ!
అనుచు వెంబడి వచ్చెడి దానిని
దాటుకొనగను పరుగిడె ఇంద్రుడు
వదలను అనుచు - అనుసరించె నది.

దాని నడకయది వేగముతగ్గెను
ఇంద్రుడు గాంచెను - ఒకచో సరస్సు
అదియే మానస సరస్సు రాజా!
పాపము అచటకు చేరగ లేక

దూరమునుండి చూచుచుండగా
దిక్కుతోచక ఇంద్రుడంతట
సరస్సునందున విరిసిన యట్టి
తామరకాడలో - ప్రవేశించెను

వేలఏండ్లట నుండె నింద్రుడు
ఎదురు చూచుచు పాపమున్నది
ఇంద్రుని పదవి - భర్తీచేయిగ
యోగశక్తితో అన్వేషించిరి

నాటి రాజులలో అగ్రగణ్యుడగు
నహుషుని తెచ్చి - అమరావతిలో
అభిషేకించిరి - ఇంద్రపదవిలో
నహుషుని గర్వము పెరిగిపోయినది

తిరిగి ఇంద్రుడు వచ్చు వరకును
దేవప్రభువు తను కావున - తనను
చేరగ రమ్మని - శచిని పిలచెను
దిక్కుతోచని స్థితిలో పడినది

అంతట ఆమెకు - దేవగురుండు
చక్కని యోచన చెప్పగ - నామె
బ్రహ్మఋషులు మరి మోయు - పల్లకిలో
తన భవంతికి - రమ్మనిచెప్పెను.

మదగర్వములో - ఆలోచించక
పల్లకి నెక్కి - దానినిమోయగ
ఋషులకు వాడు ఆదేశించెను
పాపము పండెను - అనుచు మోసిరి

అటుల మోయుచునున్న - అగస్త్యుని
కోపమ్మునకు గురియై నహుషుడు
ఇంద్రపదవిని జారవిడచుకొని
కొండచిలువగా జన్మనెత్తెను

అంతట సురలు ఋషులందరును
ఇంద్రుని వెదకి బయటకురమ్మని
అశ్వమేధము చేయించగను -
బ్రహ్మహత్య పాపమ్మతొలగెను

విష్ణుప్రీతిగా - యాగముచేయగ
పాపమునశించి దేవేంద్రుండు
స్వర్గమునేలెను ఆనందముగా
ఆనందించిరి సురలందరును

ఓ మహరాజా! వృత్రుని జననము
సురవిజయమ్ము - వృత్రుని వధయు
ఇంద్రుని - పాపము పీడించుటయు
అశ్వమేధము నిర్వహించుట

ఇంద్రుడు తిరిగి ఏలిక అగుట
భక్తిగ - శ్రద్ధగ - చదివిన - వినిన
వ్రాసిన వారికి - మంగళప్రదమై
ఆయుర్భాగ్యము పెంచును నిజము.

ఆరోగ్యమ్మది - సమకూరును మరి
సర్వరోగములు హరించి పోవును
శత్రువిజయము భోగభాగ్యములు
చివరకు ముక్తి లభించురాజా!

అంతట అడిగెను - రాజవరేణ్యుడు
స్వామీ! ధన్యుడ - జన్మతరించెను
హరిలీల లవి మనోహరములు
పాపహరణములు - క్లేశహరణములు

వృత్రాసురుని గాధలొనాకు
ఆశ్చర్యమగు విషయము తోచెను
రజస్తమోగుణముల నిధియగు
వానికి - ఎటుల భక్తి కుదిరినది

హరిపదములపై గురి కుదిరినది
చావు జేర్చును - శ్రీహరి ననెను
విజ్ఞతకలిగి - పోరగ సాగెను
అచంచలమ్మగు గురి ఎటు కలిగెను!

వజ్రపాణినే హడలెత్తించిన
ఇంద్రస్తుతులనే - అందిన భక్తి
ఎటులకలిగెను అనెడి సందియము
తీర్చగ వేడెద సంయమీంద్రుడా!

అంతట పలికెను శుకయోగీంద్రుడు
దానికి చక్కని గాధచెప్పెదను -
మానాయన దీనిని - చెప్పగనంత
వినిన నారదుడు - తిరిగి దీనిని

దేవలునకు మరి తెలియపరచగా
ఆయన - నాకు చెప్పినదయ్యా!
అవధరించుము - వినిపించెదను
అనుచు పలికెను వ్యాస నందనుడు



॥శ్రీ కృష్ణచరితము॥

## 5 చిత్రకేతూపాఖ్యానము

శూరసేన దేశమ్ములు పూర్వము
సిరిసంపదలతొ విలసిల్లగను
చిత్రకేతుడు - ధర్మతత్పరుడు
చల్లగ రాజ్యము నేలుచుండెను

కన్నబిడ్డలుగ ప్రజల నేలుచు
కంటిరెప్పలా కాపాడుచును
కలిమికి నిలయము అన్నటు రాజ్యము
కన్నుల పంటగ ఏలుచుండెను

ఎందరొభార్యలు కలరు రాజుకు
సద్గుణ రాశులు మెరపు తీగలు
మన్మధశరములు అన్నటులున్న
వారితొ - రాజు సుఖముగనుండెను

ఎంతో సౌఖ్యము - అమరియున్నను
అనుకూలులగు భార్యలున్నను
సంతులేని - ఆ చింత రాజును
మనశ్శాంతికి దూరము చేసెను

చింతలొ రాజు - గడపుచుండగా
అంగిరసుడను మౌనిపుంగవుడు
రాజునుచూడగ వచ్చెను నగరికి
అర్ఘ్యపాద్యములు రాజు ఒసగెను

ఉచితాసనమున కూర్చొని మౌని
కుశలప్రశ్నలు అడిగెను రాజును
సమాధానము చెప్పుచున్నను
రాజువదనమున - దైన్యము కనపడె.

వివరములడిగి - పలికెను మౌని
సంతుకలిగెడి మార్గము కలదు
పుత్రకామేష్టి యాగము చేయుము
తనయుడు తప్పక ఉదయించునయా!

తనయుని వలన - సుఖదుఃఖములు
అందెద వనుచు - అంగిరసుండు
శాస్త్రోక్తముగా పుత్రకామేష్టి
జరిపించెను - తను - రాజుచేతను

యాగము కాగా - యజ్ఞశేషము
పెద్దభార్యయగు కృతద్యుతికిని
ఒసగెను మౌని - సంతుకలుగుటకు
భక్తిగ - రాణి - ఆరగించినది

గర్భముధరించి - నెలలను మోసి
మగశిశువునకు జన్మనిచ్చినది
ఆనందవార్నిధిని తేలెను రాజ్యము
దానధర్మములు రాజుచేసెను

యాచకులకు మరి తృప్తినిండుగా
దానములిచ్చి - వేదవేత్తలకు
ఉచిత రీతిని సన్మానములిడి
భేషు భేషని - పొగడ్తలందెను

దినదిన ప్రవర్ధమానుండుడై మరి
ఆ మగశిశువు - పెరుగుచుండెను
జాతకర్మలను చేయించి మరి
గ్రహశాంతుల చేయించెను రాజు

బిడ్డడిపైన మమకారముతో
పెద్దభార్య గృహమందున రాజు
నిరంతరమ్ము గడుపుచుండెను
మిగిలిన భార్యలు దుఃఖమునందిరి

వారిదుఃఖము - క్రోధమ్మయినది
విచక్షణా జ్ఞానమ్ము వదలిరి
బిడ్డను చంపిన - రాజు దక్కునని
దుష్టయోచనను - అమలుపరచిరి

దాసీ నొకతెను - లొంగదీసుకొని
ఉగ్గుపాలలో - విషమును కలిపిరి
త్రాగినశిశువు - నిద్దురలోనే
అసువులువీడెను - అంతటిలోన

ఊయలలోని బిడ్డను లేపగ
దాదిని పంపెను - తల్లి కృతద్యుతి
విగతజీవుని గాంచిన - దాది
వెర్రికేకను - పెట్టెనంతట

రోదనధ్వనితో - మ్రోగెభవనము
చిత్రకేతువు పరుగున వచ్చెను
విషయముతెలిసి - కృంగిపోయెను
శోకసంద్రమున మునిగిపోయెను

వంశాంకురము అంతమైనదని
కట్టలుతెగిన దుఃఖముతోను
తల్లిదండ్రులు విలపించగను
కరగని హృదయము లేదు అచ్చట.

తల్లిదండ్రులు శోకభారమున
పలుకులు రాక ఏడ్చుచుండగా
రాజభవనము - రాజ్యమంతయు
విషాదమ్ముతో - కృంగిపోయెను

అంతట అచటకు - అంగీరసుండు
నారదమౌనితొ వచ్చెను రాజా!
రాజు గాంచెను - వారిద్దరికీ
రోదించుచును వందనమిడెను

అంగీరసుండు పలికెరాజుతో!
తత్వబోధను తీరుగచేసెను
మమకారముల రూపు చెప్పెను
బంధములనగా తెలిపె వివరముగ

"రాజా! నీవు అజ్ఞానముతో
విషయము తెలియక వగచు చుంటివి
గతించినట్టి శిశువుకు - నీకు
ఎట్టిసంబంధము కలదో చెప్పుము!

గతజన్మలొ మరి వీడు ఎవ్వడో!
నీకు తనయుడు కానే కాదు
అటుల - వీనికి ఎన్నిజన్మలో!
ఎందరు తండ్రులొ తెలియగ వశమా!

తానొకతండ్రి - ఆమె తల్లియని
తాము బాలునికి - జన్మనిడితిమని
తలంచుటెంతయు - మూర్ఖత్వమది
తనుగా చేయగలేడు - ఏపని

ప్రాణుల కలయిక విచిత్రమైనది
ప్రవాహమ్ములో కలిసిన తీగలు
కొన్ని ఒడ్డుకు చేరుచుండును
తిరిగి నీటిలో సాగిపోవును.

శుక్ల శోణిత - మిశ్రమమ్ములతో
పుట్టిన జీవుడు - ఎక్కడివాడో!
ఎప్పుడు ఎచటకు పోవునొ వాడు!
నీకూ - వానికి - అసలు తెలియదు.

జీవప్రవాహము అట్టిదె - వినుము
ప్రకృతి ఆడెడి నాటకమ్ములో
జీవులు మాత్రము పాత్రలు - రాజా!
పాత్రలుఅన్నియు చివరకు వుండవు

అంతమాత్రమున అంతులేనిదగు
అనురాగమ్మును పెంచు కొనుటది
అవివేకమ్ము అని చెప్పగను
అంతరంగమున జ్ఞానోదయమయె

నచ్చిన పాత్ర - నచ్చని పాత్ర -
నాటకమ్మునకు పరిమిత మంతే -
మనసుకు నచ్చెను - అని కోరినను
ఆపాత్ర మాత్రము - వెడలును తప్పక

మురికి కూపమున పురుగుమాదిరి
సంసారవలయమున చిక్కితి నేను
ఉద్ధరించగా వచ్చిరి మీరు
మీ గురించి నే వినగోరితినన

విజ్ఞాన నేత్రమును విప్పిచూచిన
విషయ మంతయు అవగత మగును
మృత్యువువచ్చిన ఎదిరి నిలచెడి
జీవి ఒక్కడూ లేడు వింటివా!

పలికెనప్పుడు అంగిరసుండు
మరచిపోతివి - నీచేతను - నే
పుత్రకామేష్టి చేయించితిని
ఈయనగారు బ్రహ్మకుమారుడు

ఈశ్వర దేవుడు మాయ సాయమున
సృష్టించును తను - కొన్నిపాత్రలు
తానే వాటిని సంహరించును
సృష్టి స్థితి లయ కారకు డాహరి

నాడుచెప్పితిని - నీకొక - మాట
తనయుని వలన - సుఖదుఃఖములు
అనుభవింతువని - జ్ఞప్తియున్నదా!
అటులజరిగెను వివరము - వినుము

తనయులు కలిగిన తల్లిదండ్రులు
ఎంతటి బాధలు పొందుచుండిరో
అన్నియునీకు – కలుగుట జరుగును
దానివలన మరి ఏమి సుఖమయా!

సిరిసంపదలు – రాజ్యభోగము
దారాపుత్రులు – భవంతులన్నీ
శాశ్వతముగా నీతోనుండున!
అట్టిభ్రమయది జీవికి వుండును.

గాలికి చెదరిన మబ్బుల మాదిరి
నిలబడవయ్యా! బంధములన్నీ
కలలోగాంచిన దంతా మనము
కావలెనన్న – వచ్చుట జరుగదు.

ఒకరివెంబడి ఒకరుగ వచ్చి
వరుసలు కలిపి బంధువులగుదురు
కాలముతీరగ – ఒకరి కోసమై
మరియొక రెంతయు ఆగరు రాజా!

ముందూ – వెనుకలు – అంతవరకునే
మూర్ఖత్వముతో – శాశ్వతమనుకొని
తెగని బంధమని – భ్రమలో పడెదరు
చావు అనెడి – ఒకవ్రేటుతొ తెగునవి.

అందువలననే – ఈబంధములను
త్రెంపుకు – మనము శాశ్వతమైన
ఆనందమును అనుభవించుటకు
శ్రీహరి ధ్యానము – ఒకటే మార్గము

రాజా వినుము – ఈపుణ్యాత్ముడు
నారదమహర్షి – నీకై వచ్చెను
తరుణోపాయము నీకు చెప్పును"
అనగానంతట – పలికె నారదుడు.

"రాజా నీకు విష్ణుపూర్వకము
దివ్యమంత్రము ఉపదేశించెద
ఏడురాత్రులు నిశ్చల భక్తితొ
జపించినంతనె – దర్శనమగును

సర్వజీవులకు సంకర్షణుడే
దిక్కగురాజా! అందువలననే
ఈ బంధములను త్రెంపుకు నీవు
కర్తవ్యముగా హరిని భజించుము

అంగిరసుండు చెప్పెనదంతా
యదార్థమయ్యా – అయినా వినుము
ఈమృతశిశువును బ్రతికించినచో
ఏమి సుఖమొ – అది అడిగి తెలుసుకో!

అనుచు నారదుడు – జీవుని పిలచి
నీ కొరకై – నీ తల్లిదండ్రులు
బంధువులందరు – చింతలోమునిగిరి
కావున నీవు – బొందెలో – జేరుము

పితృ పితామహ దత్తము అయిన
గద్దెనెక్కి మరి – పరిపాలించుము
అనగా వెంటనె – శిశువు కదిలెను
బ్రతికె నాతడు – కన్నులు తెరచెను

అంతట ఆగక - బ్రతికిన శిశువు
గంభీరముగా - పలుక జొచ్చెను
మౌనిపుంగవా - ఎన్నిజన్మలో
గర్భవాసమున - బాధలు పడితిని.

పుట్టుచు - గిట్టుచు - విసిగిపోతిని
వీరు నాకు - తలిదండ్రులు అనెడి
నియమము ఏమియులేదు - వింటివ!
ఎన్నిజన్మలో - ఎందరు తండ్రులో!

గర్భవాసముల - నరక బాధలు
అనుభవించితి - నాకు బంధువులు
ఎందరుగలరో - వారిని వదలితి
నాత్రోవను - నే చూచుకొంటిని

బంగారములో పొదిగిన గాని
రత్నము వేరు - బంగరు వేరు
విలువ కట్టునపు డారెంటికిని
సంబంధమును - చూడరు గాదా!

దేహము అనగా - దహింపబడునది
ఇదిపోవగను - మరియింకొకటి -
జీవునికిందులో - సంబంధము అది
వట్టిభ్రాంతియని - తెలియగవలెను!

జన్మలులేని - పుట్టుక - లేని
అభవుడు ఆతడు - విరాడ్రూపుడు
అంతా తనలో నిలపినవాడు
అన్నిటియందు - నెలకొనువాడు

స్థూల సూక్ష్మ రూపమ్ములున్నను
ఆపరమాత్మ అణువు కంటెను
అణురూపుడు మరి మహాత్ముడాతడు
జ్యోతిరూపుడుగు స్వయంప్రకాశము

మాయను పంపి - దానికి తోడుగ
గుణముల నిచ్చి - భూతసృష్టిని
చేయించుచును వినోదించును
దేహి స్వతంత్రుడు కానేకాదు!

చావు పుట్టుకల యందున దేహికి
ఎట్టి స్వతంత్ర లేదని తెలియుము
అట్టిశక్తిని - అధికారమును
కలిగియుండును నారాయణుడు

మౌనిసత్తమా! ఇల్లాలెవ్వరు!
పిల్లలు - భర్త - బంధువులెవ్వరు
శత్రులు మిత్రులు అన్నవన్నియు
మోహములో మరి చిక్కిన వానికి

ఈశ్వరుమాయ - జగత్తు అన్నది
తెలిసిన వానిని - మాయచేరదు
అన్నీతెలిసి - తిరిగి నన్ను మరి -
ఈనరకమ్మున అడుగిడ మందువ!

సర్వబంధములు విడిపోయినవి
ఈశ్వరునిలొ నే కలువనుంటిని
కోటలు పేటలు బంధుమిత్రులు
తల్లి దండ్రుల బంధముతెగినది

నన్నుతిరిగి మరి - లాగకు స్వామీ!
నాచే - రాజుకు హితముచెప్పగ
ఆదేశించి - పిలచిన ఘనుడవు
నాకై దుఃఖము - అవివేకమ్మగు.

శలవునిమ్ము - మరి మౌనిపుంగవా!
అనుచు జీవుడు - వెడలిపోవగా
తిరిగి - శరీరము రంగుమారినది
జీవకళయది - ఎగిరిపోయినది

అచ్చటివారు అచ్చెరువందిరి
చిత్రకేతువుకు జ్ఞానోదయమయె
శోకముతొలగి - ఆ మృత శిశువుకు
పారలౌకిక క్రియలనుజేసెను

సుస్నాతుడయి ఆశీనుడవ
నారాయణమంత్రమ్ము నంతట
నారదమహర్షి ఉపదేశించెను
మునులిద్దరును నెలవుల కరిగిరి

బురదనుండి మరి బయిటకువచ్చిన
గజము మాదిరి చిత్రకేతువు
సంసారపంకమును వదలి బయటపడి
నారాయణమంత్రమ్ము జపించెను

ఏడురాత్రులు నియమ నిష్టతో
జపియించగను హరి కరుణించెను
దివ్యవిమానము పంపెను భువికి
ఆరూఢుండై రాజు వెడలెను

ముక్తిమార్గము కోరవలసినది
ముక్తిధామము శాశ్వతమైనది
అట్టి నెలవుకై - హరిని భజించిన
ఇహబంధములు - విడివడిపోవును.

॥శ్రీ కృష్ణచరితము॥



## 6 చిత్రకేతుడు - అనంతుని అనుగ్రహం పొందుట

చిత్రకేతుని మదికోరినటు
దివ్యవిమానము సాగుచున్నది
త్రిలోకమ్ములను తృటిలోత్రిప్పుచు
అన్నివింతలూ చూచుచు సాగెను

కొంతదూరము సాగిన తదుపరి
విమానమ్మును ఆపెను అతడు
క్రిందకుదిగెను అచ్చటగాంచెను
అమోఘమైన దృశ్యమునంత

అనంతుడచ్చట అగపడినాడు
ముత్యమ్ములతో పోలెడిఛాయతొ
పట్టువలువలు వెలుగుచున్నవి
మణిమయశోభిత మకుటములున్నవి

కంకణములు కేయూరములు -
నడుముకు బంగరు సూత్రముగలదు
కరుణారసము ఒలికెడి కన్నులు
కాంతులీనెడి దేహచ్ఛాయతో

అనంతుగాంచి పులకరించెను
కరములు మోడ్చి నమస్కరించెను
పరవశమ్ముతో పలుకులురాక
మూగబోయి - అట నిలచెనాతడు

చిరునగవులతో అనంతుడంతట
చిత్రకేతును గాంచిన యంత -
పలుకు శక్తిమరి కలిగెనాతనికి
ఒడలుమరచి ప్రార్థించె నప్పుడు

"స్వామీ నాపై దయగలిగినదా!
ఇన్నాళ్ళకు నీ దర్శనమైనది
భక్తులకందే వరదుడవీవు
నీభక్తులలో జేర్చితివందుకు

నీదర్శనమున - సర్వము లభ్యము
సృష్టిస్థితి లయ కారుడవీవే
నీవలజన్మించిన వారైనను
అంతా తమదని గర్వపడెదరు

అణువునుండి బ్రహ్మాండమువరకూ
పుట్టుకనుండి పరమపదమునకు
మధ్యనగలవవి - అన్నీనీవే
ఆగమాలతో నుతులనందెదవు

అంతటినీవు - అనంతమూర్తివి
అభవుడ - వీవు అక్షరమూర్తివి
అనుగ్రహించి దర్శనమిడితివి
అచ్యుత - నాదే అదృష్టమ్ము

సంసారకూపమున - చిక్కిన నన్ను
ఉద్ధరించగా నారదమహర్షి
నారాయణ మంత్రమ్మునిడెనయా!
మంత్రఫలమును గాంచితి కన్నుల

నాతపమ్ములు ఫలియించినవి
నాజన్మమది తరియించినది
నీపద దర్శన మందగలిగితి
నారాయణ మంత్రమ్ము - నీవె కద!

కర్మకాండలతొ నిన్నుగనుటకు
చేయుప్రయత్నము వ్యర్థమైనది
మిణుగురు కాంతుల సహాయమ్ముతో -
సూర్యుని గాంచుట యట్టి - వ్యర్థమది

భక్తిఒక్కటే - నిన్నుగాంచుటకు
నిర్ణయించిన రాజమార్గము -
బ్రహ్మాది దేవతల స్తోత్రమ్ములతో
ప్రసన్నుడవై - భూమిని మోతువు.

ఆవ గింజవలె - వసుధ నంతను
తలపైధరించు - పన్నగరాజా!
కరుణాసాగర - దయాజలనిధీ
అనుచు పలుకుచు - మోకరిల్లెను

ఆతని భక్తికి - మెచ్చె ననంతుడు
"భక్తాగ్రేసర - నాతత్వమును
అంగిరస నారదులు తెలియజెప్పిరి
దాని వలనను - గాంచ గలిగితివి.

తత్వవేత్తలలొ ఉత్తముడవయి
నాదుతత్వమును తెలుసుకొంటివి
సర్వభూతముల నుందును నేను
నాయందుననే - జగత్తు నెలకొను

శబ్దబ్రహ్మము - భూతభావనుడ
సర్వలోకముల నిలపెద నేనే
మాయను గెలిచిన మనోనిగ్రహుడు
నన్నుతెలియగా - సమర్ధుడగును

తత్వముతెలిసి భక్తితొభజించి
తరించుటకిది దివ్యసాధనము
దుర్లభమైన మానవజన్మను
తరించుటకై నియోగించవలె

దారాపుత్రులు - భోగభాగ్యములు
ఐహిక వాసనలందు మునిగిన
తరించుటకు మరి సమయము ఏది!
అట్టిమనస్సున - భక్తి కుదురునా?

కర్మఅగునయా - దుఃఖహేతువు
క్షణిక సుఖముల ఎరచూపించి
అధోగతికి మరి త్రోయు కర్మలు
పుట్టుట గిట్టుట - వలయములోబడు.

మహానుభావుల ఉపదేశముతో
తత్వవిద్యను ఆకళించుకొని
నను స్తుతించితివి - ముక్తుడవైతివి
అనుచు అనంతుడు - అదృశ్యుడయె

తిరిగి తిరిగి తను వందనముంచి
చిత్రకేతువు విమాన మెక్కెను
కులపర్వతముల పుణ్యభూముల
విహరించె నెన్నో - దివ్యవర్షములు

వానినిగాంచి - సిద్ధులు మునులు
గంధర్వ చారణ పరమయోగులు
స్వయముగవచ్చి స్తోత్రముచేసిరి
వారి మన్ననల నందెడివాడు

ఒక్కొకసారి యక్ష కిన్నరల
రావించి - వారిచే హరిని భజించెడి
పాటలు - నాట్యము - చేయగ బలికి
హరిధ్యానములో మునిగెడివాడు

హరి కీర్తనము - కథాశ్రవణము
మించినపని యిక లేదు ఆతనికి
వారితొ - తాను నాట్యమాడుచు
తన్మయత్వమును పొందెడి వాడు

హరిభక్తులకు ప్రణామమిడుట
ఆతని - ప్రాతఃకాలపు సేవ -
వైష్ణవ భక్తులగూడి చర్చలు
మధ్యాహ్నమున నిత్యకృత్యము -

హరి పూజయది సాయంసేవ
నామ కీర్తనము - కథాశ్రవణము
రాత్రిచర్యగా - సాగిపోవుచు
హరి అవతారము - అన్నటు నడచెను.

అతడొకమారు - విమానమ్ముపై
విద్యాధర యక్ష గంధర్వులు
వెంటరాగను - వెండి కొండ గని
ముందుకుసాగి - కైలాసమేగెను

విమానమ్మును దిగి అంతటను
ముందుకుసాగి - నిండుకొలువులో
ఆశీనుడగు అంబాపతిని
గాంచెను - కన్నులపండువగాను.



॥శ్రీ కృష్ణచరితము

## 7 చిత్రకేతువును గౌరీదేవి శపించుట

ప్రమధగణంబులు స్తుతించుచుండెను
వేదనాదము ప్రతిధ్వనించెను
మృదంగ ధ్వనులతొ వెండికొండయది
మారుమ్రోగెను - మంగళకరముగ

అభవుని గాంచి - పలికెనంతట
సిగ్గుమాలిన విధముగ - నిచట
అందరిముందు - అంబికతోను
కూర్చొనుటయది సహించరానిది

దేవగణంబులు - గరళ కంఠుని
దయాగుణమును పాడుచుండిరి
వింజామరలు వీచుచుండగా
కరకంకణములు మ్రోగుచున్నవి.

తపోధనులు మరి వేదాధ్యయనులు
పరాయి మగవారెందరొ వున్న
నిండుసభలొ - మరి భార్యతొ యిచట
కౌగిలించుకొని - కూర్చొనదగునా!

భృంగి - నాట్యము సలుపుచుండగా
మంగళధ్వనులు వినబడుచుండగ
మంగళగౌరిని - అంక పీఠమున
కూర్చొనబెట్టుకు - అభవు డుండెను

ఏకాంతముగా కాంతతొ నుండుట -
అన్నవిషయము - మరచెను శివుడు -
ఆమాటలను సభికులు వినిరి
చిత్తురువులవలె కూర్చొనియుండిరి.

నిండు సభయది తీర్చిదిద్దిరి
సగమేనిచ్చిన - శాంభవి నంత
దగ్గర జేర్చుకు - శంభుడు కూర్చొని
నాట్య వాద్యముల - పరవశించెను

అన్నీవినియు - చంద్రశేఖరుడు
మిన్నకుండెను - మారుపలుకక
పార్వతి ముఖము - జేవురించెను
క్రోధము ఎగసెను - పలికె నంతట

ఆసమయుములో ఆ సభలోనికి
చిత్రకేతువు అడుగుబెట్టెను
నాలుగువంకల కలయజూచెను
ఫక్కున నవ్వెను - పేరోలగమున

నీతులుచెప్పగ - వచ్చిన వీడు
ధర్మస్వరూపము తెలిసినవాడా!
ఎంత ధైర్యము తెగింపుతోను
దూషించెను - నా మంగళమూర్తిని

ఈశ్వరదూషణ చేసిన వీడు -
ముల్లోకముల ప్రభువగు ఈశుని
స్వరూపమసలే - తెలియక పోయెను
దేవదేవుడు - జగత్కారకుడు.

నాకలోక పతి - నేరుగవచ్చి
అభవుని పదములు శిరస్సునుంచి
కిరీటకాంతులతో - నీరాజనమిడి
జన్మధన్యమని తలంచుగాదా!

పన్నగ హారుడు - పాపహరణుడు
దిగంబరుండు సర్వవ్యాపకుడు
ఆయన మూర్తిని - వేదమ్ములవి
నిర్వచించగ లేక పోవును

మంగళదాత - నామనోహరుడు
దయాంతరంగుడు గిరిజారమణుడు
అంతటివానిని - హేళనచేసే
వీడు దుష్టుడు - వివరము ఎరుగడు.

హరి భక్తుడనని విఱ్ఱవీగుటతో
హరించిపోవును - వీని పుణ్యము
అనుచు శాంభవి ఆగ్రహమ్ముతో
రాక్షసుడవై పోదువు అనెను -

అటుల శాపమిడి బుద్ధిగ బ్రతకగ
పలికి - తిరిగి - తన గద్దెనెక్కెను
చిత్రకేతువు - గ్రహించె సర్వము
అమ్మకు - సాష్టాంగ - వందనమిడెను.

జగజ్జనని - నీవిడిన శాపమును
దోసిటగైకొని స్వీకరించితి
కర్మఫలములు అనుభవించక
ఎంతటివారికి - తప్పదు తల్లీ

సుఖదుఃఖములు - మోద ఖేదములు
కర్మఫలితము - జీవికి తథ్యము
స్వతంత్రుడొకడే ఆ పరమాత్మ
మాయకులొంగని - మహిమాన్వితుడు

లీలానాటక సూత్రధారి తను
ఆడించు నిల నాటకమ్మును
అందులో పాత్రలు - తల్లీ తండ్రీ
ఆలు బిడ్డలు - బంధు మిత్రులు

శాపమిడితి వని - కోపము లేదు
తల్లి - పిల్లలను దండించునటు
నీకధికారము ఉన్నది తల్లీ
నిన్నధిక్షేపించితి - నన్నది - క్లేశము

లోకపావనివి - గేలిచేసితిని
ఆ బాధ - మదిని మరి - కలంచుచున్నది
అనుచు - అందరికి వందనముంచి
దివ్యవిమానము నెక్కిసాగెను

అంతట శివుడు బ్రహ్మాదులకు
శివభక్తులకు జగన్మాతకు
తెలియగ పలికెను భక్తునిఘనత
హరిభక్తుని - సంయమనము అదియనె

హరిభక్తులకు - స్వర్గనరకములు
సుఖదుఃఖములు తృణప్రాణయమ్మగు
నేను - విరించి - ఇంద్రాది నారదులు
యోగులు ఋషులు శ్రీహరి అంశయె

సర్వేశ్వరుడై అంతట వుండే
హరిభక్తునికి - అంతాఒకటే
అయినది - కానిది - అన్నదివుండదు
అట్టిభక్తులలో - ముఖ్యుడీతడు

వాని భక్తికి మెచ్చిన శ్రీహరి
దర్శనమిచ్చి ముక్తుడవనెను
అంతటియోగ్యుడు - తిరిగి తానుగా
ప్రతిశాపమును - ఇవ్వగచాలును

దేవీ! వినుము! తిరిగిశపించక
నిన్ను - అంటినని - వంతనొందెను
అంతటి ఉత్తము డా హరిభక్తుడు
ఆత్మద్రష్టని - నడవడి అదియే

గౌరీ! నీవు తొందరపడితివి
భక్తులు శాంత స్వభావులుకనుక
తిరిగి శపించగ - శక్తికలిగియు
నిగ్రహమ్మది కలిగియుందురు.

ఆశ్చర్యములో మునిగె నపర్ణ
హరిభక్తుని మరి శపించితినని
మదిలో - కొంత - చింతిల్లినది
తొందరపాటుకు వంతనొందినది

రాజా! వింటివ! భక్తుని శాంతము
గౌరిశాపముకు చలించలేదు
హరిభక్తుడనని గర్వించకను
సామాన్యునిగా తలను వంచెను -

ఆ చిత్రకేతువే - విశ్వరూపుడు
ఇంద్రుని చేత వధింపబడె గద
తదుపరి త్వష్ట చేసిన యట్టి
మారణయజ్ఞము వినిపించితిని

ఆయజ్ఞములో దక్షిణాగ్నిలో
ఉద్భవించిన వాడే - వృత్రుడు
గతజన్మలొ మరి హరి - భక్తుడాతడు
కావున వృత్రుడు - శ్రీహరిభక్తుడు.

చిత్రకేతుని ఉపాఖ్యానము
భక్తిశ్రద్ధల - వినిన చదివిన
దుష్కర్మ - ఫలములు హరించిపోవును
భోగభాగ్యములు - సిరి సంపదలమరు

దీర్ఘాయువును ఆరోగ్యమును
లభించి - బ్రతుకు సుఖముగ సాగును
బంధుమిత్రులతొ - గృహస్తుసుఖపడు
మనశ్శాంతిని - కలిగియుండును

పరంధాముని పదములపైన
భక్తిబలపడి ముక్తినొసగును
హరిభక్తులతో నెయ్యముచేసి
హరినిభజించు భాగ్యము అమరును.

॥శ్రీ కృష్ణచరితము॥



# 8 సవితృవంశ కథ

రాజా! నేను చెప్పబోవునది
త్వష్టయొక్క వృత్తాంతమయా!
ఆతని తదుపరివాడు - సవిత
ఆసవిత వంశము చెప్పెద వినుము.

పృశ్ని - సావిత్రి - వ్యాహృతి అనెడి
ముగ్గురు భార్యలు సవితకు రాజా!
అగ్నిహోత్రములు పశుసోమ పంచయజ్ఞములు
భార్యలయందు సవితకు కలిగెను

భగుని భార్య అగు సిద్ధియందున
భగుడు కనెను తా ముగ్గురు తనయుల
మహిమ-అనుభవ-విభవులు వారు -
అశిష్ట - అనెడి కూతురుకలిగెను

అశిష్ట - ఎంతొ గుణశీలియగు
సర్వలోకముల కారాధ్య యైనది
ధాత భార్యలు కుహూ - సినీవాలి
రాక - అనుమతి - అనెడివారలు

కూహూ తనయుడు-సాయం అగును
సినివాలికి - దర్శాఖ్యుడు-కొడుకు
రాక - తనయుడు-ప్రాతర్నాముడు
అనుమతి - సుతుడు-పూర్ణిమాఖ్యుడు

విధాత క్రియా - అనెడి భార్యతో
అగ్నికనెను మరి పురుష్యాదుల
వరుణుని భార్య వర్షిణి రాజా!
వారితనయులు భృగు - వాల్మీకులు

మహాయోగి అయ్యె-నా వాల్మీకి నరపతీ!
మిత్రావరుణులకు - పూర్వశ్రీని - గన
తేజము స్ఖలనము అయినది - దానిని
కుండలో మరి భద్రపరచగా

దానివలనను అగస్త్య - వశిష్టులు
ఉద్భవించిరి - ఓమహరాజా!
మిత్రునికి మరి రేవతి యందున
అరిష్ట - పిప్పలు లుద్భవించిరి

ఇంద్రునికంతట పౌలోమి యందున
జయంత - ఋషభ - విదుషులుపుట్టిరి
వామనుడై త్రివిక్రమునకు
కీర్తియందు - బృహచ్ఛోక్లుడు పుట్టెను

సౌభగాదులు వారికి కలిగిరి
కశ్యపునకి మరి అదితి యందున
వామన మూర్తి ఉద్భవించెను
ఆవివరములు - తెలిపెద నీకు

ఇప్పుడునేను చెప్పెడి వివరము
కశ్యపునకు మరి దితితో కలిగిన
దైత్యులసంగతి - వారియందున
బలి ప్రహ్లాదులు అగ్రగణ్యులు.

దితి తనయులలో అతిబలవంతులు
హరణ్యకశిప - హిరణ్యాక్షులు
హిరణ్యకశిపుని భార్య 'కయాధుపు'
బంభాసుబలి - పుత్రిక ఆమె

ఆదంపతులకు ప్రహ్లాదుడు మరి
అనుహ్లాదుడు - సంహ్లాదుడును
హ్లాదుడు-అనెడి కొమరులు మరియు
సింహిక అనెడి కూతురు గలిగెను.

విప్రజిత్తు సింహికల-తనయుడు రాహువు
అమృతపానము సమయములోన
శ్రీహరి వాని శిరమును తృంచెను
ప్లహ్లాదుని వివరము చెప్పెద-తదుపరి

సంహ్లాదు - గతి-లకు పంచజనుండు
హ్లాద ద్రమనులకు-వాతాపి ఇల్వలులు
వారిద్దరిని - అగస్త్యమహర్షి
సంహరించి మరి పీడ వదల్చెను

అనుహ్లాదునికి - సూర్మ్య యందున
బాష్కల - మహిషులు ఉద్భవించిరి
ప్రహ్లాదునికి - దేవి యందున
విరోచనుడను తనయుడు కలిగెను.

విరోచను సుతుడు-బలి మహరాజా!
బలికి-అశన యను భార్యయందున
నూర్గురు కొమరులు కలిగిరి-వారిలొ
జ్యేష్టకుమారుడు - బాణాసురుడు

బాణాసురుడు - శంకరు భక్తుడు
ప్రమథగణంబుల ముఖ్యుడాయెను
శివునికి-ఆతడు పార్శ్వము నుండును
దితికి సంతతి - మరుద్గణములు

మరుద్గణములు నలభైతొమ్మిది
వారందరును దేవత్వముతో
ఇంద్రునితో అమరావతి నుందురు
అనగా - అడిగెను పరీక్షిన్నృపుడు

సురాసురులకు బద్ధవైరము
మరి ఆ అసురులు - దేవతలైరా?
ఇంద్రునితోను కలిసియుందురా!
అది ఎటుసాధ్యము తెలియబరచుడు.

అనగా శుకుడు ఆరంభించెను
దితికి పుట్టిన దైత్యులెందరినొ
ఇంద్రుడు అంతము చేయుటగాంచి
కడుపుశోకముతొ తల్లడిల్లినది

సోదరులనటు చంపిన ఇంద్రుని
అంతుచూడగా సంకల్పించెను
భర్త - కశ్యపుని అనుగ్రహముతో
హరి - దయతో సాధించనెంచెను.

నాటినుండి తను అతిభక్తిగను
అనురాగమును ఒలకబోయుచు
భర్తమనస్సును గెలువ నెంచెను
మన్మథ శరములసాయము గొనెను

అటుల భర్తకు ప్రియతమురాలై
గీటు దాటనటు - తయారుచేసెను
ఆనందవార్నిధిని ముంచి - తేల్చెను
అతివ శక్తియది అజేయమైనది

అంతట భర్త ఆప్యాయముగా
కోరినదిత్తును కోరుకోమనె -
తనను ప్రసన్నుని చేసిన ఆమెకు -
సర్వేశ్వరుడే - ప్రసన్నుడనెను

సమయముకొరకై వేచియున్నది
అడిగెను - ఇంద్రుని - చంపగజాలిన
తనయు నొసగమనె - అంతేగాక
అతడు - చావులేక దేవత్వమందవలె

విషయముతెలిసెను కశ్యపుడంతట
తన బలహీనత కెంతొ వగచెను
మగువ తెగువతో అడిగిన దానిని
మాటదప్పి మరి కాదనలేదు

సరియని పలెకె - అందుకొరకై
పుంసవనమ్మను - ఒకవ్రతమ్మును
ఒకఏడాది అతి నిష్టగను.
ఆచరించమని తెలిపె విధానము.

॥శ్రీ కృష్ణచరితము॥



## 9 పుంసవనంచేసే విధానము

హింసనుచేయు తలంపుకూడదు
బిగ్గరగా మాటాడ కూడదు
అసత్యమసలే పలుకగరాదు
గోళ్ళు, కేశములు, తీయ కూడదు.

ఎముకలు పుర్రెలు అమంగళమ్ములు
చేతితో మరి - తాకగరాదు
నిలవ నీటితో - నూతినీటితో
స్నానముచేయుట నిషిద్ధమైనది

నదీజలముల - తటాకాలలో
స్నానము చేయుట నిర్ణయించిరి -
దుర్జన - సంభాషణ కూడదు మరి
విడిచిన బట్ట - కట్టకూడదు

పెట్టి విడిచిన పూలు - నిషిద్ధము
భద్రకాళికి నివేదించినది -
క్రిమికీటకములు కలిగినయట్టిది -
ఎంగిలిదైన అన్నము కూడదు.

మాంసాహారము తాకకూడదు
మడిగా లేని అన్నము వలదు
కేశములుపడి - కాకులు గద్దలు
ముట్టిన అన్నము - నిషిద్ధమైనది.

దోసిట - నీటిని త్రాగగరాదు
సంధ్యలయందు - విరబోసిన జుట్టుతొ
వుండుట - ఎంతో నిషిద్ధమైనది
వెర్రితిరుగుడు అసలేకూడదు

అలంకారములు ధరించవలెను
మితిగా - హితముగ మాటాడవలె
కాళ్ళుకడుగుకొని పడుకోవలెను
తడికాళ్ళతొ - పవళించ కూడదు

పడమటిదిశగా పడుకోరాదు
వివస్త్రగా మరి పడక నిషిద్ధము
పవిత్రమ్ముగా శుచిగా నుండి
తెల్లని బట్టలు ధరించవలెను

తూర్పుదిశగ మరి కూర్చొని భక్తిగ
రమ-రమాధవుల భజించవలెను
షోడశోపచారమ్ములుచేసి
శాస్త్రోక్తముగా పూజచేయవలె

అటుల ర్చించి 'హవిశ్మషం'
ద్వాదశాహుతుల వ్రేల్పించి మరి
నమస్కరించి - భగవ న్మంత్రము
పదిమార్లు గను - జపించి అంతట

స్తోత్రముచేసి - గంధపుష్పాక్షతల
ముత్తైదువులను పూజించవలె
భర్తకు నిరతము నిండుభక్తితో
సేవనుచేయుచు ప్రియముగూర్చవలె.

తనయుడు కడుపులో వున్నాడన్నటు
ఆనందముగా నుండగ వలెను
మార్గశీర్షమున శుద్ధపాడ్యమిని
ఆరంభించి ఈవ్రతమ్మును

పన్నెండుమాసములు నిష్ఠగచేసి
ఉద్యాపనను చేయగవలెను
ఏమరుపాటు దరి రానీయక
వ్రతము చేసిన కోర్కెతీరుననె"

దితి తా నెంతో సంతోషించెను
వ్రతము నెరుపగా - సంకల్పించెను
శుభముహూర్తమున ఆరంభించెను
పతి అనుగ్రహము కలిగిన దామెకు

గర్భవతిఅయి - నియమనిష్ఠల
వ్రతముచేయుచు నుండగ నపుడు
విషయముతెలిసి దేవేంద్రుండు
వంచనతోను - పంచ జేరెను

సేవలుచేసెడి నెపముతోడను
వేషముమార్చి - వచ్చినయంత
ఇంద్రుడాతడని - తెలియక నామె
సేవలుచేయగ - అనుమతించెను

దర్బలు కట్టెలు - తీసుకువచ్చుచు
కాయలు పూలు - సమకూర్చుచును
సమయము కొరకై - వేచియుండెను
అనుమానించక పోయెను - దితి అట

ఒకదినమ్మున - అలసట నిండి
భోజనమైన తదుపరి ఆమె
కాళ్ళుకడుగుకొన - మరచి పోయినది
గర్భభారమున - కూర్చొన లేక

పడుకొని నంతనె - నిద్రపట్టెను
అదేసమయమని నాకలోక పతి
మాయతో - ఆమె గర్భపిండమును
ఏడుముక్కలుగ - నరకివేసెను

ఏడుముక్కలవి ఏడ్చుచున్నవి -
ప్రాణము కలిగి యున్నవి అవ్వి -
ఏడ్పునాపుడు అనుచు వాటిని
తిరిగి ఏడుగా - ఖండించె వజ్రమున

అటులముక్కలు నలభైతొమ్మిది
సజీవమ్ముగా ఏడ్చుచున్నవి
తిరిగి నరకగా - యత్నించగను
తమ్ముల - మమ్ము చంపకు మనిరి

అతి దీనముగా - నరకవద్దని
తమ్ముల నిటుల బ్రతకనిమ్మని
అడిగినయంతనె - వదలె నింద్రుడు
వారు తేజముతొ - బయిటకువచ్చిరి

శ్రీనారాయణ మంత్రము మహిమచే
వారు వజ్రమున ఖండింప బడినను
బ్రతికియుండిరి - బయటపడిరట
అంతట దితి - తా - మేలుకొన్నది

విషయము పూర్తిగ గ్రహించెనామె
క్రోధవశమున ఇంద్రునిగాంచి
గద్దించి అడిగెను - జరిగిన విషయము
అంతట పలికెను ఇంద్రుడు భయమున

అమ్మా - నన్ను చంపగ చాలిన
తనయుని కొరకై తపముననుంటివి
విషయముతెలిసి - ఆత్మరక్షణకు
మోసగించి - నిను - దరికి చేరితి

సమయముకొరకై ఎదురుచూచితి
నీవు నియమము తప్పినంతనే
నీగర్భమును - ఛేదించితిని
నారాయణమంత్రమ్మున బ్రతికిరి.

ఇంతకాలము నీవు భక్తిగా
జపించినట్టి నారాయణమంత్రము
అమోఘమైనది - మహిమాన్వితము
చంపకపోయెను - నీ బిడ్డలను

శిశుహంతను - నే - పదములంటితిని
తల్లివి నీవు కాపాడవలె -
తనయుని తప్పులు తల్లికాచు కద!
అనుచు పదముల - ప్రార్థనచేసెను

ఆ శిశువులు - నా సోదరులమ్మా
మాబంధుత్వము నిలచునట్టుగా
ఆశీస్సులను యిమ్ము - అనగను
సర్వము గ్రహించె దితి అంతటను

వారందరిని - కౌగిలించుకొని
దేవతలై మరి జీవించుడని
ఇంద్రలోకమున ఇంద్రునివెంబడి
వుండ మనుచును - ఆశీస్సులనిడె

రాజా! వారే - మరుద్గణములు
సోమపానమున కర్హులాయిరి
దేవతలై మరి అమరావతిలో
ఇంద్రునితోడుగ నుండిరి వారు.

మరుద్గణములు ఉద్భవించిన
వృత్తాంతమును - చదివిన వినిన
పాప నాశనము - రోగహరణము
సుఖశాంతులవి దండిగ కలుగును

అనుచు శుకుడట పరీక్షత్తునకు
తెలిపెను అనుచు సూతుడంతట
అచటజేరిన మునులకు చెప్పెను
హరి లీలలివి పుణ్యగాధలనె.

శ్రీ కృష్ణచరితము - కర్ణపేయము
వ్యాసమౌనికే - శాంతినొసగినది
పోతనయ్య - పులకించి పలికినది
భవ భయ హారిణి - భాగవతమ్ము॥

ఓం శాంతి - శాంతి - శాంతిః





సర్వేజనాస్సుఖినోభవన్తు
లోకాస్సమస్తాస్సుఖినోభవన్తు





**సర్వం శ్రీ సీతారామచంద్ర పాదార్పణమస్తు**



(మకుటం)

శ్రీ కృష్ణచరితము - కర్ణపేయము
వ్యాసమౌనికే - శాంతినొసగినది
పోతనయ్య - పులకించి పలికినది
భవ భయ హారిణి - భాగవతమ్ము॥

# శ్రీమద్భాగవత - మకరందము

## (సప్తమస్కంధము)

### విషయ సూచిక



❋❋❋

శ్రీరామ

ఓం - నమో - వాసుదేవాయనమః

# శ్రీమద్భాగవత - మకరందము

## (సప్తమస్కంధము)

శ్రీ శుకయోగికి వందనముంచి
పలికెవినయముగ - రాజవరేణ్యుడు
నా సందేహమ్ము తీర్చుము స్వామీ
శ్రీహరి లీలలు - అవతారమ్ములు

అన్నీ - అసురుల చంపుట కొరకే
అమరుల - తాను కాపాడుటకే -
మోక్షప్రదాత - ఆయన గనుక
సురాసురులలొ భేదము ఏల?

రాక్షసవైరము - కలుగుటెందులకు
చంపుటెందులకు - ధర్మము అగునా?
సర్వ భూతముల సమానుడైన
హరికి జీవులను - చంపుట తగునా!

అంతట పలికెను - శుకయోగీంద్రుడు
నీవు చక్కగా అడిగితివయ్యా!
హరి కథలన్నవి - సందేహములిడు
ఆశ్చర్యమును కలిగించునయా!

శ్రీహరిభక్తుల చరితలన్నియు
భక్తినిపెంచి శుభములనొసగును
ఐశ్వర్యకారకము లంతియె గాక
మునుల ప్రశంసలు అందుకున్నవి

నీసందేహము తీర్చెద నిపుడు
అనుచుపలికి ఆ శుకయోగీంద్రుడు
నారాయణాంశతొ అవతరించిన
వ్యాసులవారికి వందనమిడెను

రాజా! అభవుడు నారాయణుడు
సర్వవ్యాపకుడు త్రిగుణాతీతుడు
ప్రకృతికాతడు వశుడు కాడయా!
కావున జన్మలు హరికి లేవయా!

తనుకల్పించిన మాయకు వశుడై
బాధ్యతలున్నటు కనబడుమనకు
నిజమునకా హరి గుణరహితుడయా!
గుణములకే మరి వృద్ధి క్షయములు

ఒక దృష్టాంతము - సూర్యదేవుడు
అనేకచోట్ల అనేకవిధముల
అగుపించినను ఒకడే కాదా!
అటులే శ్రీహరి ఒకడే అన్నిట.

తత్వవేత్తలు సాధనతోను
ఆత్మస్వరూపుడు ఈశ్వరుడనుచు
తెలుసుకొందురు ఆ ఈశ్వరుడు
జీవాత్మకు మరి పైవాడయ్యా!

విశ్వసృష్టికై మాయ సాయమున
త్రిగుణమ్ములను సృష్టించి మరి
గమనము కలిగిన కాలమునపుడు
సృష్టించును విను - లీలా మాత్రుడు.

కాలముతానై సృష్టికార్యమున
సాత్వికగుణముతొ సురల సృజించి
రజస్తమముల అసురుల సృజించి
వారినిపెంచి - వీరిని తృంచును

ఈవిషయమును పూర్వకాలమున
రాజసూయము చేయు సమయమున
ధర్మరాజుకు తెలిపె నారదుడు
అది వివరించెద విను మహరాజా!

రాజసూయమును చేయునప్పుడు
అర్ఘ్యప్రదానము - అగ్రపూజకై
ఎవరిని ఎన్నగవలెనో తెలియక
తికమక పడెను యుధిష్టరుండు.

అంతట సభలో శ్రీకృష్ణునికి
అగ్రపూజను చేయగ - గాంచిన
శిశుపాలాదులు దూషణచేసిరి
ఎంతో ఓర్పుగ సహించె కృష్ణుడు.

రెచ్చిపోయిన శిశుపాలుని గని
ఎంతో ఓర్పుగ కృష్ణుడు సహించె
ప్రేలాపన శృతిమించగ నంత
సుదర్శనమ్మున త్రెంచెను తలను

అంతటఅచ్చట దివ్యతేజము
శిశుపాలుని దేహమునుండి వెలువడి
శ్రీకృష్ణునిలో కలిసిపోయెను
వానికి మోక్షము నిచ్చెను శ్రీహరి

ధర్మరాజుకు అచ్చెరువాయెను
చెంతనె వున్న నారదుగాంచి!
స్వామీ! చూచితి వీదృశ్యమును
అద్భుతమైన సంఘటకదా!

కృష్ణనిందతో బ్రతికెనువాడు
దుర్భాషలను పలుకుటె తెలియును
వానికి కృష్ణునిపేరే గిట్టదు
అంతహేయముగ తూలనాడును

ఇప్పుడు గంటివ నిండు సభలొ మరి
ఎంతటి కఠినపు పలుకులుపలికెను
వినలేనట్టి దూషణచేసెను
అయినావాడు పుణ్యగతికి చనె

వేనుడు - హరిని నిందించగను
మునులశాపముకు గురి యైనాడు
హరించినాడు హరిద్వేషముతో
కానీ నేడు శిశుపాలునిగను

అంతటివైరము వెళ్ళగక్కియు
అందరిముందర కించపరచియు
అంతుదొరకని దివ్యధామము
అమర్చె శ్రీహరి - ఎటుల జరుగునది!

శిశుపాలునికి తోడుగ తిట్టిన
దంతవక్త్రుడు పరమపదముగనె
నాసందేహము తీర్చుము నీవు
నాదు ఊహకు అందని తత్త్వము.

"అంతట పలికెను నారదమౌని
అదియేఅగును జీవరహస్యము
అందరిలోన వివేకి వీవు
అందరి మాదిరి అడుగుట – వింత

దూషణ భూషణ తిరస్కారములు
శరీరమ్మునకె జీవుని కంటవు
పరమాత్మునకు అంటనె అంటవు
దేహముతోనే – అహము ఏర్పడును

నేను చేసితిని – నాకు జరిగినది
అన్నది యింక లేకపోయినచొ
హింస వానికి తగలదు గాదా!
పరమాత్మకు భేదములన్నవి వుండవు.

అందువలననే ద్వేషమ్ముతొ మరి
దూషించెను అని వేరుగచూడడు
అటులే స్తోత్రము చేసెను వీడని
అభిమానించి అక్కున జేర్చడు

దూషించినను స్తుతించిననూ
స్మరణచేయుట జరుగును కాదా
అందువలనే ఆ పరమాత్మకు
అందరు ఒకటే అందు నందరికి

మరియొక మాట నాకు తోచినది
తీరని పగతో వైరభక్తితో
విష్ణుసాయుజ్యము పొందినట్టుగా
భక్తితొ పొందుట దుర్లభమగును.

భ్రమర కీటక న్యాయము మాదిరి
ఏదోపురుగు తుమ్మెద పట్టులొ
పెరిగి – నాదము విని భ్రమరమ్మగు
అటులే మదిలో ద్వేషము ఫలమిడె

అనన్యభక్తితొ – గోపకాంతలు
ప్రాణభయముతో కంసరాజును
పగతో మరి ఆ శిశుపాలాదులు
బంధుత్వముతో వార్ష్ణేయాదులు

విడువనిప్రేమతొ మీరందరును
భక్తి కీర్తనల – మేమందరము
హరికి ఆప్తులము అయితిమిగాదా!
ఏదో విధముగ హరిజేర్చుకొను.



॥శ్రీ కృష్ణచరితము॥

# 1 జయ విజయులు శాపవృత్తాంతము

కామక్రోధ లోభాతిశయముల
హరికి మదిని మరి అర్పించినచో
ఉత్తమ గతికి జేరినారుకద!
కామించుట మరి పురుషుని కమరదు

కావున మిగిలిన క్రోధ లోభముల
హరిని జేర్చగల మార్గములయ్యా!
శిశుపాల దంతవక్త్రులిద్దరు కూడా
పూర్వజన్మలొ ద్వారపాలకులు.

జయ విజయులని వైకుంఠునికి
ద్వారపాలకులు వారిద్దరును
సనక సనందన మునుల శాపమున
పదభ్రష్టులై మరి పుట్టిరి అటుల

అనగా అడిగెను యుధిష్ఠిరుండు
సనక సనందనులనెడి మునులుమరి
సంయమనమ్ము కలిగినవారు
జయవిజయులు మరి హరి పదభక్తులు

వారిని – వీరు శపించుటన్నది
ఆశ్చర్యముగా నున్నది స్వామీ!
అనగా నంత నారదమౌని
వివరించెదనని ఆరంభించెను.

బ్రహ్మమానస పుత్రులు ఐన
సనకసనందను లిద్దరు ఒకపరి
త్రిలోకములలో సంచరించుచు
అయిదారేళ్ళబాలుర రూపుల

దిగంబరులుగా తిరుగుచు వారు
హరిభవంతిలో అడుగిడబోవగ
ద్వారపాలకులు జయవిజయులట
పరుషముగా మాటాడి రప్పుడు

ద్వారపాలకుల లక్ష్యపెట్టక
హద్దుమీరి మరి నడచుచుండిరని
ఆవేశముతో కఠినోక్తులతో
వారి మనస్సును నొప్పించగను

అలిగిన వారు వదరుబోతుల
అంధకారము తొలగించుటకు
అహంకారము అంతరించుటకు
అసురులు గమ్మని శాపమునిడిరి

అంతట శ్రీహరి ద్వారపాలకులు
పదములబట్టి క్షమించమనుచు
పశ్చాత్తాపము నిండి ఏడ్చిరి
జాలికలిగెను మునులిద్దరికి

తిరిగి వారితో పలికిరి వారు
మూడుజన్మలు బద్ధవిరోధము
హరితో కలిగి – హరిని జేరెదరు
అనుచు పరిమితి నిర్ణయించిరి.

జయ విజయులు వారిద్దరుమొదట
దితికి తనయులుగా పుట్టిరి రాజా!
హిరణ్యకశిప హిరణ్యాక్షులు
హరిద్వేషముతో హరిచే మడసిరి

హిరణ్యాక్షుడు వారిలో చిన్న
వరాహవతారము దాల్చిన శ్రీహరి –
దుష్టశిక్షకుడు శిష్ట రక్షకుడు
వానిని వధించి భూమిని గాచెను

అగ్రజుడాతడు హిరణ్యకశిపుడు
వానిని శ్రీహరి – నరసింహునిగా
అవతరించెను – అంతముజేసెను
ఆతని తనయుడు హరిభక్తుడయా!

## సప్తమస్కంధము

ప్రహ్లాదుడనెడి పుణ్యచరిత్రుడు
హిరణ్యకశిపుని వంశాంకురము
అనన్యభక్తితొ హరికి ప్రియతముడు
హరి భక్తులలో శిరోరత్నము

హిరణ్యకశిపుడు హరిద్వేషముతో
హరిమాటను మరి పలికిన తనయుని
చీల్చెదననుచు భయపెట్టినను
తనయుడు హరినే స్మరించసాగెను

మాతృగర్భమున హరినామముతో
పరవశించిన బాలుడు - వదలక
హరినిస్మరించి చెప్పగలేని
బాధలనోర్చెను తండ్రిచేతనే

అన్నిబాధలు శిక్షలుకూడా
అవలీలగను భరించె బాలుడు
అదిగని తండ్రే విస్మయమందెను
అయినా మూర్ఖుడు శిక్షలు విధించె

అన్నిబాధలు పెట్టినగాని
హరిస్మరణను మరి వదలకబాలుడు
దృఢముగనుండగ హరియే దిగెను
నృసింహమూర్తిగ వధించె తండ్రిని

రెండవజన్మలొ ఆ జయవిజయులు
రావణకుంభకర్ణ జన్మలనెత్తిరి
హరి తా పుట్టెను పూర్ణపురుషునిగ
కౌసల్యా ఆనందవర్ధనుడు

రఘునందనుడు అతి విక్రముడు
రావణకుంభకర్ణుల లీలగ కూల్చెను
అగాధను మరి మార్కండేయుడు
తెలుపును మీకు ముందురోజులలొ.

ఆ జయవిజయుల మూడవజన్మ
శిశుపాలదంతవక్త్రులై-హరి ద్వేషులయా
హరినామము విని మండి పడుచును
బద్ధవిరోధము కలిగి యుండిరి

అంతట శ్రీహరి చక్రాయుధమున
వారిని తృంచి సద్గతినిడెను
వారిశాపము తీరెను గనుక
చేరిరి స్వర్గము జయవిజయులుగ

అంతట అడిగెను ధర్మనందనుడు
తనయుని మంచిని కోరెడి తండ్రి
పేరుప్రతిష్ఠలు ఆశించుచును
వాని ఘనతకు పొంగిపోవలె

బాల్యమునుండి హరిభక్తుడయి
అనన్యభక్తికి ఆలవాలమై
భక్తశిఖామణి అని పేరొందిన
తనయునిపైన తండ్రికి వైరమ!

అతిదారుణముగ కన్నకొడుకునే
చంపగనెంచుట ఊహలకందదు
ఆ విషయమును పూర్తిగతెలిపి
నాసందేహము తీర్చుము అనెను

అంతట పలికెను నారదమౌని
తనతమ్ముని శ్రీహరి వధించినటుల
తెలిసిన అన్న హిరణ్యకశిపుడు
హరిపై పగయు ద్వేషముపూనెను.

దారుణమ్ముగా నిర్దయతోను
తమ్ముని చంపెను – వదలనుఅనుచు
దుఃఖసంద్రమున మునిగి పోయెను
అతని రోషము కట్టలు తెగినది

అగ్నికణములు రాల్చెను కన్నులు
ప్రళయభయంకర మూర్తిగ మారెను
అమోఘశూలము చేతధరించి
సభామంటపము లోనకు రాగనె

త్రిమస్తక – త్రిలోచన – శకుని
శంబరు,నముచి,శతబాహు,హయగ్రీవ
పులోముదాదిగా దైత్య దానవ
యోధుల వంక చూచి పలికెను

రణకోవిదుడు సురలకు యముడు
యుద్ధ విద్యలో ఆరితేరిన
ఉత్తముడైన నాసోదరుని
హరి చంపిన ఈ వార్త వింటిరా!

మీ అందరికీ బహిఃప్రాణము
అంతటివానిని ఒక సూకరము
చంపివేసెనట – ఆ వరాహము
వైకుంఠములో నివసించునట

వానిపేరది విష్ణువు అగునట
ఎదుటబడి మరి చంపగలేక
దొంగవేషమున తమ్మునిచంపెను
మాయలమారి మోసగాడట

వెర్రివేషముల నేర్పరిఅతడట
ఎన్నిరూపములో తెలియరెవ్వరట
తల్లిదండ్రులు – కులగోత్రములు
తెలియని యట్టి అనామకుండట

మునుల తావులలో వనభూములలో
దాగి – తిరిగెడి పిరికి వాడట
ఎటులైనను యిక వదలగరాదు
విజృంభించుడు వీర వతంసులు

అనుచు పలుకుచు హిరణ్యకశిపుడు
గిరివలె పెరిగి భీతిగొలిపెను
సింహనాదమున నింగిచీలునని
భయకంపితయై ప్రకృతినిలచెను

రాక్షస యోధులు భుజములుచరిచి
సిద్ధ పడిరి మీసమ్ములు దువ్వి
వారి మాటలకు మరింత ధైర్యము
కలిగిన అసురుడు పలికెను తిరిగి

యమదండముతో నాభుజములు సరి
వాటి చరుపుకు ఆ వైకుంఠుడు
సంద్రగర్భమున దాగినగాని
భూమిలో గిరులలో దాగినగాని

సమర్థుడనని ఎదురుగ నిలబడి
ధైర్య స్థైర్యముల గంభీరముగా
ఎగసిపడే – ఓ సంద్రపుటలగా
నాతో పోరిన – సంగ్రామములో

ఆవైకుంఠుని – మాయలమారిని
ఫాలనేత్రుని శూలమ్ము సరియగు
నాశూలమునకు – బలియిచ్చెను
ఇదినా ప్రతిన – భీషణప్రతిన

హరి కంఠములో శూలముదింపి
పారెడి నెత్తుట నాతమ్మునికి
తర్పణమ్మును యిచ్చెద – నిజము
అంతవరకు విశ్రాంతి లేదు అనె.

సకలలోకముల విజయపతాకలు
ఎగరేసెదను నావిక్రమమున
నాతమ్మునికి వైకుంఠములో
దేవగణంబులు కాళ్ళుపట్టవలె

హిరణ్యకశిపుని విజయయాత్ర–యిది
సువర్ణాక్షరములందు నిలవ వలె
భువనవిజయప్రభ మహాకావ్యము
వెలుగొందవలె అనతికాలమున

ఇంద్రుడు పరుగిడు అసువులునిలుపగ
వీరులు మీరు విజృంభించుడు
హరినామముగల అన్నితావులలొ
సర్వనాశనమున కుపక్రమించుడు

హిరణ్యకశిపుని నామము మాత్రము
వినబడవలెను – హరికి మారుగా
యజ్ఞ యాగముల మౌనిపుంగవులు
వేదఘోషను పలికిన చంపుడు

ప్రతాపవంతులు శ్రద్ధగవినుడు
విష్ణువు ఎచ్చట వసించుననగా
యజ్ఞములందు – వేదములందు
ముక్కుమూసుకొను మునులయందున

బ్రాహ్మణులొనర్చు – కర్మకాండలు
అన్నీవిష్ణువు – నిస్సందేహము
పితృదేవతల దానధర్మముల
ఆ కపటుడు మరి ఆధారమ్ము

కావున మీరు ఆలోచించక
మునులనుగాంచిన మట్టుపెట్టుడు
యజ్ఞయాగముల పొగలెగయగను
ఆర్పి – వారిని అంతముచేయుడు

వేదబ్రాహ్మణ గోవులందును
ఆహరి వుండును తెలియుడుమీరు
పాపపుణ్యముల నెంచక మీరు
భ్రాతృహంతను ఆఖరుచేయుడు

లోకమ్ములను చికాకుపరచి
తల్లక్రిందులుగ చేయసమర్థులు
కులగౌరవమ్ములు ఇనుమడించగా
ఘనవిజయమ్ముతొ తిరిగి రావలె!

అనుచు అరచెను హిరణ్యకశిపుడు
నింగినంటెను వాని అరుపులు
శంబరాదులు బయలుదేరిరి
దుర్మార్గమును ఆరంభించిరి

గుడి గోపురములు యజ్ఞవాటికలు
మౌనిపుంగవులు సంయమీంద్రులు
వేదవేత్తలు ఒరిగి పోవగా
ధర్మదేవత తల్లడిల్లినది

వేదపాఠములు చెప్పెడివారి
కుత్తుకులను మరి కత్తిరించిరి
విద్యార్థులను సమాధిచేసిరి
యజ్ఞవాటికల కలుష పరచిరి.

విధ్వంసమును గాంచిన సురలు
నాకము వదలి వనముల బడిరి
తమ్ముని తనయుల – రోదనచూసి
కదలిపోయెను హిరణ్యకశిపుడు

తల్లిదుఃఖమును భరించలేక
విలపించగను చలించిపోయెను
అంతట తల్లికి ఈవిధముగను
పెద్దకొడుకుగా ఊరడించెను

"బ్రహ్మవేత్తకు – భార్యవునీవు
అన్నీతెలిసిన విజ్ఞురాలవు
సామాన్య స్త్రీవలె విలపించుటది
తగునా తల్లీ! నామాట విను

ఎక్కడెక్కడి బాటసారులు
చలివేంద్రమునకు వచ్చిచేరెదరు
సేదతీరెదరు – మాటలు కలుపుకు
హితులుగ మెలిగి – తిరిగి సాగెదరు

ఆవిధముగను సంసారంబను
మజిలీయందును భార్యా బిడ్డలు
హితులు మనుమలు ఎందరెందరో
వచ్చి పోయెడి బాటసారులే

కలకాలము వారెవ్వరు వుండరు
పుట్టినవాడు గిట్టుట తప్పదు
అందులకొరకై తనయుని గురించి
వగచుటఏల వీరమాతవు.

నీతనయుడు తను అనామకునిగా
చావలేదు మరి వీరమరణమది
వీరస్వర్గము అలంకరించెను
వానికొరకు విలపించుట తగదు

నీకు తెలిసిన జీవ రహస్యము
వినిచెదతల్లీ – ఈసమయములో
సర్వజ్ఞుడగు ఈశ్వరదేవుడు
సర్వజీవుల ఆత్మగ వెలుగును

ఆదిమధ్యములు అంతము ఆతడు
తను కల్పించిన మాయయందున
లీలానాటక మాడించుచును
లింగశరీరము ధరించుచుండును

కదలికయున్న లింగదేహమున
కదలుచున్నటు కనబడుజీవుడు
కానీఆయన కదలనివాడు
కదలుట స్తంభన ఆయన లీల

లింగరూపమును వున్నఈశ్వరుడు
కర్మయోగమున కలిగినయట్టి
సంయోగ వియోగములన్నవి పొందును
శోక మోహములు ప్రకటించునుగద!

ఈ విషయమును విమర్శించి మరి
జ్ఞానులు చెప్పెద రొక ఇతిహాసము
ప్రేతబంధు యమ సంవాదమని
అనెడి దానిని తెలిపెదనీకు.

॥శ్రీ కృష్ణచరితము॥



## 2 బాలవేషధారి యై-యముడు చెప్పిన సుయజ్ఞోపాఖ్యానము

ఉశీనర దేశమునేలెడి
సుయజ్ఞుడను రాజుకు అతని
శత్రురాజుతో తీరని పగయది
సంగ్రామముగా మారినదపుడు

ఆయుద్ధములో ఓడిన రాజు
శత్రువు విడచిన శరములధాటికి
నేలకూలెను రక్తపుమడుగున
ఒడలంతయును తూట్లుపడినది

నఖశిఖపర్యంతముగా రాజుకు
తూట్లుపడినవి రక్తధారలు
మడుగు కట్టినవి - రణరంగమున
కాంతిహీనమై పడివుండెనట

అటుల కూలిన రాజుచెంతకు
చేరిరిబంధులు - రాజపత్నులు
విలపించిరట కట్టలుత్రెంచుకు
భాష్పధారలు మడుగు కట్టినవి

మృతకళేబరము మీదను పడిన
రాజపత్నులు వలవలనేడ్చిరి
వీరమరణముపొందిన నీవు
విధవలజేసి సాగితి వనిరి

సహగమనమ్ము చేసెదమనిరి
మనుగడ కర్థము లేదని వగచిరి
ఉశీనరమున ప్రతిఒక జీవి
శోకసంద్రమున మునిగిపోయిరి

సూర్యాస్తమయము అయిపోయినను
ప్రేతశరీరము మీద బడి అట
భార్యాబంధులు విలపించుచును
ఉన్నసమయమున ఆప్రదేశముకు

సమవర్తియగు ఆ యమరాజు
బాలునివేషము ధరించివచ్చి
దివ్యబోధను చేసెను వారికి
జనన మరణముల విప్పిచెప్పెను

"మీరందరును మృతునివద్దను
విలపించుచుండిరి విజ్ఞతవదలి
వయస్సులోన పెద్దవారుకద
చావుపుట్టుకల స్వభావమెరుగర!

జీవికి పుట్టుట గిట్టుటన్నది
స్వభావ సిద్ధము సహజమైనది
చావక స్థిరముగ ఎవ్వరుందురు
పుట్టినవాడు గిట్టుట తప్పదు

ఇందులో ఎవ్వరు చావును గెలచి
ఉట్టిగట్టుకుని ఊరేగుదుర!
ఆయువుతీరెను సాగిపోయెను
మీరోదనతో తిరిగివచ్చునా!

తల్లీతండ్రీ లేని - బాలురము
అడవులగడిపెడి అనాధలము మరి
మాకు ఎవ్వరు దిక్కుగనుండిరి!
మాపోషకుడు ఆపరమాత్మ.

తల్లికడుపులో నున్నసమయమున
పోషించిన ఆ జగన్నాధుడు
మాపోషకుడు మము రక్షించును
ఆయనగారే మము గొనిపోవును

మాకైమేము రాలేదు కద!
మేము రామనిన - ఆగనిత్తురా!
కాలముతీరగ - కట్టుదిట్టముగ
కాపు వున్నను జారిపోదురు

మాయరూపము ఈప్రకృతి - మరి
గుణములన్నవి - దానికి బంట్లు
నశించనిది ఒక బ్రహ్మపదార్థము
జీవుల - కాలము కబళించును కద!

దహింపబడునది కావున దేహము
జీవి సాగగా చీకటికొట్టు
దానిని ఉంచుకు ఆనందించెడి
గుండెధైర్యము ఎవరికి వున్నది!

జీవుడు బొందిలో మెలగుచున్నను
దేహవాసన వానికి వుండదు
కట్టెలో అగ్ని కాల్చద కట్టెను!
తనదైన కర్రయని జాలిచూపునా!

శరీరాలలో వున్న గాలియది
కట్టెల అగ్ని కనబడు నింగిని
వాటినాశ్రయించుకొని ఉన్ననుగాని
వేరుగనుండును నిస్పందేహము.

ఈ మృతజీవిని మీరందరు కలసి
లేపుదామని ప్రయత్నింతురా!
మీతోకలిసి బ్రతికిన రాజు
ఎంతోసేపయి వెళ్ళిపోయెను

ప్రాణరూపమగు గాలి ఎన్నడో
అనంతవాయువునందు కలిసెను
ఆ లింగదేహమున వసించియుండి
వెళ్ళిపోయెను తనత్రోవను తను

లింగ దేహమును ఇంద్రియాలలో
బంధించి వుంచెడి ఆవాయువుకు
వాటితొ ఎట్టి మమకారము వుండదు
ఈనాటకమును ఆడించునా హరి

దేహ ఆశ్రయము వుండువరకునే
ఆత్మకు వుండును కర్మబంధము
అది తెగిపోగనె వేరైపోవును
అజ్ఞానముతో తెలియగలేరు

ఆ మాయలొ మరి పడిన అందరూ
తల్లీ - తండ్రీ - కొడుకూ - కూతురు
ఇల్లూ - భూమి - నావారనుచును
ఎన్నోముళ్ళతొ మురిసిపోదురు -

కలలోచూచిన వస్తువులన్నీ
యదార్థమనుకొను టవివేకముగద
వివరము తెలిసిన విజ్ఞులందరూ
సుఖదుఃఖములను లక్ష్యపెట్టరు.

తత్వజ్ఞానము లేనివారు మరి
ఎడబాటు దుఃఖమును భరించ లేమని
ఎంతో వేదన పొందెద రనిశము
ఫలితము మాత్రము శూన్యమే అగు

దీనిని మీకు విశదపరచుటకు
చిన్నగాధను వినెచెద వినుడు
అనుచు బాలుడు వారికిచెప్పెను
బోయవాడు ఒకడుండెను అడవిలొ

కాలయమునిలా కనబడు పక్షుల
విల్లంబులతో వలలతొ పట్టి
రెక్కలువిరిచి చిక్కమునందు
వేసుకొనుచు విధ్వంసము చేసెను

ఒకచో - వాడు అడవి పిచ్చుకల
జంటను చూసి ఉచ్చువేయగా
అందులొపడెను ఆడుపిచ్చుక
పెంటిపిచ్చుక అందులొపడక

జంటగురించి విలపించెనట
తోడుకోసమై తపించి పోయెను
ఆవిధాత ఈ విధముగ వ్రాసెను
కర్కశమ్ముగా ప్రవర్తించెను

ఆనందముగా గడిపినారము
ఒరులకు ఎగ్గు చేసి ఎరుగము
ఒంటరిబ్రతుకు నిరర్థకమ్ము
పసికూనలను సాకెడిదెవ్వరు

ఆప్యాయముగా పెంచుకొంటిమి
రక్తపు ముద్దలుగా కనుపించు
పసికూనలకు అమ్మను ఎటుల
చూపించెదను పోషించుట ఎటు!

కాలము ఎంత కఠినమైనది
కన్నులముందుగ నరకముచూపెను
అనుచు ఏడ్చుచు పిల్లలకొరకై
దిక్కులేదని తలచుకుఏడ్చెను

అంతటిలోన ఆ నిషాదుడు
ఉచ్చుతొ పట్టి ఆ మగపిచ్చుకను
చిక్కములోన జార్చుకుసాగెను
తక్కునచచ్చెను - ఆమగపిచ్చుక

చూచారామరి! పిల్లలకోసం
వగచిన పక్షి - కిక్కురుమనక
కాలముచేతికి చిక్కి చచ్చినది
దానికి అటుపై పిల్లలెందుకు

అంతటివరకు భార్యా పిల్లలు
అనుచు ఏడ్చిన ఆ మగపక్షి
వాటికోసమై ఆగుట జరిగెన?
అటులే ఎవరూ ఆగరు తెలియుడు

మీచేతులలో కాలమిలేదు
భూమిమీదబడు ప్రతి జీవి వెంబడి
కాలమువుండి ఆయువుతీరగ
నిర్దయగా గొనిపోవుచుండును.

ఆయువుతీరగ బంధములుడిగి
ఆప్యాయతలు అనురాగములు
అన్నీవదలి నిర్దయగాను
అడుగులేయును మరోలోకమున

అటులా బాలుని వేషమునున్న
యముడు చెప్పిన బోధనతోను
కలత తీరినది - రాజు భార్యలకు
ఏడ్పుమానిరి - నిజముగ్రహించిరి

పారలౌకిక క్రియలు జరిపిరి
తిరిగిచేరిరి నివాసములకు
సమవర్తి అంతట అదృశ్యుడయ్యెను
అనుచు చెప్పెను హిరణ్యకశిపుడు."

ఆ విధముగను తల్లిని మరియు
తమ్ముని భార్యల ఊరడించెను
మాయావిలాసము - దానికెంతయు
వగచుటతగదని - మరి మరి చెప్పెను

ఆ బోధనతో పండిన యట్టి
హిరణ్యకశిపుడు ఆలోచించెను
ముదిమి మరణము గెలువగనెంచి
తపస్సుచేయగ సంకల్పించెను

జగద్విజేతగ నిలబడవలెను
తన్నెదిరించే జీవి లేకను
స్వతంత్రుడై మరి ఇచ్చవచ్చినట్లు
బ్రతుకనెంచెను కాలముగెలిచి.

అందులకొరకై తపముచేయగా
మందరగిరి ప్రాంతమ్ములోగల
వనముజేరెను ఘోరతపమును
ఆచరించగా ఆరంభించెను

బొటనవ్రేలిపై నిలబడియంత
చేతులురెండు పైకి ఎత్తి తను
నింగివంకనే చూచుచు దీక్షగ
కఠోరతపమును చేయసాగెను

ఋతువులు మారిన చలనములేక
అటులేనిలబడి తపమొనరించెను
జడలు కట్టి మరి ఎఱ్రనిరంగుకు
మారిపోయినది తలపైజుట్టు

వాడికిరణముల ప్రచండసూర్యుని
పోలిన యట్టి తీరుగ నుండెను
హిరణ్యకశిపుడు - లేడని తెలిసి
అమరావతికి వచ్చిరి సురలు

హిరణ్యకశిపుని ఘోరతపస్సుకు
భూమికూడ కంపించసాగెను
సంద్రపు ఘోష నింగికెగసెను
గ్రహములు తారలు తల్లడిల్లెను

అంతటిలోన హిరణ్యకశిపుని
శిరస్సునుండి అగ్నివెలువడి
లోకమునంతయు కాల్చునట్టుగా
నలువంకలకు వ్యాపించినది.

సురలందరును భయకంపితులై
బ్రహ్మదేవుని పదములబడిరి
విషయము తెలిసిన చతురాననుడు
వారికి అభయము నిచ్చిన యంత

వారందరును హిరణ్యకశిపుని
తీవ్రతపస్సు - అగ్నిజ్వాలలు
తిన్నగజెప్పి ఉపేక్షించిన
మహాప్రళయమే - వచ్చును అనిరి

అసురుని కోరిక సర్వవిజేతగ
సృష్టికి - ప్రతిసృష్టి చేయుచు
శాశ్వతమ్ముగా బ్రతుకుచు నుండి
నీ పీఠమునే హరించ నెంచెను.

అనన్యమైన రీతిగ నీవు
తపస్సుచేసి తపోబలముతో
జగములసృష్టికి నడుముకట్టితివి
అట్టిది - పొందగ దుష్టుని కోరిక

తపస్సు పూర్తిగా ఫలించినంత
వానిని పట్టగ శక్యమెవ్వరికి!
అందులకొరకై తగిన ప్రతిక్రియ
ఉపాయమ్ముగా చేయుము అనిరి.

అంతట బ్రహ్మ వారిని పంపి
దక్షుడు మొదలగు ప్రజాపతులతో
మందరపర్వత ప్రాంతము జేరెను
హిరణ్యకశిపుని స్థితిని గాంచెను.

తపోనిష్టలో నున్న అసురుని
చుట్టును లతలు తీగలల్లుకొని
క్రిమికీటకములు తిరుగుచుండగా
కొన్ని రక్తమును పీల్చసాగినవి

అంతటి తపమున నున్నవానిని
గాంచిన బ్రహ్మ ఆశ్చర్యపడె
సమీపించెను పలికెను ప్రియముగా
శ్లాఘనీయము - నీతపస్సనె

హిరణ్యకశిపా! ఇంతటి వరకు
ఇంతటి ఘోరతపమును చేసిన
భక్తులు లేరు – ఇకపైనుండరు
అందరిలోన అగ్రగణ్యుడవు

నీవు కోరిన వరము నివ్వగా
వచ్చితినయ్యా! సమాధి విడువుము
పలుక కుండెను హిరణ్యకశిపుడు
తిరిగి విరించి – గట్టిగ పలికెను

ఆమాటలవి వినపడకున్నవి
పుట్టలు పెరిగెను గడ్డి గాదములు
నిండిపోయినవి – అంతట బ్రహ్మ
కమండలములో జలము జల్లెను

అంతట అసురుడు కనులువిప్పెను
ముందర గాంచెను సృష్టికర్తను
ఆయన మాటలు వినిపించినవి
తపోఫలమునిడ వచ్చెనని వినె

బ్రహ్మచలువతో ఎముకలగూడు
తిరిగి బలముగ మనిషిగ నిలచెను
తపోశక్తితో మరింత తేజము
నిండి కనబడె హిరణ్యకశిపుడు

వెంటనె అసురుడు బ్రహ్మపదముల
శిరస్సువంచి సాగిలపడెను
ఆనందభాష్పముల పదములుకడిగెను
భక్తి ప్రవత్తుల వందనమిడెను

పొంగిన ఆనందముతోనంత
కనక కశిపుడు స్తుతించె బ్రహ్మను
“జలమయమ్ములో అంధకారమున
జగత్‌సృష్టిని చేసిన వాడవు

త్రిగుణమ్ములతో చేసిన సృష్టిని
పెంచి త్రుంచెడి సర్వనియంతా!
నీకునిండుగా వందనమయ్యా!
బ్రతుకు నాది మరి ఫలించె నేటికి

జగత్కర్తయై స్వయం భువుగా
విరాజిల్లెడు చతుర్ముఖునకు
శతసహస్ర వందనమ్ములివె
అనుగ్రహించుము వాణీనాధా!

వేద రూపమున యజ్ఞమునెరపి
సకల విద్యలకు ఆలవాలము
సాధకులందరి సాధన నీవు
కాలరూపమున అంతముజేతువు

పురాణపురుషుడ అవ్యయుడవయా!
పరమేష్టిస్థానమున జగత్తునడిపే
భగవానుడవు జగదాధారా!
త్రికరణ శుద్ధిగ వందనమ్ములివి

వరమునొసంగగ వచ్చితినంటివి
వరదుడవీవు దయాసాగరా!
అవధరించుము నా కోరికలు
పంచభూతములు చంపలేనటు

ఎట్టిఅవస్థలో పంచభూతముల
చావులేనటు అనుగ్రహించుము -
రేయింబవళుల చీకటి వెలుగుల
నాకు మృత్యువు కలుగనట్లుగా -

కొండలమీద మృగములవలన
యక్ష - రాక్షస - నర - సుర - కిన్నర
భూతగణమ్ముల పక్షి పిపీలిక
క్రిమికీటకముల చావులేనటు -

పలురకమ్ముల అస్త్రశస్త్రముల
భూమ్యాకాశములందున మరియు
దిగ్భాగముల - నీటిలో గాలిలో
చావులేనటు అనుగ్రహించుము -"

యుద్ధములో మరి ఎదురులేనటు
శౌర్యప్రతాపము లొసంగవలెను
లోకపాలకుల మించిన మహిమతో
జగద్విజేతగ అనుగ్రహించుము -

అంతావినిన బ్రహ్మపలికెను
అసమాన్యమగు వరములడిగితివి
అనుగ్రహించితి - కానీ నీవు!
అన్నివేళలా మంచిగ మనవలె

బ్రహ్మవరముల పొందిన అసురుడు
ఘనవిజయమని పొంగిపోయెను
వరములనిచ్చి విధాత అంతట
సత్యలోకము సాగిపోయెను

పురమున అడుగు బెట్టిన అసురుడు
బ్రహ్మబోధన - వనమునె వదలెను
తమ్మునిచంపిన విష్ణువుపైన
పగసాధించగ నిర్ణయించుకొనె

అసురనైజము - అహంకారము
వరముల వలన మరింత పెరిగెను
విష్ణువైరము పెరిగిపోయినది
సాధు హింసకు నడుముకట్టెను

దేవగణముల హింసించుటకై
నిర్ణయించుకొని వారందరికీ
సింహస్వప్నమై నిలబడి నాడు
తలచిన వణుకు పుట్టెను సురలకు

నాగలోకమున హఠాత్తుగా పడె
గరుత్మంతుని తీరుగ నాగుల
చిందర వందర చేసివేసెను
అటుల హింసను ఆరంభించెను.

గ్రహములమీద దాడిచేయుచు
వారిని కట్టి పడవేయుచును
ఆనందించుచు నుండెడివాడు
యక్షుల పరుగిడ జేసెడివాడు

ఖేచరుల లెంపలు వాయగొట్టుచు
సిద్ధుల తపమును అంతము జేసి
వారిని కట్టి పడవేయుటది
హిరణ్యకశిపుని వినోదమైనది

నరులసంగతి చెప్పగవలెనా -
పరుగెత్తించి వారి తల్లలను
తాటిపండ్లవలె రాల్చెడివాడు
కళేబరమ్ముల విసరెడివాడు

పిశాచ భూతగణముల పిలచి
వాటిచేతమరి ఆడించి అంతట
వారినినేలకు మర్దించుచును
ఆనందించెడి వాడు అసురుడు

దిక్పాలకుల భవంతులన్నీ
కూకటివ్రేల్లతొ కూల్చెడివాడు
బంధించి వారిని హింసించుచును
ఆనందముతో అరచెడివాడు

రాత్రిఅటులనే వుండవలెనన
సూర్యుడు పొడవక అటులేవుండును
అటులే పగలు సాగవలెనన
చీకటి పడెడి సమస్యలేదు -

అసురుడు పలికిన పలుకే వేదము
కాదన్నచొ మరి కంఠము తెగును
తూర్పుదిక్కును చూపి - పడమరన
అవునంచును తలవూపగవలెను

వున్నట్లుండి అమరావతిపై
దండయాత్రకు వెడలెడివాడు
వానిని గాంచి సురనాయకుడు
ఎదురుగ నేగి సేవచేయవలె

దేవవీరులు వానినిగాంచి
భీరువులై మరి నిలబడువారు
పరిహాసమునకు గురియై వారు
విధివ్రాతయని తలచి బ్రతికిరి

అటులా అసురుడు అర్ధంతరముగ
పాతాళానికి పోరుకుసాగును
ఎదురుచెప్పక - వీరులు - వెంబడి
అనుసరించుటే - తెలియునువారికి

దిక్పాలకులు ఇంద్రాదులును
కాన్కలు యిచ్చి సంతస పరచి
దినమొక యుగముగ గడపసాగిరి
దిక్కుతోచక బ్రతుకులీడ్చిరి

త్రిమూర్తులున్ను దేవతలగని
ఉపచారమ్ములు చేసి అసురునికి
క్రోధమురాకను చూచుకోమని
సలహానిచ్చి సరిపెట్టిరట.

వాడు కోరినటు కురిసె - మేఘములు
కల్పవృక్షము కోరిన దిచ్చెను
సాగరుడంతట వివిధరత్నములు
కానుకలిచ్చి భయముగ గడపును.

అస్త్రములెవ్వీ హానిచేయవు -
చావులన్నది మరచిపోయెను
సర్వనియంతగ బ్రతకసాగెను
విష్ణువైరము పెరగసాగెను

సురల ప్రార్థన దీనగాథను
వినిన విష్ణువు - అభయమునిడెను
అసురుని అకృత్యములన్నీ తెలియును
వర గర్వముతో విర్రవీగెను

గోబ్రాహ్మణుల వేదవేత్తలను
హింసించుటది తెలియును - కానీ
నాపైవాని వైరము యింకను
పరాకాష్టకు చేరుకోవలె

వానికి నలుగురు తనయులుందురు
అందలొ జ్యేష్టుడు ప్రహ్లాదుడగు
అసురుడు మూర్ఖుడు - ఆప్రహ్లాదుని
అనేక ఇడుముల పాలుజేయును

చివరికి తనయుని చంపెడిఘోరము
చేయును వాడు వాని అంతమది
అప్పుడు వానిని వధించి నేను
భూభారమును తీర్చెదననెను.

బ్రహ్మవరములవి దుష్టునిఎడల
దుర్వినియోగము అయినవి కాదా!
వెంటనె వాటిని కాదని అనినచొ
యుక్తము కాదని ఆలోచించితి

నాపైద్వేషము పరాకాష్టకు
చేరినంతనే వానిని తృంచెద
అంతటివరకు ఏదోవిధముగ
భరించి కాలము గడపుచుండవలె

ఆమాటలవి దేవగణములకు
అమృత సోనలు కురిపించినట్లయె
అసురుని అంతము కొరకై వారు
అహర్నిశము మరి చూచుచుండిరి.

కాలక్రమమున అసుర రాజగు
కనకకశిపునికి నల్గురు కొడుకులు
ఉద్భవించిరి వారిలొ జ్యేష్టుడు
ప్రహ్లాదుడు హరిభక్తుడయ్యెను

॥శ్రీ కృష్ణచరితము॥

❋❋❋

## 3 ప్రహ్లాద చరిత్ర

"జలశయ్యను అలంకరించితి
శేషశయనుని తలంచుచుంటిని
భూమినిపడుటది హరి కీర్తనకు
నాకై మరి - హరి దిగును తప్పక"

అన్నటు తలచెడి కారణజన్ముడు
హరిఅవతారము - తనకై ఎత్తి
తండ్రి శాపమును తీర్చుననుచును
తండ్రిని తరింపజేసిన తనయుడు.

పెద్దల మన్నన చేసెడివాడు
స్త్రీలను తల్లులు అన్నటుచూచును
పరుల సుఖముకై పరితపించెడి
పరమ గుణాఢ్యుడు ఆ ప్రహ్లాదుడు

అ సత్యమాడుట తెలియనివాడు
గర్వమునెరుగని వినయశీలుడు
చక్రవర్తికి తనయుడ ననుచు
తలపులొనైనా తలచనివాడు.

కోపతాపములు లోభమోహములు
ప్రహ్లాదుని ఎడ భంగపడినవి
అలభ్యమైనది కలదని చెప్పిన
అసలామాట చెవిలోదూరదు

'హరి' యనునట్టి అక్షరమ్ములవి
అక్షరాలకే తలమానికములు
అక్షరాలకు నశించకుండా
శాశ్వతత్వము కూర్చెను అవి - అను

మంచిగుణములు మూర్తీభవించి
ప్రహ్లాదునిగా పుట్టెననుచును
దేవగణములు ప్రస్తుతించిరి
శేషుడు పొగడి అలసిపోయెను

వయసుతొపాటు హరిభక్తియది
వృద్ధినొందెను ప్రహ్లాదుని కడ
అన్యచింతన మదిలోనుంచక
హరిధ్యానములో పరవశించెను.

హరిధ్యానములో ఏకాగ్రతతో
సమాధిస్థితిని పొందుటన్నది
పిన్నవయస్సులో నేర్చిన ఘనుడు
హరిమయముగ సర్వస్వము గనును

నీటిని త్రాగుచు - అన్నముతినుచు
ఆడుచు పాడుచు విహరించుచును
విశ్వమంతయు హరియే అనుకొని
ప్రతికదలికది పరంధాముడను -

"నీదర్శనమది కలిగించుమయా!
నీపదసేవ సమకూర్చుమయా!
నిరతము నామది నేలెడిదొరవు
నా ఊపిరిలో నీవే - యనును"

ఆనందమది ఇనుమడించగా
హరిముందుగ తా నుంటిననుకొని
పరవశించుచూ నాట్యమాడును
వయస్సుకుమించిన భక్తి నిండెను.

పూర్వజన్మ సంస్కారము అతనిని
హరిభక్తునిగా తీర్చిదిద్దినది
అసురబాలకుల మధ్యనున్నను
ఆతని త్రోవ మారకపోయెను

పరిసరములవి మార్పులుతెచ్చును
కానీ బాలుడు వాటికి లొంగక
తన నైజమును మారనీయక
పెద్దలమన్నన లందెడివాడు.

అంతట అడిగెను ధర్మనందనుడు
త్రోవతప్పిన పిల్లవానిని
మంచి బుద్ధులతొ మనసు మార్తురు
తనయుని కొరకై వంతలొనుందురు

కానీఇచట పరమయోగ్యుని
పుణ్యసంస్కారము కలిగిన తనయుని
పగబట్టి మరి హింసించుటది
చివరకు చంపగ నిర్ణయించుటది

ఆశ్చర్యముగానున్నది స్వామీ!
ఆనందించుట మరచి వానికే
శత్రువయినటు తనయునితలచుట
విడ్డూరము - అన - నారదుడనెను

పాండునందనా! నీవంటివానికి
ఆనందించుట అతిసహజమ్ము
అటుల జరుగక పోవుట యిచట
వింతకాదు విను - హిరణ్యకశిపుడు

హరిద్వేషముతో నున్నవాడయా!
తనయుని నడత మొదట తండ్రి-తా
పసితనమనుచు సరిపెట్టుకొని
మంచి మాటల మార్చగనెంచెను

అంతకంతకు ఆతని భక్తి
హరిపైకుదిరి చివరకుతండ్రినె
హరి భక్తునిగా మారగ చెప్పెను
అది ఆతనికి ఆగ్రహమయ్యెను

అసురప్రవృత్తి - వర గర్వములు
పరాకాష్టకు చెందిన వాడు
ఆలుబిడ్డలను యిడుములబెట్టుట
అసలెంతయును వింతకాదయా!

గురుకుల శిక్షణ మార్చుననుకొని
శుక్రుని తనయులు-చండా మార్కుల
పిలచి వారికి తనయుని బాధ్యత
అప్పగించుచు పలికెను భక్తిగా

"అయ్యా! మీరు - మాకు గురువులు
మా అభ్యుదయము కోరెడివారు
తనయుని సంగతి అయోమయమై
నిద్రరాకను వంతలో నుంటిని

పిలచిన పలుకని పరధ్యానము
రాజలక్షణము లసలే లేవు
మహాయోగిలా వేదాంతివలె
వైరి ప్రసంగము చేయుచుండును

రాజనీతిని ఉపదేశించుడు
వైరితలంపులు తుడిచివేయుడు
అనగా వారు - ఆప్యాయముగా
ప్రహ్లాదునితో - బయలుదేరిరి.

గురువుల బోధనలన్నీ అతనికి
ముందే వచ్చును అన్నటు సులువుగ
తిరిగి వారికి అప్పగించుచు
ఆశ్చర్యములో ముంచెను వారిని

కానీ ఆతని హరి భక్తియది
అంతకంతకు ఇనుమడించినది
తోటిబాలుర మనసులలోన
మెల్లమెల్లగా దూరసాగినది.

కొంతకాలము గడిచినంతను
తనయుని చదువు ఎంతకువచ్చెనో!
గురువుల శిక్షణ ఎంతగొప్పదో -
తెలియగోరి మరి రప్పించెను వారిని

తనయునిగాంచి ఆనందముతో
దగ్గరబిలచి హిరణ్యకశిపుదు
మోము నిమిరి మరి ఆతనికుశలము
తెలుసుకొని - తను వాత్సల్యముతో

అంతట అడిగెను చదువు గురించి
"వేదశాస్త్రములు నేర్చినాడవా!
దండనీతియది వంటబట్టెనా!
ఏమిచదివితి ముద్దుగ చెప్పుము"

అనగా తనయుడు చిరునగవులతో
"రాక్షసరాజా! చదువుల సారము
చదువుల మర్మము చదివితినయ్యా
నాగురువులు చదివించిరి శ్రద్ధగ -

తండ్రీ! దేహము నూతివంటిది
చీకటిలో మరి పడివుండినటు
బంధుమిత్రులు సంసారమను
బంధనాలలో చిక్కుకొందురు

ఆ బంధములు శాశ్వతమనుకొని
శాశ్వతుడైన సర్వేశ్వరుని
తలపులోనైనా తలంచలేరు
ఆశ్చర్యమగు విషయముకాదా!

దేహధారులకు విష్ణుసేవతో
అడవులలొ ఏకాంతవాసము
అన్నివిధముల శ్రేయోదాయిని
జన్మ సఫలముచేయును అదియే"

అమాటలతో రాక్షసరాజు
ఉగ్రుడయ్యెను బాలునిచూచి
ఎవరో వీనికి ఈదుర్బుద్ధిని
కలుగజేసిరి అని తలంచుచు

తనయా! నీకీ పలుకులుతగవు
వయసుకుమించిన ఆలోచనలివి
గురువులు నీకు చెప్పిన విద్యా!
లేదా నీకే పుట్టిన జాడ్యమ!

విషయముతెలియని పసివాడవు నువు
విష్ణువు మనకు బద్ధ విరోధి
అపకారమెంతయో చేసెను మనకు
వానిని పెద్దగ పొగడుచుంటివి.

నీవు తెలియదగు రహస్యమ్ములివి
దేవతలందర నెదిరించుటది
సురనాయకుని ఎటుల పట్టుట
వానిని ఎటుల బాధించుటయో -

యక్ష, కిన్నర, సిద్ధ, సాధ్యులను
ఎటుల కష్టముల పాలుచేయుటో
మొదలగు విద్యలు - మర్మములన్నీ
నాతనయునిగా - నీవు నేర్వవలె

అంతేగాని పెద్దమాటలు
విష్ణువు - గిష్ణువు అన్నతలంపులు
నేర్చుకొనుటది నిషిద్ధమైనది
అజ్ఞానములో జారకు నాయన!

అంతటపలికెను ఆ ప్రహ్లాదుడు
తరతమ భేదములన్నవి వదలి
ఈశ్వరకింకరులము అనునట్టి
జ్ఞానము మనకు అలవడవలెను.

అజ్ఞానములో పడినవారు మరి
సర్వేశ్వరుడు సర్వనియంత
అక్షరరూపుని తెలియగలేరు
విష్ణుమయమని ఎరుంగలేరు

నావిషయములో తండ్రీవినుము!
అయస్కాంతము కనుపించగనే
ఇనుము అతికినటు నామనస్సది
విష్ణుపదములకు అంకితమైనది

అంతకుమించి నామనస్సు మరి
ఆకర్షింపగ బడదు – వేటికీ
ఆ పరాత్పరుడు నిండిన మనస్సు
అన్యచింతన చేయదురాజా!

మందార మధువును ఆస్వాదించిన
తేటి కోరునా ఉమ్మెత్తపూవును
పాపభంగ ఆ గంగలొ హంస
ఏటినీటికై ఎదురుచూచునా!

మావి చిగురుల రుచి నెరింగిన
కోకిల కోరున గోరింటాకును
చంద్రకాంతితో కడుపునింపుకొను
చకోరమ్మది మంచు కోరునా!

అంతఎందుకు అనఘా వినుము!
హరిపదముల సేవామృతమును
గ్రోలెడి మనస్సు అన్యచింతనలు
ఒక్కనాటికీ చేయదు నిజము

అనగా – గురువులు ఆగ్రహించిరి
ఒక్కమారుగా ఉలిక్కిపడిరి
గట్టిగఅరచిరి ఎంతటివాడవు
బోధన చేయుచునుంటివి తగునా!

కులగౌరవమ్మును కాలదన్నితివి
అన – విన రాని – మాటలంటివి
వయస్సుకుమించి పలుకుచుంటివి
పిన్నవయస్సని మిన్నకుంటిమి

రాక్షస ప్రభువుకు చెడబుట్టితివి
తులసివనమున గంజాయి మొక్కవు
దేహశుద్ధి మరి చేసి మార్చెదము
ఎవరుచెప్పిరీ దుష్టబోధనలు

అనుచు భయముగా రాజును గనుచు
వణకిపోవుచు నిలచిరి గురువులు
అసురనాయకా! మనస్సుమార్తుము
దండించి బాలుని మనస్సుమార్చెదము

మరియొక అవకాశమ్ము యివ్వమన –
వికటాట్టహాసము చేసెనురాజు
వెంటనెవారు ఆ ప్రహ్లాదుని
త్వరగా తీసుకు పోయిరి – వెంబడి

మెళకువగా మరి తెలియజెప్పగా
ఏకాంతముగా నిర్బంధించి
వానికి చదువు చెప్పదొడంగిరి
చదువుల ఆతడు భేషనిపించెను

సామదానములు భేద దండములు
ధర్మార్థములు పూర్తిగ చెప్పిరి
రాణికి చెప్పిరి ఆ గురుదేవులు
ఆమె – బాలుని దగ్గరతీసుకు

"వంశానికి నువు – వన్నె తెత్తువు
తల్లితండ్రులను తరింపజేతువు
మెలక నవ్వుతో చిలుకపలుకులతో
పరవశింతుము అనుచు మురిసెను".

అంతటవారు రాజువద్దకు
బాలునితోడ్కొని పోవుచు అడిగిరి
మేము చెప్పినది జ్ఞప్తివున్నదా!
మాటలుమార్చి – ముప్పుతేకుము

విష్ణుప్రసంగము వదలిపెట్టుము
అసలామాట కొంప ముంచును –
అసురులకసలే సరిపడ నట్టిది
పుట్టిముంచగా – పలుకకు నాయన!

అనుచు గట్టిగా చెప్పిరివారు
రాజును గాంచి భక్తిప్రపత్తుల
వందనముంచి ఆశీస్సులనిడి
బాలునిపంపిరి తండ్రివద్దకు

గురువులబోధలు చెవిలోదూరవు
బాలుడు వినెనని మదిలో తలచిరి
మాటదక్కునని నమ్మిరి వారు
కానీబాలుడు కారణజన్ముడు

హరిని భూమికి దింపుటకొరకు
భూమికి దిగిన ఒక భక్తశిఖామణి
తల్లికడుపులో హరి రక్షణతో
ఊపిరి పీల్చిన – ఆయుష్మంతుడు

ప్రభువునుగాంచి పలికిరిగురువులు
సక్రమమార్గము ననుసరించి మరి
సకల శాస్త్రములు నేర్పినామయా!
పరీక్షించుము – నిశిత బుద్ధిని.

పరవశించెను హిరణ్య కశిపుడు
బాలుని తొడపై కూర్చొనబెట్టుకు
శిరసుమూర్కొని బుగ్గలు చిదిమి
ఆనందబాష్పముల అభిషేకించెను

తండ్రికి తెలియని భక్తవతంసుడు
తనకై నేలకు దిగిన భక్తుడు
తనమూర్ఖతతో బాధలనన్నీ
అనుభవించిన పితృభక్తుడు.

తండ్రిగుండెలకు హత్తుకుపోయెను
తనయునిగాంచి పలికెను ప్రియముగ
నిన్ను చూడగా నాకన్నులవి
కాయలు గాచెను – కులముకు వన్నెవు

ఏశాస్త్రములు నేర్చినాడవో
నీముఖతః మరి విన మనస్సది
చదువుల నెలకొను విజ్ఞానమ్ము
బ్రహ్మవిద్యలు నేర్చినాడవా!

తండ్రి మాటలు – ఆనందమును
ఆకళించుకొని – ఆ బాలకుడు
తండ్రీ! గురువులు శ్రద్ధాసక్తుల
విద్యలు నేర్పిరి – బ్రతుకు ఫలించెను.

అన్ని శాస్త్రములు – అక్షరవిద్య
అంతానేర్చితి – నాపుణ్యమది
చదువుల మర్మము తెలిసితి తండ్రీ!
అంతా వినిచెద అతి క్లుప్తముగా.

శ్రవణము–కీర్తన–స్మరణము మరియు
పాదసేవయు, అర్చనలున్నూ,
నమస్కారము, దాస్యము, సఖ్యము,
ఆత్మనివేదన – నవవిధ – భక్తులు

ఆమార్గముల – అంతర్యామిని
అవ్యయుడైన హరిని కొలచిన
మానవజీవన మనుగడ – అదియే
నాకు తెలిసినది – నమ్మిన దదియే –

హరిభక్తిలేని జీవితమ్మది
గుడ్డివానికి చంద్రోదయముగ
చెవిటికి శంఖము ఊదినట్టుగా
మూగవానిని చదవమన్నటు

పేదవానికి పెండ్లి చేయుటగ
కృతఘ్నునితో చెలిమి చేసినటు
బూడిదలో మరి చేసిన హోమము
సూకరముకు పన్నీరుగ నగును

హరిపూజచేయు చేతులె చేతులు
వర్ణనచేసెడి – నాలుక నాలుక
స్వామినిచూచే చూపులు చూపులు
హరికి మ్రొక్కెడి శిరమే శిరము

శేషశయనుని గాథలువినెడి
కర్ణములే మరి కర్ణములయ్యా!
లక్ష్మీపతికై ధ్యానము చేసెడి
మనస్సు – అసలగు మనస్సుఅగును

గరుడవాహనుకు ప్రదక్షిణించెడి
పదములు – నిజమగు పాదములగును
శ్రీవత్సాంకుని తలంచు బుద్ధియె
శ్రేష్టమైనదిగ తలంచవలెను

హరికీర్తనము చేసెడి దినము
సార్థకమైన – దినమగు తండ్రీ!
హరిని తెలిపెడి చదువే చదువు
హరితత్వబోధకుడె అసలగు గురువు

హరిసాయుజ్యము చేరుమార్గము
చూచుకోమని చెప్పెడి తండ్రే –
తండ్రి అగునయా – జయాభిలాషీ!
మరియొకత్రోవ హరిని జేర్చదు

తండ్రీ నీకు తెలియని దుండదు
ఈశరీరమొక తోలు తిత్తికద!
అందలి గాలి జారిపోయిన
దీని ఉనికి మరి ఎక్కడగలదు!

అందులకొరకై ఈశరీరము
పరమేశ్వరునికి అర్పణకావలె
హరికీర్తన మరి చేయనినోరు
ఢక్కమాదిరి ధ్వనిచేయునదే –

హరిపూజచేయని కరములు
కట్టెతెద్దుకు – తక్కువెఅగును
శ్రీకాంతుని గని పరవశించని
కనులు కేవలము గోడరంధ్రములు

హరి కంకితమై యుండని తనువు
నీటిబుడగతో సమానమైనది
హరిభక్తిలేని విద్యావంతుడు
రెండుకాళ్లుగల పశుసమానుడు

హరిసేవయను ప్రభంజనమ్ము
సంసారమేఘమును చెదరగొట్టును
తాపత్రయముల దూరముచేయు
దివ్యౌషధము హరిపదసేవ

పాప సంద్రమును హరిభక్తియను
బడబాగ్నియది ఎండగట్టును –
ఆపదలనెడి కారుచీకటిని
హరిసంకీర్తన వెలుగు – చీల్చును

మోక్షనిధిని మరి హరిసంకీర్తన
దివ్యాంజనముగ కళ్ళకుచూపును –
అనుచు బాలుడు తొణకక బెణకక
తండ్రిముందర నిలబడిపలికెను

హిరణ్యకశిపుడు ఉగ్రుడయ్యెను
క్రోధాగ్నితొ మరి కదిలిపోయెను
బాలుని క్రిందకు బలముగత్రోసెను
గురునందనుని చూసిఅరచెను.

"బ్రాహ్మణరూపున ఉన్ననీది మరి
నిజమగు బ్రాహ్మణ జన్మమెకాదు
చదువు నెపమున నా పసికందుకు
రిపుని కీర్తన నూరిపోసితివి

భృగువంశమున పుట్టిన నీవు
రాజద్రోహిగా నడిచినాడవు
బాలుని – నీవు భ్రష్టుచేసితివి
దుర్మతివీవు – నయవంచకుడవు

పిల్లవానికి ఏమి తెలియును
మనము నేర్పినది నేర్చుకొందురు
ఇంతటి ద్రోహము చేసిననీవు
నరకములో మరి పడకపోదువా!

ఎందులకింత ద్రోహచింతన
కలిగినదయ్యా! నాపైనీకు
అనగా గురువు – గడగడలాడుచు
చేతులు మోడ్చి పలికె వినయముగ

"అసురభూపతీ! ఆగ్రహించకు
శాంతివహించి నామాటలు విను
నీతనయునికి దుర్బోధలను
మేము ఎన్నడూ చేయగలేదు

మేముఎన్నడూ ఇంతటి పాపము
ఆచరించము - నీపదములు ఆన
చేతనయినవి చదువులు నేర్పిన
విధేయులము విను దానవాగ్రణీ!

మేము అడిగినవి తీయగ జెప్పెను
మాచదువులవి సులువుగ నేర్చెను
నీకడ యిటుల పలుకుచుండెను
ఇదిమాత్రము - విను-వానిబుద్ధియే!

ఎవరోచెప్పి నేర్పినదసలే
కాదు ప్రభూ - మా మాటలునమ్ముము
మీవంశమునకు హితులముమేము
మీమన్ననలకు పాత్రులమైతిమి

పిల్లవానికి పుట్టినబుద్ధిది
దానిని మార్చెడి యోచనచేయుము
అసుర భూపతీ! అడ్డమెరుగవు
వివరముగా మరి యోచించుమయా!"

అటులపలికిన వారిమాటలకు
కాస్తకుదుటపడె హిరణ్యకశిపుడు
తిరిగిబాలుని చూడగనంత
ప్రసన్నముగా తనయుడు అగబడె

తిరిగి ఉగ్రుడై పలికెను తండ్రి
విన్నావామరి గురువులమాట
అంతానీవే నేర్చి నాడవా!
ఎవ్వరు నీకీ బోధలుచేసిరి

దుర్బోధనలు చేసిన కుమతి
ఎవడో చెప్పుము - చీల్చివేతును
అనగాబాలుడు - పలికెనంతట
ఎవరోచెప్పిన - రానిచదువిది.

నిష్కారణమ్ముగ గురునిందను మరి
విప్రనిందను - చేయు చుంటివి
కారణమున్నను అట్టినిందను
గురు, విప్రులపై - చేయగరాదు

ఇంతకుముందే విన్నవించితిని
ఈసంసారము - చీకటి నూయి
ఆకూపమున కూరుకుపోయి
ఇంద్రియాలకు లొంగిపోయి మరి

పుట్టుచు, గిట్టుచు జన్మలుగడిపే
జీవితయాత్ర వ్యర్ధమైనది
అట్టిఅజ్ఞానపు జీవుల కెంతయు
పరతత్వజ్ఞానము చెప్పిన వినడు

లంచమిచ్చి హరిభక్తిని పొందరు -
కారడవులలో నియమనిష్టల
కాలముగడిపిన భక్తిఅందదు
భక్తివిద్యయది చెప్పిన అబ్బదు.

ఆత్మసాక్షాత్కారమన్నది రాజా!
పొడిమాటలతో అందని దయ్యా!
గుడ్డివానికి మరియొకఅంధుడు
చూపెడిదేమి - ఆలోచించుము

కర్మబద్ధులై సంసారజలధిలో
మునిగినవారు హరిని చూతురా!
హరిభక్తితొ మరి బంధవిముక్తితొ
పావనమూర్తిని దర్శించెదరు.

శాస్త్రాధ్యయనము చేయలేదని
తలంచవలదు - భక్తిశ్రద్ధలతొ
గురువులుచెప్పినవన్నీ చదివితి
వాటిసారమును చదివితి నేను

సంసారజలధిని దాటి భక్తితో
శాశ్వతమైన ఆనందధామమగు
పరంధాముని చేర్చెడిత్రోవ
తెలుసుకొనకను చదువులు వ్యర్థము

వేదాలను వల్లించిన గాని
శాస్త్రాలను మరి తిరగేసినను
తెలియనిచదువు చదివితి రాజా!
నాకు లభించిన పుణ్యముఅదియే

ఆమాటలతో - ఆ మహరాజు
తోకత్రొక్కిన త్రాచుగమారెను
ఆసనమ్ముదిగి ఒక్కటిచరిచి
బాలుని దూరము విసరివేసెను

విన్నారామరి! వీనివదరుడు
ఎంతటి ధైర్యము గుండెనిబ్బరము
పితృద్రోహిగా మారెను వీడు
శత్రుపక్షమున దూరిన దుష్టుడు

ఇంతటి ద్రోహిని బాలఘాతకుని
ఎచ్చటనైనా చూచియుందురా
వీనికి తగిన చదువుచెప్పెద
వదలను వీనిని - ఈ ఉన్మాదిని

అనుచు అచట గల అసురయోధులతొ
అరచుచు పలికెను - వింటిరిగాదా!
ఐదు వసంతములున్న వయస్సులొ
పులి మీసములను లాగుచుండెను.

మన కులద్రోహిని ఆ మాయావిని
కీర్తించుచు మరి బోధనచేసెను
ఎంతచెప్పినా త్రోవమారదు
అంతకంతకు శృతిమించినది

పుత్రాకృతిగల - శత్రువు వీడు
అసుర కులముకే మచ్చుతెచ్చెను
మాటల - మార్చని దీర్ఘరోగము
మరణబాధల మారునొ ఏమొ!

దయచూపకను - రాచపట్టిని
సంహరించుడు - సరియగురీతిని
చెడిన భాగమును వైద్యుడు వదలక
ఖండించినటు వధించివేయుడు

ఈ కులద్రోహిని - పితృద్రోహిని
వధించి - కులమును కాపాడవలె
మరుమాటాడక మట్టుపెట్టుడు
మరోమాటయిక లేనేలేదు.

అటులపలికెను అసురభూపతి
ఆవేదనను దిగమ్రింగుకొనె
అనురాగ రాగము ముఖమునకనబడె
అది తండ్రికగు కఠినపరీక్ష

అంతట తలచెను భక్తశిఖామణి
సరియగుత్రోవకు తండ్రివచ్చెను
అది అటుజరగక - భిన్నమైనచో
ఆయన జన్మకు - ముక్తి లభించదు

అన్నిబాధలు తండ్రికొరకునై
ఆనందముగా అనుభవింతును
అసలాబాధలు నాకు కలుగు టెటు
నా శరీరమే హరిసొత్తుగదా!

ఆయనసొత్తును రక్షించుకొను
ఆర్తరక్షకుడు - పరంధాముడు
అహర్నిశము నావెంటనుండును
ఆయన కివ్విబాధలుగావు

అనుచు పొంగెను ప్రహ్లాదుండు
తండ్రిసేవలు యిప్పుడు మొదలు
జన్మనెత్తిన ఫలమదియగును
అని - ఆ భటుల వెంబడిసాగెను.

॥శ్రీ కృష్ణచరితము॥



## 4 ప్రహ్లాదుని హింసించుట

అసుర యోధులు అతికర్కశముగ
అరపుల కేకల - బాలుని దండన
ఆరంభించిరి - ఆ పసివాడు
అసలాబాధలు తనకు కాదని

తనునమ్మిన ఆ పరాత్పరుండు
అండగ నిలచును - అను నమ్మకము
ఆత్మవిశ్వాసము అంతకంతకు
అధికమైనది ఆ బాధలలో

శూలాలతొ మరి పొడచిరి కసిగా
గదలమోదిరి - రాజు ఆనతిని
అంతకంతకు రెచ్చిపోయిరి
అధికముచేసిరి వారి ప్రయత్నము

అంతజరిగినా అసురయోధులే
అలసిపోయిరి ఆయాసముతో
అసురేంద్రుడు మరి దండించునని
ఆగక బాదిరి - బాలుడు కందడు.

ఉలకక పలుకక ఊరకుండెను
ఊపిరందని స్థితిలో యోధులు
కత్తుల - ఈటెల పొడిచిరి - పొడచిరి
వారిచేతులు రక్తసిక్తమయె

జగద్రక్షకా - జగదాధారా!
దయాసాగరా! దుష్టశిక్షకా!
భక్తబాంధవా - భవబంధవిమోచక
పాపనాశకా! పతితపావనా!

అవివేకులను మన్నించుమయా!
అనుచు వారిపై జాలిచూపుచు
చిరునగవులతో నిలచియుండగా
చిత్తరువులయి చూచిరందరు

ఆకలి అనడు - అలుపునెరుగడు
అయ్యో! అనడు అమ్మో! అనడు
కాపాడమని అడగడెవ్వరిని
హరినామము మరి ఆగక పలుకును.

అంతటిలోన సమాధిస్థితిలో
నిలచి పోవును ఆతనిముందు
శ్రీహరియున్నటు తలంచుకొనును
తను పులకింతతొ వందనమిడును

తెలియక తాను తరించు మార్గము
తానే త్రొక్కెను - తన జనకుడని
అనందముతో ఆపసివాడు
శ్రీహరి స్మరణతొ భరించెనన్నియు

విషయముతెలిసిన రాక్షసరాజు
భటులపైన మరి ఆగ్రహించెను
మత్తగజములతొ త్రొక్కించమని
మరియొక ఆదేశమ్మునిచ్చెను

ఆగజములవి ముందుకువంగి
బాలుని ఎదుట వందనముంచి
తిరిగి వెనుకకు త్రోవతీసెను
కరివరదుని - మరి కాంచె బాలునిలొ

ఎంతజేసినా భద్రగజములు
ముందుకురావు అచ్చెరువాయెను
అంతట బాలుని విషనాగులచే
కరిపించగను ఆజ్ఞలనిడెను

పన్నగశయనుని ధ్యానమునున్న
గరుడ వాహనుని కీర్తనచేసెడి
ప్రహ్లాదుని గని - విషసర్పములు
తోకల నిలబడి భక్తిని తెలిపెను

అంతకంతకు అసురభూపతి
ఆగ్రహమ్మది పెరుగుచున్నది
ఆలోచించెను ఆలోచించెను
అగ్నిహోత్రమున త్రోయగజెప్పెను

అప్పటికప్పుడు ఎండుకట్టెలతొ
అగ్నిహోత్రము నెలకొనజేసి
రమాకాంతుని నమ్మిన భక్తుని
త్రోసిరి అగ్నిలొ - నిండిన కసితో

ఆశ్చర్యముగా. అగ్నిఆరెను
చందనచర్చగ బూదిఅంటెను
అందరినోళ్ళు అటులే తెరచి
రెప్పలార్పక గాంచిరి బాలుని

మరియొక మార్గము బాలునిఅచట
సంద్రజలముల విసరివేయమనె -
తండ్రి యిచ్చిన ఆదేశమ్మును
అమలుపరచిరి ఆ కింకరులు

అటుల జలముల బాలుని విసరి
అమ్మయ్యా! అనిచేతులు దులుపుకు
అడుగుత్రిప్పిరి - తిరుగుయానముకు
అంతటిలోన దివ్యబాలకుడు

అమోఘమైన అలపై ఒడ్డుకు
కొట్టుకువచ్చి - అనాయాసముగ
గట్టునెక్కిమరి వెంబడించెను
హడలిపోయిరి అసురయోధులు

చంపగబోయి - చచ్చినంతయి
బాలునితోడ్కొని - తండ్రిని గాంచి
అంతాచెప్పి రక్షించమని
అసహాయులమని విన్నవించిరి

చంపుట తేలిక అనుకొని మేము -
ఎందరొ మునులను - ధర్మపరులను
మీ ఆనతితో మట్టుపెట్టితిమి
ఇప్పుడు తెలిసెను మాప్రతాపము

చంపలేమని నిర్ణయానికి
వచ్చినారము దానవశ్రేష్టా!
దయగొని మమ్ము క్షమించప్రార్థన
లేదా సిద్ధము - నీవిడు శిక్షకు -

ఆఖరి యత్నము గిరిపైనుండి
బాలుని విసరగ ఆనతినిడెను
అటులజేసిరి కానీ బాలుడు
క్రిందపడినను చల్లగనుండెను

గిరిక్రిందను తను తన గోవిందుని
గోవర్ధనగిరి నెత్తిన వానిని
ప్రార్థన జేయుచు నవ్వుచు కనబడె
బాలుని తీసుకువచ్చిరి తిరిగి

అసమర్థులని భటులను తిట్టి
మంత్రులనడిగెను చంపెడిమార్గము
ఒకరి ముఖము లొక రందరట
చూచుకు నిలచిరి మంత్రిపుంగవులు

అంతటిలోన దివ్యయోచన
వచ్చినట్టుగా హిరణ్యకశిపుడు
అభిచారహోమములు చేయించినచో
ఉలకక చచ్చును అని ఆనతినిడె

రాజుఆనతిని పురోహితులట
తంతుఅంతయు విధిగా నెరపి
మంత్రాక్షతలూ - నీళ్లనుతీసి
బాలునిపైన చల్లిరి వారు

హోమ యజ్ఞముల - కర్తయు - భోక్త
యజ్ఞపురుషుడవు - నీ వేకాదా!
ఆశ్రితపోషా! అనుచు భక్తిగా
హరిని తలచుచు నుండెను బాలుడు

అంతటిలోన హోమగుండములు
నీళ్ళుపోసినటు ఆరిపోయినవి
నోళ్ళుతెరిచిరి ఆ పురోహితులు
నీరైపోయెను దానవరాజు.

హేమకార్యము నిర్వర్తించుట
రాదుగనక - మరి భ్రష్టుఐనదని
పురోహితులను తిట్టి పంపెను
బ్రతుకు జీవుడా అనితలంచిరి

ఆయాసముతో అసురభటులట
రాజుకుచెప్పిరి వారిబాధను
తిరిగి వారికే దెబ్బలువచ్చి
తగులుచున్నవని పదములబడిరి.

ఏమిచేయుటకు పాలుపోకను
విసిగిపోయిన హిరణ్యకశిపుడు
తిరిగి కొట్టమని హింసించమని
ఆనతిచ్చెను - చేసిరి వారు

మార్గముగానక భటులకు చెప్పెను
తోడ్కొనిపోయి ఇచ్చవచ్చినటు
హింసించుడని పంపివేసెను
దీనవదనుడై ఆలోచించెను

చలించనట్టి పిల్లవానిని
చీకటిగదిలో బంధించి మరి
అన్నపానములు యివ్వవద్దని
ఆదేశించెను ఆగ్రహమ్మున

జానెడులేని పసికందును మరి
జయించలేని - అమర విజేతను
అనుచు సిగ్గుతో - తలదించుకొని
పరపరివిధముల యోచనచేసెను

కొన్నిరోజులు అటులగడచినవి
బాలుని స్థితిని చూడగ తండ్రి
తలుపులు తెరచి చూడగ చెప్పెను
చెక్కుచెదరక కూర్చొనె బాలుడు

విష పన్నగములు వ్యర్థమైనవి
భద్రగజములు వందనమిడినవి
అగ్నిదేవుడు దీవన లిడెను
సంద్రజలములు కాళ్ళుకడిగెను

గదిలో అడుగుబెట్టిన భటులు
చెంగునగెంతి బయిటకు దూకిరి
బంగారములా - వన్నెవాడక
బాలుడు బయటకు వచ్చెనప్పుడు

మాయలమారి గజరక్షకుడా!
పన్నగాలకు ఆజ్ఞలనిడెనా!
మామగారగు సాగరమ్మునకు
సంకేతమును అందజేసెనా!

శిరోభారము పెరిగె రాజుకు
తిరిగిబాలుని పొడచి - చీల్చుమని
ఆనతి నిచ్చి తిరిగి పోయెను
అంతజేసినా అలవడు బాలుడు

కొండ నెత్తినటు గాథలు చెప్పెడి
కొంటెబాలుడు - బాలునిగాచెన!
కాలుడు ఆహరి కింకరుడా మరి -
కాలపాశము విడువక నుండెను

సప్తమస్కంధము

బాలునిచంపెడి వాడేలేడు
చంపుయత్నమున చచ్చెదనేను!
చావులేని మరి నాకు చావును
తెప్పించగను పుట్టెను బాలుడు.

ఆలోచనలతొ శిరోభారముతొ
చండామార్కుల కబురుపంపెను
గురుపుత్రులకు ఆసనమ్మొలిడె –
రాజునుగాంచి – పలికిరివారు

రాక్షసేంద్రుని ముఖమును గాంచిరి
ఆవేదనను గ్రహించినారు
"ప్రతాపతేజము నిండినవదనము
దీనమునున్నది దానవాగ్రణీ!

సురపతి ఇంద్రుడు లొంగిపోయెను
రిపులపాలిటి సింహస్వప్నమగు
నీకీచింత – కలుగుట ఏల?
ధరకంతయును శాసనకర్తవు –

బాలునిగూర్చి ఇంత వంతయా!
తెలిసియొ తెలియక పలికినపలుకులు
మదిలో నుంచుకు మథనపడకయా!
త్రోవకు తెచ్చిడి విధముచూతము

కోపతాపముల మార్గమువలదు
మంచిమాటలతొ మనసుమార్చవలె
మాజనకునికి అప్పగింతము
ఆయన మార్చును ఆ పసివానిని

వయస్సుపండిన విద్యావంతుడు
అసుర కులముకు వేల్పుసముడగు
మాజనకునికై ఓపికపట్టుము
అనుచు చల్లగా చెప్పిరివారు.

వారిమాటలతొ తేలికపడెను
వినయమునిండి పలికెను వారితొ
అటులచేతము అంతవరకును
బాలుని మీరు గొనిపోయి – మరి

ధర్మార్థకామములు – గృహస్థుడైన
రాజునేర్వగ వలయు – వాటిని
ఉపదేశించుడు అనగా వారు
బాలునితోడ్కొని గృహములకేగిరి

ధర్మార్థకామముల విషయములన్నీ
విపులముగా బోధించిరి గురువులు
రాగద్వేషముల ఇంద్రియ సుఖముల
దారితీసెడి విద్యలవియని

ఐహికవాంఛలు నెరవేర్చుకొన
ఈశరీరము శాశ్వతమనుకొని
అజ్ఞానంలో పడిన వారు మరి
నేర్చుకొందురు అట్టి విద్యలని

అసలు విద్యకై పరితపించెడి
పరమభక్తుడు ఆ ప్రహ్లాదుడు
లౌకిక విద్యలు విన్న వెంటనే
అప్పగించెడి గ్రాహి ఆతడు

గురువులు విద్యాబోధనుచేసి
స్నానసంధ్యలకు వెడలినంతనే
తోటి బాలురతొ ఆటలాడక
వారిలొ నాటెను - భక్తిబీజములు

తోటిబాలురకు ఇటులచెప్పును
"మన గురుదేవులు అసలగు చదువును
ఇంతవరకును చెప్పనె లేదు
కొరగాని చదువులతొ చెవులు చిల్లుపడు

నేనొక పాఠము చెప్పెద వినుడు"
అనగావారు తొందర చేసిరి
"మనవంటి బాలురు ఎందరొ యిలలొ
చచ్చుచుండిరి - చూచుచుంటిమి

మరణించగను ఏమిపొందెదరు
తిరిగి ఎక్కడో జన్మించెదరు
పెరిగి పెద్దయి - రాలిపోదురు
ఇటుల వలయములొ చిక్కుకొందురు

జన్మకు ఏది సార్ధకతయొ - అది
గురువులు మనకు చెప్పలేదు కద!
శిధిలమగునది కావున దీనిని
శరీరమనుచు పిలచుచుందురు

నేనుచెప్పునది వినుడు శ్రద్ధగా
ధర్మార్ధములను నెరవేర్చుటకు
అనువైనది ఈ మానవజన్మ
పుణ్యఫలముతో లభించె మనకు

మనిషికి మనుగడ నూరేళ్ళుకద
సగము - రాత్రిలో గడిచిపోవును
మిగిలిన దానినిలొ ఇరవైఏళ్ళు
పసి - బాల్యము మరి యౌవ్వనమేకద

మిగిలినవింక ముప్పదిఏండ్లు
ఇంద్రియవశమున అర్ధకామముల
ఊడిగమ్ముతో నిరర్ధకమ్ముగ
అగును - దానిని వివరించెదను

కామ, క్రోధ, లోభ, మోహ ములు
మదమాత్సర్యము లారు శత్రువులు
మనిషికి తెలియక అతనిలొ జేరిన
దుష్టగ్రహములవి బలవత్తరములు

ఆ ఆరుశత్రువులు - ఇంద్రియాలను
బంధించి - వాటికి వశమునునుంచును
వాటికి - లోబడి తృష్ణపెరుగును
ప్రాణముకన్న తృష్ణ తీపియగు

తృష్ణనిండిన జీవుడు - ధనమును
సంపాదించెడి ధోరణిలోబడు
ఎన్నోత్రోవలు - త్రొక్కును ధనముకు
చివరకు - పరులసొమ్ము హరించును

ఆపై మనిషి - స్త్రీకి దాసుడగు
ఆ స్త్రీయంత్రము - సౌందర్యము మరి
లావణ్యముల ముగ్ధుని చేయును
ఆ మోహము మరి కృంగదీయును

పెరిగినమోహము సంతానముతో
దారాపుత్రుల బంధనమ్ముగా
ధనార్జనకు మరి త్రోయును ముందుకు
ఎన్నోయిడుములు మీదకుదూకును.

తల్లిదండ్రులు - భార్యాపిల్లలు
బంధులు - హితులు - పరివారమ్ము
ఇల్లూ - పశువులు - తోటా దొడ్డీ
అనెడి బంధములు - బిగిసిపోవును.

ఆబంధములతొ ఇంద్రియసుఖముల
ఉదరపోషణ - ధనార్జనమ్ము
అదియేఅగును పరమార్ధమ్ము
మరి తరించుటను చింతే వుండదు

ఇదితెలుసుకొని కౌమారవయస్సున
భగవద్భక్తిని అలవరచుకొని
సుఖదుఃఖములు - కాలగమనమున
వచ్చెడివేనని తెలియగవలెను

అతి చంచలము ఆయువు గావున
వృధాగా మరి - పోనీయకను
మోక్షసాధనకు వినియోగించుట
ఉత్తమమైన ధర్మముఅగును

సకలప్రాణులకు హరి ఆత్మయగు
హరినిమించి మరి ఆప్తులుండరు
అటులే శ్రీహరి అన్ని జీవులను
ప్రేమగచూచుచు రక్షణచేయును

అసువులు వుండెడివరకు జీవుడు
మోక్షప్రాప్తికై - హరి ధ్యానములో
గడపుటన్నది - త్రికరణశుద్ధిగ
అలవరచుకొన శాంతిలభించును

కానీ వింత - మనపెద్దలు మరి
సంసారలంపటము గృహస్థధర్మము
అన్నవి మనకు నూరిపోసెదరు
మోక్షపధమును మదిలో తలచరు

అనేకమైన గర్భవాసముల
బంధించబడి పుట్టుచు చచ్చుచు
కర్మలు చేయుచు కడతేరినచో
శాశ్వతసుఖము ఎటుల లభించును

అశాశ్వతమ్మగు ఈదేహమునకు
ఐహికసుఖము శాశ్వతమైనద?
కావున మనను భ్రమలోముంచెడి
పనికిరాని - ఈ చదువులెందుకు

మరెయొక విషయము తెలిపెద వినుడు
స్త్రీచూపులతో మత్తుకలిగిన
విజ్ఞానవంతుడు పెంపుడు లేడిగ
ఆడించినటు - ఆడుచుండును

విషయసుఖముల దాసుడుఅయిన
వానితొ - చెలిమి అనర్థమైనది
మరలచెప్పుచు నుంటిని మీకు
శాశ్వతసుఖము - ఈశ్వర సన్నిధి

అయిన చో మరి-హరి-ఎచ్చటగలడు
ఎటులాయనను చూడగలుగుట
అసలాస్వామి కనబడునాయను!
శంకలు వదలి వినుడుచెప్పెద

నీలో - నాలో - నిప్పులో - నేలలో
గాలిలో - నింగిలో - సకలజగత్తులో
అణువుమొదలు మరి మేరువువరకు
హరిలేనిది అసలేదియులేదు

అంతర్యామిగా హరిగలడు
వానినిగనుట కష్టముగాదు
అసురప్రవృత్తిని వదలివేసి మరి
మంచి మనస్సును పెంచుకోవలె

జీవకారుణ్యము, భక్తి ఉండెడి
తావులో హరి మరి తప్పక వుండును
అట్టిగుణములు కలిగిన వారు
హరి కరుణకును పాత్రులగుదురు .

ధనమదమున్నచో అసురప్రవృత్తిని
పెంచునుగావున దానినివదలి
ప్రసన్నమైన మనస్సుపెంచుకు
జీవులన్నిటిని ప్రేమించవలె

మనకు ఏది మరి ఇవ్వగవలెనో
ఆ ఈశ్వరునకు తెలియునుగావున
వెర్రిచదువులతో వెకిలిభక్తితో
కోరుచు పోయిన - లభించవేవియు

ఈ జ్ఞానమును లోగడ ఒకపరి
నారాయణుడు నారద మునికి
తెలియబరచెను కావున యిది మరి
అర్థము అగును హరిభక్తులకే

నాకు దీనిని నారదమహర్షి
తెలిపెను - దానిని - మీకు తెలిపితి
అనుచు ప్రహ్లాదుడు వారికిచెప్పగ
ఆనందించిన బాలురు పొగడిరి

అంతట అడిగిరి ఆ ప్రహ్లాదుని
ఇంతటిజ్ఞానము ఎట్లు కలిగినది
రాజభవనము దాటిఎరుగని
పసివాడవు నువు ఎట్లునేర్చితివి

అనగా పలికెను చిరునగవులతో
పూర్వము ఒకపరి నాదుజనకుడు
మందర పర్వత ప్రాంతమందున
కఠోరతపస్సును ఆచరించెను

ఆసమయములో అదేఅదనని
దేవసేనలు ఇంద్రునితోను
మన రాజ్యమును ముట్టడించిరి
భయోత్పాతములు కలుగ జేసిరి

అనుకోని సంఘటన - అసురసేనలు
దిమ్మెరబోయి - ధైర్యము తెచ్చుకు
పోరిరి గాని దిక్కుతోచక
అసువులు నిలుపగ పరుగులు తీసిరి

అంతట ఇంద్రుని సేనలన్నియు
మానగరములో అడుగు బెట్టినవి
నగరమంతయు ధ్వంసముచేసిరి
రాజమహలుకు ఇంద్రుడువచ్చెను.

పరుని ముఖమును చూడని సాధ్వి
నాజనని అట భీతిల్లినది
సిగ్గుతొ ఒక గదిమూల నక్కినది
సిగ్గుమాలిన ఇంద్రుడు ఆమెను

వెదకి కనుగొని బంధించాడు
వెంటతీసుకొని పోవుచుండెను
అది తలంచిన గుండెపగులును
అంతట నారదు డగపడె అతనికి

విషయము తెలిసి నారదమహర్షి
మందలించెను తగని పనియని
"దేవగురువుకు శిష్యుడవీవు
నీచమైనపని చేయగ తగునా!

శీలవతి మరి మహాపతివ్రత
పైగా ఈమె చూలింతకదా!
అబలను నీవు దుఃఖపెట్టుట
తగని పనియని తెలియవలెనుకద!"

"అంతట ఇంద్రుడు పలికె రోషమున
స్వామీ నాకు తెలుసును విషయము
ఈ ఇల్లాలు ప్రసవించగనే
శిశువునుచంపి ఆమెను విడచెద

తండ్రికి తోడు తనయుడు కలిసిన
దుష్కృత్యములకు అడ్డువుండదు
ధర్మనాశనము మరింత జరుగును
సురలకు – బ్రతుకే దుర్భరమగును."

అంతట పలికెను నారదమహర్షి
"ఇంద్రా! ఈమెకు పుట్టెడి శిశువు
భాగవతోత్తముడన్నది తెలియుము
హరి రక్షణలో నున్నశిశువది

కోరినీవు మరి యిడుమల బడకుము
విషయము వినిన దానవేంద్రుడు
తపోబలమున బలములుపెరిగి
ముందుగ నిన్నే ముట్టడించును

మరింత దుఃఖము కలుగును నీకు
కావున – సింహపు చెవులు లాగకు
అటులనీవు మరి చేసినచో యిక
నీదు ఉనికి యిక ప్రశ్నార్థకమే!

కావున నీవు ఈ పతివ్రతను
వదలి పెట్టి నీత్రోవనపొమ్ము."
అనగా ఇంద్రుడు వివేకమ్ముతో
తల్లిని విడచి వందనమిడెను

అంతట ఆమెను నారదమహర్షి
తన ఆశ్రమముకు తీసుకు పోయెను
తగిన వసతి నేర్పాటుచేసెను
ధైర్యోక్తులను చెప్పెనామెకు

అమ్మా నీదు పాతివ్రత్యమది
జగద్విదితమే సందేహించకు
నీకుపుట్టెడి బాలుడు - ఘనుడు
జగత్పావనుడు కారణజన్ముడు.

తండ్రి ఋణమును తీర్చుకొనుటకు
ఉత్తమగతిని తండ్రికిడుటకు
బాధలనోర్వగ ఆరంభించెను
గర్భవాసమున మొదలయె బాధలు

అతి తొందరలో నీపతిదేవుడు
వరములుపొంది తపము ముగించుకు
వచ్చిచేరును అంతటివరకు
ఈ ఆశ్రమమున ఉండుముఅనెను.

భర్త విజయముతొ వచ్చును-అని విని
ఆనందించెను - అంతకు మించి
భాగవతోత్తముడగు పుత్రుడు
పుట్టునని విని - పొంగిపోయినది.

చేతులురెండు జోడించి నారదుని
పదములనంటి నమస్కరించెను
"తండ్రిమాదిరిగ నాసంరక్షణ
భారముమోసెడి మహానుభావా!

నీ ఆశ్రమమున నీ ఆశీస్సులతో
మనశ్శాంతితో నుండెద స్వామీ!"
అటుల నారదుడు వేయికళ్ళతో
నాతల్లిని తా కాపాడెనట

హరిభక్తి కథలను చెప్పెడివాడు
హరికీర్తనము చేసెడివాడు
ఒకదినమున నాతల్లికి మౌని
తత్త్వోపదేశము చేసెను వింటిర.

ఆ తత్త్వమును సవిస్తరముగా
గర్భస్థముగా వింటిని నేను
కాలవశమున మాతల్లి మరచినను
నేను మాత్రము మరువకుంటిని

పూర్తిగ నాకు జ్ఞప్తియున్నది
అనగాబాలురు యోగ్యులమైనచొ
చెప్పుము మాకు - విందుము అనిరి
తప్పక అందరు వినదగినదిది

విశ్వాసముతో స్త్రీపురుషులు మరి
పిల్లలు అనెడి భేదములేక
విని అటు నడచిన వారందరికీ
జన్మరాహితిని కలిగించునది.

॥శ్రీ కృష్ణచరితము॥



## 5 ప్రహ్లాదుడు రాక్షసబాలురకు చెప్పిన తత్త్వసారం

ఈశ్వరుడే మరి కాలపురుషుడు
కామక్రోధలోభమ్ములు మూడు
దేహమ్మునకు అంటియుండును
ఆత్మకు అవ్వి అంటనె అంటవు

చెట్టుకు పుట్టిన పండుకు దశలు
పండుట ఎండుట రాలుట కుళ్ళుట -
అంటియుండును - కానీ చెట్టుకు
ఆ దశలు అంటవు వింటిర మీరు!

సత్యము – నిత్యము – శాశ్వతమైనది
పరిశుద్ధమైనది ప్రకాశించునది
అంతటనెలకొని అంటనట్టిది
ఆత్మయన్నది తెలియగవలెను

వివిధ పదార్థ కలయిక దేహము
స్థావర జంగమరూపుల నుండును
ముందు చెప్పిన తత్వమ్ములకు
సాక్షిగ ఆత్మ నెలకొనియుండును

పంచభూతముల కాశ్రయమైనది
దేహములోన వెలుగుచుండెడిది
కర్మల నేవియు చేయనట్టిది
వివేకముతో ఆత్మ తెలియబడు

మూలప్రకృతి మొదలగువాటికి
మణిహారములో సూత్రముతీరుగ
ఆత్మవుండును ప్రకాశించును
ఆత్మకు – చావు పుట్టుకలుండవు

అశాశ్వతమ్ము ఈ శరీరమని
అహంకార – మమకారమ్ములతో
అదివుండునని తెలియగవలెను
అదిగ్రహించిన మార్గము సుగమము

తెలియక ఆత్మకు పుట్టుకగలదని
పెరుగుట – చచ్చుట – కలదనిచెప్పెడి
మిథ్యావాదన వదలిపెట్టి మరి
దేహములోని ఆత్మను గనవలె

బంగారపు గని యందలిరాళ్ళను
అతిమెలకువతో అగ్నిసంయోగముతొ
స్వర్ణకారుడు గ్రహించినటులు –
నిపుణతో మరి ఆత్మనెరుగవలె.

తత్వవిచారణ చేసుకొనుచును
శోధనచేసి ఆత్మను గనవలె
ఉన్నటులున్న అవస్థలేవియు
ఆత్మకువుండవు తెలియగ వలెను

మూలప్రకృతి – మహత్తు మరియు
అహంకారము – పంచతన్మాత్రలు
అనునవి ఎనిమిది ప్రకృతులగును
సత్వరజస్తమములు దాని గుణములగు

జాగృతి – స్వప్న – సుషుప్తి – అనెడి
అవస్థలను మరి దాటిన దాత్మ
కర్మలబుట్టిన బుద్ధులతోను
ఆత్మనుతెలియగవీలు చిక్కును

కర్మేంద్రియములు జ్ఞానేంద్రియములు
మనస్సు – భూ జలాగ్ని–వాయు గగనములు
అనుపదారు వికారమ్ములను
కపిలుడు మొదలగువారు చెప్పిరి.

పరిమళించుట పూవు స్వభావము
ఆస్వభావము పరిమళమ్మును
ఆశ్రయించుకొను గాలికి తెలియును
అటులే బుద్ధితొ ఆత్మను గనవలె.

గుణకర్మల స్థావరమైన
సంసారమేర్పడు బుద్ధివల్లను
అజ్ఞానమునకు మూలస్తంభము
స్వప్నమువంటిది ఈసంసారము

కల చెదరగనే శూన్యమన్నటు
అశాశ్వతమ్ము ఈ సంసారము
సుఖదుఃఖములు వికారమ్ములవి
మనస్సువల్లను ఏర్పడు చున్నవి

సంసారలంపటము కలిగినవానికి
స్వప్నావస్థయె - జాగ్రదావస్థ -
గుణవికారములు అంటనివాడు
ఈశ్వరుడొకడే తెలియగ వలెను

గుణాశ్రయమ్ము కలిగిన జీవుడు
పుట్టును చచ్చును అనుట భ్రమయది
గుణాలవలన కలుగు కర్మలతొ
అజ్ఞానమ్మది కలుగుచుండును

జ్ఞానాగ్నితొ ఆ అజ్ఞానమును
దగ్ధముచేయగ - కర్మలు నశించు
కర్మలు నశించ - గుణములు నశించు
అది సాధనము - దివ్యధామముకు

అనుచుతిరిగి ఆ ప్రహ్లాదుండు
భాగవతధర్మము లుపదేశించెను
పరమేశ్వరుని చేరుటకనువగు
ధర్మమ్ములు తా వినిచె బాలురకు.

తల్లిదండ్రుల గురువుల సేవ
దురాశవదలి తృప్తినందుట
సజ్జనస్నేహము విగ్రహారాధన
హరికథ శ్రవణము హరికీర్తనము

హరిచరణములను ధ్యానించుటయు
హరివిగ్రహములను దర్శించుటయు
హరిపూజ శ్రద్ధగా భక్తిగచేయుట
వైరాగ్యమునకు సాధనమ్ములివి.

వీటిని భాగవత ధర్మములందురు
వీటి మూలముగ విష్ణువు అన్నిట
సర్వభూతముల ఆత్మరూపముగ
ఉన్నట్టుగను భావించుకొని

అరిషడ్వర్గమ్ములను జయించి
ఇంద్రియాలను వశపరచుకొని
హరిభక్తిగలిగి మరి ప్రవర్తించిన
హరిసాయుజ్యము లభించగలదు

హరిపై ధ్యానము నిలపినవాడై
ఆయన లీలలు కన్నుల గనినటు
పరవశమ్మున, గద్గదమ్ముతో
తన్మయుడై మరి కీర్తించవలె

వైకుంఠవాసా - దీనశరణ్యా!
దయాసాగరా - పాపనాశనా!
పతితపావనా - పన్నగశయనా!
పాహిముకుందా - అని పలుకుచును

దేహధ్యాసను మరచినవాడై
నాట్యమాడుచు పరవశించవలె
అప్పుడు నిజముగ కన్నులముందర
భక్తకల్పకము కనబడు మనకు

అట్టిస్థితికి మరి జేరినవాడు
బంధములన్నీ సులువుగ తెంచుకు
అరిషడ్వర్గము లోడిపోవగా
హరిసాయుజ్యము తప్పకనందును

సర్వజీవులలొ హరి వసించును
అన్నిహృదయములు ఆయన నెలవులు
ఆకాశమ్మది లేనిది ఎక్కడ!
అటులే శ్రీహరి లేనిది ఎక్కడ!

పుణ్యకర్మలు – యజ్ఞయాగములు
చేయుటవలన పుణ్యములభించి
పుణ్యక్షయము అయినవెంటనే
తిరిగి వత్తురు ఈలోకమునకు

అట్టికర్మల ఫలితము మాత్రము
శాశ్వతమైనది కానేకాదు –
వచ్చిన ఫలితము ఫలమునిచ్చిన
పుణ్యముతగ్గిన – ఫలముతొలగును

అహంకారమున కర్మలుచేసిన
విపరీత ఫలితములు కలుగుచుండును
కామ్యముకోరి చేసినకర్మలు
సత్ఫలితమ్ముల నొసంగలేవు.

నేడుఇంటిలో – రేపు మంటిలో
అంతటి అశాశ్వతమైన దేహము
దానికి ఎన్నో కోర్కెలుపెంచుకు
తననే తాను మోసగించుకొను

దేహి – కర్మలు ఆచరించగా
కర్మలు చేసెడి దేహము లభించు
అజ్ఞానముతో కర్మలుచేయుచు
పుట్టుచు తిరిగి కర్మలు చేతురు

సర్వభూతముల తాను సృజించి
వాటితొకలిసి హరి వసించుచు
జీవుడు అనెడి పేరున బరగును
అది తెలిసినచో జ్ఞానము కలుగును

నిశ్చలభక్తితొ కొలచుట ముఖ్యము
దేవతలా మరి దానవులా మరి
యక్షకిన్నర సిద్ధసాధ్యులా –
అన్నది ముఖ్యముకానేకాదు

పాపకార్యములు ఆచరించుటకు
నియమము ఎటుల విధించబడదో –
అటులే శ్రీహరి కరుణపొందుటకు
విచక్షణన్నది కలగదు వినుడు

దానధర్మములు జప తపమ్ములు
వ్రత నియమాలతొ హరిని పొందము
హరిని చేర్చునది – భక్తి ఒక్కటే –
అనన్యభక్తి రాజమార్గము.

నిజమగుభక్తితో పిలచినవానిని
చిరునగవులతో దగ్గరతీసుకు
ఆనందసీమను అందజేసెడి
అక్షరమూర్తి శ్రీహరి – వినుడు!

అసలు విషయము – నేటి చదువది
బానిసత్వము మనకు నేర్పునది
బ్రతుకు తెరువును కలిగించునదే
హరినిచేర్చుటకు పనికిరానిదది

కావునమీరు పుస్తకాలను
గురువులకే మరి ఇచ్చివేయుడు
నమ్మకమున్న నాతోరండు
అసలగు విద్య నే బోధించెద

ఒక్కటి వినుడు మీరందరునూ
అసురగుణములు వదలివేయుడు
పెద్దలతొ మరి బంధమువలదు
చీకటినుండి వెలుగుకు రండి

మనసుతీరగా హరికీర్తనలతొ
ఆనందనృత్యమున తేలిపోదము
నిత్యనూతనము ఐన జీవితము
ఆరంభింతము ఆలోచించుడు

కనబడువారలు శత్రులుకారు
అసలగు రిపులు లోపల గలరు
ఆరుశత్రువులు – అరిషడ్వర్గము –
వారే నిజమగు రిపులగు మనకు.

హరినామస్మరణము అనెడి
దివ్యాయుధమున ఆరుశత్రువుల
అంతముచేయుట అతిసులభమ్ము
అది ప్రారంభము ఉన్నత పథముకు

సంసారబంధములు తెగవలెనన్న
హరిభక్తియను అస్త్రముకావలె
హరిభక్తియను గంగాజలముల
మనస్సు నిర్మలముచేయగవలెను

అజ్ఞానమ్మను చీకటినుండి
హరిభక్తియను దివ్వెనుగైకొని
బయిటకు వత్తము – నాతోరండి."
అనగా బాలురు సంతసపడిరి

అంతటినుండి ఆ బాలకులు
వారి పుస్తకములచ్చట వదలి
సమయము దొరకిన ప్రహ్లాదునితో
హరికీర్తనము చేయసాగిరి

అటులా బాలురు మెల్లమెల్లగా
భక్తిమార్గమున నడవసాగిరి
చండామార్కులు గ్రహించినారు
వచ్చెడి ఆపద తలంచి భయపడె

నేరుగ వారు రాక్షసప్రభువుకు
సర్వము తిన్నగ విశదపరచిరి
"తాచెడ్డ కోతి వనమెల్లచెరచెను
అన్నటులున్నది – తనయుని నడవడి.

లోకవిజేతా! నీకుమారుడు
మాకులొంగడని నిర్ణయమైనది
తోటిబాలురను కూడతీసుకొని
మాచదువులవి వ్యర్థముఅనెను

అందువలనను మావిద్యార్థులు
పుస్తకమ్ములను ముఖమున కొట్టి
మమ్మల్నే మరీ చదువుకోమని
ప్రహ్లాదబాలునితో చేరిపోయిరి

ఏదోవిధముగ ఓబలశాలీ!
నీవే - త్రోవకు తీసుకురావలె
మాచదువులవి వ్యర్థము అనుచు
మాముఖమున మరి చెప్పుచుండిరి

మీకువచ్చిన - హరిగాథలవి
వినిపించమని - రాకపోయినచో
చెప్పిన - వినెడి స్థితికిరమ్మని
మాకు - హెచ్చరిక చేసిరి బాలురు.

నీకుమారుడు ఆ హరిభక్తితో
వళ్ళుతెలియనటు నాట్యమాడును
వెర్రికీర్తనలు పాడుచుండును
వాతావరణము కలుషితమగును

రాక్షసేశ్వరా! నీకడుపున మరి
వైరి భక్తుడు పుట్టుట ఎటుల!
అది నీ పుణ్యమొ - పాపఫలమ్మో
కానీ నీదు - కీర్తి నిలబడును"

గురువుల మాటలు గునపమ్ముల వలె
గుండెకు తగలి - చలించె రాజు
పదములునిలువక కంపించుచును
పండ్లుపటపట కొరికె కోపమున

తోకత్రొక్కిన త్రాచుపామువలె
దిగ్గున దిగెను సింహాసనమును
కన్నులు జ్యోతుల తీరుగ మారెను
అరచెను - వీనిని ఉపేక్షించను

నామరూపములు లేకుండగను
చేసెద వీనిని - వీనితో పాటు
గిరి పగిలినటు హరి తలపగులును
పేరు మిగలదు నామరహితుడగు

వెంటనె భటులకు ఆనతినిడెను
ఉన్నపట్టున ప్రహ్లాదకుమారుని
ఈడ్చుకురమ్మని తనముందరకు -
వెంటనె బాలుని నిలపిరిఅచట

ముందరగాంచిన గురువుకు బాలుడు
"హరిస్వరూపులగు గురుదేవులకు
వినయవినమ్రత వందనమ్ములనె"
అదివిని - రాజు అదిరిపోయెను

అరచెను దిక్కులు అవిసిపోవునటు
"దుర్మదాంధుడా! వదరుబోతువు!
వ్రేలెడులేని కుర్రకుంకవు
శత్రుపక్షమున చేరిపోతివి

నాముందరనే రిపునిస్మరించే
ధైర్యము నీకెటు కలిగెను ధూర్తుడ!
వాయువు మెదలదు అబ్ధి కదలదు
హిరణ్యకశిపుని కసి నెరుగవు నువు

నాపేరువిని అగ్నిచల్లబడు
భానుడు భయపడి వెలుగును చల్లగ
యమకింకరులు నా పాలనలో
అడుగు బెట్టుటన-యముని కలియుటే

ఇంద్రుడు శిరస్సు ఎత్తడెన్నడు
కిన్నర కింపురుషాదులందరు
నాపాదముల జేరి యుందురు
నాకెదు రెవ్వరు నిలబడలేరు

అంతటినన్ను, అమరవిజేతను
వేలెడంతటి వాడవు నువ్వు
భయమునెరుగక రిపునికీర్తన
చేయుచుంటివి! దుర్మతి వీవు!

నవగ్రహములు నాఅనుగ్రహము
కోరుచు – నన్నే కొలుచుచున్నవి
నామాటే ఒక శాసనమ్మురా!
భడవా! నీవొక ధూర్త భక్తుడవు

నీహరి ధూర్తుడు అట్టి కుటిలుని
పెద్దగనెంచి – దైవమ్మనుచు
వదరుచుంటివి – వివేకహీనుడ!
ఎవరుచెప్పిన దుష్ట బుద్ధియిది."

గాంగ్రింపులకు బెదరకనిలచెను
వైకుంఠవాసా! పాహిముకుందా!
అనుచు శ్రీహరిని తలంచెనచట
వెంటనె అసురుడు ఖడ్గమందుకొని

ధూర్తా! తిరిగి అదేపిలుపును
పిలచుచుంటివి చెప్పిన వినవు
ఎవడా హరి రా! దొంగ వాడురా!
నీచమైన వేషాలుధరించును

వాడొక రక్షకుడని – నువు నమ్మి
నాముందరనే పొగడుచుంటివి
వాడే అంతటి ధీరుడైనచో
సురలనెందుకు కాపాడలేదుర!

దేవదానవ సంగ్రామమున
నల్లులమాదిరి సురలను నలుపగ
వాడెందుకు రక్షించకుండెను
చేవలేకనా! చావుకువెరచా!

గురువులబోధలు వినకపోతివి
దైత్యకులమున చెడబుట్టితివి
మోక్షమిచ్చెడిది మాయలమారా!
దైత్యవిరోధి – దయాదూరుడు

గాలిసోకినటు – పదే పదిగను
ఆ అర్భకుని మాయలమారిని
పొగడుచుంటివి అది యొక చదువా!
చదువుల మర్మము అది అని అంటివి.

నాబల శౌర్యము లక్ష్యపెట్టక
నామరూపములు లేని చోరుని
నయవంచకుని నమ్మకద్రోహిని
నారాయణుడని పిలచు చుంటివి

అసురుల చంపుట సరదా వానికి
ఎదిరిపోరగ శక్తి లేదుమరి –
వారికి మోక్షము ఇత్తుననుచును
ప్రచారమ్ముతో మోసగించును

నిన్నీఖడ్గముతో ఖండించెద
దిక్కెవడో మరి ఆలోచించుము
బుద్ధిగ బ్రతుకుము అనిచెప్పినను
వినక మూర్ఖత పెంచుకొంటివి."

అసురునిగాంచి భూమివణకెను
దిక్పాలకులు దిగాలుపడిరి
కానీ ఆ ప్రహ్లాదుడు మాత్రము
చలించకుండా పలికె తండ్రితో

"దిక్కులనాతడు ఏర్పరచాడు
దిక్కుగ వాటిలో వెలిగెడివాడు
దిక్కగునాకు – దీనశరణ్యుడు
దిక్కని వేడిన దిగ్గున దిగును.

దిక్కెవ్వడని ధిక్కరించినను
దిక్కగు నీకు – ధర్మరక్షకుడు
దిక్కుదిక్కుల నిండి కనబడు
దిక్కుల దిక్కు – అందరి దిక్కు

ప్రశాంత మనస్సుతో ఆలోచించుము
తొందరగా మరి మాటలు వదలకు
బలములు దిక్కుల ప్రశ్నలెందుకు
మిత్రత్వమున మనసు కుదుటపడు

కాలము దాని గతులు మార్పులు
కలిగించెడిది ఆ ప్రభువయ్యా!
ఇంద్రియాలను నడిపెడివాడు
సృష్టికి ఆతడు – ఆద్యుడు తండ్రీ!

నాశములేని అక్షరుడాయన
అంతట నిండిన అనంతమూర్తి
కనబడు సర్వము అతనిలొగలదు
అన్నిట ఆతని రూపముకనబడు

కోపతాపములు పూర్తిగ వదలి
నిర్మలమనసుతొ నిరీక్షించి మరి
నిదానమ్ముగా చూచిన కనబడు
కావున నీమది నిగ్రహించుము

లోకాలన్నీ జయించినాను
ఇంద్రవిజేతను అంటివి నీవు
కానీ – నీలో అంతఃశ్శత్రుల
గెలవగ లేక – ఓడిపోతివి

ఇంద్రియనిగ్రహమన్న ఖడ్గమున
ఆరు శత్రువుల గెలవగ వలెను
అది నిజమైన జయమగు తండ్రీ!
నిష్ఫలమైన గెలుపు ఎందులకు

బుద్ధిని నీవు వశపరచుకొని
సర్వజీవులను సమముగచూడుము
కర్మబంధముల త్రెంపుకోవయా!
సంసారకూపమును వదలిరా యిక!

అధిదైవతము - అధిభూతమగు
ఈశ్వరుడైన హరి ఆశ్రయము
అందెడి మార్గము నీకు చూపగా
తనయునిగా నాబాధ్యత యగునది."

హిరణ్యకశిపుడు ఉగ్రుడయ్యెను
కాలిమడమలతొ నేలనుతన్నెను
కాల్చునట్టుగా బాలునిగాంచి
"హద్దుమీరి నువు ప్రేలుచుంటివి

నాకే పాఠముచెప్పెడి వాడవ!
చావుకు తెగించినట్టుగ నున్నది
ప్రాణమ్ములపై ఆశలేదుయిక
అసలెందుకు నువు పుట్టినాడవో!

విశ్వమంత శాసించువాడను
అదితెలియక నువు వదరుచుంటివి!
అనగా బాలుడు - "విశ్వవ్యాప్తివి
అంటివి కనుక - విష్ణుమూర్తివే"

ఆమాటలకు మరింత మండెను
నన్నే ఆహరి అంటున్నావా!
అనగా బాలుడు - సర్వము హరియే
అనవిని తండ్రి - వణకిపోయెను.

నీమాటలు - నీపిచ్చి తెలుపును
అన్నను చంపిన టక్కరి ఆ హరి
ఎక్కగలడుర? వివేకహీనుడ -
కనబడడెందుకు - పిరికిపందరా!

చూపుమురా! యిక వానిని - నిన్ను
కలిపి - ఖడ్గమున నే ఖండింతును
వాడుయిచ్చెడి లంచమేమిటిర?
వానికూతలు కూయుచుంటివి!

ఎక్కడవాడు - ఏమిచేయును
చెప్పర చెప్పు - అని రెట్టించగ
చలించనట్టి ధీరబాలకుడు
పరవశించెను హరినితలంచి

"చక్కని ప్రశ్న వేసితివయ్యా!
వివరించెదను ఒక్కమాటగా
ఎక్కడలేడో - చెప్పుటకష్టము
ఎక్కడగలడో - చెప్పుటతేలిక

నీటిలో - నేలలో - నింగిలో గాలిలో
సముద్రాలలో సర్వగిరులలో
దిక్కుల రేయిం బవళుల రవిలో
శశిలో త్రిమూర్తులందున గలడు

ఓంకారములో నెలకొనియుండును
సకలచరాచర జీవకోటిలో
ప్రాణము - ఆత్మయె శ్రీహరి తండ్రీ!
చివరకు - నీలో - నాలోకలడు.

ఇక్కడగలడు – అక్కడలేడు
అను సందేహము వదలివేయుము
ఎక్కడవెదకిన – అక్కడగలడు
చక్కని శ్రీహరి సందియమేల!"

అనగా తండ్రి కోపవశుడయి
తనయునిగాంచి పలికెను – "కుమతీ!
అసత్యాలను – ప్రచారమ్ముగా
చెప్పుచుంటివి – రిపుని బానిసవు

తిక్కతిక్కగా – పలుకుచుంటివి
వెర్రివేదాంతము నుడువుచుంటివి
ఎక్కడవెదకిన అక్కడె గలడా!
అయితేగలడా – ఈస్తంభమున?

ఓరీ! డింభక వెర్రిఅర్భకా!
ఈస్తంభములో చూపగలవురా!"
అంతట పలికెను ప్రహ్లాదుండు
మదిలో హరికి వందనమిడుకొని

"విశాల విశ్వమునందు నిండిన
ఆత్మగవెలుగు అక్షరమూర్తి
స్తంభములో తా నుండితీరును
సందేహము మరి ఎంతయువలదు

నీకనుమానము కలిగిన చూడుము".
అనగా అసురుడు – అట్టహాసముగ
ఆస్తంభములో హరి గిరిలేనిచొ
నీబ్రతుకు నేటితో అంతమేసుమా!

అధికతర్కము వలదుతండ్రి! విను
ఆస్తంభములో తప్పకగలడు
అనగా అసురుడు గద్దెను దిగెను
అడుగులేసెను భూమివణకెను

ఖడ్గమందుకు గిర్రున త్రిప్పెను
పలికెను కత్తితొ ఖడ్గరాజమా!
నాసోదరుని చంపిన కపటుడు
ఈస్తంభములో కలడట వింటివ!

మాయలమారిని – నీకు బలిచ్చి
ఆరక్తముతో నాతమ్మునికి
తర్పణమ్మును చేసెద నిపుడే
అప్పుడునాకు శాంతికలుగును

మాయలమారి కనబడనిచొ మరి
వాని భక్తుని – దురహంకారుని
నీకు బలిగ నే నిచ్చెద నిజము
అనుచు ఖడ్గమును తిరిగిత్రిప్పెను

హరివైరముతో వాని హృదయము
అల్లకల్లోలము ఐపోయినది
కాల్చునట్టుగా చూచెను బాలుని
వానిలొ గాంచెను మహావిష్ణువును.

వివేకమంతయు హరించిపోయెను
తమోగుణమది ముందుకురికెను
తలపులనిండా హరియేనిండెను
చేతలుకూడా – హరికొరకైనవి.

వైరభక్తియది ముదిరి పోయినది
హరిని చూడవలె ననెడి జిజ్ఞాస
కలిగెను - ఆహరి - ఆసమయములో
అట్టివానిని - సమీపించును.

రెండడుగులలో స్తంభముచేరి
చక్రని గిక్రిని - హరినీ - గిరినీ
చూపర అని కుడిచేతిని ఎత్తెను
కర కంకణములు సవ్వడిచేసెను

బలమునంతను భుజముననింపి
ఒక్కటి చరచెను ఆస్తంభమును
ఆదెబ్బకు ఆ స్తంభమె గాక -
సభామండపము జవజవ లాడెను.

॥శ్రీ కృష్ణచరితము॥



## 6 నరసింహావతారం

నిప్పురవ్వలు చెదరి పడినవి
పటపట శబ్దము వినవచ్చినది
స్తంభము మెల్లగ బీటలువారెను
రెప్పపాటులో పెఠేలుమన్నది

ఆమంటలతో అకాలప్రళయము
విలయాగ్నియని - గగన - భూచరులు
ముచ్చెమటలతో గడగడలాడిరి
బ్రహ్మాండమ్మది పేలిపోవునని

స్తంభముపేలి రెండుముక్కలయె
పైముక్కఅది నింగికెగిరినది
నేలను మిగిలిన రెండవముక్కలొ
ప్రచండమైన పెనుగాలెగసెను

బ్రహ్మాదులు మది తలంచినారు
మింటికెగసెడి పెనుమంటలవి
వాటినుండి ఒకభయంకరమ్మగు
దివ్యశుభంకర రూపము కనబడె.

అంతటలేచెను పెద్దపొగయది
బ్రహ్మాండమ్మును నిండినట్టిదగు
కారుమబ్బుల పోలెడి పొగయది
సుడులుతిరుగుచు నిండెనంతయు.

దివ్యమూర్తి ఒక టావిర్భవించెను
అసుర రాజుకు విలయంకరమై
అతని ఆర్తిని హరింపజేయగ
అమోఘరూపము అవతరించెను

చటచ్చటయని - పెటేల్‌పెటేల్మని
పటాల్పటాల్మని - గుప్పుగుప్పుమని
నిప్పులు నింగికి ఎగిరెడితీరుగ
ఎగిరెను-ఎగసెను పెనుమంటలవి

హల కులిశ చాపచక్రముల
దివ్యరేఖల పాదమ్ములతో
దీనులబ్రోచు సుందర పదముల
భక్తునికొరకై భువికిదిగినదది

హిరణ్యకశిపుని దీక్షకుమెచ్చి
నిరీక్షించి మరి పెరిగిన అతని
దర్శనకాంక్షను తీర్చుట కొరకై
ధర్మరక్షణకు ఉద్భవించెను.

ప్రచండమూర్తి నేలను నిలబడ
ఆదికూర్మము ఆదిశేషుడు
భూమిని మోసెడి వారలిద్దరు
ఆబరువుకు తా చలించి నారు

ఊరువులవ్వి బలముతెలుపుచు
క్షీరపయోధి నందుబుట్టిన
ఐరావతపు తొండము లన్నటు
భాసిల్లినవి దివ్యమూర్తికి

పట్టుపంచెయది వన్నెలీనెను
మేనుకు మెరుగులు దిద్దుచుండెను
మణికంకణములు మేఖలకాంతులు
సభాభవనముకు వెలుగులుపూసెను

వీరగంభీరుని నాభి – కొలనువలె
నడుము సన్నగా పిడికిట యిముడును
అన్నటులున్నది – మనోహరమ్ముగ
చూపులకందని తేజోరూపము

విశాలమై మరి వీరత్వమునకు
ఆటపట్టగు వక్షస్థలము
రాక్షసరాజ వక్షస్థలమును
దున్నుటకనువగు–హల మనిపించెను

వజ్రాయుధమును పోలెడి నఖములు
శంఖ చక్ర గదా ఖడ్గతోమర
ఆయుధాలతొ వెలిగెడి భుజములు
కంకణమ్ములు తార హారములు

భుజబంధములు బిగించియున్నవి
మకర తోరణము లమరి యున్నవి
కనక కిరీటము కాంతులీనినది
పాదాంగదములు నిండుగనుండగ

దీనబంధువు దివ్య సుందరుడు
శత్రుమర్దన సమర్థ ధీరుడు
ఆవిష్కరింప బడెను లీలగా –
అదరెడిపెదవులు కోపము తెలిపెను

దివ్యావతారుని దంతములవ్వి
మెరపులతీరుగ మెరయుచున్నవి
ప్రళయకాలపు జ్వాలలపోలి
నాలుక యున్నది నాగుబాములా

మేరు మందర గుహలనుబోలి
విశాలమైన ముఖము వున్నది
పట్టుదలను మరి తెలిపెడి – నాసిక
అట్టహాసముగ కనబడె – రూపము

నాసికాపుటల వీచెడిశ్వాస
అగ్ని జ్వాలలా సభాభవనమును
కాల్చునట్టుగా యున్నది అచట
కన్నులున్నవి ప్రచండ రవివలె

నయనతీక్ష్ణత నిష్పురవ్వలను
రాల్చుచున్నది నిరాటంకముగ
తారాగ్రహములు ఆ అగ్నికి మరి
తల్లడిల్లుచునున్నవి నింగిని

ఆకనుబొమ్మలు ఇంద్రధనుస్సులు
విశాలమైమరి కఠినములైన
చెక్కిళ్ళవ్వి శిలలబోలినవి
మణికుండలములు మెరయుచున్నవి

ఆచెక్కిళ్ళకు ఆ మణికుండలములు
అనేక వన్నెలు అద్దుచున్నవి
ఆ కాంతితొ ఆ వదనశోభయది
అమోఘమై మరి మరింతపెరిగెను.

ఆ జులపాలు - నీలి మబ్బులై
అటునిటు ఊగిన ప్రభంజనమ్మై
ఆకాశములో - ఖేచరులగమనము
అసాధ్యమైనది - కదలెడిశిబికల

క్షీరపయోధిని ఉద్భవించిన
శంఖములన్నటు కర్ణములున్నవి
పున్నమిచంద్రుని వెక్కిరించెడి
సొగసులుతేలిన దివ్యరోమములు

వెండికొండను బోలువిగ్రహము
దుష్టశిక్షణకు దిగిన దేవుడు
మధ్యమధ్యలలో గర్జించగను
నింగి దేవతల చెవులు చిల్లువడె

నరసింహావతారుని దివ్యవిగ్రహము
దనుజగర్వమును హరించివేసెను.
దివ్యప్రభలతో విచిత్ర రూపము
నరుడు - సింహముల-సమన్వయంబది

కరుణాపూరిత దృక్కులతోనట
భక్తప్రహ్లాదుని వీక్షించుచును
దుర్నిరీక్షమగు-క్రోధజ్వాలల
మరియొక కంట రాజునుగనుచు

వీర క్రోధములు - జాలి కరుణల
మిశ్రమమ్ముగా చూపులు కలిగి
ప్రళయభయంకర రూపమునిండి
భక్తుని కావగ అవతరించెను

నరసింహావతారము నచ్చట
గాంచిన రాజు - కలవరపడెను.
హిరణ్యకశిపుడు - అరణ్య మూర్తిని
గాంచెను - తలచెను-అడవి నుంటినని

మృగరాజా మరి మనుజోత్తముడా!
వనమునుంటినో - భవనము నుంటినొ
వెంబడి గొనిపో వచ్చిన బంధువొ!
బంధము త్రెంచగ జాలిన దైవమొ!

మనుజుడందునో సింహమందునో!
మాయలమారి నాటకమందునొ!
మాటనిలుపుకొన స్తంభమునందు
మూర్తీభవించిన విష్ణుస్వరూపమొ!

చంపుట జరిగిన వీరమరణము
పోరునచచ్చుట చేవ లక్షణము
కావున పోరెద కసితీరగను
హిరణ్యకశిపుని పేరునిలచునటు –

మాయావిని నే నెదిరించెదను
బలపరాక్రమము చూపించెదను
అనుచు తలంచి మనసుకుదుటపడ
గట్టిగ హరిపై క్రోధమునింపుకు

ప్రక్కనవున్న గదను గైకొని
దివ్యమూర్తిని కొరకొరచూచుచు
"దొంగవేషముల సిద్ధహస్తుడవు
నాడు పందివై తమ్మునిచంపి

నేడు మరొక్కమాయ వేషము –
పేరుతెలియని – కపటవేషమిది
నీకొరకై నే వెదకి అలసితి
నాకొరకై నువు బయటపడితివి

వదలను నిన్ను పోనివ్వనిక
అసువులు పోయిన ఆగనుయింక
అరిభయంకరుడు హిరణ్యకశిపుడు
అన్నవిషయము తెలుసుకొందువు."

అనుచు అడుగును ముందుకేసెను
అదిరి వెనుకకు బారెడుతూలెను
ఆర్భాటమ్మది సింగముపైకి
ఎగిరి తగ్గిన – కరి తీరైనది

ప్రళయభయంకర ఆర్భాటముతో
ఘనాఘన ఘోషణభీషణ
పర్జన్యునిలా గర్జనచేసి
నరసింహమూర్తి హుంకరించెను

ఆ అరపుకును అట్టహాసముకు
అంతటి అసురుడు అదరిపడెను అట
నిలబడలేక తూలెనుగదతో
తిరిగి తేరుకొని తేరిచూచెను.

॥శ్రీ కృష్ణచరితము॥



# 7 నరసింహస్వామి హిరణ్యకశిపుని వధించుట

అగ్నినిగాంచి ఎగిరెడి మిడత
ఎగిరి ఎగిరి అది – అగ్నినిబడును
తెగించి అసురుడు గదతోకొట్టెను
నరసింహుడు వెంటనె చేతినిజాచి

సింహము – కరిని పట్టుకున్నటు
హిరణ్యకశిపుని గట్టిగ పట్టుకు
వానిచేతగల గదను గైకొని
అంతదూరము విసరి వేసెను

వెంటనె అసురుడు తప్పించుకొని
ఎత్తుకుఎగిరి ఒడుపుగనంత
కవచ ఖడ్గము డాలునందుకు
కత్తితొ – ఒక్క వేటువేసెను

దెబ్బతప్పుకు నరసింహమూర్తి
విలయ కాలాగ్నిని తలపించుచును
విస్ఫులింగముల రాల్చెడి చూపుల
కరాళదంష్ట్రకాంతుల మధ్యలొ

మిన్నాగువలె నున్ననాలుకను
ఒకపరి అటునిటు ఆడించుచును
దవడలు గట్టిగ జళిపించుచును
భోనభోంతరాళమ్ము లదరునటు

గర్జించి తలను - తను ఆడించగను
కనుబొమలు రెండును ముడులువడినవి
'హం' అని మరి యొక గర్జనచేసెను
అసురుని పైకి లంఘించె లీలగా

కృష్ణసర్పము - ఎలుకను పట్టిన
తీరుగ - నరసింహమూర్తి ఒక్కపరి
హిరణ్యకశిపుని ఒడిసి పట్టెను
విడిపించుకొన అసురుడు తలచి

ఘనప్రయత్నము చేసెను కానీ
రవంత పట్టుసడల నీయక
తొడలమీద ఆ హిరణ్యకశిపుని
అడ్డముగా మరి వేసెను స్వామి.

వజ్రసమమగు నఖములుతోను
హిరణ్యకశిపుని గండియచీల్చెను
గరుడుడు - పామును చీల్చివేసినటు
గోళ్ళతో అసురుని చీల్చెను స్వామి -

రక్తధారలను సభాభవనమున
చిందించెను శ్రీ నరసింహుండు
ప్రేగులుతీసి జందెము మాదిరి
మెడలోదాల్చెను నృసింహస్వామి

మాంసఖండములు సభాభవనమున
కెంపులమాదిరి జల్లివేసెను
నాడీమండల మంతయు తృంచెను
మెదడునుపెరకి ప్రేగులుత్రెంపి

గుండెలుచీల్చి పెదవులుత్రెంచి
పొరలు పొరలుగా శరీరమ్మును
చింపివేసి మరి గర్జించగను
రక్తసిక్తమై మెరసెనుగోళ్ళు

వజ్రాయుధములు గండ్రగొడ్డళులు
దంష్ట్రాకరాళ నఖములన్నటు -
శస్త్రాస్త్రముల పని లేకుండను
చీల్చిచంపెను హిరణ్యకశిపుని

శ్రీహరిదాల్చిన అవతారాలలొ
విశిష్టమైన అవతారమ్మిది
నృసింహరూపము - దనుజుని జంపి
సద్గతినిడెను శుభకరమైనది.

పగలూ రాత్రికాని సంధ్యలో -
లోపల బైట కాని ప్రదేశము
సభాభవనపు ద్వారప్రదేశము
నింగీనేలా కాని తొడలపై

సచేతనమ్ము అచేతనమ్మును
కాని ఆయుధము - వజ్రనఖములు
మనిషీ - మృగము కాని రూపము
దితి తొలిసంతతి - నంతముచేసెను

రక్తధారలతొ భూదేవతను
అభిషేకించిన నరసింహుండు
ఇనుమడించిన ఉద్రేకముతో
కరాళవదనముతో కనబడెను

రక్తాంబరుడై రక్తనఖములతొ
పడగలు విప్పిన నాగుబాముపలె
నాలుక నటునిటు ఆడించుచును
సింహము తీరుగ గర్జన చేయుచు

హుంకరించుచు కలయజూచుచు
కళ్ళతొ నిప్పులు కురిపించుచును
మీదకువచ్చిన అసుర మూకను
చక్రధారలతొ – తెగనరకి మరి

వీరావేశము పొంగి పొరలగా
భూమివణకెడి అడుగులేయుచు
మెల్లగసాగి మధ్యలొనున్న
సింహాసనమును అధిష్టించెను

కళ్ళనుండి మరి రోషమెగయుచు
అవేశముతో బుసలను విడచుచు
అమోఘ దర్శనమిడెను భక్తులకు
అరివీరులకు గుండెలవిసెను

హిరణ్యకశిపుని కళేబరమ్ము
జల్లెడలాగున అగపడెనచట
దానినిచూచిన నరసింహమూర్తికి
క్రోధము మరింత పెరుగుచున్నది

ఎదిరించిన ఆ అసురులందరు
రాజుకు తోడుగ నడచిరివెంట
నిస్తేజముగా భయంకరమ్ముగ
సభయంతయును నిలచియున్నది

బిక్కముఖముల బెదరుచూపుల
సురలుసైతము ఎదురు నిలువక
నక్కినక్కి మరి నిలచియుండిరి
ఎదుటనిలచెడి ధైర్యములేదు.

హిరణ్యకశిపుని మరణవార్త విని
దేవతలందరు పొంగిపోయిరి
మందార సుమముల వర్షముతో మరి
వారిసంతసము తెలియబరచిరి

విజయదుందుభులు మ్రోగించుచును
జయగీతికలు పాడిరి సురలు
అచ్చరకన్యలు దిగివచ్చి అట
దూరమునిలచి నృత్యమాడిరి

సునంద కుముదాదులు వారు
మహావిష్ణువుకు పార్శ్వంచరులు
బిరబిరవచ్చిరి – కానీ స్వామిని
గాంచినవారు – భయపడిపోయిరి

కష్టములన్నీ కడతీరెనని
ఆనందించిన ఋషులు – మునులు
స్వామినిగాంచి భయపడిపోయి
అంతదూరమున నిలచి – మ్రొక్కిరి

విరించి శివుడు సురనాయకుడు
దిక్పాలకులు వారి అనుచరులు
ఆనందముగా వచ్చిరి గాని
దగ్గర జేరెడి ధైర్యములేదు

నిరుత్తరులై నిలచిపోయిరి
దూరమునుండే వందనముంచిరి
ఎందరు వచ్చిన అందరు కూడా
బెదరి నిలచిరి దూరమునందు.

॥శ్రీ కృష్ణచరితము॥



## 8 బ్రహ్మాది దేవతలు శ్రీ నరసింహస్వామిని స్తుతించుట

ముందుగ బ్రహ్మ - ప్రక్కన శివుడు
వారి ప్రక్కగా సురపతి మరియు
దిక్పాలకులు నిలబడి యుండిరి
ప్రజాపతులు మునులు-సిద్ధులు నిలచిరి

అందరు జయజయ ధ్వనులు పలికిరి
విరించి వినయము భక్తి నిండగా
ముడిచిన కరముల స్తుతించె నరహరిని
దివ్యమూర్తిని కీర్తించెనిటు

"అప్రమేయము అనంతమైన
తేజప్రభలతొ విరాజిల్లెడి
దేవదేవునికి వందన శతములు
పురుషోత్తమునికి నమస్సుమాంజలి

లీలతొ విశ్వము సృజించి పెంచి
లయముచేసెడి నిర్వికారునకు
నిఖిలలోకముల కధిపతి కివియే
భక్తిప్రపత్తుల నమోవాకములు

దీనశరణ్యా - దయాసాగరా!
ఉగ్రత్వమును ఉపశమించుము
కటాక్షించుము" అని నుతించగా -
మిగిలినవారు స్తోత్రముచేసిరి

భక్తబాంధవా కోపించుటకు
తరుణముకాదిది కరుణించవయా!
సాధుహింసను చేసెడి అసురుని
అంతముజేసిన శుభసమయమిది.

దేవా! యిదుగో నీదు భక్తుడు
ప్రహ్లాదబాలకుడు పవిత్రచరిత్రుడు
వీనిని నీవు అనుగ్రహించగ
ఉగ్రరూపమును ఉపసంహరింపుము

అంతట ఇంద్రుడు మ్రొక్కిపలికెను
నరహరిరూపా! దీనశరణ్యా!
బాధలుతీర్చి యజ్ఞయాగముల
రక్షించితివి రమానాయకా!

తిరిగిస్వేచ్ఛగా బ్రతికెడి వీలు
సురలకు - నీవు కలిగించితివి
అవతార కార్యము సిద్ధించినది
అనుగ్రహించి - ప్రసన్నుడవగుము

అంతట ఋషులు పలికిరి భక్తిగ
నీదుసృష్టియగు భూతజాలమును
ఇడుములబెట్టిన దుష్టదనుజుని
కఠినశిక్షకు గురి జేసితివి

ధర్మసంస్థాపన జరిపిన దేవా!
నరహరి రూపము ఉగ్రస్వరూపము
ఉపశమింపగ జేయుముస్వామీ!
లోకములెల్ల వణకుచున్నవి

తిలోదకములతో - ఒసగు పిండముల
హరించు దుష్టుని - సంహరించితివి
మా కడుపుమంటను ఆర్పితివయ్యా!
అనుచుపొగడిరి పితృదేవతలు.

మాపై పగతో అణిమాదిసిద్ధుల
దనుజుడు - తాను వశపరచుకొని
నిర్వీర్యులుగా చేసెను మమ్ముల
తిరిగి మాకు మరి బ్రతుకునిచ్చితివి.

అనుచు సిద్ధులు సంతోషముగా
నమస్కరించి పొగడిరి స్వామిని -
విద్యాధరులు వినయమునిండి
కీర్తన జేసిరి నరహరిదేవుని

భుజగ సంతతులు పలికిరి భక్తిగ
కరుణాసాగర మణులతొపాటు
కాంతామణులను హరించితెచ్చిన
మదోన్మత్తుని చంపితివనిరి!

వర్ణాశ్రమ ధర్మమ్ముల నసురుడు
తారుమారు మరి జేసివేసెను
అట్టి ఖలుని - నువు అంతము జేసి
వాటిని నిలపితివనిరి మనువులు

ప్రజాపతులు వారందరు భక్తిగ
నరహరి మూర్తికి వందనమిడిరి
ప్రజాసృష్టిని చేయగ చెప్పిన
నీమాటను ఆ అసురుడు కాదని

మమ్ముల నాతడు బంధించాడు
సృష్టిచేయుటకు ఆటంకమయె
నేటికి అసురుని - అంతముజేసి
మా దుర్దశను తొలగించితివి.

మా పాటను విని ఆనందించి
ఇడుమల బెట్టి వినోదించెడి
అసురునిజంపి - రక్షించితివని
గంధర్వులట స్తుతించినారు.

యక్ష - చారణ - కింపురుషులును
కిన్నరులందరు పొగడిరి స్వామిని
కసాయిబాధలు పెట్టిన అసురుని
నిర్దయగా మరి చంపితి వనిరి

ఇష్టదేవతల స్తుతించరాదని
తనను మాత్రమే స్తుతించవలెనని
కట్టడిచేసి మానోళ్ళలొ మరి
మట్టికొట్టెను హిరణ్యకశిపుడు

కరకు గోళ్ళతొ కడుపు చీల్చిమరి
మామనస్సుకు శాంతినిడితివి
అనుచు భక్తిగా వైతాళికులు
కీర్తనజేసిరి నరహరిమూర్తిని -

పగతో నిన్ను ద్వేషించినను
చంపు నెపమున సద్గతినిడితివి
భక్తికంటెను విరోధమ్ముతో
నిన్నుచేరుట సులభముస్వామీ!

నీ అనుగ్రహముఅందెను అసురుడు
ముక్తిధామము అందెను వానికి
కావునస్మామీ! ఉగ్రరూపమును
తగ్గించమనిరి విష్ణుసేవకులు

అందరు అటుల స్తుతులు చేసినను
ఉగ్రమూర్తి శాంతించకపోయెను
అంతటవారు ఆలోచించుకు
లక్ష్మీదేవిని ప్రార్ధనచేసిరి

అమ్మాలక్ష్మీ! – నీకుతప్పదు
శ్రీహరి పట్టపురాణివి నీవు –
నిరతము సేవలుచేసే సాధ్వివి
హరిని ప్రసన్నుని చేయుము తల్లీ!

వారిమాటలకు లక్ష్మీదేవి
భర్తను ప్రసన్నమూర్తిగ చేయగ
సంకల్పించి ముందుకు నడచెను
రూపముగాంచి ఆగిపోయినది

కలిమికి రాణి బెదరిపోయినది
తలచెను మదిలో స్వామినిగాంచి
ఇంతటి భీకరరూపము నెపుడు
చూడనెలేదు భర్తమోమున

నిండుచంద్రుని పోలెడిముఖము
చిరునవ్వులతో చల్లనిచూపుల
నిరతముగాంచే సుందరవదనము
ప్రచండభానుని పోలియున్నది

అమృతపు జల్లు చల్లెడిచూపులు
ప్రళయాగ్ని మంటలు చిమ్ముచున్నవి
మెరసేకోరలు భీతిగొలుపునటు
కనుపించినది కాంతునిరూపము

రంపములన్నటు ఉన్న – గోళ్ళవి
రోషపూరిత నేత్రమ్ములతో
ముఖమున జారిన కేసరమ్ములతొ
హడలెత్తించే తీరుగనున్నది

భయముగొలుపు ఈ మూర్తి దగ్గరకు
జేరుట నాకు అసాధ్యమైనది
ఇంతటిరూపము కలదనిస్వామి
ఎన్నడునాకు చెప్పనెలేదు –

ఆడుదానిని అశక్తురాలిని
అనితలంచిన – లక్ష్మీదేవి
మరుమాటాడక నిలచిపోయినది
పలుకరించుటెటు – పలుకున తిరిగి

పైగా – నరహరి నోటనాలుక
అగ్నిజ్వాలగా కదలుచున్నది
సెగలు పొగలవి చిమ్ముచున్నది
అగ్నిగోళములు ఆ నేత్రములు

రోషమింకను తగ్గనె లేదు
నన్నేచూచుచు నున్నటులున్నది
ఆచూపులలో అమితవేడియది
నిలబడనీయని స్థితికితెచ్చినది

ఈ స్థితిలో నే దరికిచేరను
కొంతశాంతముకలిగిన చేరెద
అనుచు లక్ష్మి-తా-రెండు చేతులు
జోడించి స్వామికి వందనమిడెను.

లక్ష్మీదేవి భయమునుగాంచి
బ్రహ్మతలచెను ఈస్థితిలో మరి
నృసింహస్వామిని శాంతపరచెడిది
ప్రహ్లాదుడొక్కడే అనితలంచెను

తనలోతాను ఆలోచించుచు
కనులుమూసుకొని నిలచిన బాలుని
దరికిజేరెను విరించి అంతట
మెల్లగ పలికెను బాలుని గాంచి

కన్నులుతెరచిన ప్రహ్లాదుండు
బ్రహ్మనుగాంచి వందనమిడెను
దగ్గరతీసుకు పలికెనుబ్రహ్మ
భాగ్యశాలివి – పరమభక్తుడవు

హరికరుణను నువు అందినాడవు
చూచితివీవు – ఉగ్రమూర్తిని
అనగాబాలుడు నమస్కరించెను
తిరిగిపలికెను బాలునిగాంచి

ఉగ్రమూర్తి శాంతించగ వలెను
భీతితొనిలచెను సర్వజగత్తు
నీవొక్కడవే రౌద్రమూర్తిని
ప్రసన్నునిగా చేయగలవయా!

విధాత శలవు ఇచ్చెనుగనుక
మెల్లగ బాలుడు ముందుకు నడచి
ఉగ్రమూర్తి పాదమ్ములనంటి
భక్తిప్రపత్తుల నమస్కరించెను

మోకాళ్ళమీద – తా – కూర్చొనినాడు
తిరిగివందనము నిడె ప్రహ్లాదుడు
బాలునిగాంచిన ఉగ్రరూపము
కొంతమెత్తబడె ఆశ్చర్యముగా

చిరునగవులతో బాలునిగాంచి
దగ్గర పిలచి దక్షిణ హస్తము
బాలునితలపై నుంచెను ప్రేమగ
దివ్యానుభూతిని పొందెనుబాలుడు

ప్రహ్లాదుని మేను పులకరించినది
నయనపద్మములు విప్పారినవి
ఆనందబాష్పములు ధారలుకట్టి
స్వామిపాదముల నభిషేకించెను

అటులే కూర్చొని ప్రహ్లాదుండు
నృసింహమూర్తిని భక్తిప్రపత్తులు
పొంగిన గుండెతొ పులకరింతతో
స్తుతించె – జన్మ – చరితార్థమయె

"ఈశ్వరదేవా! శాంతివహించుము
నాదు మనవిని ఆలకించుము
సురలు - సిద్ధులు - బ్రహ్మదేవుడు
ప్రజాపతులును - లోకపాలకులు

శక్తికొలదిగా వర్ణించినను
నీదుమహిమను తెలియగలేరు
బాలుడ నేను - పామరుండను
అల్పబుద్ధిని - అసుర జన్మదను

నిన్ను నేను మరి స్తుతించగలనా!
నీదుమహిమ నే తెలియగ నేర్తున
నినువర్ణించగ మాటలు చాలున
నీగుణగానము పాడగ తగుదున!

జప తపాలు మరి కీర్తిప్రతిష్టలు
నియమనిష్టలు కఠోర వ్రతములు
నిన్నెన్నటికీ సంతసపరచవు
భక్తిబంధముకు లొంగిపోదువు

గజేంద్రునివలె నిశ్చలభక్తి
నీపైనిలపిన - ఆదుకొందువు
విద్య - శాస్త్రము - తపము-తేజము
కలిగిన విప్రుని కన్నను కూడా

త్రికరణశద్ధిగ నిన్నేనమ్మి
బ్రతుకుభారము నీపైనుంచిన
విద్యాహీనుడు - ధన్యుడుఅగును
నీభక్తుడయి ముక్తినందును

ఓ జగదీశా! భక్తసులభుడవు
నీభక్తులను ప్రేమించినటు
మరొక రెవరిని ప్రేమించవుగద!
జ్ఞానముకన్న భక్తిమిన్నయగు -

సిరిసంపదలు - వాక్పటిమలును
నిన్నుపొందగ చేయగజాలవు
భక్తి మార్గమున నడచిన వారికి
నీ అనుగ్రహము లభించు గాదా!

భక్తి వినా మరి - యింకొక టేదియు
లేనివాడను నమ్మినవాడను
నామనవిని విని శాంతించుమయా!
నీవానిగ - నన్న నుగ్రహించుము

పలుకుల ఒలికే పాండిత్యమ్ము
వాదనగెలిచే విద్యాగంధము
లేనివాడనని విన్నవించితిని
వచ్చీరానీ మాటల - బాలుడ.

నాతండ్రిని నువు కడతేర్చితివి
నీవేతండ్రివి - సర్వమునీవే
ఈరూపముతో ఉత్తమగతిని
తండ్రికిడితివి దయాసాగరా!

ఎన్నోబాధలు ఓర్చితి - నీకై
నిన్నుచూడగా తలంచినాను
నాయిడుమలు నువు చూడగలేవని
నమ్మితి - నిన్ను - నమ్మినవాడను

వచ్చినపని అది నెరవేరినది
ఉగ్రరూపము తగ్గించుమయా!
బ్రహ్మాదులు నిను చేరగలేక
భయపడుచుండిరి ఓభగవంతా!

భువన మోహనమైన రూపము
పున్నమివెన్నెల వంటి చల్లనిది
నీచిరునవ్వులు మల్లెపువ్వులే -
నీచూపులవి కరుణాలయములు

అంతటి మోహనమూర్తివి నీవు
భక్తులహృదిలో కొలువుతీరెదవు
కానీ ఇప్పుడు ఈరూపముగని -
నిన్నుచేరగా భయముగ నున్నది

చల్లనిచూపుల కరుణాధాముడు -
కరముల స్పర్శ చందనచర్చ -
పలుకులవాలికే కారుణ్యమ్ము -
అనుచు భక్తులకు చెప్పితిమయ్యా!

ఇంతటి ఉగ్రరూపముగాంచిన
మేముచెప్పినది తప్పని అనరా!
నేను సత్యము నుడివెదస్వామీ!
నాకేమాత్రము భయములేదయా!

కరాళదంష్ట్ర వజ్రనఖములు
పర్జన్యగర్జన ఘనశరీరము
గాంచిన నేను భయపడనయ్యా!
ప్రేగుల హారముచూసి - బెదరను

నిప్పులు రాల్చే నీ కన్నులగని
పారిపోయెడి భక్తుడగాను
ఉగ్రనరహరిని గాంచిన నేను
భయపడనయ్యా! బంగరుతండ్రీ!

సంసారమునకు భయపడుదునయా!
సంసారాగ్ని నలుసుగ మొదలై
కార్చిచ్చులా అల్లుకుపోయి
భస్మముచేయును మూర్ఖమానవుల

నీపదములవద్ద నన్నుజేర్చుకొని
వరదహస్త మందించు - అందరకు
జగద్రక్షకా - చిన్నవాడను
పలుకుట రాని అపండితుడను.

ధైర్యముగా మరి చనవుతోడను
మాటలాడితిని క్షమించుస్వామీ!
తల్లిదండ్రులు తనయుని రక్ష
ఔషధమ్మది రోగికి రక్ష

నడిసంద్రములో నావ రక్షయగు
అటులే మరి ఈ సంసారజలధిని
మునిగెడి వానికి - నీవే రక్ష
నీవుతప్పమరి - లేరుఎవ్వరును

గర్భవాస నరకమ్ములు ఎన్నో
అనుభవించితిని యింత వరకు
ఎంతటి బాధలు ఆజన్మలలో
అనుభవించితినొ చెప్పగచాలను -

ఈ జన్మములో ఈబాధలవి
నీకొరకై మరి ఓర్చుకొన్నవి -
తండ్రిఋణమును తీర్చుకొన్నవి -
అలసిపోతిని - పుట్టుట చాలును

నీ లీలలు విని గానముచేయుచు
ఆనందముగా బ్రతుకనీయుము
రక్షకుడవు నువు - శిక్షకుడవు నువు
అన్నీనీవే - ఆశ్రితమందార!

కాలమునీవే మాయను సృజించి
మనస్సులకు ఆవహించి మరి
గుణకర్మలు నిండిన సంసారమను
బండిని - నీవు నడిపించెదవు

ఇంద్రియాలపై పెద్దగ మనసును
నియమించితివి అదిముఖ్యమయా!
దానిని మనుజుడు మాయకులొంగి
ఇహసుఖములకై - బానిస చేయును

సిరిసంపదలు దివ్యపదవులు
గొప్పవి అయినచొ మానాయన తను
గట్టిగచూచిన - దిక్పాలకులు
వణకిపోయిరి - అదిసుఖమా మరి!

జగజ్జెట్టిని - భువనవిజేతను
అనుచు తండ్రిమరి - విర్రవీగెను
అంతటివాడు అర నిమిషములో
నీచేతులలో - రాలిపోయెగద!

శాశ్వతమైనది ఏదియులేదు
బ్రహ్మాదుల ఈ వైభవమ్ములు
ఏదో రోజున - అంతము అగును
అదిమరి వున్నది నీచేతులలో

అస్థిరమైన - సిరిసంపదలు
అసలు కోరని మనస్సు నాది
అహర్నిశము నీ పదములసేవ
అనుగ్రహించగ వేడుకొంటిని

తర్కించినచో సుఖసంపదలవి
ఎండమావులని తేలిపోవును
ఈశరీరమొక రుగ్మతనిలయము
అట్టిచీకటి బ్రతుకు వలదయా!

జగన్నాయకా! నీకరుణకుపాత్రుడ
అంతకుమించి కోరను - దేనిని
విరించి శివుడు లక్ష్మీదేవియు
చేరగలేక దూరము నిలచిరి

దగ్గరజేరెడి భాగ్యమునాకు
కలిగించితివి కారుణ్యాలయ!
రాక్షసవంశములోన జననము
నీకాపట్టింపులు లేనే లేవు

తనవాడు మరి పరాయివాడని
భేదభావములు చూపనివాడవు
తండ్రినిశిక్షించి - నమరక్షించిన
నీదు మహిమను తెలియగలేము.

వేదశృతులను కాపాడితివి
అనేక అవతారమ్ములనెత్తి
ధర్మరక్షణకు నడుముకట్టిన
నారాయణ - నిను పొగడగవశమా!

కామక్రోధముల వశముననున్న
కర్మేంద్రియములు నిన్నుతలచవు
చపలత్వముతో తిరిగెడి బుద్ధికి
నిశ్చలత్వము కలుగుట కష్టము

ఎన్నోత్రోవలు నిన్నుచేరుటకు
వాటిలో భక్తి - రాజమార్గము
వ్రత జప తపములు శాస్త్రపఠనము -
ఇంద్రియ లోలత యున్న వ్యర్థము

భక్తియోగము పట్టుపడనిచో
ఆత్మజ్ఞానమున నిన్నుతెలియగ
కట్టెను మధించి అగ్నితీసినటు
ఎంతోశ్రమను పొందుచుందురు

నీగుణగానము చేయుచు వినుచు
నీకథలను శ్రవణము చేయుచు మరియు
నిరతము నీ రూపమ్మును గన
నేర్చుట - జన్మకు పరమార్థతయగు

పశుపక్ష్యాదుల తీరుగ నరుడు
కామభోగముల కాలముగడిపిన -
ఉన్నతమైన మనుజ జన్మమది
నిష్ప్రయోజనమ్మగును నరహరీ!

పుట్టుచు చచ్చుచు తిరిగి పుట్టుచు
సంసారమను వైతరిణినిబడి
బాధనుపడుచు సుఖమనుకొనుట
మోసగించుకొనుటది - కాదామరి!

నీపదములను నిరతముకొలిచి
నీకీర్తనలో పరవశింతును
నన్నునువ్వు మరి ఉద్ధరించుము
నందనందనా! నీకింకరుడను.

పంచభూతములు ప్రాణేంద్రియములు
శబ్ద స్పర్శ, రూప రస గంధములు
మనోబుద్ధి అహంకార చిత్తములు
సర్వమునీవే - సన్నుతశీలా!

సగుణ నిర్గుణ బ్రహ్మపదార్థము
చావు పుట్టుకలు గుణవికారములు
జ్ఞానవంతులు - నిన్నుతెలుసుకొని
ఆద్యంతములు లేవని అందురు

తత్వజ్ఞానము కలిగినవారు
వేదాధ్యయనము కేవల మొకటే
ఫలిత మీయదని గ్రహించినంత
సమాధిస్థితి కై సాధనచేతురు

త్రికరణశుద్ధిగ భక్తిమార్గమున
పయనించుటది దేహికి వలయును
నీకు మ్రొక్కుట కీర్తనచేయుట
నీకథలను తా నిరతము వినుట

చేసిన పనులు ఫలరహితముగా
నీకర్పించుట దేహి చేయవలె -
అవి కోరవడిన ఎంతటి నిష్టయు
యోగము కూడా నిష్ప్రయోజనము

సర్వము తెలిసి మాటాడినటు
పలికినయట్టి పామరుడనయా!
నీసేవలను చేయునట్టుగా
అనుగ్రహించుము ఆశ్రితపాలా!"

ప్రహ్లాదుడు భక్తిగ ప్రార్థించగను
దయావీక్షణము ప్రసరించునటు
చల్లగచూచెను - ఉగ్రస్వరూపము
శాంతమూర్తియై నిలచెనంతట

అమృతవాహిని జాలువారునటు
పలికెను బాలుని చల్లగ గనుచు
"ప్రహ్లాదా! నీ భక్తిభావముకు
సంతసించితిని శుభము కలుగును

నీవుకోరినటు నాభక్తులను
అనుగ్రహింతును సందేహించకు
భక్తులందరికి అందెదనయ్యా!
సామాన్యులు నను కనలేరు కద!

బాలభక్తుడా! శుభములిచ్చెదను
శుభప్రదుడను కోరినదిత్తును
నీవు కోరుకొను - ఇచ్చెదనిపుడు
అనుచు అడిగెను అనంతమూర్తి

బాలునిమనస్సు తెలియును హరికి
అన్నీవదలిన విరాగి బాలుడు
కోర్కెలు భక్తికి ప్రతిబంధకములు
సంసారలంపటము తగిలించునవి

జ్ఞానముకలిగిన బాలుడు పలికెను
పరీక్షించుటకు అడిగితివయ్యా!
నన్నువెరుగవా! ఓ నారాయణ!
నామది లొంగదు బాహ్యసుఖములకు.

దేహసౌఖ్యములు కోరెడి జీవికి
సంసారభోగముల తేలెడి వానికి
కోర్కెలుతీరుట - పండుగ వంటిది
నేనాత్రోవలో నడచుటలేదు

ఎంతగొప్పగా అడిగితివయ్యా!
నామది తెలియగ పరీక్ష పెడితివి
ఇంద్రియాలును మనస్సు - మరియు
దేహము, ధైర్యము - కీర్తి - నిలబడవు

బుద్ధి - ప్రాణము - లజ్జాభిమానము
సిరిసంపదలు - అశాశ్వతమ్ము
వీటికోసమై - నిన్నుకోరుటది
వెర్రితనమని - తలంతు తండ్రీ!

రాజువు నీవు - నాఏలికవు
భృత్యుడ నీకు - దయామయా! విను
కోరినదిత్తును అంటివినీవు
తిరస్కరించుట - అని తలపోయకు

నీవుఅడిగినటు కోరుకుందును
కోర్కెలులేనిచొ నీకుదగ్గరగు
కావున స్వామీ కోర్కెలు పుట్టని
వరమున్న - మరి అనుగ్రహించుము

ఓం నమో! నారసింహాయ నమః
పురుషోత్తమాయ! పురాణపురుషా!
పరంధామ - ఓ పన్నగశయనా!
వందనమిదిగో - అని పదములబడె

ప్రహ్లాదుని పలుకుల నరహరి ఎంతో
ఆనందించెను దగ్గర తీసుకు
మృదువుగ తలపై వరదహస్తమిడి
అటులే ఇచ్చితి అని పలుకుచును

భక్తా నీదు మనస్సుతెలియును
సమస్తరాజ్యము పరిపాలించెడి
చక్రవర్తివై మన్వంతరము
సకలభోగములు అనుభవించుము

నాకధలను వినుచు ఆనందించుము
సకలప్రాణులలో నన్నుచూడుము
వైదిక కర్మల అవసరమేమి -
నాపూజలను చేయుచుండుము

పుణ్యక్షీణము కలుగదునీకు
చక్రవర్తివై రాజ్యము నేలి
దేహత్యాగము చేసిన పిదప
కీర్తిగడించి - నన్నుచేరెదవు

లోకులకొరకు - నీకూ - సరిపడు
మరియొక వరము - నీకొరకై - నే
అవతరించిన గాధను మరియు
నీభక్తి శక్తిని సన్నుతించిన

విశేషమైన ఫలితము కలుగును -
జన్మరాహితి ప్రసాదించెదను
ధన్యజీవిగా యశముగడించును
ధనధాన్యము ఆరోగ్యములమరును -

ధన్యోస్మియని పలికి ప్రహ్లాదుడు -
తండ్రి మూర్ఖతతొ అసుర గుణముతో
తమ్ముని జంపితి వన్న కోపమున
నీభృత్యుడనగు నన్ను మార్చగా

ఎన్నోభాధలు పెట్టెను అతడు
అన్నినువ్వే అనుభవించితివి
అన్నభావన నామదినున్నది
అయినా - తండ్రిని ఉద్ధరించుము

నీచేతిలో మరణము మహాధ్భాగ్యమే
పాపములన్నీ నాశమయినటే!
కానీ స్వామీ! నాదుజనకుడు
ఉత్తమగతిని పొందగవలెను

ఆనందించిన నరహరిపలికెను
నిన్నుగన్న నీతండ్రి ధన్యుడు
పవిత్రుడైమరి పాపవిముక్తుడు
నీవల్లను నీ తండ్రికి సద్గతి.

ఓ ప్రహ్లాదా! వాంఛలు వదలి
ననుసేవించిన నాభక్తులగు
వారందరును నావారగుదురు
భక్తశిఖామణి వైతివి నీవు

నీవుచేయదగు కార్యముచెప్పెద
విధివిహితముగా నను సేవించుము
ఆలసించక నీతండ్రికివలయు
పారలౌకిక క్రియలను చేయుము

నిన్నుగనుటయు - వైరభక్తియు
నాదుస్పర్శయు - అన్నియుకలసి
పుణ్యమూర్తిగా అయ్యెను తండ్రి
హిరణ్యకశిపుడు సద్గతినందెను

నీవుచేసెడి ఉత్తరక్రియలతొ
పుణ్యలోకముల తండ్రిచేరు నన -
ఉత్తరక్రియలను తండ్రికిచేసిన
ప్రహ్లాదుని మరి అభిషేకించిరి

చిరునగవులతో - సుందరరూపము
సంతరించుకొని నిలచెను నరహరి
ప్రసన్నుడైన నరసింహమూర్తి
దరికి జేరిరి - బ్రహ్మేంద్రాదులు

నమస్కరించి విరించి పలికెను
ధన్యులమైతిమి దేవా నేటికి!
రక్కసుబాధ తీరిపోయినది
సుఖసంతోషము లందుకొందుము

నావరములతో విర్రవీగెను
సృష్టిని తారుమారు చేసెను
నేటికి నీవు ఆదుకొంటివి
బాధలుబాపిన భగవంతుడవు

ఈపసికందు ప్రహ్లాదుండు
తండ్రిపెట్టిన బాధలనన్నీ
ఎటులసహించెను ఊహకందదు
అట్టిభక్తుని ఆదుకొంటివి.

నీ నృసింహావతార గాథను చదివిన
వినినా - వ్రాసిన యముడు చేరడు
సుఖజీవనులై బాధలులేక
అకాలమృత్యువు వాతనుబడరు

అంతటపలికెను నరహరినవ్వుచు
నీమాటలవి జరిగి తీరును
కానీ, యిట్టివరములు దుష్టుల
రాక్షసప్రవృత్తి పెంచుటె యగును

అనుచు అందరికి దర్శనమిచ్చి
అంతర్ధానము అయ్యెను శ్రీహరి.
ప్రహ్లాదుడంతట విరించి శివులకు
సురలకు భక్తిగ వందనమిడెను

బ్రహ్మ అంతట శుక్రునిచేత
ప్రహ్లాదునికి వేదోక్తముగా
రాజ్యభిషేకము చేయించి అంతట
దైత్యదానవుల ప్రభువుగ నిలపెను

పట్టముగట్టుకు ప్రహ్లాదుండు
సురలు భూసురులు ప్రజాపతులకు
మునులు మొదలగు పుణ్యమూర్తులకు
వేర్వేరుగను పూజలు సలిపెను

వారందరును మనసునిండుగా
చిరంజీవికి దీవనలిడిరి
అతనిభక్తిని శ్లాఘించుచును
దేవలోకముల కరిగిరి సుఖముగ

ధర్మనందనా! ఆవిధముగను
హిరణ్యాక్ష హిరణ్యకశిపులు
వరాహ నరసింహ అవతారమ్ముల
హరిచేతులలో సద్గతినందిరి

రెండవజన్మ రావణ కుంభకర్ణులు
శ్రీరామునిచేతిలో వధింపబడిరి
మూడవజన్మ శిశుపాలదంతవక్త్రులు
శ్రీహరి చేతిలో వధింపబడిరి

ఆవిధముగను మూడు జన్మలలో
ప్రబలవిరోధము హరిపై గలిగి
హరిని స్మరించి హరిచే హతులై
పాప విముక్తితో హరిని చేరిరి

బ్రహ్మావరములు మన్నించిన హరి
సాధురక్షణకు - ప్రహ్లాద భక్తికి
నరహరి అవతారమ్మునెత్తెను
హిరణ్యకశిపుని ఉద్ధరించెను

శుభప్రదమైన ఈకథ చదివిన
వినిన వ్రాసిన భవభయ మెరుగక
రోగివిముక్తి పాపవిముక్తి
కలిగి సుఖములతో హరిభక్తిపెరుగును

కుంతీనందన! వేదవిద్యలు
నాల్గుముఖములతో పలికెడిబ్రహ్మ
ధ్యాననియమముల ఆత్మదర్శనము
చేయుసాధకుల ప్రయత్నమంతయు

ఫలించ కష్టము - అయిన శ్రీహరి
నారాయణ పరబ్రహ్మమూర్తి మరి
నీ నెచ్చెలియై నీయింటనె - తా -
బావగ - మంత్రిగ-హితునిగ నుండుట

దివ్యమంగళ రూపముతోను
నీతోతిరుగుట - నీపుణ్యమయా!
హరిభక్తి - శక్తి మరి మహత్తుఎంతని
చెప్పెదనయ్యా! హరిలీలలివి

మాయావియైన మయుడు పూర్వము
శివుని భ్రమలో పెట్టినవాడై
పై చేయిగను చరించుచుండగ
దిక్కుతోచక పోయెను శివునకు

ఆ విషమ సమయమున శ్రీహరివచ్చి
ఆదుకొనెను మరి అంబాపతిని
అనగా వినిన ధర్మనందనుడు
అడిగెను వివరము నారదమౌనిని

॥శ్రీ కృష్ణచరితము॥



# 9 త్రిపురాసురసంహారం

భక్తిగ అడిగెను ధర్మనందనుడు
మయుని గాధను వివరించమని –
బదులుగ పలికెను నారదమౌని
"శ్రీహరి తోడుగ నుండును సురలకు

ఇంద్రాదులకు దేవతలకును
రక్షగ నిరతము ఉండును శ్రీహరి
అందువలననే దేవదానవుల
పోరునందున సురలు గెలిచిరి

ఓడిన అసురులు–మాయల ఘనుడగు
అసురుడు ఐన మయుని జేరిరి –
అభయమునిచ్చి మయుడంతటను
మూడు పట్నముల సృష్టిచేసెను

అయోమయమ్ము – రజితమయమ్ము
సువర్ణమయమ్ము – అన్నవి మూడు
పట్టణమ్ములు – మయుని రచనతో
దుర్భేద్యముగా తయారైనవి

వలయుచోటుకు ఎగర సమర్ధము
గ్రద్దలపోలి నింగిని సాగును
తిరిగి వచ్చును స్థావరమ్మునకు
అంతటిగొప్ప పట్టణమ్ములవి

అసురులు వాటిని అనుభవించుచు
యధేచ్ఛగా మరి సంచరించుచు
అన్నిలోకముల తిరుగజొచ్చిరి
అందరికీ అది బాధయైనది

లోకపాలకులు నిలబడలేక
అసురుల ధాటికి ఓర్వగలేక
నందివాహనుని సన్నుతించిరి
విన్నవించిరి వారి బాధలు

అసురుల – టక్కరిమాయలు పెరిగి
ప్రాణాంతకమగు బాధలొనుంటిమి
కాపాడుమయా! కారుణ్యాలయ
అనుచు భక్తిగా శివునర్థించిరి

వారి అవస్థకు జాలికలిగెను
అభయమునిచ్చెను నాగాభరణుడు
వెంటనె విల్లుతొ – శరమునువదలెను
మెరపుతీరుగా బాణముకదిలెను

అనేకశరములు ఆబాణములో
ఉద్భవించినవి – దివ్యశరములవి
అసురులందరిని కాల్చివేసెను
శరములు అంతర్ధానమైనవి

విషయము తెలిసిన మయుడు బాధపడి
అసురులసాయముల వికటించినదని
వారి కళేబరములన్నియు జేర్చి
తపోబలముతో – బావిని సృజించి

అమృతకూపమ్ముగ – ఆ నూతిని
చేసి – అందులో వేసెను వాటిని
వెంటనె అసురుల కళేబరమ్ములు
ప్రాణమ్ములతో బ్రతికి వచ్చినవి

యధాప్రకారము అసురులందరూ
తిరిగి సురలపై దాడికి దిగిరి
నిశ్చేష్టుడయి శివుడు నిలచెను
చేయుటకేమియు తోచలేదు మరి

అంతటిలోన శ్రీహరి లీలగ
గోవుగ మారి బ్రహ్మదేవుని
వత్సమ్ముగను చేసి అచ్చటి
అమృత రస కూపమ్ముకు వచ్చెను

దివ్యధేనువది అమృతకూపమున
జారిపడినటు పడిపోయినది
అందలి అమృతమంతా తాగెను
అందమైన ఆ ధేనువు గాంచిరి

అంతటి పనినా ధేనువు చేయును
అని ఆ అసురులు తలంచలేదు
అందరుపోయి మయునకు చెప్పిరి
అమృతకూపము మిగిలె చీకటై

అందలి అమృతమంతా హరించె
అగపడలేదు గోవుయు దూడయు
అంతట మయుడు సర్వముగ్రహించె
అనుకొనె - అదియే ఈశ్వరేచ్ఛయని

దైవసంకల్పము అని తలంచెను
ఈశ్వరుమాయ ముందర మాయలు
నిలబడలేవని గ్రహించినాడు
నేరుగ శ్రీహరి - శివుని చేరెను

గోరూపమును వదలిన శ్రీహరి
ధర్మ, జ్ఞాన విద్యాతపో విరక్తి
క్రియాశక్తి విశేషమ్ములతొ
శివునిచేసెను - తేజోవంతముగ

పోరుకు వలయు దివ్యములైన
రధ, సూత, అశ్వాదులను
శివునికివ్వగా - అంబా పతి - తా
త్రిపురమ్ములపై పోరుకు సాగెను

కవచధారణతొ శివుడంతటను
తేరునుఎక్కి ధ్వజమునెత్తమని
దివ్యాస్త్రముల అమ్ములపొదులతొ
త్రిపురమ్ములను ముట్టడించెను.

అభిజిల్లగ్నమునందున హరుడు
దివ్యశరమునొకదానిని విడచెను
హరి ముహూర్తము - శరబలమ్ములు
ఒకటై - భస్మముచేసెను పురముల

ముక్కంటి మంటకు భస్మమైనటు
ముక్కంటి శరముకు కాలె త్రిపురములు
దేవదుందుభులు మ్రోగినవపుడు
పుష్పవృష్టికురిపించిరి సురలు

అచ్చరకన్నెలు నాట్యమాడిరి
దివ్యస్తోత్రములు చదివిరి మునులు
శివస్తోత్రముతో దిక్కులు మ్రోగెను
కైలాసమునకు చేరెను శంభుడు

మయుడు మాయతో శివుని జయించగ
హరి తన మాయతొ మయునిజయించి
శివుని కృతార్థుని చేసెను నాడు
అనుచు తెలిపెను నారదమహర్షి

హరి తన మాయతొ మంగళకరముగ
లోకమ్ములను రక్షించునయా!
అంతట అడిగెను ధర్మనందనుడు
వర్ణాశ్రమ ధర్మమ్ములెట్టివని.

॥శ్రీ కృష్ణచరితము॥



## 10 వర్ణాశ్రమధర్మమ్ములు

"బ్రహ్మకుమారా! సర్వజ్ఞుడవు
భక్తశిఖామణి - నీవేనయ్యా
నీవంటిపెద్దలు ఏదిధర్మమని
ప్రవచించెదరో చెప్పుము స్వామీ!"

"ధర్మనందనా! ధర్ముని పత్ని-దాక్షాయణికి
శ్రీహరి సుతుడై నారాయణుడను
నామధేయుడై జన్మించెనయా!
లోకక్షేమము తలంచి ఆతడు

బదరికావనము జేరి అచ్చట
ఆశ్రమవాసిగ తపస్సుచేయగ
వెళ్ళితినప్పుడు - నారాయణుడు
నాకుచెప్పెను - పరమధర్మములు

వాటిని నీకు వివరించెద - విను
ధర్మలక్షణములన్నవి ముప్పది
సత్యము-దయయు-ఉపవాస శౌచములు
సహన - వివేక - మనోనిగ్రహము

ఇంద్రియజయము-అహింసయున్ను
బ్రహ్మచర్యము - దాన-జపములు
నిత్యసంతుష్టి - మెత్తని మనసు
సమదర్శనము - వృద్ధులసేవ

ఫలితములేని పనులుమానుట
మితభాషణము వాంఛారహితము
ఆత్మవివేకము అన్నోదక దానము
జీవుల దేవుని సమముగ జూచుట.

ఆత్మాన్వేషణ హరిధ్యానమ్ము
హరికీర్తనము - కథాశ్రవణము
అర్చన - నమస్కార-హరిసేవయును
హరికైంకర్యము ఆత్మనివేదన

హరిభక్తులతో నెయ్యముచేయుట -
మున్నగుముప్పది లక్షణమ్ములు
సనాతనమ్మగు ధర్మమార్గముగ
నారాయణుడు నాడు తెలిపెను

యజన-యాజన-అధ్యయన-అధ్యాపక
దాన - ప్రతిగ్రహములన్నవి ఆరు
మంత్రానుష్టాన కులాచారము
కలిగిన విప్రుడు చేయు కర్మలు

పైవాటిలొ మరి క్షత్రియునకు
ప్రతిగ్రహమన్నది వదలి పెట్టి మరి
మిగిలిన ఐదు అనుష్టించగ
విధ్యుక్తధర్మములు అని చెప్పబడె

ధర్మబద్ధముగ ప్రజాపాలనము
చేయగవలెను రాజునిరతము
దండశుల్కమును విప్రులవద్ద
గ్రహించరాదు - రాజు ఎన్నడూ -

వ్యాపారము కృషియు - గోరక్షణము
వైశ్యుడు తాను నిర్వహించును
శూద్రుడు అనెడి సేవాపరుడు
పరులశ్రేయముకు నిలచుట ధర్మము.

భిక్షాటనమో - రాలినగింజలో
భుజించి బ్రతుకును గడుపుటధర్మము
అనాయాచితముగ లభించు దానిని
ధర్మరహితమును కోరుటదోషము

ఆపదలోపల కూడను - రాజు
దానముగొనుట నిషిద్ధమైనది
పైనచెప్పిన రీతిగ లభించు
దానిని గ్రహించ ధర్మసమ్మతము

చాతుర్వర్ణములందలి వారు
ధర్మమార్గమున విహితకర్మలతొ
ఒకరిదోషములు ఒకరు ఎంచక
అందరు ఒకటిగ గడుపుట ధర్మము

గృహశుభ్రత మరి శుచిగా నుండుట
మంగళకరముగ అలంకారమున
మృదు - మిత భాషణ చేయుటనేర్చి
పతిసేవలను గృహిణిచేయవలె

స్నానపానముల ఆహారనిద్రల
పతికిష్టముగా నడచుకోవలె
హరిగా - పతిని సేవించినచో
లక్ష్మీదేవిగ సుఖపడగలదు

ఎవ్వరైనను ఆయాయుగముల
విహిత ధర్మమును ఆచరించిన
ఇహపరములలో సుఖించగలరు
వేదవేత్తలు చెప్పిరి అటుల -

కామ్యవాసనలు వదలకపోయిన
కోర్కెలపైనే మోజుతగ్గును
మితముతప్పినచొ సుఖములభించదు
విరక్తి కలుగుట జరిగితీరును

సాత్విక గుణమున విహితధర్మమును
ఆచరించిన క్రమక్రమముగా
కర్మాచరణలొ విరక్తికలిగి
ముక్తినిపొందగ చాలినవాడగు

జాతులన్నవి పుట్టుటవలన
నిర్ణయించుటది సరిగానిదయా!
వారు నడిచెడి త్రోవవల్లను
ధర్మాచరణల చెప్పగవచ్చును

ఆశ్రమధర్మమ్ముల వివరించెద
అందలొ మొదటిది బ్రహ్మచర్యము
మౌంజీ -కౌపీన - యజ్ఞోపవీత -
కృష్ణాజిన - పలాశ - కమండలదండములు

ధరించియుండి - పవిత్రమనస్సుతొ
మూడుసంధ్యలా గాయత్రి జపించుచు
గురుసేవలతో విద్యనేర్చుచు
భిక్షాటనతో జీవించవలె

అటుల భిక్షగా తెచ్చిన దానిని
గురువుగారికి సమర్పించుకు
ఆయన ఆజ్ఞతొ మితముగ తినుచు
ఉపవాసమ్ములు చేయుచుండవలె.

అవసర మేరకు స్త్రీలతొ పలుకుట -
స్నానాదులలో వారితొ సేవలు
చేయించుకొన - నిషిద్ధమైనది
సత్యభాషణము చేయుచుండవలె

ఆడా - మగా ఒకటే అనెడి
భావనతో మరి స్త్రీలఎడలను
జాకరూకతతొ మెలగగ వలెను
అతి చనవు మరి పెంచకూడదు

గృహస్థ ధర్మము - ఆలితొ నుండుట
పరస్త్రీ వైపు చూడకుండుట
వేదశాస్త్రములు అభ్యసించుట
చదివిన దానిని ఆచరించుట

సర్వజీవుల దయతో చూచుట
అన్నిటియందున హరినే గనుచు
ఆదరించి మరి అన్నమునిడుచు
సర్వవ్యసనముల విసర్జించవలె.

మూడవది యిక వానప్రస్థము
గృహస్థాశ్రమము నిర్వహించుకు -
అడవికిపోయి కందమూలముల
కడుపునింపుకొని జీవించవలె

నారబట్టలు జటాధారణతొ
తపోనిష్టతో గడపగవలెను
కనీసపక్షము ఒక ఏడాది
తపోధ్యానమున నుండగవలెను.

రోగమ్ములకు - ముసలితనముకు
లొంగిడిదైన శరీరమ్మును
వానప్రస్థమున కష్టముకలిగిన
వెంటనె సన్యాసమ్ము గొనవలె

నీలినింగిలో - చర్మరంధ్రములు
నిస్వాసమును గాలిలొ భాగము
తేజమునందు ఉష్ణత కలిగి
రసమది జలముల - లగ్నమన్నటు

శల్యమాంసాదులు ధరణియందున
అగ్నియందు మరి వాక్కునుకలపి
ఇంద్రునియందు చేతులు మరియు
విష్ణువుయందు పాదమ్ములను

చంద్రునియందు బోధతొ బుద్ధిని
రుద్రునియందు అహంకారమున మమకారమ్ము
క్షేత్రజ్ఞునిలో సత్వమ్ముతొ - చిత్తము
పరమందు గుణజన్య వికారమ్మును

లయమొనర్చవలె - సన్యసించుచు
పిమ్మట పృధివిని జలమునందున
జలమును తేజమునందున మరియు
తేజముతో మరి వాయువు ఆపై

వాయువునంత గగనమునందు
గగనమునంత అహంకారతత్వమున
అహంకారమును మహత్తునందు
మహత్తును మరి ప్రకృతియందు

ప్రకృతియందు అదే ప్రకృతిని
అవ్యయుడైన పరమాత్మయందున
లయముచేసి మరి మిగిలినయట్టి
క్షేత్రజ్ఞుని మరి పరబ్రహ్మగ గనవలె

వానప్రస్థుడు జరా రోగముల
చిక్కిన ఎడల బ్రతికియున్నచో
సన్యసించిన క్రమసన్యాసము
ఆ ధర్మములను తెలిపెదవినుమనె -

దండకమండల శిఖాజందెములు
విసర్జించి కౌపీనధారియై
దేహభావనలేక వుండవలె
జీవులపై ఆపేక్షతగనిది

భిక్షాటనతో జీవించవలె
ఆశ్రయమన్నది ఉండకూడదు
పరమశాంతుడై సమభావనతో
నారాయణస్మరణమ్ము చేయవలె

ఆత్మజ్ఞానము కలిగించు చదువులు
చదువుచుండవలె మరొకటికూడదు
గ్రహములస్థితి మరి తారలనడక
తిధివారముల ధ్యాస విడువవలె.

వాదోపవాదములు సన్యాసికి కూడదు
శిష్యులజేర్చి బోధలు చేయుట
నిషిద్ధమైనది - అంతియెగాక
రోజుకు ఒక్క ఊరినుండవలె

పరమాత్మమయము ఈ కనబడునట్టిది
అన్నభావన కలిగియుండవలె
అశాశ్వతమ్ము దేహము అనుకొని
దానిసేవకై యోచనతగదు

విజ్ఞానమ్ము వికసించగను
పరమహంసయై దండాదిచిహ్నములు
ధరించి గాని ధరించకున్నను
బాహ్యాడంబర దృష్టి వదలవలె

ఉన్మత్తునిగా నో - బాలునిగానో
మూగవానిగా నున్నటుగానో -
నిర్వికారముగ పరమాత్మ ధ్యానమున
ముక్తికొరకు మరి తపించవలెను

దానికి తగిన ఇతిహాసమ్మును
తెలిపెద ననుచు ధర్మరాజుకు
నారదమౌని చెప్పసాగెను
ఆనందముగా విని - యుధిష్ఠిరుడు

॥శ్రీ కృష్ణచరితము॥



# 11 ప్రహ్లాదాజగర సంవాదము

ప్రహ్లాదునితో అజగరుడను
మునికి జరిగిన - సంవాదమిది
లౌకికవిషయమ్ములు తెలియగను
లోకసంచారము సలిపె ప్రహ్లాదుడు

అటులతిరుగుచు మంత్రులకూడి
కావేరీ తీరమందుననున్న
సహ్యాపర్వతము చేరెను అచట
మౌనిపుంగవుని గాంచె ప్రహ్లాదుడు

బలిష్టమైన శరీరమ్ముతో
వంటినిండ మరి బూదిపూతతో
ఆడా మగా తెలియనట్టుగా
పరుండియుండెను - ఆముని అచట

మోక్షప్రాప్తికై కఠోరవ్రతమును
ఆచరించుచు మునివున్నటుల
గ్రహించినంతనె ప్రహ్లాదుండు
మునికి భక్తిగా పూజనుచేసెను

మౌని చరిత్ర తెలియగోరిన
ప్రహ్లాదుడడిగెను - "ఓ ధర్మాత్మా
వ్యాపకమేదో - కలిగినట్టుగా
భోగముతో నీశరీరమున్నది

ధనభోగములు లేనివానికి
ఇంతటి ధృడమగు దేహమువుండదు
అవ్విరెండు మరి నీకు లేనటు
నీస్థితిగాంచిన తెలియుచున్నది

ఇటుల నేలపై నిదురించెడివానికి
ఇంతటి బలిష్టదేహము వుండున
నిందా స్తుతులు నీకుపట్టవు
ఎందుకు ఇటుల నిద్రలోనుంటివి?"

ప్రహ్లాదుని పలుకులు - వినినంతటనే
ప్రసన్నమైన ఆతనిమాటలు
మౌనిపుంగవుని మాటాడించెను
చిరునగవుతొ ఆ ముని పలికెనట

"భక్తశిఖామణి - నీవెవ్వరవో
నాకుపూర్తిగా తెలిసినదయ్యా!
నారాయణుని ప్రియతమభక్తుడ!
నీకుతెలియనిది ఏమియులేదు

అడిగినాడవు వివరించెదను
నీతోపలుకుట భాగ్యమె నాకు
పెద్దలవలన తెలిసినయట్టి
పట్టుబడిన ధర్మమ్ము తెలిపెద

ఓపుణ్యాత్మా! తృష్ణయన్నది
మహాప్రవాహము - ఆగ నట్టిది
తీరినకొద్దీ పెరుగుచుండును
దానిబలమది మాటల కందదు

కోర్కెలునిండిన నాజీవితము
ఎన్నోజన్మలు ఎత్తినదయ్యా!
ఎన్నెన్నోమరి గర్భవాసముల
పుట్టుచు గిట్టుచు మనిషినైతిని

దుఃఖముదాటి సుఖప్రాప్తికై
ధర్మబద్ధముగ సంసారమునెరపి
నడచితిగాని - నాకు మోక్షము
అందెడిత్రోవ కనబడలేదు

కర్మల త్యాగము చేసినగాని
జీవి స్వతంత్రుడు కాడని తెలిసితి
అనుభవించెడి భోగములన్నీ
అశాశ్వతమ్మని అర్ధమైనది.

ఆలోచించి - నివృత్తిమార్గము
అవలంబించితి అంతటితో మరి
నేనుచేయదగు కర్మలు వదలితి
అనుభవించవలె చేసిన కర్మలు

వెంటనె దేహపు - మమతను వీడి
ఎండా వానల చలిలో యిచట
పగలూ రాత్రి భేదమువదలి
పరుండియుంటిని ఈ విధముగను

శాశ్వతసుఖమది మదిలోగలదని
తెలియని మూర్ఖుడు-జలమునువదలి
ఎండమావికై ఎగబడినట్టుగ
భ్రమలోపడి మరి భ్రష్టుడుఅగును

దేహముతో మరి సుఖములన్నియు
అనుభవించెడి ఆలోచనతో
ఆరాటపడు - కానీ నిజముగ
సుఖములాతడు అనుభవించడు

సుఖమును తాను అనుభవించినటు
తననేతాను - మభ్యపెట్టుకొను
నిజముగాతాను సుఖభ్రష్టతను
అనుభవించును - తెలియగలేడు

ధనమువల్లనే సుఖమువున్నదని
అనుకొని - దుఃఖము సుఖముగనెంచును
చోరభయము మరి శత్రుభయమ్ము
ఎవరో అడిగెదరన్న భయమ్ము

అనుభవించిన - తరిగెడి భయము
నిద్రించిన మరి ధనమేమగునో!
అనెడిభయముతో - తృప్తిగ తినడు
సుఖముగ - నిద్రపోలేడు గదా!

ప్రాణభయము మరి రోగభయమ్ముల
మమతను పెంచుకు బ్రతికినవానికి
భయము ఒక్కటే దగ్గర చుట్టము
వాంఛ నశించిన - భయము పరుగిడు

తేనెటీగ - తా - పూవులతేనె
ఒక్కచోటకు సమకూర్చగనే
అనుభవించునది మానవుడే గద
తేనెటీగలా - ధనముకూర్చును

సంపాదించిన ధనమంతయును
అనుభవించునది మరి యొకజీవి
లోభుల బ్రతుకు - మరీ దుర్భరము
భయముతొ తినడు - తిననీయడుగా!

వాడుదాటినచొ - అందరుతిందురు
వానిభయము మరి చావునాపునా!
కొండచిలువ తా కదలకయుండి
దొరకినదానిని తిని నిద్రించును

నాకు గురువులు - ఆరెండే విను
తేనెటీగయు - కొండచిలువయు -
వాటిజీవితము ఆకళించుకొని
నేనీస్థితిని - అవలంబించితి

సుఖములన్నియు అనుభవించితి
పట్టుపుట్టములు నారబట్టలను
కట్టినాడను - కట్టనె లేదు
రెండుఒకటే - నేడు నాస్థితికి.

రథ హయములను - ఏనుగునెక్కితి
ఎక్కలేదను - చింతలేదు విను
కస్తూరి పునుగు మరి జవ్వాదిపూతలు
బూడిదపూతయు ఒకటే నాకు

పర్ణశాలలు రమ్య హర్మ్యములు
రుద్రభూములు - ఒకటే నాకు
పొట్టకోసము తపనలేదు ఇక
తిట్టినఒకటే - పెట్టినఒకటే

అమృతమ్మును ఆముదమ్మును
ఒకటేనాకు - రుచులు వదలితి
సంతోషము దుఃఖము ఒకటే నాకు
దొరకలేదని తలంచ నసలు

కోరికయున్న - దొరకిన - దొరకుట
సుఖదుఃఖములు - కలుగుట జరుగును
కోరక యున్న - రెండూఒకటిగ
సుఖదుఃఖములు దరికేరావు

రోగమువచ్చుట సహజమైనది
ఎటులపోవునో రోగముఅనుచు
కుమిలిఏడ్వను - దేవుని పిలవను
ధనభోగములు లేవని తలచను

ఉన్న గోచిని తీసి వేసి మరి
పిశాచి మాదిరి తిరిగెద నిచట
వింతజంతువని నవ్వుకుందురు
పిచ్చివాడని జాలిపడెదరు.

ఇచటకు వచ్చి అజగరము వలెను
చాలాకాలము నుండి పరుంటిని
కండ్లుమూసుకొని హరి ధ్యానముతో
ఆత్మానందము పొందుచుంటిని

నేను ఆత్మను అనెడి స్థితికి మరి
వచ్చినాడను సాధనతోను
గోప్యమైన నాచరిత్ర నీకు
హరిభక్తునికి చెప్పితినేడు

నీమనస్సుకు హత్తుకున్నటు
చెప్పితిననగా - ప్రహ్లాదుండు
భక్తిగ మునికి - అర్చన సలిపి
తన నగరమునకు తిరిగివెళ్ళెను.

అంతట అడిగెను ధర్మనందనుడు
ఓపుణ్యాత్మా! భాగవతాగ్రణి!
నావంటి గృహస్థుకు ఉత్తమస్థితియది
కలుగుట ఎటుల వివరించుమయా!

ధర్మనందనా! గృహస్థాశ్రమధర్మమ్ముల
నిర్వర్తించుచు వాటన్నిటినీ
హరికి అర్పణచేయుచు - బుద్ధిగ
ధర్మపథమున నడువగవలెను

జ్ఞాననిధులగు మునుల సేవయు
హరికథా శ్రవణము చేయుచు
సంసారమొక - స్వప్నము అన్న
జ్ఞాపకమ్మది కలిగియుండవలె.

ప్రతిఫలమ్మును ఆశించకను
తల్లిదండ్రులకు - సుత సోదరులకు
అక్కరలో - ధన సాయముచేయుచు
సిరిసంపదలు - దైవమిచ్చెనని

వాటిపైన మమకారము పెంచక
దైవకార్యముల ముందు నిలవవలె
పొట్టకూటికై - దొంగిలించిన
కనికరించ వలె - అట్టిచోరుని

జీవులహింస చేయగరాదు
సర్వప్రాణులు తనవారన్నటు
కష్టపెట్టక కనికరించవలె
కలిగినదానిని పంచి పెట్టవలె

ధర్మవిహితమగు ధనార్జనమ్ముతొ
పితృదేవతల ఋషులనుమరియు
భూతగణమ్ముల తృప్తిపరచవలె
జీవకారుణ్యము ముఖ్యమైనది

తనుజీవించుట ఆత్మోపాసన
చేయుట కొరకై - అన్నటు తలచి
ఆత్మోపాసన చేయుచున్నచో
ఆనందధామముకు జేర్చును శ్రీహరి

అతిథి పూజయది గృహస్థువిధియగు
ధనముకోసమై తండ్రిని గురువును
అంతముచేయగ సిద్ధపడుటది -
భార్యావిధేయత కలిగియుండుటది -

మొదలగుబుద్ధులు - దరిరానీయక
తనయిల్లాలిని - అతిథిపూజలను
చేయునట్టుగా - మలచుకొన్నచో
ఈశ్వరానుగ్రహ - పాత్రుడుఅగును

సుర - భూసురుల - సర్వజీవుల
అంతరాత్మగా వెలయు క్షేత్రజ్ఞునికి
సర్వకామ్యములు సమర్పించుకు
సంతృప్తిని తా పొందగవలెను

ధర్మనందనా! ఆశ్రమమ్ములలొ
శ్రేష్టమైనది - గృహస్థాశ్రమము
దానికి విహితములైన ధర్మములు
వివరించెదనని - ఆరంభించెను

పుణ్యతిధులలో – పుణ్యకాలముల
దేవబ్రాహ్మణ సమారాధనలు
తల్లిదండ్రులకు సమారాధనలు
జప హోమ – స్నాన వ్రతముల

పితృదేవతల తృప్తిపరచుచు
బంధులందరిని ఆదరించుచు
గృహస్థు నడచిన ఆయుర్వృద్ధి
అమితమైన సుఖశాంతులు కలుగును

పుణ్యనదులు ప్రవహించు తావుల
యజ్ఞదీక్షలు – పితృకార్యములు
చేయుచుండవలె – ధర్మకార్యములు
శక్తికితగినటు ఆచరించవలె.

సర్వలోకములు హరి యందుండును
సాధుస్వభావము హరితత్త్వమ్ము
అట్టిసాధువు – ఉనికి తెలుసుకొని
ధర్మకార్యము జరపవలె నట

చిత్తశుద్ధికై – దైవరక్షణకు
పుణ్యక్షేత్రములు దర్శించవలె
గయ ప్రయాగ కురుక్షేత్రములు
పులహాశ్రమ మరి నైమి శారణ్యము

కాశీ – మధుర – కుశస్థలి మరియు
బదరికావనము – సీతారామాశ్రమము
పంపాసరస్సు – బిందుసరోవరము
మహేంద్రగిరి మరి నారాయణాశ్రమము

మలయపర్వత పుణ్యస్థలములు
శ్రీమన్నారాయణ ప్రతిష్ట స్థలముల
హరిభక్తులు వసించు స్థలముల
సేతువు – ప్రభాసతీర్థమ్ముల

అట్టిస్థలములలో చేసిన ధర్మము
కొంచెమైనను ఫలిత మనంతము
ధర్మనందనా – సృష్టి యంతయు
శ్రీహరి దివ్యవిలాసము తెలియుము

స్థావరజంగమమైన సృష్టియది
శ్రీహరిలేనిచో – లేనే లేదు –
అంత ఎందుకు – యిందరిమధ్యలో
అగ్రపూజ – నువు హరికి చేసితివి.

బ్రహ్మాండమను తరుమూలము హరియే
హరిసంతృప్తి – జీవకోటిసంతృప్తి
హరిపూజయది చేసినచో మరి
జీవకోటిని పూజించినట్లగు

తిర్యగ్జాతుల – అధికుడు పురుషుడు
ఆపురుషులలో వేదవేద్యుడగు
హరినెలకొన్న – వేదముచదివిన
ఆత్మజ్ఞాని – సత్పాత్రుడు అన్నిట

ఎవరికివారే పాత్రులమనుకొని
అసూయతో మరి త్రేతాయుగమున
వాదన సాగగ – పూజార్హమగు
హరి ప్రతిమయది – కల్పించబడె

హరి ప్రతిమను మరి అర్చించినచో
అఖండఫలము లభించగలదు
పురుషద్వేషులు అట్టిప్రతిమలను
పూజించరు–వారికి ఫలములభించదు

లోకారాధ్యుడు పూజనీయుడు –
నారాయణుడు – ఒక్కడేనయా!
ఆనారాయణుడు వేదబ్రాహ్మణుని
పూజచేయును – వింటివరాజా!

అట్టిబ్రాహ్మణుల వేదపరులును
యోగులు మరియు కర్మపరులను
తపోవంతులు – శాస్త్రకోవిదుల
గృహస్థు – భక్తిగ పిలచి వారికి

పూజను సలిపి – పితృసంతృప్తిగ
కవ్యము మరియు దేవప్రీతికై
హవ్యము – సమర్పించుకొన్నచో
గృహస్థాశ్రమ ధర్మమ్మదియగు

పితృకార్యమున ఒకరికి గాని
మరి – ముగ్గురకు భోజనమిడవలె
దైవసమారాధన ఒకరికి గాని
ఇద్దరకు గాని చేయగవలెను

ధనము కలదని విశేషమ్ముగా
శ్రాద్ధము నిర్వర్తించుట తగదు
దేశకాలముల పాత్రోచితముగ
కలిగిన దానిని తృప్తిగనిడవలె

హరిప్రీతిగను కందమూలములు
భోక్తకు నిడిన అక్షయఫలమిడు –
మాంస నివేదన నిషిద్ధమైనది
జీవహింసను చేయగరాదు

యజ్ఞయాగముల పశువధ తప్పు
ఆక్రియవల్లను మిగిలిన జీవులు
భయముతొ అవ్వి బ్రతుకుచుండును
అహింసయే – మరి పరమధర్మము

గృహస్థధర్మమ్మునకు – బాధయగు
ధర్మము చేయుట – తగనిది రాజా!
ధర్మముమాదిరి అగబడునట్టి
అధర్మమెన్నడు చేయగరాదు.

వేదవిరుద్ధ ధర్మము తగదు
లోకవంచనకు చేయగతగదు
ధనసంపాదన కది "దంభమ్మగు"
స్వధర్మమ్ముతో పాప శాంతియగు

యాత్రాసందర్భములయందును
ధనయాచన మరి తగనిది ధర్మజ!
జీవయాత్రకు అడ్డ దారులు
త్రొక్కక – దైన్యముగా మరి వుండక

కొండచిలువలా సంతుష్టుడయి
ఉండుట ఎంతో శ్రేష్ఠమైనది.
అట్టిసుఖమది శాశ్వతసుఖము
తిరిగెడి వానికి అందని సుఖమది

జిహ్వాకులొంగి కామవశుడయి
తృప్తినెరుగని బ్రాహ్మణ మనుగడ
హీనమైనది - వాని చదువది
నిష్ప్రయోజనము అన్నదినిజము

భూలోకములో స్వర్గసుఖములు
అనుభవించినా - దిక్కుల గెలిచిన
ఆకలి దప్పులవల్ల - కామమది
తీరదుఅన్నది - నిశ్చయమయ్యా!

అదేవిధముగా హింసవల్లను
కోపముచావదు - ఓకౌంతేయా!
సంకల్పరహితమున కామముగెలుతురు
కామవిసర్జన - చంపు - క్రోధమును.

అర్ధము అగు ననర్ధ కారణము
అనెడి తలంపుతొ - లోభమువదలిన
అద్వైతబుద్ధితో భయము తొలగును
సత్వగుణమున దంబమడగును

ఆత్మానాత్మ వివేక జ్ఞానమున
శోకమోహములు తొలగిపోవును
మౌనమువల్లను మనశ్శాంతియు
దయవల్ల తగ్గును - భౌతికదుఃఖము

శరీరమ్ముపై మమత తగ్గిన
హింసప్రవృత్తి తగ్గిపోవును
సమాధిబలముతొ దైవికబాధలు
తొలగిపోవును - సాధన ముఖ్యము

ప్రాణాయామము మొదలగువాటితొ
మన్మధబాధలు తొలగిపోవును
సాత్వికమైన ఆహారముతో
నిద్రను జయించ వీలుకలుగును

సత్త్వగుణముతో రజస్తమములు
అవలీలగను జయింపబడును
గురుసేవలను చేయుచుండవలె
దానివల్ల మరి జయించు సర్వము

విష్ణుమహిమను చెప్పెడి గురువును
సాధారణమగు మనుజుడనుకొని
గౌరవించని - వానికి చెప్పిన
మార్గములన్నీ వ్యర్ధమైనటే!

ధర్మనందనా! శ్రీకృష్ణుడు దేవుడు
యోగి హృదయముల వసించువాడు
అనంతుడాయన అంతటివానిని
మానవుడనుచును తలతురు కొందరు.

అట్టివారిని ఏమనవలెను?
ఆ పరమాత్మను - తెలియబరచెడి
గురువు నిజముగా హరియేఅనుకొని
ఆరాధించగ వలెను భక్తితో -

ఇంద్రియలోలత కలిగినవారు
సమాధియోగము నభ్యసించినను
పరమార్ధమ్ము పొందగలేరు
మోక్షసాధనము - కర్మలుగావు

సంసారవాసనలు మోహముపెంచును –
మనస్సువశమున నుంచుకొనుటకై
సర్వమువదలి త్యాగమునేర్చిన
అదియేఅగును – సన్యాసమ్ము

సన్యాసమును స్వీకరించిన
భిక్షాన్నముతో కడుపునింపుకొని
ఏకాంతముగా – స్థిరచిత్తముతో
ప్రణవమంత్రమును ఉచ్చరించుచు.

రేచక – పూరక – కుంభకాలతో
ప్రాణాపానము లరికట్టి – అంతట
స్థిరముగనిలపి – తన చిత్తమును
నాసికాగ్రమున – దృష్టినిలపవలె

అట్టియోగమును అభ్యసించిన
ప్రశాంతమైన చిత్తము కలిగి
బ్రహ్మానందముతో అనుభూతితొ
చలించనట్టి చిత్తముకలుగును

సన్యాసాశ్రమ స్వీకారమ్మును
వలదని – తిరిగి వెనకడు గిడిన
కక్కిన తిండి తినిన లోభివలె
అవహేళనకు గురియగునయ్యా!

తెలియనివారు తనువు ఆత్మయని
పలుకుచుందురు నిజముకాదది –
రాలెడి తనువని – తెలిసిన వివేకి
దహింబడెడిదని అసహ్యించుకొను

బ్రహ్మచారి – తనవ్రతము వదలక
అటులేగృహస్థు – ధర్మాచరణతొ
తపస్వి – గ్రామనివాసము చేయక
సన్యాసి – స్త్రీలకు చేరువగాక

శరీరమే ఒక రధముగ నెంచిన
సారధి బుద్ధి – మనసు కళ్లెము
ఇంద్రియమ్ములు అశ్వములగును
ధర్మాధర్మ గతులు – చక్రములు

వివిధబంధములు చిత్తముఅగును
శబ్దస్పర్శాదులు ఆ రధమునకు
సంచరించెడి భూములు అగును
అంతట – జీవుడు – రధకుడు అగును

ప్రణవము ధనుస్సు–శుద్ధజీవుడు శరము
బ్రహ్మము లక్ష్యము – మరి శత్రువులు
రాగ – ద్వేషములు – శోకభయములు
లోభ – మోహ – మద–మాత్సర్యమ్ములు

అట్టిశరీరము అనెడి రధమును
జీవుడు వశమున – నుంచుకోవలె
హరిసేనతొ – మరి – హరి భక్తులసేనతొ
వాడియైన విజ్ఞాన ఖడ్గముతొ

హరి కృప యనెడి బలమును కలిగి
రాగాది శత్రువుల ఖండించ వలె
ప్రణవమనెడి ఆ విల్లునందున
శుద్ధజీవమను శరము సంధించి

బ్రహ్మలక్ష్యముగ విడువగ వలెను
ఆపై జీవుడు రధికుడుగాక
రధికత్వమును వదలిపెట్టి మరి
ఆనందముతో అనుభూతిపొందవలె.

అటుల చేయక ఉపేక్షించిన
ఇంద్రియాలను - అశ్వములవ్వి
బుద్ధిఅనెడి - ఆ సారధినంత
తమవశమ్మున నుంచుకు-రధమును

సంసారము వంకకు-ఈడ్చుకుపోయి
విషయశత్రువుల - మధ్యత్రోయును
శత్రువులంతట - విజృంభించి
రధిక - సారధుల నాశముచేయును.

వైదిక కర్మలు రెండు రకములు
ప్రవృత్తము మరి నివృత్తములని
ప్రవృత్తము ననుసరించిన
తిరిగిపుట్టుక తధ్యమురాజా!

నివృత్తమును అనుసరించిన
మోక్షమునందుట తథ్యమురాజా!
ఇష్టాపూర్తములని రెండువిధములుగ
ప్రవృత్తికర్మలు చెప్పబడునయా!

హింసా ద్రవ్యమయ - కావ్యరూపము
దర్శ - పూర్ణమాస - పశు - సుత
వైశ్వదేవ - బలిహరణాదులు
యాగాదికములు - ఇష్టములందురు.

దేవాలయారామ - తటాక - కూపములు
పూర్తములందురు - అట్టివాటిని -
ప్రవృత్తకర్మల - దేహమువదలి
మరొక దేహము పొందునప్పుడు

దేహి ఇంద్రియాలలో సూక్ష్మరూపుడై
ధూమ దక్షిణాయన - కృష్ణపక్ష రాత్రి
దర్శనంబుల - సోమలోకము
లభించగలదు - ధర్మనందనా!

అక్కడ కర్మల భోగములంది
వర్షరూపమున వరుసగ నంత
ఓషధి-లత-అన్న-శుక్ల-రూపమ్ముల
భూమిమీదను జన్మించునయా!

తిరిగి పుట్టెడి మార్గము అదియగు
నివృత్తిమార్గము నవలంభించిన
ఇంద్రియాలను వశమున నుంచుకు
క్రియా యజ్ఞమున - మనస్సులోను

మనస్సును మరి వాక్కునందున
వాక్కును తిరిగి అక్షరాలలో
అట్టివర్ణసమూహము నోంకారమున
ఓంకారమును - బిందువునందు

బిందువునంత - నాదమునందు
నాదమ్మును మరి ప్రాణమునందు
ప్రాణమ్మును మరి బ్రహ్మమునందు
ప్రతిష్ఠించవలె - పాండునందనా!

ఉత్తరాయణ శుక్లపక్షములు
పగటివేళ మరి పూర్వాహ్ణములు
నిండుపున్నములు - సహాయమ్ముతో
సూర్యమండలము నుపాసించుచు

బ్రహ్మలోకమును సాధించి మరి
తేజోరూపమున - సూక్ష్మమ్మును మరి
కారణమ్ముతో లీనముచేసి
కారణదేహము లయమొనర్చి మరి

శుద్ధాత్ముడైన - చివరకు ఆతడు
ముక్తినొందును - కుంతికుమారా!
పితృమార్గము - దేవమార్గములు
తెలిసినవాడు జ్ఞాని అగునయా!

ఆత్మయనునది దేహాదులకు -
మూలము - చివర అయివుండి మరి
బహిరంగముగా భోజ్యముఅగుచు
అంతరంగమున భోక్తగ నుండి

పరము కంటెను - మించినదై మరి
జ్ఞానమువలన తెలియదగినది
వాక్కువలనను చెప్పదగినది
వెలుగు లేకనే - వెలిగెడి దాత్మ.

దానిని మించిన దేదియు లేదు
దానిది - కానిది ఏదియులేదు
కనబడువాటిలొ మూలపదార్థము
వేరుగనున్నటు - కనబడునటుల

ఇంద్రియ వ్యవసాయమ్మంతయును
వేరుగనున్నటు కనబడు - కానీ
వేరుపదార్థము దేహముగాదు
దేహము-దాని సంబంధమ్ములు నిలవవు

అదేవిధముగా దాని ఆధారము
భూమ్యాదులును మిథ్యాత్మకములు
మాయవల్ల పరమాత్మలొ మార్పు
కలుగుచున్నటు భ్రమకలిగించును

మాయ తొలగగా - భ్రాంతి నశించి
అంతామిధ్య అన్నది తెలిసి
ఊహించినవి - భావించినవి
స్వప్నముగా మరి తేలిపోవును

అద్వైతస్థితి మూడువిధములు
భావాద్వైతము - క్రియాద్వైతము
ద్రవ్యాద్వైతము - అన్నవి మూడు
వాటివివరములు వినిపించెదను

వస్త్రము - నూలు - కలసియున్నటు
కార్యకారణములందున - వస్తువు
ఒక్కటేయని - వేరుగాదని
తెలియుట భావాద్వైతము అందురు

మనోవాక్కులతొ చేయు పనులకు
ఫలభేదమ్ము గణించకుండా
పరబ్రహ్మార్పణమ్ముగ - చేయుటన్నది
క్రియాద్వైతముగ - చెప్పగబడును

దారా సుతులు మిత్రాదులగు
సమస్త ప్రాణులు అందరితోను
తనకు - దేహమ్మునకు మరియు
పంచభూతాత్మకమగు భోక్త ఆతడు

పరమాత్ముడొక్కడే - అనెడిజ్ఞానము
అర్థకామముల ఏక దృష్టియు
కలిగియుండుట - ద్రవ్యాద్వైతముగ
చెప్పబడునయా! ధర్మనందనా!

ముని యనువాడు అతిమెలకువగా
ఆత్మజ్ఞానముతొ అద్వైతత్రయమును
విమర్శించుకొని వస్తుభేదము
స్వపరభేదము లేక - మెలగవలె

ధర్మనందనా! వింటివి గాదా!
వర్ణాశ్రమ ధర్మ - స్వరూప స్వభావము
ధర్మము నిర్వర్తించుట కష్టము
సత్యము - నిత్యము - ధర్మమేఅగును

వేదోక్తమగు మార్గము తప్పక
గృహస్థాశ్రమ విధులను క్రమముగ
నిర్వర్తించుచు - శ్రీహరిసేవతొ
గృహస్థు చేరును - హరిసాయుజ్యము

అంత ఎందులకు - మీరందరును
పవిత్రమనస్సుతొ - అనన్య భక్తితొ
శ్రీహరి పద పద్మమ్ముల గొలచి
అనుగ్రహమ్ముతొ యిడుములు దాటిరి

గిరియంతటి - కష్టమ్ముల మీరు
అవలీలగను - దాటగలిగిరి
రాజలోకమును లీలగ జయించి
రాజసూయము చేయగలిగిరి.

ఇంద్రవైభవము లమరెను మీకు
కృష్ణదేవుని చల్లనిచూపు
నిరతము మిమ్ముల కాపాడుచును
రక్షగనున్నది పాండునందనా.

॥శ్రీ కృష్ణచరితము॥



## 12 నారదుని పూర్వజన్మవృత్తాంతము

నారదుడంతట తన గాథను - అట
ధర్మనందనుని వినుమని చెప్పెను
గడచిన యట్టి మహాకల్పమున
గంధర్వజాతిలో జన్మించితిని.

ఉపబర్హణుడు అన్నది పేరు
సుందర రూపము సుకుమారమ్ముల
అందరినీ మరి మించినాడను
మృదుభాషణము నాసొంతమయె

నా చిరునగవులవి వెన్నలజల్లులు
విద్యావినయము పుట్టెను నాతో
అంతటినన్ను - గాంచిన స్త్రీలు
పరవశించుచు నుండెడి వారు

పురుషులు - ననుగని పరవశించిరి
నేను - నచ్చిన అందగత్తెలతొ
విలాసమ్ముగా గడపుచుంటిని
ఆనందముగా రోజులు గడచెను.

ఆసమయములో సృష్టికర్తలు
దేవసత్రమను యాగము చేయగ
సంకల్పించి హరికీర్తనకై
గంధర్వులను ఆహ్వానించిరి

గంధర్వులతో నేనును వెడలితి -
నావెంటను నా ప్రేయసులందరు
యాగమ్మునకు వచ్చిరి - నాడు
యాగము చక్కగ సాగుచున్నది.

తీయగ నేను పాటపాడితి
మధురానుభూతి కలిగెనందరకు
ప్రియురాండ్రవంకకు చూచితి నేను
వారిచూపులకు పరవశించితి

వెంటనె నేను వారి భుజముల
చేతులనిడుకొని బయటకు వచ్చితి
యాగసభలొ - నేనున్నటు మరచితి
యాగదీక్షలోనుండిరి బ్రహ్మలు

నా స్త్రీలోలత గ్రహించినారు
నాపై క్రోధము పెల్లుబికినది
నాకామమ్ముకు శాపమునిడిరి
శూద్రజన్మను ఎత్తగ పలికిరి

అంతట నాకు - తెలివి వచ్చినది
అప్పటికే మరి జరిగె ననర్థము
నేనొక శూద్ర వనితకు పుట్టితి
బ్రాహ్మణునింట ఆమె ఊడిగము

కొంత మేలు అది కలిగెనునాకు
బ్రహ్మవాదులగు యోగుల యొక్క
సేవలుచేసే భాగ్య మమరెను
ఆసేవలవి - జ్ఞానమునిడినవి

పాపహరణమై అజ్ఞానము అణగి
ఆత్మతత్త్వము తెలుసుకొంటిని
వారిసేవల అమోఘ ఫలితము
బ్రహ్మతనయునిగ - జన్మనెత్తుట

ఈ విషయమును చెప్పుటెందు కన
పరతత్త్వమును ఉపాసించెడి
వారి మహిమలు తెలుపుట కొరకే
వారిసేవల ఫలము చెప్పుటకు

శుద్ధమనస్సుతొ - వివేకమ్ముతో
హరిసేవలతో గృహస్థు తాను
ముక్తుడయ్యెడి మార్గముచెప్పితి
నీసందేహము తీర్చితినయ్యా!

కుంతీనందన - ఆగోపాలుడు!
మనసుకు - మాటకు అందనివాడు
అందరియందు - నెలకొనియుండి
మనుజరూపమున నున్న మాధవుడు

మంచిని చెప్పే హితుడే నీకు
నిను పాలించే - యజమానియగు
నచ్చినచుట్టము - వచ్చిన దైవము
రమాధవుడు నీ భాగ్యపు పంట

అగ్రపూజను జనార్దనునికి
చేయుటవల్ల యజ్ఞముసాగెను
ఫలితము పూర్తిగ నీకు లభించెను
చరితార్థుడవై ఖ్యాతిగలిగినది"

అనుచు నారదుడు చెప్పగ నంత
ధర్మరాజు తా భక్తి ప్రపత్తుల
ప్రేమాస్పందిత హృదయముతోను
కృష్ణదేవునికి నమస్కరించెను.

ధర్మనందనుడు కృష్ణ సేవగా
చేసినయట్టి గౌరవమ్మునకు
సంతసించిన - నారదమహర్షి
దేవలోకముకు సాగిపోయెను

అనుచు శుకుడు అట పరీక్షిత్తునకు
తెలియబరచెనని సూతమహర్షి
శౌనకాది మహా ఋషులకు చెప్పెను
పరవశించిరి మనిపుంగవులు.

శ్రీ కృష్ణచరితము - కర్ణపేయము
వ్యాసమౌనికే - శాంతినొసగినది
పోతనయ్యే - పులకించి పలికినది
భవ భయ హారిణి - భాగవతమ్ము॥

ఓం శాంతి - శాంతి - శాంతిః





సర్వేజనాస్సుఖినోభవన్తు
లోకాస్సమస్తాస్సుఖినోభవన్తు





**సర్వం శ్రీ సీతారామచంద్ర పాదార్పణమస్తు**



(మకుటం)

శ్రీ కృష్ణచరితము - కర్ణపేయము
వ్యాసమౌనికే - శాంతినొసగినది
పోతనయ్య - పులకించి పలికినది
భవ భయ హారిణి - భాగవతమ్ము॥

# శ్రీమద్భాగవత - మకరందము

## (అష్టమస్కంధము)

### విషయ సూచిక







శ్రీరామ

ఓం - నమో - వాసుదేవాయనమః

# శ్రీమద్భాగవత - మకరందము

## (అష్టమస్కంధము)

శ్రీ చరణాలను మదిలో నిలపి
మంగళమూర్తి - గాధలు వింటిని
స్వాయంభువ మనువు చరిత్ర
వర్ణాశ్రమ ధర్మమ్ముల వింటిని

స్వామీ! నాకు విశదపరచుము
ఏ-మనువు కాలమున హరి జన్మించెను
హరి పుట్టుటకు కారణమేమి?
ఏ మహిత కార్యముల చేసెనాతడు!

రాజా! వినుము ఈ కల్పములో
మనువులు ఆర్గురు - ఇంతకుముందు
పదునాలుగు మందిగా మనువులుండిరి
వారికాలమున సృష్టిని - చెప్పితి

మొదటి మనువు స్వాయంభువుడు
ఆకూతి-దేవహూతి ఆయన బిడ్డలు
ధర్మజ్ఞానముల బోధించుటకు
వారికి - హరియే పుట్టె తనయులుగ

దేవహూతి కొమరుడు కపిలుడు రాజా!
అగాధనునే - వివరించితిని
ఆకూతి కొమరుడు యజ్ఞుడుఅగును
ఆయన చరితను వినిపించెదను

రాజ్యపాలనము - భోగభాగ్యములు
విడచి - భార్యతో స్వాయంభువుడు
భార్యయైన శతరూపతొ కలిసి
తపసు చేయగా అడవికి సాగెను

సునందా నది ఒడ్డునాతడు
ఒంటి కాలిపై నియమనిష్టతో
కఠోర తపము చేయ సాగెను
సర్వేశ్వరుని ప్రార్ధన చేసెను

నిర్నిద్రుడును లోక రక్షకుడు
ఆది అంతములు లేని వాడగు
అక్షరుండును జ్ఞాన స్వరూపుడు
సర్వధర్మముల నెలకొనియున్న

సర్వేశ్వరునికి మ్రొక్కుచుంటిని!
అనుచు నాతడు ఉపనిషత్తులను
పలుకుచుండెను పరవశమ్ముతో
అంతట అసురులు వచ్చిపడిరట

ఆ మహనీయుని మ్రింగదలచిరి
అంతటిలోన-చక్రధారి శ్రీవిష్ణుదేవుడు
ఆకూతికి మరి తనయుడు గాను
యజ్ఞుడుగాను ఉద్భవించెను

యజ్ఞుడంతట చక్రాయుధమున
రక్కసులందరి శిరములు నరికి
స్వాయంభువును కాపాడగను
దేవతలందరు కీర్తన చేసిరి

రాజా! వినుము మనువులలోన
మొదటి మనువుదగు దివ్యగాధ అది
ఆపై రెండవ మనువు గాధను
వివరించెదను ఆలకింపుము

అగ్ని తనయుడు స్వారోచిష మనువు
ద్యుమత్సు–షేణ – రోచిష్మదాదులు
ఆయన యొక్క తనూజులయ్యా!
రోచనుండును ఇంద్రుడు మరియు

తుషిదాదులును దేవతలున్నూ
ఊర్జస్తంభుడు మున్నగువారు
సప్తఋషులుగా చెప్ప బడిరయా!
ఆపై గాధ వినిపించెద – విను

వేదసిరుడను బ్రాహ్మణోత్తముడు
భార్య తుషితతో సత్కర్మలుచేయగ
విభుడు అనెడి నామధేయముతొ
విష్ణువు – కొడుకై వారికి పుట్టెను

మూడవ మనువు ప్రియవ్రతుడగును
భూమండలమును పరిపాలించెను
పవన, సృంజయ, యజ్ఞహోత్రులు
మొదలగువారు అతని తనయులు

ఆ కాలములో వశిష్ఠ తనయులు
ప్రమదాదులు మరి సప్తఋషులయా!
సత్యజిత్తు మరి ఇంద్రుడు అగును
సత్య – భద్రాదులు దేవతలైరి

ధర్మునకంతట సూనృత అనెడి
ధర్మపత్ని అగు – వారిరువురకు
శ్రీహరి పుట్టెను – సత్యసేనునిగ
దుష్ట శిక్షణ చేసెనాతడు

ఉత్తమునకును తోడబుట్టిన
తామసుడగును నాల్గవ మనువు
కేతువు మొదలగు పదిమంది కొడుకులు
అప్పటి ఇంద్రుడు – త్రిశికుడు అగును

సత్యకాదులు – వేల్పులగుదురు
జ్యోతిర్వ్యోమాదులు మునులగుదురయా!
హరి మేధునకు – హరిని యందున
హరి జన్మించెను – వింటివ రాజా!

దయాసింధువు సర్వవ్యాపకుడు
భక్తుల బ్రోచే పరమదయాళువు
శరణు జొచ్చిన గజేంద్రునొకని
మొసలి నుండి మరి విడిపించెనయా!

అంతట అడిగెను రాజవరేణ్యుడు
మడుగులో మొసలికి అడవిన కరికి
పోరు ఎట్టుల సంభవించెను
గజేంద్రమోక్షణ వినిపించమనె.

॥శ్రీ కృష్ణచరితము॥



# 1 గజేంద్ర మోక్షణము

ఓ మహారాజా! పాలసంద్రమున
త్రికూట పర్వత మంద చందముల
మూడు శిఖరముల వెలుగుచున్నది
పొడుగు వెడల్పులు యోజనవిస్తృతి

వివిధధాతువుల వజ్రకాంతులతో
నింగివరకును వెలుగులు నింపును
గలగల పారే జలపాతములతో
కన్నుల పండుగ చేయును–ఆగిరి

ఎత్తగు తరువుల చిక్కని లతలతో
చక్కని పొదలతో–చుక్కలు దిగినటు
లెక్కకు చిక్కని–సుమములు మెరయగ
మనుసు దోచునది–మనోహరమ్ము

లవంగ, లుంగ, కేతకి భల్లాత
వకుళ వంజుళ కుంద కురవక
చందన–పిచుమంద మందార జంబూ
తాల తక్కోల తమాల హింతాల

శింశుపాశోక – నాగ పున్నాగ
చంపక శతపత్ర మరువక మల్లిక
శిరీష బిల్వామలక – తరుసంపదతో
శోభగనున్నది ఆ త్రికూటగిరి

కలహంస కారండవ చక్రవాకముల
శుక పికరవముల సందడినిండి
కిన్నర కింపురుష గంధర్వాదుల
ఆటపట్టుగ నిలచెను ఆ గిరి

వజ్రవైడూర్య నీల గోమేధిక
పుష్యరాగ మరకతమ్ములు
కాంతులద్దుచూ గిరిపైనున్నవి
గంధమాదన గిరి యనిపించును

అడవిదున్నలు – మర్కటమ్ములు
ఘన వరాహములు – చమరీమృగముల
అడవి పిల్లులు – వన్యప్రాణులు
స్వేచ్ఛగ తిరిగే సుందర ధామము

జలపాతమ్ములు దివ్యసరస్సులు
కళకళలాడే కలువపూవులతో
వెలుగులుచిమ్మే త్రికూట గిరియది
వన సంపదతో విరసిన – ఆమని

అడవి ఏనుగులు అధికము అచ్చట
ఒక దినమున ఆ కరులన్నియును
చీకటి కొండలు నడిచె నన్నటు
జలక్రీడకు ఆ సరస్సుకు వచ్చెను

రాజఠీవితో గజరాజు వెలుగగా
ఆడు ఏనుగులు అనుసరించగా
కరిగుంపును గని హరి పరుగిడెను
మద జలమ్ముతో నిండెను కరులు

నిర్మల జలముల నిండిన కొలనుల
జలపక్షులతో ఘనమీనమ్ముల
మకరులు నిండి మనోహరముగా
వెలుగు చున్నవట కాసారమ్ములు

సరస్సు ఒడ్డున వనసోయగమును
తిలకించి మరి పులకించుచును
విద్యాధరయువ దంపతులచ్చట
వనవిహారము సలుపుచుందురు

తీవలు త్రెంపుచు పూలను రాల్చుచు
మద జలమ్ముతో తడసిన చెవులతొ
ఆడుదంతులకు వీవనవీయుచు
ముదముగ రాజు సాగుచుండెను

అచ్చటనున్న కాసారమ్మున
గజరాజు తన ఆడుదంతులతొ
జలక్రీడకు మరి వచ్చుచుండును
పరవశించి అట జలకములాడును

తోడుగ నడచు ఆడుదంతులను
మురిపెముగా మరి తొండము జాపి
స్పృశించుచుండగ ఆడుదంతులు
వలపులొలకగా వనమున సాగెను

గజములగుంపు-వచ్చుట గాంచి
వనజంతువులు భయపడి పరుగిడు
ఝుంకారమ్ముల తుమ్మెదలచ్చట
మదజలమ్మును గ్రోలు చుండును

నడచి అలసిన గజరాజుకట
దప్పికైనది నీటిని వెదకగ
కొంత దవ్వులో కాసారమ్మది
కనువిందుగను కనుపించినవి

సరస్సున దిగిన - గజరాజు తను
రాణులందరితొ పరవశమ్మున
జలక్రీడనట సలుపుచుండగా
వసంతశోభయే నిలచి చూచెను

విరసిన పద్మమ్ములతో సరసు
నవ్వులు ఒలుకుచునున్నటు తోచెను
తాబేళ్ళు, మొసళ్ళు, ఘన మీనములు
నిండుగనున్నవి కొలను యందున

తొండమునిండా నీటిని తీసి
నింగికెగిరినటు జల్లుచుండెను
.వనవిహారముతొ అలసిపోయిన
కరులు జలకముల సేదతీర్చుకొను

హంస, బెగ్గురులు సొగసులొలకగా
కన్నుల పండుగ చేయుచున్నవి
పద్మ సుగంధము నీటి తుంపరల
నిండిన గాలి - హాయి గొలిపెను

ఒకదినమున తన ఆడుదంతులతొ
వనవిహారము చేయుచు రాజు
ఆడుదంతులు అనుసరించగా
సాగె వనమున రాచఠీవితో

గజముల గుంపు సంతోషముతో
మడుగున దూకెను నీటిని చిమ్ముచు
జలక్రీడలో మరి మునిగి పోయెను
గజరాజు తను స్వేచ్ఛగ ఆడెను

సరస్సునంతను కలచివేసెను
జలచరములవి ఒడ్డునపడినవి
నింగికెగిరినటు ఎగిరెను కొన్ని
ఆశ్చర్యముగ చూచిరి సురలు

పద్మమ్ములను తెంపుచు విసరుచు
తొండమ్ములతో నీటిని పీల్చుచు
నింగికెగరగా జల్లిన నీటితొ
వర్షము నింగికి ఎగసి నట్లయె.

గజరాజటుల స్వేచ్ఛ మీరగా
తన కాంతలతో జలముల-సుఖముగ
ఆటలాడగ - ప్రకృతి కాంత
పరవశమ్మున తిలకించినది

అంతటిలోన ఉపద్రవమ్ము
గజరాజునట కౌగిలించెను
రాహువు - సూర్యుని పట్టినట్లుగా
మొసలి ఒక్కటి గజమును పట్టెను

విదిలించుకొని గజరాజంతట
తొండముతో ఆ మొసలిని కొట్టెను
దూరము పడిన మొసలి అంతట
రివ్వున వచ్చి కాలిని పట్టెను

తిరిగి గజమది బలముగ తన్ని
తొండముతో ఆ మొసలిని కొట్టి
గట్టువద్దకు ఈడ్చుకు వచ్చెను
తిరిగి మొసలి తనబలమును చూపుచు

తొండమునంతను గీరి వేసెను
రక్తముకారెడి గజము నంతను
నీటిలోనికి ఈడ్వసాగెను
గజము తిరిగి - తా - గట్టుకు లాగెను

మొసలి - లోనికి లాగుచుండెను
ఏనుగు గట్టుకు లాగుచుండెను
అటులా విధముగ కరి మకరములు
వాటి శక్తిని చూపుచున్నవి

తోటి ఏనుగులు దిక్కు తోచక
కనుల నీటితో చూచుచున్నవి
స్థాన బలముతో - మకరి బలమది
అంతకంతకు హెచ్చుచుండెను

కరి బలమ్మది తగ్గుచుండగా
మకరి ఎగురుచూ విజృంభించుచు
ఏనుగు కుంభస్థలము చీరుచు
మడుగును నింపెను రక్తముతోను

కరిని బలముగా లోనికి లాగి
మడుగులోన మరి ముంచసాగెను
ఉక్కిరిబిక్కిరి అయ్యెను ఆకరి
తోకను బట్టి ఈడ్చుచుండెను

ఎగిరి గజమును గీరుచుండెను
మకరి బలముకు దాని బరువుకు
ఏనుగు ఎముకలు విరిగినట్లయె
బలము పుంజుకొని ఏనుగు పోరెను

ఏనుగు కొట్టినదెబ్బకు - తాను
ఒడుపుగ మొసలి తప్పుకొనుచును
నీటిలొ మునుగుచు తిరిగి తేలుచు
ఏనుగుపైన దూకజొచ్చెను

విజయోత్సాహము నిండెను మకరి
అజేయమైనది - ఆ మకరియని
దిక్కుతోచక రక్షణ చేసెడి
దిక్కును మదిలో తలచెను ఆ కరి

అటులా పోరు సాగుచుండగా
గజముబలమది క్షీణించినది
మొసలి బలమది ఇనుమడించినది
పట్టువదలక పోరెను గజము

కరుణించే ఆ కరుణాధాముడు
దీనుల పాలిటి దిక్కు ఆతడు
ఎటులపిలచిన - నను కాపాడును
ఈ దురవస్థను తెలుపుట ఎట్లు?

తిరిగి మకరి - తా - కాళ్ళను బట్టి
గజరాజునట లోనికి లాగెను
గజ మకరులటు వేయి ఏండ్లుగా
రాత్రింబవళ్లు పోరు సలిపిరి

అసంఖ్యాకమగు కరులకు దిక్కును
నాకు - దిక్కది నేడు కొరవడె
లక్షలకొలది ఆడు దంతులకు
మగనినైన నా మగతనమిదియా!

జవసత్త్వములు ఉడిగెను - కరికి
జలజంతువుకు బలము పెరిగినది
విశ్వప్రయత్నము చేసిన గజముకు
విశ్వనాథుడు స్ఫురణకు వచ్చెను

చందన తరువుల చల్లని ఛాయల
విహరించుచును హాయిగ నుండక
నీటికోసమై యిటకు వచ్చితి
మొసలిపాటు మరి తప్పుట ఎట్లు

ఆశలుడిగిన ఆ గజరాజు
మిగిలిన శక్తిని కూడదీసుకొని
మదిలో మాధవ స్మరణచేసెను
తనువూ మనసూ అంకితమన్నది.

॥శ్రీ కృష్ణచరితము॥



## 2 గజేంద్రుని భగవత్ప్రార్థన

"భువనపోషకుడు విశ్వవ్యాపకుడు
సృష్టిరచనను చేసినవాడు
తిరిగి దానిని లయముచేసెడి
పరమేశ్వరుని స్తుతించు చుంటిని.

ఆది మధ్యము అంతములేని
అన్నీతానై వాటికి అంటక
అన్నిటియందు తానున్నట్టుగ
అన్నీతనవని పరిపాలించుచు

## అష్టమస్కంధము

లోకమ్ములకు లోన వెలుగుచు
తిరిగి వాటికి వెలుపల నిలచి
అంతుబట్టని అనురాగమూర్తి
ఆత్మతత్వమున నెలకొని యుండి

ఏ రూపములో నిన్నుగొలుతును!
ఏపేరుతో నిను పిలతును స్వామీ!
ఏస్థలమని మరి నిర్ణయింతును
ఎచటని నాకు ఎవరుచెప్పెదరు?

లోకపాలకులు లోకములున్న
లోకములో నెలకున్న జీవులు
లయమగు ప్రళయపు పెంజీకటికి
ఆవల వెలుగెడి తేజోమూర్తి

ఎక్కడ తలచిన - అచ్చటగలడు
ఎప్పుడు పిలచిన - తప్పక పలుకు
ముప్పులుబాపే చక్రధారి మరి
ముందుకు రాడా ననుపాలించగ!

నామొరవిని నను కరుణించగను
మనసునిండగా ప్రార్థింతునిదే!
మునిజన వందితుడైన శ్రీహరి
ముందుకురావలె ఆదుకొనగను

దీనుల యందు కలడని అందురు
భక్తుల హృదిలో కొలువగు నందురు
ఆయన లేని స్థలమేలేదట
అంతటివాడు కలడో లేడో!

నామరహితుడు - గుణదోషములు
పుట్టిగిట్టుటలు - లేనటువంటి
మాయతొ అన్నీ కలవనిచూపే
సజ్జన వందితుడే - యిక దిక్కు

సకలచరాచర జగతిరచించి
పరిపాలనలొ శ్రమను ఎరుగని
నిర్నిద్రుడు మరి నిర్వికారుడగు
సత్యవర్తికి ప్రణామమిదిగో!

దుష్టశిక్షకుడు శిష్టపాలకుడు
దయాసింధువు ధర్మరక్షకుడు
మోక్షప్రదాత - మంగళమూర్తి
లీలానాటక సూత్రధారుడు

స్థూలసూక్ష్మ శరీరధారిగా
దర్శనమిచ్చే అవ్యయుడాతడు
అభవుడు-ఆర్తుల కభయప్రదాత
ముక్తికాంక్షులకు ముంగిటనిలబడు

యోగదృష్టికి అందెడువాడు
వేదశాస్త్రముల నెలకొనువాడు
ఇహసుఖ భోగులకు అందనివాడు
పరమాత్మ ఆతనికి-నావందనము

తనతేజముతో విరించి సురలను
సర్వజీవులను లోకమ్ములను
నామరూపముల - నెలకొన జేసి
తిరిగి వాటికి ముగింపుచూపే

స్వేచ్ఛావర్తి - త్రిగుణాతీతుడు
త్రిగుణమ్ములలో వున్నటు కనబడి
లింగబేధమును తాను సృజించి
తానువాటికి లోబడియుండక

లోకసాక్షికి త్రోవచూపుచు
సృష్టికర్తనే సృష్టిచేసిన
యోగుల హృదిలో కొలువైయున్న
మూలవిరాట్టుకు నా ప్రణతులివే!

ఇంకా ఎందుకు ముందుకు రావు!
ఎలానిన్ను పిలతును స్వామీ!
అన్నీ వదలి నిన్నే నమ్మితి
వమ్ముచేయకు నా నమ్మకము."

ఆర్తిగపిలచి - అలసిపోయెను
అంతకుమించి త్రోవలేదని
అతడే దిక్కని నమ్మిన గజము
మరి మరి ప్రార్థన చేసెను ఈశుని.

"ఓ సర్వేశ్వర! బలముడిగినది
ధైర్యము సడలెను అసువులు లేచెను
శక్తుడిగినది నిలబడలేను
రావలె స్వామీ! వేగమెరమ్ము!

శరణాగతులకు చల్లని నీడవు
పిలచిన ఓ! యని పలికేవాడవు
అనుచు - ఆర్తులు ఎందరొ చెప్పిరి
నమ్మితి నందుకు - వమ్ముచేయకు!

దిక్కులేని వారందరి దిక్కువు
పిలుపు అందని దూరమునున్నను
సర్వవ్యాప్తివని - మొరపెట్టితిని
అయ్యో! కుయ్యో - అలసి సొలసితి"

అటుల-గజేంద్రుడు ఆర్తిగ పిలువగ
బ్రహ్మాదులును సురలందరును
శక్తిలేకను - హరియే దిక్కని
మదిలో తలచి మిన్నకుండిరి

పిలచిన పలికే పరంధాముడు
అలుపు నెరుగని కరుణాధాముడు
శరణం - అంటే చాలని నిరతము
వేచిచూచెడి విశ్వనాధుడు

ముఖ్యభవనము - వైకుంఠమున
మునిజనవందిత నిలయమ్మదియగు
సకలశోభల సుందరవనమున
నెలకొనియున్నది-సిరులకు నెలవు

హంసతూలికాతల్పము మీద
రత్నఖచితమగు పర్యంకమున
రమతోకూడి - ముచ్చలాడెడి
మంగళమూర్తి వినెను ఆర్తిని

గజరాజుమొర ఆలకించెను
అసమయములో ఆనందముగా
సిరితో సరసములాడుచుండగా
పాహి పాహి-యను - పిలుపునువినెను

అంతే - అంతే - రివ్వునలేచెను
శంఖచక్రముల ధరించలేదు
గరుత్మంతుని పిలవగలేదు
చివరకు లక్ష్మికి చెప్పనెలేదు

అసురులు స్వర్గము-ముట్టడించిరో!
అబల మానము-కావగ వలెనో!
వేదమ్ములవి - హరింపబడెనో!
హరిని చూపమని అడిగిరొ కక్షతొ!

తనపైనున్న ఉత్తరీయమది
జారిన దానిని సరిచేయకను
కదలెను - భక్తుని రక్షించుటకై
అర్ధాంగి అంతట - అనుసరించెను

గమ్యము చెప్పడు-అయినా ప్రియసతి
హరి - తా - సాగెడి ప్రదేశమ్ములు
భక్త రక్షణ సమయమ్ములను
మదిలో తలచుచు సాగుచున్నది

అడిగెదననుకొని తలచెను లక్ష్మి
అడిగెడి సమయము లేనేలేదు
అడిగిన పలుకని ఆరాటమ్మది
అమ్మ గ్రహించి గమ్మున నుండెను

ముడివిడి మూపున జారెను కురులు
కర్ణాభరణము తళుకుల మెరయగ
వల్లెవాటది సరిదిద్దకను
వడ్డాణమ్మును బిగించకుండను

వైకుంఠమ్మది బయిలుదేరినది
వెళ్ళవలసినది భూలోకమ్ము -
ఎంతదూరమో - నడువగ వశమా!
అన్నది తలచదు భక్తబంధువు

ముఖమున అలదిన గంధమంతట
స్వేదజలముతో కరగి జారగా
ముందుకు నడచి అడిగెద ననుకొని
అంతటిలోన ఆగెను లక్ష్మి -

కోటి సూర్యుల కాంతుల వెలుగుచు
లక్ష్మీపతి - తా - సాగుచుండగా
వెంబడి లక్ష్మి - పరివారమ్ము
శంఖ, చక్ర గద ఖడ్గమ్ములవి

మేఘము వెంబడి మెరపులాగను
వెంబడి సిరి - తా - అనుసరించెను
అడిగిన నుడవని సందర్భమని
అడుగక - సాగెను శ్రీమహాలక్ష్మి

వాటివెంబడి నారద మహర్షి
విష్వక్సేనుడు - వైకుంఠవాసులు
నడచుచుండిరి ఆశ్చర్యమ్మది
అడిగెడివారు ఎవరూ లేరు -

గగనయానమున నడకను సాగెడి
నారాయణుని చూచిన సురలు
నమస్సులిడిరి - భక్తిప్రపత్తుల
వినబడలేదా స్తుతులేవియును

గజరాజును - తా - రక్షించవలె
అదే దీక్ష మరి - అదె కర్తవ్యమ్ము
అనుకొని సరస్సు చేరిన శ్రీహరి
సూర్యకాంతిగల చక్రము విడచెను

వెనుక వచ్చెడి సుదర్శనమ్మును
సుదర్శనుండు మకరముమీద
ప్రయోగించెను భయంకరమ్ముగా
మడుగున ధ్వనులవి బయిలుదేరెను

అల్లకల్లోలము అయినది సరస్సు
గమ్యము చేరెడి విష్ణుచక్రము
మొసలి తలను - అట తృంచివేసినది
తలవేరైనది మొండెమునుండి

పీడవిరగడై బలముచేరగనె
కాళ్లువిదిల్చి నిలచెను - ఆ కరి
మబ్బులు దాటి బయటకు వచ్చిన
చందమామ వలె నుండెను గజము

గజరాజంతట క్రొత్తవెలుగుతో
కళకళలాడెను ఆనందముతో
మిగిలిన కరులు నీటినిపీల్చుచు
అభిషేకించిరి - తమనాయకుని

విజయసూచనగ పాంచజన్యమును
పూరించెను అట వాసుదేవుడు
దేవదుందుభులు మ్రోగెనొక్కపరి
అచ్చరకన్యలు నాట్యముచేసిరి

భక్తవత్సలుడు చేతిని జాపి
గజరాజును - తా - వెలికితీసెను
జవసత్వమ్ములు వచ్చిచేరగా
హరిపదములపై వ్రాలెను ఆకరి

గజేంద్రమోక్షణ దివ్య గాధను
రాజుకుచెప్పి శుకయోగీంద్రుడు
కరి మకరుల వృత్తాంతము తిరిగి
తెలియబరచెను ఈ విధముగను

హూ హూ - అనెడి గంధర్వుండు
దేవలుడనెడి ముని శాపమున
మొసలిజన్మతో మడుగున నుండెను
శాపవిమోచన కలిగించెను హరి

అనేక విధముల హరిని స్తుతించి
ఆనతినంది సాగె గంధర్వుడు
హరి కరస్పర్శతో గజరాజంతట
విష్ణుసాయుజ్యమునందెను రాజా!

ఓ ధరణీశా! ఇంద్రద్యుమ్నుడను
ధరణీధవుడు - విష్ణుభక్తుడు
మౌనవ్రతముతో హరినామముతో
గిరిపై నాతడు దీక్షలోనుండును

ఒకదినమున మరి దీక్షలోనుండగ
అగస్త్య మహర్షి అరుగుదెంచెను
మౌనవ్రతమును వదలి రాజా - తా -
పరిచర్యలవి - చేయగలేదని

కినుక వహించిన అగస్త్యమహర్షి
మూఢ మృగమగు - కరివి కమ్మని
శాపమునిడెను అతనితొబాటు
ఏనుగులైరి పరివారమ్మును

కరిజన్మమున హరిని వదలక
నిశ్చలభక్తితొ ముక్తిని పొందెను
గజమును బ్రోచిన శ్యామసుందరుడు
లక్ష్మినిగాంచి పలికెనప్పుడు

"దేవీ! భక్తుని రక్షించుటకై
తొందరలో మరి విషయము చెప్పక
చీర కొంగును విడువక నడచితి
నన్నెటు - నీవు భావించితివి

భక్తరక్షణ పరమధ్యేయము
ఆపనిలో - నే - నన్నియు మరతును
నన్నేమన్నను లెక్కించనులే!"
అనగా-లేమ సొగసుగ నవ్వెను

"దీనరక్షకా! మరుమాటాడక
నీతోసాగెడి సహధర్మిణిని
నామది - నీకు తెలియకుందునా!
నీకర్తవ్యము భక్త రక్షణము -

అంతట శ్రీహరి లక్ష్మీదేవితొ
వెంబడివచ్చిన ఖగపతినెక్కి
వైకుంఠమునకు సాగిపోయెను
జయజయధ్వనులు పలికిరి సురలు.

రాజా! ఈకథ వినిన వారికి
పాపముతొలగి కీర్తిలభించును
దుఃఖము లన్నీ తొలగిపోవును
దుస్స్వప్నములు నశించిపోవును

శుచిగా ప్రభాత సమయములోన
పఠించువారికి సంపదలమరును
పీడలుడుగును-శుభములు కలుగును
సుఖసంతోషములమరును విధిగా -

జీవితాంతము సుఖముగ గడిపి
ఆపై మోక్షము నందునాతడు
రాజా! ఇది శ్రీవిష్ణువుచెప్పిన
ఫలశృతి అని మరి తెలియగవలెను -

తిరిగిచెప్పెను కమలనాభుడు
ఓ గజరాజమ! వేకువఝామున
నిన్నూ, నన్నూ, ఈసరస్సును
శ్వేతద్వీపమును - పాలసంద్రమ్మును

బంగరు గిరిని - అందలి గుహలను
ప్రక్కన వెలసిన - చిక్కని అడవిని
శంఖ చక్ర గద ఖడ్గమ్ములను
శ్రీలక్ష్మిని మరి గరుత్మంతుని

ప్రహ్లాదుని-శేషుని-మత్స్యకూర్మాది
అవతారములను-వాటి గాథలను
సూర్యచంద్రులను-ప్రణవమంత్రమును
అగ్నిదేవుని - సత్యధర్మముల

వేదశాస్త్రముల గోబ్రాహ్మణులను
సాధ్వీమతల్లుల - పుణ్యవర్తనుల
చంద్ర, కాశ్యపుల - గౌరీదేవిని
గంగాదిగాగల పుణ్యనదులను

మందార-కల్పక దివ్యతరువులను
ఐరావతమును అమృతమ్మును
బ్రహ్మఋషులను భక్తధృవుని మరి
పాపరహితులను నిర్మల మనసుతో

తలచినవారికి అంత్యకాలమున
మోక్షమునిచ్చెద - అని హరి చెప్పెను
కావున రాజా! ఈగాధ మరి
ఐశ్వర్యమ్ములనిడి - కైవల్యమునిడు

అనుచు చెప్పిన శుకయోగీంద్రుడు
ఐదవ మన్వంతరపు గాధను
చెప్పసాగెను పరీక్షిత్తునకు
అనుచు సూతుడు ఆరంభించెను

రైవతుడగును ఐదవ మనువు
ప్రతివింధ్యుడాదిగా ఆతని తనయులు
హిరణ్యరోముడు - ఊర్ధ్వబాహుడు
వేదశీర్షుడు అప్పటి మునులు

భూతరయాదులు దేవతలప్పుడు
శుభ్రుని కంతట వైకుంఠియందు
శ్రీహరి పుట్టెను వైకుంఠునిగా
వైకుంఠమును సృజించెనాతడు

వైకుంఠుని సతి రమ యగునయ్యా!
ఆరవ మన్వంతరము నందున
చక్షస్సు తనయుడు చాక్షుడు - తాను
ఆరవ మనువుగ చెప్పబడునయా!

పురుః పురుష సుద్యుమ్నాదులు
చాక్షుసు తనయులు-రాజులు వారు
మంత్రద్రుముడు ఇంద్రుడు మరియు
అప్యాదులును-అప్పటి సురలు

అహవిష్మ ద్వీరకాదులు అప్పటిమునులు
వైరాజునకు సంభూతికిని
అజితుడు అనెడి నామధేయమున
పద్మాక్షుడు - తా - ఉద్భవించెను

ఆదికూర్మముగ - అజితుడు తాను
పాలసంద్రమును చిలికెడివేళలో
మందరగిరిని వీపున మోసెను
అమృతమ్మును సురలకు పంచెను

ఆ మహనీయుని కథలు తరగనివి
అనగా రాజు! ఓ పుణ్యాత్మా
అసలు దేవతలు క్షీరాబ్ధిని మరి
చిలుకుట ఎందుకు శలవీయుడయా!

హరి తానెట్టు కూర్మరూపున
మందర గిరిని మోసెను - వీపున
అమృతమెట్లు - పంచెను వారికి
అనగా మౌని ఆరంభించెను

॥శ్రీ కృష్ణచరితము॥



# 3 క్షీరసాగరమథనము

దేవదానవులు బద్ధశత్రువులు
జన్మవైరము వారి మధ్యన
అసురుల బాధల కోర్వగ లేక
సురలు - బ్రహ్మను ప్రార్థనచేసిరి

దూర్వాసుశాపమున కలుగు కష్టములు
చతుర్ముఖునకు తెలియును కనక
తనుగా వారికి త్రోవచూపగల
శక్తి లేదని వారితొ పలికి

పద్మనాభుడు దిక్కయిప్పుడు
ప్రార్థించినచో అభయమిడునని
అందరుకలిసి జగన్నాథుని
స్తోత్రము చేసిరి భక్తి ప్రపత్తుల

"సర్వేశా! ఓసర్వనియంతా!
ఘోరతపముకు వ్రతనియమాలకు
మునులకు సైతము అందనివాడవు
ఆశ్రితజన మందారము నీవు

నిన్నుకొలిచిన ఫలితమనంతము
సురలందరినీ కొలచినట్లగు
ఆర్తులమొరవిని దర్శనమిడినచొ
బ్రహానందము నందెదమయ్యా!"

బ్రహ్మదేవుని ప్రార్థన వినిన
వెన్నుని మనసు - కరగిపోయినది
దివ్యతేజమట ఆవిర్భవించెను
వేయిసూర్యు లుదయించి నట్లయె

దివ్య తేజమును సురలు సైతము
చూడగలేక కనులు మూసిరి
అంతటిలోన తేజము మరుగై
లక్ష్మీపతి - తా - ముందునిలచెను

స్వర్ణకిరీటము - మకరకుండల
వనమాలతొ మరి కౌస్తుభమణితో
కాంచన చేలము - శంఖచక్రముల
కస్తురి తిలకము - శ్రీవత్సముతో

అభయముద్రతో నారాయణుడు
భక్తులపాలిటి కల్పవృక్షము
చిరునగ వొలుకగ దర్శనమిడెను
పరవశించిరి సురలందరును

తనయుడు తండ్రిని ప్రార్థించెనట
నాల్గు ముఖములతొ కీర్తన చేసెను
"సృష్టి స్థితి లయకారకుడవు నువు
అణువు కన్నను సూక్ష్మరూపుడవు

సద్గుణ నిధివి - అభవుడవీవు
నీరూపమది - దుష్టశిక్షణ
శిష్టరక్షణ చేయును అనుచు
ఆగమాలు మరి తెలుపుచున్నవి

సర్వకారణ - సర్వవర్తివి
ఆరాధనకు - సగుణరూపమున
మోక్షకామికి నిర్గుణరూపున
అనుగ్రహించే పరంధాముడవు

కట్టెయందున అగ్ని గాంచినటు
ఆత్మవేత్తలగు జితేంద్రియులు మరి
నిశ్చల దృష్టితో మోక్ష కాంక్షియై
నీ దర్శనము చేయగలుగుదురు -

కరుణాధామా! మాబాధలివి
అసురలవలన ఇడుమలనుంటిమి
నేనూ - ఈ సురలందరు కూడా
నీలోవారము - సర్వమెరుగుదువు!

అనుచు సలిపిన స్తుతులకంతట
గంభీరముగా పలికెను శ్రీహరి
"ఎలుక కోసమై పాము కాచినటు
అదనుకొనమై - వేచియుండవలె

అమృతమిప్పుడు ఉద్భవించవలె
ఆకర్తవ్యమ్ము మీపైనున్నది
అమృతపానము అమరత్వమునిడు
అందుకు సాధన వినిపించెదను

లతలు - ఓషధులు తీసుకువచ్చి
పాలసంద్రమున వేసి అంతట
మందరగిరిని కవ్వము చేసి
వాసుకి తాడుగ - మథించవలెను

నా సహాయము తప్పక వుండును
క్షీరపయోనిధి తరచునప్పుడు
భయంకరమ్మగు విషముపుట్టును
అయినా దీక్షను వదలక-చిలుకుడు

ఆపై కొన్ని దివ్య వస్తువులు
ఉద్భవించును - సరి అనుకోక
పట్టువదలక - పామును వదలక
చిలికిన - అమృత ముద్భవించును"

ఆమాటలకు విరించి - సురలు
ఆనందించిరి అప్పటికప్పుడు
అమృతమ్మది అందుకున్నటు
అందరు తలచిరి దీక్షవహించిరి

అంతట సురలు అసుర రాజగు
బలితో తీయని పలుకులు పలికిరి
ఆ మహరాజు సురాసురులకు
సఖ్యముచేయగ హితవుచెప్పెను

అటుల రోజులు గడచుచుండగా
సురనాయకుడు మెల్లని మాటల
అమృతమ్మును పొందుట తెలిపెను
అమృతపానపు ఫలితము నుడివెను

పాతకక్షలు మదిలో తలచక
అన్నదమ్ములము అందరమొకటై
క్షీరసాగర మథనము చేతము
అనగా నసురులు సమ్మతించిరి

అసురులందరూ ముందుకువచ్చి
మందరగిరి పెకలించసాగిరి
త్రవ్విరి నేలను - కదిపిరి గిరిని
బలమగు తాళ్ళతొ లేవనెత్తిరి

ముందు భాగము అసురులు మోయగ
వెనుక భారము తేలికైనది
భారమంతయును అసురులు మోసిరి
తెలివిగ సురలు, తేలికపడిరి

కొండజారిన – దానికిందపడి
నలిగిపోవుచు నుండిరి కొందరు
అలసిపోయి – వారందరు తలచిరి
భరించరాని భారము అదియని

కొండ మోయుట తేలికపనియా!
విష్ణువు మనకు ఇడుములనిడెను
గిరికిందపడి చచ్చుచుంటిమి
చూచుచునుండెను ఆ శ్రీహరి.

సురలు అసురులు అలసటనిండి
త్రోవతెలియక దిగాలుపడగా
సర్వవ్యాపకుడు దర్శనమిడెను
నేనుండగను దిగులు ఎందుకనె

వారందరినీ ఊరడించెను
బంతిమాదిరి గిరినిఎత్తెను
గరుత్మంతుని మూపుననిడెను
క్షీరపయోనిధి వద్దకుపొమ్మనె

మందరగిరిని విష్ణుమూర్తిని
గమ్యము చేర్చెను – వైనతేయుడు
దేవదానవులు వాసుదేవుని
పరవశమ్మున స్తోత్రముచేసిరి

వాసుకినంతట పిలచెను శ్రీహరి
లోకోపకారము చేయగ చెప్పెను
అమృతమందు భాగమిత్తురని
మృదువుగ కరమున నిమిరెను పామును

నాగరాజు – తా – సరియని పలికెను
అంతట వారు మందరగిరికి
కవ్వపుతాడుగ వాసుకి నుంచి
చిలుకుట కొరకై సిద్ధముచేసిరి

తలభాగముకు పట్టుకొనుటకై
వారిలోవారికి పోటీవచ్చెను
దానవులనిరి తోకను పట్టుట
అవమానము మరి సహించమనిరి

విష్ణుమాయకు లొంగినయట్టి
అసురులు పలికిన పలుకులు సురలకు
ఆనందమును కలిగించినవి
పెద్ద ముప్పును – తప్పించినవి.

బుసలను విడచుచు వాసుకి అంతట
భయంకరమ్మగు బాధనందెను
శరీరమంతకు రాపిడి కలిగెను
ఆగుడాగుడని అరచె పన్నగము

సంద్రమధనము ఆపిన వెంటనె
కొండతొపాటు కొందరుకూడా
సంద్రములోనికి మునిగిపోయిరి
నిరాశతో వారందరుండిరి

అంతటిలోన శ్రీహరి అచ్చుట
కూర్మావతారము దాల్చినిలచెను
లక్షయోజన వెడల్పు వీపుతొ
బ్రహ్మాండమునే మింగునోటితో

ప్రపంచమ్మునే మోయగలిగిన
బలమగుకాళ్లు కలిగియున్నది
అంతటి ఘనమగు తాబేలును గని
ఆశ్చర్యములో మునిగిరందరు

ఆదికూర్మము మందరగిరిని
వాసుకి తోను మీదకు తెచ్చెను
తిరిగి - ఆశను పెంచుకువారు
బలము పుంజుకొని చిలుకసాగిరి

దేవదానవులు క్షీర సంద్రమును
తరచెడి సమయమునందు పుట్టిన
శబ్దము - ఎగసెను సత్యలోకముకు
విరించి చెవులలొ గీపెట్టినది

క్షీరపయోనిధి జలచరమ్ములవి
ఎగిసే కెరటమ్ములతో లేచెను
కొండక్రింద మరి నలిగెనుకొన్ని
కొంత కాలమటు చిలికిరి కడలిని

అంతట పుట్టెను - హాలా హలము
భుగభుగ ధ్వనులతొ భయంకరమ్ముగ
కోలాహలము కలిగించుచును -
సెగలు పొగలకు - పరుగులు తీసిరి

లక్షసూర్యుల వేడిని కలిగి
ప్రళయమప్పుడే వచ్చినట్టుగ
భీకర దావాగ్నిని రగిలించెను
కల్పాంతమునే తలపించినది

మెరిసే మంటలు - చిటపటధ్వనులు
నిప్పులు కక్కుచు నున్నది విషము
దేవదానవులపైకి వచ్చినది
భయపడి - హరిని స్మరించిరందరు

మూర్ఛిలి పడిరి కొందరచ్చుట
దొర్లసాగిరి దానిబాధకు
గరళ ప్రభావము పెరిగిపోయినది
కొండ గుహలలో వ్యాపించినది

అడవుల - పల్లెల కాల్చసాగెను
నదీనదములు యింకిపోయెను
అమితవేగమున నింగి కెగసినది
సూర్యగోళమును - తాకెను గరళము

ఊర్ధ్వలోకముల కాల్చివేయునా -
అన్నటుమంటలు ఎగసిపోయినవి
క్రిందికి దిగినది పాతాళమునకు
అధోలోకముల - తాండవమాడెను.

బ్రహ్మాండమునే హడలగొట్టెను
మారణకాండను - ఆపకున్నది
పాముమాదిరి సింహము రీతిగ
పక్షితీరుగా - చరించసాగెను

వింతచర్యలతొ విజృంభించుచు
ఎగసిపడగను దేవతలందరు
నిలబడలేక నేలను బడిరి
గ్రహముల గతులు–తప్పిపోయినవి

చుక్కలు తెగిపడి నేలరాలినవి
జీవకోటియది తల్లడిల్లినది
బ్రహ్మాదులందరు పరుగులుతీసి
కైలాసమును చేరి అచ్చట

శంభో శంభో! కాపాడుమయా!
రక్ష రక్ష – ఓ చంద్రశేఖరా!
అనుచు అరచుచు నున్న భక్తులను
భక్తవశంకరు డనుగ్రహించెను

అంబతొ కలసిన సాంబశివుడట
అభయమునొసగెను–వారందరును
తిరిగి – ప్రార్థన చేసి – త్రినేత్రుని
కృపకు పాత్రులై – పలికిరిట్టుల

"లోకమ్ములను చల్లనిచూపుల
కాపాడే ఓ కరుణామూర్తీ!
శుభముల నిచ్చే శంభుడ వీవు
సృష్టి స్థితి సంహారకర్తవు

బ్రహ్మ విష్ణు శివనామమ్ములతో
విరాజిల్లెడు వేదమూర్తివి
శక్తి శబ్దములు మేళవించిన
సదసద్రూపుడ వీవేస్వామీ!

జగత్తుకీవు అంతరాత్మవు
ప్రాణాధారము నీవే స్వామీ!
పరంజ్యోతివి పరంధాముడవు
త్రిగుణమ్ములవి త్రినేత్రమ్ములు

ఉందువందురు–లేవని అందురు
నిన్ను తెలియుట తేలికగాదు
ఆగమాలలో వెలుగు చుందువు
విషబాధలు – నీ దరికిచేరవు

నాగాభరణా! ఫాలనేత్రముతొ
అంతకాదులను కాల్చివేసితివి
వేదో పనిషత్ – దివ్య శృతులవి
నిన్నుపొగడగ చాలవు స్వామీ!

మేమెంత మరి నిను కీర్తించగ
గిరిజారమణా! గౌరిమనోహర!
గంగాధర ఓ! భూతగణాధిప!
నీకుతెలియని విషయము లేదు!

దేవదానవులు అమృతమందగ
పాలసంద్రము చిలుకుచుండగా
హాలహలమది ఉద్భవించినది
లోకనాశనము చేయుచున్నది.

ముప్పునుండి మరి కాపాడగను
తగినవాడవని పదములంటితిమి
నిఖిలలోకముల సార్వభౌముడవు
నీవేగతియిక ఓ నటరాజా!"

అటులవారు మరి ఆర్తిగ కోరగ
అర్ధనారీశ్వరు డంతట తనను
ఆశ్చర్యముగా చూచుచునున్న
అంబతొ పలికెను అర్ధవంతముగ

"జగన్నాయకుడవనుచు నమ్మిన
ఆపన్నులను కావగవలెకద!
ప్రాణరక్షణ కోరినవారిని
ప్రభువు ఆదుకొన ధర్మమేకదా!

పరోపకారము ఉత్తమ ధర్మము
పంచభూతములు పరహితకాంక్షులు
శ్రీహరికిపుడు సంతసమొదవగ
కాలకూటమును అడ్డగించవలె

లక్ష్మీపతి - తా - సంతసించిన
జగములన్నియు సంతసపడును
తీయని ఫలముగ హాలాహలమును
మ్రింగివేసెద లోకహితముకై."

ఫాలనేత్రుడు అటుల పలుకగా
పరమపావని పార్వతిదేవి
సర్వమంగళ తమ చిత్తమని
ప్రేమమీరగా పలికెనప్పుడు

వెండికొండను దిగివచ్చెను - తా -
జయ జయ ధ్వనులు మిన్నుముట్టెను
గంభీరముగా లోకరక్షకుడు
హాలాహలమును ముద్దగ చేసెను

అవలీలగను - అతిహేలగను
లీలామానుష విగ్రహుడపుడు
ఆరగించెను - కాలకూటమును
ఆశ్చర్యములో మునిగిరందరు

జాంబూనదము అన్నటు హరుడు
హాలాహలమును ఆరగించగా
ఎంత మాత్రము శ్రమ కలుగదయె
ప్రసన్నుడై పరమేశ్వరుడుండెను

సర్పహారములు చలించలేదు
బాలచంద్రుడు కలవరమందక
గంగమ్మ తను రుసరుసలాడక
నీలకంఠుని భక్తిగ చూచిరి

అంతట అడిగెను రాజవరేణ్యుడు
మౌనిసత్తమా! ఇడుములబాపగ
హాలాహలమును మ్రింగమనుచును
సురలందరును కోరగ వచ్చును -

పరమశివుడు - తా - అభయమునిచ్చి
గరళము మ్రింగిన-మ్రింగవచ్చును
కానీ - విషమటు మ్రింగుట కొరకై
పార్వతి - ఎటుల సమ్మతినిడెను?

అంతట పలికెను శుకయోగీంద్రుడు
లోకహితమును మదిలో నెంచి
పసుపు కుంకుమలు పూర్తిగనమ్మి
ప్రాణవిభుని-తా-విషము మ్రింగమనె

## అష్టమస్కంధము

స్వామివేసిన మూడు ముళ్ళవి
గట్టిగనున్నవి అనుచు పలుకుచు
శుభముల నెలవు శివుడు కనుకను
జగత్ హితముకై నిలబడ మనెను -

ఆవిధముగను అంబాపతి - తా -
ప్రళయాగ్ని సమమగు హాలాహలమును
కంఠమునందే నిలిపి వుంచుకొని
ఉదరములో - లోకాలను గాచెను

ఓ! ధరణీశా! అడిగినవన్నీ
ధారళముగా యివ్వవచ్చును
కానీ! గరళము - లోకుల కావగ
మ్రింగుట మరి-ఆ శివునికె తగును

కంఠములోని హాలహలము
క్రొత్త అందము కల్పించినది
గరళకంఠుని - నీలకంధరుని
బ్రహ్మేంద్రాదులు కీర్తన చేసిరి.

హాలహలము శివుడు గ్రహించిన
వృత్తాంతమును చదివిన వినినా -
పన్న గాగ్నుల బాధలుండవు
ఆరోగ్యము సౌభాగ్యములమరును

రాజవరేణ్యా అమృతమధనము
తిరిగి సాగినది కొంతకాలముకు
తెల్లని ధేనువు ఉద్భవించినది
మల్లెపూవులా మెరసిపోయినది

అడిగినవారి కోర్కెలుతీర్చే
కామధేనువది అపురూపమైనది
దేవమునులు తమ యజ్ఞదీక్షలకు
వీలైనదని - గైకొనినారు

పాలసంద్రము తరచుచుండగా
ధవళకాంతితో మెరిసే గుఱ్ఱము
ఉచ్చైశ్రవము - ఉద్భవించినది
బలి భూవిభుడు గైకొనె దానిని

ఆపై పుట్టెను ఐరావతమను
అమోఘమైన గజరాజమది
దానిని ఇంద్రుడు గ్రహించినాడు
నాల్గుదంతములు కలవా కరికి

ఆపై సంద్రమునందు పుట్టెను
కల్పవృక్షము - కోర్కెలు తీర్చును
ఇంద్రుని నందనవనముకు చేర్చిరి
అంతట వనము సంపద నెలవయె

సాగుచున్నది సంద్రమధనము
అంతట పుట్టిరి మెరపుతీగలుగ
సుందరాంగులగు అచ్చరకన్యలు
ఆపై పుట్టెను - చల్లని చంద్రుడు

బ్రహ్మ ఆనతిని చంద్రుడంతట
గ్రహమండలముకు సాగిపోయెను
అంతట పుట్టెను కలిమికిరాణి
రత్నాకరుని - ప్రియతమపుత్రిక

మేఘములోన మెరపు తీగ వలె
సౌందర్యమది పోత పోసినటు
పాల సంద్రపు మిసమిసలన్నీ
ఒలకపోసెడి వదనము కలిగి

పూదివల నవలావణ్యముతో
ముగ్ధమోహన మూర్తి అచ్చట
సృష్టికర్త తన నేర్పరితనముకు
సాక్ష్యమన్నటు వెలికి వచ్చెను

మంగళమూర్తికి అభిషేకముకై
అమూల్యమైన మణిపీఠమును
సురపతి ఇంద్రుడు అమర్చగాను
దేవ సుందరులు-కనక కలశముల

నిర్మల జలములు-చేత ధరించిరి -
చిగురుటాకులు తెచ్చె-వసుంధర
పాలు పెరుగులు - నేయి వెన్నలు
సమకూర్చినది కామధేనువు

పసిడి కలశముల వసంతుడంతట
పట్టుతేనెను తీసుకు వచ్చెను
మునులంతను వేదోక్తముగా
మంత్రఘోషను వినిపించగను

మంగళ ధ్వనులట ఎగిసె మేఘముల
గంధర్వగానము సుర నాట్యములు
సొగసుగ నిండగ - దిగ్గజమ్ములు
నీటిని పీల్చి - అభిషేకించెను

రమ అభిషేకము పూర్తికాగనే
విలువల కందని పట్టుచీరయది
పసిమి రంగుతో మిలమిలాడగ
సముద్రుడంతట సమర్పించెను

వరుణుడంతట తుమ్మెదలెగసెడి
వైజయంతీ మాలను - యిచ్చెను
విశ్వకర్మయిడె బంగరు గాజులు
రత్నకిరీటము ఆభరణమ్ములు

మౌక్తిక హారము శారద వేసెను
హస్తమునందు అలంకారముగ
పద్మము నొసగెను చతుర్ముఖుండు
నాగరాజు యిడె - కుండలమ్ములు

సుస్వరమ్ముగా శృతులంతటను
నుతులొనర్చెను మంగళమూర్తికి
లోకమ్ములకు అధికారిణివై
విలసిల్లమని పలికెను దిక్కులు.

క్షీరాబ్ధి సుందరి-శ్రీ మహాలక్ష్మి-తా-
ఆభరణమ్ముల అలంకారముల
సిరులొలుకుచును కనక పీఠిని
కూర్చొనియుండగ చూచిన సురలు

ఈమె వరించిన విశ్వమోహనుడు
భువనాలకు మరి అధిపతియగును
ఈమెవసించు దివ్య ధామమది
ఆనందధామమై అలరారును కద!

అష్టమస్కంధము

ఈమె దృష్టియది సాగిన చోటు
ధన, ధాన్య, ధర్మముల నెలవే యగును
చిరునగవులవి దుఃఖ హరణములు
జీవకోటికి శుభములనిడును

పురుషోత్తమునికి ఇల్లాలైనచో
నిత్యసుమంగళి నగుదు ననుచును
నారీరత్నము వరమాలను - తా -
వరదుని - కంఠము నందువేసెను

అటులా సురలు మదిలో దలచిరి
మంగళకారిణి తలచెను తాను
ఈ బ్రహ్మాండము ఆటపట్టగు
లోకములన్నీ అందు అమరినవి

పాదసేవను ప్రసాదించమని
చేరదీసి మరి కనికరించమని
అర్థాంగిగ అంగీకరించమని
మేఘశ్యాముని కోరుచున్నటు

బ్రహ్మాదులు - నా యింటమూర్తులు
భూతలమది - నా బొమ్మల పీట
సూర్య, చంద్రులు - దీపకళికలు
ఉమా,భారతులు - నా చెలికత్తెలు

పరంధాముని ప్రసన్న వదనుని
ప్రియముగ చూచెను రమాసుందరి -
సిగ్గుమొగ్గలవి జారుచుండగా
శిరసును వంచి నిలబడి యుండెను

అనుచు తలచుచు పీఠము దిగినది
మందగమనమున మెరపు తీగలా
నడచి వచ్చెను - సురల మధ్యకు
చలించి పోయిరి దేవతలచ్చట

మరి మరి చూడగ మనసు కలిగినది
మరల చూడగా సిగ్గుకలిగినది
సూటిగ రమణుని చూడగ లేక
రమణి చూపులవి మురిసిపోయినవి

సురల మధ్యలో విష్ణువొక్కడే
గంభీరముగా నిలబడి యుండెను
పురుషోత్తముని - కరుణాధాముని
కలిమికిరాణి మరిమరి చూచెను

పద్మాక్షుడు - తా - ప్రతి చూపులను
చూడగ - కొంత సిగ్గు కలిగెను
రెండు చూపులు కలిసెనొక్కపరి
దివ్యాను భూతిని పొందిరిద్దరు

అన్నివిధముల అందచందముల
సద్గుణరాశి - సరస వివేకి
కామక్రోధముల జయించినట్టి
శ్రీవత్సాంకుడు శ్రీకరుడితడు

అంతట శ్రీహరి సముద్రతనయకు
వక్షస్థలమున చోటు ఇచ్చెను
పురాణ దంపతులిద్దరి చూపులు
శుభముల నెలవై కలుముల నిడెను

జగత్తుకంతకు కళ్యాణముగా
రమకళ్యాణము జరిగినదపుడు
నారాయణుడు మూడు ముళ్ళతో
హృదయ సీమలో–బంధించె లక్ష్మిని

కౌస్తుభమ్మును కానుకగాను
రత్నాకరుడు అల్లుని కొసగెను
అచ్చరకన్నెలు నాట్యము చేసిరి
గంధర్వులంతట గానముచేసిరి

పుష్పవృష్టి కురిపించిరి సురలు
శ్రీసూక్త పఠనము – వేదపఠనము
దేవ ఋషులట భక్తిగ చేసిరి
మంగళ ఆశీర్వాదము లొసగిరి

శ్రీవత్స కౌస్తుభ వైజయంతులతో
విరాజిల్లెడు వక్షస్థలమును
విశ్వమోహిని లక్ష్మీదేవి
అధివశించెను అనురాగముతో

చల్లని చూపుల నవదంపతులు
భోగభాగ్యములు సుఖ, సౌఖ్యములు
సురలందరకు ప్రసాదించిరి
దానవులకది లభించలేదు.

సముద్రమథనము కొనసాగినది
అమృతమ్ముకై దీక్షవహించిరి
అంతట – పాల సంద్రమునుండి
ఉద్భవించెనొక దివ్యపురుషుడు

నిడుపగు చేతుల పూలదండలతొ
పట్టువస్త్రముల అలంకారముల
విశాల వక్షము నవయౌవ్వనమున
రత్నకుండలము లమరి యుండగా

సత్వతేజమున వెలుగులు నింపుచు
అచ్యుతునంశతొ మహాపురుషుడు
ధన్వంతరి – అట దర్శనమిడెను
ఆయుర్వేదము – ఆతనిసొమ్మగు

సురవైద్యునిగ ఖ్యాతిపొందెను
ధన్వంతరి తన చేతులయందు
అమృత కలశము ధరించినాడు
దేవదానవులు పరవశించిరి

రాక్షసులంతట బలమునుచూపి
సురలమీద పడి అమృతకలశము
హరించినారు గంతులేయుచు
చావును గెలిచెడి ఔషధమనిరి

అంతట సురలు దిక్కుతోచక
శ్రీహరి పదముల ప్రార్థన చేసిరి
అభయమునిచ్చెను ఆర్తరక్షకుడు
అమృతమ్ము నందించెదననెను

రాక్షసులందరు ఆనందముతో
అమృతపానము చేతమురండని
ఒకరినొకరు మరి పిలచుకొనుచును
కోలాహలములొ మునిగిపోయిరి

అంతట శ్రీహరి మెరపుతీగలా
మెరసిపోయెడి మంగళమూర్తిగ
మోహిని అవతారమ్ము ధరించెను
అసురుల మనసులు చలించి పోయెను

నవ్వుల పువ్వులు - రువ్వుచు సుందరి
విలాసాలను ఒలకబోయుచు
ఓరచూపులను-శరములు వేయుచు
వింత చేష్టలతొ - వెఱ్ఱెత్తించెను

ప్రతిరక్కసుడు-తననే-సుందరి
అనుగ్రహించెను-అని తలంచుచు
మంత్రముగ్ధులై నిలచిపోయిరి
మందగమనను మరిమరి చూచిరి

లావణ్యమది పోతగపోసిన
సుమసుందరిని పలుకరించిరి
పరవశించిన అసురులు-జవ్వని
అందచందముల నభివర్ణించిరి

నెలతా! నీవు వన సుందరివా!
అందమునందు అందవెవరికిని
విరించి-చతురత నంతయు నింపి
ఒంపుసొంపుల - నిను సృష్టించెను

కశ్యపముని సంతానము మేము
ఈదేవతలు - మాసోదరులు
మాశ్రమ ఫలితము అమృతమ్మిది
మాలోమాకు భేదమువచ్చెను

మా తగవును నువు తీర్చగవలెను
మాకందరకు సమముగ పంచుము."
అనగానంతట నవయౌవ్వనవతి
ఓరచూపుల పలికెనసురులతొ

"రూపవతినని నమ్మినచో మరి
వమ్ముచేయను - మీనమ్మకము
అయినా - విజ్ఞులు అందగత్తెను
నమ్మరు కాదా! మీకుతెలియును

చంచలాంగులు - చపలచిత్తులు
అనుచు నందరు - పలుకుచుందురు
సాయముకోరిరి - నిస్సంశయముగ
పంచిపెట్టెదను - అమృతమ్మును"

అంతట అసురులు అమృతకలశము
ఆజవ్వనికి అందజేసిరి
అలవోకగ ఆ దివ్యసుందరి
అందించెను తన చూపులతూపులు

సుస్నాతులయి రండనిచెప్పగ -
స్నానసంధ్యలు పూర్తిచేసిరి
అగ్నిహోత్రము విధులను చేసిరి
దానదక్షిణలు ఒసగిరి వారు

దర్భాసనములు సిద్ధపరచుకొని
బారులు తీరి దేవాసురులు
అమృతమ్మును ఆరగించుటకు
ఆతృతగా నట కూర్చొనియుండిరి

మోహినిగాంచెను వారందరిని
అసురులకమృత మందజేసిన -
పాముకు - పాలు పోసినట్లగు
అని తలపోసి పలికెనప్పుడు

మీలో-సురలను-అసురుల - నేను
పోల్చగలేను కావున మీరు
రెండు వరసలలొ విడిగా కూర్చొన
నాపని తేలిక అగును అన్నది

అంతటవారు అటులకూర్చొన
అమృత పంపక మంతట సాగెను -
ముందుగ సురలకు పంచసాగెను
ఆత్రముగా వారందరు త్రాగిరి

అసురులలో మరి అలజడి రేగగ
వరుస ముగించుకు మీదరికొత్తును
అంతటి వరకు తాళుడు అనుచు
చిరునవ్వుతొ మరి మత్తెక్కించెను

వారిలొవారు రాక్షసులంతట
మనకుకూడ మరి పంచును వినుడు -
మనవంతు మరి వచ్చును యిపుడు
అటుల తలంచి మిన్నకుండిరి

అమితమైన అనురాగము చూపెను
అనుమానించిన అసలుకు మోసము
వేచియుందమని అసురులు తలచిరి
అమృతపానము సురలకు దక్కెను

అంతటిలోన రాహువు మెల్లగ
సురలపంక్తిలో కూర్చొనినాడు
అమృతమ్మును పంచెను మోహిని
ఆరగించెను విషయము తెలియక

అదిగమనించి సూర్యచంద్రులు
సైగచేయగా దివ్యసుందరి
చక్రప్రయోగము చేసి రాహువు
శిరమును తృంచెను అవలీలగను

అమృతపానము చేసినందులకు
రాహువుశిరము దైవత్వముతో
గ్రహములలో మరి స్థానమునందెను
రవిచంద్రులపై ఆగ్రహించెను

అందువలననే - పర్వదినముల
సూర్యచంద్రులను - రాహువు తాను
బాధించుచుండెను - ఓమహరాజా!
అసురులకంతట నిజముతెలిసెను

రాక్షసులందరు తేరిచూడగా
వారిమధ్యలో మోహిని బదులుగ
విష్ణువునిలబడి యుండెను అచ్చట -
అసురులు అమృతమందకపోయిరి

మహావిష్ణువును చూచి దేవతలు
ఆనందముతో పొంగి పోయిరి
శ్రీహరి పదములు నమ్మినందుకు
అమృతపానము చేసిరి సురలు

హరిని తలచని అసురులందరు
శ్రమకు ఫలితము నందకపోయిరి
చక్రధారిని శరణుకోరినచొ –
సర్వశుభములు సమకూర్చునుకద!

అమృతబిందువు అందని అసురులు
యుద్ధమునకు సన్నద్ధులాయిరి
అమృతపానము చేసిన సురలు
హరిభక్తులు – ఎదిరించి నిలచిరి

ప్రచండ యుద్ధము సాగుచుండెను
బలి – ఇంద్రులట ఘనముగ పోరిరి
అంతట బలి తన మాయావిద్యతొ
దేవతలను నిర్వీర్యుల చేసెను

బాధకులోనై దేవతలంతట
భక్తవత్సలుడు హరిని తలచిరి
వెంటనె విష్ణువు ఖగపతిపైన
అచటకు రాగా మాయ చెదరెను

హరి సాయము మరి అందిన తోడనె
విజృంభించిరి దేవతలప్పుడు
కాలనేమి అను అసురుడంతట
శూలము విసిరెను గరుడుని పైకి

హరి ఆ శూలము ఒడుపుగగైకొని
తిరిగి విసరగా అసురుడు మడసెను –
పన్నగ శయనుడు చక్రము విడచి
పేరు మోసిన అసురుల చంపెను

యుద్ధభూమిలో – గుట్టలు గుట్టలు
అసురుల – కళేబరమ్ములు నిండెను
వజ్రాయుధముతొ సురనాయకుడు
విజృంభించెను అసురులపైకి

సముచి – అనెడి ఒక రక్కసుడంతట
ఆయుధమ్మునకు లొంగక పోగా
ఆకాశవాణి మాటలు వినిన
ఇంద్రుడంతట యోచన చేసి

సంద్రపు నురుగును వజ్రాయుధముకు
పూసి – చంపెను సముచి రక్కసుని
అసంఖ్యాకముగ అసురులు మడసిరి
అంతట నారదుడటకు వచ్చెను.

రాక్షసబలము తగ్గిపోయినది
విడిచి పెట్టుడు మిగిలినవారిని
మీ ముందర ఆదానవులాగరు
జీవహింసనిక ఆపుచేయమని

బ్రహ్మదేవుని అభిమతమనుచు
విషయము చెప్పి – తిరిగి సాగెను.
యుద్ధమునాపి దేవతలందరు
నాకలోకము చేరుకొనగను

పడమటి దిక్కున గిరిశిఖరమునకు
చేరిరి మిగిలిన అసురులందరు
అంగ వికలురను హత రాక్షసులను
మృతసంజీవిని విద్యతొ నంత

అసుర గురుండు శుక్రాచార్యుడు
బ్రతికించెను మరి - బాగు చేసెను
ఓటమినందిన బలి భూవిభుడు
ఆత్మజ్ఞానము కలిగియుండగ

ఊరటపొందెను అని శుకమహర్షి
రాజుకు చెప్పి తిరిగి మొదలిడె
వెండికొండ పై చంద్రశేఖరుడు
శ్రీహరిలీలలు తెలిసినవాడై

జగన్మోహిని అవతారముతో
జగత్తునే మైమరిపించి మరి
అతి తెలివిగ నట అసురులందరిని
మోసగించిన విషయము తెలిసి

నీలకంఠుడు అంబతొ కలిసి
వైకుంఠమునకు చేరి అచ్చట
విష్ణుదేవుని పూజించి - తానును
సత్కారములను అందిన పిదప

పరవశమ్మున స్తోత్రము చేసెను
పతితపావనుని పొగడెను తీయగ
"ఓ జగదీశా! విశ్వవంద్యుడవు
కాలమంతయు నీరూపమయా!

త్రిగుణమ్ములు నీ అధీనమో హరి!
ఆది అంతములు నీవే కాదా!
పూర్ణదేహివి అక్షరుడవు నువు
కైవల్యపథమును చేర్చెదవీవు

సత్వము ధర్మము ఈశ్వరుడవని
శక్తివి నీవని అవ్యయుడవని
ఆత్మయె నీవని అనేకవిధముల
వర్ణించెదరు ఓ లక్ష్మీపతి!

నాకు తెలిసిన విషయము ఇదియే
అన్నీనీవే - అంతట నీవే
ఆభరణమ్ములు వేరైనా మరి
బంగారమది ఒకటేకాదా!

మరీచి మున్నగు ఋషులు సైతము
నీ విలాసము తెలియగ లేరు
అంత ఎందుకు ఓ పరమేశా!
నేను కూడ మరి తెలియగ లేను

దేవాసురులకు నీ విలాసము
తెలియశక్యమా ఓ నారాయణ!
ఇచ్ఛామాత్రము సృష్టి చేసెదవు
బంధమోక్షములు కల్పించెదవు

పురుషాకృతితో - పరంధామ నువు
జరిపిన లీలలు జగద్విదితమే
కానీ నీవు స్త్రీరూపముతో
అసురుల ముగ్ధుల చేసినావట!

భువన మోహినిగ అవతరించిన
జగతిని మైమరపింపచేసిన
మంగళ రూపము దర్శించగను
మదిలో కోరిక మహానుభావా!"

అర్ధనారీశ్వర! అప్పటిరూపము
భువనమోహినీ రూపము చూడగ
నిన్నునీవు మరి మరచి అడిగితివి
మంచిది అనుచు అదృశ్యమయ్యెను

శ్రీహరి ఏడీ – అనుచు శంకరుడు
నలుదిక్కులకు చూచుచుండగా
అంతదవ్వులో ఒకప్రదేశమున
బంతి ఆడుచు ఇంతి కనబడెను

అందమైన ఒక పూలతోటలో
చంద్రకాంత శిలావేదిక ప్రక్కన
పచ్చికనేలలొ – చక్కని సుందరి
బంతి ఆటను ఆడుచున్నది

ఆటలొ పయ్యెద జారుచున్నది
పూలదండలు పారిజాతములు
కొప్పున నిలచి శోభలీనగా
తుమ్మెదలచ్చట చేరుచున్నవి

సుమలావణ్యము కలిగియున్నది
సుమలతలా సుకుమారి యున్నది
చెవులకమ్మలు తళతళమెరసి
చెక్కిళ్ళకు మరి సొగసులుదిద్దెను

బెదురుచూపులు నేర్పెను హరిణికి
నడకనేర్పెను రాయంచకును –
అన్నటులున్న – ఆ రమణీమణి
ముంగురులాడెను ఫాలభాగమున

జారిన బంతిని అందుకొనుటకై
జారెడి పయ్యెద సర్దుకొనుచును
కదలాడే ఆ మెరుపు తీగ – తను
ఓరచూపుతో – హరుని చూచెను

రెప్పలార్పక చూచుచునున్న
గౌరీపతికా చూపు తగిలినది
చలించిపోయెను మరిమరి చూచెను
మన్మధుని మరి ఆహ్వానించెను

"ఇంతటి చక్కని ఇంతిని బ్రహ్మ
చతురతతో మరి తీర్చిదిద్దెను
ఈమెను చేకొను వాడు ధన్యుడు
అంతటి భాగ్యము నాకులభించున!

అనుచు తలచెను గంగాధరుడు
అంతటిలోన ఆ సుకుమారి
బంతినందుకొను ప్రయత్నమ్ములో
తరువుచాటుకు పరుగెత్తగను

ఆరాటముతో నిండెను శివుడు
తిరిగి జవ్వని రాయంచలతో
విలాసమ్ముగా నడచుచు నగపడె
కన్నులపండుగ అయినది శివునకు

ప్రక్కనున్న వారందర మరచెను
ఆమెచూపుకై ఆత్రుతపడెను
అంతటిలోన బంతి వచ్చి – అట
శివుని దగ్గర పడగా – సుందరి

పరుగునవచ్చి బంతికోసమై
వంగెను - పయ్యెద జారిపడినది
ఆమెచేతులవి శివుని చేతులకు
తగిలి - శివునకు శివమెత్తినట్లయె

సుందరి-పరుగున ముందుకుసాగెను
ఆగుమాగుమని శివుడు పరుగిడె
కొంతసేపట - పరుగులెత్తిరి
దొరకిపోయినది శివునకు - సుందరి

బిగికౌగిలిలో బంధించెను శివుడు
తిరిగి సుందరి తప్పించుకొని
పరుగుతీయగా నీలకంఠుడు
ఆమెవెంబడి పరుగుతీసెను

కొండలు కోనలు తోటలు తోపులు
నదీనదములు దాటుచువారు
పరుగులెత్తిరి చివరకు శివునకు
ఒకప్రదేశమున దొరకెను సుందరి

బిగి కౌగిలిలో శివునకు అంతట
ఆత్మజ్ఞానము కలిగెనొక్కపరి
దృశ్యముచెదిరి తాను మాత్రము
పూర్వపుచోటికి వచ్చిచేరెను

ముసిముసినవ్వుల శ్రీహరి నిలచెను
సిగ్గుతో - తల వంచెను శివుడు
అంతట పలికెను రమాకాంతుడు
ముక్కంటీ! నువు సమర్థుడవయా!

నీవు తప్పమరి నాదుమాయను
తెలిసినవారు లేనేలేరు
అనుచు హరి అటు ప్రశంసించెను
హరుడు చేరెను కైలాసమునకు

ఓ మహరాజా! ఆవిధముగను
క్షీరసాగర మథనము జరిగెను
ఆసమయములో మునిగిన గిరిని
పైకి ఎత్తెను నారాయణుడు

ఈ వృత్తాంతము చదివిన వినినా
సంసార సంద్రమున మునిగినవారు
హరికృపతోమరి ఒడ్డునకెక్కి
సర్వసుఖములు శుభములందెదరు

జగన్మోహినిగ సురులకు మేలు
చేసిన - శ్రీహరి కివె నమస్సులని
శుకుడు పలికి - ఆపై గాథను
ఆరంభించెను వివరముగాను

వైవస్వతమను వేదవవాడు
శ్రాద్ధదేవుడు ఆ మనువగును
అతనికి తనయులు పదిమందయ్యా!
ఇక్ష్వాకు - నభగ - ధృష్టుడు - శర్యాతి

అరిష్యంతుడు నాభాగుడును
దిష్ట కరూశ పృషద్ధుడు మరి
వసుమంతుడు అను వారందరును
రాజ్యపాలన చేసిరి రాజా!

పురందరుండు అప్పటి ఇంద్రుడు
ఆదిత్య-మరుదశ్వి వసురుద్రులు అను
దేవతలామన్వంతరమున నుండిరి
అప్పటి సప్తఋషులను చెప్పెద

గౌతమ-కశ్యప-అత్రి - విశ్వామిత్ర
జమదగ్ని భరద్వాజ వశిష్ఠులను
సప్తఋషులు-విను ఓ మహరాజా
విష్ణువు పుట్టెను వామనమూర్తిగ

కశ్యపమునికి అదితి గర్భమున
వామనుడై శ్రీహరి జన్మించెను
ఇంద్రునకాతడు సోదరుడయ్యెను
అంతటివరకు చెప్పితి రాజా!

ఆపై మన్వంతరమది విను రాజా!
ఎనిమిది అగును వివరము లివ్వి
ఆ మన్వంతరముల శ్రీహరి లీలలు
వినిపించెదను ఓ మహరాజా!

విశ్వకర్మకు తనయలిద్దరూ
సంజ్ఞ - ఛాయలు-సూర్యుని భార్యలు -
మూడవకూతురు బడబయు కూడా
సూర్యదేవుని ఇల్లాలైనది

సంజ్ఞయందున-యముడు-యమున
శ్రాద్ధదేవుడు పుట్టిరి రాజా!
ఛాయతనయులు తపతి - సావర్ణి
శనైశ్చరుండు - అనువారయ్యా

తపతి భర్త మరి సవరుణుండగును
బడబ సంతతి అశ్వినిసురలు -
సవర్ణి అగునయా - అష్టమ మనువు
అచంచలదీక్షతొ తపములొనుండెను

సిరిసంపదల ఆశపెరుగును
పోరు కలిగి మరి జగమునష్టపడు
ఆసమయములో ధర్మస్థాపనకు
ఒకమహనీయుడు మనువై కాచును

సూర్య సావర్ణి మన్వంతరమ్మున
నిర్మోహ విరజ స్కాద్యులాతని
తనయులు రాజులు మరి దేవతలు
సుతపుడు విరజుడు అమృత ప్రభువులు

గాలవ దీప్తిమంత - పరశురాములు
అశ్వత్థామ కృపాచార్యుడు
నాజనకుడగు వ్యాసమహర్షి
ఋష్యశృంగుడు ఋషులగుదురయా!

విరోచను తనయుడు బలి-ఇంద్రుడగు
బలి తన బలముతొ స్వర్గము జయింప
వామనుడైన శ్రీహరి తిరిగి
ముల్లోకములను ఆక్రమించెను

అంతట బలి - తా - సుతలలోకమున
ఆనందముగా గడుపుచుండెను
కొంతకాలముకు బలి భూవిభుడు
దేవలోకపు సార్వభౌముడగు

విష్ణువు స్వయముగ - ఇంద్రుని తాను
పదవీచ్యుతుని చేసి అంతట
బలికి స్వయముగ ఇంద్రపదవిని
అందజేయును విను మహారాజా!

తొమ్మిదవ మనువు వరుణుని సుతుడు
దక్షసావర్ణి ఆతని పేరు
ధృతకేతు దీప్తకేతులాతని తనయులు
రాజ్యపాలనము చేసెదరయ్యా

పర మరీచి గర్గాదులు సురలు
అద్భుతుడను వాడింద్రుడు అగును
ద్యుతిమంతుడాదిగా ఋషులగుదురయా!
హరిజన్మించి ఇడుములబాపును

ఆయుష్మంతుని యిల్లాలైన
అంబుధానకు తనయునిగాను
అంబుజోదరుడు "అద్భుతు" పేరున
అవతరించి - తా - రక్షణచేయును

పదియవ మనువు బ్రహ్మసావర్ణి
ఉపశ్లోకుని కుమారుడతడు
భూరిషేణాదులు తనయులు రాజులు
హవిష్మంతాదులు మునులగుదురయా!

శంభుడు అను వాడింద్రుడు అగును
విబుద్ధాదులు దేవతలగుదురు
విశ్వసృజునకు విషూచియందు
విష్వక్సేనుడై హరి పుట్టునయా!

ఆపై మనువు ధర్మసావర్ణి
పదునొకండవ మనువు ఆతడు
సత్యధర్మాదులు పదిమంది తనయులు
రాజులగుదురు పరిపాలింతురు

విహంగమ కామగమన
నిర్వాణచరులు దేవతలగుదురు
వైధృతుడను వాడింద్రుడు అగును
అరుణాదులు మరి ఋషులగుదురయా!

సూర్య సూనుడుగ శ్రీహరి పుట్టి
ధర్మసేతువను పేరున బరగుచు
వైధృతుడై బలవిక్రమమ్ముల
లోకమ్ములను పరిపాలించును

భద్రసావర్ణి - పన్నెండవ మనువు
దేవ - ఉపదేవ - దేవజ్యేష్ఠాదులు
ఆతని తనయులు రాజులగుదురు
ఋతధాముండు ఇంద్రుడు అగును

హరితాదులు మరి దేవతలగుదురు
తపోమూర్త్యాదులు ఋషులగుదురయా!
సత్యతపస్సుకు - సూనృతయందు
స్వధామునిగా - శ్రీహరిపుట్టును

పదమూడవ మనువు దేవసావర్ణి
చిత్రసేనాదులు - తనయులు రాజులు
సుకర్మా సుత్రాములాదిగా సురలు
దివస్పతి యను వాడింద్రుడు అగును

నిర్మోహాదులు ఋషులగుదురయా!
బృహతీ–దేవహోత్రుల కంతట–శ్రీహరి
యోగవిభుడనే – పేరున పుట్టి
ఇంద్రుని సఖుడై – జగములనేలును

సత్రాయణునకు – వితానయందు
బృహద్భానుని – పేరున శ్రీహరి
ఉద్భవించి – మరి యజ్ఞయాగముల
వర్ధిలజేసి – రక్షణచేయును

రాజవరేణ్యా! ఈపదునాల్గురును
మనువులు–భూమిని పరిపాలింతురు
అటుల యుగములు వేయిగడువగను
బ్రహ్మదేవునికి పగలు ఒక్కటగు

శుకుడటు చెప్పగ – రాజు అడిగెను
ఓ మునిసత్తమ! మనువుల నెవరు
నియమించెదరు–హరి తానెందుకు
ఆ మన్వంతరముల ఉద్భవించును

అంతట చెప్పెను శుకయోగీంద్రుడు
మనుజరూపుడగు విష్ణునానతితో
మనువులు–మునులు–ఇంద్రుడు వత్తురు
యుగములయందు పరిపాలింతురు

నాలుగుయుగములు పూర్తికాగనే
కాలగర్భమున కలియు వేదములు
తపోబలముచే – మునులు వాటిని
తెలుసుకొందురు ఉద్ధరింతురు

నాల్గుపాదముల ధర్మమునడచును
హరి ఆజ్ఞతొ మరి మనువు లేర్పడి
వారితనయులు రాజులయ్యెదరు
భూమిని చక్కగ పరిపాలింతురు

యోగ్యులను మరి శ్రీవత్సాంకుడు
మనువులుగా నియమించును రాజా!
హరి సంకల్పమువల్ల లోకములు
ఏర్పడుచుండును రాజవరేణ్యా!

ఆయా యుగముల పద్మనాభుడు
యోగీంద్రుడై – తా – యోగవిద్యను
విస్తరింపగా చేయును రాజా!
మౌనిరూపున కర్మను నేర్పును

ప్రజాపతిగను సృష్టిచేయును
ఇంద్రునిగా మరి దైత్యుల దునుమును
సిద్ధునిగా – బోధించు జ్ఞానమును
కాలరూపియై – లయకారకుడగు

పెక్కురూపములు నామధేయముల
విరాజిల్లును విశ్వవంద్యుడు
ఆత్మద్రష్టనకు దర్శనమిడును
కర్మలొ చిక్కినవారి కందడు

భూత, భవిష్య, ద్వర్తమానముల
అనేక విధముల వెలుగుచుండును
అనేకవృత్తులు–కల్పించి పెంచును
అవి క్షరమైనను – తా – నక్షరుడు

శుకయోగీంద్రుడు అటులచెప్పగా
రాజు అడిగెను ఓ పుణ్యాత్మా!
రాక్షస రాజగు బలిని శ్రీహరి
మూడడుగులు - తా - యాచించెగద

జగన్నాథుడు - చేయిజాపెను -
దానమిచ్చిన రాజును - తాను
పాతాళములో బంధించెను గద!
అవృత్తాంతము విశదపరచుడనె.

॥శ్రీ కృష్ణచరితము॥



# 4 వామనచరిత్ర

శుకయోగీంద్రుడు ఆరంభించెను
ఓ మహరాజా! సురలందరును
అమృతపానము చేయుటవలన
బలసంపన్నులు అయ్యిరంతట

బలి భూవిభుని - తాత - ప్రహ్లాదుడు
ఎన్నడు వాడని - అమోఘమైన
పద్మమాలను - ప్రీతిగ నిచ్చెను
చంద్రునిబోలిన తెల్లని శంఖము

ఇంద్రుని వలన ఓటమి చూసిన
బలి - తల దించెను అవమానముతో
రాక్షస గురువు శుక్రాచార్యుని
ఆశ్రయించెను సేవలు చేసెను

దివ్యశంఖమును - అసురగురుండు
అనుగ్రహించి - రాజుకు యిచ్చెను
దివ్యవస్తువులు అందిన రాజు
అతి బలవంతుడు అయ్యెను రాజా!

శుక్రుని మనస్సు ప్రసన్నమైనది
బలి బాధను - తా - గ్రహించినాడు
విశ్వజిత్ యాగము-చేయించెదనని
శపథము చేసెను-అసురగురుండు

దానధర్మములు - బలి భూవిభుడు
దండిగ చేసి విప్రుల చేత
ఆశీస్సులను అందెను - భక్తిగ
తన కులదేవత పూజలు చేసెను

కనక రథమ్ము - దివ్యాశ్వములు
సింహధ్వజము - అమోఘ ధనుస్సు
అమ్ముల పొదులు - అభేద్య కవచము
హోమాగ్ని నుండి బయలు వెడలెను

తాత ప్రహ్లాదుని ఆశీస్సులు గొని
బలిష్టులైన రాక్షస గణముతొ
బలిసాగెను తన జైత్రయాత్రకు
అడ్డమెరుగరా - రాక్షసయోధులు

స్వర్గలోకమును భూమికి దింపునో!
భూమిని స్వర్గము పైకి త్రోయునో!
అన్నటులున్నది యుద్ధ సన్నాహము
నింగిని మ్రింగునో - అనిపించినది

ఇంద్రుని పైన - పగ సాధించుట
పరమధ్యేయము బలి భూవిభునకు
కొంత ప్రయాణము సాగిన పిదప
నాకపురికి మరి చేరెను సేనలు

అమరధామము సుఖముల నిలయము
అనఘులు అచ్చట విడిది చేతురు
రోగబాధలు ఉండవు అచ్చట
దుఃఖములన్నవి తెలియవు వారికి

త్రిభువన పావని - గంగాభవాని
పరుగులెత్తెడి పుణ్యభూమి అది
సుమగంధముతో పవనుడు తాను
పరవశమ్మును కలుగ జేయును

ఇంద్రవైభవము కనులకు కట్టును
కలిమికి నిలయము దివ్యధామము
యజ్ఞము చేసిన పుణ్యమూర్తులు
సాదర ఆహ్వానములందెదరు

సోమయాజులకు సుర సుందరులు
పూలబాటను వేసిరి - నడువగ
పోటీపడి ఆ పుణ్యపురుషులకు
గౌరవమ్మునందించు చుండిరి

వీర మరణము పొందిన వీరులు
సూర్యమండలము సాగుచుండిరి
సుగంధ పరిమళ శోభలునిండి
అందములకు కాణాచియైనది

సంతోషముగా ఐరావతము
చరించుచుండగ ఒక్కసారిగా
సింహగర్జన విని కలవరపడె
ఉచ్ఛైశ్రవము పరుగులెత్తెను

కల్పవృక్షము దిగులు పడినది
కామధేనువు కలవర పడినది
దేవ సభయది సుడులు తిరిగెను
సురల గుండెలు దద్దరిల్లెను

అంతటిలోన రాక్షస సైన్యము
శంఖములూదిరి భయంకరమ్ముగ
సురకాంతల గర్భస్థశిశువులు
విలవిలలాడిరి ఆసవ్వడికి.

వార్తాహరులు సురనాయకునకు
బలి దండెత్తుట తెలియబరచిరి
వెంటనె ఇంద్రుడు రక్షణపెంచి
బృహస్పతినట ఆహ్వానించెను

సురగురునికి - తా - వందన ముంచి
పలికెనంతట దేవనాథుడు
స్వామీ సర్వము తెలియును మీకు
బలిని గెలువగ అసాధ్యమైనది

ఎవరో ఆతని అండనిలచిరి
అందులకింతటి ధైర్యము చేసెను
విరించి సైతము నిలబడలేదని
గట్టిగ మనసుకు తోచుచున్నది

ఎదురు నిలువగ అసాధ్యమైనది
స్వయముగ రాజ్యము నివ్వగలేను
దిక్కుతోచని దీనస్థితి యిది
దయగొని మార్గము సూచించుడనె -

అంతట పలికెను దేవగురుండు
ఓ మహరాజా! బలి భూవిభుడు
శుక్రాచార్యుని అనుగ్రహమ్మున
అజేయమైన వానిగ నిలచెను

ఈ సమయములో - బలిని గెలువగ
శివ కేశవులే సమర్థులయ్యా!
నీవు చాలవు - అని తెలుసుకొని
సురలోకమును - విడిచి పొమ్మిక!

పగతుర-బలముతొ ఎదిరించినచో
ఎదురుతిరగక - అదను చూచుకొని
బలహీనునిగ - వాడైనప్పుడు
ఘోరుజరుపుట - నా అభిమతము

బ్రాహ్మణోత్తముల ఆశీస్సులతో
అమోఘబలుడుగ అయ్యెను ఆ బలి
బ్రాహ్మణద్వేషిగ - త్వరలోమారును
అప్పుడు నీ కవశాశము చిక్కును

అంతటివరకూ ఆగవలెనయా!
బలిమాటసలు తలంచవద్దు
శత్రువు - బలములొ నిన్నుమించెను
కావున యుద్ధము జరుపుట తగదు!

యుద్ధములో మరి గెలుపు నందుటో
అసువులు బాయుటొ జరుగునుకాదా!
నీకా మృత్యువు భయములేదు - యిక
పలాయనమ్మె - సరియగు మార్గము

గురువుమాటపై గురిని నిలపెను
ఇంద్రుడు మిగిలిన సురలందరితో
ఇంద్రలోకమును వదలిపోయెను
కామరూపులు వదలిరి నాకము

సురలోకములో అడుగుబెట్టిన
బలికచ్చట మరి ఎదురే లేదు
పారిపోయిన సురలను తలచి
బ్రతికి పోయిరని - నవ్వెను తనలో!

మూడులోకముల పాలకుడయ్యెను
విశ్వవిజేత అయ్యెను ఆ బలి
భార్గవుడంతట - బలిచే నచట
నూరు యజ్ఞములు చేయించెనయా!

బలిపాలనలో యిడుముల నెరుగరు
సుఖభోగముల తేలియాడిరి
యాచకులచ్చట లేనేలేరు
నిత్యపూజలు జరిగెను గుడులలొ

సకాలవర్షము లవ్వికురవగా
విరగ పండిన భూలక్ష్మి తను
వసుంధర - అన్న - పేరును
నిలబెట్టుకొని ధన్యతనందెను

బలిపాలన అటు సాగుచుండగా
అదితికి తెలిసెను తనయుల బాధలు
దేవతలట్టుల ఇడుమలనుండగ
తల్లి మనస్సది తల్లడిల్లినది

ఒకదినమున తన భర్తగారగు
కశ్యపునికి - తా - పూజలు జరిపి
దిగులునిండిన ముఖముతొ నుండగ
ఊరడించి మరి - పలికెను భర్త

"పూజ్యురాల! నువు చింతలొనుంటివి
దైవకార్యములు సాగుచున్నవా!
అతిథిపూజలు చేయుచుంటివా!
ధర్మపథమున తనయులుండిర

అతిథికి - వున్నది పంచియివ్వవలె
అటుగాకున్న సంపద వున్నను
ఏమియు లేని - పేదగ లెక్కిడు
కలిగిన దానిని - కాదన కూడదు

సర్వవ్యాపకుడు విష్ణుమూర్తిగద!
శ్రీహరి ముఖమే అగ్ని - బ్రాహ్మణులు
వారిరువురును - తృప్తినందిన
పరిపూర్ణముగా హరి సంతసపడు"

అనుచు భర్త తను వివరములడుగగ
గద్గదస్వరమున పలికెను అదితి
"దితి" తనయులు బలగర్వమునిండి
నా తనయులను వెడలగొట్టిరి

దిక్కులేనివారైరి కొడుకులు
తోడబుట్టిన చెల్లెలైనను
వారించకను మిన్నకున్నది
ఆమెదృష్టిలో చులకనైతిని

వారిబాధలు తలచుకొన్నచో
నిద్రపట్టదు - తిన మనసవదు
పెద్దకుమారుడు ఇంద్రుడు తాను
కారడవులలో తిరుగుచుండును

అతి సుకుమారి పెద్దకోడలు
శచి - ఏ పంచన గడపుచున్నదో!
ముద్దుమనుమలు జయంతాదులు
చెట్టుపుట్టలలొ తిరుగుచుందురు

అమరపురియగు ఆ అమరావతి
అసురలమయమై - కళపోయినది
యజ్ఞభాగములు అందనీయక
అపహరించుచు నుండిరి అసురులు

మహానుభావా! ఆదుకొనుమయా!
దుష్టశిక్షణ జరిపించవయా!
సమర్థుడవు నువు - విధాత సముడవు
రాజ్యము సురలకు ఇప్పించవయా!"

భార్యవేదన గ్రహించినాడు
భవిష్యత్తును తెలిసినవాడగు
కశ్యపుడంతట - ఆలితో పలికెను
"మమకారములు శాశ్వతమ్ములా?

తనయుడెవ్వడు తండ్రి ఎవ్వడు
చచ్చుటన్నది జీవికి ఉన్నద?
శ్రీహరిమాయ జగత్తుఅంతయు
సంసారలంపటము-అందుభాగమే

నిశ్చల భక్తితొ హరిని కొలచిన
సర్వము నీకు నెరవేరుననె"
స్వామీ! అటులే ఆచరించెద
విధానమెట్లు - మంత్రముఏది -

అనుచు అడిగిన దితి కంతటను
"జలభక్షణ" మను వ్రతమును చెప్పెను
మంత్రము నుపదేశించి అంతట
విధివిధానము వివరించగను

ఫాల్గుణమాసపు శుక్లపక్షమున
పాడ్యమినుండి పదిరెండురోజులు
శ్రీహరి పరముగ వ్రతమెనరించెను
హరిధ్యానమున లగ్నమయ్యెను

సంతసించిన లక్ష్మీపతి - తా -
శంఖచక్రములు పీతాంబరముతొ
కౌస్తుభమణితో కుండలాలతో
వనమాలతొ నట దర్శనమిడెను

ఆనందాబ్ధిని మునిగిన అదితి
పరవశమ్మున స్తుతించె నప్పుడు
"ఆశ్రితపాలా! కారుణ్యాలయ
యజ్ఞస్వరూపా! విశ్వనియంతా!

అభయంకర - ఓ అరిభయంకరా!
నా ఆవేదనది - నీకుతెలియదా!
అసురుల బాధల నా సంతానము
కడుయిడుమలలో కుములుచుండిరి

కంటికి నిదురే లేదు నమ్ముము
కడుపు కోతను తెలుపగలేను"
అనగా శ్రీహరి - ఊరడించెను
కష్టములన్నీ తీరును అనెను

"అమ్మా! నీవు అతితొందరలో
కొడుకులందరితొ కోడళ్ళతొ మరి
సుఖపడు కాలము వచ్చును నిజము
అసురులు దుఃఖిలు సమయము వచ్చును

దేవమాత! విను - నీగర్భమున
తనయునిగా నే నుద్భవించెద -
తగిన సమయమున రాక్షసరాజును
అణగద్రొక్కెద సురల మేలుకై

ఓరిమి కొంత కలిగియుండుము
సురలకు శుభములు కలుగజేతును"
అంతటిలోన - తెలివి కలిగినది
అంతా కలయని భ్రమలోపడినది

అయినా శ్రీహరి దివ్యవాక్కులు
వీనులవిందుగ వినబడుచున్నవి
ఆనందధామమా దివ్యవదనము
కన్నులనుండి తొలగకున్నది

అంతా చెప్పెను – కశ్యపబ్రహ్మకు
ఆనందములో మునిగితేలెను
లక్ష్మిని కన్న రత్నాకరుని
మించిన కీర్తి – తనకులభించును

సాక్షాత్–శ్రీహరి తనయుడు అగును
విష్ణు జనకునిగ యశస్సుకలుగును
ఆనందముగా రోజులు గడపుచు
పుణ్యఘడియకై వేచియుండిరి

గర్భవతియగు అదితికంతట
నెలలునిండగా – మునిపత్నులు వచ్చి
మంత్ర విభూదిని నొసటకు పెట్టి
రక్షాబంధము కట్టిరి భక్తిగ

విశ్వంభరుడు – విశ్వమోహనుడు
ఽక్షరమూర్తి – విరాట్ పురుషుడు
ఽంతటివాడు – తల్లి గర్భమున
ఒదిగి యుండెను – దుష్టశిక్షణకు

దివ్యతేజముతొ భాసిలె అదితి
నిండు చంద్రునిగ వదనమున్నది
అంతట బ్రహ్మ – అచటకు వచ్చి
గర్భస్థ శిశువును స్తోత్రముచేసెను

"భువనాధీశా! భక్తవశంకర
సృష్టిస్థితి లయ కారకుండవు
కాలపురుషుడవు కారణజన్ముడ
సురలబాధలు తీర్చుము తండ్రీ!

చావులేని ఆ దేవతలందర
బ్రతుకులు దుర్భరమైనవి స్వామీ!
గర్భమునుండి ఉదయించవయా!
శుభోదయము మరి సురలకు కలుగును"

అనుచు విరించి భక్తి ప్రపత్తుల
స్తోత్రముచేయగ – నారాయణుడు
దివ్యఘడియలో సుఖముగ పుట్టి
చరితార్థత – కలిగించెను – తల్లికి.

శుభ రాశులలో గ్రహములున్నవి
సూర్యచంద్రులు ఉచ్ఛస్థితిలో
వెలుగుచుండగా – శ్రవణ ద్వాదశిని
అభిజిత్ లగ్నము నందు పుట్టిన

శ్రీహరి – వింతగ పొట్టిగ నుండెను
అంతటి కురచగ విష్ణువుఎన్నడు
అవతారమును దాల్చగలేదు
నాల్గుభుజములు కలిగిన బాలుడు

శంఖ, చక్ర, గద, పద్మమ్ములతో
పీతాంబరము కుండలాలతో
శ్రీవత్సమ్మను పుట్టుమచ్చతో
కమలపత్ర నేత్రమ్ములు కలిగి

రత్నకిరీటము వనమాలతొ మరి
పీతాంబరము భుజకీర్తులతో
కౌస్తుభమణితో - మువ్వల గజ్జల
మనసులుదోచే - వామనుడాయెను

శ్రీహరి నరుడై పుట్టినఘడియలొ
ప్రకృతి తాను పరవశించినది
దేవతలందరు - క్లేశము మరచిరి
సూర్యచంద్రుల తేజము హెచ్చెను

సప్తసంద్రములు తరంగాలతో
ఆనందముగా నాట్యమాడెను
పూలజల్లులు పుప్పొడితోను
తేనె వరదలుగ పారినదపుడు

దివ్యశిశువును గాంచిన అదితి
ఎటులగర్భమున ఉండెనొ శిశువని
ఆశ్చర్యములో మునిగిపోయినది
స్తోత్రముచేసెను కశ్యపుడంతట

నాల్గుభుజముల మంగళమూర్తి
సాధారణమగు - బాలు డాయెను
ఉపనయనమునకు సరిపడువయసు
కలిగిన యట్టి వామనుడాయెను

ముద్దుపలుకుల - పరవశమిడుచు
తల్లికి ఎంతో సంతసమిడెను
శ్రీహరి అనెడి ధ్యాసను మరచి
ఎత్తుకు మురిపెము చేసె బాలుని

బుడి బుడినడకల బాలుని గాంచి
తల్లిదండ్రులు ముగ్ధులాయిరి
పది దినములయి పురిటిస్నానము
చేయించిరప్పుడు పుణ్యాంగనలు

శంకరురాణి - పార్వతి సాటి
పుణ్యమూర్తి అని పొగడిరి అదితిని
ఆశ్రమవాసులు మహర్షులందరు
కశ్యపప్రజాపతి అభీష్టమ్ముతో

ఉపనయనమ్ము చేయించగను
రవి - గాయత్రిని ఉపదేశించెను
యజ్ఞోపవీతము - వేసె బృహస్పతి
కౌపీనము - కట్టించెను తల్లి

కృష్ణాజినమును - భూదేవిడెను
మోదుగ దండము-నిడెను సోముడు
అంబరమిచ్చెను-దివ్య ఛత్రమును
బ్రహ్మయిచ్చెను - కమండలమ్మును

వాణియిచ్చెను - జపమాలికను
సప్తఋషులు-పవిత్రమ్ముల నిచ్చిరి
కుబేరుడిచ్చెను - భిక్షాపాత్రను
పార్వతి యిడెను మొదటి భిక్షను

శాస్త్రవిధిగను వామనుడంతట
ఋషుల సాయముతొ హోమముచేసెను
అటులా బాలుడు సంధ్యకృత్యములు
నిష్ఠగచేయుచు - ఆనందమునిడె

ఒకదినమున ఆ దివ్య వటువు తను
పర్ణశాలకు వెలుపల కూర్చొని
అటుగాసాగే బ్రాహ్మణోత్తముల
పలుకరించెను - అడిగె వినయముగ

"అయ్యలార! ఈ భూమిమీదను
అడిగినవారి కోర్కెలు తీర్చే
అగణిత సద్గుణి - పుణ్యాత్ముండు
అతులిత దాన గుణాఢ్యుడుగలడా?"

అంతటవారు నవ్వుచు పలికిరి
"ఆహా! ఎందరొ - దాతలు కలరు
అందరిలోన అగ్రగామిగా
అందురు - బలియను చక్రవర్తిని

అంతటిదాత ముందులేడు గద -
అతనిసాటి మరి పుట్టబోరిక -
ఆ పుణ్యాత్ముడు నూరుయజ్ఞములు
ఆచరించెను - కీర్తి గడించెను"

వెంటనె బాలుడు తల్లిదండ్రుల
ఆశీస్సులుగొని వారివెంబడి
సురల మేలును మదిలో నెంచి
బలినిచూడగా - బయిలుదేరెను

ఓ మహరాజా! లక్ష్మీపతి - తా -
సిరులకు దొరయగు శ్రీపతి తాను
చేయిజాపి - యాచించుట కొరకై
బయలుదేరెను - బలి సన్నిధికి

పరహిత మెంచే పరమాత్మునికి
యాచన అన్నది తలపుకురాదు
విశ్వశ్రేయమే పరమార్థమని
'భిక్షాందేహి' అనగా వెడలెను

కలిమికి రాణి కలిగిన భర్త
కరమును జాచి యాచించుటకై
కదలుచుండెను - విశ్వంభరుని
కదలిక - భూమిని కదలించినది

చిరుతబొజ్జలో - బ్రహ్మాండముతో
చిన్నగ బాలుడు నడచు చుండగా
ఆదిశేషుని దివ్యపడగలవి
అణగి పోవునా - అనిపించినది!

పరాయిసొమ్ము అడిగిన - యాచన
తనది తాను మరి - అడిగి పొందుట
అధికారముతో - గ్రహించుటైనను
అందరిముందు - యాచనే యగును

బలికే - బ్రతుకును యిచ్చిన దాతకు
భువికే - మనుగడయిచ్చిన దాతకు
భువనమ్ములలో - నిండిన దాతకు
ఇచ్చెడిదెవ్వరు యిచ్చుటేది మరి!

వామనమూర్తి నడచుచుండగా
నర్మదానది కనుపించినది
పాపక్షాళనము చేయుతోయములు
సుఖముల నిచ్చును-మంగళజలములు

అవలీలగను నదిని దాటెను
ముందుకు పోగా అంత దవ్వులో
రాక్షస కోలాహలము వినబడె
కనబడె సురలు - దిగులు తొనిండి

యజ్ఞశాల అట వెలుగులునిండెను
పతాకమ్ములు రెపరెపలాడెను
గజతురగములు సందడిపెంచెను
శోభకు నెలవా యజ్ఞవేదిక

హోమధూమమది బయటకువెడలి
కారుమబ్బుల సృజించుచున్నది
ఆధూమముకు సూర్యదేవుని
రధతురగములకు శ్వాసకష్టమయె

వామనువెంబడి వచ్చు బ్రాహ్మణులు
బలిభూవిభుని యజ్ఞశాలయని
తెలుపగ - ముసిముసినవ్వుల తోను
మెల్లగ చేరెను యాగశాలను

కురుచ రూపుతో - కదిలే అగ్నిగ
కనబడు వటువును - చూసినవారు
తమలోతాము గుసగుసలాడిరి
బ్రహ్మతేజమే రూపమునందెన!

ద్వాదాశా దిత్యులు యిచ్చట
ఉదయించిరాయని అనిపించునుగద!
ఎంతటి సుందర రూపమో యిది!
ఎచ్చటివాడో - బ్రహ్మచారి మరి

హరుడా! హరియా! విధాతయగునో!
ఆదిత్యుడొ మరి అగ్నిదేవుడో!
ఎవరో వారిలొ - ఒకరగునయ్యా!
సాధారణమగు మనుజుడు కాదు

మెల్లమెల్లగా దివ్యవటువు - తా -
సభామంటపము నందడుగిడెను
సామగానము సాగుచున్నది
ఉద్గాతలు నిష్టాతులు-సామవేదమున

హోతలు - క్రియకు వివరణయిచ్చుచు
యజ్ఞక్రియను చేయించుచుండిరి
త్రేతాగ్నులవి ప్రజ్వరిల్లగా
యాజకులు అట యజ్ఞమునడిపిరి

అన్నీవినుచు - ఆకళించుకొని
అటునిటు తిరుగుచు వారందరినీ
ఆనందములో ముంచి వేసెను
అక్కడక్కడ - ఆగుచు అడుగగ

అచ్చటివారా వటువు - శ్రద్ధకు
ముచ్చటగా మరి వివరణయిచ్చిరి
మధ్య మధ్యలో - హరి-హరి అనుచు
మరింత వినయము - శ్రద్ధచూపెను

వటువు తానుగా - జటలు చెప్పెను
మంత్రార్ధము చర్చించెను వారితొ
కొందరితో మరి పరిహాసముగా
పలుకుచు వారిని ముగ్ధుల చేసెను

అన్ని ప్రక్రియల ప్రవేశమున్నటు
వటువు - వారికి సహకరించుచు
మెల్ల మెల్లగా బలి భూవిభుని
దరికి చేరెను - స్వస్తిపలికెను

"అసురనాయకా! అఖండకీర్తితొ
అట - సురలందరి గర్వమ్మునకు
అంతము చూసిన-అమోఘబలుడవు
అనంతభోగము బడసితివయ్యా!

అసుర కాంతల - ముఖ పద్మమ్ముల
వెలుగునింపిన - దివ్యతేజమా!
సత్యధర్మములు దయాగుణమునకు
ఆటపట్టు - నువు - బలిమహరాజా!"

అనుచు పలుకుచు దివ్యవటువట
పవిత్రమ్ముతో మంత్రాక్షతలతొ
తన కుడిచేతిని శుభముగ జాచి
స్వస్తిపలికెను - చక్రవర్తికి

"మూడులోకముల తిరుగే లేని
శాసనమ్ములు - చేసినవాడు
నవ్వుచు - నాకము వశపరచుకొని
నాకపతిని మరి - త్రోసినవాడు

త్రిభువన సామ్రాజ్యమ్మును ఏలుచు
మహామునులు - కీర్తించు రీతిగా
యజ్ఞముచేసెడి రాక్షస ప్రభువుకు
సర్వశుభములు కలుగును గాక!"

అటులాశీస్సులు కురిపించి మరి
కలయ జూచెను పేరోలగమును
వేదరాశిలా వెలుగులు చిమ్ముచు
దండ కమండల ధారణచేసి

ఛత్రము పట్టి నిలచెను వటువు
భిక్షా పాత్ర కనబడుచున్నది
నిండు చంద్రుని పోలు వదనమున
వెన్నెల పూలు పూయుచున్నవి

రాక్షస గురువు శుక్రాచార్యుడు
సూర్యతేజమున - అణగిన గ్రహమై
వెలవెల బోవుచు కనబడెనచ్చట
ఆసనమ్ముదిగి అడిగె కుశలము

వటుపును చూచిన రాక్షసరాజు
వేదము - నడచి వచ్చినదనుకొనె
సూర్యచంద్రులే వచ్చిరనుకొనె
అగ్నిదాల్చె - ఈ రూపమనుకొనె

చక్రవర్తి - అతి శ్రద్ధా భక్తుల
ఆసనమ్ముదిగి పదములుతుడిచెను
ఆతని భార్య వింధ్యావళి తను
బంగరు పాత్రతొ నీటిని పోయగ

పాదపద్మములు బలికడుగగను
భళి భళి! అనుకొని రందరచ్చట
మంగళజలమును శిరసునదాల్చి
తుడిచెను పదములు-పరవశమ్మున

విష్ణుపాదములు కడుగు భాగ్యము
పూర్వము పొందెను-చంద్రకిరీటుడు
అంతటి భాగ్యము పదములు కడిగి
అందుకొనెను అట - బలి భూవిభుడు

ఉచితమైన ఒక ఆసనమిడెను
అమితమైన వాత్సల్యముచూపుచు
అంతకుమించిన గౌరవమ్ముతో
"అడిగెను వడుగా! ఎవ్వరవీవు?

నీ తలిదండ్రులు ఎవ్వరు స్వామీ!
నీఉనికి ఎచ్చటి - జన్మమెక్కడ
నీరాకతో - నే ధన్యుడనైతిని
నే పొందితిని - యజ్ఞఫలమ్ము

బ్రహ్మచారి - నీ అభీష్టమెద్ది!
మేలు వస్త్రముల - ధనధాన్యములా!
ధేనువులా మరి భక్ష్యభోజ్యముల!
శుభలక్షణలగు-కన్యలు వలయున?

గజాశ్వమ్ములా - గ్రామములా మరి
ఇండ్లా - భూముల - భూరిదక్షిణా!
అడుగుము నీవు - సమర్పించెద
నీదేయిక - మరి ఆలశ్యమ్ము!"

"అసురనాయకా! ఏమని చెప్పెద
అందరు - నాకు తల్లిదండ్రులే!
అక్కడ యిక్కడ - ఎక్కడచూచిన
అన్ని ప్రదేశములందున వుందును

నాఅంతవాడను - నేనే అగుదు
నానడవడి మరి ఏమని చెప్పెద
నేపోయెద - నే - తలచిన చోటుకు
నన్ను ఆపగలవారు - ఎవ్వరు?

యదార్థమిది విను - ఓ మహరాజా!
నాకు ఎవ్వరూ - లేరు అన్నచో
నేను మాత్రము - అందరివాడను
అందెడి వాడను - అడిగిన వారికి

అందరికీ - నేనయిన వాడనే
అందరు నన్ను చేరెడివారే
ఆదిలో నేను కలిగినవాడను
అది అంతయును-నా విషయములే -

అది అటులుండగ - నీవిపుడాడిన
పలుకులు - ఎంతో పరవశమిడినవి
యోగ్యుడవీవు - అని తెలిసితిని
యదార్థమ్మును పలికితివీవు

కులగౌరవమును నిలుపునట్టుగా
దానమీయగా - నిలబడితివి నువు
దయాపరులకు తత్వవేత్తలకు
నిలయమైనది - మీ కులమయ్యా!

త్యాగశీలత - దానగుణముల
ఎన్నికైనది - మీవంశమది
యాచకులకు మరి కల్పతరువది
తృప్తికలుగు - మీ దొడ్డగుణముల

నీపూర్వీకుల యశస్సువెలుగును
తారగ వెలుగును - తాత ప్రహ్లాదుడు
ఆతని కీర్తితో - మీవంశమది
పాలకడలివలె పొంగుచున్నది

మీతాతలలో మూడవవాడు
హిరణ్యాక్షుడు - జగతిజయించెను
వరాహమూర్తిగ శ్రీహరి పుట్టి
చంపెనాతని - అంతటివాడు

సంగతి తెలిసిన హిరణ్యకశిపుడు
హరిని త్రుంచగా - బయిలుదేరెను
విష్ణువంతట భయముతోనంత
తప్పించుకొనె చాకచక్యముగ

సూక్ష్మరూపమున శ్రీహరి తాను
హిరణ్యకశిపుని నిట్టూర్పులతో
లోనికి పోయి - ఉదరమునందు
కాలము గడిపెను వింటివ రాజా!

విష్ణువుకొరకు శోధించాడు
జాడతెలియక విసిగిపోయెను
మాయావియని - పిరికిపందయని
తలంచి ఆపెను - హరి అన్వేషణ

ఇంద్రాదులకు బ్రాహ్మణులకును
ప్రాణదానము చేసిన ఘనుడు
నీతండ్రియగు - విరోచనుండు
నీవు మాత్రము - తక్కువవాడవ!

అడుగిడి - నాకము వశపరచుకొని
వెడలగొట్టితివి - నాకపతిని మరి
మూడులోకములు నీ ఆధీనము
అసురుల పాలిటి వేల్పువు నీవు

దానముచేయని ప్రభువు బ్రతుకది
నిరర్ధకమ్ము విను మహరాజా!
వాని వైభవము - బూరుగుచెట్టగు
వాని ధనమది నిరుపయోగమగు

దాన విశేషము తెలిసిన విజ్ఞుడ!
ప్రభువుల లెక్కలొ ముందువుందువు
దాతలలో మరి-నీకు ముందు మరి
లేరని ఎందరొ - చెప్పగవింటిని

నాకోరికది - నావలె చిన్నది!
అవి యివి - కావలెనన్న కోరిక
నాకు లేదు - నే కోరెడి దిదియే
ఒకటో రెండో - అడుగుల నేలే -

మూడు అడుగులవే-బ్రహ్మాండముగా
మదిలోతలచి - పొంగిపోదును
మరియింకేమియు - కోరను నేను
ముందు నేను-యాచించి ఎరుగను!

చక్రవర్తి - తా - పలికెను వటువుతొ
బాలుడవీవు - అడుగుట తెలియదు
అతిస్వల్పమగు కోరిక ఏమి
ఆలోచించి - నిర్ణయించుకో!

అశ్వము లడగవు - ధేనువులడగవు
కన్యలు కాదు - భూములుకాదు
అడుగుటతెలియని పసివాడవు నువు
నీకంతే మరి ప్రాప్తమున్నదా!

అయినా వినుము - దాతకు తగిన
దానము కోరుట - ధర్మసమ్మతము
నీయాచనతో - దాత గౌరవము
ఇనుమడించవలె - కీర్తినొసగ వలె

స్వల్పము నొసగుట రాక్షస ప్రభువుకు
నలుగురిలో - నగుబాటు అగునయా!
ఎటుల యిచ్చుటా మూడు అడుగులు!
అడుగుము నీవు - ఆలోచించుకు!

వదాన్యశేఖరా! నీవు పలికినది
యదార్థమయ్యా! సందియమేల
బ్రహ్మచారినగు నాకు వలయునవి
గొడుగో-జందెమొ-కమండలమ్మో!

అంతకుమించి-మౌంజియొ-దండమొ
ఏనుగు లెందుకు అశ్వములెందుకు
కన్యలెందుకు భూము లెందుకు
కనకాభరణము లెందుకు రాజా!

వదాన్యశేఖర! నిండు మనసుతో
వలయునన్నవి ఒసంగ గలవు
కానీ - మోసెడి బరువు మాత్రమే
ఎత్తుకొనుటది - లోక ధర్మము

ఆశతొనిండి అడిగిన ఎడల
ఇచ్చినచో మరి అనుభవించెడి
యోగ్యత అన్నది - కావలెనుకదా!
మూడడుగులవే బ్రహ్మాండమయా!

తృప్తిచెందని మానవుడెన్నడు
సుఖముగనుండడు నీకుతెలియదా!
అసంతృప్తునికి - విశ్వమొసంగిన
వీస మెత్తు మరి - ఆనందించడు

నాల్గుసంద్రముల భూమినంతను
పరిపాలించియు తృప్తినందని
వేనుడు మొదలగు రాజులెందరో
కాంక్షతొనిండి కడతేరిరి కద!

నిత్యసంతోషి తృప్తినందుచు
కలిగిన దానిని పరమార్థమని
స్వీకరించి మరి సుఖపడగలడు
ముక్తికాంత - తా - చేరును వానిని

సంతోషి ముఖమది - తేజోవంతము
వంతనెరుగని వెలుగుతొనుండును
నీవిచ్చెదవని రాజ్యమంతయు
కోరుటతగదు - ఓ పుణ్యాత్మా!

మూడడుగులవి నీవొసంగిన -
ముల్లోకములు యిచ్చినట్టుగా
ఆనందించెడి - మనస్సు నాది
అంతకుమించి కోరనేదియు

అనుచు వటువట తీయగనుడువగ
ఆనందముతో బలి భూవిభుడు
దానమీయగా సంకల్పించి
జలకలశమ్మును గ్రహించినంతనె -

శుక్రాచార్యుడు - ముందుకు వచ్చి
పలికెను రాజుతొ - ఓ మహరాజా!
వచ్చినవాడు - శ్రీహరి అగును
అదితి కశ్యపుల సంతానమయా!

విషయము తెలియక మాటయిచ్చితివి
ఈదానముతో - రాక్షసకులమది
ఇడుమలలో మరి పడిపోవునయా!
నీ సిరిసంపద - రాజ్యములుండవు

నీ ఐశ్వర్యము ఇంద్రునికీయగ
నాకపతిని మరి ఏలికచేయగ
మోసగించుటకు వచ్చెను వటువు
మాటనమ్మము-కులము నిలుపుకో!

మూడడుగులతో మూడులోకములు
ఆక్రమించెడి ఘనుడగునయ్యా!
తానే చెప్పెను - మూడడుగులవి
బ్రహ్మాండమని - వింటివి కాదా!

ఎదిగిన వటుడు కంటి కగపడని
ఎత్తుకు ఎదిగి విశ్వము నిండును
ముందుచూపుతో చెప్పుచుంటిని
నిందువొ లేదో - నామాటలను!

మాటయిచ్చి మరి తప్పుట తప్పే!
ముప్పుతెచ్చిడి దానమిచ్చుట
మాటతప్పుట - కానేకాదు
వలదీ దానము - శ్రేయముకాదు

దానము-యజ్ఞము-తపస్సు కర్మలు -
ధనము హరించగ - చేయగరాదు
ధనమును అయిదు భాగములేసి
ధర్మార్థకామములు - కీర్తికొరకును

ఆపై అయిదవ భాగము మాత్రము
తనపై బ్రతికెడి వారికి నిడవలె
అటులకాదని అవివేకముతో
తన్నుమాలిన ధర్మము తప్పు!

బహ్వృచ గీతార్థమ్మును - వినుము
మాటయిచ్చియు కీడొనరించు
కర్మను - కాదన ధర్మసమ్మతము
అసత్యదోషము అంటదురాజా!

దాచి పెట్టిమరి దానము కాదన
జీవచ్ఛవముగ పరిగణించవలె -
మూలము చెడిన చెట్టురీతిగా -
సర్వము దానము-అనర్థమయ్యా!

తల్లివేరది చెట్టుకు ముఖ్యము
దానిని - చక్కగ కాపాడినచో
తరువు - పూలను - ఫలముల నిచ్చును
దానిని - నాశము చేయగ తగదు.

స్త్రీలవిషయము - వివాహమందున
ప్రాణభయములో - ధన నాశమున
గౌరవ హానిలో - మాటదప్పిన
అనృతదోషము అంటదు రాజా!

అసురకులమ్ము-రాజ్యము-మరియు
నీతేజస్సును నిలుపుకోవలె!
పొట్టివాడు మరి గట్టివాడయా!
త్రివిక్రముడుగా నిండును సర్వము

దానము గీనము - తరువాతయ్యా!
మనుగడముఖ్యము నీకు తెలియదా!
ఎంతని చెప్పుదు ఓ మహరాజా!
అనుచు శుక్రుడు - పలుకుట వినిన

దానవరేణ్యుడు-పలికెను గురువుతో
"స్వామీ - మీరు చెప్పినదంతయు
యదార్థమైనది - సందియమేల
కానీ నేను - మాటయిచ్చితిని -

ఏది కోరినా - యిచ్చెదనంటిని
మాట తప్పరు మాన ధనులుకద!
ఇహభోగములు దూరమగునని
పరమును మరచుట-మంచిదికాదు

భూమి స్వయముగా బ్రహ్మకు చెప్పిన
మాట తెలియదా! మహానుభావా!
దుర్మార్గులను భరింతుగాని
అసత్యవాదిని - భరించనన్నది

రణరంగమున వెన్నుచూపక
వీరమరణము పొందిన - ధన్యత
పలికిబొంకక - సత్య వ్రతముకై
ఇడుములు పడుట మానధనమగు

సేద్యగానికి విత్తనమ్ములు
అనువగు పొలము - దొరకినట్టుగా
తగుసమయములో - త్యాగబుద్ధియు
యాచకుండును - దొరకవలె కదా!

భూమినేలిన - రాజులెందరో
సిరిగొనిపోయిర - పేరునిలచెనా!
శిబివలె దానముచేసిన విజ్ఞులు
వెలుగుచుందురు - కీర్తిచంద్రికల -

మీరుచెప్పినది నిజమే స్వామీ!
యజ్ఞయాగముల వ్రతదీక్షలతో
అందనివాడు - అంతటివాడు
అడగవచ్చెను - ఎంతటి భాగ్యము -

సిరికే మగడు - దాతల దాత
విధాత - పుట్టుకకు కారణుడాతడు
కరముజాచెను - యాచించెను - నను
పైచేయితో - నే దానమిడవలె

అంతటి భాగ్యము దొరకుట ఎట్లు
ఎంతటి పుణ్యము చేసినాడనో -
కలిమి రాణికి కాంతుడాతడు
కరుణనిండి - నను యాచించెను కద!

రాజ్యము గీజ్యము శాశ్వతమ్ములా!
భోగభాగ్యములు అస్థిరము గదా!
వాటికోసమై శాశ్వత కీర్తిని
ధారపోయుట - తగనిది స్వామీ!

పాపమో పుణ్యమో-కులనాశనమో!
ధారుణి తాను శిథిలమ్మగునో!
దుర్మరణమ్మది సంభవించునో
దానము మానను ఓ గురువర్యా!

హరి హరులైనా విరించి అయినా
యాచించుటకై ముందు నిలబడి
**దేహీ అన్నది - నిలబడిపోవును**
**దేహమన్నది - దహింపబడును**

అనుచు నిశ్చయము-తెలిపిన బలిపై
ఆగ్రహించెను అసురగురుండు
పదభ్రష్టుడవు త్వరలో అగుదువు
అనుచు శపించెను - దానశోభితుని

గురుశాపమునకు చలించ లేదు
దృఢ నిర్ణయము చెప్పిన బలి-తా-
భార్యకు సంజ్ఞను చేసినంతనే
శుద్ధ జలమును గొని వచ్చినది

వడుగారమ్మ! అడిగిన దిత్తును
దివ్యపాదములు కడిగెద నిపుడు
అనుచు పలుకగా ఆదిదేవుడు
పాదపద్మములు అందించగనే

యోగుల - మదియను సరోవరమ్మున
విజ్ఞాన తేజముల తెలియాడెడు
తెల్లతామరల - పోలుపాదములు
లక్ష్మి నిరతము కొలచు పాదములు

వేదవీధులలో నడచెడి పదములు
ఉపనిషత్తులు పొగడు పదములు
జీవకోటిని - కాచు పదములు
పదములు కావవి-మోక్షపథములు

సహధర్మిణి అట జలమును పోయగ
పులకరింతతో బలి భూవిభుడు
పాదపద్మములు కడిగి - జలమును
తలను ధరించెను - సంకల్పముతో

బ్రహ్మచర్యవ్రత దీక్షాపరుడవు
ఆగమాలలో వెలుగు తేజము
విష్ణుస్వరూపుడ - దానగ్రహీతా!
బ్రహ్మార్పణమగు నాదానమ్ము

జగన్నియంతకు - జగములుగాంచి
పొంగిపోయెడి రీతిగ బలి - తా -
మూడడుగులుగా నేలను అపుడు
ధారపోసెను జన్మతరించగ

చివరి ప్రయత్నము దానమునాపగ
ఆలోచించిన అసుర గురుండు -
జలకలశమునకు గల రంధ్రమునందు
కంటి నుంచెను జలముల నాపగ

దానిని గ్రహించి సర్వజ్ఞుండు
దర్భపుడకతో పొడచినంతనే
జలముధారగా పడిన దప్పుడు
శుక్రుని కన్ను - చితికి లొట్టపడె

రాజా! వింటివ బలిభూవిభుడు
దానగుణమున ఎన్నిక అగును
ముప్పు తప్పదని - ఆహ్వానించెను
ఆడితప్పనని దీక్ష వహించెను

సర్వజగత్తు పరవశించెను
ప్రస్తుతించెను బలిభూవిభుని
పూలవాన కురిపించిరి వేల్పులు
దేవదుందుభులు మ్రోగెనింగిని

ఓ మహరాజా! భూదానమది
అన్ని దానముల శ్రేష్ఠమైనది
దానగ్రహీత - దాతయు కూడా
శతవత్సరములు స్వర్గమునుందురు

వామను డంతట బలితో పలికెను
ఓ మహరాజా! అతి స్వల్పమగు
దానమిడితినని చింతిలవలదు
మూడు లోకములుయిచ్చినట్లగు

అటుల వటువు-తా-పలుకుచుండగా
తీయని మాటలు విని మహరాజు
మదిలొ ఎంతో పొంగి పోయెను
ఎంతటి చతురుడొ బాలుండనుకొనె

అంతటలోన ఆశ్చర్యముగా
దివ్యవటువు - తా - ఎదుగ జొచ్చెను
ఇంతింతై మరి పెరుగుచు వటువు
ఆకాశమును అంటెడి ఘనుడయె

మేఘమండలము దాటి పోయెను
సూర్యచంద్ర గోళమ్ముల దాటెను
ధ్రువమండలమును మించి ఎదిగెను
సత్యలోకమును ఆక్రమించెను

చర్మచక్షువుల కందని రీతిగ
ఎత్తు వెడల్పులు ఎదిగెను-వటువు
కంటి ముందరా దృశ్యమ్మును గని
కలయా నిజమా - అని తలంచిరి

సూర్యబింబమది ముందుగ-గొడుగై
చూడామణిగా - చెవికుండలముగ
ఆపై బింబము - కంఠహారమై
భుజ బంధమ్మై - అలరారినది

రవిబింబమ్మది-ఎదిగిన వటువుకు
చేతి కడియమై అలరారినది
వటువు తాను అట ఎదుగుచుండెను
బింబము కిందకు వచ్చినట్లయె

నడుముకు గంటగ-బింబము తోచెను
కాలియందియై - కాంతులీలినది
ఇంకావటువు ఎదుగుచుండగా
పాదపీఠమై - సూర్యుడు నిలచెను

బ్రహ్మాండమ్మది నిండునట్టుగా
బాలవటువు – తా – త్రిగుణాత్మకమగు
విశ్వరూపమును సంతరించెను
విజయ ఘోషతో దిక్కులు మ్రోగెను

❋❋❋ ॥శ్రీ కృష్ణచరితము॥

## 5 వామనుని విశ్వరూపము

నింగినేలా – దిక్కులు, నిండెను
స్వర్గము – సంద్రము – సర్వజీవులు
అన్నీఒకటై – ఆపై కెదిగి
భువర్లోకమును మించి ఎదిగెను

ఆగక ఎదిగి సువర్లోకము
మహర్లోక సత్యలోకముల –
సందులేక – తా – ఎదిగిపోయెను
దివ్యదేహమును సంతరించెను

అడుగుల క్రిందున – పాతాళమ్ము
పాదామ్ములపై – భూమి అనగను
మీగాళ్ళ పైన మరి కొండలన్నటు
మోకాళ్ళపైన పక్షులుండినటు

తొడలయందున మరుత్తులన్నటు
వస్త్రము సంధ్యగ వెలుగుచుండగా
ప్రజాపతులు మరి గుహ్యమునందున
జఘనంబున మరి అసురులున్నటు

ఆకాశమ్ము నాభిగ తోచెను
బొజ్జయందున సముద్రమ్ములు
ఉరమున తారలు–హృదయమునందు
ధర్మము ఉన్నటు – నిండెను వటువు

ఋతు సత్యమ్ములు ఉరోజమ్ముల
మనస్సున చంద్రుడు వెలుగుచున్నటు
వక్షస్థలమున లక్ష్మి నెలకొని
కంఠమ్మున వేదమ్ములు తోచెను

భుజముల పురందరాది సురలును
చెవుల దిక్కులు – తలపై నాకము
శిరోజమ్ములవి మేఘమ్ములుగ
నాసిక యందు అనిలుడు వున్నటు

కన్నులలో మరి సూర్యదేవుడు
ముఖమున అగ్ని–ఛందస్సులు–వాక్కున
నాలుకయందు – వరుణుడు నెలకొని
కనుబొమ్మల మరి విధి నిషేధములు

అహోరాత్రములు కంటిరెప్పలన
నొసటియందున కోపము వెలయగ
పెదవుల – లోభము–స్పర్శలో కామము
రేతస్సునందున నీరునెలకొని

అధర్మమ్మును – యజ్ఞమ్ములన్నవి
పృష్ఠభాగమున – నిలచినట్టుగా
నీడలొ – మృత్యువు కలిగినట్టుగా
బ్రహ్మాండమంతయు–నిండెను వటువు

మందహాసమున-మాయలు నెలకొని
రోమములందు ఓషధులుండి
నాడులయందు నదులున్నటుల
జంగమస్థావర సృష్టి గాత్రమున

గోళ్ళయందున రాళ్ళు కలిగినటు
బుద్ధియందున - విరించి యున్నటు
ప్రాణమ్ములలో-దేవఋషులు గల
సుదర్శనుండు - ఉద్భవించెను

చక్రము మొదలగు ఆయుధమ్ములతొ
మకుట శోభతో మంగళ ప్రదముగ
సునందాది పరిచారులతో
ఊహలకందని రూపము నిలచెను

బ్రహ్మాండమంతయు కప్పుకొన్నటు
కన్నుల చూడగ శక్యముగాని
దివ్యరూపమున - త్రివిక్రము డట
ఆవిర్భవించెను అమోఘమ్ముగా!

అటుల ఎదిగిన దివ్యవటుండు
ఒక్కపాదమున భూమిని కొలిచెను
రెండవ పాదము నింగిని నిండి
ఊర్ధ్వలోకముల నాక్రమించెను

ఎక్కడచూచిన విష్ణురూపమై
బ్రహ్మాండమునే బ్రద్దలుచేయున!
అన్న శంక - మరి కలిగిన దపుడు
విశ్వమయుండు దర్శనమిడెను

నిండుగ నిలచిన దివ్యవటువుకు
పద్మమ్మునకు అంటినయట్టి
ఖురదరేణువుగ భూమితోచెను
నింగి తోచెనొక భ్రమరమ్ముగను

నేలా నింగీ విశ్వమంతయు
నిండిన వటుని - బ్రహ్మతేజమది
సూర్యకాంతితో భాసిల్లినది
దివ్యకాంతులవి నిండెనంతట

త్రివిక్రముని పద-దర్శనభాగ్యము
కలిగెననుకొని పుణ్యాత్ములగు
మరీచి మొదలగు - మహామునులట
పొంగిపోయిరి - జన్మధన్యమని

సత్యలోకమున వున్నజ్ఞానులు
తత్వాన్వేషణ తత్పరులందరు
హరిపద దర్శన భాగ్యమ్మునందిరి
పులకరింతతో స్తోత్రముచేసిరి

నాభికమలము కనుపించగనే
పరవశించిన బ్రహ్మదేవుడు
పదములనంటి నమస్కరించి
దివ్యజలములతొ అభిషేకించెను

బ్రహ్మకడిగిన పాదము అనుచు
కీర్తించిరట దేవగణంబులు
పాదజలమును దాల్చిన బ్రహ్మ
తన - తలవ్రాతకు పొంగిపోయెను -

విష్ణుపాదము కడిగిన నీరది
దేవజలము - అట ఏరుగ పారి
పాపపంకిలము పారద్రోలెడి
పావన తీర్థముగా విలసిల్లెను

లోకపాలకులు యధావిధిగను
భక్తిప్రపత్తుల విష్ణుపాదమును
షోడశోపచారమ్ములతో
పూజలు సలిపి - స్తోత్రముచేసిరి

జయజయ ధ్వనులతొ మంగళకరముగ
లోకములన్నీ మారుమ్రోగెను
అంతట బలి-అట విస్మయమందెను
తన్మయుడై - తా - స్తోత్రముచేసెను

విష్ణుమూర్తి తన విశ్వరూపమును
తగ్గించుకొని - తిరిగి వటువుగా
యజ్ఞశాలలో దర్శనమిడెను
అసురులు ఆగ్రహమందినవారై

మాయచేసి మహారాజు సంపద
అపహరించెను వదలకూడదు
తగిన శాస్తి మరి చేసితీరవలె
అనుచు పోరుకు దిగిరి అసురలు

అంతట వటువు అటుఇటు చూడగ
పుష్పదంతుడు ఆదిగాగల
విష్ణువు - సేనా నాయకులచ్చట
ప్రత్యక్షమైరి - శ్రీహరిలీల

ఇరుపక్షములు పరాక్రమమ్మున
పోరగ నిలువగ బలి అంతటను
శుక్రుని శాపము తలంచుకొనుచు
అసుర వీరులను శాంత పరచెను

పోరుకు సమయము - కానేకాదు
విధిలీలలను - దాట నశక్యము
దైవము మనకు ఎదురు తిరిగిన
మారుదిక్కు మరి వుండదు-వినుడు

పారిపోయిన విష్ణుకింకరులు
మీకుఎదురుగా పోరగ నిలచిరి
కేవలమది-విధి అన్నది తెలియుడు
సర్వేశ్వరుని ఏమనగలము!

కావున మనము తగ్గుటమంచిది
గాలి కెదురుగా నిలచుటతగదు
మంచిరోజులు వచ్చిన పిదప
మనపని సుగమము అగును-సత్యము.

బలమగు కోటయు - మంచిసచివులు
శక్తిమంతులగు - సేనాబలము
మంత్రశక్తులు - ఔషధమ్ములు
అపారమైన తెలివి - గలిగియు

రాజు మాత్రము - విజ్ఞతనిండి
పగతుర బలమును - గుర్తించుకొని
కాలపరిస్థితి - నాకళించుకొని
పోరగ - సిద్ధము కావలె - వింటిర!

అటుల ప్రభువు మరి నచ్చచెప్పగా
అసురులు ఎంతో అయిష్టముగనే
రసాతలమ్ముకు వెడలిపోయిరి
అటుల పోరు మరి ఆపెను ఆ బలి

విష్ణువు మనస్సు తెలిసినవాడై
తార్క్ష్యుని తనయుడు పాశమ్ములతో
బలిభూవిభుని బంధించె నట
మారుపలుకక నిలచెను ఆ బలి

జగన్నాయకా – సామాన్యుడవా!
నీకృప యిటుల చూపించితివి
ధన్యుడనైతిని దయాసాగరా
అని చిరునవ్వుతొ పలికెను – రాజు

వామనుడైన శ్రీహరి పదములు
కడిగి ధన్యుడైనట్టి రాజును
కరచరణమ్ములు బంధించిరట
సర్వజగత్తు విస్మయమందెను

దానగుణముకు బలిని పొగడిన
కంఠములన్నీ హా – హా – యనుచు
విస్తుపోయి మరి నిలచిపోయిరి
విధి విలాసమని తలచె – దానబలి

ధీరోదాత్తుడు బలిమహరాజు
దానగుణముకే – వన్నెతెచ్చెను
జంకక నిలచెను ధైర్యమ్ముగను
చిరునవ్వులతో తేజము వెలిగెను

అంతట అడిగెను పొట్టి వటువట
మూడడుగులలో మూడవదేది?
నింగీ నేలా – రెండుగ కొలచితి
మాటనిలుపుకో – యశముపెంచుకో!

వాగ్దాన భంగము దుర్గతినిడును
ఆలోచించి నిర్ణయించుకో!
అంతట పలికెను దానశోభితుడు
"ఆడిబొంకుట – తెలియనివాడను

బ్రహ్మాండమునే ఆక్రమించిన
బ్రహ్మస్వరూపము – నీవేస్వామీ!
నీదికానిది – నేనుయిచ్చునది
సృష్టిలొ వుండుట – విచిత్రమైనది

నీవడిగిన ఆ మూడవపాదము
నాశిరస్సున – అనుగ్రహించుము
పాదమునుంచి పావనమొనర్చు
పుడమిని–యశస్సు ఇనుమడించును–

మరణభయమ్ము నాకులేదు–విను
లేమిచింత యది లేనివాడను
నరకమ్మును – నే లెక్కచేయను
కానీ బొంకుట – తలంచలేను

అన్నదమ్ములు హితులు గురువులు
ప్రాణదాత మరి శిక్షించినచో
మేలు చేయును – కీడుగాదని
మదిలోనమ్మితి – మంగళమూర్తీ!

మదాంధులమ్మగు మాకందరకూ
సమయముతెలిసి - వెలుగునుచూపి
జ్ఞాననేత్రము తెరపించెదవు
ప్రథమగురువువు - నీవేస్వామీ!

నిన్నెదిరించి - నిలబడలేరు
నినుద్వేషించిన మా రాక్షసులకు
ఉత్తమగతులను కలిగించితివి
దయాసాగరా! సామాన్యుడవా!

మిత్తి, చుట్టమా! యముడుశత్రువా!
యమకింకరులకు స్వార్థమున్నదా!
బ్రతుకు సత్యమా! అశాశ్వతమ్ము
బుద్బుదప్రాయము అన్నదిమరతుము

మాయలోపడి దయాధర్మములు
సత్యము - దానము-అను సత్కర్మలు
మరచిపోయి మరి మదాంధుడై యిల
తను శాశ్వతమ్మని తలంచుచుండును

బంధువులందరు స్వార్థపరులయా!
తనయులు అగుదురు ఋణానుబంధము
సంసారలంపటము - భార్యవల్లనే
క్షణికము ధనము-బ్రతుకు బుద్బుదము

రెప్పపాటు వరకాగదు కాలము
ఆశ్రితులందరు దొంగలమాదిరె
నీటిమూట యగు ఆయుర్భాగ్యము
మెరపువంటిదే - ఐశ్వర్యమ్ము

చిన్నవయస్సులో భక్తిపండిన
తాత ప్రహ్లాదుడు వివేకవంతుడు
తండ్రిని కాదని నీ ఆశ్రయమున
లోకవందితుడగుట తెలియును

అజరామరుడై వెలుగుచుండెను
మాపూర్వీకులు - వైరభక్తితో
నీదరిచేరిరి - కానీ స్వామీ!
వారినిమించిన భాగ్యము నాది

కలిమినివదలి - ఒంటిరివైతివి
నను యాచించగ కదలివచ్చితివి
అంతటి దయను చూపితి వీవు
ఎంతటి పుణ్యము చేసినాడనో!"

అటుల వినయముగ పలుకుచుండగా
మనుమనిచూడగ వచ్చె ప్రహ్లాదుడు
బంధముతో మరి తగుమర్యాదను
చూపగలేక - మ్రొక్కెను - భక్తిగ

సునందాదులతొ కూర్చొనియున్న
వామనమూర్తిని దర్శించుకొని
ఆనందబాష్పముల పులకరింతతో
పదములనంటి పలికెను భక్తిగ

"ఓ పరమేశా! నా మనుమనికి
నుడువగ చాలని మేలు చేసితివి
ఇంద్రపదవిని నీవొసగితివి
నీవే తిరిగి - వదిలించితివి

గర్వాంధునిగా - పదవి - చేయును
చిత్తము నిలకడ లేకపోవును
నీపదములపై భక్తి కుదరదు
నీ అనుగ్రహమ్మే-అఖండ పదవి"

ప్రహ్లాదుడు అట పలుకుచుండగా
బలి మహరాజుకు ధర్మపత్నియగు
వింధ్యావళి - ఒక శోకలత వలె
అచటికి వచ్చి పలికె విష్ణువుతొ

"లక్ష్మీనాధా! పతిభిక్షనిడు
లోకములన్నీ - నీవిలాసమే!
సప్తలోకముల కధిపతి వీవు
కళ్ళుకప్పు - మా అహంకారము

నీవడిగినది ఒసగెను - నాపతి
నీమాటను మరి మీరగ లేదు
ఎందుకు నీవు బంధించితివి!
కరుణాసాగర - కాపాడుమయా!"

అంతట విరించి వచ్చి పలికెను
"జగదాధారా! ఉన్నదంతయు
భక్తి ప్రపత్తుల ఒసగెను ఈ బలి
బంధ విముక్తుని చేయుము స్వామీ!

నీ అనుగ్రహపాత్రుడు ఈతడు
ఈతనిపై నువు ఆగ్రహించకు
సర్వార్పణమని ఒసగెనీతడు
సర్వనియంతా! కటాక్షించుము!

నీకుతెలియని విషయమున్నదా!
**తనకుమాలిన ధర్మమన్నది**
బలివిషయములో - వినుతికెక్కును
బంధవిముక్తుని చేసి - బ్రోచుము."

అంతట పలికెను - అనంతమూర్తి
"వాణీనాధా! లెస్సపలికితివి!
నా అనుగ్రహము ప్రసరించుటకై
సంపదలన్నీ హరించి వేతును

అహంకార మమకారమునిండి
ధర్మదూరులై నడచునప్పుడు
ఎన్నో జన్మలు ఎత్తుచుందురు
దుర్గతి నందుచు నుందురువారు.

రూపము వయస్సు విద్య బలములు
ఐశ్వర్యమ్ము గర్వహేతువులు
వాటికిలొంగని నిర్మలచిత్తుని
నిరంతరము - నే - కాపాడెదను.

రాక్షస ఏలిక - గురు శాపమునకు
గురియై సర్వము కోల్పోయెను-విను
బద్ధుడైనను పుణ్యశీలుడు
అజయ - అనబడు-మాయను గెలిచెను

అతఃశ్శుద్ధి సత్యవ్రతములు
ఆనందమును చెదరనీయక
ప్రసన్నముగను ఉంచెను యిపుడు
నాపరీక్షకు నిలచెను - గుణములు

నా అనుగ్రహము కలిగిన ఈబలి
సావర్ణిమన్వంతరము నందున
ఇంద్రునిగాను - సురలను ఏలి
ఆపై - నాదగు లోకము చేరును

నాలోకమది సురలకు దొరకదు
అంతటియోగ్యత కల్పించితిని
అంతటి వరకు సుతలలోకమున
సర్వసుఖములు అందునీతడు

ఆకలిదప్పులు దుర్మరణములు
అసలేవుండవు - సుతలలోకమున
సురలు అచ్చట వుండగోరెదరు
సుదర్శనమ్ము - రక్ష నిచ్చును

నీఆనతిని మీరిన యట్టి
అసురులందరిని చక్రము చూచును
లోకమ్ములకు అధిపతులెవ్వరు
నిన్నెదిరించరు బలి ధర్మాత్మా!

నిరంతరము నిను రక్షణచేతును
తలచుకొన్నచో దర్శనమిడెదను
సహవాసదోషమున కలిగిన యట్టి
అసురగుణములిక దరిచేరవనె."

అటుల శ్రీహరి ఆనతినిడగా
ఆనందముతో పులకరించిన
అఖండదాత కనుగొలకులవి
అభిమాన ధారలు కురిపించినవి

చేతులురెండు జోడించి మరి
విష్ణుపాదముల మీద వ్రాలెను
"పన్నగశయనా! పరమానందము!
వర్ణించుటకా శేషుడుచాలడు

లోకనాధులకు మించినయట్టి
దివ్యధామమునొసంగినావు
నాకురక్షణగ నుందునంటివి
తలచిననంతనే దర్శనమంటివి

అసురభావమది అంతరించునని
నీలో - నన్ను చేర్చుకొనెదనని
చల్లగ చెప్పిన మాటలు - వింటిని
ఎంత ఆదరము నాపై - స్వామీ!"

అటుల బలి మరి పలుకుచుండగా
వామనమూర్తి కనుసన్నలతో
విష్ణుదూతలు కట్లను విప్పిరి
వింధ్యావళి - తా - పొంగిపోయెను

దాన కిరీటము దాల్చిన బలి తన
భార్యతొ హరి బ్రహ్మాది సురలకు
వందనముంచి తన వారలతో
సుతలలోకమున కేగెను సుఖముగ

వంశఖ్యాతి యది యినుమడించునటు
పేరుతెచ్చిన మనుమనిగాంచి
ప్రహ్లాదుడు - తా - పరవశించెను
ప్రస్తుతించెను వామనమూర్తిని.

పురాణపురుషా! మాపైనీవు
అపారమైన కృపనుజూపితివి
మాకోటకు నువు రక్షగనుండుట
నీ ఉదారతకు నిదర్శనమ్ము

అసురలపైన కృపారసమ్మును
చిలకరించెడి చిన్మయమూర్తివి
నీకు అందరూ సమానులయ్యా!
నిన్నుకాదని చెడెదరు యిలలో -

నిన్నేమరక కొలచువారికి
కల్పవృక్షము వంటి వాడవు
అనుచుపలికిన - ప్రహ్లాదుని గాంచి
చిరునగవులతో పలికె వామనుడు

ప్రహ్లాదా! నువు నీవారలతో
సుతలలోకమున వసించుమయ్యా!
గదాపాణినై రక్షగనుందును
నన్నునమ్మిన నాశము కలుగదు

అటుల శ్రీహరి ఆనతినిడగ
ప్రహ్లాదుడు తన వారందరితో
దివ్యనామము స్మరించుకొనుచు -
సుతలలోకముకు దారితీసెను

వామనుడంతట శుక్రునిగాంచి
యజ్ఞకాండను పూర్తిచేయమన
శ్రీహరి ఆజ్ఞతొ శుక్రాచార్యుడు
శాస్త్రవిధిగ చేయించె - యజ్ఞము

అటుల శ్రీహరి దానముగొని అట
ముల్లోకములను ఆక్రమించెను
ఇంద్రునికంతట పదవినిచ్చెను
అంతట ఇంద్రుడు ఆనందముతో

లోకమ్ములకు లోకపాలకుల
ఏలిక - విష్ణువు - వామనుడనెను
శివుడు - స్కంధుడు - దేవఋషులును
ప్రజాపతులును సంతసపడిరి

ధర్మమ్మునకు - కీర్తికి - లక్ష్మికి
సర్వశుభములకు వేదమ్ములకు
మోక్షమ్మునిడు-ఉపేంద్రుడగును
వామనమూర్తి - ముఖ్యుడు అనెను

ఓమహరాజా! బలవంతుడగు
సోదరునిచే - తా - తిరిగి పదవిని
ఇంద్రుడు పొందెను-అంతటి గొప్ప
సోదరుడున్న తమ్ముడు ధన్యుడు

స్వార్థములేదు - పొట్టి వడుగు - తా -
తల్లిగర్భమును ఫలింప జేసెను
ఆక్రమించిన లోకములన్నీ
తమ్మునకిచ్చిన - గొప్పదాతయగు

సత్సంతానము బడసిన తల్లి
గర్భవాసమున వసించినందుకు
జన్మ ధన్యమని తలంచురాజా!
దుష్టుడుకలిగిన దుఃఖించును గద!

ఇంద్రుడంతట తమ్ముని శక్తితొ
లోకపాలనము చేయగసాగెను
త్రివిక్రమవిజయము - కీర్తనచేయుచు
బ్రహ్మాదిదేవతలు శలవునందిరి

ఓ మహరాజా! వామన చరిత్ర
సర్వజనులకు స్తుతించదగినది
మానవ దేవ పితృకార్యముల
పఠించినంతనె శుభములు కలుగును

అటుల శుకుడు అట పరీక్షిత్తునకు
చెప్పినట్టుగా - సూతమహాముని
శౌనకాది మహఋషులకచ్చట
తెలియబరచెను దివ్యగాధను.

❋❋❋ ॥శ్రీ కృష్ణచరితము॥

## 6 మత్స్యావతార కథ

పరీక్షన్నరేంద్రుడు వినయముగాను
అడగెనప్పుడు - శుకయోగీంద్రుని
"శ్రీహరి జన్మలు విచిత్రమైనవి
నీచమైన ఒక చేపగ పుట్టెను

తక్కువ, ఎక్కువ, అన్నదిలేక
జీవులన్నియు తన అంశయని
తెలుపుట కొరకై సమయములోన
ఆయా అవతారమ్ముల నెత్తును

దుర్గంధముతో నిండిన జన్మ
నీటిలొవుండే మత్స్యరూపము
ఏలధరించెను పురుషోత్తముడు
సాధించిన ఆ కార్యమెట్టిది"

గడచిన కల్పము చివర జరగిన
మత్స్యావతార గాధను వినుము
ద్రవిడదేశపు ఏలికయైన
సత్యవ్రతుడు అతి ధర్మాత్ముడయా!

అపుడు శుకుడు - తా - పరీక్షిత్తునకు
తెలియబరచిన గాధను సూతుడు
శౌనకాది మునులందరు వినగా
తెలియబరచెను సవిస్తరముగా

జలపానముతో ఆ మహరాజు
'కృత మాలిక' - అను ఏటిగట్టున
తీవ్రజపమ్ము ఆచరించెను
చెదరని గురితో హరిని కొలిచెను

గోబ్రాహ్మణులను వేదమ్ములను
సజ్జనులను మరి కాపాడుటకు
ధర్మము నెలకొన చేయుట కొరకై
నారాయణుడు జన్మలనెత్తును

ఒకదినమున ఆ మహరాజు తను
జలతర్పణము చేయచుండగా
చేపపిల్ల ఒకటాసమయములో
దోసిట నీటిలొ - తేలియాడెను

వెంటనె రాజు అతి భద్రముగా
చేపపిల్లను నీట వదిలెను
అంతట పలికెను చిరుమీనమ్ము
"ఎంతటి పనిని చేసితివయ్యా!

బ్రతుకు ఆశతో నిన్నుచేరితి
నీటవదిలి నను దుఃఖపెడితివి
మత్స్యకారులు బంధించెదరు
లేదా – ఘన మీనమ్ముమింగునో!

ఆపన్నులను రక్షించుటది
నీబోంట్లుచేసెడి గొప్పవ్రతమయా!"
వెంటనె రాజుకు మనసు కరిగినది
కమండలమ్ములో వేసెను – చేపను

తెల్లవారు సమయమ్ముకు చేప
పెద్దదిగా మరి తిరుగుచుండగా
కమండలమ్మది చాలదు అనగా
పెద్దబానలో – నీట వేసెను

క్షణములో పెరిగిన మీనమ్మునకు
బాన చాలక సత్యవ్రతుండు
ఒక కోనేటిలో వేసెను చేపను
తిరిగి ఎదిగెను దివ్యమీనము

ఆశ్చర్యములో మునిగిన రాజు
ఆమీనమును మోసుకుపోయి
అచటి సంద్రమున – నీటవదిలెను
అంతట పలికెను ఘనమీనమ్ము

"రాజా! ఇచట మకరులున్నవి
వాటికి నన్ను బలిచేసెదవా!
ఇంతకాలము రక్షించితివి
మార్గోపాయము యోచించుమయా!"

అంతట రాజు ముడిచిన కరముల
మీనమ్మును గని పలికెనప్పుడు –
"సామాన్యమగు – చేపవు కావు
విశేషమ్ముగా పెరుగుచుంటివి

తప్పక నీవు – నారాయణుడవు
మత్స్యావతారము దాల్చితి విపుడు
ఈ అవతారము ఏల దాల్చితివి
తెలుపుము నాకు వివరముగాను".

అంతట పలికెను ఘనమీనమ్ము
"రాజా నీవు పలికినట్టుగా
హరినే – నేను – ఈ జన్మములో
చేయగదగిన ఘనకార్యము వినుము

నేటికి – ఏడవ రాత్రియందున
విధాతకది ఒక పగలు – అప్పుడు
భూ, భువర్లోక, సువర్లోకములు
ప్రళయసంద్రమున–మునిగి పోవును

ఆసమయములో నాసంకల్పము –
అచటికి – పెద్దనావ వచ్చును
అందులోవుండును ఓషధులున్న
విత్తనమ్ములు – సప్తఋషులును

## అష్టమస్కంధము

అంధకారమున - మునులతేజముతొ
సంద్రజలమని గ్రహించవచ్చును
ఆజలములపై - నావ - వూగును
దానికి ఎట్టి నష్టము కలుగదు

అందులోవుండి రక్షణ చేతును
నావలోవుండును ఘనమగు సర్పము
ఇరుదిక్కులలో నేనూ సర్పము
రక్షగనుందుము - అ పెనునావకు

బ్రహ్మకు రాత్రి గడచు వరకును
నీకు, మునులకు కష్టము కలుగక
కాపాడుచుందును-విను మహరాజా!
ఆ ఘన కార్యము కొరకై పుట్టితి!

పరబ్రహ్మమును నేనే రాజా!
నీ తపస్సుకు సంతసించితి
అనుగ్రహించగ దర్శనమిడితిని
అనుచు మీనము అదృశ్యమైనది."

రాజర్షియగు సత్యవ్రతుండు
దర్భశయ్యపై హరిధ్యానముతో
విలయసమయముకు ఎదురుచూచెను
అంతట మెల్లగ కల్పాంతముగనె.

ఆకాశములో మేఘములవ్వి
కారుచీకటిగ మార్చెనప్పుడు
జడివాన ఆగక కురిసె ధారగా -
సంద్రములవ్వి కల్లోలమయె

నదులు సంద్రముల జలములన్నియు
ఏకమై - భువి జలమయ మయ్యెను
జీవరాశులు సమస్తమున్నూ
భువిలో నున్నవి నీటిలొ తేలెను

సృష్టికార్యమున విరామమెరుగని
విరించి ఎంతో అలసటచెందెను
మేను వాల్చెను - రెప్పలుమూసెను
తలక్రింద తన చేయినిడుకొనె

అంతటిలోన నిద్రలొ మునిగెను
బ్రహ్మనిద్రలో, గుర్రుపెట్టెను
ఆసమయములో చతుర్ముఖుని
ముఖములనుండి-వేదములొచ్చెను

నిద్రలొబయటకు వెలువడినట్టి
వేదమ్ములను హయగ్రీవుడను
రాక్షసుండు పసిగట్టి - గుట్టుగా
అపహరించుకొని దాచె సంద్రమున

నిగమములన్నీ దొంగపాలయె
విషయము తెలిసెను జగన్నాథుడు
వేదమ్ములను రక్షించవలె
నావ రక్షణ చేయగవలెను

ఆఘనకార్యము చేయుటకొరకు
పెద్దశరీరము కురుచ తోకతో
బంగరు ఛాయతొ - చక్కని మచ్చల
ఘనమీనమ్ముగ - హరి నిలచెనట

ఒకే కోరతో వాడిచూపులతొ
దివ్యమీనము జలధిలొ పడెను
జలచరములతొ ఆడసాగెను
గట్టుకు చేరుచు మునుగుచుండెను

చిన్నచేపలను మ్రింగుచున్నది
రెక్కల - నీటిని చెదరగొట్టుచు
కెరటమ్ములను లక్ష్యపెట్టక
విసురుగ తిరిగెను సంద్రజలముల

మత్స్యావతారము-ప్రళయకాలమున
ప్రళయజలముల - ప్రళయమ్ముగను
సంచరించెను - శ్రీహరిలీలది
అంతట రాజు - గాంచెను నావను

ఓషధులున్ను - విత్తనమ్ములు
మహామునులును నావలొ కనబడె
సత్యవ్రతుడు - తా - నెక్కెను నావను
నీటతేలుచు సాగెను నౌక

ఆ మహరాజు గాంచె మీనమును
మునుల సాయముతొ మహామీనపు
కోరకు నావను బంధించాడు
అంతట రాజు - హరిని స్తుతించెను

"అవిద్యలోపడి అంధకారమున
సంసార జలధిలో పడిన జీవులు
అవిద్యతొలగగ జ్ఞానకాంతితో
మోక్షపదవిని అందగలరయా!

ఓ జగదీశా! నిరంతరమ్ము
మము కాపాడే పనిలో నుందువు
అంధునికి మరి త్రోవ చూపినటు
కన్నులున్నను - నీవు నడిపెదవు

ఓసర్వేశా! పుటముపెట్టగను
బంగారమునకు - వన్నెపెరిగినటు
నీసేవలతో పాపక్షాళనము
జరుగుచున్నది జీవులందరికి

నీ అనుగ్రహము - లేశమాత్రమున
ఇంద్రపదవిని - అందగలరయా!
మరి నీదయ అది - పూర్తిగనున్న
ఎంతటి స్థితిని కల్పించెదవో!

అజ్ఞానములో - గురువులనమ్మి
కనబడు వానిని కానకపోయిన
ఫలితము శూన్యము - ఓ పరమాత్మా!
నిన్నుమించిన గురువెవరయ్యా!

జగద్రక్షకా! నీవు తప్పమరి
వేరెవ్వరు - మము రక్షించెదరు
నిన్నుకాదని మరచి పోవుట
కండ్లుమూసుకొని-నిధిని దాటుటే!

జలప్రళయమున ఉద్ధరించెడి
విశ్వకర్తవు నీవేస్వామీ!
నీ అనుగ్రహము అనెడి కాంతితో
సృష్టిస్థితి లయ మొనరించెదవు."

## అష్టమస్కంధము

సత్యవ్రతుని ఆ ప్రార్థన వినిన
పరమేశ్వరుడు మీనరూపుడు
పరమానందము నందిన వాడై
గురువుగ రాజుకు బోధచేసెను

సాంఖ్యయోగ సహితమ్ముగను
పురాణసంహిత నుపదేశించెను
ఆ మహరాజు ఈ కల్పములో
వివస్వంతు-తనయుడు శ్రాద్ధదేవుడగు

ఆ మహనీయుడు – శ్రీహరి దయతో
ఏడవ మనువుగ లెక్కిడబడెను
అటుల రాత్రియది గడచిపోయినది
మత్స్యరూపుడు వెదకుచుండెను

సంద్రమునంతను కలంచివేసి
శ్రీహరి వెదకెను దుష్టునికొరకు
ఆగమమ్ముల వేదన వినబడె
మత్స్యరూపుని శోధన పెరిగెను

నిటారుగా తన ముఖమును నిలపి
తోకను గట్టిగ – విదలించుకొని
వెలుగులుచిమ్మే దేహకాంతితో
దౌడలు రెండు బిగించి పట్టి

వేదచోరుని – హయగ్రీవుని
వెదకెను – గాంచెను సంద్రగర్భమున
ఒక్కసారిగా మీదబడగను
ఉక్కిరిబిక్కిరి అయ్యెను అసురుడు

ఆగమాలను అందిన యట్టి
ఆనందములో పరాకుగాను
ఆతడుండగా అశనిపాతమై
అసురుని పైకి–దూకెను మత్స్యము

వెంటనె తలతెగి హయగ్రీవుడు
సంద్రగర్భమున మునిగిపోయెను
ప్రళయాంతమయి మునులందరును
వెలుగు రేఖకై వేచియుండిరి

బ్రహ్మారాణి తను మేలుకున్నది
పయ్యెదనంతట సర్దుకున్నది
బ్రహ్మకు మెలకువ వచ్చినదపుడు
మెల్లమెల్లగా కనులు తెరచెను

తెలతెలవారగ – ముందుగలేచిన
వాణిని గాంచి – తెల్లబోయెను –
చిరునగవులతో వీణాపాణి
భర్తకు వేడుక చేసిన దపుడు

పూర్తిగ వెలుగులు ప్రసరించినవి
పరమేశ్వరుడు ఆగమాలను
చేతధరించి తనకుమారుడగు
బ్రహ్మకుయిచ్చెను భద్రమనుచును

బ్రహ్మ – వాణియు వందనముంచిరి
శుభమస్తు అని దీవనలిడెను
స్వామీ – మీదయవల్లను మాకు
ఇడుములు తప్పెనుఅనుచు పలికిరి

బ్రహ్మ - శ్రీహరి ఆశీస్సులుగొని
భార్యతొ తిరిగి సంతోషముతో
ఆగమాలను తలను ధరించి
సృష్టిచేయగను ఆరంభించెను

ఓ మహరాజా! పెనుప్రళయమున
పరంధాముని - భక్తిగ కొలిచి
గట్టెక్కిన ఆ సత్యవ్రతుండు
మనువుగ తాను ఖ్యాతినందెను

అందువల్లనే కష్టమ్ములలో
శ్రీహరిదయ యది - కాపాడునని
నమ్ముటకొరకీ సత్యవ్రతుండు
సాక్షిగ - మనకు కనబడుచుండును

రాజర్షియగు సత్యవ్రతుని మరి
మత్స్యరూపుడగు మాధవదేవుని
వృత్తాంతమును వినిన - చదివినా -
బంధవిముక్తితొ సుఖములందెదరు

అంతియెగాక ఈ చరిత్రను
నిత్యము పారాయణగా చదివిన
ముంగిటనిలచును మోక్షపథమ్ము
సందియమెంతయు లేదు భూవరా!

ప్రళయ జలధిలో అసురుని జంపి
ఆగమాలను రక్షించి మరి -
బ్రహ్మకు సృజించ శక్తినొసగిన
మత్స్యరూపునికి - మనసా ప్రణతులు

శ్రీ కృష్ణచరితము - కర్ణపేయము
వ్యాసమౌనికే - శాంతినొసగినది
పోతనయ్య - పులకించి పలికినది
భవ భయ హారిణి - భాగవతమ్ము॥

ఓం శాంతి - శాంతి - శాంతిః





సర్వేజనాస్సుఖినోభవన్తు
లోకాస్సమస్తాస్సుఖినోభవన్తు





**సర్వం శ్రీ సీతారామచంద్ర పాదార్పణమస్తు**



(మకుటం)

శ్రీ కృష్ణచరితము - కర్ణపేయము
వ్యాసమౌనికే - శాంతినొసగినది
పోతనయ్యే - పులకించి పలికినది
భవ భయ హారిణి - భాగవతమ్ము॥

# శ్రీమద్భాగవత - మకరందము
## (నవమస్కంధము)

### విషయ సూచిక





శ్రీరామ

ఓం - నమో - వాసుదేవాయనమః

# శ్రీమద్భాగవత - మకరందము
## (నవమస్కంధము)

శుకయోగీంద్రుడు పరీక్షిత్తునకు
తెలియబరచిన దివ్యగాధను
సూతమహాముని - మునులందరకు
తీరుగ నచట తెలిపెను ఇటుల

బ్రతుకును దిద్దెడి పవిత్రగాధలు
ముక్తినొసగెడి మంగళ చరితము
దయతో - నాకు తెలుపుచుంటివి
వ్యాసనందనా - ధన్యుడనైతిని

మనువులు వారి వివరములన్నీ
విష్ణువుదాల్చిన అవతారములు
సత్యవ్రతుని ఆ పుణ్యచరిత్ర
తెలియబరచితివి - తీరుగవింటిని

సత్యవ్రతుండను సూర్యపుత్రునితొ
వైవస్వత మన్వంతర మేర్పడె
ఇక్ష్వాకువాదిగా అతని సంతతి
పదిమంది కొమరులని చెప్పితివయ్యా!

ఆపై వివరము - వంశ విస్తరణ
ఎటుల జరిగెనో తెలుపుముస్వామీ!
పుణ్యచరిత్రలు - స్తుతి పాత్రములు
పాపక్షాళనము చేయగలిగినవి

జగత్పావనమైన చరిత్రలు -
కర్మసాక్షియగు సూర్యదేవుని
వంశచరిత్రము - వినగోరితిని
అనగా పలికెను - శుకయోగీంద్రుడు

"ఓ మహరాజా! మనువంశమది
వేయి ఏండ్లుగా - వర్థిల్లినది
ఆపైవివరము నాకు అందదు
అంతటివరకు చెప్పెద వినుము.

కల్పాంతమున - విశ్వంభరుడు
ఒక్కడు మాత్రము మిగిలియుండెను
ఆయన - నాభి కమలము నందున
సృష్టికర్త తా ఉద్భవించెను.

ఆయన చేసిన మానవ సృష్టిలొ
మరీచి మహాముని - ఉద్భవించెను
మరీచి కొమరుడు కశ్యప - ప్రజాపతి
భార్య అదితి - యగు దక్షుని కూతురు

మరీచి అదితుల - సంతతి రాజా!
తమోహరుండగు - సూర్యదేవుడు
సూర్యుని భార్య సంజ్ఞాదేవి
వారి తనూజుడు - శ్రాద్ధదేవుడు

శ్రాద్ధదేవుని భార్య - శ్రద్ధయగు
ఆదంపతులకు యశోవంతులగు
పదిమందికొమరులు-వరుసలో వారు
ఇక్ష్వాకువును - నృగ శర్యాతిలు

దిష్ట ధృష్టుడు, కరూశకుండు
అరిష్యంతుడు, పృషద్ధుడు మరి
నభగుడు, కలియని వారి పేర్లయా!
యశోవంతులు వారందరును

తనయులకొరకై-మనువు యజ్ఞమును.
ఆరంభించి - చేయుచుండగా
ఆతని భార్య - హోతను కోరెను
పుత్రిక బడయగ కోరిక అనెను

ఆయిల్లాలు - వ్రతదీక్షతొ నట
నిష్టగ కూర్చొని - కోరుకొనగను
ఆవిధముగను హోమము జరపగ
ఆనతిచ్చెను - పురోహితుండు

తత్ఫలితముగా - కూతురు పుట్టెను
"ఇల" అనిపేరు పెట్టిరి శిశువుకు
మనువు మాత్రము వంతనొందెను
పుత్రసంతతి కాకపోయెనని

యజ్ఞ సమాప్తి జరిగినంతనే
వశిష్టువద్ద చేరి అడిగెను
నాసంకల్పము తెలిసియు మీరు
అనుగ్రహించక బోయిరి ఏల?

వశిష్టమహర్షి విషయము తెలిసి
హోతచేసిన సంకల్పముతో
ఫలితముమారెను - అని చెప్పి తను
శ్రీహరి స్తోత్రము - నిష్టగ చేసెను.

అంతట శ్రీహరి - ప్రత్యక్షమయి
వరముకోరుమన వశిష్టమహర్షి
"ఇల"ను మగబిడ్డగ - మార్చగకోరెను
అటులే మారెను - సుద్యుమ్నుడయె.

చక్కగ రాజ్యము నేలు సుద్యుమ్నుడు
వేటకుబోయి వేటాడుచును
మేరుపర్వత ప్రాంతమందలి
కుమార వనమును సందర్శించెను.

ఆవనమున మరి పార్వతిదేవితొ
శివుడు ప్రియముగ విహరించుచుండును
ఆవనమందున - కాలుమోపగను
స్త్రీగా మారెను - ఆ మహరాజు

వెంటవచ్చెడి సైనికులున్ను
రాజు గుఱ్ఱము - మారిపోయిరి
ఎంతోవంతలొ - వారువుండి రన
వివరము లడిగెను పరీక్షిత్తట.

అంతట చెప్పెను - వ్యాసకుమారుడు
మునులు కొందరొక రోజున భక్తిగ
శివదర్శనము చేయగ వచ్చిరి
ఆసమయములో ఉమాశంకరులు

ఆనందమున - వనముననుండగ
గాంచిన మునులు-వెనుకకు వెళ్ళిరి
పార్వతి ఎంతో సిగ్గుపడినది
అదిగమనించి శంకరుడపుడు

మెచ్చిన శివుడు పలికె నంతట
నామాటయది - కల్లకాదు మరి
నీకోరికను - నే తీర్చవలె
కావున తగిన మార్గమ్మిదియని.

వనమున మరి యొకపురుషుడు అడుగిడ
స్త్రీగా మారును - అనుచుపలికెను
ఆప్రభావమున సుద్యుమ్నుడును
అతని అనుచరులు - మారిరి స్త్రీలుగ

నెలదినములు మరి స్త్రీగానుండును
మరి ఒక నెలమరి - పురుషుండగును
అంతకుతప్ప - మార్గములేదని
తెలియబరచెను శంకరదేవుడు

వారందరును బయలుదేరిరి
బుధుని ఆశ్రమము చేరెను రాజు
బుధుని చూచెను - స్త్రీయగు రాజు
వారి చూపులు కలసిన వపుడు.

అటులే రాజును సింహాసనమున
కూర్చొనబెట్టెను కులగురువంతట
రాజు ధర్మముగ - రాజ్యపాలనము
కొనసాగించెను - నెలనెల మారుచు.

మన్మథబాణము - తగిలినవారు
ఒకటైనారు - ఫలితముగాను
కొమరుడు కలిగెను - పురూరవుండు
స్త్రీగామారిన సుద్యుమ్నుడంతట.

రాజుకు ముగ్గురు కొడుకులు కలిగిరి
ఉత్కలు గయుడు విమలుండ నుచు
నామధేయులు వారు ముగ్గురు
ఉత్తరదేశము నేలిరి చక్కగ

తిరిగి పురుషునిగ - మారుట ఎట్లని
చింతలోనుండి - తలంచె గురువును
అంతట వశిష్టమహర్షి వచ్చెను
సర్వము గ్రహించె కులగురువపుడు

అంతట వృద్ధాప్యము పైబడగా
సుద్యుమ్నుడంతట పెద్దకుమారుని
పురూరవుకి మరి పట్టముకట్టి
తపోదీక్షతో వనముల కేగెను

రాజు తిరిగి మరి - పురుషుడగుటకు
నిష్టగ తపమును - చేసె వశిష్టుడు
ప్రత్యక్షమయ్యెను పార్వతీపతి
రాజును మార్చగ కోరె వశిష్టుడు.

మనువంతటను మగసంతతికై
యమున ఒడ్డున నూరుఏండ్లు తను
తపస్సుచేసెను శ్రీహరి మెచ్చెను
ఫలితముగా మరి కొమరులు కలిగిరి.

ఇక్ష్వాకు ఆదిగా పదిమందిసంతతి
అందు పృషధ్రుడు అను తనయుండు
తండ్రిశాసనము అమలు పరచగా
పశుల కాపరిగ - అయ్యెను రాజా!

ఒక దినమున ఆపృషధ్రుండు
ఆవుల తోలుకు అడవికివెళ్లెను.
గోవులు తిరిగివచ్చు సమయమున
మబ్బులుకమ్మి వర్షము మొదలయె.

చీకటి పడినను వాన వెలవదు
అంతకంతకు ఉదృతమైనది
చిమ్మచీకటి - కుంభవృష్టిలో
గోవుల - తరువుల క్రిందకు-తోలెను

ఆచీకటిలో - ఆడవి యందున
గోరక్షణము చేయుచుండగా
పులి ఒకటొచ్చెను - అరచె గోవులు
చెల్లాచెదరై పరుగులెత్తినవి.

అంతట - ఆపులి గోవునుబట్టెను
అంబారవము వినిన పృషధ్రుడు
కత్తితొనరకెను - గోవుచచ్చెను
తిరిగి నరకగా - పులి చచ్చినది.

చిమ్మచీకటిలొ - జరిగినదంతయు
తేరిచూడగా - విషయము తెలిసెను
కసాయినైతిని గోహంతను అని
గోలుగోలున - ఏడువ సాగెను

అంతటవశిష్టు డచటకు వచ్చెను
కులగురువుకు తా వందన మించి
విషయముతెలిపెను వ్యాకులమతియై
దోషము చేసిన వాడవు నీవని

కోపించిన ఆ వశిష్టమహర్షి
రాజ్యభ్రష్టుడై శూద్రుడవగుదువు
అనుచు తిట్టెను - కుమిలెను రాజు
గురుశాపమది మదికలంచెను

గోవధ తోనే - గోలున ఏడ్చెడి
పృషధ్రునికి మరి గురుశాపమది
అశనిపాతమై వచ్చిపడినది
గురుపాదముల వ్రాలిపోగను.

దారుణ మరణము బ్రహ్మవ్రాసెను
అప్పుడు నీకీ దోషముతొలగును
అనుచుపలికెను వశిష్ట మహర్షి
గురువుమాత్రమిక - చేయునదేమని

పృషధ్రుడు తా కుమిలిపోవుచు
సర్వసంగ పరిత్యాగిగ మారెను
హరి ధ్యానముతో జితేంద్రియునివలె
కాలముగడుపుచు నుండెను - బాధగ

కలిగిన దానిని పంచియిచ్చుచు
తోటివారికి సాయపడుచును
దొరికిన దానిని మాత్రమె తినుచు
అశువులుంచుకొని గడపసాగెను.

అంధునిమాదిరి – జడునిమాదిరి
విరాగిగా మరి భూమిని తిరుగుచు
అడవిలోపల – కార్చిచ్చులో తను
దహింప బడి మరి మోక్షమునందెను.

మనువుకు మరి యొక కుమారుడాతడు
కరూశుడందురు – అతని సంతతి
ధర్మపధమున ఉత్తరాపధము
పరిపాలించిరి ప్రజలు మెచ్చగా

దృష్టుని వంశమునందలి వారును
సత్పధగాములు – పుణ్యమునందిరి
నృగుని వంశమున – సుమతి పుట్టెను
అతనికి తనయుడు – భూతజ్యోతి.

భూతజ్యోతికి తనయుడు – వసువు
వసువుకు తనయుడు ప్రతీకుడయ్యా
అతని కుమారుడు – ఓఘవంతుడు
ఆతని కూతురు ఓఘవతియగు

సుదర్శనుండు – ఆమెకు భర్త
వారి తనయుడు అరిష్యంతుడు
ఆతని కొమరుడు – దక్షుడు రాజా!
మీఢ్వాంసుడు – ఆ దక్షునికొడుకు

మీఢ్వాంసునికి తనయుడు – శర్వుడు
శర్వుని కొమరుడు – ఇంద్రసేనుడు
ఆతని తనయుడు – వీతిహోత్రుడు
సత్యశ్రవుడు – ఆతని కొమరుడు

సత్యశ్రవునికి – ఉరుశ్రవుండును
ఆతనికి మరి – దేవదత్తుడు
దేవదత్తునికి – అగ్నివేశుడు
తనయులుగా మరి ఉదయించిరయా!

అగ్నివేశుడు పుణ్యకర్మల
జాతకర్ణుడను ఋషిగా వెలిగెను
"అగ్నివేశ్యాయనం" వంశము వెలిసెను
అరిష్యంతుని వంశము అదియే.

ఇకపై – దిష్టుని వంశచరిత్ర
వినిపించెదనని – శుకుడు చెప్పెను
దిష్టుని తనయుడు నాభాగుడు – తా
వైశ్యత్వమును పొందెను రాజా!

అతని తనయుని – హలధరుడందురు
వత్సప్రీతి – ఆతని కొమరుడు
వత్సప్రీతికి – తనయుడు – ప్రాంశువు
ప్రాంశువుకొడుకు – ప్రమతి అగునయా!

ప్రమతికి తనయుడు – శుమిత్రుండు
అతని కుమారుడు – చాక్షుషుండగు
నివింశతి మరి ఆతని తనయుడు
అతని కుమారుడు – రంభుడు – రాజా!

రంభుని తనయుడు – శనినేత్రుండు
వాని కొమరుడు – కరంధనుండు
అవిక్షిత్తు ఆ కరంధను సుతుడు
మరుత్తుడాతని – తనూజుడయ్యా!

ఆ మరుత్తుడు తా చక్రవర్తిగా!
యశముగడించెను – ఆతనిగాథ
అతడొక – యజ్ఞము నెరపెను రాజా!
సంవర్తుడా–క్రతు–యాజకుడయ్యెను.

మరుత్తులున్ను విశ్వదేవులు
యజ్ఞసభ్యులుగ క్రతువునడిచెను
అపారదక్షిణ లిచ్చెను రాజు
విప్రోత్తములను సంతసపరచెను.

యజ్ఞమునందు విశేషమ్ముగా
సోమరసమ్మును గ్రోలిన ఇంద్రుడు
సంతసమంది సంబారములవి
బంగరు మయముగ మార్చివేసెను.

నిర్విఘ్నముగా భూరి దక్షిణల
వాసవు తృప్తిగ – విశేషయజ్ఞము
భువిలో సలిపిన – మహాదాత మరి
మరుత్తు మించి లేనే లేడు.

మరుత్తుకొమరుడు – దముడనువాడు
అతని తనయుడు రాజవర్ధనుడు
సుధృతి ఆతని తనూజుడయ్యా
సుధృతి తనయుడు – సౌధృతేయుడు

కీవలు డాతని వంశాంకురము
అతనికి తనయుడు బంధుమంతుడు
వేదవంతుడు అతనికి తనయుడు
బంధుడు – సుతుడా వేదవంతునికి

బంధుని తనయుడు తృణబిందుడగు
ఆతడు మిక్కిలి రూపవంతుడు
ఆలంబస యను అచ్చరకన్య
తృణబిందుని తా మోహించినది.

వారిరువురకు 'ఇలబిల' – అనెడి
కూతురుపుట్టెను – అంతట ఆమెను
విశ్రవసుడు తా పరిగ్రహించెను
వారికొమరుడు – ఇలబిలుడయ్యా!

ఆ ఇలబిలుని – కుబేరుడందురు
తృణబిందునకు కొమరులు యోగ్యులు
విశాలుడున్ను – శూన్యబంధుడు
ధూమ్రకేతువు అనెడివారలు

అమువ్వురిలో – విశాలు వంశము
వృద్ధినందినది ఆతని పేరున –
వైశాలియను – పట్నము వెలిసెను
ఆతని తనయుడు – హేమచంద్రుడు

హేమ చంద్రునికి ధూమ్రాక్షుడను
తనయుడు కలడు అతనికి పుత్రుడు
సహదేవుండను నామధేయుడు
అతనికి సుతుడు కృశాశ్వుడయ్యా!

కృశాశ్వ సుతుడు సోమదత్తుడు
ఆతడు నిష్టగ – ఇంద్రప్రీతిగా
అశ్వమేధ యాగమ్మును చేసి
పుణ్యలోకముల స్థానమందెను

సోమదత్తుని తనయుడు సుమతి
సుమతికి సుతుడు జనమేజయుడు
వైశాల్యమన్నది - వీరివంశము
తృణబిందు కీర్తిని నిలపిరి సుతులు

మనువుకు మరియొక తనయుండైన
శర్యాతి - ఎంతో విద్యావంతుడు
వేదవేత్తయు - ఆతని తనయ
సుకన్య అనెడి సుగుణాలగని

చెలికత్తెలతో వనమున తిరుగుచు
పుట్టనొకటి గని పరీక్షించగా
రెండుకంతలలొ - వెలుగులు కనబడె
మిణుగురులనుకొని-పొడిచె పుల్లతో -

దైవవశమున అటుల జరిగెను
కంతలనుండి - రక్తము కారెను
దూరములోగల రాజభటులకు
మలమూత్రములు బంధింపబడె

అంతట రాజు - తన సేవకులతొ
అకార్యమేదో చేసిరీవనిని
దానికి శిక్షగ - దుర్దశ కలిగెను
అనుచుండగను - సుకన్యవచ్చెను.

జరిగినదంతా తెలియబరచెను
రక్తము కారుట వివరించగను
భయమునిండిన - ఆ మహరాజు
పుట్టనుజేరి - లోనకు చూచెను.

దివ్యతేజముతొ చ్యవను మహర్షి
తపముచేయుచు అగపడె రాజుకు
క్షమించమనుచు పదముల బడెను
దేహభావమే మరచిన మౌని

చ్యవనుమహర్షి - అభయమునిచ్చెను
అంతట రాజు తన కూతురగు
సుకన్యచేసిన తప్పిదమ్మునకు
శిక్షగ - ఆమెను మునికి ఒసగెను.

సుగుణశీలము దయాపూర్ణయగు
సుకన్య - ఎంతో వినయమునిండి
మునిసేవలలో - లగ్నమైనది
కోపతాపముల చలించలేదు.

ఎన్నో తిప్పలు - పెట్టినగాని
ఓర్పుతొనామె నిలబడియుండి
భూదేవతను తలపించినది
భర్తసేవలే పెన్నిధి అనుకొనె

ఒకదినమున ఆ ఆశ్రమమ్మునకు
దేవవైద్యులు అశ్వని సురలు
వచ్చిరి - వారిని చ్యవను దంపతులు
యధావిధిగను - సత్కరించిరి.

అంతట పలికెను చ్యవను మహర్షి
అశ్వని దేవతలైన మీకు మరి
హవిర్భాగములు సోమపానము
అందకున్నవి - తెలియును నాకు

ఆరెండును మరి కలిగించెదను
ముదుసలి నైతిని - శక్తిచాలదు
కావున-ముదిమిని దూరము చేయుడు
అనగా వారు ఆనందించిరి.

పలికిరి మునితో మహానుభావా!
ఇదిగో - మడుగు - దేవనిర్మితము
మడుగులో మునిగిన పోవును ముదిమి
అనుచు మునితొ ఆ మడుగున దుమికిరి

రెప్పపాటులో దివ్యతేజముతొ
సమానమైన అందచందముల
రూపురేఖలు సౌకుమార్యముతొ
ముగ్గురు వచ్చిరి నేలమీదకు.

ఆనందముతో పరవశమ్ముతో
సుకన్య - భర్తను పోల్చగలేక
పాతివ్రత్యపు బలము చేతను
ప్రార్థన చేసెను పతిని చూపమని

అశ్విని సురలు సంతస పడిరి
అందచందముల నవయౌవనమున
అంగజు మించిన - మూర్తిగ మారిన
అనఘుని-చ్యవనుని చూపిరి ఆమెకు.

క్రొత్త జీవితము - మొదలై వారు
ఆనందసీమలో విహరించుచును
ధర్మబద్ధముగ దాంపత్యమును
నిర్వర్తించుచు గడపసాగిరి.

యజ్ఞము చేయగ సంకల్పించిన
శర్యాతిరాజు - బిడ్డను, అల్లుని
పిలచుటకొరకై - ఆశ్రమసీమలో
అడుగిడి - గాంచెను అవాక్కు అయ్యెను.

సుకన్య - తానొక యౌవ్వన వంతుని
ప్రక్కన కూర్చొని ముచ్చటలాడుట
గాంచిన రాజు - కలవరపడెను
కూతురు నడవడికెంతో క్రుంగెను

భరించలేక ఆవేదనతో
వంశము చెరపిన - కులటవు అనెను
ముదుసలి భర్తను - వదలి స్వేచ్ఛగా
తిరుగుచునున్న - దుష్టవనిత వనె

మందహాసమున పలికె సుకన్య
జనకా! ఈయన - నీజామాత!
నీకూతురునగు నేను ఎన్నడూ
త్రోవ తప్పి మరి చరించనయ్యా!

అనుచు వివరముగ విషయము తెలుపగ
తలనువంచుకొని క్షమించమనెను
వారిద్దరికీ ఆశీస్సులనిడి
వెంబడి తీసుకు సాగె ముదముగా

మామ యజ్ఞమును యథావిధిగను
చ్యవనుమహా ఋషి చేయించి అంతట
సోమరసమ్మును గ్రహించమనుచు
అశ్విని సురలను ఆహ్వానించెను.

సోమరసమ్మును ఇవ్వజూపిన
చ్యవనునిపై మరి కోపమునంది
వజ్రాయుధమును ఎత్తెను ఇంద్రుడు
తపోవంతుడది సహించలేక

అటులే చేతిని నిలపివేయగా
ఎత్తినచేతిలొ – వజ్రముతోను
గాంచెను ఇంద్రుని సకలజగత్తు
తెలివి కలిగినది దేవరాజుకు

మనసునిండుగా తపోవంతుని
స్తుతించినంతనె విముక్తికలిగెను
ఆవిధముగను చ్యవనుని దయతో
సోమరసమ్మున భాగమునందిరి

కాలక్రమమున శర్యాతి రాజుకు
ఉత్తానబర్హి – అనర్తుడును
భూరిషేణుడను – కొమరులు కలిగిరి
అనర్తు తనయుడు – రైవతుడయ్యా!

ఆరైవతుడు అమిత బలాఢ్యుడు
సంద్రమునందు కుశస్థలియను
పట్టణమ్ము నిర్మించుకు – భూమిని
ప్రజలు మెచ్చగా పరిపాలించెను

అతనికి తనయులు పదిమందియును
రేవతి యనునొక కూతురు కలిగెను
ఒక దినమున తన కూతురు తోడను
బ్రహ్మలోకమున కేగెను రాజు.

బ్రహ్మకొలువులో గంధర్వ కిన్నరులు
నృత్యగీతములు సలుపుచుండిరి
బ్రహ్మదర్శనము ఆలశ్యమైనది
సద్దుమణగగా బ్రహ్మనుజేరెను.

భక్తి ప్రవత్తుల అట విధాతకు
వందనముంచి పలికెను రాజు
తనకూతురుకు – వరుడు ఎవడని –
వివరించమని భక్తిగ కోరెను.

నవ్వుచుపలికెను చతుర్ముఖుండు.
ఈమెకు తగిన వరులు – అందరూ
సాగిపోయిరి – వారేకాక
వారిపిల్లలు వంశములన్నీ –

కాలగర్భమున కలిసి పోయినవి
నీవు ఇచటకు వచ్చులోపల
ఇరువది ఏడు పర్యాయములు
నాల్గు యుగముల చక్రము తిరిగెను.

విషయము చెప్పెద వినుము శ్రద్ధగా
భూభారమును హరించ నెంచి
శ్రీహరి పుట్టెను – బలభద్రునిగా
ఆయన – నీకు తగిన అల్లుడనె.

బ్రహ్మమాటను గురిగా నెంచి
బలభద్రుని పదములు భక్తిగ కడిగి
కూతురునిచ్చి పెండ్లి చేసెను
తపసు చేసుకొన సాగె – శర్యాతి.

మనువుకు-నభగుడు మరియొక సుతుడు
అతని సంతతిలో - నాభాగునకు
కలియని పేరు అతని సోదరులు
రాజ్యభాగమును యివ్వక పోయిరి.

బ్రహ్మచారియగు నాభాగుడు - తా
భాగమిమ్మని అన్నల నడుగగ
తండ్రిని అడుగగ - చెప్పి పంపిరి
అంతట తండ్రి అతనితో పలికెను.

జరిగినదేదో జరిగిపోయినది
అన్నదమ్ములతొ తగవులెందుకు
ధనికుడవగుటకు - త్రోవచెప్పెద
అనుచు తండ్రి-తా-తెలిపె తనయునకు

అంగిరసులు అట సత్రయాగమును
సలుపు చుండిరి వారికి నీవు
వైశ్యదేవ సూక్తులు రెండు
సందర్భముగా చెప్పినయంత

సంతసమంది - కవియని - పిలచి
స్వర్గమేగుచు - మిగిలిన ధనము
నీకు ఇచ్చెదరు - అంతట నీవు
ధనవంతుడవై సుఖపడగలవు

అటుల చేసిన నాభాగునికి
అమితధనము వారిచ్చి వెడలిరి
అంతటిలోన కాటుక రంగుతొ
నిలబడెనచటొక దీర్ఘకాయుడు.

ఆతడు పలికెను ఈధనమంతయు
అంగిరసులు మరి నాకు ఒసగిరి
అనగా తనదని నాభాగుడన
ఆతని తండ్రిని నిర్ణయించమనె

తండ్రిని జేరిన నాభాగుండు
విత్త మెవరిదని - అడిగిన యంత
తొలుత ధనమును రుద్రున కొసగిరి
అందువలన ఆ ధనమాతనిదనె

విషయము తెలిసిన నాభాగుండు
పరవశమ్మున తిరిగివచ్చి అట
నిలచిన మూర్తిని రుద్రుదేవుని
పాదములంటి ప్రార్థన చేసెను.

స్వామీ! ధనము మీదేనయ్యా!
పితృదేవులు చెప్పిరి - విషయము
తెలియక నేను - అడ్డుపడితిని
అనుచు భక్తిగా నాభాగుడనె

అంతట రుద్రుడు తండ్రీ తనయుల
ధర్మతత్పరత కెంతో పొంగెను
ధనమంతయును ఆతనికొసగి
ఆత్మజ్ఞానము బోధించెనయా!

ఓ మహరాజా! నా భాగుచరితము
భక్తి శ్రద్ధలతొ రెండుపూటలా
చదివినవాడు - సత్కవియగును
మంత్రవేత్తయై సుఖములనందును.

మంగళప్రదమగు జీవనమ్ముతో
ఇహాభోగములు అనుభవించి మరి
దేహత్యాగముతొ ముక్తినందును
అనుచు శుకుడు తా రాజుకు తెలిపెను.

తిరిగి పలికెను శుకయోగీంద్రుడు
ఓ మహారాజా! నాభాగుని తనయుడు
అంబరీషుడు - విష్ణుభక్తుడు
అతని చరితము పుణ్య ప్రదమయా!

అంబరీషుని భక్తిముందర
ఋషిశాపమ్మది వ్యర్థమైనది -
అనగా రాజు - ఆత్రమునిండి
వివరముగా వినిపించగకోరెను.

॥శ్రీ కృష్ణచరితము॥



# 1 అంబరీషోపాఖ్యానం

ఓ మహారాజా! మనువంశమున
భూమినేలిన నాభాగునికి
తనయుడాతడు - అంబరీషుడు
కీర్తిమంతుడు - సాధుశీలుడు

ఏడు దీవులను నిరాటంకముగ
ప్రజారంజనగ పరిపాలించెను
ఐశ్వర్యములో మిన్నయైనను
హరిస్మరణమ్మే భాగ్యమనుకొనును

విషయ లోలుడు కాడా రాజు
విజితేంద్రియుడై కీర్తిగడించి
విజయ పథమున - భూమినేలుచు
విష్ణు ధ్యాసతో - నిరతము గడపును

మదిలోన హరి ప్రతిష్ట చేసుకు
మంగళమూర్తిని కన్నుల నింపుకు
మది పులకింతతొ - గానమువినుచు
మనుగడ నాతడు సాగించెనయా!

హరి భక్తునికి ఎదురుగ నేగి
పదములనంటి - తోడ్కొనివచ్చి
పాదధూళిని స్వయముగ తుడిచి
పరవశించును ఆ మహారాజు

హరి భక్తులతో నెయ్యము చేయును
హరి భక్తులను ఆదరించును
హరి భక్తులకు ఆశ్రితుడాతడు
హరిని మరచిన ఘడియే లేదు.

వశిష్టాదులు మహాఋషులచే
ఆశీస్సులుగొని అంబరీషుడు
సరస్వతీనది తీరమందున
అశ్వమేధములు ఎన్నోచేసెను.

భూరి దక్షిణలు ఋత్విక్కులకిడి
వారిమన్ననల నందెను రాజు
అహర్నిశము శ్రీహరి ధ్యానముతో
ఎన్నిక భక్తుడు - ఎంతని పొగడుదు.

ఓ మహారాజా! కరుణాధాముడు
భక్తులపాలిటి పారిజాతము
శ్రీహరి వచ్చి అంబరీషునికి
దర్శనమిచ్చి ధన్యుని చేసెను.

భక్తికి మెచ్చి సుదర్శనుండు
శత్రుహరణము జగద్రక్షయగు
దివ్యచక్రమగు సుదర్శనమ్మను
ప్రియముగ నిచ్చి - ఆశీస్సులనిడె

అంబరీషుని అర్ధాంగి - భర్తను
అనుసరించెడి - దర్మచరిత్ర
అహరహమును శ్రీహరి ధ్యానముతో
అంతా గాంచును - విష్ణుమయముగా

ఆలితో కలసి - అంబరీషుడు
అతినిష్టగను ఒక ఏడాది
అమోఘ వ్రతము - ద్వాదశి వ్రతము
అనుష్టించెను యధావిధిగను

దీక్షగ - వ్రతమును పూర్తి చేసుకొని
కార్తీకములో మూడు దినములు
ఉపవాసదీక్షను ఆచరించుకొని
యమునా జలముల స్నానము చేసి

మధువనమందు విష్ణుప్రీతిగా
మహాభిషేకము పూర్తిచేసెను
ఉపచారములతొ పూజనుచేసెను
విష్ణుప్రీతిగా సంతర్పణచేసెను.

బంగరుకొమ్ముల మెరసిపోయెడి
వత్సలు గలిగిన ఆలమందను
ఆరు అర్బుదము సంఖ్యలొవాటిని
వేదవిదులకు దానముచేసెను

అసంఖ్యాకమగు విప్రోత్తములకు
అన్నదానము తృప్తిగచేసి
ఆశీస్సులను అందినయంత
పారణచేయగ కూర్చొనె రాజు.

దుర్వాస మహాముని శిష్యగణముతో
వేంచేయగను - దిగ్గునలేచి
అంబరీషుడు తోడ్కొనివచ్చి
ఉచితాసనమున కూర్చొనజేసెను.

మునిపదములకు వందనముంచి
వినయమునిండి పలికెను రాజు
తనగృహమందు దేవతార్చన
అనుగ్రహించగ ధన్యుడగుదునని

స్నాన నియమము తీర్చుకు వచ్చి
ఆరగింతునని - రాజుకు చెప్పి
శిష్యగణముతో మునిపుంగవుడు
స్నానార్థమయి యమునకు వెడలెను.

నదికివెళ్ళిన ముని రాడాయె
పారణ సమయము మించిపోవును
వ్రతభంగము అని తలచుచు రాజు
క్షణమొక యుగముగ నిరీక్షించెను.

పారణకింక అర్ధముహూర్తము
సమయము మాత్రము మిగిలియున్నది
దాటిపోయిన ద్వాదశి తిధి యది
గడచిపోయి - మరి ఫలితము దక్కదు.

ముని రాకుండగ భుజించలేడు
తిని-ముని కిడినచొ-ఎంగిలి అగును
దిక్కుతోచక - ధర్మమార్గమును
ఉపదేశించగ - విజ్ఞుల నడిగెను.

ద్వాదశి తిధిలో జల పానముతో
వ్రతము పూర్తి - మరి చేసినచో నిక
తినినట్టుగను లెక్కకు రాదు
ఉపవాసమని చెప్పగ రాదు

వారు చెప్పిన ధర్మసూక్ష్మమును
మదిలోతలచి అంబరీషుడు
జలమునుగ్రోలి శ్రీహరిస్మరణతొ
అతిధికోసమై నిరీక్షించెను.

కొంతసేపటికి మౌనివచ్చెను.
వడ్డనలన్నీ పూర్తిచేసిరి
అంతటమౌని దివ్యదృష్టితో
రాజు - నీటిని గ్రోలుట తెలిసెను

దిగ్గునలేచి రుసరుసలాడెను
అగ్నిహోత్రమన - మండిపడుచును
మూర్ఖుడవీవు - అతిధికి పెట్టక
ఆరగించిన కుమతివి - అనెను.

ఉచ్ఛిష్టమును పెట్టిన ధూర్తుడ
హరి భక్తుడవు ఎటులగుదువు నువు?
నీకు బుద్ధి మరి చెప్పక వదలను
అనుచు - జటను అట నేలకు కొట్టెను

జటాబంధమున పెరకిన జటను
నేలకు కొట్టగ ఆశ్చర్యముగా
కృత్యయనునొక రక్కసిరూపము
ముని ఆనతితో బయలుదేరెను.

విరబోసిన ఘన శిరోజాలతో
శూలపాణియై అట్టహాసమున
భూమి అదరునటు అడుగులేయుచు
అంబరీషునిపై బడవచ్చెను

అంతట శ్రీహరి - భక్తరక్షకుడు
వెర్రితపసికి వివేక మొదవగ
మూర్ఖక్రోధమును - మొదటికి నరకగ
చక్రాయుధముకు ఆనతినిడెను.

అగ్నికీలలచె నిండిన - చక్రము
రాజుపంపినటు - దూసుకువచ్చెను
ముందరవున్న కృత్యనుకాల్చెను
ముందుకువచ్చి - మునిపైబడెను

అసువులు నిలపగ దూర్వాసుండు
పరుగిడసాగెను - చక్రము వదలదు
మేరుపర్వత గుహలో దూరెను
చక్రము వదలక - వెంబడించెను.

భయపడి మౌని గుహనువదలెను
దిక్కుతోచక - పాతాళముచనె
ఊపిరిపీల్చుకు నిలబడినంతనె
నేనున్నానని - వచ్చెను చక్రము

తిరిగి పరుగుతో - మౌని అంతట
సంద్రజలముల తెగించి దూకెను.
వదలనుస్వామీ! అనునట్టుగను
చక్రము వెంబడి నీటిలొదూరెను.

ప్రాణభీతితో - వెర్రితాపసి
నింగి కెగిరెను - వదలదు చక్రము
దిక్కుదిక్కులకు దీనవదనుడై
పరుగిడె తాపసి - ప్రాణభీతితో

అడ్డేమున్నది - నాకిల అనుచు
వెంబడించెను - విష్ణుచక్రము
ఇంద్రునిలోకము - చంద్రునిలోకము
మొదలగు లోకములన్నీ తిరిగెను

వారెవ్వరును అభయము నిడక
త్వరగాపొమ్ము! ఆపద మాకని
వెడలగొట్టిరి - తాపసోత్తముని
తప్పు తెలియడా - తామస మౌని

దీనవదనమున సత్యలోకమున
బ్రహ్మదేవుని అభయముకోరెను
విష్ణుచక్రమును ఎదిరించగను
వశముగాదని చెప్పి పంపెను.

నేరుగ సాగి కైలాసమున
ఫాలనేత్రుని పాదములంటెను
విష్ణువు ఆనతి శిరోధార్యమై
తిరిగెడివారము అని వివరించెను

చక్కని యోచన చెప్పెను - పశుపతి
నేరుగసాగి లక్ష్మీకాంతుని
పాదములంటిన - పరంధాముడు
దయాసముద్రుడు - రక్షించుననె

వైకుంఠమున లక్ష్మీదేవితొ
కనకసౌధమున కొలువుతీరిన
శ్రీవత్సాంకుని - దర్శనమంది
క్షమించమనుచు ప్రార్థనచేసెను

తరుణోపాయము - నీస్మరణమ్మొ
జన్మరాహితి - నీదర్శనము
ఇడుమలబాపెడి నీవదనమ్మొ
గాంచితినోహరి - కనికరించుము

నీదు మహిమను తెలియకపోతిని
భక్తసులభుడవు - కరుణాసింధు
నను కాపాడుము - చక్రమునుండి
తప్పు తెలిసితి - అహమువదలితి

పశ్చాత్తాపుని - మునినిగాంచిన
శ్రీహరిపలికెను వాత్సల్యముతో
భక్త పాశముల - బద్ధుడ నేను -
వారి హృదయముల వసింతునయ్యా!

నాకై నేను కోరనేదియు
కోరినదొసగెద - నాభక్తులకు
పతివ్రతకు - తన భర్తలొంగినటు
భక్తులకెపుడును - లొంగియుందును.

తపస్సు, విద్యలు, బ్రాహ్మణసంపద -
దుర్మార్గునకవి - కీడొనరించును
అన్నితెలసియు - సాధుహింసకు
దిగిన నీకు - ఈదుర్గతి కలిగెను.

సాధుజనుల హృదయమ్ముల నున్న
నాదుతేజము - వారికి రక్షణ
విషయము వినుము నిను రక్షించగ
చాలినవాడా - అంబరీషుడే!

సద్గుణయుతుని అభయముకోరిన
అనుగ్రహించి - మేలుచేయును
అనగా మౌని - పరుగునవచ్చి
అంబరీషుని పదముల బడెను.

మౌనివచ్చి తన పదముల బడగ
ఉక్కిరి బిక్కిరి - అయ్యెను రాజు
బ్రాహ్మణోత్తముడు పదములుబట్టుట
తగని పనియని - వణకిపోయెను.

వెంటనె రాజు కరములు మోడ్చి
ప్రార్థన చేసెను సుదర్శనమ్మును
చక్రరాజమా! నమస్సులివిగో!
సృష్టిసర్వము నీదేనుసుమా!

నీదు ఘనతను పొగడగవశమా!
శాంతివహించి - కావుము మునిని
నీతేజమును గాంచినంతనే
దైత్యసంఘములు నిర్జీవమగు -

ధర్మరక్షణకు హరికి తోడ్పడే
నీదుపుణ్యమును ఎన్నగతరమా!
బ్రాహ్మణోత్తముడు - దైవము అనుచు
నమ్మిన నాదు - వినతిని వినుము

దూర్వాసుని - నువు వదలిపెట్టుము
ముని కపకారము తలంచవద్దు
నాపై హరికి - ప్రీతియున్నచో
మౌనివర్యుని - రక్షణచేయుము

అంబరీషుని ప్రార్థనవినెను
శాంతివహించెను - సుదర్శనమ్ము
బ్రతుకుజీవుడా అని ముని తలచెను
ప్రియముగ రాజుకు దీవన లిడెను.

ఓ మహరాజా! ధన్యుడవయ్యా!
హరిని పూర్తిగా నమ్మిన - నీకు
పూర్తిగ వశుడై - ఉండెను శ్రీపతి
జన్మనెత్తిన ఫలముదక్కెను.

నీకపకారము తలచిన - నాకు
పెద్దమనసుతో - బుద్ధిగరపితివి
సౌమ్యముగా - నాతప్పు దిద్దితివి
నాప్రాణములను - నిలిపితివీవు.

నాపాపమునకు నిష్కృతిలేదు
భక్తుని - బాధకు గురిచేసితిని
భక్తబంధువు శ్రీహరి నాకు
కన్నులు రెండు తెరిపించాడు

హరిని - పూర్తిగా నమ్మిన నీకు
అడ్డమన్నది - లేనే లేదు
ఎల్లవేళలా! ఓ మహరాజా!
నీకు శుభము - నే కోరెదనయ్య!

అనిపలికి - ముని - శలవుకోరగా
పొగడ్తలన్నీ శ్రీహరికేనని
ఆతిధ్యమ్ము స్వీకరించమని
భక్తిగ మునిని - వేడెను రాజు

నీ దర్శనము చేయగ నాకు
ఎంతోకాలము నుండి కోరిక
అది నెరవేరెను అనుచు పలుకుచు
మృష్టాన్నమును ఆరగించెను

నీ పలుకులను వింటిని నేను
నీ ప్రసాదము గొంటిని నేను
నీ చరిత్ర అది శాశ్వతమ్మిల
నేపోయెదనని నింగిని సాగెను.

దూర్వాసమహాముని సాగిన నుండి
విషయము సర్వము మరి మరి తలంచి
నిమిత్త మాత్రము తనశక్తియని
భక్తిని - బ్రతుకున-పూర్తిగ నింపెను

అస్థిరమైన సుఖభోగములను
పూర్తిగ వదలి మనశ్శాంతితో
రాజ్యభారము కొమరులకిడెను
అడవులకేగెను హరి ధ్యానముతో

అంబరీషుని దివ్యచరిత్ర
చదివిన - వినిన - నరులందరికీ
జ్ఞానము భోగములన్నీ అమరి
పుణ్యపదవి అది లభించునయ్యా!

అంబరీషునికి ముగ్గురు కొమరులు
విరూపుడున్ను - కేతుమంతుడు
శంభుడు అను ఆ ముగ్గురు తనయులు
తండ్రికి తగిన పరమయోగ్యులు

కేతుమంతుడు, శంభుడు మాత్రము
పిన్నవయసులో హరి ధ్యానమున
రాజ్యభోగములు వలదని పలికి
తపస్సు చేయగ వనములకేగిరి

పెద్ద కుమారుడు రాజ్యమేలెను
పృషదశ్వుడును - వృషదశ్వుండు
రధీరుడున్నూ - ఆతని తనయులు
ధర్మతత్పరులు కీర్తిగడించిరి

రధీరునకును అంగిరసముని
అనుగ్రహమ్మున తనయులు కలిగిరి
రధీరస - అంగీరస గోత్రమ్ములతొ
బ్రాహ్మణ వంశజులయ్యిరి వారు.

ఇక్ష్వాకు వంశము ప్రసిద్ధమైనది
దానిక్రమమును వినిచెద ననుచు
శుకయోగీంద్రుడు పరీక్షిత్తునకు
తెలియబరచెను మృదుమధురముగా

మనువు ఒకపరి - తుమ్ముతుమ్మగా
నాసికారంధ్రమునుండి వెలుపలికి
మగ శిశువొకడు - వచ్చెను-వానికి
ఇక్ష్వాకువు అని పేరు పెట్టిరి.

సూర్యవంశముకు మూలపురుషుడగు
ఇక్ష్వాకువునకు తనయులు నూర్గురు
వారిలో వికుక్షి - నిమి - దండకులు
హిమగిరి వింధ్యలో పుడమినేలిరి.

ఇరువదిఐదుగురాతని తనయులు
తూర్పు పడమటి దేశములేలిరి
నలుబదిఐదుగురు వారి తనయులు
ఉత్తర దక్షిణ భూముల నేలిరి.

ఇక్ష్వాకువు - తన జ్యేష్ఠునిగాంచి
అష్టకాశ్రాద్ధమను పితృకార్యముకు
పరిశుద్ధమగు మాంసము తెమ్మని
ఆనతిచ్చెను - వికుక్షి కదలెను

ఇచ్చవచ్చినటు అడవి యందలి
జంతువులెన్నో చంపబడినవి
వేటలో అలసి ఆకలి పెరిగెను
అంతట - కనెనొక - చెవుల పిల్లిని

వెంటనె పిల్లిని కోలను కూల్చి
మాంసము కొంత భక్షణ చేసి
మిగిలిన శేషము తండ్రికి యిచ్చెను
పితృకార్యమది ఆరంభమయె

శ్రాద్ధమ్మునకు భోక్తగ వచ్చిన
కులగురువైన - వశిష్టమహర్షి
దివ్యదృష్టితో సర్వము తెలిసి
ఎంగిలి మాంసము నిషిద్ధమనెను

విషయము తెలిసి తండ్రి అంతట
రాజ్యమువదలి తనయుని పొమ్మనె
అంతట రాజు యోగిగ మెలగి
వనమునకేగి - మోక్షమునందెను

తండ్రిగతించుట వినిన వికుక్షి
తిరిగి - రాజ్యము చేరెను - వానిని
చెవుల పిల్లిని - భక్షించెనని
శశాదుడని మరి - పిలువసాగిరి.

వికుక్షి అంతట ధర్మమార్గమున
ప్రజలను ఏలి హరిని కొలచుచు
యజ్ఞయాగములు మెండుగ చేసి
పుణ్యాత్మునిగా రోజులు గడిపెను.

వికుక్షి తనయుడు పురంజయుండు
అసురపురంబులు జయించెనాతడు
ఇంద్రుడు వాహనమయ్యెను గావున
ఇంద్రవాహుడను - మరియొక పేరు

వృషభరూపమున నున్న ఇంద్రుని
మూపున కూర్చొని - సమరముచేసెను
కావున అతనిని - కాకుత్థ్సుడని
పిలుచుచుండిరి ఓ! మహారాజా!

కృతయుగమందు చివరి భాగమున
సురాసురులకు పోరు జరిగెను
ఇంద్రుడు ఓడి - హరిని - శరణన
పురంజయుడు నీకండ నిలచుననె.

పురంజయునిలో ప్రవేశించెద
ఇంద్రా! నీవు వృషభముకావలె
అతనిని నీవు మూపున మోసి
సమర భూమికి గొనిపోవలెను

నాశక్తిని మరి పొందుట వలన
పురంజయుడు ఆ అసురపురంబులు
జయించి నీకు - సమర్పించును
అనుచు శ్రీహరి మార్గము చెప్పెను.

విష్ణు శక్తితో ఇంద్రవాహుడై
అగ్ని శరములతొ ఆ శశాదుడు
అసురులపురములు లీలగ గెల్చి
ఇంద్రుని కొసగి పురంజయుండయె

ఓ మహారాజా! ఆవిధముగను
ఇక్ష్వాకు వంశపు వీరులవలన
దేవతలటుల మేలువడసిరి
అంతటిఘనులా ఇక్ష్వాకువంశజులు

పురంజయునికి - అనేవసుండు
అతనికి పృధువు - ఉద్భవించిరి
పృధువు తనయుడు విశ్వగంధుడు
విశ్వగంధునికి - చంద్రుడు కలిగెను

చంద్రుని సుతుడు - యవనాశ్వుండు
అతని కుమారుని 'శవస్తి' యందురు
వానికితనయుడు బృహదశ్వుండు
అతనికొమరుడు కువలయాశ్వుడు.

కువలయాశ్వుడు మహావీరుడు
తనయులగూడి దుంధుండని యెడి
దేవవైరిని హతమార్చగను
దుంధుమారుడని పేరుగలిగెను

దుంధుని ముఖమున అగ్నివెలువడి
దృఢాశ్వుడు కపిలాశ్వుడును
భద్రాశ్వుడను కొమరులు - తక్క
మిగిలిన వారు దగ్ధమాయిరి.

దృడాశ్వతనయుడు - హరియశ్వుండు
వానికి సుతుడు - నికుంభుడయ్యా!
నికుంభు సుతుడు బర్హిణాశ్వుడు
అతనికి తనయుడు కృతాశ్వుండు

కృతాశ్వు కొమరుడు సేనజిత్తయా!
వానికి తనయుడు యవనాశ్వుండు
పుత్రసంతతి లేకపోవుటచె
ఇంద్రయాగము చేసెనాతడు

యాగము శ్రద్ధగ చేయుచుండిరి
మంత్రజలమునొక కలశము నుంచి
మగబిడ్డ కలగవలెనని సంకల్పించి
పట్టమహిషులకు ఈయదలచిరి

రాత్రి అందరూ నిద్రలోనుండగ
రాజుకు మిక్కిలి దాహమాయెను
నీటిని వెదకగ మంత్రజలమది
కనబడినంతనె త్రాగివేసెను

ఉదయముకాగా ఋత్విక్కులట
నీటిని వెదుకగ విషయము తెలిసెను
రాజుగర్భమును చీల్చుకునంతట
మగశిశువొకడు బయటకువచ్చెను

సర్వలక్షణ సంపన్నుడగు
శిశువు ఏడ్వగా ఇంద్రుడంతట
స్వయముగవచ్చి చూపుడువేలును
నోటిలోనుంచి ఆకలితీర్చెను

వాసవుడంతట ఆబిడ్డడికి
మాంధాతయని - పేరును బెట్టి
చక్రవర్తియగు - బాలుడు అనుచు
అంతర్ధానము అయ్యెనురాజా!

ఈశ్వరుదయకు పాత్రుడు అయిన
యవనాశ్వుండు తిరిగి బ్రతికెను
మాంధాత పెరుగుచు బలవంతుడయి
రాజ్యాభిషేకము చేయించుకొనె.

ఆ పరాక్రముడు రావణుడాదిగ
అసురులెందరినొ జయించినాడు
త్రిదస్యుడని బిరుదు నాతడు
ఇంద్రునివలన - గ్రహించినాడు

శత్రువులందర - తాపమడంచి
యజ్ఞయాగములు మెండుగ చేసెను.
సమారాధనల కంతము లేనటు
అన్నదానము దండిగ చేసెను.

జగత్తుఅంతా - విష్ణుమయమని
నమ్మినభక్తుడు - ఆ మాంధాత
కృతయుగమంతకు వన్నెతెచ్చిన
ఎన్నికరాజు - మాంధాత యగు

ప్రజారంజకము ధర్మబద్ధముగ
భూమినేలిన సార్వభౌముడు.
మాంధాత తన రాజ్యమునందున
ఈతిభాధలు క్షామము బాపెను.

బిందుమతియను యోగ్యురాలితో
ముగ్గురు కొమరులు కలిగిరి రాజుకు
పురుకుత్సుడును - అంబరీషుడు
ముచుకుందుండు వారి పేర్లయా!

యాబది మంది స్త్రీసంతతితో
నిండుగనుండెడి ఆ మహరాజు
సంతానముతో ఆనందముగా
రోజులుగడుపుచు నుండెను రాజా!

ఆసమయుములో సౌభరి అనునొక
మునిపుంగవుడు యమునాజలముల
తపముచేయుచు నిష్టగ నుండగ
చేప సంతతిని చూచె నొకపరి

నిండుగనున్న సంసారముతో
చేపదంపతులు మునికి కనబడ
మనసుచెదిరిన - మునిపుంగవుడు
సంసారజీవితము గడుపగ నెంచెను

అంతట మౌని మాంధాతను గని
ఒక్కబిడ్డను భార్యగ నిమ్మన
మక్కువ కలిగిన తనయను మునికి
పెండ్లిచేతునని చెప్పెనురాజు

మదిలో మౌని చింతలొ మునిగెను
వయస్సుమళ్ళిన ముడుతల దేహము
వలచివచ్చెడి మగువయుండదని
తిరిగి ఆశ్రమము చేరెను సౌభరి

అంతట రాజు భక్తి ప్రపత్తుల
తనయలందరిని తనకు తానుగా
సౌభరి ఆశ్రమమునకు పంపెను
మునిని చూచిరి పరవశించిరి

దివ్యరూపముతొ నిలచిన మౌనిని
కన్నులగాంచిన కన్యలందరూ
ఆనందముగా భార్యలాయిరి
సంసారసుఖమది దొరికెను మునికి.

తపోశక్తిని ఆనందముకై
లీలావిలాస భోగమ్ములకై
ధారపోసి ఆ మునిపుంగవుడు
రోజులు గడుపుచు సుఖముగ నుండెను

మాంధాత వచ్చి - తనయల చూచెను
దివ్యసౌధమున ఆనందడోలికల
తనయలగాంచి - ఆనందపడి
శలవుతీసుకొని వెడలెను తిరిగి

రోజులు గడుపుచున్న సౌభరి
మదిలో యోచన చేసి - తెలిసెను
సుఖములతనిని - అనుభవించెనని
తనసుఖములలో - సుఖములేదని.

దీర్ఘ తపస్సు వ్యర్థమైనదని
మదిలోఎంతో - వంతనొందెను
వానప్రస్థము గ్రహించగోరి
తనభార్యలకు తెలియబరచెను

వారందరునూ అంగీకరించిరి
వానప్రస్థ నియమమ్మున నుండి
మరియొక అడవికి వారందరితో
సౌభరిచేరి తపసు మొదలిడె

నిశ్చలమైన తపస్సు చేయుచు
వానప్రస్థ నియమమ్మున మెలగుచు
తపోకీలల తనువును జేర్చి
బ్రహ్మాపదార్థము లోన - కలిసెను

సుఖభోగముల విరక్తిచెంది
విష్ణుపదములు మదిలోనిలపి
దేహయాత్ర చాలించెను సౌభరి
అతనిని భార్యలు అనుసరించిరి.

తపోనిష్టుడు – చేపల గాంచి
సంసారలంపటము తగిలించుకొని
జ్ఞాననేత్రము – తెరచి – చివరకు
తపమును చేసి – సిద్ధిపొందెను

సౌభరియొక్క వృత్తాంతమది
సంసారులకొక కనువిప్పగును
తెలివికలిగి తమ జీవితగమ్యము
చూచుకొనుటకు త్రోవచూపునది

మాంధాత జ్యేష్ఠుడగు అంబరీషుని
యువనాశ్వుండు – పెంచుకొనెనయా!
యౌవనాశ్వుడు ఆతని తనయుడు
వానికి కొమరుడు – హారీతుండు

మాంధాత కొమరుడగు పురుకుత్సుని మరి
నాగులు – భక్తిగ ఆహ్వానించి
తమ చెల్లెలగు – నర్మద నిచ్చి
పెండ్లిచేసిరి – అచట వసించెను

గంధర్వులవలన – నాగులందరూ
కష్టపడుటది – తెలిసినయట్టి
పురుకుత్సుండు పోరును సలిపి
గంధర్వుల బాధ – తీర్చివేసెను

నాగలోకమున అతడు వసించిన
వృత్తాంతమును చదివిన వినిన
నాగులవలన – ఆపదలేనటు
వరమును పొందెను – పురుకుత్సుండు –

పురుకుత్సునకు – త్రిసదస్యుండు
అతని తనయుడు అనరణ్యుండు
వాని తనయుడు హర్యశ్వుండు
వానికుమారుడు అరణుండయ్యా

అరణుని తనయుడు త్రిబంధనుండు
వానికుమారుడు సత్యవ్రతుండు
సత్యవ్రతునికి – త్రిశంకుడనెడి
కొమరుడు కలిగెను – ఓ నరపాలా!

గురుశాపముతో ఆ త్రిశంకుడు
ఛండాలునిగా మారెను – రాజా!
తనువుతొ స్వర్గము చేరగ దలచి
చేసిన యత్నము – శాప కారణము

విశ్వామిత్రుని ఆశ్రయించెను
ఆతడు సరియని – తపోధనముతో
రాజును – తనువుతొ నింగికి లేపెను
స్వర్గయానమున నడిపెను రాజును

ఇంద్రుడు అతనిని క్రిందకు త్రోయగ
తలక్రిందుగను పడుచు – త్రిశంకుడు
మొరపెట్టగను – విశ్వామిత్రుడు
ఆపెను రాజును – దివిభువి – మధ్యలొ

అంతట మౌని - స్వర్గము తీరుగ
మరియొకసృష్టిని - అటగావించి
రాజును అచట వసింపజేసెను
విశ్వామిత్రుడు - అపర బ్రహ్మఅయె.

త్రిశంకుతనయుడు హరిశ్చంద్రుడు
కలలోనైన బొంకని నరపతి
సత్యవ్రతమును భంగపరచగా
విశ్వామిత్రుడు యిడుమలబెట్టెను

సంపదపోయెను యిడుమలబడెను
కడజాతి వానికడ కొలువు చేసెను
అయినా రాజు అసత్యమాడక
విశ్వామిత్రుని అబ్బుర పరచెను

వశిష్టమహర్షి అంతయుగ్రహించి
విశ్వామిత్రుని పట్టుదలకు మరి
హరిశ్చంద్రుడు గురిఅయ్యెనని
విశ్వామిత్రుని శపించె నంతట

క్రోధజ్వాలతొ - వారిరువురును
శపించుకొనిరి అతిఘోరముగా
గ్రద్దఅయ్యెను - విశ్వామిత్రుడు
కొంగ అయ్యెను - వశిష్టమహర్షి

సంతతిలేక - హరిశ్చంద్రుడు
నారదు మాటను శిరమున దాల్చి
వరుణోపాసన - చేయగ నంత
వరుణుడాతనికి ప్రసన్నుడయ్యెను

గుణవంతుడగు కొమరుడుకలిగిన
వానిని వరుణుని తృప్తికోసమై
యజ్ఞపశువుగా అర్పింతునన
వరుణుడు - పుత్రుని అనుగ్రహించెను

రోహితు డనుచు - పేరుపెట్టిన
పుత్రుని - వరుణుడు కోరినంతనే
పురుడు తీరగా - అర్పింతునన
సరియని సమయము నిడెను వరుణుడు

ఆపై - దంతము లుద్భవించగా
అర్పింతునని - సమయము గొనెను
ఆపై దృఢమగు దంతములవ్వి
వచ్చువరకును - వేచియుండమనె

తనయునిపైన - మమకారముతో
కాలమునెట్టుచు నుండెను రాజు
అదిగ్రహించిన రోహితుడంత
తండ్రివ్యధను తా తీర్చగనెంచి

కానన సీమకు కదిలిపోయెను
తపోదీక్షలో వనమున నుండెను
అంతట తండ్రికి వరుణక్రోధమున
జలోదరమ్మను - వ్యాధికలిగెను

వార్తనువినిన రోహితుడంతట
రాజధానికి వచ్చుచుండగా
ఇంద్రుడు ముదుసలి రూపుతొవచ్చి
అతని ప్రయాణము ఆపుచేసెను

తండ్రిరుగ్మత బాపుటకొరకై
యాత్రలు చేయుట మంచిమార్గమన -
ఒక ఏడాది యాత్రలు చేసి
తిరిగి వచ్చుచు నుండగ - ఇంద్రుడు

అదేవిధముగా అతని ప్రయత్నము
అపుజేయుచు - అడ్డు తగిలెను
ఐదువత్సరము లటుల జరిగెను
తండ్రీ కొడుకులు - కలవక పోయిరి

ఆరవ ఏడు - బయలుదేరుచు
ఆగకుండగా వచ్చుచుండెను
అచ్చుటగాంచెను - అజేగర్తుని
అతని ఆశ్రమమందు అడుగిడె

అంతయు తెలిసిన - అజేగర్తుడు
అతని తనయుడగు శునశ్శేపుని
అతని వెంబడి తోడ్కొనిపోయి
యాగపశువుగా ఆహుతి నిడమనె

హరిశ్చంద్రుడు యాగము మొదలిడె
పురుష మేధము జరిగెనచ్చట
వరుణుడు, సురలు, తృప్తినందిరి
అమోఘమైన యాగమయ్యెనది

హరిశ్చంద్రుని రుగ్మత తగ్గెను
వరుణుడు - ప్రీతిగ స్వర్ణరధమును
హరిశ్చంద్రునికి - బహూకరించెను
శునశ్శేపుడు అసమాన్యుండు

హరిశ్చంద్రుని సత్యవ్రతముకు
మెచ్చినయట్టి విశ్వామిత్రుడు
బ్రహ్మవిద్యను అనుగ్రహించెను
రాజు - దానిని స్వీకరించెను

ఆత్మవిద్యాతత్వము వినుము
మనస్సు అగును అన్నమయమ్ము
అన్నము యొక్క రూపము పృధివి
మనస్సుతో భువి తత్వము తెలిసెను.

వసుంధరను అది సృష్టి చేసిన
జలముతొ లయమును చేసి అంతట
జలతత్వమును తెలిసి దానిని
అగ్నితత్వమున ఆర్పివేసెను

అగ్నిని వాయువు నందు లయించి
వాయువునంతట నింగిని కలిపెను -
ఈవిధముగను పంచభూతముల
వశమొనరించెను ఆపుణ్యాత్ముడు

తమోగుణముగల - నింగితత్వమును
అహంకారమున లయమొనర్చెను
సాత్విక రాజస తామసత్వముల
మహాతత్త్వమున నిగ్రహించెను

లోకసృష్టికి సంకల్పము అది
ఆమహత్తులో ఇంద్రియాలను
అణచివేసెను అనాయాసముగ
అంతట తెలిసెను - పరతత్వమును

జ్ఞానకాంతితో ఆ పుణ్యాత్ముడు
సంసారకారకము అయినటు వంటి
ప్రకృతినంతట గెలవ గలిగెను
అంతట తెలిసెను - బంధమోక్షములు

ఆతని సాధన - నెరవేరగను
వాక్కుకు మనసుకు అందనట్టిదగు
నిజమగురూపము - చూడగలిగెను
ఆత్మదర్శనము చేయుట - అదియే.

ఆవిధముగను హరిశ్చంద్రుడు
తన్నుతాను మరి తెలియగలిగెను
శాశ్వతమైన సుఖమునందెను
ఆత్మదర్శనము నందగలిగెను

రోహితు తనయుడు హరితుడు రాజా!
వానికి తనయుడు చెంపుడు అగును
చెంప నిర్మితము చెంపానగరము
చెంపుని సుతుడు సుదేవుండు.

సుదేవు సుతుడు విజయుడు రాజా!
వానితనయుడు రురుకుండగును
రురుకు తనయుడు వృతుడు అగునయా!
వానికి కొమరుడు - బాహుకుడగును

బాహుకుడెంతో సాధుస్వభావుడు
రిపులధాటికి నిలబడలేక
రాజ్యము వదలి భార్యలతోను
అడవులకేగెను - ఓనరపాలా!

ఇడుమలబడి అట తనువువీడెను
ఆతని భార్యలు భర్తవెంబడి
సహగమనమ్ము చేయగ నెంచిరి
వారిలొ ఒకతె గర్భవతిఅయా!

గర్భవతిని మరి ఔర్వమహాముని
వారించగను సరియనె నామె
ఆమె రక్షణగ మిగిలినవారు
సహగమనమ్మును ఆపివేసిరి.

తోటి సవతులు కక్ష వహించి
విషముకలిపిన అన్నము పెట్టిరి
తెలియక తినెను - వారిని నమ్మి
దైవము ఆమెకు రక్షగ నిలచెను

బాధలేకను సుఖప్రసవమై
మగబిడ్డడికి జన్మనిచ్చెను
విషముతొ - బిడ్డడు పుట్టెనుగావున
సగరుడు అనెడి - పేరుకలిగెను.

॥శ్రీ కృష్ణచరితము॥



## 2 సగర చక్రవర్తి గాథ

సగరుడు-వీరుడు-రిపుభయంకరుడు
తండ్రిని బాధలు పెట్టిన యట్టి
రాజులందరిని జయించినాడు
అఖండయశముతొ రాజ్యమేలెను

ఔర్వమహాముని ఆదేశముతో
హరికి ప్రీతిగా అనేకమైన
అశ్వమేధములు చేసెను అతడు
ఒకపరి - అటుల యాగము సాగగ

యాగాశ్వమును ఇంద్రుడు హరించి
నాగలోకములొ తపములోనున్న
కపిలమహర్షి చెంతను విడచెను
అశ్వము కొరకై వెదుక సాగిరి.

సగరుని తనయులు ఆయుధములతో
అరవై వేలమంది సాగిరి
భూమినంతను - వెదకిరివారు
పాతాళమునకు త్రవ్వి - వెదకిరి.

వెదకుచు వారు నాగలోకమున
కపిల మహర్షి చెంతనెయున్న
యాగాశ్వమును గాంచిరి అచట
తపముననున్న మునిని గాంచిరి

దురుసు తనమున-పరుషములాడుచు
ఆయుధాలతో ముందుకు సాగి
అశ్వహర్తను - వదలము అనుచు
అరపులసవ్వడి - చేయసాగిరి

ధ్యానభంగమై కనులు తెరచెను
అగ్ని పుట్టెను - వారందరినీ
క్షణకాలములో - భస్మమొనర్చెను
బూడిదరాసులు నేలబడినవి.

సాధుజనులను - తాపసోత్తముల
బాధలుపెట్టిన - దానికి శిక్ష
అనుభవించక తప్పదు రాజా!
హరి అవతారము కపిలమహర్షి

పరమదయాళువు - తపోతత్పరుడు
ఆయన క్రోధము చవిచూచిన - ఆ
సగరపుత్రులు బూడిదాయిరి
సౌమ్యుని ఆగ్రహ మంతటిదయ్యా

కపిలుని క్రోధము కాల్చెను అన్నది
సత్యదూరము - విను మహరాజా
వారితప్పిదము - కాల్చెను వారిని
స్పృశించినంతనె - అగ్నికాల్చదా!

యాగము ఆగెను - వెదుక బోయిన
తనయుల జాడ - తెలియకపోయెను
సగరుని భార్య - కౌశికి యగును
ఆమెకు బుట్టెను అసమంజసుడు

అసమంజసుడు దుష్టవర్తనుడు
చిన్నపిల్లలను దగ్గర తీసుకు
సరయూనదిలో పారవేయుచు
తండ్రి తిట్టగా - ఆనందించును

అటులా పిల్లల - బాధపెట్టుచు
తిరిగి వారిని యోగశక్తితో
బయటకు తీసి - తలిదండ్రులకు
ఇచ్చుచు తాను - ఆనందపడు

అతనితనయుడు అంశుమంతుడు
అన్నివిధములా - కులదీపకుడు
తాతబాధను గ్రహించినాడు
యాగము సాగెడి యత్నము చేసెను

తాత ఆనతిని - ఆ పుణ్యాత్ముడు
అడవులు - పల్లెలు అన్నీవెదకెను
అశ్వముకొరకై ఆతడు వెదకుచు
పాతాళమునకు చేరి అచ్చట

కపిలమహర్షిని - యాగాశ్వమును
అచ్చటనున్న - భస్మరాసులను
చూచి - విషయము గ్రహించినాడు
మునికి - వినయముగ మ్రొక్కెనాతడు.

మనసునిండుగా ప్రార్థించెనట
మహాయోగులు జ్ఞానమూర్తులు
తపస్సమాధిలో నున్నవారును
నిన్నుగాంచగలేరు - నిజమిది.

మనోనేత్రముకు అందనియట్టి
దివ్యరూపము కలిగినమూర్తివి
దేహధారులము కనుగొనగలమా!
దేహములో నిను చూడగ జాలము

మాయ అనెడి - ఈ చీకటిలోన
అంధుని మాదిరి చరించు మేము
జీవునిలో నువు - వసించియున్నను
కాంచగలేము - మహానుభావా!

నిన్నుగాంచెడి అదృష్టమ్ము
జన్మజన్మల తపఃఫలమది
లభించె నాకు - కరుణామూర్తీ!
కనిక రించమని ప్రార్థనచేసెను

మనసు చెదరక గతము తలవక
భస్మరాసుల వూసు ఎత్తక
భక్తి ప్రపత్తుల స్తోత్రము చేయగ
కపిలమహర్షి ఆనందించెను.

అంతట పలికెను కపిలమహర్షి
దొడ్డగుణములు కలిగిన నీవు
గంగాజలముతొ సగరపుత్రులకు
ఉత్తమగతులను కలిగించుమయా!

కరుణాపూరిత నేత్రమ్ములతో
అనుగ్రహించగ అశ్వముగొనెను
తాతకుయిచ్చి - యాగసమాప్తికి
సహకరించెను - తాతమెచ్చెను

యజ్ఞసమాప్తి చేసినంతనే
సగరుడు సర్వము పరిత్యజించి
అడవులకేగి తపోనియమమున
ఉత్తమగతికి చేరెనురాజా!

అంశుమంతుడు - రాజ్యభారము
మంత్రులకిడి - తా - వనములకేగి
తపమును చేసి గంగను దింపగ
యత్నించె నది జరుగకపోయెను -

అంశుమంతుని కొడుకు దిలీపుడు
విశ్వప్రయత్నము చేసి ఫలించక
తనువువదలెను - అంతట రాజా!
దిలీపు తనయుడు సాధించెనయా!

భగీరథుండు దిలీపు తనయుడు
అష్టకష్టములు - తపోనియమమున
లెక్కచేయక - నిష్టగ నిలచి
గంగయొక్క ఆశీస్సులనందెను.

దర్శనమిచ్చిన దివ్యగంగ - తా
వరముకోరు మన భగీరథుండు
తాతల భస్మము - పావని గంగలో
తడిసిన - ఉత్తమగతి కలుగుననె.

పాపహారిణీ! పావనగంగా!
హరిపాదోద్భవి! అమృతగంగా!
అతులిత పుణ్యప్రదాయిని గంగా!
కరుణాంతరంగా! నిను గాంచంగా!

కమనీయంగా - నింగిని వదలి
నేలను పరుగిడి పరవశించుచు
పాతాళములో - పదములు మోపి
పరమగతులను తాతలకిడుము

ఆనందించి గంగ పలికెను
నింగినుండి - నే - నేలకు దిగగా
కలిగెడి ఒత్తిడి - భూమి ఓర్వదు
అందులకొరకై మార్గము గనుము

రెండవ విషయము ఈభువిలోన
పాపకర్ముల పాపములన్ని
కడిగి - నేను మరి - పాపభారమును
మోయగలేను - విను మహరాజా!

అంతట పలికెను భగీరథుండు
హాలాహలమును మింగినయట్టి
ఫాలనేత్రుడు అసమాన్యుండు
నిన్నుభరించగ చాలినవాడు

శివుని శిరస్సున మజిలీచేసి
శివగంగగను - నేలకు దిగుము
పుణ్యమూర్తులు నీలోమునుగగ
పాపక్షాళనము జరుగును తల్లీ!

అనుచుపలుకుచు భగీరథుండు
శివుని - తపముతో - మెప్పించగను
ఉరుకుల పరుగుల ఉవ్వెత్తుగను
నేలకు దూకెను - ఆ సురగంగ

లోక క్షేమము - కొరకై గంగ
అభవుని శిరమున దూకెను అంతట
శిగ పూవుగను ధరించె - శివుడు
అంతట దిగెను - నేలకు గంగ

భగీరథుని రథమార్గము వెంబడి
సాగిన గంగ పాతాళములో
భస్మరాసుల పై ప్రవహించగ
పుణ్యమూర్తులై - స్వర్గమేగిరి

గంగను శిరమున దాల్చినంతనే
అఘముల బాయును అన్నది నిజమని
సగర పుత్రుల గాథచెప్పుచు
గంగనిలచెను - దయాంతరంగగ

భగీరధుని యశశ్చంద్రికను
పరచెను గంగ - ముల్లోకముల
భాగీరథియని పేరున నిలచెను
సుఖభోగముల మునిగెను రాజు

ధర్మపాలనము చేసి అంతట
విష్ణుపాదములు - మదిలోనిలపి
భగీరధుండు హరిని జేరెను
పుణ్యగాధ ఇది వింటివి రాజా!

భగీరధునికి తనయుడు - శ్రుతుడు
అతనికి తనయుడు - నాభావరుడు
సింధుద్వీపుడు అతని తనూజుడు
ఆయుతాయువు అతనికి తనయుడు

ఋతుపర్ణుండు అతని తనూజుడు
అక్షవిద్యను - ఋతుపర్ణుండు
అతని స్నేహితుడు నలున కిచ్చెను
అతని తనూజుడు - సర్వకాముడు

సుధాసుండు అతని కుమారుడు
మదయంతీపతి - సుధాసుండయా
కల్మషపాదుడు - మిత్రసహుండని
నామధేయములు అతనికి గలవు

సుధాసుండు గురుశాపముతో
రాక్షసుడయ్యెను - ఓమహరాజా!
సంతులేని వాడయ్యెను - అతడు
అనగా - రాజు - వివరములడిగెను

అంతట పలికెను శుకయోగీంద్రుడు
సుధాసుండు వేటకు వెడలి
అచ్చటగాంచెను ఇద్దరసురలను
వారిలొ ఒకనిని కూల్చెసుధాసుడు

రెండవవాడు - భయపడి పరుగిడె
వేట ముగించి - తిరిగివచ్చెను
తప్పించుకొని ఆ రక్కసుడు
కక్షతీర్చుకొన యోచనచేసెను.

వంటవానిగా వేషముదాల్చి
పాకశాలలో కొలువుకు చేరెను
సమయముకొరకు వేచియుండెను
వసిష్టుడొక పరి నగరికి వచ్చెను.

రాజు - భక్తిగా ఆహ్వానించి
భోజనమ్మును - చేయగ కోరెను
అది అదను అని - ఆ రాక్షసుడు
నరమాంసమును - వండిపెట్టెను

భోజనమ్మునకు ఉపక్రమించుచు
విస్తరిలోని వంటకమ్ముగని
ఆగ్రహమ్ముతో మండిపడుచును
రాక్షసజన్మను ఎత్తుము అనెను

సుధాసునికి శాపము కలుగుట
వినిన రక్కసుడు - మాయమయ్యెను
విషయము గ్రహించి వశిష్టుండు
పుష్కరకాలము శాపము అనెను.

సుధాసుండు వంతనొందెను
వంటవాని దుశ్చర్యగ్రహించెను
సంయమీంద్రుడే - అలిగె ననుకొని
మదిలో ఎంతో ఆగ్రహమందెను

నిరపరాధికి శాపమునిడెనని
వశిష్టుపైన ఆగ్రహమందెను
తిరిగి శపించగ మంత్రజలమును
దోసిట గైకొని - నిలబడినంత

ఆతని భార్య - మదయంతి అట
శాపము తగదని - శాంతపరచెను
మంత్రజలమది భూమిని విడువగ
తగదని - రాజు యోచనచేసి

వికల మనస్సుతొ - ఆ జలమ్మును
తనపదములపై - విడచుకొనగను
కమిలిపోయినవి - రాజుపాదములు
కల్మషపాదుడు - అయ్యెను రాజు

వశిష్టుశాపము - నందిన రాజు
రాక్షసరూపును ధరించి అంతట
అడవిలోనికి వెడలిపోయెను
అటుల సుదాసుడు తిరుగుచుండగా

ఆకలిబాధను ఓర్వలేకను
అటుగా సాగెడి భార్యాభర్తల
గాంచినంతనే బ్రాహ్మణభర్తను
కబళించుటకై - ఒడిసిపట్టగా

వలదని - లబలబ ఏడ్చుచు భార్య
అడ్డపడుచును బ్రతిమాలినది
అంతటిలోన తేరిజూచెను
సుదాసుండని గ్రహించెనామె.

దీనవదనయై ప్రార్థన చేసెను
ధర్మమార్గమున భూమినేలిన
ప్రభువువు నీవిటు - చంపుటతగదు
తోబుట్టువుగను భావించుమయా!

లోక పావకుని వంశమునందు
ఉద్భవించిన - మణిపూసవు నువు!
భర్తను విడచి - నీచెల్లెలికి
పసుపుకుంకుమలు నిలబెట్టుమయా!

ఎన్నోవిధముల బ్రతిమాలినను
వినక - తినెను - ఆ బ్రాహ్మణునచట
అంతట భార్య శపించెనతనిని
స్త్రీని స్పృశించిన - చత్తువు అనెను

అంతట - ఆ స్త్రీ - భర్తఎముకలను
ప్రోగుచేసి - అట అగ్నిరగిల్చి
సహగమనమ్మును చేసి అంతట
ఉత్తమగతిని పొందెను రాజా!

అటుల సుదాసుడు తిరుగుచుండెను
పదిరెండేడులు గడవగ నంత
తిరిగిరాజ్యము చేరి - రాజయె
భార్య ఎంతయో ఆనందించెను

భర్తశాపమును విని మదయంతి
కుమిలిపోయెను బ్రతుకు వ్యర్థమనె
తాకిన అసువులు నిలవవు అనిన
మాట – ఈటెలా తగిలెను వారికి

పిల్లలు లేని జన్మవ్యర్థమని
వంతనొందుచు వారిరువురును
వశిష్టమహర్షి పదముల బడగ
సర్వము తెలిసెను కులగురువంతట

తనతేజముతో గర్భముకలుగగ
అనుగ్రహించెను – ఆ బ్రహ్మఋషి
ఏడువత్సరము లటు – మోసినను
ప్రసవమగుటది – జరగకపోగా

మునిని తిరిగి అటుప్రార్థించగను
వశిష్ట మహర్షి వచ్చి అచటకు
పదును రాయితో కడుపును చీరి
పిల్లవానిని – వెలికితీసెను.

అందువల్ల నాబాలకునంతట
"అశ్మకు" డనుచు పేరుపెట్టిరి
అతని తనయుడు మూలకుడయ్యా!
సూర్యవంశమును నిలిపిన నలుసు.

భార్గవరాముడు రాజవంశముల
అంతము చేయుచు నున్నసమయమున
స్త్రీజనమంతా యోచనచేసి
మూలకు నంతట – దాచివేసిరి

నారులు వారిని రక్షించగను
నారీకవచుడు – అనుచు పిలచిరి
మూలకు తనయుడు ఖట్వాంగుడయా!
అతిబలశాలిగ – రాజ్యమేలెను.

నాల్గుసంద్రముల నడుమ భూమిని
సార్వభౌముడై పరిపాలించెను
దేవదానవుల పోరునందున
దేవతలకు – తను సాయముచేసెను.

ఖట్వాంగుని పరాక్రమమ్మున
అసురులగెల్చిన సురలు అప్పుడు
వరము కోరుమన – ఖట్వాంగుడంతట
ఎంత ఆయువు మిగిలెను తనకనె?

అంతటవారు నీ ఆయుర్భాగ్యము
పూర్తిఅయినది – కావున మరియొక
వరముకోరుమన – ఆమహనీయుడు
ఆయువు తీరగ – వరము లెందుకనె

వరములడుగక – నగరము జేరి
సంసారబంధములు – త్రెంచి వేసుకు
విష్ణుకథలతో – కాలముగడిపి
ఆనందధామము – చేరెను రాజా!

ఖట్వాంగు తనయుడు దీర్ఘబాహువు
ఆతని తనయుడు – రఘుమహరాజు!
రఘువు తనూజుడు – "పృథుశ్రవుండు"
ఆయన తనయుడు – అజమహరాజు.

అజమహరాజు వంశాంకురము
దశరథనృపతి - భాగ్యశాలియై
సాక్షాత్ - విష్ణువు తండ్రి అయ్యెను
సూర్యవంశమున వెలుగు నింపెను.

సురల ప్రార్థన వినిన శ్రీహరి
నాల్గు అంశలుగ ఉద్భవించెను
రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు
దశరథ పుత్రులు - కీర్తిమంతులు

కవికోకిల - వాల్మీకి మహర్షి
సవిస్తరముగా వారి చరిత్రను
రామాయణముగ వ్రాసి - కీర్తిగనె
చెప్పద నది విను - సంగ్రహమ్ముగా

॥శ్రీ కృష్ణచరితము॥



## 3 శ్రీరామ చరిత్ర

శ్రీరామ చరిత్రము మంగళప్రదము
గాయత్రి మంత్రము కలిగియున్నది
వాల్మీకి మహర్షి - బ్రహ్మఆనతిని
చదువుల తల్లి - కృపతోవ్రాసెను.

దశరథనృపతి సురపతి సాటిగ
ధరనేలెను అట ప్రజలుమెచ్చుగా
ధనధాన్యములకు లోటు లేకను
ధర్మబద్ధులై వుండిరి జనులు.

నీతి నియమములు తప్పక జనులు
ఆనందసీమలో ఉన్నటు తలచిరి
దశరథనృపతికి - అన్నీయున్నను
సంతులేని - ఆ కొరతయున్నది

కౌసల్య - సుమిత్ర - కైకేయీ లని
ముగ్గురు రాణులు - ఆ మహరాజుకు
వారినోములు ఫలించి వారికి
సంతుకలుగగా - జనుల ప్రార్థనలు.

చింతలోనున్న ఆ మహరాజు
కొలువు తీరి - తన బాధ చెప్పెను
సుమంత్రుడనియెడి మంత్రిపుంగవుడు
తనకు తెలిసిన విషయము తెలిపెను

కులగురువు అగు వశిష్టమునికి
వందనముంచి కోరిక తెలిపెను.
అశ్వమేధము - పుత్రకామేష్టి
చేయించమని - ప్రార్థన చేసెను.

సరియని మహర్షి తగువారలకు
ఆనతి నొసగెను - యాగము మొదలయె
ఋష్యశృంగుడు సమర్థుడైన
ఋత్విక్కుయని తోడ్కొని వచ్చిరి.

అశ్వమేధము - అతి మెలకువుగా
శాస్త్రవిధిగను ఆరంభించిరి
వేదవేత్తలు పాల్గొనిరందు
అన్నదానము దండిగ జరిగెను

అశ్వమేధము - ఐనతధుపరి
సంతానముకై ఇష్టిని జరిపిరి
అదిసమయమని - శ్రీహరి అంతట
నరుడై పుట్టగ సంకల్పించెను.

రావణుభయమున సురలందరును
వాణీపతిని ప్రార్ధన సలిపి
మార్గోపాయము వేడిరి వారు.
లోకకంటకుని అంతముకోరిరి.

చతుర్ముఖుండు సురలందరితో
విష్ణువుకంతయు తెలియబరచెను
దేవవైరిని అంతము జేయగ
నర రూపమును ఎత్తగ కోరిరి.

సరియనిపలికి - శ్రీవత్సాంకుడు
దశరధునింట నాల్గు అంశలతొ
జన్మించుటకు నిర్ణయించెను
దశరధతేని జన్మతరించగ -

అంతట అచ్చట - హోమమునుండి
దివ్యపురుషుడు - వెలికి వచ్చెను
శ్రద్ధగ చేసిన యాగఫలమును
అందించగను వచ్చితి ననెను

దివ్యపాయసము కలిగిన పాత్రను
రాజుకుయిచ్చి - సతులకుయిమ్మనె
పుత్రులు కలిగెడి వరప్రసాదము
అనుచుపలికెను - ఆశీస్సులనిడె.

రాజు అంతట పులకరింతతో
సగము పాయసము కౌసల్యకు నిడె
మిగిలిన దానిలొ సగము సుమిత్రకు
అందులొ సగము - కైకకు యిచ్చెను.

మిగిలినయట్టి అష్టమభాగము
తిరిగి సుమిత్రకు అందజేసెను.
ఆనందముతో కన్నులకద్దుకు
ఆరగించిరి ఆ దేవేరులు.

నారాయణుడు నరుడై పుట్టును
దశకంధరుని అంతము చేయును
కావున మీమీ - అంశలతోను
సంతానమును బడయగవలెను.

స్వామిసేవకై నిలబడవలెనని
బ్రహ్మదేవుడు - ఆదేశించగ
సురలందరకు - వారి అంశలతొ
వానర భల్లూకములు దయించినవి

ఇంద్రుని అంశతొ - వాలిపుట్టెను.
రవితేజముతో - సుగ్రీవుడు పుట్టగ
వాయుదేవుని అంశతొ హనుమ
మొదలగు వీరులు ఉద్భవించిరి.

వీరులందరకు - వాలి - రాజుగా
పరిపాలించెను - అడవులయందు
రామసేవకై - వేచియుండిరి
లోకక్షేమమే - వారి ధ్యేయము

పాయస భాగము గ్రహించినట్టి
రాణులు ముప్వురు - గర్భవతులయి
నవమాసములు - నిండినంతనే
దివ్య శిశువులను ప్రసవించిరట.

ఆనందముతో పరవశమ్ముతో
పొంగిపోయెను - దశరధరాజు
పురముపొంగె నానందవార్నిధి
పురజనులందరు మునిగితేలిరి.

ఆమని శోభలు పరచెను - ప్రకృతి
వసంతసోయగ మొలికెను పుడమిని
అనువగు సమయము అని తలంచిన
శ్రీహరి పుట్టెను - నాల్గు అంశలతొ

చైత్రమాసము - శుద్ధనవమిలో
పునర్వసుతారలొ - పురుషోత్తముడు
కర్కాటకలగ్న - దివ్యలగ్నమున
గ్రహములు ఉచ్ఛస్థితిలోనుండగ

వంశకర్తయగు - సూర్యదేవుడు
మేష రాశితో - ఉన్న తరుణమున
మంగళమూర్తి - కౌసల్యమ్మకు
పుణ్యఫలముగా - ఉద్భవించెను.

సూర్యదేవుడే - నింగిని వదలి
నేలకుదిగి ఆ తల్లిప్రక్కన
పడుకొనినట్లు వెలుగులు చిమ్మెను
అందరి ముఖ కమలమ్ములు విరసెను

కైకేయి కన్నది చక్కని బిడ్డను
సుమిత్ర కిద్దరు కొడుకులు పుట్టిరి
నారాయణుడు నాల్గు అంశలతొ
పుడమి పునీతము చేయగ పుట్టెను.

వశిష్టమహాఋషి యోగ్యతలెరిగి
ఆత్మజ్ఞానమున వారిని తెలిసి
నామకరణమును చేయించుచును
కౌసల్యాతనయుని - రాముడు అనెను.

కైకకుమారుని - భరతునిగాను
లక్ష్మణ, శత్రుఘ్నులు - అనెడిపేర్లవి
సుమిత్ర తనయుల - కిడెనా-మహర్షి
పెరుగు చుండిరా - పుత్రులు నల్గురు.

రామలక్ష్మణులు - ఒక జంటగను
భరత శత్రుఘ్నులు మరి యొక జంటగ
కలిసి తిరుగుచు పెరుగుచుండిరి.
సోదరప్రేమకు నిలయమువారు.

వేద శాస్త్రముల నభ్యసించిరి
ధనుర్వేదమున మెళకువ లెరిగిరి
జ్యేష్ఠకుమారుడు - రామచంద్రుడు
ఇష్టుడాయెను సర్వజగతికి.

ఒక్కదినమున కొలువుకూటముకు
విశ్వామిత్రుడు అరుగుదెంచెను -
అర్ఘ్యపాద్యముల - సత్కారముల
కూర్చొన చేసెను - దశరథవిభుడు

కుశలము తెలిసిరి వారిద్దరును
విశ్వామిత్రుని - కోరిక ఏమని
వినయమునిండి - అడిగెను రాజు
మదిలోకోరిక - తెలిపెను మౌని.

తను చేసెడి ఒక యాగమునకును
కలిగెను విఘ్నము - దనుజులవలన
యాగరక్షణకు - రామచంద్రుని
తనతో పంపగ - కోరెను మౌని

మదికలవరమున - ఆ మహరాజు
రాముని వదలి - తనను తోడ్కొని
యాగసమాప్తి చేయగ కోరెను
పుత్రప్రేమను వెలువరించెను

వలదని - మౌని - రాముని కోరెను
వశిష్ట మహర్షి నచ్చజెప్పెను
రాముని శ్రేయము - కోరిన మౌని
తనయునడిగెనని తిన్నగ చెప్పెను.

వల్లెయనుచును - అయోధ్యాపతి
విశ్వామిత్రుని వెంబడి తనయుల
వీరబాలకుల రామలక్ష్మణుల
విజయము పలుకుచు పంపెనంతట

తండ్రికి వందన మించిరి వీరులు
గురువు ఆజ్ఞ తలదాల్చెదమనుచు
విశ్వమోహనులు - విశ్వామిత్రుని
వెంబడి సాగిరి - పొంగెను పుడమి

అంతః పురముల గారాబముగా
అతులిత సౌఖ్యములనుభవించిన
అరిభయంకరులు అతిసుకుమారులు
అడుగుల వెంబడి నడచిరి మునికి.

కాలినడక నా ముప్పురుసాగిరి
ముందునడచెను విశ్వామిత్రుడు
హరి తనతోడని మురిసెను మౌని
రాణ్ముని తోడని - రాముడు తలచెను.

రాత్రిసమయమున తరువుక్రిందను
నిదురించిరి శ్రీరామలక్ష్మణులు
ప్రాభాతమున గాధినందనుడు
మేలుకొలిపె - కౌసల్యరాముని

అంతటమౌని అతి రహస్యమగు
బల - అతిబల - మంత్రమ్ములను
ఉపదేశించెను ఆసోదరులకు
తేజము పెరిగెను - మంత్రబలము చే

విశ్వామిత్రుడు ఆనందముతో
తనకు వశమగు అస్త్రములన్నీ
ఉపదేశించెను రామభద్రునకు
అర్హత కలిగిన వీరుడ వనెను.

రిపుల హరించగ చాలినశక్తిని
రామచంద్రుడు గ్రహించినాడు
పూర్ణపురుషునిగ - అస్త్రసంపదతో
దివ్యతేజముతో వెలిగెను రాముడు

తిరిగి ముప్వురు సాగుచుండిరి
పురాణగాథలు స్థలపురాణములు
విశ్వామిత్రుడు చెప్పుచుండగా
అలసటమరచి నడచుచుండిరి.

విశ్వామిత్రుని ఆశ్రమమ్మునకు
చేరెడి త్రోవలో – పెనుగాలెగసెను
ఘనతరువులవి నేలకొరిగెను
కొండరాళ్ళవి గాలికి ఎగిరెను

ధూళి మేఘమై నింగి కెగిరెను
త్రోవకనబడక నడక కష్టమయె
అంతటిలోన ప్రళయ భయంకర
గర్జన వినబడె – ఆముప్వురకు

కంటి ముందర ఘోరరక్కసి
నోరుతెరచి అట నింగినుండి మరి
నేలకు దిగుచు – కనబడె వారికి
విశ్వామిత్రుడు గ్రహించె సర్వము

రామచంద్రునికి ఆదేశమ్మిడె
వెంటనె శరముతొ కూల్చగ చెప్పెను
శరసంధానము చేసిన రాముడు
విడువక నిలువగ ముని గ్రహించెను.

లక్ష్మణుడంతట శరము విడువగ
అన్నకు చెప్పగ – రాముడంతట
ఆడదిగనుక – చంపుట ఎట్లనె!
వెంటనె పలికెను – గాధినందనుడు

రామా! అదియొక ఘోరరక్కసి
తాటక అనెడి పరమపాతకి
హోమ కార్యములు విఘ్నము చేయును
ఆలసించక కూల్చుము దానిని.

గోబ్రాహ్మణుల – హితము కొరకునై
స్త్రీని చంపుట – ధర్మసమ్మతము
అనగా రాముడు శరమును వదలెను
రామబాణమున – కూలెను తాటక

రామా! నీవు అమోఘబలుడవు
వేయి ఏనుగుల బలముకలిగిన
తాటకనొక్క దివ్యశరమున
నేలకురాల్చితి వనుచు పొగడెను

గురు ఆశీస్సుల బలమది స్వామీ!
అనుచు వినయముగ రాముడు పలుకగ
అసురసంహారము చేయుటకిదియే
ఆరంభమయా! అని మునిపలికెను

ఆశ్రమసీమలో అడుగు బెట్టగా
సుందర రాముని చూచిన మునులు
ఆనందించిరి – తాటక వధ విని
అభినందించిరి – వీరబాలకుని

విశ్వామిత్రుడు దీక్షవహించెను
యాగము మొదలయె శాస్త్రోక్తముగా
మారీచసుబాహులు – అసురులువారు
యాగధ్వంసకులు – అనుచుపలికిన

మాటలు విని శ్రీరామచంద్రుడు
యాగరక్షణకు నడుముకట్టెను
మెరిసేవిల్లుతో నూరుకళ్ళతో
వేచియుండెనా అసురులకొరకు

ఆకాశములో అసురమూకను
పసిగట్టెను శ్రీరామచంద్రుడు
అప్రయత్నముగ శరము పరుగిడె
అంతదూరమున తెగిపడె సుబాహువు

అంతటిలోన హోరుమనుచును
శబ్దమయ్యెను - రక్తధారలు
కురియజేసిరి అసురమూకలు
శరముతో ఆపెను - ఆ ఆగడము

ఒక్కబొట్టును క్రిందకు రాలక
అసురప్రయత్నము వ్యర్థమయ్యెను
రాముని శరము - మారీచుని గని
ఈడ్చుకు పోయెను దూరతీరముకు

యజ్ఞము జరిగెను నిర్విఘ్నముగ
విశ్వామిత్రుడు సోదరు లిరువుర
శిరములు మూర్కొని పరవశమ్మున
యాగముగాచిన ఘనులు మీరనె

మౌని పలికెను - పరవశమ్మున
నీవు సమర్థుడవని - నేనెరుగుదు
రవివంశమునకు వన్నెతెచ్చిన
విశ్వమోహన రూపుడవీవు!

అంతట రాముడు అడిగెను మునిని
ఆ మారీచుడు ఎచ్చట పడెనని
ఏపాదోనిధి వొడ్డున రాలెనొ -
అసురులనొక్క కంటను గనుమనె.

జనకుని సేవకు లటుగా సాగుచు
దివ్యబాలకుల చూచి మురిసిరి
వారిని గాంచి - అడిగెను మౌని
స్వయంవరము వివరమ్ము చెప్పిరి.

జనకమహీపతి తన తనయ యగు
సీతాదేవికి పెండ్లిచేయగా
స్వయంవరమును చాటించెనయా!
విల్లును పెట్టెను - వీరశుల్కముగ

తనకడనున్న శివుని ధనుస్సు
ఎక్కుపెట్టిన యోధుడు మాత్రము
పిల్లను చేకొన అర్హుడుఅనెను -
అల్లుని చేసుకు పిల్లనిత్తుననె.

అందమునందు ఎందున కనని
సుందరమూర్తుల చూడమక్కువై
దరికి వచ్చితిమి - వీరిద్దరును
తగిన వారని - మనసు చెప్పును.

నీలమేఘముతో సమానమైన
మేనిరంగుతో మెరసిపోయెడి
సుమసుకుమారుడు - వెలుగుసూర్యుడు
తగును అల్లునిగ - మాజనకునికి.

అటుల పలికిన వారిని గాంచి
కోరిక తీరును అని పలికి ముని
మిథిలకు పోదము అనుచుపలుకగా
తప్పకపోవలె అనె సౌమిత్రి.

మీ ఆజ్ఞను మాశిరమునదాల్చుట
కర్తవ్యమనె రాముడు భక్తిగ
అంతటవారు మిథిల త్రోవలో
సాగుచుండిరి మౌని వెంబడి.

త్రోవలొ రాముని పాదమ్ములకు
రాయి తగిలెను అంతట రాముడు
బొటనవ్రేలును తడిమి చూచుకొనె
ఎదురుగ నిలచెను – అపురూపవతి

రాయికి బదులుగ రమణి నిలువగ
ఆశ్చర్యములో మునిగెను రాముడు
భక్తిగ పలికెను – ఆ స్త్రీమూర్తి
రామా! నేను ధన్యనైతిని.

నీపదస్పర్శ – శాపము తీర్చెను
పాషాణమునగు నేను తరించితి
నీకు శుభమగు మంగళమూర్తీ!
అనిపలుకుచును వెడలెను ఆమె.

సౌమిత్రంతట అడిగెను మునిని
విశ్వామిత్రుడు తెలిపెను సర్వము
గౌతము సతి ఆ అహల్యారామా!
అందచందముల మిన్నగు సుందరి.

ఇంద్రుడు ఆమెను గ్రహించనెంచి
అర్ధరాత్రమున ఆశ్రమతావుల
కోడిగ కూసి భ్రమకల్పించి
మునిని పంపెను స్నానార్థమయి

గౌతము రూపము ధరించి సురపతి
ఆశ్రమమ్మున అడుగిడినంతనె
గ్రహించి అహల్య – బుద్ధిగరపగా
బలాత్కరించగ ప్రయత్నించెను

అంతటిలోన గౌతమ మహర్షి
వేకువకాదు అని తలంచుచు
మాయ అనుచును మరలివచ్చెను
ఇంద్రుడు గాంచి వణకిపోయెను.

పదములు పట్టిన సురపతికాతడు
బుద్ధిగరపగా శాపమునిడెను
అతివ నహల్యను శపించెనంతట
పాషాణముగా మారిపొమ్మనె.

దశరథతనయుడు రామచంద్రుని
పదములస్పర్శతొ శాపము తీరును
అనుచుపలికెను – ఓ రఘురామా!
ఆమెతరించెను – నీపదస్పర్శతొ

కొంతసాగిరి – మిథిలను గాంచిరి
జనకుడువారి రాకను తెలిసి
స్వాగతమిడెను వారికి తగిన
విడుదులనుంచి – గౌరవించెను.

జనకభూపతి ఆహ్వానముగొని
సోదరులిరువుర వెంట నిడుకొని
సభకువచ్చెను - రాజులెందరో
స్వయంవరంనకు వచ్చియుండిరి.

పేరోలగమున వీరోచితముగ
హరువిలునందగ - వీరబాలకుడు
ముని ఆదేశము నందుకు నడచి
ఎక్కుపెట్టగా - విరిగెను విల్లు

ఫెళ్ళున విరిగెను అభవుని చాపము
బ్రహ్మాండమది కదలెనొక్కపరి
వీరశుల్కయగు సీతాదేవిని
విజయరామునికి ఒసగెను జనకుడు

రాజవరేణ్యుల కంటిముందర
కరితొండముతో సరిపడు భుజముల
లీలగనెత్తి విరచెను విల్లును
రమ కళ్యాణము జరిగెనప్పుడు.

అయోనిజను ఆ హరి అవతారము
లోక కళ్యాణము కొరకై తాను
కనుల పండువుగ పెండ్లియాడెను
కోమలి కన్నియ పులకరించెను.

లక్ష్మణమూర్తికి - ఊర్మిళనిచ్చి
భరతునికంతట మాండవినిచ్చి
శృతకీర్తిని మరి శతృఘ్నునకు
పెండ్లి చేసెను జనకభూపతి

తాటకాంతకుడు సీతాలక్ష్మితొ
తమ్ముళ్లతొ మరి - వారి భార్యలతొ
అయోధ్యపయనము చేయుచుండగా
అడ్డుగనిలచెను - భార్గవరాముడు.

సవాలుచేసిన భార్గవరాముని
అజేయుడైన - పరశురాముని
బలవిక్రమమున భంగపరచెను
తెలిసెను రాముని - పరశురాముడు

అయోధ్యలోన రాముడుండెను.
యువరాజుపట్టము కట్టగనెంచి
దశరథవిభుడు సుముహూర్తమ్మును
నిర్ణయించెను ప్రజలు మెచ్చగ.

ముద్దుల భార్య కైక అంతట
విభునికోరెను వెనుకటి వరములు
భరతాభిషేకము - రామవనవాసము
ధర్మపాశమున - రాజు చిక్కువడె.

జనకుని మాటను శిరమున దాల్చి
జనకజ - వెంబడి నడచుచుండగా
జయశీలియగు లక్ష్మణ మూర్తితొ
జనపదములను విడచి - వనికి చనె.

చిత్రకూటముకు భరతుడురాగా
చలించనట్టి నిశ్చయమ్ముతో
చల్లగ రాజ్యము నేలమనుచును
పాదుకలిడిచనె - దండకవనికి.

తపోనిష్ఠులకు నిలయము అయిన
తరు సంపదతో సొగసుగనున్న
తలపుల మధురిమ కోయిల పాటగ
తనువు పరవశము కలుగు నెలవది

దండకవనిలొ నుండు అసురుల
గుండెలు పగులగ రామచంద్రుడు.
ధర్మమూర్తి – తా ఋషులసేవలో
దర్శించెనట – అగస్త్యమునిని.

పర్ణశాలలొ సతి సోదరులతొ
పురాణ పురుషుడు రాముడుండగా
పాపచరిత్ర – శూర్పణఖ రక్కసి
పొందుకోరెను – శిక్ష లభించెను.

ఖరదూషణులు జనస్థానమున
చెల్లెలి బాధను తీర్చగ కోరి
పదునాల్గువేల అసురులతోను.
పోరగరాగా – త్రుంచెను రాముడు.

దశకంధరుడు – కాలఛోదితుడు.
ధర్మదూరుడై చెల్లిమాటపై
దశరథరాముని ధర్మపత్నిని
ధరణిజనంతట హరింపనెంచి

మాయలమారి – మారీచునట
మాయలేడిగ మారగ చెప్పి
మనసుదోచమనె – అంతట సీత
మురిసిపోయి, ఆ లేడిని కోరగ

అన్నదమ్ములు లేని సమయమున
అబలహర్త ఆ దశకంధరుడు
ఆశ్రమమందు అడుగిడి సీతను
అపహరించె తన అంతము కోరి

అంబరవీధిని అసురుడు గొనిపో
ఆక్రందించెను అవనీనందిని
అంతట జటాయు వాగ్రహమ్ముతో
అడ్డుకొనెను – తన అసువులు వీడెను

సీతాన్వేషణ చేయుచు రాముడు
కబంధుశాపము తీర్చెను ధీరుడు –
శబరి తరించగ దర్శనమిడగా
శబరిసాగెను దివ్యధామముకు

సుగ్రీవునితో నెయ్యము చేయగ
సుందరమూర్తి – ఋష్యమూకమున
సూర్యకుమారుని చెంతకు చేరెను
సాదర స్వాగతమచట లభించెను

వాలి ఘాతుకము విన్న రాముడు
వదలనింక ఆ అబలహర్తనని
వాగ్దానమ్మును చేసి – వధించెను
వీరుడు వాలిని – వీరవతంసుడు

దశకంధరునికి – దడపుట్టించిన
ధీరుడు వాలి – కిష్కింధాపతి
దనుజాంతకుని – రామచంద్రుని
దివ్యశరమున – నేలకొరిగెను.

కోలను వాలిని కూల్చిన రాముడు
కిష్కింధేలగ సుగ్రీవుని కిడి
కపికులోత్తముని సీతాన్వేషణ
కార్యారంభము గావించమనె

నాల్గుదిక్కులకు నడచిరి కపులు
నేలనంత శోధించసాగిరి
నమ్మనబంటు ఆంజనేయుడు
నీలాకాశములోకి ఎగిరెను

రాముని గుర్తు అంగుళీయకము
రమ కర్పింపగ రాముడివ్వగ
రఘుకులతిలకుని మనమున నిలిపి
రయమున సాగెను - పూజ్యుడు పావని.

మైనాక సురసల ఆశీస్సులుగొని
ముందు నిలచిన - సింహిక గూల్చి
ముదముగ సంద్రమునంతయు దాటి
మాతనుచూడగ మారుతిసాగెను.

అవలీలగను సంద్రము దాటిన
అతులిత బలభీముడు హనుమ
అడ్డము నిలచిన లంకను జయించి
అడుగిడె లంకాపురములోనికి.

అడుగడుగున ఆ రక్కసిమూకలు
ఆయుధాలతో రక్షణ చేయుచు.
అజేయుడైన దశకంధరుని
అఖండ బలమును - చాటుచుండిరి.

అన్ని తావులా వెదకెను మారుతి
అందరిగృహములు పరిశీలించి
అమ్మనుగానక - దుఃఖిలుచుండగ
అగబడె నచట అశోకవనము.

అందదు గిడెను అంతట వెదకెను
అమ్మవుండెడి తావని తోచెను
అతి మెళకువగా వెదకుచుండగా
ఆంజనేయుని - కోరిక తీరెను.

అన్నులమిన్న - రాఘవు రాణి
అందచందముల పోతబొమ్మలా
అగబడెనచట దీనవదనమున
ఆమెనుగాంచి - ఆనందించెను.

రక్కసికావలి మధ్యలో మాత
రక్షణలేని లేడిపిల్లవలె
రఘుపతికొరకై - నిరీక్షించగా
రామబంటు శ్రీహనుమగాంచెను.

అమ్మబాధను గ్రహించి మారుతి
అమిత దుఃఖమున మునిగి పోయెను
ఆమెతో పలుకగ యోచనచేసి
అట రఘు రాముని కీర్తనచేసి.

అంగుళీయకము అమ్మకుయిచ్చి
ఆమెవేదన తాను గ్రహించి
అంతకుమించిన వేదన - పతి దని
అతివ మనస్సుకు ఊరటకూర్చి

రోజుల నెంచుము - రాముని కొరకై
రఘుపతి నీ ఉని కెరిగినంతనే
రావణు తలలు - త్రుంచును అనుచు.
రాముని కీయగ చూడామణి గొని.

అశోక వనమును ధ్వంసముచేసి
అరి భయంకరుడు అని చెప్పునటు
అక్షునిజంపి - వీరుల జంపి
అంతఃపురముల - పురమును గాల్చి

అనఘుని రాముని కంతయు జెప్పి
అమ్మను - కన్నుల దాచితెచ్చితిని
అన్నటు - పదములు అభిషేకించెను.
అంతటి వీరుడు - ఆంజనేయుడు

గుండెలు పొంగిన ఆనందముతో
గుండియ కలిపి రామచంద్రుడు -
గురుతర కార్యము సేతువుకట్టి.
గురితో లక్ష్యము నెరవేర్చగను.

వానర భల్లూకమ్ముల జేర్చుకు
వీరుడు లంకలొ అడుగుబెట్టెను
వశముగాని ఆ రక్కసి మూకల
వడిగా కూల్చెను - దివ్యశరముల

ఇంద్రజిత్తును చంపె లక్ష్మణుడు
ఇరుసేనలవి ఘనముగపోరెను.
ఇదియొక సంద్రము అన్నటు సేనలు
ఇది నిజమా అని పోరుసలిపెను.

దశరధసూనుడు దివ్య ధనుస్సుతొ
దశకంధరుని కూల్చుట కొరకై
ధరణి భారము బాపుట కొరకై
ధరణిజ చెరను - తీర్చుటకొరకై.

ప్రళయోగ్రానల సన్నిభమైన
పరమోత్కృష్టము అయినటువంటి
శరమునువిడచెను - శిరములురాలగ
రాలెను పుడమిని - రావణాసురుడు

దేవవిరోధిని అంతము చేసి
దివ్యతేజమున వెలిగెను రాముడు
దేవతలందరు పూలవానలు
దివి నుండచట - కురిపించగను

అవని భారము తీరినదనుచు
అవతారమూర్తి ఆనందించెను
అందరి మన్ననలందిన - రాముడు
అట వెలుగులను - పంచెను రవికి.

రావణుభార్యలు విలపించుచును
రణభూమి కట - వచ్చిజేరిరి
రాణి మండోదరి - గోలున ఏడ్చెను
రాళ్ళు కరిగెనా స్త్రీలరోదనకు

"రవికిరణములు భయమున అడుగిడు
రమ్మనగానే వేల్పులు వత్తురు
రణమున నీవు అజేయుండవు
రమణిని కోరి ఒరిగిపోతివి.

ధర్మ దూరమగు పనులు చేసిన
దండన తప్పదు – అన్నది నిజము
ధరణిజ నిచ్చి శరణు కోరుమని
దీన వదనమున ప్రార్థించితిని

వినక పోతివి మంచి మాటలు
వీరుని మించిన – వీరులుందురు
విజయము నీదే – ఓటమిలేదని
విర్రవీగితివి ఒరిగిపోతివి."

రాతలు మార్చగ వశముగాదనె
రమణికి చెప్పి అనునయించెను
రాముడు ఎంతో దుఃఖమునందెను
రావణుకుత్తర క్రియలనుచేసిరి

దానవ చేష్టల నెరుగని వాని
ధర్మతత్పరుడు విభీషణాఖ్యుడు
దానవ సామ్రాజ్యమ్మును ఏలగ
దీవనలిడెను రామచంద్రుడు.

అవనిజ నటకు రావించుకొని
అగ్నిపునీతగా స్వీకరించగా
అందరి మనసులు పొంగిపోయెను
అచటకు దిగెను నాకలోకము

అభిషిక్తుండై విభీషణుండు
అనఘుని పదముల భక్తిగ్రవాలెను
అన్నదమ్ములలో ఒకడవు నీవని
అనెను రాముడు అభినందించి

విభీషణాఖ్యుడు వినయమునిండి
విమలచరిత్ర సీతకు మ్రొక్కి
విజయ రాముగని – హృదయరాణితో
పుష్పకమెక్కగ వినతి చేసెను

సీతారాములు సుగ్రీవ లక్ష్మణులు
వానరసేన విమాన మెక్కిరి
విశ్వమోహనుడు రామచంద్రుడు
పుష్పకమ్మునకు ఆదేశమ్మిడె

అందరు యోధులు అందు ఎక్కిరి
అయోధ్యనిలచెను వారి మనస్సుల
ఆగెను రాముడు – కొంతదవ్వులో
అక్కడగలదు నందిగ్రామము

చామరమ్ముతో సుగ్రీవ విభీషణ
శ్వేతఛత్రముతొ ఆంజనేయుడు
శిరమున పాదుకలుంచుకు భరతుడు
అమ్ములు చాపమ్ముతొ శత్రుఘ్నుడు

బంగరు ఖడ్గముతో నంగదుడు
పూర్ణకుంభముతొ భూమిజ నుండగ
పాదములందు సౌమిత్రియుండగ
బంగరు డాలు జాంబవంతుడు గొన

పుష్పకమెక్కెను పురుషోత్తముడు –
గ్రహములసేవల నందెడు శశివలె
పూర్ణచంద్రునిగ భాసిలె రాముడు
రామచంద్రు గని పొంగెను పుడమి

అడవులు కొండలు అంతటి వారిధి
అవలీలగను రాముడు దాటి
అంతదవ్వులో నందిగ్రామమున
ఆనందగ్రామముగ – సొగసులునింపి

ఆప్యాయముగా తమ్ములందరిని
అక్కునజేర్చుకు అయోధ్యరాముడు
అడుగిడె నగరిలో – అందరినచట
అడిగెను కుశలము రామచంద్రుడు.

శోభతో వెలిగెను అయోధ్యనగరము
రామకాంతితో వెలిగెను జగము
అలంకారముల అమరావతినే
అందవన్నటు నిలచె నయోధ్య

దేవాలయములు అలంకరించి
ఆ దేవతలకు హారతులిచ్చిరి
భక్తిప్రపత్తుల మ్రొక్కిరి జనులు
చల్లని జలకము జల్లిరి వీధుల.

నింగి ప్రశాంతత నిండియున్నది
జలధులు నిలచెను నిశ్శబ్దముగా
మునులహోమములు వెలిగె తేజముతో
గృహములముందు రంగవల్లులతో

చాందినీలతో – తోరణాలతో
కలువల మాలలు కళకళ లాడగ
గోడల వ్రాసిరి రాముని గాథను
మంగళహారతు లందిరి జనులు

భద్రగజములు ఎదురువచ్చినవి
గజములు హయములు ఆనందముతో
అరచిన అరపుల సందడితోను
పొంగిన కడలిగ తోచెను నగరము

రాచబాటలో సాగెడి రాముని
చూడగ సందడి పెరిగెను జనులకు
తాటకాంతకుని దర్శించుటకై
బారులుతీరి వేచియుండిరి.

నారవల్కలము లమరి యుండగా
అడవికి సాగిన అయోధ్యరాముడు
దశకంధరుని శిరములు కోసి
ధరణిపూజను చేసెను వింటిర!

తండ్రిమాటను తలనుదాల్చిన
తనయుడు అంటే – రాముడుగాదా!
తండ్రి మాదిరిగ తలంచి రామునికి
తనువు – అంకిత మిదె సౌమిత్రి.

“ఛాయే వానుగతా సదా” యని
జనకుడు తనయను రామునికిచ్చెను
ఆమాటలను నిజము చేసినది
నీడమాదిరి అడుగుల నడచెను.

అక్కడ చూడుడు ఆంజనేయుడు
అసురుల లంకను కాల్చివేసెను
అంతసముద్రము దాటిన ఘనుడు.
అతులిత బలుడు ఆ హనుమంతుడు

అందరి మాటలు వినుచు రాముడు
ఆనందమును పంచుకొనుచును
అడుగిడినాడు దివ్యసౌధమున
అమరావతితో – భవంతి పోలెను.

స్ఫటికపుగోడలు పగడపు ముంగిలి
మామిడాకుల తోరణాలతో
పూలమాలలతొ అలంకరించి
భవనములన్నీ శోభగ వెలిగెను.

సీతారాములు సౌమిత్రియును
కౌసల్యమందిరము నందడు గిడిరి
తల్లులు ముగ్గురు – అచటే వుండిరి
వారిపదముల వందన మించిరి.

కౌసల్య హృదయము పులకరించెను
అక్కున జేర్చుకు – ఆనందించెను
మాతృప్రేమతో తల్లులందరూ
మరిమరి చూచిరి ఆ సోదరులను.

అచటకు వచ్చిన వశిష్టమునికి
వినయమునిండి – వందనమిడిరి
జటాబంధనము విడదీసిమెల్లగా
మంగళజలముల స్నానము తీర్చిరి.

అంతట మహర్షి – సీతారాముల
అయోధ్యనేలెడి – సింహాసనమున
కూర్చొనబెట్టి – అభిషేకించెను
కన్నులపండుగ అయినది పండుగ

పట్టుబట్టలు ఆభరణమ్ములు
అలంకరించిన సీతారాములు
అందరికిడిరి బహుమానములు
అంతులేనివగు సంపదలిడిరి.

పట్టాభిషేక సమయమునందు
దివ్యకానుకలు దేవతలందరు
సమర్పించిరి రామచంద్రునికి
ఆనందముగా జరిగెను వేడుక

రాజుగ రాముని చూడగ కోరిక
తీరెను జనులకు – సర్వజగతికి
పట్టాభిరాముడు పరిపాలించగ
పుడమిపొంగెను – తన భాగ్యమని

భూప్రకంపనలు సంద్రపు టలజడి
రామరాజ్యమున – లేక – చల్లగా
జనులందరును సుఖముగనుండిరి
మునులకు – అసురుల బెడద తీరెను.

సూర్యచంద్రులకు – గ్రహబాధపోయెను
హోమాగ్నులవి – వెలిగె నిండుగా
దివ్యతేజముతొ వెలిగెను దిక్కులు
దేవరాజ్యమును తలపించినది.

యజ్ఞవరాహము – దిగ్గజమ్ములకు
ఆదిశేషునికి – భూభారమును
మోయగ – కష్టము అనిపించకను
ఆనందించిరి – రామరాజ్యమున

ఈతిబాధలు మరిచిరిజనులు
అన్నదమ్ములుగ మెలగ సాగిరి
రామనామముతొ నిండెను పుడమి.
కన్నతండ్రివలె - కాచెను రాముడు.

త్రేతాయుగమున - కృతయుగమన్నటు
యజ్ఞయాగములు జరుగుచుండగా
అపసవ్యముగా ఏదియు జరుగక
ఆనందాబ్ధిని జనులు మునిగిరి

లక్ష్మీదేవిని తలపించుచును
మంగళమూర్తి సీతాదేవి
రాముని గుండియ బాసల నెరిగి
భర్తసేవలో పరవశించినది.

అటులచెప్పగా శుకయోగీంద్రుడు
ఆనందముతో పొంగిన రాజు
పాండవ వంశాంకురము పరీక్షిత్తు
రాముని తలచి - వందనమిడెను.

అంతట అడిగెను ఆ మహరాజు
రాముడు - ఎన్ని - క్రతువులొనర్చెను
ఎటుల జనులను - పరిపాలించెను
సవిస్తరముగా వినకోరితిని

తన సోదరులను ప్రాణసమముగా
ప్రేమించెను - శ్రీరామచంద్రుడు
బంధుల పాలిటి కరుణాసింధువు
భక్తులపాలిటి కల్పతరువయా!

రామరాజ్యము సుఖసౌఖ్యములకు
ఆలవాలమని వింటివి నీవు
యజ్ఞపురుషుడే తాను అయినను
భూత తృప్తిగా క్రతువులు చేసెను.

నాల్గుదిక్కుల తన రాజ్యము
ఋత్విక్కులకు - దానముచేసెను
సీతారాములు ఆభరణంబులు
పూర్తిగ - దానము చేసి వేసిరి

దానధర్మముల - రాముని మించిన
చేయి లేదని - పొంగిపోయిరి
భుదానమును పొందిన యోగ్యులు
ప్రేమగ పలికిరి రామచంద్రునితొ

యోగులమయ్యా! భోగములెందుకు
పుడమిపాలనము చేయుము నీవే
అజ్ఞాన తిమిరములంతరించగా
జ్ఞానజ్యోతిని వెలిగించుమయా!

అదియే మాకు సంభావనయగు
బ్రతుకును దిద్దెడి మార్గము అగును
అనుచు వారట - ఆశీస్సులనిడ
విజయశోభతో వెలిగెను రాముడు.

విశ్వమోహనుడు ప్రజలమనస్సుల
కొలువుతీరెను పరిపాలించెను
మారువేషమున తిరుగుచు ప్రజల
సమస్యలన్నీ తెలియుచుండెను.

రామచంద్రుడు తనే స్వయముగా
వినెనొక - పౌరుని వాడి మాటలు
భార్యనాతడు తూలనాడెను
శంకతొ పలికెను అతికఠినముగా

"నిన్నేలుకొను మూర్ఖుడగాను
పరుల ఇంటిలో - వున్న నిన్నుమరి
కోరితెచ్చుకొను వెర్రిరాముడను
అనుకోవద్దు" అనుచు పలికెను.

రాముని మనస్సు కలతచెందెను
పుడమి పాలన అగ్ని పరీక్షని
తెలిసిన రాముడు - ప్రజావాక్యమే
కర్తవ్యమని మదిలో నెంచెను

చూలింతయగు సీతాదేవిని
అడవులకంపగ నిశ్చయించుకొనె
సూర్యవంశముకు తనవల్లను మరి
కళంకమగునని మది తలపోసి.

సీతను పరిత్యజించగ తలచి
పట్టరాని దుఃఖమ్ముతొ నంత
లక్ష్మణమూర్తిని ఆదేశించెను
సీతను వనముకు గొనిపొమ్మనెను

వనమునందున - వాల్మీకి మహర్షి
ఆశ్రమమందున విడువగ చెప్పెను
ముని వాటికల విహరించగను
కోరెనుగావున గొనిపొమ్మయ్యా!

పరిత్యజించిన విషయము చెప్పక
మెల్లగ విడచి రమ్మని చెప్పెను
మదిలొ కలవరమందిన తమ్ముడు
రాజాజ్ఞను మరి నిర్వర్తించెను.

అడవిలొ - ఆశ్రమమందున జేర్చి
విషయము చెప్పి శోకవశుడయి
తిరిగి వచ్చెను లక్ష్మణమూర్తి
అతివ మనస్సు కల్లోలమయె.

ఆత్మహత్యతో అంతముకాగా
తలచెను సీత - కానీ ఆమె
వంశాంకురముల చంపిన యట్టి.
దోషముతలచి - మిన్నకున్నది.

అతిభారముగ అడుగులేయుచు
వాల్మీకి ఆశ్రమము చేరెను సీత
మౌని సత్తముడు సర్వము తెలిసి
ముదముగ నామెను ఆహ్వానించెను.

కన్నబిడ్డలా - ఆమెను సాకుచు
పుణ్యకథలను ఆమెకు చెప్పుచు
వేదన తీర్చెను ధరణీసుతకు
కడుపు ఫలించి కన్నది - కవలల

ఆ మగ శిశువుల కిద్దరికపుడు
లవ కుశులనుచు - పేర్లు పెట్టెను
రామచంద్రునికి ప్రతిబింబములే
అన్నటు వారు - పరవశమిడిరి.

భరతునితనయులు ఇద్దరు వారు
రక్ష, పుష్కలులు అనెడి పేర్లవి
అంగద చంద్రకేతుడు అనెడి కొడుకుల
లక్ష్మణ మూర్తికి కలిగిరి రాజా!

సుబాహువు మరి శ్రుతసేనుండను
తనయులు పుట్టిరి శత్రుఘ్నునకు
అతుల సోదరులు నలుగురికీ ఆ
వంశాంకురములు ఉద్భవించిరి

ఆసమయములో భరతకుమారుడు
గంధర్వులతో యుద్ధముచేసి
వారిని జయించి కానుకలందుకు
రామచంద్రునికి సమర్పించెను.

లవణాసురుడను అసురుడు మునులను
వేధించగను – విషయము తెలిసి
శత్రుఘ్నుని మరి పంపెను రాముడు
రాచపట్టి తా జయించె వానిని.

ఆనందించిన రామచంద్రుడు
శత్రుఘ్నుని గని కౌగలించుకొని
ప్రశంసించెను – వాని శౌర్యమును
పొంగిపోయెను – రామానుజుడు.

వనమున పుట్టిన వీరబాలకులు
పెరుగుచుండిరి విద్యలు నేర్చిరి
వాల్మీకే – తన రామాయణము
తీయగ చెప్పెను ఆ సోదరులకు.

గంధర్వులవలె ఆ లవకుశులు
రామగానము చేయుచుండగా
ప్రకృతి తానే పరవశించెను
ఎన్నో తావుల గానముచేసిరి.

ఆ బాలకులు అయోధ్యలోన
రాముని – యాగశాలకు వచ్చిరి
వారి రూపములు గాంచిన మునులు
దేవబాలకులు అని తలపోసిరి.

లవకుశులంతట – రామాయణమును
వీనులవిందుగ గానము చేసిరి
వినిన రాముడు పరవశించెను
వారి రూపములు – హృదిలో నిలచెను.

అక్కున జేర్చుకు రామచంద్రుడు
వివరములడిగెను – అంతట వారు
రాముని యజ్ఞము చూడగవచ్చిన
మునిబాలురమని తెలియజెప్పిరి.

మరునాడుదయము వెళ్ళెదరనుచును
వారికి తగిన వసతులనిచ్చి
కానుకలిచ్చి రామచంద్రుడు
అంతులేని ఆనందము నందెను

మరునాడుదయము వాల్మీకిమహర్షి
అవనిజతోను అయోధ్యచేరి
రామచంద్రునకు సర్వము తెల్పెను
రామ తనయులీ – లవకుశులు అనె.

తిరిగి పలికెను రామాయణకర్త
రామా! నీకు చెప్పగ తగుదుమ!
నీమది తెలియగ ఎవ్వరివశము
నిలచిన ధర్మము నీవేరామా!

సీతాదేవి పరమపతివ్రత
పావన చరిత పృధివికి పుట్టెను
అగ్నిహోత్రుడే అందరిముందు
పతివ్రతయని నాడు చాటెను.

వీరశుల్కయగు ఈ అయోనిజ
నీకు తగిన ఇల్లాలు అనుచును
సర్వజగత్తు మురిసిపోయెను
భార్యాబిడ్డల చేరదీయుము.

రాముని మనస్సు తెలిసిన అవనిజ
పతిదేవునికి వందనముంచి
ప్రార్ధన చేసెను తన జననియగు
అట వసుంధరను ఆర్తితోడను.

తల్లీ! నేను ధర్మచరితను
ఓర్పున నీకు - తగినదానను
నిష్కళంకను - పతియే మనుగడ
పతి మనస్సును గెలవక పోతిని

నిష్కళంకను - నీకుమార్తెను
అపవాదుతొ - నే బ్రతుకలేనిక
రామాంకమది - పోయిన నాకు
నీ అంకసీమయే - శరణముతల్లీ!

అనుచు ఏడ్చెను అవనీనందిని
అంతట చీలెను - రెండుగ భూమి.
సభాభవనము రెండుగ చీలెను.
పైకివచ్చెనొక అమోఘదృశ్యము

సహస్రఫణిమణి దివ్యకాంతులతో
ఆదిశేషుడు అగుపించెనట
ఆపడగలపై నవరత్న భూషిత
మణిమకుటముతో వెలుగులు చిమ్మె

విశ్వమోహిని వసుంధర అట
ఆసీనురాలై అగుబడె కన్నుల
అవనిజ - నంతట గుండెకు హత్తుకు
అంకసీమన కూర్చొన బెట్టుకు

అభిమానముతో చెక్కిలి నిమురుచు
ఆనతివ్వగా ఆదిశేషుడు
ఆశ్చర్యముగా భూమిలోకి చనె
అచ్చటినేల - తిరిగి కలిసెను.

అంతట రాముడు క్రోధమునిండి
అవనిపైన మరి శరమువదలగ
అనుజా! ధనుస్సు అనుచు అడుగగా
అందరు నిలచిరి నిశ్చేష్టులయి.

శాంతమూర్తి అట మారె రౌద్రముగ
జగతిప్రళయమే అనితలంచిరి
అచ్చటనున్న వాల్మీకి మునీంద్రుడు
ముందుకువచ్చి - శాంతపరచెను.

రాఘవా! నువు శాంతివహించుము
అవమానము మరి పుడమిచేసెనని
కినుక వహించకు జరిగిన దానికి
చింతించినను ఫలితము శూన్యము.

విధి విలాసము – అటుల జరుగవలె
అందులకింక దుఃఖము మానుము
కుశలవులిద్దరు మీదంపతులకు
ప్రతిబింబములు తెలియుము రామా!

వారికి పట్టము కట్టుము రామా!
నీవే కన్నులు ఎర్ర జేసిన
లోకములన్నీ దగ్ధము అగును.
అందులకింక శాంతి వహించుము.

అనుచుచల్లగా శాంతపరచెను
రామచంద్రుని స్తోత్రముచేసెను
వాల్మీకి సాగెను తపోభూమికి
రాముడు మనస్సు చక్కబరచుకొనె

ధర్మమార్గమున సాధుసేవలతొ
సమారాధనల హోమక్రతువులతొ
పదమూడువేల వత్సరమ్ములు
రాజ్యమేలి – నిజవాసముకేగెను.

ఆదిదేవుడు శ్రీరఘురాముడు
పుడమిభారము తీర్చగ పుట్టెను
వానర దండుతొ వారధి కట్టుట
అసురులు చంపుట ఆయన లీల.

దుష్టశిక్షణ శిష్టరక్షణకు
అవతరించిన ఆనంద ధామము
శ్రీరఘురాముడు లోక కంటకుని
లోకక్షేమము కోరి చంపెను.

ధీరోదాత్తుడు తారక రాముడు
ధర్మస్వరూపము దశరథరాముడు
పుంసాంమోహన రూపుడు రాముడు
పురాణ పురుషుడు పురుషోత్తముడు.

తామరరేకులవంటి కన్నులు
పున్నమచంద్రుని మించిన అందము
చల్లని చూపుల – మనసులనేలే
మనోహరుడు శ్రీరఘునందనుడు.

చిరునగవులతో సిరులనుఒసగే
శ్రీకరమూర్తి శ్రీరఘురాముడు
భార్యతొ తమ్ములు హనుమంతునితో
కొలువుతీరును భక్తుని గుండెలొ

అంతటిరాముని కివె జోతలయా!
అనఘుడు రాముని కిదె వందనము
అమితబలాఢ్యుని కిదె సుమాంజలి
అనుచు అందరూ మ్రొక్కెదరయ్యా!

రామునితో మరి కలిసియుండిరి
రామునితో మాటాడు చుండిరి
రాముని చల్లని చూపులు అంది
ధన్యతనందిరి జనులందరును.

పశుపక్ష్యాదుల సర్వజీవులను
తరింప జేయును రామనామము
భవసాగరమును దాటించి మరి
దివ్యధామము చేర్చును నిజము.

ఆతరువాత రాజ్యమునకును
కుశుని తనయుడు అతిధి వచ్చెను
అతిధి తనయుడు నిషధుడు రాజా
నిషధుని కొమరుడు నభుడు అగునయా!

నభుని కుమారుడు పుండరీకుడు
పుండరీకునికి – క్షేమధన్వుడు
అతనికి తనయుడు దేవానీకుడు
వాని కొమరుడు అహేనుడగును

అహేను కొమారుడు పారియాత్రుడు
అతని కుమారుడు బలుడనువాడు
బలుని కుమారుడు – చలుడనువాడు
చలుని తనయుడు – వజ్రనాభుడు.

వజ్రనాభునికి కొడుకు శంఖణుడు
అతని కుమారుడు విధృతి అగును
విధృతి తనయుడు హిరణ్యానాభుడు
హిరణ్యానాభుడు యాజ్ఞ్యవల్క్యునిచె

ఆధ్యాత్మయోగమను – విద్యను నేర్చి
మనస్సునంతయు వశమున నుంచుకు
యోగమార్గమున చరించసాగెను
అతని కుమారుడు పుష్యుడు అగును.

పుష్యుని కొడుకు – ధ్రువసంధియగు
అతని కుమారుడు సుదర్శనుండు
సుదర్శనునికి అగ్నివర్ణుడు
అతనికి తనయుడు శీఘ్రుడు అగును.

శీఘ్రుని తనయుడు మరుడనురాజు
నాటి రాజులలొ మేటిగ నిలచిన
మరుడు క్రమముగా యోగిగ మారి
కలాప – గ్రామమునందు వసించెను.

కలియుగమంతము అయిన తదుపరి
విఛ్ఛిన్నమైన సూర్యవంశమును
మరుడు తిరిగి మరి నెల కొల్పెనయా
అతనికి పుట్టెను ప్రశుసుశ్రుండు

వానికి పుట్టెను – సంధి – తనయునిగ
సంధి కుమారుడు – అమర్షణుండగు
మహాస్వతుండు – వాని కొమరుడగు
విశ్వసాహ్యుడు – ఆతని తనూజుడు.

విశ్వసాహ్యుని వంశాంకురము
బృహద్బలుండగు – ఆ వీరుండు
భారత యుద్ధము నందున పోరి
నీ జనకుని చేబడి మరణించెనయా!

ఓ మహారాజా! సవిస్తరముగా
ఇక్ష్వాకునుండి బృహద్బలు వరకు
వివరములన్నీ తెలిపితి నీకు
ఆపై పుట్టెడివారి వివరములు

తెలియబరతునని శుకయోగీంద్రుడు
పరీక్షిత్తునకు తెలియ బరచగా
సూతుడు అచటి మునులందరికి
తెలియబరచెను వివరముగాను.

❋❋❋ ॥శ్రీ కృష్ణచరితము॥

# 4 భవిష్య ద్రాజేతిహాసము

బృహద్బలునకు - బృహద్రణుండు
వాని తనయుడు ఉరుక్షతుండు
ఉరుక్షతునకు తనయుడు భానుడు
భానుని కొమరుడు సహదేవుండు

సహదేవు తనయుడు బృహదశ్వుండు
వాని కుమారుడు భానుమంతుడు
అతనికి తనయుడు ప్రతీకాశ్యుడు
వానికుమారుడు - సుప్రతీకుడు.

సుప్రతీకునకు - మేరుదేవుడు
మేరుదేవునికి - సుతక్షత్రుండు
వానికి తనయుడు ఋక్షకుడయ్యా
ఋక్షకు తనయుడు అంతరిక్షుడు

అంతరిక్షునకు సతపుడు కొడుకు.
వానికుమారుడు అమిత్రజిత్తగు
అతనికి తనయుడు బృహద్వాజియగు
వాని కుమారుడు బహీ అనబడు

బహీ తనయుడు ధనుంజయుండు.
ధనుంజయునకు - రణంజయుండు
వాని కొమరుడు సృంజయుడగును
సృంజయు సుతుడు శాక్యుడు అగును.

శాక్యుతనయుడు శుద్ధాదుండు.
శుద్ధాదునకు సుతుడు లాంగలుడు.
వానికి తనయుడు ప్రసేనజిత్తు
వాని కుమారుడు క్షుద్రకుండయా!

క్షుద్రకు తనయుడు ఋణకుండయ్యా
వానికుమారుడు - సురథుండయ్యా
సురథుతనయుడు సుమిత్రుండగు
అతనితో సరి సూర్యవంశము

సూర్యవంశమున - కార్యదక్షుడు
ఇక్ష్వాకుడయా - అతని తనయుడు
నిమి - యనురాజు తండ్రికి తగును
అతడొక యజ్ఞము సంకల్పించెను.

కులగురువు అగు వశిష్టమునిని
యజ్ఞముతనచే చేయించమనె
ఇంద్రుడు కూడా ముందే యజ్ఞము
సంకల్పించి పిలచె వశిష్ఠుని

అందువలననే వశిష్టమహర్షి
రాలేననుచు - చెప్పెను విషయము
సందిగ్ధములో నిమి అంతటను
నిర్ణయించెను యజ్ఞముచేయగ

బుద్బుదప్రాయము తనువు కావున
మరి యొక మునిని ఆహ్వానించి
నిర్విఘ్నముగా యజ్ఞముచేసెను.
వినిన వశిష్టుడు ఆగ్రహమందెను.

తనకై ఆగక - యజ్ఞము చేసెను
నిమిని శపించెను-తనువు రాలునని
తిరిగి శపించెను నిమి మహరాజు
నీవుకూడ మరి మడయుదు వనెను

కాలము నెవ్వరు దాటగలేరు
క్రోధము మూలము అనర్థమ్ములకు -
దేహత్యాగము చేసి వశిష్టుడు
ఊర్వశి గర్భమునందు పుట్టెను.

శాపగ్రస్తుడగు నిమి అంతటను
తనువు వీడగ - ఆదేహమును
సుగంధ ద్రవ్యములందు నుంచిరి.
యజ్ఞక్రియను మరి పూర్తిజేసిరి.

మునుల హవిస్సులు అందుకొనుటకు
వచ్చిన సురలను గాంచి పలికిరి
బ్రహ్మజ్ఞాని - ఈరాజు కావున
బ్రతికించండని భక్తిగ కోరిరి.

దేవతలంతట ఊపిరిపోయగ
వలదని నిమి అట వారికి చెప్పెను
దుఃఖ భాజకము ఈశరీరము
తిరిగిదానిలో - జేరుట ఏల!

పరమాత్మధ్యానమున పరవశించెడి
ఆత్మజ్ఞానులు దేహము కోరరు
అనగా - వేల్పులు - మిన్నకుండిరి
మునులను గాంచి పలికిరి వారు.

వలదని నిమి - తా అనెనుగావున
మీకుఇచ్చెడి వరమిది - వినుడు -
తలచినంతనే మీకందరకు
నిమి కనిపించును అనుచు పలికిరి.

అంతట మునులు యోచనచేసి
రాజులేని ఆ రాజ్యము కొరకు
నిమి శరీరమును మథించి అంతట
ఒక మగ శిశువును పుట్టించారు.

అతడే జనకుడు - విను మహరాజా!
మథించ - పుట్టెనుకావున - మిథిలుడు
విదేహమందున పుట్టెను కావున
వైదేహుడనియు - పేర్లుకలిగెను.

మిథిలుడు నిర్మించినదే మిథిల
మిథిలుని తనయుడు ఉదావసుండు
అతనికిసుతుడు నందివర్ధనుడు
అతని కుమారుడు సుకేతువయ్యా

సుకేతు తనయుడు దేవరాతుడు
అతనికి తనయుడు బృహద్రథుండు
వానికి సుతుడు సుధృతిఅగును
సుధృతి సుతుడు దృష్టకేతుడు

అతని కుమారుడు హర్యశ్వుండు
హర్యశ్వ-కుమారుడు మరువు అగునయా!
మరువుకు తనయుడు ప్రతింధనుండు
వానికి తనయుడు కృతరయుండయా!

కృతరయు సుతుడు దేవమీఢుడు
వానికుమారుడు విధృతుండయా!
విధృతు కొమరుడు మహాధృతియగు
మహాధృతి సుతుడు కీర్తిరాతుడు

కీర్తిరాతునకు మహారోముడు
మహారోమునకు స్వర్ణరోముడు
స్వర్ణరోమునకు హ్రస్వరోముడు
వానికుమారుడు సొరధ్వజుండు

సొరధ్వజుడు యజ్ఞముచేయగ
బంగరు హలమున యాగభూమిని
దున్నుచుండగా దివ్యబాలిక
ఉదయించినది నాగటిచాలున

ఆశిశువును మరి సీతగ పిలచెను.
సొరధ్వజునికి కుశధ్వజుండు
వారికి తనయుడు ధర్మధ్వజుండగు
కృతధ్వజ, మితధ్వజులు వానికి తనయులు

కృతధ్వజు – మితధ్వజులకు
కేశిధ్వజ – ఖాండిక్యులు సుతులు
వాదమునందు కేసిధ్వజునికి
ఖాండిక్యుడు – ఓడి – వనములకేగెను

ఖాండిక్యునికి భానుమంతుడు
వాని తనయుడు శతద్యుమ్నుండు
వాని కుమారుడు శుచి అనువాడు
శుచి కుమారుడు సనధ్వాజుడగు

సనధ్వాజునికి – ఊర్ధ్వకేతుడు
ఊర్ధ్వకేతుని సుతుడు అజుడయా
అజునికుమారుడు పురజిత్తగును
వానికుమారుడు అరిష్టనేమి.

అరిష్టనేమి సుతుడు శ్రుతాయువు
వాని కుమారుడు పార్శ్వకుండయా
పార్శ్వకు తనయుడు చిత్రరథుండు
క్షామసి ఆతని కుమారుడగును

క్షామసి తనయుడు హేమరథుండు
హేమరథునికి సత్యరథుండు
వానికొమారుడు ఉపగురుడయ్యా!
అగ్నినాతడు – ఆరాధించగ

మెచ్చిన అనలుడు – అనుగ్రహించగ
ఉపగర్వుడను తనయుడు కలిగెను
అతని కుమారుడు పావనుడగును
పావనుతనయుడు సువర్చసుండు.

సువర్చసుండుసు – భూషణుడనబడు
అతని తనయుడు జయుడనువాడు
జయుని కుమారుడు విజయుండయ్యా
అతనికి తనయుడు ధృతుడనువాడు

ధృతుని కుమారుడు అనఘుడనబడు
వాని కుమారుడు వీతిహవ్యుడు
అతని తనూజుడు ధృతియనువాడు
ధృతికి తనయుడు బహుశాశ్వుండు

బహుశాశ్వ సుతుడు కృతి అనబడును
కృతి కుమారుడు మహావశియగు
వీరే - మైథిలులనగ - ప్రసిద్ధులు
వీరందరునూ ధర్మతత్పరులు

రాజ్యపాలనము చేయుచున్నను
పరమాత్మతత్వమును ఆకళించుకొని
గృహస్థాశ్రమము నెరపుచున్నను
బ్రహ్మోపాసనయందు - చరింతురు.

అనుచు పలికిన - శుకయోగీంద్రుడు
చంద్రవంశపు రాజుల చరితము
వినిపించెదనని తెలియబరచగా
పరవశమ్ముతో వినెను నరేంద్రుడు

॥శ్రీ కృష్ణచరితము॥



## 5 చంద్ర వంశస్థుల చరిత్ర

అనంతుడాతడు సర్వవ్యాపకుడు
పరంధాముడు పరాత్పరుండు
శ్రీహరి కర్త - సృష్టికర్తకే!
నాభికమలమున పుట్టెను బ్రహ్మ -

విరించి మానస పుత్రుడు - అత్రి
తండ్రికి తగిన సుగుణాలగని
అత్రి తనయుడు శశాంకుడయ్యా!
కలువల కిలకిల నవ్వించుచును

విప్రోత్తములకు - ఓషధులకును
నింగితారలకు అధిపతి ఆయెను -
ఆవిధముగా బ్రహ్మనిర్ణయము
చంద్రుడు జగతికి ఆనందమునిడు

రాజసూయము చంద్రుడు చేసి
మూడుజగముల పేరుగాంచెను
దేవగురుడగు బృహస్పతికడ
విద్యాభ్యాసము కొరకై చేరెను.

సకలవిద్యలు నేర్చెను చంద్రుడు
ఆ సమయములో బృహస్పతి భార్య
తార అనెడి అందాల అతివ - తా
చంద్రుని చూచి మోహించినది.

అనేక విధముల ప్రయత్నించెను
చివరకు చంద్రుని లొంగ దీసుకొనె -
అందాల చంద్రుడా - అతివకులోబడె
విద్యాభ్యాసము పూర్తి అయినది.

చంద్రుడు గురువుకు నమస్కరించి
శలవుగైకొని బయలు దేరగా
తార అతనితో వెంబడి సాగెను
వికల మనస్కుడు అయ్యెను గురువు.

సామోపాయము సాగదనుకొని
కయ్యానికి మరి దిగెను బృహస్పతి
భీకర సంగ్రామమ్ము మొదలయె
సురలు గురువుకు సాయమయ్యిరి

అసురులు - వారి గురువు-శుక్రుడు
చంద్రునివైపు - పోరసాగిరి.
జగత్ ప్రళయమే అగునట్టుగను
భీకరమైన పోరు సాగెను.

అదిగాంచిన ఆ అంగీరసుండు
బృహస్పతికి మరి జనకుడు అగును
బ్రహ్మనుగాంచి - పోరుమాన్పమనె
విరించి వచ్చి - పోరునాపమనె

చంద్రునికంత బుద్ధిగరపెను
తారను వదలగ ఆదేశించెను
అంతట తారకు నచ్చజెప్పెను
నిశ్శబ్దముగా నిలచిపోయెను.

అంగీకరించిన భార్యామణిని
చూచిన భర్త దిగులునందెను
గర్భవతియని తెలిసినయంత
అనేక విధముల - దూషించెనట

కులపాంశని వని పరుషములాడెను
పరమపాతకి అనుచు తిట్టెను
బ్రహ్మనిలచెను మారుపలుకక
కొన్ని దినములకు ప్రసవించినది

చక్కనివాడు అందములొలికే
మగశిశువుకు తా జన్మనిచ్చెను
మనస్సుకళిగిన బృహస్పతి - గని
తనబిడ్డడని - వెల్లడిచేసెను.

చంద్రుడు కూడా తన బిడ్డడని
చెప్పగనంతట తికమక పడిరి
వాగ్వివాదము పెరిగె నిద్దరికి
తెల్లబోయి అట నిలచిరి మునులు

దేవతలను మరి అడిగిరి మునులు
మాకు తెలియదు అనుచు చెప్పిరి
తల్లికి తెలియును అనగా నంత
పుట్టిన శిశువు తల్లి నడిగెను

ఆవేదనతో అడిగెను బిడ్డ
అనామకుడనై పోదును తల్లీ!
తండ్రి తెలియని పాపినందురు
వివరము చెప్పుము - అనుచు వేడెను

మాటలురాక నిలచెను తార
అందరిముందు పలుకగ లేదు
బాధ గ్రహించిన విరించి అంత
అనునయించెను ఏకాంతముగా

బ్రహ్మ తనను మరి క్షమించెనని విని
సిగ్గుతొ చెప్పెను - చంద్రుడేయని
విలపించు తారను - ఊరడించెను
ఆ బాలుని మరి చంద్రునికిచ్చెను

బుధుడు అనుచును పేరుపెట్టెను
సర్వముగాంచి బృహస్పతి అంతట
కృంగిపోయెను అవమానమ్మయె
అంతట బ్రహ్మ - దగ్గరజేరి

అయ్యా! నీవు దేవగురుడవు
ఆచార్యుడవు కావున నీవు
భార్యలేక మరి పదవికి తగవు
అందులకొరకై పత్ని ముఖ్యము

బిడ్డలు కలుగుట రెండవ విషయము
పత్నిని పొందుట ప్రధమము కావున
తారను నీవు స్వీకరించుము
అనుచు పలికి మరి కలిపెనువారిని

కొడుకునుగాంచి చంద్రుడు పొంగెను
అందమునందు తండ్రిని మించెను
యోగ్యుండైన బుధున కంతట
ఇళ అను కన్యతొ పరిణయమైనది

బుధునకు ఇళకు పుట్టినవాడు
పురూరవుడు సుందర రూపుడు
శౌర్య ధైర్య గాంభీర్యముల
దిక్కుల వెలిగెను ఆతని కీర్తి

ఒక దినమున దేవేంద్రసముఖమున
సభలో నారద మహర్షి తాను
పురూరవుని ప్రఖ్యాతిని బొగడెను
రాజలోకముకు కిరీటమనెను.

మిత్రావరుణుని శాపమువలన
ఊర్వశిమారెను మానవాంగనగ
ఆమెవిన్నది పురూరవు వర్ణన
అతనిని చూడగ ఉవ్విళ్ళూరెను.

భూలోకములో గాంచెనాతనిని
ఆతని అందము మత్తెక్కించెను
మన్మధుడే మరి తగడు అన్నటు
అందమ్మునకే అందమాతడు

అంత దూరమున అగుపించిన ఆ
ముగ్ధమనోహరి మనసు హరించగ
మరిమరి చూచెను పురూరవుండు
విరిశరముల గురి తగిలె నిద్దరికి

మనసువిప్పెను పురూరవుండు
మదినేలమని అభ్యర్థించెను
మంగళకారిణి – మరునిబాణమా!
మనువాడమని – ప్రియముగ కోరగ

అంగీకరించిన ఆ యౌవ్వనవతి
దేవవేశ్యను ఊర్వశిననెను
నీఅందము విని వచ్చితిననెను
తన నియమములు చెప్పెనాతనికి

నియమపాలన జరగక పోయిన
తనతోనుండుట జరుగదు అనెను
అందుమొదటిది తనమేకలను
రెంటిని శ్రద్ధగ కాపాడవలె.

రెండవ నియమము ఆ మహరాజు
దిగంబరముగా కనబడరాదు
మూడవ నియమము కాదనకుండా
మేకల – నేతిని – ఆరగించవలె.

కామ బలమది - బంధించగను
కట్టుబాట్లకు - అంగీకరించెను
కల నిజమైనటు సంబరపడెను
కలసి సాగిరానందసీమకు

బంగరుమేడను కట్టించాడు
పూదోటలతో జలాశయములతొ
నేత్రపర్వముగ నిలచెను భవంతి
మన్మథరాజ్యము నేలసాగిరి.

ఎడబాయని చక్కని అనురాగముతో
కంటికి రెప్పలు కలసియున్నటు
కాంతా కాంతుడు ఒకటిగ నుండిరి
రెప్పపాటు మరి విడివడి యుండరు

అటులా యిరువురు సుఖముగనుండగ
ఇంద్రసభలొ మరి ఊర్వశిలేదని
గ్రహించి ఇంద్రుడు సర్వము తెలిసి
ఆమెను తిరిగి రప్పించ నెంచెను.

గంధర్వులిద్దరిని వినియోగించెను
వారొకరాత్రి రెండుమేకలను
బాధించగను అరచిన వవ్వి
నిద్రలొనున్న రాజులేవడయె.

గాఢాలింగన ఆనందములో
వళ్ళుతెలియని మొద్దునిద్రలో
పురూరవుండు వుండుట గాంచెను
ఊర్వశి వెంటనె నిద్రలేచెను.

మేకల అరపుల ఆమె లేచెను
కానీ ఆతడు - మరింత బలముగ
ఆమెను దగ్గరజేర్చుకు పడుకొన
ఊర్వశి ఎంతయొ - ఈసడించుకొనె.

ఆపదకలిగిన సమయములోన
అందుకు తగిన స్పందనలేక
అతి నిద్రితుడు - పురుష రూపమగు
అతివే అగునని - పరుషములాడెను

దిగ్గునలేచి ఆదుకొనగను
అడుగిడనట్టి - శౌర్యహీనుడు
మగవాడని మరి - చెప్పగ తగడు
అట్టిభర్తను పొందుట హేయము -

చక్రవర్తిగా - భీరువునకును
వ్రాత వ్రాసిన - బ్రహ్మాది తప్పు
అనుచు-మాటలను ఈటెల - పొడవగ
దిగ్గునలేచెను - ఆవేశముగా

ఒక్కఉదుటున బయటకువచ్చి
మేకలగొంతులు నులుముచునున్న
గంధర్వులను అంతము జేసెను
మేకలనంతట తెచ్చె భద్రముగ

కానీ ఆతడు వంటిమీదను
బట్టలులేని సంగతి నెరుగడు
ఊర్వశి మాటల - ఉబికిన క్రోధము
అంతటి ఆపద - తెచ్చిపెట్టినది

మాటతప్పిన ఫలితముగాను
ఊర్వశి అతనిని వదలిపోయెను
దిక్కుతోచక మూర్ఛిలిపడెను
ఆమె వియోగము అంతటిదాయెను.

దిక్కుదిక్కునా – వెఱ్ఱివానివలె
ఊర్వశీ అని అరచుచు వెదకెను
పిలచుచు – నడచుచు – వేదననిండి
సరస్వతీనది ఒడ్డుకు చేరెను

చెలికత్తెలతో జలకాలాడుచు
ఊర్వశి ఆతనికి అగబడెనపుడు
నీటిలో నిలబడి ఆమెను పిలచెను
ఆమెలేక తను బ్రతుకను అనెను.

ఆదుకొనుము నను అన్నులమిన్నా!
అక్కునజేర్చుకు వేదనతీర్చుము
అంతటివరకు ప్రాణములుండవు
అతివా రమ్ము – అని బ్రతిమాలెను.

పరిహాసముగా పలికెను ఊర్వశి
ఆడుదానికి లొంగుట అనిన –
నిన్నేగాంచితి – నిజము తెలియుము
ఈమమకారము – శాశ్వతమైనదా?

కామాంధుడు మరి పశుతుల్యుడగు
వాని కట్టెను మృగములు ముట్టవు
విషయము వినుము – ఆడుదానిని
నమ్మిబ్రతుకుట – మతిమాలిన పని

అతివ స్వభావము తెలియకపోతివి
ఆలోచనలు – అగ్నిమంటలు
ఆప్యాయతలు – అమోఘ నటనలు
ఆపలుకులవి – తేనెలొలుకునవి.

కట్టుకున్నది – మన్మధుడైనా
వారిమనస్సును గెలువగలేడు
క్రౌర్యము వారికి – జన్మలక్షణము
భర్తను – తనయుని – లెక్కజేయరు

చాపల్యమ్మది వారి సొత్తయా!
కాఠిన్యమ్మది – వారినైజము
అధర్మమ్మది – అందిన విద్య
వెలయాలు చెప్పునా – వేదాంతమ్ము!

తెలియక పోయి – చరించినావు
మాటదప్పిన నిన్ను వదలితి
కానీ ఒక ఏడాది తదుపరి
శుభలక్షణుల – కొడుకులనిత్తును.

అనుచుపలికి తా చనెను ఊర్వశి
ఆమెగర్భము ధరించెననుకొని
అమితానందము నందెనురాజు
మోద – ఖేదముల – సాగెనాతడు

సంవత్సరమది గడచినంతనే
పురూరవుండు వచ్చుట గాంచి
ఊర్వశి పలికెను – ఓ మహరాజా!
గంధర్వులను ప్రార్థించుమయా!

వారి అధీనము నుంటిని నేను
నీవు కోరిన - వారొసగెదరు
అనగా రాజు ప్రార్థనచేయగ
గంధర్వులట దర్శనమిడిరి.

అగ్నిస్థాలిని రాజుకుయిచ్చి
నీకోరికది తీరును అనిరి
నీభక్తికి మరి సంతసించితిమి
అనుచు పలికిరి వెడలిపోయిరి.

పురూరవు డా స్థాలిని గైకొని
ఆమె ఊర్వశిగ భావించుకొని
దానితొ వనమున తిరుగజొచ్చెను
విసిగిన రాజు విడచెను దానిని

పగలంతయును కాలముగడచును
కానీ రాత్రి ఊర్వశి స్మరణతొ
పిచ్చివానివలె నుండెనాతడు
అంతటవచ్చెను - త్రేతాయుగము.

త్రేతాయుగ ఆరంభమునకు
ఆత్మజ్ఞానము కలిగెనాతనికి
అగ్నిస్థాలిని గాంచెనాతడు
అశ్వత్థమాతని - కంటికగబడె.

అశ్వత్థముతో రెండు అరణులు
తయారుచేసెను పురూరవుండు
రెంటికి నడుమన - కట్టెను తీసి
తనయుని కొరకై మథించసాగెను.

అటుల తరచగా జాతవేదుడను
అగ్ని అచ్చట - ఉద్భవించెను
ఆరాధనతో పుట్టెనుగనుక
ఆహవనీయాతి రూపమ్ముతో

మూడురూపములు - గలిగినట్టిదై
పురూరవుని - తనయుని గాను
వ్యవహరింపబడి - ఆ మహాత్ముని
పుణ్యలోకముల - కంపగ జాలెను.

అటులపుట్టిన అగ్నిరూపముగ
పురూరవుండు - వేదమయుండు
అనంతమూర్తి శ్రీహరి తలపుతొ
యజ్ఞక్రతువును చేసెనాతడు.

అట్టి యజ్ఞమును నిర్వర్తించగ
పురూరవుండు పుణ్యలోకముల
స్థానము లభించి ఊర్వశి యుండెడి
పుణ్యలోకముల నివాసిఅయ్యెను.

ఏకరూపముగ నున్న అగ్నిని -
త్రేతాయుగము వచ్చినంతనే
అగ్నిని మరియు వేదమ్మును
మూడుగచేసెను పురూరవుండు.

ఆవిధముగను ఆరెండింటిని
అందుబాటుకు తెచ్చెను రాజు
విష్ణుపరముగా యజ్ఞముచేసి
పుణ్యలోకమున నివాసమందెను.

అయు, శ్రుతాయువు, సత్యాయువులు
రయుడు, జయుడును, విజయుండనెడి
ఆర్గురు పుత్రుల బడసెను రాజు
శ్రుతాయు తనయుడు వసుమంతుండు

గాధి రాజ్యమును పరిపాలించెను
ఆతని తనయ సత్యవతియగు
ఋచికుడు అనెడి విప్రుడువచ్చి
సత్యవతిని మరి భార్యగ నిమ్మనె

సత్యాయువునకు – శ్రుతంతయుండు
రయునకు శ్రుతుడు – ఏకుడు అనెడి
ఇద్దరు తనయులు ఉద్భవించిరి
జయుని తనయుడు–అమతుడు రాజా

వయస్సుమీరిన వానికి బిడ్డను
ఆలిగ నివ్వగ మనస్సురాక
తెల్లనిమేను నల్లని చెవుల
వేయి గుర్రములు నిమ్మని అడిగెను

విజయుని తనయుడు భీముడు అగును
భీముని కొడుకు – కాంచనుడయ్యా
ఆతని తనయుడు హోత్రకుడగును
హోత్రకు తనయుడు జహ్నుడురాజా!

గాధికి ఆశ్చర్యము కలుగునటు
వరుణుని కోరి అశ్వమ్ములను
తెచ్చి ఋచికుడు సమర్పించెను
కాదనలేక పెండ్లిచేసెను

నాడు భగీరథు వెంబడివచ్చెడి
సురగంగను ఆ జహ్నుడు – అలిగి
మ్రింగివేసెను – తిరిగి వదలెను
అందుకు జాహ్నవి అందురు గంగను.

మామమాటను మన్నించుచును
ఉండెను ఋచికుడు – భార్యతోనట
గాధికి మగ సంతానములేదు
చింతకలిగెను గాధిరాజుకు

జహ్నుని తనయుడు పూరుడు రాజా!
పూరుని కొడుకు బాలకుడగును
అతని తనూజుడు అజకుడురాజా!
అజకుని సుతుడు కుశుడు అగునయా

గాధికన్నను ఆమెభార్యకు
మగబిడ్డ లేడని బాధ ఎక్కువై
అల్లునిగాంచి వేదవేత్తవని
వంశమునిలపగ మార్గము కోరెను.

కుశాంభుడు మరి దూర్తయుండును
మసువు కుశనాభులు అనునల్గురును
కుశుని తనయులు–విను మహరాజా
కుశాంబు తనయుడు గాధి అగునయా!

మగశిశువుకయి యజ్ఞముచేసి
అనుగ్రహించగ అత్త కోరెను
అటులే భార్యయు – మగశిశువునకై
ప్రార్థనచేసెను ఋచికునంతట

సరియని పలికి - శాస్త్రవిధిగను
భార్య - అత్తల కోర్కెలు తీరగ
యజ్ఞకాండను ఆరంభించెను
హోమమ్ములను చేయించెనట

చరువును - వారు భుజించుకొరకు
వేరువేరుగా - పూజాగృహమున
భద్రపరచి మరి స్నానముకేగెను
అంతటవారు - తొందరపాటున

ఒకరి నిమిత్తము వుంచిన దానిని
వేరొకరు మరి - భుజించినారు
అటులా చరువులు మారిపోయెను
గ్రహించి-ఋచికుడు క్రోధమునిండి

భార్యతొ పలికెను - మూర్ఖురాలవు
క్రూరాత్ముడగు తనయుడు నీకు -
బ్రహ్మవేత్త - మరి నీ తల్లికిని
ఉద్భవింతురు - అనుచు పలికెను.

పదముల బట్టిన భార్యను గాంచి
శాంతించి ఋచికుడు పలికెనంతట
విధి నిర్ణయము మార్చగలేము
కానీ - కొంత మార్పుచేతును.

నీతనయుడు మరి సాధువుఅగును
అతని తనయుడు క్రూరుడు అగునని
అంతేచాలని సంతోషపడి
భర్త మహిమకు పొంగెను భార్య

సత్యవతి మరి కొడుకును కనెను
ఆతనిపేరు జమదగ్ని - రాజా!
ఆపై ఆమె జన్మాంతరముగ
కౌశికి నదిగా పావనియైనది

రేణువు అనెడి వాని బిడ్డను
రేణుకను - జమదగ్ని గ్రహించెను
వసుమనాది పుత్రులకామె
జన్మనిచ్చెను వారిలొ ఒకరు

హరి అంశముతొ మరి ఉద్భవించెను
రాముడు - అనెడి పేరున బరగెను
పరశువు ఆయుధమ్ముగా గొని
క్షత్రియ వంశమ్ములపై పగగొని

ఇరువదిఒక్క తడవలు ఆతడు
వెదకివెదకి - ఆ రాజుల జంపెను
ఋచికుడు - భార్యకు చెప్పిన రీతి
మనుమడు అటుల క్రౌర్యము జూపెను.

అంతటి ఘోరము చేసిన గాని
హరి అంశతొ మరి పుట్టెను గనుక
క్రూరముగానది పరిగణించక
సాధారణమగు చర్యగ నిలచెను

అంతట అడిగెను రాజవరేణ్యుడు
బ్రాహ్మణ వంశమునందు జనించి
అంతటి హింసను చేసె నెందులకు
వివరింపుమయా! ఓపుణ్యాత్మా!

సమాధానముగ మౌని పలికెను
పరశురామ చరిత్రను తెలిపెను
రాజా! వినుము–హైహయప్రభువుల
అర్జును డనెడి రాజు – మేటియగు

శ్రీహరి అంశతొ అవతరించిన
దత్తాత్రేయుని సేవించుకొని
శ్రీగురుదేవుని అనుగ్రహమ్మునకు
పాత్రుడయ్యెను భక్తుడయ్యెను.

శత్రువిజయము – వేయిచేతులు
అణిమాది సిద్ధులు – యశోబలములు
యోగవిద్యయు – తేజము, సిరియు
దత్తదేవుని కృపతో పొందెను.

గాలిమాదిరి – నింగీ నేలను
అడ్డులేకను చరించసాగెను
రేవానదికి జలక్రీడకు మరి
కాంతలతోను – వెళ్ళెను రాజు.

వేయిచేతులతొ విలాసమ్ముగా
నీటిని క్రిందకు పోనీయకను
అడ్డుకట్టలా నిలపివేసెను
రావణుడంతట అటుగాసాగుచు.

తనకూ తన సైన్యమ్మునకు
నీటిని వదలగ కోరె – నర్జునుని
దశకంధరుని చులకన చేసి
తరుణులుయున్న చోటికి వత్తువ!

మూర్ఖుడవీవు – వివేక మెరుగవు
అనుచు పలికెను – తృణీకరించెను
అంతటపోరుకు దిగెను రావణుడు
అర్జును డాతని లీలగ – గెలిచి

చెరలోనుంచగ ఆనతి నిడెను
అర్జును కింకరులా రావణుని
బంధించి వెంట గొనిపోచుండగ
కిక్కురుమనక నుండె రావణుడు

జలక్రీడను మరి ముగించివచ్చి
నగరము చేరి రావణాసురుని
బంధనమ్ములు విప్పి తెమ్మనెను
పేరోలగమున నిలపె నసురుని.

ఓరావణుడా! విక్రమీగకు
నిన్నుమించిన వీరులుందురని
తెలుసుకు తెలివిగ మసలుకోమని
జాలిదలచి – విడిపించె రావణుని

అంతటి వీరుడు ఆ అర్జునుడు
ఒక దినమున మరి వేటకు చనెను.
ఏపొడి అలసెను దగ్గరలోగల
జమదగ్ని ఆశ్రమ తావుకు జేరెను.

తపోధనుడు – ఆ రాజుకు సేనకు
ఆదరమ్ముగ స్వాగతమ్మునిడి
కామధేనువు అనుగ్రహముతో
మృష్టాన్నముతో విందుచేసెను.

విందుగ్రహించి ఆశీస్సులుగొని
బయలుదేరుచు - త్రోవలో ఆగి
దుష్టబుద్ధితో అర్జునుడంతట
కామధేనువును బలిమిని తెమ్మనె

వలదని ఎంతో బ్రతిమాలినను
జమదగ్ని మాటను కాలదన్నుచు
అడ్డువచ్చిన అతనిని త్రోసి
ఈడ్చుకుపోయిరి - కామధేనువును

కొంతసేపటికి రాముడువచ్చెను
విషయముతెలిసి ఉడికిపోయెను
ఆగ్రహమ్ముతో అడుగులేయుచు
వడిగాసాగెను - మహిష్మతి నగరము

నగరముచేరి సింహనాదముతొ
గుండెలవియగా చేసెను - జనులకు
విషయముచెప్పిరి - వీర కిశోరము
పరశురాముడు - వచ్చెను అనిరి.

చులకనగా మాటాడెను రాజు
పిల్లబాపడు - హద్దుమీరెను
మనశక్తి తెలియక - తెలివిహీనుడై
వచ్చెనుపోరుకు - రుచిచూపింతము

అనుచు పలుకుచు - చులకనచేసి
పదిహేడు అక్షౌహిణుల సేనతో
కార్తవీర్యుడు పోరుకురాగా
మరింతక్రోధము - పెరిగె రామునకు

తప్పుఒప్పుకొని - క్షమించమనక
సమరమ్మునకు - సిద్ధమయ్యెనని
గొడ్డలి గైకొని ముందుకురికెను
రక్తపుటేరది ప్రవహించినది

పెనుగాలికి కూలిన తరువులన్నటు
పరశురాముని పరాక్రమమ్మున
పైరుకోసిన పంటచేనులా
పరచుకొన్నవి సేనల తలలు.

రథములు కూలి - గజములు ఒరిగి
తురగమ్ములవి తునకలు కాగా
భటులమాంసము - ముద్దలుకాగా
భీభత్సమ్మట తాండవించెను

కార్తవీర్యుడు ఆగ్రహించెను
బాపడు అనుచు ఉపేక్షించుట
తగదని తాను అయిదువందల
ధనుసులు చేకొని శరములుకూర్చి

విప్రవీగకు - భటుల తావుకు
పంపెదనిపుడే - అనుచు శరములు
వరసగ వదలెను రాముడంతట
ఎదిరిపోరి ఆ ధనుసులు తృంచెను

ఏదీ - నీతల - కాచుకోయిక
వెర్రితలలు మరి వేసిననీకు
చేతులు త్రుంచెద అనుచు కరములు
అవలీలగను - నరకి వేసెను

అంతట ఆగక పరశురాముడు
అర్జునితలను నేలకురాల్చెను
అదిగాంచిన ఆ రాజు కొడుకులు
పదివేలమంది పరుగుతీసిరి.

విజయలక్ష్మితో - కామధేనువుతొ
ఆశ్రమమ్మునకు తనయుడు రాగా
ఆనందించిన జమదగ్ని అంతట
రాజువధను విని పరితపించెను

దేవతాంశతో - రాజుపుట్టును
ఓర్పునువదలి క్రౌర్యముపెరిగి
కానిపనిని నువు - చేసితివయ్యా!
ముందు వెనుకలు చూడకపోతివి.

రాజ్యమేలెడి రాజునుచంపుట
బ్రాహ్మణహత్యను మించిన పాపము
పాపక్షాళనకు తీర్థయాత్రలు
చేయుము-సాగుము-అనుచుపలికెను.

ఆనందముగా - రేణుక తోను
జమదగ్ని జీవితము గడపుచుండగా
ఒకదినమున తను నీటికిపోయి
అచటగాంచెను గంధర్వరాజును

చిత్రరథుడను గంధర్వరాజు
కాంతలతో తను జలక్రీడలను
సలుపుచుండగా -గాంచెను రేణుక
చిత్రరథుని గని - మరిమరిచూచెను.

ఆతని అందము ఎందునలేదని
మదిలోకొంత మరపు కలిగెను
అంతటిలోన తెలివి కలిగినది
మనస్సులోని ముద్రచెరిగినది

ఆలశ్యమునకు చింతించినది
భర్తనుతలచి - తల్లడిల్లెను
కానిపనిఅది - పరాయి పురుషుని
చూచుట - ఎంతో తప్పని తలచెను

భయమున అడుగిడె - ఆశ్రమమందు
ఆలశ్యమునకు కారణమడిగిన
భర్తకు విషయము చెప్పకపోయెను
దివ్యదృష్టితో - తెలిసెను భర్త

క్రోధవశుడయి జమదగ్ని అంతట
తనయుల పిలచి ఆనతిచ్చెను
మనసుచెదిరిన - మగువ - ఈమెను
దూరముగొని మరి అంతము చేయుడు.

స్త్రీహత్యతో మరి - మాతృహత్యయని
మిన్నకుండిరి తనయులందరు
జమదగ్ని - రుద్రునిగ మారెనప్పుడు
అంతటవచ్చెను పరశురాముడు

విషయము తెలిసెను - అంతట తండ్రి
చపలు రాలగు - తల్లిని నరకగ
ఆనతిచ్చెను - పరశురామునికి
అన్నలకూడా - మట్టుబెట్టమనె.

ఆలోచించెను పరశురాముడు
అనూహ్యమైన చిక్కువచ్చెను
అందరినీ మరి చంపకపోయిన
ఆకోపిష్టి - తనను వదలునా -

తండ్రి మాటను మన్నించినచో
ఆనందించి వరము నొసంగును
అప్పుడు - అన్నల - మాతృమూర్తిని
బ్రతికించమని కోరుకుందును.

అని మదినెంచి - పరశువుతోను
తల్లిని - అన్నల - నరకివేసెను
ఆనందించి జమదగ్ని అంతట
వరము కోరుమనె - పరశురాముని

కన్నులనీరు - కరములనొత్తుచు
అన్నల తల్లిని - బ్రతికించమని
వరముకోరెను - పరశురాముడు
అట్లేచేసెను జమదగ్ని ప్రేమతో

పరశురాముడు తల్లికి మ్రొక్కి
అన్నలందరిని - కౌగిలించుకొనె -
తండ్రి అంతటి - సమర్థుడుఅని
రాముడు తెలిసి - చేసెను అటుల

కార్తవీర్యుని తనయులునాడు
ఓటమినంది పారిపోయిరి
అదనుకోసమై వేచియుండిరి
పగతోనిండిరి వారందరును

ఒకదినమున మరి పరశురాముడు
అన్నలతోను బయటకు వెడలెను
అదే అదను అని - అర్జుని తనయులు
ఆశ్రమమ్ముపై విరుచుకుపడిరి.

నిశ్చలధ్యానమునున్న జమదగ్ని
అగపడె వారికి - ఆవేశముతో
అడ్డువచ్చిన - భార్యను త్రోసి
తలఖండించి తీసుకుపోయిరి.

కన్నులగాంచిన రేణుక అంత
గోలుగోలున - ఏడవసాగెను
అంతటిలోన రాముడువచ్చెను
తండ్రితనువును గాంచెనచ్చట

కాయముపైబడి తల్లిఏడ్చుట
చూచిన రాముడు వివరమడిగెను
అంతట తల్లి ఏడ్చుచుచెప్పెను
ఘాతుకమ్మును వివరించినది

ఇరువదిఒక్క - తడవలు - తల్లి
గుండెలు బాదుకు - రోదించినది
లెక్కపెట్టెను - భార్గవరాముడు
ఫాలనేత్రుడై - నిలచెనచ్చట

అంతటిలోన అన్నలువచ్చిరి
విషయము చెప్పి తండ్రికాయమును
భద్రపరచమని - మరిమరి చెప్పి
రాచవంశ నిర్మూలనకేగెను.

అర్జును కొడుకులు అదిరిపోయిరి
పోరుకు వారిని పురికొల్పి మరి
వారితలల నవలీలగ నరకగ
రాచవీధులలొ - రుధిరము పారెను.

మహిష్మతీ నగరమ్ము అంతయు
కొండల ఎత్తున-మొండెమ్ములు పడె
తరగిన తలలు మరియొక గుట్టగ
భీభత్సమట తాండవించెను.

రాచపురుగును మిగలనివ్వనని
ప్రతిజ్ఞచేసి - భూమిని వెదకి
ఇరువది ఒక్క తడవలు వెదకి
గంద్రగొడ్డలికి ఆహుతిచేసెను.

చచ్చిన రాజుల రుధిరమ్ముతొ నట
శమంతపంచక తీర్థమునందు
లీలగమడుగులు ఏర్పరచగను
రాజశబ్దము వినబడకుండెను.

అంతట రాముడు తండ్రిశిరస్సుతొ
తల్లివద్దకు వచ్చి అచ్చట
సర్వదేవతా ప్రీతిగనంత
మహాయజ్ఞమును చేసెనాతడు

హోతకు తూర్పు-అధ్వర్యుకు పడమర
ఉత్తరదిక్కు ఉద్గాతకు యిచ్చి
మిగిలిన దిక్కులు సదస్యుల కిడి
భూమధ్యభాగము కశ్యపున కిడె.

ఉపద్రష్టకు మరి ఆర్యావర్తము
దక్షిణగాను సమర్పించెను.
సరస్వతీనది నందున ఆతడు
అవబృధస్నానము నాచరించెను

హత్యలవలన - కలిగిన పాపము
క్షాళనకాగా పరశురాముడు
మబ్బులనుండి వెలికివచ్చిన
రవివలె భాసిలె తేజముతోను

తలతో మొండెము కలపినంతనే
తపోశక్తి - మరి పరశురాముని
పిత్రువాక్య పరిపాలన శక్తితొ -
జమదగ్ని బ్రతికెను - ఆనందించిరి

తల్లి అంతట పరశురాముని
శిరసుమూర్కొని పరవశించెను
ఐదవ తనము నిలపినాడవు
దైవాంశ సంభూతుడవీవని పలికె

సప్తర్షిమండలమందు జమదగ్ని
ఏడవస్థానము నాక్రమించెను
వచ్చే మన్వంతరమున రాముడు
సప్తర్షిమండలమందు జేరును.

పరశురాముడు కాలక్రమమున
బంధములన్నీ త్రెంచుకు నంత
ప్రసన్నచిత్తము నందిన వాడై
మహేంద్రగిరి శిఖరము జేరెను.

నిశ్చల తపములో నుండెనాతడు
సిద్ధగంధర్వులు పరశురాముని
విజయగాథలు పాడుచుందురు
పులకరింతతో వినును - ప్రకృతి

అతుల శ్రీహరి పరశురామునిగ
భూభారమును దించెను రాజా!
ఇకపై - నీకు గాధి చరిత్ర
చెప్పెద వినుమని పలికెను శుకుడు.

తేజోవంతుడు గాధిపుత్రుడు
విశ్వామిత్రుడు అనెడి పేరయా
బ్రహ్మవిద్య - విమర్శ నెరిగి
ఆత్మజ్ఞానిగా నుండెడివాడు.

రాచకులములో పుట్టినవాడు
తపోబలముతో బ్రహ్మర్షిఅయె
నూర్గురుకొమరులు కలిగియుండెను.
సగము మందిని - శపించెనాతడు.

భృగువంశీయుడు అజీగర్తుని
కుమారుడాతడు శునశ్శేపుడు
హరిశ్చంద్రుడు చేయు యాగమున
యాగపశువుగా అమ్మి రాతనిని

తల్లిదండ్రులు - అమ్మిన బాలుని
కాపాడగను సంకల్పించి
యాగముసాగెడి త్రోవచూచెను
మంత్రమొకటి ఆబాలునికిడెను.

మంత్రబలమున సురల దీవనల
బ్రతికెను బాలుడు - యాగము జరిగెను
శునశ్శేపుని - తన - జ్యేష్టపుత్రునిగ
విశ్వామిత్రుడు చూచుచుండెను

కొడుకుల నూర్గుర పిలచి అంతట
శునశ్శేపుని అన్నగ తలచి
అభిమానించగ కోరెను తండ్రి
అందుకు వారు గేలిచేసిరి.

వీడిని అన్న అని చెప్పినచో
నిన్ను - చులకనగ పలికెదరయ్యా!
ఈనరపశువు అన్నఎట్లగును?
ఆలోచించుము అనుచు పలికిరి.

బ్రహ్మర్షిగా మరి మారినగాని
రాచరక్తము పొంగులువారగ
జాతి భ్రష్టులు కమ్మని వారిని
శపించెనంతట - విశ్వామిత్రుడు

ఆ శాపముతో - గడగడలాడిరి
వారిలో సగము తెలివితెచ్చుకొని
మధుష్యందుని ముందునిడుకొని
పదములబడిరి మన్నించమని

జాలిదలచిన విశ్వామిత్రుడు
వివేకమ్మది కలదని పలికి
స్వార్థత్యాగులలో - మేటిగ లెక్కిడు
శునశ్శేపుని ఆదరించుడు

అన్నివిధములా నాకునచ్చిన
యోగ్యుడీతడు అనుచు పలుకుచు
సత్ సంతానము బడసి సుఖముగా
బ్రతకుడనుచును ఆశీస్సులనిడె.

మధుచ్ఛందాదులు - యాభైమంది
శునశ్శేపుని అన్నగ తలచిరి
అష్టక, హారీత, జయంతాదులు
యాభైమంది - శాపగ్రస్థులు

ఆవిధముగను విశ్వామిత్రుని
సంతతి - రెండు విధములైనది
ఆగోత్రమునకు ప్రవరకూడను
రెండు విధములుగ నున్నది రాజా!

అనుచుపలికిన - శుకయోగీంద్రుడు
పురూరవ వంశచరిత్ర
చెప్పెదననుచు - ఆరంభించెను
ఆనందముగా - వినెనా రాజు.

పురూరవునికి - ఆయువు తనయుడు
అతనికి నహుషుడు, క్షత్రవృద్ధుడు
రజి, రంభుడు అనేనుండను
ఐదుమంది మగ సంతానమయా!

క్షత్రవృద్ధ తనయుడు సుహోత్రుండగు
అతనికి కాశ్యుడు, కుశుడు మరియు
కృత్స్నమధుడను ముగ్గురుకొడుకులు
కృత్స్నమధునికి శునకుడు తనయుడు

శునకుతనయుడు శౌనకుండయా
శౌనకుసుతుడు - బహ్వృచప్రవరుడు
ఆతడు లౌకిక బంధమ్ముల విడి
తపోదీక్షతో వనములకేగెను

కాశ్య కుమారుడు కాశియగునయా!
కాశికి సుతుడు - రాష్ట్రుడు అగును
ఆతని తనయుడు దీర్ఘతపుడయా!
ఆతనికి సుతుడు ధన్వంతరియగు

శ్రీహరి అంశతొ పుట్టె ధన్వంతరి
ఆయుర్వేదము ప్రసాదించెను
ధన్వంతరిని ఉపాసించిన
భవరోగంబులు దగ్గరజేరవు

హరి అంశతొ మరి పుట్టెనుగావున
యజ్ఞభాగము లభించెనతనికి
ధన్వంతరి సుతుడు కేతుమంతుడు
ఆతని తనయుడు భీమరథుండు

భీమరథునికి సుతుడు - ద్యుమంతుడు
ఆద్యుమంతుడే - దివోదాసుడు
ఆతని తనయుడు ప్రతర్దనుండు
శత్రుజితుడు-ఋతధ్వజుండు ఆతడేయగు

ప్రతర్దనునికి - కువలయాశ్వుడు
ఆతని తనయుడు అలర్కుడు రాజా!
పుణ్యకర్మలతొ అరువదివేలగు
వసంతఋతువులు పరిపాలించెను.

అలర్కుసుతుడు - సన్నతి యగును
సన్నతి తనయుడు సునీతుడగును
సునీతు సుతుడు సుకేతనుడు
వాని కుమారుడు - ధర్మకేతువు

ధర్మకేతువుకు సత్యకేతువు
సత్యకేతువుకు - ధ్రుష్టకేతువు
అతని తనయుడు సుకుమారుండగు
అతనికి పుత్రుడు - వీతిహోత్రుడు

వీతిహోత్రునికి - భర్గుడు సుతుడు
భర్గునిసుతుడు - భార్గభూమియగు
అటులా రాజులు పరిపాలించిరి
ధర్మబద్ధులై నేల నేలిరి

కాశిరాజుతో ఆరంభమయి
భార్గభూమి వరకందరు రాజులు
కాశ్యులుగాను - ప్రసిద్ధికెక్కిరి
మూలపురుషుడు క్షత్రవృద్ధుండు.

ఆ క్షత్రవృద్ధుని - రెండవకొడుకు
కుశుడనువాని - తనయుడు ప్రీతి
ప్రీతి కుమారుడు సంజయుడగును
సంజయు సుతుడు జయుడనువాడు.

జయుని కుమారుడు కృతుడనువాడు
కృతుని తనయుడు హర్యధ్వనుడు
వానికుమారుడు - సహదేవుండు
సహదేవుని సుతుడు భీముడనబడు

భీముని కొమరుడు జయత్సేనుడు
వానికి సుతుడు సంకృతియగును
సంకృతి తనయుడు జయుడనువాడు
జయుని సంతతి క్షత్రధర్ముడు

పైవారందరు రాచ ధర్మమున
క్షత్రవృద్ధుని వంశము పెంచిరి -
ఇక చెప్పెదను - రంభుని వంశము
అనుచు పలికెను శుకమహాఋషి

రంభుని సుతుడు రభసుడు అగును
రభసుని కొడుకు గంభీరుండు
గంభీరు కుమారుడు కృతుడనువాడు
బ్రహ్మకులమునకు మూలమాతడు

అనేనను-తనయుడు శుద్ధుడు-అగును
శుద్ధుని కొమరుడు శుచియను వాడు
శుచి కుమారుడు త్రికకుత్తు తను
బ్రహ్మకు - సారధ్యమ్ము చేసెను.

త్రికకుత్తు కుమారుడు శాంతరజుండు
ఆత్మవిద్యతో విరక్తుడయ్యెను
పురూరవుని మరియొక సుతుడు
రజియనువాడు అమితబలాఢ్యుడు.

రజి కుమారులు ఐదువందలు
వారందరును అమితబలాఢ్యులు
దేవాసుర సంగ్రామమునందు
ఇంద్రుడు - రజిని సాయమడిగెను

ఇంద్రుని ప్రార్థన మన్నించుచును
రజిని – సమరమున అసురుల గెలచి
ఇంద్రుని రాజ్యము నప్పగించగా –
రాజ్యమేలమనె – సురపతి అంత

అసురుల ప్రభువు ప్రహ్లాదుండు
అమితబలాఢ్యుడు ఎప్పటికయినా
అతని చేతిలో ఓటమి తప్పదు
అందుకు భయపడి రజిని నేలమనె

రజిని అంతటను – దివినీ భువినీ
పరాక్రమమ్మున పరిపాలించెను
అతని సంతతి రాజులయ్యిరి
తండ్రికి సరిపడ పరిపాలించిరి.

వారిని ఇంద్రుడు రాజ్యమునిమ్మని
కోరగ వారు తృణీకరించిరి
నాడు రాజ్యమును తండ్రికిచ్చితివి
తిరిగి అడిగెడి హక్కులేదనిరి.

అంతటవారు గర్వాంధులయి
యజ్ఞములందు హవిర్భాగములు
సురపతి కందక – అడ్డుపడగను
విలవిలలాడెను – వాసవుడంతట

దిక్కుతోచక ఇంద్రుడంతట
దేవగురువును ఆశ్రయించెను
సురల రక్షణకు నిలచి బృహస్పతి
శత్రువిజయముగ హోమముతలచి

ఇంద్రుని చేత హోమమునంత
చేయించి – బృహస్పతి – ఆశీస్సులనిడె
అంతట ఇంద్రుడు – బలవంతుడయి
పోరున – రాజ్యము పొందగలిగెను.

ఇకపై – నహుషుని గాథ చెప్పెద
అనుచు మునీంద్రుడు – ఆరంభించెను
యతి – యయాతి, సంయాతి, ఆయాతి,
వియతి, కృతి యను నహుషుని తనయులు

పెద్దకుమారుడు అయిన యతికి మరి
రాజ్యమునీయగ నహుషుడు తలచెను
రాజ్యాధికారము పాపమూలమని
విరక్తుడై తా వనములకేగెను

నూరు యజ్ఞములు నహుషుడు చేసి
ఇంద్ర పదవిని అధిష్టించెను
గర్వాంధుండై – తా – శచిని కోరెను.
మునులను – పల్లకి మోయగజేసెను

అంతట ఋషులు శాపమునిడిరి
కొండ చిలువగా – జన్మనెత్తెను.
అంతట యయాతి పీఠమెక్కెను
జనరంజకముగ రాజ్యమేలెను.

వృషపర్వుని – సుతను–శర్మిష్టను మరి
శుక్రుని కూతురు దేవయానిని
యయాతి వివాహమాడెను రాజా!
అంతట రాజు అడిగెను వివరము.



॥శ్రీ కృష్ణచరితము॥

# 6 యయాతి చరిత్ర

యయాతి తాను క్షత్రియుండయి
బ్రాహ్మణ కన్యను - దేవయానిని
పరిగ్రహించుట ధర్మపాలనకు
విరుద్ధమైన విషయము కాదా!

అంతటపలికెను శుకయోగీంద్రుడు
రాక్షసప్రభువు - వృషపర్వునికి
తనయ - శర్మిష్ఠ - సుగుణాలగని
అందచందముల అందరెవ్వరును

అసురగురువగు శుక్రుని కంత
దేవయాని యను కూతురుగలదు
తండ్రి-అసురులకు గురువని ఆమెకు
మదిలో కొంత - గర్వముకలదు

రాజకుమారిత ఐననుగాని
శర్మిష్ఠ - వినయము కలిగియుండెను
ఇద్దరు కన్యలు సమవయస్కులు
స్నేహముగా మరి తిరుగుచుండిరి

శర్మిష్ఠమాత్రము దేవయానిని
అమితభక్తిగా చూచుచుండెడిది
గురుపుత్రికయని గౌరవించెడిది
వారొక తడవ - స్నానముకేగిరి.

ప్రమదావనమున - చెలికత్తెలతో
వారిద్దరును విహరించుచును
ప్రకృతి శోభను తిలకించుచును
పరవశమ్మున మునిగిరి మగువలు

అంతట వారట కొలనులో దిగి
జలకములాడుచు సందడి చేయుచు
ఆనందడోలికల నూగుచుండిరి
అచటకువచ్చెను - శివుడు అంబతో

అంతటవారు సిగ్గుమొగ్గలతొ
గట్టునజేరి వలువలుదాల్చిరి
ముసిముసినవ్వుల శంకరదేవుడు
సతితోకలసి - వెడలిపోయెను

తొట్రుపాటులో అతివలు తెలియక
ఒకరి చీరను - మరొకరు ధరించిరి
దేవయాని దగు - చీరను - శర్మిష్ఠ
కట్టుకొనెనని - తెలిసెను గురుపుత్రి

అహంకారము హద్దులుమీరెను
శర్మిష్ఠచీరను - విసరి కొట్టెను
తోకత్రొక్కిన త్రాచుపాములా
ఆవేశముతో - దుర్భాషలాడెను

అంతట శర్మిష్ఠ - పొరబాటనుచు
అనునయించగా - వినకపోవగా
రాచపట్టి తా గట్టిగ పలికెను
ఎందుకింతటి మిడిసిపాటనె

గురుపుత్రిక నని - పేలితివీవు
రాచకన్యను - ఈసడించితివి
అనుచు ఆమెను - అచ్చటనున్న
పాడునూతిలో - త్రోయగ చెప్పెను

అంతట ఆ చెలికత్తెలు వెంటనె
దేవయానిని నూతిలొ త్రోసిరి
చాలాప్రొద్దు పోయినదనుచు
వారందరును గృహములకేగిరి

నూతిలొపడిన దేవయాని తను
అచ్చట పెరిగిన తీగను పట్టుకు
రక్షించండని ఆక్రందించెను
ఆసమయములో యయాతివినెనవి

వేటకువెళ్ళిన - యయాతి రాజు
ఆత్రోవలొ సాగుచు-అరుపులు వినబడ-
తొంగిచూచెను - యయాతి అంతట
ఉత్తరీయమును ఊతగ వేసెను.

బ్రతుకుజీవుడా అని ఆ వనిత
పైకివచ్చెడి యత్నముచేసెను
అంతటరాజు దక్షిణ హస్తము
ఊతగనిచ్చి - బయటకు లాగెను.

అందచందముల పోతబొమ్మలా
నిలచిన అతివ ఉత్తరీయమును
చాలీచాలక - ధరించి నిలచెను
సిగ్గుతో - తల వాలి పోయినది.

విషయము అడిగిన యయాతిరాజుకు
స్వయంకృతమని వివరము చెప్పి
ప్రకృతిసాక్షిగ - దక్షిణ హస్తము
అందించితివి - ఆలిగ - గొనుమనె

దేవగురుడగు బృహస్పతి కొడుకు
కచుడు పలికిన మాటలు నిజమగు
నీవేనాకు - పతియు గతియు
అనగా రాజు - వివరములడిగెను.

దేవయాని తా పలికెనప్పుడు
కచుడు - విద్యకై వచ్చిజేరెను
నాతండ్రి వానికి - విద్యలునేర్పెను
మృతసంజీవని విద్యయు నేర్పెను.

ఆసమయములో అతనిని గాంచి
అందచందములు గుణములుచూచి
అడిగితి - భార్యగ చేపట్టమని
అతడాకోరిక - తిరస్కరించెను.

గురుపుత్రికవు సోదరి సమమనె
అంతట నేను కోపమునంది
నీవిద్యయది ఫలించదనుచు
శాపమునిడితిని - ఆవేశముతో -

తిరిగి కచుడు - నను శపించినాడు
బ్రాహ్మణుడు - మరి భర్తకాదని
అది నిజమైనది - కరము గ్రహించిన
కరుణామూర్తివి - వివాహమాడుము.

ఆలోచించి - విధినిర్ణయమని
రాజుచెప్పెను - అనుకూలముగ
తండ్రి ఆనతిని - జరుగు పరిణయము
అనుచు పలికి మరి - పంపెనామెను

చాలీచాలని ఉత్తరీయము
పురుషుడు ధరించు-వెలగల వలువతో
ఇల్లుచేరిన - తనయను జూచి
వివరములడిగెను శుక్రాచార్యుడు

భోరున ఏడ్చుచు విషయము చెప్పగ
ఆగ్రహించెను అసురగురుండు
అసురులు - మేలు మరచి నారని
వారి ఆశ్రయము - అనర్థమనెను.

నగరము వదలగ - నిర్ణయించుకొని
బయలుదేరెను - శుక్రాచార్యుడు
విని - వృషపర్వుడు పదములబడెను.
పోవలదనుచు మరిమరి వేడెను.

తప్పు తనదని - రాజు పలికెను
ఆమాటలకు శుక్రుడు కరిగెను.
మాట దాటకని-పలికెను గురువు -
గురు ఆదేశము - పాలించెదననె.

పలికెనప్పుడు శుక్రాచార్యుడు
"నీసుతపనియది తప్పని తలతువ"
తప్పని పలికెను - రాజు అంతట
ప్రాయశ్చిత్తము తెలుపగ కోరెను.

అయినచొ వినుమని-శుక్రుడు పలికెను
నీసుత - నిరతము చెలికత్తె వలె
సేవలు చేసిన - నాకూతురు దగు
అవమానమ్ము - తగ్గును అనెను.

అందుల కొరకై రాజు వల్లెయనె
దేవయాని తా సంతోషించెను
నాటినుండి మరి శర్మిష్ఠ - తా
దేవయానికి సేవకురాలయె.

శుక్రాచార్యుడు సమ్మతినిచ్చి
వైభవమ్ముగా తనకూతురును
యయాతికిచ్చి పెండ్లిచేసెను
అల్లుని పిలచి మామ తెలిపెనిటు.

రాజా! వినుము శర్మిష్ఠ ఇప్పుడు
దేవయానికి సేవచేయుటకు
నీయింటికి మరి వచ్చును - నీవు
ఆమెవంక మరి చూడకూడదు.

ఆమెను - నీవు తాకకూడదు
ఇదినాకట్టడి - అనుచు చెప్పెను
అటులాయిద్దరు - యయాతి యింటికి
వచ్చిరి - కాలము గడచుచుండెను

దేవయానికి ఇద్దరు పుత్రులు
యదువు - తుర్వసుడు - ఉద్భవించిరి
శర్మిష్ఠమాత్రము యౌవనపొంగుల
యయాతి కన్నుల కగబడుచుండెను.

రాచపట్టె తను దాసీతీరుగ
సేవలుచేయుచు బ్రతుకునెట్టుచు
సుఖసౌఖ్యములు అన్నీవదలి
సంసార జీవితము మరువగవలెనా!

పరధ్యానమున ఆతలంపుతో
శర్మిష్ట - కాలము గడుపుచుండెను
దేవయాని యిడు ఆదేశమ్ములు
గడగడలాడుచు చేయుచుండెను.

అది ఒక పున్నమి - రాత్రియందున
నిండుచంద్రుడు వెన్నెల పరచెను
ప్రకృతి యంతయు పులకరింతతో
సుమ బాలలను పలుకరించెను.

అనురాగముతో పూ లతలన్నీ
తరువుల చెంత ఒదుపుగ చేరెను
మలయమారుతము మనసునులేపెను
మధురమైన పులకింతలు గొలిపెను

ఆసమయములో శర్మిష్ట - తను
మోడివారిన బ్రతుకును తలచి
కుమిలిపోవుచు నున్న తరుణమున
వెనుక నుండి మహరాజు వచ్చెను.

లిప్తపాటులో - కౌగిటజేర్చెను
మృదుతల్పముపై వాలిరిద్దరు
కాలచక్రము - తిరుగుచున్నది
శర్మిష్ట నడకయది మందమైనది

నెలలు నిండుట గ్రహించినంతనె
దేవయాని విషయమ్ము గ్రహించెను
తన భర్తను వలలో వేసుకున్నదని
పరుషములాడెను - దూషణచేసెను

రోజులు గడచి వత్సరమ్ములై
ద్రుహ్యుడు, అనువు, పూరువు అనెడి
ముగ్గురు కొడుకులు ఆశర్మిష్టకు
ముద్దులొలికెడివారు పుట్టిరి

అంతట కోపము నిండిన వనిత
దేవయాని తా క్రోధము నిండి
దాసిని ఆలిగ చేసుకోమని
రాజుతొ చెప్పి - తండ్రిని జేరెను.

దేవయానిని బ్రతిమాలుచును
తిరిగిరమ్మని కోరె యయాతి
వలదని పలికి తిరస్కరించెను
అంతటిలోన - శుక్రుడువచ్చెను

గృహము చేరిన కూతురు నడిగి
విషయము తెలిసి ఉగ్రుడయ్యెను
ఇచ్చినమాట మీరిన ఫలమని
వృద్ధాప్యము ప్రాప్తించు నీకనె

యయాతి వెంటనె వృద్ధుడయ్యెను
మామపాదముల పడి బ్రతిమాలెను
వృద్ధాప్య ఫలితము నాకేకాక
నీతనయకును కలుగును - మరియు.

సంసార జీవితము అనుభవించుటకు
ముదుసలినైన - నేను తగను కద -
వయసులొనున్న - నీతనయకును
దాంపత్య సుఖమది అందకపోవును

అదియునుగాక నాకు యింకను
యౌవనసుఖములు అనుభవించగ
మనసు యున్నది కావున మామా!
దయగొని తిరిగి వయస్సునిమ్ము

మనసుకరగిన శుక్రాచార్యుడు
దేవయానికి నచ్చజెప్పెను
తోబుట్టువులుగ – మీరిద్దరును
కలసి బ్రతుకుడని హితవు చెప్పెను.

వల్లెయనిన ఆ దేవయానితో
గృహముచేరెను యయాతి రాజు
తనవృద్ధాప్యము గ్రహించితనకు
యౌవ్వనమిమ్మని జ్యేష్టుని అడిగెను

జ్యేష్టకుమారుడు – యదువు అంతట
వృద్ధాప్య జీవనము దుర్భరమనుచు
అట్టికోరిక – తగదని అనుచు
తిరస్కరించగ యయాతి రాజు

రెండవ కొడుకగు – తుర్వసు నడిగెను
ఆతడుకూడ వలదు పొమ్మనెను
అంతట మూడవ కుమారుడైన
పూరువు నడిగెను యౌవ్వనమిమ్మని

ధర్మతత్పరుడు – పిత్రుభక్తుడు
తల్లిదండ్రుల అక్కరతీర్చుట
కర్తవ్యమని నొక్కిచెప్పుచు
ముక్తిమార్గము దొరికెను అనెను.

వృద్ధాప్యములో తపసునుచేసి
ముక్తి ధామము వెదకుటకంటే
తండ్రి కోరిక తీర్చుటవలన
తేలికగా – ఆ ముక్తి దొరకుననె

వెంటనె తనయుడు ముదుసలి అయ్యెను
యౌవ్వన శోభతొ నిలచెను తండ్రి
సప్త ద్వీపములు పరిపాలించుచు
అనంత సుఖములు పొందె యయాతి

దేవయానితో అమరసుఖములు
అనుభవించుచు కాలముగడపుచు
శ్రీహరి ప్రీతిగ యజ్ఞములెన్నో
చేసెనురాజు సుఖములందెను.

ఒక్కనిముసము దేవయాని తను
దూరమైనను భరించలేనటు
సుఖముల గడపుచు నున్నరాజుకు
వివేక మొదవెను – ఒక్కదినమున

సుఖములు – తాను అనుభవించెనా!
తన్నే సుఖములు – అనుభవించెనా!
సుఖముల లొంగి బానిసబ్రతుకై
బ్రతికిన బ్రతుకు నిరర్థకంబగు

అటుల తలంచి – తనపై తనకే
అసహ్యమేర్పడి భార్యను పిలచి
అతి విలువైన గాథను వినుమని
అందలి నీతిని గ్రహించమనెను.

"ఓ! సుకుమారీ! యదార్ధమ్ముగా
మన జీవితమును - పోలిన కథయిది
జ్ఞానవృద్ధులు మునిపుంగవులు
అంగీకరించిన గాధయే యిది".

ఒకగ్రామమున వసించి యుండు
మేక పోతొకటి - మేతకుపోయెను
అడవిలొ - పచ్చిక మేయుచుండగా
దగ్గరలోగల - నూతియందు గల

ఆడుమేక - తా ఆత్మరక్షణకు
అరచుచుండగా - పోతుమేక గని
రక్షించుటకై గట్టును - కొమ్ముల
పొడచి పొడచి - అట మెరక చేసెను

నూతిలొపడిన మట్టి - మెరకతో
గట్టునకెక్కెను ఆడమేక - తా
అంతట కారణమడిగిన మేకతో
తన దురదృష్టము అనుచు పలికెను.

తిరిగి పలికెను ఆడుమేక అట
రక్షించితివి - భరించు నన్ను
భార్యగనన్ను స్వీకరించుమన
సరియని పలికి భార్యగ గైకొనె.

వారిద్దరును మందకువచ్చిరి
ఆ మగమేకను ఆశ్రయించుకొని
మరికొన్నిమేకలు భార్యలైనవి
వాటన్నిటితో సుఖములనందుచు

కొన్ని దినములకు ఆ మగ మేకకు
నూతినుండి మరి తెచ్చినయట్టి
మేకపైనను మోజు తగ్గెను
అదిగ్రహించిన ఆడుమేక యిక

అచ్చటనుండను అని పలుకుచును
తన యజమాని - విప్రునికడకు
తిరిగివచ్చెను - దానివెంబడి
మగమేక వచ్చి - బ్రతిమాలినది

విషయము గ్రహించి విప్రుడంతట
తన మేక కష్టమును - చూడలేకను
మగతనమ్మది - పోవునట్టుగా
ఆ మగమేకకు శాపమునిడెను

అంతట మేక పదముల బడెను
రక్షించమని ప్రార్థించినది
ఈ శాప ఫలితము - నీదగుమేకయు
అనుభవించును - పొందులేక నవె

జాలిగలిగిన - బ్రాహ్మణోత్తముడు
మగతనమ్మును తిరిగియిచ్చెను
తన మేకకు ఎన్నో - బుద్ధులుచెప్పి
పంపివేసెను వారిద్దరినీ.

ఆ మగమేక - ఆడుమేకతో
దాంపత్యసుఖముల తేలిపోయెను
తృప్తితీరక - విసుగుచెందినది
దిక్కుమాలిన బ్రతుకని - తలచెను

నవమస్కంధము

ఇహపరదూరము అయినబ్రతుకని
గ్రహించె నంతట - ఆ మగమేక
కావున రమణీ! మనజీవితము
అదేవిధముగా సాగుచున్నది.

ఓ ప్రియురాలా! ఇంద్రియాలవి
తృప్తినందనివి - తృష్ణ పెంచునవి
సుఖములఒడ్డు కనబడదసలు
ఈదుట సుఖమని భ్రమలోపడెదరు.

నరములబిగువు సడలిపోయినను
వార్థక్యమ్మది మీదకురికినను
తృష్ణమాత్రము పీడించును - విను
చిగురులు తొడిగి బానిసచేయును

నాల్గుసంద్రముల మధ్యభూమిని
చక్రవర్తిగా పరిపాలించియు
పరాక్రమమ్మున మేటియైనను
ఇంద్రియాలను జయించలేదు.

యోగీశ్వరుడును సంయమీంద్రుడును
ఆడుగాలి యది సోకిన - లొంగును
ఆజ్యముపడిన అగ్నిమాదిరి
అనుభవించినను - పెరుగునుతృష్ణ

దేవయాని విను - కనులు తెరచితిని
తృష్ణనింతటితొ - త్రెంపివేసితి
అడవుల బట్టి సాగిపోయెదను
సంసార సుఖములకు స్వస్తి పలికితిని.

బ్రహ్మోపాసన ఒకటేమార్గము
మనస్సునందున నెలకొనజేసి
బంధవిముక్తుడ నయ్యెద వినుము
అనుచు రాజ్యమును కొడుకులకొసగెః

నాల్గుదిక్కుల రాజ్యభాగము
మధ్యలొ ఐదవ భాగమంతయు
తనయు లైదుగురి కిచ్చివేసెను
రాజ సౌధమును వదలి కదలెను

ముని జనవాసము అయిన వనమున
నియమనిష్ఠతో గుణములకందక
బ్రహ్మోపాసన అనుష్టానమున
ఉత్తమగతులకు చేరె యయాతి

జ్ఞానోదయము కలిగె నంతట
దేవయాని తా తలచె నప్పుడు
భర్తత్రోవయే సరియైనదని
ఒంటరి బ్రతుకు అంధకారమని

సంసార లంపటము అశాశ్వతమ్ము
ఈశ్వరు కల్పిత నాటకమ్మిది
మమకార వికారములన్నియు కూడ
నిలవవు - ఎంతటివారికైనను

అతి నిస్సారము ఈసంసారము
ఎవరి త్రోవ మరి - వారిదే నగు
చలివేంద్రములో బాటసారులుగ
సంసార ఛాయలో కలసికొందురు

మాటలాడెదరు మన్నించెదరు
విశ్రాంతి కొంతగొని సాగిపోదురు
ప్రయాణమై మరి వెడలినంతనే
వెనుకటి వ్యక్తులు తెరమరు గగుదురు.

ఈ సుఖములకు బంధుత్వాలకు
వగచుట ఎంతో అ వివేకమ్ము
అనుచు తలంచి జీవితశేషము
హరిస్మరణతొ - తా - హరినిజేరెను.

నిత్యశాంతిలో నెలకొనువాడు
సర్వభూతముల కాధారమయి
ఆగమాలలో ఒదిగినవాడు
శ్రీహరికివియే - నమస్సులనుచు

ఆపైకధను శుకుడు చెప్పెను
ఓ మహారాజా! తండ్రిప్రీతికై
యౌవ్వన మొసగిన పూరునివంశము
గొప్పదైనది - నీవంశమదే

నీకంటె ముందుగల పౌరువుల
గాధను వినిచెద - ఆలకించుము
పూరువంశజులు సుగుణవంతులు
యశోవిశాలురు తేజోవంతులు.

పూరుని తనయుడు జనమేజయుడు
అతని తనయుడు ప్రాచిన్వాంసుడు
వాని కుమారుడు ప్రవిరోధన మన్యువు
వాని కుమారుడు - జారువు అగును.

జారువు సుతుడు సుద్యువుడయ్యా
వానికుమారుడు బహుగతుడయ్యా!
బహుగతు సుతుడు శర్యాతి అనబడు
శర్యాతి కుమారుడు సంయాతియగునయా

ఘృతాచి యనెడి అచ్చరకన్యతొ
పదిమంది తనయులా పుణ్యాత్మునకు
ఋతేపువు - మరి గక్షేపువును
స్థలేపువు మరి కృతాపువున్ను

జలేపువు మరియు సన్నతేపువు
ధర్మేపువున్ను - సత్యేపువును
వ్రతేపువు మరి వనేపువు అని
ఆపదిమంది నామధేయములు

ఋతేపు తనయుడు అంతిసారుడు
అంతిసారునికి ముగ్గురు తనయులు
సుమతి, ధ్రువుడు, అప్రతిరధుడు
అప్రతిరధుని సుతుడు కణ్వుడు

కణ్వ కుమారుడు మేధాతిధియగు
అతనితనయుడు ప్రస్కందుండు
వీరు బ్రాహ్మణులుగా - ప్రసిద్ధులు
సుమతి కుమారుడు - రైభ్యుడు! రాజా!

రైభ్యుని తనయుడు దుష్యంతుండు
లోకోత్తరమగు పరాక్రమమ్మున
భూమినంతను ఏకఛత్రమున
పరిపాలించిన చక్రవర్తియగు

దుష్యంతుడు తను వేటకుపోయి
భీకరమృగముల పీచమడంచి
అడవియంతయు కలయదిరుగుచు
కణ్వాశ్రమ ప్రాంతమ్ముజేరెను.

యాదృచ్ఛికముగ ఆశ్రమతావుకు
రాజుచేరెను – ఆప్రదేశము
అతిరమణీయము పరమపవిత్రము
మృగములు వైరము మరచిన చోటు

పాముపిల్లలకు నెమళ్ళు సేవ –
కరి పిల్లలకు సింహము – రక్షణ
పులి కూనలకు గజముల – సేవ
ఆవుల లాలనచేసెను పులులు

సహజవైరము మరచి – జంతువులు
ఆనందముగా బ్రతుకుటగాంచెను
అంతదూరమున సేనలనుంచి
కణ్వదర్శనము చేయగ నడచెను.

ఆశ్రమసీమలొ లతలు తరువులు
కణ్వమహాముని మంచి మనస్సును
ఆవిష్కరించుచు నున్నటుగాంచెను
పక్షులకిలకిల పరవశమిడినది.

ఒత్తుగపెరిగిన – పూలతలెంతో
లావణ్యముగా గాలికి కదలుచు
స్వాగతగీతిక ఆనందముగా
ఆలపించెనా అనిపించినది

ముందుకుసాగి అందమైన ఒక
సరస్సునచ్చట గాంచెనురాజు
స్వచ్ఛజలముతో గట్ల తరువులతొ
పలుకరించినటు లున్నది సరస్సు.

మరికొంతదవ్వులో – ఒకసుకుమారి
లతలను సర్దుచు సుమలతపోలి
కనుపించినది దుష్యంతునకు
సిగ్గుమొగ్గలై ప్రక్కకు నడచి

తరువుచాటున నిలచెను మగువ
తొంగిచూచెను పరాయివ్యక్తిని
ఆమెవదనము గాంచిన రాజు
ముగ్ధుడయ్యెను – పరవశించెను.

ఎవరా బాలిక! మునికుమార్తెయా!
బ్రహ్మనిష్టలో నిలచిన కణ్వుని
దరికి జేరిన రతి యగునేమో!
కుమార్తెయున్నటు – వినకపోతిని –

ముని బాలికలా తోచకున్నది –
వివాహమైన జాడ తోచదు –
కలలోనైనా చెదరని నామది
నేడు వశమును తప్పుచున్నది.

విషయమునడిగెద అని మహరాజు
లలనా ఎచ్చట గలరు మునీంద్రులు?
ఎవ్వర వీవు నామముఎద్ది?
కణ్వమునీంద్రులు నీకు బంధువా?

సిగ్గుపూలతో చెంపలు వెలిగెను.
వీణ మీటినటు పలికినదామె
నాయనగారు యజ్ఞముకొరకు
సోమతీర్థము వెళ్ళినారయా!

కణ్వమహర్షి పెంపుడు బిడ్డను
శకుంతలనునది నామధేయమనె
అంతట అడిగెను దుష్యంతుండు
పెంపుడు బిడ్డగ ఎట్లైతివని

విశ్వామిత్రుని యాగము చెరుపగ
మేనక నంతట పంపినారట
ఆమెపైన మరి మనసుపెంచుకొని
మునిచేసెను సంసార మామెతో

ప్రణయ ఫలముగ నే జన్మించితి
నన్నువదలి నాతల్లి సాగెను
వివేక మొదవిన తండ్రి - వదలగా
అడవిని పక్షులు ఆదరించినవి

శకుంతల పక్షులు సేవచేయగా
శకుంతలయని పేరునుబెట్టి
కణ్వమహర్షి చేరదీసిరి
పెంచి పెద్దగా చేసిరి నన్ను

కన్యకవే యని నమ్ముచుంటినని
ఆనందముతో - రాజు అడుగగా
ఔననిచెప్పి - రాజువివరము
అడిగెను జవ్వని - బెరుకు బెరుకుగా

పూరువంశ - సంజాతునేనని
దుష్యంతుడను అందురు - అనగా
అర్ఘపాద్యముల నొసగెద ననుచు
కూర్చొనజెప్పెను - ఆ మనోహరి

నీదు తియ్యని పలుకులు నాకు
ఆతిథ్యమును ఒసగెను అనుచు
ఈశ్వరదేవుని సంకల్పంబు
అని మది తలతు - నిను - నే వలతు

వల్లెయనిన చో - గాంధర్వ వివాహము
చేసుకొందును - సుందరాంగి - విను
సిగ్గుతొ ఆమె - తలనువంచినది
అంగీకారముగా - తలవూపెను

దగ్గరజేరి - ఆమహరాజు
కౌగలించుకొనె - కొంత కరగినది
అటులా రాజు ఆ శకుంతలను
గాంధర్వవిధిగను - పరిణయమాడెను.

॥శ్రీ కృష్ణచరితము॥



## 7 భరతుని చరిత్ర

రెండు మూడు దినములు రాజు
శకుంతలతొ అట సుఖముగగడిపి
అంగళీయకము ఆనవాలుగా
అతివకు యిచ్చి వెడలిపోయెను

కణ్వమునీంద్రుదు తిరిగివచ్చెను
సిగ్గుభయముతో నిలచిన తనయను
చూచినమౌని - దివ్యదృష్టితొ
సర్వము గ్రహించి - బుజ్జగించెను

తనయకు తాను ధైర్యముచెప్పెను
తగినవానిని - ఎన్నుకొంటివి
తనయుడు తేజోవంతుడు అగును
భూమినేలెడి సార్వభౌముడగు

అనుచు పలికిన తండ్రిని గాంచి
ఆనందించెను - ఆ లలనామణి
అంతటకొన్ని దినములకును
అందగత్తె అట తనయుని కన్నది.

రాచకులముకు తగినతీరుగా
జాతక కర్మలను ముని చేయించెను
దినదిన ప్రవర్ధమానమ్ముగను
దివ్యబాలుడు పెరుగుచుండెను.

ఆశ్రమమంతా కలయదిరుగుచు
సింహాలను మరి జూలు పట్టుకొని
తీసుకు వచ్చి - తాళ్ళతొ కట్టును
చెవులుపట్టి అట పులులను తెచ్చును.

మదపుటేనుగు పైకి - ఎగురును
అతి లాఘవముగ పరుగెత్తించును
ఘన భీకరమగు జంతువులన్నియు
మేక పిల్లలుగ - ఒదిగి యుండెను.

బాలునితీరు గాంచిన కణ్వుడు
సర్వదమనుడను పేరును బెట్టెను
దౌహిత్రునిగాంచి ఆటలుగాంచి
పరవశించుచు నుండెను కణ్వుడు

ఒకదినమున కణ్వుడు తనయను గాంచి
నీభర్త వచ్చి మరి తీసుకుపోడయె
పుట్టినింట నువు వుండుట అనిన
రాచభోగములు వదలుకొనుటయే!

రాచకార్యముల మునిగిన రాజు
ఆలస్యమును చేయుచుండెను
కావున నీవు - నీతనయునితో
బయలుదేరుము హస్తినాపురి.

రేపే మంచిది - అనుచు పలుకుచు
ఎడబాటు అను మాటను తలచి
తండ్రీబిడ్డలు వగచి రెంతయో
కట్టలుతెగి కన్నీరునిండెను.

తండ్రి మాటపై కుమారుని గొని
హస్తినాపురము జేరి శకుంతల
నిండుకొలువుకు జేరుకున్నది
అందరుచూచిరి దివ్యబాలుని

సభలోవారు ఆశ్చర్యముతో
దేవసంతతి అనుచు తలంచిరి
గాంచియు రాజు - మిన్నకుండెను
విస్మయమందెను అట శకుంతల

ఆ సమయములో ఆకాశవాణి
పలికెను - రాజా! చూతువదేమి
ఆమె - నీకు మరి - అర్ధాంగియగు
ఆబాలుడు నీ వంశాంకురము

కణ్వమునీంద్రుని ఆశ్రమమ్ములో
నాడు – ఈమెను గాంధర్వవిధిగను
పరిణయమాడితి వనుచు చెప్పగా
సభికులందరు శుభము పలికిరి.

అతడే భరతుడు – వానిని గాంచి
పరవశించిన తండ్రి అంతట
వయస్సురాగనె పట్టముగట్టి
వనములకేగెను తపము చేయగా

మనస్సు ఈశ్వరునందున నిలపి
ధ్యాననియమముల దుష్యంతుండు
ఉత్తమగతికి జేరెను రాజా!
భరతుని పాలన ఎన్నికైనది

దీర్ఘతపుడను బ్రాహ్మణుండు మరి
పురోహితుడుగా – డెబ్బది ఎనిమిది
అశ్వమేధములు యమున ఒడ్డున
భరతుడు తాను నిర్వహించెను.

అటులే – గంగ ఒడ్డున యాబదిఐదు
మొత్తము నూటముప్పది ఐదు
అశ్వమేధములు చేసెను భరతుడు
దాన దక్షిణల అతడే ఘనుడు

పదమూడువేల ఎనభైనాలుగు
పాడియావులను ద్వంద్వమందురు
అట్టిద్వంద్వములు వేయివత్సలతొ
ఉత్తమవిప్రుల – విద్వాంసుల కిడె.

పుష్కరతీర్థపు ఒడ్డునందున
బంగరుతొడుగుల అలంకారముల
ఐరావతము పోలిన దంతుల
పదునాలుగులక్షలు దానముచేసెను.

దిగ్విజయ యాత్రకు బయలుదేరగా
శకులు, శబరులు, కిరాత, హూణులు
మ్లేచ్ఛులు స్వయముగ లొంగిపోయిరి
భరతుడు ప్రతాప ప్రాభవాలతో

రసాతలమ్మున రక్కసి చెరలో
కుమిలెడి దేవకాంతలందరిని
విడుదలచేసి భర్తలకిడెను
త్రిపురమ్ములగల అసురుల గెలిచెను.

భరతునిపాలనలో వసుంధర
పులకరించెను సుఖములనిడెను
దివిభువి పొంగెను సర్వసంపదల
సురపతి భరతుని సాటిరాడు విను

ఇరువదివేల సంవత్సరమ్ములు
ఏడుదీవులను ఒకటిగ నేలెను
ధనపతి మించిన కలిమిని గలిగి
ఇంద్రుని మించిన బలిమిని గలిగెను.

రాజ్యపాలన సిరిసంపదలు
అస్థిరమ్ములని గ్రహించి – భరతుడు
విరక్తిపెంచుకు నిజము తెలిసెను
అతనికి ముగ్గురు భార్యలు రాజా!

విదర్భరాజు సంతతి - భార్యలు
ముగ్గురు రాణులయందున రాజుకు
మగబిడ్డలు మరి ఉద్భవించిరి
కానీవారు దక్కకపోయిరి.

తండ్రికి తగని అనామకులని
వారిని తల్లులు మట్టుపెట్టిరి
భరతుడు తెలిసి తల్లడిల్లెను
నిర్వంశమ్ము అగునని తలచెను.

వంశాంకురమును పొందగ కోరి
మరుత్‌స్తోమమను-యజ్ఞము చేసెను
ఆసమయములో జరిగెను చిత్రము
బృహస్పతి అన్న - ఉబధ్యుండు

ఆతనిభార్య - మమత అందురు
నిండుచూలాలు ఆమెనుగాంచి
బృహస్పతి తా మోహించెనయా!
ఆమెను పొందగ యత్నముచేయగ

గర్భములోని శిశువు అంతట
తగనిపని యని ప్రార్థనచేసెను
హేయకార్యము అనుచిత చర్య
వలదని - ఎంతో ఘోషపెట్టెను.

కామాంధకారమున నున్న బృహస్పతి
అంధుడ గమ్మని - శాపమునిడెను
అంతటిలోన బృహస్పతి తేజము
గర్భములోనికి ప్రవేశించెను.

దానిని గాంచిన శిశువంతటను
కాలిమడమతొ తన్నె - కోపమున
బయటపడి అది మగబిడ్డయ్యెను
బృహస్పతి-మమతను-పెంచగకోరెను.

ద్యాజుడీతడు నేను భరించను.
అనుచు పలికెను - మమత అంతట
నేను భరించను అనెను బృహస్పతి
అటులవారికి వాదము జరిగెను.

అతడే ఆయెను భరద్వాజుడని
శాపము తగిలిన మగబిడ్డ డాతడు
దీర్ఘతముడు - అయ్యెను రాజా!
భరద్వాజుని - కాదని రిద్దరు.

ఆసమయములో మరుత్తులంతట
భరద్వాజుని పోషణచేసిరి
పుత్రునికొరకై - యజ్ఞముచేసెడి
భరతునివద్దకు తీసుకువచ్చిరి.

బృహస్పతి తనయుడు భరద్వాజుడు
పెంచుకోమని - మరుత్తులిచ్చిరి
మహనీయు డీతడు అగునని చెప్పిరి
ఆనందముగా గైకొనె రాజు

వితథము అయ్యెడి - వంశమునిలపెను
కావునాతడు - వితథుడయ్యెను
ఆతని సుతుడు - మన్యువు రాజా!
మన్యువు కొమరులు బృహక్షత్రుడు

జయుడును మరియు మహావీర్యుడు
నరుడు గర్గుడు అను ఐదుగురు
వారిలొ నరుని తనయుడు సంకృతి
ఆతనికి గురువు రంతిదేవుడు

రమ్యగణాఢ్యుడు రంతిదేవుడు
దానగుణములో మించరెవ్వరును
కీర్తిచంద్రికల యశోమూర్తియై
శాశ్వతమ్ముగా పేరుగడించెను.

॥శ్రీ కృష్ణచరితము॥



## 8 రంతిదేవుని వృత్తాంతము

ధర్మబద్ధముగ విశేషసంపద
గడించినట్టి రంతిదేవుడు
అడిగిన వారికి లేదనకుండా
దానముచేసెను అమితసంపదను

ఉన్నదానిలో దాచుకొనుటది
తెలియని దాత - రంతిదేవుడు
చివరకు అంతా దానముచేసి
కట్టుబట్టలతొ నిలబడినాడు

పట్టెడన్నము - దోసెడి నీళ్ళు
కరువై - ఆతడు ఊరువదలెను
గమ్యములేని ప్రయాణమ్ముతో
భార్యాబిడ్డల తీసుకుసాగెను

ఆకలి బాధతొ నలభైఎనిమిది
రోజులు గడిపి - జీవచ్ఛవమై
కొన ఊపిరితో నిలబడియుండిరి
అంతటవారికి తినుటకు దొరికెను

ఒకప్రదేశమున పాయసమ్మును
నేయి, నీళ్ళు, లభించినాయి
అంతా దానిని పంచుకొని అట
ఆరగించుటకు సిద్ధపడగను

ఆదారిని చను విప్రుడొకండు
ఆకలిబాధను విన్నవించెను
ఆహారమును అర్థించగను
ఆలోచించక సమర్పించెను

ఆ బ్రాహ్మణుడు భుజించినాడు
మిగిలినభాగము తినుటకు కూర్చొన
ఆకలియనుచు మరి యొకరొచ్చిరి
కాదనకుండా వానికిపెట్టెను

అంతట మిగిలిన కొద్ది భాగము
భుజించ కూర్చొన - మరియొక వ్యక్తి
జాగిలాలను ఈడ్చుకువచ్చి
ఆకలియనుచు అర్థించగను

మిగిలినదంతయు ఇచ్చివేసెను -
మిగిలిన నీరు - త్రాగనెంచగా
మరియొక రొచ్చి దాహము అనెను
అసువులు నిలపగ - నీటిని యిమ్మనె -

రంతిదేవుడు హరిని స్మరించి
అన్నదానము చేసిన చేతులు -
కేవలమాతని - బాధతీర్చగా
నీటినియిచ్చే - దుర్గతి అనుచు

మదిలో మధనతొ నీటిని ఒసగెను
నీటిని త్రాగి అదృశ్యమయ్యెను
వెంటనె అచటికి బ్రహ్మాదిదేవతలు
వచ్చి నిలచిరి దర్శనమిడిరి.

విరించి పలికెను మందహాసమున
కటిక దరిద్రము ననుభవించుచు
విడువని ధైర్యము – దాన గుణముతో
సురలమెప్పునే పొందితివయ్యా!

ఇది అంతయును శ్రీహరి లీలగ –
నీకీపరీక్ష పెట్టితిమయ్యా!
ఆనందముతో కరములు ముడిచి
వారిని స్తోత్రముచేసి పలికెను.

పూర్వజన్మకృత పుణ్యమువలన
మీదర్శనము లభ్యమైనది
చెదరని భక్తిని అనుగ్రహించుడు
అనుచువేడెను – రంతిదేవుడు.

అటుపిమ్మట ఆ రంతిదేవుడు
విష్ణుధ్యానమున సద్గతినందెను
ఆతని సంతతి శ్రీహరి చలవచె
ముక్తిధామము చేరగలిగిరి.

ముక్తికి ముఖ్యము – చెదరని భక్తి
దానికి రంతిదేవుడు సాక్షి –
అనుచు పలుకుచు ఆపైగాథను
ఆరంభించెను శుకయోగీంద్రుడు

గర్గునికొడుకు 'శిని' యగునయ్యా!
అతనికి సుతుడు గార్గ్యుడు రాజా!
వాని కులమది బ్రాహ్మణకులమయె
మహావీరునికి – సురక్షయుండు.

సురక్షయునకు ముగ్గురు సుతులు
త్రయ్యారుణి – పుష్కరారుణి
కవి – యనువారు బ్రాహ్మణులైరి
బ్రహ్మక్షత్రుని – సుతుడు – సుహోత్రుడు

సుహోత్రునికి – హస్తి – తనయుడు
అజమీఢుడు, ద్విమీఢుడు మరి
పురుమీఢుడని అతని తనయులు
అజమీఢుని సంతతి విప్రులుకొందరు

ప్రియమేధాదులు అనెడికొందరు
అజమీఢుని సుతులు – బ్రాహ్మణులాయిరి
మరియొక సుతుడు – బృహదిషుండు
అతని కుమారుడు బృహద్ధనుండు.

బృహత్కాయుడు ఆతని కొమరుడు
వారి కుమారుడు జయద్రధుండు
వాని తనూజుడు విశ్వజిత్తయా
సేనజిత్తు ఆతని తనయుడు.

సేనజిత్తుకు – రుచిరాశ్వుండు
దృఢహనుండును కాశ్యుడు మరియు
వత్సుడు అనెడి నలుగురు తనయులు
రుచిరాశ్వునికి సుతుడు ప్రాజ్ఞుడు.

ప్రాజ్ఞుని సుతుడు పృథుసేనుండు.
వాని కుమారుడు పారుడు రాజా!
పారుని సుతుడు నీపుడు అగును
వానికి తనయులు నూర్గురు పుట్టిరి.

శుకుని తనూజ – నీపుని యొక్క
రెండవభార్య – ఆమె కుమారుడు
బ్రహ్మదత్తుడు అనెడి యోగ్యుడు
యోగ విద్యలో ఆరితేరెను

యోగతంత్రమును వ్రాసెనాతడు
అతని భార్య గోదేవి అగునయా!
వారి కుమారుడు విష్వక్సేనుడు
అతని తనూజుడు ఉదక్సేనుడు

ఉదక్సేనునికి – భల్లాదుడు సంతతి
బార్హదిషవులను – రాజవంశమది –
ద్విమీఢుని తనయుడు యమీనరుండు
వాని కుమారుడు కృతిమంతుండు.

కృతిమంతుని సుతుడు సత్యధృతి యగు
వానికుమారుడు దృఢనేమియగు
వానితనూజుడు సుపార్శ్వకృత్తు
అతని కొమరుడు సుపార్శ్వుడయ్యా!

సుమతి ఆతని వంశాంకురము
సుమతి కుమారుడు సన్నతిమంతుడు.
వానికుమారుడు కృతియనువాడు
యోగవిద్యను అభ్యసించెను.

హిరణ్యానాభుని వద్దనాతడు
విద్యను నేర్చి తూర్పుదేశమున
సామసంహిత – పఠించినాడు
ఆతనితనయుడు ఉగ్రాయుధుండు

వానికి – క్షేమ్యుడు తనూజుడయ్యా!
క్షేమ్యుని సుతుడు సువీరుడగును
వానికుమారుడు – పురంజయుండు
బహురథుడాతని వంశాంకురము.

హస్తి తనయుడు – పురుమీఢుండు
అతనికి సంతతి లేకపోయెను
అజామీఢునికి నీలుడు తనయుడు
ఆతనిసుతుడు – శాంతి అనబడు.

శాంతికుమారుడు సుశాంతియగును
వాని కుమారుడు పురుజుండయ్యా
పురుజు తనయుడు అర్కుడు రాజా!
అర్కుని కొడుకు భర్మాశ్వుండగు.

భర్మాశ్వునికి సుతులైదుగురు
ముద్గలుండును యవీనరుండు
బృహదిషుడు మరి కాంపిల్యుండు
సృంజయుండని వారి పేర్లయా.

పాంచాలులుగా ప్రసిద్ధికెక్కిరి
ముద్గలువంశము బ్రాహ్మణవంశము
అతనికి సంతతి దివోదాసుడును
అహల్య అనియెడి – తనయ పుట్టిరి

అహల్య ఆయెను గౌతముభార్య
వారికి తనయుడు శతానందుడు
శతానందుని సుతుడు సత్యధృతి
ధనుర్వేదమున దిట్ట ఆతడు

ఒకదినమున ఆ సత్యధృతి - తా
వేటకు వెళ్ళెను అచ్చటతనికి
ఊర్వసి కనబడె ఆ అందమునకు
వీర్యస్ఖలనము అయ్యెనాతనికి

రెల్లుదుబ్బుపై పడిన వీర్యమున
ఆడ - మగ - శిశువులు పుట్టిరి
వేటకు వచ్చిన శంతనుడంతట
ఆ శిశువులను తీసి పెంచెను.

కృపాళువై మరి పెంచెనుగావున
కృపుడను పేరు బాలునికొచ్చెను
కృపి యను పేరు బాలికకిడిరి
వారిద్దరిని శ్రద్ధగపెంచెను.

కృపిని - ద్రోణుడు పెండ్లియాడెను
దివోదాసుకు - మిత్రాయువు పుట్టెను
వాని కుమారుడు చ్యవనుడు రాజా!
చ్యవనుని తనయుడు సుదాసుండయా

సుదాసు కొమరుడు సహదేవుండు
వాని కుమారుడు సోమకుడయ్యా!
అతని తనయుడు సుజన్మకృత్తు
అతనికి సుతులు నూర్గురుమంది.

వారిలో జ్యేష్టుని పేరు జంతువు
ఆఖరివాడు పృషతుడు రాజా
పృషతుని కొడుకు ద్రుపదుడు అగును
ధృష్టద్యుమ్నాదులు ఆతని సుతులు.

ద్రౌపది యనునొక ఆడుసంతతి
ధృష్టద్యుమ్నుడు దృష్టకేతువు
వారందరునూ పాంచాలరాజులు
అజమీఢుని-తనయుడు ఋక్షుడు అగును

ఆతని తనయుడు సంవరణుండు
సూర్యతనూజ - తపతిని ఆతడు
వివాహమాడెను పరీక్షనృపా!
వారి కుమారుని కురువు అందురు.

కురుపేరుతొ బరగెను కురుక్షేత్రమది
కురువు కుమారులు నలుగురు రాజా!
పరీక్షిత్తు, సుధనుండు మరి
జహ్నువు, నిషధుడు వారిపేర్లయా!

పరీక్షిత్తుకు సంతతి లేదు
సుధనుని సుతుడు సుహోత్రుండు
వాని కుమారుడు చ్యవనుడురాజా!
చ్యవనుని సంతతి కృతియగు నయ్యా!

కృతి కుమారుని వసువు అందురు
వసువు ప్రసిద్ధుడు విను మహరాజా
అతనితనయులు బృహద్రథుండు
ఆదిగా గల వారైదుగురు

బృహద్రధుండు - కుసుంభుడున్ను
మత్స్య, ప్రత్యగ్రుడు మరియు
చేదిషుడను వారలు రాజా!
బృహద్రధుని సుతుడు కుశాగ్రుడు.

వాని కుమారుడు ఋషభుడు రాజా!
ఋషభుకుమారుడు సత్యహితుండు
అతనికి తనయుడు పుష్పవంతుడు
పుష్పవంతుని సుతుడు జహ్నువు

బృహద్రధునికి మరియొక భార్య
ఆమెకు పుట్టెను రెండుఖండములు
చూడలేక తా తల్లి వాటిని
కోట కందకములోకి విసరమనె

వాటిని - జర అను - రక్కసితీసి
జీవించు జీవించు-అనుచు కలిపెను
బ్రతికిన యట్టి ఆ బాలుండు
జరాసంధునిగ - ప్రసిద్ధికెక్కెను.

గిరివ్రజపురము రాజధానిగా
పరిపాలించెను జరాసంధుడు
మీ పినతాత - భీమసేనుడు
అవలీలగను - వానిని చంపెను.

జరాసంధుని సుతుడు సహదేవుడు
వానికుమారుడు - సోమాపి యగు
సోమాపి తనయుడు శ్రుతశ్రవుండు
జహ్నుకుమారుడు-సురధుడు! రాజా!

సురధు సుతుడు విదూరథుండు
వాని కుమారుడు సార్వభౌముడు
అతనికి తనయుడు జయత్సేనుడు
వానికి తనయుడు రధికుడు రాజా!

రధికుని సుతుడు ఆయుతాయువు
వానికుమారుడు క్రోధనుడయ్యా
క్రోధను కొమరుడు దేవాతిధియగు
వాని కుమారుడు ఋక్షుడు రాజా!

ఋక్షుని సుతుడు భీమసేనుడు
వాని కుమారుడు ప్రతీపుడయ్యా!
ప్రతీపు తనయులు దేవాసి మరియు
శంతనుండును - బాహ్లీకుండు

దేవాసి - తపసుకై వనములకేగెను
శంతనుడంతట రాజు అయ్యెను
పూర్వజన్మములో మహాభిషుడను
పేరుగలదు ఆ శంతను రాజుకు

శంతనునికి ఒక శక్తియున్నది
ముదుసలివారిని చేతితొ తాకిన
యౌవ్వన వంతులు అగుదురువారు
రాజ్యపాలనము జరుగుచుండగా

పదిరెండేళ్ళు గడచిపోయెను
వర్షము పడక - క్షామము కలిగెను
వేదవేత్తలను రప్పించి అంతట
కారణమడిగెను శంతను రాజు

సూటిగ చెప్పిరి వేదవేత్తలు
అన్న వుండగా తమ్ముడు తాను
అగ్నిహోత్రము ఆచరించుట
ముందుగ - పెండ్లి చేసుకొనుటయే.

విజ్ఞులు-దానిని పరివేత్త అందురు -
అన్నను వదలి - గద్దెనెక్కిన
ఫలితము - క్షామము, అనావృష్టియు
కావున - అన్నకు రాజ్యమీయుము

శంతను డంతట అడవులనున్న
అన్నను రమ్మని బ్రతిమాలగను
అచటి విప్రులు చెప్పిరి అపుడు
రాజ్యపాలనకు అనర్హుడనిరి.

విను మహరాజా! నీదుజనకుడు
నీఅన్నకు రాజ్యము నీయతలంచగ
కొందరు వానికి పాషండమతమును
బోధించిరి - అది తలకెక్కినది.

దాని ఫలితమీ దేవాసి - వేదముల
దూషించుచును తిరస్కరించెను
దైవదూషణ ఫలితముగాను
రాజ్యపాలనకు అనర్హుడయ్యెను

కావునరాజా! వంతనొందకు
తిరిగి రాజ్యము పరిపాలించుము
సవ్యముగానే జరుగునన్నియు
అనగా - రాజు తిరిగివచ్చెను.

పెద్దలమాటలు కాదనలేక
రాజ్యపాలనము చేయుచుండెను
పరమేశ్వరుని అనుగ్రహమ్మున
క్షామబాధలు తీరిపోయినవి.

దేవాసి - కలాప గ్రామమునందున
యోగిగనుండెను ఓమహరాజా!
కలియుగాంతము నందునాతడు
జైవాతృక కులమును స్థాపించునయా!

ప్రతీపుని మూడవ తనయుడు
బాహ్లీకుడయ్యా - రాజవరేణ్యా!
సోమదత్తుడు వాని తనూజుడు
సోమదత్తునికి ముగ్గురు కొడుకులు

భూరి మరియు భూరిశ్రవుడు
శలుండు అనెడివి వారి పేర్లయా!
శంతనరాజుకు గంగయందున
పుట్టిన తనయుడు - భీష్ముడురాజా!

మహారథులలో శ్రేష్ఠుడాతడు
పరశురామునే జయించగలిగిన
ఆత్మవేత్త - ఆ భీష్ముడు రాజా!
అస్త్రశస్త్రముల మించ రెవ్వరును

శంతనునకును - సత్యవతికిని
పుట్టినవారు చిత్రాంగదుడు
విచిత్రవీర్యుడు వారిలో అన్న
గంధర్వులతో - పోరునమడసెను.

పరాశరు మహర్షి అనుగ్రహమ్మున
ఆ సత్యవతి పరాశరునితో
వ్యాసుని గన్నది - ఆమహనీయుడు
శ్రీహరి అంశతొ - ఉద్భవించెను

వేదవిభాగము చేయుటవలన
వేదవ్యాసునిగ పేరువచ్చెను
ఆయన - నాదు జనకుడు రాజా!
ఆయన వ్రాసెనీ - భాగవతమ్ము.

పరమరహస్యము మంత్రసమానము
భాగవతమ్మును - తండ్రి చెప్పగా
చదివితి నేను - ఆవిషయమ్ము
ఆయనగారి - శిష్యులెరగరు

శంతను రెండవ తనయుండైన
విచిత్రవీర్యునికి పెండ్లిచేయగా
అంబ అంబిక అంబాలికలు
కాశీరాజు తనయుల దెచ్చెను.

స్వయంవరమున - భీష్ముడు వారిని
జయించితెచ్చెను - అంబకాదనె -
మిగిలిన యిద్దరు పెండ్లి యాడిరి
భోగమ్ములతో విచిత్రవీర్యుడు

కడతేరగను - వంశము నిలపగ
వ్యాసుని తలచెను - తల్లి సత్యవతి
వారికి బిడ్డలు కలుగునట్టుగా
అనుగ్రహించగ కోరెను - అంతట

వ్యాసానుగ్రహమందిన వారికి
ధృతరాష్ట్రుడును పాండురాజును
విదురుడు - అనెడి తనయులు పుట్టిరి
ధృతరాష్ట్రునికి సుతులు నూర్గురు

దుర్యోధన దుశ్శాసనాది కొడుకులు
దుస్సల అనెడి తనయ కలిగిరి
పాండురాజు మరి శాపవశుడయి
సంసార సుఖములకు దూరమయ్యెను

ఆతని భార్య కుంతి యందున
యమధర్మ, వాయు, ఇంద్రప్రసాదిత
ధర్మజ, భీమార్జునులు కలిగిరి
పాండుకుమారులు - పాండవులైరి

పాండురాజుకు రెండవభార్య
మాద్రియందున - అశ్వనిసురలచె
నకుల సహదేవులు ఉద్భవించిరి
వారైదుగురకు - ద్రౌపది భార్య

ప్రతివింధ్యుండు శ్రుతిసేనుండును
శ్రుతకీర్తి మరియు శతానీకుడు
శ్రుతకర్ముడు అను వారైదుగురు
ద్రౌపదిదేవి - సంతానమ్ము

ధర్మరాజుకు రెండవ భార్య
పౌరవతి యను కాంతయందున
దేవకుడనెడి తనయుడు కలిగెను
భీముని కిద్దరు భార్యలందున

హిడింబ యందు ఘటోత్కచుండు
కాళియందున - సర్వగతుండు
అర్జునునకు మరి సుభద్రయందున
అభిమన్యుండు - ఉద్భవించెను

కిరీటి యొక్క భార్యలందున
ఇరావంతుడు - ఉలూపియందు
చిత్రాంగద యందు బభ్రువాహనుడు
తనయులు పుట్టిరి - ఓమహరాజా!

నకులునకున్ను - రేణుమతికిని
పుట్టినవాడు - ఇరమిత్రుండు
సహదేవునకు విజయ యందున
సుహోత్రు డనువా డుద్భవించెను.

బభ్రువాహనుడు తండ్రికోర్కెపై
మాతామహుని వంశమ్మునకు
కర్తగ - అచటే వుండిపోయెను
అభిమన్యుండు అమిత విక్రముడు.

ఆ అభిమన్యుడు - నీకు తండ్రియగు
కురువంశమునకు కర్త ఆతడు
విరటుని తనయ ఉత్తర అనెడి
ఉత్తమురాలు నీకు తల్లియగు

తల్లి కడుపులో నీవుండగను -
అశ్వద్థామ అతికోపముతో
అపాండవంబగు - అనుచు పలుకుచు
బ్రహ్మశిరో నామకాస్త్రము వదలెను

శ్రీహరి చక్రము అనుగ్రహమ్ము
నినుకాపాడెను - ఓమహరాజా!
జనమేజయుడు శ్రుతసేనుండు
భీమసేన ఉగ్రసేనలు - నీతనయులయా!

జనమేజయుడు నీశాపము విని
తక్షకు విషముకు ప్రతి క్రియగాను
సర్పయాగము చేయును రాజా!
అతి ప్రసిద్ధుడగు - రాజాతడగు

కావషేయుడు - పురోహితునిగా
అశ్వమేధము చేయునాతడు
శతానీకుడు అతనికి తనయుడు
యాజ్ఞవల్క్యుని కడ-వేదము చదువును.

కృపునివద్ద - విలువిద్య నేర్చును
శౌనకు వల్ల ఆత్మవిద్యయు
నేర్చునాతడు - ఆతని తనయుడు
సహస్రానీకుడు ఓమహరాజా!

వాని కుమారుడు అశ్వమేధజుడు
అతని తనయుడు అసీమకృష్ణుడు
వానికి సుతుడు - నిచకుడు రాజా!
వాని కుమారుడు నుప్తుడు అగును

వాని సంతతి చిత్రరధుండు
అతని తనూజుడు శుచిరధుండు
సుచిరధునకు వృష్టమంతుడు!
అతని తనయుడు సుషేణుండగు

సుషేణు తనయుడు సుపీతుండగు
వాని తనయుడు నృచక్షువు
అతని కుమారుడు సుఖానిలుండు
వాని తనూజుడు - పరిప్లవుండు

పరిప్లవునికి సుతుడు మేధావి
అతని కుమారుడు సునయుడు రాజా!
వానికుమారుడు - నృపంజయుండు
అతనికి తనయుడు దూర్వుడు అగును

వాని తనయుడు నిమియనువాడు
వాని కుమారుడు బృహద్రథుండు
అతని తనయుడు సుదాసుండగు
వానితనయుడు శతానీకుడు

అతనికి సుతుడు - దుర్దమనుండగు
దుర్దను సుతుడు - విహీనరుండు
ఆతని తనయుడు - దండపాణియగు
వాని కుమారుడు - మితుడగునయ్యా!

క్షేమకుండు ఆ మితుని తనూజుడు
క్షేమకు తనయుడు బ్రహ్మక్షత్రుడు
ఆతనితో మరి నిర్వంశమగు
జరాసంధుని సుతుడు-సహదేవుడు.

సహదేవుని సుతుడు మార్జాలియగు
వాని కుమారుడు శృతశ్రవుండు
అతని తనూజుడు ఆయుతాయువు
వాని కుమారుడు నిరమిత్రుండు

వాని కుమారుడు సునక్షత్రుడు
అతని తనయుడు బృహత్సేనుడు
వాని కుమారుడు కర్మజిత్తుయగు
అతనికి తనయుడు శ్రుతంజయుండు.

శ్రుతంజయునకు విప్రుడు కొడుకు
విప్రుని తనయుడు శుచియగునయ్యా
శుచి కుమారుడు - క్షేముడురాజా!
క్షేముని సుతుడు సువ్రతుండగు

సువ్రతునకు మరి ధర్మనేత్రుడు
వాని కుమారుడు శ్రుతుడగునయ్యా!
శ్రుతుని కుమారుడు దృఢసేనుండు
వాని తనూజుడు సుమతి యగునయా.

సుమతి కుమారుడు సుబలుండగును
వాని కుమారుడు సునీతుడగును
అతని తనూజుడు సత్యజిత్తుయగు
సత్యజిత్తుకు - సుతుడు - విశ్వజిత్తు.

విశ్వజిత్తునకు పురంజయుండు
తనయుడగును ఓ రాజవరేణ్యా
జరాసంధాదులు ఈ మగధవాసులు
యశోవిశాలుగా వెలిగెదరు.

వారందరును కలియుగమందు
వేయివత్సరములోపు మడసెదరు
యయాతి కొడుకు అనువు సంతతి -
వినుమని చెప్పెను - శుకయోగీంద్రుడు

అనువు తనయులు సభానరుండు
చక్షువు మరియు పరోక్షుండు -
సభావరునకు - కాలనాధుడు
వాని తనయుడు సృంజయుండయా!

సృంజయు తనయుడు పురంజయుండు
పురంజయు సుతుడు జనమేజయుడు
వాని తనూజుడు మహాశాలుడు
వాని కుమారుడు మహామనసుండగు

ఉశీనరుండు - తితిక్షుడనియెడి
ఇద్దరు సుతులు మహామనసునకు
ఉశీనరునకు - శిబి, పనుడు, మరి
క్రిమి, దర్పుడను నలుగురు తనయులు.

శిబి కుమారులు నలుగురు రాజా!
వృషదర్పుండు, సువీరుడున్ను
మద్రుడు, కేకయుడను వార్లయ్యా
తితిక్షునకు మరి రుశద్రధుండు

వాని కుమారుడు హేముడు రాజా!
వాని తనూజుడు సుతుపుండయ్యా!
సుతపుని తనయుడు బలియనువాడు.
బలి కుమారులు ఆరుగురయ్యా!

అంగ - వంగ - కళింగ - సింహ
పుండ్ర - ఆంధ్ర అనెడి పేర్లయా
తూర్పుదేశమున వారిపేర్లతో
భూమిని పరిపాలించిరి వారు.

సువీరు తనయుడు సత్యరధుండు
వాని కుమారుడు దివిరధుండగు
అతని తనయుడు ధర్మరధుండు
ధర్మరధునికి సుతుడు - చిత్రరధుండు

చిత్రరధునికి మరియొక పేరు
రోమపాదుడు - గుణముల మేటి
బిడ్డలులేక కుములుచుండగా
మిత్రుడు అయిన దశరధరాజు

తనకూతురగు శాంతాదేవిని
పెంపకమ్ముగా యిచ్చెను అపుడు -
ఒకపరి - క్షామము ఏర్పడెనచట
వర్షములేక అలమటించిరి.

పెద్దలందరితో యోచనచేయగ
వారు చెప్పిరి - విభాండకముని
తనయుడు - ఋష్యశృంగుడు అడుగిడ
వర్షము కురియును-క్షామము తొలగును.

వనమున చరించు ఋష్యశృంగుని
లోకము నెరుగని తపోవంతుని
గొనిరావలెనని - అందగత్తెలను
పంపెను రాజు ఆ వనసీమకు.

వారందరు అట ఆశ్రమతావుల
పొంచివుండి మరి చూచిరా మునిని
చలనములేని - జడునిమాదిరి
కనుపించెను ఆ ఋషికుమారుడు

ఆటలు పాటలు పక్షుల కూతలు
అనుకరించుచు గెంతుచువారు
దగ్గరయ్యిరి గాంచెను ఆతడు
ఋషిపుంగవులని తలంచినాడు

కొప్పులు గాంచి జటలనుకొనెను
వలువలు - జింకల చర్మములనుకొనె
ఆభరణమ్ములు - రుద్రాక్షలనుకొని
తలచె - సుమగంధము తపోఫలమని

అమోఘమైన తాపసులనుకొని
వినయమునిండి నమస్కరించెను
అంతటవారు కవ్వింతలతో
కౌగలింతలతొ చనవుగ పలికి

తమతో - వారి వనభూములకు
ఆహ్వానించగ - అచేతనముగా
వెంబడి సాగెను ఋష్యశృంగుడు
రోమపాదుని దరికి జేర్చిరి.

ఆనందించి ఆ మహరాజు
అనుంగు పుత్రిక - శాంతనుయిచ్చి
ఋష్యశృంగునికి పెండ్లిచేసెను
సంసార సుఖములు అందెనుమౌనికి.

మామయింటిలో వసించినాడు
వర్షదేవుడు కరుణించాడు
ఇంద్రప్రీతిగా యజ్ఞము - మామతొ
జరిపించెను ఆ ఋష్యశృంగుడు

పుత్రసంతతిని రోమపాదునకు
అనుగ్రహించెను నాకలోకపతి
ఋష్యశృంగుడు దశరథచేనిచె
పుత్రకామేష్టి - జరిపించెనయా!

అటుల దశరథుని కోరికతీరి
పుత్రసంతతి కలిగెను రాజా!
రోమపాదునికి - చతురంగుండు
వానికి తనయుడు పృథులాక్షుండు

పృథులాక్షునికి బృహద్రథుండు
బృహత్కర్ముడు - బృహద్భాణుడు
అనెడి కొమరులు ముగ్గురు కలిగిరి
బ్రహద్రథునకు - బృహన్మనుడు

వాని కుమారుడు జయద్రథుండు
అతని కుమారుడు విజయుడు రాజా!
విజయుని తనయుడు ధృతియనువాడు
ధృతిసుతుండు మరి ధృతవ్రతుండగు

ధృతవ్రతునకు - సత్యకర్ముడు
వాని కుమారుడు అతిరథుడయ్యా
కుంతీదేవి - కన్యగ నుండి
సూర్యవరమున తనయునికన్నది

పెట్టెలొ పెట్టి ఆ పసికందును
గంగలొ వదలెను కుంతీదేవి
పెట్టెదొరకగా - బాలుని పెంచెను
అతిరథుడనెడి - పుణ్యాత్ముండు

ఆ అతిరథు డితడే రాజా!
ఆ బాలుండే కర్ణుడు వింటివ!
కర్ణుని కొడుకు వృషసేనుండు
దానగుణమున మేటి - కర్ణుడు.

యయాతి తనయుడు ద్రుహ్యునకు
బభ్రుసేతువు పుట్టెను రాజా!
వాని కుమారుడు - అరబ్ధుండగు
అతని కుమారుడు గాంధారుండు

గాంధారు కుమారుడు ఘర్మ్మడురాజా!
వానితనయుడు - ఘృతుడనువాడు
ఘృతుని తనయుడు దుర్మదుండగు
అతనికి సుతుడు ప్రచేతనుండు

ప్రచేతనునకు నూర్గురు కొడుకులు
మ్లేచ్ఛప్రభువులై ఉత్తరతీరపు
భూముల పాలన చేసిరి రాజా!
తుర్వసు తనయుడు వహ్నియగునయా!

వహ్ని కుమారుడు భర్గుడురాజా!
వాని కుమారుడు భానుమంతుడు
అతని తనయుడు త్రిసానుండు.
వాని కుమారుడు కరంధముండు.

కరంధు తనయుడు మరుత్తుఅగును
ఆమరుత్తు మరి యయాతివల్ల
శాపమునంది నిస్సంతుడయె
ఇకపైగాథ - వినుమహరాజా!

॥శ్రీ కృష్ణచరితము॥



# 9 యదు వంశచరిత్ర

రాజా! యయాతి పెద్దకుమారుడు
యదువు అనుచు చెప్పితి నీకు
యదువంశములో శ్రీహరిపుట్టి
దివ్య చరిత్రను కలిగించెనయా!

యదువంశచరిత్ర - పరమపవిత్రము
భువనపావనము లోకపూజ్యము
ఆ చరిత్ర వినినచొ జన్మరాహితి
వీనుల విందుగ నుండు చరిత్రము

యదువుకు నలుగురు కుమారులయ్యా!
సహస్రజిత్తు క్రోష్టువు మరియు
నలుడు - రిపుడు - అనెడి పేరులవి
సహస్రజిత్తుకు-తనయుడు-శతజిత్తగును

వాని తనయులు మహాహయుండు
వేణుహయుడును హేహయుండును
హేహయు తనయుడు ధర్మ్మడనబడును
ధర్మనితనయుడు నేత్రుడు అగును

నేత్రునికంత కుంతి తనయుడు
అతని తనయుడు మహిష్మంతుడు
వానితనూజుడు భద్రసేనుడు
వాని కుమారుడు దుర్మదుండగు

దుర్మదు తనయుడు ధనికుండగును
వాని కుమారులు నలుగురు రాజా!
కృతవీర్యుడును కృతాగ్ని కృతకర్మ
కృతౌజుండు వారి పేర్లయా!

కృతవీర్యుని తనయుడు అర్జునుండగు
కార్తవీర్యార్జునుడతడే రాజా!
దత్తాత్రేయుని భక్తుడాతడు
యోగసిద్ధిని పొందినవాడు

అనేక యజ్ఞములాతడు చేసి
అఖండయశమును సంపాదించెను
పరశురాముని ధాటికి ఆతని
వేయిబాహువులు తెగి నేలనుబడె

ఆతని తనయులు వేయిమందయా!
వారిలో బ్రతికిన దైదుగురయా!
జయధ్వధ–శూరసేన–వృషణుండు మరి
మధువు ఊర్జితులను వారయ్యా!

జయధ్వధునికి తాళజంఘుడు
వానికి ఔర్యముని అనుగ్రహమ్మున
నూర్గురు కొడుకులు ఉద్భవించిరి
వారిలో జ్యేష్ఠుడు వీతిహోత్రుడు

మధువు తనయుడు వృక్ణుడు అగును
వానికి నూర్గురు కుమారులయ్యా!
పెద్దకుమారుడు వృష్ణిఅగునయా!
మధు యదు వృష్ణి వంశములవ్వి

ఆవంశములో పుట్టినవారు
మాధవ–యాదవ–వృష్ణులు అనుచు
ప్రసిద్ధమైన పేర్లతొ నుందురు
యదువు కుమారుడు క్రోష్టువు అగును

క్రోష్టువు తనయుడు వృజినవంతుడు
వానికి శ్వాహితుండు తనూజుడయ్యా!
వాని కుమారుడు భేరుశేకుడు
వాని తనూజుడు చిత్రరథుండు

చిత్రరథునికి సుతుడు శశిబిందువగు
శశిబిందువునకు పదివేల భార్యలు
పదివేల లక్షలు వారికి తనయులు
శశిబిందుండు సప్తదీవులనేలెను

శశిబిందు తనయులలొ
ఆరుమంది మరి ప్రసిద్ధులాయిరి
వారిలొ వొకడు పృధుశ్రవుండు
వానితనూజుడు ధర్మదు అగును

ధర్ముని సుతుడు ఉశనుండగును
నూరు అశ్వమేధమ్ముల చేసెనుశనుడు
వాని కుమారుడు రుచకుండగును
వాని తనయులు పురుజిత్తు రుక్మ

రుక్మేషువు – ప్రధువు – జ్యామఖుండగు
జ్యామఖు భార్య – శైబ్యయగునయా
వారికి సంతతి – లేకపోయెను
ఒకకన్యనాతడు బలిమిని తెచ్చెను

శైబ్య అంతట కోపించినది
తనపై ప్రేమ తగ్గెననుచును
పరుషముగా మాటాడిన యంత
నవ్వుచు పలికెను సవతి కాదని

కోడలుగా మరి తెచ్చితి నామెను
అనుచు జ్యామఖుడు సద్ది చెప్పెను
కొంత కాలముకు శైబ్య గర్భము
ఫలించి తనయునికి జన్మనిచ్చెను

ఆతనిపేరు విదర్భుండగు
పితృదేవతలు సంతసించిరి
తానుతెచ్చిన కన్యనంతట
విదర్భునికిడి పెండ్లి చేసెను

వారికి తనయులు ముగ్గురు రాజా!
కుశుడు – కృధుడు – రోమపాదుడు
రోమపాదునకు బభ్రువు సుతుడు
వానికి విభువు – కుమారుడగును

విభువు తనయుడు కృతి యగునయ్యా!
కృతికి తనూజుడు ఉశికుండగును
వానికి తనయుడు–చేది యగునయా
చైద్యాదులాతని సంతతి యగును

కృథునకు – కుంతి–కుంతికి–ధృష్టి
ధృష్టికి–నిర్వృతి–అతనికి–దశార్హుడు
వానికి–వ్యోముడు–తనూజులయ్యా!
వ్యోముని–సుతుడు–జీమూతుండగు

జీమూతు–తనయుడు–వికృతి–యగును
వికృతి–తనయుడు–భీమరథుండగు
వాని తనూజుడు–నవరథుండగు
అతని కుమారుడు–దశరథుడయ్యా!

దశరథు–సుతుడు–శకుని–యగునయ్యా!
శకుని–తనూజుడు–కుంతి–అగునయా
కుంతి – కుమారుడు – దేవరాతుడు
వాని – తనూజుడు – దేవక్షత్రుడు

దేవక్షత్రునికి – మధువు – సుతుండగు
వాని – తనూజుడు – కురువశుండగు
వాని – కుమారుడు–అనువు అగునయా
అనువు కుమారుడు – పురుహోత్రుండు

పురుహోత్రుని–సుతుడు–అంశువు–అగున
అంశువు–తనయుడు–సాత్వతుండు–అగు
వానికి – భజమానుండు–భజి–దివ్యుడు
వృష్ణి–దేవావృధనందక–మహాభోజుండు

భజమానునికి – పెద్దభార్యతో
నిమ్రోచి – కంకణ – వృష్టి – తనయుల
చిన్నభార్యతో – శతజిత్ సహస్రజిత్తులు
ఆయుతజిత్తు–అను ముగ్గురు తనయులు

దేవావృధునికి – కొడుకు – బభ్రువు
వారిద్దరిని – శ్లాఘించిరి పెద్దలు
యోగవేత్తలు – వారిద్దరును
వేలమందికి యోగము నేర్పిరి

పదునాల్గువేల అరువది ఐదుగురు
వారి యోగవిద్యతో మోక్షము నందిరి
మహాభోజుడు – అతిధర్మాత్ముడు
వాని వంశజులు – భోజులాయిరి

వృష్ణికి - ఇద్దరు - కుమారులయ్యా!
సుమిత్రుడు-మరి-యుధాజిత్తుడు
శిని అనమిత్రుడు - అనువారిద్దరు
యుధాజిత్తునకు తనూజులయ్యా!

అనమిత్రునికి-నిమ్నుడు-తనయుడు
అతని తనయులు సత్రాజిత్-ప్రసేనజిత్తులు
శిని - తనయుడు-సత్యకుడయ్యా!
సత్యకు-తనయుడు-సాత్యకి-అగును

ఆసాత్యకిని - యయుధానుడందురు
సాత్యకి-తనయుడు-జయుడు-అగునయా
జయుని-కుమారుడు-గుణి-అగునయ్యా!
గుణి-తనూజుడు-యుగంధరుండు

అనమిత్రునికి రెండవ కొడుకు
ప్రశ్నియగునయా! ఆతనిసంతతి
శ్వఫల్క-చిత్రకుడు-అనువారిద్దరు
కాళిందిని, శ్వఫల్కల-సుతులు-అక్రూరుడు

అసంగుండు-సారమేయుడు-మృదుకుండు
మృదపచ్ఛివుడు-వర్మదృక్కు-మరి-ధృష్టవర్ముడును
క్షత్రోపేక్షుడు-అరిమర్దనుడు-శత్రుఘ్నుడు-మరి
గంధమాదనుడు-ప్రతిబాహువు అను

పదిరెండుమంది తనయులు పుట్టిరి
ఆపై-సుచారువు-అనెడు-కూతురు
అక్రూరుని-తనయులు-దేవల-అనుపదేవులు
చిత్రరథునికి-తనయులు-అయిన

పృథు - విధూరథుండు-మొదలగువారు
వృష్ణి వంశమునకు చెందినవారు
అంధకునకు-మరి-భజమాన-కుకురు-
శుచి-కంబళబర్హిషుడు-అను నలుగురయా

కుకురుని-తనయుడు-వృష్ణి అగునయా
వాని సుతుండు - విలోమ తనయుడు
అతని - తనూజుడు - కపోతరోముడు
వాని కుమారుడు - అనువు-అగునయా

అనువు - తుంబురునికి-స్నేహితుడగును
అనువు-కుమారుడు-దుందుభి- అగును
వాని కుమారుడు - దవిద్యోతుడగు
దవిద్యోతునికి - పునర్వసు - కొడుకు

పునర్వసువునకు-సుతుడు-ఆహుకుడున్ను
ఆహుకి - అనెడి - కూతురు - కలిగిరి
ఆహుకు-తనయులు-దేవక-ఉగ్రసేనులు
దేవకుని-కంతట-నలుగురు తనయులు

దేవల-అనుపదేవ-సుదేవ-దేవవర్ధనులు
ఆపై - తనయలు - ఏడుమందయా
ధృతదేవ - శాంతదేవ - ఉపదేవలును
శ్రీదేవ - దేవరక్షిత - సహదేవ - దేవకి

కన్యలేడుగురిని - వసుదేవుండు -
భార్యలుగా మరి గ్రహించినాడు
ఉగ్రసేనునికి - కంసుడు-వ్యగ్రోధుడు -
సునామకుండు - గహ్వాండును

శంకుడు – సుభువు–రాష్ట్రపాలుడును
విసృష్టుండు – దుష్టిమంతుడు
అనెడి కొమరులు తొమ్మిదిమందియు,
ఆపై నలుగురు తనయలు కలిగిరి

ఆ తనయల పేరులు కంస–కంసవతి–
సురాభువు – మరి – రాష్ట్రపాలిక
వారు నలుగురు వసుదేవుని తమ్ముని
భార్యలాయిరి ఓ మహరాజా!

భజమానునికి – విధూరధుండు –
వానికి తనయుడు – శిని – అగునయ్యా!
శినికి – తనయుడు–భోజుడు – అగును
భోజుని–తనయుడు – హృదికుండగును

హృదికుని సుతులు దేవమీఢ శతధన్వ కృతవర్మలగు
దేవమీఢుని-మరియొక పేరు-శూరుడు-అగును
ఆశూరునికి–మారిషయను–ఇల్లాలునందున
వసుదేవ – దేవభాగ – దేవశ్రవుడును

అనకుడు–సృంజయుడు–శ్యామక–కంకులును
అనీకుడు–వత్సక–వృకులను తనయులు –
పృథ–శృతదేవ – శృతకీర్తి – శృతశ్రవస
రాజాధిదేవి – అను – తనయలు పుట్టిరి

॥శ్రీ కృష్ణచరితము॥

❊❊❊

## 10 వసుదేవుని చరిత్రము

వసుదేవుండు ఉద్భవించగా
దేవదుందుభులు మ్రోగె నింగిని
శ్రీహరి ఈతని పుత్రుడగునని
ఆకాశములో మ్రోగె దుందుభులు.

అందువల్లను – అనకదుందుభి
అనెడి పేరును – కలిగి యుండెను.
కుంతికి తనయులు లేకపోవుటచె
ఆతని మిత్రుడు శూరుడంతట

మిత్రుని కోరిక కాదనలేక
తన కూతురగు పృథను అంతట
కుంతి భోజునకు దత్తతయిచ్చెను.
దూర్వాసుండు వచ్చెను అతిధిగ

కుంతిసేవలకు మెచ్చిన మౌని
దివ్యమంత్రమును ఒసంగినాడు
ఇష్టదేవత – కోరినవెంటనె
ప్రత్యక్షమగు మంత్ర రాజమది.

పరీక్షించగా తలచిన కుంతి
ఏకాంతముగా కూర్చొనియుండి
సూర్యదేవుని తలంచి మదిలో
మంత్రోచ్చారణ చేసినయంత

వెంటనె ముందర భానుడు నిలువగ
తొట్రుపాటుతో భయమునిండి మరి
క్షమించమనుచు ప్రార్థన చేసెను.
మంత్ర పరీక్షకు తలచితి ననెను.

భయము వలదు నీ కన్యాత్వమునకు
భంగము కలుగదు-నా అనుగ్రహము
సద్యోగర్భము నందున - నీకు
విశేష బలుడగు తనయుడు కలుగును.

అనుచు పలికిన - సూర్యదేవుడు
కుంతీదేవిని అనుగ్రహించెను
రెండవ భానుడు - అన్నట్టువెలిగెడి
కొడుకును కన్నది కుంతీదేవి.

కన్యకు కొడుకన - లోకనిందయని
భయపడి - శిశువును పెట్టెలోనుంచి
గంగానదిలో విడచిపెట్టెను
అతడే కర్ణుడు - దానగుణాఢ్యుడు

కాలక్రమమున పరీక్షిత్ రాజా!
మీతాత యైన ఆ పాండుభూపతి
కుంతిభోజుని దత్తపుత్రికగు
కుంతిని తాను పరిణయమాడెను.

కుంతియందున పాండురాజుకు
ధర్మజ భీమార్జునులుదయించిరి
కుంతి చెల్లెలు - శ్రుతదేవ కంతట
దంతవక్త్రుడు పుట్టెను రాజా!

మునిశాపమున పుట్టిన యట్టి
దంతవక్త్రుడు రాక్షసుడాయెను
జయవిజయులలో ఆతడొకండు
శ్రుతదేవ చెల్లెలు - శ్రుతకీర్తియగు

ఆశ్రుతకీర్తిని కేకయరాజగు
దృష్టకేతుడు - పరిగ్రహించెను
ప్రతర్ధనాదులు అనెడి పేర్లుగల
కొడుకు లైదుగురు - ఆదంపతులకు.

రాజాధిదేవి - ఆమెసోదరి
జయత్సేనును - భార్యయైనది
విందుడు మరియు అనువిందుడును
తనయులిద్దరు ఆ దంపతులకు

రాజాధిదేవి సోదరియైన
శ్రుతశ్రవస తా చేదిభూపతి
అనుఘోషునికి - భార్యయైనది
ఆమెతనయుడు శిశుపాలుండు

వసుదేవు సోదరుల వంశక్రమమిది -
దేవభాగునికి - కంస - యందున
చిత్రకేతువు - బృహద్బలు లుదయించిరి
వసుదేవు తమ్ముడు దేవశ్రవుడు -

దేవశ్రవునికి కంసవతితొ మరి
వీరుడు - ఇషువంతుం డనెడి వారలు
ఇద్దరు తనయులు పుట్టిరి రాజా!
వసుదేవు అనుజుల వివరములివ్వి.

కంక యందున కంకుని కపుడు
బకుడును మరియు సత్యజిత్తుయు
పురజిత్తనెడి ముగ్గురుతనయులు
అనుచు శుకుడు తా చెప్పదొడంగెను.

సృంజయునకు మరి రాష్ట్రపాలితో
వృష–దుర్మర్షణులు ఉదయించిరయా!
శ్యామునకు మరి సురభూమి యందున
హరి, కేశ, హిరణ్యాక్షులు కలిగిరి రాజా!

మదిర యందున వసుదేవునకు
నంద–ఉపనంద–కృతకశ్రుత శూరాదులు
తనయులు పుట్టిరి ఆపైసంతతి
కౌసల్యయందున – కేశి పుట్టెను.

మిత్రకేశియను అచ్చరయందు
వత్సున కంతట వృకాదులనెడి
తనయులు పుట్టిరి విను మహరాజా!.
వృకుని సంతతి చెప్పెదవినుము.

రోచనయందు – హస్తహేమాంగాదులు
ఇళయందున – యదు ముఖ్యులగు
ఉరు – వల్కలాదులు ఉద్భవించిరి
ధృతదేవయందు, త్రిపృష్టందును.

దూర్వాక్షియందున–వృకుని కంతట
తక్ష, పుష్కర, సాళ్వాదులు పుట్టిరి
అనీకునికి – సుదామనితో
సుమిత్ర–అనక–బాణాదులు పుట్టిరి.

శాంతిదేవతో – ప్రశమ ప్రశ్రితాదులు
ఉపదేవయందు – కల్పవృష్ట్యాదులు
శ్రీదేవయందు వసుహంస, సుధన్వాదులు
దేవరక్షితయందు – గదాదులున్ను

అనకున కంతట కర్ణికయందున
ఋతధామ – జయులు ఉద్భవించిరి
వసుదేవునకు వివిధ భార్యలలొ
కలిగిన సంతతి విను మహరాజా!

సహదేవయందు – పురూధాదులు
దేవకియందు – కీర్తిమంతుడు
సుషేణ, భద్రసేన, ఋజువును
సమద, భద్ర, సంకర్షణులు

రోహిణియందు – వసుదేవునకు
బలుడు–గదుడు–సారణుందును –
దుర్మద, విపుల, ధ్రువ, కృతాదులు
తనయులు పుట్టిరి ఓమహరాజా!

అష్టమగర్భము నందు దేవకికి
దుష్టశిక్షణ – శిష్టరక్షణకు
శ్రీహరిపుట్టెను – కృష్ణునిగాను
జన్మతరించెను దేవకి దేవికి.

పౌరవి యందు – సుభద్రుడున్ను
భద్రబాహుడు, దుర్మదుండును
భద్రుడు, భూతాదులు అనువారు
పన్నెండుమంది జన్మించిరయా!

కృష్ణుని జననము ఐన తదుపరి
ఆడుబిడ్డ మరి పుట్టె దేవకికి –
సుభద్ర అనెడి – సుశీలపుట్టెను
కిరీటి భార్య నీకు అవ్వయగు.

ఆధర్మమ్మది ఎదుగునప్పుడు
హింస విహారులు నిండినప్పుడు
భూభారమును దించగలిగిన
దయామయుండు శ్రీహరి రాజా!

నరజన్మముతో నారాయణుడు
లోకులకావగ ఇడుములనందును
గర్భవాసమున - బందీ అగును
రత్నగర్భపై - జనన మందును

యజ్ఞయాగముల ధర్మకార్యముల
భక్తిపెంచును - తాను చేయుచు -
పాపపుణ్యముల - కర్త కాకను -
మాయానాటక మాడించునయా!

భారతయుద్ధము నెపమున భూమికి
భారము తీర్చిన - పరబ్రహ్మమే!
మనుజ లోకమున మోహినివలెను
గీతామృతమును పంచిపెట్టెను.

పాపపంకిలము క్షాళనచేసే
పరమపవిత్రము హరి గాధలివి
వినెడివారు మరి ధన్యులు రాజా!
ఎంతని పొగడుదు రమాకాంతుని!

జగములన్నియు కడుపునదాచి
దేవకి కడుపున పుట్టుటన్నది
ఆయన లీల - ఆలోచించుము
అంతుదొరకని ఆనందమిదు

తనుగా తాను నిర్ణయించుకొని
భూమిభారమును తక్కువచేసి
దుష్టులదునిమి శిష్టులబ్రోచి
పరంధామము చేరును తిరిగి.

చిరునగ వొలికే - ప్రసన్నవదనము
నీలనీరద శ్యామల దేహము
విశాలవక్షము శ్రీవత్సాంకము
శ్రీదేవికి మరి నెలవా ధామము

నిడుపగు కన్నులు - కోమలదేహము
పొడువగు కరములు - కౌస్తుభహారము
మకరకుండల మంగళశోభలు
మనసున - వెన్నెల కురిసేనామము.

తీర్చిన కస్తురి - అభయమునిడగా
శంఖ చక్రములు అమరియుండగా
పీతాంబరము వనమాలతొ మరి
మనసులనేలే - జగన్నాయకుడు.

భువనమోహనుడు భువిలోపుట్టి
మర్త్యుల బాధలు తీర్చగ నిలచి
మోక్షపథమునకు - త్రోవలుచూపి
తనలో స్థానమునిడునో రాజా!

కనులు మూసినా తిరిగి తెరచినా
నెమిలిపింఛముతొ - చిరునగవులతో
అభయముద్రతో - వేణువుదాల్చి
అగుపడు - కృష్ణుడు - తన భక్తులకు

కరుణారసము కన్నులవొలికే
కరివరదుని మరి మరువనీయదు
కనకచేలము కలిమికి నెలవు
కన్నులగాంచిన జన్మధన్యత

అంతటి హరినీ వామనమూర్తిగ
అందునట్టుగా నిలబడమనుచు
ఆర్తితొ పిలచిన - పరుగున వచ్చును
అడగని వారిది - ఆలశ్యమయా!

ఆగోపాలుడు - పాపులబ్రోవగ
అందరి మదిలో కొలువుతీరగా
అందుకోండని - నామమునిడెను.
అహర్నిశము మరి స్మరించవలెను.

అంధకారమును అంతముచేసి
అభిమాన వార్నిధిని - హృదిలోనిలపి
అనుగ్రహించగ - ఆగోపాలుని
అర్థించెదమో రాజా! ఇపుడు.

అనుచు శుకుడు - తా - పరీక్షిత్తునకు
భాగవతంబును చెప్పుచుండెనని
సూతుడు అచ్చటి శౌనకాదులకు
తెలియబరచెను ఆపైగాథను.

**శ్రీ కృష్ణచరితము - కర్ణపేయము**
**వ్యాసమౌనికే - శాంతినొసగినది**
**పోతనయ్యే - పులకించి పలికినది**
**భవ భయ హారిణి - భాగవతమ్ము॥**

**ఓం శాంతి - శాంతి - శాంతిః**





సర్వేజనాస్సుఖినోభవన్తు
లోకాస్సమస్తాస్సుఖినోభవన్తు





**సర్వం శ్రీ సీతారామచంద్ర పాదార్పణమస్తు**



(మకుటం)

శ్రీ కృష్ణచరితము - కర్ణపేయము
వ్యాసమౌనికే - శాంతినొసగినది
పోతనయ్య - పులకించి పలికినది
భవ భయ హారిణి - భాగవతమ్ము॥

# శ్రీమద్భాగవత - మకరందము
## (దశమస్కంధము)

## విషయ సూచిక

సర్గము పేజీ

## ఉత్తరార్ధము

శ్రీరామ

ఓం - నమో - వాసుదేవాయనమః

# శ్రీమద్భాగవత - మకరందము

## (దశమస్కంధపూర్వార్థము) శ్రీకారము

శ్రీహరి లీలలు విన మనసుపడి,
హరిపదములు తన మదిలో నిలిపి,
శుకయోగీంద్రుని మరిమరి స్తుతించి,
పరీక్షితుండను రాజు పలికెనిటు.

సంయమీంద్రుడా జ్ఞాననిధి వయా!
సూర్య చంద్రుల వంశ చరిత్ర
అందలి రాజుల పుణ్యజన్మలు
అతి విపులముగా వివరించితివి.

నారాయణుని లీలలు తెలుపుము
యదువంశములో నేల బుట్టెను
ఏవిధముగ తా సంచరించెను
ముదము గొలుపగా-వినిపించుమయా.

భవరోగములకు ఔషధమ్మయి,
వీనులవిందై - ముక్తి నొసంగే
హరికీర్తనము - చాలు నింకయను
మందమతి ఇల నుండదుగాదా!

కురు సంగ్రామపు ఘన సాగరమును
తాతలు-లీలగ-హరియను నౌకతొ,
అవలీలగ ఎటు దాటగలిగిరో -
తెలుపుము స్వామీ-జన్మతరించును.

కురుపాండవుల వంశాంకురమగు
నన్నుకావగా - మొర వినివచ్చి
చక్రాయుధమున - నను కాపాడి
తల్లి గర్భమును - ఫలింపజేసిన

మహానుభావుని దివ్య చరిత్ర
ఆలకింతును పులకరించగా
మాయామానుష విగ్రహుడాయన
విక్రమ లీలలు - తరగని నిధులు.

దేవకి కడుపున పుట్టిన బాలుడు
యశోద కొడుకై - పెరుగుట ఎట్లు?
వ్రేపల్లెకు తా నెట్లు వచ్చెను?
ఎటుల గడిపె నా వ్రజ బాలకులతొ.

మధురానగరిలొ ఎటుల చరించెను?
మేన మామయగు కంసుని చంపెన?
యాదవులతొ ఆ మహానుభావుడు
ఎన్ని వసంతము లందు గడిపెను.

మహితమూర్తికి - భార్యలెందరు?
తెలిసీ తెలియని - స్థితిలో నుంటిని,
నీ ముఖ కమలము నుండి వెలువడు
లీలామృతమును గ్రోలగ నిమ్ము.



అనుచు కోరిన రాజచంద్రునికి,
శుక మహాఋషి తా హరి లీలలను,
వినిచెను అనుచు-సూతుడు-అచటి
శౌనకాది మహఋషులకు చెప్పెను.

హరి యను రెండు అక్షరమ్ములు,
హరియించును గద పాతకమ్ములు,
సర్వజీవులు పవిత్రులగుదురు,
ఆ కథలను - నే వినిచెద - వినుమనె.

॥శ్రీ కృష్ణచరితము॥



# 1 వాసుదేవుని జన్మవృత్తాంతము

అసురుల బాధల కోర్వగలేక
భూదేవత - తా - గోవురూపమున
బ్రహ్మను చేరి శరణు వేడెను,
విలపించుచు - తన బాధలు చెప్పెను.

నారాయణుడు నేలకు దిగును,
దివియే భువిలో అవతరించును,
కావున మీరు - మీ మీఅంశల
యదు వంశములో ఉద్భవించుడు.

ఊరడించి ఆ - విరించి ఆమెతొ
సురనాథుని తో సురలందరితో
క్షీరసాగరము చేరి - అచ్చటి
జగన్నాథుని స్తోత్రము జేసెను.

భూ భారమును తీర్చుట కొరకై
వాసుదేవునిగ పుట్టును శ్రీహరి,
వేయితలలు గల అనంతుడంతట,
హరికి - అన్నగా - అవతరించును.

పురుష సూక్తమున పరంధాముని,
ప్రార్థన చేసిన బ్రహ్మ పలికెను -
ధ్యానము నున్న - తనకు వినబడిన
విషయము వారికి తెలియబరచెను.

హరిసేవలకై - దేవకాంతలు,
భువిలో పుట్టగ - సిద్ధము కావలె,
శ్రీహరి ఆజ్ఞతొ - మాయ - కూడను,
స్వామి అంశతో నేలకు దిగును.

ఆ విధముగను విరించి పలికి,
భూదేవిని అట ఊరడించెను,
సురలందరకు శలవును యిచ్చి,
సత్యలోకము తిరిగి చేరెను.

॥శ్రీ కృష్ణచరితము॥



# 2 శూరసేన చరిత్ర

మథురానగరము రాజధానిగా
శూరసేనము - మథురమ్ములను
శూరసేనుడు ఏలుచుండెను,
అతని తనయుడు - వసుదేవుండు

దేవకీదేవిని పరిణయమాడి,
వసుదేవుండు నవ వధువుతో తా
గృహమునకేగు సమయమునందు,
బావమరిదియే రథమునడిపెను.

ఉగ్రసేనుని - కుమారుడున్ను,
దేవకిదేవికి అన్నగారగు,
కంసుడు - రథమును తోలుచుండెను.
ఎన్నో కాన్కలు ఇచ్చిరి వధువుకు.

మంగళ స్వరములు-మ్రోగుచుండగా,
వధూవరులు అట రథము నుండగా,
వైభవమ్ముగా సాగె ప్రయాణము,
కంసుడు-రథమును తోలుచుండెను.

కొంతదూరము సాగిన వెనుక,
నింగినుండి అట పలుకులు వినబడె,
"కంసా! వీరికి పుట్టిన యట్టి,
అష్టమ గర్భము నిన్ను చంపును".

అదిరిపడెను ఆ కంసుడంతట,
ఆడపడుచును చంపగ నెంచెను
పాపకృత్యముల వెనుకడుగిడని,
దుష్టుని తలపు - తెలిసెను బావ.

అతి సౌమ్యముగా పలికె కంసునితో,
"శూరుల మన్నన పొందిన వాడవు,
చెల్లిని చేతుల చంపుట తగునా!
మంగళ మూర్తిని అంతము చేతువ.

పుట్టినవాడు గిట్టుట తథ్యము,
పుడమిని బ్రతుకు శాశ్వత మెవరికి,
తనువును వదలిన జీవి మరియొక
శరీరమ్మును ధరించు - నిజము.

స్వప్నమునందలి దేహము తనదని,
నిజముగ తానే అచ్చట గలనని,
భావించుకొని - అనుభవించినటు,
ఇలలో మనుజులు నిజము మరతురు.

సూర్యచంద్ర బింబమ్ములు - జలమున,
గాలికి - కదలెను అనెడి భ్రాంతిలా
మాయా మోహిత శరీరమ్ముల,
జీవుడు - జ్ఞానము వదలి - చరించును.

పసుపు కుంకుమతో - దీవించనగు,
చెల్లెలు నీకు - కూతురు సమము,
అట్టి - ఈమెను అంతము చేతువ,
పరలోకమును మరువకు మయ్యా!"

ఎన్నోవిధముల నచ్చ చెప్పినా,
మూర్ఖుడు వినక - చంపనెంచగా,
యోచనజేసి వసుదేవుండు,
భార్యరక్షణ కర్తవ్యంబని.

"కంసా! హింసను విడనాడుమయా!
ఈ కల్యాణిని మట్టు పెట్టకు,
ఈమెకు పుట్టిన సంతానమును,
నీకు – స్వయముగా అప్పగింతుననె".

ఆ మాటలకు తృప్తినందిన,
కంసుడు చెల్లెలి కొప్పును వదిలెను,
వధూవరులు తమ గృహమును జేరి,
సంతోషముగా గడుపు చుండిరి

సురల తేజమే – ఆకృతి గొన్నటు,
ఎనిమిదిమంది మగశిశువులను,
దేవకి గన్నది – ఆపై – ఆమె,
ఆడశిశువును ప్రసవించినది.

పుట్టిన వెంటనె మొదటి కొడుకును
వసుదేవుడు తా కంసునికిచ్చెను,
కన్న బిడ్డనే కత్తి కొసంగిన,
ధీరుడు ఇలలో – అతడే రాజా!

ధైర్యవంతుడు జంకడెన్నడు
పిరికి – చేయని తప్పే వుండదు,
పసికందుని – తన కందించిన – ఆ
సత్యవర్తితో – పలికె కంసుడు.

"అష్టమ గర్భము – ఆపద కావున,
వీనిని – నీవే గొని పొమ్మయ్యా"!
అనగా – తండ్రి – బాలుని గైకొనె,
మదిలో మాత్రము దిగులు వదలదు.

॥శ్రీ కృష్ణచరితము॥



## 3 యాదవుల జన్మవృత్తాంతము

ఒక దినమున – ఆ – నారదమౌని,
కంసుని వద్దకు వచ్చి చెప్పెను,
"నందాదులును – వారిభార్యలు,
వసుదేవుడును – దేవకిదేవి.

యాదవులందరు దేవతలయ్యా,
నీవూ – నీతో నున్న స్నేహితులు
రాక్షసులందరు – కావున చంపగ
విష్ణువు – దేవకి – కొడుకై పుట్టును"

విషయము చెప్పి సాగెను మౌని,
విష్ణువుచేత తృంచ బడిన,
కాలనేమియను – దనుజుడు–తానని,
తెలిసిన కంసుడు తల్లడిల్లెను.

విష్ణువైరము పెరిగి పోయినది,
బావను – చెల్లిని – చెరలో నుంచెను,
పసికందులగు వారి పిల్లలను,
నిర్దాక్షిణ్యము – నిండి – చంపెను.

జాలినివీడి – తండ్రిని కూడా
చెరలో నుంచెను దుష్టుడాతడు
రాజులు – మనుగడ పరమార్ధమని,
హితులను, బంధుల చంపుకొందురు.

శూరసేన దేశమ్ముల – కంసుడు,
ఏలసాగెను – విచ్చలవిడిగా,
రాక్షసరాజుల అండ చూసుకొని,
యదుకులమ్ముపై పోరుకు సాగెను.

ప్రలంబకుండు, చాణూరుడును,
తృణావర్తుడు – ముష్టికుడున్ను,
అరిష్టుడు మరి ద్వివిదుడు – పూతన,
మొదలగు వారు కంసుని కండ.

బాణుడు మరియు మాగధుండను,
రాక్షసరాజులు ఆతని తోడై,
కురు, పాంచాల, కేకయ, విదర్భ,
దేశమ్ములను ఆక్రమించెను.

కొన్ని దినములకు దేవకిదేవి,
గర్భము దాల్చెను – పుణ్యవశమున,
వైష్ణవీయమగు అనంతు తేజము,
ఆమెగర్భమున కుదురు కున్నది.

యోగమాయను పిలచెను – విష్ణువు,
అనంతుతేజము తీసుకువెళ్ళి,
వ్రేపల్లెలోగల – రోహిణి కడుపున,
ఉంచగ చెప్పెను – సరియనె నామె.

గర్భ రక్షణ పొందుటవలన,
రోహిణి కొడుకు – సంకర్షణుడగు,
మనసులు రమింప జేయు వాడయి,
రామునిగాను – పేరునందును.

తిరిగి పలికెను జగన్నాథుడు,
"దేవకి దేవికి – నే జన్మింతును,
నీవు యశోదకు బిడ్డవుకమ్ము,
నరులపూజలు – అందుకొందువు.

భద్రకాళి యని – దుర్గయనుచును,
విజయా, వైష్ణవి, కుముద – చండిక,
కృష్ణ, మాధవి – శారద, అంబిక,
కన్యక –నారాయణిగా బిలుతురు.

అతిబలవంతుడు అగుటచేతను,
బలభద్రునిగా మరియొక పేరతో
అనంతు తేజము – రోహిణి కడుపున,
ఫలించి – ఇలలో అవతరించును".

ఆనతినంది – దేవమాయ అట,
దేవకి దేవి గర్భతేజమును,
తీసుకు వెళ్ళెను – అంతట – అచట
దేవకి గర్భము చెడెనని – తలచిరి.

దుష్టశిక్షణ – శిష్ట రక్షణకు,
భూభారమ్మును, తీర్చుట కొరకు,
విష్ణువు – తనదగు అంశతొ నంతట,
వసుదేవుని – తా ననుగ్రహించెను.

దివ్యతేజముతొ వసుదేవుండు
రెండవ సూర్యుడు అన్నటు తోచెను,
అంతటి తేజము భర్తవల్లను,
పొందిన దేవకి – జన్మ తరించెను.

చందమామను ధరించినట్టి,
తూర్పు దిక్కు వలె – వెలగసాగెను,
జగన్నాథుని – అంశతొ నున్నను,
ఆమె వదనమున – విషాదమున్నది.

మూర్ధునియందు నెలకొను విద్యగ,
ఘటము నందలి అగ్ని తీరుగా,
చెరలో నున్న - దేవకి దేవి.
అనిపించినది ఆ సమయములో.

॥శ్రీ కృష్ణచరితము॥

❋❋❋

## 4 చెల్లెలి తేజస్సు చూచి కంసుని ఆశ్చర్యము

చందమామలా వెలిగెడి మోముతొ
కాంతులు చిమ్మె శరీరమ్ముతో,
చెరసాలంతయు ధగధగ మెరిసే,
తేజము గలిగిన చెల్లిని గాంచి.

మదిలో తలచెను కంసుడు అపుడు,
ఇంతటి తేజము కలిగి యుండుట,
నిజముగ హరిని మోయుట వలనే,
ఈ చూలింతను చంపుట ఎట్లు.

ఆదరించదగు ఆడపడుచును,
అంతము చేసిన అపకీర్తి యగు,
అంతటి అఘము చేసిన నాకు,
నరకలోకమ్మే సంప్రాప్తించును.

అని మది నెంచి - చెల్లిని వదిలి,
భువిపై పడెడి - శిశువు కోసమై,
పుట్టినంతనే - చంపుటకొరకై,
వేచి యుండెను - శ్రీహరి తలపుతొ

దేవకి గర్భము నందు పెరిగెడి,
దివ్యశిశువును దర్శించుకొని,
విరించి, శివుడు, నారద మౌని
సురలంద రిటు - స్తొత్రము జేసిరి.

॥శ్రీ కృష్ణచరితము॥

❋❋❋

## 5 నారదాదిమునుల స్తోత్రము

"సత్యవ్రతుడవు - సర్వేశ్వరుడవు
సృష్టి స్థితి లయ మందు స్థిరుడవు,
పరమ పదంబును చేరుట కనువగు,
సాధనమైన మహానుభావా!

పంచభూతముల పుట్టుక నెలవు,
అవి - క్షరమయినను - నీవక్షరుడవు,
సమదర్శియగు - దివ్యస్వరూపా!
నినుశరణంచు వేడుచుంటిమి.

ప్రకృతి – పాదుగ నెలకొని యుండి,
సుఖదుఃఖములు–రెండు ఫలములయి
త్రిగుణమ్ములవి – వ్రేళ్ళుగ నుండి,
పురుషార్థములు – నాలుగు రసములు.

పంచేంద్రియములు – ఐదుగ నిలిచి,
ఆత్మ స్వభావము ఆరుగ నుండి,
ఏడు ధాతువులు పై పొరలుగను,
పంచభూతములు–బుద్ధియు–మనసు.

అహంకారము అనునవి ఎనిమిది,
కొమ్మలుగాను విలసిల్లగను,
నవరంధ్రములను – తొర్రలు గలిగి,
పదిప్రాణములు – పత్రమ్ములయి,

జీవేశ్వరులను – రెండు పక్షులతొ,
సంసారంబను – భూరి తరువును,
నెలకొన జేసి – పెంచి – చివరకు
త్రెంచగ చాలిన – ప్రభుడవు నేవే!

నిన్ను తెలియక అనేక మంది,
అనేక విధముల చెప్పుచుందురు,
తెలిసిన జ్ఞానులు – విష్ణువు నీవని,
స్థిరమతులై – నిను కీర్తనచేతురు.

దుష్టశిక్షణ – శిష్టరక్షణకు,
వివిధ రూపములు ధరించు చుందువు,
చరాచరములకు శ్రేయము నిడెదవు,
నిన్ను తెలియుటది తేలిక గాదు.

నీపద నౌకను ఆశ్రయించుకొని,
భవ సాగరమును, అవలీలగను,
గోవుపాదమును వేసిన రీతిగ,
దాటగలుగుదురు కొందరు మాత్రము.

భయమును వీడి – బుద్ధిని నిలపి,
నిన్ను స్మరించిన చేరుట నిన్ను –
ఆశ్రమధర్మములందున – నిన్ను
సేవించుటకగు సత్త్వమూర్తివి.

సత్త్వరూపమున ఆరాధించిన,
అనుగ్రహింతువు ఓ నారాయణ!
నిను ధ్యానించి – కీర్తన చేసిన,
ఈతి బాధలు వుండవు కాదా!

నీపదస్పర్శతొ ఈ భువియంత
పునీతురాలై పరవశించెను,
నీ అవతారము అసురులదునిమి,
భూభారమ్మును తీర్చి వేయుగద –

పుట్టుకలేని అభవుడవీవు,
పుట్టుట–పెరుగుట–మొదలగు దశలు,
మాయతొ నిండిన జీవులకే మరి,
నీకు ఎటుల అవి సంభవించును?

మత్స్య, కూర్మ, వరాహ, నరసింహ
వామన – అవతారమ్ముల నెత్తి
లోకులగాచిన – కారుణ్యాలయ,
భూభారమ్మును తీర్చుము స్వామీ!

యదువంశపావకా-దయ చేయుమయా!
గర్భమునుండి ఉదయించవయా!
అనుచు - స్తోత్రము చేసి - దేవకికి,
విషయము తెలిపిరి ఆనందముగా

"తల్లీ - నీవిక తల్లడిల్లకుము
కంసుని వలన - కీడు కలగదు,
మేమందరము భయము వదిలితిమి",
అనుచు పలికి - వారందరు వెడలిరి.

॥శ్రీ కృష్ణచరితము॥



## 6 శ్రీకృష్ణ జననం

భవబంధములు - త్రెంపగ జాలి,
భువనమ్ములను బొజ్జను దాచిన,
భగవంతుడు తన భక్తులకొరకై
బందీ అయ్యెను, గర్భవాసమున.

పురిటి నొప్పులు పెరిగె - దేవకికి,
పుణ్యమూర్తికి - జన్మ తరించెను,
పుణ్యఘడియలో - పరంధాముడు,
ప్రసన్నుడై - ఉదయించె నప్పుడు.

సప్తసంద్రములు - నిర్మల జలముల,
ఆనందముతో - పొంగె నొక్కపరి,
పర్జన్యుడు - తన సంతోషమును,
తెలియ పరచెను - మధుర గర్జనతొ.

గ్రహములు, తారలు, వెలుగులుచిమ్మెను,
దిక్కులు వెలిగెను, దివ్య తేజమున,
సుమ గంధములో - హాయిని గలిపి
వాయువు - చల్లగ - సందడి చేసెను.

హంసలతో నట జలములు శోభిలె
నిశ్చలముగ - హోమాగ్నులెగసెను,
తేటనీటితో నదులు పరుగిడె,
శుక పిక రవములు శుభముగ వినబడె.

ఫలభారముతో - తరువులు వంగెను,
జలభారముతో - మేఘము కదిలెను,
పండుగ సందడి నిండినదంతట,
పరవశమ్ముతో - ప్రకృతి నవ్వెను.

నింగి కురిసెను పూలజల్లులు,
పొంగి పోయెను ప్రతిహృదయమ్ము
శ్రావణమాసపు కృష్ణపక్షము
కారుచీకటిని - కాంతి పుంజము.

కంసుని హృదిలో పిడుగుల సవ్వడి,
రోహిణి తారలొ కృష్ణ జననము,
మేనమామకు - రోహిణి గండము,
మానవాళి కది మధురా నందము.

దేవదుందుభులు మ్రోగె నింగిని,
అచ్చర కన్యలు నాట్యము చేసిరి,
తూరుపు దిక్కున - పూర్ణ శశివలె,
దేవకి గన్నది - దివ్య బాలుని.

విచ్చిన తామర లన్నటు - కన్నులు,
చతుర్భుజములలో ఆయుధాలతో,
శ్రీవత్సమ్మను పుట్టు మచ్చతో
మెడలో - కౌస్తుభమణిహారముతో.

పీతాంబరము నల్లనిమేను,
ధగధగ మెరిసే మకుట శోభతో,
జ్వలించు - అగ్నిగ - కుండలాలతో,
మువ్వలతాడు - భుజకీర్తులతో.

మనస్తాపము హరించిపోయెను,
ఆనందాబ్ధిని - ఓలలాడెను
పదివేల గోవులను - మదిలోనే - తను,
విప్రుల కిడినటు సంకల్పించెను.

ముందుకనబడు - ముకుందు గాంచి
దివ్యబాలకుని మరిమరి జూచి,
జన్మనెత్తిన ఫలము దక్కెనని,
తన్మయత్వమున మునిగెను తండ్రి.

వేయి సూర్యులుదయించి నట్టుగా,
కనబడు బాలుని గాంచి - ముదమున,
పొంగిన గుండెతొ - కరములు ముడిచి,
ఈ విధముగను స్తోత్రము చేసెను.

॥శ్రీ కృష్ణచరితము॥



## 7 వసుదేవుడు స్తుతించుట

"మాయను గెలిచిన పురుషోత్తముడవు,
దేవా - నీవు స్థిరుడవు జగతిని,
స్వతంత్రుడవు-నువు-తేజోమూర్తివి,
నీకు తండ్రినై సద్గతి నందితి.

కనబడు సృష్టిని! చేసెద వీవే!
పెంచి తృంచుటలు - నీకే తెలియును.
పంచభూతములు - నీకనుసన్నలొ
నిరంతరమ్ము చరించు చుండును.

త్రిగుణాత్మకమగు మాయాజగతిని,
నీవున్నటుల కనబడు చుందువు,
నిజముగ నీవు అందు ఉండక,
వేరుగ నుండి - ఆడించెదవు.

దుష్టశిక్షణకు అవతరించిన
అక్షరమూర్తీ - వందనమిదగో!
ఆకాశవాణి మాటలు వినిన
కంసుని హింస పెరిగి పోయినది.

సర్వజీవుల ఆత్మగనుందువు,
ఏదీకోరని - అవ్యయుడవయా!
నిన్ను తెలియక అజ్ఞానములో,
నీవు - వేరని తలంచు చుందురు.

నీఅన్నలను మట్టు పెట్టెను,
మాబ్రతుకుల నిటు బందీ చేసెను,
కంటికి కునుకే మరచితిమయ్యా!
తినుటకు అసలే తోచదు స్వామీ!

నీ వుదయించిన విషయము తెలిసి,
ఆ శిశుహంత - వచ్చుట తథ్యము,
నిరతము నిన్ను స్మరించు కొనుచు
నిద్రాహారములు - మరచెను కంసుడు'

వసుదేవుడటు పలుకుచుండగా,
శంఖచక్రముల - చతుర్భుజుని గని,
మదిలో - కంసుని చింత మెదిలినను,
ముదమున - దేవకి స్తుతించెనిటుల.

 ॥శ్రీ కృష్ణచరితము॥

## 8 దేవకీదేవి స్తుతించుట

"ఇదియది యని -వివరించగరాని
వేదమ్ములు - మరి చెప్పగ, లేని
విశ్వవ్యాప్తమై - విస్తరించిన,
ఆదినుండి గల - రూపమునీది.

త్రికరణ శుద్ధిగ - త్రికాలమ్ముల,
నిన్ను స్మరించిన భయములు తొలగి,
శాశ్వతమైన - పరమ పదమును,
అందుకొనుటది నిశ్చయమ్ముగద!

త్రిగుణమ్ములకు తాను మూలమై,
శబ్దస్పర్శలకు అతీతమైనది
క్రియలకు అందని - మాటలకందని,
అధ్యాత్మదీపము - నీరూపమయా!

మహా యోగులు - యోగ మార్గమున,
నిన్ను గనుటది - జరుగునొ - ఏమో -
పూర్వ పుణ్య ఫల - విశేషమ్ముచే,
నిన్నుగంటిని - ధన్యనైతిని

ప్రళయ కాలమున విశ్వమంతయు,
నీయందుననే లయించిపోగా,
అక్షరుడవు - నువు ప్రకాశింతువు,
మూలవిరాట్టువు - విరాడ్రూపుడవు.

చర్మచక్షువుల నీ రూపమును,
చూడగలుగుట సాధ్యముగాదు,
వాసుదేవ - నిను ప్రార్థన జేతును,
సాధారణమగు రూపముదాల్చుము.

విశ్వము త్రిప్పే - విద్య నేర్చితివి,
జగన్నాటక - సూత్రధారుడవు,
నీ తోబుట్టువు - మాయ - జగతిని,
ఆవరించుట - నీ లీల గదా!

కుక్షి నజాండము నిల్పిన నీవు,
నాకడుపున - జన్మించుట ధన్యత,
కడలి యంతటి సౌభాగ్యమది -
తల్లిని - తరింప చేసిన తనయుడ.

నాకడుపున నువుజన్మింతువని
కంసుడు తెలిసి - కష్టపెట్టుట
నుడువగ లేను - ఓ నారాయణ!
మము కాపాడెడి - దైవమునీవే"!

 ॥శ్రీ కృష్ణచరితము॥

## 9 దేవకీ-వసుదేవుల పూర్వజన్మవృత్తాంతము

నారాయణుడు తల్లిని గాంచి,
ఈవిధముగను పలుకు చుండెను.
"స్వాయంభువ మన్వంతరమందున,
పృశ్ని – అనెడి ఒక పతివ్రతవు-నువు.

పుణ్యమూర్తియగు – ఈ వసుదేవుడు,
సుతపుడనెడి – ఒక ప్రజాపతియగు,
మీరిరువురును బ్రహ్మ ఆనతిని,
ఘోరతపంబును ఆచరించిరి.

పదిరెండువేల వత్సరమ్ములు
మీరొనరించిన తపసుకు మెచ్చి,
ఈ రూపమున దర్శన మిడితిని,
వరము కోరమని అడిగితి-నాడు.

అసాధ్యమైన మోక్షమునడుగక,
నా – మాయకు మరి లొంగిన మీరు,
నన్ను బోలెడి కొడుకునడిగిరి,
పుత్రమోహమున బందీలయ్యిరి.

అంతట – నేను – పృశ్నిగర్భునిగ,
శుభ లక్షణముల పుట్టితి మీకు,
మరు జన్మలొ మరి మీరిరువురును
అదితి – కశ్యపుల – జన్మనెత్తిరి.

కురుచరూపుతో వామన మూర్తిగ,
మీగర్భమున జన్మించితిని,
ఇంద్రుని తమ్ముడనైతిని – గావున,
ఉపేంద్రునిగను వెలసితి – నాడు.

ఈ జన్మలొ మరి మీకు పుట్టితి,
జన్మరాహితి కలిగించితిని,
పూర్వజన్మస్మృతి – కలిగించుటకై,
ఈరూపమున దర్శన మిడితిని.

నాకికపై – నరజన్మ ఉండదు
కంసునివల్ల కీడు కలుగునని,
భయము వీడుడు – ఇపుడే – తండ్రీ!
వ్రేపల్లెకు నను శీఘ్రమె గొనిపో –

అచ్చట –యశోద – ఆడ బిడ్డను
ప్రసవించినది – నాదగు మాయతొ
నన్నా తల్లి చెంతకు – జేర్చుము,
ఆశిశువును ఇట జేర్చుము తండ్రీ –

తలుపులు తెరచుకు త్రోవనిచ్చును,
అసాధ్యమైన యమున – దారినిడు",
అనుచు పలికి-తన మాయతొ నంత,
సాధారణమగు శిశువై కనబడె.

వసుదేవుడు – ఆ బాలుని గైకొనె –
తలుపులు తెరచుకు త్రోవ నిచ్చినవి,
ఒక్కొక్క ద్వారము దాటగ నంత,
శేషుడు – తిరిగి – తాళము లేసెను.

ఆదిశేషుడు దివ్య పడగలతొ,
మెరసే ఛత్రము అన్నటునిలబడ,
మెల్లగ సాగెను వసుదేవుండు,
ఘనమగు యమున చెంత చేరెను.

రామచంద్రుని పాదపద్మములు
శిరమున దాల్చగ – త్రోవనిచ్చిన,
జలనిధి భంగి – పొంగెడి యమున
గుండియ పొంగి – మార్గము నిడెను.

పుణ్యమూర్తి – తను భవసాగరమును,
దాటినట్టుగా యమునను దాటి,
గాఢనిద్రలో మునిగిన యట్టి,
వ్రేపల్లెకు వసుదేవుడు చేరెను.

మంగళకరముగ – మెరిసే మోముతొ
నిద్రలొ నున్న యశోదప్రక్కన,
బాలుని వుంచి – ఆడ శివువగు,
యోగమాయను – గ్రహించినాడు.

కన్నయ్యను అట మరిమరి జూచి,
కనుల బాష్పములు నిండిపోవగా,
దుఃఖ సంద్రమును దిగమ్రింగుకొని,
శిశువును హత్తుకు బయలుదేరెను.

మెల్లగ వచ్చి చెరసాలలొ గల
దేవకి ప్రక్కన – శిశువు నుంచెను,
తిరిగి – సంకెలలు బిగుసుకున్నవి,
జగము చీకటై – తోచెను వారికి.

మాయ కమ్మిన వ్రేపల్లెలొ – అట,
గాఢనిద్రలో మునిగిన యశోద,
కొడుకును గన్నదొ–కూతురునో–మరి,
తెలియని స్థితిలో నున్నది–నాడు–

అంతటి లోన అచ్చటి బాలిక,
కెవ్వన – రోదన ఆరంభించెను,
కావలి వారి గుండెలపైన,
చరచినట్టుగా నున్నది ఏడ్పు.

ఉలిక్కిపడి వారందరు లేచి,
బీగమ్ములను చూచి – తృప్తిపడి,
పరుగున పోయి – రాజును గాంచి,
విషయము చెప్పిరి – వణకుచు నపుడు.

నిద్ర మరచిన కంసుని మనసుకు,
చురుక్కు మన్నటు – తగిలెను వార్త,
గభీలుమని – ఆ – పాన్పునుండి పడె,
అడుగులు తడబడ పరుగిడినాడు.

చెరసాల చేరెను కరవాలముతో
అన్నను గాంచి దేవకిదేవి,
అడ్డుపడినది బ్రతిమాలినది,
అల్లుడుగాదనె – ఆడ శిశువనె.

మేనకోడలు – రక్షించు మయా,
ఆడుబిడ్డను చంపుట తగదు,
తేజో మూర్తులు – మగ బిడ్డలను,
నిర్దయతో నువు – వధించినావు.

అన్నా – వదలుము – ఈ పసికందును,
నీకాపద – మరి – కొడుకు వల్లగద
ఆడనలుసును కాపాడవయా,
నా కోరిక మన్నించుము రాజా!

కంటిధారతో కరుగునట్టుగా,
వలవలనేడ్చి ప్రార్థించినది,
పాషాణము ఆ కంసుని గుండె -
నీచుడు - చెల్లిని త్రోసి వేసెను.

అప్ప రావురను పులి - తన కగపడు,
లేడి కూనను వదలనట్టుగా,
ఆ పసికూనను - బలముగ లాగి,
బండకు విసరి - కత్తినిదూసెను.

ఆశ్చర్యముగా - ఆ పసికందు,
నేలను పడక - నింగి కెగిరెను
దివ్యమాలలతో - శంఖ చక్రముల
అష్టభుజములతొ అవతరించినది.

చెంతనె - సుర గంధర్వులు నిలచి,
కానుక లిచ్చి - స్తోత్రము చేయగ,
నింగిని నిలచిన - దివ్యమూర్తి - తా
గంభీరముగ పలికినదపుడు.

"కంసా! నను - నువు చంపగ లేవు,
పసి పిల్లలను చంపిన దుష్టుడ -
నిన్ను చంపెడి తేజోవంతుడు,
పుట్టెనురా - నువు - తెలివిగ బ్రతుకు.

ఈ దంపతులను విడచిపెట్టుము",
అనుచు పలికి - ఆ భువనేశ్వరి - తా
దివ్యనామముల దివ్యరూపముల
ఇలలో పూజలనందగ వెలసెను -

దిక్కుతోచక నిలచెను కంసుడు,
భయ సంభ్రమముల స్థాణువయ్యెను,
కొంతసేపటికి తెలివి తెచ్చుకొని,
ఆ దంపతులను జూచి పలికెను.

"మహాపాపిని - శిశుహంతను - నే
బ్రహ్మ హత్యను మించిన పాపము
మీ బిడ్డలను చంపి - పొందితి,
క్షమించమని - మిము వేడుచుంటిని.

ఆకాశ వాణి - పలుకులు వింటిని,
అప్పటినుండి - ఘోరములెన్నో
ఆచరించిన దుష్టుడ నేను,
ఆదరించుడు - శాంతి వహించి.

కర్మలబట్టి జీవులు ఇలలో
రూపులు దాల్చి - కర్మఫలములను,
అనుభవించుచు - సమాప్తి కాగనె
ఎవరి త్రోవన - వారు సాగెదరు.

నేను చంపుట - వారు చచ్చుట,
కర్మవిహితమగుచేష్టలు - గానీ,
అందుకొరకు - నే - నింద పొందుట,
తప్పా - కాదా - తెలుపుము బావా"!

అనుచు వారికి వందనమ్ములిడి,
స్వయముగ-బంధవిముక్తుల చేయగ -
పశ్చాత్తప్తుడు అయిన కంసునితొ,
సౌమ్యముగా - వసుదేవుడు పలికెను.

"నీదు పలుకులు సత్యము బావా!
కామ క్రోధముల చిక్కిన మనుజులు,
నీవు - నేనను - తలపుతొ నుందురు,
తిట్టుకొందురు - చంపుకొందురు.

అందరిలోనూ - దైవము కలడని,
తెలియగ లేరు! అనుచు పలికెను",
అంతట కంసుడు వారిని విడచి,
మరలి పోయెను రాచనగరికి.

ఎటులో గడిపెను మిగిలిన రాత్రి,
తెల్లవారగనె - మంత్రుల పిలచెను,
యోగమాయ అట నింగిని పలికిన
విషయము తెలిపి - మార్గము కోరెను.

వెంటనె - మంత్రులు సలహా నిడిరి,
పల్లెల, ఇండ్ల సందుల, గొందుల
తోటల, తోపుల తీరుగ వెదకి,
కనపడు శిశువుల నంతము చేయుట.

"ఆనతి నిడుడు - కంసమహాప్రభు!
మీ భయమున మరి-దాగిన సురలు,
హరి-హర-విరించి పదముల బడిరో
తీరుగ నిపుడే విచారించదగు.

పగతురు - పరుగిడినారని మనము
ఉదాసీనులము కారాదు - సుమా!
వారు-అంతము అగు వరకును-మరి,
వారిని మరచుట మంచిది గాదు.

రోగమ్ములను - రిపు జనములను,
ఇంద్రియాలను-సమయము జూచి,
ప్రబలనీయక - లొంగదీయవలె,
ఉదాసీనత, అనర్థ మగును!

దేవతలలొ మరి - విష్ణువు ముఖ్యుడు,
వారందరికీ నాయకుడగును,
గోబ్రాహ్మణులు - శాంతీ - కరుణ -
యజ్ఞయాగములు - వానికి నెలవు.

కావున ఇపుడే - వాటన్నిటినీ,
ధ్వంసము చేసిన - అణగునువాడు
ఆనతి నిడినచొ - మునులను జంపి,
హోమ ధూమముల నార్పివేతుము.

వేదమ్ములను - బూడిదచేతుము,
మునుల గొంతులు-కొరికి వేతుము,
భూమిని చీల్చి - పొడిపొడి చేతుము,
ఆనతినిమ్ము సందేహించకు".

అనుచు ప్రగల్భములాడెడి సచివుల
కాజ్ఞల నిడెను - మృత్యువు కోరి,
సాధు హింసకు తరలిరివారు,
అంతఃపురమున కేగెను రాజు.

వ్రేపల్లె - అట - శ్రీపల్లెగనయి,
కోలాహలముతొ నిండిపోయెను,
నందుని మది - ఆనందమునిండి
యమునను మించి పొంగిపోయెను.

పుత్రోదయము తొ - శుభోదయమయి.
వేదవేత్తలను - విప్రోత్తములను
రావించి మరి శాస్త్రోక్తముగ
శాంతి క్రియలను చేయగ కోరెను.

జాతకర్మలను శ్రద్ధగ జరిపి
పితృదేవతల పూజలొనర్చెను
రెండు లక్షల - పాడి గోవులను,
వత్సమ్ములతో దానము చేసెను.

దానము లంది - వేద విదులట.
శ్రీమంతుడయి - శుభములనిడునని,
మంగళ కరముగ - దివ్య శిశువునకు,
ఆశీస్సులనిడి - ధన్యతనందిరి.

ఆటపాటల - ఆనందముతో
క్రొత్త అందములు విరిసెను పల్లెలొ
ఆమని శోభలు సంతరించుకొని,
పరవశించినది ప్రకృతియంతయు.

పశు సంపదను అలంకరించిరి,
గోపాలుడు ఇక పాలించునని,
తెలిసెను వాటికి-మురిసి పోయినవి,
పొదుగులు నిండి-నడక మందమయె.

మామిడాకుల తోరణాలతో,
అగరు ధూపములు - మంగళనాదము.
ఆటపాటల ఆనందముతో
వ్రేపల్లెతోచెను అమరావతిలా.

ఆర్తులందరికి యోగ్యులందరికి,
నందుదు - దండిగ దానము లిడెను.
ప్రతి హృదిలోను నారాయణుడై -
ప్రతిగృహమందు పుత్రోదయమయె.

విలువగు వలువల - అలంకారముల
పెద్దలందరూ కానుకలు తీసుకు
నంద నందనుని చూడగ వచ్చిరి.
వసంత వేడుక జరిగె నచ్చట.

నందుని రాణి యశోదమ్మకు,
నోచిన నోముల - ఫలము లభించెను.
వంశోద్ధారకు డుద్భవించెను.
చూతము రండని - వచ్చిరి స్త్రీలు.

మంగళకరముగ అలంకరించుకు,
విశేషమైన - బహుమానములతొ
యశోదా ఆనంద వర్ధనుని,
చూడగ వచ్చిరి ముదమున వారు.

పట్టుచీరలు ఆభరణమ్ముల
సన్నని నడుములు - సొగసగు నడకల
సిరిగల మోములు - పూలదండల
గోపకాంతలు చూడగ వచ్చిరి.

ఎన్నో విలువగు కానుకల నపుడు,
యశోద కిచ్చి-శిశువును గాంచి,
తనివి తీరక - మరి మరి జూచి
రూపము - కన్నుల దాచుకు వెడలిరి.

సుగంధతైలము - మేనుకు పూసి
పసుపునురాసి - గోపకాంతలు,
శిశువుకు - జలకము లాడించి-మరి
హరియే రక్షయని - నీటిని త్రిప్పిరి.

ఆనందముగా జోలలు పాడి.
జగన్నాథుని నిద్ర పుచ్చిరి.
నిర్నిద్రుడు - అట నిద్ర నటించుట.
లీలని తెలియదు - వారెవ్వరికి

నందుడు-ఆ-శుభ సమయములోన
రోహిణి దేవిని సంతోషముగా
పసుపు కుంకుమలు పట్టు వస్త్రములు
ఆభరణమ్ముల సత్కరించెను.

క్షీరసాగరము తరలి వచ్చినటు
పాలు నిండెను - పల్లె నిండుగా
పచ్చిక బీళ్ళు - పరవశమిడగా
పశు సంపద-తా-గెంతెను ముదమున.

పాలు మీగడలు, నేయి, వెన్నలు,
నిండిన కుండలు నవ్వెను - కిలకిల
సర్వ సమృద్ధము - మంగళకరమై.
ఆవ్రజపురము - పలుకరించినది.

నందు డంతట కార్యార్థమయి
కంసుని కిచ్చెడి కప్పము తీసుకు
మధురానగరికి బయలు దేరెను
పల్లెకు - గట్టిగ రక్షణ నుంచెను.

రాచకార్యము పూర్తి జేసుకొని
వసుదేవుని - తా - చూడగ వెడలెను.
నందుని గాంచిన వసుదేవుండు,
ఆనందముతో ఆప్యాయముతో.

ఎదురుగ వెళ్ళి ఆహ్వానించి.
ఆసన మందున కూర్చొన బెట్టి.
అతని వదనమున - తన పసికందును
ఆత్రముగా మరి - వెదకు చుండెను.

"ఇన్నిరోజులకు నీకానందము,
నాకానందము - కలిగించగను.
పుత్రోదయము కలిగెను నందా!
విని-ముద మందితి మందరమయ్యా.

సంసార చక్రము తిరుగు చుండును,
క్రిందు మీదులు దాని స్వభావము,
ప్రవాహమ్ములో -కలియుట - విడుట
జరుగు చుండెడి విషయమే గదా!

నీవూ - నీ పరివారమందరూ,
సుఖ సౌఖ్యముల -నుండిరి గాదా!
నీ పశు సంపద వృద్ధి నొంది మరి.
ఆరోగ్యముగా శుభముగనున్నద.

జల సమృద్ధమై - చెరువు లున్నవా?
పచ్చని పచ్చిక - పరవశ మిడునా -
కౄర మృగముల బాధలు లేక,
నిర్భయమ్ముగా నుండిర మీరు.

ఆదరించి మరి అన్నము నిడని,
గృహస్థు బ్రతుకు - మోడు వారినటు,
ఎదుగు బొదుగులు వుండవు వానికి,
హితులు బంధువులు చేరరు వానిని.

నీవూ నీఇల్లాలు - సుఖముగ
తనయుని లాలన జేయు చుండిర,
నా కొడుకనుచు - నీకగువారు,
శిశువును గాంచి మురిసి పోదురా!

నీ బిడ్డ మరి" - అనుచు పలుకుచు
మాటలు రాక దుఃఖము నిండగ,
ఊరడించెను నందుడు ప్రియముగ
"వసుదేవా నువు జ్ఞానవంతుడవు.

నీ పసికందుల చంపెను దుష్టుడు,
ఆడుబిడ్డ - తా - నందక పోయెను,
ఈశ్వరేచ్ఛను - దాటగలేము,
ధీరోదాత్తుడు చలించడయ్యా!

నా తనయుడిక - నీ కుమారుడే,
నన్ను - వేరుగా తలంచ వద్దు,
గోకుల మంతయు - మన బాలుని చే
వ్యాకుల మణగి-సుఖము నందును".

అంతట - పలికెను వసుదేవుండు
"కప్పము - రాజుకు చెల్లించితివి
మము చూచితివి - ఆనంద మది
ఆలసించక మరలి పొమ్మిక.

గోకులమ్మునకు శీఘ్రమె బొమ్ము
అపశకునములు తోచుచున్నవి".
అనగా-నందుడు శలవు తీసుకొని
వ్రేపల్లెకు తను బయలుదేరెను.

❋❋❋ ॥శ్రీ కృష్ణచరితము॥

## 10 పూతన మృతి

వసుదేవుడచ్చట హెచ్చరించుట,
మదిలో తలచి - నందుడంతట,
శిశువుకు - రక్షణ కల్పించమని
హరిని - నిండుగా ప్రార్థన జేసెను.

కంసుని ఆనతి నందిన అసురులు,
శిశువుల మ్రింగగ - బయలుదేరిరి,
పూతన - అనునొక రాక్షస వనిత,
పల్లెలు - వాడలు - తిరుగ జొచ్చెను.

అటుల తిరుగుచు - ఆ శిశుహంత,
వ్రేపల్లెకు తా వచ్చి చేరినది
కామరూపిణి నిర్భయముగను
ఆ స్త్రీ జనమున కలిసి పోయినది.

చక్కని రూపము సంతరించుకొని,
సొగసగు కన్నుల - మణి హారముల,
ముగ్ధమోహన మూర్తిగ మారి,
లక్ష్మీకళతో - అగుపించినది.

ఆమె అందమగు - రూపము గాంచి,
గొల్ల వనితలే ముగ్ధులాయిరి,
మెల్లమెల్లగ - నల్లనయ్య గల
పాన్పు వద్దకు వచ్చెను - ఆ స్త్రీ

అడ్డు పెట్టుటకు ఆ స్త్రీ లెవరికి,
కారణమసలే - కనబడలేదు,
అందువల్లను - ముందుకు వచ్చి,
నల్లనయ్యను జూచెను తీరుగ.

దాని కన్నులు - మూతబడినవి,
ఆనందాబ్ధిని - ఓలలాడినది,
అనంతమూర్తి స్పర్శతో - ఇక
అందని సద్గతి - అందును త్వరలో.

ఎందరో యోగులు చూడగలేరు -
చూచిన వారు - చేరగలేరు,
చేరిన వారు - స్పర్శనెరుంగరు,
కానీ - తనకవి అందుచున్నవి.

ఓరగ - తాను పూతనను గని
లీలామానుష విగ్రహుడపుడు
క్రీడా మానుష విగ్రహుండయి,
నిద్ర నటించుచు నున్న సమయమున.

విషపూరితమగు - తన స్తన్యముతో
బాలుని అంతము కోరిన పూతన,
కరముల - బాలుని ఎత్తిన వెంటనె
నిలువలేక - తా నేలకు తూలెను.

బ్రహ్మాండములను మోయు బాలుని,
ఎత్తనసాధ్యము - తెలియును దానికి,
వెంటనె బిడ్డను - అడ్డము వేసుకు
తొట్రుపాటును - దాచి వేసెను.

వెంటనె పాలను అందించినది,
అంతము గోరి - ఆ అవివేకి
జగద్రక్షకుడు - పాలతొ బాటు,
దాని ప్రాణములు పీల్చ సాగెను.

అయ్యో - అయ్యో - చాలు నింకయని,
అరచుచు - రక్కసి - మేఘము మాదిరి,
నేలను బడెను - కొండలు, కోనలు,
దాని అరపులకు - అదిరి పోయినవి.

నింగి తారలు - రాలి పడినటు,
గ్రహములు - నెలవులు వదిలి నట్టుగా,
నింగి చీలినటు - ధ్వను లెగసినవి,
సంద్రపు ఘోషలా కలిసి పోయినవి.

వజ్రాయుధపు పాటుకు నపుడు,
వృత్రాసురుడు కూలినట్టుగా
కొండయంతటి రక్కసి పూతన,
నేలను బడెను - విగత జీవియై.

ఒకటిన్నర యోజనముల దూరము,
దానిక్రింద బడి-నుగ్గు అయినది,
నిజరూపముతో చచ్చెను పూతన,
వచ్చిన వారికి ముచ్చెమటలయె.

కొండగుహవలె నోటిని తెరచెను,
నాగటి కొర్రులు - దాని దంతములు,
నూతులంతటి లోతగు కన్నులు
కొండల బోలిన - పిరుదులు గలిగి.

ఎండి పోయిన మడుగనిపించే
కడుపు గలిగిన - వికృతరూపము
హడలెత్తించే విధముగ - నచట,
అడ్డముగా - ఆ నేలనుబడెను.

అంతటి దేహము అచ్చట నుండగ,
నోరెత్తక మరి నిలచి పోయిరి,
బాలకృష్ణుడా పాతకి పైన
కేరింతలతో ఆడుచుండెను.

ముందుకు వచ్చి బాలుని తీయగ,
భయపడిపోయిరి అచ్చటివారు,
అందరొక్కటై - కళ్ళు మూసికొని
అందుకొనిరి - ఆ నందనందనుని.

నీళ్ళు చల్లిరి! దిష్టి తీసిరి,
గోవుతోకతో దిగదుడిచిరట,
గోధూళిని - మరి - నొసట దిద్దిరి,
గోమూత్రమును చల్లిరి - వారు.

భయముతొలగునటు-హరినామములు,
చదువుచు-బాలుని అవయవమ్ములకు
గోమయమ్మును పూసిరి అపుడు,
కొందరు - శుచిగా రక్ష చదివిరి.

"చిరంజీవ - నీ అడుగులు బ్రహ్మ
వాయుదేవుడే - నీ జానువులు
తొడలు-యజ్ఞుడు-నడుము అచ్యుతుడు,
హయగ్రీవుడు ఉదరము-గాచును.

హృదయ రక్షకుడు కేశవుడగును,
గుండియ రక్షణ ఈశుడు జేయును,
కంఠమ్మును-మరి-రవి కాపాడును,
భుజముల గాయును చతుర్భుజుండు.

త్రివిక్రముడు - నీ ముఖముగాయును,
శిరమును గాచును ఈశ్వరదేవుడు,
చక్రి-ముందుగా నడచు చుండగా
గదతో-శ్రీహరి వెనుక సాగును.

ధనువును దాల్చి-మధుసూదనుడు,
శంఖము, చక్రము - గదతో - విష్ణువు,
ఇరుప్రక్కలను నడచు చుందురు,
నీకు రక్షగ నిరతము వుందురు.

పై భాగమున ఉపేంద్రుడున్ను
క్రిందభాగమున - తార్క్ష్యుడు నిలచి -
హలధరుడైన - అవ్యయుడైన
పురుషోత్తముడు - నినుకాపాడును.

హృషీకేశుడు యింద్రియమ్ములను
ప్రాణమ్ములను - నారాయణుడు
మనస్సును మరి కపిల మహర్షి
పృశ్నిగర్భుడు - బుద్ధిని గాయును.

నిద్రావస్థలో - గాచు మాధవుడు
నడచు నప్పుడా వైకుంఠుడును
కూర్చొనునప్పుడు శ్రీపతి గాయును
యజ్ఞభుజుడు-తినునప్పుడు గాయును.

నీ పేరును విని-దుస్వప్నములు,
బాలగ్రహములు - పిశాచగ్రహములు
రాక్షసగణములు - శాకిని - ఢాకిని
పూతనాదులు నశించి పోదురు.

ప్రాణేంద్రియముల - శరీరమ్మును,
బాధపెటెట్టడి రుగ్మతలన్నీ,
నీదరిచేరక సుఖముగ నుండుము" -
అనుచు - రక్షను చదివిరి వారు.

గుండెకు హత్తుకు ఆనందముతో
కన్నుల నీరు నిండి పోవగా
స్తన్యమునిచ్చి - మాతృమూర్తి - తా
జోలలు పాడి నిద్దుర బుచ్చెను.

కొంతసేపటికి - నందుడు వచ్చెను
విషయము తెలిసెను వారందరకీ
వడిగా వచ్చిరి - ఆత్రమునిండి,
రక్కసి కాయము గాంచి రచ్చట.

నమ్మశక్యముకాదు అన్నటు,
చెప్పుచుండిరి విషయమంతయు
వసుదేవుడు అట చెప్పిన విషయము
తలచుకు మదిలో వందన ముంచిరి.

ఖండ ఖండములు చేసిరి కాయము,
దూరము తీసుకు పోయి అచ్చట
దహనము చేయగ - అగరు వాసన
ఎగసిన దచట జ్వాలల నుండి.

రక్కసి పూతన - జన్మ తరించెను
పరమాత్ముడు మరి అనుగ్రహించెను,
పదముల త్రొక్కి - పాలను త్రాగి,
పరమ పదమ్మును అందజేసెను.

కన్న తల్లివలె స్తన్యము నిచ్చెను,
పాప పంకిలము పీల్చివేయగా
పుణ్యమూర్తియై - దివి కేగినది,
శాశ్వతమ్ముగా నిలచి పోయినది.

విషక్షీరమును - యిచ్చిన వనిత
మోక్షమునందెను - సద్గతి కలిగెను
సతతము క్షీరము నిచ్చే గోవులు
మాతృమూర్తియు - ధన్య జీవులు.

జరిగినదంతా తలచుకు గొల్లలు -
బాలకృష్ణుని లీలలు వినుచు
గృహముల కేగిరి - నందుడంతట
నందనందనుని ముద్దిడి మురిసెను.

అంతవరకును శుకుడు చెప్పగా
ఆనందించిన రాజు అడిగెను.
ఇంకా - శ్రీహరి లీలలు వినగ
తొందర - మదిలో కలిగి యుంటిని.

ఏయే అవతారమ్ముల నెత్తెను,
బాలకృష్ణుని లీలలు ఏమి
దివ్యకథలను విందును మౌనీ!
అనగా నపుడు శుకుడు పలికెనిటు.

నందనందనుడు ఒత్తిగిల్లెనని,
జన్మతారలో – వేడుక చేయగ
గొల్ల వనితలను ఆహ్వానించి
పేరంటమును చేసెను తల్లి.

మంగళ వాద్యము లెగయు చుండగా
ఆటపాటలు సాగుచుండగా
వేదగానము వినబడుచుండగ
పరిమళ జలములు పోసిరి శిశువుకు

విప్రోత్తములు వేదాక్షతలతొ
ఆశీస్సులను పలుకు చుండిరి
వారందరకు నూత్న వస్త్రముల –
విందు భోజనము లిడిరి తృప్తిగా.

పుణ్యాంగనలకు పసుపు కుంకుమలు
పట్టు వస్త్రములనొసగె – యశోద
మధురములైన భక్ష్య భోజ్యముల
ఆదరమ్ముగా విందొనరించెను.

వేడుక సందడి జరుగుచుండగా
బాలకృష్ణుని సంగతి మరచెను.
నిద్రలొ నున్న బాలుడంతట
కరచరణములను ఆడించుచును.

పాలకోసమై అన్నటు – గట్టిగ
అరచి అంతట చిరుపాదములతొ
చెంతనె వున్న – బండిని తన్నెను.
ఎగిరి పడిన దా శకటమంతట.

గట్టి శబ్దము వినవచ్చినది
ఇరుసు – చక్రములు విరిగి పడినవి,
అచటకు ఎటులా – బండి వచ్చెనని
వారిలొవారు తర్కించగను.

అచ్చటి బాలురు కొందరప్పుడు
కృష్ణుడు – బండిని తన్నెను – అనిరి,
ముక్కలైనదని చెప్పిరి – గాని,
శకటాసురుడని – తెలియ దెవ్వరికి.

పసివాడేమిటి – బండిని తన్నుట, –
ముక్కలగుటది ఎటుల జరుగును,
భయసంభ్రమముల అచ్చటి వారు,
గుంపుగ నిలబడి చూచుచుండిరి.

అంతటిలోన యశోద వచ్చి
పసివానిని తన గుండెకు హత్తుకు
బుజ్జగించి – మరి – పాలందించి
రక్ష కట్టమని విప్రుల కోరెను.

అచ్చటనున్న వేదవిప్రులు
వేదమంత్రములు పఠించినారు.
హోమాదులను నిర్వహించిరి.
మంత్ర రక్షను కట్టిరప్పుడు.

దిష్టితీసిరి ముత్తయిదువులు
గోధూళితొ - మరి బొట్టుపెట్టిరి
వేదవిదులకు గోదానములిడి,
ఆశీస్సులను అందెను నందుడు.

వేదమంత్రముల - నమ్మకమున్న,
వేద విదులన - గౌరవమున్న,
నందుడు - వారిని సత్కరించుచు
వారి-దీవనలు నమ్మును నిరతము.

॥శ్రీ కృష్ణచరితము॥



## 11 తృణావర్తుని సంహారము

తొడపై - తనయుని కూర్చొన బెట్టుకు
యశోద - లాలన చేయుచుండగా
బాలుని బరువు ఇంతింతై మరి
మోయగలేని యంత యైనది.

నేల మీదను కూర్చొనబెట్టి,
ఆశ్చర్యముతో చూచుచుండగా,
రివ్వున వచ్చెను - ఒక సుడిగాలి,
వడిగా-బాలుని ఎగురవేసినది.

ఆసుడిగాలి - అతి వడిగలదై
తట్టుకొనగ మరి - అసాధ్యమైనది,
ఆసుడిగాలే - సుడిలో పడునని
తెలియక పోయిరి అచ్చటివారు.

భూమియంతయు కదలి పోయినది,
రవి కిరణమ్ములు నేలకు పడవయె
నింగి విరిగి - అట నేలపడినటు
ప్రళయమాయని! అనిపించినది.

వ్రేపల్లె నంతను బంతిగ చేసి
ఎచ్చటకో మరి విసరి నట్లయె -
చేష్టలుడిగి అట జనులు భయమున
ఇష్టదేవతల ప్రార్థన జేసిరి.

బెబ్బులి అరపులు - సింహగర్జనలు,
హోరుగాలిలో కలసి - వినబడి
ఆవ్రజపురము భీతిల్లినది
ముహూర్త కాలము అటుల గడచినది.

అంతటిలోన తెలివి తెచ్చుకొని
బాలుని కొరకై చూచె యశోద,
అచ్చట - బిడ్డడు కనబడలేదు,
గుండె ఝల్లుమని క్రుంగిపోయెను.

బిగ్గరగా రోదించ సాగెను
"నిన్ను ఇచ్చటే కూర్చొన బెడితిని,
నన్ను వదిలి - మరి ఎటుల బోతివి
ఆసుడిగాలి బారిపడితివా!

వరాల మూటా - ఎంత జరిగినది
నాదురదృష్టము నిన్ను చేరినది,
ఎచ్చట నుంటివొ - ఏమయిపోతివొ,
దైవమా! యిక నీవే దిక్కు".

అరచి అరచి - తా నలసి పోయినది,
నేలను బడెను - నిలబడ లేక
గొల్లవనితలా దృశ్యము గాంచి
కంటినీటితొ కుమిలి పోయిరి.

తృణావర్తుడను - దుష్టరాక్షసుడు
సుడిగాలి రూపున బాలుని గైకొని
నింగికెగరగా - అంతకంతకు
బాలుని బరువు పెరిగి పోయినది.

భరించరాని బరువుకు పెరిగెను
అసురుడు - ఆశ్చర్యములో మునిగెను
తానా బాలుని మోయగ లేడు
తన-మెడ పట్టి-బాలుడు వదలడు

సంకట స్థితిలో అసురుడు పడెను -
అసురుని మెడను పట్టుకు - బాలుడు
వ్రేలాడగను - దిక్కు తోచక ·
అసురుడు - ఉక్కిరి బిక్కిరయ్యెను.

వలలో పడిన పక్షితీరుగా -
నిగ్రహించెడి శక్తి లేకను
నేలకు రాలెను తృణావర్తుడు.
ఛిద్రమయినది శరీరమంతయు.

కఠిన శిలలపై - కటికరాక్షసుడు
కూలుట గాంచిరి జనులందరును
వాటి మధ్యగల బాలుని గాంచిరి
వెంటనె గైకొని యశోద కిచ్చిరి.

దైవవశమున బాలుడు బ్రతికెను
అనుచు - అచ్చట జనులందరును
భయసంభ్రమముల రక్కసి రూపము
గాంచి - పలుకుట వినిరందరును.

పాప చింతన మదిలో నున్నచో
తగిన శాస్తి - మరి జరిగి తీరును
సాధుస్వభావము కలిగిన నందుడు
దైవసహాయము కలిగియుండెను.

ఎంతటి పుణ్యము మనము చేసితిమొ-
నిరపాయముగా బాలుడుండెను.
మనము చేసిన యజ్ఞయాగములు
మన బిడ్డని మరి బ్రతికించినవి.

కీడు పోవుటకు రక్షాస్తోత్రము
శ్రీహరి నామోచ్చారణ చేసిరి -
అంతట యశోద పాలను యిచ్చి
వెన్నునిమిరి - మరి పరుండ బెట్టెను.

నల్లనయ్య తా నిద్ర నటించుచు
మెల్లన ఒకపరి ఆవలించెను.
తల్లి - తనయుని నోటనప్పుడు
ఉల్లము ఝల్లను దృశ్యము గాంచెను.

ఆపసికందు నోటియందున
భూమ్యాకాశము-తారలు - గ్రహములు
గిరులు, తరువులు పర్వతమ్ములు
అడవులు మరి సెలయేళ్ళు గాంచెను.

సర్వచరాచర జగమంతయును,
నిర్వికారముగ నోటను దాచి
కదలక పడుకొను బాలుని గాంచి
తల్లి - తన్మయము నందెనప్పుడు.

యాదవులకును పురోహితుండు
సద్గుణయుతుడు - గర్గుడు - మౌని
వసుదేవుడంపగా వచ్చెనచ్చటికి
నందుని గృహమున కేగుదెంచెను,

ఎదురుగ నేగి నమస్కరించి
అర్ఘ్యపాద్యముల సత్కరించెను -
ఆసనమ్మున కూర్చొన బెట్టి
వందనముంచి నందుడు పలికెను.

"మహానుభావా! నీవు వచ్చుట
పుణ్యతీర్థమే తరలి వచ్చుట
ఊరక రారు - మీరాక యది
సర్వ శుభములు కలుగ చేయును.

సర్వశాస్త్రముల పారంగతుడవు
జ్యోతిశ్శాస్త్రము నందున - నిధివి,
వేదవేత్తవు - బ్రహ్మమూర్తివి
నీయశోలతలు నెలకొన్నవి ఇలలో

నాకుమారులకు - నామకరణము
నీవు చేయగ ప్రార్థన స్వామీ!"
అంతట గర్గుడు పలికె నందునితొ
"నాకభ్యంతర మెంతయు లేదు.

కానీ - నందా - కులగురువునని
నీకూ నాకూ - స్నేహమున్నదని
తెలియునందరికి - కావున మనము
రహస్యమ్ముగా చేయవలెనది.

కంసుడు-సంగతి పసిగట్టునయా!
ఆడంబరము అసలేవద్దు",
అనుచుపలికి-ఆ సద్గుణయుతుడు
నామకరణములు చేసెను వారికి.

రోహిణి కొడుకును గాంచి పలికెను
"మనసులనేలే - రాముడీతడు.
బలమున మేటి - బలభద్రుండు
యదుసంరక్షణ సంకర్షణుడగు

ఉల్లము జిల్లను నవ్వులు చల్లే
చిన్ని శిశువును చూచి పలికెను.
నల్లని మేను-నయానానందము
కృష్ణుడు అనుట సమంజసమ్ము.

వసుదేవునికి ప్రాణసమానుడు
వాసుదేవుడను పేరున బరగును
రూపము - గుణములు -కర్మలబట్టి
అనేకనామము లుండును నందా!

ఈ బాలునిచే సుఖములందెదరు
సర్వదుఃఖములుహరించి పోవును.
దుష్టశిక్షణ - శిష్టరక్షణ
జరిపించగల దివ్యమూర్తియగు.

మానవులందరు ప్రేమించెదరు
మనుజోత్తముడై కీర్తి గడించును
నారాయణుడై- మహాత్ముడగును
బాలుని రక్షణ అతి ముఖ్యమయా"!

అనుచు పలికి ఆ గర్గమునీంద్రుడు
శలవు గైకొని వెడలిపోయెను.
కృష్ణుని గాంచి నందుడంతట
పరవశమ్మునపొంగి పోయెను.

॥శ్రీ కృష్ణచరితము॥



## 12 శ్రీకృష్ణ - బలరామ క్రీడలు

మెల్ల మెల్లగా నల్లనయ్య-తను
అన్నయ్యతో - తా - పెరుగుచుండెను
పాలు, పెరుగులు పొంగు చుండెను.
పశుసంపద యది పెరుగుచుండెను.

తల్లి కొంగును పట్టుకు నిలచి
అడుగులేయుచు - తూలి పడుచును
లేగదూడల తోకలపట్టుకు
పరుగులెత్తుతు పరవశమిడును.

పశువుల శాలలొ చొరబడి అచ్చట
నీళ్ళతొ ఆడి - బురద చేసుకు
తల్లి దీవనలు అందుకొనుచును
అల్లరి చేయుచు నుండిరి వారు.

పాలు త్రాగుచు తల్లులకెంతో
తనివితీరని ఆనందము నిడి -
అంతటి లోన త్రాగిన పాలను
కొంటె తనమున ఉమిసెడివారు.

వచ్చీరాని పలుకులతో నట
ఉల్లము చల్లగ చేసెడి వారు
బాల్య చేష్టలు వర్ణించుటకు
ఆదిశేషునికి - సాధ్యముగాదు

శిరస్సులెత్తి ఆడునప్పుడు
పడగలు విప్పిన - ఫణులనిపింతురు
బురద పూసుకొని ఆడునప్పుడు
కరిపిల్లలను పోలియుందురు.

వేగము - ఒడుపు కలిగినవారై -
సింహపు పిల్లల బోలియుందురు
సూర్యచంద్రులా ముఖముల దాగెనొ -
అనునట్టుగను వెలుగు నింపెదరు.

పాలను త్రాగి - తల్లుల ఒడిలో
అలసి - సొలసిన బిడ్డలగాంచిన
యోగీశ్వరులు-యోగ ముద్రలో
అవతరించిరా అనిపించెదరు.

మగువలందరిని- చిరునగవులతో
పలుకరించుచు -పరవశమిడుచు
మాయను - తాము-మాయ చేయగల
మాయామానుష విగ్రహులాయిరి.

ఊగుచు సాగే-బుడిబుడి నడకల
బాలురగాంచి రంభాదులట
పరవశించిరి - ఆడిరి పాడిరి
దేవతాంగనలు మురిసి పోయిరి.

కంసుడు మొదలగు రిపుజనమంతా
భయమున మునిగి-కండ్లు మూతబడి
తడుము కొనుచును-తిరుగ సాగిరి.
తనువు నిలవదని - తెలియసాగిరి.

తపోధనులు - మది సంతోషముతో
తమను ఆదుకొను-దైవము అతడని
తలపుల మదిలో పొంగిపోవుచు
ముచ్చటలాడుచు - మురిసి పోయిరి.

తనను చూడని అంధుల - మరచి
మూడులోకముల సాగెడి చూపుల
కనబడు జనులలొ - బాలకృష్ణుడు
తనవారెవరో తెలియుచుండెను.

ఆత్మ విద్యయది - కాని విద్యలు
అల్పమైనవని - ఎరిగిన యట్టి
అందము చిందే - నందనందనుడు
అందరినీ - తను పలుకరించును

పుట్టుక లేని అభవుడాయన
ముగ్గురు తల్లుల పిల్లడాయెను
అమ్మా - అమ్మ - అనిపిలచుచును
ఆనందాబ్ధిని - తేల్చెడివాడు.

నింగీ నేలా - రెండడుగులలో
కొలిచిన - వామనమూర్తి అచ్చట
రిపులడుగంటే - కాలము వచ్చెను
అన్నటు - అడుగులు వేయుట నేర్చెను.

దుమ్ము ధూళి యది - విభూతి పూతగ
తలపై హారము - చంద్ర రేఖగా
దిష్టి తిలకము - మూడవ కన్నుగ
మెడలో దండలు - బుసల పాములన.

చంద్రశేఖరుడు - ఇతడే నేమో -
అన్నటు - కృష్ణుడు అగపడు చుండగ
శివకేశవులు ఒకరే యనుచు
ఆనందములో మునిగిరి జనులు.

బాలుర గాంచి తన్మయత్వమున
అన్నిపనులను మరచి పోయిరి
జనులందరును అచ్చట చేరి
బాల్యచేష్టల - పరవశించిరి.

కొమ్ములు - కోరలు గల జంతువుల
నీరూ, నిప్పు - కంట కాదుల
బారి పడక - మరి - తల్లులు చూడగ
మనోభిరాములు పెరుగుచుండిరి.



॥శ్రీ కృష్ణచరితము॥

## 13 కృష్ణుడు బాలురతో ఆడుట

తనతో సరిపడువయసు పిల్లల
నాయకుడన్నటు - వర్తించుచును
అన్నతొ కలసి-నల్లనయ్య అట
అందరి మన్ననలందు చుండెను.

దినదినమునకు వృద్ధినొందుచు
ఆటల పాటల - మాటలయందు
తెలివితేటలు కనబరచుచును
మనసుల - మమత పెంచుచుండెను.

కసరు కొనగను - అలుకచెందుచు
గజ్జెలందియలు - ఘల్లు ఘల్లుమన
అంతటిలోన పరుగున వచ్చి
ఒడిలో చేరి - పాలను త్రాగును.

మెల్లన సాగి - గొల్ల యిండ్లలో
వెన్నను తిని - మరి తెలియనట్టుగా
చల్లగచేరి అమ్మనుగాంచి
బువ్వపెట్టమని అడిగి - పరుగిడు.

॥శ్రీ కృష్ణచరితము॥



## 14 బాలక్రీడాభివర్ణనము

తోటిపిల్లలను - గోవులనుచును
తాను - వాటికి నాయకుడనని
ఆడుచు మరి తా వంగి నడచుచు
అంకెవేయుచు గెంతెడివాడు.

నేను - రాజును అనుచును పలికి
సేవచేయగ చెప్పెడివాడు
దొంగననుచును - నిద్రపొమ్మని
వారి సొమ్ములను తీసెడి వాడు.

మీ అందర-నాడించు వాడను
అనుచు పలికి - అట ఆటలాడును
ఊయలలూగును బంతులాడును.
వింతవింత పనులు చేయును.

దుడుకుపనులకు దిట్ట ఆతడై
కపటనాటక సూత్రధారి అట
గొల్లవనితల ఓర్పు చూడగా
వారు - తల్లితో చెప్పుచుండిరి.

"పసి బిడ్డలకు పాలు లేవని
మా బాలింతలు చింతలొ నుండగ
కొంటెతనమున - బాలకృష్ణుడు
లేగల వదలెను - గోవుల చెంతకు.

ఇంట జొరబడి పాలన్నిటినీ
తోటివారిచే త్రాగించి - మరి
మిగిలిన పాలతొ కుండలన్నిటిని
పగుల గొట్టెనో యశోద! వింటివ.

కడుపు నిండుగా పాలను త్రాగి
దండింతుమని భయమున దాగి
వడిగా - పిల్లల త్రొక్కుచు - పరుగిడె
మా పసికందులు ఏడ్చుచుండిరి.

నీకొడుకంతటి ఘనుడు మరొకడు
పుట్టడు భువిలో - నిజమమ్మా - విను!
ఉట్టి అందక - పీటలెక్కగా
అదీ అందక - రంధ్రము చేసెను.

ఉట్టి యందలి - కుండ లోపలి
పాలు మీగడలు రంధ్రము నుండి
జారుచుండగా పిల్లలందరితొ
జుర్రెను తల్లీ - వింటివ తీరుగ!

పెరుగును త్రాగి - తిన్నగ బోక
కోడలి మూతికి రాసిపోవగా
నంగనాచి తన కోడలుఅనుచు
అత్త - అల్లరిచేసెను వింటివ!

కమ్మనినెయ్యి - అక్కడ త్రాగి
ఆకుండలను యిక్కడ బెట్టగ
వారికి వీరికి వల్లమాలిన
జగడ మయ్యెనే తల్లీ వినుము -

నన్ను మించిన - దేవుడు ఎవడు
అనుచు నవ్వుచు - మాముందరనే
నీ తనయుడు - మా దైవపటముల
ఎంగిలి చేసెను - ఎవరికి చెప్పము -

వెన్నను మ్రింగి - పారి పోవుటకు
సందుచూచుకొను కొంటె వానిని
మాచిన్నది - మరి ఒడిసి పట్టగా
గాయము జేసి పరుగిడె చోద్యము -

ఇంటి ముందర తచ్చాడుట గని
ఎవరవు నీవని నిలబెట్టగను
ఒక్క గెంతుతో దాని పెదవిని
కరచి - పరుగిడె - మెరపు రీతిగా.

దూడ తోకకు - పిల్ల జుట్టును
ముడేసి - దూడను తరిమాడమ్మా
కుయ్యో - మొర్రో అనుచు పిల్లది
శోకాలెట్టగ - సంబరపడెను.

పిల్లి అరపులకు - భయపడు పిల్లలు
అన్నము తినెడి సందె వేళలో
దీపములార్పి - పిల్లి మాదిరిగ
అరిచాడమ్మా - పిల్లలు గోల.

తలుపులు - తాళాలన్నీ - మాత్రం
చెక్కు చెదరవు - కానీ లోపలి
పాలూపెరుగూ - వెన్నలు మిగలవు
హరించి పోయి - కుండలు మిగులును.

సంపదలున్న - సుఖపడవలెను
బీదా బిక్కిని - బాధపెట్టరు!
కొడుకును యిటుల - ఊరి మీదకు
వదలి - చోద్యము చూతువ తల్లీ!

ఓయమ్మా! యిక ఆగడాలను
చెప్పే ఓపిక లేదే తల్లీ -
ఊరేవదిలి పోయేరోజు
తెచ్చేనమ్మా - ముద్దులకొడుకు".

గొల్లవనితలట యశోదమ్మకు
దుడుకు చేష్టలు వివరించగను
కొడుకును - తల్లి సమర్థించినది.
తొందరపడి నిందించవలదనె.

ఊరిలో త్రోవలు తెలియని కుంక,
ఏఇల్లెవరిదో - అసలే తెలియదు
నన్ను వదలి - నాకన్న - వుండడు
పసివాడసలే ఇల్లువదలడు.

నోముల పంటగ - నాకీ వయసున
కలిగాడమ్మా - ఈ పసికందు
తల్లులు మీరు - తనయుని మాదిరి
జాలి చూపి - మరి మరచి పొండవి.

అటులా తల్లులనందరి నంపి
తనయుని చూడగ - బాలకృష్ణుడు
ఏమీతెలియని - అమాయకునిలా
వడిలో వ్రాలగ - తల్లి ముద్దులిడె.

॥శ్రీ కృష్ణచరితము॥



## 15 తల్లికి విశ్వరూపం చూపుట

తోటి బాలురు - బలరాముడును
మన్నుతినెను - మన కృష్ణుడనుచును
తల్లికి చెప్పగ - యశోద అంతట
నిజము చెప్పమని గద్దించినది

"అమ్మా - నేనా మన్నుతినుటది
వెర్రివాడనా - ఆకలి గొంటిన
వారి మాటలు -కల్లలే సుమా
నను దండింతువు - అని చెప్పిరటు."

అనుచు కృష్ణుడు - తల్లితో నని
వాసన చూడుము నా నోరనుచు
బిక్కుబిక్కున బాలుడు వచ్చి
తల్లిముందర నోటిని తెరచెను.

చిన్ని బాలుని నోటి యందున
సర్వజగత్తును గనెనా తల్లి
అండ పిండ - బ్రహ్మాండ మంతయు
గిర్రున తిరుగుచు అగపడె-నామెకు.

నదీనదములు - కొండలు - గిరులు
సూర్య - చంద్రులు-అగ్ని దేవుడు -
దిక్పాలకులు - దేవతలందరు
అడవులు నిండిన బ్రహ్మాండముగనె.

కనులు తిరిగెను - చెమటలు పట్టెను
నోటమాట మరి పెగులుట లేదు
కలయా నిజమా - వైష్ణవమాయా!
నేలా - నింగీ - నీరూ - ఒకటయె!

నేను యశోదను అవునా కానా -
గోప బాలుడా - పరబ్రహ్మమా!
నోటి యందున - జీవకోటినే
చూపించగల దైవము ఇతడు.

నన్నీ తీరుగ ఉద్ధరించగ
ఉద్భవించిన - మహానుభావుడు -
తల్లీ - తండ్రీ - తోడూ నీడా
అన్నీ యితడే - శరణు వేడితి.

అదిగో - సర్వము తెలియుచున్నది
నిజముగ - నేనే యశోదమ్మను
అడుగో అతడే - నాపెనిమిటి - మరి
వారందరునూ గోపబాలురు.

ఈతడు-బాలుడు కానే కాడు
బ్రహ్మాండమునే ఏలేవాడు!
విశ్వంభరను - భరించువాడు -
అనుచు భక్తిగా - ప్రార్థించుట గని.

వైష్ణవమాయను ప్రేరేపించగ
అన్నీమరచి – తల్లి యశోద
బాలుని – తొడపై కూర్చొన బెట్టుకు
బుజ్జగించుచు పరవశించెను.

ఆగమాలచే – స్తుతించ బడెడి
ఆదిదేవు నే – తనయుని గాను
పొందిన నందుడు – అతని భార్య
ఎంతటి పుణ్యము చేసిరోగదా!

భవ బంధాలను త్రెంపగ జాలిన
మోక్ష లక్ష్మిని పొందగ చాలిన
శక్తిని – కవులు – భక్తి రచనల
పొందెదరనుచు వింటిమి గాదా!

ఆ పరమాత్మను తనయుని గా మరి
ఏవిధముగను పొందగలిగిరి –
వివరించమని – అడిగెను రాజు
అంతట పలికెను–శుక యోగీంద్రుడు.

వసువులలోను–ద్రోణుడు–ముఖ్యుడు
అతని భార్య–ధర–యని బరగు
వారిద్దరినీ భువిలో పుట్టగ
బ్రహ్మదేవుడు ఆజ్ఞాపించెను.

విరించి కపుడు వందన ముంచి
నారాయణుడే బిడ్డగ పుట్టే
వరమొసంగమని ప్రార్థించగను
వల్లెయనెను – ఆ చతురాననుడు.

బ్రహ్మమాటను పాటించుటకు
బ్రహ్మాండమునే భరించువాడు
యశోద – ఆనంద వర్ధనుడు
వారికి పుట్టి – తరింప జేసెను.

స్వయముగ – యశోద–పాలుచిలుకుచు
నంద నందనుని మదిలో తలచుచు
సన్నగ – పాటలు పాడుచుండెను
కవ్వము – చేతిలో తిరుగుచుండెను.

సన్నని నడుము కదలుచుండెను
చీర చెరగది – జారుచుండెను
మెడలో – మాలలు చిక్కులుపడెను
పద్మముఖములో – చెమట చిగిర్చెను.

కర కంకణములు ఆడుచుండగా
పెరుగు చిలికెడి ధ్వనితో నవ్వి
తాళము వేయుచు నున్నవి అపుడు
కురులు జారి – అవి వీపున బడెను.

కర్ణాభరణములా సమయములో
కాంతులు – ముఖమున కద్దుచుండెను
తియ్యగ పాడే యశోదపాటకు
గోవులు మునిగెను – తన్మయత్వమున.

అంతటిలోన బాలకృష్ణుడు
పాలిమ్మనుచు పరుగున వచ్చి
కవ్వము నాపెను – చిలిపి నవ్వుతో
కరగిపోయినది నందుని కాంత.

పాల్కడలి దేవునికి ఆనందముగా
పాలందించి - పొంగి పోయినది
అంతటిలోన - పాలు పొంగెను
బిడ్డను దింపి లోనికేగెను.

కోపము వచ్చెను - సుకుమారునికి
రాయితొ కుండను - పగులగొట్టెను
వెన్నను గైకొని - ఏడ్పు నటించి
పరుగు దీసెను తోటివారికై.

తల్లివచ్చి అట దృశ్యముగాంచెను
పాలకుండది పగిలియున్నది
ప్రక్కన - బాలుడు అగపడలేదు
విషయము తెలిసి-ముందుకు సాగెను.

ముందు ఇంటిలో బాలకృష్ణుడు
అగపడినాడు - రోలు ఎక్కుచు
ఉట్టి మీదగల - పాలకుండ కై
చేయు ప్రయత్నము-తల్లిగ్రహించెను.

కర్రను చేకొని - దండింపగను
ముందుకు నడచెను-ఆగు మాగుమని
తల్లినిగాంచి - దండించునని
తెలిసిన బాలుడు - పరుగు తీసెను.

ముందు - కృష్ణుడు పరుగిడుచుండెను
తల్లి - వెనుక - తా ననుసరించెను
అదిగాంచిన - ఆ - గొల్లవనితలు
చోద్యముగా మరి చూచు ఉండిరి.

సన్నని నడుము - సరిపడు సొగసుల
బుసలను కొట్టే - ఆయాసముల
అందని బాలుని - అందుకొనుటకై
అతివ - తొందరగ పరుగిడుచున్నది

మనోవేగమున - మహాయోగులే
అందుకోగను - అసాధ్యమైన
నందనందనుని అందుకొనుటకై
అమాయకముగా - తల్లి పరుగిడె.

తల్లి శ్రమను - తా గ్రహించినాడు
స్తంభముచాటున - నక్కెనప్పుడు
దొరికినట్టుగా నిలబడి నంతలొ
వేరొక స్తంభము వెనుక నక్కెను.

చివరకు - తాను తప్పు ఒప్పుకొని
క్షమించమన్నటు దొరికి పోయెను
కొట్టగ - చేతిని ఎత్తెను - గాని
అప్రయత్నముగ ఆగి పోయెను.

హద్దుమీరి నువు ఆగడాలను
చేయుచుంటివి - హన్నా - అనుచు
నిన్నోదిక్కున - కట్టిపడేతును
తెలియవచ్చు - నీతప్పులు నీకు.

కుక్షినజాండము - నిల్పిన బాలుని
భక్తికి లొంగే - భక్త బంధువును
విశ్వము నిండిన విశ్వబంధువును
రోటికి కట్టగ - తల్లి తలంచెను.

కట్టువడడు–తా–సిరిసంపదలకు
కట్టు వడడు తా కపట భక్తులకు
కట్టు వడడు మరి యోగ శక్తులకు
కట్టు వడడు – మరి శృతిలతలకును.

భువనాలన్నీ – బొజ్జలో దాచిన
బాబు బొజ్జకు – తాడు చాలక
ఎంత తెచ్చినా – అందక పోగా
విసిగి పోయినది – విస్తుపోయినది!

అంతటి వాడు – అందని వాడు
అందెను – తల్లికి – రోటికి కట్టగ
ఆమె పుణ్యము – ఆదిశేషునికి
అందనిదే మరి – కీర్తించగను.

భవబంధాలను త్రెంచేవాడు
భువనాలను మరి నిండినవాడు
తల్లిశ్రమను–తా–గ్రహించినట్టు
తాడుకు సరిపడ – నిలబడినాడు.

పట్టుదలతొ–ఆ–బాలుని కట్టగ
తాడు తెచ్చినది – చాలకపోయెను
ఇంకా తెచ్చెను – చాలుట లేదు
ఎంత తెచ్చినా – కొంచెము తక్కువ.

ఉరమున నిలచిన లక్ష్మీదేవికి
ఉదరమునుండి పుట్టిన బ్రహ్మకు
వదలక ఉండే – శివశంకరునకు
అందని దయను పొందె – యశోద.

యోగులు,జ్ఞానులు–మునులను మించిన
ప్రేమాదరణల నెలవు – భక్తులు
భక్తిలతలతో – ఆ భగవానుని
బంధించుటకు భక్తులు యోగ్యులు.

॥శ్రీ కృష్ణచరితము॥



## 16 అర్జున వృక్ష భంగము

రోటికి బాలుని కట్టి వేసినది
మనసుకు శాంతి తెచ్చుకొన్నది
ఇంటిపనులకై – లోని కేగినది
భక్తులసేవకు – సాగెను బాలుడు.

నలకూబరుడు – మణిగ్రీవుడు
ధనపతి కొడుకులు – వారిద్దరునూ
నారదు శాపము నందిన వారై
మద్ది తరువులై – నిలచి యుండిరి.

ఎన్నోయేండ్లుగతించి పోయెను
మద్ది తరువులకు మోక్షము లేదు
ఆ తరువుల గని - బాలుడంతట
రోలునీడ్చుచు - చెంతకు చేరెను.

రాజు అడిగెను - శుక యోగీంద్రుని
కుబేర తనయుల - శాప వివరము
అంతట మౌని - తీరుగ నపుడు
పరీక్షితున కిటు - తెలియబరచెను.

శివకింకరులము-ఎదురు లేదను
అహంకారమున - ధనపతి తనయులు
ఇద్దరు - అచ్చట వెండి కొండపై
సుఖభోగముల తేలియుండిరి.

విరితోటలలో విహరించుచును
లతా మణులతో - ఆడిరి పాడిరి
దివిజ గంగలో - సురకాంతలతో
జలకములాడిరి - మదించి పోయి.

వలువలు లేకను-వారు - అచ్చట
జలకాలాటలొ - మునిగి పోయిరి
అదేత్రోవలో - నారదమౌని
సాగుట గాంచిరి - వారందరును.

స్త్రీలు - వెంటనే చీరలు కట్టుకు
గట్టు లెక్కిరి - మౌనిని జూచి
మత్తుజారక - దిగంబరులుగా
ధనపతి తనయులు - ఇద్దరుండిరట.

సిగ్గునువదలి - మధుపానములో
ఒడలు తెలియక - దిగంబరులుగా
నిలచిన వారిని - గాంచి నారదుడు
ఈ విధముగను సత్యము తెలిపెను.

ధనమదాంధుడు - సత్యదూరుడై
తనువు నిత్యమని - తలంచునాతడు
కన్నతల్లికీ - పోషకునకే
శాశ్వత సొత్తుగ - నిలవదు-తనువు.

పేదవాడు తను వలయు దానిని
కష్టముతో మరి పొందగలుగును
కావున వాడు - ఇతరుల బాధలు
గ్రహించగలుగు స్థితిలో నుండును.

తనతో సమముగ తోటి వారిని
చూచెడి జ్ఞానము - పేదకుండును
దనమదాంధునికి - దరిద్రమనెడి
కాటుక వైద్యము - చేయదగినది.

సూర్యకాంతిలో - చీకటి విడినటు
సాధువర్తనుని - దైవజ్ఞానము
అజ్ఞానమును - అంతము జేయును
అహంకారికది - చీకటి బ్రతుకు."

అనుచు - నారదుడు - బుద్ధి చెప్పగా
అహంకారుల మదము దించగా
నలకూబరుని - మణిగ్రీవుని
ఉద్దేశించి - పలికె నిట్టుల.

"ధనమదాంధులు మీరిద్దరునూ
హద్దులుమీరి తిరుగుచుండిరి
కావున మీరు - మద్ది తరువులై
వంద ఏండ్లు-మరి-భువిలో బ్రతుకుడు.

నారాయణుని - పదముల స్పర్శతొ
శాపము తీరి - సురరూపముతో
సురలోకమును చేరుకొందురు".
అనుచు - శాపము - నారదుడిడెను.

శాపగ్రస్తుల - మద్దితరువులై
భువిలో పుట్టి - బ్రతుకు చుండిరి
నారద మౌని మాట ప్రకారము
శాపవిమోచన - కలుగచేయగా.

రోటినీడ్చుచు - బాలుడు సాగి
మద్ది తరువుల మధ్యకు-జేరి
సందునుండి - తా - అటుగా సాగి
రోలును లాగెను చెట్ల సందున.

ఫెళఫెళమనుచు రెండు వృక్షములు
కూలిపోయినవి ఆశ్చర్యముగా
వాటినుండి మరి తేజోవంతులు
వెలువడి - వారు - పదములబడిరి.

నలకూబరుడు - మణిగ్రీవుడు
కరములు ముడిచి స్తోత్రము చేసిరి
"దేవా - నీవు - జగన్నాథుడవు
బాలుడ వసలు కానేకావు!

సర్వసృష్టికి - మూలము నీవు
అక్షరమూర్తివి - అవ్య యుడవయా!
విశ్వమంతయు - నీరూపమని
బ్రహ్మవేత్తలు తెలియగలరయా.

సర్వప్రాణులకు - భూతకోటికీ
ప్రభుడవు నీవే - ఓ - పరమాత్మా!
త్రిగుణాలకు నువు కట్టుపడవయా
గుణకర్ముడు - నిను - తెలియుట ఎట్లు.

అవతారములకు ఆదిరూపుడవు
జీవశక్తిని - ప్రసాదింతువు
విశ్వకర్తవు - విశ్వనాథుడవు
మంగళమూర్తీ - వందనమిదిగో!

యదుకుల తిలకా - భక్త సులభుడా!
సుందరమూర్తీ - వందనమిదిగో
నారదుశాపము - వరముగ మారి
నీదర్శనము కలిగించినది.

నీకీర్తనలో - మా - నాలుకలు
నర్తించవలె నిరంతరమ్ము
నీగుణగానము చెవులు వినవలె
మాకరములు - నీ సేవ చేయవలె.

నీదు మంగళ రూపము నిరతము
మాకన్నులు దర్శించ వలెనయా
మా శిరస్సులు - నీపదములపై
భక్తిప్రపత్తుల నిలచి యుండవలె.

మా–మనస్సులు–బుద్ధులు–అనిశము
నీగుణములనే కీర్తించునటు
అనుగ్రహించి – వరమొసంగుము
అనాథనాథా" – అని కీర్తించిరి.

వారిని గాంచి – పలికెను కృష్ణుడు
"సన్మార్గములో మిమ్ము నడుపుటకు
నారదుడొసగిన శాపము తెలియును
కావున – మిమ్ముల చేరవచ్చితిని.

నాదర్శనమున – జ్ఞానము కలిగి
అజ్ఞాన తిమిరములు నశించి పోవును
భక్తిభావమును కలిగియుండిరి
ఆనందమది – మరలి పొందిక".

అంతట–వారు ఆ – భగవానుని
పదములప్రాలి – పరవశమంది
నారాయణుని ఆశీస్సులుగొని
ఉత్తరదిశగా – వెడలిరి – భక్తిగ.

ఫెళఫెళ మన్న – చప్పుడు వినబడి •
నందుడు మొదలగు వారు వచ్చిరి
కూలిన చెట్లను – వాటి ప్రక్కగా
రోలుతొ ప్రాకే – కృష్ణుని చూచిరి.

విశేషమైన – గాలి లేకనే
ఎటుల విరిగెనా రెండు వృక్షములు
నిరపాయముగా బాలుడుండెను
బాలుడు వాటిని – విరచుట సాధ్యమ?

ఆశ్చర్యములో మునిగినవారికి
ఎన్నోప్రశ్నలు ఉదయించినవి
అంతట – వారికి – గోపబాలురు
ఈవిధముగను – తెలియపరచిరి.

"చెట్ల సందులో నుండి – రోటిని
లాగగ – మరి – ఆ – చెట్లు విరిగినవి
వాటినుండి అట ఇద్దరు మనుషులు
కృష్ణుని ముందర నిలబడినారు".

వారిమాటలను కొట్టి వేసిరి
అటుల జరగదని – నవ్వుచు అనిరి
అంతట – నందుడు త్రాటిని విప్పి
బాలుని ఎత్తుకు ముద్దులాడెను.

ఆటలపాటల ఆనందముతో
పిల్లలందరిని సంతసపరచును.
కృష్ణుని ముందర – వారిసమయము
ఇట్టే గడచును – తోటివారికి

పాలుత్రాగితే జుట్టు ఎదుగునని
తల్లి చెప్పగా – పాలను త్రాగి
ఏదీ – ఇంకా – జుట్టు ఎదగదా!
అనుచు – కొంటెగా – తల్లి నడుగును.

నీటిలొ తనప్రతి బింబము చూపి
నన్ను కొట్టుటకు – వాడు వచ్చెనని
గోముగ – తల్లి చెంత చేరును
తన్మయత్వమున మునుగును తల్లి.

బూచివాడు - నిన్నెత్తుకు పోవును
మారామింక - వదులుము కన్నా -
అన్నమాటలు-విని-భయపడినటు
చెంగున - తల్లి చెంగు పట్టుకొను.

పండ్లు - అమ్మేడి వనితను గాంచి
దోసెడు ధాన్యము దానికి పోసి
పండ్లనిమ్మని - అడిగెడి - వాడు
తనువు మరచెడిది - కృష్ణునిగాంచి.

దోసెడు పండ్లు - బాలుని కిచ్చి
పరవశమ్మున బుగ్గలు నిమిరి
చల్లగనుండుము - నానాయన-యని
దీవనలిచ్చి - మురిసి పోయెడిది.

దోసిట పోసిన ధాన్యము - బుట్టలో
రత్నాలుగను వెలుగుచుండెడిది
ఆపళ్ళన్నీ వాడ కంతటికి
పంచెడివాడు చిన్ని కృష్ణుడు.

క్షణకాలము తన బాలుని విడచి
ఉండలేక మరి యశోద అంత
కృష్ణా! కృష్ణా! అని పిలచుచును
ఇల్లంతా - తా - వెదకు చుండును.

ఇంటలేడని వెదకుట కొరకై
రోహిణి - తానూ - బయలుదేరెదరు
ఎక్కడ - ఎక్కడ - అని పిలచుచును
యమున ఒడ్డున గాంచెడి వారు.

తోటి బాలురతొ ఆడుచునున్న
కృష్ణునిగాంచి - బుజ్జగించుచు
అన్నము తినక ఆడుచుంటివి
ఎంత ప్రొద్దు - మరి - గడెచెనొచూడు.

అనుచు - దగ్గరకు తీసుకు - తల్లి
ముఖము తుడుచుచు - ముద్దుచేయుచు
తిరిగి వత్తువులె - తిందువు - రమ్ము
అనుచు - బాలుని తోడ్కొని పోవును.

"విన్నావా - ఓనందయ్యా - నువు
బాలుడు - మాట - వినుట మానెను
ఒక చోటుండడు - చెప్పిన వినడు
తనన్నదే మరి - జరిగి తీరవలె.

ఎక్కడ వుంటివి - నీవని అడిగిన
నాకో చోటా - నాకో స్థలమా -
ఎక్కడ పడితే - అక్కడ వుందును
అనుచు - తిక్కగా - సమాధానమిడు".

అనుచు - చెప్పుచు - మురిసి పోవుచు
పరిమళ జలముల స్నానము తీర్చి
కస్తురి తిలకము నొసటను దిద్ది
పూలతొ - జుట్టును అలంకరించును.

పట్టు పుట్టములు - తీరుగ కట్టి
చక్కని - ఆహారమ్మును పెట్టి
గొడవలు లేక ఆడుకోమని
లాలనచేసి - యశోదపంపును.

ముద్దుగ నున్న - మోమును గాంచి
మురిసి పోవును - బుగ్గలు గిల్లి
ముద్దుపెట్టుకొని - మరి మరి జూచి
మహదానందము నందును నిరతము.

గోకులమ్మును సంతస పరచుచు
రామకృష్ణులు గడపుచుండగా
ఉపద్రవమ్ములు - వచ్చుచున్నవి
అన్న - విచారము - పెద్దలకున్నది.

వారొక రోజు - జరిగిన యట్టి
ఉత్పాతములను తలచుచుండగా
ఉపనందుడను - జ్ఞాన వృద్ధుడు
బాలురక్షేమము తలచి పలికెను.

"మన కృష్ణునిపై - పగతో - ఎన్నో
ఉత్పాతములు వచ్చుచున్నవి
పూతన వచ్చెను - సుడిగాలొచ్చెను
చెట్లు చిత్రముగ - విరిగి పడినవి.

దైవవశమున గండములన్నీ
గాలికి - కొట్టుకు పోయిన వంతే -
కావున మనము - నివాసమ్ములు
వేరొకచోటకు మార్చివేతము.

పచ్చికనేలలు - పూతీవలతో
స్వచ్ఛజలముతో పారే యమున
బృందావనమది - పర్వతప్రాంతము
మనకు - చక్కగా అమరియున్నది.

మీరందరును - ఆలోచించి
నిర్ణయానికి వచ్చినంతనే
బాలుర క్షేమము మదిలో నెంచి
మకాములన్నీ - మార్చివేతము".

ఆమాటలకు సరియనిరందరు
వెంటనె వారు - బయలుదేరిరి
ఆలమందలు ముందునడచెను
స్త్రీలు - బాలురు - బండ్ల నెక్కిరి.

కవచధారులై - విల్లంబులతో
రక్షణగా మరి - సాగిరి కొందరు
వాయిద్యాలతొ సవ్వడి చేయుచు
మృగముల పరుగిడ జేసిరి కొందరు.

హితులు - పురోహితు లందరితోను
బంధుమిత్రులను చేర్చుకు వారు
పండుగ సందడి నిండిపోవగా
బృందావనము - చేరసాగిరి.

పసుపు, కుంకుమలు - శోభలీనగా
పసిడి ముఖములతొ - గోపకాంతలు
కన్నులకింపగు వస్త్రధారణతొ
కొప్పుల నిండుగ - పూలదండలతొ.

బంగరు నగలు - ఆభరణాలతొ
పొంగిన ఆనందముతో వారు
కృష్ణలీలలు - గానము జేయుచు
సాగుచుండిరి - బృందావనముకు.

రోహిణి – యశోద – లిద్దరు అపుడు
రామకృష్ణులను కూర్చొన బెట్టుకు
అతివలు పాడే గానము వినుచు
ఆనందముతో – పరవశించిరి.

తోటి బాలురతో ఆటలాడుచు
మురళీ గానము – వినిపించుచును
గోవుల – మేతకు తీసుకు వెళ్ళుచు
ఆనందముగా గడుపుచుండిరి.

నల్లనయ్యతో – వారందరును
చల్లగ – బృందావనము జేరిరి.
ఆలమందలకు – శాలలు కట్టి
వారు – వసతులు – కట్టుకొనిరట.

గజ్జెలు – ఘల్లవి సందడి చేయగ
పరవశమ్మున నాట్యమాడుచు
ఎగిరి గెంతుచు – పండ్లను త్రెంపుచు
చెంగు చెంగున పరుగిడువారు.

ముని బృందములకు ఆలవాలమై
ప్రకృతి శోభకు ప్రతీక – తానై
శుక పిక రవముల – మంగళ స్థలము
పరవశమిడినది రామకృష్ణులకు

వనజంతువులను – అవలీలగను
పట్టుచు – విడచుచు – ఆడెడి వారు
పక్షులకూతకు – ప్రతిగా – కూయుచు
కేరింతలతో – గెంతెడివారు.

పందెము లేసుకు – నీటిలో దూకి
కాళియమడుగున – ఈదెడివారు
ధైర్యసాహసము లా యిద్దరివని
తలచెడి వారు తోటిబాలురు.

❊❊❊ ॥శ్రీ కృష్ణచరితము॥

## 17 వత్సాసుర – బకాసురుల వధ

వత్సాసురుడను రాక్షసుడొకడు
దూడ రూపమున – మందలో కలిసి
రామకృష్ణులను అంతము జేయగ
పన్నాగముతో నున్న విషయమును

ఒడుపుగ – దాని నాలుగు కాళ్ళను
అట్టె గ్రహించి – రెప్పపాటులో
తరువుకు కొట్టగ – ఆ వత్సమది
సవ్వడి చేయక – చచ్చెనచ్చట.

కృష్ణుడు మెల్లగ పసిగట్టాడు
అన్నను బిలచి – మంచి వత్సమిది
ముద్దులొలుకుచునున్నది గనుక
చేరదీతము రమ్మని పిలచి.

ఆశ్చర్యములో మునిగి పోయిన
గోపబాలురు – బాలకృష్ణుని
అభినందించి – నమస్సులుంచిరి
గోవత్సమ్ములు – బ్రతికినవనిరి.

మరియొకనాడు రామకృష్ణులు
ఆలమందలను మేపుచు నంత
ఎంతో దూరము తీసుకువెళ్ళి
దాహము నిండి - నీటిని వెదకిరి.

ప్రక్కనె ఉన్న చెరువును గాంచి
పశువులన్నిటికి - నీటిని పెట్టి
తృప్తిగ - యిద్దరు దాహము తీర్చుకు
వచ్చుచు-నచటొక - కొంగను చూచిరి.

కొండ యంతటి శరీరమున్నది
భయంకరముగా కనబడు చున్నది
యోగనిద్రలో నున్న - మౌని వలె
కదలక యున్నది - ఘనమగు కొంగ.

దొంగచూపుతో - కృష్ణుని గనుచు
సవ్వడి జేయక నున్నది - బకము
చెంతకు కృష్ణుడు - అరుదెంచగను
ఒక్కసారిగా - రెక్కలు విదిల్చి.

తరువులు కూలెడి - సవ్వడి చేసి
గుహవలెనున్న నోటిని దెరచి
గుటుక్కుమని - ఆ బాలకృష్ణుని
మ్రింగివేసెను - ఆశ్చర్యముగా

బలరాముడును - వ్రజబాలకులు
తెలివి తెచ్చుకొని - కృష్ణమూర్తికై
వెదకిరి అచ్చట - కనబడలేదు
కాళ్ళు కదలక - కూలబడిరట.

దుష్ట బుద్ధితో - మ్రింగెను కొంగ
కానీ - కృష్ణుడు మ్రింగుడు పడునా!
ప్రళయకాలమున - సర్వజగతిని
మ్రింగసమర్థుడు - మ్రింగుడు పడునా!

గొంతులొ నుండగ - మంట మొదలయె
అగ్ని గోళమును - మ్రింగి నట్టయె
బాబోయనుచు - బాబును తాను
బయటకు ఉమ్మెను - బ్రతుకుట కొరకై.

అంతట ఆగక - బకాసురుండు
నోటిని దెరచి - ముందుకు రాగ
అవలీలగను - అతిహేలగను
రెండుగ చీల్చెను - దాని నోటిని.

గడ్డిపోచను నడిమికి - రెండుగ
చీల్చి వేసినటు - చీరి విసరగా
అసువులు వీడి - నేలను బడెను
ఆశ్చర్యములో మునిగిరి మిత్రులు.

దేవ దుందుభులు - మ్రోగె నింగిని
పుష్పవర్షము కురిసె నచ్చట
మిత్రులు - సంతోషముతో - కృష్ణుని
కౌగిలించుకొని - పులకరించిరి.

ఇండ్లకు చేరిరి - ఆలమందలతొ
గోపబాలురు చెప్పిన విషయము
వినిన పెద్దలు - తల్లిదండ్రులు
భయ సంభ్రమమున - మునిగి పోయిరి.

వరుసగ ఇటుల ఆపదలన్నీ
వచ్చుచున్నవి - పగబట్టినటు
గాలికి - మేఘము చెదరిపోయినటు
అంతటిలోనవి - పోవుచున్నవి.

కృష్ణునిపైన - దుష్టబుద్ధితో
హానిచేయగ వచ్చిన వారు
అగ్నిని బడిన - మిడతల మాదిరి
మరు మాటాడక - చచ్చు చుండిరి.

గర్గ మహాముని - నాడు చెప్పెను -
కంసుని వల్ల ఆపద కలదని
అదే నిజమని తోచుచున్నది
మహాపురుషుల మాటలు నిజమగు.

మన మెంత - మరి - రక్షించుటకు
ఆపరమాత్మ - మన బాలునికి
రక్షగనుండును - అనుచు నందుడు
మిగిలినవారు - తలంచినారు.

ఎప్పటి మాదిరి - రామకృష్ణులు
ఆటల పాటల - నాట్యమ్ములతో
బాల్య చేష్టలతొ - బృందావనమును
ఆనందడోలికల నూపు చుండిరి.

ఒక ఉదయమున - రామకృష్ణులు
వనభోజనము చేతము అనుచు
గోపబాలకుల నందర లేపి
ఆలమందలతొ బయలుదేరిరి.

చలిది అన్నపు - కావిళ్ళు గొని
కిఱ్ఱు చెప్పులు కాళ్ళకు తొడిగి
చేతకర్రలు - కంబళ్ళుగొని
బయలుదేరిరి - గోప బాలురు

పూసలదండలు - బంగరు సరములు
పూలహారములు ధరించి రందరు
పాటలు పాడుచు మురళి ఊదుచు
తగినట్టుగను - గంతులేయుచు

తుమ్మెద ఝుంకారమ్ముతొ కలసి
రొదలను చేయుచు సాగుచుండిరి
త్రోవలొ కనబడు - నెమళ్ళ గాంచి
వాటితొ కలసి - నాట్యముజేసిరి.

పూ పొదరిండ్ల జొరబడు వారు
చెట్టు కొమ్మలను ఎక్కెడి వారు
పిల్ల వాగులను గెంతుచు - వారు
రామసైన్యమే అనిపించిరట.

పూదీవలతో - ఊయల లూగుచు
చిటారు కొమ్మల - కనబడు పండ్లు
చటుక్కున - మరి ఎగిరి త్రెంపుచు
పోటీలేసుకు దుముకు చుండిరి.

ముందునడచెడి వాని ప్రక్కన
నడ చుచు - ఒక పరి కేక పెట్టగా
బెదరి పోయిన వాడు - వెంటనే
కెవ్వున అరవగ - నవ్వెడివారు.

సవ్వడి చేయక వెనుకను వెళ్ళి
వీపున చరచగ – మొఱ్ఱో అనుచు
కావడి వదలి – నేలను బడగ
వెక్కిరించుచు – నవ్వెడివారు.

ముందుగ – కృష్ణుడు నడచుచుండగా
పరుగు పరుగున – కృష్ణుని తాకగ
గొల్ల పిల్లలు పరుగులు తీసిరి
వారిలొ వారు హాస్యము లాడిరి.

పాదధూళిని – శిరమున దాల్చగ
పరమ యోగులకు – కష్టసాధ్యము
కానీ – అచ్చటి గోప బాలురు
ఆ పరమాత్మతొ – కలిసి తిరిగిరి.

కరముల తాకుచు – మీద బడుచును
మన్నించుచును – మన్నలందుచు
కొంటె పనులతో – గడిపే బాలురు
ఎంతటి పుణ్యము చేసిరో కదా!

ఆటల పాటల వారుండగను
'అఘుడను'–రక్కసుడది–గమనించెను
వాడి పేరు విని – సురలు సైతము
గడగడ లాడి – పరుగిడు వారు.

ఆ దుష్టునికీ – కంసరాజుకు
అంతుబట్టని స్నేహముగలదు
అందు వలననే – కంసుని పనుపున
అక్కడ కాసెను – కృష్ణుని కొరకై.

బకాసురునికి – తమ్ముడు అఘుడు
అన్నను చంపిన – కృష్ణుని పైన
పగ తీర్చుకొను అవకాశముకై
ఎంతోకాలము వేచియుండెను.

అదే సమయమని – ఆ – రాక్షసుడు
అతి భయంకరమ్మగు కొండ చిలువలా
రూపము దాల్చి – నేలను పరుండె
ఘనమగు గిరివలె తోచెనచ్చట.

గుహతో పోలెడి నోటిని గలిగి
గిరిశిఖరమ్ముల పోలు దంతముల
నిప్పులు కురిసే చూపుల తోను
నాలిక జాచి నేల పరుండెను.

గోపబాలురు – పామును జూచిరి
తమను మ్రింగుటకు వచ్చెను అనుచు
కృష్ణుడుండగా – మనకా భయము!
పిచ్చిపాము – మరి – చచ్చును ఇపుడే.

బకుని చంపిన – బలభీముడిట
ఉన్నటు – దానికి తెలియదు పాపం!
తీరా – అది మన కృష్ణుని కగపడ
బకుని స్నేహము చేయగ సాగును.

అనుచు ధైర్యముగ – ఆలోచించక
తొందర పాటున నడచెడి వారిని –
విషయము తెలియని అమాయకులని
కృష్ణుడు చూచి – వంత నొందెను.

పెద్ద దేహముతొ నున్న పామని
తెలియును గాని - రక్కసుడనుచు
తెలియదు వారికి - అనుచు వారిని
వెనుకకు రమ్మని - అరచుచుండగా.

అంతటిలోనే - వారందరును
ఆలమందలతొ - ముందుకు నడచి
గుహవలెనున్న - దాని నోటిలో
పడిపోయిరి - మరి - చిత్రముగాను.

పొగలను గ్రక్కే - పెద్ద నోటితో
అగ్నిని రాల్చే పెద్ద కండ్లతో
ప్రళయ కాలమే దాపరించినటు
మ్రింగెను గోవుల - గోప బాలురను.

కృష్ణుడు అదిగని పరితపించెను
వారి తల్లులకు ఏమని చెప్పుట?
విధి - నిర్దయుడై ఇటుల చేసెను
నేనెటు తిరిగి ఇల్లు చేరుట -

అనుచు కృష్ణుడు మదిలో నెంచి
ముందుకు నడచి - పాము నోటిలో
స్వయముగ బడెను - కుత్తుక బట్టెను
శ్వాస ఆడక పోయెను - పాముకు.

కొంత సమయము గడచినంతనే
దాని అసువులు ఎగసి పడినవి
గిజగిజ లాడి - తలపగిలి - అది
చచ్చెను అచ్చట - సవ్వడి లేక.

వెంటనె గోవులు - గోప బాలురు
శ్రీకృష్ణుడును బయటకు వచ్చిరి
మేఘముదాటి - ముందుకు వచ్చిన
చంద్రుడు - తారలు అన్నటులుండిరి.

బ్రహ్మాండమ్మును ఆక్రమించెను
నాటి - వామనుడు - సురల మేలుకై
నేటి - కృష్ణుడు - తోటి వారిని
రక్షించుటకై - అఘుని జంపెను.

అఘుని చంపిన - అనఘుని పైన
పుష్ప వృష్టి కురిపించిరి సురలు
దేవదుందుభులు మ్రోగె శ్రావ్యముగ
అచ్చర కన్యలు నాట్యము చేసిరి.

బ్రహ్మానందము నందిన బ్రహ్మ
నాల్గు ముఖములతొ - బాలకృష్ణుని
స్తుతించి - భక్తిగ నమస్కరించెను.
వింతగ తోచెను బాలురందరికి.

ఎంతో కాలము, ఆ పిల్లలకు
ఎండిపోయిన పాము చర్మము
ఆటవస్తువుగ మిగిలియుండెను.
ఆ గాథను మరి మరువరు వారు.

కృష్ణుని ఐదవ సంవత్సరమున
కొండచిలువ - మరి మ్రింగెనందరిని
కృష్ణుని కారవ ఏడు వచ్చెను.
అప్పుడు వారు బయటకు వచ్చిరి.

ఒక ఏడాది గోవులన్నిటితో
ఎటుల వుంటిమి - దాని కడుపులో
ఆశ్చర్యముగ - గోపబాలురు
ఆ విషయమును తలంచుచుందురు.

అటులాగాథను శుక యోగీంద్రుడు
చెప్పగ నంత - ఆ మహరాజు
ఒక ఏడాది జరిగినట్టుగా
వారికి తెలియుట - విష్ణుమాయయగు.

ఆ రహస్యము వినగా నెంచితి
దివ్యలీలలు వినగా మనసయె
అనుగ్రహించి - తెలుపుము స్వామీ!
అనగా - శుకుడు ఆరంభించెను.

శుక యోగీంద్రుడు - రాజును గాంచి
సంతసించి - మరి తెలుపుచుండెనని
సూతుడు - అచటి మునులందరకు
తెలియబరచెను వివరముగాను.

గురువు - సర్వదా శిష్య వత్సలుడు
ఎంతటి గోప్యమునైనా - గురువు
నమ్మిన శిష్యుని వద్ద - దాచడు
కావున - వినుము లీలామృతమును

గోపబాలురను - గోవులన్నిటిని
అఘుని చంపి మరి విడిపించగను
ఆనందముతో వారందరును
కృష్ణుని వెంబడి నడచుచుండిరి

త్రోవలో కృష్ణుడు దివ్య సరస్సును
నిర్మల జలముల శోభిలు కొలనును
కలువలు నిండి - తామరలుండగ
చూచి - ముదమును పొందినవాడై

"మదికానందము కలిగించుచును
మరి మరి చూడగ తోచు సొగసుతో
మనలందరిని పలుకరించునటు
మనసుదోచినది - ఈ ప్రదేశము

ఎండలో - మీరు అలసిపోయిరి
ఆకలి మెండుగ వేయుచున్నది
అందర మిచట చల్దులు తిందము
ఆలమందలకు పచ్చిక యున్నది."

కృష్ణుని మాటకు వారందరును
సరియని - గోవుల - మేతకు వదిలి
చల్దులు విప్పి - నంద నందనుని
మధ్యలో కూర్చొన - ప్రార్థన చేసిరి

చివురుటాకుల - కంచమ్ములలో
కలిపిరి చల్దులు - ఊరగాయలతో
మీగడ పెరుగుతో కలిపిరి కొందరు
వెన్నపూసయది - ముందేయున్నది

ఊరించుచును - జుఱ్ఱుకొనుచును
వ్రేళ్ళ సందుల - ప్రీతిగనాకుచు
ప్రక్క ఆకులో - అందుకొనుచును
తెలియనట్టుగా - నటించి - తినిరి.

పందెము వేసి - తినెనొక బాలుడు
అయిదు మందికి సరిపడ - తినెను
కృష్ణుని చూడు - అని - మరిపించి
అతని ఆకులో ముద్దను తినెను.

భయపడవలదు నే చూచెదను
మీరందరును చల్దులు తినుడు
అనుచు - కృష్ణుడు ముందుకు సాగెను
దిగులుతొ నందరు కూలబడిరట.

అందరి మధ్యలొ బాలకృష్ణుడు
వేణువు - బొడ్డున దోపుకునంత
మీగడ పెరుగు - ఊరగాయతో
తినుచుండెను - వారందరితోను.

కంఠ హారములు - శోభ లీనగా
నెమిలి పింఛము - మెరయుచుండగా
ఫాలమునందు - కస్తురి వెలుగగ
పొన్ను కర్రతో వెడలెను కృష్ణుడు

ఊరగాయతో మీగడ పెరుగుతొ
ఊరించుకొని తినుచుండగను
ఆ రుచి - అందరిని నోరూరించగ
చల్ది బంతి - అట తీర్చెను కృష్ణుడు.

సాగుచు నచట - గోవులు మేసిన
స్థలమునుగాంచి - ముందుకునడచి
అవి చరించిన - కాలి జాడతో
నలుదిక్కులలో వెదుక సాగెను.

పశువులు-మేతకు-దూరము పోయెను
కనుచూపులొ - అవి కనబడలేదు
తొందరగా వారందరు లేచి
పేరుపేరున పిలవ సాగిరి

కొండలు - కోనలు పూపొదరిళ్ళు -
చెట్లు - చేమలు - గుట్టలు - మిట్టలు
సందులు - గొందులు-సరిభూములను
ఎంతో శ్రద్ధగ వెదకెను కృష్ణుడు.

ఎంత వెదకినా ఆలమందల
జాడ తెలియక - తికమక పడెను.
ఆలోచించిన కొద్దీ విషయము
అంతుపట్టక జటిలమైనది.



॥శ్రీ కృష్ణచరితము॥

## 18 బ్రహ్మ మాయ

అఘుని జంపుట ఆశ్చర్యమది -
అసలు - బాలుని శక్తి జూడవలె
అన్నయోచన బ్రహ్మకు వచ్చి
అంతా మాయము చేసి వేసెను.

గోవులన్నిటిని - గోపబాలురను
మాయతొ - బ్రహ్మ దాచి వేసెను
తిరిగి వచ్చిన కృష్ణుని కచట
గోపబాలకులు అగపడ లేదు.

పేరు పేరునా - స్నేహితులనట
పిలచి-పిలచి మరి-అలసెను కృష్ణుడు
అంతట - కృష్ణుడు బ్రహ్మ మాయను
గ్రహించినాడు అంతరంగమున

బ్రహ్మాండమునే సృజించినాడు
బ్రహ్మను - తానే సృజించినాడు
అంతటివాడు - అందనివాడు
తెలియగలేడా - బ్రహ్మమాయను

చిరునగవొకటి -- మెరసెను మోమున
"గోపబాలురు కనబడలేదని
తల్లుల కెందుకు చెప్పగవలెను
నేనే - వారి రూపులనందెద"

అనుచు కృష్ణుడు - సంకల్పించి
ఉత్తర క్షణమున - వివిధ రూపముల
గోపబాలురుగ - నిలబడినాడు
గోవులు తానై - కనబడినాడు

అచ్చుగుద్దినటు లున్న రూపములు
అవే గొంతులు - అవే మాటలు
అవే హారములు - వస్త్రధారణ
అన్నీ - మునుపటి గోపబాలురవి

గోవులన్నిటిని మరల్చమనుచు
వారందరికీ ఆజ్ఞలనిడగా
ఆలమందలతొ తిరిగి వచ్చిరి
ఎవరి గోవులను - వారు కట్టిరి

వేణుగానము బిడ్డలు చేయగ
సవ్వడి విని - మరి - తల్లులందరు
ఆనందించిరి - వారందరికీ
తృప్తిగ - పాలూ - భోజనమిడిరి.

క్రొత్త ఎంతయు కనబడకుండా
అనుమానమ్ము రాకుండగను
తల్లుల వద్ద - గోపబాలురు
ఆనందముగా గడుపుచుండిరి

పరంధాముడని - తెలియక పోయి
తమ బిడ్డలని - మదిలో నెంచిరి
గోవులు - తల్లులు - పాలను యిచ్చిరి
ఎంతటి పుణ్యము చేసిరో కద -

అటుల వత్సరము గడచుట కింక
కొద్దిరోజులు గడువుయుండగా
లేగల తోలుకు కృష్ణుడు అన్నతొ
గోవర్ధనగిరి ప్రాంతము జేరెను.

అచ్చట - ఆవులు పచ్చిక మేయుచు
వచ్చిన - వత్సమ్ముల గాంచినవి
పరవశించినవి - పాలు చేపినవి
పరుగున - వత్సమ్ముల చేరినవి

వాటి వెంటగల - గోపకుల కట
అపశక్యము గాకపోయినది
ఆ గోపకులు - తమ బిడ్డలను
అచ్చట చూచి - పరవశించిరి

అటులానందము నిండిన యట్టి
గోవులు - గోపకు లందరు అపుడు
అతి కష్టము పై తిరిగి వెడలిరి
బలరామునికి - వింతగ తోచెను.

వట్టిపోయిన - ఆవులన్నియు
దూడల జూచి పాలను చేపుట
గోపకులందరు తమ బిడ్డలపై
కృష్ణుడన్నటు - ప్రేమజూపుట.

గోవత్సమ్ముల - గోపబాలురలో
కృష్ణుని రూపము అగపడుచున్నది
దేవమాయయా-అసురుల మోసమ -
నందనందనుని - జగన్నాటకమ!

అని మదినెంచి కృష్ణుని గాంచి
మహానుభావా - యింతటి వరకు
లేగలన్నియు - ఋషులమాదిరి
గోపాలకులు సురలుగ - దోచిరి.

ఇప్పుడు మాత్రము వారందరును
నీ రూపముతో అగపడుచుండిరి
దేవరహస్యము తెలుపుము స్వామీ!
అనగా - అన్నకు చెప్పెను కృష్ణుడు

చిరునగవులతో జరిగినదంతయు
బలరామునకు తెలియబరచెను
బ్రహ్మచేసిన ఘనకార్యమునకు
ప్రతిక్రియ-తాను చేయుట తెలిపెను.

బ్రహ్మకాలమున - తృటి గడచినది
భువిలో - ఒక ఏడాది గడచెను
భూమికి వచ్చి - బ్రహ్మచూచెను
గోపాలకులను - లేగల జూచెను

ఆశ్చర్యములో బ్రహ్మ మునిగెను -
నా మాయతొ - మరి - వారందరిని
గుహలో నుంచగ - యిచటకువీరు
ఎచ్చట నుండి వచ్చిరి ఇపుడు

సృష్టి చేయగల విధాత - నేను
వీరి సృష్టి మరి - ఎటుల జరిగెను
ఒక ఏడాది గడచిపోయినది
వీరిని సృజించు బ్రహ్మ ఎవ్వడు.

తికమకపడెను - నాల్గు ముఖములు -
తిన్నగ జేరెను సత్యలోకము
ద్వారము వద్ద - కావలివారు
అడ్డగించిరి - కదలనీయక

అంతట - బ్రహ్మ వారితొ పలికెను
"మీ యజమానిని - బ్రహ్మను నేను
అడ్డగింతురా - వళ్ళు తెలియదా"!
అనుచు - దురుసుగా పలికిన యంత

నిర్భయముగ వారందరు పలికిరి
నీవుదొంగవు - వేషము మార్చి
బ్రహ్మ మాదిరిగ - వచ్చితి విటకు
వచ్చిన త్రోవనె - పోవుట మంచిది.

రెచ్చిపోయిన - బ్రహ్మ పలికెను
"మదించి పోయిరి - మీరందరును
మోసగాడినని అందుర - నన్ను"
అనుచు - రుస-రుస-లాడుచుండగ

వీణాపాణి వచ్చె నచ్చటికి
విషయము తెలిసి పలికెనప్పుడు -
"నిజముగ - నీవు మోసగాడివే
మా ప్రభువచట-గృహమున నుండెను

సౌధము లోపల - ప్రభువు వుండగా
ఆ వేషములో చొరబడ వత్తువ"!
అనగా - లోపలి - విరించి వచ్చెను
ద్వారము వద్ద - బ్రహ్మనుగాంచెను

వేషము మార్చి వచ్చెను వీడు
అనగా వాణి - కావలి వారకు
గెంటి వేయమని - ఆజ్ఞాపించి
చతుర్ముఖునితో - లోనికేగెను

సూర్యకాంతిలో మిణుగురు యొక్క
కాంతి తెలియదు - అదే విధముగ
చీకటిలో మరి మంచు కనబడదు
అటులే - కృష్ణుని మాయ - గొప్పది.

కృష్ణ మాయలో - వేరొక మాయ
కనబడదన్నది - తెలిసెను బ్రహ్మ
కంటి ముందర గోపబాలురు
చతుర్భుజులుగా అగబడసాగిరి.

నీల మేఘశ్యామల వర్ణము
మకుట కుండల - మణి హారములు
పీతాంబరములు - తులసి మాలలు
తల మానికమగు - నెమలి పింఛము.

శంఖ, చక్ర, గద, - పద్మమ్ములతో
కోటి సూర్యుల - వెలుగులు నిండి
అణి మాది - సిద్ధుల కాలవాలమై
చిరునగవులవి - సిరినగవులుగ

దివ్యమంగళ రూపమ్ములతో
దేవదేవులే - అన్నటు - వారు
నిలచియుండగా - జీవకోటి యది
వారి సేవలో - నిమగ్నమైనది.

వైష్ణవీయమగు వారికి - ప్రకృతి
కైవారములు - సలుపు చున్నది
మహత్తు మొదలగు తత్వములున్ను -
గుణములు - సేవలు - చేయుచున్నవి.

ఆ దృశ్యముగని - విధాత కంతయు
తెలియ వచ్చెను - తానే యిపుడు
మాయచేయ బడి - మాయ లోనబడె
తన తప్పును - తా - తెలిసినవాడై.

భువనాలకు - తా - వెలుగు నిచ్చుచు -
బాలుర రూపుల - దర్శన మిడెను
అనుచు బ్రహ్మ - అట నిశ్చేష్టుడయి
చలనము లేక - నిలచి యుండెను.

మాయకు అందక - శృతుల కందక
స్వప్రకాశమున - అతి విలాసముగ
నిలబడి నట్టి - నిర్వికారుడు
నివ్వెరబోయిన - బ్రహ్మను చూచెను.

గోపాలకుని రూపముతోను
గోవుల వెదకుచు - వాసుదేవుడు
ఆకలి దప్పుల కందని వాడు
అన్నపు ముద్దతొ - అగబడినాడు.

కనికరించెను - తనదగుమాయను
తొలగించగను - బ్రహ్మకు - అపుడు
చలనము వచ్చి - మెల్లమెల్లగా
కన్నులు విప్పే - శక్తి వచ్చినది.

దివ్య బాలుని - జూచిన బ్రహ్మ
దిగ్గున దిగెను - వాహనమ్మును
సాష్టాంగము గా - ప్రణామమిడెను
పదముల కాన్చెను - తన శిరస్సును.

కన్నుల ముందర - కమల నాభుడు
నందనందనుని - రూపములోన
అగబడినాడు - బ్రహ్మ దేవునికి
కృష్ణుడు మాత్రము - తెలియనట్టుగా.

నవరత్నాలతొ మణుల శోభతో
ధగధగ మెరిసే - వజ్రకిరీటము
బాలకృష్ణుని - పదమంజరులకు
నీరాజనము యిచ్చెను కాంతుల.

లేగల కొరకై - వెదకు చుండెను
పేరు పేరున - పిలచు చుండెను
కనబడనట్టి మిత్రులందరిని
వెదకుచు - పొదలను అడుగుచుండెను.

ఆనందముతో - అశ్రులు రాలగ
దివ్యపాదమును - కడిగి భక్తిగా
పావనిపుట్టిన - పాదము యిదిగో -
అనుచు - స్తోత్రము చేసెను యిటుల.

॥శ్రీ కృష్ణచరితము॥



## 19 బాలకృష్ణుని బ్రహ్మస్తుతించుట

"నీవే తల్లివి - తండ్రివి నీవే
నీవే దిక్కు ఆగమరూపా -
నారాయణ - నువు - గోపాలునిగ
పాపాలన్నీ - కడుగగ పుడితివి

శిఖిపింఛమది శోభలీనగా
పిల్లన గ్రోవి - చేతధరించి
తామరపూవుల బోలు - పదముల
కరుణా రసము - ఒలికే కన్నుల

మేఘమునున్న - మెరపు కాంతిలా
కాంచన చేలము - మెరయుచుండగా
చలిది అన్నపు - ముద్ద యుండగా
వన మాలికలు కంఠము నుండగ

చిరునగవులతో సొగసులు చిందే
వెన్నెల కురిసే పెదవులలోన
మురళీ నిలచి - నాట్యమాడగా
నిలచిన స్వామీ - వందనమయ్యా!

నీ రూపము కైవల్య దీపము
విశ్వరూపము - ఊహించుటకై
అందనిదయ్యా -అవ్యయమూర్తీ!
ఆత్మమాత్రము - దర్శించు నిను

సర్వము తెలుసును - అన్న భావనతొ
అహంకారముతొ నీ ముందర - నే
ఓడిపోతిని - ఓ నారాయణ!
భక్తి గొప్పది - తపస్సు కన్నను

కోర్కెలు వదలి - నీపై మనసుతొ
నిరతము - నీ గుణగానము చేసిన -
అన్నీ నీవే అని - మది నమ్మిన -
నీ సాయము మరి లభించుగాదా

నింగిని చుక్కల - లెక్కిడవచ్చును
నీ గుణములను లెక్కిడలేము
యోగులందున - రాజువు నీవు
నీ మాయను - నే పరీక్షించగా

మూర్ఖత్వముతో - మాయను చేసి
నేనే - అందులొ దిగబడి పోతిని
నా అజ్ఞానము - క్షమించవయ్యా
నాగర్వమది హరించె - నోహరి

అణువునుండి బ్రహ్మాండమంతయు
నెలకొనినట్టి - దివ్య స్వరూపా!
ఆది అంతములు-ఎవరికి తెలియును?
ంందురు - అందరు నిన్ను

గర్భములోని - శిశువు తన్నెనని
కడుపు కోసుకొను - మూర్ఖులుండరు
ప్రకృతి యంతయు - నీలోగలదు
నేనూ అందులో - ఒకనిని స్వామీ!

కినుక వహించకు - ఓ కృష్ణయ్యా!
జలము - నీరము - నీలో నుండి
వాటిలొ - నీవు వుండుట వలన
నారాయణుడవు - అయితివి నీవు

అన్ని భూతముల కధినాథుడవు
పాలకడలిలో - యోగనిద్రలో
పవ్వళించెడి పరమాత్ముడవు
నీ మూర్తులవి - అనంతములు గద -

నిను గుర్తించగ - బయలుదేరితిని
తామర తూడును బట్టి - సాగితి
నూరేళ్ళుగను - ప్రయాణించినను
అంతము తెలియక - అలసిపోతిని

సర్వజగములు - నీలోనుండును
సర్వ జగముల - నీవే యుందువు
నీదు మాయగద - యశోద - గనుట
కన్నతల్లి యే - మాయలొ పడెను

విశ్వంభర - మరి - నీలోనుండును
కాదనుకొన్న - వేరుగ నుండును
అంటీ అంటక - అన్నిటియందు
నీవుందువు - మరి తెలియుట కష్టము

ఒక్కడవై నువు - అనేక మూర్తుల
అగబడినావు - ఆగమరూపా -
అంతలొ నవ్వి - మాయము చేసి
ఒకటిగ - తిరిగి దర్శనమిడితివి

సృష్టి, స్థితి, లయ కారకుడవు-నువు
త్రిమూర్తులుగా నెలకొని యుందువు
దుష్ట శిక్షణ - శిష్టరక్షణకు
అవతారమ్ముల నెత్తితి వీవు

ఈ రూపమని - చెప్పగ లేము
అన్ని రూపములు - కలిగిన వాడవు
పురాణపురుషా - అనంతుడవు-నువు
సత్య - స్థిరమగు - మూర్తివి నీవు

అన్ని జీవులలొ ఆత్మవు నీవు
దేహముధరించు జీవులు మాత్రము
నీకు దేహము కలదని తలతురు
అజ్ఞానములోనుందురు వారు

దేహము లేనిచొ - గుణములుండవు
అది తెలియక-మరి సగుణుడవందురు
నిర్గుణుడవని - దివ్యమూర్తివని
జ్ఞాన చక్షువులు - చూడగలుగును

మనసు, బుద్ధి, - అహంకారము
మొదలగు-పదకొండింద్రియమ్ములకు
అధిపతుల మగు - పదముగ్గురము
శంకర దేవుడు - నేనూ - చంద్రుడు

నీ చరణామృత - పానము జేసియు
కొంతలో కొంత - తృప్తినందితిమి
ఇంద్రియమ్ముల మక్కువ వదలక
ఈ విధముగను వుంటిమి స్వామీ!

కానీ ఇచ్చట - గోపాలకులు
గోపికలందరు - సర్వము మరచి
సర్వేంద్రియముల దృష్టి - నీ పైన
నెలకొన జేసి - ధన్యులాయిరి

ఎంతటి ఉన్నత శిఖరాలను - ఈ
గోపకు లధిరోహించిరి - భక్తితొ
మమ్ముల దాటిరి - నిర్మల భక్తితొ
వారి ఘనత - నేనెటు చెప్పుటయా -

వేదమ్ములను తెలియని వారు
ఈ లోకములో - ఈ వన సీమల
ఈ మందలలో - కృష్ణా యనుచు -
నంద నందనా - అని పిలచుచును.

తనివి తీరని - ఆనందముతో
తనువులు మరచే - భక్త బంధువుల -
పాదరేణువు - శిరమున దాల్చుట
బ్రహ్మ పదవిని - మించిన ఘనత

పూతన వంటి రక్కసి కే - నువు
మోక్షము నిచ్చిన - మంగళమూర్తీ
బంధు జనముతో - నీకర్పితమగు
ఈ భక్తులకు - ఏమిచ్చెదవో -

శరీరమే - ఒక చెరసాలగను -
మోహ పాశమే - సంకెలగాను
అనురాగమ్ము - మొదలగు నట్టివి
కావలి వారిగ - చిక్కుకునున్న

జీవులపై - నువు - కారుణ్యాలయ
కరుణా దృక్కులు - ప్రసరించినచో
సూర్యరశ్మికి - చీకటి విడినటు
బంధములన్నీ - పటాపంచలగు

సర్వాత్మా - నిను స్తుతించుచుంటిని
తెలియక చేసిన అపరాధమ్మును
క్షమించి - నన్ను అనుగ్రహించుము"
అనుచు - విరించి - స్తోత్రము జేసెను

తిరిగి - భక్తిగా - బ్రహ్మదేవుడు
ప్రదక్షిణించి - నమస్కరించెను.
పదములనంటి - నమస్సులుంచెను
సత్యలోకము జేరె నానతిని -

బ్రహ్మ దాచిన - గోపకుమారులు -
లేగలన్నియు వచ్చి చేరగ
యమున ఒడ్డుకు వచ్చెను - కృష్ణుడు
గోపకులది - తెలియకపోయిరి -

ఒక వత్సరము - గుహలో నుండిన.
వారందరికీ - ఒక క్షణమన్నటు
కాలము గడచెను - దైవ మాయచే
విష్ణుమాయను - తెలియకపోయిరి -

కృష్ణుని చూచి గంతులేసిరి
ఆనందముతో పరవశించిరి
నీవు లేక - మరి తినుట జరుగదు
రమ్ము రమ్మని - కూర్చొనబెట్టిరి.

కృష్ణుని సరసన - వారు కూర్చొని
చలిది బంతిలో - అన్నము తినిరి
ఎండి పోయిన పాము చర్మమును
కృష్ణుడు వారికి చూపెనచ్చట.

పూలదండలతొ ముద్దులొలుకుచు
పిల్లన గ్రోవి - చల్లగ నూదుచు
మందలొ నడుగిడ - వారందరును
పాటకు తగ్గటు - నాట్యము చేసిరి.

తిరిగి వచ్చిన కృష్ణుని - గాంచి
పెద్దలందరు పరవశించిరి
కొండ చిలువను - కృష్ణుడు చంపి
కాపాడినటు - పిల్లలు చెప్పిరి.

వారి మాటలకు బృందావనము
మారు మ్రోగినది - కృష్ణ లీలవిని -
అనుచు చెప్పగ - రాజవరేణ్యుడు
శుక యోగీంద్రుని - అడిగెనిట్టుల.

కృష్ణుడు - అచ్చటి పల్లె వాసులకు
అంతటి హితుడుగ - ఎట్టులయ్యెను
కన్న వారిని - మించిన ప్రేమకు
నోచిరి ఎటులా - వ్రజకుల-వాసులు -

ఆనందముతో శుక మహర్షి
ఈ విధముగను ఆరంభించెను
అనుచు - సూతుడు - శౌనకాదులకు
తెలియ బరచుచు నుండె నచ్చట.

"సర్వజీవులకు ఆత్మగనున్న
ఆ పరమాత్మ - గోప జనముకై
మూర్తి ధరించి - వారితొ నుండెను
అనురాగమును - పంచెను వారికి.

గుణములన్నిటిలొ - శ్రీహరి భాసిలు
విష్ణుపాదమను - నావను పట్టుకు
ఆవుపాదమును వేసినట్టుగా
సంసార జలధిని - ధీరుడు దాటును.

అఘాసురుని - అంతము జేసి
ఆప్తులైన - ఆ గోప బాలురతొ
చల్దులు భుజించి - బ్రహ్మదేవునికి
తన విలాసము లీలగ జూపిన.

కృష్ణలీలను - చదివిన వినిన
కోర్కెలు తీరి - సుఖములందెదరు -
ఆ విధముగను కృష్ణుడు అచ్చట
స్నేహితులందరి మధ్యలొ గడిపెను.

అనుచు తిరిగి-ఆ శుక యోగీంద్రుడు
హరి లీలను చెప్పదొడంగెను
ఒక దినమున-శ్రీ కృష్ణుడు-మురళిని
ఊదసాగెను - ప్రభాతమున.

వేణునాదము - వినిరి గోపకులు
బలభద్రుడును విని - అట జేరెను
వారందరును కృష్ణుని వెంబడి
గోవుల మందతొ బయలుదేరిరి.

ఆవుల మందలు - ముందు సాగగా
వారందరును - బృందావనము
చేరిరి - అచ్చటి ప్రకృతి యంతయు
పరవశమ్ము - కలిగించుచున్నది.

పండిన పండ్లు - మెరసే చిగురులు
అరవిరిసిన - సుమ సంపద నిండి
లతా కుంజములు - శోభలీనగా
తుమ్మెద - ఝుంకారమ్ముల నిండెను.

వైరము మరచి - జంతువులన్నీ
సఖ్యత పెంచుకు - తిరుగుచున్నవి
పెళ్ళిసందడిలొ - తిరిగే జనులుగ
తిరుగుచున్నవా - జంతువులన్నీ.

సరసున విరిసిన - పద్మములవ్వి
నవ్వుచున్నటు - తోచుచున్నవి
జలపక్షులవి - కిలకిల నవ్వగ
ప్రకృతి యంతయు - పరవశించెను.

ఆ సమయములో ప్రాభాతములో
ఆటలాడగ మనసు కలిగిన
కృష్ణుడు - అన్నకు తెలియపరచెను
అన్నతొ పలికెను - మృదు మధురముగ.

"దేవా! చూడుము - వృక్ష సంపద
పూలూ, పండ్లతో - నేలకు వంగి
నీ పాదములను - స్పృశించుచున్నది
ధన్యత నందగ - నిలచియున్నది.

ఫలపుష్పములను - కాన్కగ - నీకు
సమర్పించగ - వేచి యున్నవి
ఆ తుమ్మెదలు - నీ కీర్తి నిట
పాడుచున్నవి - బలభద్రా విను!

రూపము మార్చి - నేలకు దిగిన
పరమేశ్వరునిగ తలంచి - మునులు
సేవించగను వచ్చుచుండిరి
దేహ చ్ఛాయగని - నెమళ్ళు ఆడెను.

శ్రేష్ఠము అయిన - అతిథివి నీవని
కోయిలలన్నీ - పలికె స్వాగతము
నీపద స్పర్శతో - పొంగెను పుడమి
జంతుజాలము - ధన్యతనందెను.

నీ కాలి గోళ్ళు - మరి తగిలినంతనే
వనమున - లతలు - పులకరించెను
నదులూ-గిరులూ-పులుగులు-మృగములు
క్రొత్త సొగసుతో శోభిలుచున్నవి."

అటులా విధముగ-తమ్ముడు పలుకగ
మౌనముతో - బలరాము డంతట
కృష్ణుని - ముదముగ కౌగిలించుకొని
పరవశించెను - పులకరించెను.

కృష్ణుడంతలో - ఆటలలోబడె
కేరింతలతో - గంతులేసెను
నెమళ్ళ గూడి - నాట్యమాడెను
గున్న ఏను గన - వాటితో నడచెను.

దూరము సాగి - ఆవులన్నిటిని
పేరుపేరున పిలవసాగెను -
"పూర్ణచంద్రికా - గౌతమి - గంగా!
రండి రండి మీరందరు రండి -

మేఘబాలికా - ఇటు రావమ్మా!
చింతామణి - నువు నిలబడిపోతివ
సురభీ - రమ్ము - మనోహారిణి -
సర్వ మంగళ - ఇటు రావమ్మా!

ఎంతదవ్వు నువు - పోతివి - భారతి
శ్రీ మహాలక్ష్మీ - త్వరగా రమ్ము -
మందమారుతీ - వేగమె రమ్ము!
మందాకిని - నువు పరుగున రమ్ము.

శుభాంగీ - ఇటు రావాలమ్మా - "!
అనుచు కృష్ణుడు - మురిపెముగాను
మేఘగర్జన పోలు కంఠమున
గోవుల పిలవగ - మురిసిపోయినవి.

నడచి అలసిన - అన్నగారికి
పదములొత్తుచు - సేదతీర్చుచు
చిగురాకులతో - విసరుచు - కృష్ణుడు
సేవచేసెను - తిరిగి నడచిరి.

తోటివారితో - రామకృష్ణులు
ఆడుచుపాడుచు - నడచుచుండిరి
మధ్యమధ్యలో - తగవులాడుచు
వారి ప్రతాపము చూపుచు సాగిరి.

గోపబాలురు - చెట్లనెక్కుచు
క్రిందకు దుముకుచు-కవ్వించుచును
రక రకములుగ ఆటలనాడుచు
ఆనందముగా - నడవసాగిరి.

అలసిన కృష్ణుడు - నీడన కూర్చొన -
తోటి బాలురు - చప్పునవచ్చి
వీపుమీద - మరి - కూర్చొనబెట్టుకు
ప్రయాణమ్ము - సాగించెడివారు.

పడుకొనునపుడు - తొడపై తలనిడి
పడుకొనమని-ఒక బాలుడు కూర్చొను
చిగురాకులతో - విసరెడివారు
పదములొత్తుచు నుండెడివారు.

ఎంతటి పుణ్యము చేసిరొవారు
కృష్ణుని కంత - చేరువనుండి
సేవచేయుచు - కలసి తిరిగిరి
జగన్నాథునికి - స్నేహితులైరి.

అంతటిలోన - శ్రీదాముడను
గోపబాలుడు వారితొననెను
అక్కడగలదు - తాటితోపు - మరి
దానిలొ ఎన్నో ఫలములు రాలును.

కానీ - అచట - ధేనుకా సురుడు
నివసించును - అటకెవ్వరు పోరు
గాడిద రూపుతొ - నుండును వాడు
వాని బంధువులు గలరు అచ్చటే.

అటుగా నడచిన మనుజులందరిని
అమాంతమ్ముగా - మ్రింగును వాడు
అందువల్లనే - రుచిగల పళ్ళు
అందుకొనుటకు - వశముగాదు కద!

కమ్మని వాసన వచ్చుచున్నది
రామకృష్ణులు - మీరిద్దరును
వానిని ఒకపరి - చూచితిరా యిక
అంతమగును - వాడక్కడికక్కడ.

అనగా - వారు ముసి ముసినవ్వుల
ఒకరినొకరు అట చూసుకు నిలబడ
బలరాముని - ముఖపద్మము అపుడు
ఎఱ్ఱని రంగుతొ - వెలుగులు చిమ్మెను.

బలరాముడు - తా - ముందునడువగ
తమ్ముడు - కృష్ణుడు అనుసరించెను
తృటిలో వారు తాటితోపులో
జొరబడి - చెట్లను ఊపివేసిరి.

తాటిపళ్ళవి - జలజలరాలెను
ధేనుకుడంతట - బలరాముని గనె
వెంటనె వచ్చెను - పోరు సలుపగ
వాని అడుగులకు - భూమి వణకెను.

పట్టగ రాని - ఆగ్రహమ్ముతో
బలరాముని-తన్నెను-బలముగ-వాడు
ముందుకు వచ్చి - కరవబోయెను
తప్పుకు నిలబడె - బలభద్రుండు.

తిరిగి తన్నెను - ధేనుకాసురుడు
ఉగ్రుడై - అట బలభద్రుండు
నాలుగు కాళ్ళు - అట్టె గ్రహించి
గిర్రున త్రిప్పి కొట్టెను - తరువుకు.

కిమ్మనకుండా చచ్చెను - అసురుడు
వీరుడు కొట్టిన దెబ్బకునపుడు
తాడి విరిగిపడె - ప్రక్కతాడిపై
అటులావరస - చెట్లు కూలిపడె.

అంతట - అసురుని బంధువులందరు
గార్ధభ రూపులు - విరుచుకుపడిరి
సోదరులిద్దరు - వంతులేసుకు
ఎత్తికొట్టిరి - తాటిచెట్లకు.

అటులా అసురులు అంతము కాగా
కళేబరమ్ముల - కూలిన తరువుల -
మబ్బులు కమ్మిన ఆకాశముగ
కనిపించినదా తాటి తోపుయది.

గోపబాలకులు - ఫలములు తినిరి
దేవ దుందుభులు - మ్రోచిరి సురలు
పూలవానను - కురిపించిరట
రామకృష్ణులను - స్తోత్రము చేసిరి.

అన్నతొ కలసి - నందనందనుడు
ముందుకు వచ్చెను గోపబాలురతొ
త్రోవపొడుగునా వారందరునూ
అన్నదమ్ములను - పొగడుచుండిరి.

శిఖిపించమది - గాలికి కదలుచు
సిరికళ - కన్నుల తాండవించగా
మురళీగానము - ఉల్లమునిండగ
ముగ్ధమోహన రూపుతొ నున్న.

కృష్ణుని చూడక - వుండగలేని
అభిమానముతో - గోపికలందరు
ప్రొద్దుగ్రుంకగనె - గోవులతోలుకు
వచ్చిన కృష్ణుని - చూతురు ముదమున.

ఆ సుందరుని - తనివి తీరగా
కన్నుల గాంచి - పరవశించుచు
యోగశక్తితో - పరమాత్మనుగను
తీరుగ - వారు పులకరింతురు.

చిరునవ్వులతో - పలుకరించుచు
చూపులతోనే - సమాధానమిడి
సిగ్గుతొ - ప్రక్కకు తప్పుకొనుచును
వారి మనసులను - సంతసపరచును -

ఉదయము నుండి అగపడకుండా
తిరిగిన బాలుర - రామకృష్ణులను
రోహిణి - యశోద - లిద్దరప్పుడు
అక్కున జేర్చుకు - లాలన చేసిరి.

దిష్టి తీసిరి - వారిద్దరకు
పరిమళ జలములు పోసిరంతతట
పట్టుబట్టలు - అలంకరించిరి
మధుర పదార్థములిచ్చిరి - ప్రీతిగ.

బాలురు - భుజించి నిద్రలో జారిరి
శేషపాన్పుపై పవళించేటి
పరమాత్ముడు - తా - శేషుని ప్రక్క
పవళించెను అట - అలసట నిండి.

రోజులు గడచుచు నుండగ నొకపరి
బాలకృష్ణుడు - గోపాలకులతో
వనమున కేగెను ఆ సమయములో
బలరాముడు మరి గృహమున నుండెను.

ఆ దినమున మరి సూర్యదేవుడు
నిప్పులు చెరుగుచు నున్నటులుండెను
ఉదయము నుండే దప్పిక మొదలయె
ఎండవేడికి వాడిపోయిరి.

దాహమునకు మరి ఓర్వలేకను
గోపాలకులు యమునలో బడిరి
విషముతో చెడిన - నీరని - తెలియక
త్రాగిన వారు - అసువులు వీడిరి -

గట్టున పడిన - మిత్రుల గాంచి
కరుణామృతమగు దృష్టితొనంత
అసువులు బోసి - బ్రతికించగను
ఆనందముతో కృష్ణుని పొగడిరి."

॥శ్రీ కృష్ణచరితము॥



## 20 కాళీయ మర్దన

ఓ మహరాజా - కృష్ణుడంతతట
కాళీయుడను - పాపతేనిచే
కలుషితమైన - యమున నీటిని
పవిత్రమైన జలముగ జేయగ.

సర్పరాజును -మడుగునుండి మరి
తొలగించెనయా - అద్భుతముగను -
అనగా - రాజు ఆ కథ వినగా
అనుగ్రహించుడు - అనుచు అడిగెను.

అంతట పలికెను శుకయోగీంద్రుడు
"రాజా! వినుము-యమున నీటిలో -
మడుగొక టున్నది-అది ఫణిరాజుకు
అతని సంతతికి - ఆశ్రయమైనది.

ఆ ఫణిరాజు - ఉనికిచె - నీరు
విషముగ మారి - ఉడుకుచుండును
మడుగుపైన - మరి ఎగిరిన పక్షి
వేడికి - మడుగులో పడి-ఉడుకునయా!

మడుగునుండి మరి వీచిన గాలులు
దగ్గరనున్న - జంతుజాలమును
హరింపజేయును - కావున శ్రీహరి
ఆదుకొనగను - అచటికి వచ్చెను.

యమున ఒడ్డున - కడిమి చెట్టును
చూచెను - కృష్ణుడు వెంటనె - ఎక్కెను.
ఉత్తరీయము - నడుముకు గట్టి
శిఖిపింఛమును - సరిజేసుకొనె.

పదములు రెండు - దగ్గర జేర్చుకు
కరములు రెండు - బలముగ ముడిచి
కరిపిల్లవలె - హరి - ఆ మడుగున
ఒక్కసారిగా దుమికెను - లీలగ.

ఆ తాకిడికి - యమున నీరు అట
గట్లను దాటి - పైకి చిమ్మినది
బాలకృష్ణుడు - కాళీయుని గని
గుండెలపైన - నొక్కసాగెను.

నీటిలొ ఈదుచు - పాములకందక
పదములతో ఆ పాముల తన్నుచు
కరములతో మరి గొంతులు పిసికెను
కాలీయునికి - ప్రాణాంతకమయె.

అంతట ఫణి - అట క్రోధము నిండి
సాధారణమగు బాలుడీతడు
అంతము చూతును-అనుచు-గర్వమున
విషజ్వాలలతో - నాల్కలు విసరెను.

కోరలు - ఒడుపుగ సరిజూసుకొని
లాఘవమ్ముగా - కృష్ణునందుకు
కరచెను - తోకతొ - బందీ చేసెను
తిరిగి తిరిగి మరి - కరచుచుండెను.

పాలకడలిలో - హాలాహలమన
యమున నీటిలో - విషజ్వాలలవి
కొంత సమయము - కృష్ణుని - అచట
కదలనీయక - నిలపివేసినవి.

మునుగుచు తేలుచు-నుండెను కృష్ణుడు
గోపబాలురది - గమనించుచును
పైకి తేలిన - బాలుని గాంచి
కలవరపడుచు - నిలచిపోయిరి.

బాలకృష్ణుని - పాము కరచెను
ఏదీదారి - అనుచు ఏడ్చిరి
ఒడ్డున - పశువులు - మేత మానినవి
కంటనీటితో - నిలచిపోయినవి.

అంతట - అచటి - భూమి వణకెను
చుక్కలు రాలి - నేలపడినవి
గోపకుల కట - దుశ్శకునముగా
కన్నులు అదిరెను - కలవరపడిరి.

నందాదులు మరి బయలుదేరిరి
కృష్ణుని కొరకై - వెదుకసాగిరి
వారితొ నున్న - బలరాముడును
బయలుదేరెను కృష్ణుని వెదుకగ.

అడుగుల రేఖలు - శంఖ చక్రములు
తీరుగ - కనబడుచుండగ వారు
వాటి వెంబడి - నడచి నడచి - మరి
యమున ఒడ్డుకు - వచ్చి చేరిరి.

ఫణి బంధములో - కృష్ణుని గాంచిరి
ఏడ్చుచు నున్న - బాలురగాంచి
సజలనయనముల - అచ్చట నిలచిన
పశువుల గాంచిరి - వారందరును.

దృశ్యము గాంచిన - యశోద అంత
గాలికి తెగిన - లతవలెబడెను
ఆమెను పట్టుకు - గోపకాంతలు
కృష్ణుని - ఉద్దేశించి పలికిరి.

గోపికలందరు - ఏకధారగా
శోకములోన మునిగిపోయిరి
పున్నమి వెన్నెలవలె - చల్లగను
నవ్వేవారు - ఎవరున్నారిక.

కృష్ణా - నీవుఎదురువచ్చి - మరి
పలుకరింతువే - మరి రావేమి!
ఎంతదూరమున - నున్నను గానీ
వత్తువే మరి - యిపుడటు చేయవు.

నిన్ను వదలి - మేమిట మనలేము
అందరమొకటై - మడుగున పడెదము
అనుచు-సిద్ధపడ - బలరాముడు - గని
వారిని - నిలుమని వారించెనట.

అనుచు బిగ్గరగ - ఆక్రందించిరి
అంతట నందుడు - మొదలగు వారు
కాస్త తేరుకొని - కృష్ణుడు వినునటు
మడుగు ఒడ్డున నిలబడి పలికిరి -

తొందర వలదు - నిదానించుడు
కొంచెము - ఓపిక పట్టుడు - మీరు
అనగా నందరు - నిలచిపోయిరి
దిక్కులవంక - చూచుచుండిరి.

విషపూరితమగు పాలను ఇచ్చిన
పూతన విషము - మ్రింగినవాడవు
ఈ విషమునకు - లొంగిపోదువా!
ఎంత బాధలో - నుంటివి నాయన.

అంతటిలోన - యశోదమ్మకు
స్పృహ తప్పినది - నేలను బడినది
కలవరింతలా - పలుకసాగెను
ఉపచారములు చేయుచుండిరి.

కర్కశముగ - తన కరకుకోరల
కొరుకుచున్న - ఈ విషఫణి బాధకు
ఎటుల సహించి - నిలచితివయ్యా
మేము సిద్ధమీ - పాము వాతబడ.

ఆమె పలికినది - ఆవేశముతో
కృష్ణా - నిన్నా పాము గెలుచునా!
నిను బంధించి - హాని చేయునా!
అంతా భ్రాంతి - తెలిసినదయ్యా.

కన్నా - నీవు - వెన్నతింటివని
దండించితిని - పాపము చేసితి
అలుకమాని - నువు పలుకరించవా!
గజ్జెలు ఘల్లన - గంతులేయవా.

రారా - బాబూ - రమ్ము రమ్మిక
ఆలసించక - నాదరి రమ్ము
నిన్ను చూడక - నిలువలేనిక
అనుచు పలుకుచు - నున్న యంతలో.

చిరునగవులతో – తన కృష్ణయ్య
పాముపైన – మరి అగబడినాడు
కన్నులు మూసుకు – తిరిగి తెరచెను
మేరు గిరివలె – కనబడె బాలుడు.

పాము కట్లవి – విడిపోయినవి
పాము శరీరము – నలిగిపోయినది
పాముకు – కరిచే శక్తి వుడిగెను
పాపతేడిక – కదలక పోయెను.

ఊపిరి అందని – స్థితిలో పాము
ఆయాసముతో – విషము విడచుచు
కృష్ణుని వదలి – ప్రక్కన నిలబడె
కమిలిపోయెను – పాము శరీరము.

పట్టు వదలిన – అదను చూసుకొని
ఫణిని బట్టి – మరి దౌడలు నొక్కి
గిరగిర త్రిప్పి – చాప చుట్టలా
నీటిలో విసరెను – లాఘవమ్ముగా.

ఫణిముక్కులవి – రక్తము గ్రక్కెను
చావలేక – ఆ పాము నిలచినది
అంతట కృష్ణుడు – కాళీయునిపై
నాట్యమాడగ – సంకల్పించెను.

రత్నాలంకృత – వేదికనచ్చట
రచించినట్టు – భావించుకొని
నందనందనుడు – పదకమలమ్ములు
నాట్యరీతిలో – మలచుకు – నిలచెను.

యమున నీటిలో – తరంగమ్ములవి
మృదంగ రవళి – చేయుచున్నవి
బృందావన – వన – పరిమళసుమముల
భ్రమరమ్ములవి – పాటపాడినవి.

రాజహంసలు – బెగ్గురు పక్షులు
తాళమ్ములను – వేయుచున్నవి
నింగిని నిలచి – సురలందరును
ప్రేక్షకులై – మరి చూచుచుండిరి.

కళానిలయము – కృష్ణుడన్నటు
కరుణామయుడే – కృష్ణుడన్నటు
కాళీయుని – మదమణిగించినటు
కదం త్రొక్కుచూ – నాట్యము చేసెను.

గోపబాలుని – వేషమునున్న
పాపహరణుడు – కృష్ణదేవుడు
పాపతేనిపై పడగలపైన
పదముల – ఆడగ – పరవశించిరి.

నింగిని నిలచి – మురిసిపోయెడి
ప్రేక్షకులంతట – పుష్పవృష్టిని
కురిపించగను – దేవదుందుభులు
విజయ సూచనగ – మ్రోగుచున్నవి.

భువనాలన్నీ – బొజ్జలో నిలపిన
బాలుని బరువు – భరించలేక
నోటినుండి – తా – రక్తము గ్రక్కుచు
మదిలో తలచెను – ఫణిరాజంతట.

దేవతలైనా - విషాగ్ని కీలల
హరించిపోదురు - ఆశ్చర్యమిది
ఇంతటి బాలుడు - నన్ను జయించెను
హరీ -యీతడు - హరియే యగును.

జగన్నాథుడు - జగద్వంద్యుడు
జగదీశ్వరుడు - జగపతియితడు
బ్రహ్మాండములను - ఏలే బాలుడు
అని గ్రహించి - తా - శరణువేడెను
॥శ్రీ కృష్ణచరితము॥



## 21 కాళీయుని భార్యలు - కృష్ణుని స్తుతించుట

కాళీయుని - మదమణగించుటకై
పడగల - నాట్యము సలిపిన కృష్ణుని
నాగకాంతలు - గాంచిరి భక్తిగ
జీవచ్ఛవమై - భర్తయుండెను.

జగముల - మేలు చేసెద వీవు
పగతో - జీవుల బాధించవయా
విషఫణులమగు - మమ్ముల నీవు
శిక్షించుటది - మాపుణ్యమయా -

పతిని గావుమని - ప్రార్థన జేసిరి
పసుపు కుంకుమలు-నిలపగ వేడిరి
వీడిన కొప్పుల - శోకలతలవలె
కృష్ణదేవుని పదముల వ్రాలిరి.

ఎంతో తపము - నోముల ఫలముచె
నీపదరేణువు - స్పృశించె లక్ష్మి
కానీ - ఎట్టి కష్టము లేకనె
కాళీయునికది - లభించె నేడు.

తమ సంతతిని - ముందునిడుకొని
భక్తి ప్రపత్తుల నమస్సులుంచిరి
ప్రదక్షిణించి - నమస్కరించిరి
కరములు ముడిచి-ప్రార్థించి రిటు -

నీపద రేణువు స్పర్శ కలిగిన
బ్రహ్మపదవిని - తిరస్కరింతురు
ఇంద్రపదవిని - ఈసడింతురు
రాజ్య పదవిని - లెక్కజేయరు.

"దుష్ట శిక్షణకు ఇలలో బుట్టిన
దివ్య స్వరూపా - నీ పదకేళిలొ
ధన్యుడయ్యె - ఈ పాముల తేడు
ఎంతటి పుణ్యము చేసెనో మరి.

సంసార జలధిలో - ఈదులాడుచు
గట్టుకు చేరే మార్గము గానరు
కానీ - ఇపుడీ ఫణిరాజునకు
సులువుగ - మార్గము జూపితివీవు -

కాలస్వరూపా - త్రిగుణమ్ములతో
సృష్టిని రచించి - నడిపెద వీవు
విశ్వనాథుడవు - విశ్వకర్తవు
మా తప్పులు-మన్నించుము స్వామీ -

బిడ్డల తప్పులు - తండ్రి గాచినటు
కాపాడుమయా - కారుణ్యాలయ -
క్రోధాంధుడగు - పన్నగరాజు
మంచివాడని - అనగా తగదు.

కానీ - స్వామీ - వైధవ్యముతో
బ్రతుకులు మావి - దుర్భరమగును
మర్దనమైనది - గుణవర్ధనము
కావున యితడు-మంచిగ బ్రతుకును.

ఈ పసికందుల-ముఖములు చూచి
పతిని గావుమో! - పరమదయాకర -
నాడు చేసిన - పెండ్లి - పెండ్లియా!
నేడు - నీవు-మరి చేయుము పెండ్లి.

తండ్రి చేసిన - వివాహబంధము
ఇక తెగిపోవు - నీదయలేనిచొ
ఆ బంధమును - భద్రము చేయుము -
పసుపు కుంకుమలు-నిలుపుము స్వామీ.

ఆశ్రితపాలా - అఖిలాండేశ్వర -
నీవు చెప్పినటు - నడచును భర్త
కావున - మాకు పతిని ఒసంగుము
మా ప్రార్థన - మన్నించుము-వంశీ!"

నాగ కాంతల - దుఃఖము గాంచెను
వెన్నపూసలా - కరగె హృదయము
వెన్నుడు - వెంటనె తేలికబడెను
కాళీయునికి - బరువు దిగినది.

చితికిన తలలు - సరిచేసుకొని
శిరములువంచి - ప్రార్థించె నిటు
"సుకుమారమగు - నీ పదములకు
పడగలంటగా - వందనమిదిగో!

పాములనడక - వంకర టింకర
ముఖముల-విషపు-సెగలెగయునయా!
దుర్మార్గులము - గర్వాంధులము
మమ్ము - మంచిగా - తలంచరెవ్వరు.

జన్మతొ వచ్చిన - సహజగుణమ్ము
వదలి వుండుట - జరగదు స్వామీ!
నేటినుండి - నే మారిపోతిని
జన్మనిచ్చిన - జనకుడవైతివి.

తృంచుట - పెంచుట - నీకే తగును
నీ పద స్పర్శ - కలిగిన నాకు
మరణము - మహదానందము స్వామీ!
దేహవాసన - అంతరించినది".

అటుల పలికిన - ఫణిరాజును గని
నీవు వెంటనే - మడుగును వదలుము
ఇకపై - నీరు త్రాగ - యోగ్యమగు
అనుచు కృష్ణుడు - ఆనతినిడెను.

ఈ కథ వినిన - చదివిన వారు
పగలూ - రాత్రీ - సంధ్యాసమయము
విష భయమన్నది లేక - సుఖముగ
జీవించెదరని - కృష్ణుడు పలికెను.

ఇప్పటినుండి - ఈ జలమందున
స్నానము జేసి - నను సేవించి
పితృతర్పణము లిచ్చినవారికి
పాపములన్నీ హరించిపోవును.

గరుత్మంతునికి భయపడి - నీవు
రమణకద్వీపము - విడచివచ్చితివి
నా పదముద్రలు - నీశిరమున గని
గరుత్మంతుడు - హానిచేయడు.

అనుచు - కృష్ణుడు - కాళీయునికి
వచ్చిన చోటికి - పొమ్మని చెప్పగ
పదములు బట్టి - నమస్కరించి
శ్రద్ధాభక్తుల పూజలు చేసెను.

దివ్యాంబరములు - ఆభరణములు
అర్పించెను - శ్రీ కృష్ణదేవునికి
నల్ల కలువల - మాలను తెచ్చి
కంఠసీమను - అలంకరించెను.

చిరునగవులతో - సిరిమగడంతట
శుభము పలుకగా - కాళీయుండు
కాంతలతోనూ - సంతతితోను
వదలిపోయెను - యమునా నదిని.

అంతటి నుండి-యమున తోయములు
అమృతమయమై - శోభలీనినవి
కృష్ణదేవుని - పాదామృతమై
దివ్యతీర్థమై - నిలచెను భువిలో-"

భక్తిగ - రాజు అడిగె - మునీంద్రుని
రమణక ద్వీపము - ఎందుకు వదలెను?
కాళీయుడు- మరి-గరుత్మంతు నెడ
చేసిన తప్పు - ఏమిటి స్వామీ!

ఆనందముతో శుకమునీంద్రుడు
ఆరంభించెను-వినుమని రాజుతొ-
"రమణక ద్వీపము నందలి జనులు
పాముల వల్ల భయముతొ నుండిరి.

వారందరును - పాములకొరకై
పలురకములగు భక్ష్యమ్ములను
తరు మూలముల వుంచెడివారు
పాములనటుల - తృప్తిపరచిరి.

ఆ పన్నగములు - దొరకిన దానిలొ
సగముతీసి అట - గరుత్మంతునికి
ఆహారముగ - నొసగుచుండెడివి
గరుత్మంతుని - తృప్తిపరచెడివి.

అహంకారమున - బల గర్వితుడై
తనను మించిన వాడే లేడని
ఒక దినమున - కాళీయుడంతట
గరుత్మంతుని - ఆహారముతినె.

విషయము గ్రహించి - ఖగరాజంతట
కాళీయుని - మదమణగించెదనని
మహోగ్రుడై - అట కరుగుదెంచెను
రెక్కల విసురుకు - గిరులు దొర్లినవి.

చేపల దుఃఖము - గాంచిన - మౌని
వాటికి - ముదము కలిగించుటకై
గరుత్మంతుడు - యిటకు వచ్చిన
చచ్చును - అనుచు శాపమునిడెను.

అది గమనించి - కాళీయుండు
పోరుకు - తాను సిద్ధమయ్యెను
పడగలు విప్పి - బుసలను కొట్టి
గరుత్మంతుని - కరచె నప్పుడు.

ఆ విషయము - మరి కాళీయునికి
తెలియును - కావున అటకు వచ్చెను
ఖగరాజటకు - రాడని తెలిసి
నిర్భయమ్ముగా - బ్రతుకుచుండెను.

క్రోధ జ్వాలలు - ఎగసిపడగను
వినతాసూనుడు - ఆవేశముతో
పడగలపైన - తన్నె నొక్కపరి
దెబ్బతొ పరుగిడె - కాళీయుండు.

మెరపుతీగలా - వెలుగులు చిమ్ముచు
చిరునగవులలో - వెన్నెల విరియగ
ఆభరణములు - దివ్యాంబరముల
నందనందనుడు - ముందు నిలబడ.

గరుత్మంతుని - దెబ్బకు - తలలు
చీలిపోయినవి - వెంటనె - పాము
వెనుకకు చూడక - పరుగున వచ్చి
యమున అడుగున-బ్రతుకుచుండెను.

ఆనందముతో నందాదులును
గోపికలందరు కృష్ణుని గాంచి
జవసత్వమ్ములు వచ్చి చేరగా
పరవశమ్మున -పొంగిపోయిరి.

సౌభరి-యనునొక - మునిపుంగవుడు
యమునా జలముల-తపములో నుండెను.
ఆ సమయములో - గరుత్మంతుడు
యమునకు వచ్చి - చేపల గాంచెను.

యశోద, రోహిణులిద్దరు - అపుడు
అమిత ప్రేమగా - గుండెలచేర్చుకు
ఆనందముతో - పులకరించిరి
పునర్జన్మను - ఎత్తినట్లయె.

చేపలరాజును - ఎత్తుకుపోయి
ఆహారముగా - గ్రహించినాడు
అంతట - చేపలు దిక్కులేకను
విలవిలలాడుచు - రోదించినవి.

బలరాముడు-తన-తమ్ముని-ముదముగ
కౌగలించుకొని - మురిసిపోయెను
గో సంపద - అది - గంతులేసెను
క్షీరధారలు - కురిసె - వృష్టిగా.

వేదవిదులు అట ఆశీస్సులనిడి
మంగళవాచక పఠనము చేసిరి
సర్పగండము తొలగిపోయెనని
నందుని - కృష్ణుని - అభినందించిరి.

తొడపై కూర్చొన బెట్టుకు - యశోద
నా యదృష్టము కావున - నీవు
బ్రతికినావు - నను బ్రతికించితివి
అనుచు ముద్దిడి - మురిసిపోయినది.

దుష్ట పన్నగము - బాధించగను
అమ్మా-అని నువు-పిలచినావు కద!
ఎంతటి బాధను - అనుభవించితివో
అనుచు - చెక్కిలి ముద్దిడె యశోద.

రాత్రి అందరు -యమున ఒడ్డున
నిద్రించిరి - వారలసటనిండి
అంతటలోన - అర్థరాత్రమున
అడవి నుండి-అట-మంటలు లేచెను.

భీకరమగు - కార్చిచ్చు రగిలినది
ఫెళఫెళమనుచు - కూలెను చెట్లు
జ్వాలల-నాల్కలు - ముందుకు జాపి
మంట లెగసినవి - కలవరపడిరి.

వంశీ - కృష్ణా - పరమదయాళో!
మము కాపాడుము - కారుణ్యాలయ
అనుచు - బిగ్గరగ అరచుచుండిరి
శరణు-శరణు - అని భీతిలి పలికిరి.

వెంటనె కృష్ణుడు - ముందుకువచ్చి
నమ్మినవారిని - ఆదుకొనుటకై
అంతటి మంటను - ఒడుపుగ బట్టి
మ్రింగివేసెను - వెన్నముద్దలా.

ఆశ్చర్యములో మునిగిరందరు
కాపాడితివని - పొగడిరి కృష్ణుని
కరుణాపూరిత - నేత్రమ్ములతో
ఆశీస్సుల నిడె - వారందరికీ.

నిర్వికారముగ నుండెను కృష్ణుడు
మంట మ్రింగిన - జాడలేదయె
హాలాహలము - మ్రింగిన శివుడు
ఆహా - యనుచు - మురిసిపోయెను.

ఆ విధముగను - రోజులు గడచెను
అంతటిలోన - గ్రీష్మఋతువది
అడుగుబెట్టెను - తాపము నింపెను
చల్లని నీడకు - జేరిరి జనులు.

॥శ్రీ కృష్ణచరితము॥



## 22 గ్రీష్మఋతు వర్ణనము

సూర్యదేవుని - రథ చక్రములు
ఉత్తరదిశకు తిరిగిన వపుడు
జీవులపైన తన అధికారము
చూపించుటకై-తాపము పెంచెను.

తన వేడికి - తా - తాళలేకను -
నదుల - తటాకములందలి నీరు
అవురా వురని - ప్రచండమూర్తి
తపనుడు - తాను - త్రాగుచుండెను.

నిప్పులు చెరిగే - ఎండనంతను
తన ప్రతాపమని - వివస్వంతుడు
జనుల మీదకు - విసరుచుండెను
చెట్ల నీడకు చేరెను-ప్రాణులు.

చలివేంద్రములు - కంటబడగనే
బ్రతుకు జీవుడా - అనుచు జేరిరి
జరుగుబాటుగల - జనులందరును
వట్టి వేళ్ళ - అచ్ఛాదన నుండిరి.

తేమ లేకను - చెట్లు ఎండెను
పెనవేసిన - ఆ లతలు వాడెను
మన్మథునెంతయు - ఆహ్వానించక
దూరము కోరిరి-యువతరమంతయు.

బ్రహ్మాండమను - భాండమునందు
ఉష్ణరసమును - బ్రహ్మ పోయగా
దాని నుండి మరి - ఉద్భవించిన
వేడి కిరణములు - నిండెనంతయు.

ఆ రసమును - మరి - తాగిన అగ్ని
అడవులలోన - నెగళ్ళు పెట్టెను
కానీ - అచట - బృందావనమున
తపనుని ఆటలు - సాగుటలేదు.

పాప తాపములు - హరింప చేయగ
అవతరించిన - నందనందనుని
ఆతని అన్న - బలరాముని గని
గ్రీష్మమాయెను - వసంతఋతువుగ.

రామకృష్ణుల - ఉనికి చేతను
గ్రీష్మతాపమట - కనబడకుండెను
గంతులు వేయుచు-జలప్రవాహములు
గిరుల నుండి - అట జారుచున్నవి.

తరువులు, తీగలు - లేతనవ్వులతొ
పలుకరించునటు - నిండెను పూలతొ
ఆ సుమ గంధము-పవనుడు-తాను
జల్లుచుండెను - నాల్గువైపులా.

పచ్చిక పరచిన - నేల - తివాచిగ
రామకృష్ణులను - ఆహ్వానించెను
జంతుజాలము వసంత సుఖమును
అనుభవించుచు నుండెనప్పుడు.

పంచమ స్వరమున కోయిల పాడెను
చిలుక పలుకులతొ నిండెను ప్రకృతి
నెమళ్ల కేకలు - నింగి కెగసెను
గండు తుమ్మెదల - రొద పెరిగినది.

యమునా జలముల - చల్లని గాలిని
సుమ గంధముతో - సత్కరించగా
ఊగుచు పిలచే - పద్మమ్ములపై
ఎగసిన గాలులు - నిండెనంతట.

అటుల - గ్రీష్మము - వసంతమ్ముగా
రూపుదిద్దుకొనె - బృందావనమున
ఆ సమయములో - రామకృష్ణులు
బృందావనము - జేరిరి మందతొ.

గోపబాలురతొ - ఆనందముగ
ఆటల మునిగిరి - రామకృష్ణులు
తమ రాజులు - వారిద్దరనుచును
భుజములమోసిరి - మురిసిపోయిరి.

గోపాలకులు - వివిధ రాగముల
గానము చేయగ నంతట - కృష్ణుడు
పాటకు తగినటు - నాట్యమాడుచు
పరవశమ్మును - కలుగజేసెను.

ఆ పరమాత్మను సేవించుటకై
గోపాలకులై - దిగిన దేవతలు
ఆటపాటల - ఆనందముతో
అమరసుఖములు - మరచిపోయిరి.

॥శ్రీ కృష్ణచరితము॥

❊❊❊

## 23 బలభద్రుడు ప్రలంబాసురుని చంపుట

ప్రలంబుడను నొక దుష్ట రక్కసుడు
గోపకుమారుని వేషముదాల్చి
వారందరినీ కష్టపెట్టుటకు
వావిలొ ఒకనిగ కలసిపోయెను.

ఆట మధ్యలో అదను జూచుకొని
అన్నకు చెప్పెను ప్రలంబు సంగతి
అసురుని - అంతము చేయుటకొరకై
ఆతృత జూపెను - బలభద్రుండు.

అది గమనించెను నందనందనుడు
వానిని జేరి స్నేహము చేసెను
మిత్రులందరితొ పలికెనప్పుడు
క్రొత్త ఆట - నొకటాడుదామనె.

ఆటలాడుచు వారందరును
భాండీరకమను - మఱ్ఱి వద్దకు
పశువుల తోలుకు వచ్చి చేరిరి
ఆటను - వారు పూర్తి చేసిరి.

రెండు జట్లుగ విభజనజేసెను
ఒక జట్టుకు-తా-నాయకుడయ్యెను
రెండవ జట్టుకు - అన్న-నాయకుడు
బంతి ఆటను - ప్రారంభించిరి.

శ్రీదాముడను గోపబాలకుడు
శ్రీకృష్ణుని - తన భుజముననిడుకొనె
భద్రసేనుడు - వృషభుని మోసెను
ప్రలంబు నెక్కెను - బలభద్రుండు

ఓడినవారు గెలిచిన వారిని
భుజముననిడుకొని మోయగవలెను
ఆ షరతుకు వారందరు సై యన
ఆరంభించిరి - ఆటనప్పుడు.

ప్రలంబుడంతట - మదిలో తలచెను
"కృష్ణుని మోయుట వశముగాకను
చచ్చెను - నాడు తృణావర్తుడు
కావున - కృష్ణుని వంక చూడను.

వానికి అన్న - వీపున నున్నది
కావున వీనిని హరింతుననుకొని"
అతివేగముగా పరుగిడసాగెను
గాలిలొ వాడు దూసుకుపోయెను.

బంగరు కడియమ్ములతో అసురుడు
వీపుననున్న బలరామునితో
మెరపుతీగలు - చందమామతో
కలసిన - మేఘము అన్నటు తోచెను.

కొంతదూరము పోవునప్పటికి
వీపున - బరువు అధికమైనది
పర్వతమ్మునే మోయుచున్నటు
పరుగు తగ్గినది - నడక సాగదు.

అసురుని అసలు రూపము గాంచిన
బలభద్రుండు - పిడికిలి బిగించి
నెత్తిని మోదగ - తల చితికినది
అసువులు వీడి - నేలకు రాలెను.

మన బలరాముడు అసురుని జంపెను
మనలందరను కాపాడెను గద
అనుచు గోపకులు ఆనందించిరి
పూలవాన కురిపించిరి సురలు.

❊❊❊ ॥శ్రీ కృష్ణచరితము॥

## 24 కృష్ణుడు దావాగ్నిని మ్రింగి గోపకులను కాపాడుట

పచ్చిక మేయుచు గోవుల మందలు
బృందావనముకు - దగ్గరనున్న
అడవియందున ప్రవేశించెను
అచ్చటనున్నది - దావానలము.

ఆదుకోవయా - ఆపద్బాంధవ
నీవుగాక - మరి దిక్కెవ్వరిక
అని అరచెడి ఆ పిల్లలగాంచి
కరుణామయుడు అభయమునిచ్చెను.

ఆ మంటలలో చిక్కడె - గోవులు
వాటి అరపులకు గోపాలురు - చని
వాటిని బయటకు తోలుకువచ్చిరి
కానీ - అగ్ని - అల్లుకుపోయెను.

"ప్రాణసమానులు మీరందరును
మూగజీవులీ - గోవులు ప్రాణము
కావున మిమ్ముల - రక్షించెదను
కనులు మూసుకొని-ప్రార్థన చేయుడు".

ఆ దావాగ్నిలొ - గోవులు - మరియు
గోపబాలకులు - చిక్కడిపోయిరి
కృష్ణా! నీవే రక్షకుడవని
ప్రార్థన జేసిరి నమ్మకమ్ముతో.

కృష్ణుని మాటల - వారందరును
కనులు మూసుకొని రంతటిలోన
అవలీలగను - దావానలమును
వెన్న ముద్దలా - మ్రింగివేసెను.

ఆపదగడచి - బ్రతికిరందరు
భాండీరకమను తరువును జేరిరి
జరిగిన దంతా వింతగతోచెను
ఇంద్రజాలమా అనిపించినది.

తీయగ వేణువు నూదెను కృష్ణుడు
అందరు జేరిరి నందనందనుని
వారందరును గోవుల తోలుకు
తిరిగివచ్చిరి వారి గృహములకు.

మానవ మాత్రుడుచేయగలేని
మహితకార్యము కృష్ణుడు చేసెను
కావున - సామాన్యుడు కాడీతడు
బ్రహ్మయొ, విష్ణువొ, రుద్రుడొ యగును.

గోపాలకులు తమ పెద్దలకు
రామకృష్ణుల ఘనత చెప్పగా
వారందరునూ - వారిద్దరినీ
భువికి దిగిన ఆ దేవతలనిరి.

॥శ్రీ కృష్ణచరితము॥



## 25 వర్షఋతు వర్ణనము

ఋతుచక్రమది తిరుగుచుండెను
వర్షఋతువది అడుగిడె చల్లగ
తూరుపుగాలుల జోరు హెచ్చెను
పులకరించెను - వసుధయంతయు.

మేఘమ్ములను గాంచిన రైతులు
ఆనందముతో పులకరించిరి
జలచరమ్ములకు ఊపిరి వచ్చెను
ఎదురు ఈదుచు నుండెను జలముల.

పడమటి దిక్కున - ఇంద్రధనుస్సు
రంగవల్లిని - తీర్చిదిద్దెను
తడవకుండ - తానుండుట కొరకై
సూర్యుడు-తానొక-గుడిని కట్టుకొనె.

భూమియనెడి - ఆ - స్త్రీపై నపుడు
నాగటిచాలులు అగపడుచుండగ
వర్షఋతువను - విటుడు - గోళ్ళతో
చేసిన - ముద్రలు అనిపించినవి.

చాతక పక్షులు వర్షధారలతొ
గొంతు తడుపుకొని పరవశించినవి
అడవుల - మంటల జోరు తగ్గినది
జల్లులు పడగా చల్లబడినవి.

వర్షాకాలము అనెడి మిత్రుని
చూచిన యట్టి - సస్య సంపద
ఆనందమును తెలియబరచినటు
ఎత్తుగ ఎదిగి - ఫలించి నిలబడె.

నదుల సరస్సుల-జలములు-తాను
వేసవిలో మరి-ఋణముగ గైకొని
తిరిగి ఋణమును - తీర్చివేసినటు
భానుడు నిలచెను - పీల్చివేయక.

రెక్కలు గలిగిన కాటుక కొండలు
ఎగురుచున్నవా - అన్నటు - మబ్బులు
నింగిని పరుగిడ - సుందరమయిన
దృశ్యము కనులకు విందుచేసెను.

వర్షాకాలము అనెడి విటుండు
విసరినట్టి - కర్పూరపు ముక్కలు
అవియే - అన్నటు - అచ్చటరాలిన
వడగళ్ళపుడు తోచుచున్నవి.

జడివానలలో తడిసిన గిరులు
జలకాలాడిన - కరులనిపించెను
పారెడి నదులు - గట్లను తాకెను -
జారెడి - జలపాతమ్ములు - పాడెను.

మీన నేత్రముల లతాంగులను గని
తన సోయగము తక్కువ అనుకొని
మెరపులు - మేఘములందు దాగెను
మధ్యమధ్యలో - చూచుచున్నవి.

మెరపుల - తీరుగ - కోమలాంగులు
చంచలమతులని - తెలియబరచునటు
మేఘమునందలి-ఉరుములు వినబడె
నెమళ్ళు - నృత్యము చేయుచున్నవి.

ఎడబాటుకు మరి గురియగునట్టి
ఆలుమగలకు - తోచకపోయెను
పగలూ, రాత్రీ అన్నది తెలియని
స్థితిలో నున్నది - మబ్బుల నింగి.

మిణుగురు పురుగులు-సాయంసంధ్యలో
చిరుదీపములను వెలిగించినవి
సూర్యుడు కనబడకుండుట చేత
ఆటవికులకట - తిండి కష్టమయె.

మొగలి పొదలవి గుబాళించగ
రంగురంగుల - పాములల్లుకొని
అలంకరించుకు నిలచిన స్త్రీలై
వరుణుని - ప్రార్థన నున్నటుతోచెను.

ఒత్తుగ - చిగుళ్ళు పెరిగిన పచ్చిక
కొత్త తివాచీ పరచినట్టయె -
వాన దెబ్బకు - తెగుళ్ళుపోయి
ఆరోగ్యముగా పెరిగెను పైరులు.

పచ్చని పచ్చిక - చిగుళ్ళుమేసి
పసిమివన్నెతో - నిగారింపుతో
పొదుగు బిందెలతో - పట్టుచీరలతొ
పశువులు తోచెను బాలింతలవలె.

అన్నగారితో తన స్నేహితులతొ
ఆలమందతో - కృష్ణుడు సాగి
బృందావనమున ఆటల పాటల
ఆనందముగా గడుపసాగెను.

ఎన్నోవిధమగు ఆటలనాడును
తానే - నాయకుడందరి కన్నటు
వారందరినీ జేరదీయుచు
ఆనందమును పంచి పెట్టెను.

జగన్నియంత - జగద్వంద్యుడు
జగముల-నుదరమునందు-నూపుచు
జగములొ-తానొక-గోపాలునిగ
జన్మించుట-భూదేవి పుణ్యము.

హృది కదిలించే - వేణుగానము
విశ్వమోహనము - వేణుగానము
మేఘగర్జనగ - నాదము ఎగసెను
నాదబ్రహ్మయే తానై నిలచెను.

పెదవుల - మరళీ మురిసిపోవగా
వదనము నందలి - విరసిన నగవు
మెరపు తీగతో - కలసిపోయినది
అందమ్మునకే వన్నెలు దిద్దెను.

శిరసున నిలచిన శిఖిపింఛమది
ఇంద్రధనుస్సును మించె నందమున
అభిమాన సుధయది-కురియుచున్నది
గోపాలకులు పులకరించిరి.

కృష్ణమేఘము నేలను నిలిచి
బృందావనమున పరవశమిడగా
నింగిని మేఘము - కన్నెర్రగను
చూచి చూచి - మరి అలసిపోయినది.



॥శ్రీ కృష్ణచరితము॥

## 26 శరదృతు వర్ణనము

గో - వృషభములకు-లేగదూడలకు
కృష్ణుడు-ముదముగ పూజలు చేసెను
వర్ష ఋతువుకుఅనువగు పనులతొ
ఆనందముగా గడపిరందరును.

అంతటిలోన - శరదృతువది
మెల్లమెల్లగా అడుగుబెట్టెను
తోటలు - చిక్కని ఆకుల నిండెను
బురదనేలల - తడి - ఆరినది.

నెమళ్లగొంతులు పెగలుట లేదు
ఉరుముల మెరపుల - సందడి ఆగెను
స్వచ్ఛజలముతో - నదులన్నియును
ఉత్తమ పురుషుని మనసును పోలెను.

మేఘమ్ములవి తేలిక పడగా
గాలికి చెదరి పోవుచుండగా
ఇహ సంబంధము వదలిన జ్ఞాని
ముక్తుడైనటు తోచుచున్నది.

అగస్త్యోదయము - అయినంతటను
విజ్ఞాన జ్యోతిలో వెలుగుచునున్న
యోగి పుంగవుని - హృదయమువోలె
ఆకాశమ్ము అగపడుచున్నది.

మెరిసే ఆకాశములో నపుడు
నీటి బిందువులు జారుచుండగా
నీలి చాందినీ నుండి జారెడు -
ముత్తెపు సరములు - అన్నటు తోచెను.

తారల వెలుగును అధిగమించి మరి
చంద్రకాంతులు ఎగయుచుండగా
బ్రహ్మాండమను - పెట్టెనుండి - అవి
వెదజల్లిన కర్పూర కణికలయె -

చంద్రకాంతితో ఫలించి - సశ్యము
కోసివేతురని - ఆక్రోశించుచు
బాధను - పుడమికి తెలుపుచున్నటు
కంకుల తలలు - వంచి నిలచినది.

గింజల - కొరకు ఎగిరెడి పులుగులు
మంచెలనున్న - కాపుకన్నెల
అధరములవ్వి - దొండ పండ్లని
భ్రమించి - కొరికి - ఎగిరిపోయినవి.

చిక్కగ - లతలు - అల్లుకుపోగా
పూపొదరిండ్లు పులకరించినవి
సూర్యదేవుని కర -కిరణమ్ములు
నేలను జేరగ అసాధ్యమైనది.

సోయగ మొలుకుచు సరోవరమ్ములు
స్వచ్ఛ జలముతో లక్ష్మీదేవిగ
నేత్రపర్వము చేయుచున్నవి
మంగళకరముగ అగుపించినవి.

ఎత్తుగ పెరిగిన - తరువులనెంతో
అతితేలికగా - విరచిన కరులు
ఆనందముగా ఆరగించుచు
మదించి - తిరుగుచు కనబడుచున్నవి.

హంసలు-సారస పక్షులు-ముదముగ
సవ్వడి చేయుచు శోభను పెంచెను
నీరు తగ్గగా-జలచరమ్ములకు
ఆందోళనయది ఆరంభమయె.

సన్నని నడుముల - చెంచుకాంతలు
విల్లంబులతో - అడవి జంతువుల
అవలీలగ - వేటాడుచుండిరి
తుమ్మెదరవములు మింటికెగసెను -

మధ్య మధ్యలో ఇసుకదిబ్బలు
కర్పూర మంటపము లన్నటులున్నవి
వాటిపైన మరి కూర్చొని - మునులు
సంధ్యనిష్ఠలు చేయుచుండిరి.

వసుధ శోభిలె - సస్య సంపదతొ
విజయహారతులు - అశ్వములందెను
జమ్మికొట్టిరి - భేరులు మ్రోచిరి
దండయాత్రకై -సాగిరి రాజులు.

రసాల, సాల వృక్షమ్ములను
ముని బాలికలు ముదముగ పెంచిరి
ఆ తరు సంపద అలంకారముగ
నయనానందము చేయుచున్నది.

లక్ష్మీపూజలు చేయుచు -కాంతలు
లక్ష్మీ కాంతితొ - వెలుగుచుండిరి
అనంగుడంతట - పూల బాణములు
సంధించుటకై - సంబరపడెను.

॥శ్రీ కృష్ణచరితము॥



## 27 వంశీగానం

సోయగ మొలికెడి శరదృతువులో
హాయిగొలిపెడి ప్రకృతి గాంచి
బృందావనిలో - నందనందనుడు
వేణుగానము ఆరంభించెను -

విరబూసిన - ఆ పొన్న ఛాయలో
విలాసమ్ముగా నిలబడినాడు
కుడిపాదమును - ప్రక్కకువేసి
ఎడమకాలిపై నిలబడినాడు.

చెవిసందున - ఆ - గోగుపూవది
నవ్వగ - వన్నెలు - బుగ్గలపైబడి
నీలిరంగును - రంగరించుకొని
నయనానందము జేయుచున్నది.

క్రొంజిగురాకుల బోలిన పెదవుల
లీలగ - నిలచిన వేణువుతోను
జగన్మోహనుడు నిలబడినాడు
జగత్తు పరవశ మందుచుండెను.

ముఖ పద్మమున ముంగురులాడుచు
తుమ్మెదలను మరి రమ్మని పిలచెను
నెమలి పింఛమా పాట గమకముల
వ్యాఖ్యానించెను-అన్నటు కదలెను.

జగముల నూయల నూపుచున్నటు
నందనందనుడు వేణువు నూదెను
పరవశమ్మున ప్రకృతి నిలచెను
పులకరించిన - లతలు పూసెను.

వయ్యారముతో - వనలక్ష్మి - అట
వసంత ఋతువును జేరదీసెను
కోటి కోకిలలు కూసినట్టుగా
పల్లెను రమ్మని - పిలచినదపుడు.

గోపకాంతలు - గోకులమంతయు
గోపాలుని - ఆ - వేణుగానమును
వినగా - తొందరపడి - వచ్చిరట -
పొన్నచెట్టుకడ - చేరిరందరు.

వేణుగానము మనసును దోచెను
ముగ్ధ మోహనుడు - కన్నులనిండగ
పెదవుల - మరళీ నాట్యమాడగా
దృశ్యము గాంచి - పరవశించిరి.

ఎంతటి పుణ్యము మురళీ చేసెను
పెదవుల - నిరతము నాట్యమాడును
కరముల నిలచి - పులకరించును
అనుచు - అందరూ పొగడుచుండిరి.

వారిలో వారు - గోపకాంతలు
వరుసలతో - మరి పిలచుకొనుచును
మధురనాదమున పరవశించుచు
వేణువు ఘనత చెప్పుచుండిరి.

వేణుగానమున పొంగిన యమున -
తరంగములతో - లయబద్ధముగా
తాళము వేయుచు - నందనందనుని
నీడను - తనలో దాచుకొన్నది.

నీలి మేఘమా కృష్ణమూర్తి యని
వేణుగానమే మేఘగర్జ నని
తలచిన నెమళ్ళు - ఉనికిని మరచి
పరవశించి - అట - ఆడుచున్నవి.

మేతనుమరచి - నిలచెను గోవులు
పాలను వదలి - లేగలు చూచెను
బాలకృష్ణుని - మోహనరూపము
కన్ను లసలే మూయనీయదు.

తరువుల పులుగులు-గానము వినుచు
పరవశించి అరమోడ్చిన కన్నుల
ధ్యానమునున్న-మునులను బోలెను
రెప్పలార్పవు - రెక్కలార్చవు.

కొండచరియలు - పులకరింతతో
నవ్వుచున్నటు - పూలతొ విరిసెను
సుమహారములు - కాన్కగనిచ్చి
గానము వినుచు - నిలచె వసుంధర.

ప్రకృతి అంతయు - తనకు తానుగా
కృష్ణార్పణమని - నిలచియున్నది
ఆ దృశ్యముతో - పులకరించిన
గోకులమంతా ఉనికి మరచెను.

❊❊❊ ॥శ్రీ కృష్ణచరితము॥

# 28 హేమంత ఋతు వర్ణనము

హేమంతమది విరిసెను - ముదముగ
చందమామ - తా - చల్లదనమును
జల్లుట తగదని తలచెను మదిలో
అగ్నిదేవుడు ఆరాధ్యుడయె.

త్రేతాగ్నులవి చలికి భయపడి
శివుని కంటిలో - సంద్రపులోతులా
జనుల యింటిలో - మూడు సర్దుకొని
బ్రతుకు జీవుడా - అన్నటులున్నవి.

మన్మథుడపుడు పూలబాణముల
వీర విహారము చేయుచుండెను
మగని మీద - మమకారము పెరిగెను
ఆలు మగల కానంద సమయమయె.

చిక్కని చలిలో - గోపకాంతలు
మార్గశిరమున శుద్ధపాడ్యమిని
యమునా నదిలో స్నానము చేసి
కాత్యాయనికి పూజలు - చేసిరి.

ఉదయించిన ఆ సూర్యబింబము
చలికి - చిక్కక - పరుగిడునటుల
వడిగా సాగి - పడమటి కొండల
చాటున దాగి - అలసట తీరెను.

ఇసుక తిన్నెలో - అమ్మను - జేసి
అర్ఘ్యపాద్యముల - పూజలు చేసి
గంధాదులతో - అర్చనజేసి
నైవేద్యముతో తృప్తి పరచిరి -

మనసు నిండుగా ప్రార్థన జేసిరి
మనసుకు నచ్చిన వరుని కోరిరి -
జాతర చేతుము - అనుచు మ్రొక్కిరి
ప్రసాదమ్ములను ఆరగించిరి.

❊❊❊ ॥శ్రీ కృష్ణచరితము॥

## 29 గోపికా వస్త్రాపహరణము

యమునానదిలో స్నానమాడగ
ఉదయమె - లేచి - గోపకాంతలు
ఆనందముగా బయలు దేరిరి
నందనందనుని కీర్తన జేసిరి.

వలువలు దీసి - ఒడ్డున నుంచి
జలముల దిగి - అట స్నానమాడుచు
జలక్రీడలలో మునిగి యుండిరి
బాలకృష్ణుడది గ్రహించినాడు.

దూరముగా తన వారిని - నిలపి
తానొక్కడె - ఆ - యమునకు జేరి
వలువలన్నిటిని మూటగ - గట్టి
పిల్లిలాగ - అట తరువునెక్కెను.

జలకాలాడిన యువతులంతట
చీరలు లేవని గ్రహించినారు
సంగ్రహించినది కృష్ణుడేయని
తెలిసిరి వారు - బ్రతిమిలాడిరి.

"శ్యామల మూర్తీ! భామల కోకలు
అనుగ్రహించి - వదలివేయుము"
గొంతువరకును నీటిలొ నిలచి
దీనముగా ప్రార్థించిరి వారు.

"గోకుల నేతకు తనయుడ వీవు
సుకుమారుడవు - కోకలీయుము
నిన్ను వేడితిమి - జాలి జూపుము
ఎన్నో దండము లివిగో కృష్ణా!"

కృష్ణుడంతట - వారితొ బలికెను
గట్టుకు జేరి చీరలు గొనుడు -
అనగా - వారు తిరిగి బలికిరి
దిగంబరముగా నుంటిమి గాదా -

అంతట కృష్ణుడు వారితోననె
"వ్రతములోనున్న మీరందరును
దిగంబరముగా స్నానమాడుట
నిషిద్ధమని - మరి - తెలియకబోయిరి.

గట్టుకు జేరి - నమస్కరించిన -
చీరలిత్తును గొనుమని బలికెను"
ముడిచిన కరముల - ముగ్ధమోహినులు
సిగ్గుతొ తడిసి - నిలచిరచ్చట.

"సిగ్గు ఎందులకు - తెలియని వాడన
వ్రతఫలమందగ తలచినచో - యిక
ఆలసించక నమస్కరించుడు
మీరూ - నేనూ ఒకటని తెలియుడు"-

అటుల చేసిరి - గోప సుందరులు -
నందనందనుడు - అనుగ్రహించెను
అర్పణజేసి - అహమున వదలిన
వ్రతముల ఫలము లభించుననెను -

"మదిలో - మీరు - మరువరు నన్ను
మీలో - నాలో - నున్నది మమత
వేరను భావము - వదలివేయుడు
ఆత్మానందము పొందుడు మీరు"

అనుచు తియ్యగా బోధను జేసి
చీరల నిచ్చి - వ్రతఫలమంతయు
పరిపూర్ణముగా లభించుననుచు
వారి మనస్సుల - నిలచెను కృష్ణుడు.

ఆలమందలను మేపుచునున్న
మిత్రులవద్దకు కృష్ణుడు వచ్చెను
ఎండ తీవ్రత భరించలేక
అశోక తరువు ఛాయలో జేరిరి.

ఎండ - వానలు - చలి అని చూడక
ఎల్లవేళలా నీడనిచ్చుచు.
ఫలములనిచ్చి బాటసారులకు
సేవజేసెడి తరువుల గాంచిరి.

ఫలములు తినిరి - నీరు త్రాగిరి
వారి ఆకలి తీరకపోయెను
సోలిన ముఖముల - కృష్ణుని గాంచి
ఆకలి బాధ విన్నవించిరి.

అంతట - కృష్ణుడు - దయాసింధువు
మునుల భార్యలను - తరింపనెంచి
కొంతదవ్వులో - యజ్ఞము జేసెడి
మునులవద్దకు వారిని బొమ్మనె.

అచ్చట అడవిలో - కొందరు మునులు
స్వర్గము గోరి - అంగిరసమను
యజ్ఞము - దీక్షగ జేయుచుండిరి
వారి విషయము కృష్ణుడు జెప్పెను.

వారిని జేరి - ఆహారమును
అర్థించుడని - వారికి చెప్పెను -
అటులే - వారు - మునులను జేరి
అన్నదానము చేయగ కోరిరి.

మూర్ఖత్వముతో నిండిన మునులు
ఈసడించిరి - కసరి కొట్టిరి
ఉసూరుమనుచు - వారందరును
విషయము చెప్పిరి బాలకృష్ణునికి.

అంతట - కృష్ణుడు - వారల గాంచి
మీరు - నేరుగా - వారి భార్యలకు
రామకృష్ణులు పంపినారని
ఆకలి బాధను తెలుపుడు అనెను.

గోపబాలురు అటుల చెప్పగా
ఆనందించిన మునుల భార్యలు
భక్ష్య భోజ్యములు - కడవల నింపుకు
కడలిని జేరే నదులన - వచ్చిరి.

భర్తలు - బంధువులందరు - వారిని
వలదని చెప్పి - వారించినను
నందనందనుని దివ్యసన్నిధికి
విప్రకాంతలు వడిగా వచ్చిరి.

అందచందముల సాటిలేనిదగు
దివ్యమంగళ విగ్రహమ్మును
తనివి తీరగా గాంచిరి కాంతలు
జన్మనెత్తిన ఫలమిది - అనిరి.

వారిని గాంచి – చల్లని మాటల
నల్లనయ్య – కుశలమ్ము నడిగెను
తిరిగి పొమ్మని వారికి చెప్పెను
యజ్ఞ సమాప్తి జరిపించమనె.

అంతట – వారు – భక్తిగ పలికిరి
"నీ పద సేవ కోరి వచ్చితిమి
సంసారలంపటము – త్రెంచుకొంటిమి
తనువు రాల్చెదము – నీదు సేవలో".

"భర్త చెంతనే – భార్య మనుగడ
మరలి పొందు –మిము ఆదరింతురు
వారి సేవలే – పెన్నిధి మీకు
నా ప్రతిరూపము వారిని తలచుడు".

అనునయమ్ముగా వారిని పంపెను –
ఆనందముగా వారందరును
భోజనాదులు ముగించి నారు
గోపబాలకులు – విశ్రమించిరి.

వచ్చిన వనితల గాంచిరి మునులు –
తమ అజ్ఞానము తెలిసెను వారికి
యజ్ఞభోక్తయు – యజ్ఞ కర్తయు
నారాయణుడే – అన్నది మరచిరి.

చదువు సంధ్యలు తెలియనియట్టి
తమ ఇల్లాండ్రు నిజము తెలిసిరి
దర్శన భాగ్యము కలిగెను వారికి
నివేదనమ్ము స్వయముగ చేసిరి.

ఆ – భాగ్యమునకు నోచక పోతిమి
దర్శనమైనను దొరకలేదని
మదిలో వేదన నిండిన మునులు
అచ్చటినుండే నమస్కరించిరి.

గోకులమందు – గుట్టుగ నున్న
కృష్ణుని విషయము తెలిసిన వారై
నలుగురిలో మరి తెలుపుట తగదని
మదిలో తలచి – ఆగిరి – మునులు.

రామకృష్ణులు – తమ స్నేహితులతో
ఆలమందలతో – గృహములు జేరిరి –
కృష్ణుని గాంచి – నందుడు పలికెను
ఇంద్ర యాగము చేయు తలంపనె.

ఇంద్రయాగము చేయగ నెంచితి
అనుచు పలికిన – తండ్రిని గాంచి
యాగ వివరము – దాని ఫలితము
తెలియజేయమని – కృష్ణుడడిగెను.

॥శ్రీ కృష్ణచరితము॥



## 30 ఇంద్ర యాగం

"ఇంద్రయాగమది చేయుట ఎట్లు
ఎవరికి చెందును – ఎవరు చెప్పిరి
ఏ శాస్త్రములో తెలిపిరి దానిని
ఏ సాధనములు దానికి కావలె.

హితుల కడ – మరి – గోప్యమెందులకు
అజాత శత్రువులందరు మీరు
కావున – విషయము తిన్నగ జెప్పుడు"
అనిన కృష్ణునితొ నందుడు పలికెను.

"ఈ యాగముకు–ఇంద్రుడు మూలము
మేఘుని ఉద్దేశించి – చేయునది
ఇంద్రుని ఆనతి మేర నడచుచు
మేఘములవ్వి – వర్షించునయా!

సకాల వర్షములవ్వి లభించగ
పంటలు పండి సుఖములు కలుగును
అవివేకులు ఈ యాగము చేయక
దుఃఖములవ్వి తెచ్చుకొందురు.

సంతసించిన – శచీపతి – తను
వర్షమ్ములను అనుగ్రహించగ
పచ్చికతో ఈ నేల నవ్వును –
పాడిపంటలు – వృద్ధినొందును".

సురనాథునికి హితము గరపగా
అతని శక్తిని – మించిన శక్తిని
ప్రదర్శించగా – మదిలో తలచి
తండ్రితొ పలికెను నందనందనుడు.

"తండ్రీ వినుము – నేను జెప్పునది
కర్మలవల్ల – ప్రాణులు పుట్టును
పెరిగి, తరుగును – కర్మలవల్ల –
సుఖ దుఃఖములకు – కర్మ కారణము.

తన కర్మలకు – తాను కర్తయై
దాని ఫలములను అనుభవించును
మరియొక దేవుడు ఫలితమిచ్చునను
ఆలోచనయది – అర్థరహితము.

కావున – ఎవరో ఇంద్రుడు యిపుడు
హాని చేయునని – తలంచవద్దు
కర్మఫలములను తప్పించుటకు
దేవునికే మరి సాధ్యముగాదు.

కర్మవశుడు – ఈ దేహి – కావున
చేసిన కర్మల ఫలితము వలన
సురాసురులుగ – నరునిగనో – మరి
జంతువుగానో – జన్మనెత్తును.

వర్ణాశ్రమముల వల్లను వారు
చేయు కర్మలు – చేయగవలెను
సృష్టి స్థితిలయ కారకమ్ములు
త్రిగుణమ్ములని – తెలియుడు మీరు.

రజోగుణమున – జగము జనించును
రజో ప్రేరణతొ – మేఘము కురియును
పంటలు పండును – కావున యిపుడు
ఇంద్రుడు దేనికి ఆగ్రహించును.

పశువుల మేపుకు – బ్రతికే మనను
ఇంద్రుని కోపము ఏమి చేయును?
సంతోషించిన – ఒరిగెడిదేమి?
ఆలోచించుడు మీరందరును.

నా మాటలను తిన్నగ వినుడు
కనబడు కొండకు – ఆలమందలకు
బ్రాహ్మణులకును – తృప్తి కలుగునటు
మీరందరును – యజ్ఞము చేయుడు.

తెచ్చిన సంబారమ్ములతోను
పిండివంటలు పాయసాలతో
నిండు మనసుతో – కొండకు మ్రొక్కి
శ్రద్ధాభక్తుల – పూజచేయుడు.

కడుపునిండుగా పశుపక్ష్యాదులు
ఆరగించునటు – అన్నము నిడుడు
వేదవిదులకు – దక్షిణలిచ్చి
సమారాధనతొ తృప్తిపరచుడు.

మిత్రులు, హితులు బంధుజనముతో
విందు భోజనము లారగించుడు
గో బ్రాహ్మణులకు – అగ్నిదేవునికి
భక్తి మీరగా – ప్రదక్షణించుడు.

అటుల చేసిన – యజ్ఞము శుభము –
నాకు తోచినది – చెప్పితి నేను –
ఆలోచించుకు నిర్ణయించుకొని
మీకు తోచినటు చేయుడు అనెను."

నల్లనయ్య అట చల్లగ జెప్పెను
వారిమదికది – మంచిగ తోచెను
కృష్ణుని మాటను – కాదనరెవ్వరు
యాగము జేసిరి – శ్రద్ధాభక్తుల.

గో బ్రాహ్మణులను – భక్తిగ కొలిచిరి
సమారాధన ముగిసెను శుభముగ
కృష్ణుని తేజము – నిండిన కొండ
నివేదించినవి – ఆరగించినది.

కామరూపి – ఈ పర్వత రాజము
అన్నీ – చక్కగ తిని వేసినది
మనలందరను – చల్లగ జూచును
నమస్కరింతము రండని పిలచి –

నందనందనుడు గిరికి మ్రొక్కెను –
అందరు – భక్తిగ మ్రొక్కిరి – కొండకు
ఆనందముగ – బండ్లను కట్టిరి
పందెములేసిరి – పరుగెత్తించిరి.

అలంకరించిన బండ్లతొనపుడు
కృష్ణుని మీద పాటలు పాడుచు
గిరికి – అందరు ప్రదక్షిణించిరి
ఆనందముగా – ఇండ్లను జేరిరి.

ఇంద్రుని కోపము శృతిమించినది
తన యజ్ఞమును పాడుచేసెను
కృష్ణుడు. – తనను ధిక్కరించెను
తన ఉనికిన మరి – మరచిరి వారు.

ప్రళయ కాలమున విడచునట్టివగు
'పుష్కలావర్తక' – మేఘమ్ములను
అప్పటికప్పుడు రావించుకొని
వాటితొ పలికెను – వాసవుడపుడు.

"నల్లబాలుని – మాటలు నమ్మిరి –
వెర్రి గొల్లలని – తెలిసిపోయినది
పాలూ, పెరుగూ, నేతులు త్రాగి
తెగబలిసిరి – ఈ గోపకులందరు.

కొండల రెక్కలు నరకినయట్టి
వజ్రపాణినని - తెలియకుండిరి
భయభక్తులవి - వదలివేసిరి
నియమ నిష్ఠలు - చెదరగొట్టిరి.

గురువూ - దైవము - అన్నవి మరచి
పెద్దల - పిన్నల అంతరమెరుగక
గిరుల తరులలో చిలిపిగ తిరిగే
కృష్ణుని చేష్టలు - మితిమీరినవి.

కలిమితొ కన్నులు - మూతబడినవి
యాగము చేయుట మానివేసిరి
కావున - ఇపుడే బృందావనమును
రాళ్ళ వానతో - ముంచివేయుడు.

ఆగక కురిసే - రాళ్ళ వానతో
ప్రాణి మిగులక - పోవలెనచట
వారందరును - యమనిలయముకు
బయలు దేరవలె - సాగుడు మీరు.

సురసేనలతో - ఐరావతమున
అనుసరింతును మిమ్ముల నేను -
కృష్ణుని సత్తా - తేలిపోవలె"
అనగా - గర్జన చేసె - మేఘములు.

హఠాత్తుగా నట బృందావనమున
నల్లని - మేఘములల్లుకొన్నవి
కారుచీకటి - కమ్ముకొన్నది
కుండపోతగా వర్షము మొదలయె.

ఘనమగు ఉరుములు-ఈదురుగాలులు
నింగి చీలినటు - కురిసేవాన
కన్నులు తెరవగ - వశముగాదయె
ఎడతెగకుండా - రాళ్ళు కురిసెను.

జలప్రవాహమున - లేగలు తేలెను
గోవులు వాటిని - జేరగ పరుగిడె
వాటి రక్షణకు - గెంతె వృషభములు
తరువులబోలి - నిలిచిరందరు.



॥శ్రీ కృష్ణచరితము॥

# 31 గోవర్ధనోద్ధరణం

నడవగ లేక - రాళ్ళబారి పడి
ఆక్రందనతో గోపికలందరు
గోపాలకులను చేరిరప్పుడు
బ్రతుకు ఆశయది సన్నగిల్లినది.

ఆ ప్రళయములో రక్షించునది
ముకుందుడని - వారందరు తలచి
చేతులనెత్తి జాలి గొలుపునటు
ప్రార్థన జేసిరి - రక్షించమని.

"కరుణాసాగర - కాపాడవయా -
ఆశ్రిత వత్సల - ఆదుకొనవయా -
నిన్ను నమ్మిన - మాకు ఎన్నడూ
ఇంతటి విపత్తు రాలేదయ్యా.

ఉరుములు-మెరుపులు-శిలా వర్షము
ఇంత ఉధృతము ఎరుగము మేము
అసువులు నిలుపుము ఆశ్రితపాలా -"
అనుచు - దీనముగ మ్రొక్కిరివారు.

ఆపద్బాంధవు డది - వినినాడు
వారి కష్టముకు - కరిగిపోయెను
దుర్మదాంధుడగు - ఇంద్రునికపుడే
కనువిప్పును - కలిగించ తలచెను.

"నను సేవించే వేల్పుల ఏలిక -
కావున - చంపక - బుద్ధిగరపెద
ఇంద్రపదవితో అంధుడయ్యెను
జ్ఞాన కాంతిని - చూపించెదను."

అని తలపోసి - కృష్ణుడంతట
గోపకులందరు వినగా - పలికెను
"స్నేహితులారా - చింతవదలుడు
మీరంతా ఒకచోటికి రండు.

ఆలమందలను జంతుజాలమును
ఒక్కచోటికి తోలుకురండు
దయామూర్తియగు పరంధాముడు
మీకందరకు మేలు జేయును."

అనుచు కృష్ణుడు కరిపిల్లవలె
బలముగ అడుగులు వేయుచునంత
పూజలు జరిపిన - కొండను జేరెను
మందహాసముతొ గిరిని చూచెను.

వేణువు - బొడ్డులొ భద్రపరచెను
వల్లెవాటుగా నున్న - వలువను
బలముగ - నడుముకు బిగించికట్టి
ఆదివరాహము - అన్నటు నిలచెను.

జలప్రళయమున మునిగిపోయిన
భూమిని - నాడు ఉద్ధరించిన
ఆదివరాహము - అన్నటు కృష్ణుడు
అవలీలగను - గిరిని ఎత్తెను.

పూలచెండును ఎత్తినట్టుగా
కుడిచేతితొ ఆ కొండ నెత్తెను
గొడుగు మాదిరి నిలచెను కొండ
అడుగు కదలక నిలచెను కృష్ణుడు

"రండి రండి - మీరందరు రండి
కొండ క్రిందకు - త్వరగా రండి
రాళ్ళవానతో - భయము వలదిక
ఇళ్ళకంటె - ఇది భద్రము మీకు.

బాలుడు వీడు - కొండ పెద్దది
మోయలేడని - తలంచవద్దు
సకల చరాచర - జగత్తువచ్చి
మీద పడినను - చేయి కదలదు."

అమృత మయమగు పిలుపును-వినిరి
అందరు జేరిరి-కొండక్రిందకు
ఆనందములో తేలిపోయిరి
ఆకలిదప్పులు మరచిపోయిరి.

కృష్ణుని చేతిలొ నున్న పర్వతము
తామరపూవుగ భాసిల్లినది
ఏడు రాత్రులు, ఏడు పగళ్ళు
ఏకధారగా కురిసెను రాళ్ళు

కొండగొడుగుతో నుండెను కృష్ణుడు
గొడుగులొ నందరు సుఖముగ నుండిరి
గోధనమంతా నిలచెనచ్చట
గోవర్థనమని - గిరిని బిలచిరి.

దురహంకారము నిండిన ఇంద్రుడు
పరాభవముతొ - సిగ్గునందెను
ఘనమగు శిలలను గడ్డిపోచలని
నిర్లక్ష్యముగా నిలచెను ఆ - గిరి.

చిన్నబుచ్చుకొని - అమరావతిలో
అడుగుబెట్టెను సురనాయకుడు
సురసేనలును - తోటివారికి
ప్రభువు - పరాభవ గాథను జెప్పిరి.

ఐరావతము దిగెను ఇంద్రుడు
ఇంతేనా - నీ గొప్పదనమని -
తెల్ల ముఖముతో - లోనికి బొమ్మని
వెల్ల ఏనుగు - పలికినట్లయె.

వాన వెలిసెను - రవి ఉదయించెను
అందరు బయటకు వచ్చిరంతట
గిరిని-తిరిగి-అటనుంచెను కృష్ణుడు
మందల తోలుకు మరలిరందరు.

గోపకులందరు ఆనందముగా
కృష్ణుని - గుండెకు - కౌగిలించుకొన
పెద్దలు - శుభమని ఆశీస్సులనిడి
శాంతి మంత్రములు చదివించి రట.

సురలు - శుభమని పూలవానలు
కురిపించిరి - ఆ బృందావనమున.
అచ్చర కన్యలు - నాట్యమాడిరి
గంధర్వ గానము హాయిగ వినబడె.

ఇంద్రయాగమా - పొందని జెప్పి
కొండయాగముగ మార్చినవాడు
సురపతి గర్వము దించినవాడు
మా గోపాలుడు - రక్షకుడనుచు.

సుందరాంగులు ఆనందముగా
కృష్ణగీతికలు పాడగ - వినుచు -
ఉల్లము చల్లగ - చల్లని చూపుల
మెల్లమెల్లగా - నడచెను కృష్ణుడు.

కృష్ణుని లీలలు పాడుచుండిరి
నందనందనుని - ప్రశంసించిరి
పెద్దలందరూ - నందుని జేరి
మదిలో మాటను తెలియబరచిరి.

"ఎందు విన్ననూ - నందా - నేడు-
నందనందనుని - మాటలేనయా -
ఆశ్చర్యమును కలిగించునటు
బాలకృష్ణుని - చేష్టలున్నవి.

కన్నులు తెరవని - పసికందుగను
పూతన ప్రాణము తీసెను నాడు -
మూడవ నెలలో - బండిని విరచి
ఆశ్చర్యమును కలిగించెనయా -

తృణావర్తుని అసువులు దీసెను
మద్ది చెట్లను కూల్చెను రోటితొ
బకాసురుని - అవలీలగ జంపెను
వత్సరాక్షసుని - అంతము చేసెను.

అఘాసురుని పరిమార్చెను బాలుడు
ఆ పనులన్నీ అసమాన్యమయా!
సామాన్యుడు మరి చేయగలేడు
మానవమాత్రుని కసాధ్యమైనవి.

తనతో సముడగు బలరామునిచే
ప్రలంబునసురుని చంపించెనయా -
భీకరమైన దావానలమును
వెన్నముద్దలా మ్రింగివేసెను.

కాళీయుని మదమణగించి మరి
మడుగునుండియే - వెడలగొట్టెను
అది సరిగానీ - ఏడోఏటను
కొండను లీలగ ఎత్తి నిలచెను.

నందయ్యా నీ వంశాంకురము -
గోపకులముకే కనువిందయ్యా -
ఉద్ధరించగా - మనలందరను
పుడమికి దిగిన పరమేశ్వరుడగు."

వారి మాటలకు నందుడంతట
గర్గమహాఋషి చెప్పిన మాటలు
కృష్ణుడు - సాక్షాత్ - విష్ణు అంశయని
చల్లగ చెప్పెను వారందరితో.

పరవశించిరి వారందరును
పరమాత్ముడని కృష్ణుని పొగడిరి
అనంతుడైన ఆదిదేవుడని
సన్మానించిరి - నమస్కరించిరి.

సురనాయకుని అహముదిగినది
కృష్ణుని ఘనత తెలిసినవాడై
క్షమించమని - తా - వేడుకొనుటకు
కామధేనువుతొ - నేలకు దిగెను.

కృష్ణదేవుని పాదపద్మముల -
శిరస్సు వంచి - నమస్కరించెను
మకుటకాంతితో - బాలపాదముల
అభిషేకమ్మయి - వెలుగులు జిమ్మెను.

తప్పిదమ్మును ఒప్పుకొనుచును
కరములు ముడిచి - క్షమించమనెను
భక్తి ప్రపత్తుల - స్తోత్రము జేసెను
మనసు నిండుగా పలికెనిట్టుల -

॥శ్రీ కృష్ణచరితము॥



## 32 ఇంద్రుడు కృష్ణుని స్తుతించుట

"పురాణ పురుషా - తెలిసితినయ్యా -
జగన్నాథుడవు - జగద్వంద్యుడవు
అవివేకముతో - గోపాలుడ వని
తలచితి నాడు - తెలిసితి నిజము.

తపోమయము - నీ తేజము స్వామీ -
రజస్తమములు అంటవుదానికి
సాత్వికమూర్తీ - మాయ అంటదు
సత్యశాంతముల నెలవే నీవు.

దుష్ట శిక్షణ - శిష్ట రక్షణకు
దండ ధారివై నిలతువు నీవు
గురుడవు నీవే - తండ్రివి నీవు
తలరాతలను మార్చెద వీవు.

అక్షరమూర్తీ - అహంకారులకు -
ప్రభువుల మనుకొను గర్వాంధులకు
బుద్ధిగరపుటకు - లీలతొ బుట్టి
వారికి - తెలివిని - కలిగించెదవు.

లోకాధీశా! నన్ను బోలిన
అల్పుల మార్చగ - నీకొకలెక్కా -
నావలె నింక - ఎవ్వరు కూడా
అహంకరించి -నడవరు స్వామీ!

మాధవా - ఇక - మదము వదలెను
దాసునిగా - నను ఏలుము స్వామీ!
అజ్ఞానముతో - రాళ్ళవానను
కురిపించితిని - కరుణను వదలి.

బ్రహ్మాదులకే తెలియగరాని
నీశక్తిని - నే - తెలియగ జాలను
ముల్లోకముల - ఏలిక పదవి
నీకరుణయని - తెలియక పోతిని".

క్షమించ మనుచు - పదముల బడిన
సురనాయకుని - అనుగ్రహించి
ఆప్యాయముగా చూచెను కృష్ణుడు
పరవశించెను - వజ్రాయుధుడు.

చిరునగవులతో - సుందరమూర్తి
పలికెనప్పుడు ఇంద్రుని గాంచి
"నీ గర్వమును దించుట కొరకై
యజ్ఞము - కొండకు చేయించితిని.

ధనమదాంధులు - ధర్మము వదలిన-
దరిద్రులుగా చేతును వారిని -
వారిబాగుకై - శ్రేయము కొరకై
వారిని అటుల చేతును తెలియుము.

తెలివిగ - నాకము ఏలుకో యిక!
రాగభోగముల - మునిగి తేలకు-"
అనుచు కృష్ణుడు - ఆనతి నిడెను
శుభమగు ననుచు దీవన లిడెను.

అంతట పలికెను - కామధేనువు
కృష్ణదేవునికి - మ్రొక్కి - పలికెను
విశ్వకర్తవు - విశ్వరూపుడవు
విశ్వము నేలే - జగన్నాథుడవు.

నీపాలనతో - మా కులమంతా
పవిత్రమైనది - ఇడుములు తొలగెను
గోపాలునిగా పేరు గాంచితివి
అంతటి ఘనత మాకు దక్కినది

గోబ్రాహ్మణుల - సాధువర్తనుల
సుఖవృద్ధికి - నిను - అభిషేకించగ
బ్రహ్మదేవుడు ఆనతినిడెను
నీవే - మాకు ఏలిక వింక.

భూభారమును హరింపజేయగ
అవతరించిన శ్రీహరి వీవు
అభిషేకమ్ము చేయగ నిమ్ము
బ్రహ్మమాట పాలించగ నిమ్ము."

అంతటిలోన సంబారమ్ములు
అభిషేకపు - ద్రవ్యమ్ములన్నియు
సిద్ధమయినవి - మంగళ కరముగ
పాలందించెను - కామధేనువు.

తొండము నిండుగ గంగా జలమును
ఐరావతము - తెచ్చినదపుడు
కశ్యపుడాదిగ - మునులందరును
పిలచినట్టుగా వచ్చి చేరిరి.

సాధు - రక్షాదీక్ష - నిమిత్తము
అవతరించిన కృష్ణుని - భక్తిగ
నాకాధీశుడు అభిషేకించెను
కన్నుల పండుగ అయినది పండుగ.

తుంబురు-నారద-గానమునిండెను
రంభా - ఊర్వశి నాట్య మమోఘము
పుష్పవృష్టి - కురిపించిరి సురలు
పరిమళ శోభతొ - పవనుడు విసరెను

ముల్లోకములు బృందావనిలో
నేలకు దిగి - అట ఆనందముగా
సంబర మపుడు చేసికొనగను
పులకరించెను పుడమి యంతయు.

కృష్ణుని గాంచి - గోవులన్నియు
క్షీరధారలు కురిపించినవి
నిర్మల జలముతొ నదులన్నియును
కిల కిల నవ్వుచు పులకరించినవి

వివిధ తరువులు - విరిసెనిండుగా
తేనెలు కురిసెను - ఆనందముగా
పూలతొ నిండి - ముత్తయిదువులన
లతలు - సోయగము - లొలికించినవి.

వైరము మరచి జంతుజాలము
స్నేహ భావనతొ నిండి పోయెను
పట్టాభిషేక సమయమునందు
ప్రకృతి అంతా పరవశించెను.

తిరిగి తిరిగి - అట నమస్సులుంచి
దేవదేవుని - ప్రస్తుతించుచు
నాకలోకము ఇంద్రు డేగెను
దేవగణములు - అనుసరించెను.

బృందావని - గోవిందుని మయమై
కొత్త అందములు పూసుకొన్నది
నందుడు - శ్రీహరి పూజను చేసెను
ఏకాదశిలో ఉపవశించెను.

ద్వాదశి తిథిలో - వేకువ నందే
స్నానము చేయగ సంకల్పించెను
అసురులు తిరిగే సమయమ్మది యని
తెలియక పోయి - నదికివెడలెను.

యమునానదిలో నీటిలొ దిగెను
నందుని గాంచిన - వరుణుని దూత
తన నగరమునకు-ఎత్తుకు పోయెను
నందుడు - ఎంతో వంత నొందెను.

తెల్లవారినను - నందుని జాడ
తెలియక బోయి - తల్లడిల్లిరి
వెదకిరందరు - దుఃఖమునిండి
రామకృష్ణులకు చెప్పిరి విషయము.

సర్వజ్ఞుండగు - కృష్ణుడప్పుడు
వరుణుని పనియని - తెలిసిన వాడై
యమునలొ మునిగి - నేరుగ సాగి
వరుణుని నెలవున - అడుగు బెట్టెను.

కృష్ణుని గాంచి - వరుణుడంతట
ఆశ్చర్యములో మునిగి పోయెను
అర్ఘ్యపాద్యముల - దేవదేవుని
యధావిధిగను - అర్చన చేసెను.

వినయమునిండి-పలికెను వరుణుడు
"స్వామీ - నీదు-పదముల స్పర్శతొ
నాలోకమిది - పావనమైనది
నాకలోకమును మించి పోయినది.

నీపద సేవను - చేసిన వారు
దివ్యపథమును అందెదరయ్యా!
అంతయు నిండిన మాయ యంతయు
నీ ఆనతితో నడచుచుండును.

తెలియక పోయి - నాసేవకులు
నీజనకుని మరి తెచ్చిరిచ్చుటకు
అది - నాతప్పుగ - ఒప్పుకొందును
క్షమించమనుచు వేడుచుంటిని.

లోకాధీశా! నీబంటునయా!
దాసుని తప్పును మన్నించుమయా!
నీఆగ్రహము తెలియును నాకు
అనుగ్రహము - బ్రతికించును నన్ను.

సర్వము తెలిసిన జగన్నియంతవు
నీ తండ్రిని - నువు - గొనిపోవయ్యా!
కరములు రెండూ జోడించితిని
కరుణా మూర్తీ! కాపాడు మయా"!

అనుచు పలికిన వరుణుని గాంచి
అనుగ్రహించితి - ననుచుపలుకుచు
తండ్రిని తీసుకు - బయలు దేరెను
బృందావనము వచ్చి చేరెను.

విషయము నంతయు వినిన గోపకులు
కృష్ణుడు - సాక్షాత్ ఈశ్వరుడనుచు
భక్తి ప్రపత్తుల - ప్రార్థన జేసిరి
స్తోత్రము జేసి దీవన లందిరి.

కృష్ణుడంతట వారందరికీ
బ్రహ్మతత్త్వము చూపగదలచెను
కర్మల వలలో - చిక్కిన వారిని
అనుగ్రహించగ సంకల్పించెను.

అంతట కృష్ణుడు - తేజోమయమగు
దివ్యరూపమును - సంతరించెను.
మాయకు అందని జ్యోతిరూపము
మాటలకందని మంగళ ప్రదమది.

జ్ఞానబోధకము - సత్యమయినది
ఆనందరూపము - బ్రహ్మమయినది
త్రిగుణమ్ములను - జయించి నిలచి
అగపడునట్టి - దివ్యరూపమది.

జ్యోతి శ్చక్రము అదియే అయిన
దివ్యరూపమును సంతరించెను
పరమాత్ముని నెలవును-బ్రహ్మలోకమును
తనివితీరగా - జూచిరి వారు.

విశ్వరూపమున - అనంత ప్రభలతొ
వెలుగుచునున్న - కృష్ణుని గాంచిరి
ఆత్మస్వరూపులు వారందరయి
దివ్యావస్థలొ నిలచిరచ్చట

కృష్ణుని దయతో వారందరును
సాధారణమగు స్థితికి జేరిరి
పరమాత్మయని - ప్రస్తుతించిరి
పూజలు చేసి - పులకరించిరి.

ఆవిధముగను - నందాదులను
ఆనందములో - ముంచి - తేల్చుచు
కృష్ణుడు - వారితొ - గడుపుచుండగా
శరదృతువది - అడుగు బెట్టినది.

శారద రాత్రులు - ప్రకృతికాంతకు
పరవశమ్మును కలిగించినవి
కలువలు కిలకిల నవ్వుచున్నవి.
సుమశరు తీవ్రత పెరిగి పోయినది.

నిండు చంద్రుడు విసరిన యట్టి
కర్పూరరాగమా - అనిపించునటు
తెల్లని వెన్నెల - చల్లగ విరిసెను
తారాహారము - ధరించె జాబిలి.

పతి - తన కరముల-తూర్పు కాంతకు
నొసట - కుంకుమ దిద్దినట్టుగా
చంద్రోదయము అనిపించినది
చంద్రకాంతి - అటపెంచె తాపము

సుమశరుడప్పుడు అట్టహాసముగ
సుమబాణములు - రథమున నుంచుకు
బయలుదేరగా - రథముకు కట్టిన
జయపతాక - ఆ - చంద్ర బింబమయె.

సుమశరు కందక-నిలబడ వలెనను
పట్టుదలను మరి - తుంచగ చాలిన
చక్రము అది - అని - చంద్రబింబము
అగుపించినదా - శారద రాత్రి

ఎడబాటు బాధలొ - నున్నటు వంటి
స్త్రీ పురుషులను - వెదకి పట్టుకొను
కోర్కెల దీపము - అన్నటు అచట
చంద్ర బింబము - అగుపించినది.

చల్లని జల్లుల చందమామను
అందమైన ఆ కృష్ణుడు గాంచెను
మురళీ గానము నారంభించెను
జగముల నూయల లూప సాగెను.

॥శ్రీ కృష్ణచరితము॥



## 33 మురళీగానంలో గోపికలు ముగ్ధులగుట

మధుర నాదము - మురళీ గానము
వీనుల విందుగ వినవచ్చినది
గోపికలందరు పరవశించిరి
వశము తప్పినటు ప్రవర్తించిరి.

లేగలనపుడు - వదలుట మరచిరి
పాలుపిదుకగ - తోచదు వారికి
పిదికిన పాలు - కాచగ మరచిరి
కాగిన పాలను - దింపుట మరచిరి.

భర్తకు - సేవలు చేయటలేదు
పిల్లకు - పాలు ఇచ్చుటలేదు
ఆహారమును మరచి పోయిరి
కృష్ణ ధ్యాసతో నిండి పోయిరి

కురులను దిద్దక - విరులను బెట్టక
బొట్టు కాటుకలు - సరిచూడకను
నగలను మరిచి - వలువలు మార్చక
గంధాదులను అలంకరించక.

జారెడి పయ్యెద సరిజేయుచును
కదలాడే - ఒయ్యారపు నడకల
ఎవరు వచ్చినా గుర్తుపట్టక
పరుగులెత్తిరి ప్రభువుసన్నిధికి

అత్తల - ఆంక్షల దాటగలేక
కదలలేక మరి కొందరు కాంతలు
మనసును - వేణు గానసభకునై
ఆనందముగా - పంపివేసిరి.

అంతట - రాజు శుకుని అడిగెను
గోపకాంతలు అటుల నడచిరి
ఎట్లుతరించితి మని తలంచిరి?
తెలుపుము స్వామీ! కృష్ణుని లీల.

తేని ప్రశ్నకు - మౌని చెప్పె - నిటు
కృష్ణుని వైరి - శిశుపాలుండే
ముక్తి నొందగా - భక్తినిండిన
గోపకాంతలు తరించలేరా!

అవ్యయుడాతడు - అక్షరుడాతడు
అరవిందాక్షుడు - ఆ శ్రీకృష్ణుడు
ఏదో విధముగ - నమ్మిన వారికి
మోక్షము నిచ్చును - నిస్సంశయముగ.

జన్మకారణుడు, జన్మరహితుడు
పరమ పురుషుడు పరాత్పరుండు
హరిని - తాకిన తరులు గిరులును
బంధవిముక్తిని పొందును రాజా!

బంధుత్వమ్ము - శత్రుత్వమ్ముల
ఇష్టము - భయము ప్రాణభీతియో
భక్తి, విచారము - ఏదో మార్గము
అనుసరించిన - కృష్ణుడు గాచును.

మంజుల వంశీ రావము - వినుచు
అచటకు వచ్చిన గోపకాంతలతో
ధర్మపథమును తెలియబరచుచు
తియ్యని మాటలు చెప్పెను కృష్ణుడు.

॥శ్రీ కృష్ణచరితము॥



## 34 ధర్మ బోధ

"కోమలులారా! అర్ధ రాత్రమున
అడవి జంతువులు తిరిగే స్థలముకు
అయిన వారిని - తోడు గొనకను
వచ్చిరి మీరు - కారణమేమి.

పరమ పావని - యమునానదికి
గట్టున పెరిగిన లతలు - చిగుళ్ళతో
పూలు పండ్లతో - సంసారమును
ధర్మబద్ధముగ నడుపుచున్నవి.

పరాయిపురుషుని - చూడ వచ్చిరన
పరాచకాలయి పోవును బ్రతుకులు
కులకాంతలు - మీరందరు భక్తిగ
భర్తసేవలో తరించవలెను.

ధ్యాన - శ్రవణము - కీర్తనమ్ముతో
ననుధ్యానించి - మనసున నిలపిన
మీరు తరింతురు - నిశ్చయమ్ముగా
నాదు మూర్తిని మదిలో గాంచుడు.

మిమ్ములగానక మీ వారందరు
బెంగతొ వెదకుచు నుందురు గాదా -
స్త్రీ నడవడితో - తల్లి దండ్రుల
అత్తమామల - కీర్తి పెరుగును.

సమదృష్టిని - నే - కలిగి యుందును
జీవకోటి - నాకైన వారలే
జంతు జాలము - నావారు సుమా -
స్త్రీ పురుషులను - భేదము గానను.

ధర్మబద్ధ మగు జీవితమ్మది
స్త్రీకి - భర్తతో నిర్ణయించిరి
పతి స్థితి గతులు - లెక్కచూడక
ఛాయగ భార్య అనుసరించవలె.

ఇల్లు వదలుట - స్త్రీకి తగనిది
దైవము నైనను - భక్తితొపిలచి
సేవచేయగల - నిశ్చలమనసు
మానవ జన్మకు కావలెను సుమా-"

కృష్ణుని మాటలు - ఈటెలాయెను
వదలి పోవగ మనసు రాదయె
పరమాత్మ పదముల - నిలచిన మనసు -
ఇహ సంబంధపు వాసన కోరదు.

❋❋❋ ॥శ్రీ కృష్ణచరితము॥

## 35 గోపికల ప్రార్థన

అంతట పలికిరి గోపకాంతలు
నందనందనా - వందనమనుచు
"అన్నీతెంచుకు - నిన్నేనమ్ముకు
నీ పదసేవకు వచ్చామయ్యా!

స్త్రీ ధర్మమును - పతిసేవలను
తెలిపితి వీవు - జన్మ తరించెను
నీవేపతియు - గతియును మాకు
మోక్షపథమునిడు - రమాపతివి గద!

ఇహబంధములు - అశాశ్వతమ్ము
నీతో బంధము - శాశ్వతమయినది
భక్తిబంధమది - భరించు వాడవు
లోకభర్తవు - లోకకర్తవు.

పదములు నడచును నీ సన్నిధికి
పెదవులు పలుకును నీ నామమునే
కరములు చేయును నీ సేవలనే
మనసులు నిండెను నీరూపముతో

పుడమికి ధవుడవు - మాధవా విను!
ఎన్ని జన్మలో ఎత్తిన గాని
లభించనట్టి పాద సేవయది
లభించె - మాకు - విడువలేమయా!

నీ పదధూళి - శిరమున దాల్చి
కలిమికిరాణి - మురిసిపోవును
బ్రహ్మపదవి యది వద్దనివచ్చి
బ్రహ్మకడుగు - నీ - దివ్య పాదము.

కావున మేము కదలమింకను
కారుణ్యాలయ - నిలువగ నిమ్ము
కన్నుల నిండుగ - దివ్య రూపము
కాంచగ నిమ్ము - కల్లలు కావివి.

మదిలో గాంచిన - ఆనందమగు
ముందర గాంచిన - మహదానందము
పదముల స్పర్శ - పరమానందము
ఆలింగనమది - అమృతమయము.

మకరకుండల - కాంతులు నిండి
నెమలి పింఛము - నిగనిగ లాడగ
మందస్మిత వదనార విందము
కన్నులు మావి - మూతపడవయా -

తరులు గిరులవి - పశు పక్ష్యాదులు
నిన్నుగాంచిన - పులకరించును
వేణుగానమున - పరవశించును
అబలలమగు - మా - మాట ఏలనిక!

నిరతము - నీ దివ్య పదములు కోరి
వియోగ వేదన పొందుచుంటిమి
స్పర్శమాత్రమున చరితార్థులమయి
జన్మనెత్తిన ఫలము నందెదము.

వారి కోర్కెను - భగవానుండు
మన్నించెను - పద - స్పర్శనిచ్చెను
ఆనందములో - మునిగిపోయిరి
ఆటల - పాటల - పరవశించిరి.

తీయని పాటలు - ఉల్లమునిండుగ
చల్లని జల్లుగ - కురియుచుండగా
పదములు - కదలి నాట్యమాడినవి
ప్రొద్దుతెలియక పోయెను వారికి.

ఆటల పాటల అలసిపోయిరి
అంతటిలోన నల్లనయ్య - అట
అగపడకుండ నుండుట గాంచి
ఆవేదనతో నిండిరి వారు.

పెన్నిధి పోయిన పేదరీతిగా
వారందరును వంతనొందిరి
ఎదుటి కాంతలో - కృష్ణుని గాంచి
కొంత ఊరట పొందిరి కొందరు.

తిరిగి వారు తమ స్వామిని వెదుకగ
చెట్టు చెట్టును కలయ జూచిరి
దొంగలాగ - ఎట - నక్కెనోయని
వెదుక సాగిరి - చింతలోమునిగి.

॥శ్రీ కృష్ణచరితము॥



## 36 అన్వేషణ

పొన్న - మామిడి - మద్ది - పనసలు
మొదలగు తరువుల పిలచి అడిగిరి
లతల - తీవలను - పూపొదరిండ్లను
మరిమరి అడిగిరి కృష్ణుని కొరకై.

“నల్లనివాడు - నెమలి పింఛముతో
నవ్వులు జల్లే - కృపాసింధువు
నీ పొదచెంత కలడా మల్లీ!
నవ్వక - నిజము చెప్పవె తల్లీ!

లతలారా - ఓ పూపొదలారా!
తీవల్లారా - తరువుల్లారా
వేణుగానమున - మనసులు దోచిన
పద్మనేత్రుని - కృష్ణుని గంటిర.”

అనుచు అడుగుచు - తిరుగుచుండిరి
అడిగిన వాటిని - అడుగుచుండిరి
ఆవేదనతో - నిండి - పోయిరి
అంతా చీకటి అనిపించినది

కొందరు - కృష్ణుని లీలలు చేసి
తన్మయత్వమున - మునిగిపోయిరి
పూతన వలెను - నటించి - చూపి
బాలకృష్ణుని ఘనత చాటెను.

కృష్ణుడు చేసిన - ఘన కార్యములను
తలచుకొనుచును - పరవశించిరి
గోవర్ధనమని - తనదగు - పైటతో
ఆచ్ఛాదన పట్టెను - ఒకసుకుమారి.

దావానలమిది - మ్రింగివేతును
కనులు మూసుకొని వుండండనుచు
నింగికి చూచి - గుటక మ్రింగుచు
పరవశించెనొక - ముగ్ధమోహిని.

అటులా స్త్రీలు - వెదకుచుండగా
శంఖ చక్రముల గుర్తులు గాంచిరి
కృష్ణుని అడుగులు - అని గుర్తించిరి
అడుగుల వెంబడి నడవసాగిరి.

సనక సనందన ముని పుంగవులకు
యోగదర్శనము - నిడు పదములని
అడుగులనుండి - ధూళిని తీసి
తలను ధరించెను - ఒక మనోహరి

ఈ పదములకు - సిరి-తా-నిరతము
సేవచేయుచు - మురిసిపోవును
ముక్తికాంతను చూపే పదములు
దివ్యపథమును అందించునవి.

ఈ పదములను బ్రహ్మదేవుడు
కడిగి - పుణ్యమును పొందినాడట
అనుచు భక్తిగా - మ్రొక్కిరి వారు
పాదముద్రలను అనుసరించిరి.

మధురస్మృతులు మదిలో తలచుచు
గోవిందునికై - వెదకిరంతట
తిరిగి తిరిగి అట-యమున ఒడ్డుకు
చేరిరందరు - నిరాశనిండి.

॥శ్రీ కృష్ణచరితము॥



## 37 గోపికా గీతలు

పరమాత్మునికై పరితపించెడి
జీవుని వేదన - తెలియగ కష్టము
అనుభవించిన వారికి తెలియును
అనుచు - గీతికలు పాడిరివారు.

గోపాలా - నీ పదముల స్పర్శతో
గోపకులమ్ము - పునీతమైనది
సిరి సంపదలు నిండెను గృహముల
కలకలలాడెను - గోధనమంతయు.

ఉపద్రవమ్ములు - ఎన్నో వచ్చిన
అన్నిటినుండీ కాపాడితివి
కానీ - నేడు - కరుణను మరచి
దూరమైతివి - దయజూపవయా -

యశోద కొడుకువు - అందురు - నిన్ను
కానీ - నీవీ సకల జగత్తుకు
ఆత్మగ నిలచి - బ్రహ్మ - కోరగా
మము కాపాడగ - దిగిన దేవుడవు.

నీ పదములను కొలిచేవారికి
సంసారభయమును బాపెదవీవు
ఆముష్మికమును - కలిగించగను
శిరమున - కరమిడి - దీవించవయా!

సాయం సంధ్యలో - గోవుల తోలుకు
తిరిగి వచ్చెడి నీముఖమంతా
గోధూళితొ మరి - నిండి - శోభగా
వెలుగుచుండుట మరువగ లేము.

భక్తుల కోర్కెలు తీర్చగ చాలి
బ్రహ్మకు - పూజగ-లభించు పాదము
పుడమితల్లికి - పెన్నిధి అయిన
పదముల స్పర్శ - కలిగించవయా!

బంధువులందరు వలదని ఆపిరి
అయినా - నినుగన వచ్చితిమయ్యా!
ఇట్టేకనబడి - అట్టేపోతివి
ఎట్లాగయ్యా - నిన్నుగనుటది!

ఆవుల తోలుకు పోయిన - నిన్ను
పగలు - చూడగ వశముగాదయె
కంటికి - రెప్పలు - బ్రహ్మపెట్టగా
రాత్రి - మూసుకొని - కోర్కెతీరదు.

గోపకాంతల దుఃఖము గాంచి
వారి బాధను చూడలేమని
అశృలు రాల్చెను - అన్నటు - తరువుల
ఆకులు రాల్చెను - మంచుబిందువులు.

గోపిక లటుల వేదన నిండి
దర్శనమ్ముకై తపించుచుండగ
దయగొని కృష్ణుడు - పీతాంబరుడు
కనబడెవారికి - కన్నుల నిండుగ.

॥శ్రీ కృష్ణచరితము॥

❊❊❊

# 38 గోపికల ఆనందము

గోపిక యొకతె కరములు ముడిచి
భక్తి నిండుగా నమస్కరించెను
ఆనందాబ్ధిని మునిగిరివారు
శ్రీకృష్ణుని గని పరవశించిరి.

ముందు - పలికిన - చులకనగునని
చిరుకోపమును చూపెను - ఒక స్త్రీ
నన్నువదలితివి - కారణమేమి
నిమిషము-యుగముగ గడచెను అన్నది

దివ్య విగ్రహము గాంచిన కాంత -
ధ్యాన ముద్రలో మునిగి పోయినది
ఎడబాటునకు వంతనొందుచు
నిష్ఠురముగ - మాటాడెను ఒక స్త్రీ

తియ్యని మాటల వారందరిని
పలుకరించెను కరుణామూర్తి
యమునానదికి - జేరిరందరు
ఆనందముగ - గడిపిరచ్చట

నిన్నుగాంచక - బ్రతుకలేనని
నిర్ణయించుకొని యుంటిని నేను
కానీ - నేను - యింతటివరకు
బ్రతికియుంటిని - మొండి జన్మమిది

వల్లెవాటును పరచి - ప్రభువును
కూర్చొనబెట్టిరి - పరవశించిరి
తానొకడైనా తలకొకమూర్తిగ
సేవాభాగ్యము నందజేసెను

సేవచేయగ - తిరిగి చేయవలె
సేవచేయకనె - చేయుట ఘనత
సేవచేసినా - తిరిగి చేయరు
ఇది-మగ బుద్ధా! - అనుచు అడిగిరి

తనను గురించి అడిగినారని
బదులు చెప్పెను నందనందనుడు
"మీరు చెప్పిన విధములందున
నేను - ఎందును జేరని వాడిని.

సత్యము నుడివెద - వినుడందరును
దయగల వారిలో - ప్రథముడ నేను
వియోగమున్న - ప్రేమ - పెరుగును
అభిమానమ్ము ఇనుమడించును.

నిజమగు రూపము భక్తులుగాంచిన
అహంభావమున - చెడిపోయెదరు
నిరంతరము - నా - భక్తుడు - నాకై
తదేకధ్యానము - చేయగవలెను.

అయిన వారిని మరచి వచ్చిరి
మిమ్ము వదలి - నే - పోవుట జరగదు
మీ ఆంతర్యము గ్రహించి నాను
మరచి పొందు యిక-జరిగినదంతయు.

శాంతినందుడు - వంత వీడుడు"
అనుచు - కృష్ణుడు చల్లగ పలికెను
పరవశించిరి - గోపికలందరు
గానామృతమును - గ్రోలిరి భక్తిగ.

॥శ్రీ కృష్ణచరితము॥



## 39 రాసక్రీడ

శరద్రాత్రిలో - చంద్రకాంతిలో
యమునాతటిపై మరళీలోలుడు
సన్నగ రాగము నాలపించెను
చిగురులు మెరసి - విన సాగినవి.

నారీ నారీ - నడుమ మురారి
నారీ మణుల - మధ్యమురారి
వీనుల విందగు - వేణుగానమున
ప్రకృతియంతయు పులకించినది.

యమునా తీరము రంగ స్థలముగ
పూసిన పొన్న - కన్నులనిండుగ
తెల్లని చాందిని - కట్టినట్టియె
గలగల - యమున - శృతి కలిపినది.

నింగిని - చంద్రుడు చూచుచుండెను
తరువుల - పులుగులు వినుచున్న వట
ఆనందముగా - కృష్ణుడంతట
నృత్యము చేయుచు గానము జేసెను.

నారీమణులతొ - నృత్యమాడుచు
తియ్యని మురళీ గానము చేయగ
రాసక్రీడతో - యమునానది యది
పరవశించె నా - దృశ్యముగాంచి.

విమానములపై వేల్పులువచ్చి
నింగిని నిలచి - చూచుచుండిరి
గోపీమండల నడుమన నున్న
గోపాలుడు - అట - నృత్యమాడెను.

నల్లని మేఘము - కృష్ణుడన్నటు
మెరుపుతీగలా కాంతలాయిరి
హావభావముల - అడుగులేయుచు
అందరు - నృత్యము చేయుచుండిరి.

రసమయమైన - రాసక్రీడ
పరమాత్మునితో కలిసి నృత్యమున
పాల్గొనలేక - నింగినుంటిమని
సురలు - చింతలో మునిగిపోయిరి.

యోగీశ్వరుడగు కృష్ణదేవుడు
వేణుగానమును ఆలపించగా
రాళ్ళు కరిగినటు - అనిపించినది
పదములు నిలువక - నాట్యమాడిరి.

మధురముగా-గంధర్వులు-నింగిని
కృష్ణుని - కీర్తన చేయుచుండిరి
గోపకాంతల - కరకంకణములు
ఆభరణమ్ములు - తాళమేయగా.

పాటకు అనువుగ అడుగు లేయుచు
ఆత్మారాముడు అయిన కృష్ణుని
అభిమానమునకు పాత్రులాయిరి
గురువుకు తగిన శిష్యులాయిరి.

చక్కని నృత్యము చేసిన గోపిక
కృష్ణ దేవుని ప్రశంసలందెను
అలసిన గోపిక - నిలబడలేక
కృష్ణుని భుజమున - వాలిపోయినది.

కృష్ణుని కంఠము పెనవేసుకొని
కొందరు కాంతలు మురిసిపోయిరి
నాగకాంతలతొ కనబడునట్టి
చందన తరువన -కృష్ణుడుతోచెను.

కొప్పులు విడివడి -తిలకము చెదరి
సుమముల రేకలు రాలిపడినవి
జారిన పయ్యెద సర్దుకొనగను
తీరిక లేనటు నృత్యమాడిరి.

అందమైన - ఆ - రాసక్రీడలొ
బృందావన మది - నందనమైనది
వైకుంఠమ్మే - నేలకు దిగెనా!
అనిపించినదా వెన్నెలరాత్రి

అద్దమునందు - ప్రతిబింబముగని
బాలుడు - ఆడిన చందముగాను
ఆత్మరూపులగు - గోపకాంతలతొ
ఆటలపాటల - తేలెను కృష్ణుడు.

రాసక్రీడలో అలసిపోయిరి
ముఖ బింబములు వాడిపోయినవి
అంతట - కృష్ణుడు - వారందరితో
యమునలొ దిగెను - స్నానమాడగా.

జలకాలాడిరి - అలసట తీరిరి
గోపకాంతలతొ - కృష్ణదేవుడు
ప్రక్కనన్ను పూలతోటలో
సుమ సౌరభములు ఆస్వాదించెను.

ఆ విధముగను దేవదేవుడు
గోపీ జనమును రాసక్రీడతో
శరద్రాత్రిలో పండు వెన్నెలలో
పారవశ్యమున - ముంచి వేసెను.

అంతట-రాజు-అడిగె మునీంద్రుని
ధర్మస్థాపనకు ఉద్భవించెను -
అధర్మమ్మును - అణచి వేయునే
ఆ-హరి అటుల చేయుట తగునా?

ధర్మరక్షకుడు - ధర్మ మూర్తియగు
శ్రీహరి - అటుల - పరకాంతలతో
విహరించుటది - ధర్మమైనదా
విశదముగా వివరించుడు స్వామీ!

అంతట - మౌని - మందహాసమున
భూనాథునితో - పలికెను ఇటుల
"సర్వభక్షకుడు - అగ్నిదేవుడు
దోషమాతనిని - తాకగలేదు.

ఇంద్రుడు-చంద్రుడు మొదలగు వారు
లోకహితముకై చేయు పనులవి
తప్పుగ తోచిన - వారికి మాత్రము
తప్పు అంటదు - తెలియుము రాజా!

అణువునుండి-మరి-మేరువు వరకు
నిండిన వానికి చెల్లునుగానీ
సామాన్యుడు మరి పరాయికాంతను
స్మరించి - బ్రతుకుట అసంభవమ్ము

సర్వనాశము చేయగ చాలిన -
కాలకూటమును మ్రింగెడిశక్తి
శివునికి తప్ప మరి ఇంకొకరికి
లేదన్నది - మరి - నిస్సంశయము.

ఎవని పాదములు శరణాగతి యని
నమ్మికొలుతురో - ఆ పరమాత్ముని
లీలలు - అద్భుతమైనవి రాజా!
అతనికి దోషముకలుగుట ఎట్లు?

గొల్లలలో - మరి - గొల్ల కాంతలలో
గోవులలోనూ - గోవత్సమ్ముల
జీవకోటిలో - తానై నెలకొను
పరంధామునికి పరాయి ఎవ్వరు.

ఆడా మగలను - తేడాలేదని
జంతుజాలము - తనవారనుచు
తెలియజెప్పెడి - దివ్యలీలలు
తెలివిగ మాత్రము గ్రహించవలెను."

తెల్లవారెను - కృష్ణుడంతట
గృహములకేగగ చెప్పెను వారికి
మనసు రాకనే మగువలందరు
శలవుగైకొని బయలుదేరిరి.

ఇండ్లను జేరిన గోపికలను గని
గోపాలురు మరి - మారుపలుకక
ఆప్యాయముగా రమ్మని బిలచిరి
కృష్ణదేవుని గాంచిరి - వారిలో

గోపీజనముతొ రాసక్రీడ
వినినా - చదివినా - వారందరికీ
మనస్తాపము హరించి పోయి
శుభములు కలిగి సుఖపడగలరు.

❋❋❋ ॥శ్రీ కృష్ణచరితము॥

# 40 గంధర్వుని శాపవిమోచనము

బృందావనికి అతి దగ్గరలో
అంబికావనము నెలకొనియున్నది
క్రూరమృగముల తాకిడి యుండదు
అచటొక దేవత వెలసి యున్నది.

తన మిత్రులతో నందుడు అచట
దేవికి - పూజలు చేయుట కొరకై
అంబికావనము బయలు దేరెను
సరస్వతీనది పారు చున్నది.

శుచిగా - నదిలో స్నానము చేసి
ఉమాశంకరుల పూజలు చేసి
కానుకలెన్నో సమర్పించుకొని
దానధర్మములు దండిగ చేసెను

జలపానముతో కఠిన నియమమున
అర్చన జరిపి - రాత్రి అచ్చటే
నిద్రలొ మునిగిరి - అర్ధరాత్రమున
అటకొక - పెద్ద పాము వచ్చినది.

భయంకరమ్మగు పన్నగమంతట
నిద్రలొ నున్న నందుని కరచి
నోటిని తెరచి మ్రింగసాగెను -
కావుము వంశీ! అనుచు అరచెను.

నందుని అరపులు విని వారందరు
నిద్రలేచిరి దృశ్యము గాంచిరి
కఱ్ఱలతో ఆ పామును గొట్టిరి
అయినా - వదలక మ్రింగసాగెను.

కృష్ణా! కృష్ణా అని అరచుచును
సొమ్మసిల్లెను - నందుడచ్చట
అంతటిలోన కృష్ణుడు వచ్చెను
తండ్రికి - తాను ధైర్యము చెప్పెను.

బలముగ కాలితొ - పామును తన్నెను
వెంటనే పాము - నందుని వదలెను
జయ జయ ధ్వానము లందరు జేసిరి
నందుడు తనయుని కౌగిలించుకొనె.

ఆసమయములో పాముకు బదులు
అచటొక - దివ్య పురుషుడు నిలచెను
కృష్ణుడు - వానిని వివరములడిగెను
పాముజన్మమరి ఏలవచ్చెననె.

అంతట పలికెను దివ్య పురుషుడు
"దేవా - నేను - సుదర్శనుండను
విద్యాధరుల జాతివాడను
అందగాడినని గర్వించితిని."

గగన యానమున సాగుచునుండి
ఒక ప్రదేశమున ఆగితి - నచ్చట
అంగీరస - వంశమ్మున బుట్టిన
ఋషుల నెందరినొ చూచినాడను.

అందవికారము కలిగిన వారిని
హేళన చేసితి - దాని ఫలితమిది
మహాసర్పమై - జీవించమని
శాపమునిడిరా ముని పుంగవులు.

జాలిగనేడ్చుచు పదములబడగా
శాపవిమోచన చెప్పిరి దయతో
భక్తరక్షణకు - పుడమిని పుట్టిన
పరమాత్ముడు - నీ శాపము తీర్చును.

యదు వంశములో హరి జన్మించును
ఆయన పదముల స్పర్శతొ నీకు
శాపము తొలగి - ధన్యుడవగుదువు
అనుచు తెలిపిరి-" అని పలుకుచును

"నీ పద ధూళి - శిరమున పడెను
ధన్యుడ నైతిని - పరమాత్మాయని
అనేక విధముల స్తోత్రము జేసి
ఆనతి గైకొని - వెడలి పోయెను.

గోపకులందరు ఆనందించిరి
కృష్ణుని - తిరిగి స్తోత్రము చేసిరి
దేవికి మ్రొక్కి - శలవును గైకొని
మందకు జేరిరి - ఆనందముగా.

మరి యొక వెన్నెల రాత్రియందున
రామ కృష్ణులు అలంకరించుకు
వనమున కేగి - విహరించుచును
తీయగ పాటను ఆరంభించిరి.

మనోహరమ్మగు పాటను వినిన
గోపికలందరు పరవశించిరి
అన్నదమ్ముల చుట్టు చేరిరి
పారవశ్యమున - మునిగి పోయిరి

రామకృష్ణులు - సుమసౌరభముల
తియ్యగ పాడి - ఆటలాడిరి
ఆనందాబ్ధిని - తేలిరందరు
అటుల సమయము గడిపిరంతట.

||శ్రీ కృష్ణచరితము||



# 41 శంఖ చూడ వధ

శంఖచూడు - డను పేరుగలిగిన
ధనపతి సేవకు డటకు వచ్చెను
రామకృష్ణులు - గోపికలందరు
వనములొ నుండుట గాంచెను వాడు -

సమయము కొరకై వేచియుండెను
రామకృష్ణులు - ఏమఱియుండగ
యోగబలముచే గోపకాంతలను
హరించి - పోయెను - ఉత్తరదిశగా

విషయము గ్రహించి గోపకాంతలు
రామా! కృష్ణా! అనుచు అరచిరి
అన్నదమ్ములు - దిగ్గున లేచిరి
బలముగ - తరువులు రెండు బెరకిరి

ఒక్క ఉదుటున - శిరము నందుకొని
పిడుగుల బోలు గ్రుద్దులివ్వగా
నెత్తురుగ్రక్కుచు చచ్చెనువాడు
వాని శిరమున - రత్నము గలదు.

భయమువలదని ధైర్యము చెప్పి
ఉత్తరదిశగా పరుగిడినారు
అంతముచేసే - మృత్యుదేవతగ
అగుపించిరి - బలరామకృష్ణులు

వెంటనె - కృష్ణుడు - రత్నము బెరకి
కానుకగా - తన అన్నకివ్వగా
ఆనందముతో బలరాముడట
ప్రియసోదరుని కౌగిలించెను.

వెంటనె దుష్టుడు - గోపకాంతలను
వదలి - పరుగిడె-అసువులు నిలపగ
అన్నను - వారికి రక్షగనుంచి
వెంబడించెను - కృష్ణ మోహనుడు.

దుష్టకార్యము చేయుట వలన
వైరిగ మారిన - శంఖచూడుడు
కృష్ణునిచేతిలో - అసువులు వీడి
ముక్తికాంతను జేరగలిగెను.

హరి సేవలవి - ప్రియముగ జేసిన -
వైరముతో మరి - హరినెదిరించిన -
ఫలితము ఒకటే - ముక్తిలభించుట
అనుచు - రాజుకు - శుకుడు తెలిపెను.

॥శ్రీ కృష్ణచరితము॥



# 42 వేణుగానం

ఉదయమెలేచి - ఆలమందలతొ
నందనందనుడు బయలు దేరెను
గోపకాంతలు - గృహకృత్యములు
కృష్ణ స్మరణతో చేయుచుండిరి.

కృష్ణలీలలు పాడుకొనుచును
నిత్య కృత్యములు చేయుట యందు
సాధన చేసిరి - గోపికలందరు
ఎన్నో జన్మల పుణ్యఫలమది.

ఉదయము నుండే - వారి మనస్సులు
కృష్ణార్పితమై - పాడుచున్నవి
అంతటిలోన - వారి మనస్సుకు
వేణుగానము విన్నటు తోచెను

పనులవి - మరచి ఒకచో జేరిరి
వారిలో వారు - కృష్ణదేవుని
వెదకుచున్నటు కనబడినారు
ఆశ నిరాశల ఊగులాడిరి.

అదిగో - అదిగో - వేణుగానము
బృందావనిలో వినబడుచున్నది
అచ్చటినుండి - పరవశించిన
పవనుడు - వీనుల విందు జేసెను.

పెదవుల వద్ద నిరతము నిలచే
వెదురు వేణువే - ధన్యతనందెను
కదిలేవేళ్ళు నయనానందము
అమృతమయమా - గాన వైభవము.

వేణుగానము వినిన - దేవతలు
మనుజుల మెందుకు కాకపోతిమి -
కృష్ణుని పదముల పడక పోతిమని
ఆవేదనలో మునిగి యుందురు.

గరికను కొరికే - గోవుల - చెవిలో
వేణునాదము పడినచో యిక
నోరు కదపక - మోరలెత్తుకొని
సమాధిస్థితిలో నిలచి పోవును.

పొదుగుల యందు పాలు త్రాగెడి
గోవత్సములు - త్రాగుట మరచును
కృష్ణుని పాట - నెమళ్ళు వినుచు
మేఘముదిగెనని - తలంచి ఆడును.

వారిలో వారటు - మాటలతోను
తియ్యనైన తమ అనుభవాలతో
ఆనందమును అనుభవించిరి
కనబడలేదని బాధనందిరి.

సూర్యోదయముతో - గోవుల తోలుకు
అడవికి పోవును - తిరిగి ఆతడు
చీకటి పడు వరకచ్చట నుండును
ఎంతటి - వియోగ బాధ కలుగునో!

కనబడకున్నా - దగ్గరవున్నచో
తనివి తీరని ఆనందమ్ము
అందువల్లనే బ్రహ్మదేవుడు
అంతా - రాత్రిగ నుంచిన మంచిది

ఎప్పుడు-సూర్యుడు-పడమర కెళ్ళును
ఎప్పుడు - కృష్ణుడు మన కగబడును
గోవులు - ఎంతటి పుణ్యము నందెనో
గోజన్మయినా కలుగకపోయెను -

అంతటిలోన - ప్రొద్దు వాలెను
కృష్ణాగమనము కెదురు జూచిరి
గోధూళియది ఎగురుచుకనబడె
హృదయము పొంగి పరవశించినది.

ఎదురేగిరి వారందరు ముదముగ
కృష్ణుని గాంచి పలుకరించిరి
"ఇంతమెల్లగా - నడచితివేమి
మా ఆశ్రమమది - తెలియకుంటివి!

తెల్లవారిన - నిలబడవిచట
చీకటి పడక - రానేరావు
అంతవరకును - నిన్నుగానక
ఎంతటి దుఃఖమొ - నీకు తెలియదా."

అనుచు పలుకుచు - వెంటనడచుచు
దివ్యమంగళ రూపము గనుచు
వచ్చెడి కాంతల పలుకరించుచు
కృష్ణుడు - ఇంటిలొ అడుగు బెట్టెను.

॥శ్రీ కృష్ణచరితము॥

❋❋❋

## 43 వృషభాసుర సంహారము

రోజులట్టుల గడచుచుండగా
కంసుని పనుపున అరిష్టుడనునొక
అసురుడు - రూపము మార్చినవాడై
ఆబోతుగ - ఆ - మందకు వచ్చెను.

ప్రాణభీతితో అరవసాగిరి
కృష్ణా! కృష్ణా! అనుచు బిలచిరి
అంతటిలోన వచ్చెను కృష్ణుడు
ఆబోతుముందర నిలచెను - గిరివలె.

గిరివలె ఉన్నత కాయమున్నది
గిరిశిఖరము వలె మూపు వున్నది
అరపుకు - గడ గడ వణకుచుండిరి
గర్భవతులకు - నిలవ - కష్టమయె

ఆడువారిని - అల్లరి బెట్టే
మగతనమునకు - సిగ్గుపడవలె
సామాన్యమగు - గొల్లమందయని
తెలివి లేక - ఇటువచ్చి నాడవు.

అడుగుల - భూమిని కదలించినటు
కదలే-గిరి యది-అన్నటు వచ్చెను
ఘనశృంగములతొ-మందలొ బడిన
ఆబోతును గని - పరుగిడ సాగిరి.

వృషభాసుర - నీరోజులు సరి-యిక
అనుచు అరచి - అట - పాములబోలిన
కరములతో - నెదిరించెను కృష్ణుడు
ముందుకు దూకెను - ఆ - రక్కసుడు

లేగలు - తల్లులు చాటున నక్కెను
కట్లు తెంచుకొని పరుగిడె నెద్దులు
గోవులు - గొల్లల వద్ద జేరెను
తరుముచు వచ్చెను రక్కసుడంతట.

కృష్ణుని కొరకై వాడు వచ్చినది
వాని కోరిక - నెరవేరినది
ఆవేశముతో కృష్ణునిపై బడ
ఒడుపుగ తోసెను - వానిని కృష్ణుడు.

కొమ్ములపట్టుకు - బలముగ గెంటగ
నేలను బడెను - చెమటలు బట్టెను
తిరిగి తేరుకొని - ముందుకు వచ్చెను
అంతట కృష్ణుడు ఆగ్రహించెను.

శృంగములందుకు ఘనముగ తన్నెను
రక్తము గ్రక్కుచు ఎగిరి పడగను
కొమ్మును బెరకి - పొడవగనంత
అంతమయ్యెను వృషభాసురుడు.

గోపకులందరు - జయము పలికిరి
పుష్పవృష్టి కురిపించిరి సురలు
బలరాముడంతట సంతోషముతో
బలముగ తమ్ముని కౌగిలించుకొనె.

ముఖమును తుడిచి-యశోదప్రియముగ
దిష్టిని తీసి - ముద్దులాడెను
ఆనందాశ్రులు నిండగ - నందుడు
తనయుని గాంచి పొంగి పోయెను.

తను పంపిన - ఆ - అసురుడట్టుల
కిక్కురుమనక చచ్చెననుచును
వేగులు - వార్తను తీసుకురాగా
తల్లడిల్లెను - కంసభూపతి.

అంతటిలోన నారద మౌని
అటకేతెంచగ - పూజలు చేసి
కంసుడు అడిగెను విశేషమ్ములను
వివరముగా - ఆ - మౌని చెప్పెను.

"కంసా వినుము - అతి రహస్యము
యశోదకన్నది ఆడ పిల్లను
ఆకాశములో కెగిరిన దదియే
అల్లుడు కాదని - వదిలితి వీవు.

గర్భము చెడెను - దేవకి కనుచు
నాడుతలంచుట - వట్టిదే సుమా!
ఆ గర్భమ్ము - రోహిణి కడుపున
పెరిగి - ఫలించి - కొడుకుగ పుట్టెను.

రోహిణి కొడుకై - బలరామునిగా
పెరుగుచుండెను - నందవ్రజమున
దేవకి కడుపున పుట్టిన వాడు
పెరుగు చుండెనట - కృష్ణుని గాను.

విష్ణు మాయ - ఈ - కథనడిపించెను
దేవకి గర్భము - రోహిణి కందెను
యశోదమ్మకు పిల్లగ బుట్టియు
దేవకి - పిల్లగ - కన్నుగప్పినది."

అనుచు తిన్నగా - చెప్పెను మౌని
బయలు దేరుటకు సిద్ధమయ్యెను -
విషయము వినిన కంసుడంతట
వసుదేవుని - హత మార్చెద ననుచు.

ఖడ్గమందు కొని పరుగున బోయి
ఆ వసుదేవుని ముందు నిలచెను
యముని బోలు ఆ - కంసుని గాంచి
కలవర పడెను - వసుదేవుండు.

"కొడుకును - చల్లగ రక్షించుకొని
ధర్మ పన్నములు - చెప్పుచుంటివా!
ఇంతటి మోసము చేసిన - నీకు
శిరచ్ఛేదము తగిన దండన."

ఈతని పైనా - నీ ప్రతాపము"
అనుచు హేళనగ పలుకగ - నంత
ఆప్రయత్నము - విరమించినను
కంసుని కోపము తగ్గకున్నది.

అనుచు - బుసలతో - కత్తినెత్తెను
నారదుడంతట - అడ్డు వచ్చెను
"ఈతని చంపిన లాభమేమిటి
కర్తవ్యమును ఆలోచించుము.

వెంటనె ఆతడు - ఆనతి నిచ్చి
వసుదేవుని - మరి - దేవకి దేవిని
ఇనుప సంకెలల బద్ధుల జేసి
కారాగృహమున - బంధించమనె.

అంతట కంసుడు - కేసి - అనునొక
నమ్మిన బంటును - రావించుకొని
రామకృష్ణులను మట్టుబెట్టమని
ఆనతి నిడగా - పరుగిడె బంటు.

❋❋❋ ॥శ్రీ కృష్ణచరితము॥

## 44 కంసుని కొలువు

వ్యూహరచనకై - నిర్ణయించుకొని
కొలువు దీరెను-కంసుడు-హితులతొ
ఆప్తులు, మంత్రులు - సామంతులును
చాణూర ముష్టికులు - మల్లులుండిరి.

బృందావనిలో - రామకృష్ణులట
తరుల - గిరులలో తిరిగే బుడతలు
యద్ధములో - నను - చంపివేతురట
ఎంతటి పొగరుగ - పలికిరొ - వింటిర!

అందరివంక - చూచి పలికెను
"ఎన్నో వింతలు - పుట్టుచున్నవి
నన్ను చంపగా - పథకము లున్నవి
వెర్రి గొల్లలట - దానికి ముఖ్యులు.

చాణూరా - నువు వింటున్నావా!
ముష్టికా - నువు నిలబడవయ్యా
మల్ల విద్యలో - మార్తాండులగు
మిమ్ముగెలిచెడి - మగవాడుండడు.

దేవేంద్రాదులు - మారు పలుకరు
నను గని-భయపడు-సూర్యదేవుడు
వాయుదేవుడు - వంగి నడచును
ప్రకృతి-ననుగని-నిలచు వినయముగ.

మల్లవిద్యా ప్రదర్శనమ్మని
దానికి రమ్మని పిలువనంపుడు
వెట్టిగొల్లలు - వచ్చినంతనే
వారి పొగరును - దించి వేయుడు.

గజరక్షకుడా - నీ శిక్షణలో
ఐరావతమును - లక్ష్య పెట్టని
కువలయా పీడము - అజేయమైనది
దాని సాయమున - అణచుము వారిని

నన్ను చంపెడి - వారిని - త్వరగా
చూడగ - ముచ్చట పడుచుంటినయా!
సురలుకోరగా - నను చంపుటకు
విష్ణువు దిగెనట - భూమి మీదకు.

జరిగెడి కార్యము-వినుడు శ్రద్ధగా -
ధనుర్యాగము - అనునొక యాగము
ఆరంభింతును - ఆ యాగములో
పశువధ చేయుడు - నిర్దయతోను.

వసుదేవునికి - కొడుకుగ బుట్టి
కృష్ణుని పేరున - పెరుగు చుండెనట
వానిని తెచ్చుట ముఖ్యమేగదా!
వ్రేపల్లెకు నువు పోవలెనిపుడు.

చతుర్దశి యది శుభముహూర్తము
ఆరంభింతము - యజ్ఞము - నాడు
పశుపతి దయతో జయము లభించును"
అనుచు - కంసుడు ఆనతి నిచ్చెను.

ధనుర్యాగమని - వారందరిని
ఆహ్వానించి - తీసుకురమ్ము
ఏదో విధముగ - రామకృష్ణులను
తెచ్చెడి భారము - నీ దేను సుమా!

సభలో నందరు సంతసించిరి
జయ జయ ధ్వనులు మిన్నుముట్టెను
అంతట కంసుడు - ఆప్యాయముగా
అక్రూరుని - అట - గాంచి పలికెను.

నాకై నీవు చింతిల వలదు
కువలయాపీడము - వారిని చూచును
చాణూర - ముష్టికులు మల్లయోధులు
మాటాడక - మరి - మట్టు పెట్టెదరు.

"యదు కులమునకు మణిపూసవు-నువు
క్రూరత్వమును - తెలియగనట్టి
సార్థకనామము కలిగిన వాడవు
నీ సఖ్యముతో నాకు శుభమగు.

బాలురతోడుగ - వసుదేవుని - మరి
వృష్ణి కులమున - భోజకులమున
పేరుగాంచిన పెద్దలందరిని
యమపురి కంపెద-సందియమెందుకు?

స్నేహముగా - నిను కోరుచుంటిని
సాధించగల సమర్థుడవయా!
రామకృష్ణులను - గొల్ల బాలకులు -
వారిని - నీవు తోడ్కొని రావలె.

రాజ్యకాంక్షను వదలని ముదుసలి
నాజనకుడగు - ఉగ్రసేనుని
అతని తమ్ముడు - దేవకుని - యిక
కత్తికి - బలిగా అర్పించెదను.

రిపులహరించి - హితులను జేర్చుకు
భూప్రజలంతా-భళి-భళి యనునటు
పట్టాభిషేకము చేసుకొందును
పుడమి పాలనము చేతును - నేను.

ఆలసించక బయలు దేరుము"
అనుచు - భుజమును తట్టి చెప్పెను
ఆలోచించుకు నిశ్చయించుకొని
అక్రూరుడిటు పలికె - కంసునితొ.

"నీ ఆనతిని దాట లేనుకద!
దైవయోగము దాటగ లేము -
కావున విధిని తెలియని వారై
మనుజులు ఇలలో మసలు చుందురు.

నీ కోరికది విధి ప్రేరితము
దానిని కాదన - నెవ్వరి వశము?
నీవు - రిపులుగా - తలచే వారిని
రామకృష్ణులను తోడ్కొని వచ్చెద."

అక్రూరుడటు వెడలగ నంత
రామకృష్ణులు ముందర వున్నటు
క్రోధము నిండి - ప్రళయ మూర్తియై
అంతఃపురమును జేరెను - కంసుడు.

॥శ్రీ కృష్ణచరితము॥



## 45 శ్రీకృష్ణుడు - కేశి - వ్యోమాసురులను చంపుట

నమ్మిన భృత్యులు - స్వామిభక్తులు
అసువులనిచ్చే అతి సాహసులు
కంసుని సేవలొ - నిరతము వుందురు
వారిలొ ఒకడు - 'కేశి' రక్కసుడు.

కృష్ణుని - బలిగొన - బయలుదేరిన
కంస భృత్యులను - మృత్యుదేవత
ఆప్యాయముగా ఆహ్వానించి
ఆతిథ్యము నిడు రోజులు - అవ్వి.

మాయలొ - కేశిని - మించ రెవ్వరు
కామరూపుడు అతి బలవంతుడు
మృత్యు దేవతను - వణకించగల
శక్తిమంతుడు - ఆ - మాయావి.

ఇంద్రవరుణులను జయించినానని
బలగర్వమున నున్న రక్కసుడు
గుఱ్ఱపు రూపును - సంతరించుకొని
వ్రేపల్లెకు - తా - బయలు దేరెను.

కృష్ణుని పైకి పొమ్మని చెప్పి
పంపెను కంసుడు - కేశిరక్కసుని
పైకే పొమ్మని - చెప్పినట్టుగా
వాడిక - తిరిగి రానేలేదు.

మహాకాయముతొ గుఱ్ఱమునడువగ
శేషుని - మెడలు - విరగినట్టయె
భూమివణకెను - అది సకిలించగ
నింగిన - సురల చెవులు చిల్లుపడె

తెరచిన నోటిలో - దంతము లవ్వి
ప్రళయ జ్వాలను బోలియున్నవి
కాలపాశమును బోలెను - వాలము
భయంకరమ్ముగ - జూలు ఎగిరెను.

స్త్రీలు-పురుషులు-బాలురు వృద్ధులు
గోవులు-లేగలు-వృషభము లన్నియు
చెల్లా చెదరై భయపడిపోయి
ప్రాణమ్ముల నరచేతనుంచిరి.

ఆర్త రక్షకుడు - కృష్ణుడు గాంచెను
ముందు నిలచెను - పలికె హేళనగ
"మూర్ఖుడ వీవు - నీ ప్రతాపము
బేలలైన - ఈ గొల్లలపైనా -

నీవు వెదకెడి వాడను - నేనే
చేవగలిగిన - యిటు రమ్మనగ
అంతట అసురుడు ఆగ్రహమ్మున
నోటిని తెరచి - ముందుకురికెను.

ఒడుపుగ తప్పుకు - కృష్ణుడంతట
అశ్వపుజూలును - అందుకొనగను
దొరకక-అసురుడు-బలముగ తన్నగ
కృష్ణుడు సులువుగ తప్పించుకొని

పామును - గ్రద్ద - విసరినట్టుగా
విసరె నశ్వమును - నంద నందనుడు
అశ్వము లేచి - భీకరమైన
నోటిని తెరచి - కృష్ణుని పైబడె

అంతట - కృష్ణుడు లాఘవమ్ముగా
బలమగు చేతిని నోటిలో దూర్చెను
వామన మూర్తి - ఎదిగినట్టుగా
చేయి ఎదుగుట ఆరంభించెను.

చేయి విసరిన - విసురుకునంత
అశ్వపు దంతము లూడిపడినవి
పెరిగిన హస్తము - ప్రాణాంతకమై
కండ్లు రెండును - రాలి పడినవి.

ఉదరము ఉబ్బి - గుండియ చెదరి
నేలను బడగా - అసురుడంతట
నడిమికి రెండుగ చీలిపోయెను
అసువులు - గాలిలో తేలిపోయెను.

ఆనందముతో నిండిన సురలు
పూలవాన - కురిపించి రచ్చట
పునర్జన్మను ఎత్తినట్టుగా
గొకులమ్మట మురిసి పోయినది.

ఆనందముగా వారందరును
నందనందనుని కీర్తన జేసిరి
ఆపద్బాంధవుడని పలుకుచును
అనేక విధముల స్తోత్రము చేసిరి.

॥శ్రీ కృష్ణచరితము॥



# 46 నారదాగమనము

ఆసమయములో నారద మౌని -
నరజన్మము తో - నరజాతికి - మరి
కీర్తి నొసంగిన - నారాయణుని
దర్శించగ - వ్రేపల్లెకు దిగెను.

కృష్ణ దర్శనము చేసుకు - మౌని
ఏకాంతముగా పలికె నిట్టుల
“పురాణ పురుషా - యోగి వందితా!
సర్వేశా - ఓ మంగళ రూపా!

నీ మహిమలను కొనియాడగను
నాల్గు ముఖములు-బ్రహ్మకు చాలవు
కట్టెలో నున్న - అగ్ని రీతిగా
సర్వ జీవులలో నుందువు నీవు.

చిద్రూపివి నువు - చిన్మయమూర్తివి
సగుణోపాసన వల్ల - ఎల్లరకు
అందునట్టుగా అగుపించెదవు
ప్రణవము నందు-నెలకొనియుందువు.

వేదమ్ములు - నిను - ప్రస్తుతించును
కర్మసాక్షివి - కర్మకు మూలము
మాయను నీవు - వశపరచుకొని
అనేక రూపులు - సంతరించెదవు.

సత్వ, రజ-స్తమో గుణములను
మాయతో - నీవు కల్పించితివి
సృష్టి స్థితి లయ రూపమ్ములతో
మాయా - జగతిని రచించి నావు.

రక్కసి కృత్యమ్ములతో రాజులు
భూమిని - బాధకు గురిచేయగను
వసుంధర - మరి దుఃఖించగను
వసుధలో పుడితివి - దుష్టశిక్షణకు.

యదు వంశమ్ము - శీల సంపదకు
పదిలమ్ముగను - వుండుననుకొని
అవతరించితివి - ఓ నారాయణ!
అవధరింపుము - నా పలుకులను.

చాణూర ముష్టికులు-గజ-కంసులను
శంఖ, యవనుల - ముర - నరకులను
శిశు పాలుని - మరి - దంత వక్త్రుని
సాల్వాదులను - అంతము జేతువు.

పారిజాతము - పెరటి చెట్టగు
శ్యమంతకము - నీ సొంతము అగును
నృగమహరాజుకు - శాపము తీరును
బ్రాహ్మణ శిశువును - బ్రతికించెదవు.

రణమున - పార్థుని - సారథివై - నువు
భూభారమును తగ్గించెదవు
యోగులు - యతులు - కీర్తించెదరు
యోగ విద్యను - వెల్లడి చేతువు.

త్రిగుణమ్ములవి హద్దులు మీరక
సంచరించునటు ఆదేశింతువు
ఆది అంతములు లేని రూపుడవు
వందన మిదిగో - నందనందనా!

సత్యము-నిత్యము-అయిన మూర్తివి
సర్వభూతముల శరణాగతివి
దేవదేవుడవు - నిను దర్శించగ
వచ్చితినయ్యా - శలవు నిమ్మిక"

అటుల పలికిన నారదుగాంచి
కృష్ణుడు పలికెను మందహాసమున
"నీమాటలలో విషయము తెలిసెను
నాకర్తవ్యము - నెరవేర్చెదననె".

నారదు డంతట వెడలి పోయెను
తోటివారి కా విషయము తెలియదు
కృష్ణుడు మాత్రము తన మిత్రులతో
నెచ్చెలి మాదిరి మసలుచుండెను.

యథాప్రకారము గోపబాలకులు
గోవుల తోలుకు అడవికేగిరి
వారొక - ఆటను ఆడదలచిరి
అందరు కూడి ఆరంభించిరి.

వారిలో వారే - కొందరు - గొఱ్ఱెలు
కొందరు - గొఱ్ఱెల కాపరులాయిరి
దొంగలుగా మరి కొందరాయిరి
ఆట - చక్కగా సాగుచున్నది

అంతటిలోన అసలు దొంగ అట
మెల్లగ వచ్చి - వారిలో చేరెను
వ్యోముడు-వాడు-మయుని తనయుడు
గొల్ల వేషమున - వారిలో కలిసెను.

రూపు రేఖలు - కలిసి పోవగా
అనుమానించే వారు లేరట
వారితో - ఆడుచు - మెల్ల మెల్లగా
ఒక్కొక్కరినే - అపహరించెను.

అపహరించిన - గోపబాలురను
దూరముగా - ఒక - గుహలో దాచెను
దారికడ్డముగ - రాయినుంచెను
అటుల బాలురు - బందీలయ్యిరి.

బాలురసంఖ్య - తగ్గుచున్నది
ఏమియు తెలియని - నంగనాచిలా
మన వారంతా కనబడరేమని
కృష్ణుని అడిగెను - వ్యోముడు-తెలివిగ.

అసలుగుట్టును తెలిసిన వాడు
వెన్న దొంగ - తా - పలికెను తిరిగి
"ఎంతో తెలివిగ - ఆడితి వాట
అసలు దొంగవు - అతి చతురుడవు

గుహలో దాచి - తెలియనట్టుగా
అడుగు చుంటివి - అతి సాహసివి
బేలలు - నీకు దొరికి పోయిరి
మూర్ఖుడ-ననుచు-తలంచు చుంటివి"

అనుచు కృష్ణుడు ఒక్క ఉదుటున
సింహము - నక్కను పట్టుకొన్నటు
వ్యోముని - కరముల యిమిడించగను
రక్కసిరూపుతో - నిలచెను వాడు.

అవలీలగను - కంఠమునొక్కి
నేలకు తోయగ - చచ్చెనసురుడు
గుహలో మిత్రుల నందరనపుడు
వెలికి తెచ్చెను - నందనందనుడు.

విశ్వాసముగా నున్న అసురుడు
దానిని - గట్టిగ నిరూపించినటు
అసువులు వీడెను - కంస సేవలో
కృష్ణుని పదముల రాలిపోయెను.

॥శ్రీ కృష్ణచరితము॥



## 47 అక్రూరుడు మందకు వచ్చుట

కంసుని మాట నెరవేర్చుటకై
ఉదయమె లేచి - రథా రూఢుడై
శుభ శకునము గని - అక్రూరుండు
బృందావనము - బయలుదేరెను.

కానీ - కంసుడు - తనకు అప్పుడు
అలభ్యమైన - అవకాశమును
రామకృష్ణుల - దర్శన భాగ్యము
కలిగించెనని - సంబరపడెను.

కృష్ణ దర్శనము మదిలోతలచి
ఆనందములో మునిగిపోయెను
పుణ్యవశమున - ఈ పని - తనకు
కంసుడొసగెనని - పొంగి పోయెను.

అంతటిలోన - సంశయ మొదవెను
దుష్టుని పిలుపున - వారిని గొనిపో -
వచ్చితినని - మరి తెలిసినచో యిక
దరికి చేరగా అనుమతించునా?

గతములొ చేసిన - పుణ్యఫలమని
తపస్సిద్ధియని - తలంచినాడు
ఎంతో చక్కని పుణ్య కథలను
వినిన ఫలితమని - మదిలో నెంచెను.

సర్వము తెలిసిన - జగన్నియంత
నామది - పూర్తిగ తెలియకుండునా -
నాభాగ్యమది - ఎటులనున్నదో
అనుచు తలంచెను-పరి-పరి విధముల.

యోగదృష్టితో - తపస్సమాధిలొ
మహామునుల కే లభ్యము గాని
మహా యోగము - కృష్ణ దర్శనము
తనకు కలుగునని ఆనందించెను.

అశ్వమ్ములను మించిన వడితో -
కృష్ణ దర్శనము చేయుట కొరకై
మనసు - పరుగులు తీయుచుండెను
రథము జేరెను - బృందావనము.

పరంధాముని పాదపద్మములు
స్మరించి - తరించు టన్నది మరిచి
శత్రుభావమున చంపగ నెంచెను
కంసుడు - ఎంతో మూర్ఖుడయ్యెను.

ఎడమనుండి మరి కుడి వైపునకు
అడవి జంతువులు పరుగిడ - గాంచి
శుభశకునమ్మని - తలంచి నాడు
మనసు కుదుట పడె - అక్రూరునకు.

చిరునవ్వులతో - సిరులొలకగను
చంద్రబింబము పోలు ముఖములో
తీర్చిన కస్తూరి - అభయము నిడగ
కనబడు - కృష్ణుడు - అతి తొందరలో.

సాయం సమయము దాటుచున్నది
రాత్రికి కృష్ణుని దర్శన మగును
పాదపద్మముల - శిరస్సు నుంచి
పులకరించెద - జన్మ తరించగ.

కరుణా మూర్తి - వరద హస్తమును
శిరసున నుంచి - లేవదీయును
గుండెకు జేర్చి - వెన్ను నిమురును
ప్రీతిగ పలుకును - అని తలంచెను.

ప్రొద్దువాలెను - ఆల మందలను
మళ్ళించుకొని - మరలి రందరు
పేరులు పెట్టి - గోవుల పిలచుచు
గోపాలకులు వెదకు చుండిరి.

అపుడే పుట్టిన లేత పెయ్యలను
మెడపై నిడుకొని - నడచు చుండిరి
పచ్చిక కొరకై పరుగిడు గోవుల
పొదుగుల - పాలు కారుచున్నవి.

ఈటెలు - కత్తులు ఆయుధాలతో
అడవి మృగములను అడ్డగించుటకు
రక్షణగా - మరి - కొందరు నడచిరి
శ్రద్ధగ చూచుచు - నడచుచుండిరి.

బిడ్డలకొరకై ఆతృత నిండి
గోవులు - వెంబడి వడిగా నడచెను
గో సంపదతో - గోపాలకులు
మందకు చేరిరి - ఆనందముగా.

చక్కని మేతను మేసిన గోవులు
నెమరు వేయుచు నున్నవి - శాలలొ
పొదుగులనుండి క్షీరధారలు
కురియుచున్నవి - పులకరింతకు.

పాలుపిండుచూ - పదములు పాడుచు
నందనందనుని కీర్తన చేయుచు
పరవశమ్ముతో - పల్లెయుండెను
అక్షయమ్ముగా పాలు నిండెను.

ఏదో విధముగ సమయము జూచి
కృష్ణుని దర్శన భాగ్యము కొరకై
ఎన్నో కన్నులు చేసుకు - వనితలు
నిలచి యుండిరి - మధుర స్మృతులతో.

బృందావన మక్రూరుడు చేరెను.
వినయము నిండగ-రథమును - దిగెను
రామకృష్ణులు నడచిన - నేలను
పాదము మోపగ - పరవశించెను.

పులకరింతతో - నడువసాగెను
నాలుగడుగులు వేసినయంత
శంఖచక్రముల - నాగలి గుర్తుల
పాదముద్రలు - అగుపించినవి.

పదములు ఆగెను - కనులు మెరసెను
ఆనందముతో - బాష్పజలముల
అభిషేకించెను - పాదముద్రలకు
శిరమును వంచి - నమస్కరించెను.

ఎంతటి భాగ్యము కలిగిన దోయని -
అంతటి భాగ్యము - తపోధనులకు
అందని భాగ్యము-అని తలపోయుచు
సుందరమూర్తుల చూడగ సాగెను.

అరుగో - అరుగో - అన్నదమ్ములు -
అవనికి దిగిన - అక్షరమూర్తులు
అవని భారము తీర్చగ చాలిన
అరి భయంకరులు అగపడినారు

చిరునవ్వులతో - వెలిగే మోముల
సన్నని తిలకము-సొగసుగ మెరయగ
పట్టు బట్టలు - సుమహారములతొ
దర్శన మిడిరి - రామ కృష్ణులు

సాష్టాంగముగ నమస్కరించెను
మాటలురాని - మధురక్షణములవి
మూగ వోయి-అట-నిలబడి పోయెను
**ముడిచిన కరములు-తడిసిన కన్నులు -**

పులకరించిన భక్తుని గాంచెను
భక్తవత్సలుడు - ఆనందించెను
అభయము నిచ్చే కరములు జాచెను
కౌగిలింతకు ముందుకు వచ్చెను

కృష్ణుని కౌగిలి నందిన వాడు
క్రూరత్వమును ఎరుగని వాడు
అక్రూరుడు - మరి - ధన్యుడాయెను
జన్మనెత్తిన ఫలము దక్కెను

రామకృష్ణులు - సగౌరవముగా
అక్రూరుని తమ వెంట నిడుకొని
గృహమున కేగి - అతిథికి తగినటు
సపర్యలన్నీ - శ్రద్ధగ జేసిరి.

భక్ష్యభోజ్యముల - విందు జేసిరి
ఆరగించి - తాంబూలము గైకొని
విశ్రాంతి తీసుకొను - అక్రూరునితో
నందుడు పలికెను - అందరు వినగ.

"కంసుడు బాగా వున్నటు తలతును
చెల్లెలి పిల్లల నందర వాడు
నిర్దాక్షిణ్యము నిండి చంపెను
పాపీ చిరాయువందురు కాదా -

యోగ క్షేమములు అడిగేటందుకు
మనస్కరించకనుంటిని - స్వామీ -
క్రూర సర్పముతొ జీవించునటు
మనుగడ - మీది - సాగుచుండును".

నందుని మాటకు బదులు చెప్పక
నమ్రతనిండి - నమస్కరించి
కృష్ణుని వంక చూచుచుండగా
నందనందనుడు పలికె నప్పుడు

"ఎందరొ చెప్పగ వింటినిగానీ
అక్రూరా - మిము చూచుట ప్రథమము
మీవారందరు - సుఖముగ నుండిర
మీప్రయాణము - సుఖముగ జరిగెన.

రామకృష్ణులు జన్మించినటు
నారద మహర్షి చెప్పిన సంగతి
ఆపై - కంసుని క్రోధా వేశము
వివరముగా - అక్రూరుడు తెలిపెను.

కంసమామ - నా తల్లిదండ్రులను
చెరలో నుంచెను అన్నటు వింటిని
వారు క్షేమముగ - నున్నారు గదా -
మామకు - నిద్దుర రానే రాదట.

ధనుర్యాగము తిలకించుటకు
బంధువుగా - మిము ఆహ్వానించెను
అనుచు చెప్పగా - రామకృష్ణులు
ముసిముసి నవ్వులు ఒలకబోసిరి.

నేను పుట్టినటు - విన్న వెంటనే
దిగులు భయములతొ-నిండిన కంసుడు
ఘోరకృత్యములు చేయుచుండెను
రోజులు-లెక్కిడు చుండును-పాపము.

నందుని గాంచి కృష్ణుడు పలికెను
"ఆప్యాయముగా పిలువ నంపెను
యాగము చేసెడి - రాజుకు తగినటు
కాన్కలు తీసుకు-బయలుదేరెదము.

నా తలిదండ్రులు - ఏమి చెప్పిరి?
వారికి కనబడి - వచ్చినాడవా?
నీరాకకు - మరి - కారణమేమి?
తెలియ బరచుము" - అనగా - నంత.

యాగమునందు విని యోగించగ
పాలు, పెరుగూ, నేయీ-మనము
కుండల నిండుగ - గొనిపోయెదము
త్వరగా సిద్ధము కావలె మీరు".

కృష్ణుని మాటలు వినిరందరును
ప్రయాణమునకై వలయు వస్తువులు
సమకూర్చుకొని ప్రయాణమైరి
విషయము వినిరి గోపకాంతలు.

❋❋❋ ॥శ్రీ కృష్ణచరితము॥

# 48 గోపికల పరితాపము

మథురకు - కృష్ణుడు సాగుచుండెనని
వినిరి - గోపికలు - కలవరపడిరి
అక్రూరునిపై కోపము వచ్చెను
దిక్కులు శూన్యము అనిపించినవి.

ఆ మహారాజు - ఆనతి నిడెను
వచ్చి చెప్పెను - అంతకు మించి
అక్రూరుడు - మరి - చేయునదేమి
మన దౌర్భాగ్యము - చేసినదంతయు.

పిలువ నంపగా-వెడలగ-వలెనా?
అన్న ప్రశ్నకు - సమాధానముగ
మామ పిలుపును-మన్నించెను-మరి
మధ్యలో-మనము ఏమి చెప్పెదము.

ఇన్నాళ్ళూ - మరి - లేని ప్రేమయది
నేడు వచ్చెనా - కంస మామకు
అనుచు పలికిరి - ఎత్తి పొడుపుగా
దిగులు నిండిన గోపకాంతలు.

కృష్ణుడు - తమకు దూరమగునని
తలచినంతనె - కృంగి పోయిరి
మధురమైన - తమ అనుభవాలవి
ఎదను పిండి-కను గొలకులు నింపెను.

బ్రహ్మరాత - యిటు రాసెను మనకు
దుఃఖము నిండి బ్రతుకగ వ్రాసెను
ఆయన గారి - యిల్లాలయినా
భర్తకు చెప్పిన - రాత మారుగద.

యశోదా నందులు మొదలగు
పెద్దలు - వెళ్ళిన-యజ్ఞము నడవద
కృష్ణుని యిచటే వుంచి - వారలే
వెళ్ళివచ్చిన - మన కానందము.

కృష్ణుడు మాత్రము-సిద్ధము అనుచు
ఎందుకు ముందుకు వచ్చెను-వినుడు
మనమంతా యిట నుంటిమి అనుచు
తెలిసినవాడు - అటుల చేయునా -

అయ్యో - ఈ - అక్రూరుడు ఒకడు
పేరు మాత్రము తియ్యగ నుండి
క్రూరత్వముతో నిండి పోయెను
మనకొరకై - మరి - పుట్టెనొ ఏమో!

పేరు నందలి మంచి తనమును
నిలబెట్టగను తలచిన చో - మరి
కృష్ణా - నీవు - శ్రమపడవద్దు
పెద్దలు వచ్చిన - చాలని అనడా -

అయినా గానీ - మన కృష్ణునికే
పట్నపు గాలి - సోకినదమ్మా -
అచ్చట - వారి సేవలుచూచిన
పల్లెపిల్లలను - మనలను తలచున!

నాగరికతకు - నిలయము ఐన
పట్నవాసపు పడతుల సందడి
కృష్ణుడు గాంచి - కరగిపోవడా
మళ్ళీ యిచ్చటి ముఖములు చూచున.

ఇంతటి వేదన కలిగించిన - ఆ
బ్రహ్మకు - మనసే లేదనిపించును
మన ఉసురును-తా పోసుకొనును గద-
అనుచు - అతివలు - కటువుగ ననిరి.

మన మందరము అక్రూరుని గని
పదముల బడి మరి ప్రార్థించినచో
కృష్ణుని వదలి సాగి పోవును
అనెనొక సుందరి - అందరి తోను.

అటుల జరగదు - పైగా మనము
నలుగురిలోన - పలుచ నగుదుము
మన కులదేవత - దయగల తల్లి
కృష్ణుని ఆపిన - ఆగును అతడు.

అసువులు-మావి-నిలుపుము కృష్ణా!
అనుచు - ప్రార్థన చేతము రండని
పరిపరి విధముల వారందరును
పలుకుచు - బాధను మ్రింగుచుండిరి.

కంటినీటితో - కుమిలి పోయిరి
తలచుకు తలచుకు సొమ్మసిల్లిరి
వారి బాధను చూడగ లేనటు
మెల్లమెల్లగ నడచెను రాత్రి.

గోపకాంతలను ఓదార్చగను
పైకివచ్చినటు - రవి బింబమది
నింగిని నిలచెను - తెల్లవారెను
ప్రయాణమ్ముకై సందడి వినబడె.

॥శ్రీ కృష్ణచరితము॥



# 49 మథురకు గొల్లల ప్రయాణం

అట్టహాసముగ గొల్లలందరు
మథురకు సాగిరి ప్రయాణమ్మయి
పాలూ, పెరుగు, నేతి కుండలు
బండ్లనిండుగా సర్దిరి వారు.

నీలాంబరమును - మ్రింగినట్టుగా
నెమలి పింఛము రెపరెపలాడగ
చూపుకు అందిన యంతవరకును
నందనందనుని చూచిరి వారు.

నందాదులు మును ముందుసాగిరి
ముదుసలివారు - శుభము పలికిరి
గోపకాంతలు మదిలో వేదన
తెలిపెడి-ముఖముల నిలబడిపోయిరి.

మనసులు దోచే సుందర రూపము
మదిలోనే - మరి - పదిల పరచుకు
బరువుగ నడచి గృహముల కేగిరి
మూగబోయినటు లుండిరి వారు.

త్వరలో వత్తును - అన్న - సూచనగ
చిరునవ్వులతో కృష్ణుడు - వారిని
ఇండ్లకు పొమ్మని చెప్పి - అంతట
రథము నడప - అక్రూరుని కోరెను.

అతిమెలకువగా రథము త్రోలెడి
అక్రూరునితో ముచ్చటలాడుచు
దాహము వేయగ - యమున చెంతను
రథము నాపమని కృష్ణు డడిగెను.

అన్నదమ్ములు రథమునుండి దిగి
యమునతోయముల - దాహము తీర్చుకు
రథమును జేరగ - అక్రూరుండు
వారి ఆనతిని - స్నానము కేగెను.



॥శ్రీ కృష్ణచరితము॥

# 50 యమునా జలములలో - రామకృష్ణులగాంచి - అక్రూరుడు స్తోత్రము చేయుట

వరుణ మంత్రము - పఠించు కొనుచు
నీట మునిగెను అక్రూరుండు
పైకిలేచెను కనులు - విప్పెను
యమునలొ గాంచెను-రామకృష్ణులను.

రథమున జూచెను రామకృష్ణులను
నీటిలొ జూచెను అన్నదమ్ములను
ఆశ్చర్యాంబుధి నందు మునిగెను
ఆనంద బాష్పములు ధారలుగట్టెను.

సుందర గాత్రులు-మంగళ మూర్తులు
రెండు తావుల - ఒకే సారిగా
దర్శన మిడిరి - ధన్యుని జేసిరి
అనుచు పొంగెను - అక్రూరుండు.

యమునా జలముల ఆదిశేషుడు
వేయి పడగలతొ - దర్శన మిడెను
నల్లని వస్త్రము ధరించి నాడు
తెల్లని మేను - చల్లని నవ్వు.

కోటి సూర్యుల కాంతిని మించిన
దివ్య కాంతులతొ - పడగలు వెలిగెను
మణిమయ శోభిత పడగలు వెలిగెను
సర్పజాతులు - సేవలొ - నున్నవి

సురలు - స్తోత్రములు చేయుచుండిరి
కింకిణి రవములు - సొగసుగ వినబడ
నాగకన్యలు - సన్న సన్నగా
వింజామరలు వీచుచుండిరి.

వెన్నెల వెల్లువ - వేయిపడగలై
మల్లెల పాన్పు - శేషతల్పమవ
భక్తుల పాలిటి కల్పతరువగు
పురుషోత్తముడు అగపడినాడు.

విశ్రాంతిగ - తా - పడు కొనినాడు
నిర్నిద్రుడు - అట నిద్ర నటించెను
నల్లని మేఘము - పోలెను దేహము
విశాలమైన వక్ష స్థలమది.

శ్రీవత్సమ్మను పుట్టు మచ్చతో
కలిమికి నిలయము వక్షస్థలము
నాభికమలమున - నాల్గు ముఖముల
బాలుడు-శృతులను పలుకుచుండెను.

శేష శయ్యపై నిద్రలొనుండి
కాలు - కదపగా అందెల సవ్వడి
వేదశృతులకు - పద క్రమములను
వివరించునటు - తోచుచున్నది.

సనక సనందన -యోగిపుంగవులు
ఏకాదశ -రుద్రాది దేవతలు
పరమ యోగులు - పరంధాముని
కీర్తన జేయుచు - భక్తిగ నిలచిరి.

సత్త్వ శక్తియు - కీర్తికాంతయు
తేజో మూర్తీ - భూదేవియును
ఆత్మవిద్యయు - అవిద్య - ప్రకృతి
మాయ - మొదలగు శక్తులన్నియు

తేజోరూపము గలిగిన శక్తులు
సపర్యలుచేయుచు నుండి రచ్చట
దివ్యదర్శనము అక్రూరునికి
పులకరింతను కలుగ జేసెను.

శుభలక్షణముల సుందర రూపము
కౌస్తుభహారము - సుమహారములు
శంఖ, చక్ర, గద పద్మమ్ములతో
పద్మనయనముల విరాజిల్లుచు.

నున్నని నునుపు - నిగారింపుతో
అద్దమువలెను - తళతళలాడగ
చెక్కిళ్ళువ్వి మెరయు చుండగా
మంగళమూర్తి దర్శన మిడెను.

షోడశకళలతొ వెలిగే చంద్రుని
వెక్కిరించెడి సుందర వదనము
దొండ పండు వలె నున్నవి పెదవులు
నువ్వుపువ్వులా నున్నది నాసిక.

సరిపడు సోయగ మొలికే చెవులు
శంఖము వంటి కంఠము గలిగి
భువనమ్ములను పరిపాలించే
ఠీవితొ నాతడు విరాజిల్లెను.

భుజకీర్తులు-మరి-బంగరు మురుగులు
మకర కుండలము అమరి యుండగా
రత్న మకుటము మెరయు చుండగా
పసిడి గజ్జెలు - మురిసి - మ్రోగెను.

తేజోమూర్తిని - నారాయణుని
ప్రహ్లాద నారద - నంద - సునందులు
భక్తిమీరగా నుతించుటది - గని
పరవశించెను - అక్రూరుండు

మాటలు మరచిన పుణ్య ఘడియది
పులకరింతతో - ఉనికి మరచెను
కన్నుల నిండిన మంగళమూర్తిని
మధురముగా కీర్తించె నిట్టుల.

"సుందరమూర్తీ - ఓ సుకుమారా!
అక్షరమూర్తీ - జగన్నాయకా -
ఓనారాయణ - ఆది పురుష - నువు
విరాడ్రూపుడవు - విశ్వకర్తవు.

మందస్మిత వదనార విందమును
గాంచితి నేను - తాపము శమించె
అజ్ఞానతిమిరమును అంతముజేసి
జ్ఞాన జ్యోతి వెలిగించు వదనమది.

భద్రమూర్తివి - అవ్యయ మూర్తివి
పూర్ణ పురుషుడవు - అనంత శక్తితో
అఖిలాండమును పరిపాలించే
అనఘుడవయ్యా - ఆత్మారామా!

సుఖదుఃఖములకు అతీతుడవయి
స్వయంప్రకాశము కలిగిన మూర్తివి
బ్రహ్మపథములో - చిద్రూపముతో
అహర్నిశము భాసించు - దేవుడవు.

జీవకోటికి - చైతన్యము - నువు
ఇంద్రియములకు - జీవశక్తివి
నిశ్చలధ్యానము - నిర్మలత్వము
నిలకడనేర్పే మనస్సు నిడెదవు.

అణువునుండి-అట-మేరువు వరకు
చలన శక్తిగా నెలకొను మాయవు
చూపూ, పలుకూ - శ్రవణ శక్తియు
అన్నీ నీవే - అనంతమూర్తీ!

సూర్యచంద్రులకు-వెలుగు-వెన్నెలలు
చరాచరములకు - ఉనికిని జూపి
కాలగమనమును నిర్ణయించుచు
స్థిరముగ నడిపే - కాలపురుషుడవు.

వేదాధ్యయనము - బ్రహ్మచారులకు
అగ్ని కార్యము - గృహస్థులకును
యోగశక్తి - మరి - యతులందరికీ
గమ్యముగా నువు - చూపించెదవు.

పూలతొ - పూజలు చేతురు - కొందరు
కావ్యగానమున - కీర్తన జేతురు
మనస్సు నర్పణ జేతురు - మునులు
అన్నిత్రోవలూ - నిన్ను జేర్చుకద -

శివకేశవులు - వేరు కాదయా
నదులు - కడలిలో జేరినట్లుగా
ఏరూపమున - ఆరాధించిన
వారిని - తరింప జేతువు నీవు.

అగ్నిహోత్రము - నీముఖబింబము
కంటి చూపు-అది-భాస్కర దేవుడు
పదములు-భూమి-నాభియె-నింగి
నీ - మోకాళ్ళు - దిక్కులగునయా!

నీ - కర్ణములు - వేదములగును
నీలినింగి - నీ శిరస్సు అగును
ఇంద్రుడు-నీదగు-భుజములు స్వామీ!
సముద్ర జలములు - నీ ఉదరమయా!

ప్రాణవాయువు అనిలుడు అగును
చెట్ల ఓషధులు - నీరోమములు
శిరోజాలు - మరి - మేఘములగును
కొండలు - నీదగు-ఎముకలు - గోళ్ళు.

కన్నులార్పుటలు - రాత్రిం బవళులు
వర్షము - నీదగు తేజము స్వామీ!
నీవు కాని - దసలేదీ లేదు
అవతారమ్ములు - నీ లీలలయా!

సోమకు జంపి - శృతులను గాచిన
మత్స్యావతారుడ - వీవే స్వామీ
మధుకైటభులను - అంతము జేసిన
శ్రీహరి నీకివె - వందనమ్ములు.

మందరగిరిని - వీపున మోసిన
ఆదికూర్మము - నీ అవతారము
హిరణ్యాక్షుని - అంతము జేసి
భూమిని - నీవు ఉద్ధరించితివి.

భక్తుని కొరకై - స్తంభమునందు
వెలసిన - భక్త బాంధవుడవు
కనక కశ్యపుని - కరకు గోళ్ళతో
జీల్చిన నరహరి - నమస్సులయ్యా!

మూడడుగులతో బలిని త్రొక్కితివి
ఇంద్రుని రాజ్యము నిలబెట్టితివి
దురహంకారుల శిరములు నరకిన
పరశురాముడవు - వందనమయ్యా!

అబలహర్తను - దశకంధరుని
అంతము జేయుగ - భువికే దిగితివి
కౌసల్యమ్మకు - నోముల పంటగ
అవతరించిన - రామభద్రుడవు.

దుష్టుల భారము భరించలేక
శరణు వేడిన భూదేవతకు
అభయమునిచ్చి - కదలి వచ్చిన
వాసుదేవ - నీ పదముల బడితిని.

నీకనుసన్నతొ - మాయ నడచును
మాయకులొంగి - నేనూ - నాదను
మూర్ఖత్వములో బడితిని స్వామీ!
స్వప్నము వంటిది - ఈ జీవితము.

సంసార సంద్రమును దాటగలేక
గమ్యము తెలియక కొట్టుకు పోయే
అజ్ఞానిని - నను - నీ భక్తునిగా
స్వీకరించి - మరి అనుగ్రహింతువ?

నీటిని వదలి - ఎండమావిని
అందుకొనుటకు - సాగెడి రీతిగ
నిన్ను - నేను - గుర్తించగలేక
భ్రాంతిలొ పడిన - చపల చిత్తుడను.

సర్వేశా - ఓ సర్వ నియంతా!
విశ్వస్వరూపా - పదముల బడితిని
నా అజ్ఞానము - మన్నించుమయా
నీదరి జేర్చి - ఉద్ధరించుము"

అనుచు - పొంగిన - గుండియతోనట
యమునా జలముల - అక్రూరుండు
స్తోత్రము జేయగ - మహావిష్ణువు
అంతర్ధానము అయ్యెను లీలగ.

అడుగులు - భూమిని వదలినట్టుగా
ఆనందము తో - గాలిలొ తేలుచు
అక్రూరుడు - తా - రథమును జేరెను
అచ్చట గాంచెను రామకృష్ణులను

చిరునగవుతొ - అట - కృష్ణుడడిగెను
"స్నానార్థమయి-యింత సమయమా!
నీటిలొ, నింగిలొ, భూమిపైనను
ఏమయినామరి - వింతలు గంటివ"?

అంతట పలికెను అక్రూరుండు
"స్వామీ - వింతలు నీలో గలవు
నింగీ, నేలా - నీటిలొ వుండవు
నీలో నుండక పోవుట వింత"

అనుచుపలుకుచు రథమును తోలెను
మథురకు దగ్గర నున్న వనమున
నందాదులు మరి వచ్చి జేరిన
స్థలమునందు-ఆ-రథము ఆగెను

ముందుగ - నీవు - రథముతోలుకొని
మథురకు బొమ్మని కృష్ణుడనగను
ముడిచిన కరముల నక్రూరుండు
ముకుందునితో పలికె భక్తిగా.

"స్వామీ - నీవు - నా గృహమందు
పదములుంచి-నను-ధన్యుని జేయుము
నీ పదధూళితొ - పవిత్రమగును
పుణ్య తీర్థమై - నిలబడు గృహము"

అంతట కృష్ణుడు - పలికె తీయగా
"ముందుగ - కంసుని మట్టు బెట్టి వలె
ఆ పై వత్తును - నీ గృహమునకు
కావున - మామకు - రాక తెలుపుము"

మరు మాటాడక - అక్రూరుండు
రామకృష్ణుల రాకను - రాజుకు
తెలియబరచి - తా - గృహమున కేగెను
కంసుని మది - కల్లోల సంద్రమయె.

*** ॥శ్రీ కృష్ణచరితము॥

## 51 శ్రీ కృష్ణుడు మథురలో ప్రవేశించుట

మరుసటి రోజు మధ్యాహ్నమునకు
మంద స్మిత- వదనార విందముతొ
మథురా నగరిలొ - నందనందనుడు
మంగళకరముగ - నడుగు బెట్టెను

లక్ష్మికి నిలయము - అన్నటులున్న
మంగళ శోభతొ - కళ కళ లాడే
మథురానగరపు - అందములన్నీ
నందనందనుని - గన - వచ్చినవి

నిండు అగడ్తలు - కోట బురుజులు
నింగి కెగసినటు - నిలబడు మేడలు
విలాసమ్ముగా - ఎగురు పతాకలు
సొగసులు చూడగ-సురలను పిలచును

బంగరు తోరణ శోభలు వెలుగ
తిన్నని వీధులు - నేత్ర పర్వముగ -
ఎన్నిక మేడల - నిలచియుండెను
కలిమికి నిలయము - మథురానగరము

ధనపతి రథమును-మించిపోయి-మరి
వెలుగుచున్నవట - రథములన్నియు
ఐరావతమును - చిన్న బుచ్చెడి
ఏనుగులున్నవి - ఎన్నో అచట

వాయుదేవునే జయించ గలిగిన
వడిగల గుఱ్ఱములున్నవి - అచట
ప్రమథ గణంబుల - ధిక్కరించగల
భటులు గలరు - అట రక్షణ గాను.

గిరులను బోలిన - ధాన్యపు గాదులు
మంగళ కరమగు - వాద్యఘోషలు
లక్ష్మీదేవి - స్థిరనివాసముగ
వెలసి యున్నటు - తోచుచున్నని

అంతటి లక్ష్మి - పొంగిన గుండెతొ
అందమయిన - యదునందను చూడగ
సింగారముతో ముందుకు వచ్చెనొ -
అన్నటుతోచెను - మధురానగరము.

నగర శోభను కన్నుల గాంచుచు
మత్తగజములా నడుగులు వేయుచు
ముందుకు సాగెడి ముకుందు నందము
పౌరకాంతలు - చూడగ నిలచిరి.

గోపీ జనము - హృదయమునందు
ప్రతిష్ఠించిన - పుణ్య - పురుషుడు!
కృపాసముద్రుడు - వచ్చుచుండెను
చూతము రండని - బయలుదేరిరి.

అక్కా రావే - త్వరగా రావే!
చెల్లీ నీవు - త్వర పడ వేమి
అనుచు - కాంతలు మేడల పైన
నిలబడి యుండిరి - దర్శనార్థమై

చేసెడి పనులు వదలి వేసిరి
తినెడి భోజనము మరచిపోయిరి
కట్టు బొట్టులు - సరిచూడకనే
మేడలనెక్కిరి - కృష్ణుని చూడగ

గుండెల - కొలువై - కృష్ణుడుండెను
కన్నుల నిండుగ - దర్శించగను
పనులన్నియును - గాలికి వదలి
పరుగులెత్తిరి - కృష్ణుని చూడగ

మేడలపైన నిలచి యుండిరి
దోసిలి నిండా పూవులుండెను
కృష్ణలీలలు - చెప్పుకొనుచును
పరవశమ్మున నిలచియుండిరి.

పూతన నంతము - చేసిన ఘనుడు
కాళీయుని - మదమడ గించెనట
మురళీ గానము వినిన - మ్రోడులే
పులకరించి-మరి-పూత పూయునట.

గోపిక లెంతటి పుణ్యము జేసిరొ
నిత్యము - దర్శన భాగ్యము కలుగగ
కన్నులు రెండూ వున్నందులకు
మంగళ మూర్తిని - చూచిన - ధన్యత.

నందనందనుని కీర్తించినచో
నాలుక వునికి - సార్థకమగును
అనుచు-పుష్పములు-ముదముగ జల్లుచు
పుష్పవృష్టి - కురిపించసాగిరి.

భూసురోత్తములు - వేద పనసలతో
ఆశీర్వచనము పలుకు చుండగా
మెల్ల మెల్లగా - నడచుచు కృష్ణుడు
నగర ద్వారము సమీపించెను.

అంతటిలోన - వారికెదురుగా
రజకుడు - బట్టల మూటతొ నగబడె
కృష్ణుడు - వానిని రమ్మని పిలచి
మంచి దుస్తులను - వారికిమ్మనె.

"రాజదర్శనము చేయగవలెను
మంచి దుస్తులతొ మెరిసిపోవలె
మేనల్లుళ్ళము - అందువల్లను
మమ్మందరు-అట-చూతురుగాదా".

ఆ మాటలకు హేళన చేసి
చాకలి అనెను - రామకృష్ణులతొ
"మేనల్లుళ్ళా - నమ్మశక్యమా!
పల్లెలొ నుండే - అనాగరికులు.

రాజు ధరించే - దుస్తుల నడిగే
ధైర్యము - ఎటుల వచ్చెను మీకు
నెయ్యి, పెరుగులు త్రాగి - కొవ్వుతో
నోటి కొచ్చినటు పలుకక-తొలగుడు".

వెంటనె కృష్ణుడు-చేయి-విసరెను
చాకలి తల - అది ఎగిరిపడినది
వెంట నుండిన రజకులందరు
పరుగు తీసిరి - తిరిగి చూడక.

బాల కృష్ణుడు - మూటను విప్పి
మంచి దుస్తులను ఎంచి ధరించెను
అన్నకు యిచ్చెను - చక్కని బట్టలు
మిగిలిన వన్నీ - పంచిపెట్టెను.

అంతటిలోన వారికెదురుగా
బట్టలు నేసే - వ్యక్తి వచ్చెను
రామకృష్ణులను గాంచిన అతడు
ఎన్నికైన - వస్త్రమ్ముల నిచ్చెను.

ఆ బట్టలుగొని - ఆశీస్సులనిడి
కొంతముందుకు సాగగ నంత
సుదాము డనెడి - పూలవర్తకుడు
రామకృష్ణులకు ఎదురు వచ్చెను.

మంగళమూర్తుల - చూచి పొంగెను
పాదములంటి నమస్కరించెను
పూలూ-గంధము-తాంబూలములు
భక్తి ప్రపత్తుల నర్పణజేసెను.

గృహముకు రమ్మని ఆహ్వానించెను
అతిథి పూజలు శ్రద్ధగ జేసెను
ఆనందించిన రామకృష్ణులు
మదిలో కోరిక నడుగగ నంత.

పొంగిన గుండెతొ సుదాముడపుడు
"మీ పదసేవ దొరికిన - నాకు
మీ పద దాసుల స్నేహమునొసగుడు"
అనుచు-ముడిచిన కరముల-నిలచెను.

రామకృష్ణులు సంతస మందిరి
ఆయుర్భాగ్యము-యశము-సంపద
అనుగ్రహించి - ఆశీస్సులనిడి
ముందుకు సాగిరి - రాజవీధిలో.

వంకర టింకర నడుము గలిగిన
స్త్రీ - అట - వారికి ఎదురు వచ్చినది
కుబ్జ - అందురు - వక్రరూపిని
గంధము నేర్పుగ - తీయగలిగినది.

నిత్యము-గంధము-గిన్నెలనిండా
రాజమహలులో సమర్పించును
ఆమెను చూచి - తా కునట్టుగా
నడచిన - కృష్ణుని - నిలవేసినది.

కన్నులు తెరచి నడువగవలెను
అనగా కృష్ణుడు - నవ్వుచు పలికెను
"గంధము ఎచటికి గొని పోచుంటివి?
మాకు యిచ్చిన పూసుకొందుము.

నీముఖమెంతో అందమైనది
అందుకు తగినటు నిన్ను మార్తును
వంకర రూపము - సరిజేసెదను"
అనగా - కుబ్జ - కోపగించెను.

"కొంటె కొక్కిరిగ - అగపడుచుంటివి
నావంకర - నన్ననుభవించనీ
అందరు వుందుర - అందగాళ్ళయి
అడిగితివీవు - గంధము గొనుము.

మంచి వారుగా అగబడుచుండిరి
కొంటెతనములో - జాలియున్నది
కంసరాజు కిడు - గంధములివ్వి
ఆనందముగా పూసుకొనుడనె."

అంతట కృష్ణుడు గంధము తీసుకు
పూసుకొనెను - తన శరీరమంతయు
కుబ్జను - రూపసి చేయగతలచి
నడుమును బట్టి - ఎత్తి - దింపెను.

అతిసుకుమారిగ - అందగత్తెగా
మెరసి పోయెడి సుందరిగాను
కుబ్జ నిలచెను - అందరి ముందు
చూచెడి వారి - కన్నులు మెరసెను.

మన్మథ శరమన - కుబ్జ నిలచెను
నమస్కరించి భక్తిగ పలికెను
"స్వామీ! నీవు - నాగృహమందు
అడుగిడి పూజలు - అందుకోవలె.

దిక్కుల వంకర - దీయగ జాలిన
దిక్కువు నీవు - దయామయుడవు
దిక్కులేని - నా బ్రతుకున - దయతో
దివ్య సుగంధము పూసిన దొరవు".

ఆమాటలకు కృష్ణుడు పలికెను
"సుందరీ - నీదు కోర్కె తీర్తును
ముందు - మా పని పూర్తి జేసుకొని
ఆపై వత్తును"-అని అభయము నిడె.

నూరుకన్నులతో - ఎదురు చూతును
అనుగ్రహించుము - స్వామీ! అనుచు
ముడిచిన కరముల - కుబ్జ నిలచెను
ఆనందముతో పొంగి పోయెను.



॥శ్రీ కృష్ణచరితము॥

# 52 ధనుర్భంగము

అంగడి వీధిలొ రాచరీవితో
కృష్ణుడు నడచుచు -కనబడినంత
ఆనందముతో ఎందరెందరో
ఎన్నోకాన్కలు యిచ్చుచుండిరి.

కాన్కలు గొనుచు - చిరునగవులతో
రామకృష్ణులు - ఎదురుగ కనబడు
ధనుశ్శాలలో ప్రవేశించిరి
అచ్చట గలదు - దివ్య ధనుస్సు.

ఇంద్రధనుసులా మెరయుచున్నది
పొడవూ-బరువూ-భయము గొలుపును
మెల్లగ - కృష్ణుడు-ధనుసును జేరెను
అచ్చటివారు - వలదని పలికిరి.

ధనుస్సు జోలికి పోవలదయ్యా -
అనుచు పలుకుచు - నుండిరి వారు
వారిమాటలను లెక్కజేయక
చాపము వద్దకు నేరుగ సాగెను.

అవలీలగను - అతి హేలగను
లీలామానుష విగ్రహుడపుడు
కేలనెత్తెను - దివ్యధనుస్సును
తెల్లబోయిరి - చూచినవారు.

వింటిని ఎత్తి - బలముగ - బట్టి
అల్లెత్రాటిని - బిగించబోగా
ఫెళ్ళున విరిగెను - నడిమికి విల్లు
విల్లా - గుల్లా - అనిపించినది.

విల్లు విరిగిన - ధ్వనితో నచ్చట
నింగి విరిగెనా - అనిపించినది
ధనుశ్శాలయది - తిరిగినట్టయె
కృష్ణుని పొగడిరి - స్తోత్రముజేసిరి.

భీకరధ్వనికి - కంసుడు వణకెను
పాతాళములో కూలినట్టయె
ముందుకు వచ్చిన భటులందరినీ
రామకృష్ణులు - నేలకు రాల్చిరి.

ధనుర్యాగమని - పిలుపునందుకొని
నందనందనుడు - వచ్చెనచ్చటికి
వచ్చిన పనిలో - సగము జరిగెనని
ఆనందించిరి రామకృష్ణులు.

బసకు జేరిరి - అన్నదమ్ములు
పెద్దల దీవన లందిరివారు
వారికి తిరిగి - నమస్సులుంచిరి -
సాయంసంధ్య - అలముకొన్నది.

నింగి లక్ష్మి–తా–సూర్యుని కాంతిని
వయసు మళ్ళినది – నీకు – అన్నటు
వెక్కిరించుట – అనునట్టుగను
సూర్యకాంతి–అది–వెలవెలబోయెను.

షోడశకళలకు – నిలయమైనను
శంభుని శిరమున – నెలవైయున్నను
పరాయి పురుషుడు–చందమామయని
పద్మసుందరి – ముడుచుకు పోయెను.

సాయం సంధ్యా సమయములోన
సంధ్యావందన ప్రక్రియలోన
వదలిన జలము – వజ్రధారయై
మందేహులనే–అసురుల తృంచును.

ఆ మందేహులు – అంతము కాగా
వారి రక్తము పారుచున్నటు
ఆకాశములో – పశ్చిమ దిక్కు
రక్తవర్ణమై – మెరయుచున్నది.

నేల నిండిన కృష్ణుని – కీర్తి
కీర్తిసంద్రమై – శోభలీనగా
ఆ సంద్రమున – నింగికెగిరెడి
నీటి తుంపరలు – తారలైనవి.

దశ దిశలందు – నిండిపోయిన
కృష్ణుని గుణముల – దివ్య గంధమును
ఆఘ్రాణించగ – చల్లిన కస్తురి
అన్నటు – బ్రహ్మ – చీకటి పరచెను.

రాజైనా మరి – మనకు శత్రువు
చంద్రుడు – అడుగో – వచ్చుచుండెను
మా పిల్లలను – రక్షించండని
నిశాకాంత – తా – అభ్యర్థించగ.

సమ్మతించిన – తామర – పూవులు
నల్లనైన – ఆ – తుమ్మెదలగొని
కడుపులోన – మరి – దాచుకున్నటు
ముడుచుకుపోయెను సవ్వడిచేయక.

అంతటిలోన – చంద్రోదయమయె
కామోద్దీప్తిని – కలిగించ గల
శక్తిమంతుడు – చందమామయని
విరహులు–భయముతొ నిండిపోయిరి.

"సమయము" – అనెడి వీర పుంగవుడు
విసరిన ఖడ్గము – అన్నటు మెరసే
చందమామను – నింగిన గాంచి –
చీకటి యనెడి – మృగము – పరుగిడె.

కలువలు – కిలకిల నవ్వుకొనుచును
చందమామను పలుకరించినవి
తనయుని గాంచి – సంబరపడుచు
కౌగిలింతకై – సంద్రము పొంగెను.

చకోర పక్షుల – సందడి పెరిగెను
చంద్రుని వెన్నెల నిండిన ప్రకృతి
బ్రహ్మాండమొక – కర్పూర పేటికగ
తోచుచున్నదా చల్లని వేళ.

ఆ సమయములో రామకృష్ణులు
క్షీరాన్నమును ఆరగించిరి
అప్రమత్తులై వుండగ జెప్పిరి
శత్రు - నగరమని - హెచ్చరించిరి.

కంసుని హృదిలో - వడగాడుపులు
పడకమీద - మరి - నిలకడ లేదు
మథురకు వచ్చిన చిన్ని కృష్ణుడు
బెదురు గొల్పెను-భయము పెరిగెను.

సేవకులను-ఆ-కృష్ణుడు జంపెన!
దివ్యధనుస్సును నడిమికి విరచెన -
పిల్లడా మరి - పిడుగా వాడు!
కాలుడు అగునా - నసుకడతేర్చున!

గట్టున పడ్డ - చేప తీరుగా
గిలగిలలాడెను - మనో ధైర్యము -
కన్నుమూసినచొ - నిద్రేరాదు
భయంకరమ్మగు దృశ్యములగుపడు.

నీటిలొ చూడగ - తన - తల లేదు
మొండెమొక్కటే - కనుపించినది
చెమటలు పట్టెను-కనులు-తెరచెను
శ్వాస ఆడెడి - సవ్వడి లేదు.

చంద్రమండలమ్ము-రెండుగ-కనబడె
తన ఛాయయది - చిల్లులు పడినది
బంగరు పూలతొ - చెట్లు కనబడె
అడుగుల సవ్వడి - వినబడకుండెను.

మృత్యుదేవత - వచ్చుచున్నటు
తోచెడి శకునములవి - అనిపించెను
కలత నిద్రలో - భయపడి లేచెను
విషము తిన్నటు - కల - వచ్చినది.

విగతజీవుడు - కౌగలించినటు
దిగంబరుడై - నిలబడి నటుల
నూనె త్రావినటు - ఖరము నెక్కినటు
భయంకరమ్మగు - కలలు వచ్చెను.

బ్రతుకు ప్రయాణము - ఆఖరయినటు
కాలుడు వచ్చి - ముందు నిలచినటు
మదిలో తోచెను - భయము పెరిగెను
పిచ్చివానిలా తిరిగెను - గదిలో.

సూర్యుని - గుర్రపు - డెక్కల దెబ్బకు
చీకటి జంతువు - తల చిదికి - మరి
రక్తము చిమ్మెను - అన్నటు - తూర్పున
అరుణబింబము - అగుపించినది.

సూర్యబింబము శోభగనున్నది
పగడపు బంతిగ - తోచుచున్నది
కాలగమనము - కొలచుట కదియే
కొలపాత్రగను - అగపడుచున్నది.

ఆయుర్దాయము అను సంపదను
కొలచుట కొరకై - విశ్వనాథుడు
ఏర్పరచిన - ఒక - బంగరు కుంచము
అన్నటు - తూర్పున-బింబము అగబడె.

పశ్చిమ దిశయను - సుందరవదనకు
అద్దము అయ్యెను సూర్య బింబము
చక్రవాకముల - తాపము తీర్చగ
దివ్యౌషధము - అన్నటు తోచెను.

చల్లని గాలులు - వీయసాగెను
చీకటి - పరుగిడి గుహలలో-దాగెను
తుమ్మెద రవములు వినబడుచుండెను
లేత ఎరుపుతో మెరసెను పుడమి.

మల్లయుద్ధము జరిపించుటకు
రంగము - సిద్ధము చేయగ జెప్పిన -
కంసుని ఆనతి - పాలించినటు
వార్తను జెప్పి - నిలచిరి భటులు.

మది వ్యాకులము - మరువకున్నను
తప్పనిసరియై - కంసుడు సాగెను
మల్లరంగమును - పరిశీలించెను
ఎంతో శ్రద్ధగ - తీర్చి దిద్దిరి.

స్వర్ణ కాంతులు చిమ్ముచున్నటు
మెరిసే మట్టితొ - తీర్చిదిద్దిరి
కస్తురి నీటతొ - తడిపి - మధ్యలో
చందన స్తంభములమర్చినారు.

పతాకాలతో పూలమాలలతొ
మంగళకరముగ - నలంకరించిరి
ప్రేక్షకులందరు ఆతృత నిండి
సుఖాసీనులై కూర్చొనిరచట.

శ్రావ్యముగా - సంగీతము సాగెను
రక్షణగా నట సైనికులుండిరి
కపటమెరుగని - మహాపురుషుని
మదియనునటుల - మంటపమున్నది.

మంత్రి, సామంతులు అలంకరించిన
మంటపమ్మునకు - రాజ ఠీవితో
వందిమాగధుల - స్తోత్ర పాఠముల
కంసుడు వచ్చి - ఆసీనుడయె.

కంసుని కెంతో - ప్రీతిపాత్రులగు
చాణూర, ముష్టికులు-కూటుడు-మొదలగు
మల్ల యోధులు - వచ్చిరి వెంబడి
సందడి ఎంతో పెరిగిపోయినది.

నందుడు మొదలగు ఆహూతులట
తెచ్చిన కాన్కలు సమర్పించుకు
ఏర్పరచిన ఆ స్థలములందున
ఆశీనులయి చూచుచుండిరి.

ఆ సమయములో రామకృష్ణులు
అలంకరించుకు - ఆనందముగా
వచ్చుచుండగా - ద్వారము వద్ద
విఘ్నమొక్కటి - వచ్చి పడినది.

కువలయాపీడము - అనునొక ఏనుగు
వారిపైనను - విరుచుకుపడినది
మాపటివాడు - తెలిసి - అట్టుల
ఉసిగొలిపెను - ఆ మహాగజమును.



# 53 కృష్ణుడు - కువలయాపీడము నంతము చేయుట

అంతట - కృష్ణుడు - పలికె మావటితొ
"ఓరీ! నీవిటు గజమును తోలుట
క్షమించరాని - నేరము అగును
వచ్చెడి మనుషులు కనబడకుండిర

మళ్ళించుమురా-గజమును" అనుచు
కృష్ణుడు పలుకగ - లెక్కజేయక
కంసుని ఆనతి - పరిపాలనలో
తిరిగి గజమును పైకితోలెను.

మీదకు వచ్చెడి గజమును గాంచెను
పట్టు వస్త్రము బిగించి కట్టెను
కరకంకణములు సర్దుకునంత
ఎదురునిలచెను కృష్ణుడప్పుడు

చూచెడివారు సంబరపడిరి
విస్తుబోయిరా - ధైర్యముగాంచి
అంతట-కృష్ణుడు-చెవిలో పొడవగ
రోషము హెచ్చెను - ఆ గజమునకు.

నేలను - కాళ్ళతొ బలముగ తన్ని
ఘీంకరించెను - కువలయాపీడము
ఆ అరపునకు - యముని మహిషము
అచేతనమ్మయి - కూలినట్లయె.

సాగరమ్ములు - ఘోషించినవి
కులపర్వతములు కదలినట్లయె
మృత్యుదేవత - గజరూపమున
నేలకు దిగెనా - అనిపించినది.

ఒక్క ఉదుటున కువలయాపీడము
తొండము చాచి - కృష్ణునందుకొనె
రెప్పపాటులో - తప్పించుకొని
దానికి దొరకక - తిప్పలు పెట్టెను.

గిర్రున తిరుగుచు - కృష్ణునందుకొన
ప్రయత్నించెడి - గజమును - నేర్పుగ
తోకనందుకొని గిరగిర త్రిప్పి
విసరెను-కృష్ణుడు-లాఘవమ్ముగా.

గరుత్మంతుడు పామునందుకొని
విసరినట్టుగా - విసరివేయగా
అల్లంతదూరము కువలయాపీడము
గాలిపటములా ఎగిరిపడినది.

రోషము పెరిగి - గజరాజంతట
తొండము చాచి ముందుకు వచ్చెను
ఒడుపుగ - కుంభస్థలముతొ - కృష్ణుని
కుమ్మివేసెడి - యత్నము చేసెను.

నేర్పుగ - కృష్ణుడు - గజముకందక
కుంభస్థలమును - పగులగొట్టెను
రక్తధారలు నేలను జారగ
ముత్యములవ్వి రాలిపడినవి.

నేలను బడిన రక్తము ఎరుపు
తెల్లని ముత్యములందు మెరయగ
సంధ్యారాగము నిండిన - నింగిని
తారలు - మెరసిన - చందము తోచెను.

నేలను బడిన - గజము లేచినది
తిరిగి - కృష్ణుని పైకివచ్చెను
దానికందక - నందనందనుడు
ఒక్కటి చరచెను కుంభస్థలమున.

ఆ దెబ్బకు అది నేలకూలినది
అయినా దాని రోషము తగ్గక
అంతకు మించిన ఆవేశముతో
అంతము కోరి ముందుకొచ్చినది.

అదను చూచుకొని కృష్ణుడంతట
బలముగ తన్నెను - శిరస్సుపైన
నేలనుబడిన దంతి దంతములు
పెరకివేసి - మర్దించెను గజమును

పర్వతమంతటి - కువలయాపీడము
కిమ్మనకుండా చచ్చెను - అంతట
ఆ దంతములతొ మావటివానిని
గజ సహాయముగ-యమపురికంపెను.

విలాసముగా - ఏన్గు దంతములు
చేతనూపుచు - రామకృష్ణులు
మల్లయుద్ధము జరిగెడి తావుకు
చిరు నగవులతో వచ్చి చేరిరి.

ఆ దృశ్యముగని అచ్చటివారు
ఆశ్చర్యములో మునిగిబోయిరి
అంతటి గజమును - అవలీలగను
అంతము చేయగ - ఆహా - యనిరి.

ఆడంబరముగ - సందడి నిండి
క్రిక్కిరిసిన ఆ మల్ల రంగము
కృష్ణాగమనము అయినంతటనే
మరింత తేజము పులుముకున్నది.

కృష్ణుని రూపము - మల్లవీరులకు
రౌద్రానకమై - భయము గొల్పెను
జన సమూహముకు - నందనందనుడు
రాజుగ - ఠీవిగ తోచుచుండెను.

కంసుడు గడగడ వణకెను -మదిలో
మృత్యుదేవతను చూచినట్లయె
అతని అనుచరులు - నేలను నిలబడ
చేసెడి యత్నము వ్యర్థమయ్యెను.

యోగులందరికి - శాంతమూర్తిగా
ధూర్తులందరికి -యమరాజుగను
తల్లిదండ్రులకు - ముద్దుబిడ్డగా
కనిపించెను - అట కృష్ణుడప్పుడు.

బలరామునితో కలసి - కృష్ణుడు
రంగ స్థలమున - మధ్య నిలచెను
గున్న ఏనుగన - అడుగులు వేయుచు
వచ్చిన - కృష్ణుని గాంచిరందరు.

చచ్చిన కువలయాపీడము - కంసుని
కంటికగబడె - ఏడ్చెను - విలవిల
చెమటలు పట్టెను - ఆ మహరాజుకు
భయముతొ పెదవులు వణకసాగెను

ప్రేక్షకులందరు - సుందరమూర్తిని
తనివితీరగా చూచుచుండిరి
వారిలొ వారు - గుసగుసలాడుచు
కృష్ణుని ఘనత - చెప్పుచుండిరి.

సామాన్యమగు బాలురు కారు
సాధురక్షణకు - దిగిరీ యిద్దరు
వసుదేవునికి పుత్రులు వారు
దేవతలే-మరి-నమస్కరించుడు.

వైష్ణవ తేజము ఉట్టిపడుచును
కళకళలాడుచు కనబడుచుండిరి
నల్లనివాడు - కృష్ణుడు అగునట
ప్రక్కనున్నది - బలరాముడట.

పద్మనేత్రముల -నెమిలి పింఛముతొ
పీతాంబరము - వనమాలతొ - మరి
భూ చక్రమును - పరిపాలించగ
నేలకు దిగిన - చక్రధారియట.

పూతన నంతము చేసిన ఘనుడు
శకటాసురునీ - వత్సాసురునీ
మట్టుబెట్టిన - మహానుభావుడు
గొల్లపిల్లలకు - ప్రాణసమానుడు.

మద్ది చెట్లకు - శాపము తీర్చిన
మంగళమూర్తిని - దర్శించండి.
అనుచు - అందరు చూచుచుండగా
చాణూరుడు అట కృష్ణుని గాంచెను.



॥శ్రీ కృష్ణచరితము॥

## 54 చాణూర - ముష్టికుల వధ

కృష్ణుని గాంచి పరిహాసముగా
చాణూరుడను - మల్లుడు పలికెను
"అడవులలోన గోవుల మేపుచు
మల్ల యుద్ధము నేర్చినారట.

మీ నైపుణ్యము చూడగ నెంచి
మా మహరాజు మిము రప్పించెను
ప్రభువుల మెప్పు కావలసినది
ప్రజలు మెచ్చుకొను విద్యయె - విద్య.

"నవ్వుచు పలికెను - కృష్ణుడంతట
పసివారము - మా విద్య - ఎంతటిది
కాకలు తీరిన - యోధులు మీరు
కండలు తిరిగిన-మీతో-చాలము."

అయినా - మమ్ముల - నాహ్వానించిరి
మీ ముచ్చట - మరి - కాదనలేము"
అనగా నంతట - మల్లుడు పలికెను
మీరసాధ్యులని తెలియుచున్నది.

పసివారైనచొ - పసగలిగిన - మా
కువలయాపీడము నంతము జేతుర!
వేయి ఏనుగుల - మర్దించగల
గజము చచ్చెను - మీచేతులలో.

నీకూ - నాకూ సరిజోడీ - మరి
ఇడుగో - వీనిని - ముష్టికుడందురు
మల్ల యుద్ధమున - రుద్రునయినను
వాయువు నయినను కదలనీయడు.

వీనికి జోడీ – మీ అన్నయగు
సిద్ధముగా మరి ఉన్నారా – యన
ముందుకు వచ్చెను బలభద్రుండు
భూమిని – బలముగ తన్ని నిలచెను.

మల్ల యుద్ధమున – చాణూరునకు
వల్లమాలిన సంతోషమ్ము –
కరితొండముతో సరిపడు భుజములు
చరచెను–అరచెను–మీసము దువ్వెను.

మల్లుడు వేసే బలమగు అడుగుకు
భూమి క్రుంగునా – అనిపించినది
కృష్ణుడు లీలగ వానిని చూచెను
అట్టహాసముకు – చిరునవ్వొలికెను.

చాణూర ముష్టికులు అసమాన్యులని
రాజ్యమంతయు తెలిసిన విషయము
వారిద్దరునూ – కంసుని భుజములు –
కంసకీర్తికి – పతాకమ్ములు

ఈ బాలునితో – మల్లయుద్ధమా!
అని – మదినెంచి ముందుకు వచ్చి
ఒక్క పట్టులో – కృష్ణుని పైబడి
కదలకుండగా ఒడిసి పట్టెను.

మెరపు మెరసినటు – లాఘవమ్ముగా
ఒడుపు తెలిసిన కృష్ణుడంతట
పట్టు వదల్చుకు – వాని పాదములు
గ్రహించి – ఎత్తి – నేలకు విసరెను.

మేలుమేలు అని – మల్లుండంతట
ప్రస్తుతించెను – కృష్ణుని శక్తిని
తిరిగి – వేగముగ వాయువు తీరుగ
కృష్ణుని తాకెను – క్రోధము నిండి.

కాళ్ళ సందున – కాలిని దూర్చి
క్రిందకు తోసెను నందనందనుని
రివ్వున లేచి – మల్లుని తాకి
నడుమునందుకొని – గిరగిర త్రిప్పెను

అటుల త్రిప్పి – ఆ మల్ల యోధుని
నేలమీదకు విసరెను కృష్ణుడు
గొడ్డలి దెబ్బకు కూలిన తరువన
పుడమిని బడెను చాణూరుండు

అదే విధముగ బలభద్రుండు
ముష్టికునితో – ఢీకొన్నాడు
అన్నదమ్ముల ఒడుపులు గాంచి
తికమకబడిరి మల్లులిద్దరూ.

నేలనుబడిన చాణూరుండు
మదించినట్టి గజము తీరుగా
కృష్ణుని తాకి – బాహువు లందుకు
విసరి వేసెడి – యత్నముచేసెను.

వెంటనే కృష్ణుడు – నడుమునందుకొని
తిరిగి నేలకు విసరివైచెను
క్రోధమునిండి మల్లయోధుడు
బలముగ తన్నెను – నందనందనుని.

దెబ్బ తప్పుకొని - కృష్ణుడంతట
మల్లుని కాళ్ళను బలముగ బట్టి
గుండెలపైన ఒడుపుగ గుద్దెను
చేష్టలుడిగినటు - పడెనా మల్లుడు

గుండె చీలినటు తోచెను వానికి
సంభ్రమునందు - గిరి మాదిరిగ
నేలను తిరిగెను చాణూరుండు
తిరిగి వెన్నుడు - వెన్నున తన్నెను.

బలభద్రుండట - కృష్ణుడిచ్చట
మల్లులిద్దరితొ - పోరుచుండిరి
అచ్చెరువాయెను - చూచెడివారికి
వారిలొ వారిటు - తలంచుచుండిరి.

కంసుడు - ఎంతటి దుర్మార్గుడయా!
ఈ పసికందుల - హింసపెట్టెను
చాలిక పోరు - అనడేమయ్యా!
పిల్లలపైన - జాలి చూపడే!

సభలోనున్న - పెద్దలయినను
ఆపించండి - పోరు ననుచును -
కాపాడండి - పసికందులనని -
అనరేమీ - యిది - ఆశ్చర్యమయె!

ఈ అన్యాయము చూడగలేము
అసలీ సభకు -' వచ్చుట తప్పు
కృష్ణుని చూడు - లేత ముఖమది
చెమటతొ తడిసి - అలసిపోయినది

తెల్లని వాడగు బలభద్రుండు
ఎఱ్ఱని రంగుకు తిరిగిపోయెను
అన్నదమ్ములు - వెన్నుజూపరు
కానీ - మనము చూడగలేము

రాజు కాడు-ఈ కంసుడు - యముడా!
మీసము దువ్వుచు - మురిసిపోవుచు
చోద్యము జూచుచు కూర్చున్నాడు
పరమ పాపి - ఈ - కంసుడు నిజము

ఎంతటి దెబ్బలు - మల్లులిద్దరు
కొట్టుచుండిరో - పసికందులను
మనము - మీదబడి - మల్లులిద్దరను
చంపివేతము - అనుచు తలంచిరి.

అంతటిలోన - చాణూరుండు
రక్తము గ్రక్కుచు అగపడినాడు
ఆనందించి వెర్రిగ నరచిరి
ముష్టికుని గతీ - అంతే అయినది.

వీరమల్లులు - నేలకొరిగిరి
అసువులు - గాలిలొ తేలిపోయినవి
అంతటిలోన - కూటుడు అనెడి
మల్లుడు - రంగములోకి దూకెను

కూటుడు నేరుగ - బలభద్రునిపై
విరుచుకు పడగ - బలరాముండు
నుదుట గ్రుద్దెను - లాఘవమ్ముగా
రెండు వ్రక్కలై నేలనుబడెను

తిరిగి కొందరు మల్లులు వచ్చిరి
వారు - కృష్ణుని తన్నుల - చచ్చిరి
మిగిలిన కొందరు మల్లవీరులు
బ్రతుకు ఆశతో - పోరు మానిరి.

రాజు మెప్పుకై - చచ్చుట తగదు
బ్రతికియున్నచో - అది పదివేలు
చాణూర ముష్టికుల - లీలగ జంపిన
వీరులముందు - మనమొక లెక్కా!

భయపడి మిగిలిన - చిల్లర మల్లులు
స్థలములనుండి - లేవకపోయిరి
కంసుని మదిలో - ప్రళయము లేచెను
ఊహించనిది - జరిగిపోయినది.

❋❋❋ ॥శ్రీ కృష్ణచరితము॥

## 55 కంస సంహారము

జగజ్జెట్టులని బిరుదుగాంచిన
రుద్రదేవునే - లక్ష్యపెట్టని
మల్లులిద్దరిని - అవలీలగను
పిల్లలిద్దరూ - నేలకూల్చిరి.

వాని మాటలు - నోటనుండగనె
కృష్ణుడు - కంసుని పైకి దుమికెను
సింహపు పిల్ల - లేడి పైకి - మరి
లంఘించినటు - తోచెనప్పుడు

సభయంతయు - నిశ్శబ్దమైనది
ఆగ్రహమ్ముతో నిండెను కంసుడు
ఆనందముతో నిండిరందరూ
అంతటిలోన అరచెను కంసుడు

మీదబడెడి - ఆ - కృష్ణుని గాంచి
తప్పించుకొని - కంసుడంతట
ఒరలోనుంచి - చంద్రహాసమను
దివ్యఖడ్గమును - వెలికితీసెను

కట్టలు తెగిన - క్రోధమునిండి
కంసుడు - మంత్రుల కాజ్ఞలనిడెను
రామకృష్ణులను - విసరి వేయమని
గొల్లలందరను హింసించమని

సభలోనందరు స్థాణువులాయిరి
కంసుని భృత్యులు జయము పలికిరి
మెరసే కత్తిని - కృష్ణుడు గాంచి
ఒడుపుగ తప్పుకు - కంసుని త్రోసెను

నందుని - కట్టి - చెరబెట్టమనె
వసుదేవుని - తల - నరకగ జెప్పెను
తన శత్రువును - గౌరవించెడి
తండ్రిని కూడ - చంపగ చెప్పెను

గద్దెనుండి - ఒక తోపుతొ - కంసుని
రంగస్థలముకు - నెట్టివేసెను
రత్నఖచిత - మకుటమ్ము నేలబడి
నవరత్నములు దొర్లినవచట

గరుత్మంతుడు - ఫణిని విసరినటు
గద్దెనుండి - ఆ - కంసుని విసరెను
ఆ దెబ్బకు మరి తాళగలేక
అసువులు విడచెను - కంస భూపతి.

సభయంతయును విస్తుబోయినది
మాటలురాక - మూగబోయినది
అసువులు వీడిన - కంసుని - అచట
నేలపైన - దొర్లించెను కృష్ణుడు

వైరభక్తితో - నామస్మరణతో
నిముసమైనను - మరచిపోవక
బ్రతికి - కృష్ణునే తలంచినాడు
చచ్చి - కృష్ణునిలొ - కలసిపోయెను.

యోగీంద్రులకే అలభ్యమైన
యోగము కలిగెను - కంసునికపుడు
కృష్ణుని చేతిలొ మరణము నంది
దివ్యధామము జేరెను కంసుడు.

కంసుని తమ్ములు - న్యగ్రోధుడు ను
గుహ్యుడు - మొదలగు వారు లేచిరి
ఆవేశములో - అరచుచునంత
కృష్ణుని పైకి - దుమికిరి వారు

అదిగాంచిన - ఆ - బలభద్రుండు
ఇనుప పరిఘనొక దానిని చేకొని
వారందరినీ - యమపురికంపెను
ఒక్కడు కూడా దక్కలేదు అట.

బ్రహ్మేంద్రాదులు - సుర గంధర్వులు
పూలవాన కురిపించిరచ్చట
నారదమౌని - ఆనందించి
నృత్యము చేయుచు - స్తోత్రము జేసెను

కంసుని భార్యలు - వార్తను వినిరి
అంతఃపురమును వదలి వచ్చిరి
కంటికి మంటికి - ఏకధారగా
విలపించిరి - అట దృశ్యముగాంచి.

"నాధా - నీవు - వినకపోతివి
సాధుజనులను - హింసించితివి
చేసిన పాపము అనుభవించవలె
అది నిజమన్నటు - నేలకొరిగితివి.

నీ పాలిట - మరి - యమరాజే - యీ
కృష్ణుని రూపుగ - అవతరించెను
మమ్మందరినీ - ఒంటిగజేసి
దూరమైతివి - ఓ ప్రాణేశ్వర!

పసికందనియు - జాలిజూపక
కృష్ణునిపైకి - ఎందరెందరినొ
పంపినాడవు - దుర్మార్గముతో
పెద్దలు చెప్పిన - వినకపోతివి.

దుర్మరణముతో - నేలబడితివి
దారుణమ్మునిక - గనలేమయ్యా!
నీతో బాటు - నీ సన్నిధికి
పంపగ - కృష్ణుని - వేడుకొందుము.

ఆ విధముగను - కంసుని భార్యలు
రోదించుచును - అలసిపోయిరి
కృష్ణుడు - వారిని - ఊరడించెను
విధిని దాటుట - జరగదు అనెను

తల్లి దండ్రులు - పరవశించిరి
దగ్గర జేర్చుకు - ముద్దు పెట్టుకొని
మురిసిపోయిరి - మెరసిన కన్నుల
ఆనందాశృలు - వర్షించినవి

యథావిధిగను - కంస ప్రభువుకు
ఉత్తర క్రియలను - జేయమనుచును
తగిన వారికి - కృష్ణుడు చెప్పెను
కృష్ణుని మాటను - పరిపాలించిరి.

తల్లిదండ్రులకు నమస్కరించి
వినయము నిండి-కృష్ణుడు పలికెను
"కన్నది - మీరే అయినాగానీ
ముద్దుముచ్చట - లభించలేదు

అంతట - కృష్ణుడు - తల్లిదండ్రులను
దేవకిదేవి - వసుదేవులను
బంధవిముక్తుల చేయగ జెప్పి
వారి పదముల నమస్కరించెను.

మమ్ముల - లాలన జేసే - ప్రేమ
లభించలేదు - మీ యిరువురకు
మీ వద్దను మరి పెరిగే భాగ్యము
మాకు లభించక పోయినదమ్మా!

తల్లిదండ్రులు - దివ్యబాలుని
హృదయమ్మునకు హత్తుకొనిరట -
వారి మనస్సు - తీరు మారినది
అమిత భక్తితో ఉరక లేసినది.

విధివశమ్మును - దాటగలేము
జన్మనిచ్చిన - జననీ జనకులు
మీ ఋణమ్మును - తీర్చగవలెను
తీర్చకపోయిన మహాపాపమది.

వీరు - బిడ్డలని - తలచుట తప్పు
లోకాలేలే - అధినాయకులు
అనుచు - అవాక్కయి నిలచిపోయిరి
బాలకృష్ణుడు - గ్రహించినాడు

సమర్థుడైన తనయుడు భక్తిగ
తల్లిదండ్రులను పోషించనిచో
చచ్చిన వెనుక - ప్రేతము అగును
తన మాంసమును - తానే తినును.

వెంటనె మాయను - ప్రయోగించెను
ఆత్మ విమర్శను - దూరము జేసెను
తమ కుమారులు - వారిద్దరను
భావము - వారిలో - అంకురించెను

తల్లిదండ్రులను - గురువుల - పిల్లల
బ్రాహ్మణోత్తముల - సాధుజనులను
భార్యను - చక్కగ పోషించనిచో
బ్రతికియుండినను - జీవచ్ఛవమే.

మా గురించి – మిము చెరలోబెట్టెను
సామర్థ్యము – మరి –కలిగియున్నను
ఉపేక్షచేసిన – దయా – దూరులము
పెద్ద మనసుతో – క్షమించవలెను.

కరుణాపూరిత – నేత్రమ్ములతో
కరుణించే – ఆ – కరుణామూర్తి
కరుణించమని – తల్లిదండ్రులను
కోరుట గాంచిన – కనులు చెమర్చెను

ఆప్యాయముగా తల్లిదండ్రులు
తొడపై – కృష్ణుని – కూర్చొనబెట్టుకు
తనవితీరగా – కౌగలించుకొని
మనసుతీరగా – ముద్దుజేసిరి.

అంతట – కంసుని జనకుండైన
ఉగ్రసేనునితొ – పలికెను కృష్ణుడు
"తాతా! యయాతి – శాపమువలన
యాదవులు – మరి – రాజ్యమేలరు

ఈ సమయములొ – నీవు – తప్పక
సింహాసనమును అధిష్ఠించవలె
అన్ని విధముల – సహాయమ్మును
మీకు – భక్తిగా చేతును – నేను .

సురలు–నీకు మరి–ఒదిగియుందురు
మిగిలిన రాజులు – లొంగియుందురు
కావున – నీవు – రాజ్యలక్ష్మిని
చేరదీయవలె – ధర్మరక్షణకు".

అనుచు – అంతట – వాయుదేవుని
అచటకు పిలచి – ఇంద్రుని అడిగి
దేవ సభయగు – 'సుధర్మ' నచటికి
తేవలసినదని – ఆనతినిడెను.

ఆ విధముగను – వాయుదేవుడు
సుధర్మనచటకు తెచ్చి – నిలపెను
కృష్ణుడంతట – చెరలోనున్న
బందీలందర – విడుదల చేసెను

యదువృష్టి – భోజ – కుకురాంధక
బందీలందర విడుదల జేసి
వారి సమక్షము నందే – కృష్ణుడు
ఉగ్రసేనునికి – పట్టము గట్టెను.

పట్టాభిషేకము కన్నుల గాంచి
ఆనందముతో పొంగిపోయిరి
కృష్ణుని నామస్మరణ జేయుచు
సుఖముగ – గృహములకేగిరందరు.



॥శ్రీ కృష్ణచరితము॥

## 56 ఎడబాటు

కృష్ణుడు – నందుని – వద్దకు చేరి
ప్రేమాస్పందిత హృదయము నిండి
పలికెను – "తండ్రీ! నమస్సులయ్యా!
నీలాలనలో – ధన్యులమైతిమి.

తల్లిదండ్రులు – ఎవరో తెలియని
మా యిద్దరిని – నీవూ – అమ్మయు
కన్నబిడ్డలుగ – పెంచినారు గద!
మీ ఋణమును మరి – తీర్చగలేము.

మా మాటలను - నెగ్గించుచును
విసుగు జెందక - ఆప్యాయముగా
మంచితనముతో పెంచిరి మీరు
మంచి భవిత - నందించిరి మాకు.

కొంతకాలమిట - వుందుము మేము
జ్ఞాతులందరికి - త్రోవను జూపి
వ్రేపల్లెకు మరి జేరుకుందుము
మిమ్ము మరచుట - కలలో జరుగదు.

ఇక్కడ ఉన్నను - అక్కడ ఉన్నటు
ఉందుము" అనుచు - వస్త్రభూషలు
భక్తిగనిచ్చి - నమస్కరించెను
తిరుగు ప్రయాణము చేయగ కోరెను.

పెంచిన ప్రేమ - పొంగి పొరలినది
నందుని కన్నులు - చెమ్మగిల్లినవి
ఏకధారగా బాష్పధారలతొ
అభిషేక మ్మొనరించెను వారికి.

రామకృష్ణుల - కనులు చెమర్చెను
తండ్రికి - ప్రియముగ నమస్కరించి
ధైర్యము గరపి - గోపాలురకు
యథోచితముగ కాన్కలనిచ్చెను.

రామకృష్ణులకు ఆశీస్సులనిడి
శుభమును పలికి - నందుడంతట
మనసును - వారికి అర్పణజేసి
నిజవాసమునకు - బయలుదేరెను.

నమస్కారములు తల్లి కిడినటు
త్వరలోనే మరి వచ్చుచున్నటు
మరిమరి చెప్పి - మంగళకరముగ
విలువగు రత్నపు కాన్కల నంపెను.

కొంత దూరము నందాదులను
సాగనంపిరి - రామకృష్ణులు
బరువగు - గుండెల - వెనుకడుగిడిరి
నందుడు - దుఃఖము దిగమ్రింగుకొనె.

కొంతకాలము గడచినంతట
కులగురువైన - గర్గుని బిలచి
వసుదేవుండు - శాస్త్రోక్తముగా
ఉపనయనములు జరిపెను వారికి.

ఆ - శుభ సమయము లోన - భక్తిగా
భూసురోత్తముల నందరబిలచి
ధన - గోధనముల వసుదేవుండు
వారందరినీ - తృప్తిపరచెను.

తనయుడు పుట్టిన సందర్భములో
ముదముగ-మదిలో-నాడు-తలంచిన
గోదానమును స్వయముగ చేసెను
అన్నదానముతొ - తృప్తిపరచెను.

॥శ్రీ కృష్ణచరితము॥



# 57 విద్యాభ్యాసం

గురుముఖతః – మరి – విద్యనేర్చిన
జ్ఞానవంతులు అగునని తెలిసి
గురుకుల వాసము చేయుచు వారు
విద్యనేర్చుకొన యోచన చేసిరి.

తల్లిదండ్రుల ఆశీస్సులు గొని
రామకృష్ణులు బయలుదేరిరి
కల్యాణరాసి – కాశికిజేరి
గంగానదిలో స్నానమాడిరి.

విశ్వనాథుని దర్శించుకొని
అవంతిపురము జేరిరివారు
సకల విద్యలకు నిలయము అయిన
సాందీపని – గని – నమస్కరించిరి

విద్యార్థులుగా స్వీకరించమని
జ్ఞానభిక్షను – అనుగ్రహించగ
వినయము నిండి – కోరిరి భక్తిగ
ఆచార్యుడు – మరి – సంతసించెను.

రామకృష్ణులు – గురు శుశ్రూషలు –
శాస్త్రాధ్యయనము – నిష్ఠగ జేసిరి
అరువదినాల్గు – విద్యలన్నిటిని
అరువదినాల్గు దినముల నేర్చిరి

జగద్గురువులకు గురుదేవుడయి
విద్యాబుద్ధులు నేర్పిన యట్టి
సాందీపని గని – వీణాపాణి –
చదువుల తల్లి – మురిసిపోయినది.

ఆప్యాయముగా గురువు పలికెను
వత్సలార – మీరిరువురు – నాకు
శాశ్వత కీర్తిని – తెచ్చిపెట్టిరి
సాధారణమగు – మనుజులు కారు.

అల్ప వ్యవధిలో – అనల్పమైన
విద్యలు నేర్చుట – అసాధ్యమైనది
వినయవంతులు – నేను కోరిన
గురుదక్షిణను – నాకిడవలెను.

ఆ మాటలకు – రామకృష్ణులు
వందనముంచి – పలికిరి భక్తిగ
గురుదేవా – యిక సందేహించక
కోరుడు – యిత్తుము – గురుదక్షిణను

గురువు పలికెను – సంతోషముతో
వత్సలార – నా – కుమార – రత్నము
ప్రభాస తీర్థ – జలముల యందు
స్నానార్థమయి – పోయి – మునిగెను

సంద్రమునందు – మునిగిన – బాలుని
తలచుకొనుచును – కుములుచుంటిమి
తనయుని తెచ్చి – అప్పగించుట
నేకోరెడి – గురుదక్షిణ అనెను.

❋❋❋ ॥శ్రీ కృష్ణచరితము॥

# 58 గురుదక్షిణ

గురువుకు - వందనముంచిరి వారు
రథారూఢులై - బయలు దేరిరి
సాగరుని గని - సూటిగ అడిగిరి
గురుపుత్రుని-మరి-తమకొసంగమని

నీరు ఆవిరై - బీడై యుండువు
అనుచు - పలుకుచు - నారి మీటిరి
యదు సింహముల - రౌద్రము గాంచి
సాగరుని మది - కల్లోలమయె

అంతట పలికెను - వినయము నిండి
వీరులార - నే - నిజము చెప్పెద
మీ గురుపుత్రుని - పంచ జనుడను
అసురుడు మ్రింగెను-అని-నే-తెలిసితి

శంఖరూపమున - నాలో - తిరిగే
దనుజుడు - వాడు - అని వివరముగా
రక్కసుడుండెడి - నెలవు తెలిపెను
వెంటనె కృష్ణుడు కడలిలొ దూకెను -

పంచజనుని గని - చీల్చెను వానిని
వాని కడుపులో - బాలుడు లేడు
శంఖరూపముగ మారిన అసురుని
పాంచజన్యమును - గ్రహించినాడు.

పట్టుదల యది - పెరిగిపోయినది
సంయమినీ-యను-యమ నగరమునకు
నేరుగబోయి - పిడుగులుబడినటు
పాంచజన్యమును - ఊదెను కృష్ణుడు.

అమిత కోపమున - ప్రతిక్రియ జేయగ
కాలుడు కదలి - ద్వారము జేరెను
దివ్యమూర్తిని గాంచినంతనే -
యముని కోపము - ఎగిరిపోయినది.

అప రాధినని - పలుకుచునంత
పాదపద్మముల సాష్టాంగపడె
భక్తి ప్రపత్తుల - పూజలు జేసి
వచ్చిన కారణమడిగెను - యముడు

ఆనందించిన - కృష్ణుడంతట
విషయము చెప్పి - బాలుని గైకొని
గురువునుజేరి - పుత్రుని ఒసగి
నమస్కరించి తిరిగి - అడిగెను

స్వామీ - మీరు కోరినదిచ్చితి
సంకోచించక - యికపై కోరిక
తెలియబరచుడు నెరవేర్చెదను
శిష్యుడ-దాసుడ-అని వందనమిడె.

ఆనందాబ్ధిని - మునిగిన గురువు
తన శిష్యులగు - ఆసోదరులను
అమితమైన వాత్సల్యము నిండి
గుండెకు హత్తుకు - పులకరించెను.

ప్రియముగ పలికెను - సాందీపనట
"జగత్తునేలే - దివ్యమూర్తులు
దిగిన దేవతలు - సంశయమెందుకు
మృతుని - మీరు - బ్రతికించి తెచ్చిరి.

ఇంతకు మించిన కోరిక లేదు
మది పులకింతలో - మాటలు రావు
చిరకాలము - మీ కీర్తి - నిలచును
ఆయుర్భాగ్యము - కలుగును మీకు

సాధురక్షణలో - చిరకాలమ్ము
శాశ్వత కీర్తిని పొందుదు మీరు"
అని - ఆశీస్సులు అందజేసెను
చిరంజీవులుగ - వుందురు అనెను.

రామకృష్ణులు - ఆశీస్సులు గొని
గురుపత్నికి - అట నమస్కరించగ
వారి శిరస్సులు మూర్కొని-ప్రియముగ
ఆనందాశ్రుల - ఆశీస్సులనిడె.

"కడుపు శోకము - నాకు - తీర్చిరి
పారవశ్యము కలుగజేసిరి
మిమ్ములగన్న-తల్లి-కడుపు-మరి
చల్లగ నుండి - చల్లగనుందురు"

శలవును గైకొని - రామకృష్ణులు
మధురకు తిరిగి బయలు దేరిరి
వారిని గాంచి - మధురానగరపు
పురజనులందరు పొంగిపోయిరి.

ఉత్సవమ్ముగా - రామకృష్ణులు
కోటకు జేరిరి - జనులందరితో
ప్రజల మనస్సుల కొలువై - వారు
సుఖ సంతోషము లందజేసిరి.



॥శ్రీ కృష్ణచరితము॥

## 59 ఉద్ధవ దౌత్యం

ఒక ప్రశాంతమగు - ప్రాభాతమున
మదిలో మధుర స్మృతులు-నిండి-అవి
మధురకు - దూరము తీసుకుపోయి
వ్రేపల్లెలో - శ్రీ కృష్ణుని వదలెను

రేయింబవళులు - గొల్ల పల్లెలో
ఆడిన ఆటలు - చేసిన లీలలు
మదిలో మెదిలెను - పరవశించెను
మరి-మరి-అచ్చటి తలపులె మెదిలెను.

తనవారందరు - తల్లడిల్లినటు
తనకు దూరమై - దిగులుతోనున్నటు
తనువుతో నున్నను - మనసు దూరమై
తన కొరకై - మను చున్నటు తలచెను.

గోపికలందరి - మదిలో వేదన
తన కొరకై - ఆ భక్తుల మధన
తలచిన కొద్దీ - భక్తబంధువు
వాత్సల్యములో మునిగిపోయెను.

వయసులో పెద్ద - పెద్ద మనసుగల
ఉద్ధవుని - అట - రావించుకొని
మదిని విప్పెను - మధుసూదనుడు
హృది గది తెరచి - హితులను జూపెను.

"అయ్యా - నీవు - నాకు హితుడవు
నాపై - నీకు ప్రీతియున్నది
నా మనవిని - విని - నాకొక పనిని
మనస్ఫూర్తిగా చేయగవలెను.

వ్రేపల్లెకు నువు బయలుదేరుము
నా తలిదండ్రుల దర్శించుమయా!
కుశల వార్తను వారికి తెలిపి
నేను వత్తునని తెలుపుము వారికి.

అంతట – నీవు – గోపికలను గని
నా మది–నిరతము–వారి తలపులతొ
నిండియుండునని – వారికి తెలిపి
వారి వ్యధను–నువు–దూరము చేయుము.

నిరతము – వారు – నా తలంపుతో
నిత్య కృత్యములు–మరచియుందురు
అన్నపానములు కృష్ణ భక్తికి
నైవేద్యమిడి – ఉపవశింతురు."

మంగళకరముగ తేరును ఎక్కి
మంగళమూర్తి మాటలు తలచుచు
మంగళమైన పల్లె సీమకు
మంగళరూపుడు బయలుదేరెను.

సూర్యాస్తమయము అగునప్పటికి
వ్రేపల్లెకు – ఆ – రథము జేరెను
ఆలమందలు లేపిన ధూళి
రక్షాకవచము – అన్నటు అమరెను.

ముందుగ–నందుని గృహమున కేగెను
కృష్ణుని గాంచిన యంత – సంబరము
⁻ిగిన దపుడు – నందుని కచట
సేవలు హితునకు జేసెను.

మృష్టాన్నమును – ప్రీతిగనిడెను
మార్గాయాసము తీరునట్టుగా
సేవలొనర్చి – సంతసపరచెను
యోగక్షేమములు – అడగ సాగెను

"ఉద్ధవా! అట క్షేమమే కదా!
కంసుని పీడ వదలిపోయినది
ప్రాణసఖుడగు – వసుదేవుండు
దేవకిదేవి – సుఖముగ నుండిర!

చిట్టి తండ్రులు – రామకృష్ణులు
ఆనందముగా నుండిరి కాదా –
మమ్ముల నచ్చట – తలతుర – వారు
మా జ్ఞాపకము – వున్నద వారికి!

పెంచిన ప్రేమ – తలచుకొందుర!
ప్రేమ నిండిన – ఇచటివారిని
గోపాలురను – గోవుల మందను
గోపకాంతలను తలచుకొందుర!

మచ్చలేనిదగు చంద్రబింబమై
వెలుగులు చిమ్మే కృష్ణుని వదనము
కన్నుల నిలచును నిరంతరమ్ము
అనుచు – దుఃఖమున మాటలాపెను

ప్రక్కనె వున్న – యశోద మదిలో
కృష్ణుడు మెదలి – దుఃఖము పెరిగి
కృష్ణా! అనుచు – పైకి పిలచుచు
కన్నులు రెండు – తుడుచుకొన్నది.

"ముద్దులయ్య - నా మాట తలచున
నవ్వుల పువ్వులు - జల్లే బాబు
నా కన్నయ్య - నన్ను తలచునా!
అంధకారము - నిండిన దిచట.

ఎన్నాళ్ళకు - నా బాబును జూతును
వెన్నపెరుగులు - నే - తినిపింతును
**చిన్ని నోటిలో - బ్రహ్మాండమునే**
**దాచెను-అందులో-నేనే మూలనో"?**

అనుచు-దుఃఖము నిండె-యశోద
అంతట పలికెను - ఉద్ధవుడచట
"అమ్మా-వినుము-కృష్ణుడు వచ్చును
అనిశము-మిమ్ముల-తలచుచుండును

ఒక విషయము-నే-చెప్పెద వినుడు
రామకృష్ణులు - కారణజన్ములు
మానవులనుచు - తలంచవద్దు
నేలకు దిగిన - హరి అవతారము.

దుష్ట శిక్షణకు అవతరించిన
శ్రీహరి రూపము - వారిద్దరును
విష్ణువులోన ఐక్యమగుటన
జన్మనెత్తిన ఫలముదక్కుట.

జీవులన్నిటికి ఆత్మ వెలుగు
నారాయణుడు - నరజన్మముతో
మీగృహమున - తా - నడుగుబెట్టెను
పుణ్యతీర్థముల - తేల్చెను మిమ్ముల.

పూర్వ జన్మపు - పుణ్యవశముచే
మీ కాభాగ్యము - కలుగజేసెను
అందరికాయన - అన్నివైపులా
బంధువు-హితుడు-ప్రాణసమానుడు.

లౌకికమైన - బంధుత్వములు
లేనివాడు - ఆ - నారాయణుడు
పుట్టుకలేని - అభవుడాయన
అభయమునిచ్చే - ఆత్మబంధువు.

సంరక్షణము - సంహరణమ్ము
ఆయనలీలలు - తెలియుడు మీరు
పుణ్యపురుషుని - పురాణపురుషుని
పెంచిరి ధన్యులు - వంత వీడుడు".

అనుచు తియ్యగా - కృష్ణ తత్త్వము
వినిపించెను - ఆ - ఉద్ధవుడపుడు
వారిద్దరి మది ప్రశాంతమైనది
సుఖముగ నిద్రలో జారిరి వారు.

తూరుపు రేఖలు పుట్టుచున్నవి
సూర్యబింబము కర్తవ్యముకై
తొందరపడుచు - లేవనున్నది
పల్లె-నిద్రయను-దుప్పటి వదలెను.

ఉద్ధవుండు - తా - నిద్రలేచెను
నిత్య కృత్యములు నిర్వహించుకొని
ఏకాంతములో కూర్చొనియుండెను
కవ్వపు మ్రోతలు - వినబడుచుండెను.

దూరము నుండి చూచిన - గోపిక
కృష్ణుడే యని భ్రమలోపడినది
నలుగురికీ తను - తెలియజెప్పెను
అందరొక్కటై చేరిరచ్చటకు.

నిదానముగా జూచిరి వారు
కృష్ణుడు కాదని గ్రహించినారు
చంద్రబింబమగు వదనము-మరియు
పద్మనేత్రములు భ్రమ కలిగించెను.

పట్టు వస్త్రము - కుండలమ్ములు
కంఠసీమలో - శోభిలు - మాల
విశాల వక్షము - పొడవగు కరములు
కృష్ణుడేయని - భ్రమలో ముంచెను.

దగ్గరగా మరి వచ్చినంతనే
విషయము వారు గ్రహించినారు
సిగ్గుమొగ్గలు - విరిసె ముఖముల
చిరునవ్వులవి - దాగెను పెదవుల.

"ఓహో - నీవా - మాకు తెలిసినది
కృష్ణుని సఖుడవు - వచ్చితి విటకు
తల్లిదండ్రుల - కుశలమరయగ
నిన్ను పంపెను - నందకిశోరుడు.

తల్లి దండ్రులను - మరవలేదులే -
అంతవరకును ఆనందమది
అంతకుమించి కావలసినది
కృష్ణునికెవ్వరు వున్నారిచట!

సఖ్యము మరచుట సహజలక్షణము
గురువు - శిష్యుని మరచుట లేదా
తుమ్మెద - పువ్వును వదలుట లేదా
పులుగు - పండ్లుతిని-చెట్టును వదలద!

ఆ విధముగను వాసుదేవుడు
మాతో - మరి - వ్రేపల్లె సీమతో
తెగతెంపులవి చేసుకు - వదలి
పట్నవాసము చేయుచుండెను.

అనుచు - నిష్ఠురములాడుచుండగా
తుమ్మెద•ఒకటి - రొదచేయుట విని
భ్రమరమ్మును గని - పలుకుచున్నటు
కృష్ణుని చేతలు - విమర్శించిరి.

॥శ్రీ కృష్ణచరితము॥



# 60 భ్రమరగీతలు

"భ్రమరమ! నీవు ధూర్తమిత్రుడవు
మా - పదపద్మమ్ములను - ముట్టకు
సుందర వదనల - మందిరాలలో
వశించు-కృష్ణుడు-నిన్ను జేర్చుకొను

పట్నవాసపు స్త్రీల - హితుడవు
వారి దూతగా - హరి వక్షమున
పూలదండల - తేనె త్రాగెదవు
నీ ముఖమును గన-మక్కువ లేదు!

ఒక పుష్పమున - మధువును త్రాగి
మరెయొక పువ్వును ఆశ్రయించెడి
నీ తీరుగనే - ఆ - మహరాజు
నడచుచుండెనని - తెలియుచున్నది.

మమ్ముల మరచి - మధురలొ తాను
సుఖముగ నుండెను-ఎంతటి-టక్కరి
ఆ టక్కరికి - పూజలు చేసి
లక్ష్మి పొందెను పతిగా - వింటివ!

నిజముగ - లక్ష్మి - మోసపోయినది
హరి కీర్తి విని - కరగిపోయినది -
నీ సంగీతము - కట్టిపెట్టుము
పట్నవాసపు రాగము చాలును

నీ నయగారము - మాయనవ్వులు
కట్టిపెట్టుము - కీటకరాజమ!
మా మనస్సులు హరించినట్టి
హరికి నీవు - మరి తగియున్నావు

అంతటి సిరియే - తెలియకపోయెను
గొల్ల వనితలము - మేమొక లెక్కా!
సర్వము - స్వామికి అర్పణ జేసుకు
ముక్తి లక్ష్మిని - కోరుచుంటిమి.

కను విందైన రూపము చూడక
బ్రతకలేమని తెలిసిన స్వామి
ఇన్నిదినములు - దర్శన మీయక
దుఃఖతప్తులను చేయుట తగునా!

ధర్మము తెలిసిన పెద్దలెవ్వరూ
హర్షించరని తెలియద - నీకు
రాకు రాకు - మాదరి దాపులకు
మా పదపద్మమ్ములను - స్పృశించకు.

మాధవు కీర్తిని - గానము జేసే
మధుర భ్రమరమా! - మాకు తెలియును
తరువు - చాటున నిలబడి - కోతిని
కోలను కూల్చుట - ధర్మము అగునా?

ముగ్ధ మోహన రూపము గాంచి
ముచ్చటపడి - ఆ - ముదితజేరగా
ముక్కుచెవులను - కోయించుటది
మన్నించదగు కార్యము అగునా?

మాటల గారడి జేసిన - ఘనుడు
మూడడుగులవి - చాలును అనుచు
మురిపించి - మరి - మత్తును జల్లి
మహానుభావుని - మోసగించెకద!

భృంగరాజ! యిటు-పలుకుట తగదా -
ఆయన లీలలు వినిన జీవులు
ఉద్ధరించబడు నందురు కాదా!
మేము అందుకు నోచగలేదా -

నిరంతరమ్ము నామస్మరణతో
లీలామృతమును గ్రోలుచుంటిమి
మాపై దయను జూపని దేవుని
మన్నించుటది జరుగదు కాదా!

లౌకిక వాసనలన్నీ వదలుకు.
బంధములన్నీ దూరము చేసుకు
సంసార సాగరము దాటుట కొరకు
పాదపద్మముల - శరణని పడితిమి.

ఆశను చూపి - దగ్గర జేర్చుకు
వియోగజలధిని త్రోసివేసెను
అచ్చట సుఖముగ గడుపుచుండెను
దయా దూరుడు - నందనందనుడు.

ఆలమందలు - అడవులు - పల్లెలు
అనాగరికమగు నెలవులు - నెలతలు
అన్నీ - అతనికి రోతపుట్టినవి
అందులకచట స్థిరపడినాడు"-

కృష్ణదర్శనము కలుగలేదని
మదిలో వ్యధతో - వారు పలుకగా
తియ్యని మాటల - వారందరినీ
ఓదార్చగను -పలికె ఉద్ధవుడు

"పుణ్యవతులు - మీరందరు వినుడు
జప - దానములు-ధ్యాన - వ్రతములు
తపస్సు - స్వాధ్యాయ దీక్షల - మించిన
భక్తి ప్రపత్తులు - కలిగియుండిరి.

శ్రీహరిపైన - మీ భక్తి యది
అనంతమైనది - అపారమైనది
ఇహ బంధములు - చుట్టరికమ్ములు
దాటిపోయినది - నిశ్చలమైనది

పురాణ పురుషుని - భక్తిగ కొలిచి
తరించినారు నిస్సంశయము
మిమ్ముగాంచెడి భాగ్యము కలిగెను -
కృష్ణుని మాటలు - చెప్పెద వినుడు.

"సుందరులారా! వినుడు శ్రద్ధగా
పనులన్నిటిలో నెలకొని యుందును
నాతో ఎడబాటన్నది జరుగదు
సర్వ జగత్తున - నేనే వుందును.

పంచ భూతముల తత్త్వము - సృష్టిలొ
నెలకొనినటుల - నేను వుందును -
మనసు - ప్రాణము, బుద్ధి గుణములు
ఇంద్రియాలకు నే నాధారము.

నా సంకల్పము వల్లనె - జీవులు
పుట్టి - పెరిగి - మరి లీనము అగును
ఆత్మ మాత్రము మాయకు లొంగదు
నిత్యశుద్ధమై నిలబడి యుండును.

సగుణమ్ముగను ఆత్మయున్నచో
ప్రకృతి సిద్ధములగు కార్యములు
తానే చేయుచు - మనస్సునపుడు
ఆధిక్యములో నుంచును వినుడు.

కలలో జూచిన దంతయు కూడ
కల్లయనుకొను - ఆత్మ వివేకి -
అట్టివాడు మరి - ఈ ప్రపంచము
అస్థిరమన్న తలపుతొ నుండును.

నదుల గమ్యము - కడలి యగునటు
అష్టాంగ యోగములు-అధ్యయనమ్ము
సత్యవ్రతము-మరి-తపస్సు-అన్నియు
పరతత్త్వమును - పొందుటకొరకే.

మరియొక విషయము-వినుడందరును
దూరముగా - మరి - వుండుటవలన
అనురాగములు - ఆప్యాయతలు
ఇనుమడించుటది సహజమైనది.

నే దూరముగ నుండుటవలన
నాపై - ధ్యానము పెరిగెను మీకు
అది - మన బంధము పెంచెడి సాధన
స్థిరమగు బంధము కలిగించునది.

ఆ మాటలకు వారందరును
సంతోషముతో పొంగిపోయిరి
కరములు ముడిచి పలికిరియిటుల
"ఎన్నాళ్ళకు మరి - వింటిమి స్వామీ!

తియ్యనైన - మా కృష్ణుని పలుకులు
వినిపించితివి - ఋణపడియుందుము
అది సరిగాని - నందకిశోరుడు
ఆనందముగా - సుఖముగనుండెన -

ఎన్నాళ్ళకు ఈ పల్లెకు వచ్చును
మధురవాసులు - మరలనిత్తురా?
పూపొదరిండ్ల - వేణుగానమున
పులకరించెడి - ఘడియ ఎన్నడో!

మమ్ముల నాయన - తలంచుకొనునా -
మాతో గడపిన - మధురక్షణములు
ముచ్చటించునా - మీతో స్వామీ!
ఆటపాటల ఊసు తలచునా!

వెన్నెల వెలుగుల - యిసుకతిన్నెల
పొన్ననీడలో - యమునాతటిపై
వేణునాదము వినుచు గడిపిన
మధుర క్షణములు తలంచుకొనునా!

మదికానందము కలుగునట్టుగా
మాధవుకుశలము - తెలిపితి వీవు
మా మాటలను స్వామికి చెప్పి
మా నమస్సులు అందచేయుము.

జాగుచేయక - వేగమెరమ్మను
అసువులుండగనె - చూడగ రమ్మను
ఆశ్రిత రక్షకుడన్న - బిరుదును
శాశ్వతమ్ముగా నిలుపుకోమను!

లక్ష్మితో - సమముగ - మమ్మందరినీ
భక్తులందరిని - చూచుకోమను
పెద్దమనిషివి - నీవు - హితమును
తియ్యగ చెప్పి - పంపుము హరిని.

తోడుగ - తిరిగే - ప్రియ మిత్రుడవు
నిజముగ - మాధవుడిటకు వచ్చునా?
ఇచ్చకాలకై అటుల చెప్పెనా!
మాపై - అనురాగమ్ము తగ్గెనా -

వెనుకటి మాదిరి - వ్రేపల్లెలోగల
భక్తులందరిని పలుకరించునా
కృష్ణుని కెడమై - తిండి సహించక
కృంగి కృశించి - యుంటిమి స్వామీ!

నీపై భారము వేసితిమయ్యా -
మనస్ఫూర్తిగా నమ్మితిమయ్యా -
స్వామిని పంపే బాధ్యత నీదే!
అనుచు పలుకుచు - వలవలనేడ్చిరి" -

వారందరినీ ఓదార్చుటకు
తగుమాటలను - చెప్పి - ఉద్ధవుడు
కాస్త ప్రశాంతత - కలుగ జేసెను
ఇండ్లకు పంపెను - వారందరినీ.

కొంతకాలమట సుఖముగ గడిపి
కృష్ణలీలలు - వినిపించుచును
మధురకు మరలెను ఉద్ధవుడంతట
నందాదులు మరి కాన్కలనంపిరి.

భక్తిగ - కాన్కలనందజేసెను
కృష్ణుని మనసుకు - శాంతిగూర్చెను
కృష్ణుని వద్ద - శలవునందుకొని
గృహము జేరెను - ఉద్ధవుడపుడు.



॥శ్రీ కృష్ణచరితము॥

## 61 కృష్ణుడు ఉద్ధవునితో కుబ్జ గృహమునకేగుట

మాట యిచ్చిన మహిమాన్వితుడు
మంగళమూర్తి - భక్తబంధువు
మదిలో - కుబ్జ - మెదలినంతనే
మెల్లగసాగెను - ఉద్ధవుతోను.

ఇంద్ర సదనమును ధిక్కరించెడి
అందచందముల గృహమునందున
చెలికత్తెలతో తిరిగెడి కుబ్జ
జగన్మోహిని - అన్నటులున్నది.

కృష్ణుడు - పాదము - మోపిన యంత
పరవశించెను - కుబ్జ - వెంటనే
అర్ఘ్య పాద్యముల - సేవలు జేసి
దివ్యశయనమున కూర్చొనజేసెను.

యథావిధిగను అతిథిసేవలు
ఉద్ధవునికట జరిపినదామె
స్నానము చేసి - అలంకారముల
కృష్ణుని పదముల చెంత చేరినది

పాదములొత్తి - పరవశించినది
రూపముగాంచి - మురిసిపోయినది
మాటలు విని - తా - ధన్యతనంది
స్వామి సేవలో - పునీతమయ్యెను

కొన్ని దినములు కుబ్జ యింటిలో
సుఖముగ గడిపి - వాసుదేవుడు
ఆమె జన్మకు - ధన్యత గూర్చి
ముక్తి ధామమున చోటు చూపెను

అచ్చటి నుండి గృహమునకేగి -
అక్రూరుని గన - మనసు కలుగగా
అన్నతొ - ఉద్ధవుతో నంతటను
నిండుమనసుతో - బయలుదేరెను

ఆ ముగ్వురను జూచిన యంత
పరవశించెను అక్రూరుండు
అతిథి పూజలు భక్తిగ జేసెను
కృష్ణుని పాదములొత్తుచు పలికెను.

"మీరిద్దరును - రామకృష్ణులై
పుడమి భారము తీర్చగవెలసిన
దేవదేవులే - నిస్సందియము
సాధారణమగు - మనుజులు కారు.

కంసాదులను - చంపుట సాధ్యమ!
అట్టివారిని - అంతము జేసిన
శ్రీహరివీవు - కృష్ణా! తండ్రీ -
నను కాపాడుము - కరుణించవయా!

త్రిలోక పావని - గంగామాత
నీ పదములలో ఉద్భవించెను
యదువంశమున - సజ్జనులందర
ఉద్ధరించగా నేలకు దిగితివి.

సంసారయాతనలు అంతము జేసి
నీదరి జేర్చుకు - కాపాడవయా!
నీ దాసునిగా అనుగ్రహించుము
నీ భక్తునిగా కటాక్షించుము"

పొంగిన గుండెతొ పలికె నక్రూరుడు
ఆనందించెను - నందనందనుడు
ఆతని కరము గ్రహించె - ప్రియముగ
మనశ్శాంతిని - కలుగజేసెను.

❊❊❊ ॥శ్రీ కృష్ణచరితము॥

## 62 కృష్ణుడు - అక్రూరుని హస్తినకు పంపుట

"అక్రూరా - నువు ఆప్తుడవయ్యా -
తండ్రి యంతటి ముఖ్యుడ వీవు
మాకు పెద్దవు - మేము - ప్రేమగా
నిరతము - నీతో నుందుము-నిజము.

మాకొక పనిని - చేసి పెట్టవలె
చనవుగ - నీతో చెప్పుచుంటిమి
హస్తినాపురము పోయి రావలెను
అచటి కుశలము - తెలుపగవలెను.

పాండు భూపతి పోయిన వెనుక
అత్త - కుంతి అట కౌరవులింటను
తనయులతో - మరి-హస్తిన నున్నది
ఎటులవుండిరో తెలియగవలెను -

ఒక్క దినమున కుంతీదేవి
విదురుని యింటికి వచ్చి - అచ్చట
అక్రూరునితో మనసును విప్పి
వారి భాధలు చెప్పుకొన్నది.

తనయునిపైన మమకారముతో
ధృతరాష్ట్రుడట - పంచపాండవుల
సరిగా చూచుట లేదని - వింటిని
వారి సరిస్థితి ఎటుల నున్నదో!

"మన వారందరు క్షేమమే కదా!
మాకు - ఏమని - చెప్పిరి వారు
దురాత్ములైన - కౌరవులింట
దుర్భరముగా - గడపుచుంటిమి.

స్వయముగ నీవు వారిని చూచి
ధైర్యోక్తులను చెప్పగవలెను"
అనగా - సరియని అక్రూరుండు
హస్తినాపురము బయలుదేరెను.

పులుల మధ్యన - ఆడు లేడిలా
కాలము నీడ్చుచు -నున్నానయ్యా!
దుర్యోధనుని దుష్టచేష్టలు
చెప్పుటకెన్నో - నిద్దురరాదు-

పురమును జేరి - జ్ఞానవృద్ధులను
భీష్మ - ద్రోణ - విదురుల చూసెను
పెద్దయైన - ధృతరాష్ట్రుని గాంచెను
కృపాచార్యుని - పలుకరించెను.

నాతనయుడగు - భీముడన్నచో
పట్టరాని ద్వేషమ్ము - వానికి
నిద్రలోనున్న భీమసేనుని
ఈటెలతో పొడిపించినాడయా -

పెద్ద కుమారుని - దుర్యోధనుని
అతనికి - ప్రాణసమానుడు అయిన
కర్ణుని గాంచెను - అక్రూరుండు
అశ్వథ్థామను గాంచెనాతడు.

విషసర్పములచె - కరపించెనయా!
పలుగులు కట్టి - నీటిలొ త్రోసెను
విషాన్నమును - తిని పించినాడయా
దైవకృపచే - బ్రతికియుండెను.

కుంతీ దేవిని - పంచపాండవుల
రాచ బంధువుల నందర చూచి
యోగక్షేమములు విచారించెను
విదురుని యింట విడిసియుండెను.

మేనత్త ఉన్నదని - రామకృష్ణులకు
తలంపు వున్నద - కాపాడెదరా -
తండ్రిలేని - నా బిడ్డల రాజ్యము
కృష్ణుడు - మా కిప్పించనెంచెనా?

నిన్నుగాంచితిని - ధైర్యము పెరిగెను
ఆశాకిరణము - అంకురించెను
రామకృష్ణుల ఆలోచనలు
నాకు చెప్పి - నన్నూరడించుము."

అనుచు పలుకుచు - కంట నీటితో
కుమిలిపోయెడి - కుంతిని గాంచి
ఊరడెంచెను - మృదువచనముల
విదురుడు కూడా - ధైర్యము గరపెను.

ధృతరాష్ట్రుని గని పలికె - నక్రూరుడు
"రాజా - నీవు పాండుసుతులను
చేరదీసి -పోషించు చుంటివి
ధర్మబుద్ధితో సాకుము వారిని.

నీకు వేరుగా చెప్పగవలెనా
నీ తనయులతో సమానమ్ముగా
వారిని - నీవు - పెంచగవలెను
రాజ్యభోగములు - అశాశ్వతమ్ము -

దుర్యోధనుడే ఉద్ధరించును
పాండుసుతులు-మరి-పరాయివారను
మాటను - మదిలో రానీయకుమా!
కాలనిర్ణయము -కాదనలేము

నేత్రద్వయము - లేక పోయినను
జ్ఞాన నేత్రము - మూయకురాజా!
పుత్రమోహమున - పాండుసుతులకు
అన్యాయమును జరగనీయకు

లోకుల దృష్టిలో కీర్తి పెంచుకో!
పాండుసుతులకు - రాజ్యభాగమును
పంచి యిచ్చి - నీ - పరువు నిలుపుకో-
పెద్దతనము - కాపాడుకోవయా!" -

సూటిగ చెప్పెను - అక్రూరుండు
బదులుగ పలికెను - ధృతరాష్ట్రుండు
"అక్రూరా - నువు హితము పలికితివి
మంచిమాటలు - చెప్పితివయ్యా -

ఎంతో సుదినము - నీవల్లను - నే
విషయములన్నీ - తెలిసికొంటిని
ఈశ్వరేచ్ఛను - దాటగలేము
ఎదిరినిలచి - మరి - పోరగలేము

అవతార మూర్తియగు - కృష్ణుని కిదిగో
ప్రణామమ్ములు - ఆచరించితిని
ఆయన కోరిన రీతిగ - మేము
మసలుకొందుమని - విన్నవించుము" -

ఆ మాటలకు - అక్రూరుండు
తిరిగి పలికెను - ఓ మహరాజా -
"నీకు తోచినటు - ఆచరించుము
నీ వేదాంతము - గ్రహించినాను

ఈశ్వరేచ్ఛను - దాటగలేమని
చెప్పితి వీవు - సంతోషమది
శలవునిచ్చిన - మథురకు సాగెద"
అనుచు పలికి - తా - మథురకేగెను.

హితులందరికడ - శలవుగైకొని
మధురకుసాగి - కృష్ణుని కచట
కుంతి మాటలు - తెలియబరచెను
కురుపతి మాటలు విన్నవించెను.

పాత్రల సృజించి - పలికించగల
జగన్నాటక సూత్రధారికి
ఏది ఎప్పుడు - ఎటుల జరుగునో
తెలియనిదా ఈ సృష్టి రహస్యము -
॥శ్రీ కృష్ణచరితము॥



# 63 జరాసంధుని పరాభవం

జరాసంధుని కుమార్తెలిద్దరు
అస్తి - ప్రాస్తి - కంసుని భార్యలు
వైధవ్యము తో దుఃఖించుచును
తండ్రిని గాంచి పలికిరి యిటుల

"తండ్రీ! కృష్ణుడు - దయాదూరుడు
మధురనంతను వ్యాకుల పరచెను
మమ్ముమించిన - రాజెవడనుచు
మదము నిండి-మరి-పలికెనచ్చట

రాజు లెందరినో - తుదముట్టించెను
మా బ్రతుకులనిటు బ్రద్దలు జేసెను
పసుపు కుంకుమలు - పోగొట్టుకొని
మోడువారినటు-బ్రతుకు చుండవలె

యమపురిగా-ఆ-మధురను మార్చెను
మాకీ బ్రతుకు వలదయ్యా - విను!
అనగా - తండ్రి తల్లడిల్లెను
జరాసంధుడు - ఉగ్రుడయ్యెను

తోక త్రొక్కిన - త్రాచై లేచెను
"ఏమిటి మీరు చెప్పుచున్నది -
కృష్ణుడు - కంసుని అంతము జేసెన
...ననని తెలియక పోయెన

రోదించుట యిక కట్టిపెట్టుడు
కృష్ణుడు - అంతటి వీరుడయ్యెనా
సప్తసంద్రముల - నేకము జేయగ -
శక్తిమంతుడను - నన్నుమరచెనా -

దంతి దంతముల నూడ బెరకగల -
దిగంతములలో కీర్తి నింపగల -
ధీరుడనేను - నాముందటనే
గొల్లలు - ఎల్లలు మరచిపోయిరి.

జరాసంధుడు పగ సాధించును
గొల్లలకిపుడు శని రోజులగు
కృష్ణుడు - గిష్ణుడు - యాదవులందర
నల్లు లన్నటు - నలిపివేతును.

జరాసంధుడు ఆజ్ఞలనిడెను
యాదవులపై పోరుకు నిలచెను
ఇరువది మూడు అక్షౌహిణుల
సైన్యము వెంబడి రావలె ననెను".

"నీటిలో - నింగిలో ఎచ్చట దాగిన
యదువంశమును అంతము జేసెద
ఈ సింహమును - నిద్రలేపిరి
అనుభవించవలె - కర్మఫలమ్ము".

పుడమినంతను మ్రింగునట్టుగా
ప్రచండ సైన్యము వెంటనడువగా
యాదవరాజుల రాజధానిని
మథురను - తాను ముట్టడించెను.

సంద్రము పొంగి పుడమిని బడినటు
అపారసేన మథురను - తాకగ
అస్తవ్యస్తము - అయినవిబ్రతుకులు
కల్లోలముతో నిండెను మథుర

కృష్ణుడు గాంచెను-యోచన చేసెను
మూర్ఖునికి మరి బుద్ధి చెప్పవలె
వానిని వదలి వాని సైన్యమును
అంతమొనర్చిన భూమి తేలికగు

"దుష్టశిక్షణ ఆరంభింతును
జరాసంధుని గర్వ మణంచెద"
అనుచు తలంచగ-నింగి నుండి మరి
రెండు రథములు నేలకు దిగినవి.

సూర్యుని రథమును మించిన వెలుగుతొ
ఆయుధాలు - మరి - సారథులుండి
ముందునిలచిన - రథములగాంచిన
అన్నతొ పలికెను వాసుదేవుడు.

"అన్నా! నీవీ రథమునెక్కుము
సాధుహింసను చేసెడి దుష్టుని
అంతము చేసి - శాంతి గూర్చెదము
భూభారమును దించెదమయ్యా!"

రెండవ రథమును కృష్ణుడెక్కెను
అతి తక్కువగా సైన్యము నడువగ
పోరుకు సాగి - ప్రభంజనముగా
శంఖములూదిరి - రామకృష్ణులు.

శంఖఘోషకు - తల్లడిల్లిరి
జరాసంధుని కోపము పెరిగెను
కృష్ణుని గాంచి - హేళన జేయుచు
పలికెనప్పుడు - యుద్ధభూమిలో.

"మాయల మారివి - బంధువిరోధివి
కళ్ళు తెరవని - పసివాడవు - నువు
స్వ - పర - భేదము - మరచిపోతివి
నీ తో యుద్ధము - నా కవమానము

ఓబలరామా - పెద్దవాడవు!
కొంత బలముగ అగపడుచుంటివి
చొరవగ - ముందుకు వచ్చినాడవు
స్వర్గము కంపెద అతి తొందరలో"

అనుచు పలికెడి జరాసంధునితొ
కృష్ణుడు పలికెను - చిరునవ్వులతో
"శూరుడెవ్వడూ అతిగా పలుకడు
ఆత్మ ప్రశంస - అసలు చేయడు."

ఆ మాటలకు రోషము పెరిగి
విజృంభించెను జరాసంధుడు
ఒక్కుమ్మడిగా అందరు నచట
శరవర్షము కురిపించ సాగిరి.

ఆగకుండగా వచ్చెడి శరముల
కలవరపడెను యాదవ సైన్యము
విషయము తెలిసి నందనందనుని
కనుగొలకులవి ఎఱ్ఱబడినవి.

శార్జ్ఞము - అనెడి - దివ్య ధనుస్సును
సూర్య కాంతితో - వెలిగే విల్లును
కృష్ణుడు తీసి శరములువదలెను
ప్రళయకాలమా - అన్నటు వదలెను.

విజయకేతనము లెగురుచుండగా
రామకృష్ణుల రథములప్పుడు
మెరపుతీగలై మెరయుచున్నవి
కృష్ణుని శరములు చీల్చ సాగెను.

శరములు వచ్చెడి దిక్కు తెలియదు
శిరములు తెగుచు - నేలకు రాలెను
రక్తపుటేరది - ప్రవహించినది
రిపు సైన్యమది - అంతరించెను.

జరాసంధుని వేదన పెరిగెను
హలాయుధముతో బలభద్రుండు
గజ-తురగములను-రథముల చీల్చెను
ఒకరిని మించి - ఒకరని పించిరి.

అచేతనుండయి నిలచిన వానిని
జరాసంధుని - బలరాముడు గని
కరిపై దూకెడి - సింగము తీరుగ
దుమికి - వానిని బందీ చేసెను.

బంధించి మరి ఈడ్చుకువచ్చి
హలాయుధమ్మును ఎత్తెనొక్కపరి
అంతట కృష్ణుడు - వలదని పలికి
చంపక విడచుట - తగిన శిక్షయనె.

"విరథుడు వీడు - గర్వముచచ్చెను
వదలి వేయగా - బుద్ధి వచ్చినచొ -
కొన్ని దినములు - ఇలలో మనును
అటుగాకున్న చంపుట తప్పదు".

తమ్ముని మాటలు విని బలరాముడు
బంధవిముక్తుని జేసి పలికెను
"బుద్ధిగ బ్రతుకు - పొగరుమానుము
నిన్ను చంపుట - మా - కవమానము".

బ్రతుకు జీవుడా అని సాగుచును
మదిలో ఎంతో దుఃఖిలసాగెను
ప్రాణభిక్ష నిడి వదలిరి అనుకొని
అవమానమునకు కృంగిపోయెను.

కాలము అనుకూలమ్ము కాదని
కర్మఫలమును అనుభవింతునని
యదువీరులను - గెలుచుట ఎటుల
అని మది తాను తర్కించుకొనె.

వాని మిత్రులు రాజులు కొందరు
త్రోవలొ వానికి ధైర్యము గరపిరి
ఓర్పు జూపి - మరి-సమయము రాగా
పగతీర్చుకొన - మెళకువ జెప్పిరి.

అఖండసేనావాహిని నచట
అవలీల గను - నేలకూల్చిన
అసమాన ధీరులు - రామకృష్ణులను
అందరొక్కటై ప్రశంసించిరి.

సురగంధర్వులు పూలవానను
మంగళకరముగ - కురిపించిరట
స్తోత్రపాఠకుల విజయ ఘోషయది
నింగికెగసినది - సురలు వినగను

॥శ్రీ కృష్ణచరితము॥



# 64 కాలయవన వధ

విజయలక్ష్మితో - విజయహాసముతొ
విజయ దుందుభుల మ్రోతలెగయగా
వచ్చుచున్న - బలరామకృష్ణులకు
విజయహారతులు పట్టెను - మథుర

లాజలు జల్లి - ముత్తయిదువులు
ఆశీస్సుల - నిడి - మురిసి పోయిరి
దిష్టితీసిరి - రక్ష చదివిరి
మంగళ హారతు - లిచ్చిరి వారికి

బలరామకృష్ణులు-మంగళ కరముగ
కోటలోనికి అడుగు బెట్టిరి
గెలిచి తెచ్చిన ధన మంతయును
ఉగ్రసేనునికి - సమర్పించిరి.

చచ్చి బ్రతికిన - జరాసంధునికి
నిద్రాహారములు కరువై పోయెను
పగతీర్చుకొన - పట్టు పెరిగినది
పదిహేడుతడవలు-యుద్ధము చేసెను.

అన్ని తడవలూ - పరాభవముతో
వెన్ను చూపి-తా-పరుగిడి బ్రతికెను
పట్టుదలతొ - మరి - యింకొకసారి
పెద్ద పెట్టున - తయారయ్యెను.

జరాసంధుని ప్రయత్నాలను
తెలిసిన యట్టి - నారద మహఋషి
వాడు వచ్చెడి లోపున మరియొక
దుష్టశిక్షణకు యోచన జేసెను.

కాలయవనుడను మ్లేచ్ఛ రాజు - తా
బలగర్వముల - పొగరుతొ నుండెను
వాని చెంతకు నారదుడేగెను
అతిథి పూజలు అందెనచ్చట

లోకవార్తలను - యవనుడడిగెను
వానిని పొగడెను - నారదమౌని
"యవనా! నీ దగు పరాక్రమముతో
రాజలోకమును గెలిచినాడవు.

కానీ - మథురలొ యాదవరాజులు
నీకు తెలియదా - అలక్ష్యమా - మరి!
లేదా - వారికి - భయపడుచుంటివ!
నీ బలవిక్రమ - మంతరించెనా?

వినుమో! యవన! అందలి రాజు
జరాసంధుని పొగరణగించెను
చిత్తుగ తన్ని - అసువులుంచెను
అతనికి - సరిపడు వీరుడు లేడు."

ఆ మాటలకు ముఖము ఎఱ్ఱబడి
ఆసక్తి నిండి అడిగె నారదుని
"యాదవుడా! – వాడెటుల వుండును
వివరించు మన – మౌని చెప్పెను.

"నల్లని ఛాయ – నయనానందము
తెల్లని – తామర పూవులె కళ్ళు –
చల్లని చంద్రుని – పోలిన ముఖమున
కస్తురి తిలకము – రక్షగ మెరయును.

ఎగు భుజములతో – పొడగరి తానై
లోకాలేలే – ప్రభువుగ తోచును
వక్షస్థలమున పుట్టుమచ్చయది
లక్ష్మీదేవికి – ఆటపట్టయగు.

బంగరు చేలము – కుండలమ్ములు
మంగళకరమగు వనమాలతొ – తా
యాదవులందు అతిసుందరుడు
ఎంత చెప్పినా తరగదు ఘనత.

ఎక్కడ చూచిన – ఆతదుండునని
ఒక్కడైనను – పెక్కు రూపులని
పెద్దలు చెప్పగ – వింటిని నేను
నాకు తెలిసిన విషయము వినుము.

మాయలందున అగ్రగణ్యుడు
అందక తిరిగే – అమోఘచతురుడు
ఒడుపుగ వానిని – పట్టగ వలెను
అంత తేలికగ తలంచవలదు."

ఆహా! వాడు అంతటివాడా!
ఏదీ చెప్పుము – పేరు విందును
అనగా మౌని – కృష్ణుడనుచును
పేరును చెప్పి – సాగిపోయెను.

కట్టుదిట్టముగ – వ్యూహము వేసి
అఖండ సేనా వాహిని నడువగ
మథురానగరము చుట్టు ముట్టెను
దిగ్బంధమును చేసెను – యవనుడు.

యవనుని రాక – తెలిసెను – కృష్ణుడు
ఉద్రేకపడు – సీరిని గాంచి
పలికెనప్పుడు! అన్నా మనము
వివేకముతో – నడువగ వలెననె.

గోటితొ పోయే – చిన్న పనికి – మరి
గొడ్డలి పెట్టు ఎందుకోసమనె
"కాలయవనుడు – అసాధారణుడు
వాని సైన్యము – సుశిక్షితమ్ము.

వీనితో మరి – పోరుచుండగా
జరాసంధుడు తప్పక వచ్చును
ఓడినవాడు గట్టిపట్టుతో
పోరగవచ్చును – విజయకాంక్షతో

యవనునితో – మనయుద్ధము సాగగ
మరో త్రోవలో – జరాసంధుడు
ముట్టడించును – ఆసమయములో
ఇద్దరితో మరి – పోర నసాధ్యము.

కావున మనము - రిపులకు తెలియని
ప్రదేశమ్మున - కోటనొక్కటి
నిర్మించుకొని - మనవారలను
సురక్షితముగా నందు చేర్చెదము.

అనుచు పలికిన - నందనందనుడు
సాగరుని కడ - స్థలము నడిగెను
పన్నెండు యోజన-నిడుపును గలిగి
అంతే విస్తీర్ణము గల - స్థలములో

విశ్వకర్మకు - పురమాయించెను
అద్భుత పట్టణ - రచన చేయమని -
కృష్ణుని ఆనతి - తలను ధరించి
చక్కని నగరము నెలకొన జేసెను.

వరుణ పురమును - వెక్కిరించునటు
ఇంద్రనగరమును - తలదన్నినటు
అలకాపురిని - ఈసడించినటు
యముని నగరపు జయ పతాక యన.

నింగినంటెడి - ప్రాకారమ్ము
పాతాళమును - మించిన అగడ్త
ద్వారకయన్న - పేరుతొ నగరము
శత్రుల కందక - అయోధ్య యైనది.

గృహములు-పేటలు-అంగడి వీధులు
రచ్చ పట్టులూ - రాజభవనములు
బంగరు-రత్నపు పనులతొ-మెరసెను
మంగళకరముగ - నిలచెను ద్వారక.

సుగంధ ధూపము - దట్టము గా నట
మేఘ మన్నటు - ఎగయుచున్నది
బంగరు కలశమ్ములతో - మేడలు
రెండవ సూర్యుడు-అన్నటు మెరసెను.

దివ్య సుగంధము జల్లే పూవులు -
వాడిపోనివా - విరులన్నియును
పూదోటలతో - జలపక్షులతో
విరిసిన ఆమని - ద్వారక యైనది.

అచ్చటి విప్రుల విశేషమ్ములను
శుకుడు - రాజుకు తెలియబరచెను
బ్రహ్మదేవుడే అచటకు - వచ్చిన
వేదవిదులతో - పలుకగ - జంకును.

నాల్గు ముఖముల - వేదములన్నీ
వల్లించిన - ఆ - విరించి సైతము
వేదప్రసంగము - వారితొ చేసిన
తికమకపడుట - జరిగి తీరును.

వేదవిదులు - ఆ ద్వారక యందు
చేసిన - యజ్ఞపు హోమధూమము
నింగిని - నీలపు రంగుకు మార్చెను
కావున గ్రహములు - కనబడకుండెను.

రాచకులములో - దాతలె - అందరు
యాచకులకు - మరి - కల్పతరువులే
పరస్త్రీ ముఖము - చూడరు వారు
సత్యసంధులు -వీరవతంసులు.

వర్తకశ్రేష్ఠులు - రత్నము లమ్ముచు
రత్నాకరునే మించి పోయిరి
దివ్యరథములు - మంగళకరములు
ఐరావతమును పోలు ఏనుగులు.

వాయుదేవుని - మించిన యట్టి
వడిగల - గుఱ్ఱములున్నవి అచట
పులి మీసములను - మెలి వేయగల
ధైర్యవంతులే భటులందరును.

రిపులందరికది - యమద్వారమై
దుర్భేద్యమయి నిలచెను - ద్వారక
అచటి జనులకు - ఆకలి దప్పులు
లేకుండగను - జేసెను కృష్ణుడు.

స్వయముగ-ఇంద్రుడు-పారిజాతము
దివ్య తరువును - బహూకరించెను -
సుధర్మయనెడి - దేవ సభను - తా
కృష్ణ దేవునికి సమర్పించెను.

మనో వేగముతొ -పరుగిడ గలిగిన
అశ్వమ్ములను వరుణుడు యిచ్చెను
ఆ గుఱ్ఱములు - అతి తెల్లనివి
ఒక చెవి మాత్రము నల్లని రంగు.

అష్టైశ్వర్యము లన్నిటి నచట
ధనపతి - స్వయముగ అమర్చినాడు
లోక పాలకులు - అందరు భక్తిగ
తమ సంపదలను - కృష్ణుని కిడిరి.

వెంటనె - కృష్ణుడు యోగశక్తితో
మథుర వాసులను అందరినపుడు
ద్వారక జేర్చెను - అతి చిత్రముగ
తానొక్కడె - అట-మథురలొ నుండెను.

ఏ ఆయుధమును చేత ధరించక
మత్తేభములా మథురనుండి - తా
కృష్ణుడు వచ్చుట గాంచెను యవనుడు
తికమకపడెను - ఆలోచించెను.

సేనల అలికిడి - వినబడ కుండెను -
రాయబారముకు - వచ్చుచుండెనా
యాచించుటకై - వచ్చుచుండెనా
తన్నెదిరించుట కటుల వచ్చునా!

అంతటిలోన - చేరువ అయిన
కృష్ణుని గాంచి - పోల్చు కొనుచును
నారద మౌని చెప్పిన గుర్తులు
వీనికి సరిగా సరిపడి యున్నవి.

ఆహా కృష్ణుడు - యాదవుడితడే
అనుచు పట్టుకొన ముందుకు వచ్చెను
తప్పించుకొని - కృష్ణుడు పరుగిడె
కాలయవనుడు అనుసరించెను.

పరుగిడు యవనుడు-పలుకు చుండెను
యుద్ధ భిక్షను - కోరి వచ్చితివి
జరాసంధుని - ఓడించితివి
వెన్నుజూపి - మరి - పరుగిడుచుంటివి.

అందక పరుగిడి కృష్ణు డంతట
కొండగుహలో–తా–దూరి పోయెను
"దొరకక ఎటకు పోదువు దొంగా"!
అనుచు యవనుడా–గుహలో దూరెను.

ఆ తన్నుకు – ఆ గుహ – అదరినది
పెద్ద శబ్దము – ఎగసిన దపుడు
నిద్ర లేచెను – దివ్య పురుషుడు
వళ్ళు విరచుకొని – ఆవలించెను.

కటిక చీకటిలో – పెద్ద పాన్పున
ఒక పురుషుడు అట నిద్రలో నుండెను
కాలయవనుడా – పురుషుని గాంచి
పరుషములాడుచు – హేళన జేసెను.

మెల్లగ కళ్ళు తెరచి చూచెను
చిరుకోపమును – రగిల్చినాడు
ఆ కోపములో – అగ్ని పుట్టెను
కాల యవనుని – కాల్చి వేసెను.

"యుద్ధము చేసెడి – ధైర్యము లేక
పోరుకు వెరచి – పారి పోతివి
దొరకని దొంగవు – నీవని – ముందే
నాకు జెప్పెను – నారద మౌని.

అంతటి వీరుడు కాల యవనుడు
క్షణ కాలమ్ము పట్టక ముందే
భస్మరాసియై – నేలను బడెను
అదివిని – విస్మయ మందెను రాజు.

ఇప్పుడెక్కడకు పోదువు నీవు
శాశ్వత నిద్రకు – పంపుదు నిన్ను"–
అనుచుబలముగా మహాపురుషుని
తన్నెనపుడు – కాలయవనుడు.

ఆలకించుచునున్న మహీపతి
శుకయోగీంద్రుని అడిగె – వినయముగ
స్వామీ! ఎవరా దివ్య పురుషుడు
వాని తండ్రి మరి – ఎవ్వరు తెలుపుడు

ఆ – గుహ లోనికి ఎటుల వచ్చెను
అచట నిద్రలో నుండె నెందులకు
కాలయవనుని – కాల్చెడి శక్తి
ఎటుల వచ్చెను – తెలుపుడు అనెను.

॥శ్రీ కృష్ణచరితము॥



# 65 ముచుకుందుడు

శుకయోగీంద్రుడు - ఆరంభించెను
రాజా! వినుము - దివ్య పురుషుడు
ఇక్ష్వాకు వంశము నందు జనించెను
మాంధాతకు-మరి-తనయుడాతడు.

ముచుకుందుడని - దివ్యనామము
దేవతలందర - రక్షకుడాయన
ఆయన రక్షణ పొందిన సురలు
భక్తిగ పలికిరి - ముచుకుందునితో.

స్వామీ! నీవు మా రక్షణకై
ఒంటరివై యిట - నిలచి యుంటివి
ఎంతో కాలము గడిచె పోయెను
నీ రక్షణలో సుఖముగ నుంటిమి.

కానీ స్వామీ! నీ వారందరు
కాలగర్భమున - కలసిపోయిరి
ఏకాకిగ - నిను - కాలము చేసెను
కాలమహిమది - తెలియును గాదా!.

నీవు చేసిన ఘనకార్యమునకు
సంతసించితిమి - ధన్యులమైతిమి
మా సంతృప్తికి - నీకొక వరము
మేము - ప్రేమగా నీయదలచితిమి.

మోక్షము నిచ్చెడి వాడు - శ్రీహరి -
అదివిడచి - మరి - ఏదో వరము
కోరుకోవయా - కారుణ్యాలయ!
అనుచు అడిగిరి - సురలందరును

ఆ మాటలకు సంతసించిన
ముచుకుందుడు - తా - నిద్ర గోరెను
సరియని పలికి సురలు వెడలిరి
నిద్రలొ మునిగెను - ముచుకుందుడు.

దేవదత్త మగు నిద్ర కావున
యోగ నిద్ర యై - నిష్ఠకు నెలవది
కాలయవనుడు - కాలి పోవగా
కన్నుల ముందర - కనబడె - కృష్ణుడు.

జగన్నాయకుడు - జగద్వంద్యుడు
భువన మోహనుడు - దర్శన మిడెను
తెల్ల తామరల పోలిన కన్నులు
వనమాలతొ మరి శోభిలు వక్షము.

చంద్ర బింబమును - పోలు ముఖముతో
మకర కుండల కాంతు లెగయగా
నీల మేఘమును పోలిన దేహము
నింగి యంతటి - విశాల హృదయము.

శ్రీవత్సముతో కలసి - కౌస్తుభము
దివ్య తేజముతొ - వెలుగు నింపగా
మెరిసేవన్నెతొ - పీతాంబరముతొ
నాల్గు భుజములు నెలకొని యుండి.

దివ్య మోహన - రూపము గలిగి
ప్రసన్నమైన-వదనము నందు
చిరునవ్వు - అను - పూవు పూయగా
దర్శనమిడెను - ముచుకుందునకు.

ఆశ్చర్యములో మునిగి పోయెను
అవాక్కుగా - మరి - నిలచి పోయెను
అంతట - ఆతడు - తెలివి తెచ్చుకొని
నమస్కరించి - పలికె భక్తిగా.

"మహానుభావా! ఎవ్వర వీవు
దివ్య తేజముతొ - నిలచి యుంటివి
ఇంద్ర - చంద్రులు - తేజము నందు
నీ ముందసలు - నిలబడ లేరు.

ఎక్కడ వుందువు స్వామీ - నీవు
నా కొరకై - యిటు - వచ్చినాడవా!
కంటక మయమగు - స్థలములందున
నడచి నీవు - మరి - అలసి పోతివా!

దుర్గమమైన ఈ స్థలమునకు
నాకై - నీవు వచ్చినాడవా!
నీశుభ నామము - వివరములన్నీ
వినిపించుమయా - వందనమిదిగో!

నీ పద సేవ - చేయు నర్హత
కలదని - నీవు అనుగ్రహించిన
పాదములంటి - పులకరింతును
పరమదయాళో - పలుకుము స్వామీ!

ఇక్ష్వాకు వంశమున - జన్మించితిని
ముచుకుందునిగా - పిలుతురు నన్ను
మాంధాతకు-నే-తనయుడ నగుదును
సురల మేలుకై - నడుము కట్టితిని.

అలసి పోయి - నే - నిద్రలొ నుండగ
దుష్టుడొకడు - యిట వచ్చి - యిప్పుడే
దురుసు చూపగా - దగ్ధమయ్యెను
అంతట - నీవు - దర్శన మిడితివి"

అటుల పలికిన - ముచుకుందునితో
దివ్య కంఠమున - కృష్ణుడు పలికెను
"రాజా! వినుము - నే ననంతుడను
లెక్కకు అందని పేర్లు నావయా!

నా గుణ - కర్మల - విభూతులన్నీ
లెక్కకు - చిక్కనివయ్యా - వినుము
దనుజుల - దునిమి - భూభారమును
తగ్గించమని - బ్రహ్మ కోరెను.

అంతట - నేను - వసుదేవునికి
తనయుడ నైతిని - వాసుదేవుడను
కంసుని పేరున పుట్టిన యట్టి
కాలనేమిని - అంతము జేసితి.

ఇంకా ఎందరొ - దుష్టులు గలరు
వారందరినీ - నిర్మూలించెద -
నీ కంటి మంటలో - కాలిపోయిన
దుష్టుడాతడు - కాలయవనుడు.

నను ధ్యానించే - భక్తుడవీవు
అనుగ్రహించగ - వచ్చినాడను
నీకు తోచిన వరము కోరుకో -
వరదుడనేను - ఒసగెదనిపుడే".

తన జన్మమది - ధన్యమైనదని
పొంగిపోయెను ముచుకుందుండు
నారాయణుడు అవతరించునని
గర్గుడు చెప్పిన - మాట తలంచెను.

ఆనందముతో - పులకరించెను
నారాయణుని స్తోత్రము జేసెను
"పురాణ పురుషా - వందనమయ్యా!
నిన్ను గాంచితి - జన్మ తరించెను.

మేతకు పోయి - నూతిలొ బడిన
గొఱ్ఱెచందమున - జనులందరును
సంసార బంధముల చిక్కువడెదరు
నిన్నే నమ్మిన - తరించ గలరు.

కాంతా కనకము - దేహవాసనల
రాజ్యభోగముల - తగిలిన మనసుతొ -
మట్టి పాత్రయగు శరీరమ్ముతో
విఱ్ఱవీగి - నే - చరించినాను.

మంగళ మూర్తీ! నిను గనలేక
తుచ్ఛసుఖములే-సుఖమని ఎంచితి -
సమయములోన - సరిదిద్దెదవు
దయామూర్తివి - భక్త సులభుడవు.

మనుజుని మనసు - చిత్రమైనది
ఘోరతపంబును జేసియు - చివరకు
ఇంద్రపదవినో - స్వర్గవాసమో
కోరును గానీ - మోక్షము కోరడు.

ముకుందా! నిను దర్శించితిని
మనస్సులో - నిను - ప్రతిష్ఠించితి
లౌకిక వాసనలన్నీ సమసెను
నీ పదసేవ - అనుగ్రహించుము.

కర్మఫలమును - అనుభవించితిని
ఏ బంధములూ - దరికి రానటు
ననుదరిజేర్చి - ఉద్ధరింపుము
అంతకు మించిన - కోరిక లేదు".

అటుల పలికిన - ముచుకుందునితో
మధురముగా నట పలికె-ముకుందుడు
"రాజా! నీవు పరోపకారివి
ఇంద్రియాలను జయించినావు.

రాజుగ నేలెడి సమయమందున
వేటకు పోయి - జంతుల జంపి
హింసజేసితివి - అది తొలగుటకై
ముందుగ - తపస్సు - చేయగవలెను.

తపస్సుతో - ఆ - పాపము తొలగగ -
బ్రహ్మ వంశమున - జన్మించెదవు -
సత్కర్మలను ఆచరింతువు
చివరకు - నన్ను - చేరుకుందువు".

అటుల పలికిన - హరికి - భక్తిగా
ప్రదక్షిణించి - నమస్కరించెను
గుహలో నుండి - బయటకు వచ్చెను
సూక్ష్మరూపుతో - కనబడె - జీవులు.

కలియుగమింక - సమీపించునని
తెలిసిన వాడై - తపస్సు చేయగ
ఉత్తర దిశలో సాగి - అచ్చట -
నిష్ఠగ - తపమును - ఆచరించెను.

గంధమాదన పర్వతమ్ముపై
కొంతకాలము - తపస్సు చేసెను
నరనారాయణులిద్దరు వసించు
పుణ్యభూమికి - సాగి వెళ్ళెను.

బదరికావనము - పవిత్ర భూమి
నరనారాయణులందు వసింతురు
అచటకుజేరి నిర్మల మనసుతొ
హరిధ్యానములో - నిమగ్నమయ్యెను.

ముచుకుందునికి - దర్శనమిచ్చి
మధురానగరిని చుట్టుముట్టిన
శత్రు సైన్యము - నిర్మూలించి
మథురకు-తిరిగి వచ్చెను-కృష్ణుడు

ధన రాసులను - ద్వారకలోనికి
తరలించమని ఆదేశించి
రామకృష్ణులు - యిద్దరు అపుడు
ద్వారక కేగగ - సిద్ధమవగనే -

మెరుపు దాడిలా. - జరాసంధుడు
అఖండసేనతొ - పోరగ వచ్చెను
ఇరవైమూడు - అక్షౌహిణుల
సేనాబలముతొ - వచ్చెను - పోరుకు.

సేనలు నడచిన - తాకిడి కచటి
నేల కదిలెనా - అనిపించినది
ధూళి -మేఘమై - నింగి కెగసెను
శస్త్రకాంతులవి - మెరుపుల కలిసెను.

రామకృష్ణులు - గ్రహించినారు
పథకము వేసుకు - పరుగు తీసిరి
అట్టహాసముగ - అరుపు లెగయగా
జరాసంధుడు - అనుసరించెను.

పిరికి పందలై - పరుగిడు చుండిరి
భూమ్యాకాశము లందున - మీరు
ఎచట దాగినా - వదలను అనుచు
ఘనసైన్యముతో వెంబడించెను.

అటుల సాగిన - రామకృష్ణులు
ఘనమగు కొండను-గాంచిరి-త్రోవలో -
నిరంతరమ్ము - ఆ గిరిపైన
వర్షము కురియును ఏకధారగా.

ప్రవర్షణమ్ము - అందురు గిరిని
అనువుగ నుండును - ఆ పర్వత మని
రామకృష్ణులు - అందు - దాగిరి
జరాసంధుడు - గిరిని జేరెను.

కొండనంతయు వెదకించగను
అన్నదమ్ముల జాడ తెలియక -
తికమకపడి - మరి - నిర్ణయించెను
కొండను - అగ్నికి - ఆహుతి జేయగ.

కట్టెలు - తరువులు తీసుకువచ్చి
కొండకు పేర్చి - అగ్నిరగిల్చిరి
గిరిపై నున్న - తరువులు కూడా
అఖండమ్ముగా అంటుకొన్నవి.

నింగికి - ఎగసే - ధూమముతోను
వెలుగు నిండిన - మంటలతోను
కొండ అంతటా - మండిపోవగా
ఆనందించెను - జరాసంధుడు.

తెలివిగ - ఎత్తగు కొండను ఎక్కి
లీలగ దూకి - అన్నదమ్ములు
చల్లగ జేరిరి - ద్వారకలోనికి
మంటలు అటులే - మండుచున్నవి.

బలరామకృష్ణులు - అగ్నికి అచటే
దగ్ధమైరి - అని - మదిలో నెంచి
మగధకు - తాను - సేనాబలముతొ
సాగి పోయెను - జరాసంధుడు.

॥శ్రీ కృష్ణచరితము॥



## 66 రుక్మిణి కల్యాణం

ఓ మహారాజా! బ్రహ్మ మాటపై
రైవతుడనెడి - ధరణీధవుడు -
తన కూతురగు - రేవతి దేవిని
బలరామునికి - ఆలిగ నిచ్చెను

ఆ వృత్తాంతము - చెప్పియుంటిని
ఆపై - మంగళ కరమగు గాథ
శ్రీ కృష్ణుడు - తా - రుక్మిణి దేవిని
పరిణయమాడిన - దివ్యగాథ యిది.

ఇంద్రుని గెలిచి - గరుత్మంతుడు
అమృతంబును - తెచ్చినట్టుగా
శిశుపాలాదుల జయించి - కృష్ణుడు
పరిణయ మాడెను - రుక్మిణిదేవిని.

ఆ మాటలకు - రాజు అడిగెను
రాక్షస వివాహ పద్ధతిలోను -
అతివ నెత్తుకొని పోయి - కృష్ణుడు
పెండ్లియాడినటు - జెప్పిరి - మీరు.

స్వయం వరమునకు - వచ్చిన రాజులు
సాల్వుని వంటి - యోధులెందరినొ
ఒకడే - కృష్ణుడు - జయించెనెటుల
ఆవృత్తాంతము - వినగోరితినన.

శుకయోగీంద్రా! విష్ణువు కథలు
మంగళకరము - మనోహరములు
అమృత సోనలు కురిపించునవి
తనివి తీరదు - ఎంత విన్ననూ -

క్రొత్తగ తోచును - వినిన కొలదిని
వినెడి చెవులకవి - ఆభరణమ్ములు
పాపక్షాళనము - చేయును గాథలు
కావున చెప్పుము - కరుణామూర్తీ!

అనగా మౌని - ఆరంభించెను
విదర్భ యందు - వీరుడు అయిన
కుండిన దేశపు - ఏలిక యైన
భీష్మకుండను - రాజోత్తమునకు.



కుమారులైదుగురుండిరి - వారిలో
పెద్దవానిని - రుక్మి యందురు
ఆరవ సంతు - ఆడు బిడ్డయై
రుక్మిణి యనెడి పేరున బరగెను.

లక్ష్మీదేవికి ప్రతిరూపముగా
రుక్మిణి నిలచెను అన్ని విధముల
పాడి పంటలు సౌభాగ్యములతో
వెల్లి విరిసినది - రాజ్యమంతయు.

ఈతి బాధలు - మరిచిరి ప్రజలు
సుఖసౌఖ్యముల బ్రతుకు చుండిరి
సుమ సుకుమారి - రుక్మిణి దేవి
ఆటపాటలతో - ముదము గొలిపెను.

బొమ్మల పెండ్లిని - వేడుకగాను
బాలిక లందర కూర్చి - చేయుచు
వియ్యపు రాలిగ - మర్యాదలను
పొందుచు - కను విందొనర్చ సాగెను.

గుజ్జన గూళ్ళను - విందు భోజనము
వరస పంక్తులలో - కూర్చొన బెట్టి
కమ్మని రుచులతో - ఆరగించుడని
కొసరి - కొసరి-మరి-తినిపించునట.

తనే శ్రద్ధగా - వివిధ లతలకు
స్వయము - పాదులు చేసి - వాటికి
ఆధారముగా - కర్రలు పాతి
పూ బాలికల - పలుకరించును.

రాజ భవనమున - ఊయలలూగుచు
మదిలో - ఊహల - నూపుచుండును
బాలికలతో - మరి - బంతులాడును
చిలుకల కామె - చదువులు నేర్పెను.

నెమలికి - నాట్యము నేర్పు చుండును
నడకల - హంసల - మరపించుచును
ఆనందముగా - ఆ బాలామణి
రాజభవనమున - వెన్నెల నింపును.

సన్నని నడుము - సొగసగు వంపుల
రాజకుమారి - ఆ రమణీమణి
నవయౌవనమున - అడుగు బెట్టెను
మదనుని - బాణము - అని పించినది.

గృహమున అడుగిడు-అతిథుల వల్లను
కృష్ణుని - మోహన రూపము తెలిసి
దానిని మదిలో చిత్రించుకొని
కన్నులు మూయక - వేచి యున్నది.

సుందర రూపము - గుణ శీలములు
అన్నీ విని - విని - ఆ మురారికే
తనువూ - మనసూ - అంకితమనుచు
నిశ్చయించుకొనె - ఆయౌవ్వనవతి.

కృష్ణుని - భర్తగ పొందగ ధన్యత
అని తలంచుచు - పరధ్యానమున
కృష్ణా! అని - తా - పలుకుచుండెడిది
చెలికత్తెలు విని - పరవశింతురు.

అచ్చుట - కృష్ణుడు - అతివ గురించి
అంద చందములు - సౌశీల్యములు
అహర్నిశము - తన తలపు గురించి
ఆలకించి - మరి-మనసు పెంచుకొని.

ఆసుకుమారిని - ఆలిగ పొందగ
ఆనందమది - కలుగుననుకొని
అనువగు సమయము-రావలెననుకొని
అన్నుల మిన్నను-మనసున నిలిపెను.

బంధువులందరు - బాలామణిని
కృష్ణుని కీయగ నిర్ణయించిరి -
కానీ - రుక్మి - రుక్మిణి అన్న
కృష్ణునిపైన - పగపెంచుకొనె.

అతి కర్కశమున-తన నిర్ణయ మది -
శిశుపాలునికి - రుక్మిణినిచ్చి
పెండ్లి చేతునని - నొక్కిచెప్పెను
కృష్ణుని తలంపు - తేవలదనెను.

మూర్ఖుడు-రుక్మికి-మనసు కరుగదని
మిన్నకుండిరి - పెద్దలందరూ
అన్న - యోచన - వినిన రుక్మిణి
అతిదీనముగ - విలపించినది.

దిక్కుతోచక - ధైర్యము తెచ్చుకు
సమ్మిన యట్టి - విప్రునొకనిని
రావించుకొని - ఆయన ముందు
మదిలో కోరిక - విన్న వించెను.

"స్వామీ! నిన్ను తండ్రిగ నెంచెద
నా వివాహము - కృష్ణదేవునితొ
జరుగును అన్న - ఆశ లేదయా!
అన్న మనసు - ఇక మారుట - కల్ల.

శిశుపాలునితో - నావివాహము
నిర్ణయించెను - నాఅగ్రజుడు
కావున నీవు - భక్త బంధువగు
కృష్ణుని కంతా - తెలియజెప్పుము.

అనుచు - అతివ - తా - ఆవేదనతో
ప్రార్థన జేసెను - విప్రోత్తముని
కృష్ణదేవుని - తోడ్కొని రమ్మని
దిక్కుజూపమని - ప్రార్థించినది.

అగ్నిద్యోతనుండను పేరుగల
విప్రోత్తముడు - ధన్యుడననుకొని
శీఘ్రమెసాగి - ద్వారకజేరి
కృష్ణుని జూడగ - అనుమతి కోరెను.

ఎదురు వచ్చెను - ఆప్యాయముగా
అగ్నిద్యోతనుని - పలుకరించెను
సగౌరవముగా -తోడ్కొనిపోయి
బంగరు - ఆసన మిడెను - భక్తిగా.

అతిథికి తగినటు - మర్యాదలను
చేసెను కృష్ణుడు - సంతసపరచెను
ఆనందించిన - అగ్నిద్యోతనుడు
నిండుమనస్సుతొ - దీవన లిడెను.

శీఘ్రమె – చక్కని ఇంతిని పొంది
అంతులేని – సుఖ మందుకోవయా –
నీకల్యాణము – జగత్తుగాంచి
పులకరించును – పుణ్యము తనదని.

ముసిముసినవ్వుల మోహనమూర్తి
అగ్నిద్యోతనుని పదములొత్తుచు
విప్రోత్తమ – నువు – సంతసించుట
నాకానందము – కలిగించునయా!

సుఖసౌఖ్యముల – విప్రులుండిన
రాజ్యము – చల్లగ నుండును స్వామీ!
గోబ్రాహ్మణులను – తృప్తిగ నుంచే –
ధరణీధవునికి – నమస్కరింతును.

సద్గుణయుతుడవు–ఎచటవసింతువు!
ఏమహనీయుని – పాలననుంటివి
శ్రమపడి వచ్చిన కారణమేమి –
నీకోరికది – తీర్తును – అనెను.

అంతట – విప్రుడు – పలికె తీయగా
"స్వామీ! వినుము – విదర్భనేలెడి
భీష్మకుడనెడి – రాజోత్తమునికి
ముద్దుల కూతురు – రుక్మిణి గలదు.

ఆ బాలామణి – నీ పదసేవకు
నిరతము – ప్రార్థన చేయుచున్నది
నాపలుకులవి – ఆమె పలుకులే
అవధరింపుము – నిండు మనసుతో.

ఏ మహనీయుని పదములొత్తిన
త్రిభువనమ్ముల – ఉన్నతులగుదురొ
గుణగానమ్ము పరవశమిడునో
దేహవాసనలు – అంతరించునో.

గాంచిన – కన్నులు సార్థకమగునో –
తలపులు – తనువును నిలపజాలునో –
ఆ పరమాత్ముని – పదముల యందు
నమ్మము – నా మది లగ్నమైనది.

మనసులు హరించు – మంగళమూర్తీ –
"హరి" యని –నిన్ను అందురందుకే
నీవలనే గద – మోహము పుట్టును –
నీ పదసేవలు – మనసు కోరును.

హరిదగు సొత్తును – నక్క కోరినటు
అశిశుపాలుడు – నను – గొనిపోవగ
తలంచుచుండెను – అవివేకముతో
అధముడెరుగడు – నీ మగతనము.

పెదవులు కదలును – నిను కీర్తించగ
కన్నులు విడివడు – నిను గాంచుటకు
పదములు కదలును – నీ మూర్తిని గన
మదిలో నీవే – మంగళ మూర్తీ!

పాపాల గని – శిశుపాలుని గని–
అన్న – రుక్మి – తా పొంగిపోవును
జరాసంధుడు – ఆదిగాగల
అంధులు – వానికి అండదండలు.

అసాధ్యమన్నది - నీకులేదు గద
అతివను - నన్ను ఆదరించుము
అఖండసేనతొ - అందరిముందు
అరి వీరుడవై - ఆలిగ గొనుము.

రాక్షస వివాహ పద్ధతిలోను -
శౌర్యలక్ష్మితో - ననుజేర్చుమయా!
ఇద్దరమొక్కటై - నీ అడుగులలో
నడచెదమయ్యా - కారుణ్యాలయ

అంతఃపురమున నున్న - కాంతను
ఎటుల గ్రహించుట-అని-తలపోయకు
సిగ్గు విడచి - నే - చెప్పుచుంటినని
తప్పుగనన్ను - తలంచవద్దు.

మా ఆచారము - పెండ్లికి - ముందు
ఊరి వెలుపలి - ఆలయంబున
వధువు చేయును - దుర్గా పూజను
అదియగు స్వామీ - నీకవకాశము.

శంక వదలి - ఆ - వంకకు వచ్చి
ననుగొని పొమ్ము నందనందనా -
కాదంటివ - మరి - ఉపేక్షింతువా
వదలెద-తనువు-నిను ధ్యానించుచు.

స్వామీ - యిది - మారుక్మిణి కోరిక
ఆమె పంపిన - సందేశమ్ము -
అందచందములు - గుణశీలములు
వినియే వుందువు - నీవిప్పటికే -

మా పిల్లని - నే - పొగడుచుంటినని -
మదిలో నెంచకు - మంగళమూర్తీ!
పూదీవలకు - సొగసులు నేర్పును
శంఖము చాలదు - ఆమె కంఠముకు

సింహమధ్య - అతిలోకసుందరి
చంద్రరేఖను - మించిన - నుదురు
దొండపండులా - మెరసే పెదవులు
వెన్నెల పూలను - రువ్వేనవ్వులు.

చిలకలు తమ - తల వంచే పలుకులు
అందము లొలికే - చక్కని కురులు
ఆ - కను బొమ్మలు - సుమశరు విల్లు
అన్నుల మిన్నకు - కన్నులు చారెడు.

కలిమికి - రాణి - ఆ జవరాలు
ఆమెకు - నీయెడ - అమిత భక్తి-మరి
నిను కీర్తించెడి సమయములోన
ఆమెకనుల - ముత్యాలు మెరయును.

నీ ధ్యానమున ఆమె రూపము
పరమ యోగులను మించి పోవును
కన్నులు తెరచుట - నిను గాంచుటకే
మూయుట-మరి-నిను ధ్యానించుటకే

నా ఊహలలో నీవు - పురుషుడవు
ప్రకృతి ఆమె - అన్నటులున్నది
ఈడుజోడు మరి - కుదిరెను సరిగా
మీ కల్యాణము జరుగుట - తథ్యము.

మాగురువులపై - అనగ చెప్పితి
మీ కల్యాణము జరిగి తీరును
బలమును జూపి - రిపులహరించి
పెండ్లియాడుము-శుభములు మాకిడు.

విప్రుని పలుకులు - వినిన కృష్ణుడు
మందహాసమున - అతని చేయిగొని
అభిమానముగా - పలికె నిట్టుల
పరవశించెను - అగ్నిద్యోతనుడు.

విప్రోత్తమా! నాకంతయు తెలియును
ఇందువదనకు - నాపై మమత -
ఆమెతలంపు - ఎదలోనున్నది
మదిలో ఆమెను పదిలపరచితి.

రుక్మి ఎంతయు ఇష్టపడడని
తెలియును నాకు - అందుల కొరకు
కట్టెను మథించి అగ్ని తీసినటు
తెచ్చెద - బాలను - రిపులహరించి.

అనుచు వివరములు కృష్ణుడు-తెలిపి
అగ్నిద్యోతనుని వెంటసాగగా
అరదము సిద్ధము చేయగ బలికెను
అతివేగముగ తేరు కదలెను.

రాయబారము - సఫలమైనదని
పరవశించెను - విప్రుని మనసు
చందమామలా వెలిగెను - వదనము
రథము చేరెను విదర్భ నగరము.

పెద్ద కుమారుని మాటపై నట -
పెండ్లి ప్రయత్నము లారంభించిరి -
రాచబాటలు - సందులు గొందులు
శుభ్రపరచిరి - కన్నుల విందుగ.

సుగంధజలములు - చల్లిరి వీధుల
తోరణాలవి - సొగసుగ కట్టిరి
రంగవల్లులు - సింగారించిరి
అగరుధూపములు నిండి పోయినవి.

పెండ్లి శోభతో నగరమంతయు
అగుపించినది - నవ వధువువలె
అలంకారముల - అతివలు - మెరసిరి
మంగళస్వనములు-మిన్ను ముట్టినవి.

రుక్మిణి తండ్రి - భీష్మకు డపుడు -
పితృదేవతల - నర్చన జేసెను
సమారాధనలు - సంతర్పణలు
సంతృప్తిగను - జరిపించెనట.

రాజదంపతులు - వేదవిదులకు
వందనమ్ములిడి - ఆశీస్సులు గొని -
మంగళ జలముల - తమ కుమార్తెకు
మంగళ స్నానము - చేయించుటకై -

ముత్తయిదువులను - కోరగ నంత
సర్వమంగళకు - మంగళ స్నానము
చేయించి - మరి - అలంకరించిరి
కల్యాణ తిలకము - దిద్దిరి నుదుట.

నాల్గు వేదములు - చదివిరి విప్రులు
రక్షాబంధము కట్టిరి - వధువుకు
గ్రహ శాంతులకై - హోమము జేసిరి
శుభము కలుగగా - దీవనలిడిరి.

అఖండసేన అనుసరించగా
బలరాముడు - తా - ముందు నడచెను
తమ్ముని పైన అనురాగముతో
విదర్భ త్రోవలో సాగెను బలములు.

అందరికన్నా - ముందుగ - నటకు
శిశుపాలుడు తన-బలముతొ వచ్చెను
జరాసంధుడు - దంతవక్త్రుడు
సాల్వుడు - విదూరథు-లనుసరించిరి.

మంగళ స్నానము చేసిన మగువ
మనసున - కృష్ణుని ప్రతిష్ఠించుకొని
మనోవేగమున రావలెననుచు
మరి మరి ప్రార్థన చేయుచున్నది.

అట్టహాసముగ - సైన్యసంపదతొ
తనను మించెడి - వీరుడు లేడని
చాటుచున్నటు - శిశుపాలుండు
స్వయంవరమునకు వచ్చె-మిత్రులతొ.

అంతటిలోన శంకమెదలెను
కదిలే ఊహల నాపి వేసెను
అతివ మనస్సున భయము నిండెను
పరిపరి విధముల - యోచన చేసెను.

బలరామ కృష్ణులు భరతము పట్టి
శిశుపాలునికి - కన్య నిడెదమని
ఘోష పెట్టుచు నుండిరి - మిత్రులు
ఎందరెందరో రాజులు వచ్చిరి.

లగ్నము - రేపని - నిర్ణయించిరి
మధుసూదనుడు - రాకపోయెను
వెళ్ళిన యట్టి - వృద్ధ బ్రాహ్మణుడు
తాను - ముందుగా - రావలెను కదా!

శిశుపాలునికీ, ఆహూతులకూ
స్వాగతమిచ్చి - తగు మర్యాదల
విడుదలనుంచెను - భీష్మకుడపుడు
స్వయంవరమునకు వేచియుండిరి.

అసలా విప్రుడు - ద్వారక చేరెన?
చేరియుండును - నాకోరికను -
మురళీధరునికి - చెప్పి యుండును
అయినా - తను - యిట రాలేదు కదా!

రుక్మిణి దేవి కల్యాణము నకు
కృష్ణుడు ఒకడే వెడలె - నని విని
పోరుజరుగునని శంక మెదలగ
బలభద్రుండు బయలుదేరెను.

కన్య - తానుగా - రాయబారము
పంపుట తగదని - తలంచినాడా!
నాతలవ్రాత - ఎటులనున్నదో
సర్వేశ్వర! నను కనికరించుము.

అమ్మల గన్న అమ్మవు నీవు
అహర్నిశము నామదిలో నుండి
అనుగ్రహించి - ఆదుకోవలె
అందుకొనుము - నా విన్నపమ్ములు.

'ఎందుకు తొందర' - అనెడి పలుకులు
లీలగా విని - ముగ్ధ మనోహరి
దోసిలి యెగ్గి - అదరెడి పెదవుల
ఆనందముతో - ప్రార్థన జేసెను.

అగ్నిద్యోతనుడు - ద్వారక జేరెన?
మార్గ మధ్యమున - ఆగి పోయెనా?
అతనిని మించిన - ఆప్తులు - నాకు
దొరకరు - అని నే నమ్మితి గాదా!

ఇన్నాళ్ళకు - నా నోము పంటగా
దర్శన మిడితివి - ధన్యురాలను
ఇంతవరకును - ఉపేక్షించగా -
నా దోషము-మరి-ఏమది-స్వామీ!

అన్న - పట్టును వదలని-మూర్ఖుడు
అచ్యుతుడేమో - రాకపోయెను -
అన్నీ తెలిసిన - సర్వమంగళ
ఆదుకొనగను - ముందుకు రాదు.

కన్నులున్నవి - నీ రూపము గన
కర్ణములున్నవి - నీ నామము - విన
నాలుక యున్నది - నిను కీర్తించగ
తనువు యున్నది - నీ సేవలకు.

మనసు కలత పడి-మగువ యుండెను
భరింప రాని వేదన కలిగెను
పూలపాన్పుయే - భగ్గుమన్నటు
నిలకడ లేని - స్థితిలో నుండగ

నీ గుణ కీర్తన- తాపహరణము
నీ పద సేవకు - కరములున్నవి
నీ కంకితమై - యుంటిని స్వామీ
కారుణ్యాలయ - కనికరించుము.

దివ్య తేజము - వెలుగు పుంజము
విడివడి - కన్నుల ముందర్థ తనకు
శిఖిపించముతో - చిరునగవులతో
కనబడె కృష్ణుడు - పరవశించెను.

కన్యల మనసు - హరించ గలిగే
సుగుణాలగనీ - సుందర రూపా!
అందము-చందము-సౌభాగ్యములకు
నెలవగు లక్ష్మి - వలచె నందుకే

పీతాంబరము - పిల్లనగ్రోవి
వనమాలతొ - తా - మెరసి పోవుచు
కస్తురి తిలకము - సోయగ మొలుకగ
పసిడి గజ్జెలతొ - పరవశమిడెను.

దిక్కుతోచని - దీనురాలను
కబురంపితినని - దోషము నెంచకు
అనుచుండగను - శుభమస్తు అని
దీవన విని - తా - ఉలికి పడినది.

అంతా భ్రమయని - తెలిసి పోయినది
తిరిగి మనస్సున - వేదన నిండెను
పూలపాన్పు పై - మేను వాల్చెను
కన్నుల జారెను - మదిలో మథన

రుక్మిణి స్థితిని - తల్లి గాంచినది
వివరము తెలుపక - నున్నది రుక్మిణి
తెల్లవారుట జరిగి తీరునని
తల్లడిల్లుచు - నున్నది - బాల.

అలంకరించగ - పూలసజ్జలతొ
చెలికత్తెలు - అట - వచ్చి నిలచిరి
కసరి కొట్టిన - అతివను గాంచి
పరిహాసములు ఆడబోయిరి.

వారిని పొమ్మని - గట్టిగ పలికి
బడలిక నిండి - శయ్యను జేరెను
అతివ మనస్సు - తెలియక - వారు
ఒక్కరొక్కరే - వెడలి పోయిరి.

మెల్లగ లేచి - ఆబాలా మణి
బయటకు చూచెను - ప్రకృతి లోన
కృష్ణదేవుని రూపు తోచెను
మనసు కుదుట పడె-ఒక్క నిమిషము.

అంతటిలోన - ఎడమకన్నది
ఎడమ భుజమది-అదిరెను-అతివకు
శుభశకునమని - మదిలో తలచెను
అప్పుడు గాంచెను - అగ్నిద్యోతనుని.

అంగలు వేయుచు -వడివడిగా నట
వచ్చుచునున్న విప్రుని గాంచెను
ఏమి చెప్పునో - ఆతడనుచును
ఆరాటముతో - కదలి పోయినది.

ముహూర్త కాలము గడచినంతనే
మంగళ కరముగ - అగ్ని ద్యోతనుడు
అడుగు పెట్టెను - అంతఃపురమున
"వచ్చెను - కృష్ణుడు - బాలా అనెను.

ఆనందములో తేలి పోయినది
నిలబడలేక విప్రుని పదముల
అంజలి యొగ్గి వ్రాలి పోయినది
కనుల బాష్పముల - కాళ్ళు కడిగినది.

కల్యాణ మస్తని - దీవన లొసగి
తియ్యగ పలికెను - అగ్నిద్యోతనుడు
"తల్లీ! నీగుణ సౌశీల్యములు
తెలిసి-మాధవుడు-ధవుడనగుదుననె.

నన్నెంతగనో - గౌరవించెను
విశేషమైన - కాన్కలొసగెను
చక్రాయుధముతొ - చక్రి వచ్చెను
దిక్పాలకులే - వచ్చిన - నిలవరు.

ఆశిశుపాలుడు - లెక్కకు రాడు
కాంతా! - వినుము - ఆపరమాత్ముడు
అందరి ముందు - నిన్ను గ్రహించి
రాక్షస వివాహమాడును - నిజము.

రుక్మిణి మేను – పులకరించినది
విప్రుని మాటలు – భాగ్యపు మూటలు
బ్రతుకుబాటకు–కాంతి పుంజములు –
వీనుల విందు – కలిగించగను.

కన్నుల నిండుగ – నిండె – కృతజ్ఞత
భక్తి ప్రపత్తుల – పలికెను రుక్మిణి
"భూసురోత్తమా – నా పై దయగొని
వయస్సు మరచి – శ్రమ కోర్చితివి.

దుర్గమమైన – ద్వారక కేగి
నా సందేశము – సుందరమూర్తికి
అందచేసిన – శుభముల రాసివి
నా ప్రాణములు – నిల బెట్టితివి.

బంధు చింతామణీ – భాగ్యశాలివి
ప్రత్యుపకారము – చేయగ చాలని
బాలను–బేలను–మనస్సు నిండుగా
నమస్కరించితి – అనుగ్రహించుము"

అంతట పలికెను – అగ్నిద్యోతనుడు
"అమ్మా – నీకు శుభములు కలుగును
నా అదృష్టము ఫలించి – నాకు
కృష్ణదేవుని – దర్శనమైనది.

మహిత కార్యమును – చేసినయట్టి –
ఘనత దక్కినది – బ్రతుకు ఫలించెను
కోటి జన్మలు – ఎత్తిన గాని
ఇంతటి భాగ్యము – కలుగదు తల్లీ!

లక్ష్మీ దేవివి – మంగళమూర్తివి
నీ సంతోషము – నాప్రతిఫలము"
అనుచు పలికి – తా – శలవు గైకొనె –
ఆనందముతో – పొంగెను – అతివ.

రామకృష్ణులు వచ్చినారని
విని – భీష్మకుడు – స్వాగతమిడెను
చక్కని విడుదుల నుంచెను వారిని
విలువగు కాన్కల నిడెను వారికి.

కృష్ణుడు వచ్చెను అనిన వార్త విని
పురజనులందరు చూడవచ్చిరి
దివ్య మంగళ రూపముగాంచిరి
పులకరించిరి – ధన్యత నందిరి.

ఆనందముతో మనసులు పొంగి
చక్కని జంట అనుచు తలంచిరి
చక్రికి తగును రుక్మిణి అనిరి
బ్రహ్మను పొగడిరి మదిలో వారు.

మా పుణ్యములు ఫలించి – తప్పక
రుక్మిణి కితడే – భర్తగావలె
అని తలపోయుచు – ఆనందించుచు
గృహముల కేగిరి – వచ్చిన వారు.

గౌరీ దేవికి మ్రొక్కవలెనని
ఆ సమయమది వచ్చెననుచును
పురోహితుడట – చెప్పగ నంత
తగు – ఏర్పాటులు చేసిరి అపుడు

మంగళ ధ్వనులు - మిన్ను ముట్టగా
ఆయుధాలతో - భటులు నడువగా
పూజా దినుసులు - పిండివంటలు
ముత్తయిదువులు - తీసుకు నడువగ.

నూత్న వస్త్రములు - పూదండలతొ
సౌభాగ్యమునకు - నెలవు అన్నటు
విప్రకాంతలు - వెంటనడచిరి
రుక్మిణి భాసిలె - లక్ష్మీ దేవిగ.

అలంకారముల పెండ్లి కూతురు
సిగ్గుమొగ్గలవి - జారుచుండగా
చెలికత్తెలట - చతురోక్తులతో
వెంటనడువగా - సాగెను - పూజకు.

నిండుగ - సింగారించిరి - వధువును
పట్టు వస్త్రములు - విరి దండలతో
కర్ణభూషలు - కనులకాటుకతొ
అందము-అతివగ నిలచెను అచట.

బంధుజనము - మరి - పరిచారికలు
వెంట సాగగా - మంగళమూర్తి
మంగళగౌరి - ఆలయమ్మునకు
అర్చన చేయగ చేరుకొన్నది.

శుచియై - రుక్మిణి ఆలయమ్మున
అడుగు పెట్టెను - అమ్మను కొలవగ
పుణ్యాంగనలు భవాని దేవికి
పూజను భక్తిగ ఆరంభించిరి.

శుభ్రజలముతో స్నానము - తొలుత -
ఆపై గంధము - అక్షతలిడిరి
నూత్న వస్త్రములు - ఆభరణమ్ముల
పూలమాలలతొ అలంకరించిరి.

దీపధూప నైవేద్యము లిడిరి
మంగళ హారతులొసగిరి - అంబకు
ఆసమయములో - రుక్మిణి - మదిలో
భక్తి ప్రపత్తుల వేడెను దేవిని.

దయగల తల్లీ -. శంకరు రాణీ
సర్వమంగళవు - శుభముల నెలవు
అభవుని అర్ధాంగిగ - నిలచితివి
అది మది తలచి - ఆశీస్సుల నిడు.

నందనందనుని - భర్తగజేసి
నా బ్రతుకునకు - త్రోవ చూపుము
పురాణ దంపతులైన - మిమ్ములను
బంగరు పూలతొ - పూజించెదను.

నాపై దయగొని - నారాయణుని
నాకు భర్తగా - ప్రసాదించుము
అనుచు మ్రొక్కి-అట-విప్రవనితలకు
కాన్కల నిచ్చి - పూజించినది.

గౌరీ పూజ శ్రద్ధగ చేసుకు
ఆలయమ్మును దాటి వచ్చినది
అందగత్తెలందరి నడుమ
రాజహంసలా నున్నది రుక్మిణి.

ఆబాలామణి మెరపు తీగలా
మెరయుచుండగా - వచ్చిన రాజులు
తేరి చూడగా - శక్యముగాకను
తలలు వంచిరి - కనులు మూసిరి.

అందము - తానే - నడచుచున్నటు
మన్మథబాణము - అన్నటుసాగెను
రెపరెపలాడే - పయ్యెద చెంగు
అర్జుడు-కృష్ణుడు-అన్నటు కదలెను.

వంచిన తలతో - సిగ్గుదొంతరలు
మేలి ముసుగునకు - సొగసులద్దెను
చిన్నగ తలను ఎత్తి చూచినది
ముంగురులను - మరి-సరి చేసినది.

ఆచూపే - ఒక - వాడి బాణమై
మగతనమునకు - సవాలు యైనది
ధైర్యముజార్చి - భయము రగిల్చెను
ధరణీ ధవులను - హడలగొట్టెను.

మెల్ల మెల్లగా సాగుచు - నతివ
బంగరు తేరున - నీలిమేఘమన
నిలచిన - కృష్ణుని - తిలకించినది
పులకించినది - పరవశించినది.

"నా కోరికది - సఫలమైనది
నాపూజలవి - ఫలించెనేటికి
సర్వమంగళకు - నాపై నిజముగ
దయగలిగినది - ధన్యురాలను.

కోరిన పెనిమిటి - కృష్ణుడు - అదుగో-
పురుషోత్తముడు - రథమున నుండెను
వేదమ్ములకే అందని వాడు
అందుకొనుటకై వచ్చెను - నన్ను".

తొందరగా - మరి - అడుగు లేసెను
నేల వదలినటు - పడెను - అడుగులవి
జలదరించెను - మేనంతయును
తేలికగా - తను - తేలి పోయెను.

ఆనంద బాష్పములు కనుల నిండెను
పులకరింతతో అడుగు లేయగా
కరకంకణములు - సవ్వడి చేసెను
ఆనందమది చెంపల పూసెను.

అడుగులు-ఎటులో-రథము చెంతకు
తనువును - బలముగ నడిపించినవి
లేతనవ్వు - తా - నందించినది
చేయందించి - కృష్ణుడుగైకొనె.

వెంటనె - రథమును తోలె - సారథి
నేలనంటక - సాగెను రథము
శరత్కాల - మేఘమ్ముల పోలి
పరుగెత్తినవి - గుఱ్ఱములపుడు.

రెప్పపాటుతో - జరిగిన దంతయు -
కనులు విప్పి మరి చూచు వరకును
జరాసంధునికి విస్మయమాయెను
శరవేగముతో రథము సాగెను.

దిక్కుతోచక బిక్క మొగముల
చూచు చుండిరి - శిశుపాలాదులు
అపార సేనతొ బలభద్రుండు
అనుసరించెను - కృష్ణుని రథమును.

కృష్ణుని రథము - ద్వారకవైపు
సాగుచున్నది - వాయు వేగమున
జరాసంధుడు - సాల్వుడు - వీరులు
అవమానముతో - తలలు వంచిరి.

కృష్ణుని అటుల - నిరాటంకముగ
పోనీ వలదని - తలంచినారు
రుక్మి - పట్టుదల - వారికితోడై
పగసాధించగ - నిలబడినారు.

గొల్లలు-మన-పరువంతయు నిపుడు
రుక్మిణితోను - అపహరించిరి
వారిని - అటుల - వదల కూడదని
ధైర్యము చెప్పుకు - బయలు దేరిరి.

తమ సైన్యమును - పురికొల్పగను
యదువీరులపై శరములు వదలిరి
తిరిగి బదులుగ యదుసేనలవి
శరవర్షము - కురిపించసాగెను.

యుద్ధము గాంచి భీతిలు బాలకు
ధైర్యము చెప్పెను కృష్ణుడంతట
"బలరాముడును - యదుసేనలును
రిపుసేనలను - కాలరాయును.

విజయలక్ష్మిని - నీకు తోడుగా
తెచ్చెదరందుకు - సందియమేల"
అనుచు - మృదువుగా చెక్కిలి మీటి
సుందర-వదనకు-ధైర్యము గొలిపెను.

యదువీరులలో - ఒక్కొక వీరుడు
వదలెడి శరములు - గురితప్పకను
రిపుల శిరముల - నేలకు రాల్చెను
రక్తపుటేరది - ప్రవహించినది.

రథముల విరిగెను - దంతులు వొరిగెను
నేలకూలినవి - అశ్వము లెన్నో
వీరులెందరో - నేలను బడిరి
అఖండసేన - పలుచబడినది.

కార్చిచ్చు - చల్లబడి నట్టుగ తోచెను
జడివాన - వెలిసిన చందమాయెను
శిశుపాలుడట - చిన్న బోయెను
ప్రాణమ్ములతో - నిలచె దీనముగ.

జరాసంధుడు మొదలగు యోధులు
ఒక్కరొక్కరే - అతనిని చేరిరి
ఊరడించుచు - ఊపిరి పోయగ
ఘన ప్రయత్నము చేసిరప్పుడు.

ఓ శిశుపాలా! బ్రతికి యుంటివి
అంతేచాలు - సంతోషమది
భార్య అంటివా - దేవుడెరుగును
పెండ్లి జరుగుటకు-బ్రతికి యుండవలె.

అటులా రాజులు - ఊరడించిరి -
అందరిలోన - పెద్దవాడగు
జరాసంధుడు-ముఖమును-తుడిచి
వేదాంత బోధను - చేసెనప్పుడు.

ఈ సమయములో-కృష్ణుని-మనము
తేరి చూడగా - అసాధ్యమైనది
త్రినేత్రుడయినా - జయించలేడు
అంతటి శక్తి - కాలమహిమది.

స్నేహితుడా! విను - నామాటలను
బ్రహ్మరాతను దాటగ లేము
అస్వతంత్రులు దేహధారులు
ఆడించెడిది - ఆ - పరమాత్మ -

మనసు తిప్పుకో - మథన మరిచి పో!
గొల్ల పిల్లడు అపహరించిన
పిల్లకోసమై - వంత నొందకు
అంతకు మించిన - అతివ దొరకదా!

నా సంగతి మరి - తెలియును నీకు
పదిహేడు తడవలు-యుద్ధము జేసితి
అన్నిసారులూ - కృష్ణుని చేతిలొ
ఓడిపోతిని - కాలమహిమది.

అనుచు మెల్లగా - చెప్పి వెడలెను
జరిగిన దానికి - సిగ్గు చెందుచు
జారుకొనిరి - అట - మిత్రులందరూ
శిశుపాలుడును - సాగి పోయెను.

బలరాముడు నను - బంధించాడు
కృష్ణుడు - దయగొని విడిపించాడు
పదునెనిమిదవ - పోరునందున
కృష్ణుడె - పరుగిడె పిరికి పందలా -

జరిగిన దానికి తలవంచుకొని
అవమానమని - తలంచుకొనుచు
రుక్మి మాత్రము - వెంబడించెను
ఒక అక్షౌహిణి సేన - నడచెను.

పరాక్రమున విజృంభించి
యాదవ సేనల - జయించినాను
కావున రాజా! జయాపజయముల -
మోద - ఖేదముల తావీయకుము.

రథము వేగముగ తోలగజెప్పెను
సారథి నెంతో తొందర జేసెను
నల్ల గొల్లనికి - నా ప్రతాపము
చూపెదనిపుడే - అనుచు అరచెను.

మనమందర మదృష్టవంతులము
చక్రాయుధము - మీదపడకను
రక్షించినది - బ్రతికి పోతిమి
యాదవులకివి - మంచి రోజులు.

నా శౌర్యముతో - వానిని జయించి
రుక్మిణి నిపుడే - విడిపించెదను
నా స్నేహితుడగు - శిశుపాలునికి
ఆలిగ చేసెద - ననుచు పలికెను.

రుక్మి రథమది వేగము పెరిగి
కృష్ణుని రథమును సమీపించెను
అంతట – రుక్మి – దుర్భాషలతో
కృష్ణుని – నింద జేయ దొడంగెను.

"వెన్న దొంగ! నిను ఎటు పోనిత్తును"
అనుచు–శరములు–మూడు వదలెను
అంతట పలికెను – కృష్ణుని గాంచి
తారతమ్యములు – ఎరుగవు అనెను.

"మాసరివాడవు కావు – ధూర్తుడా!
మా పాపను – నువ్వపహరింతువా!
కులమా–గుణమా–రూపసంపదా –
ఏమున్నది – నీ – మిడిసి పాటిది.

పుట్టుకెక్కడో – పెరుగుట ఎక్కడొ
నడవడి గురించి – చెప్పెడి దెవ్వడు
మాన మర్యాదలు – లేని వాడవు
మాయలేక – నువు – మనిషివి గావు.

గుణహీనుడవు – రాజువు కావు
వావి – వరుసలు – లేని వాడవు
పిల్లను విడిచి – పరుగిడి పొమ్ము
లేదా – గర్వము దించెద నీకు –"

అనుచు పలికెడి – వదరు బోతుతో
తిరిగి పలికెను కృష్ణుడు అపుడు
"అన్నీ అంటివ? మిగుల్చుకొంటివ
మూర్ఖుడ వీవు – మనసు నెరుగవు.

మనస్సు లేని – మనువును జేసి
బాల – గొంతుక – కోయదలచితివి
రాక్షస వివాహ పద్ధతిలోను
వీరుడనై – గొని పోవుచుంటిని.

శక్తియున్నచో నన్నెదరించి
నీ చెల్లెలిని – తీసుకు పొమ్ము
రాచ పౌరుషము తెలియ జేయుము
గొల్ల తనముపై ఘనత చూపుము.

హద్దు మీరి – నువు – వదరకు మింక
వేడినీళ్ళకు – యిళ్ళు కాలవు"
అనుచు – కృష్ణుడు ఒక్క శరమున
రుక్మి – విల్లును త్రుంచెను – నడిమికి.

ఆరు శరములు విడచెను తిరిగి
ఎనిమిది శరముల గొట్టె నశ్వముల
రెండు శరముల – గొట్టె సారథిని
మూడు శరముల – టెక్కెము గూల్చెను.

మరి యొక విల్లు – తీసుకు – రుక్మి
సంధించుటకు – ఎత్తి నంతనే
తిరిగి కృష్ణుడు – త్రుంచెను దానిని
అటులే కృష్ణుడు–ధనుసుల త్రుంచెను.

విసిగి పోయిన – రుక్మి అంతట
ఘనమగు కత్తిని చేత ధరించి
తెగించి కృష్ణుని రథమున దూకెను
ఒడుపుగ కృష్ణుడు తప్పించుకొని.

రుక్మి ఖడ్గమును - ముక్కలు జేసి
వాని చేతులు - బిగించి పట్టి
కత్తినెత్తెను - తల నరకుటకు
అంతట రుక్మిణి అడ్డుపడినది.

ఒక్కసారిగా కృష్ణుని పదముల
ప్రార్థన జేయుచు వ్రాలి పోయినది
"స్వామీ! దయగొని - నా అగ్రజుని
నన్ను జూచి-మరి-మన్నించుమయా!

అన్న - తప్పిదము జేసెను - నిజమే
పురుషోత్తముడు - అల్లుడయ్యేనని
పొంగిపోయెడి - తల్లిదండ్రులకు
పుత్ర శోకము - కలుగనీయకు.

అనుచు రుక్మిణి కనుల బాష్పముల
కరుణా మూర్తి - పదములు కడిగెను -
వెన్న పూసలా - వెన్నుని మనసు
కరగి పోయినది - క్షమించినాడు.

తలకట్టు - మీసములు తీసి అతనిని
విరూపిగాను - చేసి వదలెను
పెండ్లి ముస్తాబు బావగారి కని
గుర్తువుండు నటు చేసెను కృష్ణుడు.

రుక్మి సేనలను - పరుగిడ జేసి
యదు సేనతొ - బలభద్రుడు వచ్చెను
మాటపెగలక - నిలబడి యున్న
రుక్మిని గాంచి పలికెనచ్చట.

"కృష్ణా! నీవు ఏమి చేతువో
తెలియ దెవ్వరికి - వివరముగాను
తల గోయుటతో సమానమే గద
తలపై జుట్టును తెగ గోయుటది.

రాకుమారునికి అంతకు మించిన
అవమానమ్ము ఇలపై నుండదు"
అంతట - మరదలి వంక జూచుచు
పలికె నప్పుడు - బలభద్రుండు.

"అమ్మా నీవు వంత నొందకు
రుక్మి చేసిన దుష్కర్మలకు
ఫలితము-తాను-అనుభవించెను
కర్మ ఫలములు - జీవికి తప్పవు.

ఈశ్వరు మాయ - జీవులందరిని
మోహా - ద్వేషముల దాటనీయదు
ఆత్మకు మాత్రము అంటవు అవ్వి
వివేకముతో తెలియుము నీవు.

బలరాముడటు అనునయించగా
శోకము తగ్గెను రుక్మిణి దేవికి
రుక్మి మాత్రము మూర్ఖత్వముతో
కృష్ణుని గెలిచే - యోచన నుండెను.

కృష్ణుని - గెలువక - కుండిన నగరము
తిరిగి రానని భీష్మించుకొని
దగ్గరలో గల ప్రదేశమ్మున
నివసించగను - నిర్ణయించుకొనె.

ఆ విధముగను - పురుషోత్తముడు
రాజ లోకమును - జయించి - తాను
బంధు మిత్రులు సంతసించగ
భీష్మక సుతను - గ్రహించినాడు.

పెండ్లి శోభతో ద్వారక యంతయు
కళకళలాడెను - కనుల పండువగ
ప్రతి గృహమునట పెండ్లి వేడుకగ
అలంకరించిరి - ఆనందముగా -

మామిడాకుల - తోరణాలతో
అగరు ధూపముల - పరిమళాలతో
రంగురంగుల - దీప కాంతులతొ
నేత్ర పర్వమై - నిలచెను ద్వారక.

రంగవల్లుల - సోయగాలతో
ధ్వజ పతాకలు - రెపరెపలాడగ
కర్పూర దీపములు - చాందినీలతో
అమరావతినే - మించెను ద్వారక.

మంగళ వాద్యపు సవ్వడు లెగయగ
పూలవానలు తరువులు కురియ
విరిసిన - ఆమని-అన్నటు నగరము
కన్నులు తెరచి - చూచు చున్నది.

బలరాముడును - రేవతి దేవి
వచ్చిన వారికి - విడుదులు మాపి
సత్కారములు చేయుచుండిరి
పెండ్లి సందడి - నిండి పోయినది.

భూదేవంతటి పీట వేసిరి
నింగి యంతటి పందిరేసిరి
రుక్మిణి - కృష్ణుల - వివాహమంటే
జగత్తుకే - కల్యాణము - అనిరి.

యాదవ పురోహితుడు - గర్గుడు
ఉచితాసనమున - ఆసీనుడయె
మంగళ స్నానము నాచరించుకొని
మంగళమూర్తి కృష్ణుడు కూర్చొనె.

పీతాంబరము - మెరయుచుండగ
మందహాసము వెలయుచుండగా
నందనందనుడు - పెండ్లి కుమారుడు
పెండ్లిపీట పై కూర్చొని నాడు.

సర్వమంగళ - రుక్మిణి దేవికి
సర్వా లంకారమ్ములు జేసి -
రేవతి దేవి - తీసుకువచ్చి
కృష్ణుని ప్రక్కన - కూర్చొన బెట్టెను.

సిగ్గుమొగ్గలై - కన్యవున్నను
తలవంచుకొని - కూర్చొని యున్నను
విజయలక్ష్మి - తా - రుక్మిణి ధైర్యము
ముత్తయిదువులకు - చెప్పుచున్నది.

వివాహ విధిని - యథావిధిగను
గర్గుడు - అచట చేయించుచును
సర్వమంగళకు - మంగళ సూత్రము
మంగళమూర్తిచె - ధరింపజేసెను.

మంగళ ధ్వనులు - మిన్నుముట్టెను
అశీస్సులను ఒసగిరి - పెద్దలు
వధూవరులు - అతి - భక్తి మీరగా
గురువుల - ఆశీస్సులను గ్రహించిరి.

ఆనందముతో - వసంతాలతో
బంతులాటతో - వేడుకలన్నీ
ముదముగ జరిగి - కల్యాణమ్ము
లోకోత్తరముగ జరిగిన దపుడు.

ఆహూతులకు విందొనర్చిరి
విలువగు కానుకలొసగిరి ప్రియముగ
కల్యాణజంటను కన్నుల నిండుగ
చూచిరి - జనులు - మురిసిపోయిరి.

పెండ్లంటేనే - కృష్ణుని పెండ్లి
అనుచు - నందరు మురిసి పోయిరి
రుక్మిణీ కృష్ణుల కల్యాణమ్ము
జగత్తుకే - కల్యాణమైనది.

॥శ్రీ కృష్ణచరితము॥



# ఉత్తరార్థము

## 1 ప్రద్యుమ్న కుమార చరిత్ర

ప్రాయోపవేశ - దీక్షలోనున్న
రాజు - అంతట శుకయోగీంద్రుని
లీలామృతమును - అందించమని
భక్తిగ నడుగగ - మౌని చెప్పెను.

ప్రద్యుమ్నుడని - పేరు బెట్టిరి
నారదుడంతట - బాలుని వివరము
శంబరాసురుని - చెవిలో వేసెను
నీ శత్రువని - నొక్కి చెప్పెను.

ఫాలనేత్రుని - అగ్ని కీలల
భస్మమైన - ఆ - సుమశరుడంతట
దేహధారియై - జన్మించుటకు
శ్రీహరి తేజములోన - కలిసెను.

మాయలమారి - శంబరాసురుడు
అదృశ్యముగా - పురిటి పాపను
అపహరించి - అట - కడలిలొ వేసెను
సంతోషముతో - గృహమున కేగెను.

ఆదిలక్ష్మియు - నారాయణుడు
అన్నటు - రుక్మిణీ - కృష్ణులుండగ
వారిరువురకు - శుభలక్షణుడు
మన్మథుడపుడు - ఉద్భవించెను.

సంద్రమునందొక ఘనమగు చేప
శిశువును మ్రింగెను - వలలో పడెను
జాలరులంత - తమ ఏలికయైన
శంబరాసురుని కిచ్చిరి చేపను.

ఘనమీనమును - గాంచిన అసురుడు
రుచిగా వండగ - ఆనతిచ్చెను
వంటశాలలో - చేపను కోసిరి
రుచిగా వండగ - సిద్ధ మాయిరి.

చేప కడుపులో శిశువును గాంచిరి
ఆశ్చర్యములో మునిగి పోయిరి
వంటశాలకు అధికారిణి యగు
మాయావతికి ఇచ్చిరి - శిశువును.

అమాయావతి - రతీదేవియే -
పేరుమార్చుకొని - శంబరునింట
వంటశాలలో - కొలువు చేయుచూ
కాలము గడుపుచునున్నది ఆమె.

తన నాథుడగు - మన్మథుడెచటో
తప్పక పుట్టి - తనకు లభించును
అన్న - ఆశతో - నున్నది ఆమె
పాతివ్రత్యమున - ఎన్నిక ఆమె.

మురిపెములొలికే - ముద్దు బాలుని
అందచందములు - మైమరపించెను
అంతటిలోన - నారద మహర్షి
అచటకు వచ్చి-విషయము చెప్పెను.

శంబరాసురుడు చేసిన పనిని
తెలియ జెప్పెను - మాయావతికి
అంతట ఆమె - యజమానిని గని
తనకు - పెంచుకొన-బాలునీయమనె.

బాలుని గొనమని - అసురుడు చెప్పగ
మాయావతి మరి - పొంగి పోయినది
ఎంతో శ్రద్ధగ - పెంచెను బాలుని
పతిని పెంచిన - సతి-ఇల-రతియే.

చక్కగ పెరిగి - యవ్వన దశలో
అడుగు బెట్టెను - ఆ సుకుమారుడు
ఆతని అందము - అందగత్తెలకు
మత్తెక్కించి - మనసు హరించెను.

మన్మథుడనగా - అసమాన్యుడుగద
ఆతని - విరిశర - నైపుణ్యమునకు
సగ మేనిచ్చెను - శివుడు - పార్వతికి
చతురాననుడు - వాణిని వరించె.

యౌవన శోభతొ - కన్నుల ముందర
తిరిగెడి యువకుని - గాంచిన వనిత
మాయావతి-తను-మనసు-పడినది
విరహవేదన - కన్నుల నిండెను.

కరము గ్రహించి - కౌగలించుకొన -
దూరము జరిగి - యువకుడు పలికెను
"అమ్మవు నీవు - హద్దు మీరుట
నీ శీలమునకు - కళంకమగును.

ధర్మ దూరమగు చేష్టలు - తప్పని"
ప్రద్యుమ్నుడట - చెప్పుచుండగా
నిగ్రహించుకొని - పలికెను ఆమె
వివరములన్నీ వినిపించినది.

నాథా! నీవు మన్మథుడవయా!
రుక్మిణి – కృష్ణుల తనయుడవైతివి
పురిటి పాపగా – నీవున్నపుడు
శంబరాసురుడు – అపహరించె–నిను.

అనుచు వివరములు వినిపించినది
అంతట పలికెను – కోపముతోను
"నీవిప్పుడు – ఆ – శంబరాసురుని
అంతము జేయగ–బయలు దేరుము.

దుష్టుడు వాడు – అతి మాయావి
మాయతొ – వానిని జయించవలెను
కావున నీకు – శత్రుమాయను
హరింపజేసే – విద్యనేర్పెదను".

అనుచు పలికి–ఆ–ప్రద్యుమ్ననకు
తగిన శక్తిని సమకూర్చినది
తల్లిని సంతస పరచగ కోరెను
ఆమె దుఃఖమును – తొలగించమనె.

వెంటనె – వీరుడు బయలు దేరెను
కవచ – కార్ముక – ఖడ్గమ్ములు గొని
శంబరాసురుని – పోరుకు రమ్మని
ఉత్సాహముగా – ఆహ్వానించెను.

"పిరికి పందవై – బాలుని – నన్ను
కడలిలోన – నువు పారవైచితివి
నీ పాలిటి – యమరాజును – నేనై
రణ సంద్రమున – ముంచెద నిన్ను".

ఎదురుగ నిలబడి పోరుకు రాక
మాయా యుద్ధము – అసురుడు జేసెను
కనబడకుండా – కార్ముకమ్ములు
వదలసాగెను – ప్రద్యుమ్నునిపై.

అంతట – వీరుడు – మంత్రశక్తితో
మాయను తృంచి – విడచెను శరములు
అనేక రూపుల – శంబరాసురుడు
తనువు తెగించి – యుద్ధము జేసెను.

అన్ని విద్యలూ – అణగారినవి
కంటికగబడె – శంబరాసురుడు
మృగరాజువలె – ప్రద్యుమ్నుడట
అసురునిపై బడి–నరకెను–శిరమును.

అంతట – సురలు సంతసించిరి
అసురుని బాధ – అంతమైనదని
ఆనందముతో – పూలవానను
కురిపించిరి–ఆ–శుభ సమయములో.

అసురుని జంపి – విజయము నంది
వచ్చిన భర్తకు – హారతులిచ్చెను
ఆనందముగా వారిరువురును
రుక్మిణి దేవి గృహమును జేరిరి.

అందచందముల – కృష్ణుని పోలి
కన్నుల ముందర – నిలచిన పురుషుని
అంతఃపురమున కాంతలు గాంచి
కృష్ణుడు వచ్చెను – అని తలంచిరి.

అణుకువ నిండి - ఆ స్త్రీజనము
మూలమూలలకు - తొలగి నిలచిరి
కొందరు మాత్రము కృష్ణుడు కాదని
సందేహమును - తెలియబరచిరి.

తర్కించుకొని నిర్ణయించిరి
ఆతడు - కృష్ణుడు కాదని తెలిసిరి
అంతటిలోన - రుక్మిణి వచ్చెను
ప్రద్యుమ్నుని గని-మురిసి పోయెను.

అందచందములు - రూపురేఖలు
తన నాథునికి తగియున్న వని
తన-కుమారుడా-అని తలంచినది
అంతటిలోన - దుఃఖము ఎగసెను.

పురిటి పాపను - అసురుడు హరించి
కడుపుతీపిని - దూరము చేసెను
దురదృష్టమది - నిండిన - తనకు
ఆనందమది కరువై పోయెను.

తిరిగి చూడగా - అన్ని విధములా
కృష్ణుని పోలి వుండెను అతడు
నడకతీరుయు నాథుని దనుకొనె
మాతృభావము - ఉబుకు చున్నది.

మనసు మాత్రము-తనకుమారుడని
నొక్కి చెప్పినటు - తోచుచున్నది
ఆనందబాష్పములు కనులు నిండెను
కుమారా - యని - పిలువ దలంచెను.

ఆ ప్రయత్నము - విరమించినది
తోటి పడచులు - గేలిచేతురని
తటపటలాడుచు - నిలచి యున్నది
అంతటిలోన - కృష్ణుడు వచ్చెను.

ప్రద్యుమ్నుడట వచ్చెనని - విని
బలరామునితో - బంధుజనముతో
కృష్ణుడు వచ్చెను - మందిరమ్మునకు
అన్నీ తెలిసియు - మిన్న కుండెను.

అంతటిలోన నారద మహర్షి
మందిరమ్మునకు - వచ్చి - వారికి
జరిగిన దంతా తెలియబరచెను
ఆనందముతో - పొంగిపోయిరి

అసురుని చేతిలో - అంతమైనటు
తలచిన బాలుడు - బ్రతికి యుండెను
దైవవశమున - తిరిగి - బాలుని
చూచితి మనుచు సంబరపడిరి.

దేవకిదేవి - వసుదేవుడును
మనుమని-మరియు-మనుమరాలిని
గుండెకు జేర్చుకు పులకరించిరి
ఆనందముతో పొంగిపోయిరి.

బలరాముడు-తన-కుమారునకును-
కోడలికి - అట - విలువగు వలువలు
భూషణాదులు - యిచ్చెను ప్రియముగ
ప్రేమాదరణలు పంచి పెట్టెను.

అంతటిలోన ఒక్కమారుగా
ఆనందమది - పొంగిపోవగా
రుక్మిణి - కృష్ణులు - యిద్దరొక్కపరి
తమకుమారుని - కౌగలించిరి.

రుక్మిణిదేవి కోడలితో నవె -
నీ తపస్సది ఫలించెనమ్మా!
మా నోములు-మరి-ఫలించినాయి
నా తనయుని-నువు-చూపించితివి.

అనుచు-ప్రేమగా-కురులు దిద్దెను
తిరిగి-తనయుని-మరిమరి ముద్దిడి
ఎన్ని కష్టములు కలిగెనోయని
కంటనీటితో - చేరదీస్తినది.

ద్వారకవాసులు - బంధుమిత్రులు
విషయము తెలిసి - సంతసించిరి
సుందర స్త్రీలు - యౌవన వతులు
ప్రద్యుమ్నుని - గని చలించినారు.

నారాయణుని - తనయుడాతడు
మన్మథుడే - మరి - తిరిగి బుట్టెను
అందమంతయు - మూర్తిగ నిలచెను
అతనిని గాంచి - పులకరించిరి.

అనుచు - తియ్యగా - శుకమహర్షి
పరీక్షిత్తునకు - తెలియజెప్పెను
ఆపై తిరిగి - శ్రీహరి గాథను
వీనుల విందుగ చెప్పదొడంగెను!



॥శ్రీ కృష్ణచరితము॥

## 2 శమంతకోపాఖ్యానము

రాజా! వినుము దివ్యగాథ యని -
శుకయోగీంద్రుడు ఆరంభించెను
"సత్రాజిత్తను ధరణీధవుడు
కృష్ణునిపైన - నిందవేసెను.

ఆపై - ఆతడు-తప్పు తెలుసు కొని
అవమానముతో - కృంగిపోయి-తన
కూతురు - సాత్రాజితిని-ముదముగ
యదుకిశోరునికి - సమర్పించెను.

ఆ గాథంతయు - సవిస్తరముగా
తెలియబరచమని - రాజు కోరగా
శుకయోగీంద్రుడు - తియ్యగ జెప్పెను
పరవశమ్ముతో - వినెనా రాజు.

సత్రాజిత్తు - సూర్యభక్తుడు
సూర్యదేవుని మెప్పించగను
శమంతకంబను అమోఘ మణిని
దివాకరుడు - ఆ - రాజు కిచ్చెను.

మణిని ధరించి - సత్రాజిత్తు
రాజ్యమునకును - వచ్చుచుండగా
రెండవ సూర్యుడు-అన్నటు వెలుగులు
దూరము నుండే కనిపించినవి.

ఆశ్చర్యముతో - ద్వారక వాసులు
కృష్ణుని జేరి - నమస్కరించిరి
స్వామీ - యిటకు - నారాయణుడో
సృష్టికర్తయో - నిను - గన వచ్చెను.

దిక్కుల వెలిగే - దివ్య కాంతితో
ఆమూర్తి - యిటు వచ్చుచుండెను
అనుచు చెప్పగా - కృష్ణుడు నవ్వి
వచ్చెడి వాడు - సత్రాజిత్తనె.

వారందరును - ఆశ్చర్యముతో
సత్రాజిత్తును - మణితో గాంచిరి
అంతట ఆతడు గృహమును జేరి
మణికి పూజలు శ్రద్ధగ జేసెను.

వేదమంత్రముల - శాస్త్రోక్తముగా
మణిని గృహమున ప్రతిష్ఠ చేసి
నిత్యము - దానికి పూజచేయుచు
ఆనందముగా - గడపసాగెను.

దివ్యమణి - అది - బంగారపు గని
రోజున కెనిమిది బారువులంత
బంగారమును ప్రసాదించును
సుఖశాంతులతో రాజ్యము నుంచును.

మణి మహాత్త్వము తెలిసిన కృష్ణుడు
యాదవరాజున కిమ్మని - తాను
సత్రాజిత్తుకు సూచన జేసెను
దానికి - ఆతడు - నిరాకరించెను.

బంగారమ్మును - నిత్యము ఇచ్చే
మణినిచ్చుటకు - మనసు రాకను
ధనకాంక్షకు - తా - లొంగిన వాడై
మణినీయనని - ప్రత్యుత్తరమిడె.

అటుల - కాలము - జరుగుచుండగా
సత్రాజిత్తుకు - తమ్ముడు అయిన
ప్రసేనజిత్తు - మణిని ధరించి
వేటాడగను - అడవికేగెను.

ఆతని మెడలో-మెరసే మణి-యది
మాంసఖండమని-భ్రమించి-వనమున
సింగము ఒకటి - వానిని జంపి
మణిని - గ్రహించి - పోవుచుండగా.

జాంబవంతుడను - భల్లూకమ్ము
దివ్య ప్రభలతో - వెలిగే - మణి - గని
సింగమ్మును - అట - అంతము జేసి
మణిని గ్రహించి - గుహను జేరుకొని.

గుహలోనున్న - తన బాలిక యగు
జాంబవతికి - ఆ - మణి నొసంగెను
అచ్చట గృహమున - మణి - కనబడక
సత్రాజిత్తు - కలవరపడెను.

తమ్ముడు యింకా - రాకపోవగా
తన - తమ్ముని - శ్రీకృష్ణుడు జంపి
మణిగ్రహించెనని - నిందవేసెను
మర్యాదలు - ఆ - గొల్లలెరుగరనె.

ఆ మాట యది - కృష్ణ దేవునికి
ఈటెపోటు లా - తగిలె - మనస్సున
ఘోరమైన - అపవాదుకుతాను
మదిలో - ఎంతో - పరితపించెను.

వెంటనె - కృష్ణుడు బయలు దేరెను
వాస్తవమ్మును వెలికి తీయగా -
ప్రసేను డేగిన - మార్గము - తాను
చారులవల్లను - తెలుసుకు-సాగెను.

కొంతదూరము ప్రయాణించగ -
అసువులు లేని - గుఱ్ఱము కనబడె
అటుపై - కొంత - దూరము సాగి
ప్రసేనజిత్తుని - కళేబరముగనె.

అటుపై అచట - చచ్చిన సింగము
ఆపైనంత - పెద్దఅడుగులు
కృష్ణుడుగాంచి - అడుగుల వెంబడి
నడువగ-నవి యొక-గుహను జేర్చెను.

తనతో - వచ్చిన జనులను-అచటే
వాకిలి వద్ద - వుండగ జెప్పి
అంధకారమగు - గుహలోనికి-తను
ఒంటరిగా మరి - బయలు దేరెను.

కటిక చీకటి తొ - నిండిన గుహలో
కొంత దూరము సాగగ - నచట
బాలిక - ఒకతె - ఆడుచు-గనబడె
అచ్చట - మణి వ్రేలాడుచున్నది.

శమంతకమ్ము కనుపించగనే
ఆనందించిన - కృష్ణుడంతట
మెల్లగ మణి - గొని పోవుచుండగా
చూచిన - దాది - అరచెనొక్కపరి.

దాది - అరపు విని - జాంబవంతుడు
నిద్రనుండి - తా - మేల్కొని వచ్చి
కృష్ణుని గాంచి - దొంగ - యనుచును
పట్టుకొనెను - మరి - కదలనీయక.

తప్పించుకొని - విసరెను కృష్ణుడు
దూరము కెగిరిన - జాంబవంతుడు
తిరిగి మీదబడి పట్టుకొనగను
కృష్ణుడు-తప్పుకు-గ్రుద్దెను-బలముగ.

అటులా యిద్దరు అతిబలవంతులు
ఇరువది ఎనిమిది రోజుల - వరకు
అమోఘమైన - పోరు సలిపిరి
ఒకరిని మించి - ఒకరు పోరిరి.

క్రమ క్రమముగా - జాంబవంతుని
శక్తి - సన్నగిలి - నిలబడ లేక
తిరిగి - కొట్టెడి - శక్తి లేకను
భయ - భ్రాంతుడై - నిలబడినాడు.

అంతటిలోన - జ్ఞానోదయమయె
కరములు ముడిచి - నమస్కరించి
భక్తిగ - పలికెను - పురాణపురుషా!
జగదీశ్వరుడవు - తెలిసితి నిన్ను!

సృష్టి-స్థితి-లయ-కారకుడవు-నువు
ఈప్రకృతికి - మూలపురుషుడవు
పితృవాక్య - పరిపాలన - దక్షుడ!
శివుని-విల్లునే-విరచిన-ఘనుడ.

శరముతొ - నిలబడ - సాగరుడంత
గడగడవణకి - త్రోవనిచ్చెను
రక్కసి మూకను - ఉక్కడ గించగ
కోదండముతో - నిలచిన రామా!

పూలను లీలగ - కరి - త్రెంచినటు
పంక్తి కంధరుని శిరః కమలములు
త్రెంచి - భూమికి - కంఠమాలగా
అలంకరించిన - అరిభయంకరా!

లంకాపతిగా - విభీషణాఖ్యుని
అభిషేకించిన - ఆశ్రిత - వత్సల!
నిన్ను తెలియక - పోరితి - నీతో
అభయమునిచ్చి - కాపాడుమయా!

అటుల భక్తిగా పదముల బడిన
జాంబవంతుని - అనుగ్రహించెను
శరీరమంతయు - కరములనిమిరి
ఆతని బాధను బాపెను కృష్ణుడు.

భల్లూకేశ్వర - మణికై వచ్చితి
నాపై నిందను - బాపుకొనుటకు -
అనగా నంత - జాంబవంతుడు
మణితో పాటుగ తనయ - నిచ్చెను.

మణితో - బాలామణితో - కృష్ణుడు
ద్వారక జేరుట - ఆలస్యమయె
ద్వారము - కడను - వేచియుండిన
జనులు - తిరిగి - అట ద్వారక జేరిరి.

కొన్ని దినములు - వేచి జూచిరి
కృష్ణుని జాడ - అగబడలేదు
గుహలో - జొరబడు - ధైర్యము లేక
తిరిగి ద్వారకకు - వెడలి పోయిరి.

కృష్ణుని గురించి - వారు చెప్పగా
బంధుమిత్రులు దిగులు నిండిరి
కృష్ణుడు త్వరగా రావలెననుచు
దుర్గాదేవికి - పూజలుచేసిరి.

అనుగ్రహించిన - దుర్గాదేవి
కృష్ణుని క్షేమము తెలియబరచెను
మణితో - బాలామణితో - కృష్ణుడు
వచ్చు చున్నటు - పలికె నప్పుడు.

జాంబవతితో - నట - మంగళకరముగ
కృష్ణుడు వచ్చెను - సంబరపడిరి
సత్రాజిత్తును - రావించి అట
అందరి ముందర - మణిని ఒసగెను.

గృహమునకేగిన - సత్రాజిత్తు
మదిలో ఎంతో వ్యధకు లోనయె
అకారణమ్ముగ - కృష్ణునిపైన
అపనిందను - తా - వేసితిననుకొనె.

తన పాపమది - క్షాళనగుటకు
కృష్ణునిపదములు - కడుగుటయేనని -
మణితో పాటుగ - బాలామణిని
సమర్పించగా - యోచన జేసెను.

ఆలోచనను అమలు - పరచెను
అమిత ధనముతో కాన్కలు తీసుకు
తనకూతురునూ - శమంతకంబును
కృష్ణునికిచ్చి ధన్యుడాయెను.

అందములొలికే - సుందర రూపము
సత్యభామయను పేరున బరగు
కన్యను - కృష్ణుడు గ్రహించినాడు
వివాహమాడి - ముదము గూర్చెను.

మామను గాంచి - కృష్ణుడు పలికెను
"దినమణి - నీకీ - మణిని ఒసంగెను
నాకీ బాలామణియే చాలును
కావున గొనుము-శమంతకంబును".

కృష్ణుని మది-యది-వెన్నపూసయని
తనపై - కరుణ - చూపెననుకొని
ఆనందించిన సత్రాజిత్తు
మణితో తిరిగి గృహమున కేగెను.

ఆపై గాథను శుకయోగీంద్రుడు
పరీక్షిత్తునకు - తెలియబరచగా
ఆనందముతో పులకరింతతో
వినుచుండెను-ఆ-రాజు శ్రేష్ఠుడు.

పంచపాండవులు కుంతితొ కలసి
లక్క యింటిలో కాలిపోయిరని
వినిన కృష్ణుడు - సర్వము తెలిసియు
బలరామునితో - హస్తిన కేగెను.

భీష్మ ద్రోణులను-కృప-విదురులను
ధృతరాష్ట్రుని మరి - గాంధారిని గని
ఊరడించెను - వేదన తీర్చెను
ఉపశమనమ్ము కలుగ జేసెను.

సత్రాజిత్తు - మోసగాడని
మనకిచ్చెదనని - చెప్పిన యట్టి
శమంతకంబును - సాత్రాజితిని
కృష్ణుని కిచ్చి - అవమానించెను.

అని - అక్రూర - కృతవర్మలట
శతధన్వుని - మరి - రెచ్చగొట్టిరి
తిరిగి ఆమణిని - ఏదోవిధముగ
తెచ్చుకొనుటయే మార్గము అనిరి.

ఆమాటలకు శతధన్వుండు
ఒక - నిశిరాత్రి - సత్రాజిత్తును
అంతము జేసి - శమంతకంబును
అపహరించుకొని - పారిపోయెను.

తండ్రి హత్యను వినిన - కూతురు
సత్యభామ - తా - వలవలనేడ్చెను
హస్తినా పురము బయలు దేరెను
భర్తకు - విషయము తెలియబరచినది.

అవతారమూర్తులే అయినను గాని
సామాన్యుల వలె దుఃఖించిరట
ద్వారక జేరిరి - అంతట కృష్ణుడు
శతధన్వుని మరి చంపెదననెను.

కృష్ణుని - శపథము తెలిసినంతనే
శతధన్వుడట - తల్లడిల్లెను
సాయపడమని - కృతవర్మను - తా
అతిదీనముగా ప్రార్థన జేసెను.

అదిరిపోయిన - కృతవర్మ - అట
అసహాయుడనని - విప్పి చెప్పెను
"రామకృష్ణులు - అసమాన్యులయా!
కంసుని చంపిరి - బంధుమిత్రులతొ.

జరాసంధుడే ఎన్నో మారులు
ఓడిపోయెను - పరుగిడి బ్రతికెను
తెలిసి - నిప్పును - తాకరెవ్వరూ"
అనుచు - ఆతనిని - బెదర గొట్టెను.

అచ్చటి నుండి - అక్రూరుని గని
అభ్యర్థించెను - సాయపడమని
శతధన్వునికి - కృష్ణుని ఘనత
తెలియబరచెను - అక్రూరుండు.

జగతిరచించి - నశింపజేసే
శక్తిమంతుడు - కృష్ణుడు - వినుము!
బ్రహ్మాదులకే - లీలలు - తెలియవు
ఆతని వశమై యుండును - మాయ.

ఏడుయేండ్ల ప్రాయమ్మున - గిరిని
చిటికెన - వ్రేలుతొ - ఎత్తగలుగునా!
గో సంరక్షణ చేయగలుగునా!
ఆపని చేసెను - కృష్ణుడు-వింటివ -

మేమందరము - జగన్నాథుడని
మదిలో తలచి పూజించెదము
ఎదురించుటది - ఎదలో - తలచము
నీతో స్నేహము - చాలును యింక".

అటుల గట్టిగా - అక్రూరుడు - అన
ప్రాణభీతితో శతధన్వుండు
తురగము నెక్కి అతివేగముగా
శత యోజనముల దూరము సాగెను.

విషయము తెలిసి రామకృష్ణులు
వెంబడించిరి - రథారూఢులై
కృష్ణుని రథమును గాంచినంతనే
తురగము వదలి - పరుగిడ సాగెను.

ఎదురుగ - మిథిల అగపడెనతనికి
ప్రాణభీతితో దొంగమాదిరి
పరుగిడువానిని - గాంచిన కృష్ణుడు
చక్రాయుధమును -ప్రయోగించెను.

నేలకూలిన శతధన్వుని కడ
శమంతకంబు - కనబడలేదు
తొందరపడి-మరి-చంపితి ననుచు
కృష్ణుడు అనగా - అన్న పలికెను.

"మణి హర్త మరి - ఇతడే గావున
చంపితి మందుకు - ఈతడు-మణిని
హితుల వద్దను దాచి యుండును
వెదకుము - నీవు - ద్వారకకేగి.

విదేహరాజు నిర్మల హృదయుడు -
అతనిని చూడగ - ఆగెదనిచ్చట
నీవు వెళ్ళుము - వెనుక వచ్చెద"
అనగా కృష్ణుడు - బయలు దేరెను.

జనక మహీపతి - ఎదురువచ్చెను
బలరామునికి - స్వాగతమిచ్చెను
అర్ఘ్యపాద్యముల నిచ్చి - ప్రేమగా
సదుపాయములు - అమర్చినాడు.

జనకుని కోరిక - మన్నించుచును
కొన్నిదినములట బలభద్రుండు
మిథిలలోనుండగ-నిర్ణయించుకొనె -
అపుడు వచ్చెను - సుయోధనుండు.

మిథిలకు వచ్చిన దుర్యోధనునకు
స్వాగతమిచ్చి - విడిదినిచ్చెను
జనకుని ఆతిథ్యములో నతడు
బలరామునికి - శిష్యుడయ్యెను.

బలరామునికడ - గదాయుద్ధపు
రహస్యమ్ములను సమగ్రమ్ముగా
సుయోధనుండు గ్రహించినాడు
ధన్యుడైనటు - తలంచినాడు.

కృష్ణుడంతట ద్వారక జేరి
సత్రాజిత్తుకు - తగిన విధముగా
పారలౌకిక - క్రియ జేయించెను
సత్యభామను - ఊరడించెను.

సుధన్వుని - వధ - వినిన వెంటనే
అక్రూరుడును కృతవర్మయును
ద్వారకలో మరి - రక్షణ లేదని
ప్రాణభీతితో పారి పోయిరి.

అక్రూరుడు - ఆ - పేరుకు తగినటు
మంచి మనసుతో మనుగడ గడపును
ఆతడు అచ్చట లేక పోవుటచె
వర్షము లేక కరవు వచ్చెను.

అనావృష్టితో - దేశమంతయు
తల్లడిల్లగా - ద్వారక యందలి
వృద్ధులు కొందరు - కృష్ణుని గాంచి
మదిలో మాట - తెలియ పరచిరి.

"యదువంశమణీ! పూర్వ కాలమున
కాశీరాజు పరిపాలనలో
అనావృష్టి యది బాధించగను
అక్రూరుని-తండ్రిచె-కష్టము తొలగెను.

శ్వఫల్కు డనెడి - మహానుభావుని
తోడ్కొని పోయి - కాందిని - యనెడి
కన్య నిచ్చి - మరి పెండ్లి జేసెను
ఘనముగ నాతని - సత్కరించెను.

ఆ - శ్వఫల్కుని - ఉనికి చేతను
సమృద్ధిగా మరి - వానలు కురిసెను
కావున - కృష్ణా - అక్రూరుడును
తండ్రియంతటి మహానుభావుడు.

కావున నీవు - యిపుడే పోయి
అక్రూరుని - యిటకు - తీసుకురమ్ము
కరువు కాటకములన్నీ తొలగి
సుఖశాంతులతో బ్రతికెదరందరు.

ఆమాటలకు - కృష్ణుడంతట
అక్రూరునికై - దూతల నంపి
ద్వారక - కతనిని - రప్పించుకొని
యథావిధిగను - పూజలొనర్చెను.

"అక్రూరా - నువు పేరుకుతగుదువు
శతధన్వుడు-తా-శమంతకంబును
నీ గృహముననే - వుంచి-పోయినటు
తెలియుచున్నది-సత్యము అదియగు.

సత్రాజిత్తుకు - కొడుకులు లేరు
ఆడుసంతతికి - ఆస్తి వచ్చుగద
ఆ మణిపై - మరి - ఆశలేదయా!
మాకందరికి చూపుము దానిని.

నావద్దనె - ఆ - మణి వున్నదను
అపోహ తొలగి - శాంతి కలుగును
నీ గృహమందు - స్వర్ణవేదికను
యజ్ఞయాగములు జరుగు-నిరతము".

అటుల - కృష్ణుడు వరము నొసగెను
అనునయింపుగా - మణిని చూపమన
ఉత్తరీయమున - దాచిన మణిని
కృష్ణదేవునికి - సమర్పించెను.

కృష్ణుడంతట శమంతకంబును
బంధుమిత్రులకు - జూపించి - మరి
అక్రూరునికే యిచ్చి వేసెను
ఆనందించిరి బంధువులందరు.

అవతారమూర్తి - తా - భువిపై పుట్టి
శమంతకంబును గ్రహించినట్టి
గాథను చదివిన - వినిన - స్మరించిన
అపవాదులు - పాపమ్ములు తొలగును.

కొంతకాలము - గడచినంతట
కృష్ణుని మదిలో పాండునందనుల
చూడగ - కోరిక కలిగినంతనే
సాత్యకి మొదలగు - వారితొ - సాగి.

ఇంద్రప్రస్థమును - జేరినంతనే
పాండవులందరు - ఆనందించిరి
కృష్ణుని - వారు - కౌగలించుకొని
ఆనందములో తేలిపోయిరి.

కృష్ణుడంతట - వయసున పెద్దగు
ధర్మరాజుకు - భీమసేనునికి
నమస్కరించెను - అటుపైనంత
ముదముగ పార్థుని - కౌగలించుకొనె.

నమస్సులుంచిన - నకుల సహదేవుల
లేవనెత్తి - ఆశీస్సుల నిడెను
ఉత్తమమైన - ఆసనంబును
అలంకరించెను - నందనందనుడు.



సిగ్గు మొగ్గలవి జారుచుండగా
నవవధువగు - ద్రౌపది వచ్చి
కృష్ణుని పదముల - నమస్కరించెను.
ఆశీస్సులను - కృష్ణుడొసగెను.

సాత్యకిని - మరి - యాదవులందర
పలుకరించిరి - పాండునందనులు
అంతట కృష్ణుడు - అత్తను గాంచి
కుశల ప్రశ్నల పలుకరించెను.

అత్తానీకు - కోడలు వచ్చెను
పెత్తనమ్మును - నెరపు చుంటివా!
సుఖముగ-కాలము గడుపుచుంటిరా
అనుచు-కుంతిని-అడిగె కృష్ణుడు.

దుర్యోధనుడు-పెట్టిన యిడుములు
మదిలో తిరిగి - కనులు చెమర్చెను
గొంతుక-బొంగురు బోయెను కుంతికి
మెల్లగ పలికెను - నల్లనయ్యతో.

"వెంట వుంటివి - నీడ మాదిరి
కంటి రెప్పలా - చూచుచుంటివి
కావున మేము - నిలబడి యుంటిమి
మాభాగ్యము - నీ అండదొరకుట".

అంతట పలికెను ధర్మనందనుడు
"కృష్ణా నీవు - సామాన్యుడవా!
సనకాదులకే - అందనివాడవు
ఆదరింతువు - మమ్మందరినీ.

పూర్వజన్మకృత - పుణ్యవశమున
నీ యనుగ్రహమునంద గలిగితిమి
అనుచు భక్తిగా పలుకుచుండగా
చిరునగవులతో చూచెను కృష్ణుడు -

పాండు సుతులతో సుఖముగ గడుపుచు
పౌరులందరకు దర్శనమిడుచు
ఇంద్రప్రస్థమున కొన్ని మాసములు
నందనందనుడు సుఖముగ - గడిపెను.

కృష్ణార్జునులు - వేటకోసమై
ఒక్క దినమున బయలు దేరిరి
వివిధ మృగములను - కిరీటి అంత
నిశిత శరముల - నేల గూల్చెను.

అందులో మిక్కిలి విశిష్టమైన
మృగములనెంచి వేటగాండ్రట
పార్థున కిచ్చి - నమస్కరించిరి
అంతట - దాహము వేసె - కిరీటికి.

కృష్ణార్జునులు దగ్గరలో గల
యమునానదిలో స్నానముజేసి
సంధ్యవార్చుకు దాహము తీర్చుకు
ఇసుక తిన్నెపై - కూర్చొనినారు.

అంతటిలోన - యమున తోయముల
అందములొలికే - సుందరవదన
అన్నుల మిన్న - అతి రూపవతి
అగబడె - కృష్ణార్జును లిద్దరికి.

ప్రక్కనె వున్న - పార్థునంతట
విషయము తెలుసుకు రమ్మని పంపెను
అంతట విజయుడు-మృదుమధురముగా
వివరములడిగెను - సుమసుకుమారిని.

"ఇంతీ! నీవు ఎవ్వరిదానవు -
తల్లిదండ్రులు - ఎవరోజెప్పుము
కల్యాణకాంక్షతో - వచ్చినట్టుగా
తలంచుచుంటిని - కోరిక తీరును"

అంతట పలికెను ఆ సుకుమారి
"అయ్యా నేను సూర్యనందనను
కాళింది యని - పిలతురు నన్ను
తపోనియమమున నుంటిని - ఇచట.

విష్ణుదేవుని - భర్తగ పొందగ
కోరికతో - నే - తపమున నుంటిని
ఈ నదిలోన - నేను వసించగ
గృహమును కట్టెను నాదు జనకుడు".

ఆ విషయమును పాండునందనుడు
శ్రీకృష్ణునకు తెలియబరచెను
సర్వము తెలిసిన జగన్నాథుడు
ఇంద్రప్రస్థముజేరె నామెతో.

పాండునందనుల కోరిక తెలుసుకు
విశ్వకర్మనట - రావించి మరి
అతిరమ్యముగా రాజా దానిని
రచించమనుచు కృష్ణుడు చెప్పెను.

కొంతకాలమటు జరిగి నంతట
పార్థునకంత సారథిగానయి
అగ్ని దేవునిచె ఖాండవ వనమును
దహింపచేయగ - మెచ్చిన అగ్ని.

అభేద్య కవచము - గాండీవమును
అక్షయతూణీరమ్ములు - మరియు
శ్వేతాశ్వములతొ - దివ్యరథమును
కిరీటికిచ్చెను - కానుకగాను.

ఆ సమయములో - మయుడంతటను
దివ్యసభను - తా - నర్జున కిచ్చెను
ఆ మయసభలో - సుయోధనుండు
అవమానమ్మును - పొంది యుండెను.

అంతట - కృష్ణుడు-శలవు నందుకొని
సాత్యకి మొదలగు వారందరితో
ద్వారకజేరి - శుభముహూర్తమున
కాళిందిని - తా - పరిణయమాడెను.

॥శ్రీ కృష్ణచరితము॥



# 3 కృష్ణుని భార్యలు

విందుడు–మరియు–అనువిందుడను
అవంతి దేశపు పాలకులిద్దరు
దుర్యోధనునికి – ప్రాణస్నేహితులు
మిత్రవింద – యగు – వారికి చెల్లెలు.

హరికి – అత్తయగు – రాజాధి దేవికి
మిత్రవింద – తా – ముద్దుల కూతురు
ఆమె పెండ్లికి స్వయం వరమును
ప్రకటించి రట – అవంతిరాజులు.

స్వయం వరమునకు–కృష్ణుడు వచ్చి
రాజులగెలిచి – మిత్రవిందను
పరిణయమాడెను – మంగళ కరముగ
అనుచు శుకుడు–తా–నారంభించెను.

రాజావినుము – యదుకిశోరుని
పరిణయగాథ – మంగళ ప్రదమిది
కోసలరాజు – నగ్నజిత్తుకు
నాగ్నజితియను – కూతురు గలదు.

అందచందముల – సాటిలేనిది
సుందరవదన – సుమసుకుమారి
ఆమెను – పరిణయమాడుట కొరకై
ఎందరొ రాజులు – ముందు నిలచిరి

బలమగు ఎద్దులు – ఏడు సంఖ్యలొ
పోరుకు సిద్ధము చేసెను – రాజు
వాటిని గెలిచిన – వీర పుంగవుడు
కన్యకు తగిన వరుడు – అగునని.

ఎందరొ వీరులు ముందుకు వచ్చి
వృషభమ్ములతో – పోరగ లేక
కొమ్ముల గిట్టల – బారిని పడిరి
కొందరు ముందే పరుగిడువారు.

విషయము తెలిసి – కృష్ణుడంతట
ససైన్యమ్ముగా – కోసల కేగెను
సగౌరవమ్ముగ – ఆమహారాజు
మురళీధరునికి – స్వాగతమిడెను.

చాటుగ – కృష్ణుని గాంచెను – కాంత
నాగ్నజితి – తా – పరవశించెను
కృష్ణుని – పతిగా పొందగలిగిన
జన్మ ధన్యమని – తలపోసినది.

నమ్మిన దైవము – అనుగ్రహించి
కృష్ణుని – భర్తగ చేయగ – కోరెను –
మదిలో ఆశ తీరునొ లేదో
అన్న సంశయము – పొడచూపినది.

అంతట కృష్ణుడు గంభీరముగా
నగ్నజిత్తుతో – పలికెనచ్చట
రాజా! మేము యాచించమయా!
కన్యాశుల్కము – అసలే ఇవ్వము.

నెయ్యము కోరి – వచ్చినారము
నీ పిల్లను – మరి – ఆలిగ నిమ్ము
అనగా – రాజు – పలికె వినయముగ
కృష్ణా – నీవు – మహాపురుషుడవు.

నిన్ను మించిన అల్లుడు దొరకడు
సాక్షాత్ లక్ష్మియె - నీ ఇల్లాలు
కానీ - నేనొక ప్రకటన చేసితి
బలపరీక్షను - పెట్టితినయ్యా!

రాకుమారులు - ఎందరొ వచ్చిరి
సాధ్యపడకను - వెనకడుగిడిరి
బలముతొ - ఎద్దుల బంధించవయా
నాకుమార్తెను - చేపట్టుమయా!

పీఠమునుండి దిగెను - కృష్ణుడు
ఉత్తరీయమును-బిగించె-నడుముకు
నెమలి పింఛము - సరిజేసుకొని
ఎద్దుల ముందు నిలబడినాడు.

బుసలు కొట్టుచు-ఏడు వృషభములు
కొమ్ములతో-మరి-కుమ్మ బోయెను
ఉంకె వేయుచు - నేలను తన్నుచు
ఆవేశముగా - ముందు కురికినవి.

రెప్పపాటులో - కృష్ణుడంతట
చిత్రచిత్రముగ - సుడులు తిరుగుచు
వాటికందక - పరుగిడ జేయగ
అలసి పోయినవి - ఎద్దులన్నియు.

చూచు - వారికి ఒకే కృష్ణుడు
కానీ అచట - ఏడుగురాయిరి
బొమ్మల మాదిరి ఆడించుచును
ఒకోగుద్దుతో - నేలకు త్రోసెను.

అటులా ఎద్దులు నీరసపడినవి
ఒకేతాటితో - కట్టెను వాటిని
చూచెడి వారు - చకితులాయిరి
కంటి రెప్పలు - ఆర్పక చూచిరి.

నగ్నజిత్తుకు - కోరిక తీరెను
నాగ్నజితికి - మరి - నోములు పండెను
వెంటనె పెండ్లిని - నిర్ణయించిరి
మంగళ ప్రదముగ జరిగెను - పెండ్లి.

వధూవరులను గాంచిన వారు
ఆనందముతో పొంగి పోయిరి
వేదమంత్రముల - ఆశీస్సులవి
నింగికెగయగా - వినవచ్చినవి.

దేవతలందరు - పులకరింతతో
పూలవృష్టి - కురిపించి రచ్చట
మంగళ వాద్యపు మధుర ఘడియలో
కృష్ణుడు చేకొనె - నాగ్నజితినట.

ఆనందముగా - నవవధువుతొ - తా
బయలు దేరెను - కృష్ణుడు - రాజా!
అంతట - విషయము - వినిన రాజులు
మత్సరంబున - ముందుకు వచ్చిరి.

ఎద్దుల పోరున ఓడిన రాజులు
ముందుకు - కృష్ణుని పోనీయమని
అఖండసేనతొ - పోరగ వచ్చిరి
అదివిని - అర్జును డచటికి వచ్చెను.

గాండీవముతో - కిరీటి అంతట
పొగరుబోతులను - ఎదిరి నిలచెను
కొందరి తలలు - తెగనరకగను
బ్రతుకు ఆశతో - పరుగిడిరందరు.

శ్రమలేకుండా - కృష్ణుని రథము
ద్వారక జేరెను - జనులు ముదముగ
వధూవరులకు - హారతులిచ్చిరి
సుఖముగ కృష్ణుడు-గడుప సాగెను.

అంతట కృష్ణుడు-మేన మరదలగు
భద్రను శుభముగ పెండ్లి యాడెను
మద్రభూపతి - కూతురు అయిన
లక్షణ - కన్యను పరిణయ మాడెను.

రాజా! కృష్ణుని భార్యలు వీరు
ఎనిమిదిమంది - అష్టమహిషులు
అందచందముల - గుణ శీలముల
అందరొక్కటే - అనుంగుసతులు.

రుక్మిణీదేవి - జాంబవతియును
సత్యభామ - మరి - కాళిందియును
మిత్రవిందయు - నాగ్నజితియును
భద్ర - లక్షణ - ఎనిమిది మంది.

అంతట కృష్ణుడు - నరకుని జంపి
చెరలోనున్న - రోహిణి మొదలగు
పదునారువేలగు సంఖ్యలొ కన్యల
పరిగ్రహించెను - రాజా వినుము.

అటుల జెప్పిన శుకయోగీంద్రుని
అడిగెను రాజు - కుతూహలమున
భువికి తనయుడు - నరకాసురుడు
వానితొ - పోరు - ఎటుల జరిగెను.

కృష్ణుడు - నరకుని-చంపెనెందులకు?
అసురుడు - కన్యల చెరలో నుంచెన!
వివరములన్నీ వినగోరితిని
అనగా మౌని ఆరంభించెను.

॥శ్రీ కృష్ణచరితము॥



## 4 నరకాసుర వధ

రాజా - నరకుడు జంకడెవరికి
దుర్మార్గుడయి - దేవమాతయగు
అదితి - కుండలములపహరించెను
వరుణుని - వెల్ల-గొడుగుహరించెను.

అంతియెగాక - మేరుగిరిని గల
మణి పర్వతమును - ఆక్రమించెను
ఇంద్రుడు వేడెను - కాపాడమని
అభయమునిచ్చి - కృష్ణుడు కదలెను.

భూదేవికి - ఆ - నరకాసురుడు
ముద్దుల బిడ్డ - అయినను గాని
మట్టు పెట్టగా - మురళీధరుడు
గరుడుని ఎక్కి - సాగుచుండగా.

సత్యభామ - తా - వచ్చెదననెను
"స్వామీ! మీ - శరలాఘవమ్మును
రిపులహరించే - మగసిరి చూడగ
మనసు పడితిని - అనుసరింతును".

అంతట కృష్ణుడు - నవ్వుచు పలికెను
"పూతోటలలో ఊయల లూగుట
అనుకొంటివ-నువు-పోరుటయనగా
జలక్రీడ వలె - క్రీడనుకొంటివ.

భీకర సంగరమందున దుష్టులు
నిశాచరులు మరి-విరుచుకు పడెదరు
బంతులాట యది కాదు-ఇంతి-విను"
అనగా - వినక - వచ్చెదననెను.

నీ అండన - నే - నుందునెప్పుడు
నీవుండగ - నాకాపద కలుగదు
నీతోవుండుట - నాకానందము
నాథా! కాదన వలదని కోరెను.

కాదనలేక - కదలె కాంతతో
ఖగపతి - శరవేగముతో సాగెను
ప్రాగ్జ్యోతిషమను - నగరము నందు
నరకుడుండును - అభేద్యమదియగు.

ఆ నగరమునకు-ఘనమగు గిరులు
పెట్టనిగోడలు - నింగిని తాకును -
వివిధాయుధములు-నిప్పులు చిమ్మగ
అడుగిడ శక్యము - కానేకాదు.

నింగికి ఎగసే - జలకెరటమ్ములు
సుడులు తిరిగెడి-విసురగు-గాలులు
నాల్కలు జాపి ఎగబడు నిప్పు
కాపాడును - ఆ - ప్రాగ్జ్యోతిషమును.

అంతకు మించి - మురాసురుండు
అల్లిన యట్టి - పాశములవ్వి
రక్షించును - ఆ నగరము నెపుడు
శ్రీహరి చేరెను - ఆ పురమునకు.

గదతో - కృష్ణుడు కొండల గూల్చెను
అమ్ముల గూల్చెను - శరదుర్గమును
వాయు-అగ్ని - మరి జలదుర్గములను
చక్రాయుధమున గూల్చి వేసెను.

ప్రాకారమ్ముల - గదతో గొట్టి
యంత్రమ్ములను - పిండిజేసెను
మురాసురుని - పాశమ్ముల త్రెంచి
పాంచజన్యమును - పూరించెనట.

శంఖ ఘోషయది - నింగికెగసెను
ప్రళయమేఘమది ఉరిమినట్లయె
జలమునందు - తా - నిద్రలోనున్న
మురాసురుండు - మేల్కొనినాడు.

ఆవులించెను - వళ్ళు విరుచుకొని
వచ్చి చూచెను - విధ్వంసమును
తనపాశములవి తెగిబడియున్నవి
అసురుని - అయిదు తలలు తిరిగెను.

కంటిముందర - ఖగపతి పైన
శ్రీపతి కనబడె - మురాసురునకు
ఆగ్రహమ్ముతో - కదిలి పోయెను
పదినేత్రమ్ముల - నిప్పులు రాల్చెను.

తెరచిన నోళ్ళతొా-జగము మ్రింగునటు
అరచి-విసరెను-ఘనమగు శూలము
కృష్ణుని గాంచి - పలికెను ఘనముగ
ఇన్నాళ్ళకు నాకంటబడితివి.

వేచియుంటిని - వేల్పుల పెద్దా!
విడువనింక - నే - కూల్చెదనిచటే
అనగా కృష్ణుడు - అతి విలాసముగ
పలికెను - ఓరీ - యిక-నీపని సరి.

కూతలు మాని - చేతల జూపుము
సురలకు - యిక - నీపీడ విరగడగు
అనుచు కృష్ణుడు-గరుడునిపై బడు
శూలము విరచెను-ముక్కలు చేసెను.

అంతట కృష్ణుని - నిశిత శరముల
అయిదు ముఖములు-రక్తము గ్రక్కెను
అది లెక్కించక-మురాసురుండు
గదనొక్కటి-తా విసరెను రణమున.

గదతో - కృష్ణుడు-అసురుని గదను
తునకలు జేసెను - అవలీలగను
అంతట అసురుడు-ముందు కురకగా
చక్రాయుధమును వదలెను చక్రి.

చక్రాయుధము - సూటిగ సాగి
అయిదు శిరములను-త్రుంచి వేయగా
శిఖరము తెగిన - కొండ తీరుగా
మురాసురుండు - నేల కొరిగెను.

తండ్రిమరణము - తెలిసిన తనయులు
ఏడు గురుండిరి - వారందరును
నరకుని - ఆనతి నందిన వారై
కృష్ణుని పైకి - పోరుకు వచ్చిరి.

తామ్రుడు మరియు అంతరిక్షుడు
శ్రవణ - విభావసు - వసుడను వారు
నభస్వంతుడు - అరుణుడు అనెడి
అసురులు పోరగ వచ్చిరి ఘనముగ.

పీఠుడు - అనెడి - సైన్యాధ్యక్షుని
వెంటబెట్టుకు - శరములు వదలిరి
వారిశరములను - త్రుంచి - కృష్ణుడు
అంతము జేసెను - వారందరినీ.

కృష్ణుని శరముల - చక్రాయుధమున
తనవారందరు - కూలినట్లు విని
ఆగ్రహమ్ముతో - నరకాసురుడు
గొల్లని విడువను - అనుచు పలుకుచు.

మణి కాంతులతో - కుండలమ్ములవి
మెరయుచుండగా - ఘనసైన్యముతో
సమరాంగణమున - కరుగు దెంచెను
ఖగవాహనుని - గాంచె నచ్చట.

యుద్ధము చేయగ నరకాసురుడు
సిద్ధపడగను - సత్యభామ - తా
సంసిద్ధయయి నిండుగ నిలచెను
ప్రకృతి కాంత - శిరస్సు నెత్తెను.

నిడుపగు జడను - చుట్టిన దామె
కొంగుముడిని - తా - బిగించె గట్టిగ
ధగధగలాడే - మణి భూషణములు
నిగనిగలాడే - మేని కాంతులతొ.

గిర్రున త్రిప్పి - కొంగును దోపి
వీర రసమది - మూర్తిగ నిలచెన!
అన్నటు నిలచిన - అతివను గాంచి
కృష్ణుడు పలికెను అనునయించుచు.

భామా! ఎందుకు తొందర నీకు
అసురుని గెలువగ - నాకు కష్టమా!
అనగా - నతివ - ఆగ్రహమ్ముతో
నరకుని వంక - జూచుట గాంచి

కంసారి - తను - ధనుస్సు నంత
వీర లలామకు - అందించగను
కన్నులు జూడగ చాలనంతటి
క్రోధమూర్తియై - నిలబడె - నతివ.

ఎదురుగ నిలచిన - నరకాసురుని
కంటిలో దిగెనా - భామ - రోషము
అసురుడు మూసెను-రెండు కన్నులు
చూడగ శక్యము గాక పోయెను.

వింటిత్రాటిని - ఒడుపుగ నామె
బిగించె - అదిగని - సురలు నింగిని
రాక్షసకాంతల - పసుపు తాళ్ళవి
తెగిపడు ననుచు - సంతసపడిరి.

అల్లెత్రాటిని - ప్రోగించినది
నరకాసురుని గజబలమంతయు
గజగజవణకెను - తెలివి తప్పెను
శరసంధానము - చేయుట మొదలిడె.

క్రింది పెదవి - ముని పంట నొక్కినది
అమ్ములు తీసి - వదలు చున్నది
కరకంకణములు - శృతివేయగను
అల్లెత్రాటిధ్వని - రాగమెగసెను.

చెవులకమ్మలు - మెరయుచున్నవి
వీరరసము - చెక్కిళ్ళ కద్దినవి
గాంభీర్యమది - కన్నుల వాలికి
శరపరంపరను - తొందర జేసెను.

ఆగక - శరములు వేసే - ధనుసు
వీరశబ్దము - పూరించినది
ఆధ్వనికచ్చటి - అసుర సేనల
హాహాకారము - వినబడకున్నది.

వీర రసమట - సత్యయైనది
భయానకమ్ము - భామ యైనది
రౌద్రరసమది - రమణి యైనది
అద్భుతరసమా - అతివ యైనది.

అంతటి పోరున - అతివ సన్నగా
నాథుని పైన - లేత నవ్వును
సంధించినది - ఆసమయములో
శృంగార రసమది - కృష్ణున కందెను.

ఎఱ్ఱని కన్నుల - నరకుని జూచుచు
సఱ్ఱున శరములు - ఆగక విడచుచు
విరిశరములను - విరిసిన కన్నుల
నాథునిపైన - సంధించినది.

ముందుకు జరిపి-వంచి-నిలచిన
కుడికాలును - మరి - కదలనీయక
ప్రచండ యుద్ధము - చేసెను సత్య
అసురసైన్యము-మునిగెను శరముల.

వీణాపాణి - విల్లు ధరించెను
తీగను - తరువుకు కూర్చగ చాలని
లతాంగి - తాను - నారిని కూర్చెను
అనుచు-అబ్బురము నందుచుండిరి.

ముత్యాల సరములు - కూర్చగరాని
ముగ్ధ - శరములను వదలు చుండెను
చిలుకకు - పలుకులు నేర్పుట రాని
చిలకల కొలికి - అస్త్రము లేసెను.

అస్త్రమంత్రములు - ఎపుడు నేర్చెనో!
అంతరీవిగ - గర్జించుటది
ఎటుల అబ్బెనా - అతివకు అనుచు
తలంచినారు - విస్మయులైరి.

వింటి సవ్వడి - ఉరుముల బోలెను
చేత విల్లది హరివిల్లయినది
వానకోయిలలు - దేవతలాయిరి
నల్లనయ్య అట - మేఘమాయెను.

మేఘము నందు - మెరపు - తానయి
శరవర్షమును - కురిపించగను
అసురమూకయను - కార్చిచ్చు - అట
రగులకుండ - మరి - ఆరిపోయినది.

రక్కసి సేన పలుచబడినది
బ్రతికిన వారు - నరకుని జేరిరి
అంతట కృష్ణుడు అనునయంబుగా
ధనుసునిమ్మని - అతివ నడిగెను.

సత్యా! నీదగు సమరధాటికి
సత్యము - అసురులు అదిరిపోయిరి
బంగరు కాన్కలు - ఇచ్చెదనీకు
కార్ముక మిమ్మని - గొనెను కృష్ణుడు.

నరకుడు గాంచి - గేలిగ పలికెను
"ఆడుది - నిలబడి పోరుచుండగా
ప్రక్కకు జరిగిన - పురుషుడ వీవు
ఎంతటి - మగసిరి గలిగిన వాడవు.

రాక్షసులంటే - రణకోవిదులు
ఆడుదానితో - యుద్ధము చేయరు
అందువల్లనే - ఉపేక్షించితి
ఇకపై చూడుము - నాప్రతాపము".

"నరకా! వదరకు నిలబడవింక
అసుర కాంతలు - రోదించునటు
సురకాంతలు - మరి - వినోదించునటు
నీ - తలరాల్చెద పుడమిని - బడగ".

అటుల పలుకుచు - కృష్ణుడంతట
శతఘ్ని - అనెడి - దివ్యాస్త్రమును
వదలగ నంత - అసురులందరు
అమితబాధకు - లోనయినారు.

శరముల కూలెను - అశ్వములన్నీ
గదతో గజములు - ఒరిగి నేలబడె
చక్రము సాగి అసురుల గూల్చెను
చిందరవందర - అయినది సేన.

తనువు తెగించి - కొందరసురులు
ఎదిరి - శరములు - వదిలిరి తిరిగి
కృష్ణుడు - శరముల నడిమికి తృంచి
త్రెంచెను-అసురుల శిరముల నచట.

గరుత్మంతుడు రెక్కలతోను
ఘనమగు-ముక్కుతొ - కాలిగోళ్ళతో
అసుర మూకను - అంతము జేసెను
మిగిలిన కొందరు పారిపోయిరి.

నరకుడొక్కడే - గజము - మూపున
మిగిలి యుండెనా యుద్ధభూమిలో
వజ్రాయుధమును - లక్ష్యపెట్టని
శక్త్యాయుధమున-గరుడుని-కొట్టెను.

శక్త్యాయుధము తగిలిన ఖగపతి
పూలదండది - తగిలినయట్టి
మదగజమ్ములా - నిలబడినాడు
మరింత బలముగ - కనబడినాడు.

నరకుని వద్ద - మిగిలి యున్నదొక
అమోఘ శూలము - ఆశూలమును
ఆశపెంచుకు - విసరెనప్పుడు
జయము తథ్యమని - తలంచినాడు.

శూలముగాంచి మధుసూదనుడు
చక్రము వదలెను - దివ్యచక్రమది
శూలము నెదిర్చి - మ్రింగివేసినది
నరకుని శిరము - తృంచివేసినది.

వరాహావతారుడు - నీ పెనిమిటియని
చెప్పెడి తల్లీ - నీతనయుడనని
జాలిచూపక - తల తెగ వేసెను
అనుచున్నటుల - కూలెను శిరము.

నరకునంతము - గాంచిన మునులు
ఆనందముతో - పొంగి పోయిరి
పుష్పవృష్టి - కురిపించిరి సురలు
స్తోత్రము చేసిరి - నరకాంతకుని.

రత్నపు - బంగరు కుండలాలను
వైజయంతి యను దివ్యమాలను
వరుణుని - వెల్లగొడుగును మరియు
మహారత్నమును కృష్ణున కిచ్చి

పురాణపురుషుని - భక్తి ప్రపత్తుల
స్తోత్రము చేసెను - భూదేవి అట -
"ఉరమున మాల - నాభిని కమలము
కన్నులు రెండు - పద్మములయ్యా!

పాదపద్మములు – పాపహరణములు
అనంతనామము లున్నవి నీకు
విశ్వము నీ ఉదరమ్మున నున్నది
నీ రూపములో – విశ్వమున్నది.

దేవదేవుడవు – నీవే స్వామీ
వాసుదేవుడవు – నీవే తండ్రీ!
ఆదిపురుషుడవు – అంతరాత్మవు
సకలకారణ కారణుండవు".

జయముజయమని – ఆ వసుంధర
శరణుకోరి – తా – పలికెను తిరిగి
"నీవు లేనిది ఇలను వుండదు
నీది కానిది – మనలేదు – ఇల.

సృష్టి, స్థితి – లయ కారణుండవు
త్రిగుణాత్మకముల – కాధారుడవు
స్వామీ! ప్రకృతి – తోడుగ – నిన్ను
నిరంతరమ్ము అనుసరింతును.

పంచభూతములు–ఇంద్రియమ్ములు
వేల్పులు–మనస్సు–విశ్వమంతయు
నీయందుననే – పుట్టుచున్నవి
పుట్టుటగిట్టుట – లేని వాడవు.

కారుణ్యాలయ – కనికరించి – నువు
నరకుని కొడుకు – ఈ భగదత్తుని
కాపాడుమయా! – ఈ – పసివాడు
తండ్రిని బోలడు – దుష్టుడు గాడు."

వెంటనె కృష్ణుడు – నరకుని తనయుని
అనుగ్రహించి – అభిషేకించి
రాజ్యమ్మునకు – రాజుగ జేసెను
నేరుగ – నరకుని – భవనము కేగెను.

పదునారువేలు – అట – రాచకన్యలు
నరకుని చెరలో – మ్రగ్గుచుండిరి
బలవంతముగా – కన్యలందరిని
ఎత్తుకు వచ్చి – చెరలో పెట్టెను.

నందనందనుని – చూచిరి వారు
ఉల్లము పొంగెను – జన్మతరించెను
అవివాహితలగు – వారందరునూ
పతిగా – గతిగా – తలచిరి – కృష్ణుని.

ఆ కన్యలకు – భవితలేదు – యిక
మరియొక భర్త – దొరకుట కష్టము
మ్రోడు వారిన – జీవితాలని
తలంచి – కుములుచు నుండెడివారు.

అసురుని చెరలో – నున్న అతివలు –
ఆదుకొనుటకై – ముందుకు వచ్చే
అంతటి మనసు – గలవారెవ్వరు –
అనుచు – కుములుచు నుండెడివారు.

బందీలందర – విడుదల జేసెను
కర్తవ్యమ్మది – తెలియదు వారికి
ఎచటికి పోవలె – ప్రశ్నార్థకమది
నరకుడు పోయెను–తరుణులు మిగిలిరి.

వారందరిలో సిగ్గు మెరసెను
బ్రతుకు ఆశ - యది ఉదయించినది
ఇంతటి అందము-నిండిన పురుషుని
కలలోనైనా - కనలే మనిరి.

వనమాలయినచొ - కంఠసీమను
అంటిపెట్టుకొని ఉందు ననుచును
మురళీ అయిన పెదవుల వద్ద
పదిలముగా మరి-ఉందు ననుచును.

కౌస్తుభమైన - వక్షస్థలమున
విడువక వుండే భాగ్యము అనుచు
పరిపరివిధముల - కన్యలందరూ
మదిలో తలచుకు-మురిసి పోయిరి.

సర్వజ్ఞుడగు కృష్ణుడంతట
వారి మనస్సులు తెలిసినవాడై
వారందరికీ ఆభరణాదులు
అలంకారములు - అమర్చినాడు.

వారందరినీ - తగు మర్యాదల
అందలాలపై - ద్వారక కంపెను
ధన రాసులను - గజ తురగములను
వారివెంబడి ద్వారక కంపెను.

అచ్చటి నుండి - కృష్ణుడు నేరుగ
సత్యతొగూడి - ఖగపతినెక్కి
సురలోకమునకు - జేరి - అచ్చట
అదితి భవనమున అడుగు బెట్టెను.

మణి కుండలములు ఆమెకు యిచ్చి
ఆమెస్తుతులను - తాను గ్రహించెను -
అచటకు వచ్చి - నాకలోకపతి
వాసుదేవుని - పూజ చేసెను.

అంతట కృష్ణుడు - సత్య కోరగా
నందనవనముకు నేరుగసాగి
పారిజాత వృక్షమ్మును పెరకి
గరుడుని మూపున నుంచుకు-వెడలెను.

దివ్య గంధము ఎగసెనొక్కపరి
పారిజాతములు - కురిసె వారిపై
ఆనందముతో సత్యనయనములు
పారిజాతముల - మించి - విరిసినవి.

పారిజాతమును - అపహరించెనని
ఎదిరించగను - వచ్చెను - సురపతి
కృష్ణుని ఘనత - మదిలో మరచెను
నాకపతిననే - గర్వము పెరిగెను.

కరుణామయుడు కనికరించి - మరి
క్రూర నరకుని కూల్చెను అనుచు
కుండలాలను - తల్లికిచ్చెనని
తలంపు లేక - తలబడె - సురపతి.

వెన్నదొంగ - నువు - ఎచటికి పోదువు!
కన్నుగప్పి - నువు - కదల లేవు యిక
పారిజాతమును వదలిపొమ్మిట
అనుచు - సురలతో - వచ్చెను పోరుకు.

లీలగ నవ్వుచు - కృష్ణుడంతట
తలకొక బాణము చురుక్కు మనునటు
సన్నగ విడువగ - వారందరును
వచ్చిన త్రోవనె - వెడలిపోయిరి.

దేవతలందర ధైర్యమ్మునకు
కిలకిల నవ్వెను - చిలకల కొలికి
అంతట కృష్ణుడు - ఖగవాహనమున
ద్వారక జేరెను - ఆనందముగ.

సత్యభామతో విహరించెడి - ఒక
వనమున నుంచెను-పారిజాతమును
నందనందనుడు-శుభముహూర్తమున
కన్యలందరిని పరిణయమాడెను.

అష్టమహిషులతొ - ఆనందముగా
పదునారు వేలగు-తరుణీమణులతొ
చాకచక్యముగ - గృహస్థాశ్రమము
కృష్ణుడు-నడపుచు-సుఖముగ నుండెను.

భర్త సేవలే - పెన్నిధి అనుకొని
భర్త సుఖములే - పరమావధియని
పదములు కడిగి - పవిత్ర జలమును
శిరసున - వారు జల్లు కొందురు.

సుగంధ జలముల - స్నానముతీర్చి
గంధాదులతో - పూలమాలలతొ
పట్టుపుట్టముల - అలంకరించి
మురసి పోదురు - వారందరును.

మధుర పదార్థము లారగింపుకై
సమకూర్చి - మరి - మధుర భాషణల
అడుగులొత్తుచు - సేవజేయుచు
పతియే గతియని - తలంచువారు.

నాయింటనె - నా - నాథుడుండెనని
అందరు అతివలు అనుకొనుచుందురు
అందరి సేవలు - ఆపరమాత్మ
అందుకొనుచును - అందునందరికి.

సతుల మనస్సుల - నేలును స్వామి
పాతివ్రత్యమున - ఎన్నిక వారు
వారందరితో - నందనందనుడు
వనవిహారము - జరుపుచుండును.

పూదోటలలో - పూపొదరిళ్ళ
సరస్సులందున - సౌధములందు
వారితొ నిరతము పరంధాముడు
కలిసియుండుట - వారి పుణ్యము.

బ్రహ్మాదులకే - అందని వాడు
ఆగమాలకే - దొరకనివాడు
పుణ్యాంగనల - పూర్వపుణ్యమున
వారికి లభించి - సేవల నందెను.

గృహస్థాశ్రమ లీలలొ - కృష్ణుడు
ఒక దినమున - తా - పెద్దభార్యయగు
రుక్మిణిదేవి మందిరమ్మున
పూలశయ్యపై ఆసీనుడయె.

సఖులతో - అచటకు - రుక్మిణి వచ్చి
వింజామరను - వీయసాగెను
అంతట కృష్ణుడు - అతివను గాంచి
చిరునవ్వులతో పలికె నిట్టుల.

❀❀❀ ॥శ్రీ కృష్ణచరితము॥

## 5 శ్రీకృష్ణుడు రుక్మిణితో (సరసముగా) విరసోక్తులాడుట

"ఇంతీ! నీవు రాచకన్యవు
పుట్టినింటికి - తగినటువంటి
ఇంటిలో - నీవు - అడుగిడవలెను
కానీ - నన్ను - జేర వచ్చితివి.

కులమూ - రూపము - సిరిసంపదలు
వియ్యానికి మరి - కావలెను సుమా!
జరిగినదేదో జరిగిపోయినది
తిరిగి యోచన చేసుకో మరి.

శిశుపాలాదులు - శ్రీమంతులు గద!
శౌర్య ధైర్యములు - కలిగిన వారు
పిరికిపందవలె - సంద్రగర్భమున
దాగియుంటిని - ద్వారక యందు.

సాల్వుడు మొదలగు వారు-నన్ను-మరి
చులకనగా - మాటాడుట వలన
రుక్మి - మదమున - తూలనాడుట
విని - నే - వారికి బుద్ధి చెప్పితి.

తల్లిదండ్రులు - నీ అన్నయును
శిశుపాలునికే - నిన్నొసగెదమన -
కాదని - నన్ను - చేపట్టుటది
తెలివి తక్కువని - తెలియుట లేదా!

వారి శౌర్యము - తలవంచునటు
వీరత్వముతో - తెచ్చితి నిన్ను
నాకై - నేనే - మనసు పడి - మరి
తెచ్చితిననుకొని - తలంచవలదు.

బల గర్వితులు - మాకు శత్రువులు
సంద్రజలమున - మా నివాసము
సింహాసనముల - నాశించము-మరి
సిరిసంపదలు - లేనివారము.

కామ - మోహములు - సిరిసంపదలు
కోరనెన్నడూ - కాంతా వినుము!
లౌకిక వాసనలంటవు - నన్ను
తటస్థునిగా వుందును - నేను.

మా బంధువులు - అంతటివారే
కలవారెవరూ - కాదని తెలియుము
అట్టి బంధువుల - కలిసి యుందుము
కాంతా! నీవు తొందర పడితివి.

ఆత్మ బుద్ధితో - సాగెద - నిరతము.
నిర్బంధములు - నాకు లేవు - విను
ఘటమునందలి - దీపశిఖ వలె
నిశ్చలమైనది - నాస్వభావము.

అందువలననే - స్వేచ్ఛనిచ్చితి
అంతఃపురముల - నున్న భోగములు
అందవు - కావున - అతివా నీవు!
ఆలోచించి - నిర్ణయించుకో".

అటుల కృష్ణుడు పలుకుట వలన
రుక్మిణి మదిలో నున్న రాజసము
పట్టపు రాణిని - అన్న భావన
అంతమగునని - తలంచినాడు.

కృష్ణుని పలుకులు - సూటిగ నాటి
చలించి పోయెను - రక్మిణిదేవి
కలలోనైనా - విన నూహించని
కటుభాషణము - అన్నటు తోచెను.

పులి గాండ్రింపును వినిన - లేడివలె
కంపించినది - కాంతాలలామ
కంటిధార యది కురియుచున్నది
కుమిలి పోయెను - కృష్ణుని కాంత.

తలవంచుకుని - నిలబడి యున్నది
తలతిరిగినది - హృది పగిలినది
తనువంతయును - ఉడికిపోయినది
తెలియకుండ-తా-నేలను బడెను.

వెంటనె - కృష్ణుడు లేవనెత్తెను
మెత్తని పాన్పున - జేర్చె నామెను
చందన మలది - తిలకముదిద్ది
ఉపచారములు - చేసెనామెకు.

కన్నులు మెల్లగ - తెరచిన కాంతను
కౌగలించుకొని - సంతసపరచెను
సిగ్గు మొగ్గలవి - జారుచుండగా
పదములంటి - తన - పతితో పలికెను.

"కంసారీ! నిను - కొలుతును నిరతము
జగన్నాథుడవు - నాథుడవైతివి
నీకు తగుదునా - నేనని తలతును
పాదసేవకు - అర్హత కలదా!

నీరూపమిది - నామమిది యని
నిర్ణయించుటకు - సమర్థులెవ్వరు
ప్రకృతి - పురుషులు - కాలమ్మునకు
ప్రభుడవు నీవు - పరంధాముడవు.

త్రిగుణమ్ములకు - లొంగిచరించి
పొంగిక్రుంగెడి - ద్వంద్వము - గెలవని
సాధారణమగు - అతివను - నేను
నీదరి చేరుట - నాపుణ్యమది.

సంకల్పమును - కలిగించెదవు
నెరవేర్చెదవు - నీవే స్వామీ
నీవు ప్రభుడవు - దాసిని నేను
ధన్యురాలను - పరమదయాళో!

యజ్ఞ ఫలమును - గ్రహించువాడవు
లేనివాడనని అంటివి నీవు
పుట్టి గిట్టుటలు - లేనివాడవు
స్వార్థము - అసలే లేని వాడవు.

తెలియని మూర్ఖులు - సంసారమున
ఈదులాడుచు - నిన్ను తెలియక
జీవితమంతా - నిస్సారముగా
గడిపివేతురు - మాయలొ మునిగి.

నాకు తెలిసిన-సత్యము-ఇదియే
భృకుటిని - నీవు - ముడివేసినచో
ప్రళయ కాలమగు - దేవతలందరు
పదముల వ్రాలి-అభయ మడిగెదరు.

మనసులొ - నిన్ను - ప్రతిష్ఠించుకు
మొరపెట్టితిని - ఆలకించితివి
రాజుల నెదిరి - వీరపుంగవా!
నన్ను తెచ్చితివి - నీదానిగను.

పిరికి పందవు - ఎట్లగుదువయా!
నిన్నెదిరించిన రాజులు మిగలరు
నిన్ను చేరిన - రాజులు నిజముగ
పరంధామమును - చేరుకుందురు.

మోక్షమ్మునకు - ఆటపట్టగు
మంగళమూర్తివి - నిను సేవింపక
సాధారణులను - సేవించెదరా
నీపదములను - వలదని - పోదుర.

ఆశ్రిత వత్సల - దీనబాంధవా!
వానకోయిల - వర్షము వలదని
చవిటి నేలకు - జేరున స్వామీ!
నీచాశ్రయము - కోరరెవ్వరును.

రసాలమ్ములో - తియ్యని రసము
చిలుక - వదలి - ఉమ్మెత్తను జేరున
కారుమబ్బులు - కోరెడి నెమలికి
కీచురాయి ధ్వని - పరవశమిడున?

కరిమాంసమును కోరెడి సింహము
శునకమాంసము - కోరదు గాదా -
నీపద కమలము - కోరిన భ్రమరము
వదలదు వాటిని - వేయి ఎందులకు.

స్వామీ! నాడు - మనసు తెలిపితి
నేడు చెప్పెద - అవేమాటలు
నీపదములను - నిరతము కోరే
దాసిని నేను - దయామయా - విను!

ఆశ్రిత వత్సల - శ్రితజన రక్షక
రుక్మిణి యనెడి - పూలతీవకు
ఆధారము నువు"-అనుచు పలుకుచు
అనంతమూర్తి - పదముల వ్రాలెను.

అంతట కృష్ణుడు అనునయించెను
నీమది తెలుసును - బేలా అనెను
నవ్వులాటగా - అంటిని అనెను
మదిలో మథన - మరచి పొమ్మనె.

చిరునవ్వులు - మరి - కురిపించమనె
చిలిపి కయ్యములు-మధురము అనెను
పతివ్రతలలో - మేలు బంతివనె
గుణశీలముల - మించరెవ్వరనె.

"నీమాటలవి - చెవులకు విందు
నీవన్నది - మరి - సత్యము-లలనా
నీ మదిలోని - కోరికలన్నీ
నెరవేరునటు - వరమొసంగితిని.

నీభక్తికి - నే - వశమై యుండి
ద్వారకలో - నే - గృహస్థునై యిటు
నీతో - కాలము గడుపు చుంటిని
నీ అదృష్టము - ఫలించె లలనా.

మోక్షమొసంగే - నన్ను తెలియక
సామాన్యునిగా - తలంచి నట్టి
దేహవాసనలు - వీడని అతివలు
పొందెడి లబ్ధి - ఏమియు-వుండదు.

నీ ప్రవర్తన - ఎన్నికయినది
నీ - కబురందుకు-స్వయముగ వచ్చి
నిన్ను గ్రహించి - తెచ్చుకొంటిని
నీతో సరిపడు - అతివవు - నీవే".

అటుల - కృష్ణుడు - ద్వారకలోన
గృహస్థాశ్రమము - నాచరించుచు
ఆనందముగ గడపసాగెను
కోరిన వరములు పొందెను రుక్మిణి.

పూపొదరిండ్ల - ఉద్యానముల
ఏటితటముల - సౌధములందు
ఫలవృక్షముల ఛాయలందున
రుక్మిణితోను గడపసాగెను.

ప్రద్యుమ్నుడు - మరి - చారుధేష్ణుడు
సుధేష్ణుడు - మరి - సుచారువున్ను
చారుదేహుడు - చారుగుప్తుడు
భద్రచారువు - చారుచంద్రుడు.

ఆపై - విచారవు - చారువు - అనెడి
పదిమంది పుత్రులు - కాలక్రమమున
ఆదంపతులకు - ఉద్భవించిరి
తల్లిదండ్రులను - సంతసపరచిరి.

అదే విధముగ - సతులందరికి
పది - పది మంది - పుత్రులు గలిగి
వారికి - కొడుకులు-మనుమలు గలిగి
కృష్ణుని వంశము-పెరిగెను-శుభముగ.

యదు - వృష్ణి భోజ-అంధక మొదలగు
నూట ఒక్కటగు పేర్లతొ పెరిగెను
సంతతి - విద్యాభ్యాసము - కొరకై
గురువు లెందరినొ - నియమించిరట.

కృష్ణుని వంశములోని వారికి
విద్యనేర్పిన ఉత్తమ గురువులు
మూడుకోట్ల పై - ఎనుబది వేలు
ఆపై వంద సంఖ్యలో నుండిరి.

గురువుల సంఖ్య - అంత వుండగా
శిష్యుల సంఖ్య - లెక్కించుటకు
విరించి - శివులకె కష్టము అగును
ఆనందముగా - నుండిరందరు.



॥శ్రీ కృష్ణచరితము॥

# 6 కయ్యము - వియ్యము

కృష్ణుని - పెద్ద కుమారుని పేరు
ప్రద్యుమ్నుడు - ఆ - అందగానికి
భార్యయైనది - రుక్మి కూతురు -
అనగా రాజు - అడిగెను శుకుని

కృష్ణుని పైన - పగసాధించగ
కృష్ణునిచే - అవమానము నందిన
రుక్మి - ఎట్టుల - కృష్ణునితోను
వియ్యమందెనో - తెలుపుడు అనెను.

రుక్మి కూతురు - రుక్మవతియను
పేరున బరగెడు - సౌందర్యవతి -
స్వయంవరములో - రాజుల ముందే
ప్రద్యుమ్నుడు-ఆ-కాంతను చేకొనె.

తండ్రిని పోలిన - ప్రద్యుమ్నుండు-
మగువతొ-రథమున సాగుచుండగా
ఎదిరి పోరిన - రాజులందరిని
జయించి-ద్వారక జేరెను సుఖముగ.

రెండవ కూతురు - చారుమతిని-మరి
కృతవర్మ-తనయునికి-ఆలిగ నొసగెను
అటులా - తనయల వివాహమ్ములు
రుక్మి-స్వయముగ-శుభముగ జేసెను.

కొంతకాలము - జరిగిన పిదప
మనుమరాలగు - రుక్మలోచనకు -
ప్రద్యుమ్న తనయుడు-అనిరుద్ధునకు
పెండ్లి చేయగా - రుక్మి తలంచెను.

శుభలేఖ నంతట రుక్మి పంపగా
బలరామాదులు - మెచ్చి - హితులతో
బంధులందరితొ - విదర్భ జేరిరి
మంగళ ప్రదముగ - పెండ్లి జరిగెను.

ఆవియ్యముతో - వారందరునూ
ఆనందముగా - గడపు చుండగా
కళింగ రాజుకు - కన్ను కుట్టెను
రుక్మి మనసున ద్వేషము నింపెను.

"నాడు పొందిన - అవమానమ్ము
అంత తేలికగ - మరచి పోతివా!
అదను చూచుకొని - దెబ్బ కొట్టుట
పండినయట్టి - రాజకీయము.

బలరామునికి - జూదము - వ్యసనము
ఆటయందున - నేర్పరికాదు
నీవు గెలిచి - ఆ - గొల్ల వారిని
అవమానించి - నింద బాపుకో.

చెప్పుడు మాటలు - చెవికెక్కినవి
బలభద్రుని - తా - పిలచె జూదముకు
ఆవిధముగను - తన - అంతమును
కోరితెచ్చుకొనె - మూర్ఖుడు - రుక్మి

రుక్మి పిలుపును - కాదనలేక
జూదము నందు - మక్కువ నిండిన
బలరాముడు - తా - వచ్చె జూదముకు
సొమ్ము పణముగా బెట్టి ఆడిరి.

బలరాముడట - ఓడుచుండెను
పందెము మాత్రము-పెరుగు చుండెను
జూదవ్యసనమున పట్టు పెరుగును
పందెము పెంచుట - జరిగి తీరును.

అటుల - ఆడుచు - లక్ష పందెమని
బలరాముడట పందెము పెట్టెను
ఆ పందెములో-బలరాముడు గెలిచెను
కానీ - వారు మోసము చేసిరి.

నాదేనయ్యా - గెలుపు అనుచును
రుక్మి పలుకగా - అచ్చటి రాజులు
రుక్మికి హితులు - కావున వారు
తటస్థమ్ముగా - నుండి పోయిరి.

మరియొక పందెము లక్ష అనుచును
బలభద్రుండు ముందుకు వచ్చెను
ఆ పందెములో-ముందు విధముగా
రుక్మి ఓడె - బలభద్రుడు గెలిచెను.

కానీ - రుక్మి - తా - గెలిచితిననె
ప్రక్కన వున్న రాజులు - పలుకరు
అంతట పలికెను - ఆకాశవాణి
బలరాముడు-మరి-గెలిచెను-అనెను.

వెంటనె కొందరు - రుక్మినప్పుడు
రెచ్చగొట్టిరి - అంతటవాడు
పాతపగను తన-మదిలో నుంచుకు
బలరాముని - అట-హేళన చేసెను.

నే గెలిచితిని - ఓడితివీవు.
ఎందుకు - అంత - రభస చేతువు
జూదమునందు - పశులకాపరులు
రాజులతో - మరి - సాటి వత్తురా.

ఆమాటలకు - బలభద్రుండు
రుద్రుడాయెను - కోపమెగసెను
కొండెత్రాచు వలె - సర్రున లేచి
ఇనుప - దూలమొక దానిని - పెరకెను

రాజులందరిని - రుక్మితొ బాటు
మోదెను - వారు - గోలబెట్టిరి
కళింగ భూపతి శిఖను పట్టుకు
దెబ్బ కొట్టగా - దంతము లూడెను.

పరుగిడుచున్న - రుక్మిని పట్టుకు
పళ్ళురాలునటు కొట్టి - తన్నెను
నేల కూలెను - అసువులు వీడెను
అటుల చంపెను - దొరికిన వారిని.

యదు సింహమును రెచ్చగొట్టెను
చచ్చెను రుక్మి - వానితొ - బాటు
వాని హితులు - అట - నేలకొరిగిరి
ప్రజలందరును - కలవరపడిరి.

అన్న చేతిలో - రుక్మి చచ్చెనని
తెలిసి కృష్ణుడు - తటస్థుడయ్యెను
రుక్మిణికీ - మరి బలరామునికి
అభిమానములు - వుంచగ - తలచెను.

వధూవరులను రథమెక్కించి
బలరామాదులు - యాదవులందరు
ద్వారక జేరుచు - పొలిమేరనగల
కుశస్థలి యను - ప్రదేశమందున.

వివిధ తరులతో - నిండిన చోట
ఆనందముగా - గడిపి - అంతట
మంగళ స్వనములు - ఎగయుచుండగా
ద్వారకలోనికి - అడుగు బెట్టిరి.

రాజా - ఇదెయే ప్రద్యుమ్నాది
యాదవ - కొమరుల - వివాహగాథ
ఆపై గాథ - బలితనయుడగు
బాణాసుర వృత్తాంతము - వినుమనె.

॥శ్రీ కృష్ణచరితము॥



## 7 బాణాసుర వృత్తాంతము

రాజా! బలియను - భూవిభునకును
నూర్గురు కొమరులు-అందులొ జ్యేష్ఠుడు
బాణుడు అనెడి - మహా వీరుడు
అతనికి - వేయి చేతులు గలవు.

భక్తి ప్రపత్తుల పదములబడెను
అంతట - లేచి - ఢక్క నందుకొని
తాండవమ్మునకు - అనువగు రీతిని
అమోఘముగ - మ్రోయించె బాణుడు.

దేవతలందరిలోన - శంకరుని
ఆరాధించును - బాణుడు-నిరతము
శివభక్తులలో అగ్రగామిగా
లెక్కిడ వచ్చును - అంతటివాడు.

ప్రసన్నుడైన ఫాలనేత్రుని
స్తోత్రము చేసెను - బాణుడంతట
"భక్త మానస - సరోవరమ్మున
రాజహంసవు - శివశంకరుడవు.

ఒక దినమున కైలాసము - కేగి
శంకరు - దర్శన మందెను అతడు
ఆ సమయములో - అంబాపతి-తా
తాండవమాడుచు-నుండెను-ఘనముగ.

బలగర్వితులగు - దైత్యులత్రుంచగ
సమర్థుడవు - నువు - హిమగిరినాథా!
సగమేనిచ్చి - అంబతొ కలిసి
తాండవమాడెడి - భక్తవశంకర!

పార్వతి - మదియను-తెల్ల కలువకు
చంద్రబింబము - వంటివాడవు
సర్పరాజగు - వాసుకినే - నువు
కరకంకణముగ - దాల్చినాడవు.

తాండవ మనగా - పొంగిపోదువు
భక్తుల బ్రోవగ - పరుగెత్తెదవు
నా కోరిక ఇది - నాపురమందు
కాపురముండి - నను కాపాడుము".

అని పలుకుచును - మణి కిరీటపు
కాంతులు-అభవుని పదముల వాలికి
అభిషేకమ్ము జరిగినట్టుగా
భక్తి ప్రపత్తుల నమస్కరించెను.

భక్తవశంకరు డంతటి నుండి
తారకుడాదిగ - భూతగణములతొ
గౌరితొవచ్చి - శోణపురమున
బాణుని - కోటకు - రక్షకుడయ్యెను.

ఒక్క దినమున - బాణుడు వచ్చి
గరళకంఠుని - పదముల మ్రొక్కి
చంద్రమౌళిని - సన్నుతి చేసి
మదిలో - కోరిక - తెలియబరచెను.

"త్రిపురాసుర సంహారీ! వినుము!
నాచేతులవి - సలుపు చున్నవి
నాభుజ బలముతొ - పోరుట కొరకు
ఒక్కడైనను - ఇలలో లేడు.

ఫాలనేత్ర! ఓ భక్తవశంకర
కరిచర్మాంబర - హాలాహలధర
శూలాయుధకర - పన్నగహారా!
పాపవినాశ - పరమదయాకర.

గిరిజామనోహర! జగద్వందిత
వెండికొండపై - వెలసిన స్వామీ!
భక్తుల కోర్కెలు - తీర్చే దైవము
నిన్ను నుతించగ - నెవ్వరితరము.

యుద్ధకేళిలో - రిపులతొ పోరి
మదపుటేనుగుల - నేలకూల్చుచు
వేయిచేతులతొ - శతృసేనలను
కదళీతరువుల బోలి - నరకుచు.

వీరవిహారము - చేయట యందు
రక్తధారలను - పిండుట యందు
నైపుణ్యమది - కలిగిన కరములు
పని లేకుండెను - దుఃఖము నిండెను.

మరియొక వీరుడు నన్నెదిరించి
నిలబడువాడు ఇలలో లేడు
నీవు తప్ప మరి - మార్గము చూపే
మహానుభావుడు లేడు - శంకరా!"

ఆ మాటలకు - అంబాపతికి
వల్లమాలిన కోపము వచ్చెను
బలగర్వితునితొ - పలికె శాంతముగ
"ఓయీ మూర్ఖుడ - చెప్పెద వినుము.

ఏ సమయములో - నీ పతాకము
నేలను బడునో ఆ సమయములో
నీ బాహువులు నేలకూలునటు
నీతో సరిపడు - వీరుడు పోరును"

ఆ మాటతొ - ఆనందము నంది
కరముల దురద తీరుననుకొని
కాంతలగూడి - అంతఃపురమున
ఆనందముగా గడపసాగెను.

॥శ్రీ కృష్ణచరితము॥



# 8 ఉషా పరిణయం.

బాణుని కూతురు - ఉషయను కన్య
అందచందముల సాటి లేనిది
గుణశీలముల ఎన్నికైనది
కుసుమకోమలి - నయన చకోరి.

ముగ్ధ మోహిని నిదురలొ - తానొక
మధుర స్వప్నమును - గాంచినదామె
మన్మథుడేయను - నవమోహనుడు
మురిపెముగా-నట-శయ్యను జేరెను.

మందస్మిత వదనార విందముతొ
మంగళమూర్తితొ - మాటలాడినది
మరపురాని - అనుభూతి కలిగినది
మది పులకింతతొ - కనులు తెరచెను.

కలయని తెలిసి - తెల్లబోయినది
కన్నుల నిండుగ - జూచెను మూర్తిని
కల్లయనునటు - తోచుటలేదు
కనబడదేమి అనుచు వెదకెను.

కౌగలించినటు - కిలకిల మన్నటు
కాంతుడాడిన - సరసపు చేష్టలు
కరములు జాచి - ముందు కొచ్చినటు
కాంత ఎంతయో - పులకరించెను.

అంతయు-భ్రమయని-తేలి పోయినది
కలయని - నిజముగ రూఢియైనది
కానీ - కాంతుని దివ్య విగ్రహము
కన్నుల నిండుగ - నిలబడి యున్నది.

భరించరాని విరహవేదనతొ
పాన్పున - కూర్చొని యున్నది - కోమలి
కరములు జాచి - పిలచుచున్నటు
కంటబడినదా చెలికత్తెలకు.

మృదుభాషణముల - అడిగి రామెను
కలగంటివ - ఓ లలనా - అనిరి
కాదని - మాటను దాట వేసినది
కానీ - మదిలో వేదన తగ్గదు.

పెదవులు విప్పి - మాటాడుటకు
వశముగాకను - కనబడె నతివ
చెలికత్తెలకు - తోచుట లేదు
అంతట వారిలొ - చిత్రరేఖయను

ప్రియసఖి-మంత్రి కుంభాండుని-కూతురు
ముందుకు వచ్చి - మురిపెముగాను
మదిలో నున్నది గ్రహించినాను
మధురమైన - అనుభూతిలొ నుంటివి.

అనుచు మెల్లగా - బుజ్జగించుచు
రహస్యమైనచొ - చెప్పనెవరికని
ఒట్టు పెట్టితిని - అనుచు లాలనగ
విషయమంతయు గ్రహించ మొదలిడె.

అంతట పలికెను ఉషాసుందరి
'కలగాంచితినని' - చెప్పి - ఆపెను
ఆపై - పలుకుట - వశముగాకను
సిగ్గు మొగ్గలా-ముడుచుకు పోయెను.

ఆపై వివరము చెప్పుము అనుచు
చిత్రరేఖ - మరి - తొందర జేసెను
కేవల మది ఒక కలయే గాదు
తనువూ - మదియు పులకించినవి.

అనగా తిరిగి - పలికెను జవ్వని
తనుగాంచిన - ఆ సుందరాంగుని
అందచందములు తీరుగ జెప్పెను
అతని చేష్టలు - తెలియ జెప్పెను.

అటుల చెప్పుచు - మది వేదనతో
కంటనీటితో - పలుకకున్నది
ఉడికించుటకు - గేలిచేయుటకు
సమయము కాదని - చిత్ర పలికెను.

"కలలో సుందరు డెవరో తెలియదు
పేరు చెప్పమని అడగక పోతివి
అయినా - వినుము - నా ఆలోచన
బొమ్మలు గీసి చూపెద నేను.

ఎందరెందరో - సుందరాంగుల
మహావీరుల - యక్ష కిన్నరుల
చిత్రపటములను - గీసి చూపెద
గుర్తింపుము - నీ - మోహనాంగుని"

ఆనందించిన ఉషా బాల - తా
తొందర జేసెను - తన ప్రియ సఖిని
పొన్నున గూర్చొని వేచియున్నది
చిత్రరేఖ - తన పని మొదలిడెను.

ముల్లోకముల - ప్రసిద్ధులైన
పురుష పుంగవుల - రూపురేఖలు
పటములు గీసి - పేర్లను వ్రాసి
ఉషా సుందరికి - చూపగ దెచ్చెను.

కిన్నర - కింపురుష - గంధర్వులను
సంగీత కోవిదులు- అనుచు చూపెను
సిద్ధ - సాధ్యులు - చారణ - గరుడులు
ముదిమి గెలిచిన - మహాత్ములనెను.

సుఖముల తేలే - వారని పలికి
సురాసురులను - మరుత్తు - యక్షుల
సుందర మూర్తుల - చిత్రపటములను
సుందరి కపుడు చూపసాగెను.

తేజో వంతులు - కామ రూపులు
నాగులు వీరు - అనుచు ప్రియసఖి
స్వర్గ వాసుల - పాతాళ వాసుల
బొమ్మలు చూపి - కాదని తెలిసి.

భూలోకములో - ధరణీధవుల
చిత్తరువులను - చూపసాగెను
మాళవ - కొంకణ-మత్స్య-పుళింద
మహీశులమ్మా - అనుచు చూపుచు.

కళింగ - భోజ - నేపాళ - విదేహ
పాండ్య - కురు-మరి బర్బర-సింధు
యుగంధ-రాంధ్ర-బంగళ-కరూశ
టెంకణ - త్రిగర్త - ధరణీ ధవులనె.

సుధేష్ణ - మరాట-లాట-పాంచాల
నిషాద - ఘూర్జరక-సాల్వ మహీశుల
మంగళమూర్తీ - ఎవరో చెప్పుము
అనుచు చూపగా - ఫలితము లేక.

జరాసంధుడు - మగధకు రాజు
సింహబలుడు - అతిధైర్యవంతుడు
కీర్తిచంద్రికలు - నిండెను దిక్కుల
అంతులేని - ఐశ్వర్య వంతుడనె.

ఇదుగో చూడు - భీష్మక సుతుడు
విదర్భ నేలును - అతి బలవంతుడు
ఈతడు కళింగ - రాజ్యము నేలును
కదన పండితుడు - ఈ కాళింగుడు.

ఇంతీ! యితడు భగదత్తుండు
భూదేవికి మరి - మనుమడు అగును
ప్రాగ్జ్యోతిషమును - పరిపాలించిన
నరకుని తనయుఢు - శంకరు భక్తుడు.

కాశీరాజుకు - ప్రియసఖుడితడు
పౌండ్రక వాసు దేవుడందురు
కృష్ణుని పేరున - శంఖ - చక్రములు
ధరించి - కృష్ణుని - తిరస్కరించును.

వీరిని గనుము - కమలలోచనా!
చంద్రవంశమున - ఎన్నిక వీరు
దైవ - బ్రాహ్మణ భక్తి పరులయి
అవక్ర విక్రమ పరాక్రములగు.

ధర్మజ - భీమార్జునులు - మరియును
నకుల-సహదేవులు-అయిదుగురమ్మా!
పంచ పాండవులు - అందురు వీరిని -
పోనీలే - మరి - చూపెద కొన్ని.

రాజరాజుగా ప్రసిద్ధి కెక్కిన
కురుకుల మణి - ఈ సుయోధనుండు
గదాయుద్ధమున - గండర గండడు
కాదంటివ - సరి - ఆపెద నింక.

యదువంశములో పుట్టిరి వీరు
శూరసేన - వసుదేవ - ఉద్ధవులు
ఈయన చూడు - బలభద్రుండు
హలాయుధుడు-మరి-మహాయోధుడు.

శేషశయనుడు - శ్యామ సుందరుడు
పద్మనేత్రుడు - పరంధాముడు
భువన పావనుడు - పాపహరణుడు
బలరామునికి - తమ్ముడీయన.

అష్టమహిషులను - ఏలు యిష్టముగ
కృష్ణుడు - ఇతడు-సురవందితుడు
భవరోగమ్ముల - వైద్యుడీయన
గంగ పుట్టెను - పదమంజరుల.

అనుచు చూపగా - మరి మరి జూచి
మనసు నిండుగా వందన ముంచి -
కాదమ్మా - చెలి - చిత్రపటములు
మిగిలినవా మరి - ఆశయున్నదా!

తొందరపడకు - తోయజాక్షి - విను
ఈతని - ప్రద్యుమ్నునిగా పిలతురు
అనుచు చూపగా - తటాలున గొని
పరిశీలించి - మరి - మరి - జూచి.

చిత్రా - యితడే అనుకున్నాను
అంతటి భ్రమ యది కలిగెను నాలో
కాదమ్మా - అని నిరాశపడగా
మరి యొక పటమును జూపెను చిత్ర

అనిరుద్ధుని - ఆ చిత్రపటముగని
పరవశించెను ఉషాసుందరి
గుండెకుహత్తుకు - మురిసిపోయెను
చిత్రను హత్తుకు - కిలకిల నవ్వెను.

వివరములడిగిన ఉషాసుందరికి
చెప్పెను చిత్ర - అనిరుద్ధుడని
శ్రీకృష్ణునికి - మనుమడు - అనెను
సింహవిక్రముడు - తగిన జోడనె.

ఉషాసుందరి కనులు చెమర్చెను
నిరాశతోను మది కలవరపడె
పరాయిపురుషుడు - తనవాడగునా!
అంతయు గ్రహించి - చిత్ర పలికెను.

దిగులు వదలుము - సుందర వదనా!
నేనుండగను - అన్నియు సాధ్యమె
అనుచు వెంటనే - నింగిని సాగి
ద్వారకకేగి - అచ్చట నున్న

అనిరుద్ధు భవనము నందున - ఆమె
కామరూపమున - ప్రవేశించెను
హంసతూలికా తల్పము నందు
హాయిగ నిద్రలో నుండెను - అతడు.

యోగ విద్యతో - అనిరుద్ధుని గొని
మనోవేగమును - మించి నట్టుగా
ఉషా మందిరము నందున జేర్చి
ఉషతో పలికెను - సంతోషముతో

యదుకుల చంద్రుడు-కృష్ణుని మనుమడు
నీ మది దోచిన - మనోహరుండు
సుమశరు మించిన - అందగాడు గద
మందగమన - నీ కోరిక తీర్చితి.

మెలకువ వచ్చి - తికమక పడెను
ప్రదేశమంతయు కొత్తగ తోచెను
బంగరు బొమ్మ - కన్నుల ముందు
అనిరుద్ధునకు - అయోమయంబయె.

తరుణీ - యిచటకు-ఎటుల వచ్చితిని
ఎవ్వరవీవు - అనుచు అడిగిన
అనిరుద్ధునకు - వివరము చెప్పెను
ఆమె మనస్సు - గ్రహించినాడు.

అంతట ఆమెను - అక్కున చేర్చుకు
ఆనంద సీమలొ అడుగు బెట్టెను
అన్ని వసతులు అమరి యుండగ
అడుగు కదపక - గదిలో నుండెను.

అంతఃపురమున - విరిసిన ఆమని
ఆనంద మది - పొంగులు వారెను
ఆకలిదప్పులు - మరచిన జంట
అనురాగపు డోలల వూగులాడిరి.

అంతటిలోన - ఉషాకన్యకు
నెలతప్పినది - విషయము తెలిసి
కావలి వారు - కలవరబడిరి
బ్రతుకు పైన మరి ఆశ వదిలిరి.

ఆలోచించుకు అన్ని విషయములు
రాజుకు తెలుపుట ఉచితమనుకొని
మెల్లగ - సంగతి విన్న వించిరి
అప్రమత్తులము-అని పదముల బడ.

అదిరి పోయెను - బాణాసురుడు
సింహాసనమును వదలి పరుగిడె
సింహము వలె - గర్జించునట్టుగ
గచుచు-ఖడ్గము నందుకు కదలెను.

ఉషా మందిరము జేరి అచ్చట
పాన్పు మీద అనిరుద్ధుని గాంచెను
కిలకిల నవ్వుచు కోమలి యుండెను
ఒరలో నుండి కత్తిని లాగెను.

ఆ శబ్దమునకు తలపైకెత్తి
ఎదురుగ గాంచెను బాణాసురుని
అనిరుద్ధునికి - విషయము తెలిసెను
సైనికు లందరు మోహరించిరి.

దొంగని పట్టుడు - అంతుచూడుడు
అనుచు అరచుచు - ముందుకు వచ్చెడి
బాణుని గాంచి అనిరుద్ధుండు
ఇనుప పరిఘ నొకటందుకు నిలచెను.

విజృంభించి యినుప పరిఘతో
చెండాడెను - అట రాక్షస వీరుల
కొందరు పరుగిడి పోయిరి అంత
బాణుడు ముందుకు వచ్చి నిలచెను.

అనిరుద్ధునితో పోరగ లేక
నాగాస్త్రముతో బద్ధుని చేసెను
దెబ్బల నుండి రక్తము గారుచు
నాగపాశముల - కట్టువడెనట.

తిరిగి - త్రాళ్ళతో బిగించి కట్టి
అచ్చటి నుండి - తీసుకు పోయిరి
విలవిలలాడుచు - ఉషాసుందరి
తండ్రి పదముల బడెను దీనముగ.

కన్న కుమార్తెను - అనుచు పలుకగా
కసరి గొట్టుచు - పలికెను తండ్రి
గొల్ల వానితో - కాపురమ్ముతో
కులము నెల్ల చెడగొట్టితి వనెను.

కావలి వారికి - ఆదేశించెను
కదలనీయక - కాపు కాయమనె
అంతటిలో ఒక భటుడు వచ్చెను
జండా విరిగిన సంగతి చెప్పెను.

అదివిని - బాణుడు ఆనందించెను
భుజముల - దురద - తీరే ఘడియ
శివుడు చెప్పిన - శుభముహూర్తము
వచ్చుచున్నదని - సంతసపడెను.

ద్వారకలో అనిరుద్ధుని - జాడ
తెలియక పోయి - కలవరపడిరి
ఏమయినాడు - అనిరుద్ధుడని
బలరాముడు-మరి-అడుగుచుండెను.

తల్లిదండ్రులు దుఃఖతప్తులై
కళతప్పిన - వదనమ్ముల నుండిరి
అంతట అచటికి నారద మహర్షి
వచ్చెను - విషయము చెప్పి వెడలెను.

రుద్రుడయ్యెను బలభద్రుండు
హలాయుధమ్మును గిరగిరత్రిప్పుచు
శోణపురమును సంద్రగర్భమున
ముంచెదననుచు - ముందుకురికెను.

కృష్ణుడు - అన్నను - శాంత పరచెను
యుద్ధ భేరి - మ్రోయించగ చెప్పెను
దారకుడంత అతి శీఘ్రముగ
కృష్ణుని అరదము సిద్ధము జేసెను.

మనుమని - అతనితొ - మనుమరాలిని
తీసుకురమ్మని ఆశీస్సుల నిడి
సుమంగళులు - అక్షతలను చల్లి
దీవనలిచ్చి పంపిరి కృష్ణుని.

బలభద్రుడును - సాత్యకి - మరియు
ప్రద్యుమ్నుడును - యాదవ వీరులు
రథ గజ తురగ కాల్బలమ్ములతొ
సింహనాదముల సాగుచుండిరి.

భగీరథునితో సాగెడి గంగే -
అన్నటు - కృష్ణుని రథము వెంబడి
అఖండసేన - సాగుచుండగా
స్వర్గ మర్త్య పాతాళములదిరెను.

పదిరెండగు - అక్షౌహిణుల
సేన - కదిలెను - రథము వెంబడి
కృష్ణుని రథము తిన్నగ సాగి
శోణపురమును జేరుకొన్నది.

యాదవ సేన - శోణ పురమును
చిందరవందర చేసి వేసెను
మేడల కూల్చి - బురుజుల త్రోసి
భవనములెన్నో దగ్ధము చేసెను.

పట్నము నుండి ఒక్క జీవియూ
బయట పడెడి మార్గమ్ము లేదయె
విషయము తెలిసెను బాణాసురునికి
క్రోధము నిండి రణముకు సాగెను.

అఖండసేన సమకూర్చుకొని
అంతులేని బలగర్వము నిండి
అమోఘమైన తేరును ఎక్కి
అట్టహాసముగ బయలు దేరెను.

ఆ సమయములో శంకర దేవుడు
భక్త వశంకరుడాయన కావున
బాణాసురునికి అండగ తాను
శ్రీకృష్ణునితో పోరగ వచ్చెను.

ప్రమథ గణంబులు-భూతగణంబులు
కుమారస్వామి - అనుసరించగా
ఫాలనేత్రుడు శూలము నంది
నందినెక్కి - తా - పోరగ వచ్చెను.

ప్రచండ సమరము - సాగుచున్నది
శ్రీకృష్ణుడు - తన - నిశిత శరముల
శివకింకరులను - శివుని కూడను
కలవర పరచెను - పరుగెత్తించెను.

అంతట శివుడు ఆగ్రహమంది
నిప్పులు కురిసే దివ్య శరములను
కృష్ణుని పైన ప్రయోగించగా
వాటిని మధ్యలొ త్రుంచెను కృష్ణుడు.

సహింపరాని కోపముతోను
బ్రహ్మాస్త్రమును వదలెను శివుడు
కృష్ణుడు తిరిగి అదే అస్త్రమున
బ్రహ్మాస్త్రమును త్రిప్పి పంపెను.

వాయవ్యాస్త్రము వేసెను హరుడు
పర్వతాస్త్రమున అణచెను కృష్ణుడు
ఆగ్నేయాస్త్రము వదలెను పశుపతి
ఐంద్రాస్త్రమున అణచెను శ్రీపతి.

అమిత క్రోధమున గరళకంఠుడు
పాశుపతమ్మును ప్రయోగించగా
నారాయణాస్త్రము వదలి కృష్ణుడు
ఆశ్చర్యముగా నణచెను దానిని.

అటుల కృష్ణుడు అస్త్ర బలముచే
కలవరపరచి - అంతట ఒడుపుగ
సమ్మోహనాస్త్రము వేయగ హరుడు
నిద్రలొ జారి ఒరిగె నందిపై.

అంతట కృష్ణుడు కరకుటమ్ముల
రిపుసేనలను నేలకు రాల్చెను
ప్రద్యుమ్నుడు తన శరపరంపరల
కుమారస్వామిని పరుగిడ జేసెను.

సాంబుడు - ఘనమగు పోరునందున
బాణుని కొడుకును కలతబెట్టగా
శరముల ధాటికి నిలబడలేక
ఆహవభూమిని - వదలి పరుగిడె.

బలభద్రుండు విజృంభించెను
ముసలాయుధమున ముందుకు దూకి
కూపకర్ణుడు - కుంభాండులను-అట
మోదగ - చచ్చిరి - రక్తము గ్రక్కి.

ఇరుసేనలట ఘనముగ బోరెను
అంతట - బాణుడు - సాత్యకి తోను
పోరుట ఆపి - చెదరిన సేనల
సమీకరించి - పురిగొల్ప సాగెను.

నెత్తురు - మాంసము-తెగిన తలలతో
ఎముకలు - పుఱ్ఱెలు-తెగిన ప్రేవులతొ
అతిభీకరముగ నాహవభూమి
అగుపించినదా సమరములోన.

శరములు - తెల్ల కలువలు బోలి
వింజామరలు - తెల్లని నురుగయి
శ్వేత ఛ్ఛత్రములు - పద్మములన్నటు
ఎముకలు - ఇసుక తిన్నెల బోలి.

నెత్తురు - అచట - నీళ్ళుగ తోచి
కేశములవ్వి - జలముల పాచిగ
యుద్ధ భూమియది - ఎఱ్ఱనీళ్ళతో
శోణము అనెడి ఏటిని బోలెను.

అంతట బాణుడు అమిత కోపమున
కృష్ణుని వైపు రథము నడపమనె
అయిదు వందల చేతుల యందు
అయిదువందల ధనుస్సులున్నవి.

ఒక్కొక ధనుసున రెండు శరములు
సంధించుటకు సిద్ధపడగను
సమర పండితుడు కృష్ణుడంతట
ధనుస్సులన్నీ తృంచెను నడిమికి.

ఆగక కృష్ణుడు - చంపె సారథిని
రథమును గూల్చెను-అంతట-కృష్ణుడు
ప్రళయకాల మేఘమ్ము ఉరిమినటు
పాంచజన్యమును పూరించెనట.

శంఖఘోషకు - రక్కసి వనితల
గర్భమ్ములవ్వి కలత పడినవి
బాణాసురుడు భయపడి పోయెను
కళాకాంతులవి హరించి పోయెను.

ఆ సమయములో - బాణుని తల్లి
కోటర - అనుస్త్రీ - కొడుకు రక్షణకు
దిగంబరిగా - తల విరబోసుకు
కృష్ణ మూర్తికి - ఎదురు - నిలబడె.

కృష్ణుడు మొగమును తిప్పుకొనగను
అదే అదనని బాణాసురుడు
వెన్నుజూపి - మరి పారిపోయెను
వెన్నుని-ఘనత-తెలిసెను వానికి.

అంతట - అచటకు - శివజ్వరమది
మూడుతలలతో - మూడు పాదముల
భీకరమైన ఆకారముతో
కృష్ణుని మీదకు వచ్చె నొక్కపరి.

కృష్ణుడు వెంటనె - వైష్ణవ జ్వరమును
పోరుకు పంపగ - రెండు జ్వరములు
భీకరమైన పోరు సలుపగా
వైష్ణవ జ్వరము - విజృంభించెను.

ఆధాటికి మరి - ఆగలేకను
శివజ్వరమది - పారిపోయెను
దాని వెంబడి వైష్ణవ జ్వరము
వదలక పరుగిడె - అతివేగముగా

పరుగెత్తిన - ఆ - శివ జ్వరమునకు
రక్షణ దొరకక - తిరిగి - తిరిగి అది
కృష్ణుని పదముల - వ్రాలిపోయినది
కాపాడమని - ప్రార్థించినది.

కరములు మోడ్చి - కమలనాభుని
స్తుతియించినది - ఆ - శివజ్వరము
"నాశములేని - పాపరహితుడవు
అపారమైన శక్తికి నిలయము.

బ్రహ్మ, రుద్ర, ఇంద్రాదులందరికి•
ప్రభువై - ఆత్మగ నెలకొని యున్న
భక్త సులభుడా - భువనమోహనా!
సృష్టి, స్థితి, లయ కారకుడవయా!

ఇంద్రియాలను - నడప గలిగిన
సర్వేశ్వరుడవు - సర్వనియంతవు
ఇచ్ఛా - జ్ఞాన - క్రియా శక్తులతొ
విరాజిల్లెడి - విరాడ్రూపుడవు.

ఊహలకందని -తేజోమూర్తివి
స్వామీ - నిన్ను - సేవింతునిదే -
అంతియె గాక -కాల స్వభావము
అన్నీ నీవే - అవ్యయమూర్తివి.

త్రిగుణాత్మకములు - పుణ్యపాపములు
సుఖదుఃఖములను - ద్వంద్వములున్న
ప్రాణికోటిని భరించునట్టి
చైతన్య రూపమగు - ప్రాణశక్తియు.

పరబ్రహ్మము - పరతత్త్వమును
మోక్షరూపము గలిగిన యట్టి
పరమైశ్వర్యము - గలిగినవాడవు -
జరామరణములు లేనివాడవు.

రవిచంద్రాగ్నుల మించిన తేజము -
ఆరాధించు - భక్తులందరికి
తత్త్వజ్ఞానము - కోర్కెల తీర్చే
అనంతశక్తికి - వందన మిడితిని.

అనేక అవతారమ్ముల నెత్తుచు
బ్రహ్మ మొదలగు సజ్జనులందర
కాపాడెదవు - కారుణ్యాలయ
భూభారమును తీర్చెడి ఘనుడవు.

పుడమి భారము తీర్చుట కొరకై
పుట్టిన యట్టి పురాణ పురుషా!
స్వయం ప్రకాశము కలిగిన వాడవు
నిర్మలమయిన ఆకృతినీది.

భక్త పోషకా - నీవే దిక్కని
నిన్ను వేడక నున్న జీవులకు
పరితాపమ్ముతప్పదు గావున
నీపదములను ఆశ్రయించితిని.

ఆర్తత్రాణ పరాయణుడన్న
బిరుదము నీవు - ధరించినావు
నను కాపాడుట - కష్టము గాదు
కాపాడుమయా -కరుణాసాగర".

అనుచు స్తుతించిన శైవజ్వరమును
అనుగ్రహించెను కృష్ణుడంతట
నిజము గ్రహించి - వేడితివీవు
కాపాడెదను అనుచు పలికెను.

కృష్ణుడు పలికెను శైవజ్వరముతో
జ్వరముల కలహము - నీస్తోత్రమ్ము
నాయనుగ్రహము - పొందిన గాథ
మనసున దలచిన-మేలు కలుగును.

అట్టివారికి - చలిజ్వర బాధ
ఉష్ణ జ్వరపు - బెడద యుండక
సుఖముగ నుందురు"-అనగా-తిరిగి
కృష్ణుని కచట మ్రొక్కెను జ్వరము.

అంతట బాణుడు ఘనమగు రథముతొ
విల్లూ - ఖడ్గము - బాణములంది
పుడమి-అదరునటు-రథము సాగగా
తిరిగి పోరగా - వచ్చె రణముకు.

ప్రచండ భానుని - పోలునట్టుగా
బాణాసురుడు - రణముకు వచ్చి
శత్రుసైన్యమను - ఎండు కట్టెలకు
కార్చిచ్చై శ్రీ కృష్ణుని - తాకెను.

అసంఖ్యాకముగ అమ్ములు వదలగ
కృష్ణుడు వాటిని - తృంచె మధ్యలో
అంతట - కృష్ణుడు - ఆగ్రహమంది
సుదర్శనమ్మును - ప్రయోగించెను.

ప్రళయములోన - సూర్యబింబమన
సాగెను చక్రము - యుద్ధభూమిలో
అంచులనుండి రాలెడి అగ్ని
వజ్రాయుధములు - కురిసినట్లయె.

దేవతలందరు - జయము పలికిరి
అరటిబోదెలను - నరకినట్లుగా
బాణుని కరములు తృంచెను-చక్రము
నాల్గుహస్తములు మాత్రముంచినది.

ఆసమయములో చంద్రశేఖరుడు
కరములు మోడ్చి - పురుష సూక్తమున
ప్రార్థించె నట - పరంధాముని
బాణాసురుని కాపాడమనె.

"పరంజ్యోతివి - పరాత్పరుండవు
ఆగమాలలో నెలకొని యుంటివి
సర్వవ్యాప్తివి - అసమాన్యుడవు
అనంతరూపా - అక్షరమూర్తీ!

నీ నాభి యందున - ఆకాశమ్ము
ముఖమున-అగ్ని-శిరమున-స్వర్గము
కర్ణములందు - దిక్కులు నెలకొని -
నేత్రములందు - ఆదిత్యుడును.

మనస్సునందు - చంద్రుడు వుండి
అడుగుల యందు - భూమి నెలకొని
ఆత్మయందున - అహంకారము
జఠరమందున - సాగరమ్ములు.

తేజమునందు - జలము నెలకొని
భుజముల-ఇంద్రుడు-వెలుగుచుండగా
రోమములందు మేఘమ్ములును
తరువులు - ఓషధులున్నవి స్వామీ.

శిరోజమ్ముల - బ్రహ్మలు వుండి
జ్ఞానమునందు - సృష్టి తొబాటు
ప్రజాపతులును - వెలుగుచుండగా
హృదయమునందు ధర్మముండును

ఇంతటి - మహిమోపేతుడ - వీవు
దివ్యతేజము కలిగిన నీవు
అనేక - అవతారమ్ము లెత్తెదవు
నిన్ను పొగడగ - మాకసాధ్యము.

భూతకోటికి - ప్రథముడ వీవు
ఈశ్వరుడవు-నువు-పరిపాలింతువు
త్రిగుణాత్మకముల నాశ్రయించి నటు
కనబడి - అనేక రూపుల నుందువు.

సత్పురుషులకు - జ్ఞానమునిచ్చి
అజ్ఞాన తిమిరములు పారద్రోలెదవు
మాయకులోబడి - ఇల్లు - ఇల్లాలను
తాపత్రయముల - మునిగి పోదురు.

ఇంద్రియాలకు లొంగిన వారు
నీ పదపద్మమ్ములను గానక
మూర్ఖులు గాను మిగిలిపోదురు
ఆత్మ వంచన చేసికొందురు.

నీ ఆశ్రయము - కాదని జనులు
ఇంద్రియలోలత - పెంచుకున్నచో
అమృతమ్మును - కాలదన్ను కొని
హాలాహలము - మ్రింగినట్లగు.

సజ్జన వందిత! - ప్రసన్నమూర్తివి
ఆనంద రూపివి - నిన్ను నిరతము
నేనూ - బ్రహ్మయు - మునిపుంగవులు
సేవించుచును పరవశింతుము

నీవు లేనిది - సృష్టిలొ లేదు
నీవు కానిది - ఏదియు లేదు
నా ప్రార్థనను - మన్నించి - నువు
నాభక్తుని-మరి-కాపాడుమయా."

శంకరుడటుల - స్తోత్రముచేయగ
చిరునగవులతో కృష్ణుడు పలికెను
అర్థనారీశ్వర - అర్థవంతముగ
నీవు పలికినది - యదార్థమయ్యా!

నీవు కోరినటు - నీకు హితమగు
పనిని చేసెద - విడచెద బాణుని
ప్రహ్లాదుని వంశము నందు బుట్టిన
అసురుల జంపను-అని వరమిడితిని.

వీని గర్వము - అణచి వేసితి
నాల్గుచేతులే - మిగిల్చినాను
నీ భక్తులలో - మేటి ఈతడై
జరామరణములు లేక యుండును.

అటుల కృష్ణుడు-వరము నొసంగగ
బాణునితోను - తనకు గూడను
కృష్ణుని-అనుగ్రహ-మందెను అనుచు
సంతోషించెను - ఫాలనేత్రుడు.

ఆవిధముగను - బలికుమారుడు
బాణాసురుడు - యుద్ధహోమమున
కరములు అనెడి - సమిధలు వేసి
రక్తము అనెడి - ఆజ్యము పోసి

అపురూపమగు - హోమము జేసి
యజ్ఞపురుషుడగు - జగన్నాథుని
అనుగ్రహమ్ము పొందిన వాడై
పరిశుద్ధుడయి - పదములబడెను.

వెంటనె - బాణుడు - పురమునకేగి
కూతురు - అల్లుడు - ఆనందించగ
బంధవిముక్తుల వారిని జేసి
అపార ధనము - ఆభరణమ్ములు.

విశేషమైన - కానుకలిచ్చి
బంగరు తేరున - కూర్చొనబెట్టి
కృష్ణుని వద్దకు - తీసుకువచ్చి
అప్పగించెను - నిండుమనసుతో.

మురిపెముగా - శ్రీకృష్ణుడు వారిని
కౌగలించుకొని - సంతోషించి
రథమునందున - కూర్చొన బెట్టుకు
సాగెను - విజయోత్సాహము నిండి.

శివ-బాణులు-మరి-సెలవు తీసుకొని
వీడ్కోలిచ్చిరి - శ్రీకృష్ణునికి
మంగళ ధ్వనులు మిన్ను ముట్టగా
రథములు సాగెను - సేనలు కదిలెను.

ద్వారక లోన పెండ్లి సందడి
పొంగివెల్లువై - పారుచున్నది
స్వాగతమ్మును పలుకుచున్నటు
నగారాలు అట మ్రోగెను - నగరిని.

రెపరెపలాడుచు - ఎగురు పతాకలు
ఆహ్వానమును యిచ్చుచున్నవి
శ్రీకృష్ణునకు - నూతన జంటకు
మంగళహారతు లిచ్చిరి - వనితలు.

అంతఃపురమును - జేరెను కృష్ణుడు
స్వాగతమ్మును - పలికిరందరు
ముందుగ - రుక్మిణి - హారతినిచ్చి
దిష్టితీసి - దీవించి - పలికెను.

అమ్మా! రతీ - కోడలు ఇదిగో
చక్కని చుక్క - నీకు తగ్గదు
అనుచు-పలుకుచు-ఉషాసుందరిని
రతీ దేవికి - అప్పజెప్పినది.

జంటగ - తనయుడు వచ్చినందుకు
ప్రద్యుమ్నుడును - రతీదేవియు
ఆనందముతో - పొంగిపోయిరి
పండుగ జేసిరి ద్వారక యంతయు.

ఓ మహారాజా! యదుకుల సింహము
శివబాణులను జయించి-ముదముగ
వధూవరులను తోడ్కొని తెచ్చిన
గాథ ఎంతయో విశేషమైనది.

దీనిని - చదివిన - వినిన వారికి
ఐహిక సుఖములు అందును-మరియు
మోక్షలక్ష్మి - తా - వచ్చి చేరును
అనుచు-మధురముగ చెప్పెను రాజుకు.

అంతట - రాజు - అంజలి యొగ్గి
స్వామీ! యదుకుల చంద్రుని-గాథలు
తనివి తీరదు - ఎన్ని విన్నను
ఆపై గాథలు చెప్పుడు అనెను.

❋❋❋ ॥శ్రీ కృష్ణచరితము॥

## 9 నృగ మహారాజు చరిత్ర

కృష్ణుని తనయులు-ప్రద్యుమ్నుడును
అతని సోదరులు ఒక దినమున-అట
వనవిహారము చేయగ - సాగి
సుందరవనముల - తిరిగి అలసిరి.

దప్పిక నిండి - నీటిని వెదకిరి
అచ్చటగనిరి - పెద్ద బావిని
అందులొ చూడగ నీరులేదు మరి
వింత ఒక్కటి - కనబడె వారికి.

నీరులేని - ఆ - పెద్ద బావిలో
ఘనమగు - ఊసర వెల్లిని గాంచిరి
వెలికి తీయగ - శ్రమను పడిరట
కదల్చలేక - పోయిరి - వారు.

అంతట - వారు - తండ్రిని చేరి
విషయమంతయు - వివరించగను
సర్వజ్ఞుడు - మరి - తెలియనట్లుగా
అంతా విని - అట - నూతిని జేరెను.

ఊసర వెల్లిని - గాంచెను కృష్ణుడు
ఎడమచేతితో - ఘనమగు జీవిని
గడ్డి పోచలా - వెలికి తీసెను
నేలను బడగ - చిత్రము జరిగెను.

ఊసరవెల్లి - మనిషిగ మారెను
రత్న కిరీటము - వెలుగుచుండగా
ఆభరణమ్ముల - మేలువస్త్రముల
దివ్యరూపమున - నమస్కరించెను.

అంతట కృష్ణుడు - వివరములడుగగ
కృష్ణుని పదముల - నమస్కరించి
వివరించెను-తను-నృగుడను-అనుచు
ఇక్ష్వాకువునకు - తనయుడ ననెను.

"స్వామీ! నేను - చెప్పెడిమాటలు
ఆత్మ స్తుతిగా - తలంచవలదు
అడిగితివీవు - అందుల కొరకు
చెప్పక తప్పదు - నాగాథ - విను

అనంతసంపద - కలిగిన - నేను
ధార్మిక బుద్ధిని - కలిగి యుంటిని
దానధర్మముల - వెనుకడు గిడక
గోదానమ్ముల - పేరుగాంచితి

తారలనైనా - లెక్కిడ వచ్చును
కానీ - నేను దానము చేసిన
గోవుల సంఖ్య - లెక్కకు అందదు
దానగుణముతో - వంశము శోభిలు.

వత్సమ్ములతో - బంగరు గిట్టల
అలంకారముల నిండిన గోవుల
వేదాధ్యయనులు - తపఃశ్శీలురకు
దక్షిణతో మరి - దానమిచ్చితిని.

న్యాయార్జిత - విత్తమ్ముతొ నేను
బంగారమును - రత్నమ్ములను
పంటభూములు - వస్త్రమ్ములను
గృహములు-గజములు దానమిచ్చితిని.

పూతనాంతకా! - పెద్దల చలవతొ
పంచమహాయజ్ఞమ్ములు - చేసితి
తోటలు వేసి - నూతులు - చెరువులు
త్రవ్వించితిని - దాన గుణముచే

కాలమట్టుల - జరుగుచుండగా
కశ్యపుడనునొక - బ్రాహ్మణునకు
దానమిచ్చిన - గోవు ఒక్కటి
తిరిగి మందలో - కలసి పోయినది.

తెలియక - నేనా - ఆవును - తిరిగి
దానమిచ్చితిని - విప్రునొకనికి
ఆతడు-ఆవును గొనిపోవుచుండగ
గుర్తుపట్టి - ఆ - కశ్యపు డాపెను.

గోహర్తనని - నిందవేసెను
ఆవును - గొని పో యత్నము చేసెను
అంతట విప్రుడు - వివరము జెప్పి
దానముగానది లభించె ననెను.

తిరిగి - యిద్దరూ - నాకడ కొచ్చిరి
కటువుగ పలికెను - కశ్యపుడంతట
ధర్మ పాలనకు - గద్దెనెక్కితివి
అధర్మవర్తివి - దోషివైతివి.

దానము జేసిన - గోవు గదా - యిది!
తెలియక మందలొకలిసి - పోవగా
దానిని తిరిగి - దానమిచ్చితివి
దాతవు - హర్తవు - నీవే అయితివి.

వినయము నిండి - ప్రార్థించితిని
తెలియక చేసిన - దోషమంటిని
లక్షగోవులు - ఇచ్చెదనంటిని
ఆ గోవును మరి - వదల మంటిని.

లక్షగోవులా - ఎందులకయ్యా
రాజ్యమంతయు - యిచ్చిన గాని
వదలను గోవును - అనుచు పలికెను
పాపఫలమది - అనుభవించమనె.

అంతట - నేను - రెండవ విప్రుని
కోరితి - గోవును - వదలమనుచును
ఆతడు కూడా - అదే ఆవును
వదలను అనుచు - నొక్కి జెప్పెను.

అపరిష్కృతమై - నిలచె సమస్య
కాలము గడిచి - చెల్లి పోతిని
యమకింకరులు - నను గొని పోయి
యమధర్మరాజు కడ - నిలబెట్టగను

దండధరుడు - తా - జాలిగ పలికెను
మనుజేంద్రా - నీ దానగుణముచే
ముల్లోకముల - కీర్తి లభించెను
పుణ్యమూర్తివి - నిస్సంశయమది.

ముందుగ - నీవు పాపఫలమును
అనుభవించక తప్పదు - రాజా!
బ్రహ్మశాసనము - బ్రహ్మలిఖితము
అనుచు భువికి నను త్రోసి వేసెను.

అంతటి నుండి ఊసరవెల్లిగ
నీచజన్మతో - దుఃఖము నిండి
కాలము గడిపితి - పుణ్యవశమున
నిన్ను గాంచితిని - మంగళమూర్తీ!

నందనందనా - నిను దర్శించితి
ఆనందముతో - పొంగిపోతిని
నీ పదసేవ - నిరంతరమ్ము
వరముగ-నాకు-అనుగ్రహించుము.

అనుచు - పదముల వ్రాలిన-నృగునకు
అభయమునిచ్చెను - అంతట ఆతడు
అచటకు వచ్చిన - విమానమ్ముపై
స్వర్గలోకము జేరెను రాజా!

తీయగ కృష్ణుడు - తనవారలకు
ధర్మబోధను చేసెను - అచట
విప్రద్రవ్యము - కార్చిచ్చువలె
రాజవంశముల - కాల్చి వేయుననె.

అవనీ నాథుల - ఐశ్వర్యమను
సంద్రము నంతయు - హరించు శక్తి
బ్రాహ్మణ ధనమను - బడబాగ్నికి-మరి
నిశ్చయమ్ముగా - నున్నది అనెను.

రాజుల సంపద అనెడి - కొండను
కూల్చును-విప్రుల-ధనమను వజ్రము
వారి కీర్తియను - చంద్రకాంతికి
విప్రధనమగు - ప్రచండ సూర్యుడు.

విషముకు - విరుగుడు-వున్నది-కానీ
బ్రాహ్మణసొత్తను-విషము-విరగదు -
కావున - రాజు - బ్రాహ్మణ సొత్తును
వశపరచుకొన - అరిష్టమగును.

ఏమరుపాటున - తాకిన గాని
నిప్పు - కాల్చక మానదు గాదా!
బ్రహ్మణ ధనము - అపహరించగా
బ్రాహ్మణుడపుడు - కన్నీరిడు గద.

ఆ కన్నీటితొ - తడసిన నేలను
ఎన్ని రేణువులు - వున్నవొ - అన్ని
సంవత్సరములు - ఆహర్త - మరి
కుంభీపాక - నరకము నుండును

అతడే గాక బ్రాహ్మణద్రవ్యము
అపహరించిన - దోషము వల్ల
ముందు - వెనుకలు-పదిపది తరముల
వారందరు - నరకమ్మున నుందురు.

తానైయిచ్చిన దానిని గాని
ఇతరులు యిచ్చిన దానిని గాని
విప్రుని పొలమున పండు ధాన్యము
అపహరించి - మరి-భుజించువాడు.

అరువది వేల - వత్సరమ్ములు
మురికి కూపమున-పురుగై యుండును
ఇది అంతయును - తెలిసినవారు
బ్రాహ్మణు నెడల - భక్తిగ నుందురు.

విప్రుడు తాను దురుసుగ నున్నను
ఎదురాడక - మరి - మన్నించవలె
వినయము నిండి - నమస్కరించిన
వారందరును - నాకు హితులగు.

కావున - నేను - నిత్యము వారికి
పూజలు చేతును - అంతియె గాక
విపరీతముగ - నడచు దుష్టులను
వెదకి - నేను - శిక్షించెద - వినుడు.

కావున మీరు - భక్తిగ నుండుడు
అనుచు - ఆజ్ఞనిడి వెడలెను కృష్ణుడు
రాజా - ఈకథ విను వారలకు
ఇహ-పరసుఖములు అందును తథ్యము

అని చెప్పుచును - శుకయోగీంద్రుడు
ఆపైగాథను - రాజుకు చెప్పెను
రాజా! ఇది బలరాముడు - తాను
వ్రేపల్లెకు - మరి - వెళ్లిన గాథ.

॥శ్రీ కృష్ణచరితము॥



## 10 బలరాముడు వ్రేపల్లెకువెళ్ళుట

వ్రేపల్లెలో గల - బంధుల-హితులను
సందర్శించగ - బలభద్రుండు
బంగరు తేరున - వైభవమ్ముగా
వ్రేపల్లె జేరెను - స్వాగతమందెను.

గోపాలకులు - గోపీ జనము
ఆప్యాయముగా పలుకరించిరి
సముచితమ్ముగా - మర్యాదలవి
బలరామునికి - లభించెనచ్చట.

యశోదానందుల - పదముల
భక్తి ప్రపత్తుల - వందనమిడెను
ఆనందముగా ఆదంపతులు
గుండెకు హత్తుకు - పరవశించిరి.

ఎన్నాళ్ళకు నువు వచ్చితి వయ్యా
తమ్ముడు కృష్ణుడు ఏడీ? రామా!
సుఖముగ నాతడు ఉన్నాడాయని
కుశలప్రశ్నలు - కురిపించిరట.

ప్రతి గృహమునకు స్వయముగ వెళ్ళి
పెద్దలందరికి - నమస్కరించి
పిన్నలందరికి ఆశీస్సులనిడి
వారిమన్ననలు అందెను అతడు.

బలరాముడు - వచ్చెనని - విని
గోపికలందరు - వచ్చి చేరిరి
నమస్కరించి - కుశలము అడిగిరి
వారి కుశలము అడిగెను - అతడు.

అంతట వారు - గద్గద స్వరమున
మీ తమ్ముడు - ఆ పద్మనేత్రుడు
బాగున్నాడా-మరి-మమ్ముల మరచెను
అందమైన - ఆ - నగరిలొ నుండెను.

పట్నవాసపు - విలాసమ్ములతొ
అందగత్తెలగు - భార్యామణులతొ
మా మాటను-తను-తలచున-మదిలో
మమ్ము - పూర్తిగా మరిచి పోయెనా!

నీడగ - తిరిగిన - తోడు నీడలను
యమున ఒడ్డున - గడపిన క్షణములు
వనవిహారములు - వెన్నెల రాత్రులు
మరచి పోయెను - ఎంతటి గడసరి.

అనుచు బాధగా - అనుభూతులతో
కనులు చెమర్చిన-వారి-మనస్సుల
శాంతి కలుగు నటు - బలరాముడు-తా
తియ్యని మాటల - సంతసపరచెను.

రెండు మాసములు - బలరాముడట
బంధుల - హితుల - ఆప్యాయతను
అనుభవించుచు - ప్రకృతి ఒడిలో
పరవశించుచు - గడిపి వేసెను.

పులకరింతతో - తరువులన్నియు
తేనెలు - మద్యము కురిపించినవి
ఆనందముగా - బలరాముడట
తనివితీరగా గ్రోలెను వాటిని.

అతిగా మద్యము - నాతడు గైకొని
ఆనందముగా - నున్న సమయమున
అంతదవ్వులో - యమునను గాంచి
ముందుకు రమ్మనె - స్నానమాడగ.

అంతటిలోన - మత్తు దిగినది
తిరిగి పొమ్మని ఆదేశించెను
తానే స్వయముగ-యమునా నదిలో
జలకాలాడి - ఆనందించెను.

బదులు పలుకక-యమున తోయములు
పారుచుండగా - ఆగ్రహమ్మున
పోయలు-పాయలు-చేతుననుచును
హలాయుధమ్మున లాగెను యమునను.

గట్టున జేరిన బలరామునికి
విలువగు నగలు - వస్త్రము లిచ్చి
బంగరు పూలమాలను యిచ్చి
గౌరవించినది - యమునానది అట.

అదిగని-యమున-గడగడ లాడుచు
అతివ రూపున - ముందర నిలచి
కరములు మోడ్చి - ప్రార్థించినది
పదముల వద్దకు - వచ్చితిననెను.

యమునలొ - నాడు - నాగలితోను
చేసిన గుర్తు - నేటికి యున్నది
తెల్లగా నట - కనబడునయ్యా
అనుచు రాజుకు - చెప్పెను మౌని.

రాజా! వినుము కృష్ణుని - కడకు
కరూశ దేశాధీశుడు అయిన
పౌండ్రక - వాసుదేవుడు అనెడి
ధరణీ ధవుడొక వార్త నంపెను.

❀❀❀ ॥శ్రీ కృష్ణచరితము॥

## 11 పౌండ్రక వాసుదేవుడు

భువిలో - నేనే - వాసుదేవుడను
ఆనామము - మరి - నాకేచెల్లును
కావున - నీవు - పేరు మార్చుకో
అనుచు కృష్ణునికి హెచ్చరికంపెను.

పౌండ్రక వాసుదేవుడు - అనెడి
ధరణీ ధవుడు - మాకు ఏలిక
ఆయన చెప్పిన మాటలు వినుడు
ఆగ్రహముతో నుండెను అతడు.

దూత వచ్చి - అట - ద్వారకలోన
నిండుకొలువులో - కృష్ణుడుండగా
రాజుపలుకులు - వినిచెను - వారికి
"రాజా! కరూశ దేశము నాది.

వాసుదేవుడను పేరు - నాకుతగు
గొల్లడు తగడు - ఆపేరున కనె
నేటినుండి - ఆపేరును వదలి
అసువులుంచుకో మనుచు చెప్పెను.

అంతియె గాక – నేటి నుండి మరి
ఆయన మాటను మీరకుండవలె
అటుగాకున్న – రణము – తప్పదనె
స్వామీ ఇవియే–మాప్రభు మాటలు".

దూత మాటలు – వినిరి కొలువులో
ఎంతటి పొగరు – అనుచు తలంచిరి
కృష్ణుడు – వారిని శాంతపరచెను
దూతను గాంచి – పలికె – తీరుగా.

"దూతవు – నిన్ను–పరుషము లాడను
పొగరుబోతురా! మీ మహరాజు
పోరున తెగురా – నీశిరస్సది
అంటిని–అనుచు–చెప్పుము–వానికి"

దూత పలుకుల – రోషము పెరిగి
యుద్ధప్రయత్నము – నారంభించెను
వెంటనె – కృష్ణుడు – తేరు నెక్కెను
కరూశదేశము – సమీపించెను.

విషయము తెలిసి – పౌండ్రకుడపుడు
ఆయుధాలతో – సేనాబలముతొ
కదనరంగముకు కదిలెను – వడిగా
కాశీరాజు సేనతొ వచ్చెను.

కృష్ణుని వలెనే – వేషమున్నది
శంఖ–చక్రగద – తీరుగ దాల్చి
మాయాకౌస్తుభము – మెడలో దాల్చి
మకర కుండలము – లలంకరించుకు.

కాలియందెల – మువ్వల మ్రోయగ
కరకంకణములు – మెడలో మాలలు
గరుడధ్వజము – పీతాంబరము
రత్నకిరీటము – కస్తురి తిలకము.

నాలుగశ్వములు – అమరిన తేరుతొ
కృష్ణునితోను – సమానమయిన
అలంకారముల రణముకు రాగ
పకపకనవ్వెను – నందనందనుడు.

రోషము పెరిగి – రాజు అంతట
పండ్లు కొరుకుచు – వాడి బాణములు
కృష్ణుని పైన సంధించగను –
వాటిని పొడి – పొడి – చేసెను కృష్ణుడు.

ఆనందముగా – కృష్ణుడప్పుడు
పాంచజన్యము – పూరించగను
అదిరిన సేన – కలవరపడినది
కొందరు వొరిగిరి – అసువులు వీడి.

వెంటనె – కృష్ణుడు – శరములు వదలి
రిపుసేనలను – నేలగూల్చెను
అదిగని – కొందరు – సైనికులంత
పరుగుతీసిరి – బ్రతుకు ఆశతో.

సేనాబలము – అంతమయినను
పౌండ్రకుడపుడు – ముందుకు వచ్చెను
వానిని గాంచి – హేళన చేయుచు
వీరుడ రమ్ము – ఎదురుగ నుంటిని.

నీవే - యికపై - వాసుదేవుడవు
కానీ - అసువులు - వుండవు నీకు -
వెఱ్ఱి వేషముల - మహానటుడవు
నీకు లొంగి - నే - బ్రతుకగవలెనా!

అనుచు పలుకుచు - నిశిత శరముల
రథము - సారథి - అశ్వమ్ములను
నేలకూల్చి - మరి-చక్రము విడువగ
తలవేరైనది - మొండెము నుండి.

పౌండ్రకు శిరమును-త్రుంచిన చక్రము
కాశీరాజు తలను త్రెంచెను
ఆ - శిరమున శ్రీ కృష్ణుడు నేర్పుగ
బంతిమాదిరిగ - శరముల ఆడెను.

కాశీ తేని - శిరమునట్టుల
నేలను - బడనీకుండగ - కృష్ణుడు
గాలిలోన - మరి - ఆడించి - అట
అతని - పట్టణములోనికి గొట్టెను.

రాజభవనపు - ముంగిట పడిన
శిరమును గాంచిరి-పురజనులందరు
రాజపత్నులు - వలవలనేడ్చిరి
తనయుడు-ఎంతో కుమిలి పోయెను.

తండ్రికి తగిన - క్రియలను జేసి
సుదక్షిణుడు-మది-క్రోధము పెంచుకు
కృష్ణుని - వధించ వలెనని - తలంచి
పురోహితునితో - యోచన చేసెను.

పురోహితుని - ఆదేశము మేరకు
వారిద్దరును భక్తి శ్రద్ధల
సాంబశివుని - ఆరాధన చేసిరి
అంతట-శివుడు-దర్శనమిడెను.

త్రిపురాంతకుని - స్తోత్రము చేసి
మదిలో పగ - యది - తెలియపరచుచు
తండ్రిని - జంపిన - కృష్ణుని జంపే
మార్గోపాయము - చెప్పగ వేడెను.

అభిచారహోమము - యథావిధిగను
నిర్వర్తించిన -ఆయాగమునకు
ప్రీతినందిన - అగ్నిహోత్రుడు
సాయపడునని - శివుడు చెప్పెను.

కఠోరమైన - దీక్షవహించి
అభిచారహోమము - చేయగనంత
హోమమునుండి - మహాకృత్యయను
మహోగ్రశక్తి - ఆవిర్భ వించెను.

నిప్పులు రాల్చే - ఎఱ్ఱని కన్నులు
వజ్రమంతటి - ఘనమగు కోరలు
రాగివర్ణముతొ - కేశములుండి
వికృతమ్ముగా - మంటలొ పుట్టెను.

కత్తివంటి - తన నాలుకనూపుచు
ప్రళయాగ్ని వలె - తోచు - శూలముతొ
బ్రహ్మాండమును - ఒక్క గుటకలో
మ్రింగునట్టుగా - బయటకు వచ్చెను.

తాళవృక్షములు - అన్నటు-పొడవగు
కాళ్ళను గలిగి - భీకరరూపి
దిగంబరిగ - మరి ద్వారకవైపు
సాగుటగాంచి - నేల - వణకెను.

భూతగణంబులు-నాట్యము జేయుచు
పెడబొబ్బలతో - అరచుచుండిరి
అటుల సాగిన - కృత్య అంతట
ద్వారక చేరెను - హడలిపోయిరి.

అల్లకల్లోలము - సృష్టించినది
హాహాకారము - లెగసెనొక్కపరి
కృష్ణా - నీవు కాపాడు మయా!
ఆపద్బాంధవ - ఆదుకోవయా!

అనుచు - అరచెడి-అరపులన్నియు
అంతఃపురమున - ఆనందముగా
పాచికలాడెడి - కృష్ణుడు - వినెను
కృత్య విషయము - అవగతమైనది.

ఆశ్రిత రక్షకుడుపేక్షించక
సుదర్శనమ్మును - లీలగ వదలెను
మంచివారికది - సు - దర్శనమ్ము
దుర్మార్గులకది - యమదర్శనము.

రివ్వున సాగిన - విష్ణు చక్రము
కృత్యను తరిమెను - ద్వారకనుండి
చక్రధాటికి - నిలబడలేక
భూతగణముతో - పరుగిడె కృత్య.

తనను పంపిన - సుదక్షిణుని - మరి
ఋత్విక్కులను - కాల్చివేసెను
చక్రము - కాశీ రాజ్యము కాల్చి
కృష్ణదేవుని - సన్నిధి జేరెను.

కృత్యను - అటుల - పరుగిడ జేసి
శత్రు విజయము నందిన యట్టి
కృష్ణలీల - విన - పాపము తొలగి
సుఖము కలుగును-విను మహరాజా!

అనుచు వ్యాసుని తనయుడాతడు
భాగవతమ్మున - కృష్ణుని చరితము
వీనుల విందుగ - వినిపించుచును
ఆపై గాథను - ఆరంభించెను

*** ॥శ్రీ కృష్ణచరితము॥

## 12 బలరాముడు ద్వివిదుని జంపుట

వ్రేపల్లెలొ - బలరాముడు గడిపి
ద్వారక జేరెను -తనమిత్రులతో
ఆసమయములో - ద్వివిదుడు అనెడి
కపి యోధుడు-ఆ-ద్వారక జేరెను.

మైందుని-తమ్ముడు-ద్వివిదుడు అనెడి
కపియోధుడు - ఆ - బలవంతునికి
నరకునితో - అతి స్నేహముగలదు
నరకుని వధను - వినెనా ద్వివిదుడు.

కృష్ణునిపైన - ద్వేషము పెంచుకు
కృష్ణుని పాలన సాగెడి నేలను
పాడు చేయుచు - హింసపెట్టుచు
కల్లోలము - సృష్టించ సాగెను.

పల్లెల కాల్చుచు-తోటలు కూల్చుచు
మేడలు - నేలకు-మట్టము చేయుచు
నదుల జలముల-కలుష పరచుచు
పశువుల చంపుచు - క్షోభపెట్టెను.

స్త్రీలూ - బాలురు-వృద్ధులు-అనుచు
జాలిచూపక - చిదుక బాదుచు
వారిని కట్టి - ఈడ్చుకు పోయి
కొండగుహల - బంధించుచుండెను.

అగడ్తలలో - నిలువున ముంచి
స్త్రీలను చంపుచు - ఆనందించుచు
మెల్లమెల్లగా - ద్వివిదుడు - తాను
ద్వారక చేరెను - దుష్ట బుద్ధితో.

ద్వారకలోన - అడుగు బెట్టిన
ద్వివిదునికచట - అతిశ్రావ్యముగా
సంగీతమది వినవచ్చినది
ఆదిక్కునకు - సాగెను - అతడు.

రైవత - పర్వత - మచ్చట గలదు
విశాలమైన - గుహలో - నచట
బలభద్రుండు - సుందరస్త్రీలతో
పాచికలాడుచు-ముదముగ నుండెను.

మధువును గ్రోలి - మత్తు నిండెను
మదగజమ్ములా - అగపడు చుండెను
కన్నులు రెండు - ఎర్రగ నున్నవి
ఆ-బలరాముని గాంచెను-ద్వివిదుడు.

గుహ కెదురుగను - నిలబడియున్న
చెట్టు నెక్కెను - ఆ కపి వీరుడు
కోతి చేష్టలు - చేయమొదలిడె
కాయలు కొరికి - విసర సాగెను.

ఒక్క గెంతులో - గుహలో కురికి
కనబడు - అతివ - కొప్పును లాగి
గోళ్ళతొ గీరి - రెప్పపాటులో
తిరిగి చెట్టును - చేరుచుండెను.

కోతిచేష్టలు - భరించలేక
బలభద్రుండొక - రాయిని - విసరెను
దెబ్బతప్పుకొని - ద్వివిదుడంతట
లోపలనుండి కుండను తెచ్చెను.

మద్యభాండమది - గ్రహించి - ఎగిరి
తరువునుండి - అట - నేలకు విసరగ
ప్రియమగు మద్యము - నేలపాలవ
గాంచె నచ్చట బలభద్రుండు.

ఆగక - ద్వివిదుడు - గుహలో కురికి
అతివలచీరలు - చింపసాగెను
హారమ్ములను త్రెంపసాగెను
క్రోధము పెరిగెను - బలరామునకు.

అవమానమ్మును - అల్లరి చేష్టను
భరించలేక - బలభద్రుండు
సత్రున లేచి - హలము గ్రహించి
ముందు కురికెను - కపిని తాకెను.

తరువులన్నియు - సమాప్తి అయినవి
అంతట ద్వివిదుడు - కొండరాళ్ళను
అవలీలగను - ఎత్తి - విసరెను
వాటిని - పొడి పొడి చేసెను-వీరుడు.

వెంటనె-ద్వివిదుడు-బలముగ నచటి
ఘనమగు తరువును-పెరకి-విసరెను
దెబ్బతగిలిన బలరామునికి
అమితమైన - క్రోధమ్ము ఎగసెను.

అదిపని గాదని - ఆ కపియోధుడు
ద్వంద్వయుద్ధము చేయగ నిలచి
బలముచూపుచూ - బలరాము నట
పిడికిలి బిగించి - పొడిచెనొక్కపరి.

హలాయుధమ్మును - గిర్రున త్రిప్పి
మోదగ - ద్వివిదుడు-మూర్ఛనందెను
తిరిగి - తేరుకొని - రక్తము కారుచు
మరియొక-తరువును-విసరె బలముగ.

ఆ దెబ్బకు - మరి - ఉగ్రమూర్తియై
ద్వివిదుని - పట్టి - బలభద్రుండు
మెడపై గ్రుద్దగ - కళ్ళువూడిపడె
మెదడు బైటపడి - నేలకొరిగెను.

వచ్చెడి - తరువును - బలభద్రుండు
మధ్యలొ త్రుంచెను - ఆయుధమ్ముతో
అటులా ద్వివిదుడు-విసరిన తరువుల
నేలకు రాల్చెను - బలభద్రుండు.

ఘన శరీరము గలిగిన - ద్వివిదుడు
నేలను బడగ - నేల అదిరెను
రైవతగిరి - యది - కదలెనొక్కపరి
సురలు - ముదముతో - పులకరించిరి.

పుష్పవృష్టి కురిపించిరి - సురలు
బలభద్రుండు - సేదతీర్చుకొని
లలనామణులతొ - ఆనందముగా
పట్టణమ్మున అడుగు బెట్టెను.

 ॥శ్రీ కృష్ణచరితము॥

# 13 దుర్యోధనునితో వియ్యం

దుర్యోధనుని ముద్దుల కూతురు
లక్షణ అనెడి - సుమ సుకుమారి
అందచందముల సాటిలేనిది
శుభలక్షణ - మరి - సుగుణాలగని.

కల్యాణమునకు - సరిపడు వయసున
స్వయంవరమును - జరిపించుటకు
తండ్రి యోచన చేయుచుండగా
సాంబుడు - వినెను - ఆమె గురించి.

కృష్ణుని తనయుడు–సాంబుడు–వీరుడు
జాంబవతికి – మరి – పుట్టినవాడు
సాహసమ్ముతో – శుభలక్షణను
రథమున నిడుకొని – వచ్చుచుండెను.

కౌరవవీరులు – యుద్ధ చతురులు
అయినా – సాంబుని – విక్రమమ్మునకు
సిగ్గు జెందిరి – నిలబడలేక
పోరుట – ఎటులో – శంకలొ పడిరి.

కౌరవ వీరులు – కలవర పడిరి
తెలివి తెచ్చుకొని – పోరగ వచ్చిరి
సింహనాదమును – సాంబుడు చేసి
కురువీరులపై–శరములు వదలెను.

అంతటిలోన – ధైర్యము తెచ్చుకు
అందరొక్కటై – తెగించి నిలచి
అనేక శరముల – సాంబుని వారు
ఉక్కిరి బిక్కిరి చేయసాగిరి.

గొల్లడు – నేడు – గడసరి అయ్యెను
ఎత్తగ లేని – బరువు నెత్తునా!
అనుచు – హేళనగ – కౌరవవీరులు
శరవర్షము – కురిపించసాగిరి.

సాంబుని రథపు టెక్కెము – విరిగెను
సారథి ఒరిగెను – అంతట – అతడు
లక్షణతోను – రెప్ప పాటులో
రథమునుండి – మరి నేలకురికెను.

మంచు కమ్మినటు – శరములన్నియు
రథమును కప్పగ – సాంబుడంతట
చలించకుండా – తనశరములతో
వారి శరములను – త్రుంచి వేసెను.

అదే అదనుగా – అందరొక్కటై
సాంబుని అచట – బంధించి – మరి
ఆనందముతో – రథమున నిడుకొని
విజయోత్సాహము – నిండి వెడలిరి.

ఒక్కడె వీరుడు – కురుయోధులను
నిగ్రహించి అట పోరుచుండగా
పులకరించిన – సురలు నింగిని
దేవదుందుభులు మ్రోయించిరట.

సాంబుని విషయము – నారదమహర్షి
రామకృష్ణులకు – తెలియబరచెను
ఉడికి పోయిరి – యాదవులందరు
అమిత క్రోధమున – కదలి పోయిరి.

ఎక్కడ చూచిన – అక్కడె–సాంబుడు
మెరపులాగ – మరి – పోరుచుండగా
రిపుసేనలవి – కలవరపడెను
రక్తధారలు – పారుచుండెను.

ఉగ్రసేనుడు – వారికి రాజు
ఆయన – ఆనతి – నందిన వారై
యుద్ధ భేరులు – మ్రోయించిరట
కౌరవసేనల – రాల్చనెంచిరి.

పంచభూతములు - కంపించినవి
కడలి - గట్టిగా - ఘోషించినది
భూమి వణకెను - అంతటితో మరి -
కురువంశమ్ము - మిగలదు అనిరి.

యుద్ధభేరులు - సన్నాహములు
గాంచిన అంతట - బలభద్రుండు
తిరిగి - యోచన - చేసెను - తాను
సేనాపతులతొ - పలికెను అపుడు.

“మీఅభిలాష - ఉత్సాహములు
సమయోచితమే - కానీ - వినుడు
కౌరవులందరు - మన బంధువులు
మెల్లగ చెప్పి - త్రోవ చూపెదము”.

అనుచు పలికి - అట-బలరాముండు
విప్రోత్తములను - ఉద్ధవాదులను
వెంటనిడుకొని - బంగరు తేరున
హస్తినాపురము - బయలు దేరెను.

హస్తినాపురము - చేరు త్రోవలో
అందమైన ఉద్యానవనముగని
విడిది చేసెను - బలభద్రుండు
కౌరవసభకు - ఉద్ధవు నంపెను.

జ్ఞాన వృద్ధుడు - ఉద్ధవుడంతట
భీష్మ ద్రోణులకు - ధృతరాష్ట్రునకు
సుయోధనునికి - యోగ్యులందరికి
పేరుపేరునా - నమస్కరించెను.

వారందరును - తిరిగి - ఉద్ధవుని
కుశలము అడిగి - గౌరవించిరి
అంతట - ఆతడు - ఆపెద్దలకు
బలరాముని రాకను - తెలియపరచెను.

ఆనందముతో - కౌరవులపుడు
అర్ఘ్యపాద్యముల - తగిన కానుకల
బలరాముని అట గౌరవించిరి
నమస్కరించిరి - వినయము నిండి.

అందరు - అచట - ఆసీనులవ
బలభద్రుండు - ఆరంభించెను
కుశల ప్రశ్నల - పలుకరించెను
విషయము లోనికి-తిన్నగ వచ్చెను.

“మీరు - ఎంతటి - ఘనులయినా మరి
ఉగ్రసేన - మహారాజు ఆనతిని
శిరమున దాల్చి - మెలగుట మంచిది
ఉభయులకు - అది - శుభదాయకము.

అందరొక్కటై - నాకుమారుని
నిర్బంధించిరి - తగునా - ఆపని?
జరిగినదేదో - జరిగి పోయినది
మన్నించుము-మా రాజు - మిమ్ములను.”

అనుచు పలుకుచు - నుండగ నంత
మాటమధ్యలో - సుయోధనుండు
తోకత్రొక్కిన త్రాచుగ లేచి
తలతిక్కగ - మాటాడ సాగెను.

"చాలు నింక - నీవాచాలత్వము
కాలమహిమ - యిది - చూపుచున్నది
కాలిచెప్పు - అది - తలకెక్కినది
ఉగ్రసేనుని - రాజుగ నెంతుమ?

అయినవాడని - ఊరుకుంటిమి
కావున రాజుగ - చెల్లుబాటయె
గొల్లవానికి - ఛత్రచామర
సింహాసనములు - లభించగలవా?

రాజ చిహ్నములు - రాజుకు తగును
గొల్లఘానికి - తగవు - తెలియదా!
తారతమ్యములు - మరిచి పోయిరా
ఆయన - మాకు - ఆజ్ఞల నిడునా.

ఇంతకు నీవు చెప్పెడిదేమి
తనయుడు చేసిన-విషయము వింటివ!
కులము నెంచక - విగ్రవీగునా!
వాని నిమ్మని - కోర వచ్చితివ!

సురలకు - లొంగని - గాంగేయాది
కురువీరులను - ఎదిరించుటకు
అమరనాథునికి - అలవి కాదుగద
ఎందుకు-పలుకుట వ్యర్థపు పలుకులు".

అనుచు పలుకుచు - దుర్యోధనుడు
దిగ్గునలేచి - సాగి పోయెను
అదిగాంచిన - ఆ - బలరామునికి
అమిత క్రోధము-పొంగి పొరలినది.

ప్రళయ కాలమున - సూర్యుని మాదిరి
ఎఱ్ఱని కన్నుల - బుసలు కొట్టుచు
ప్రక్కనె వున్న - యాదవులనుగని
భయంకరముగా పలికెను అపుడు.

"ధనమదాంధులు - ఆ గర్విష్ఠులు
మంచి మాటలతొ - త్రోవకు రారు
పశువుల తీరు - వారిది కావున
చావగొట్టుటే - తగిన మార్గము.

ఇంద్రాదులును - దిక్పాలకులు
కృష్ణుని - వేల్పుగ తలంచుచుందురు
పారిజాతమును - సుధర్మనిచ్చి
భక్తి ప్రపత్తుల - ఒదిగి యుండిరి.

కలిమికి నిలయము - లక్ష్మీదేవి
కృష్ణుని పదములు సేవించును గద
విరించి - శివుడు - నేనును కూడా
ఆయన అంశతొ జన్మించితిమి.

దుష్ట శిక్షణకు - శిష్ట రక్షణకు
నేలకు దిగిన - హరియే కృష్ణుడు
ఆయన - ఆజ్ఞతొ - ఉగ్రసేనుని
రాజ్యపాలన - జరుగు చున్నది.

అది అంతయును - మరచి - కౌరవులు
తముగా యిచ్చిన - రాజ్యమన్నటు
ఉగ్రసేనుని - నందనందనుని
తేలికగా - మాటాడు చుండిరి

కృష్ణుని పదముల - శిరస్సునుంచి
పాదధూళిని - స్వయముగ దాల్చి
పులకరించును - సురనాయకుడు
ధన్యుడనన్నటు - తలంచు-నిరతము.

కాలి చెప్పులు - శిరస్సులనుచు
మదించి పలుకుట - సహించనింక
పుడమిని - కౌరవులుండరు యింక
నా ప్రతాపము - చూపెద నిపుడే."

అనుచు పలుకుచు - బలభద్రుండు
బలముగ అడుగులు-వేయుచు నడచి
హలాయుధమును - చేత ధరించి
హస్తిని - జలముల కలుప నెంచెను.

నాగటితో - ఒక ప్రక్క నెత్తెను
ఏటవాలుగా - హస్తి - ఒరిగెను
దిక్కుతోచక - ఏడ్చిరి జనులు
ప్రళయమన్నటు - తలంచినారు.

భీష్మాదులు అట-విషయము తెలిసిరి
బలభద్రుని - మరి - శాంత పరచగా
సుయోధనుండు - మొదలగు వారు
సుతులు హితులతో - పరుగు తీసిరి.

సాంబుని - బంధము లూడదీసిరి
లక్షణతో - మరి - విలువగు కాన్కల
వారిద్దరినీ రథమున నుంచుకు
బలభద్రుని కడ - నిలచిరప్పుడు.

సాష్టాంగముగా - నమస్కరించిరి
తప్పుదిద్దమని - ప్రార్థన జేసిరి
హరి - అవతారము - నీవే అనిరి
బ్రహ్మాదులు - నీ - విధేయులనిరి.

శాంతి వహించి - కాపాడుమని
పదముల బడి - మరి - ప్రార్థించగను
అభయము నిచ్చెను - బలభద్రుండు
బ్రతికితి - మనుచు - తలచిరి వారు.

దుర్యోధనుడు - తన కూతురుకు
ఎన్నో విలువగు - కాన్కలనిచ్చి
అల్లున కెన్నో - ఆశీస్సులనిడి
బంగరు రథములు - ఏనుగు లిచ్చెను.

కోడలుతోను - తనయునితోను
ఆనందముగా - బలభద్రుండు
ద్వారక జేరెను - వేడుక జేసిరి
సుఖముగ వారు గడుపు చుండిరి.



॥శ్రీ కృష్ణచరితము॥

## 14 శ్రీకృష్ణుని మహిమ నారదుడు గుర్తించుట

కృష్ణలీలలు - మనోహరములు
చిత్రమైన - ఒక లీల - నారదుడు
స్వయముగ-తాను-గ్రహించెననుచు
రాజుకు తెలిపెను-శుకయోగీంద్రుడు.

నరకుని చెరలో - నున్న అతివలను
పదునారు వేలగు - కన్యామణులను
పరిణయమాడిన - కృష్ణుడు - వారితొ
సుఖముగ నుండుట - ఆశ్చర్య మని.

మదిలో తలచిన - నారదమౌని
కృష్ణుని చూడగ - వేడుక కలిగి
ద్వారకలోన అడుగు బెట్టెను
స్వర్గధామమై - నిలచెను ద్వారక.

నా కోరికది - తీర్తును - అనుటది
నాపై - దయను - కురిపించుటయే
దర్శనమైనది - ధన్యుడ - నేను
పోయివత్తును - శలవీయమనె.

ఫల-సుమ-తరువుల శోభలు నిండి
శుకపిక రవముల - మనోహరమ్మయి
ప్రకృతి కాంత - కనులు విప్పుకొని
చిరునగవులతో - తిరుగుచున్నదట.

మరయొక-సౌధము నందున-అడుగిడి
ఉద్ధవునితొ - మరి - మాటలాడుచు
తనయిల్లాలితొ - పాచికలాడెడి
నందనందనుని గాంచెను మౌని.

లక్ష్మీప్రదముగ - ద్వారక యున్నది
మంగళ ప్రదముగ-సౌధములున్నవి
కృష్ణుని కీర్తన - పరవశమిడును
విజయ గాథలతొ మది పులకించును.

ఆశ్చర్యములో మునిగి పోయెను
తా నొక్కడె - అట - కరుగు దెంచెను
అంతటిలోన - ఆసౌధమునకు
కృష్ణుడు వచ్చుట - ఎటుల జరిగెను?

పసిడి కాంతులతొ - తోరణాలతో
అంతఃపురములు - వెలుగుచున్నవి
ఒక సౌధములో - సేవలనందెడి
కృష్ణుని గాంచెను - నారద మౌని.

ఆ ప్రదేశమున - గౌరవమంది
మరియొక - మేడలొ భార్యామణితో
సరసాలాడెడి - కృష్ణుని గాంచెను
తిరిగి - మరి యొక - సౌధము జేరెను.

ఎదురుగ వచ్చి - ముని-పదములకు
వందనముంచెను - కృష్ణుడు-భక్తిగ
ఆసనమ్మున - కూర్చొన బెట్టి
పదములు కడిగి-పలికె-వినయముగ.

ఆ సౌధములో - దివ్యతల్పమున
నిదురించెడి - శ్రీ కృష్ణుని గాంచెను
మరియొక మేడలొ - నడుగిడగానే
కృష్ణుడు వచ్చి - పలుకరించెను.

మీ ఆనతి - అది - శిరోధార్యము
వేచియుంటిని - సెలవీయుడనె
"మంగళమూర్తీ - నీ సంకీర్తన
మించిన - ముదము - యిలలో లేదు.

సంపూర్ణకాములు - అయినమిమ్ములను
ఏకోరికలు - తీరని - నేను
ఏ విధముగను - తృప్తి పరతును
శలవీయమని - నారదునడిగెను.

మరియొక మేడలొ - ముద్దుగుమ్మతో
జలకాలాడెడి - కృష్ణుని గాంచెను
ఆపై - మరియొక - సౌధములోన
చిలకల కొలికితొ పలుకుట చూచెను.

మరియొక ఇంట - కృష్ణుడు శ్రద్ధగ
సంధ్యోపాసన - చేయుచుకనబడె.
మరియొక-గృహమున పంచ యజ్ఞములు
ఆచరించుచు - దర్శనమిడెను.

దానము చేయుచు-స్నానము చేయుచు
కొడుకులతో - మాటాడుచు-కనబడె
కృష్ణుని లీలకు పరవశించుచు
అన్ని గృహములు తీరుగ తిరిగెను.

ఎచ్చట - తాను - అడుగు బెట్టిన
అచ్చట గలడు - ఆ పరమాత్మ
స్వయముగ - గాంచి-నారద మౌని
ఆనందముతో - పొంగిపోయెను.

పరమ యోగులకు - అలభ్యమైన
పురాణపురుషుని-మాయా విలాసము
గాంచిన మౌని - కీర్తన జేయుచు
దేవ లోకము - తిరిగి జేరెను.

తానొకడైనా - తలకొక రూపుగ
కాంతలందరితొ - సేవలనందే
కృష్ణుని లీల - మంగళప్రదము
వినినా - చదివిన-సుఖసంపదలిడు.

అనుచు పలికెను - శుకయోగీంద్రుడు
పరవశించెను - రాజవరేణ్యుడు
అంతట - తిరిగి కృష్ణుని గాథను
ఆరంభించెను - మౌనిసత్తముడు.

వందిమాగధుల - స్తోత్రపాఠముల
మంగళవాద్యపు - సవ్వడి - ఎగయగ
మంగళమూర్తి - కృష్ణుడు - మెల్లగ
పద్మసమమగు - కన్నులు తెరచును.

పరబ్రహ్మమగు - తననే - తాను
స్మరించి - లేచును - ప్రభాతమున
ఉదయకాల్యములు - నిర్వర్తించుకు
పరిమళ జలముల - స్నానమాడును.

దివ్యవస్త్రములు ధరించి - సొగసుగ
ఆభరణమ్ములు - అలంకరించుకు
కన్నుల నిండుగ - మోహన మూర్తి
దయాసింధువు - దర్శన మిడును.

సాత్యకి - ఉద్ధవు - లిద్దరి మధ్యలొ
రెండవ-సూర్యుడు - అన్నటు కృష్ణుడు
రథమును - ఎక్కి సాగుచుండగా
పరవశింతురు - పురజనులందరు.

సుధర్మయనెడి - దివ్య సభను గల
మణిమయ - శోభిత - సింహాసనమును
అధిష్ఠించి - శ్రీకృష్ణుడు - సభలో
పూర్ణ చంద్రునిగ - కొలువు తీరును.

మెల్లగ - తేరును - దిగిన కృష్ణుడు
నేలమీద - తా - నడుగిడినంత
పరవశమ్ముతో - ఆ భూకాంత
కన్నులు తెరచుకు - కృష్ణుని గనును.

ఐరావతము - అన్నటు మెల్లగ
అడుగులేయుచు - ముందుకు సాగి
విలువల కందని - సింహాసనమున
విజయమూర్తి-తా-కూర్చొను వాడు.

వందిమాగధులు-కవులు-గాయకులు
మిత్రులు - బంధువు లెందరెందరో
సేనాపతులు - సచివోత్తములు
విరిసిన కన్నుల-కొలువున నుందురు.

పరంధాముడు - పుడమిని బుట్టి
పాలకుడై - ధరనేలు కొనుచును
ప్రతిహృది యందలి-సింహాసనమున
కొలువుతీరి - కాపాడు చుండును.

ఒక్కదినమున - కొలువులోనికి
ఆత్రుతనిండి - విప్రుడొకండు
అడుగిడి - భక్తిగ - నమస్కరించి
కృష్ణుని కిటుల - విన్న వించెను.

"ఆశ్రితవత్సల - ఆపద్బాంధవ
జరాసంధుడు - లోకకంటకుడు
లొంగని - రాజుల-నందర నాతడు
చెరసాలలొ - బంధించి వుంచెను.

చెరలో పెట్టెడి - చిత్రహింసలు
భరించలేక - వారందరును
రహస్యమ్ముగా - పంపిరి - నన్ను
వారి - గోడు - వివరించెద స్వామీ!

దీనబాంధవా - దయాసముద్రుడ!
నీపదములకు - వందన మయ్యా!
బంధవిముక్తుల - గావించి - మము
కాపాడుమయా - కారుణ్యాలయ.

నీకు తెలియనిది - భువిలో లేదు
నీది కానిది - అసలే లేదు
పదునెనిమిదియగు - పర్యాయమ్ములు
ఓటమి చూచెను - జరాసంధుడు.

అల్లులమైన - మా ఎడ వాని
ప్రతాపమ్మును - చూపించుచును
చెరలో బెట్టి - హింసించుచును
అధికుడు ననుచు - విర్రవీగును.

కావున - కృష్ణా - కాపాడుమయా"!
అనుచు - దీనముగ - ప్రార్థించిరని
విప్రోత్తముడు - తెలియబరచెను
అంతట వచ్చెను - నారదమౌని.

కృష్ణుడు లేచి -స్వాగతమిచ్చి
బంగరు ఆసనమందున - తగినటు
నారదమౌనికి - పూజను చేసెను
ఎచ్చటి నుండి - రాకని - అడిగెను.

"సర్వలోకముల - సంచరింతువు
నీకు తెలియని - విషయము లేదు
పాండవులెచ్చట - నుండిరి స్వామీ
క్షేమమే కదా - వారని - అడిగెను."

అంతట మౌని - పలికె కృష్ణునితో
"స్వామీ - సర్వము గ్రహించగలవు
నీకు తెలియని - విషయము కలదా
అయినా తెలిపెద - వారు-కుశలమే.

ధర్మరాజు - తా - బ్రహ్మతృప్తికై
రాజసూయము - చేయదలంచెను
యజ్ఞరక్షకుడవు - వీవేనయ్యా
యజ్ఞభోక్తవు - ఓ నారాయణ!

పుడమినేలెడి - రాజులందరు
పుడమిని - వెలిగెడి - తపోవంతులు
రాజసూయము - చూడగవత్తురు
నీదర్శనము - కలుగునందరికి.

బావగానొ - మరి - బంధువుగానో
యాగమ్మునకు - విచ్చేయుమయా!
నిన్ను గాంచెడి - భాగ్య మందరికి
ప్రసాదించుము - అనుచు పలికెను."

మౌని మాటలు - వినిన కృష్ణుడు
ఉద్ధవు వంక - చూచి పలికెను
"నీ ఆలోచన - తెలియబరచుము
అటుల చేతును - నిస్సంశయమనె."

అందరిముందు - పెద్దరికమ్మును
నిలబెట్టగను - ఆనందించి
వందనమ్ములు - మదిలో నుంచి
నందనందనుని - జూచి పలికెను.

"ఓ శ్రీకృష్ణా! యదుకుల భూషణ!
నారద మౌని - చెప్పినట్టుగా
పెద్దరికముతో - ముందు-నిలచి నువు
రాజసూయము - చేయించవయా!

దానివల్లను - కలుగు లాభములు -
పాండు నందనుల - ఘనత తెలియుట
రాజులందరిని - వారు జయించుట
జరాసంధుని - మర్దించుట యగు.

చెరలోనున్న - రాజులందరి
దీనగాథను - వినిచె - విప్రుడు
కావున - నీవు - కదలవలెనయా
ధర్మజుకండగ - నిలబడవలెను.

విప్రుడు కోరిన - కాదనకిచ్చెడి
ఘనుడా రాజు - జరాసంధుడు
విప్రవేషమున - యుద్ధభిక్షను
భీముడు కోరును -కథ-నడిపించుము."

ఉద్ధవు పలుకులు - సంతసమిడెను
సభలో వారు - సరియని పలికిరి
కొలువు ముగించి - యదుకుల రత్నము
వనవిహారము చేయ సాగెను.

కృష్ణుని వలన - సన్మానము గొని
నారదుడేగెను - దేవలోకము
గిరివ్రజపురము చేరిన విప్రుడు
జరిగినదంతయు తెలిపె - రాజులకు.

భీమార్జునులకు - కృష్ణదేవుని
ఆలింగన సౌభాగ్యము కలిగెను
చిన్నబావలు - యిద్దరు అపుడు
కృష్ణుని పదముల నమస్కరించిరి.

సుముహూర్తమున-సుతులు-సతులతో
బంధుమిత్రుల - బలగమ్ములతో
నందనందనుడు - ఇంద్రప్రస్థము
బయలుదేరెను - భక్తుల బ్రోవగ.

అంతట కృష్ణుడు - విప్రోత్తములకు
పెద్దలందరికి - నమస్కరించెను
కుశలప్రశ్నల - పలుకరించుచు
ఇంద్రప్రస్థమున - అడుగు బెట్టెను.

అడవులు - పల్లెలు - పట్టణమ్ములు
మెల్లమెల్లగ - దాటుకొనుచును
ఇంద్రప్రస్థముకు - దగ్గరలోన
బసచేసెను - శ్రీకృష్ణుడు-హితులతొ.

కరుణాధాముడు-యదుకుల తిలకుడు
గోపీజన - హృది - పరిపాలకుడు
అడుగిడెనని - విని - జనులందరును
కన్నుల గాంచి - పరవశించిరి.

కృష్ణుని రాక - వినిన ధర్మజుడు
ఆనందముతో పొంగి పోయెను
తమ్ములు-సచివులు-బంధులందరితొ
పురోహితులతో - ఎదురువచ్చెను.

భువనమ్ములను - బొజ్జలొ దాచిన
భగవంతుండే - కడుపున బుట్టిన
తల్లిదండ్రుల - భాగ్యమె - భాగ్యము
ఎన్నినోముల ఫలమదిఏమో!

మంగళవాద్యము - లెగయచుండగా
శంఖనాదములు - నింగికెగయగా
కృష్ణుని జేరి - నమస్కరించి
కౌగలించుకొనె - ధర్మనందనుడు.

బ్రహ్మాదులకు వూహలకందని
పరబ్రహ్మము - గొల్ల పిల్లలతొ
ఆటలనాడెను - వారు ఎంతటి
పుణ్యము జేసిరొ - పునీతులైరి.

కృష్ణుని కౌగిలి - పరవశమిడినది
మాటలురాక - తనువు తెలియక
అటులే - ఎంతో సేపు - గడచినది
కొంతసేపటికి - తెలివి గలిగినది.

ఆగమ లతలకు - అందనివాడు
తల్లికి అంది - త్రాళ్ళకు లొంగి
రోటికి - తాను - బంధింపబడె
అంతకు మించిన-వింత-విందుమా!

అమృతమ్మును - సురలకు యిచ్చిన
అమృతమూర్తి - గొల్ల యిండ్లలో
వెన్నపూసను - దొంగిలించెనట
వెన్నుని గాథలు - వీనుల విందులు.

కృష్ణలీలలు - గానము చేయుచు
పులకరించుచు పూలజల్లులతొ
పూజచేసిరి - పరమాత్మునికి
కృష్ణుని - దీవనలందిరి వారు.

కాన్కలు గొనుచు - హారతులందుచు
దీవన లిడుచు - వాసుదేవుడు
అంతఃపురమున అడుగు బెట్టెను
కుంతివచ్చి - తా - పలుకరించెను.

ఆప్యాయముగా చెంతకు వచ్చిన
అత్తకు-వందన మొంచెను-కృష్ణుడు
కుశల ప్రశ్నల - క్షేమమడిగెను
ద్వారక వాసుల - కుశలమడిగెను.

పుణ్యస్త్రీలకు - గంధాక్షతలు
పట్టు వస్త్రములు - కాన్కల నిడిరి
వచ్చిన వారికి - మంగళ కరమగు
వసతుల నప్పుడు - సిద్ధపరచిరి.

స్వయముగ - వారి-సదుపాయములు
ధర్మరాజు - తా - చూచుచుండెను
కృష్ణార్జునులు ఆనందముగా
కొన్ని మాసములు సుఖముగ గడిపిరి.



॥శ్రీ కృష్ణచరితము॥

## 15 భీమాదుల దిగ్విజయ యాత్ర

కొలువు తీరెను - ధర్మనందనుడు
కృష్ణుడు - తోడుగ - ఆసీనుడయె
తియ్యగ పలికెను - ధర్మరాజట
కృష్ణదేవుని - స్తుతించి పలికెను.

"కంసాంతక! నీదయాభిక్షచే
మేమందరము - సుఖముగ నుంటిమి
నీరాకయది - మహదానందము
మదిలో - కోరిక - తెలియబరతును.

రాజసూయము - చేయగనెంచితిని
అండగ నిలబడి - నెగ్గించుమయా!
నీపదసేవ - మరువని - మాకు
అసాధ్యమైనది - ఇలలో నుండదు."

నవ్వుచు కృష్ణుడు - పలికెను సభలో
"ధర్మనందనా - నీతి పుంగవా!
సద్గుణమ్ములకు - నెలవు నీవయా
రాజులందున - మేటిగ - తలతును.

రాజసూయము - నిరాటంకముగ
కొనసాగించుము - మేలు కలుగును
పితృదేవతలు - తృప్తినందెదరు
శతృరాజులు మిగలరు రాజా!

అఖండ కీర్తియు - పుణ్యము కలుగును
అమిత బలులు - నీ తమ్ములుండగా
అడ్డు నిలచెడి - రాజు - వుండదు
ఆరంభించుము - ఆలసించక.

సంబారములు - సమకూర్చుకొని
శత్రురాజులను - లొంగదీయగ
వీరవరేణ్యులు - తమ్ములనంపుము"
అనగా - రాజు - ఆజ్ఞలనిడెను.

దక్షిణముకు - సహదేవునంపెను
పడమటి దిశకు - నకులు నంపెను
ఉత్తర దిక్కుకు అర్జును నంపెను
తూర్పుకు పంపెను భీమసేనుని.

అన్న ఆనతిని - తలను ధరించి
అరి భయంకర - వీరులు సాగిరి
విజయలక్ష్మితో - అతి తొందరలో
తిరిగి వచ్చిరి - కీర్తి పతాకతొ.

మైత్రితొ - రాజులు కాన్కలు యిచ్చిరి
ఎదురు నిలచిన రాజులందరిని
లొంగదీసుకొని - కాన్కలందుకొని
అన్నగారికి - సమర్పించిరి.

ఉత్తర దిశలో - జరాసంధుడు
లొంగలేదని - కిరీటి చెప్పగ
యాగమ్మునకది - విఘ్నము అనుచు
ధర్మనందనుడు - నిరాశ చెందెను.

అంతట - కృష్ణుడు - ధర్మజుగాంచి
ఉద్ధవుడిచ్చిన సలహా చెప్పెను
"యుద్ధభిక్షను - యాచించుటచే
ద్వంద్వ యుద్ధము - జరిగి తీరును.

బ్రాహ్మణులకు - మరి - లేదనడతడు
నేనును - కిరీటి - వృకోదరుండు
విప్రవేషమున - జరాసంధుని
యుద్ధభిక్షను అర్థించెదము.

ద్వంద్వ యుద్ధము - భిక్షగ కోరగ
అయుద్ధములో - భీముడు - వానిని
అంతము జేయును" - అనుచు చెప్పెను
ఆనందించెను - ధర్మనందనుడు.



॥శ్రీ కృష్ణచరితము॥

## 16 శ్రీకృష్ణ - భీమార్జునులు - యుద్ధ భిక్ష కోరుట

విప్రవేషముల - కృష్ణార్జునులు
భీమసేనుడు - బయలు దేరిరి
త్రేతాగ్నుల వలె - వెలుగుచుండిరి
గిరివ్రజపురమున - అడుగు బెట్టిరి.

జరాసంధుని - కొలువును జేరి
అతిథి పూజలు - రాజు చేయుట
స్వయముగ - గాంచి - సంతసించిరి
ఆహ్వానము గొని - కూర్చొనిరచట.

తీయగ పలికిరి - జరాసంధునితొ
"రాజా! నీవు - గొప్ప దాతవు
అడిగిన - కాదన కిచ్చెడి - ఘనుడవు
మా కోరికను - తీర్చుము నీవు.

దాతకు వుండదు - దాపరికమ్ము
దధీచి యిచ్చెను - వెన్నెముకను - మరి
శిబి తన - కండలు - కోసి యిచ్చెను
పావురాయి - తను - ఆహుతియైనది.

రంతిదేవుడు - హరిశ్చంద్రుడు
బలిభూవిభుడు - నిరతము నిలతురు
వారికి - నీవు - తీసి పోవని
తెలుసుకు - భిక్షకు - వచ్చితిమయ్యా.

దివ్యతేజమున - వెలుగుచుండిరి
ఉరుమును - బోలి - కంఠములున్నవి
వింటి - నారితో - కాయలు కాసిన
చేతులు - ఘనతను - చాటుచున్నవి.

మదిలో తలచెను - జరాసంధుడు
వీరు బ్రాహ్మణులు - కానేకారు
వేషధారులు - మహానుభావులు
కోరిన దిత్తును - వీరికి - తప్పక.

వామన మూర్తి - సాక్షాత్ హరియని
తెలిసియు-బలి-తా-జంక లేదు గద
అటులే - నేను - ప్రాణమయినను
కాదన కిత్తును - అని - తలపోసెను.

వారిని - గాంచి-మృదువుగ పలికెను
"గుణవంతులు - మీరడుగుడు-స్వామీ!
తప్పక యిత్తును - సందియమేల
వెనుదీయుటది-తెలియదు-అనెను".

అంతట - కృష్ణుడు-పలికెను రాజుతో
"మేము కోరెడిది - యుద్ధ భిక్షను
భీమార్జునులు - వీరిద్దరును
నేను కృష్ణుడను - వచ్చితిమిటకు.

మాలో నీవు - ఎవరితోనైనా
ద్వంద్వ యుద్ధము చేయగ రమ్ము
ఇది మాకోరిక - తీర్చుము రాజా!"
అనగా - పలికెను - జరాసంధుడు.

"మాయల మారి - కృష్ణుడవీవా!
నాతో - యుద్ధము చేయవచ్చితివ!
పరుగిడి పోయి - కడలిని దాగిన
భీరుడవీవు - వీరుడవగుదువ?

వెన్ను చూపిన - వెన్నుడవీవు
నీతో పోరుట - నాకు - తగనిది
అర్జునుడితడు - చిన్నవాడు - మరి
సరిజోడీతడు - భీమసేనుడు.

అనుచు పలుకుచు - అట్టహాసముగ
జబ్బలు - చరచుచు - భీమసేనుని
పోరుకు - రమ్మని - ఆహ్వానించెను
గదనొక్కటి - ఆవీరుని - కిడెను.



॥శ్రీ కృష్ణచరితము॥

## 17 భీమ జరాసంధుల యుద్ధం

పట్టణమ్మునకు - దూరము సాగి
సమప్రదేశమున - పోరుకు దిగిరి
మదపుటేనుగులు - ఢీకొన్నటుల
కొదమసింగములు అన్నటు పోరిరి.

రెండు కొండలట - పోరుకు దిగెనా
అన్నటు - భూమి - దద్దరిల్లినది
ఒకరిని - మించి - ఒకరు పోరిరి
ఒకరొకి - లొంగక మరియొకరుండిరి

కొంత సమయము - గడచునప్పటికి
ఇద్దరి గదలు - నుగ్గయి పోవగ
ద్వంద్వ యుద్ధము చేయ సాగిరి
ముష్టి ఘాతములు-ఎగయుచున్నవి.

నేలను బడుచు - తిరిగి లేచుచు
సొమ్మసిల్లుచు - తెప్పరిల్లుచు
రక్తపు ధారలు - కారుచుండగా
పూచిన మోదుగు చెట్లనిపించిరి.

భీమ సేనుని - బలము పెరుగుటకు
తన - తేజమును - కృష్ణుడంపెను
జరాసంధుని - పుట్టుక విషయము
జ్ఞప్తి చేయుటకు - కృష్ణుడు-అపుడు

భీమసేనుడు - గుర్తించునటు
చెట్టు రెమ్మ నొక దానిని - నిలువుగ
చీల్చి విసరెను - గ్రహించె భీముడు
ముందుకు దూకెను-సింహనాదమున

నిలువున - త్రోసి - జరాసంధుని -
వాని పాదములు త్రొక్కి పట్టి - మరి
నిలువుగ చీల్చి - రెండు ఖండములు
విడిగా జేసి - నేలకు విసరెను.

అటులా భీముడు జరాసంధుని
అంతము జేసి - అరచెనొక్కపరి
అదిరిపోయిరి - పౌరులందరు
అమితోత్సాహము - నిండెను భీముడు.

ఆనందముతో - నందనందనుడు
భీమసేనుని - కౌగలించుకొని
అలసట తేర్చెను - అంతట వారు
అడుగిడినారు - పట్టణమ్మున.

జరాసంధుని - కుమారుడతడు
సహదేవుండు - శరణుజొచ్చెను
అతనికి - వెంటనె - యువరాజుగను
పట్టము గట్టెను - యదుకుల రత్నము.

ప్రియముగ కృష్ణుడు - చెరలోనున్న
రాజులందరికి - విముక్తి నిడగా
ఆనందముతో - వారందరును
మురళీధరుని - స్తోత్రము జేసిరి.

❋❋❋ ॥శ్రీ కృష్ణచరితము॥

## 18 విముక్తులైన రాజులు శ్రీకృష్ణుని స్తుతించుట

జరాసంధుని - చిత్రహింసలకు
గురియైనారు - నరపాలకులు
కృష్ణుని - దర్శనమైనది - వారికి
బ్రతుకు - ఆశ-చిగురించెను-వారిలో.

సాష్టాంగముగా - ప్రణామమిడిరి
పురుషోత్తముని - ప్రార్థన చేసిరి
శరణు - శరణని - కరుణించమని
ఊపిరి పోసిన - దాతవు అనిరి.

రాజ్యగర్వము - ధనమదాంధత
తమకు - కీడును తెచ్చిన వనిరి
మానవ నైజపు - బలహీనతలకు
కట్టుబడి - మరి - కృంగితి మనిరి.

అసాధ్యమైన కోర్కెలు పెంచుకు
ఎండమావులని - తెలియక పోయి
మానవులిలలో - సంసారంబను
జలధి దాటగ - చాలక పోదురు.

నీ పదయుగళి - మరువ నట్టుగా
నీపై - గురి యది - చెదర నట్టుగా
నిరతము - నిన్నే - సేవించునటు
వరమొసంగుము - వరదా! అనిరి.

వారితొ పలికెను - వారి జాక్షుడు
"మీరు చెప్పినది - నిజమే - వినుడు
పూజ్యుల - విప్రుల - ప్రజలను-రాజు
దయతో చల్లగ - కాపాడ వలె.

రాజ్యమదంబున - వారిని ఎన్నో
బాధలు పెట్టిన - నహుషుడు-మరియు
రావణరాజు - కార్తవీర్యుడు
నాశనమగుట - తెలియును గాదా.

కులము-ధనము-బలము యశస్సు
ఆయుర్భాగ్యము పెరగవలె నన
ధర్మరక్షణ - ఒకటే మార్గము
దానిని వదలక - రాజ్యము చేయుడు.

నాపై భక్తి - చెదరక నిలచును
అపై - ముక్తి కలుగును - మీకు"
అనుచు - వారికి - తగు మర్యాదలు
చేయగ జెప్పెను - సహదేవునకు.

జరాసంధుని - తనయుని వలన
నూత్న వస్త్రములు - కానుకలందుకు
తగు వాహనముల - రాజులందరు
తమతమ - నెలవుల-కరిగిరి-అపుడు.

సహదేవుడొసగిన - కాన్కలందుకు
భీమార్జునులతొ - కృష్ణుడు సాగి
ఇంద్రప్రస్థము - చేరి - శుభముగ
శంఖ ఘోషను - వినిపించెనట.

జరాసంధ - వధ - జరిగినదని - విని
ఆనందముతో - పొంగిరి - పౌరులు
ధర్మనందనుడు - పొంగిన గుండెతొ
భీమార్జునులను - కౌగిలించుకొనె.

కృష్ణునిగాంచి - భక్తి ప్రపత్తుల
ధర్మనందనుడు పలికెనప్పుడు
"నీదయ - మాపై - నెలకొని యుండగ
మా బ్రతుకులవి - సాగు సవ్యముగ.

లోకమ్ములను శాసింతువు - నువు
మానవు లెంత - మంగళమూర్తీ!
నీవాడించు - నాటక మందున
పాత్రలు మేము - పరమదయాళో!

మేము - ధన్యులము-మాధవా విను!
జగతికి-ధవుడవు-అక్షరుడవు-నువు
నీ అభిమానము-మాపై కురియును
మేమెంతో - అదృష్ట వంతులము.”

అనుచు - పలికిన - ధర్మ నందనుని
కనుసన్నలతో - అనుగ్రహించెను
అంతట రాజు - రాజసూయముకు
తగు ఏర్పాటులు - చేయగ నుడివెను.

॥శ్రీ కృష్ణచరితము॥



# 19 శ్రీకృష్ణుడు రాజసూయములో శిశుపాలుని చంపుట

శ్రీకృష్ణుని-తా-ముందు నిడుకొని
శ్రీకరమ్ముగా - రాజసూయము
చేయించగను - వేదవిదులను
భూసురోత్తముల - కోరెను-రాజు.

వచ్చిన రాజులు - కాన్కలు దెచ్చిరి
వాటిని అందుకు - భద్రపరచగా
సుయోధనునికి - అప్పజెప్పిరి
దానమిచ్చుట - కర్ణుని పనియది.

వ్యాసుడు-మొదలగు-మహామునులకు
ఆహ్వానములు - పంపిరి-అపుడు
భీష్మద్రోణులు - కృపాచార్యుడు
విదురుడు-మొదలగు-వారిని పిలచిరి.

మృష్టభోజనము లమర్చు పనిని
భీమసేనునికి - అప్పగించిరి
కృష్ణుని సేవలో - కిరీటి యుండెను
నకులుడు - సంబారమ్ములు కూర్చెను.

సుయోధనుని-మరి-అతని తమ్ములను
సాదరమ్ముగా - ఆహ్వానించిరి
చాతుర్వర్ణములందలి జనులకు
సగౌరవముగా - పిలుపులనంపిరి.

దేవతలను - మరి - భూసురోత్తముల
గౌరవించుట - సహదేవుని పని
భోజనాదుల - వడ్డన పనిని
ద్రౌపది - స్వయముగ చూచుచున్నది.

శాంతి పూజలు - వేదవేత్తలు
శాస్త్రసమ్మతిగ - చేయించిరట
బంగరు హలముల-యజ్ఞభూమిని
దున్నించిరి-ఆ-భూసురోత్తములు.

ఇంద్రాదులును - దిక్పాలకులు
బ్రహ్మ రుద్రులు - సిద్ధచారణులు
నాగులు - మొదలగు వారు వచ్చిరి
అన్ని లోకముల - ముఖ్యులు వచ్చిరి.

యజ్ఞ దీక్షను - యిచ్చిరి - రాజుకు
నియమ నిష్ఠలకు - లోపము లేక
యథావిధిగ-క్రియలన్నియు జరిగెను
వేదములే - అట విడిసినట్లయె.

అంతటి యజ్ఞము - జరుగలేదని
శ్లాఘించిరి - ఆ - ధర్మరాజును
కృష్ణుని దయచే - జరిగిన దనుచు
తలంచినారు - పంచపాండవులు.

వచ్చిన వారిని - సత్కరించెడి
మహాత్కార్యమది - మిగిలి యున్నది
సదస్యులందు - అగ్రపూజకు
అర్హుడు - ఎవరని - ప్రశ్న వచ్చినది.

ఎవరికి తోచిన - రీతిని - వారు
అభిప్రాయములు - తెలియబరచిరి
సభలో - ఘోషను - ఆపవలెనని
సహదేవుండు - గట్టిగ పలికెను.

అగ్రపూజకు - అర్హుడు ఒకడే
అతడే - కృష్ణుడు - సర్వేశ్వరుడు
అతడిక్కడనే - వుండగ - మరియొక
ఆలోచన యది - అసందర్భము.

దేశకాలములు - యజ్ఞము - అతడే
భోక్తయు - కర్తయు - పరంధాముడే
సర్వజగత్తు - యుగములు-గురువు
దైవము-ప్రణవము-అగ్నియు నతడే.

జననము-వృద్ధి - క్షయములు అతడే
సృష్టిని - నడపే - అక్షరుడాయన
ఆయన పూజను చేసినచో - మరి
సర్వస్వమును - పూజించినటు.

జగన్నాథుని - సంతసపరచిన
జగము-సంతసము నందును కాదా!
కావున - మాధవు పూజను చేయుము
అనగా-నందరు-భళి-భళి-యనిరి.

ఏసంకోచము - మదిలో నుంచక
ధర్మనందనుడు - వాసుదేవుని
దివ్య పాదములు భక్తిగ కడిగి
శిరసున దాల్చెను - పవిత్ర తీర్థము.

తమ్ములు - ద్రౌపది - దివ్యతీర్థము
శిరసుల దాల్చిరి - భక్తి ప్రపత్తుల
నూత్న వస్త్రములు - ఆభరణము లిడి
పాదపూజను చేసెను - రాజు.

ఆనంద బాష్పములు - ధారలు కట్టగ
నందనందనుని - దివ్య విగ్రహము
ధర్మనందనుడు నిండుగ గనుచు
పదములు కడుగుచు - పొంగిపోయెను.

అగ్రపూజను - అందిన - కృష్ణుడు
దివ్య ప్రభలతో - వెలుగ సాగెను
దేవదుందుభులు - మ్రోగెను - నింగిని
కల్పవృక్షము పూలుజల్లెను

అంతయు గాంచి - శిశుపాలునికి
అంతులేని - ఆవేశము వచ్చెను
ఈర్ష్యాసూయలు - పొంగి పొరలెను
నోటికి వచ్చిన - దెల్ల పలికెను.

కృష్ణుని గాంచి - ఆనందించెడి
ఆహూతులను - గాంచి పలికెను
"కోలాహలము - ఆపండయ్యా!
ఏమి ఘనతయని - ఆనందించుట.

అగ్రపూజకు – అర్హుడు ఎవరో
సహదేవుడది – నిర్ణయించుటా?
లోకము తెలియని – పసివాడతడు
అతనికి – మీరు – వంత పలికితిరి.

అర్హత మీకు – తెలియనిదా మరి
శ్రీమంతులును – తేజోవంతులు
తపో వంతులు – జ్ఞాన వృద్ధులు
యోగివరేణ్యులు – ఎందరొ కలరు.

వారందరును – సభలో నుండగ
వారిని కాదని – గొల్ల నొకనిని
అగ్రపూజకు – అనుమతించుట
బుద్ధి హీనతను – తెలియబరచదా?

కృష్ణుని – అర్హత ఏమిటి తెలుపుడు?
కులగోత్రములా – గుణ – వర్తనమా
ధనమా – బలమా–రాచ పుట్టుకా –
వావివరసలు – లేనివాడుగద.

తల్లిదండ్రులు – ఎవరో తెలియదు
దగ్గర బంధువు – లెవరూ లేరు
యదువంశమది – రాజ్యమేలదు
యయాతి శాపము–మీకు తెలియదా.

కన్నుల కింపగు – రూపము గాదు
జారుడు – చోరుడు – అట్టి వానిని
పూజార్హునిగా – పూజించుటయా!
వంకర త్రోవల – తిరిగే టక్కరి".

అటుల వదరెడి శిశుపాలుని మరి
లక్ష్య పెట్టక – కృష్ణుడుండెను
సభలో వారు – కలవర పడిరి
కొందరు బయటకు – వచ్చి నిలచిరి.

నిశ్చేష్టులయి – పాండునందనులు
చూచుచుండగా – కొందరు రాజులు
కత్తులు దీసిరి – బుద్ధి చెప్పుటకు
అయినా – అతడు లక్ష్య పెట్టక.

కృష్ణ – నిందను – చేయుచుండెను
శిశుపాలునితో – వచ్చిన రాజులు
కరవాలమ్ములు – తీసిరి బైటకు
యుద్ధరంగమై – పోయెను ఆ సభ.

ధర్మనందనుడు – అంతయు చూచి
కలవరపడుచు – కృష్ణుని గాంచి
వచ్చెడి – ప్రళయము – ఆపగ వేడెను
సుఖాంతమ్మును – చేయగ కోరెను.

అభయమునిచ్చి – కంసారి – అట
శిశుపాలునితో – పలికెను – నవ్వుచు
"బావా! నన్ను పూజించిరని
అక్కసు–కక్కుచు–నుంటివి–నీవు.

అందుకొనుమిదే – అగ్రపూజను
అందుకు నీవు – అర్హుడవయ్యా
అనుచు పలికి అట – సుదర్శనుండు
విసరుచున్నటు – తెలియకుండనే.

సుదర్శనమ్మును - ప్రయోగించెను
దివ్యకాంతితో - కనులు మూసిరి
చక్రాయుధము - నేరుగసాగి
శిశుపాలుని - కంఠమ్ము త్రుంచెను.

కంఠము తెగిన - శిశుపాలునిగని
అతనికి తోడగు - రాజులందరు
సభలో నుండి - జారిపోయిరి
అంతా జరిగెను - క్షణకాలములో.

చక్రహతుడయి - అసువులు వీడిన
శిశుపాలుని - దేహమ్మునుండి-ఒక
దివ్య కాంతి - అది-వచ్చి అంతట
జగన్నాథునిలొ - కలిసి పోయినది.

అనుచు - శుకుడట-చెప్పగనంత
దుష్టబుద్ధితో - నిందించిన - ఆ
దుష్టుడు - బాధలు-అనుభవించక
కృష్ణునిలో ఎటు - ఐక్యమయ్యెనన.

వైరభక్తితో - మూడు జన్మలు
హరినే స్మరించి - హరిలో కలిసెను
అనుచు-మౌని-అట పరీక్షిత్తునకు
సందేహమును - నివృత్తి చేసెను.

శిశుపాలుడంతము - కోరితెచ్చుకొనె
యజ్ఞమంతయు - జరిగెను విధిగా
ఋత్విక్కులకు - సదస్యులకును
రాజు యిచ్చెను-కాన్కలు-దండిగ.

యజ్ఞసమాప్తి - అయినది కనుక
అవభృథస్నానము - నాచరించుటకు
తమ్ములు - తల్లి - బంధుజనముతో
పుణ్యజలములకు జేరెను - రాజు.

వేదమంత్రములు - ఎగయుచుండగా
శాస్త్ర విధిగను ద్రౌపదితోను
పవిత్ర తోయము లందున రాజు
అవభృథ స్నానము - చేసెను రాజా!

ఆ సమయములో-మునులు - దేవతలు
పితృ దేవతలు భూదేవతలు
ధర్మరాజుకు - దీవనలిడిరి
పుష్పవృష్టి - కురిపించిరి సురలు.

యజ్ఞమ్మునకు - వచ్చినవారు
పాపహరమ్ముగ - అవభృథస్నానము
నాచరించిరి పరవశించిరి
ధర్మనందనుడు - వెలిగె తేజమున.

రాజలోకమున - కాంతులు నింపిన
నాల్గుదిక్కులా యశము నింపిన
ధర్మనందనుడు - ఆహూతులకు
వారికి - తగినటు - కాన్కల నొసగెను.

సత్కారమ్ముల - నందిన వారు
సంతుష్టులయి - ఆశీస్సులనిడిరి
విడువగలేక - కృష్ణదేవుని
ఆపెను - భక్తిగ - ధర్మనందనుడు.

ఆప్యాయముగా – కృష్ణదేవుని
కొన్ని దినములు వుండగ కోరెను
కాదనలేక – ఇంద్రప్రస్థమున
కొంత కాలము గడిపెను – కృష్ణుడు.

దివి నుండి – దిగిన – దేవకన్యలా
జగన్మోహన – రూపము గలిగిన
మంగళ మూర్తిగ – అగపడినట్టి
ద్రౌపది – సిరికి – కన్ను కుట్టినది.

రాజసూయము – అసాధ్యమైనది
కృష్ణదేవుని – అనుగ్రహముతో
నిరాటంకముగ – జరిగినదపుడు
ధర్మజుకీర్తి – పుడమిని నిండెను.

దానికితోడు – మయసభలోను
పరాభవమ్ము – జరిగినదతనికి
నిండుగ కొలువున–వున్న సమయమున
అందరి ముందు – తలవంపులయె.

కృష్ణుని – సేవాభాగ్యము – కలిగిన
అసాధ్యమన్నది – వుండదు రాజా!
ధర్మజుసిరికి – రాజులందరు
మనసునిండుగా – సంతసించిరి.

మయుడు రచించిన – దివ్య సభయది
అమోఘమైనది – సురలకందనిది
కొలను వున్నను – లేనటు లుండును
లేకపోయినను – వున్నటు – కనబడు

బంధువుగానట – వున్నను గానీ
సుయోధనుని–మది–రగిలి పోయెను
పాండవులందరు – చల్లగనుండుట
ఓర్వగలేని – మనస్సు వానిది.

అది తెలియకను – తికమకలోపడి
జలములో బడెను – సుయోధనుండు
అందరు నవ్విరి – అందున – భీముడు
అట్టహాసముగ నవ్వెను – అపుడు.

అంతట అడిగెను – రాజు–మౌనిని
ఎందులకంతటి ఈర్ష్య అనుచును –
పాండుసుతుల ఎడ – వైరభావమది
వాని – నైజమని–శుకుడు పలికెను.

అన్న – వలదని – వారించెనట
కానీ – అందరు నవ్విరొక్కపరి
స్త్రీలు కూడ – మరి – నవ్విరి అపుడు
ఆ అవమానము – భరించలేక.

కృష్ణుని దయతో – లభించినట్టి
మహదైశ్వర్యపు – మంగళ శోభకు
కన్నులు కుట్టెను – దుర్యోధనునికి
మదిలో రగిలెను – ఈర్ష్య జ్వాలలు.

తోక త్రొక్కిన త్రాచుమాదిరి
రుసరుసలాడుచు దుర్యోధనుడు
తన తమ్ములతో – బలగమ్ములతో
నిజవాసమునకు – వెడలిపోయెను.

జరిగినదానికి - ధర్మనందనుడు
మదిలో - ఎంతో - వంతనొందెను
అవమానమ్ము - తనకు జరిగినటు
చలించి పోయెను - ఆసమయమున.

కృష్ణుని అండతొ - వారందరును
అటుల జేసిరని - తెలిసెను రాజు
జగన్నాథుడు - కనుసన్నలతో
ధర్మరాజును - శాంతపరచెను.

అంతటితో - ఆ - సభ ముగిసినది
ధర్మరాజుకడ - వీడ్కోలుగొని
సకుటుంబముగా - కృష్ణదేవుడు
ద్వారక - సుఖముగ జేరుకొనెనట.

జరాసంధుని - వధ జరిగినది
రాజులందరు - విముక్తులైరి
శిశుపాలుని - తల - నరకబడినది
రాజులు - లొంగిరి - ధర్మరాజుకు.

దేవతలందరు - తృప్తినందిరి
రాజసూయము - చక్కగ జరిగెను
దానివలననే - దుర్యోధనుని
మచ్చరంబది - మారె - ద్వేషముగ.

ఆద్వేషమ్మది - జరగబోయెడి
సంగ్రామమునకు - నాందియైనది
భూభారమ్ము - తీరిపోవును
కృష్ణుని - అవతారమ్ము - తెలియును.

రాజసూయము - చేయదలచిన
ఆలోచనలో - ఉద్ధవు - సూచన
అమోఘమైనది - ఎన్నో విధముల
ప్రయోజనమ్ములు చేకూర్చినది.

అనుచు పలికి - ఆ-శుకయోగీంద్రుడు
ఆపైగాథను - కృష్ణుని లీలలు
వినుమని రాజుకు చెప్పదొడంగెను
ఆనందముతో వినెనారాజు.

శిశుపాలునికి - నమ్మిన మిత్రుడు
సాల్వుడు-రాజు-తన సైన్యముతో
రుక్మికి - నాడు తోడుగ వెళ్ళెను
కృష్ణుని - చేతిలొ - ఓటమి జూచెను.

నాడు సాల్వుడు - ప్రతిజ్ఞ చేసెను
యాదవులెవరిని - మిగలనీయక
అంతము జేతును - అంతమందినని
కఠోరతపమును ఆరంభించెను.

నియమ నిష్ఠతో - తపోదీక్షతో
ఫాలనేత్రుని - మెప్పించగను
ప్రసన్నుడయ్యెను - పార్వతీ పతి
కోరిక దీర్తును - కోరుకోమనె.

అంబాపతిని - గాంచిన సాల్వుడు
భక్తి ప్రపత్తుల - స్తోత్రము చేసెను
ఆపై - కోరెను - దివ్య వాహనము
నింగిని స్వేచ్ఛగ - తిరుగు వాహనము.

ఏ లోకములో - నుండనట్టిది
ఎవ్వరికీ - మరి - లభ్యముగాని
నింగిని సాగే - దివ్య వాహనము
అనుగ్రహించగ - వరము కోరెను.

ఫాలనేత్రుడు మయుని పిలచెను
వాహనమ్మును చేయగ జెప్పెను
దివ్య విమానము ఇచ్చెను - మయుడు
సౌభకమ్మని - పేరు బెట్టెను.



॥శ్రీ కృష్ణచరితము॥

## 20 సాల్వుడు ద్వారక మీదకు దండెత్తుట

అమిత గర్వమున - అహంకారమున
సేనలన్నిటిని - సిద్ధపరచుకొని
నాలుగు దిక్కుల - నుండి-ద్వారకను
ముట్టడించెను - సాల్వుడు-అపుడు.

నేలను - సేనలు బాధించగను
నింగిని-సాల్వుడు-విసురుగ తిరుగుచు
తరుల గిరులను - కురిపించగను
ఊపిరి-సలపక-పోయెను - జనులకు.

కృష్ణుడు - ద్వారక నున్నటు తలచెను
కానీ - కృష్ణుడు ఇంద్రప్రస్థమున
పాండవులతో - నుండెను అపుడు
సాల్వుడు - మొదలిడె-విధ్వంసమును.

ప్రళయమాయని - అనిపించినది
విషయము గ్రహించి - కృష్ణ నందనుడు
ప్రద్యుమ్నుడు - తా - పోరుకు సాగెను
అఖండ సేన - అనుసరించెను.

ఉద్యానమ్ముల - పెరకి వేయగా
జలాశయముల - పూడ్చివేయగా
కోటల - పేటల - కలవర పెట్టగ
సర్వనాశనము చేయగ చెప్పెను.

యాదవ సేనలు - ఒక్కుమ్మడిగా
సాల్వుని - సేనల - మీద బడినవి
దేవ దానవ - పోరును పోలి
జరుగుచున్నది - ప్రచండ యుద్ధము.

రాజు ఆనతిని - సైన్యమంతయు
భీభత్సమ్మట - చేయసాగెను
ధనము దోచుచు-యిళ్ళు - కాల్చుచు
ప్రజలను పట్టుకు - బంధించిరట.

వింటినారుల - టంకారములు
మత్త గజమ్ముల - ఘీంకారములు
వీరయోధుల - హుంకారములు
నింగికెగసెను - దిక్కులనిండి

సాల్వుడు - నింగిని - వాహనమ్ముపై
అంతయు జూచి - ఆనందించుచు
తరులు - గిరులను పట్టణమ్ముపై
విసరసాగెను - నింగినుండియే.

ఎన్నో మాయలు - సాల్వుడు - అపుడు
ప్రకటించుచును - పోరసాగెను
సూర్యుని వోలె - మాయను తృంచి
ఎదిరిపోరెను - ప్రద్యుమ్నుడట.

యాదవ వీరులు–సాత్యకి–సాంబుడు
చారుధేష్ణుడు – నిశిత – శరముల
సాల్వుని – పక్షపు–రాజు లెందరినొ
చీల్చసాగిరి – ఉత్సాహముగా.

రక్తపుటేరులు – పారుచున్నవి
విగతజీవుల – కుప్పలు నిండెను
వెంటనె – సాల్వుడు–వాహనమ్ముతో
నింగి కెగిరెను – తప్పించుకొని.

ఆ సమయములో–సాల్వుని–మంత్రి
ద్యుముడనువాడు – సాహసమ్ముగా
గదనొక దానిని – బలముగ విసరెను
ప్రద్యుమ్నుడు – మరి–సొమ్మసిల్లెను.

ఉపాయముగ – రథసారథి–వెంటనె
యుద్ధ రంగము నుండి – తేరును
మెరపు వోలెను–బయటకు నడిపెను
ఆవిధముగను – ఆపదకాసెను.

కొంతసేపటికి – కన్నులు తెరచి
ప్రద్యుమ్నుడు–తా–సంగతి తెలిసెను
రణభూమి అది – కాదని తెలిసెను
అవమానముతో కృంగి పోయెను.

యుద్ధభూమిలో – వెన్ను చూపినటు
శత్రువు తనను – పరిహసించునని
యదువంశమునకు–కళంక–మనుచు
సారథితోను – కటువుగ పలికెను.

నమ్రత నిండి – పలికెను సారథి
రథికుని రక్షణ – సారథి పని యిది
ధర్మదూరమగు – పనిని – చేతునా?
సేదతీరినది – బయలు దేరుడు.

అరివీరుడవై – ఆజిని – నిలచి
శత్రుసేనలను – నేలకూల్చుము
ఇదగో రథము – సాగుచున్నది
అనుచు–పగ్గములు వదిలెను – సారథి.

సారథి మాటకు – సంతసమంది
తిరిగి – పోరున కలబడె – వీరుడు
ద్యుముని – రథముపై–నిశిత శరములు
వదలెను అపుడు – ప్రద్యుమ్నుండు.

వాడిబాణముల – రథాశ్వమ్ములు
నేలకూలెను – టెక్కెము విరిగెను
ద్యుముని చేతిలో – విల్లు కూలెను
చివరకు – ద్యుముని – కంఠము తెగెను.

అంతటివీరుని – అవలీలగను
ప్రద్యుమ్నుడట – తృంచుటగాంచి
సాత్యకి – మొదలగు – వీరులందరు
శ్లాఘించిరి – ఆ – యదుకిశోరుని.

యదుసైన్యములు – విజృంభించెను
సాల్వుని సేనల – కూల్చ సాగిరి
ఇరువది ఏడు – దినములు – అటుల
భీకరయుద్ధము – జరిగెనప్పుడు.

ఇంద్రప్రస్థమున - కృష్ణుని కేమియు
తెలియదు - ద్వారక లోని-యుద్ధము
కృష్ణుడు - తిరిగి - బయలు దేరెను
అపశకునములు - తోచెను-అపుడు.

సారథియైన - దారకు గాంచి
పలికెను - కృష్ణుడు - వడిగాతోలగ
శిశుపాలుని మిత్రులు-ద్వారకలోన
భీభత్సమ్మును - చేసిరి ఏమో!

ద్వారకచేరగ - విషయము తెలిసెను
నేలను పోరెడి - యదు సేనలను
నింగిని పోరెడి-సాల్వుని గాంచెను
తలచినంత పని - జరిగినదనెను.

నింగిని - సాల్వుని-వాహనమున్నది
దాని క్రిందకు - తేరుతోలమనె
ఆసమయమునకు - యాదవసేనలు
పోరిపోరి - మరి - అలసిపోయినవి.

కృష్ణుని చూడగ - వారందరికీ
అమితమైన - ఉత్సాహము వచ్చెను
సాల్వుని కంటికి - కృష్ణుడగపడ
అంతులేని - క్రోధమ్ము ఎగసెను.

మహాశక్తి నొకదానిని - తీసి
కృష్ణుని - రథ - సారథి అయిన
దారకుపైన - ప్రయోగించెను
అమితవేగమున - శక్తి వచ్చెను.

దానిని గాంచి - సుదర్శనుండు
దివ్యశరము - నొక దానిని విడచి
పొడిపొడి చేసెను - శక్త్యాయుధమును
ఆగక - విడచెను-శరములు - అపుడు.

పదునారు శరముల - సాల్వుని కొట్టెను
సాల్వుడు - వాటిని ఎదిరించి - మరి
దివ్యాస్త్రముతో కృష్ణుని కొట్టగ
ధనుస్సు జారి - రథమున పడెను.

కొంచెము అలసట - కలిగె కృష్ణునకు
దానినిగాంచి - సాల్వుడంతట
నామిత్రునిదగు - కన్యను నీవు
అపహరించుకొని - పారిపోతివి.

చివరకు - నీవు నా ప్రియమిత్రుని
ప్రాణమ్ములనే - హరించినావు
అదనుదొరికెను - వదలను - నిన్ను
మిత్రుని ఋణము తీర్చుకొందును.

అటుల - వదరెడి - సాల్వుని గాంచి
ఆయువు - నీకు - మూడెను - ఇంక
అనుచు - వేగముగ - గదను విసరెను
ఆదెబ్బకు - సాల్వుడు మూర్ఛిలిపడెను

నోటి నుండి మరి నాసిక నుండి
రక్తము కారెను - అంతట - సాల్వుడు
తెలివి రాగనే - అదే అదనని
నింగి కెగిరెను - విమానమ్ముతో.

అంతటిలోన - సేవకుడొకడు
కృష్ణుని వద్దకు - పరుగున వచ్చి
స్వామీ! - సాల్వుడు - మీనాయనను
ఎత్తుకు పోయెను-ఘోరము జరిగెను.

విలపించుచును - తల్లియున్నది
నీకీ వార్తను - చెప్పగ పంపెను
ఖిన్నుడయ్యెను - కృష్ణుడొక్కపరి
కనుల వెంబడి - నీరు కారెను.

అంతటిలోన సాల్వుడు - మాయతో
కృష్ణుడు స్వయముగ - చూచునట్టుగ
తండ్రిని పైకి ఎత్తి చూపుచు
శక్తి ఉన్నచో - కాపాడుకోమనె.

మాయగొల్లడా - ఇదుగో తండ్రి!
వీనినిప్పుడే - ఖండించెదను
చేతనయినచో - చేవచూపుము
కాపాడుకొను - నీదు జనకుని.

అనుచు - పలుకుచు -వాడి కత్తితో
వసుదేవుని - తలను - నరకి వేసెను
శిరస్సు నందుకు - విమానమ్మున
పరుగిడి పోయెను-సాల్వుడు నింగిని.

కంటి ముందర - జరిగిన దానికి
కలవరపడెను - కృష్ణుడప్పుడు
ధనుస్సు జారెను - నిరాశ నిండెను
సేనలు - ధైర్యము - చెప్ప సాగెను.

మెల్లమెల్లగా - సాల్వుని మాయ
తెలియవచ్చెను - చక్రధారికి
వెంటనె - శార్ఙ్గమునందుకొనగను
కళేబరమ్ము - దూతయు - లేరు.

అంతటిలోన - కొందరు ఋషులు
అచటకి వచ్చి - కృష్ణుని స్తుతించి
ప్రార్థన జేసిరి - దుష్టుని కూల్చగ
ఆ మాయావిని - కూల్చగ జెప్పిరి.

జగదాధారా! దీనశరణ్యా!
మాయామానుష - విగ్రహరూపా!
నీపదనౌకతో - మానవులెల్ల
సంసార-సాగరము - దాటగలుగుదురు.

మహా యోగులకు - నీవాధారము
సురలందరకు - ప్రాణాధారము
ద్వంద్వాతీతుడ - వీవు - పుడమిలో
దుష్ట శిక్షణకు - అవతరింతువు.

నీచుడు పన్నిన - మాయ తెలియదా!
లెమ్ము నీవిక - తృంచుము - వానిని
అనుచు - పలికి ఆ మునులు వెడలిరి
అంతట కృష్ణుడు - వదలెను శరములు.

వాడి శరముల - సాల్వుని అచటే
కదలనీయక - గదను విసరెను
ఆ గద సాగి - ఆశ్చర్యమ్ముగ
పొడి పొడి జేసెను - విమానమ్మును.

వెంటనె - సాల్వుడు - ఆవేశముతో
గదనొక దానిని - చేతబట్టుకొని
కృష్ణుని పైకి - దూసుకు వచ్చెను
శరముల కొట్టెను - గదను-కృష్ణుడు.

ఆలసించక - కమలనాభుడు
చక్రాయుధమును - విడచెనప్పుడు
మణిమకుటముతో శోభిలు శిరము
సాల్వుని శిరము - నేలను బడెను.

తపో బలముచే సంపాదించిన
దివ్య విమానము - సాల్వుడు కూడా
కృష్ణుని - శక్తికి - నిలబడ లేదు
సురలు - కృష్ణుని ప్రస్తుతించిరి.

 ॥శ్రీ కృష్ణచరితము॥

## 21 శ్రీ కృష్ణుడు - దంతవక్త్రుని చంపుట

సాల్వుని మిత్రుడు - దంతవక్త్రుడు
మిత్రుని - మరణము - చూచినవాడై
కృష్ణుని మీదకు - పోరగ వచ్చెను
ప్రచండభానుని - తీరుగ వచ్చెను.

దంతవక్త్రుని - తమ్ముడు - వీరుడు
విదూరుండు - ముందుకురికెను
చక్రాయుధము - కృష్ణుడు - విడువగ
తలవేరైనది - మొండెము నుండి.

ఇన్నాళ్ళకు - నాకంట బడితివి
నామిత్రులను - మట్టు బెట్టితివి
వదలను నిన్ను - వారికి - తోడుగ
వారిసేవలకు - పంపెద నిపుడే.

సాల్వుని సేనలో - మిగిలిన వారు
జయము పలికిరి - కృష్ణుని కపుడు
పుష్పవృష్టి - కురిపించిరి - సురలు
విజయలక్ష్మి - వరియించెను-కృష్ణుని.

అనుచు-అరచుచు పండ్లు కొరుకుచు
గిరగిర త్రిప్పి - గదను - విసరెను
అంకుశ పోటును - అందించినటు
మరియొక గదను - విసరెను కృష్ణుడు.

కృష్ణ దేవుడు - ద్వారక చేరగ
స్తోత్ర పాఠముల - స్వాగతమిడిరి
బారులు తీర్చి - పురజనులందరు
లాజలు - పూలు - చల్లిరి ముదముగ.

కృష్ణుడు విసరిన - గద తగిలినది
తలపగిలినది - దంతవక్త్రునికి
అసువులు వీడి - నేలను బడెను
వాని తేజము - కలిసె - కృష్ణునిలో.

కురు పాండవుల - యుద్ధము తప్పదు
అనుచు తెలిసిన బలరాముండు
ఏవర్గమునకు - సాయము చేయక
తీర్థయాత్రలకు - కదలి వెళ్ళెను.

 ॥శ్రీ కృష్ణచరితము॥

# 22 బలరాముని తీర్థయాత్ర

బలరాముడు–తన యాత్రలో ముందుగ
ప్రభాసతీర్థము నందున – మునిగి
పితృ దేవతల – కమిత భక్తితో
తర్పణమ్ములిడి – ధన్యుడాయెను.

తపోనిష్ఠులు – జ్ఞాననిధులును
అనుసరించగా – సరస్వతి – మరి
బిందు సరోవర – వజ్రతీర్థముల
వరుసగ – తాను – స్నానమాడెను.

విశాలానది – సరయూనదుల
యమున–జాహ్నవి – జలములందున
స్నానము జేసి – తర్పణమ్ములిడి
భూసురులకు – సంతర్పణ జేసెను.

అచ్చటి నుండి – నేరుగ సాగి
మునులకు నెలవగు – దివ్య ప్రదేశము
నైమిశారణ్యము – నందున–అడుగిడె
శ్రద్ధగ–యజ్ఞము జరుగు చున్నదట.

అచ్చటి మునులు – దీర్ఘసత్రమను
యజ్ఞము చేయుచు–అచటికి–వచ్చిన
బలరామునికి – ఎదురుగ వచ్చి
అర్ఘ్యపాద్యముల – సన్మానించిరి.

వెంటవచ్చిన – భూసురులకును
అతిథిపూజలు – మునులు చేసిరి
తారల మధ్య – చంద్రునితీరుగ
ఆసీనుడయె – బలరాముడట.

అంతట జరిగెను – విచిత్రమొకటి
అందరుమునులు – వందన మిడినను
అందు–సూతుడు–బలరాముని–గని
అభివాదమ్ము – చేయకుండెను.

ఎత్తగు – పీఠము నందున – సూతుడు
ఆసీనుడయి – అచటకు వచ్చిన
బలరాముని గని – నమస్కరించక
పీఠముకదలక – కూర్చొని యుండెను.

బలరామునికి – అహము దెబ్బతిని
అవమానముగ – తలంచినాడు
పురాణాలను – తెలిసిన వాడు
పొగరునిండి – అటు చరించెనను కొనె.

విజ్ఞానమ్మది – కలిగిన గాని
సంస్కారమ్మది – కలగలేదని
దుష్టశిక్షణకు – అవతరించిన
తాను – తనపని – చేతుననుకొనె.

అటుల తలంచి – బలభద్రుండు
సూతుని కంఠముపైన – దర్భతో
పొడిచెను – చిత్రము – ఆతాకిడికి
సూతుడు – పడెను – విగతజీవుడై.

కాలరుద్రుడై – కోపమునున్న
బలరాముని గని – హడలి పోయిరి
కొంతసేపటికి – శాంతించగను
మెల్లగ చెప్పిరి – ఆమునులందరు.

"మేమందరము - అగ్రాసనము
సూతునకిచ్చి - యజ్ఞము చేయగ
నిర్ణయించుకొని - చేసితి మటుల
సూతుడు - గొప్ప జ్ఞానవంతుడు.

బ్రహ్మాసనమున - ఆసీనుడయి
ఆతడుండెను - అందువల్లను
కదలకూడదు - అది నియమమ్ము
ఆగమశాస్త్రము - అటుల తెలుపును.

మేము - బ్రహ్మగా - తలంచినట్టి
సూతుని చంపి - బ్రహ్మ హత్యకు
పాల్పడినావు - మహానుభావా!
నీవు-ఇటుల-మరి-త్రోవ తప్పుటా!

నీవు చేసిన - దారుణమ్మునకు
ప్రాయశ్చిత్తము - చేసికొనవలె
ధర్మము నెలకొన-చేయగ వలెను".
అనుచు-విషయము చెప్పిరి-మునులు.

తొందరపాటుకు చింత కలిగెను
తిరిగి మునులతో - పలికెను అపుడు
"సూతునకిపుడు - దీర్ఘాయువును
శుద్ధ సత్త్వమును-ఇచ్చిన-చాలున?

మీరందరు - మరి - సంతసింతురి
తెలుపుడు అనుచు - బలభద్రుడన
స్వామీ - నీవు - సమర్థుడవు కద!
తగిన దానిని - చేయుము - అనిరి.

ఓ మునులారా - సూతుడు యికపై
చిరాయువై - మరి - ఆరోగ్యముతో
సకలవిద్యలలో - మేటిఅగునన -
వెంటనె బ్రతికి - సూతుడు - ప్రణమిడె.

మునులందరును - సూతుడు కలసి
బలరాముని - అట ప్రస్తుతించిరి
సంతసించెను బలభద్రుండు
ప్రాయశ్చిత్తము - అడిగెను వారిని.

"తొందరపాటులో - తప్పు చేసితిని
శాంతి కలుగగా త్రోవచూపుడనె"
అంతట పలికిరి - ముని పుంగవులు
అసురనాశము - చేయగ కోరిరి.

బలరామా - ఇట - ఇల్వలు తనయుడు
పల్వలు డనెడి - అసురుడు గలడు
బలమున వానికి - చాలరెవ్వరూ
దారుణాల - కత డాలవాలము.

యజ్ఞశాలలను - రక్తమాంసముల
కలుషిత మొనర్చి - హింసించునయా
తపోనిష్ఠలో - నుంటిమి గనుక
అశక్తులమై - బాధలో నుంటిమి.

వానిని - నీవు - అంతము చేసిన
సంతోషమ్ము - కలుగును మాకు
భరతవర్షమున - తీర్థములందు
స్నానమాడుము - ఒక ఏడాది.

అటుల నీవు - ఆ - నదుల గ్రుంకిన
ప్రాయశ్చిత్తము - జరుగును అనిరి
బలరాముడట - సరియనగానే
మునులు-యజ్ఞమును ఆరంభించిరి.

తిరిగి - యజ్ఞము జరుగుట గాంచి
పల్వలుండు-అది-విఘ్నము చేయగ
రక్త - మాంసములు - మట్టి బెడ్డలు
నాలుగు వైపులనుండి - విసరెను.

జడివానతొ - మరి - సుడిగాలులతో
ఉక్కిరి బిక్కిరి అయినది - మునులకు
ఆకాశములో - ఘన శరీరముతొ
అగపడె-అసురుడు-ఆసమయములో.

కాటుక కొండగ - నుండెను వాడు
రాగి వెంట్రుకలు - పెద్దపెదవులు
రంపమ్ములను - బోలు కోరలు
నిప్పులు గ్రక్కెడి - నయనమ్ములతో.

మునులందరిని ముద్దగ జేసి
మ్రింగివేయునా - అనిపించునటు
పెద్ద అరపులతొ - అసురుడు-నింగిని
అట్టహాసము - చేయుచుండెను.

ఘనమగు శూలము - ధరించినాడు
మరియొక చేత - గదను పట్టెను
వానిని గాంచి - మునులందరును
బలరాముని అట - శరణు వేడిరి.

అభయమునిచ్చి - బలభద్రుండు
నాగలి తీసుకు - నిండుగ నిలచెను
అంతట - అసురుడు - ఆవేశముగ
బలభద్రుని - తో - పోరగ వచ్చెను.

రారా! దుష్టుడ - నీ పని - యిక సరి
అనుచు-పలుకుచు-హలాయుధమ్మున
అసురుని - శిరమున - బలరాముండు
గట్టిగ మోదెను - చచ్చెను - వాడు.

అంతట - మునులు - ఆనందించి
స్తోత్రము చేసి - వేదమంత్రముల
బలరాముని - అట - అభిషేకించిరి
శుభమస్తుయని - దీవనలిడిరి.

మునుల వద్దను - శలవందుకొని
పుణ్య నదులలో - స్నానమాడగ
బలభద్రుండు - బయలు దేరెను
హితులు - విప్రులు - అనుసరించిరి.

కౌశిక నదిలో - మునిగి - అంతట
సరయూ - ప్రయాగ - తీర్థములందు
స్నానము జేసి - తర్పణమ్ములిడి
పులస్త్యాశ్రమ - దర్శన మందెను.

గోమతి - గండకి - నదుల మునిగెను
సంసార పాశముల - త్రెంచి వేసెడి
విపాశానది - జలముల మునిగెను
శోణ - గయ-మరి-గంగల గ్రుంకెను.

మహేంద్ర పర్వత - శిఖరము జేరి
ఇరువది ఒక్క తడవలు - రాజుల -
శిరములు త్రుంచిన-పరశురామునికి
బలరాముండు - వందనమిడెను.

అచ్చటినుండి - సప్త గోదావరి
పవిత్ర తీరము చేరి - అచ్చట
స్నానము చేసి - నేరుగ సాగి
వేణా - పంప - సరస్సుల చేరెను

ఆ నదులందు - స్నానము జేసి
అటుపై భీమ నదిలో - మునిగి
కుమారస్వామి - దర్శనమంది
ఆనందముగా ముందుకుసాగి.

శ్రీశైలములో - మల్లిఖార్జున
మహాలింగముకు-మనసుతొ మ్రొక్కి
ఏడుకొండల - వెలసిన దేవుని
వెంకటేశ్వరుని - దర్శించుకొనె.

కంచికి సాగి - మహాశక్తిని
కామకోటి శక్తిని - గాంచెను
కావేరిలొ - మరి - స్నానమొనర్చి
శ్రీరంగనాథుని - దర్శించుకొనె.

వృషభాద్రి - మధుర-సేతుబంధముల
దర్శించుకొని - బలరాముడట
పదివేల గోవులను - విప్రోత్తములకు
దానము చేసి - ధన్యుడయ్యెను.

రామలింగేశ్వరు - దర్శనమంది
తామ్రపర్ణియను - నదిలో మునిగి
అచ్చటి నుండి - మలయ పర్వతము
చేరి - అచ్చట - అగస్త్యు గాంచెను.

ముందుకు సాగి - దక్షిణ సంద్రపు
తీరము చేరి - అచ్చటనున్న
కన్య అనెడి - ఆ - దుర్గను గొలిచి
పంచాప్సరమను - జలముల గ్రుంకెను.

గోకర్ణములో - చంద్రశేఖరుని
కామదేవిని - ఉపాసించుకొని
పయోష్ణి - నిర్వింధ్య నదులను గాంచి
దండకవనిలో - ప్రవేశించెను.

మహిష్మతీపుర - దర్శనమంది
మనుతీర్థమున - స్నానము చేసి
బలభద్రుండు - అనాయాసముగ
ప్రభాసతీర్థము - జేరెను తిరిగి.

తిరిగి వచ్చిన - బలరామునికి
కురుపాండవుల - యుద్ధము జరుగుట
రాజులెందరో - అసువులు బాయుట
హృదికదిలించే విషయము - తెలిసెను.

అచ్చటి వారు - తిరిగి చెప్పిరి
భీమ - సుయోధను - లిద్దరు అపుడు
గదా యుద్ధముకు - తలబడినారని
బలరాముడెంతయో - కలత చెందెను.

భీమ - సుయోధన - యుద్ధమునాపగ
కురుక్షేత్రము - చేరెను అతడు
యోధులిద్దరూ - కొండల మాదిరి
తలపడి యుద్ధము చేయుచుండిరి.

వారిద్దరినీ - వారించుచును
పోరునాపగ - చెప్పెను - వారికి
"మీరిద్దరును - సమవుజ్జీలు
గెలుపు ఎవరికీ రానేరాదు.

మీలో ఒకరు - భుజబలశాలి
మరియొకరేమో - ఉపాయశాలి
కావున యిద్దరు - సమబలులయ్యా!
ఈ రహస్యము - చెప్పితి - మీకు.

పోరునాపుడు" అనుచు - చెప్పిన
బలభద్రు మాటలు - చెవిని పెట్టక
గదలతొ యిద్దరు - ముందుకురికిరి
మరింత జోరుగ - పోరసాగిరి.

విసుగు చెందిన - బలభద్రుండు
మీతల వ్రాతను - మార్చగ తరమా -
అనుచు - విసుగుతో - ద్వారక జేరెను
మదిలో మథనతొ - తిరిగి పోయెను.

ద్వారక చేరి - యాత్రగురించి
విశేషమ్ములను - ఉగ్రసేనునికి
మిగిలిన వారికి - తెలియపరచెను
నైమిశారణ్యము - తిరిగి జేరెను.

అచ్చట - మునుల - అనుమతి నంది
యజ్ఞము చేసెను - శ్రద్ధాభక్తుల
దండిగ - దక్షిణ లిచ్చె - విప్రులకు
కానుకలెన్నో ఇచ్చెను వారికి.

యజ్ఞము - సమాప్తి అయిన - దనుకనే
రేవతిదేవితొ - కలసి - అచ్చట
అవభృథ స్నానము - నాచరించెను
వారికి మునులు - దీవనలిడిరి.

అసాధ్యమైన - తీర్థయాత్రలు
బలభద్రుండు - భక్తిగ జరిపి
బంధుప్రీతిగా - ద్వారకలోన
సుఖముగ రోజులు - గడుపు చుండెను.

బలరాముని లీలలు - తీర్థయాత్రలు
పాపహరణములు - పులకరింతలు
అనంతుడైన - ఆయన లీలలు
వర్ణించుటకు - విరించి చాలడు.

ఆవిధముగను శుకయోగీంద్రుడు
పరీక్షత్తునకు - తెలియబరచెను
ఆనందముతో పరవశించిన
రాజు - మౌనికి వందనమ్ములిడె.

॥శ్రీ కృష్ణచరితము॥



# 23 కుచేలో పాఖ్యానము

దుష్ట శిక్షణకు - పుడమిని బుట్టిన
పరంధాముని - దివ్య చరితలో
ప్రతి అక్షరము - పాపహరణము
మనుజలోకమున-కది-యొకవరము.

పరమ ఋషులకు సంయమీంద్రులకు
తపోధనులకు - ప్రీతి గూర్చునది
కృష్ణ చరితము - ఎంత విన్నను
తనివితీరదు - వినగా మనసగు.

వరప్రదాత - దేవవంద్యుని
పూజలు చేసే - చేతులె - చేతులు
చక్రహస్తునికి - నిరతము మ్రొక్కే
శిరస్సు ధన్యత నందునుగాదా!

పరంధామునితొ - కలసిన-మనసు
మనస్సుగా - మరి - గుర్తించబడు
రమాకాంతుని - చూడగలిగెడి
చూపులె అగును-సరియగు చూపులు.

ముకుంద నామము - పలికే నోరు
నోరు - అనుచును - పిలవగవలెను
అచ్యుతు కథలు - వినెడి చెవులవి
కర్ణమ్ములుగా - భావించబడు.

శ్రీహరి - పాద తీర్థము గ్రోలగ
భాగవతోత్తము - డెదురుచూచును
వానిజన్మ యది - ధన్యము అగును
అనుచు భక్తిగా - పలికెను రాజు.

ఆపై గాథను - శుకయోగీంద్రుడు
తెలియబరచెను - తియ్యగ నపుడు
కృష్ణుని - బాల్య స్నేహితుడాతడు
కుచేలుడనెడి - బీదబ్రాహ్మణుడు.

ఆత్మజ్ఞానియు - శాంతమూర్తియు
కష్టసుఖములకు - లొంగనివాడు
ఇంద్రియవశము - కలిగినవాడు
ధర్మమార్గమున - చరించువాడు.

పరతత్త్వము పై - గురిగలవాడు
తపోవంతుడు - నిశ్చల వ్రతుడు
పేదరికమ్మును - మనసున నుంచని
నిరుపేద - ఆతడు - తృప్తికి నెలవు.

భర్తకు తగిన - సుగుణాలగని
కుచేలు భార్య - పరమ పతివ్రత
అధికసంతుతో - బీదరికమ్ముతొ
కృశించి పోయిరి - సంతానమ్ము.

కాలెడి కడుపుతొ - అన్నము కొరకు
తల్లిని - అడుగుచు - ఏడ్చెడివారు
వారి బాధకు - కుమిలి పోవుచు
కంటినీట - దిగమ్రింగెడి దామె.

ఒక్క దినమున - ఆ ఇల్లాలు
భర్తముందర - మనస్సు విప్పెను
నిండు మనసుతో - నమస్కరించి
ఆకలిబాధ - తీర్చగ కోరెను.

"నాథా! పిల్లలు - ఎదుగుచుండిరి
గంజినీళ్ళవి - చాలుటలేదు.
వారిబాధను - తీర్చగ - మన విధి
దారిద్ర్యమును - దూరము చేయుడు".

మెల్లగ పలికెను - కుచేలుడామెతొ
"నామది - నీకు పూర్తిగ తెలియును
వంకరత్రోవలు - త్రొక్కగలేను
ధర్మ - మార్గము-చెప్పుము అనెను"

అంతట పలికెను - ఆ ఇల్లాలు
"స్వామీ మీకు - తెలియనిదా మరి
మీ స్నేహితుని - కృష్ణుని గాంచి
లేమిబాపమని - అర్థించుడయా!

అవతారపురుషుడు - అనిచెప్పిరి కద
లక్ష్మీపతి - మరి - దయాసముద్రుడు
ఆర్తత్రాణ పరాయణుడాయన
అందరికాయన - అందుబాటు కద!

ఆయన - దర్శన భాగ్యము వలన
లేమి తొలగి-మరి-భాగ్యము కలుగద -
ఆయనతో - మీ - స్నేహము గూర్చి
తలచి-తలచి-మరి మురిసిపోదురే".

ఆ మాటలకు - సంతసించెను
ఆలోచనయది - మంచిది అనెను
ఆ పరమాత్మ దర్శనమ్మది
ఇహ - పర - సాధకమని తలపోసి.

"పుణ్యవతీ - నీమాటలకెంతో
సంతోషమ్మది - కలిగెను - నాకు
బాల్యస్నేహితుడు - అయినను - కానీ
యోగీశ్వరుడు - దైవస్వరూపుడు.

ఆయన దర్శన - మతి శుభప్రదము
వట్టి చేతులతొ - పోవుట ఎట్లు?
కాన్కలు గొనిపో - కలిమిలేదు కద
భక్తి కలిమి - మరి - కంటికగపడదు."

అనగా భార్య - లోనికి బోయి
దోసెడు అటుకులు - భర్తకు జూపగ
సిగ్గుతొ - వంచిన తల - పైకెత్తక
అటుకులు - కట్టెను - చింకిపాతలో.

"నీవూ - పిల్లలు భద్రమనుచును
ద్వారక కేగగ - నిలచిన భర్తను
సుఖముగ వెళ్ళి - శుభముగ రమ్మని
నిండు మనస్సుతొ - కోరెను - భార్య.

పాదచారియై - ద్వారక కేగెడు
కుచేలు మదిలో - ఎన్నో ఊహలు
ద్వారకలోన - ప్రవేశింతునా!
అందుకు నాకు - అర్హత కలదా.!

ఎటులో ద్వారక - జేరిన నింక
కృష్ణదర్శనము - సులభసాధ్యమా!
నావేషముగని - పలుకరింతురా
ద్వారము వద్దే - నిలిపి వేయరా -

తీరా - నేను కనబడినంతనె
పలుకరించునా - కంటజూచునా
కృష్ణుడు - మాత్రము - అతీరుండడు
పరిచయమన్నది-మరచుట జరుగదు.

అటుల - మనస్సు-పరిపరివిధముల
అవునూ - కాదని - వూగులాడగ
అదృష్టమ్ము - ఎటుల నుండెనో
అటులే జరుగును-అనుచు-సాగెను.

ద్వారకలోన - అడుగు బెట్టెను
ధన్యుడైనటు - తలచెను - మదిలో
సిరిగలవాడని - అర్థించెదనని
మదిలో ఎన్నడు - తలంచలేదు.

నేడు కూడ - తన-నేస్తము అనుచు
బయలుదేరెను - దురాశలేక
పెట్టిన వారికి - పుట్టును అనుచు
నమ్మిన జ్ఞాని - ఆ - కుచేలుడు.

తానొక - భవంతి-ముందు నిలచెను
అచ్చటి వారిని - అడిగెనప్పుడు
కృష్ణుని మేడ - ఎచ్చట గలదని
అదియే అనుచు - వారు చెప్పిరి.

ఆనందముతో - పొంగిపోయెను
ఉత్తరీయమున-చెమట-తుడుచుకొని
లోనికి పోవుట - తన - కోరికయన
అంతట - ఆతని - వివరములడిగిరి.

"మీమహారాజుకు - బాల్యస్నేహితుడ
ఆమహనీయుని - చూడగ వచ్చితి
చాలాకాలము అయినది - చూచి
అనుచు - సూటిగా - చెప్పెను వారికి.

ఆశ్చర్యముతో - ద్వారపాలకులు
అమిత ఆదరము - చూపించుచును
ఆహ్వానించిరి - త్రోవ చూపిరి
అడుగులు - తడబడ - సాగెను విప్రుడు.

సింహద్వారము - దాటి - సాగగా
మణిమయ శోభిత - దివ్యసౌధములు
లెక్కకు అందని - వెన్నో వున్నవి
అందు - కృష్ణుని - మందిరమ్ముకై.

సౌధరాజముల - అందచందములు
తిలకించుచును - సాగెను విప్రుడు
సందడి నిండి - మంగళకరముగ
సౌధములన్నీ - అగబడుచున్నవి.

లలనామణుల - రాజహంసల
వయ్యారములు - వొలికెనచ్చట
పూదోటలతో - పద్మసరస్సుల
ప్రతిమందిరము - శోభిలుచున్నది.

తుమ్మెద ఝుంకారమ్ములు - నిండి
సుమగంధముతో - సొగసులు నిండి
అగబడు సౌధములన్నీ - చూచుచు
విశాలమైన - ముంగిట ఆగెను.

కన్నుల ముందర - కనబడు దవ్వులొ
హంసతూలికాతల్పమందున
మంగళమూర్తి - కృష్ణుడు - అగబడె
ఎదురుగ-రుక్మిణి-కూర్చొని యున్నది.

వారిద్దరును - ఇష్టాగోష్టితొ
ముసిముసి - నవ్వుల కనబడిరతనికి
దివ్య దంపతుల - గాంచిన-విప్రుడు
జన్మ - ధన్యమని - తలంచినాడు

ఇరు ప్రక్కలను - సుందరాంగులు
వింజామరలు - వీయు చుండిరి
నాటి కృష్ణుడే - యీ మహనీయుడు
ఆశ్చర్యములో - మునిగి పోయెను.

నల్ల కలువలను - వెక్కిరించెడి
నిగనిగలాడే - మేని కాంతితో
పచ్చని రంగు - పట్టుపంచయది
సిరులొలుకుచును - శోభగనున్నది.

చెక్కిళ్ళకు మరి - వన్నెలుదిద్దే
పనిలో నున్నవి - కుండలమ్ములు
పెదవుల - విరిసే - చిరునవ్వులవి
మల్లెపూలలా - తోచుచున్నవి.

ఉరమున నున్న - కౌస్తుభ మణియది
కదలుచు - రుక్మిణి వంకజూచుచు
పలుకరించుచు ఉన్నటులున్నది
కస్తురితిలకము - శోభలొలికెను.

గాలికి - ముంగురు - లాసుందరుని
లలాటమ్మున - నాట్యమాడగా
మధ్యలొ నిలబడి - కస్తురి తిలకము
నాట్యరవళి - తిలకించుచున్నది.

అరవిందాక్షుని - నేత్రద్వయము
కృపారసము ఒలికించుచున్నది
సింగపు నడుము - నెమలి పింఛము
నయనానందము - కలిగించెనట.

గండపెండెరము-మురుగుల-గంటలు
మరి మరి - చూడగ - మనసును దోచే
మంగళమూర్తి - దివ్యరూపమును
పరిశీలనగా గాంచె - కుచేలుడు.

జగన్మోహనుడు - నాటి కృష్ణుడే
లోకారాధ్యుడు - నాస్నేహితుడే
యదువంశరత్నమా - కరుణాధాముడె
అనుచు-నాతడు-మురిసి పోయెను.

ఆనందముతో - అడుగులేసెను
రెప్పపాటులో - వేణుమాధవుని
బాహువులందు - చేరెనాతడు
పరవశమ్ముతో - పొంగిపోయెను.

సఖాయని పిలచిన పిలుపుకు
కుచేలుడెంతో - ఎదిగిపోయెను
**త్రివిక్రమునిగా - ఎదిగిన వటువు**
మనోనేత్రమున - కనబడెనతనికి.

స్నేహభరితము - కృష్ణుని చూపులు
వాత్సల్య పూరితము-శ్రీహరి చూపులు
అభిమాన ధనముతో నిండెను-మాటలు
అనురాగ వార్నిధి - పొంగి పొరలెను.

పేదరికముతో - కృశించి పోయి
నియమ నిష్ఠలకు - నీరసించిన
ఎముకలగూడుగ-నుండెను-విప్రుడు
కృష్ణుడాతనిని - కూర్చొనబెట్టి.

బంగరు కలశము నందున - ఉన్న
చల్లనిజలముల-పదములు కడిగెను
ఆతీర్థమును - శిరమున జల్లుకు
పట్టుపుట్టమున-పదములు తుడిచెను.

స్వయముగ తాను - బాల్యమిత్రునికి
కస్తురి కలిపిన - గంధము పూసి
వీవన తీసుకు - విసరసాగెను
ప్రకృతి - తానే - పరవశించినది.

బడుగు బాపని - శ్రమయంతయును
ఉపచారములతొ - మాయమయ్యెను
ఆనందముతో - వెలిగెను - ముఖము
బ్రహ్మతేజము - ఉట్టిపడినది.

అగరుధూపముతొ - మణిదీపముల
నివాళులిచ్చి - సుమహారములతొ
స్వయముగ-కృష్ణుడు-అలంకరించెను
కప్పుర విడెమిడి - గోవు నొసంగెను.

నాప్రియమిత్రుడ! - కుశలమేకదా!
సుఖముగ జరిగెన - నీప్రయాణము
అనుకూలవతి - నీయిల్లాలు
పిల్లలందరూ - సుఖముగ నుండిర.

ఆనందముతో - మాటలురాక
ఆనందాశ్రులు - జారుచుండగా
అచేతనుండయి -కుచేలుడుండెను
అదియే భక్తుని - శరణాగతియగు.

బీదబ్రాహ్మణుడు - లక్ష్మీపతిచే
సపర్యలందుట - గాంచి - అచ్చట
కాంతామణులు - పరిచారికలు
ఆశ్చర్యములో - మునిగి పోయిరి.

ముందు వెనుకలు - ఆలోచించక
జగన్నాథుడే - సేవలు చేసెను
పూర్వజన్మలో - తపస్సు ఫలితము
అనుచు తలంచిరి అచ్చటి వారు.

అంతట కృష్ణుడు - మెల్లగ పలికెను
కరము గ్రహించి - అడిగె - కుచేలుని
"గురువులవద్ద నున్న సమయమున
ఎటుల గడిపితిమి - జ్ఞాపకమున్నద.

నాటి పనులు - గుర్తున్న తెలుపుము
వేదశాస్త్రముల - ఉద్దండుడవు
నీసహధర్మిణి - నీఅడుగులలో
వర్తించుచును - సుఖములనిడున!

నీవాలకము - ఇహభోగములను
విస్మరించినటు - చెప్పుచున్నది
ఆముష్మికమును - అందుకొనుటకై
నీమది - తొందర కలిగియున్నది.

జీవుల కొరకై - నేనీభువిలో
కర్మబంధముల-ముడిబడి యుంటిని
నీధ్యేయమది - పరమపదమని
ఆపథముననే - సాగుచుంటివి.

పరమార్థము - అన-మనగురుదేవులు
తేటతెల్లముగ - నాడు జెప్పిరి
అజ్ఞానతిమిరమును - అంతముచేసి
ఆత్మజ్యోతి - వెలిగించెను - గురువు.

చిదానందమగు - బ్రహ్మపదార్థము
సర్వస్వములో చూచిన జ్ఞాని
పండితులకు - మరి - ఆత్మజ్ఞానపు
భిక్షపెట్టగ - చాలిన - ఘనుడు.

ఆ గురుసేవలు - నేను చేయుట
గురుపద - సేవాధర్మము తెలుపుట
లోకమ్మునకు - గురువుల ఘనత
గమ్యము అన్నది-చాటి చెప్పుటకు.

ధర్మరక్షణకు - ధర్మపాలనకు
పరమగురుడను - ఇలలో నుంటిని
అది తెలిసినచో - నను పూజింతురు
సంసార సాగరము తరించగలరు.

అన్నిజీవులకు - ఆత్మను నేను
యజ్ఞమ్ము తపస్సు చేయట కన్నను
గురువుల సేవచేయువారిని
నావారుగను - తలంతునయ్యా!

స్నేహితుడా - ఆనాటి - విషయము
గురువు ఆనతిని - కట్టెల కొరకు
అడవికి - మనము - జేరుకుంటిమి
ఆసంఘటన - గుర్తువున్నదా?

ఆడుచు - పాడుచు - మనమిద్దరము
కట్టెలు కొట్టి - అలసిపోతిమి
నిప్పులు చెరిగే - ఎండ - కాసెను
ఆకలిమంట - కడుపులొ పెరిగెను.

కట్టెలమోపులు - మోయగలేక
ఆకలితో మరి - సొమ్మసిల్లితిమి
తరువు ఛాయలో కూలబడితిమి
గుర్తువున్నదా - అనుచు అడగగా.

"కంటికి కట్టిన రీతిగ నీవు
చెప్పుచుంటివి - గుర్తువచ్చినది
ఆపై విషయము చెప్పుము కృష్ణా!
ఆ రోజులవి - తిరిగి రావు కద"

అనుచు కుచేలు డడిగినంతనే
ఆరంభించెను - మధుసూదనుడు
"అటుల-మనము మరి-అలసిపోతిమి
అంతటిలోన - మబ్బులు క్రమ్మెను.

చిమ్మచీకటి - కమ్మినట్లుగా
నల్లమబ్బులవి - నింగిని - నిండెను
ఉరుము - మెరపులు-హోరుగాలులు
ప్రాణికోటి - యది - తల్లడిల్లినది.

అంతటిలోన - పెద్దచినుకులతొ
జడివాన కురిసెను - ప్రొద్దుపోయెను
మనమిద్దరము - తడిసిపోతిమి
గజగజ వణకుచు-నుంటిమి అచట.

కొంతసేపటికి - వానవెలిసెను
మోపులతో - మరి-బయలు దేరితిమి
మిట్టపల్లములు - ఏకమైనవి
నడిచే - త్రోవ - కనబడకున్నది.

నేలమీదనా - గోతిలోననా
అడుగు-పడుటది-తెలియకపోతిమి
ఒకరిచేతులు - ఒకరు పట్టుకొని
రాత్రియంతయు - నడచితిమయ్యా.

పట్టువదలక - కట్టెల మోపులు
పట్టుకొచ్చిన - మనలను గాంచి
పరవశించిన - మన - గురుదేవులు
సజలనయనముల - కౌగిలినిడిరి.

ఇంతటి - శ్రమకు - ఓర్చిరి మీరు
శిష్యులలోన - అగ్రగణ్యులు
అచిరకాలమున - గృహస్థులై మరి
పుత్రపౌత్రులతొ-సుఖముగ నుందురు.

అనుచు చల్లగ - మన గురుదేవులు
ఆశీస్సులనిడ - పొంగిపోతిమి
ఆవిషయము - మరి - గుర్తుకు వచ్చున
మరపురాని - మధురానుభూతియనె.

కృష్ణుని - కన్నుల నిండుగ - కనుచు
పరవశమ్ముతో - పలికె కుచేలుడు
గురుకుల వాసము - చేసిన నీవు
గరువుల ఘనతను - చెప్పితి వీవు.

ఆత్మజ్ఞానముతొ - ఆలోచించిన
ముల్లోకములకు - గురువే - నీవు
నీవు గురువులను - ఆశ్రయించుట
నీ లీలయని - తెలుపుట కొరకే.

చిరునగవులతో - సిరిమగడంతట
వెన్ను తట్టుచు - తనస్నేహితుని
జ్ఞానివి - నీవు మాటలాడుటలొ
మేటివి - అనుచు - ప్రస్తుతించుచు.

చాలాకాలము - అయినది చూచి
మిత్రుని చూడగ - వచ్చినాడవు
వట్టిచేతులతొ - రావని తెలియును
ఏమికానుక - తెచ్చితి వనెను.

కృష్ణుని కోరిక - ముదము గూర్చెను
అంతకు మించి - సిగ్గు కలిగినది
తలవంచుకొని - కూర్చొని యున్న
కుచేలునితో - పలికెను కృష్ణుడు.

జంకు ఏల - నిశ్శంకగయిమ్ము
ఎక్కువ - తక్కువ - ఆలోచించను
భక్తి ప్రపత్తుల - యిచ్చిన దానిని
వేలరెట్లుగా - భావించెదను.

ఫలమో, పుష్పమో-పత్రమొ-జలమో
ప్రీతిగ యిచ్చిన - సంతోషింతును
బాల్యమిత్రుడవు - వేదవిదుడవు
ఏమితెచ్చినను-అమూల్యమదియగు.

తలను దించుకొని - కూర్చొనియున్న
ప్రాణమిత్రుని-మనసు-తెలుసుకొని
ఆప్యాయముగా - ఉత్తరీయమున
మూటగట్టిన - అటుకులు తీసెను.

ఆహా - ఎంతటి - మధుర పదార్థము
నాకు ప్రీతియని-ఎటుల తెలిసెనో -
అనుచు - ముదముగ-పిడికెడు తీసి
కృష్ణార్పణమని - నోట వేసుకొనె.

నాతోబాటుగ - లోకములన్నీ
తృప్తినందును - అనుచు తినుచును
తిరిగి - మరియొక - పిడికిలి నిండా
అటుకులు తీయగ-ఆపెను-రుక్మిణి.

"స్వామీ! నన్ను - కటాక్షించుడు
ఇంతకు ముందే - ఆరగించిన
అటుకులు ఇచ్చెను-అనంత సంపద
గతి - మరి - మీకు తెలియదా.

అవి చాలక - మరి - మరల తింటిరా
సిరిసంపదలు - మీస్నేహితునికి
దాస్యము చేయట - తప్పదు స్వామీ
లోకములో - ఇక-సిరి మిగలదయా"

అటుల - రుక్మిణి - పలికిన పలుకుల
తీసిన - రెండవ పిడికిటి - అటుకులు
ఉత్తరీయమున - మెల్లగ విడచెను
దయాసముద్రుడు - దానశోభితుడు.

రాత్రి - అచటనే - ప్రియమిత్రునకు
అమోఘమైన - విందు జేసెను
హంసతూలికా తల్పమునందు
పవ్వళించగ - వసతి జేసెను.

అమర సుఖము - తా - పొందినట్లయి
పరవశించెను - ప్రాణమిత్రుడు
పాతసంగతులు - ముచ్చటించుకొని
హాయిగ - నిద్రలో-జారిరి- ఇరువురు.

వేకువనే - విధులన్నియు - తీర్చుకు
అరుణోపాసన - అనుష్ఠానములు
ఆచరించుకొని - కుచేలుడంతట
కృష్ణుని గాంచి - శలవు నీయమన.

'మంచిది' అనెను - ఒక్కమాటగా
ఆపై - కుచేలు ననుసరించుచు
కొంతదూరము - సాగనంపెను
ముందుకు సాగెను - విప్రోత్తముడు.

ఆనందముతో - నిండెను మనసు
విశ్వమోహనుని - విశ్వకర్తను
జగన్నియంతను బ్రహ్మస్వరూపుని
పురుషోత్తముని - గాంచితిననుకొనె.

యదుకుల రత్నము-రమాధవుని-గన
అల్పుడ నెంతటి పుణ్యము చేసితి
బాల్యస్నేహితుని - మనసునిండుగా
ఆహ్వానించెను - పూజలొనర్చెను.

మహాలక్ష్మియగు - రుక్మిణిదేవి
చామరమ్ముతో వీచెను - నాకు
లోకేశ్వరుడు - పాదములొత్తెను
ఎంతటి తపము - చేసితినో మరి.

అంత ఆదరము - జూపిన మిత్రుడు
తృణమయినను - నాకొసంగలేదు
కారణమదియే - ఇహలోకములో
భోగములన్నీ అశాశ్వతముగద.

ధనభోగముల - నామది చిక్కి
మోక్షపథమును - మరపించునని
తెలిసిన స్వామి - అటుల జేసెను
దయాసాగరుని - దయను పొందితి.

ఆయన కృపను - మించిన సంపద
ఇలలో వుండదు - అనితలంచుచు
తిన్నగ జేరెను - తన గ్రామమునకు
తన కుటీరము - చెంత జేరెను.

ఆశ్చర్యమది - ఆప్రదేశమున
తనకుటీరమది - అగబడలేదు
అచ్చటగలదొక - దివ్యసౌధము
చంద్రకాంతశిల - లొప్పుచున్నవి.

రవిచంద్రులను - ధిక్కరించెడి
వెలుగులుచిమ్మెను - సౌధ మచ్చట
ప్రక్కన గలవు చిన్న మేడలు
ఉద్యానవనములు - తీర్చియున్నవి.

నందనవనమును - వెక్కిరించునటు
వెలసెను వనములు - ఆమని శోభతొ
పద్మమ్ములతో - నిండిన కొలనులు
నేత్రపర్వము - చేయుచున్నవి.

పసిడి గజ్జెల - చిరుమ్రోతలతో
దాసీజనమట - తిరుగుచుండిరి
ఆ భవనమును - గాంచి - కుచేలుడు
ఆశ్చర్యములో మునిగి పోయెను.

ఇంతటి - చక్కని - దివ్యభవనము
ఏపుణ్యాత్ముని - సొంతమో మరి
సర్వసంపదల - నిండి యున్నది
లక్ష్మికి - నిలయము - అన్నటులున్నది.

అంతటిలోన - కొందరు వనితలు
అచ్చరకన్యల పోలి యుండిరి
అచటికి వచ్చి - ఆ విప్రునికి
కడువినయముగా - నమస్కరించిరి.

లోనికి రమ్మని ఆహ్వానించిరి
కొందరు పురుషులు-మంగళస్వనముల
ఎదురు వచ్చిరి - స్వాగతమిడిరి
మంగళస్త్రీలు - ఆహ్వానించిరి.

అచేతనముగా - కుచేలుడంతట
లోనికి నడచెను - అంతఃపురమున
బంగరు ఊయల - నూగుచు-నచట
అందములొలికే - కాంతను జూచెను.

సుందరస్త్రీల - సపర్యలందుచు
భర్తరాకకై - ఎదురు చూచుచు
త్వరితముగా - మరి - రావలెననుచు
దైవానికి - తా - మ్రొక్కుకొన్నది

భర్త వచ్చిన - విషయము తెలిసి
ఉన్నపాటున - ఊయల దిగినది
ఎదురు వచ్చినది భక్తిప్రపత్తుల -
కాంతను గాంచెను - కుచేలుడచ్చట.

మహాలక్ష్మియే - మానవకాంతగ
రూపుదిద్దుకొని - నిలబడినట్లయె
ఆ పుణ్యవతి - సజలనయనముల
భర్తపదములకు - ప్రణామమిడెను

పట్టుచీరతో - పాదములొత్తి
హారతులిచ్చి - భక్తి ప్రపత్తుల
భర్తను తీసుకు - లోనికి వెళ్ళెను
పరిచారికలు - సేవలొనర్చిరి.

కృష్ణదేవుని - కరుణావృష్టికి
సకల సంపదలు - సమకూరినవి
ఇంద్రభోగములు - అమరియున్నవి
కల్పవృక్షమే - నిలచినట్లయె.

హంసతూలికా తల్పమ్ములతో
చంద్రకాంతశిలా - సౌధమ్ములతో
పల్లకీలతో - పరిచారికలతొ
ఆనందసీమయే - అందెనాతనికి.

అన్నిభోగములు - అమరియున్నను
అనిశము - ఆతని-మనస్సు మాత్రము
బ్రహ్మపదార్థము - నుపాసించుటలొ
లగ్నమైనది - జ్ఞాని - ఆతడు.

కుచేలుడు - తా - మదిలో మాత్రము
అప్పుడప్పుడు - తలంచువాడు
దరిద్రమ్ముతో - బాధలు పడితిని
తలచుకొనుటకే - భయమగు రోజులు.

కృష్ణదేవుని - దర్శన భాగ్యము
విశేష సంపద - కలుగజేసెను
కృష్ణుడు మాత్రము - తనుగా తాను
నాదు లేమిని - ప్రస్తావించక.

వెళ్ళివత్తునన - మంచిది - అనుచు
ముక్త సరిగ - మరి - పలికి పంపెను
పిడికెడు - అటుకులు - నేనిచ్చితిని
అనంతసంపద - లమర్చె శ్రీహరి.

నమ్మకమ్ముతో - స్వల్పము నిడినను
కోటిరెట్లుగా - తలంచుదైవము
నాచరిత్రయది - దృష్టాంతమని
భక్తుడు తెలిసిన-బ్రతుకు ఫలించును.

వళ్ళు దాచని - చింకిపాతల
బడుగుబాపడని - హేళన చేయక
ముక్కి పోయిన - అటుకులు తినెను
కృతార్థునిగా - చేసెను - నన్ను.

జన్మజన్మలకు - మహానుభావుని
అనుగ్రహమ్మది - లభించవలెను
అనుచు తలంచెను-మది పులకించెను
అహర్నిశము - శ్రీహరినే - కొలిచెను.

ధర్మపత్నితో - ధర్మమార్గమున
ఐశ్వర్యములను - అనుభవించుచు
కృష్ణార్పణముగ - బ్రతుకు నంతను
తృప్తిగ - గడిసెను - కృష్ణుని సఖుడు.

శ్రీహరి కీర్తన - పండిన - మనసుతొ
ఇహబంధములకు - బద్ధుడుగాక
తృప్తిగ బ్రతుకును - వెళ్ళదీసుకు
మోక్షమునందెను - కుచేలుడంత.

అనుచు - రాజుకు - శుకయోగీంద్రుడు
కుచేలు గాథను - తెలియబరచెను
తిరిగి పలికెను - ఓమహరాజా!
వేదపురుషుడు - శ్రీహరి - తాను.

వేదవేత్తలను - విప్రోత్తములను
దైవసమానులు - అనుచు - తలంచును
కావున - వారు - భూలోకమున
పూజనీయులు - అన్నది తెలియుము.

నందనందనుడు - బాల్యసఖునికి
సంపదలిచ్చి - బ్రోచిన - చరితము
వినిన వారికి - ఇహపరములలో
సర్వసుఖములు - శుభములు కలుగును.

ఈ కథ వినెడి పుణ్యాత్ములకు
శ్రీహరిపైన - భక్తి నిలచును
అనుచు చెప్పిన - శుకయోగీంద్రుని
రాజు అడిగెను - ఈవిధముగను.

❊❊❊ ॥శ్రీ కృష్ణచరితము॥

## 24 శ్రీకృష్ణుడు సకుటంబముగా గ్రహణ స్నానమునకు వెళ్ళుట

శుకయోగీంద్రా! కుచేలు గాథ
ఆనందములో - ముంచెను-స్వామీ
అవతార పురుషుని-లీలామృతమును
అందించుమదయా - జన్మతరించును.

రాజా! వినుము - ద్వారకలోన
రామకృష్ణులు - సుఖసౌఖ్యములతొ
ఆనందముగా - గడుపు చుండిరి
అప్పుడు వచ్చెను - సూర్యగ్రహణము.

విశేషమైన - గ్రహణము గావున
గ్రహణస్నానము - చేయుట కొరకు
స్యమంత పంచక మను-క్షేత్రమునకు
రామకృష్ణులు - బయలు దేరిరి.

భార్గవరాముడు - రాజుల-జయించి
రక్తధారలతొ - ఐదు మడుగులను
కల్పించెను - అది - క్షేత్రమైనది
స్యమంత పంచక - మదియే రాజా.

సామాన్యుల వలె - రామకృష్ణులు
గ్రహణస్నానము - కర్మాచరణము
ఆచరించుటది - లోకుల కొరకు
ధర్మపథమును - చూపుట కొరకు.

ప్రద్యుమ్నాదుల - యదు-కుమారుల
సైన్యాధ్యక్షుడు - కృతవర్మను - అట
ద్వారకలోన - రక్షగ - నుంచి
బలరామకృష్ణులు - బయలు దేరిరి.

అక్రూరుడును - వసుదేవుడును
ఉగ్రసేనుడు - మొదలగు - పెద్దలు
వారిభార్యలతొ - బయలు దేరిరి
చక్కని రథముల - నలంకరించిరి.

రామకృష్ణులు - యదు - వృద్ధులతో
స్యమంత పంచక - తీర్థమ్ములలో
స్నానము జేసి - విధులను తీర్చుకు
దానధర్మములు - దండిగ జేసిరి.

ఉపవాసములు - గ్రహణస్నానముల
విప్రోత్తములకు - దానములిచ్చి
తృప్తిగ - భుజించి - ప్రక్కన తోటలొ
చెట్ల క్రింద - విశ్రాంతి గైకొనిరి.

అక్షేత్రమునకు - అంతకుముందుగ
కోసల - విదర్భ - కాంభోజాది
ధరణీ ధవులు - వచ్చి చేరిరి
నందాదులును - గోపికలొచ్చిరి.

ఆ ప్రదేశముకు - పంచపాండవులు
భీష్మద్రోణులు - ధృతరాష్ట్రాదులు
అందరు రాజులు - వచ్చి చేరిరి
గ్రహణస్నానము - చేయగ వచ్చిరి.

వచ్చినవారు - రామకృష్ణులకు
యదువృద్ధులకు - నమస్కరించిరి
పొంగిన - ఆనందముతో - రాజులు
ఉగ్రసేనుని - చూచి పలికిరి.

ఉగ్రసేనుడు - వసుదేవుడును
అక్రూరాదులు - యాదవులందరు
ఎంతటి పుణ్యము చేసిరో - మరి
జగద్రక్షకుని - సన్నిధి నుండిరి.

లోకపాలకుడు - మధ్యనుండగా
ఆటల పాటల - తియ్యని మాటల
ఆనందముగా -గడుపుచుండిరి
కృష్ణుని - తప్ప - అన్యము నెరుగరు.

పరమ యోగులకు – అందనిదైన
దర్శనమ్ము–లభియించె–మనకు ఇట
నిరతము – కృష్ణుని–సహపంక్తిని తిని
సాన్నిధ్యములో – యాదవులుందురు.

వారిమాటలకు – ముసిముసి నవ్వులు
కృష్ణుడు నవ్వుచు – అగబడినాడు
అంతటిలోన – వసుదేవుని గని
కుంతి – అచటకు వచ్చి – పలికెను.

క్షేమ సమాచారములడిగి – పలికెను
"అన్నా! పాండవు లడవుల యందు
మృగముల–కలసి–ఇడుముల–నుండిరి
మిన్నకుంటివి – తగునా నీకు –

దైవము అటుల – లిఖించినాడు
దైవము – మనకు – ఎదురుతిరిగిన
చుట్టరికమ్ములు ఏమి చేయును"
అనుచు–దుఃఖమున పలికెను–కుంతి.

వసుదేవుడామెను – వూరడించెను
"అమ్మా! మనము – ఆటబొమ్మలము
తెరవెనుకను – మరి – ఆపరమాత్మ
ఆడించును – తా – బొమ్మలన్నిటిని.

కంసుని హింసలు–ఎన్ని పడితిమో –
మగ్గిపోతిమి – అట – చెరసాలలొ
సర్వేశ్వరుని – దయకలిగినది
తిరిగి – నవ్వుచు – తిరుగుచుంటిమి.

ఆసమయములో – నందయశోదలు
గోపాలకులు – గోపికలందరు
కృష్ణుని చూడగ – వచ్చిరచ్చటికి
ఆనందముతో – పరవశించిరి.

నందయశోదలు – వచ్చుటగాంచి
రామకృష్ణులు – నమస్కరించిరి
తనయుల – ప్రేమగ–గుండెకు హత్తుకు
అమితానందము – ననుభవించిరి.

యశోద ప్రేమగ తనయులిద్దరిని
తొడపై – కూర్చొనబెట్టుకున్నది
చెక్కిలి ముద్దిడి – శిరస్సు మూర్కొని
ఆనందబాష్పముల – అభిషేకించెను.

ఎంతకాలము – గడచిపోయెనో
ముద్దుమోములు – చూడకపోతిని
ఎదిగి పోయిరి – నాయనలారా!
నన్ను చూడగ – కోరిక లేదా.

అనుచు–మరి మరి–గుండెకు చేర్చుకు
మురిసి పోయినది–మాతృహృదయము
రోహిణి – అటులే – పులకరించినది
యశోదతో – ఆ – తల్లులు అనిరి.

అక్కా నీవు – అమృత మూర్తివి
పురిటి కందులను – కంటిపాపలన
ఆప్యాయముగా – పెంచితివీవు
తల్లిదండ్రులు – మీరే అయిరి.

బాల్యచేష్టలు - చూచిరి మీరు
ముద్దుముచ్చటలు - అనుభవించిరి
ఎంతటి పుణ్యము - చేసితిరో కద!
అనుచు - ప్రేమగా - పలికిరి అచట.

అంతటిలోన - అంతదూరమున
గోపికలందరు - కృష్ణుని గాంచిరి
ఆనందముతో - పులకరించిరి
నందనందనుడు - గాంచెను వారిని.

ఎంతో కాలము - గడచిపోయినది
కృష్ణదర్శనము - లభించలేదు
ఆబాధలో - వారందరుండిరి
వారిని - కృష్ణుడు-అనునయించెను.

"బలవంతులగు-రిపుల జయించగ
చాలాకాలము - పట్టెను - నాకు
మదిలో - వేదన - మరచిపోవుడు
నాపై కోపము - తగదిక మీకు.

దైవఘటనను - కాదనలేము
ఒకచో-కలుపును-మరి విడదీయును
అన్నీ మనము - తలచినట్టుగా
జరుగవు-దైవము-మనలను గెలుచును.

అసలు విషయము - వినుడు శ్రద్ధగా
భక్తి లేక - మరి - జపతపాదులు
ముక్తినిచ్చునవి - కాదని తెలియుడు
నిశ్చలభక్తి - మీకు వున్నది.

పూర్వజన్మ - కృత - పుణ్యవశమున
అనన్య భక్తి - కలిగెను - నాపై
పునర్జన్మ - యిక - మీకు వుండదు
అనుగ్రహించితి - అనుచు పలికెను"

గోపికలందరు - పరవశించిరి
పరంధామునికి - వందనమిడిరి
పలికిరి భక్తిగ - రమాధవునితో
"స్వామీ! మేము - తరించినాము.

పరమయోగులకు - దుర్లభమైన
నీ దర్శనము - మాకు కలిగెను
నీపదధూళి - శిరసున దాల్చే
దివ్యవరమది - లభించెమాకు.

నీపై నున్న - నిశ్చలభక్తిని
తగ్గనీయకు - భక్తసులభుడా"!
అనుచు - కోరిన - గోపికలను గని
అటుల జరుగును - అనెను కృష్ణుడు.

అచ్చటి నుండి - కృష్ణుడు వెడలి
ధర్మరాజును - కుశలమడిగెను
ఆనందముతో - ధర్మనందనుడు
కౌగలించుకొని - పలికెనప్పుడు.

కృష్ణా నీకు - సర్వము తెలియును
మాస్థితి గతులు - తెలియదామరి
లోకరక్షకా - నిన్ను నమ్మిన
సుఖములు తప్ప - దుఃఖములుండవు

మాకు దేవుడవు - మంగళమూర్తీ!
నీదయవలన - సుఖముగనుంటిమి
అనుచు - పలికెను-ధర్మనందనుడు
సంతసించిరి - అచ్చటి వారు.

కృష్ణుని సతులతొ - ద్రౌపది కలసి
ముచ్చటలాడుచునున్న-సమయమున
వారిపెండ్లి - వృత్తాంతము-చెప్పగ
వారిని కోరెను - సంతోషముగా

వారందరు - తమ - పెండ్లి సంగతి
వరుసగ జెప్పిరి - ఆనందముగా
అందులొ-ఒక-వృత్తాంతము వినుమని
రాజుకు చెప్పెను - శుకయోగీంద్రుడు.

మద్రభూపతి - కుమార్తె - లక్షణ
ఆమె పెండ్లి - కథ - ఆమే చెప్పెను
ఆ కథ నీకు - వినిచెద రాజా!
అనుచు పలికెను - వ్యాసనందనుడు.



॥శ్రీ కృష్ణచరితము॥

# 25 లక్షణ పెండ్లి వృత్తాంతము

లక్షణ - అనెడి - శుభ లక్షణవతి
కృష్ణుని - అష్టమ భార్య-స్వయముగ
లక్షణముగ - తన - వివాహగాథ
వినిపించినది - పులకరింతతో

"కృష్ణుని లీలలు - రూపులేఖలు
నామదిలో - మరి - నిలచియున్నవి
నామది - స్వామికి-అంకిత మిడితిని
నాతండ్రి - యది - గ్రహించినాడు.

పెండ్లి వయస్సు - వచ్చిన నన్ను
పెండ్లి యాడుటకు - ఎందరొవచ్చిరి
వారి పోరును - తప్పించుకొన
మత్స్య యంత్ర మేర్పరచెను-తండ్రి.

ఆకాశములో - మత్స్య యంత్రమును
నీటిలొ చూచి - ఛేదించవలె
ఆపరీక్షలో - గెలిచిన వారికి
పిల్లనిత్తునని - వెల్లడిజేసెను.

అమోఘ-ధనుస్సు-అమ్మును-ఇచ్చి
పరీక్ష జెప్పగ - వచ్చిన వారు
ప్రయత్నించిరి - విఫలులాయిరి
నవ్వుల పాలై - కొందరు వెడలిరి.

భీమార్జునులు - కర్ణుడు కూడా
పరీక్షలో - మరి - ఓడిపోయిరి
రాజులందరూ - సిగ్గుతొ - నిండిరి
తలలు వంచి-కూర్చున్న సమయమున.

ఏనుగు గుంపును - చీల్చుకు - వచ్చిన
కేసరి మాదిరి - శ్రీకృష్ణుడట
అవలీలగను - శరమును వదలి
రెప్పపాటులో - విజయము నందెను.

మత్స్య యంత్రమును - కృష్ణుడు కొట్టగ
దేవదుందుభులు - మ్రోగె నింగిని
పుష్పవృష్టి - కురిపించిరి - సురలు
రాజులందరు - విస్తుబోయిరి.

వెంటనె - నేను సుమహారమును
కృష్ణుని మెడలో - అలంకరించితి
వెంటనె కృష్ణుడు-రథమున నిడుకొని
బయలు దేరెను - మెరపుతీరుగా.

రాజులందరికి - తలవంపులయి
గొల్లవాడని - ఈసడించుచు
పోరగ - వారు - బయలు దేరిరి
కృష్ణుని శరముల - రుచిని జూచిరి.

భయపడు - నన్ను - బుజ్జగించెను
అతిలాఘవముగ - పోరు జరిపెను
నేలకొరిగిరి - కొందరు రాజులు
పారిపోయిరి - మిగిలినవారు.

ప్రచండయుద్ధము - చేసెను స్వామి
ప్రసన్నమ్ముగా - నున్నది ముఖము
అలసట లేదు - చెమటలు లేవు
అమోఘమైనది - శరనైపుణ్యము.

మబ్బులొ దాగిన - మెరపుతీగలా
స్వామి గుండెలకు - జేరితి - నేను
నాదు జనకుడు - బృహత్సేనుడు
అచటకు - వచ్చెను - ఆనందముతో

శక్తికి తగినటు - కాన్కలనిచ్చెను
వెంటవచ్చిన - బ్రాహ్మణోత్తములు
వేదమంత్రముల - ఆశీస్సుల నిడ
సంతోషమట - తాండవించెను.

అచ్చటినుండి ద్వారకజేరి
సుఖముగ నుంటిమి - గౌరిచలవతో
అనిచెప్పగను - అచ్చటివారు
విని - ముదమంది - దీవనలిడిరి.

॥శ్రీ కృష్ణచరితము॥



## 26 నారదాది ఋషులు శ్రీకృష్ణుని దర్శించి వసుదేవునిచే యజ్ఞము చేయించుట

బలరామకృష్ణులను - దర్శించుటకు
నారదాది - మహర్షులు - భక్తిగ
స్యమంత పంచక - క్షేత్రమ్మునకు
వచ్చిరి - వారికి - స్వాగతమిచ్చి.

అతిథి పూజలు - చేసి - కృష్ణుడు
పలికెను - ఎంతో - వినయము నిండి
"మహర్షులు - మీదర్శనమ్మది
సురలకైనను - తేలికగాదు.

మహాయోగులు - దర్శనమిడుట
మహాపుణ్యమని - పొంగిపోయెను
పుణ్యతీర్థముల - పోలినయట్టి
పుణ్యమూర్తులని - ప్రస్తుతించెను.

పుణ్య జలములను - దేవమూర్తులను
సేవించినచో - ఫలితము కలుగును
కానీ - మీదగు - పుణ్యమూర్తుల
దర్శనమ్ముతో - ధన్యత కలుగును.

ముహూర్త కాలము-మిము సేవించిన
మహోన్నతత్త్వము - కలుగ జేతురు
పవిత్రత యది - కలిగించెదరు
మహాపురుషుల - మహిమలంతటివి.

రాలి పోయెడి - తనువు - నిత్యమని
కాంతా పుత్రుల - మోహము నిండి
తాను - మునిగినది - తీర్థమనుకొని
మూర్ఖత్వముతో-నుందురు జనులు"

కృష్ణుని మాటల - పరవశించిరి
తిరిగి - తేరుకొని - పలికిరి వారు
నీదగు - మాయకు-లొంగితిమయ్యా!
బ్రహ్మారుద్రులే - లొంగి పోయిరి.

నీ సంకల్పము - నీకే తెలియును
నీలీలలవి - విచిత్రమైనవి
నీవు మమ్ములను - అనుగ్రహించుట
నిజముగ - మాదగు-పుణ్యమేసుమా!

భూమి అంతయు - ఒకటే అయినను
అనేక రూపుల - కన్పించునటు
ఒక్కడవైనా - నీవు - లీలగా
అనేకములుగా - అవతరింతువు.

సృష్టి స్థితి లయ - కారకుడవయా!
దుష్టశిక్షణ - శిష్టరక్షణకు
అవతారములను - ఎత్తుచుందువు
జగన్నాటకము - నాడించెదవు.

తపస్స్వాధ్యాయ నియమము - నీవే
వేదమునందు - కనుపించెదవు
ఆ వేదములకు - అందనివాడవు
మాజన్మమది - ఫలియించినది.

అని - ఆ ఋషులు - కీర్తన జేసిరి
అచటకు - వచ్చిన - వసుదేవుండు
కర్మనాశనము - ఎటుల జరుగునో
శలవీయమని - ఋషులనడిగెను.

ముసిముసినవ్వుల - పలికిరి-మునులు
యజ్ఞమూర్తియగు - శ్రీహరిపరముగ
యాగము చేసిన - కర్మలన్నియు
నశించి పోవును - అనుచు చెప్పిరి.

యజ్ఞముతో - మరి - దేవ ఋణమును
వేదము చదివి - ఋషిఋణమ్మును
సంతతినంది - పితృఋణమును
తీర్చగ - శాస్త్రము నుడువుచున్నది.

అవతార పురుషులను-పొందిన నీవు
పితృఋణమ్మును - తీర్చుకొంటివి
దేవఋణమ్ము - తీర్చుటకొరకు
యజ్ఞము చేయుము-అనుచు-చెప్పిరి.

సమ్మతించిన - వసుదేవునికి
యజ్ఞదీక్షను - యిచ్చిరి ఋషులు
భార్యలందరితొ వసుదేవుండు
దీక్షను గొనెను శ్రద్ధాభక్తుల

మహర్షులు - మరి - నిర్వహించగ
నిర్విఘ్నముగ - యాగము జరిగెను
దానధర్మములు - దండిగ చేసి
అవభృధస్నానము - చేసెనాతడు.

నూత్న వస్త్రములు-ధరించి ముదముగ
వచ్చిన వారికి - కాన్కల నిచ్చి
దీవనలందెను - వసుదేవుండు
దేవదేవుని - వందన మందెను.

కృష్ణదేవుని - అనుమతినంది
నిజవాసములకు - సాగిరి - ఋషులు
వసుదేవాదులు - కోరినంతట
నందయశోదలు - వారితొ నుండిరి.

కొంతకాలమట - గోపికలుండిరి
నందయశోదలు - ఆగిరచ్చట
మూడుమాసములు వారందరును
కృష్ణుని సన్నిధినుండిరి సుఖముగ.

అటుపిమ్మటను - బయలుదేరుటకు
అనుమతి కోరగ - వసుదేవుండు
కాన్కలనిచ్చి - పంపెను వారిని
వెళ్ళలేక - మరి - వెళ్ళిరివారు.

వర్షాకాలము - వచ్చెనంతలో
ద్వారక - తిరిగి - చేరిరివారు
ఆనందవర్ధనుడు - నందనందనుడు
సుఖముగ నుండెను - హితులందరితో.

॥శ్రీ కృష్ణచరితము॥



## 27 రామకృష్ణులు - మృతులైన తమ సోదరులను తెచ్చి - తల్లికి చూపుట

గురుపుత్రుని - బ్రతికించి-యిచ్చిరని
బలరామ కృష్ణులు-ఘనతను-వినిన
దేవకిదేవికి- పుత్రప్రేమయది
పొంగిపొరలినది - బాష్పధారలుగ.

కంసుని చేతిలొ - అంతము అయిన
తన - పసికందుల - చూడగ మనసై
రామకృష్ణులను - దగ్గరపిలచి
వలవల ఏడ్చుచు - వాపోయినది.

మాతృమూర్తిని - ఊరడించిరి
విషయము చెప్పగ - ప్రార్థన జేసిరి
అంతట పలికెను - తెప్పరిల్లెను
"తనయులార - మీరసమాన్యులయా!

భూభారమును - తీర్చగ దిగిన
మహితమూర్తులు - జగద్వంద్యులు
తనయులుగా-మిము పొందుటన్నది
పూర్వపుణ్యఫల - విశేష మగును.

మిమ్ములగన్న - కన్న తల్లిగా
ఎంతో ఆనందముతో నుంటిని
కానీ - మదిలో - ఒక్క విచారము
నను బాధించుచు-నున్నది-వినుడు.

విగతజీవుని - మీగురు పుత్రుని
యమలోకమునకు-వెళ్ళి-తెచ్చి-మరి
గురుదేవులకు - సమర్పించిరని
తెలిసిన - నామది కోరిక వినుడు.

కంసుని చేబడి - అంతము అయిన
తనయుల చూడగ - కోరుచుంటిని"
అనగా తల్లికి - మాటయిచ్చిరి
బలరామకృష్ణులు - బయలు దేరిరి.

నేరుగ - వారు - బలి పాలించెడి
సుతల - లోకమున అడుగు బెట్టిరి
వారినిగాంచి - బలి భూవిభుడు
ఆనందముతో - పొంగిపోయెను.

స్వాగత మిచ్చి - నమస్కరించి
బంగరు - ఆసనమందున - వారిని
కూర్చొనబెట్టి - పూజలు చేసి
కీర్తనజేసెను - పాదములొత్తుచు.

"ఓపరమాత్మా - అక్షరమూర్తీ!
జగన్నియంతా - జగదాధారా!
భక్తసులభుడా - భువనమోహనా!
సుర ముని వందిత - జోహారులివే!

నందనందనా! గోవిందా - నువు
లీలానాటక - సూత్రధారివి
యోగీశ్వరులే - మాయలొ పడెదరు
తామసులము - మరి - వేరుగ-చెప్పన.

శిశుపాలాదులు - వైరముతోను
ప్రేమనిండి - ఆ - గోపికలున్ను
అనన్యభక్తితొ - ఆశ్రితులున్ను
నిన్ను - సులభముగ - పొందగలిగిరి.

సాత్త్విక - వివేక - వంతులైనను
సురలు-నిన్ను-మరి-పొందుట కష్టము
శాస్త్రజ్ఞానము - వేదవిద్యయు
నిన్ను చేరుటకు - త్రోవ చూపవు.

నామ సంకీర్తన - నినుజేరుటకు
తేలికయైన - రాచబాటయది
శ్రద్ధాభక్తుల - నినుసేవించిన
ముక్తి నొసగెదవు - మంగళమూర్తీ!

ఇన్ని దినములకు - నిన్ను గంటిని
విరించికే - నువు అగోచరుడవు
అట్టినీవు - నాదరికి - వచ్చితివి
ధన్యుడనైతిని - అనుగ్రహించుము"

అనుచు భక్తిగా - స్తోత్రము జేసిన
బలిని గాంచి-అట-పలికెను కృష్ణుడు
"నీదు భక్తికి - సంతసించితిమి
మేము వచ్చిన - కార్యము-వినుము.

కృతయుగమందు - మరీచి - తాను
వర్ష - అనెడి - తన భార్యయందున
ఆర్గురు కొడుకుల-నందెను-వినుము
వారిగాథను - తెలుపు చుంటిని.

ఒక దినమున - మరి-బ్రహ్మదేవుడు
కూతురునే మోహించి - ఆమెతో
వినోదించుట - చూచినయట్టి
మరీచి కొడుకులు - ఆర్గురు నవ్విరి.

పరిహసించగా - క్రోధమునిండి
రాక్షసులుగ - మరి - పుట్టమనుచును
ఘోరశాపము - వారికిచ్చెను
కట్టలు త్రెంచుకు ఏడ్చిరివారు.

బ్రహ్మశాపము - తిరుగులేనిది
హిరణ్యకశిపుని - తనయులుగాను
వారు పుట్టగా - దేవ మాయ - తా
సురలకు మేలు చేయగనెంచి

ఒక్కొక్క బిడ్డను - తీసుకుపోయి
దేవకి దేవి - కడుపున - నుంచెను
వారిని చంపెను - కంసుడు - నాడు
వినుమో - రాజా - వివరముగాను

అటులా - ఆర్గురు - దేవకిదేవికి
పుట్టిరి - గాని దక్కలేదు - మరి
వారిని చూడగ - తల్లి కోరిక
నీకడనుండిరి - వారారుగురు.

మాటయిచ్చితిమి - తల్లి కోరినది
కావున - వచ్చితి - నీ నెలవునకు
పంపుము వారిని - శాపము తీరును
కడుపుశోకము - తల్లికి తీరును.

మరుమాటాడక - భక్తి ప్రపత్తుల
వారిని పంపెను - బలిభూవిభుడు
రామకృష్ణులు - అన్నలందరిని
తల్లికి - ముదముగ అప్పగించిరి.

ఆనందముతో - తనయులగాంచి
అక్కున జేర్చుకు - ముద్దు చేసినది
శిరసు మూర్కొని పరవశించినది
పుత్రప్రేమ - పెల్లుబికి పోయినది.

విష్ణుమాయకు - లొంగినవారు
పసిపాపల్లా - ఒదిగిపోయిరి
కృష్ణుడు - తమకు - తమ్ముడనగనే
కౌగలించుకొని - పరవశించిరి.

కృష్ణుని కౌగిలి - శాపము తీర్చెను
దివ్యరూపములు - ధరించినారు
తమ్ముళ్ళకును తల్లికి - చెప్పి
నింగి మార్గమున - సాగి పోయిరి.

మృతినొందిన - తన-తనయులజూపిన
కృష్ణుడు అగును - దేవదేవుడు
అనుచు తల్లి - తా - రామకృష్ణులను
కౌగలించుకొనె - ఆనందబాష్పముల

రాజా! కృష్ణుని - దివ్య లీలలు
అద్భుతమ్ములు - చెప్పుట కగునా!
సమయము చాలదు - అనగా రాజు
ఆనందించి - అడిగెను మునిని.

❊❊❊ ॥శ్రీ కృష్ణచరితము॥

## 28 సుభద్రా పరిణయము

స్వామీ! కిరీటి - నాకు తాతగద
కృష్ణుని చెల్లెలు - సుభద్రమ్మను
వివాహమాడెను - ఆవృత్తాంతము
తెలియ పరచుడని - రాజు అడిగెను.

కిరీటి యనుచు - పోల్చక పోయిరి
యతియే అనుచు - పూర్తిగనమ్మిరి
బలరాముడు - తా - స్వాగతమిడెను
చక్కని వసతి - ఏర్పరచిరట.

అది యొక - విచిత్ర వృత్తాంతంబని
ఆరంభించెను - శుకయోగీంద్రుడు
తీర్థయాత్రలు - పూర్తిచేసుకొని
పార్థుడు జేరెను - ప్రభాస తీర్థము.

సంయమీంద్రులన - గౌరవమున్న
బలరాముడు - తా - నెదురు చెప్పక
యథేచ్ఛగా - మరి - ఉండగ చెప్పెను
మౌని అచ్చట విడిది చేసెను.

సుభద్ర పెండ్లి దుర్యోధనునితొ
బలభద్రుడు - మరి-నిశ్చయించినటు
ప్రభాసతీర్థమునందు - పార్థునకు
తెలిసెను - ఎంతో వంతనొందెను.

పార్థుని సంగతి - తెలిసి కృష్ణుడు
పలుకరించి - మరి - వెళ్ళుచుండెను
మౌని సేవలకు - తన - సోదరిని
బలభద్రుండు - నియోగించెను.

అంతతేలికగ - ఆ - వివాహము
జరుగునాయని - శంకయు గలదు
ముని వేషముతో-యాత్రలు ముగించి
ద్వారక జేరెను - కుంతీ సుతుడు.

కొన్ని దినములకు - యాదవులందరు
జాతర - ఒకటి నిర్వహించిరి
బలరామాదులు - బయలుదేరిరి
సుభద్ర - తాను - వెళ్ళదలచుకొని.

మౌని వద్దను - సెలవు గైకొన
వచ్చిన - ఆమెతొ - సరియని పలికి
తానుకూడ - మరి - వచ్చెదననెను
ఇద్దరు వచ్చిరి - ఊరిబయటకు.

కృష్ణ నిర్ణయము - ముందే జరిగెను
ఆయుధములతో రథము - ఒక్కటి
ఊరిబయట-మరి-నిలబడియున్నది
దానిని గాంచెను పాండునందనుడు.

తానే - పార్థుడనని - చెప్పుకొని
రథమున - సుభద్రనెక్కించుకొని
రెప్పపాటులో - బయలు దేరెను
అదిగ్రహించిరి - యాదవులందరు.

ఒక్కుమ్మడిగా - అందరు చేరి
ముట్టడించిరి - పార్థుని రథమును
గాండీవ మట - కృష్ణదేవుడు
ఉంచెను రథమున-గాంచెనర్జునుడు.

బెదరక - కిరీటి - శరములు-వదలెను
సుభద్ర నిలచెను - రథమునడిపెను
యాదవులందర - కలవరపరచి
సాగిపోయెను - కిరీటి - శుభముగ.

వార్తను - వినిన బలభద్రుండు
అబల హర్త యని - బుద్ధి చెప్పగా
హలాయుధమ్మును చేతధరించి
బయలు దేరుటకు - సిద్ధపడగను.

కృష్ణుడు - అన్నను - శాంతపరచెను
తగిన వరుడని - నచ్చజెప్పెను
బావ కాపద - చెల్లెలికేనవె
ఆమాటలను విన్న - అన్న మరి.

మనసు చల్లబడి - ఆప్యాయముగా
కానుకలెన్నో - దండిగ నిచ్చెను
ఆవిధముగ - సన్యాసి - తెలివిగా
గృహస్థు అయ్యెను - వింటివ రాజా.

అటుల జరిగినది - కల్యాణమ్ము
కల్యాణ కారకము - ఈగాథయని
శుకమునీంద్రుడు - రాజుకు చెప్పి
ఆపై గాథ చెప్పదొడంగెను.

❋❋❋ ॥శ్రీ కృష్ణచరితము॥

## 29 శ్రీ కృష్ణుడు ఋషిసమేతుడై మిథిలకు వెళ్ళుట

భూదేవికి - తా - తిలకమన్నటు
మిథిలానగరము - వెలుగుచున్నది
విదేహరాజుల - ముఖ్యపట్టణము
మంగళ ప్రదము-శోభకు-నిలయము.

బహుళాశ్వ జనకుడు - పరిపాలకుడు
మోక్ష లక్ష్మిని - ఆరాధించును
కర్మ యోగి - ఆ - మహానుభావుడు
వేదశాస్త్రముల - నిధి - ఆ రాజు.

యథారాజా - తథా ప్రజాయని
ప్రజలందరును - ధర్మతత్పరులు
శృతదేవుడను - విప్రోత్తముడు
శ్రీహరి భక్తుడు-నిర్మల హృదయుడు.

రాగద్వేషముల లొంగనివాడు
సత్ప్రవర్తనకు - పేరుగాంచెను
వేదశాస్త్రములు - నేర్చిన - జ్ఞాని
ఉన్న దానితో - తృప్తినందును.

జనక రాజును - శృతదేవుని - అట
చూడగతలచి - వాసుదేవుడు
బయలు దేరెను - ఆసమయములో
మహామునులు-మరి-వచ్చిరచ్చుటకు.

వామ దేవాది మహామునులకు
స్వాగతమిచ్చి - వందనముంచి
వారందరితో - మిథిలా నగరము
బయలు దేరెను - నందనందనుడు.

త్రోవలో - రాజుల - కాన్కలందుచు
ఆప్యాయముగా - పలుకరించుచు
మిథిలా నగరము - సమీపించెను
వార్త అందినది - బహుళాశ్వునికి

పొంగిన గుండెతొ - రాజవరేణ్యుడు
కాన్కలందుకొని - శృతదేవునితో
ఎదురుగవచ్చెను - కృష్ణదేవుని
దర్శించుకొని - పరవశించెను.

మునులందరకు - వందనముంచి
తెచ్చిన కాన్కలు - కృష్ణునికిడెను
పద్మనేత్రుని - పాదపద్మముల
సాష్టాంగముగా - ప్రణామమిడెను.

తనభాగ్యమని - పొంగిపోవుచు
విప్రోత్తముడు - వందనమిడెను
తమతమగృహముల - అడుగిడమనుచు
అర్థించిరి - వారిద్దరు - కృష్ణుని.

సరియని పలికి - వాసుదేవుడు
మునులతొ - జనకుని - నెలవుకేగెను
బంగరు - సింహాసనములు - చూపి
సుఖాసీనులను చేసె - జనకుడు.

బంగరు కలశము-నందలి - జలముతొ
పాదపద్మములు - అభిషేకించెను
పవిత్రతీర్థము - భార్యయు - తాను
బంధువులందరు - శిరసున దాల్చిరి.

విధి విధానముగ పూజలొనర్చి -
మణిభూషణములు - నూత్నవస్త్రములు
కాన్కగయిచ్చి - విందులొనర్చి
తాంబూలమును - భక్తిగ నిడెను.

అంతట జనకుడు - కృష్ణదేవుని
పాదపద్మములు - తొడపై నిడుకొని
మెల్లగ ఒత్తుచు - పలికె భక్తిగా
"స్వామీ! నీవు - సర్వేశ్వరుడవు.

సకలజీవుల – కర్మలన్నిటికి
సాక్షిగ – నుందువు – ఓలోకేశా!
ఈ – రహస్యము – తెలియగ లేరు
నీ పదసేవ – పాపహరణము.

నిన్ను స్మరించుచు – సత్ప్రవర్తనతొ
గడిపెడి వానికి – బ్రహ్మేంద్రాదులు
సాటిరారయా – కారుణ్యాలయ
నాభాగ్యమది – నీవు – వచ్చుట.

భువనపోషకా – త్రిభువన సుందర
దేవకినందన – వేణుమాధవా!
భక్తసులభుడా – పరబ్రహ్మమా!
నీవు వచ్చుటది – అపురూపమయా!

మునులతొ – నీవు – నాగృహమందు
విడిది చేయుము – కొన్ని రోజులు
మీ పదధూళితొ – నాగృహమ్మిది
పావనమగును – పురాణ పురుషా"!

అటుల – కోరెను – జనక భూపతి
శృతదేవుడును – రమ్మని వేడగ
కొన్ని రోజులా గృహముల – నుండి
భక్తులందరికి – దర్శనమిడెను.

భూసురోత్తముడు – వారందరికీ
దర్భాసనములు – అమర్చి భక్తిగ
సతితో కలసి – పాదపద్మములు
అభిషేకించి – పూజలు చేసెను.

కృష్ణదేవుని – పాదతీర్థము
నలుమూలలతో – యింటిలొ జల్లెను
భక్తి కలిమి గల – బీదబ్రాహ్మణుని
చూడవచ్చెనని – పులకరించెను.

అనుగ్రహించగ – శ్రీహరివచ్చుట
పూర్వజన్మకృత – సుకృతమనుకొని
తనలో తానే – మురిసి పోయెను
మంగళమూర్తికి – విందొనర్చెను.

విశ్వనాథుడు – లోకరక్షకుడు
ఆరగించెను – ఆనందముతో
చిందులు వేయుచు – నాట్యమాడెను
జన్మతరించెను – అనుచు – పొంగెను.

కృష్ణదేవుని పాదపద్మములు
తొడపై నిడుకొని – మెల్లగ వత్తుచు
పరవశమ్ముతో – పలికె నిట్టుల
"దయాసముద్రా – ధన్యుడనైతిని.

బ్రహ్మేంద్రాదుల – కందని వాడవు
నిను దర్శించితి – నాగృహమందు
మహా యోగులను – మించినయట్టి
ధన్యత నాకు ప్రసాదించితివి.

సందేహముతో – నుంటిని స్వామీ!
కానీ – నీవు – మరుమాటాడక
గృహము – పావనము చేసితివయ్యా!
ఆరగించితివి – అనుగ్రహమ్మది.

నీ పూజలతో - నామస్మరణతో
నీపద - సేవాభాగ్యమ్ముతొ - మరి
నిన్ను - పొందగ - వశమగునయ్యా
వారిమనస్సుల - విహరించెదవు.

నేలనువిడచి - సాము చేసినటు
కర్మలు - ఘనముగ - ఆచరించుచు
బ్రతుకులీడ్చెడి - అమాయకులకు
మదిలో నున్నను - అందవు నీవు.

వేదాంత వేద్యా! అక్షరమూర్తీ!
నీదాసుడను - ఆదేశించుము
నేను చేయదగు - పనులు చెప్పుము
ఆనందముతో - ఆచరింతునన"

ప్రేమగ నవ్వుచు - నందనందనుడు
ఆతని - కరము - చేత గ్రహించి
మెల్లగ - నిమురుచు పలికె చల్లగా
"శృతదేవా! నే మెచ్చితినయ్యా.

నీ ప్రవర్తన - శుద్ధమైనది
నీసౌశీల్యము - మెచ్చదగినది
మహామునులు - నీయింటికి వచ్చుట
నీపుణ్యమది - ఎన్నగ లేనిది.

స్పర్శ వల్లను - పుణ్యభూములు
దర్శనమ్మున - బ్రాహ్మణోత్తములు
పూజాదికముల - దేవతలందరు
సర్వపాపముల - హరించి వేతురు.

నన్ను తెలిసిన - బ్రాహ్మణోత్తముడు
అందరిలోన - శ్రేష్ఠుడు - వినుము
కావున - బ్రాహ్మణ పూజ ముఖ్యము
కర్తవ్యమ్మది - అని తెలియుమయా!

ఈ మహనీయులు - వచ్చిరిచ్చటకు
ఈమునులను-నీవు - అర్చించుమయా!
ఆపని - నాకు - తృప్తి నిచ్చును
జ్ఞానుల పూజ - నాకు హితమయా"?

అటుల - కృష్ణుడు - చెప్పగనంత
శృతదేవుడు తా యథావిధిగను
వందనార్చనల - మునులందరినీ
పూజించి - మరి - కృతార్థుడయ్యెను.

కొంతకాలమట - కృష్ణదేవుడు
జనక భూపతిని - విప్రోత్తముని
సంతస పరిచి - మునులందరితో
కుశస్థలికి - తా - జేరెను రాజా!

॥శ్రీ కృష్ణచరితము॥



## 30 శృతి గీతలు

త్రిగుణమ్ములకందక - దృష్టికందక
బ్రహ్మపదార్థము నందు - నెలకొని
సత్వాది-గుణములతొ-పొత్తుగలిగిన
వేదములెట్లు - ప్రకాశించును.

అనుచు రాజు - తా - నడిగిన ప్రశ్నకు
బ్రహ్మవిద్యను - తెలియబరచెడి
అధ్యాత్మబోధను - శుకయోగీంద్రుడు
పరీక్షిత్తునకు - వివరించెనట.

ప్రాణులు-రెండు విధములు-వినుము
స్థావరమ్ములు - జంగమమ్ములు
సర్వేశ్వరుడీ రెంటియందున
నెలకొని యుండును-విను మహారాజా!

జంగమమ్ములన - కదలెడివవ్వి
వాటికి జ్ఞానము - కలిగించెనయా!
బ్రహ్మస్వరూపము-గుణ-మహిమలను
తెలియబరచెడివి - వేదములయ్యా.

బ్రహ్మస్వరూపము - వేదమ్ములకు
ఆవిధముగ సంబంధమున్నది
శృతులు చెప్పును - బ్రహ్మ పదార్థము
జ్ఞానవంతునికి - తెలియును వినుము.

శృతులు - స్తుతించిన-బ్రహ్మపదార్థపు
సారాంశమయా - శృతిగీతలివి
ఉపనిషత్తులతొ - సమానమైనవి
ఋషిపరంపరగ - వచ్చుచున్నవి.

శృతిగీతలను అభ్యసించి - మరి
ఆకళించుకొను - వారందరికీ
మోక్షము - తప్పక - సిద్ధించునయా!
అందుకు - నీ కొక గాథ వినిచెదను.

లోక హితముకై - నారాయణ ఋషి
తపస్సు చేయుచు-నున్న సమయమున
నారద మహర్షి - వచ్చి మ్రొక్కెను
తన సందేహము - అడిగె నచ్చట

నారాయణుడు - చెప్పెను యిటుల
బ్రహ్మదేవుని - మానసపుత్రులు
సనకసనందన - ఋషిపుంగవులు
శ్వేతద్వీపమున - యజ్ఞము చేసిరి.

విద్య, శీలము, తపస్సు మరియు
ఆత్మ జ్ఞానమున - వారందరును
ఒకరికి ఒకరు - తీసి పోరయా!
వారిలొ జరిగెను - చర్చవొక్కటి.

ఆచర్చలొ - మరి - సనందుడపుడు
చెప్పిన విషయము - చెప్పెదననుచు
నారాయణుడు - నారదమునికి
తెలియజెప్పెను - విను మహారాజా!

భూపతి - నిద్రలొ - నున్న వేళలో
స్తోత్ర పాఠకులు - కీర్తించినటు
లయకాలములో - ఆపరమాత్మను
వేదములవ్వి - స్తుతించెనయ్యా.

ప్రళయకాలమున - సర్వశక్తులు
తనలో - యిమిడి - యోగనిద్రలో
పరమేశ్వరుడు ఉన్న వేళలో
చేయుస్తుతులవి - శృతి గీతలయా!

ఓ జగదీశా! చైతన్యమూర్తివి
స్థావర జంగమ - జీవులన్నిటికి
తెలివి నొసంగే - తేజోరాసివి
పరిపాలించే - నాథుడ వీవు.

పదార్థమందలి – దోషమ్మును మరి
గుణముగ జేసి – ఆ జీవికి – నువు
ఇచ్ఛా, క్రియా, జ్ఞాన శక్తులను
త్రిగుణమ్ములను – అనుగ్రహింతువు.

చేసెడిదీ – మరి – చేయించెడిదీ
నీవే స్వామీ! పరిపూర్ణుడవు
మాయ – నటించు – నీ శాసనమున
ఆత్మగ – నీవు – ప్రకాశింతువు.

సృష్టి లయమగు – సమయమందున
యోగనిద్రలో – మునిగి యుందువు
నీ ఉచ్ఛ్వాసము – సృష్టి చేయును
ఆ – నిమిత్తమై బ్రహ్మ పుట్టును.

నీవాడించే – లీలా నటనలో
త్రిగుణాలతో – మా సంబంధమును
త్రెంచి – వేయము – జగదాధారా!
బ్రహ్మము – చూచే – శక్తినీయుము.

ఆత్మజ్ఞానమున – యోగులు మాత్రమె
జగత్తులో – మరి – ప్రత్యంశమున
బ్రహ్మము – చూడగ – శక్తిమంతులు
అట్టి శక్తి – సమకూర్చుము దేవా!

మట్టికుండలో – మట్టిమాదిరి
లయకారకము – నీలో నున్నది
కర్మవిభజనకు – ప్రాణుల–సృజించి
వాటిలో – నీవు–నెలకొనియుందువు.

బుద్ధి, వాక్కు, కర్మల యందు
నిన్నే నమ్మి – నిన్ను తలంచుచు
నీగుణగానము – వదలక చేయగ
తాపత్రయముల – నధిగమింతురు.

అనిశము – నిన్నే – స్మరించువారికి
జరామరణములు – స్మరణకు రావు
ఆనందబ్రహ్మమున–మునిగి యుందురు
శాశ్వతసుఖమును – కలిగించునదే.

సత్–చిత్– అనెడి రూపములుండి
నిత్య – మనిత్యము – అన్ని రూపములు
కలిగి యుండి – నువు–పంచకోశముల
శరీరమ్ములను – ఆశ్రయింతువు.

ప్రాణమయ, అన్నమయ – యును
బుద్ధిమయ – మరి విజ్ఞానమయ
ఆనందమయమను – కోశములందు
ఆనందమయ కోశము నుందువు.

ఆనంద మయుడవు–అందుకె–స్వామీ
స్వయం ప్రకాశము – కలిగిన వాడవు
నీ కనుసన్నలో – బ్రహ్మాండములవి
ఏర్పడుచున్నవి – నడచుచున్నవి.

ప్రకృతి – మహత్తు – అహంకారము
పంచభూతముల – తత్త్వమ్ములతో
బ్రహ్మాండములు – సంకల్పముతో
ఏర్పడుచున్నవి – జగన్నివాసా!

బుద్ధిమంతులు - జ్ఞానము కలిగి
ఇహపర-సౌఖ్యములన్నియు-స్వామీ!
నీపదసేవే - ఆధారముగా
అనుభవించుచు - నుందురుగాదా!

నిన్ను తెలియక - తోలుతిత్తిని
పోషించుటయే - పరమార్థమని
తలంచుకొనుచు - చెడిపోయెదరు
అంతర్దృష్టి - వుండదు వారికి.

ఉదరము నందలి - అగ్నిగ-నిన్ను
ఉపాసింతురు - తెలిసినవారు
అరుణులు - అనెడి-తాపసోత్తములు
హృదయము నందలి-తేజమందురు.

హృదయస్థానమున - సూక్ష్మరూపుతో
వెలిగెడి - తేజో మూర్తిగ - నిన్ను
సుషుమ్న నాడితొ - ఉపాసించెడి
ఋషిపుంగవులు - అరుణులువారు.

తేజోమూర్తిని - హృదయమునుండి
బ్రహ్మరంధ్రముకు - సాగగనిచ్చి
సహస్రారమను - చక్రమునందు
జ్యోతిర్మూర్తిగ - నుపాసింతురు.

అట్టివారు - మరి - జన్మనెత్తరు
నీలో - లీనము అగుదురు - స్వామీ!
కట్టెలలోన - అగ్ని తీరుగా
అన్ని దేహముల - నుందువు నీవు.

అన్ని దేహముల - నున్నను - నీకు
అదోషములు - ఏవియు అంటవు
ఒకే ఆత్మయు - ఒకే బ్రహ్మగ
తేజోమూర్తివి - నెలకొనియుందువు.

అట్టి - నిన్ను - మరి - తెలియగ నేర్చి
ఫలాపేక్షను - వదలి - భక్తిగా
సేవించినచో - సాయుజ్యమది
అవలీలగను - అందుకొందురు.

శరీరమ్ములలో - జీవరూపము
నీవని నమ్మి - నీపదసేవతొ
భవబంధములను - వదిలించుకొని
విముక్తులైనచొ - ధన్యులగుదురు.

పొందుట - శక్యముగానిది - అయిన
ఆత్మతత్త్వము - తెలిసికొనుటకు
రామకృష్ణుల - అవతారములను
సేవించి - గాథలతొ తరించుచుందురు.

కొందరు - నీపద - ధ్యానము నందు
నిమగ్నమై మరి - మందాకినిలో
రాయంచలవలె - ఆనందింతురు
ఏకాగ్రతయది - కావలసినది.

కొందరు - నిన్ను - విస్మరింతురు
నామస్మరణమే - చేయగలేరు
వారుమాత్రమే - పుట్టి - గిట్టుటను
వలయ మందున - తిరుగు చుందురు.

యోగసాధనలో - పండిన మునుల
పగతో నిండిన - శిశుపాలాదుల
ప్రేమమూర్తులగు గోప సుందరుల
మమ్మును-సమముగ-జూచెదవయ్యా!

నీదయ - పొందగ-అందరునూ-మరి
సమానులయ్యా - సుందరమూర్తీ!
ఓసర్వేశా! నీరూపము గన
సాధ్యముగాదు - అపురూపమది.

శాస్త్రమ్ములలో - మాత్రమె - నీదు
రూపము గనగ - సాధ్యపడునయా!
సద్రూపముతో - బ్రహ్మాదులు మరి
ఉద్భవించిరి - అంతే తెలియును.

అంతకుముందు - నీదగు రూపము
ఇదియని - చెప్పగ - చాలరెవ్వరూ
కొందరు మాత్రము - వారి-వాదనతొ
ఇది యందురు-మరి-నిజము కాదయా.

ఉంటివి - నీవని - కొందరన్నచో
లేవని - నొక్కి కొందరందురు
ఆత్మద్రష్టలు - నిన్ను - తెలిసెదరు
నినుసేవించిన-మృత్యువు గెలుతురు.

దేవా! నీవు - స్వతంత్రుడవు కద
శాసనకర్తవు - నీవే స్వామీ!
బ్రహ్మాదులు - నీ ఆజ్ఞకు బద్ధులు
అందరికీవు - గురుడవు - దైవము.

నీపదములను - ఆశ్రయించనిచో
నావికుడుండని - పడవలొ - కూర్చొని
ప్రయాణించిన - చందమగునయా!
ఒడ్డు చేరుట - జరగదు స్వామీ!

కోరిక లేక - దొరికిన - తృణముతొ
తృప్తినందిన - సాధువు రీతిగ -
నీభక్తులగు - యోగీశ్వరులను
సేవించిన - మరి -మోక్షము తథ్యము.

దేహమ్ములను - ఆశ్రయించుకొని
హృదయములో-నువు-వెలుగుచున్నను
కంఠహారమున - మణిని - చూడనటు
చూడగ లేరు - అవివేకులయా!.

బ్రహ్మాండనాయకా! జగద్రక్షకా
ఆగమనుత - ఓ - అవ్యయమూర్తీ
అనుగ్రహించుము - అనుచు శృతులకు
అధిదేవతలు - వేడిరి హరిని.

అనుచు-సనందను-డచటి ఋషులకు
చెప్పెను - అనుచు - నారాయణుడు
నారదమునికి - చెప్పెను రాజా!
దేవర్షి మరి - చెప్పె వ్యాసునకు.

నాదుజనకుడు - వ్యాసమహర్షి
శ్రుతిగీతలు - నాకెఱుక పరచెను
దానిని - నీకు - తెలిపితి రాజా
మహత్తరమ్మిది - మంగళమూర్తీ!.

వేదశాస్త్రముల - పురాణమ్ముల
ఇతిహాసముల - సారము ఇదియే
ఉపనిషత్తులతొ - సమానమయ్యా!
వాటికి - దీనికి - భేదము లేదు.

ఈ శ్రుతి గీతలు వినిన చదివిన
సర్వపాపములు - హరించిపోయి
ఇహపరసుఖములు - సమకూరునని
శుకుడు చెప్పగా - రాజు అడిగెను.

❋❋❋ ॥శ్రీ కృష్ణచరితము॥

## 31 శ్రీశుకుడు పరీక్షిత్తునకు విష్ణుసేవాప్రాశస్త్యము చెప్పుట

శుకయోగీంద్రా! దేవతలైనా-మానవులైనా
శివుని భక్తుల - కోర్కెలు తీరును
విష్ణుభక్తులు - పేదరికమ్ముతొ
బాధలు పడుటకు - కారణమేమి.

కృష్ణునడిగెను - నీవడిగినటు
అంతట కృష్ణుడు-స్వయముగ-తాను
ధర్మరాజుకు - నవ్వుచు - చెప్పిన
విషయము తెలిపెద-విను-మహరాజా!

అంతట చెప్పెను - శుకమహర్షి
రాజా! వినుము - శంకరదేవుడు
సత్వ - రజ - స్తమముల-నుండును
సంపద - లమరును - శివభక్తులకు.

ధర్మనందనా - నా అనుగ్రహము
అందెననుకొను - భక్తులందరికి
సర్వసంపదలు - దూరము చేయగ
ఇహబంధములు - దూరమగునయా!

గుణత్రయములకు - అతీతుడా-హరి
కావున హరిని - కొలుచు వారికి
రాగసంబంధపు సంపదలబ్బవు
ముక్తికలిమి - మరి-లభించు వారికి.

సంపద పోవగ - బంధువులుండక
ఒంటిగ - నాపై - భక్తి నిలబడి
నాభక్తులకు - స్నేహితుడగును
కైవల్య మందును - నిస్సందియము.

అశ్వమేధము - చేసిన - తదుపరి
ధర్మనందనుడు - నారదమునిచే
సాత్విక సంపద లొలకబోసెడు
కథలను విని - తన - మదిలో కోరిక

నాపరీక్షకు - తాళలేకను
మధ్యలొ - వదలి - రాగసంబంధపు
సంపద కొరకు - ఇతర దేవతల
సేవలు చేసి - సంపదలంది.

అవిస్థిరమనుచు - గర్వము కలిగి
కలిమి నొసగిన - ఆ దేవతలను
కృతఘ్నులై - మరి - మరచిపోదురు
దానికి చెప్పెద - దృష్టాంతమనె.

❋❋❋ ॥శ్రీ కృష్ణచరితము॥

# 32 శివ ద్రోహం తలపెట్టిన వృకాసురుడు విష్ణు మాయచే చచ్చుట

అసుర తనయుడు - వృకుడనువాడు
సాధుహింస - ఆనందము వానికి
అందు కొరకు - ఒక ప్రదేశమ్మున
పొంచియుండెను - సాధుల కొరకు.

అటుగా వచ్చెడి యోగిని గాంచి
ముందుకు వెళ్ళి - చూడగ నతడు
నారదుండని - తెలిసిన - వృకుడు
నమస్కరించెను - అడిగెను మౌనిని.

స్వామీ! నా సందేహము తీర్చుడు
త్రిమూర్తులందు - ఎవరివల్లను
అతిత్వరగా - మరి - కోర్కెలు తీరును
అనగా - పలికెను - నారదమహర్షి.

వెంటనే-వరముల యిచ్చును-శివుడు
అది గ్రహించియే - బాణాసురుడు
దశకంధరుడు - హరుని భక్తులై
జగత్ప్రసిద్ధులు-అయినటు-తెలియద?

కావున నీవు - ఫాలనేత్రుని
అనుగ్రహమ్మును-పొందుము అనుచు
మెల్లగ చెప్పి - ముందుకు సాగెను
వృకుని - మనస్సు - గంతులేసెను.

వెంటనె - వృకుడు - తపస్సు చేయగ
కేదార తీర్థము - చేరి అచ్చట
కఠోర నియమము - నాచరించెను
మేను కోసి - మరి - అగ్నిలొ వ్రేల్చెను.

ఆరు రోజులటు - కండలు కోసి
అగ్నిలొ వ్రేల్చగ - లోకాలన్నీ
ఆశ్చర్యములో - మునిగి పోయెను
అయినా - హరుడు - దర్శనమిడనిచె.

ఏడవనాడు - మరింత పట్టుతొ
సుస్నాతుడయి - గండ్రగొడ్డలితొ
తల - తెగనరకి - వ్రేల్చ - నిలవగా
అగ్ని గుండమున - హరుడు నిలచెను.

ప్రత్యక్షమైన - పార్వతీపతి
వరము కోరమన - ఆ రక్కసుడు
తనకరమది - ఏ- శిరమున పడినను
వేయి ప్రక్కలు - కావలెననెను.

అసాధారణపు - కోర్కెకు నవ్వి
బోళాశంకరు - డిచ్చితి ననెను
వరముతొ - కళ్ళు - నెత్తి కెక్కినవి
ముదిరిపోయెను - వాని - పిచ్చియది.

వర పరీక్షకు - శివుని ఎంచుకొని
శిరమున - కరమిడ-బయలు దేరెను
గ్రహించి - శివుడు - పరుగిడ సాగెను
వెంబడించెను - వృకాసురుండు.

హరుడు -ముందర-అసురుడు వెనుక
మూడు లోకములు-తిరిగి రిద్దరు
చూచినవారు - కలవర పడిరి
ఎటుల ముగియునో-తెలియక పోయిరి.

వైకుంఠమేగెను - పరుగునహరుడు
ఆసమయములో - విష్ణుమూర్తి-తా
లక్ష్మి దేవితొ - ఆసీనుడయె
హరుడు-నిలచె-నా హరి ముంగిటను.

రొప్పుచు నిలచిన - శంకరుగాంచి
విషయము గ్రహించి-ఆదుకొనగను
బ్రహ్మచారి రూపమ్ము ధరించి
ఎదురేగెను - ఆ - వృకాసురునికి.

అసురుని గాంచి-పలికెను-వటుడు
"గొప్పవానిలా - ముఖము కనబడు
అలసి పోయినటు-తనువు కనబడు
చెప్పదగినచో - చెప్పుము అనెను."

బ్రహ్మచారి - అట-విషయమడుగగ
తెప్పరిల్లి - మరి-జరిగిన దంతయు
తేటతెల్లముగ - చెప్పెనసురుడు
అంతట నవ్వి - పలికెను వటువు.

"అసురనాయకా! హరుడు - దొరకడు
పిశాచపతిగా - అతనిని కమ్మని
దక్షుడు - నాడు - శపించె - వింటివ
ఈశ్వరు - రూపము - మారి పోయినది.

నిజము పలుకడా - నాగాభరణుడు
వాని సంగతి - తెలియక పోతివి
సత్యసంధుడే - అయినచొ - హరుడు
నిలబడడా - మరి - నీ పరీక్షకు.

దానిని బట్టి - అతని సంగతి
తెలిసి పోవును - తేట తెల్లముగ -
చెప్పెద వినుము - చక్కని యోచన
ఆచరించుము - సంకోచించక.

శివుని కొరకు - నువు - శివమెత్తినటు
తిరిగితి వయ్యా - అన్ని స్థలములు
అశుచివైతివి - అందువల్లను
శివుడు దొరకడు - అశుచి తొలగవలె.

కావున - నీవు - కనబడు జలముల
కాళ్ళూ చేతులు - శుభ్ర పరచుకొని
సంధ్యవార్చుకొని - ప్రయత్నించుము
శివుడు తప్పక - దొరికి తీరును.

విష్ణు మాయకు - లొంగిన - అసురుడు
ఆ మాటలు - మరి - నిజమని నమ్మి
నీటిలో దిగి - సంధ్యవార్చుచూ -
తనకరమే - తన-శిరమున- నిడుకొనె.

వానివరమది - శాపమైనది
నూరుద్రక్కలై - తలపగిలినది
చచ్చెను అసురుడు - మెచ్చిరి సురలు
పుష్పవృష్టి - కురిపించిరి - హరిపై.

బ్రహ్మచారి - తన - నిజరూపముతో
శివునితొ పలికెను - బోళాశంకర!
దుష్టుడు - నీకే హాని చేయగ
తలంచి - వాడు - నశించెనిపుడు.

జగద్గురుడవు - నీకు - హానిని
చేయగ తలచిన - చెడిపోవుగద!
అయినా - దుష్టుల కట్టి వరములు
ప్రసాదించుట - మంచిది కాదు.

మేలు చేసిన - లక్ష్మీపతిని
అభినందించి - ఫాలనేత్రుడు
కైలాసమునకు - సుఖముగ - జేరెను
అనుచు చెప్పి-అట-కృష్ణుడు పలికెను.

ఈ కథ - వినిన - చదివిన వారి
సకల పాపములు హరించి పోయి
నిత్యానందము-సుఖములు కలుగును
ఆపై - ఉత్తమగతులు-కలుగుననె.

శుకయోగీంద్రుడు - అనుగ్రహించి
తిరిగి - రాజుకు - చెప్పదొడంగెను
ఆనందముతో - రాజచంద్రుడు
వినుచుండెను - తా - భాగవతమ్మును.

॥శ్రీ కృష్ణచరితము॥-



# 33 భృగుమహర్షి త్రిమూర్తుల ప్రాశస్త్యము తెలియుట

సరస్వతీ నది - ఒడ్డున - ఋషులు
తపోధనులును - ఎల్లవేళలా
యజ్ఞయాగముల - సత్సంగముల
కాలము - గడుపుచు-నుండెడి వారు.

త్రిమూర్తులందు-ఎవరు గొప్ప-యని
సందేహమ్ము - కలిగెను - వారికి
భృగుమహర్షిని - తెలుసుకు రమ్మని
కోరిరి వారు - వెడలెను - మహర్షి

సత్యలోకము - చేరిన - భృగువు
బ్రహ్మను జూచి-స్తుతించ-కుండెను
నమస్కారము - పెట్టక పోగా
కోపంచెను - ఆ - చతుర్ముఖుండు.

నాల్గు ముఖములు - అగ్నిచిమ్మినటు
ఎఱ్ఱబడినవి - అంతటిలోన
తనకుమారుడా - భృగుమహర్షియని
స్ఫురించి - బ్రహ్మ - శాంతినందెను.

సాత్విక తత్త్వము - ఎంతయు - లేదని
తెలిసిన మౌని - చిరునగవులతో
శివదర్శనము - చేయగ వెడలెను
వెండి కొండకు - చేరెను మౌని.

అంబాపతి - తా - పార్వతి దేవితొ
ఇష్టాగోష్ఠి - సలుపు చుండెను
మౌనిని గాంచి - ఎదురు వచ్చెను
మౌని మాత్రము - నమస్కరించక.

మన్నన చేయక - వుపేక్షించగా
క్రోధమెగసెను - రుద్రుని కపుడు
త్రిశూలమ్ముతో - పొడవగ నెంచెను
పార్వతి వచ్చి - వారించినది.

రత్నపీఠమున - కూర్చొన బెట్టెను
మహానుభావా - నీపదరజముతొ
నా ఉదరమున - లోకములన్నీ
పవిత్రమైనవి - ధన్యుడస్వామీ.

సాత్త్విక తత్త్వము - అగపడలేదని
తెలిసిన మౌని - చిరునగవులతో
వైకుంఠమునకు - జేరి - అచ్చట
లక్ష్మీసహితుని - హరిని గాంచెను.

వక్షఃస్థలము - పవిత్రమైనది
నీదర్శనమున - ధన్యుడనైతిని
అనుచు పలుకుచు - బ్రతిమాలుకొనె
పరవశుడయ్యెను - భృగుమహర్షి.

సతితొడ తలనిడి - శ్రీహరి-పడుకొని
ముచ్చటలాడుచునుండెను-అపుడు
నేరుగ సాగి - మౌని విసురుగ
హరిని తన్నెను - వక్షఃస్థలమున.

శ్రీహరి నెంతో - అభినందించి
తిరిగి వచ్చి - అట - మునులందరికీ
జరిగినదంతా - తెలియబరచెను
హరిని పొగడిరి - సంయమీంద్రులు.

వెంటనె లేచి - శ్రీహరి - అపుడు
మౌని పాదముల - నమస్కరించి
క్షమించు స్వామీ! - నిన్ను గానక
ఉపేక్షించితి - అనుచు వేడెను.

అద్వితీయుడు - మంగళమూర్తి
అతనికి చాలిన - దైవము - లేదని
నిర్ణయించిరి - హరిని - కొలిచిరి
వైకుంఠమును - పొందగలిగిరి.

అనుచు - తియ్యగా - చెప్పెను-శుకుడు
హరిలీలలివి - పాపహరణములు
నీకు చెప్పుటన - నేను - వినుట కద
ధన్యుడననుచు - ఆరంభించెను.

❋❋❋ ॥శ్రీ కృష్ణచరితము॥

## 34 శ్రీ కృష్ణుడు మృతులైన విప్రనందనులను తెచ్చుట

రాజా! వినుము - ద్వారకలోన
కృష్ణుడు - సుఖముగ గడుపుచుండెను
ఒక దినమున - ఒక-విప్రుడు వచ్చెను
విగత జీవుడగు - తనయుని-తెచ్చెను.

పుట్టిన వెంటనె - గతించినట్టి
పురిటి కందును - తీసుకువచ్చి
రాజద్వారము - దగ్గర పెట్టి
బిగ్గరగా - రోదించసాగెను.

న్యాయాన్యాయ - విచక్షణ లేక
పరిపాలించే - ఏలిక - యుండగ
ప్రజలకు-సుఖము-వుండనె-వుండదు
అకాలమరణము లుండును ఇటుల.

అనుచు - గట్టిగా - రోదించుచును
తిరిగి పోయెను - తన గృహమునకు
ఎనిమిది మంది - బిడ్డలు - అటులే
పుట్టగానె - మరి - గతించి రతనికి.

అటు పిమ్మటను - విప్రుని భార్య
మరియొక బిడ్డను ప్రసవించినది
ఆతడు కూడా దక్కగ పోగా
రాజద్వారమును జేరి - ఏడ్చెను.

ఆ సమయములో - ద్వారకలోన
కిరీటి యుండెను - ఆతడు-గాంచి
విప్రుని చేరి - వివరములడిగి
అభయమునిచ్చెను - ఆదుకొందునని

నీకింతటి - కష్టమ్ము కలిగినను
ముందుకు వచ్చే - నాథుడు లేడా!
మరి-ఈ రాజ్యము నందున-జనులు
గోలున ఏడ్చుట - అశుభముకాదా.

దీనిని ఏలెడి - రాజు మాత్రము
గ్రహించలేదని - తెలిసి పోయెను
అదిసరిగానీ - ఈతడవ - మరి
నీకొడుకును - నే ఆదుకొందును.

నీకుమారుని - రక్షించెదను
అటులగానిచో - అగ్ని లోనబడి
ప్రాణత్యాగము - చేసుకొందును
అని - గాండీవి - పలికె విప్రునితొ.

అంతట పలికెను - విప్రుడాతనితొ
బలరామకృష్ణులకు - సాధ్యము కానిది
యాదవ వీరుల - కసాధ్యమైనది
నీవు చేతువా - ప్రగల్భమ్ములు.

శుష్క ప్రతిజ్ఞలు చేయుచుంటివి
అనుచు - తేలికగ - పలికిన యంత
ఆవేశముతో - పలికెనర్జునుడు
నే గాండీవిని - నీకు తెలియదా!

రిపువంశములు - నాఅమ్ములతో
కాలిపోయినవి - తెలియుము - నీవు
త్రిలోకమ్ములను - జయించినాను
త్రినేత్రునే - నే - తిప్పలు పెట్టితి.

మృత్యు దేవతను - లొంగతీసుకొని
నీ కొడుకులను - తెత్తును - నేనని
ఆ మాటలకు బ్రాహ్మణుడచట
ఊరడిల్లెను - ఆశ చిగిర్చెను.

కొన్ని దినములకు - విప్రుని భార్య
ప్రసవవేదన పడుచుండగను
ఆతడు వచ్చి - తెలిపె - కిరీటికి
వెంటనె - పార్థుడు - సిద్ధమయ్యెను.

ఆచమించెను - రుద్రుని మ్రొక్కెను
అస్త్ర దేవతల స్మరించినాడు
పురిటి గృహమును జేరెనర్జునుడు
అమ్ముల - రక్షణ అమర్చినాడు.

బాణమ్ములతో సందు లేకను
పంజరమ్ము - నిర్మించె - కిరీటి
నూరుకళ్ళతో - చూచుచుండెను
గట్టి రక్షణ - అని తలపోసెను.

అంతటిలోన - ప్రసవమైనది
బిడ్డ దక్కక పోయె - విప్రునకు
తిరిగి - విప్రుడు - ఏడ్చుచు పోయి
కృష్ణుని వద్ద - మొర బెట్టుకొనె.

ఓ గోవిందా - భక్తసులభుడా!
మోసపోతిని - అభయమునిమ్ము
అర్జునుడట - నాకాశను పెంచి
శుష్క ప్రతిజ్ఞను - చేసెను - స్వామీ.

సృష్టి స్థితి లయ కారుడ వీవు
నీవు చేయక - మిన్నకుంటివి
సామాన్యునకు - సాధ్యముగాదు
తెలియక - నేను - మోసపోతిని.

ఘనమగు వింటితొ - మొనగాడనని
తనను-తానె-మరి పొగడు కొనుచును
నాకీదుర్దశ - తెచ్చి పెట్టెను
కాల్చుట కొరకా - వాని అస్త్రములు.

నోటికి వచ్చిన - మాటలు పలికెను
విని - అర్జునుడు - క్రుంగిపోయెను
వెంటనె ఆతడు - దివ్య శక్తితో
యమలోకమున బాలుర వెదకెను.

విప్రబాలకులు - కనబడలేదు
అటులే - ఆతడు - అన్నిలోకములు
తిరిగి తిరిగి - తా - బాలుర గానక
అగ్నిలో - పడగ - నిశ్చయించుకొనె.

ఆసమయములో - కృష్ణుడు వచ్చి
అవివేకపు పని - అని - వారించెను
విప్రనందనుల - చూపెదరమ్మని
రథమున నిడుకొని - బయలు దేరెను.

మనో వేగమున - సాగిన రథము
భూమిని దాటి - మేరువుదాటి
ముందుకు సాగగ - ఆప్రదేశము
అంధకారమై - కనుపించినది.

ఆచీకటిలో - అశ్వములవ్వి
ముందుకు సాగక - నిలచి పోయినవి
సుదర్శనమ్మును వదలి కృష్ణుడు
ఆచీకటిని - పారద్రోలగా.

తిరిగి - రథమది - ముందుకు సాగెను
కొంతదూరము - సాగిన వెనుక
దివ్యతేజము - అగుపించినది
కిరీటి - కన్నులు - మూతబడినవి.

రథము - వేగముగ - సాగుచున్నది
అంతట - భీకర - గాలులు వీచెను
హోరుగాలులు - ఆగుట లేదు
ఆపై-అంతయు-జలముతొ నిండెను

రథము సాగెను - జలము నుండియే
జలమధ్యమున - దివ్యభవనము
ఆభవనమున - రత్న కాంతులతొ
వేయిపడగల ఆదిశేషుడు.

ఆదిశేషుడు - పడగలు పట్టగ
శేషతల్పమున - అలంకారముల
పురుషోత్తముడు - లోకపాలకుడు
అగపడె - వారికి - కన్నుల నిండుగ.

నారదాది - మునులందరు-మరియు
శ్రీదేవియును, భూదేవియును
సునందాదులు - సేవలొనుండిరి
సర్వశక్తులు - నిలచె-వినయముగ.

మందహాసము - చిందులేయగా
దివ్యకాంతులు - ఎగయుచుండగా
శంఖచక్రములు - ఆయుధాలతో
వనమాలతొ-వెలిగెను-పురుషోత్తముడు.

నారాయణుని - గాంచిన యంత
కృష్ణార్జునులు - నమస్కరించిరి
ఆదరమ్ముగా - వారిని రమ్మని
చిరునవ్వులొలకగా - పలికె-వారితో.

"అసురుల హింసకు - భూమి-బాధపడ
భూభారమ్ము - తీర్చుట కొరకు
నాఅంశతొ - నే - మీయిద్దరినీ
నరునిగ - నారాయణునిగ పంపితి.

మిమ్ముల గాంచగ - ఈమునులందరు
కోరిరి - కావున - మిము రప్పించగ
విప్రుని తనయుల - తెప్పించితిని
వీరిని - మీరు - గొని పోవచ్చును."

అచ్చట - మునులు - కృష్ణార్జునులను
నరనారాయణు - లైనవారిన
దర్శించుకొని - ఆనందించిరి
మునులకు మ్రొక్కి - బయలుదేరిరి.

కృష్ణార్జునులు - విప్రబాలకుల
గాంచిరి - వారికి - వయోరూపములు
అనుగ్రహించి - తీసుకువచ్చి
అప్పగించిరి - విప్రున కచట.

బ్రతికి వచ్చిన - తనయుల గాంచి
పొంగిపోయెను - బ్రాహ్మణోత్తముడు
విరాట్పురుషుని దర్శించితినని
పొంగి పోయెను - పాండునందనుడు.

భక్తి ప్రపత్తుల - పార్థుడంతట
శ్రీకృష్ణునికి - నమస్కరించెను
సర్వేశ్వరుడని - గ్రహించినాడు
సేవలు చేసి - ధన్యుడాయెను.

దుష్టశిక్షణ - శిష్ట రక్షణ
నిర్వర్తించును - భక్తబంధువు
యజ్ఞయాగములు - తాను చేయుచు
వేదమంత్రముల-ఘనతను చాటుచు.

వైదిక మార్గము - ననుసరించుచు
ధర్మార్థ కామముల - నాచరించుచు
సంసారబంధముల - ముడివడకుండా
సంసారియగుటది - త్రోవచూపుటకు.

ప్రజలందరకు - వేదమంత్రముల
శ్రద్ధ, బుద్ధి, గౌరవమ్ములు
కలుగునట్లుగా - పెరుగునట్లుగా
త్రోవచూపెను - ఆచరించమనె.

శ్రీహరి - లీలా - నాటకమ్ములో
సంసారిగ - తా - నగుపించుటది
సంసారులను - ఉద్ధరించుటకు -
హరిని దైవమని - జనులు తలతురు.

సర్వసంపదల - ప్రజలందరును
సుఖముగ నుండగ-శుభముగ-నుండగ
తగు ఏర్పాటులు - చేసెడివాడు
భూతల స్వర్గము-అయ్యెను ద్వారక.

పది పది మంది - సంతానమ్ము
కలిగిరి - కృష్ణుని భార్యలందరకు
పట్టమహిషులకు - పుట్టిన వారిలొ
ప్రద్యుమ్నుడును - అనిరుద్ధుడును.

దేవలోకము - నుండి దేవతలు
ద్వారకలోనికి - వచ్చుచు - పోవుచు
బాటవేసిరా - అన్నటు లున్నది
దివినే దింపిరి - శ్రీహరికొరకు.

దీప్తిమద్భానులు - సాంబుడు - మిత్ర
బృహద్భానుడు - మిత్రవిందుడు
వృకారుణులు - పుష్కరుడున్ను
దేవబాహువు - శృతదేవుడును.

భూతల స్వర్గము - ద్వారక యందు
పట్టమహిషులు - ఎనిమిదిమందితొ
పదారువేల - భార్యలతోను
సంసారిగ - శ్రీకృష్ణుడుండెను.

సునందుడున్ను - చిత్రభానుడు
వరూథుడూ - కవి - న్యగ్రోధుడును
సుందరరూపులు - వీర విక్రములు
యదువంశమున - మణి దీపికలు.

తానొకడైనా - తలకొక మూర్తిగ
ఆనందమును - కలిగించగను
కృష్ణ సేవలో - తరించెదమని
సేవలు చేసిరి - కాంతలందరు.

త్రివక్రకు - మరి పూజాఫలమగు
కుమారుడాతడు - ఉపశ్లోకుడు -
నారద మౌనికి - శిష్యుడాతడు
దివ్యజ్ఞానముతొ - ఆపుణ్యాత్ముడు.

స్త్రీ - శూద్ర - దాసీ జనులందరకు
జ్ఞానమొసంగి - స్మరణమాత్రమున
ముక్తినొసంగే - మార్గము చూపెను
సాత్వతతంత్రము - విష్ణుతత్త్వమది.

కృష్ణుని వంశము - బలసంపన్నము
సాధుమార్గమున - చరించువారు
వారిని - లెక్కిడ - పదివేలేండ్లు
చాలవురాజా! అందరుండిరి.

వారిగురువులే -మూడుకోట్లపై
ఎనుబది ఎనిమిది - వేలకుపైనే -
ఆవిషయమును - ముందే చెప్పితి
మరియొకవిషయము-విను మహరాజా!

సురాసురులకు - పోరుజరిగెను
ఆయుద్ధములో - మడసిన అసురులు
ద్వాపరమందు - రాజులు గాను
పుట్టిరి - వారు - ప్రజా కంటకులు

ఆ రాజులను - హతమార్చుటకు
సురలను - విష్ణువు-భూలోకములో
యాదవులుగను - పుట్టించెనయా!
నూటవొక్క వంశమ్ములు - అవ్వి.

శ్రీకృష్ణునికి - రుక్మిణియందు
ప్రద్యుమ్నుడను వీరుడు పుట్టెను
ఆ వీరునికి - శుభాంగి యందు
అనిరుద్ధుండు జనన మందెను.

అనిరుద్ధునికి । వంశాంకురము
ముసలమువాతను । బడక నిలచిన
వజ్రుండాతడు - మహా వీరుడు
అతనికి తనయుడు । ప్రతి బాహుండు

ప్రతి బాహునికి । సుబాహుతనయుడు
అతనికి తనయుడు । ఉగ్రసేనుడు
ఉగ్రసేనుని । కుమారుడాతడు
శతసేనుండను । మహావీరుడు

ఆ విధముగను । యదువంశమది
యదు వృష్ణి - భోజ । కుకురాంధకగా
అతి పవిత్రమై । సంతతి కలిగి
వాసుదేవుని । దీవనలందెను.

శ్రీహరి - కుటుంబ - వివరములవ్వి
కుమారులందరు-సుఖముగ - తండ్రితొ
కాలము గడుపుచు - శుభముగ నుండిరి
యజ్ఞయాగములు - చేయుచుండిరి.

ఓ మహారాజా! నందనందనుడు
వేణువు నూదిన - పరవశించుచు
అమృత జలముల - స్నానమాడినటు
కృష్ణార్పణమని - గోపికలుండిరి.

అడవుల వెంబడి - దర్శనమ్ముకై
అబలలు సాగెడి - వివరము వింటివి
అన్నీ తెలిసిన - బుద్ధి మంతులు
ఆగుదురా - మరి - సేవలు చేయక!

శ్రీహరి నామము - కృష్ణుని స్మరణ
పాపహరణము - మంగళప్రదము
దివ్య మంత్రము - బంధవిముక్తిని
కలుగచేసెడి - మహామంత్రమది.

లోక చక్రమును - చేతనుంచుకొని
చక్రధారియై - బ్రహ్మాండములను
శాసించెడి - ఆ - దేవదేవుడు
శ్రీహరి - భూమికి-భారము తీర్చెను.

ఓ ధరణీశా! - మురళీధరుడు
మనుజరూపమున - మనుజులందరిని
తనలీలలతో - ముగ్ధుల జేయుచు
సుఖముగ - నుండెను-ద్వారకలోన.

సర్వలోకముల - మంగళ ప్రదమగు
సుఖసౌఖ్యములు - కలిగించునదగు
కృష్ణుని - లీలామృతమును-వినిచితి
ధన్యులమైతిమి - మనమిద్దరము.

ఈ లీలలు - మరి - వినిన వారికి
లీలామృతమును - గ్రోలిన వారికి
పాపవిముక్తి - ఇహమున సుఖము
ముక్తి ధామము - లభించు రాజా!

కృష్ణుని తలపుతో - తనువు పొంగును
ఆనందధామము - చూపించునది
కోర్కెలు - తీర్చెడి - కల్పవృక్షము
మనశ్శాంతిని - కలిగించునది.

అవిధముగను - శుకయోగీంద్రుడు
పరీక్షిత్తునకు - తెలియబరచెనని
సూతుడు-మునులకు-తెలియబరచగా
మునులందరును - పరవశించిరి.

మునులందరను - సూతుని పొగడిరి
మనస్సులందు విష్ణుదేవుని
ప్రతిష్ఠించుకొని - భక్తి ప్రపత్తుల
విష్ణుకథలతో - గడుపుచుండిరి.

దశమస్కంధము సంపూర్ణమిది
రామభద్రునికి - అంకితమిడితిని
వ్యాసమునీంద్రుని - పదములంటితి
పోతనయ్యకు వందనమిడితిని.

సిరులు - సంపద - ఆయుర్భాగ్యము
మోక్షమునిచ్చి - ధన్యుల చేయు
దశమస్కంధము - దివ్యవరమిది
భాగవతమ్మొక - మహామంత్రము.

శ్రీకృష్ణ చరితము - కర్ణ పేయము
వ్యాసమౌనికే శాంతినొసగినది
పోతనయ్య - పులకించి పలికినది
భవ భయ హారిణి - భాగవతమ్ము.

తామర రేకుల । కన్నులవాడు
రఘుకుల శ్రేష్ఠుడు శ్రీరఘురాముడు
రక్కసి మూకల గూల్చినవాడు
దయా సింధువు - నిలచిన ధర్మము

భూసుతసీత । ముఖ పద్మమునకు
రవివై వెలుగుచు । రఘువంశమ్మను
సంద్రమ్మునకు చంద్రబింబమై
చల్లదనముతో । విరాజిల్లుచు

మారీచునిదగు । మాయయైన – ఈ
చీకటి నంతము చేసెడి । రవివి
రాజుల మన్నన లందిన – మూర్తివి
ధర్మమూర్తి శ్రీ రామమూర్తివి!

హిమగిరి నందిని । పార్వతి యొక్క
స్తుతులనందిన । సన్నుతచరితా
భక్తుల బ్రోచే పరమ దయాళో!
పాప వినాశక । శ్రీ రఘురామా!

వారిధినే । వణకించిన వీరుడ!
మనసుల నేలే । మనోభిరామా!
అసురుల నణచిన – అరిభయంకరా!
సుమశరు మించిన । సుందరమూర్తీ!

రాజశ్రేష్ఠుడా । మునిజన వందిత
ఉన్నత గుణనిధి । కారుణ్యానిధి
రామా । రామా । జానకిరమణా!
దయగొని దాసుల కాపాడుమయా!



**శ్రీ కృష్ణచరితము – కర్ణపేయము**
**వ్యాసమౌనికే – శాంతినొసగినది**
**పోతనయ్య – పులకించి పలికినది**
**భవ భయ హారిణి – భాగవతమ్ము॥**

## మంగళం

మంగళం మంగళం వాయుపుత్ర మంగళం
రామచంద్ర మంగళం - యదుకిశోర మంగళం
కలిమినిచ్చు తల్లికి - కరుణజూచు శారదకు
ఎల్లగృహములందు వుండి - చల్లగాను చూచేటి
వేణుగానలోలునికి - మంగళం - మంగళం -
జగములేలు ప్రభువుకు - మంగళం - మంగళం

ఓం శాంతి - శాంతి - శాంతిః





సర్వేజనాస్సుఖినోభవన్తు
లోకాస్సమస్తాస్సుఖినోభవన్తు





**సర్వం శ్రీ సీతారామచంద్ర పాదార్పణమస్తు**



(మకుటం)

శ్రీ కృష్ణచరితము - కర్ణపేయము
వ్యాసమౌనికే - శాంతినొసగినది
పోతనయ్య - పులకించి పలికినది
భవ భయ హారిణి - భాగవతమ్ము॥

# శ్రీమద్భాగవత - మకరందము

## (ఏకాదశస్కంధము)

### విషయ సూచిక





శ్రీరామ

ఓం - నమో - వాసుదేవాయనమః

# శ్రీమద్భాగవత - మకరందము

## (ఏకాదశస్కంధము)

తపోవంతులగు మునులను గాంచి
పౌరాణికోత్తముడు సూతమహాముని -
శుకయోగీంద్రుడు పరీక్షిత్తునకు -
తెలిపినగాధ - తెలుపుచుండెను

దారుణకృత్యము లొనరించ అసురులు
బలదర్పితులగు రాచవారును
అంతముకాగా - మునులు, భూజనులు
సురలు,భూసురులు ఆనందించిరి.

రాజవరేణ్యా! శ్రీకృష్ణదేవుడు
బలశాలియగు బలభద్రునితో
పేరుమోసిన - దుష్టచరితులగు
అసురులెందరినొ అంతము జేసెను.

పరంధాముని పరివరి విధముల
ప్రస్తుతించిరి నిండు మనస్సుతొ
మిగిలినబలము యాదవబలము
యాదవులందరు బలభీములయా!

అయినా భూమికి భారముతగ్గక
కురుపాండవుల-రణమను నెపమును
ఊతమ్ముగ మరి కృష్ణదేవుడు
అనేక మందిని హతము చేసెను

గర్విష్టులును పౌరుషవంతులు
కృష్ణుని అండతొ వారి మాటయది
తిరుగులేనిదిగ సాగుచుండెడిది
అదికూడా మరి భూభారమయె

పేరు పార్థునిది క్రియ కృష్ణునిది
అన్నవిధముగా పదునెనిమిదగు
అక్షౌహిణుల సేనను రాల్చెను
భూభారమును దించివేసెను

అదిగ్రహించిన కృష్ణదేవుడు
నమ్మిన వారిని ఏదో విధముగ
అంతముచేయక పోయినచో మరి
పెచ్చుపెరిగి అది కష్టసాధ్యమగు

అని మదినెంచి - మునిశాపము అను
నెపమునుచూపి అంతముచేసెను
అనగా రాజు అడిగె మునీంద్రుని
మునిశాపము ఎటు తగిలిన దనెను

॥శ్రీ కృష్ణచరితము॥



# 1 విశ్వామిత్రాది మహర్షులు శ్రీకృష్ణుని దర్శనమునకై వచ్చుట

బదులుగ పలికెను శుకయోగీంద్రుడు
భువన మోహన మంగళమూర్తి
ధర్మస్థాపనకు అవతరించి మరి
గృహస్థ ధర్మమునాచరించుచు

జగన్మంగళము నిరతముతలచే -
శ్రీకృష్ణుడు తా ద్వారకలోన
వసుదేవునింట విడిసియుండెను
తనకర్తవ్యము చేయగ నెంచెను

యాదవకులమును నశింపజేసిన
మిగిలిన పనియది నెరవేరునని
తలచిన కృష్ణుని - చూడగ నచటికి
విశ్వామిత్రాది మహర్షులు వచ్చిరి

ద్వారకదగ్గర పిండారకమను
తీర్థమ్మునకా మునులు వచ్చిరి
కలిదోషహరణగ పుణ్యకర్మలు
ఆచరించిరి ద్వారక కొచ్చిరి

ఏనాటికిని మన్నింపదగు
మహర్షులయ్యా! వారిపేర్లవి
విశ్వామిత్రుడు-అసిత-దూర్వాసులు
భృగువు -అంగిరస - కశ్యపుడున్ను

వామదేవ-వాలఖిల్య-అత్రి-కణ్వులు
వశిష్ఠ - నారద - మొదలగువారు
కృష్ణసౌధమున పూజలనంది
కుశలమునడిగి వెడలుచుండిరి

రాజవీధిలో మునులు నడచిరి
అంతట వారికి ఎదురుగ కొందరు
యాదవులు మరి - కృష్ణుని తనయుని
సాంబుని తెచ్చిరి - స్త్రీవేషముతో

వారు అడిగిరి అతి వినయముగా
మహానుభావులు - మీరందరును
ఈ స్త్రీ ఇపుడు చూలింత మరి
ఈమెకు పుట్టెడి బిడ్డ ఎట్టిది

ఆడుబిడ్డయా! మగబిడ్డయొమరి
తెలియబరచుడు దయతో మీరు!
విషయముతెలిసిన మునులందరును
ఆగ్రహించిరి అవమానమునకు

పలికిరివారు - ధూర్తులు మీరు
యాదవకుల నాశకులగుదురు
ఈమెకు ఆడా మగయు కాని
ముసలముపుట్టును పొందని కసరిరి -

భయపడి పోయిరి వారందరును
వెంటనె సాంబుని వేషము తీసిరి
అంతట వాని కడుపునుండి ఒక
రోకలి నేలకు రాలిపడినది

హడలిపోయిరి చెమటలు పట్టెను
వెంటనెవారు సభలోనున్న
ఉగ్రసేనునికి విన్నవించిరి
రాజు ఎంతయో కలవరపడెను

దీనముగా మరి వారినిగాంచి
అయినది ఏదో ఐపోయినది
ఆరోకలిని సంద్రజలముల
అరగదీసి మరి కలపగ జెప్పెను

ఉగ్రసేనుడు సర్వవిషయములు
కృష్ణునితో తా సంప్రదించును
కాలప్రభావము కావున అపుడు
చెప్పక చేసెను సొంతనిర్ణయము

మునుల శాపముతొ ముసలముపుట్టెను
అన్నవార్త – వ్యాపించెను ద్వారక
భయసంభ్రమముల నిండిరి జనులు
సంద్రజలముల కలుపగ చనిరి

రోకలినంతట వారందరునూ
అరగదీసిరి – అరగదీసిరి
అంతానీటిలో కలిపిరి గాని
చిన్నములికియది మిగిలిపోయినది

అరగతీయగా చేతికందక
మిగిలిన ములికిని సంద్రమునందు
విసరి వేసిరి తృప్తినందిరి
తిరిగి గృహములకు చేరిరి వారు

ఆములికిని ఒక చేపమింగినది
జాలరులకు ఆచేపదొరకినది
చేపనుకోయుచు ములికిని గాంచి
నిర్లక్ష్యముగా పారవైచిరి

ఆములికిని ఒక బోయ గైకొనె
వేటలొ తనకు ఉపకరించునని
బాణపు కొసకు అమర్చినంత
మృగమును కొట్టగ వీలుగనుండును

అనుచు–గ్రహించెను–బోయ ములుకును
సర్వము తెలుసును వాసుదేవునికి
మునిశాపము తన సంకల్పమునకు
అనువుగనుండెను అని తలంచెను.

కొన్ని దినములకు నారదమౌని
ద్వారకయందు వసుదేవుని ఇంట
అతిథిగ నుండెను ఆ పుణ్యాత్ముడు
కృష్ణదేవుని ఉపాసించుచు

కృష్ణసంకీర్తనచేయుచు మరియు
హరికథలతొ తా కాలము గడపగ
వసుదేవుడంతట వందన ముంచి
నారదమునిని అడిగె నిట్టుల

నారదమౌనీ! శ్రీహరి పాదపద్మమ్ములను
సేవించక మరి వ్యర్థముగా – తా –
కాలముగడపిన అదనుగాచికొని
మృత్యువువచ్చి కబళించునుకద!

నా అదృష్టము పుణ్యాత్ముడవు
నాయింటనుంటివి ధన్యుడనైతిని
హరిభక్తులతో సాంగత్యమిది
పాపహరణము – పుణ్యప్రదమ్ము

మమ్ముల నను గ్రహించగ దయతో
మాగృహములకు వత్తురు మీరు
మీసేవలవి దైవసేవలగు
పరమాత్మ ప్రీతియగు నిస్సందేహము!

దుఃఖాగ్నిని మరి చల్లబరచుటకు
జ్ఞాననేత్రము తెరిపించుటకు
హరిగాధలను విశదపరచుడు
ధర్మపధమును చూపుడు స్వామీ!

యమపాశమ్మున దండనపొందక
శాశ్వతమైన ఆనందమును
కలిగించెడి భగవానుని గాధలు
భాగవత ధర్మమ్ముల చెప్పుము.

వసుదేవుడటుల అడుగగనంత
పులకరించెను నారదమౌని
హరిని మనస్సున ధ్యానించుకొనె
ఆనందబాష్పముల పలికె నిట్టుల

విష్ణుమాయకులొంగిన నేను
మోక్షము నడుగక పరంధాముని
తనయునిగా మరి పొందకోరితి
సంసారబంధమున కట్టుపడితిని

వసుదేవా నువు జ్ఞానవంతుడవు
చక్కగ నన్ను అడిగినాడవు
నేనుచెప్పెడిది వినువారికినీ
స్మరించువారికి నీకూ మరియు

మోక్షమ్మడిగి - జన్మసఫలము
చేసుకొనుటది జరుగలేదు కద
తిరిగి వ్యర్ధపు బ్రతుకు వలయమది
అందులోపల చిక్కినాడను

విమర్శించెడి వారికి కూడా
శుభప్రదమై మరి సుఖములనిడును
కల్యాణమూర్తిని తిరిగి మనస్సులో
దర్శించుకొను భాగ్యముకలిగెను

వాసుదేవునికి వందనమిడితిని
ప్రాచీనమగు ఇతిహాసమ్మును
తెలియపరచెదను వేదసారమిది
జగత్తుకే కల్యాణకరమిది.

॥శ్రీ కృష్ణచరితము॥



## 2 నారదుడు వసుదేవునకు చెప్పిన విదేహర్షభసంవాదం

స్వాయంభువమనువు కొమరుడు
ప్రియవ్రతుండు అనెడి యోగ్యుడు
అగ్నీధ్రుడు ఆ ప్రియవ్రతు సుతుడు
అతని తనయుడు నాభియగునయా!

ధైర్యగాంభీర్యముల ఎన్నిక - నాభి
బలిచక్రవర్తికి స్నేహితుడాతడు
రిపులను త్రొక్కి భువి పాలించెను
నాభితనయుడు ఋషభుడు అగును

మోక్షసాధనకు వీలగుధర్మము
ఋషభుడు తాను వ్యాప్తిజేసెను
బ్రహ్మవిద్యాపారంగతులగు
తనయులు నూర్గురు ఋషభునికయ్యా!

వారిలో పెద్ద భరతుడు - భక్తుడు
హరిభక్తికి రూపై నిలచెనాతడు
ఐహిక సుఖముల తృణప్రాయముగ
నెంచి - కఠోర తపము చేసెను.

సంసార బంధములత్రెంచుకు నాతడు
ముక్తినిపొందెను-భరతుడు వింటివ!
అతనిపేరున భరతవర్షము
కలిగినదయ్యా! భూమండలమున

మిగిలినవారిలో తొమ్మిదిమంది
నవ ఖండలములకు అధిపతులైరి
ఎనభై ఒకటి సంఖ్యలోవారు నిత్యకర్మలతో
బ్రాహ్మణులైరి - బ్రహ్మవేత్తలు.

మిగిలినతొమ్మిది మంది మాత్రము
దిగంబరులై ఆత్మవిద్యాపారంగతులై
ఒకచోటుండక ఇచ్చవచ్చినటు
సకలలోకముల పూజలందెదరు

కవి - హరి - మరి అంతరిక్షుడు
ప్రబుద్ధుడున్ను - పిప్పలాయనుడు
అవిర్హోత్రుడు-ద్రమిళుడు-చమసుడు
కరభాజనుడను - తొమ్మిదిమంది

ఒకసమయమున తొమ్మిదిమంది
భరతవర్షమున విదేహభూపతి
నిమి - యను రాజు చేయుచునున్న
యజ్ఞము చూడగ వచ్చియుండిరి

రవితేజముతో శ్రీహరి స్మరణతో
అడుగు బెట్టిన వారిని గాంచి
నిమిమహరాజు - ఋత్విక్కులును
ఎదురుగవెళ్ళి ఆహ్వానించిరి

యధావిధిగను పూజలొనర్చి
ఉచితాసనమున కూర్చొన బెట్టిరి
బ్రహ్మతేజముతో వెలిగెడివారిని
సనకాదులతో కూర్చొనియుండగ

వందనముంచి నిమి మహరాజు
భక్తిగ పలికెను "మహాత్ములారా!
నారాయణుడే వశమైనటుల
కనబడుచున్న తేజోవంతులు

మీవంటి భక్తులు విష్ణురూపులు
లోకపునీతము చేయుట కొరకు
తిరుగు చుందురు దర్శనమిడెదరు
మీదర్శనమది జన్మకుసఫలత

పుణ్యవిశేషము మానవజన్మ
అట్టిజన్మలో విష్ణుభక్తుల
దర్శనమ్మది తరింపజేయును -
తెలుపుడు నాకు భాగవత ధర్మములు

అటుల భక్తిగా 'నిమి' అడుగగను
'కవి' పలికెనట రాజావినుము
చక్కని ప్రశ్నను అడిగితివీవు
సర్వభూతముల ఆత్మ ఈశ్వరుడు

ఈశ్వరుమాయగ సర్వమునెంచి
ఇంద్రియార్థముల గుర్తించకను
నిర్వికారునిగ వుండెడి వాడు
భాగవతోత్తము దని చెప్పబడు

భవభయములను హరింపజేయగ
హరి అనుగ్రహము కలిగియుండవలె
ముకుందుసేవతొ - యముడుచేరడు
ఉత్తమ గురువుగ హరినెంచవలె

సంసారబంధముల మోహపడకను
ఆధర్మమ్ముల రక్తినిపెంచక
హరిచింతనతో కాలముగడిపిన
పరమభాగవతుడు అనబడునయ్యా!

విష్ణునామము నిరతము చేయుచు
విష్ణుకథలను నిరతము వినుచు
పాడుచు, పలుకుచు, పరవశించుచు
హరి అన్వేషణ సలుపుచుండవలె

స్వపరభేధములు అంటనివాడు
అహంకార - మమకార దూరుడు
సర్వభూతదయ - శాంతి ప్రియత్వము
కలిగినవాడు భాగవతోత్తముడగు

కనబడునట్టిది హరిలీలయని
హరిని గాంచుచు నుంటిననుకొని
హరి తనలోనే కలడనితలచిన
ఆతడు అగును - పరమభాగవతుడు.

సిరిసంపదలకు భోగభాగ్యముల
మోహపడకను పదవినికోరక
హరిభక్తితొ మరి నిరతము గడిపిన
పరమభాగవతుడందురు వానిని

హరి భక్తులతో మైత్రికలిగియు
హరియందు మరి భక్తి ప్రేమలు -
మూర్ఖుల యందు రిపులయందున
దయనుచూపగా - మధ్యము డనబడు

అజ్ఞానతిమిరమును త్రెంచి - కాంతితో
సంసారపాశముల విడివడి నిరతము
హరిచరణామృతపానముతో మరి
పులకరించును భాగవతశ్రేష్ఠుడు

ఈశ్వరార్చన శ్రద్ధగచేయుచు
ఈశ్వర భక్తుల నారాధించని -
భక్తుడు అగును సామాన్యభక్తుడు
జన్మసంస్కారము - సాధన ముఖ్యము.

"పూజ్యులార! నే విష్ణుమాయను
తెలియగోరితిని కావునదయతో
హరిగాథలుగా నెలకొనియున్న
దివ్యలీలలు తెలియబరచుడు"

అంతటపలికెను అంతరిక్షుడు
"ఓ ధరణీశా! పరబ్రహ్మము
పరతత్వమ్ము పరమపదమ్ము
ఈశ్వరుడు, హరి, అన్నియు ఒకటే.

శ్రీహరి మాయ బలమైనదయా!
ఇంద్రియార్ధముల వశమై ఇలలో
జాగ్రత్, స్వప్న, సుషుప్తులవస్థల
వలయములో మరి చిక్కుకుందురు

వాటికి అందక పరమాత్మ – గమనిక
అట్టి స్థితికి మరి – వచ్చుట జరిగిన
ఈశ్వరు మాయ తొలగిపోవును
ఆత్మద్రష్టలుగ మారుట జరుగును

పంచభూతములు ఈశ్వర సృష్టి
ఆసృష్టిలొ పడి దేహి నిత్యము
కర్మలు చేయుచు వాటి ఫలములు
అనుభవించుచు నుండును ఇలలో

దాని వల్లనే సుఖ, దుఃఖములు
కలుగుచుండును నిజముగ చూచిన
సుఖముఅన్నది – సుఖమేకాదు
దానిఫలితమే పుట్టుట – గిట్టుట

యుగాంతమ్ము అను చివరిదశలొ మరి
జగత్తునంతను ప్రకృతిలోన
అంతముకాని – కాలము కలుపును
అటుపిమ్మటను నూరుఏండ్లుమరి

వర్షాభావముతో తీవ్రవేడియది
లోకమ్ముల దగ్ధమ్ముచేయును
అటుపిమ్మటను అధోలోకమున
పవిత్రాగ్నిఅది ఉద్భవించును

సంకర్షణుని ముఖములొ పుట్టిన
అగ్నిఅంతట – ఊర్ధ్వలోకముల
అన్ని వైపులకు ఆవరించును
అటుపిమ్మట మరి, జలప్రళయమున

సంవర్తకాది మేఘ ములవ్వి
విడువని ధారగ వంద ఏండ్లుమరి
వర్షించగను జలమయమగును
దానిలొ–విరాడ్రూపము–లీనము అగును

అంతట ఈశ్వర దేవుడు తాను
అవ్యక్తమగు తేజము అగును
దాని ఫలితము భూమిఅంతట
వాయువుతో జలరూపము దాల్చును

ఆ జలమంతట – తేజముపొంది
ఆతేజమ్మది కలియు వాయువున
ఆవాయువు – ఆకాశమ్మున కలియును
శబ్ద గుణరహితము ఆకాశమ్ము

ఆత్మయందున చేరిపోవును
ఇంద్రియాలు తమ వికారమ్ములతొ
అహంకారమున కలిసి పోవును
అది పరమాత్ముని యందు కలియును

సృష్టిస్థితిలయముల చేయుచునుండి
గుణత్రయముల కలిసి యుండెడి
హరి మాయయది యిట్టిదేనయా!"
అనుచుచెప్పెను అంతరిక్షుడు

అంతట అడిగెను 'నిమి' భక్తిగను
అవివేకముతో నుండెడి నరులు
శక్తివంతమగు అట్టిమాయను
దాటుట ఎటులో సెలవీయమనె

బదులుగ పలికెను ప్రబుద్ధుడను-ముని
సూర్యోదయ సూర్యాస్తమయము
ఆయువు మింగుచునున్నటు తెలియక
అహంకారమున చెడెదరు జీవులు.

తన మనుగడ శాశ్వతమనుకొని
ఇల్లు-వాకిలి-యిల్లాలు బంధములు
తెగపెంచుకొని సుఖమనుకొందురు
రోగగ్రస్తమగు తనువు సుఖమనుకొను

బంధవిమోచన ఆలోచించక
గుడ్లగూబలా బ్రతుకుచుందురు
భ్రమలోగడపుచు చూచుచున్నను
తననుకాదని - త్రోసుకు పోదురు

ముసలి అగునని - మూల్గువచ్చునని
అందము అంతము ఐపోవునని
కళ్ళముందర - రోగుల గాంచియు
తప్పుకు తిరుగుట మోసపోవుటే -

హరిభక్తిగలిగిన గురువునుచేరి
ఆనంద ధామము తెలుసుకోవలె
గురువే హరిగా పూర్తిగ నమ్మి
ఆత్మజ్ఞానమును సాధించవలె

సత్వగుణముతో భూతదయతొ మరి
హరికథాశ్రవణము - బ్రహ్మచర్యము
సాంగత్యము సుఖముల విముఖత
సజ్జనమైత్రి, ఓర్పు మౌనము

వినయ వర్తనము శాస్త్రాధ్యయనము
విధివిహితమగు కర్మాచరణ
ద్వంద్వముగెలిచే సమభావన మరి
అంతా ఈశ్వర మయమని గాంచుట.

సంతుష్టిని మరి కలిగియుండుట
దైవనిందను చేయకపోవుట
శమదమాదులు కలిగియుండుట
మోక్షపథమును గాంచెడి కోరిక

దైవకార్యముకు ఖర్చుచేయుట -
మొదలగు నట్టి సద్గుణములవి
భాగవత ధర్మమ్ములు అగును
వాటి ఆచరణ శాశ్వతసుఖమిడు

అంతట అడిగెను - నిమి - వందనమిడి
బ్రహ్మవేత్తలలొ అగ్రగణ్యులు
నారాయణుని స్వరూప స్వభావము
ఎట్టిదొ దయగొని విశదపరచుడు

అంతట వారిలో పిప్పలాయనుడు
పరమాత్మ-స్వరూపాదులు-తెలిపెను
సృష్టి - స్థితిలయముల కాశ్రయమ్మది
దేహము-మరియు యింద్రియమ్ములు

పరమాత్మరూపమది - వీటియందున
మంటలో-అగ్నిగ నెలకొని యుండును
ఇంద్రియమ్ములకు అందని దాత్మ
ఆత్మస్వరూపము శబ్దమ్మగును

త్రిగుణమ్ముల సంకలనమ్ముతొ
మహత్తహంకారముల కలయిక
సత్యపదార్థము అగును - దానికి
కదలిక కలిగిన జీవుడు అగును.

సత్తు అసత్తుల పైన వుండునది
పరమాత్మగా బ్రహ్మాదులు సుతించు -
అట్టిఆత్మయది-స్థావర జంగమమ్ముల
పెంపు నశింపులు లేకయుండును

ఇంద్రియాలతో కూడినయట్టి
ఆకారమ్ము తొలగిపోయినచొ
మనస్సును విడచి ఆ పరమాత్మ
శబ్దశూన్యునిగ నుండిపోవును

పరమాత్మ స్వరూప స్వభావమిదియగు
జ్ఞాని - అనిశము హరి భక్తితోడను
మనో మలినమును తుడిచి వేసి మరి
హరి పదమ్ములకు జేరగలుగును.

అంతట అడిగెను 'నిమి' భక్తిగను
ఏ, ఏ కర్మలు పాపము త్రుంచి
పుణ్య పథమున హరిసాయుజ్యము
అందించునొ - అవి సెలవీయమనె -

బదులుగ పలికెను అవిర్హోత్రుడు
కర్మకాండకు వేదము పునాది
ఈశ్వరురూపములు కర్మలన్నియు
విద్యయున్నను గ్రహించలేరది

వేదమార్గమున కర్మలచేసి
దాని ఫలితము - జన్మలుపొందుట
మోక్షముపొందగ అభిలషించిన
హరిసేవ ఒక్కటే రాజమార్గము.

ఫలాపేక్షతో వేదవిహితమగు
కర్మను చేసిన జన్మలు కలుగును
అటులగాకను - విహితపూజను
హరికిచేసిన ఫలితముకలుగును

హరిపరమ్ముగా - సంకల్పముతో
హరిఅర్పణగా పూజచేయవలె
శుచియై ఎదురుగ హరిప్రతిష్టతో
షోడశోపచారమ్ములొనర్చి

గంధపుష్పములు దీపధూపముల
నైవేద్యములను శ్రద్ధగచేసి
సాష్టాంగముగా నమస్కరించి
తన్మయత్వమున కీర్తించవలె

ఆ విధముగను ఆచరించిన
హరికి వానిపై ప్రీతికలుగగా
హరిని చేరెడి పుణ్యముకలుగును
అనిచెప్పగను 'నిమి' అడిగెనట

ఓ పుణ్యాత్మా! సర్వేశ్వరుడగు
శ్రీహరి ఎట్టికర్మలొనర్చెను
ఆయనలీలలు క్రియలు ఎట్టివో
దయగొని తనకు వినిపించమనె

బదులుగపలికెను 'ద్రమీళు' - దచట
ఓ మహరాజా! హరిలీలను
చెప్పుట కష్టము విరించి శివులకు
ఆదిశేషునికె అంతుబట్టనివి.

బుద్ధికితోచిన వాటిని తెలిపెద
ఆది దేవుడగు నారాయణుడు
తాను సృజించిన పంచభూతముల
సమ్మేళనమగు దేహనగరమున

తన అంశతొ అట పూర్ణపురుషునిగ
వెలుగుచుండెను గుణములతో మరి
సగుణుడుగా తా నున్నవాడగు
విరాడ్రూపునకు రూపములెన్నో

గుణములు ఆలంబనగా చేసుకు
బ్రహ్మవిష్ణుమహేశ్వరులుగ
త్రి గుణాత్మకుడై వెలయుచుండును
ఋషులలొ నారాయణునిగ నుండును

నారాయణుని దివ్యచరితమిది
నారాయణుడును నరునిగ తాను
దక్షపుత్రిక 'మూర్తి'కి జనించె
వారికి తండ్రి 'ధర్ముడు' రాజా!

వారిద్దరిలో నారాయణుడు
బదరికాశ్రమమునందున తాను
లోకశ్రేయముకు ధర్మరక్షణకు
తపోదీక్షలో తపమున నుండెను.

ఆశ్రమప్రాంతమునందలిమునులు
ఆ నిష్టకు మరి ముగ్ధులాయిరి
అచటకు వచ్చి నారాయణునికి
సేవలుచేయగ నారంభించిరి.

అమోఘతపస్సుకు ఇంద్రుడుభయపడె
తపోవిఘ్నముకు దేవవేశ్యలను
మన్మథుని మరి పంపెనచటకు
వారందరు తమ పనిలో దిగిరి

వసంతశోభలు వెల్లివిరిసెను
శుకపికరవముల సందడిపెరిగెను
కలహంసజంటలతొ సరోవరమ్ములు
కన్నులపండుగ చేసెను వనమున

పూవిలుకాడు అందగత్తెలతొ
అడుగు బెట్టెను దివ్యవనమున
తపోమూర్తిని గాంచిన స్త్రీలకు
తడబాటుతొమరి చెమటలుపట్టెను

మన్మధుడంతట తనప్రతాపము
చూపబోయె నారాయణఋషిపై
అదిగ్రహించిన ఋషి – వారినిగని
జాలిపడెను – తన కన్నులు తెరచి

దగ్గర రమ్మని పిలచెను వారిని
భయమున వారు దూరమునిలచిరి
అంతట పలికెను జాలిగ వారితొ
"అమాయకులు మీరందరు వినుడు

తెలివిలేని మీ నాయకుడింద్రుని
ఆజ్ఞల పరిపాలించగవచ్చిరి
కోర్కెల విముఖుడనేను – వింటిరా!
కోర్కెలు – భోగములవి మీ ప్రభువువి

పదవి భద్రత కోరిన ఇంద్రుడు –
మిమ్ముల పంపెను తపోభంగముకు
కానీ మీకు అసాధ్యమైనదది
కావున మీ మీ పనులలొ నుండుడు

అంతటవారు వణకిపోయిరి
పశ్చాత్తాపము నిండిన మనసుతొ
వందన మిడుచు క్షమించగోరిరి
సంయమీంద్రుని పదములబడిరి

కామక్రోధముల తగిలిన ముని తా
బురదగుంటలో నీటిని పోలును –
అవ్వి జయించిన తపోరత్నమా!
నీమది చలించ దెన్నటికిన్నీ

నారాయణుడు ప్రసన్నుడయ్యెను
అంతట వారికి తన సామర్థ్యము
తెలియబరచగా సంకల్పించెను
నారాయణ ఋషి తనువునుండిఅట

రోమకూపములనుండి అచ్చట
చక్కని చుక్కలు మూడు కోట్లుమరి
ఉద్భవించిరి వనమునిండగా –
సౌందర్యరాశులు వారందరును

కన్నులార్పక అచ్చరకన్యలు
వారందరినీ చూచి మురిసిరి
అంతట పలికెను ఋషిపుంగవుడు
అందగత్తెలలొ ఎంపిక అయిన

ఒక సుందరిని నాయికగాను
స్వర్గలోకముకు తీసుకుపొమ్మనె
వారు అందరిలొ అందగత్తెను
తోడ్కొనిపోయిరి దేవలోకము

ఇంద్రుని వద్దకు పోయి జరిగినది
విన్నవించిరి వినయమునిండి
అందగత్తెను చూపిరింద్రునికి
ఆమె 'ఊర్వశి' – వారికి నాయిక

విషయము తెలిసిన నాకలోకపతి
సిగ్గుతొ తలను దించుకొనెనట
రాజా! శ్రీహరి దివ్యగాధలవి
పులకరింతలు పుణ్యప్రదములు

విశ్వశ్రేయముకు శ్రీహరి తాను
పరమహంసగా - దత్తాత్రేయునిగ
సనకసనందన - ఋషభురూపముల
ఆత్మయోగమును బోధించి వెడలెను

దుష్టశిక్షణకు శిష్టరక్షణకు
ఎన్నెన్నో అవతారమ్ములనెత్తును
మత్స్య - కూర్మ -వరహావతారముల
భూమిని శ్రీహరి ఉద్ధరించెను

అట్టి లీలలు అద్భుతమ్ములు
వినక - శ్రీహరిని ధ్యానించకను
విపరీత బుద్ధులు కలిగినవారికి
ఉత్తమగతి అది ఎటులలభించును?

'చమసుడు' అనెడి ఋషభ నందనుడు
బదులుగ పలికెను రాజుతొ నంత
చాతుర్వర్ణములన్నవి - శ్రీహరి
అంశతోనవి - ఉద్భవించినవవి

సత్వగుణ ప్రధానులు - విప్రులు
సత్వ రజస్సుల క్షత్రియులున్న -
బాహువులందు ఉద్భవించిరి -
రజస్తమముల ప్రధానులైన

వైశ్యులు ఊరువులందు పుట్టిరి
తమోగుణప్రధానులు ఐన
శూద్రులు - పాదములందు వెలసిరి
అటులే కర్మలు ఏర్పాటైనవి

వీరందరిలో శ్రీహరి కథలను
ఎవ్వరు వినరో వారు మాత్రము
ఎంతటి కర్మలు ఆచరించినను
ముక్తిని పొందరు - ఆరాధన ముఖ్యము

స్త్రీలు - శూద్రులు హరి కథలను విని
భక్తి ప్రపత్తులు కలిగియుందురు
అందుకువారు ఉద్ధరింపబడి
ముక్తినిపొందగ అర్హులగుదురు

బ్రాహ్మణ - క్షత్రియ వైశ్యులు మాత్రము
అహంకారమున - పండితులమని
రూప బల కర్మలతోను
ఆత్మజ్ఞానము లేక చెడెదరు.

హరి భక్తులను హేళనచేయుచు
కపట డాంబిక భక్తులు కొందరు
లోకమ్మును వంచించి - సుఖముల
మునిగి తేలి మరి పతనమొందెదరు

ఇల్లూ - వాకిలి - భార్యా పుత్రులు
నేను - నాది - పరమార్థమ్మని
సంసారవలయమున పడినవారికి
జన్మల వలయము తప్పదు రాజా!

చెప్పిన వినక - తెలియుననుకొని
మిడిసిపాటుతో విజ్ఞతవదలిన
హరిభక్తిలేక మరి పశుతుల్యమగు
జీవితమ్మది నిరర్థకమ్ము.

బంధవిముక్తికి హరి భక్తి ఒక్కటే
రాజమార్గమని తెలియగవలెను -
అనగా రాజు ఏకాలములో ఏరూపములో
ఏవిధముగ - శ్రీహరినర్చించిరి?

అనగా పలికెను - కరభాజనుడు -
కృత - త్రేత - ద్వాపర - కలియను
నాల్గుయుగములుగ కాలమున్నది
కృతయుగమందున శ్రీహరి తాను

తెల్లనిరంగు నాల్గుభుజములు
జటావల్కలము - కృష్ణాజినము
దండకమండల - జపమాలతొ తా
విరాజిల్లును దివ్యపురుషుడు.

తపోధ్యానము అనుష్టానము
కలిగినవారు ఆపరమాత్మని
హంసుడు-సుపర్ణుడు-వైకుంఠుడని
ధర్ముడు-యోగీశ్వరుడు అనుచును

అమలుడు-ఈశ్వరుడు-అవ్యక్తుడని
పరమాత్ముడాతడని పరవశమ్మున -
పురుషుడు - ఆతడు ఉద్ధరించునని
భక్తిప్రపత్తుల కీర్తించెదరు.

త్రేతాయుగమున - రక్తవర్ణుడు
చతుర్బాహుడుగ - త్రిగుణమ్ములను
దీక్షాంగభూత మగు-మొలనూలుతొ
విరాజిల్లును - వందనమందును

హిరణ్యకేశుడు - వేదత్రయమూర్తి
స్రుక్కు - స్రువములు మొదలగునట్టి
హోమసాధనము లమరియుండును
ఆపరమాత్మను - విష్ణువు - యజ్ఞుడు -

పృశ్నిగర్భుడు - సర్వదేవుడు
ఉరుక్రముడు - మరి - వృషాకపియని
జయంత-ఊరుగాయ-దివ్యనామముల
వేదోక్తక్రతువుల ఆరాధింతురు.

ద్వాపరమందున శ్యామలగాత్రుడు
పీతాంబర - చక్రాయుధధారి
శ్రీవత్సకౌస్తుభ విరాజమానుడు
సార్వభౌముని లక్షణమ్ములతొ

ద్విభుజుడాతడు ఆ పరమాత్మను
రాజాధిరాజులు ఆత్మవేత్తలు
వాసుదేవ - సంకర్షణ - ప్రద్యుమ్న
అనిరుద్ధ - పరమాత్మా - వందనమ్మని

ఋషభావతార - విరాడ్రూపుడా!
విశ్వనియంతా - నారాయణాయని
అనేకవిధముల సన్నుతింతురు
ఆపన్నుడని - కొలుచుచుందురు.

కలియుగమందు విరాడ్రూపుడు
నలుపువర్ణముతొ కృష్ణుడనబడి
ఆయనవెంబడి - ఆయుధా లమరి
సిరిసంపదలు - అనుసరించును

సాధుజీవనులు - వివేకవంతులు
అర్చన - కీర్తన - స్తోత్రమ్ములతో
ఆర్తత్రాణపరాయణ - దీనశరణ్యా!
అందుకొనుము నా నుతులను-స్వామీ!

ఆపన్నులను ఆదుకోవయా!
విఘ్నహరణ - ఓ - సౌఖ్యప్రదాతా!
బాధలుబాపే ఓ భగవంతా!
అంజలియిదిగో - అనంతమూర్తీ!

దివ్యపాదముల వందన మిదుగో
విశాలరాజ్యము విరాగిమాదిరి
పిత్రువాక్య పరిపాలన - పాలన
అన్నటు - వదలి - కదలితి వమ్మతొ

మూర్తీభవించిన ధర్మస్వరూపా!
ఆలివంకతో - పసిడి లేడికై
పరుగుతీసి-మరి-అసురులకూల్చిన
ధరణిభారము దింపిన దొరవి!

అనుచుభక్తిగా కీర్తించెదరు
ఆయా యుగముల ధర్మమ్ములకు
అమరిన - రూపనామమ్ములతో
వెలసిన శ్రీహరి - సౌఖ్యములిడును

రాజా! వినుమిది ప్రధానమైనది
నాల్గుయుగములలొ కలియుగమందు
ముక్తిని పొందుట - తేలికైనది
నామసంకీర్తన ఒక్కటిచాలును

సంసార జలధిని ఉక్కిరి బిక్కిరిగ
బ్రతికెడి జీవికి తరించు మార్గము -
తేలికైన ఒక రాజమార్గము -
నామస్మరణమది సులభమైనదది

కలియుగమందు పుణ్యతీర్థములు
కావేరి-తామ్రపర్ణి-కృతమాలమొదలగు
దివ్యనదులలొ స్నానము పుణ్యము
తర్పణాదులతొ పెద్దలు తరింత్రు.

ఋషభనందనులు విశదపరచిన
భాగవతధర్మమ్ముల కెంతో
ఆనందించెను నిమి - మహరాజు
దివ్య మునులకు పూజలు చేసెను

శుభమగుననుచు దీవనలిచ్చి
అంతర్ధానము నందిరివారు -
విరాగియై ఆ నిమి మహరాజు
కైవల్యమును పొందెను వింటివ!

అనుచు పలికెను నారదమౌని
ఓ! వసుదేవా! నీవుకూడను
అట్టిధర్మముల నాచరించుచు
భక్తిప్రపత్తుల హరిని కొలువుము

అందరిలోన మీపుణ్యమది
సాక్షాత్తు శ్రీహరి తనయుడయ్యెను
లాలనచేసి పెంచిన ధన్యత
కలిగెను మీకు - చరితార్థులయా!

అయినా ఆతడు తనయుడు అనుకొని
ఉదాసీనత మదిలో నుంచక
సర్వేశ్వరుడని సేవించవలె
అదిపరమార్ధము ముక్తిధామమిదు"

అని చెప్పగను భక్తిప్రపత్తుల
దేవకి వసుదేవులిద్దరు - అచట
మదిలోకృష్ణుని ధ్యానించుకొని
నమస్కరించిరి మనసునిండుగా

అంతటవారు తనయుని కృష్ణుని
తండ్రిగ - గురువుగ - దైవమ్ముగను
లోక పితగను - తలంచి నారు
పుత్రభావమును వదిలివేసిరి.

ఈ, యితిహాసము భక్తిశ్రద్ధల
వినిన - చదివినా - వ్రాసినకాని
పాప విముక్తితొ జ్ఞానకాంతితో
పరంధాముని కృపకు పాత్రులగు

తిరిగి అడిగెను రాజవరేణ్యుడు
శుకయోగీంద్రా - ధన్యుడనైతిని
శ్రీకృష్ణుని లీలలు తరగని నిధులు
తెలియబరచుము దయగొని నీవు

ఏప - పనులను స్వామి చేసెను
బలగర్వాంధులు ఐనయాదవుల
ఎటులహరించెను అనగా నంతట
ఆరంభించెను వ్యాసనందనుడు.

॥శ్రీ కృష్ణచరితము॥



## 3 బ్రహ్మాది దేవతలు ద్వారకకు వచ్చుట

యాదవులు బలగర్వంబుల
విర్రవీగెడి సమయములోన
ముసలము పుట్టుట వినిన కృష్ణుడు
ఆట కట్టునని ఊరడిల్లెను

ఆసమయములో బ్రహ్మాది దేవతలు
వైకుంఠము రమ్మని - కృష్ణుని కోరగ
ద్వారక కొచ్చిరి - కోలాహలముగ
హరినామసంకీర్తన చేయుచు వచ్చిరి

పరంధాముడు వచ్చిన పనియది
నెరవేరినదని తలంచి వారు
వైకుంఠమది కళదప్పినదని
స్వామినిరమ్మని ఆహ్వానించగ -

భూతగణములతొ. హరుడు వచ్చెను
మరుద్గణములతొ ఇంద్రుడు వచ్చెను
ఆదిత్య-వసువులు-కిన్నర-కింపురుషులు
పితృదేవతలు - విశ్వేదేవతలు

సిద్ధ - సాధ్యులు - చారణులున్ను
అచ్చర - గంధర్వులు మొదలగు
దేవగణంబులు వచ్చిరచటకు
విలువగు కాన్కలు - తీసుకువచ్చిరి

నందనవనపు - మందారములు
పారిజాత - సంతాన కుసుమములు
కల్పక - ప్రసవ - హరిచందన పల్లవ
పూలతొ కూర్చిన దివ్యమాలలను

బంగరు పళ్ళెములందు నిడుకొని
రంభాదులచే సురనాయకుడు
తెప్పించెనచటకు స్వామిసేవకై
సుమసౌరభముల-నిండెను నగరము

ద్వారకగాంచి బ్రహ్మాదులందరు
ఆనందముతో పరవశించిరి
వైకుంఠమది దిగివచ్చినటు
కనబడెవారికి కన్నులనిండుగ

నగర శోభను తిలకించుచును
తిన్నగజేరిరి కృష్ణసౌధమును
పరంధాముడు దర్శనమిడెను
స్వర్ణపీఠమున కనబడెస్వామి

దివ్యమాలలు కంఠసీమను
అలంకరించి వందనమిడిరి
వారందరికీ స్వాగతమ్మిడి
ఆసనాలను గ్రహించమనెను.

అంతటవారు - భక్తిప్రపత్తుల
నిలబడియుండిరి - వారిలో బ్రహ్మ
పరవశమ్మున నుతించె నిటుల
పాదపద్మముల వందనమనుచు -

"ముముక్షువులు నినుధ్యానించుచును
పురుషోత్తమునిగ నమ్ముకొనుచును
మనోపీఠమున ప్రతిష్ఠింతురు
కానీ వారికి దర్శనమందదు

నేడు మేము మరి ధన్యులమైతిమి
నీదర్శనము లభించె మాకు
ధన్యులమైతిమి దయాసాగరా!
నీ లీలలవి అనంతమ్ములవి

త్రిగుణాత్మకమగు మాయతో నీవు
సృష్టిస్థితి లయ కారకునిగా
వ్యక్తమయ్యెదవు - కానీ నీకు
ఆగుణములవ్వి అంటనె అంటవు.

ఎంతవిన్ననూ ఎంత చదివినా
నీపైభక్తి లేకపోయినచో
నిష్ప్రయోజనము జ్ఞానమంతయు -
నీ అనుగ్రహము అందుట - ధన్యత

యజ్ఞపురుషునిగ నినుభావించి
ఆరాధకులు చేతురుయజ్ఞము
అంతటి ఘనుడవు ఓ! నారాయణ
నీపాదమ్ములకు వందనమ్ములివె

కంఠసీమను అలంకరించిన
వనమాలయది నీకుప్రియమగు
నీపదయుగళము ఇడుమలుబాపి
మాకు క్షేమము కలిగించవలె

త్రివిక్రమునిగా మూడులోకములు
కొలిచిన పాదము పరమపదమయా!
త్రిపథగామియగు గంగ పుట్టిన
పాదము గాంచి ధన్యులమైతిమి

ఓ పురుషోత్తమ! మా అందరినీ
సత్క్రమమార్గమునందు చరించగ
ఆదేశించే అభయప్రదాతా!
నీదర్శనమున పాపముతొలగును

ప్రకృతి - పురుష-మహాతత్త్వముల
నడిపించెడిదీ నీవే స్వామీ!
జీవశక్తివి - జీవకోటికి
జగన్నాటక సూత్రధారివి.

పదారువేల పడతులు ఆపై
అష్టమహిషులు కలిగిన దేవా!
విజితేంద్రియుడవు మాయకులొంగవు
నీలీలలు కథలు అమృతత్త్వమిడు"

అనుచు నుతించుచు బ్రహ్మపలికెను
"మాకోరికను మన్నించుచును
భువిలోపుట్టి పురాణపురుషా!
ధరణిభారముదించినాడవు

చాలాకాలము గడచిపోయినది
వచ్చినపని యది నెరవేరినది
యదువంశమ్మిక మునిశాపమునకు
అంతమైనటు తలంచవచ్చును

కావునస్వామీ దయగొనినీవు
స్వస్థలమైన వైకుంఠమునకు
విచ్చేయుమయా! అని ప్రార్థించుచు"
పదములంటిరి పరంధామునికి

పురుషోత్తముడు ప్రీతిగ పలికెను -
మీరుచెప్పినది సత్యమైనది
కానీ నేనిట గర్వాంధులను
సమూలమ్ముగ తుడిచివేతును

మునిశాపమది ఆరంభమగు
ఆపైపనిని చక్కబరచుకొని
వచ్చెదననగా" వారందరును
ఆనందముగా మరలిపోయిరి

అతిత్వరలోనే ద్వారకయందు
అనేకమైన ఉత్పాతములు
అగబడి అందరు కలవరపడిరి
గుడ్లగూబలు కాకులు ఏడ్చుచు -

గుంపులుగుంపులు - గృహములపైన
వాలుచున్నవవి - అశుభసూచనగ
అశ్వపుతోకలు - అగ్నిలేకనే
అంటుకు - మంటలు మండుచున్నవి

ఉడికెడిఅన్నము పొంగిపోయి మరి
నిప్పులోపడి అట హుతమయ్యెడిది
చిలుక శారికలు పలుకులు మాని
అపభ్రంశముగ కూయసాగినవి

సంకర జంతువులుద్భవించినవి
రవిబింబమది మసిబారెడిది
అందరి ముఖములు కళదప్పినవి
కృష్ణునికంతయు చెప్పగవచ్చిరి

వారువచ్చిన పని గ్రహించుచు
ఆసనమ్ములకూర్చొన జేసెను
పలుకక ఉలుకక యుండిరివారు
కృష్ణుని నవ్వులు – చల్లగలేవు

"కృష్ణుడుపలికెను యదువృద్ధులతో
వచ్చినవిషయము నాకు తెలియును
ఋషి శాపమునకు తిరుగులేదిక
ఇచ్చుట ఏమియు రక్షణలేదు.

బ్రతకదలచిన – ప్రభాసతీర్థము
జేరి అచ్చట పితృదేవతల –
భూదేవతల – ఆరాధించి
దానధర్మములు దండిగ చేయుచు

అటులచేసిన గండము గడిచెడి
త్రోవదొరకును – ఆ తీర్థమున
దక్షుని శాపమునందిన చంద్రుడు
స్నాన దానముల – తేజమునందెను"

ఆమాటలతో వారందరును
ప్రభాసతీర్థము ప్రయాణమైరి
అంతట కృష్ణుని గాంచి ఉద్ధవుడు
నమస్కరించి పలికెను భక్తిగ

"స్వామీ నీవు విప్రశాపమును
తప్పించగల సమర్థుడవు మరి
యదువంశములను తుదముట్టించి
వైకుంఠమునకు జేరు యత్నమిది".

చిరునగవులతో కృష్ణుడుచూడగ
తిరిగి పలికెను ఉద్ధవుడచట
"స్వామీ! నీతోగడపిన కాలము
మధురమైనది మరపురానిది

హితునిగ సఖునిగ ప్రాణసమునిగ
గురువు, దైవము, పురుషోత్తమునిగ
నీతో గడపుచు నినుపూజించుచు
సంసార బాధలను మరచిపోతిని

నీ చూపులలో – నీ పలుకులలో
స్వర్గసౌఖ్యములు అనుభవించితి
నీ కరస్పర్శ తనుపులకింతతో
ఆనందసీమలో విహరించితిని

ఉద్ధవా! అని పిలచిన పిలుపు
ప్రకృతి తానే పిలచినట్టుగా
మారుమ్రోగెడిది – దిశలయందున
నాహృదితంత్రిని చల్లగమీటును

అప్యాయముగా సరసన కూర్చొను
అర్హత నాకు కలిగించితివి
సంసార విషయములు నాతో నీవు
ముచ్చటించుచు మన్నించితివి.

యాదవులందరిలోన నాది మరి
ప్రత్యేకస్థానమని మురిసిపోదును
నీతలపులు – నా ఊపిరి స్వామీ!
నీ కథలు, లీలలు, తరగని నిధులు.

కానీ - నన్ను బాధల మయమగు
పాపపులోకమునందున వదలి -
నీత్రోవను నువ్వు సాగిపోదువా!
ఎంతకాలమీ తనువు మోసెదను

మాగతి ఏది మనుజపుంగవా!
ఉద్ధరించుటకు మార్గముచూపుము."
అనుచు ఉద్ధవుడు కన్నీరిడగా
కంటినీటిని తుడిచె కృష్ణుడు.

॥శ్రీ కృష్ణచరితము॥



## 4 శ్రీ కృష్ణుడు ఉద్ధవునకు పరమార్థోపదేశము చేయుట

చల్లని పలుకుల పలికె కృష్ణుడు
"ఉద్ధవా! నీవు వంతనొందకుము
కారణార్థమై వచ్చినపనియది
నెరవేరినది నేనిట వుండియు

చేయదగిన పని ఏమియులేదు
సాధుకోపముకు గురియైనదగు
యదువంశమ్మది అంతరించును
అతితొందరలో జరుగును వినుము

నేటికి ఏడవ దినమున సంద్రము
పొంగిపొరలి ఈద్వారకనంతను
తనలో కలుపుకు - తుడిచిపెట్టును
కావున నీవిట నుండగవలదు

నేను వెళ్ళిన వెంటనె - కలి - తను
విజృంభించును - ఆపనశక్యము
నీబంధువులను-మమతలు త్రెంచుకు
భూసంచారము చేయుము నీవు.

తీర్థస్నానములు ఆచరించుచు
మనస్సు నాలో లగ్నము చేయుము
కనబడునట్టిది అశాశ్వతమ్మని
మాయామయమని తెలివితెచ్చుకో!

అర్థకామముల దాసుడు అగుచు
గుణముల పరిధిలొ చరించుచుండు
పురుషుని జ్ఞానము నిరుపయోగము
ముక్తి - వానికి దూరము అగును

మావటివాడు మత్తగజమును
లొంగదీసినటు ఇంద్రియాలను
మనోవికారముల ఈషణత్రయముల
అదుపులొనుంచుకు వివేకమ్ముతో

సుఖదుఃఖములకు దూరము అగుచు
సమబుద్ధిపెంచుకొని జగమంతయును
ఆత్మమయమని గ్రహింపుకలిగి
నీలోనిన్నే ప్రతిష్ఠించుకో!

విశ్వమంతయు నేనే అనుకొన
ఆత్మానందము ననుభవింతువు -
ముక్తి మార్గము సుకరముఅగును"
అనగా పలికెను ఉద్ధవుడచట

"యోగీశా నువు చెప్పిన యోగము
నావంటివారికి సామాన్యులకు
అనుసరించుటకు సాధ్యము అగునా!
నీమాయనుండి మరి వెలికివచ్చుటెటు?

గృహస్థులకైనను యతులకైనను
నీ నామస్మరణమే తరుణోపాయము
నందనందనా నీవేదిక్కని
ఆశ్రయించితి అనుగ్రహించుము

నీ చరణ సరోజములందుకొంటిని
ఆనందాబ్ధిని ఓలలాడితిని
నిజముగ నిన్ను గ్రహించగలిగిన -
కోరికలన్నవి - హరించిపోవును."

ముదముగ పలికెను ముకుందుడంత
"సమర్థులైన మునిపుంగవులు
ఆత్మజ్ఞానమున సాధనచేసి
ఉద్ధరించుకొన సమర్థులగుదురు

పురుషుని గురువు - ఆత్మ ఒక్కటే
అంతకుమించి లేరు మరెవ్వరు
సాంఖ్యయోగమున సాధకులందరు
నన్ను పురుషునిగ భావించెదరు

జీవకోటిలో మనుజులు శ్రేష్ఠులు
మనుజరూపమున పురుషోత్తమునిగ
నేనుందునయా! బుద్ధిమంతులు
ఈశ్వరుని గను ఆరాధింతురు

మానవులందు - ధ్యాననిష్టతో
నన్ను వెదకెడి - యోగులు యోగ్యులు
అనుమాన దృష్టితో సత్వమూర్తిగా
భావన చేయుచునుందురు కొందరు

జీవుడు దేవుడు ఒకటే అనుకొని
శంఖచక్ర గదా ఆయుధాలతో
ఆభరణమ్ముల రూపము ధ్యానించు
సాధకులందరు - పరమయోగులు.

ఈసమయములో ఉచితము ఐన
పాచీనమగు ఇతిహాసమ్ము
అవధూత యదు సంవాదమ్ము
వినిపించెదనని ఆరంభించెను."

॥శ్రీ కృష్ణచరితము॥



# 5 అవధూత - యదు - సంవాదము

"మావంశకర్తయగు యదువువద్దకు
అవధూత ఒక్కడు వచ్చెను-అతనిని
యథావిధిగను పూజించి భక్తిగా
అడిగెను యదువు ఓ! పుణ్యాత్మా!

మహాజ్ఞానివి-ఆత్మవిద్యావిశారదుడవు
అన్నటు - నిన్నుచూడగ తెలియును
అన్నీవదలి ఏమీతెలియని
పసివానివలె తిరుగుచుంటివి -

కోర్కెలులేవు - కలిమి గ్రహించవు
మితభాషివి నువు సంతుష్టుడవు
లోకవిరుద్ధపు నడవడి ఎటుల
అలవడె నయ్యా! ఆశ్చర్యమది

తాపత్రయముల కామ్యవాసనల
సతమతమయ్యే ఈలోకములో
ప్రశాంతమూర్తివి విరాగివైతివి
ఎటులకలిగెను నీకీ భాగ్యము?

అంతట పలికెను ఆ అవధూత
ఆత్మజ్ఞానమున ఇటు చరించుటకు
నాకు గురువులు ఎందరెందరో
ఇరవైనాలుగు సంఖ్యలొ వుండిరి

నింగీ నేలా నీరూ వాయువు-సూర్యచంద్రులు
అజగరము మరియు పావురమ్మును
సంద్రము-ఏనుగు-భ్రమరము-లేడి
చేపా - పాము - తేనెటీగయు

అటుల గురువులుగ భావించుకొని
విజ్ఞానమ్మును గ్రహించినాను
ధీరత్త్వమది ప్రధానమైనది
పురుషుడు దానిని వదలగరాదు

[illegible]గాని చెట్టు సుఖములిడు
[illegible] ఒర్పు నేర్పును
అటుల పురుషుడు ధీరుడుగావలె
అతడే సాధువు అనబడునయ్యా!

భూమినుండి - నే ఓర్పుగ్రహించితి
గుణదోషములకు లొంగని ప్రవృత్తి
వాయువు వలన గ్రహించినాను
పుష్పవాసనకు చిక్కదు వాయువు

వాయువునకు మరి లొంగని నింగి
గంభీరముగా నిలబడియుండును
అటులే స్థావర జంగరమ్ములలొ
నీలో - ఒకటే బ్రహ్మము గలదు.

సహజ రుచియు మరి నిర్మలత్వము
ఆర్ద్రత - పవిత్రత - జలముల సొత్తు
వాటిని నేను గ్రహించ గలిగితి
చెప్పక చెప్పే బోధనలవ్వి

ఆరాధకుల శ్రేయముకోరి
హవిస్సుగొనును అగ్నిదేవుడు
సర్వపాపముల భక్షకుడాతడు
పావకుడందురు - అతడొక గురువు

నిర్మలత్త్వమున మనుగడ గడపుచు
ఆశ్రయించినవారి పాపములు
క్షాళనచేసే వాడు యోగి యగు
అట్టియోగము - నేర్పెను అగ్ని

పెరుగుట తరుగుట చంద్రకాంతికే
చంద్రమండలము పెరగదు తరగదు
పుట్టుట గిట్టుట దేహమ్మునకే
ఆత్మకు గాదని చంద్రుడు నేర్పెను

సూర్యుని వలన కలిగెను జ్ఞానము
దానివలన మరి నిశ్చలత్వము -
గుణాతీతముగ యోగిగ మెలగుట
అనెడి విషయము గ్రహించినాను.

సూర్యబింబము నీటిలో కనబడు
ప్రతిబింబమది కనబడువరకే!
నిజముగ సూర్యుడు వేరుగనుండును
ఈభావమును సూర్యుడు తెలుపును

అంతియె గాక పావురమ్ముతో
తెలిసితి ఎంతో విలువగు విషయము
శ్రీకారణ్యమునందున చెట్లలో
విస్తరించిన మర్రి కలదట

మర్రి చెట్టుపై కపోతజంట
ఆనందముగా గడపసాగెను
మగపావురము పెంటిని చూచి
పరవశించును ప్రాణమనుకొను

అంతటి ఆప్యాయముగా జంట
గడుపుచుండగా - పిల్లలు కలిగిరి
పుట్టిన పిల్లల చూచుకు - జంట
ఆనందములో తేలియాడినది

వారేస్వర్గము వారే బ్రతుకు -
అన్నధ్యాసతో జంటపక్షులు
పిల్లలసాకుచు పరవశించుచు
ఆనందముగా గడపసాగిరి

అంతటిలోన బోయ ఒక్కడు
పక్షులగాంచి ఉచ్చుపన్నెను.
పక్షులజంట బయటకు పోయెను
పిల్లపక్షులు పడెనా ఉచ్చులొ

పావురమ్ముల జంట వచ్చినది
జరిగిన దానికి విలపించినవి
భరించరాని ఆవేదనతో
తల్లిపావురము వలలో పడెను.

అంతటమిగిలిన మగపావురము
విలపించి అలసి మరి - మదిలోతలచెను
ఒంటరిబ్రతుకు వ్యర్థము అనుచు
తనుకూడా మరి వలలోపడెను.

దీనినిబట్టి గ్రహింపుకలిగెను
భవబంధములో పడినవాడు మరి
కాలబంధమున చిక్కడిపోవును
రెంటికి చెడ్డ రేవడి అగును

మోక్షఫలితమిదు మానవజన్మలో
మోహపాశముల ముడి వడిపోయి
కపోతజంటగ ఇహపరములకు
చెడిపోవుటది నిశ్చయమ్ముగద!

రుచులనెంచక సారమెంచక
ఎక్కువతక్కువ అన్నదెంచక
అనాయాచితముగా లభించినంత
ఆహారముతిని - బ్రతుకు అజగరము

అందినదే తిని సుఖముగ పడుకొను
కొండచిలువ వలె భోజనాదులలో
తృష్ణ - మోహము - వదలును యోగి
అది తెలిసితిని - అజగరమ్ముతో

కాలానికి తా కట్టువడకను
ఇంద్రియాలకు లొంగిపోకను
నిద్రాద్యవస్థలు వదలివేసి మరి
కోర్కెలు లేని వాడు - మునియగు

ఎన్ని నదులవి వచ్చికలిసినా -
బడబానలమది - కడుపులోనున్నను
గంభీరముగా కనబడు సంద్రము
ఆ గుణములవి - సింధువు నేర్పెను

దేవమాయయే స్త్రీయని తలచి
బుద్ధిమంతుడు లొంగక నిలచును
వాటికి లొంగిన కృంగును అన్నది
మిడుతవల్లను తెలిసితినయ్యా!

భ్రమరము ఎంతో మెళకువగాను
పూలనుండి తా మధువుగ్రహించును
వాటిని ఎంతయు బాధపెట్టదు
రేపటి రోజుకు - కూడబెట్టదు.

రేపటికే గతి కలుగునోయని -
తేనెటీగ మరి కూడబెట్టుకొని
పట్టుతొ తాను చచ్చిపోవును
ఆ శాపాశము వలదని తెలుపును

స్త్రీప్రసంగము మమకారమ్ముల
లొంగినవాడు ఊబిలొదిగును
అదిగ్రహించిన బుద్ధిమంతుడు
మదిలోనైనా తలచడు వారిని.

అనుభవించక ధనమునుదాచిన
లుబ్ధుడు - దానికి సంరక్షకుడే -
దొంగలకో మరి దొరలకొ దొరికి
అనుభవింతురు - లుబ్ధునిధనము

ధనముదాచుట తగనిది అగును
గృహస్థు ముందుగ - బ్రహ్మచారికో
యతీశ్వరునికో నివేదించిన
ఆహారమును గ్రహించవలెను

అటులచేసిన ఫలితము నిడును
గృహస్థాశ్రమ ధర్మము తాను
నిర్వర్తించిన వాడగునాతడు
కానిచొ - ఆశ్రమధర్మ లోపమగు.

ఆడగాలితో ఋష్యశృంగుడు
చలించినట్టుగ ఎంతటి తపస్వి
అతివల వలలో చిక్కుట తథ్యము
యతి - మనస్సు గతి - మార్చగరాదు

మభ్యపెట్టెడి గీతమ్ములను
యతి తా వినిన - గాడితప్పును
వేటగాని సంగీతము - విని
వెఱ్ఱి లేడి - తా - ఉచ్చులొపడును.

ఆ విషయమును లేడివల్లను
గ్రహించినాను - గురువుగ నెంచి
ధనాశ దుఃఖము అన్నవిషయము
గ్రహించినానొక - వేశ్యవల్లను.

మిథిలానగరమునందొక వేశ్య
పింగళ - అనెడి సుందరవదన
తళుకు బెళుకులతొ పురుషుల జేర్చి
ధనార్జనమ్ము చేయసాగెను

సంపాదన అది పరమధ్యేయమై
అనుభవించుటకు సమయములేక
కూడబెట్టెను విశేషధనమును
కాలవశమున ఆరోగ్యముచెడె

కాలు కదపని స్థితిలోపడినది
వచ్చిన పురుషుని పలుకరించెడి
శక్తిలేకను నీరసపడినది
అవసాన దశలో – జ్ఞానోదయమయె

ఓసర్వేశ్వర! పాపిని నేను
ఎందరిబ్రతుకులొ బుగ్గిచేసితి
కులకాంతలెందరినొ ఏడిపించితి
కండకావరము కళ్ళుకప్పినది

ఒక్కక్షణమ్ము దేవుని తలచక
నిరర్ధకంబుగ బ్రతికితి నేను
పాపపంకిలము క్షాళనకొరకు
నీవేగతియిక – పదములబడితిని

ఆదరించుము అనాధనాధా!
అనుచు నిరతము – నామస్మరణతో
అహర్నిశము శ్రీహరిని తలంచుచు
అందుకొన్నది పరమ పదమును.

ఓ మహరాజా! ఒకబాలిక తను
నిశ్చలగురికి ప్రతిగా నిలచెను
‘కలకావతి’ యను నగరమందున
బ్రాహ్మణ గృహస్తుకాపురముండెను

ఆయన కూతురు చక్కని చుక్క
ఆ బ్రాహ్మణుడు అతి నిరుపేద
అందాల భరిణ గుణశీలములు
అందరికీ మరి పూర్తిగ తెలుసును

ఆమెను కోడలు చేసుకొనుటకు
అడగవచ్చిరి పెద్దలు అటకు
ఆ బ్రాహ్మణుడు వారిని ప్రియముగ
ఆతిధ్యమును గ్రహించ కోరెను

వచ్చినవారు మర్యాదస్తులు –
ఆతిధ్యమునిడ స్తోమతులేని
బీదబ్రాహ్మణుడు – అతికష్టముతో
కొంతధాన్యమును సేకరించెను

ధాన్యము – తనయకు యిచ్చెను తండ్రి
వాటిని దంచి వంటచేయవలె
రోటిలొవేసి దంపసాగెను
గాజుల శబ్దము వినబడుచున్నది

ఆ శబ్దము అట పెద్దమనుషులకు
వినబడునన్న సిగ్గుతొ – బాలిక
ఒక్కొక గాజే – పగులగొట్టెను
ఒక్కటి, వుంచుకు దంచసాగెను.

ఒక్కగాజుతో – శబ్దమురాదని
నిష్టగ తనపని పూర్తిచేసెను
అటుల మనస్సును లగ్నముచేయుట
నేర్చుకొంటినా బాలికవల్లను

సత్వగుణమును పెంచుకోవలె
రజో తమముల చంపుకోవలె
స్థిరచిత్తముతో లక్ష్యసాధనతొ
పరమాత్మదర్శనము చేయగ నగును

బాలునివల్ల నిర్విచారము –
వేటగానితో చెదరని నిష్ట –
ఫణితో – పరగృహవాసపు ముప్పు
సాలెపురుగుతో సంసారత్యాగము

నేర్చినాడను ఓ మహరాజా!
వారందరును కర్మయోగులే
కందిరీగ మరి లక్ష్యపుగురిని
లక్ష్యగత జ్ఞానము నేర్పును

రాజా! రిపులు మనలోగలరు
అరిషడ్వర్గములన్న రిపులను
జయించుయత్నము చేయగవలెను
అదిప్రధానము మనిషి మనుగడకు

మోక్షసాధనకు భోగము కుదరదు
అడవుల గిరులలొ సంచరించుచు
దొరికిన దానిని భుజించుచుండి
జితేంద్రుయుడుగా చరించవలెను.

ఈశ్వరకల్పిత మాయకులొంగక
ఈశ్వరార్పిత మనస్సుకలిగిన
ఈశ్వర పదమును చేరును రాజా!
అనుచు యదువుకు చెప్పె నవధూత"

యదువుచె నాతడు పూజలనంది
తనత్రోవను చనె – ఆ అవధూత
అనుచు చెప్పి అట శ్రీకృష్ణుండు
ఉద్ధవునితొ నిటుచెప్పదొడంగెను

"ధర్మచింతనతొ అప్రమత్తుడై
అనిశము నన్ను ఆశ్రయించుకొని
కోర్కెలనుండి బయటకువచ్చి
అధ్యాత్మసాధన చేయగవలెను

నిత్యనైమిత్తిక కర్మలు చేయగ
ఆరాటపడి చేయుటకన్న
నన్నుపూర్తిగా నమ్మినచాలును
వలయు ఫలమును ఒసగెదనేను

సుఖదుఃఖములు మానావమానములు
భార్యా పుత్రులు గృహ భోగముల
అంటనట్టుగా వర్తించవలె
మెల్లగ విముఖత పెరుగును వానికి

అపై వానికి దేహముపైన
మమత తగ్గును అంతటిలో మరి
గుణప్రభావము తొలగిపోవగా
ఆత్మజ్ఞానము వికసించును విను

ఉద్ధవా! విను దేహధారికి
సుఖమున్నది లేనే లేదు
సుఖమున్నదని భ్రాంతిలోపడ
దుఃఖమ్ములను ఆహ్వానింతురు

అహంకారమున అస్నీతనుయని
అన్నిభోగముల అమరియున్నవని
అనుకొని వారే మోసపోదురు
అసలు విషయము గ్రహించలేరు

నోరుతెరచుకొని వెనుకనువచ్చు
మృత్యువునసలే గ్రహించలేక
సుఖముల కొరకై ఎగబ్రాకెదరు
వధ్యశిలపై నున్నటు తలచరు

దేవతలను మరి తృప్తిపరచుటకు
యజ్ఞయాగములు చేసినవారు
అమరసుఖములు అనుభవించి మరి
ఫలితము తీరగ - భువిని పుట్టెదరు

అమరసుఖములవి - పుణ్యఫలములు
పుణ్యక్షీణతతొ - తిరిగి పుట్టుటే -
పుట్టుట-గిట్టుట వలయమునందున
చిక్కుకొందురు ఆశలచిక్కి.

అట్టిసుఖమది చివరకు నరకము
అట్టిదానికై పశువులచంపి
భూతప్రేతముల నాహ్వానించి
హింసలోదిగి క్రతువులుచేతురు.

ధనాశతో మరి యజ్ఞయాగములు
చేసిన - చేయించిన వారిద్దరునూ
పొందుటచివరకు నరకమేనయా!
ఆశలోపడి భ్రష్టులగుదురు.

దహింపబడునది దేహము - అట్టిది
శాశ్వతమనుకొని - మూర్ఖులగుదురు
లోకపాలకులు - చివరకు విరించి
లయమగువారే - కాలగర్భమున.

ఉద్ధవా! విను కాలము నేనే -
ఆత్మయు ధర్మము లోకము నేనే -
అది తెలిసినచో జ్ఞానియగునయా!"
అంతట అడిగెను కృష్ణుని భక్తిగ

ముక్తుడు - బద్ధుడు ఇద్దరుగలరు
వారిద్దరిలో ఆత్మఒక్కటే
అయినచో మరి గుణప్రభావము
ఏలకలుగునో తెలుపుము స్వామీ!

అనగా కృష్ణుడు విశదపరచెను
"బంధ - మోక్షములు ఆత్మకు లేవు
మాయాజనితము త్రిగుణమ్ములవి.
మాయయు జ్ఞానము నాసంకల్పము.

మాయతొ వికారము లుండవునాకు
భవబంధమది స్వప్నమువంటిది
అంత ఎందుకు బంధ - మోక్షములు
నా సంకల్పము వల్ల జరుగును

నా అంశయగు జీవునికిలలో
జ్ఞానముతో మోక్షమ్ములభించును
అజ్ఞానముతో భవబంధములగు
బంధమోక్షముల విశదపరచెదను

జీవేశ్వరులు రెండుపక్షులు
దేహ వృక్షమున-హృదయపు గూటిని
ఆశ్రయించుకొని - వుండెడి వవ్వి
జీవ పక్షికే కర్మల ఫలములు

సుఖదుఃఖములను కర్మఫలితము
జీవపక్షి తా ననుభవించును
ఈశ్వర పక్షికా ఫలములులేక
ఆనందములో మునిగి యుండును

మాయకు బద్ధుడు నిత్యబద్ధుడగు
మాయాతీతుడు నిత్యముక్తుడు
దేహమునాత్మగ తలంచువారు
కర్మఫలములు అనుభవించెదరు

ముక్తజీవుడు దేహధారియై
నిజముగ అందులో లేనటులుండును
జ్ఞానరహితుడు లేని దానిని
ఉన్నటు తలచి-యిడుములబడును

గుణవికారముల లొంగిపోకను
కోర్కెలవలలో చిక్కుకొనకను
పొంగక కృంగక నిశ్చల మనసుతొ
నిత్యముక్తుడు ఎరుకతొ నుండును.

పరులహింసలకు బాధపడకను
ప్రతిక్రియ చేయగ తలంపులేకను
వేదకర్మలు దేహకర్మలు
చేయగ తలచడు బంధముక్తుడు

లాభనష్టముల లెక్కచేయడు
తనదైన యోగము అవలంభించి
సర్వసమునిగా మెలగునాతడు
విజ్ఞతలేని జ్ఞానము వ్యర్థము

గొడ్డుటావుయు - చెడుఇల్లాలును
అవివేకులగు సంతానమ్మును
అపాత్రదానము చేసిన ధనము
ఇతరుల పోషణనుండెడి తనువు

ననుకీర్తించని నాలుకయున్న -
ఇహ పరములలో దుఃఖమేయగు
సకలకర్మలు విడచి - నమ్మి నను
కొలిచెడి జ్ఞాని - నన్ను చేరును.

సనాతనుండను భక్తవశుండను
నాగాథలవి లోకపావనము
వాటిని వినుచు ఆనందించుచు
అర్చించినచో ఫలితములభించు

అట్టివారు మరి కర్మలేవియును
ఆచరించగ పనియేలేదు
కర్మలుచేసిన నాపరమనుకొను
భక్తి శ్రద్ధలు దివ్యమార్గములు."

అంతట అడిగెను ఉద్ధవుడచట
స్వామీ! భక్తుని లక్షణమేది
భక్తిమార్గములు ఎట్టిదొ తెలుపుము
నారదాదుల భక్తిఎట్టిది?

బదులుగ పలికెను భగవానుండు
పరులకష్టముల సానుభూతి యు
అపకారినైనను సహించువాడు
సత్యవ్రతుండు అసూయరహితుడు

హితుల అహితుల సమముగచూచి
పరోపకారము చేయువాడును
జితేంద్రియుండై కోర్కెలచంపుకు
సదాచారుడు శుద్ధమనస్కుడు

మితాహారి మరి శాంతస్వభావుడు
లౌకిక - అలౌకిక కోర్కెలు లేక
అచంచల భక్తి కలిగిన వాడు
నన్నేశరణని కోరినవాడు

నాగాథలతో గడిపెడివాడు
అప్రమత్తుడు - నిర్వికారుడు
ఆపదలందు ధైర్యవంతుడు
ఆకలిదప్పులు జయించువాడు

జరామృత్యువుల జయించువాడు
సత్కారమ్ములు కోరనివాడు
ఇతరుల తాను సత్కరించెడి -
విషయబోధన సమర్థుడున్ను

మోసమెరుగని సహృదయుండు
దయాపరుండు తత్త్వవేత్తయు
చిత్తమాలిన్యము లేనివాడును
దోషమ్ములను తెలిసి - వదలిన

మనుజులందరూ - నాభక్తులయా!
భక్తివిరుద్ధము అగునవి వదలి
నిశ్చలభక్తితొ నన్ను స్మరించి -
ఆరాధించిన - నా భక్తుడగు

భక్తిలక్షణము లివి విను ఉద్ధవా!
నారూపమును ప్రతిమలుగాను
పూజించుటయు ఆరాధించుట
నాభక్తులను సందర్శించుట

నాభక్తులను పూజించుటయు
ప్రియమగు దానిని నాకు ఒసగుట
సేవగ తనువును అంకిత మిడుట
నా అవతారములను స్మరించుట

గీత - వాద్య - నృత్యమ్ములసేవతొ
పుట్టిన రోజు నాకు జరుపుట
సంతర్పణలు జరుపుట - భక్తిగ
నన్నుదేవునిగ భావించుటయు

ఏకాదశి ఉపవాసదీక్షలు
పూల - పండ్ల తోటలు పెంచుట
ప్రాకారములు - నిర్మించుటయు
ఆలయాలను శుభ్రపరచుట.

చక్కగ ముగ్గులువేసి అచ్చుట
దీపారాధన చేయుట మొదలగు
పనులు భక్తికి - తార్కాణములు
గుప్తదానములు చేయుచుండవలె.

నాకైచేసిన దీపారాధన
అతి పవిత్రము కావునదానిలో
రెండు జ్వాలలు వచ్చునట్టుగా
రెండువత్తులను వేయుచుందురు

నాకు నివేదన చేసినట్టిది
నాకొరకై మరి వాడగవలెను
భక్తిశ్రద్ధలతొ ఇచ్చినట్టిది
వారుగ్రహించుట సరియగునయ్యా!

వినియోగించిన దీపారాధన
వాడినయట్టి ప్రసాదమ్మును
తిరిగి నాకు మరి వాడగ రాదు
శ్రేష్ఠమైనదే నాకు పెట్టవలె.

శాస్త్రవిహితమగు పదార్థమ్మును
నివేదించిన - అనంత సుఖమిదు
సూర్యుడు, అగ్ని, వేదపండితుడు
గోమాత మరి విష్ణుభక్తులు.

నింగీ - నేలా - వాయువు-జలము
ఆత్మయు మరియు భూతకోటియది
నాదగు పూజాస్థలములు అగును
వేదవిధిగను సూర్యునియందు

అగ్నియందున హవిస్సుచేత
అతిథ్యముతో వేదవేత్తలను
తృణాదులతో గోసంపదను
భక్తి సత్కారము విష్ణుభక్తులకు

హృదయాకాశమునందు ధ్యానమున
వాయువునందు ప్రాణబుద్ధితో
జలమ్మునందు మరి గంధపుష్పాదుల
నేలయందున మంత్ర జపము[illegible]

భగవంతునిది దేహముఅన్న
భావన - ఆత్మలొ చేయుచునుం[illegible]
భక్తిప్రపత్తుల పూజించవలె
సర్వప్రాణుల నన్నుగాంచవలె

నేనుడివిన ఆ ప్రదేశమ్ములలొ
శంఖ చక్ర[illegible]ధారినగు
చతుర్భుజముల శాంత మూర్తినగు
నన్నావాహనచేసి - కొలవవలె

యజ్ఞయాగాది కర్మలతోను
అన్నదానముల నిర్మలమనసుతొ
నన్నర్చించిన వారందరికి
సుస్థిరమైన భక్తికలుగును.

సత్సంగముల కలుగు ప్రశాంతత -
చెదరని భక్తి - నన్ను జేర్చును
అవి కొరవడిన ఫలితములేదు
జ్ఞానముకన్నను - భక్తియె మిన్న

ఉద్ధవా! విను! యోగ మార్గము
వేదము తపస్సు సన్యాసమ్ము
వైదిక కర్మలు - దాన జపములు
యజ్ఞయాగములు ఉపవాసములు

తీర్థయాత్రలు - నియమ - నిష్ఠలకు
ఎంతమాత్రము వశుడనుగాను
సంగ రహిత మొనరించు సత్సంగము
నాకు ప్రియమగు - వశుడనగుదును

రాజస తామస ప్రవృత్తులైన
దైత్య రాక్షసులు ఆయా యుగముల
పరిశుద్ధులై నను పొందగలిగిరి
గంధర్వులు సిద్ధులు అటులేపొందిరి.

నాగులు కిన్నెర అప్సరసలును
విద్యాధరులు మృగములు పక్షులు
అపండితులును జ్ఞాన హీనులును
సత్సంగముతో - నన్ను చేరిరి.

వృత్ర - ప్రహ్లాద - బలి-బాణులును
మయుడు విభీషణ వృషపర్వుండు
సుగ్రీవ-హనుమంత-జాంబవంతులు
గజేంద్ర-జటాయువు-ధర్మవ్యాధుడు.

కుబ్జ - నందుడు - గోపికలున్ను
మునిపత్నులును - వీరందరును
సత్సంగముతో - నాకు యిష్టులై
నా సాయుజ్యము పొందినారయా!

యజ్ఞ - యాగములు-జపతపాదులు
ఆచరించక - వేదము చదువక
కేవలమొక్క సత్సంగమార్గమున
నన్నుపొందిరి వింటివిగాదా!

శృంగార రస అనురాగ చిత్తులై
సేవించి తరించిరి గోపకాంతలు
వాత్సల్యముతో గోవులు మరియు
సాంగత్యముతో గోవర్ధనాదులు

నాపదస్పర్శతొ బృందావనమున
తరువులు తీవలు లతాకుంజములు
కాళీయాది సర్పమ్ములు మరియు
మూగజీవులు - సేవతొ గెలిచిరి

అక్రూరుడు నన్నూ నా అగ్రజుని
మధురకుగొని-తా-సాగు సమయమున
అనురాగ వియోగ దుఃఖతప్తులగు
గోపకాంతల స్థితిని తలచిన

ఆనంద పారవశ్యము కలుగును నాకు
ఎన్నియజ్ఞములు చేసినగాని
ఆస్థితి కలుగుట అసాధ్యమయ్యా!
అందులకంత దగ్గరయ్యిరి

మనస్సు నాలో లగ్నముచేసిరి -
దేహబుద్ధిని మరచిపోయిరి
నావియోగమున అచేతనమ్ముగ
మూగజీవులైపోయిరివారు

పరమాత్మ ఎడలగల భక్తి ప్రపత్తులు
అనురాగ వార్నిధిగ పొంగి పొరలినవి
అట్టిమానస సుఖమునందిరి
శాశ్వతమైన దివ్యసుఖమది.

సర్వసంగ పరిత్యాగులు - యోగులు
నన్నుచూడగ సాధనచేయుచు
గోపకాంతల స్థితికి - వచ్చుట
సందేహమ్మది - అబ్బురపడకు!

నాతోనున్నచో స్వర్వము మరచిరి
నాకోపమును భరించలేరు
నాచిరునగవులు అమృతఝురులు
నాపలుకులు కైవల్యము వారికి

నాస్పర్శయది ఆనందపరవశము
వంశీగానము - మనసులు దోచెను
అట్టి స్థితికి మరి చేరిన యట్టి
గోపకాంతలు అమృతయోగులు.

మనస్సులగ్నము చేసిన వారికి
మమతా బంధములన్నీ తెగును
మధురానుభూతితో దేహవాసనలు
మరచిపోయిరి పుణ్యమూర్తులు

ఆతత్త్వమును గ్రహించలేక
శారీరకమగు బంధముతలచి
విమర్శలెన్నో చేసిడివారిని
అజ్ఞానులని - జాలిపడెదము

కంటి వెలుగులా కలిసిపోయిరి
వంశి రవళిలా పులకరించిరి
పూలదండలా ఒదిగిపోయిరి
నేనూ - వారూ - అన్నది మరచిరి

అంతటి ఉన్నత స్థితికి చేరిరి
అభ్యాసముతో అలవడనట్టిది
జన్మసంస్కారము కలిగినవారు
మోక్షపథముకు అర్హతనందిరి.

ప్రవృత్తి - నివృత్తిమార్గములవ్వి -
శరణని నన్ను సేవించుటచే
కలుగు ఫలితము వింటివి నీవు
కావున నన్ను భజించు మేలగు"

అనగా అడిగెను ఉద్ధవుడపుడు
కర్మలు మరియు విధి నిషేధములు
నీవు చెప్పగా వింటినిస్వామీ
కర్మలు చేయుటొ మానుటొచెప్పుము?

తత్వవిషయము విశదపరచిన
నీసందేహము తీరును అనుచు
పలికెను కృష్ణుడు ఉద్ధవునితొ నట
"జీవకారకుడు శక్తిమంతుడగు"

పరంధాముడు పరాశక్తితో
ఆధారచక్రమున ప్రవేశించి మరి
మనోమయమ్మగు పశ్యంతి మధ్యముగ
మణిపూరక-విశుద్ధ చక్రమ్ముల వెలుగుచు

ముఖస్థానమునుండి వెలువడు
ఉదాత్తాది స్వరములు మరియు
అకారాది వర్ణమ్ముల నెలవై
స్థూలరూపుడై భాసిలుచుండును.

వివిధ వేద శాఖాత్మమ్మగు
వాక్కు - వైఖరి అనబడుచుండును
అట్టివైఖరి పరమేశ్వరుని
స్థూలరూపముగ గ్రహించబడును

పరాపశ్యంతి మధ్యమ వైఖరి
అనెడిరూపముల వాక్కు వెలువడును
అది నాస్థితి విను - ప్రతిపని యందు
పలుకుట-నడచుట-తినుట-విడుచుట

స్పర్శ - వినుట - రుచిచూచుటయు
మనోచిత్త వ్యాపారమ్ములు
సత్వరజస్తమోగుణ ప్రభావమగు
వ్యాపారములు ఏర్పడుచున్నవి

అది అంతయును నారూపమయా!
ఈశ్వరుడనగు నేను అందరకు
వ్యక్తరూపమున అగపడుచుండును
వేరురూపమని తలంచవలదు

జీవుడు అనగా ఈశ్వరుడేయగు
తొలుతనాతడు అవ్యక్తరూపుడు
కాలముచేత గుణముల చేతను
ఇంద్రియ రూప శక్తులతోను

లోకమ్మునకు కారణభూతుడు
బ్రహ్మగ నాతడు రూపునందెను
భిన్న రూపములు పుట్టుక ఒకటే
వేరుగ నుండియు ఒకటిగ నున్నవి

అనేకమైన నూలుదారములు
కలిసి వస్త్రము ఐన తీరుగా
పంటలు వేరుగ పెరుగుచున్నను
క్షేత్రము ఒకటిగ నున్న తీరుగా

సమిష్టి - వ్యష్ట్యాత్మకమైన విశ్వము
ఈశ్వరునందు ఉద్భవించును
కావున సృష్టియు ఈశ్వర దేవుడు
ఒకరే గాని - వేరుకాదయా!

సమిష్టివ్యష్ట్యాత్మక ఫలితము దేహము
దేహ మనునొక సంసార తరువది
అనాది ఐన ఈవృక్షమ్మిది
ప్రవృత్తిరూపక కర్మకు నెలవు.

భోగమోక్షములు - తరువుకు పూలు
పుణ్య - పాపములు రెండు బీజములు
వివిధ వాసనలు వేళ్ళుగ నుండును
త్రిగుణమ్ములవి తరువు - నాళములు

పంచమహా భూతమ్ములవి
సంసారతరువుకు స్కంధమ్ములయి
శబ్ద-స్పర్శ-రూప-రస-గంధమ్ములు
తరువుకు అగును రసోత్పత్తులు

కర్మ - జ్ఞాన ఇంద్రియమ్ములవి
మొత్తము పదియు ఆపై మనస్సు
అన్నీ కలసి కొమ్మలు అగును
జీవ - పరమాత్మలు - రెండుగూళ్ళవి

వాత - పిత్త - శ్లేష్మమ్ములన్నవి
వృక్షమ్మునకు - పైభాగమ్ముగ
సుఖదుఃఖములను ఫలములుగలిగి
సూర్యమండలము వరకు ఎదిగినది.

అంతవరకును సృష్టి కనబడు
ఆపైకెదిగి సాగెడి జీవికి
సంసారలంపటము అంటుకోదయా!
సామాన్యులకది అందని విషయము

అవిద్యతోను - దుఃఖమయమగు
ఫలములతోను కొందరుందురు
విషయభోగములు వదలినవారు
విద్యామయ సుఖ ఫలమునందెదరు.

మాయామయుడు ఈశ్వరుడనుచు
తెలిసిన వేదతత్త్వజ్ఞానులు
దేహవాసనలు వదలిపెట్టిన
పరమహంసలు - ఆత్మద్రష్టలు -

కావున నీవు అప్రమత్తతొ
నాబోధనలు మదిలోనిలపి
ఆత్మసాక్షాత్కారపు జ్ఞానముతో మరి
శరీరవికారపు బంధముత్రెంచుకు

ఆత్మసాక్షాత్కారము పొందుము నీవు
శరీరవ్యాపారమ్ములు అడగును
ఉపాధియైన జీవాశయమును
భేదించుటన్నది తెలిపెద వినుము

త్రిగుణమ్ములవి బుద్ధికి మాత్రమె
ఆత్మకు అట్టి గుణములులేవు
సత్త్వము పెరిగిన మిగిలినవణగును
సత్త్వము అణగును సత్త్వమువలనే

రజస్తమములు అణగిపోయినచొ
రాగద్వేషములు తొలగినట్టులే -
సత్త్వము పెరిగిన కొలదిని ఉద్ధవ!
నా భక్తిరూపమగు ధర్మము అలవడు

శాస్త్రము - జలము-సంతతి - మరియు
కాశీమొదలగు పుణ్యక్షేత్రములు
వసంతాదికాలము దైవధ్యానము
వేదోక్తకర్మ - సత్కులజన్మము

మంత్రజపమ్ము జాతకకర్మ సంస్కారమ్ము
మొదలగునట్టి పది అంశములు
గుణములవృద్ధికి దోహదకారులు
వాటిలొ మూడుగ విభజన చేసిరి

జ్ఞానవంతులు మంచిది అనునది
సాత్వికమ్ముగా చెప్పబడినది -
నిరసించినది - తామస మగును
తటస్థమ్మది - రాజసమనబడు

సత్వవృద్ధితో భక్తిబలపడును
దానధర్మముల మనస్సు పెరిగి
జ్ఞానముకలిగి ఆత్మను తెలియగ
ఆసక్తికలుగును ఫలితము దొరకును

నివృత్తిసంబంధిత శాస్త్రమ్ములతో
సేవించినచో ఫలితము కలుగును
పాషండశాస్త్రము లాదిగాగల
ప్రవృత్తి శాస్త్రములు వదలగవలెను

బ్రహ్మపదార్థపు జ్ఞానమిదునది
నివృత్తి శాస్త్రము అని చెప్పబడు
కామ్య ఫలముల కోర్కెపెంచెడి
శాస్త్రము అగును ప్రవృత్తి శాస్త్రము

గుణత్రయములవి శాంతించగను
అగ్నిహోత్రము చల్లబడినటు
గుణవ్యాపకమ్ముల పుట్టిన దేహము
శాంతినందును విశ్రాంతినందును"

చచ్చెడి మేకయు ప్రక్కన ఉన్న
ఆడుమేకకై - ఆశపడినటు
విషయాసక్తి - తగదని తెలిసియు
మనసుదానికై - లాగుటెందులకు?

"బదులిడె-ప్రియముగ భగవానుండు
వివేకహీనుడు రజోగుణమున
నేను - నాది అను-అహంకారమున
సత్వప్రవృత్తిని వదలివేయును

రజో గుణముతో సంకల్ప వికల్పము
ఆపై కోర్కెలు పెరిగిపోవును
కామవశుడయి ఇంద్రియవశుడై
దుఃఖఫలములు అనుభవించును

దుఃఖఫలితమని తెలిసియున్నను
కామబలముతో కర్మలు చేయును
వివేకవంతుడు రజోతమముల
ప్రభావమ్మును గ్రహించిమేల్కొను

మనస్సును వశమున నుంచుకొనుచును
సంకల్ప వికల్పములన్నవి లేక
మనస్సు నాపైలగ్నము చేసి
భక్తికివశుడై యోగిగ నగును

అన్నివైపులా సాగిన మనసును
వెనుకకు లాగి స్వాధీనపరచుకు
పరతత్త్వమును సేవించుటయది
యోగమనుచు సనకాదులుచెప్పిరి

నాశిష్యులగు సనకాదులకు
నేను చెప్పితిని వివరముగాను"
అనగానంత - ఉద్ధవుడచట
అట్టియోగమును తెలుపకోరెను

బ్రహ్మదేవుని మానసపుత్రులు
సనకాదులు భక్తిగ తండ్రినడిగిరి
చిత్తము గుణముల లొంగియుండును
చిత్తమునందు గుణములువొదుగును

రాగవాసనలు కలిగియుండునవి
అట్టిబంధముల సడలించుకొని
ముముక్షువు తా సంసారజలధిని
దాటెడి మార్గము తెలుపుముఅనిరి.

ఆలోచించిన బ్రహ్మఅంతట
సమాధానము పొందుటకొరకై
నన్ను స్మరించెను అంతట నేను
హంసరూపున - దర్శనమిడితిని

సనకాదులునను గాంచి మ్రొక్కిరి
నీవెవరవు అని - అడిగిరి వారు
అంతట వారికి యోగరహస్యము
తెలిపితి - నది నీ కిప్పుడుచెప్పెద

మీప్రశ్న - వింతగా - నున్నదంటిని
ఆత్మవిషయమున వున్నది ఒకటే
మీరూ నేనూ ఒకటే అగుదుము
మరి నీవెవ్వరు అనుట సాధ్యమా!

చెప్పెడిది మరి నేనైయుంటిని
నాకు ఆశ్రయము నేనే ఐతిని
అప్పుడు నన్ను నీవెవ్వరవని
అడిగిన చెప్పెడి దేమియున్నది

మనుజులు పశువులు దేవతలున్ను
పక్షులుమొదలగు పాంచభౌతిక
దేహములన్నీ ఒకటే - కనబడు
విషయమంతయు నేనే అగుదును

సర్వాత్మకుడను నేనని తెలియుడు
చిత్తము గుణముల-గుణములు తిరిగి
చిత్తమునందు - లగ్నముఅగును
వాటికినెలవు - దేహము అగును

దేహము జీవుని ఉపాధియగును
రూపరహితుడు జీవుడు వినుడు
చిత్తము - బుద్ధి మొదలగునట్టివి
జీవుని యొక్క స్వరూపమ్ములగు

కావున గుణములు చిత్తము అన్నవి
వేరుగనుండుట జరుగుటలేదు
బ్రహ్మోపాసన యందు చిత్తమును
నడిపిన కలుగును స్వరూపజ్ఞానము.

అటులజరిగిన - అణగు - వాసనలు
వాసనలణగిన గుణములు తొలగును
అంతట చిత్తము మనోమయమ్మగు
తత్త్వపదార్థాన్వేషిగ - మనసగు

ఆస్థితికలిగిన పుణ్యమూర్తులకు
ఆత్మ సాక్షాత్కారము లభించగలదు
అంతటి వరకు చిత్త గుణములు
ఎడతెగని బంధమున కలిసియుండును.

జాగ్రత్స్వప్న సుషుప్తులు అను
మూడు అవస్థలు బుద్ధికిగలవు.
జీవుని కసలా అవస్థలుండవు
ఆ అవస్థలకు ఉపాధి - గుణములు

కనుక - గుణములకు చిత్తమునకును
నిత్యసంబంధము ఏర్పడుచున్నది
నేను వాటికి లొంగనివాడిని
నాకు - సర్వము అర్పించినచో

గుణముల బుద్ధుల ఏర్పడినట్టి
సంబంధమ్మది సమసిపోవును -
దేహాదుల అభిమాన రూపమగు
అహంకారము సంసారబంధమని

జ్ఞానము కలిగిన వాడుమాత్రము
సంసార బంధము దుఃఖమయమని
ననుశరణనుచు బంధముత్రెంచుకు
తిరిగి వాటిని తలంచ డెంతయు.

కామబంధముల కొట్టుకుపోయే
అజ్ఞాని గట్టును జేరుట జరగదు
కలలోఅనుభవమెంత అసత్యమొ
జాగ్రదవస్థలొ అట్టి స్థితియగు

జాగ్రదవస్థలొ అనుభవమంతయు
స్వప్నానుభవ మన్న సత్యమును
గ్రహించి విరక్తుడు గుణచిత్తములు
స్వాధీనములో నుంచుకు గెలచును

అంతయుమీరు ఆకళించుకొని
నామాయతొ మరి అవస్థలన్నవి
గుణములకేర్పడు చున్నవి అనుచు
అంతా నేనే అన్నది తెలిసి

జ్ఞాన ఖడ్గముతొ మీసందేహము
అనెడి లతలను - తెగనరకండి
మీహృదయములో ననుభావించి
భజించి ధన్యతనందగ వలెను.

మనోవికారమువల్ల పుట్టునది
అశాశ్వతమ్మై నశించునట్టిది
మాయాకల్పిత భేదబుద్ధియని
నాది - నేను - అన్నది వదలుము

ఆత్మతత్త్వపు ఆకళింపుతో
విరాగి గాను - మారుట జరుగును
అట్టివానినే సిద్ధుడందురు
కర్మల ఫలితము - దేహమువచ్చుట

కర్మక్షయముకై వివేకమ్ముతో
నడచునుతాను బుద్ధిమంతుడు
అశాశ్వతమ్ముతనువు అనుచును
తెలిసిన తొలగును వ్యామోహమ్ము.

ఆత్మానాత్మ వివేకము సాంఖ్యము
అష్టాంగరూపము యోగము అనబడు
వీటిలొ నీకు రహస్యమైన
విషయమ్ములను బోధించితిని

యజ్ఞపురుషుడును - యజ్ఞము నేనే
ఆత్మయు నేనే నన్నుతెలియుడు
హంసరూపినగు విష్ణువు నేనే
నిర్గుణుండను ఉత్తమ రూపుడ

కోర్కెలులేని వాడను నేను
గుణములు నను సేవించు చుండును.
కోర్కెలునాలోనున్నను - లొంగను
ననుతెలుసుకొని సేవించండి

హంసరూపమున నున్న నన్నట
సనకాదులు సేవించి తృప్తిపడి
ఆశీస్సులుగొని ఆనందించిరి
నిజవాసమునకు సాగితి నేను.

అంతట అడిగెను ఉద్ధవుడచట
"బ్రహ్మావాదులు పరతత్త్వమునకు
అనేక త్రోవలు చెప్పియుండిరి -
భక్తిముఖ్యమని బోధించితివి.

రెంటిలో ఏదిఆచరించవలె"
అంతటపలికెను కృష్ణదేవుడు
వాక్కులమయము వేదములవ్వి
ప్రళయకాలము ముగిసినయంత

అంతటనేను సృష్టిచేయగను
బ్రహ్మకు చెప్పితి - ధర్మముతెలిపితి
విరించి తన జ్యేష్ఠకుమారుడు
స్వయంభువ మనువుకు చెప్పెను.

మనువు వల్లను - భృగువుమొదలగు
సప్తఋషులు మరి గ్రహించినారు
ధర్మ బోధయది వారుతిరిగి మరి
పితృదేవతల కందించిరయా!

వారు అంతట ఆబోధలను
దేవ దానవ గుహ్యకుల మనుజ
సిద్ధ గంధర్వ - విద్యాధర కిన్నర
చారణ కింపురుష - నాగ యక్షులకు

రక్షొగణమునకు అందించగను
వారి సంతతికి వారు చెప్పిరి
ఆ ధర్మబోధ యది ప్రకృతియందలి
వివిధగుణములతొ మార్పుచెందినది.

దానివల్లను సత్త్వప్రధానులు
రజస్తమో! ప్రధానులుగను
మారిరి కావున - చెప్పిన ధర్మము
అనేక మతములు మార్గములందెను.

అట్టిమార్పులతొ పాషండమతము
మొదలగునట్టివి కూడ పుట్టెను
నా మాయకులొంగి - వారి అభిరుచుల
వివిధ విధములుగ ప్రవచించిరయా!

మార్పు ఫలితముగ మీమాంసకులు
స్వర్గానుభవమే ధర్మము అనిరి
దాని కోసమై యజ్ఞము చేయుట
అనుచు - వేదముకు అర్థముచెప్పిరి

వాత్స్యాయనాదులు కామముచెప్పిరి
ఇంద్రియ మనో నిగ్రహమ్ములగు
శమ దమాదులు శ్రేయసాధనము
అని పలికిరి మరి యోగబోధకులు

దండనీతిని రచించినట్టి
కొందరుపలికిరి ధనము శ్రేయమని
సామదానభేద దండమ్ములవి
ఆచరణీయము అనుచు పలికిరి

నాస్తికులంతట విషయభోగము
శ్రేయోదాయము అనుచు నుడివిరి
యజ్ఞము మేలని వైదికులనిరి
నైష్టికులు–తపోదాన నియమమ్ములుఅనిరి.

ముందుచెప్పిన మత బోధలన్నియు
కర్మవాసనల కట్టుబడినవే
వాటివల్లమరి శాశ్వత సుఖము
దొరకదన్నది నిస్సందేహము

ఇంద్రియసుఖముల దూరముచేసి
ననుసేవించిన ఆనందమొదవును
కోర్కెలు లేని జితేంద్రియుడు నను
విశ్వసించి మరి ధ్యానించునయా!

రాగద్వేషములు వదలిన వాడై
శాంత చిత్తము కలిగిన వాడై
సర్వభూతముల సమభావనతో
నాయందున మరి నిష్టనుంచవలె

ఉదారచిత్తము కలిగిన వాడై
భక్తిశ్రద్ధలతొ నను శరణన్న
బ్రహ్మపదవిని కోరడు అతడు
స్వర్గరాజ్యము అభిలషించడు

అట్టి భక్తుడే నాకు ఇష్టుడు
భక్తులలోన శ్రేష్టుడాతడు
వానిక్షేమము చూచెద నేను
అహర్నిశము కాపాడుచుందును

నా అన్ననుమించి శంకరుమించి
నాల్గుముఖముల విరించి మించి
చివరకు లక్ష్మిని మించిన ప్రేమ
పంచియిచ్చెద నా భక్తునికి.

నిజమగు భక్తుని వెంబడినేను
గోవు వెంటబడు వత్సమురీతిగ
నడచుచుందును అట్టిభక్తుడు
నడచిన నేల పరమ పవిత్రము

అర్థాశ లేకను అట్టిభక్తుడు
కోర్కెలు అన్నీ దూరము చేసుకు
నన్నుభజించి – పొందిన గమ్యము –
విషయలోలులకు అందనిదయ్యా!

నాపై నిశ్చలభక్తి నిలపిన
సాధకుడతడై మనశ్శాంతితో
పాప పంకిలము క్షాళనకాగా
పరమ పదమును అందుట తథ్యము

యోగము–సాంఖ్యము–వేదాధ్యయనము
జపతపమ్ములు – ధర్మ త్యాగములు
అన్నీకలిసి ఒక్కటియైనను
నాపై నిశ్చలభక్తికి చాలవు

భ్రష్టులుసైతము ఉద్ధరించబడు
రాజమార్గము – భక్తిమార్గము
భక్తిలేకమరి ధర్మములవ్వి
గమ్యము జేర్చవు – నిస్సందేహము.

అచంచలమ్మగు భక్తికి వశుడై
పరవశమ్మున ఆవేశముతో -
గద్గద కంఠముతొ-నామముపలుకగ
ఆనందముతో నృత్యమాడుచు

అంతట నన్నే చూచుచున్నటు
అనుభూతినందుచు నుండెడి భక్తుడు
పాపక్షాళనము చేయు గంగవలె
భువన పావనము చేయునాతడు

భక్తియోగమున మనస్సునిలచిన
కర్మమలినములు దూరముచేసి
నన్నుపొందుట జరిగితీరును
పుటము పెట్టిన బంగరు తీరగు

మనస్సు నాకు వశమొనరించి
మనోనిగ్రహము అలవరచుకొని
ఏకాంతములో నిర్మలబుద్ధితొ
ననుధ్యానించుము సాధనతోను

స్త్రీబంధమది అనర్థమైనది
స్త్రీ సంబంధము కలిగిన వారి
స్నేహముకూడా అంతటి అనర్థము
మాటలతో మరి మనసుమార్చెదరు.

అట్టివాసనలు దరిరాకుండగ
ఏకాంత ప్రదేశము నాశ్రయించవలె
మనస్సు నిలకడ కలుగుట కొరకు
ప్రశాంత వాతావరణము ముఖ్యము."

అంతట అడిగెను ఉద్ధవుడచట
స్వామీ! నిన్ను - ముముక్షువులు మరి
ధ్యానించెదరు అట్టి ధ్యానము
ఎటులో అనగా - పలికెను కృష్ణుడు.

॥శ్రీ కృష్ణచరితము॥



# 6 ధ్యాన పద్ధతి

ననుధ్యానించగ జితేంద్రియుండై
సమతల ప్రదేశము నందు కూర్చొని
దర్భలు - ఆపై - మృగచర్మమ్మును
పైన మెత్తని తెల్లని వస్త్రము

తిన్నగ పరచుకు చక్కగ కూర్చొని
నిటారుగా తన నడుమును నిలపి
వాయుప్రసారము కుంటువడకను
చేతులురెండు తొడల నిడుకొని

నాసిక కొనపై దృష్టిని నిలపగ
బాహ్యజగత్తున జరిగెడి వాటిని
గమనించుటయది జరగదు - అంత
ప్రాణశోధన చేయగవలెను.

పూరక - కుంభక - రేచక అనుచు
మూడు రకములు ప్రాణశోధన
వామ నాడిని 'ఇడ' అందురు
దక్షిణనాడిని 'పింగళ' అందురు

ఇడానాడిచే గాలిపీల్చుటది
పూరకమ్మని అందురు ఉద్ధవ!
నింపిన గాలిని బయిటకువిడచుట
రేచకమ్ముగా చెప్పబడునయా

ప్రాణవాయువును స్తంభించుటది
పూరకమనుచు చెప్పబడునయా!
ఈ విధముగను క్రమక్రమముగా
వశమున నుంచుకు చేయుట శోధన

మార్చి-మార్చి మరి చేయుచుండవలె
ఆపై - విషయము ప్రాణాయామము
సగర్భ - అగర్భ - అన్నపేర్లతో
రెండువిధములుగ చెప్పబడునయా!

సగర్భ ప్రాణాయామ ముత్తమము
దానిలొ మూలాధారమునుండి మరి
శిరస్సువరకు ఏకరూపముగ
తీగలాగను శ్వాస నడపవలె.

మూలాధారమునుండి శిరస్సుకు
పదిరెండు అంగుళ దూరమునున్న
హృదయస్థానమునందునజేర్చి
ప్రాణమ్ముతొనట కలిసి అంతట

ఘంటానాదము వలె ధ్వని నింపి
స్థిరముగనుంచుట అభ్యసించవలె
ఇటుల ప్రణవమును ప్రాణమ్మును మరి
ఏకపరచిన ప్రాణాయామము

ఆవిధముగను త్రిసంధ్యలందు
పది తడవలుగా పూర్తి చేసిన
నెలదినముల అభ్యాసముతోను
ప్రాణాయామము స్వాధీనమగు

హృదయపద్మము అధోముఖముతో
ఊర్ధ్వనాళము కలిగియుండును
ముకుళించి మొగ్గలావున్నదానిని
వికసింపజేసి - ఊర్ధ్వముచేయుట

అష్టపత్రముల బొడ్డుకలదిగా
ధ్యానించుచును ఆ నడిబొడ్డున
సూర్యచంద్రాగ్నులను సంకల్పించి
ప్రతిష్ఠించి మరి ధ్యానించవలె.

ధ్యానమ్మునకు కేంద్రబిందువుగ
ప్రసన్నమూర్తి - చతుర్భుజుండు
శ్రీవత్సాంకుడు కనకచేలుడు
మకరకుండల మంగళమూర్తి

శంకచక్రగద పద్మమ్ములతో
కౌస్తుభమణితో విరాజిల్లెడు
సర్వాంగసుందర మోహనరూపుడు
సుకుమారుడగు నారాయణుడు

నాధ్యానమును ఫలింపజేయును
అనుచు భక్తిగా సర్వాంగముల
మనస్సునంతను లగ్నముచేసి
ధ్యానించవలె - సాధించవలె

సంకల్ప వికల్ప కేంద్రము అయిన
మనస్సు నింద్రియ విషయమునుండి
ఒడుపుగ లాగి నాపై త్రిప్పి
చెదరక - గట్టిగ బంధించవలె

ఆకాశము వలె విస్తరించిన
చిత్తమునంతయు తెలివిగ లాగి
నాయందున మరి జేర్చినంతనే
ధ్యాన ధ్యేయములు అన్నవి వుండవు

అట్టి సాధకుడు - నేనూ - ఒకటిగ
కలిసియుందుము నిస్సందేహము
ఆత్మ - ఆత్మలో కలిసియుండును
వెలుగు వెలుగులో కలిసియుండును.

ఆవిధమైన ధ్యానముతోను
నిర్వాణమ్మది సులభము అగును
జితేంద్రియుండై అష్టసిద్ధులు
వశపరచుకొను సాధకుడగును".

అనగా అడిగెను ఉద్ధవుడపుడు
అష్టసిద్ధుల వివరము లేమని
అంతటపలికెను ఆది దేవుడు
ఆనందముగా వినెను ఉద్ధవుడు

"పదునెనిమిదగు సిద్ధులలోన
ఎనిమిది నాకు సంబంధించును
మిగిలిన పదియును గుణప్రధానములు
వరుసగ వాటిని వివరించెదను

అణిమ - మహిమ - లఘిమ - ప్రాప్తి
ప్రాకాశ్యం-ఈశిత్వం మరి వశిత్వమున్ను
ప్రాకామ్యం అనునవి ఎనిమిది
నాతో సంబంధించి యున్నవి

అణిమ-మహిమ-లఘిమ అనెడిసిద్ధులు
దేహమ్మునకు సంబంధించును
నాల్గవసిద్ధి ప్రాప్తియన్నది
సమస్త ప్రాణులకు సంబంధించును

అన్ని ప్రాణులకు, ఇంద్రియాలతో
ఆయా అధిష్టాన దేవతరూపుల
సంబంధమును ప్రాప్తిలొ కలుగును
ఆదేవతల అనుగ్రహము ప్రాప్తియగు

ఏ లోకములో ఉన్నను కానీ
భూగర్భములో నున్నను కానీ
దానిని తెలిసి పొందెడి శక్తిని
ప్రాకాశ్యమ్మను సిద్ధి ఒసగును

మాయాశక్తిని - దాని ఫలితములు
స్వాధీన పరచుకు - యధేచ్ఛగాను
నడవగలిగిన సిద్ధి - ఈశిత్వము
విషయభోగ విరక్తి వశిత్వము

కోరిన దానిని సమూలమ్ముగా
వశమున నుంచుట ప్రాకామ్యమ్ము
పై ఎనిమిది సిద్ధులు నా ఆధారము
అష్టసిద్ధులని - ఎనిమిది అవ్వి -

మిగిలిన సిద్ధులు పదియని చెప్పితి
అనూర్మి మత్త్వం - ఆకలిగెలచుట
దూరశ్రవణము - దర్శనమ్మగు
మనోజవమ్ము - కామరూపము

పరకాయ ప్రవేశము-స్వచ్ఛందమరణము
సహక్రీడా దర్శనమ్ము-దేవవిహారము
సంకల్పసిద్ధి - అప్రతిహత ఆజ్ఞ
అప్రతి హతగతి-మొత్తముపదియగు

పైవిగాక మరి క్షుద్రసిద్ధులు
మరియొక ఐదు వివరించెదను
త్రికాలజత్వం అనెడి సిద్ధిలో
భూతభవిత వర్తమానము తెలియుట

'అద్వంద్వం - అనెడి సిద్ధియది
శీతోష్ణ స్థితులు వశమగుట
పరచిత్తాభిజ్ఞ అనెడి సిద్ధిలో
ఇతరుల మదిని తెలిసి కొనుటది

ప్రతిష్టంభనం అనెడి సిద్ధిలో
అగ్ని - జల - స్తంభనచేయుట
అపరాజయల అనెడిసిద్ధియది
ఓటమి అన్నది లేకపోవుట

సర్వజీవులలో నున్న నన్ను మరి
సూక్ష్మపదార్థము అని భావించి
ధారణచేసి ఆరాధించిన
కలిగెడి సిద్ధిని - అణిమ యందురు

జ్ఞాన శక్తితో మహాతత్త్వరూపిగా
ధారణ చేతురు - మహిమ సిద్ధికై
పరమాణువుగా నన్ను తలంచి
ఆరాధించిన - లఘిమ పొసగును.

సాత్వికమైన ఆహారముతో
ననుధ్యానించిన - ప్రాప్తిలభించును
క్రియాశక్తితో పొసగు మహత్త్వపు
ఆధారముతో - పొసగు ప్రాకాశ్యము

త్రిగుణమ్ములను మాయనుకూడ
నడిపించు విష్ణువుగ నిర్ణేతగను
మదిలోనన్ను ఉపాశించినచొ
కలిగెడి సిద్ధి - ఈశిత్వమ్మది.

భగవంతుడని సచ్చిదానందుడని
దివ్యనామములు కలిగియుంటినని
నారాయణత్త్వమ్మునుపాసించు
యోగి అతనికి - వశిత్వమబ్బును

నిర్గుణ పరబ్రహ్మగ - తలచి
ప్రాణాయామాది యోగమ్ములతో
నన్నుసర్వదా ఉపాసించిన
ప్రాకామ్యమను - సిద్ధివశమగును

అనిరుద్ధునిగా - శ్వేతద్వీపమున
ధర్మప్రవర్తకుని - నన్ను గ్రహించి
శుద్ధమనస్సుతొ ఆరాధించిన
ఆకలిదప్పుల జయించగలుగును

ఆకాశమువలె సర్వవ్యాపకుని
నన్నుమనస్సున ఆరాధించుచు
దివ్య ప్రణవము వినగలిగినచో
దూరశ్రవణసిద్ధి కలుగును

సురభోగములు అందగ వలెనన
సత్వగుణ ప్రధానముగా నను
ధారణచేసిన ఫలముకలుగును
సంకల్పమునకు తగు – ధారణకావలె

సూర్యదేవునిగ నన్ను తలంచి
సూర్యునియందే ధ్యానముచేసిన
యోగికి కలుగును – దూరదృష్టియది
మనస్సువశముతొ నన్నుగ్రహించును

సర్వనియంతను – శాసకుడనని
ననుభావించి ఉపాసించిన
ఆ అనుభూతితొ అట్టి యోగికి
నావలె ఆజ్ఞల నిచ్చుట జరుగును

మనస్సు వశములో నుంచుకొనుచును
నన్నునమ్మి మరి ధ్యానము చేసి
ధారణ చేసిన లభించు విద్యను
కామరూప విద్య యందురు

తనలో నన్ను ధరించ గలిగిన
యోగి – త్రికాలమ్ముల తెలియగలుగును
సర్వము అతనికి కంటి కగబడును
ఉపద్రవమ్ములు దగ్గర జేరవు

ప్రాణేంద్రియముల వశ పరచుకొని
యోగి అతడై – ప్రాణశక్తితో
వాయురూపమున మరొక తనువున
ప్రవేశించుట పరకాయ ప్రవేశము

ఛత్ర ధ్వజములు ఆయుధాలను
శ్రీవత్సమ్ము కలిగిన నన్ను –
నా అవతారమ్ముల – తలచెడి యోగికి
ఓటమి అన్నది కలుగదు వినుము

మడమల రెంటిని వెనుకకు అదిమి
హృదయము – కంఠము శిరస్సు వరకు
ప్రాణవాయువును లేపి అంతట
బ్రహ్మరంధ్రముతొ బయటకు విడచుట

జితేంద్రియుండు – జితమనస్కుడు
జితాశ్వాసుడు ఇంద్రియవశుడు
ఉపాసించిన – అట్టి యోగికి
అసాధ్యమన్నది ఇలలో నుండదు

అట్టియోగము స్వచ్ఛందమరణము
అంతటిస్థితిని చేరగవలెనన
అమితసాధన – నాపై భక్తి
నన్ను చేరెడి తపన – ప్రధానము.

ఉద్ధవా! విను సిద్ధులన్నియు
యోగభ్ర ష్టత కలిగించునవే
ఆత్మవిలీనము చేయగ జాలవు
ప్రదర్శనకు మరి పనికి వచ్చును.

అట్టియోగముతొ గీచర గమనము
వశీకరణము - ముదిమిని గెలచుట
సృష్టించగల శక్తినిపొందుట -
కానీ - నాలో చేరుట జరుగదు

అన్నిసిద్ధులు ఇచ్చుట నేనే
అవియన్నియును నాకడనుండును
అటులే నేను ధర్మ - మోక్షముల
దాతను మరియు పరిపాలకుడను"

అంతట అడిగెను ఉద్ధవుడపుడు
"ఓపరమాత్మా! అవ్యయుడవయా!
ఆత్మవివేకము కలిగిన సాధువు
భక్తితొ ఎట్లు సిద్ధిపొందును

జగదాధారా! దేహధారులు
నిన్ను గ్రహించుట కష్టము స్వామీ!
కావున నీవు ఏఏ విధముగ
ఎట్టివిభూతులు కలిగియుంటివి."

బదులుగపలికెను హృషీకేశుడు
"చక్కని ప్రశ్న వేసితివయ్యా
పూర్వము కిరీటి నన్ను అడిగెను
అప్పుడు చెప్పితి - విభూతియోగము

కురుసంగ్రామపు ఆరంభములో
బంధుల చంపుట తగదని తలచి
మిన్నకుండిన ధనంజయునకు
కర్తవ్యము బోధించితి నాడు.

నాడు కిరీటికి చెప్పిన యట్టి
విభూతులను నీకెరుకపరతును
సర్వజీవుల - ఆత్మను నేను
స్నేహితుడను మరి పరిపాలకుడ -

సృష్టిస్థితిలయ కారకుడను నే
అన్ని జీవుల ప్రాణము నేను
నడిచే జీవుల గతియును నేను
కాలము - గుణము - జీవ శక్తిని.

సూక్ష్మముకన్న సూక్ష్మమునేను
మహత్తుమించిన మహత్తునేను
సర్వజీవుల మనస్సునేను
ప్రణవమంత్రమగు ఓంకారమును

అక్షరాలలో 'అ'కారమగుదును
త్రిపదగామిని - గాయత్రిని నే
దేవనాయకుడు ఇంద్రుడ నేనే
వసువులలోన అగ్నిని నేను

ఆదిత్యులలో విష్ణు ఆదిత్యుడ
ఏకాదశరుద్రుల నీలలోహితుడ
బ్రహ్మర్షులలో భృగువును నేను
రాజర్షులలో స్వాయంభువుడను

దేవర్షులలో నారదుండను
గోవులయందున కామధేనువును
సిద్ధులయందు కపిలుడనేను
పక్షులలోన వైనతేయుడను

ప్రజాపతులలో దక్షుడనగుదును
పితృదేవతల 'ఆర్యము' డగుదును
దైత్యులందున ప్రహ్లాదుడను
తారలనాయకుడైన చంద్రుడను

యక్ష - రక్షసులప్రభువు - కుబేరుడ
గజములయందు ఐరావతమును
జలాధి దేవత వరుణుడనేను
తపనశీలులలొ సూర్యదేవుడను

మనుజుల ఏలిక - రాజును నేను
అశ్వములందు ఉచ్ఛైశ్రవమును
ధాతువులందు బంగారమును
దండధారులలొ యముడనగుదును

సర్పములందు వాసుకి నేను
నాగరాజుల అనంతుడగుదును
జంతువుల ఏలిక కేసరినగుదును
ఆశ్రమాలలో సన్యాసాశ్రమ మగుదు

చాతుర్వర్ణములందు - బ్రాహ్మణుడ
పుణ్యనదులలో 'గంగ' నగుదును
నదులప్రభువగు కడలిని నేను
ఆయుధాలలో ధనుస్సునేను

మేటి విలుకాడు రుద్రుడ నేను
పర్వతాలలో మేరువు నేను
దుర్గమ్ముల హిమగిరి నగుదును
తరువులయందు అశ్వద్ధమును

ఓషధులందు ధాన్యము నేను
పురోహితులలో వశిష్ఠుడను నే
వేదార్ధనిష్ఠుల బృహస్పతినగుదును
సేనాపతులలొ స్కందుడ నేను.

సన్మార్గ వర్తనులందు బ్రహ్మను
యజ్ఞము లందు బ్రహ్మయజ్ఞమును
వ్రతముల ఉత్తమ అహింస వ్రతమును
పవిత్రములలో శుచిని అగుదును

అష్టాంగయోగముల సమాధి స్థితిని
పంచఖ్యాతులలొ ఖ్యాతిని నేను
స్త్రీలయందున శతరూపను నే
మనువులయందు స్వాయంభువుడను

మునులయందున - నారాయణుడ
బ్రహ్మచారులలొ సనత్కుమారుడ
జీవుల కభయము సన్యాసమును
ప్రియవచనమ్ము మౌనము - మతిని.

అప్రమత్తములైన వాటిలొ
కాలమానమగు సంవత్సరమును
ఋతువులందున వసంత ఋతువును
మాసములందు మార్గశీర్షమును

నక్షత్రమ్ములలొ అభిజిత్తగుదును
యుగములందున కృత యుగంబును
జితేంద్రియులలో అసిత - దేవలుల
కవుల యందున శుక్రాచార్యుడ

వేదవిభాగము చేసిన యట్టి
కృష్ణద్వైపాయనుడను నేను
భగవంతులలో వాసుదేవుడను
వానరులందు హనుమంతుడను

భాగవతులందున శ్రేష్టుడవీవు
నీవే - నేను - సందియమెందుకు
విద్యాధరుల సుదర్శనుండను
రత్నము లందున - పద్మరాగమును

సుమములందున పద్మము నేను
దర్భజాతుల కుశ యను జాతిని
హవిఃద్రవ్యముల ఆవునేయిని
ఆర్జనపరుల సంపద నేను

సహనశీలుర ఓరిమి నేను
సాత్విక గుణముల సత్వము నేను
ఇంద్రియాలకు శక్తిని నేను
మనస్సునకును బలమును నేనే

నవమూర్తులనర్చించు భక్తులకు
ఆదిమూర్తియగు వాసుదేవుడను
గంధర్వులలో విశ్వావసుడను
అచ్చరలందున పూర్వచిత్తిని

మహాగిరులలో స్థైర్యము నేను
భూమియందుగల గంధమునేను
జలముకు రుచిని నేనేఅగుదును
తేజశ్శాలుర అగ్నిని నేను.

తారల రవిచంద్రుల కాంతిని
నింగి సహజమగు శబ్దగుణమును
బ్రహ్మనిష్టులలొ బలిని అగుదును
వీరులమేటి అర్జునుండను

భూతసృష్టి స్థితిలయములు
జ్ఞాన కర్మేంద్రియముల పని
ఇంద్రియాలకు అధిష్టాత మరి
పంచభూతములు నేనే వినుము

త్రిగుణమ్ములవి నేనే నగుదును
వాటినిమించిన పరమార్ధమును
నన్నువిడచి మరి ఏదియువుండదు
సర్వమునేనే ఈశ్వరుండను

ఎంతని చెప్పెద నా విభూతులు
నావల పుట్టెడి బ్రహ్మాండములే
అసంఖ్యాకములు - తెలియుమునీవు
కావున నావి అనంత విభూతులు

ఒక్కటి వినుము - తేజము, సిరిని
సంపద లజ్జ త్యాగ భాగ్యములు
ధర్మము బలము ఓరిమి కీర్తియు
మొదలగు అంశలు అన్నీ నావే

సంక్షేపముగా నా విభూతులలో
తెలియజేసితి కొన్ని మాత్రమే
సృష్టిలొ పూవులు ఎన్ని రకములో
చెప్పగ నెవ్వరి వశమగు నిలలో

నాతనయుడని నాకుతంట్రియని
శత్రువు మిత్రుడు అనెడి వరసలు
లోకధర్మము అన్నియుకూడ
నాలీలయని తెలియుము నీవు

వాక్కును వశముననుంచుకు నంత
నీమనసును నిగ్రహించుకొని
ప్రాణవాయువును ఇంద్రియాలను
వశపరచుకొన సాధనచేయుము

అటుపై నీవు ఆత్మను ఆత్మలో
లీనము చేయుట సాధించవలె
అంతటనీవు ముక్తుడవగుదువు
సంసార వలయమున పుట్టుట జరుగదు

వాక్కును వశమున నుంచక పోయిన
చేసిన తపస్సు వ్యర్థము అగును
ముముక్షువునకు మరి వాక్‌నిగ్రహము
అవశ్యకమ్ము అనిచెప్పగను

ఉద్ధవుడడిగెను వాసుదేవుని
"వర్ణాశ్రమధర్మమ్ముల పాలన
వాటిని మరి ఉల్లంఘించిన వారికి -
భక్తిరూపమగు ధర్మముకలదని

నీవు లోగడ సెలవిచ్చియుంటివి
దాని వివరము తెలియబరచుము
నీయందు ధ్రుఢమగు భక్తి కలుగుటెటు
తిరిగి నాకు వివరించుము దేవా!

మర్త్యలోకమును వదలిన నింక
ధర్మబోధన చేసెడిదెవ్వరు
కావున మనుజుల క్షేమము కోరి
భక్తిధర్మమును ఉపదేశించుము"

ఆమాటలకు సంతసపడిన
అక్షరమూర్తి పలికెనప్పుడు
నీదు ప్రశ్నకు సంతసించితి
ప్రజాక్షేమముకు చెప్పెద వినుము

ప్రప్రధమముగ నన్నుపాసించుట
ధర్మము అన్నది తెలియగ వలెను
క్రమక్రమముగానది ఆచారమయి
భక్తికి - అదియే పునాదియైనది.

కృయుగమ్ము - శుద్ధస్వభావులు
వేదము - ప్రణవము ఒకటే అపుడు
నాల్గుపాదముల ధర్మము నడిపితి
యజ్ఞయాగములు రూపొందగలేదు.

జనులందరును ఏకాగ్రతతో
తపస్సుతో మరి శుద్ధమూర్తినగు
హంసను నన్ను ఉపాసించిరి
పాపరహితులై - కృతకృత్యులాయిరి

త్రేతాయుగపు ఆరంభములో
విరాడ్రూపుడగు నా శ్వాసలతో
హృదయమునుండి ఋగ-యజు-సామ
వేదవిద్యయది ఉద్భవించెను

వాటినుండి మరి యజ్ఞమువచ్చెను
అట్టియజ్ఞమును నేనే తెలియుము
విరాడ్రూపుని ముఖమున విప్రులు
బాహువులందు క్షత్రియులున్న

తేజో బలములు ధృతిశౌర్యమ్ము
ఔదార్యము మరి క్షమించుగుణము
బ్రాహ్మణభక్తి - మొదలగునట్టివి
కలిగియుండుట క్షత్రియ ధర్మము

ఊరువులందున వైశ్యులు మరియు
పాదములందున శూద్రులు పుట్టిరి
అటుల పుట్టెను నాల్గువర్ణములు
అటులే పుట్టెను ఆశ్రమమ్ములు

హితమును వినుట - ధ్యాన నిష్ఠయు
ధనార్జనమ్మున మక్కువచూపుట
వైదికోత్తముల సేవచేయుట
మొదలగు నట్టివి వైశ్యగుణములు.

జఘమునుండి గృహస్థాశ్రమము
హృదయమునుండి బ్రహ్మచర్యము
వక్షమునుండి వానప్రస్థము
శిరస్సునుండి సన్యాసము పుట్టెను.

గోదేవతల సేవచేయుట
సంతృప్తిని మరి కలిగియుండుట
శూద్రధర్మములు అనుచుచెప్పిరి
మిగిలిన తామసగుణము కొందరిది

శమదమాదులు తపోశౌచముల్ను
క్షమ - సంతోషము - దయాపూర్ణత
నిష్కపటమ్ము - నాఎడభక్తియు
సత్యభాషణము - వైదిక ధర్మము

అన్ని వర్ణముల వారందరికీ
కావలసినది అహింస - సత్యము
భూతహితమ్ము - కలిగియుండుట
కామక్రోధముల దూరము నుంచుట."

అనుచు ముకుందుడు ఉద్ధవునకట
ఆశ్రమధర్మమ్ములను తెలిపెను
అన్నివర్ణముల వారికి కూడా
ఉపనయనముతో రెండవ జన్మగు.

॥శ్రీ కృష్ణచరితము॥



## 7 ఆశ్రమధర్మాలు

ఉపనయనముతో అర్హతకలిగి
సమర్థుడైన గురువు వద్దను
శ్రద్ధాభక్తుల వేదమునేర్చి
ఇంద్రియ నిగ్రహమలవరచు కొని

బ్రహ్మచారి నియమమ్ముల మెలగుచు
జటను ధరించి - శుద్ధమనస్సుతొ
తెల్లని వలువలు ధరించకుండా
ఎఱ్ఱని పీఠమునందు కూర్చొనక

దర్భలుచేత ధరించియుండి
బ్రహ్మదండము కృష్ణాజినములు
అక్షమాల మరి కమండలమ్ములు
ధరించి నిష్టగమెలగుచుండవలె

స్నానభోజన హోమ మంత్రముల
కాలకృత్యములు సలుపు సమయమున
మాటాడక మౌనమ్మునుండవలె
నఖ కేశముల ఖండించగరాదు

ఉభయసంధ్యల స్నానము చేసి
ఏకాగ్రతతో - అగ్నిని సూర్యుని
ఆచార్యుని-గోవును-గురువుల-విప్రుల
పెద్దల - దేవతల నుపాసించవలె

గాయత్రి జపించి - ఆచార్యునిగా
నన్ను - మనస్సున భావించవలె
గురువులపైన గురి నిలపవలె
తప్పులు వెదకుచు చులకన కూడదు

ఉభయసంధ్యల భిక్షాటనతో
దొరకిన దానిన గురువుకు నిడవలె
గురువు ప్రియముగా అనుగ్రహించిన
ఆహారమునే గ్రహించవలెను

గురుశుశ్రూషలు పరమ ధర్మము
భోగములందు మనసు నిలపక
గురుకులవాసము చేయగవలెను
గురువును మిన్నగ భావించవలె

కన్నెత్తి స్త్రీలను చూడక పోవుట
స్నానసంధ్య గాయత్రి జపమ్ములు
బ్రహ్మచారికి అవశ్యమైనవి
మనోనిగ్రహము ముఖ్యమైనది.

బ్రహ్మచర్యము ఆచరించుచు
నాభక్తుండై తేజోమూర్తిగ
భాసిల్లుచును దీక్షను సలిపి
గృహస్థుకావలె నన్నచొ నతడు

గురువు ఆజ్ఞను గ్రహించి ముందుగ
'సమావర్తనం' అనెడి స్నానము
ఆచరించవలె - ఆపై నతడు
గృహస్థ ధర్మము లాచరించవలె

వానప్రస్థము సన్యాసములు
స్వీకరించగ - అటులచేసియు
నాపైభక్తి లేనివానికిక
ఉత్తమ ఫలము అందదు ఉద్ధవ!

కామభోగములు వలదు - విప్రునకు
యాగనిర్వహణ - దానము గొనుట
వేదవిద్యను నేర్పుట మాత్రము
బ్రాహ్మణుడు తా నాచరించదగు.

క్షుద్రవృత్తులు ఆచరించక
అతిథి అభ్యాగతుల నాదరించుచు
అతి అనురాగము పెంచుకొనకను
తృష్ణను చంపుకు మనవలె విప్రుడు

కుటుంబపోషణ కసమర్థుండై
బ్రతికెడి విప్రుని ఆదరించిన
ధనవంతుని - నే ఉద్ధరింతును
అట్టిధర్మము సుఖములనిడును

రాచవృత్తి మరి వలదు విప్రునికి
దేవ ఋషి పితృభూతముల
బ్రహ్మయజ్ఞ తర్పణ శ్రాద్ధ
హోమబలి అన్నదానముల

ఆరాధించగ వలెను విప్రుడు
వాటియందున నన్నుతలంచి
ఆరాధించగ వలెను ఉద్ధవా!
నాసేవలు పరమార్థము కావలె

దైవికమ్ముగను స్వయంశక్తితో
లభించినట్టి ధనముతొ భృత్యుల
పోషించుటలో ఏమరకూడదు
గృహస్థు నిరతము నన్నుతలచవలె

కనబడనట్టి అమరసుఖముకై
ఆరాటపడ కూడదు ఉద్ధవ!
అదియును మిధ్య - నిలబడనట్టిది
సంసారసుఖమును పోలినట్టిదే -

కలలో దృశ్యమువంటిది - సుఖము
చలివేంద్రములో బాటసారులు
కలిసినట్టుగా సంసారబంధములు
ఎంతమాత్రము కావు శాశ్వతము

తానొక అతిథిగ వచ్చినట్టుగా
తలంచవలెను తననే తాను
అటుల తలంచిన - అశాశ్వతమ్మను
భావన మదిలో నాటుకు పోవును

నాకొరకై వారెవ్వరురారు
వారికొరకునే - పోలేనసలు
అన్న యదార్థము - ఆకళించకొన
సంసారబంధముల విముఖత కలుగును

ఇకపై వానప్రస్థ ధర్మమ్ములు చెప్పెద
భగవధ్యాన పరుడైయుండి
భార్యపోషణ తనయులపై నిడి
ఒంటరిగానే వనమున మనవలె

భార్యతొ వనమున నుండినచో మరి
జితేంద్రియుండై జీవించవలె
వైరాగ్యమది అంకురించినచొ
సన్యాసమును గ్రహించవచ్చును

కందమూల ఫల - భక్షణచేయుచు
నారబట్టలు మృగ చర్మమును
ధరించి - నిష్టగ గడపగ వలెను
త్రికాలస్నానము నాచరించవలె

గ్రీష్మకాలమున పంచాగ్నులందున
వర్షాకాలము ఆరుబయలులో
శీతాకాలము నీటిలొ నిలబడి
తపస్సు చేసిన వశమగునాత్మ

చాతుర్మాస - దర్శపూర్ణమాస
అగ్నికార్యములు గృహస్థువలెనే
వానప్రస్థుడు నిర్వహించవలె
అంతఃకరణశుద్ధితొ భక్తిబలపడు

అటుల నిష్టగ ఆచరించిన
ఋషుల లోకమున - మహర్లోకమున
వసించి అంతట - నన్నుచేరును
కర్మరాహితికి వానప్రస్థము

వార్ధక్యముతో వానప్రస్థము
నిర్వహించగ శక్తిలేనిచో
ఆహవనీయాది అగ్నుల గ్రహించి
నాధ్యానముతో నన్ను చేరవలె

దారాపుత్రుల రూపమునున్న
దేవతలు - మరి తమకు లభించని
మోక్షసుఖములు - పొందును అనుచు
సన్యాసము కాటంకము తెత్తురు

అట్టివాటిని లెక్కించకను
శాశ్వతానంద ప్రాప్తికోసమై
విరాగియై మరి సన్యసించవలె
పరివ్రాజక ధర్మమ్ములు వినుము.

కౌపీనమును ధరించవలెను
అది కనబడ నీయక తాను -
తగిన వస్త్రమే ధరించవలెను
పెద్దది - ధరించ కూడదు యతులు

దండము మరియు భిక్షాపాత్ర
రెండే యతికి ఆస్తిగ నుండును
సత్యము పలుకుచు - ఆలోచించి
తగిన ప్రసంగము చేయగ వలెను

సన్యాసి జీవితము ఉత్తమోత్తమము
వానిధర్మములు మహోన్నతమ్ములు
వేష సన్యాసికి ఫలితముదొరకదు
భిక్ష స్వీకరణ నియమబద్ధమది

దొరికిన దానితొ తృప్తినందవలె
మౌనముతో ఆ భిక్షను బ్రహ్మకు -
విష్ణు సూర్యులకు భూతమ్ములకు
ముందుగ తాను నివేదించవలె

ఆపై భిక్షను అడిగినవారికి
పంచి యిచ్చి మరి శేషము తినవలె
స్థిరనివాసము యతికి తగనిది
నిస్సంగుడై తా తిరుగుచుండవలె

నన్నేతనలో లీనముచేసుకు
పరిశుద్ధమైన ఆత్మను కలిగి
వాంఛలు బంధము లకు లొంగకను
జ్ఞాననిష్టతో యతి మెలగవలె

జ్ఞానేంద్రియముల మనసును తాను
వశపరచుకొని మోక్షగామియై
తుచ్ఛసుఖములకు దూరమునుండి
పుణ్యభూములలొ సంచరించవలె.

భిక్షాన్నమునకు అలవాటుపడి
తృప్తిఅన్నది పెంచుకు మనవలె
అభిమానములు అంతరించవలె
సత్త్వగుణమది పెంచుకోవలె

కనబడునట్టిది నశించుననెడి
వైరాగ్యమ్మది పెంచుకోవలె
నిష్కామభక్తుడై ననుసేవించిన
విధి నిషేధము లతనికివుండవు

ఆకలి మరచిన లోకముమరచును
మానావమానములన్నవి తలచక
పసిబాలునివలె ప్రవర్తించవలె
పాండిత్యమ్మది మరిచి పోయినటు

సర్వసంగియై మాటాడవలె
ఫలితము కోరి నడచుట తగదు
లోకబంధము త్రెంపుకు నడచిన
మట్టి - బంగరు ఒకటిగ తలచును.

శుష్కవాదములు పెంచకూడదు
ఎదిరించి పలుకుట తగనిది-యతికి
ఎదుటివారిని భయపెట్టకను
దేహ మమతను చంపుకోవలె

ఆకలితీరెను అను సంతోషము
తీరలేదని విచారపడకను
దైవాధీనము సర్వము అనుచు
మదిలోనమ్మి - యతి మెలగవలె

ప్రాణమ్ములను నిలబెట్టుటకే
ఆహారమును - ఆశించవలె
ఆడంబరములు అసలే తగవు
స్నాన, శౌచ నియమమ్ములుండవలె

ప్రారబ్ధమన్నది జ్ఞానికి వుండదు
నా వీక్షణమున దగ్ధమగునది
యదార్థమునకు అట్టివానికి
స్నానశౌచ నియమాదులు లేవు.

గురువుగ నన్ను భావించుకొని
ఆత్మజ్ఞానము లభించువరకు
శ్రద్ధా వినయము భయ భక్తులతో
నన్ను నిరతము సేవించవలె

రాగద్వేషములు నశించకున్నచో
ధర్మభ్రష్టుడై పోవునాతడు
భోగవాంఛతో జ్ఞానము వదలిన
నన్ను ఆతడు మోసగించినటు

అట్టియతి మరి పేరుకు యతియగు
గతిచెడినట్టి వాడగునయ్యా!
బ్రహ్మచారికి గురువే గురియగు
గృహస్థు అతిధుల నాదరించుట

వానప్రస్థుడు తపోదీక్షతో
ప్రవర్తించుట - విహితధర్మము
యతి - శమ దమ అహింసలకును
నెలవైయుండుట ధర్మమైనది

గృహస్థు భార్యతొ సంసారముతో
స్వగృహమందే తపోదానములు
బాహ్యాంతర శుద్ధి దయాపరత్వము
కలిగియుండవలె - అదియే మనుగడ

స్వధర్మమ్మును ఆచరించుచు
సర్వజీవుల నను దర్శించుచు
నన్ను భజించెడి భక్తుని - తప్పక
అచిరకాలమున అనుగ్రహింతును

వర్ణాశ్రమ ధర్మమ్ములు యివియే!
నాపైభక్తితొ వాటిలొ చరించ
ముక్తి - ముంగిటకు వచ్చినిలచును
అనుచు పలికెను వాసుదేవుడు

ఆత్మానుభవ మందినవాడు
అనుమానమును ఎదగనీయక
కేవలమిది మరి మాయ యనుకొని
అజ్ఞానమును వదలివేయును

అట్టిజ్ఞాని మరి జ్ఞాన సన్యాసి
అట్టివానికి నేనే సర్వము
ఆత్మలొనన్ను చేర్చుకు నాతడు
ఆనందమును అనుభవించును

ఆవిధముగను జ్ఞానియు నేను
దగ్గరగా మరి చేరుచుంటిమి
జ్ఞానసిద్ధియది జప తపాదుల
తీర్థసేవల వలన - లభించదు

కావున ఉద్ధవ! ఆత్మజ్ఞానముతొ
ఆత్మను తెలుసుకు - జ్ఞానివై నువు
భక్తిభావనతొ నన్ను భజించుము
యజ్ఞప్రభువుగా తలతురు మునులు

ప్రకృతిలోని మాయలు మరియు
దానివికారము జన్మబంధములు
అన్నీ అగపడు దేహమ్మునకే
మూలపదార్థము నకు లేవవి."

అనగా పలికెను ఉద్ధవుడపుడు
అనాదియై వైరాగ్యవిజ్ఞానము
నిండిన యట్టి జ్ఞానమ్మును నువు
మరింత విపులముగా సెలవీయుము.

బ్రహ్మాదులకే అందనియట్టి
నీ భక్తియోగమును విశదపరచుము
సంసార జలధిలో కొట్టుకుపోయే
నాకు బోధనిడి ఉద్ధరించుము

॥శ్రీ కృష్ణచరితము॥



# 8 జ్ఞానబోధ

"ఉద్ధవా! విను ఈధర్మములు
అంపశయ్యపై నున్న భీష్ముడు
ధర్మరాజుకు నాడు తెలిపెను
అవి తెలిపెదను ఆలకించుము

తత్వములవ్వి ఇరువదిఎనిమిది
ప్రకృతి - పురుష - మహదహంకారములు
శబ్ద-స్పర్శ-రూప-రస-గంధములు
పంచజ్ఞానేంద్రియములు ఆపై

పంచకర్మేంద్రియములు మరియు
మనస్సు ఆపై పంచభూతములు
త్రిగుణమ్ములను సత్వరజస్తమములు
మెత్తముకలిపి ఇరువది ఎనిమిది

పిపిలీకాది బ్రహ్మపర్యంతము
కలిగియున్న ఆ తత్త్వమ్ములకు
కారణమ్మది - పరమాత్మతత్త్వము
ఆ సంబంధము తెలియుట-జ్ఞానము

ఆద్యంతములు - మధ్యమమందు
సృజించబడిన దానివల్లను -
సృజించునట్టిది - తెలియుటన్నది
సత్తు అందురు - జ్ఞానస్వరూపము.

సృష్టియు సృజించబడునట్టిదియు
నశించునట్టిది తెలుసుకు - ఆపై
మిగిలెడిదేది అన ఆ పరమాత్మ
ఆపరమాత్మయె - సత్తుఅగునయా!

శ్రుతి-ప్రత్యక్షము-ప్రత్సహ మనుమానము
అనునట్టివి మరి ప్రమాణమ్ములవి
ఇక్కడ ఏమియు లేదనిచెప్పుచు
వేరొకటున్నది - అని శ్రుతిచెప్పును

స్థూలదృష్టికి కనబడునట్టిది
కనబడనట్టిది వస్తుతః అని
చెప్పెడి ప్రమాణము - ప్రత్యక్షమ్ము
మహాజనప్రతిది - ప్రత్యహమగును

మెరపుకలిగిన ముత్యపుచిప్పలో
వెండి ఎక్కడ ఉన్నది అనుచు
త్రోసివేసెడి ప్రమాణమ్మది
అనుమానమ్ము - అనుచు చెప్పబడు

ప్రమాణములు నాల్గు ఆకళించుకొని
సుస్థిరమైన పదార్థమొకటి
వేరేగలదు అను నిర్ణయమునకు
వచ్చెడివాడు వివేకి - జ్ఞాని

స్వర్గాది సుఖములు కలిగించుజ్ఞానము
కర్మలవలన వచ్చెడి సుఖము
దుఃఖమెగాని సుఖము కాదది -
కావున జ్ఞాని - వాటిని చేయడు.

॥శ్రీ కృష్ణచరితము॥



## 9 భక్తియోగం

భక్తి యోగమును చెప్పితి నీకు
తిరిగి అడిగితివి వినుము చెప్పెద
నాగాథలువినుట కీర్తనచేయుట
పూజించుటది భక్తికిబాట

నా ఆలయముల అలంకరించుట
ప్రదక్షిణించుట నమస్కరించుట
నాభక్తులను గౌరవించి పూజించుటయున్ను
సర్వభూతముల సమబుద్ధియది

కోర్కెలుచంపుకు మనసువశముతో
భోగభాగ్యములు నావశమొనర్చి
తనకు ప్రీతియగు - పదార్ధమ్మును
ముందుగ నాకు నివేదించుట

వ్రతములు జపములు నాకు ఒసగుట
నాకు వాటిని ధారపోయుట
ఆదిగాగల పనులవల్లను
భక్తిఏర్పడి బలపడునయ్యా!

దృఢమగు భక్తి నా ఎడకలిగిన
అట్టిభక్తునికి ధన్యత కలుగును
కోరిక అన్నది అతనికుండదు
ధర్మ - జ్ఞానవైరాగ్యము లమరును.

రజోగుణమునకు లొంగిన మనస్సు
దేహ - గేహముల-మమతకునెలవగు
సర్వజీవుల సమభావనయది
జ్ఞానముగా మరి తెలియుమునీవు.

అంతట అడిగెను ఉద్ధవుడచట
బదులు పలికెను వాసుదేవుడు
యమ-నియమముల వివరించెనట
యమముకు సంబంధము నియమమ్ము

యమమనుధర్మము - లక్షణమ్ములు
పన్నెండుగను నిర్ణయించిరి
అహింస-సత్యము-అచార్య-అసంగమ
అపరిగ్రహము-హ్రీయును-మరియు

అస్తిక్యము మరి - బ్రహ్మచర్యము
మౌన స్థైర్యములు - క్షమ - అభయమ్ము
అను పదిరెండును యమముకు నిష్టలు
ఆపైనియమము వినుమని పలికెను.

శౌచ, జపములు - తపోశ్రద్ధలు
ఆతిధ్యము మరి నన్నర్చించుట
తీర్ధయాత్రలు - పరముపై దృష్టి
కోరిక - సంతుష్టి - ఆచార్యసేవలు

యమనియమములను అనుసరించిన
ఐహికాముష్మిక లతిసులభమగు
మోక్షేచ్ఛ కలిగిన యమము - ముఖ్యము
ప్రవృత్తి మార్గముకు నియమము ముఖ్యము

నాయందు స్థిరమగు బుద్ధి - శమమగు
ఇంద్రియనిగ్రమమన్నది - దమము
సర్వదుఃఖసహనమ్ము - క్షితియగు
జిహ్వా కామముల విజయము-ధృతియగు

ఆర్తున కిడుట దానము అగును
కామ విసర్జన - తపస్సు అగును
స్వభావ - విజయము - శౌర్యమ్మగును
బ్రహ్మతత్త్వవివేకము - సత్యము

హిత - ప్రియ - సత్య వాక్కులు - ఋతము
లౌకిక - అలౌకిక కర్మవిసర్జన - శౌచము
ఐహిక ఆముష్మిక ఫలత్యాగము - సన్యాసము
పరమార్ధమ్మది ప్రియమగు ధనము

పూర్వజ్ఞానమూర్తిని-యజ్ఞమగుదును
నాకోసమిడినది - దక్షిణయగును
ప్రాణాయామము బలమ్ము అగును
సర్వభూతహితమ్ము - దయయగు

నాకైనియమిత గుణములు అవ్వి
భగము - అనగా - ఐశ్వర్యమగు
నాపైదృఢమగు భక్తి - లాభము
ఆత్మలొఐక్యము అనుభావన-విద్య

దుష్టకర్మల ద్వేషము - లజ్జ
ఫలాపేక్షను దేనియందున
కలిగియుండక పోవుట-శ్రీయగు
సుఖదుఃఖముల గెలచుట-సుఖమగు

విషయసుఖముల కోరిక-దుఃఖము
బంధ మోక్షముల ఎరుక-పాండిత్యము
దేహ-గేహముల మమకారము-మూర్ఖత
నివృత్తి మార్గము-ఉత్తమ మార్గము

ప్రవృత్తిమార్గము - కుత్సితమార్గము
సత్త్వగుణాభివృద్ధి - స్వర్గమ్మగును
తమోగుణోద్రేకము - నరకము
నన్ను చెప్పెడి వాడే బంధువు

నాయందు ఉత్తమ బోధనిలచిన
మనుజశరీరము-గృహము అగునయా!
వివేక ధైర్యాది - గుణుడు ధనికుడు
విషయభోగ ఆసక్తి - దరిద్రము

ఇంద్రియాలకు ఓడిన - కృపణుడు
విషయసుఖములకులొంగ - ఈశుడు
వాటికిలొంగినవాడు - అనీశుడు
నీసందేహములకు ఉత్తరమ్ములివి

గుణదోషముల వెదకుట దోషము
వాటిని వదలుట గుణమగునయ్యా!
అట్టిస్వభావి - గుణి - అనబడును
అనగా అడిగెను - ఉద్ధవుడంతట

అరవిందాక్షా! నీ బోధనలో
విధి - నిషేధములు చెప్పితి వీవు
గుణము - దోషము - వివరించితివి
అది సందిగ్ధము నిర్ణయించుటకు

కులభ్రష్టులును - వ్రతభ్రష్టులును
ముక్తిపొందుటకు మార్గము ఏది?
వారికి ఎవ్వి - విధి - నిషేధములు
సమర్థుడవు నువు వివరించుమయా!

ఉద్ధవా విను మూడు యోగములు
జ్ఞాన - కర్మ - భక్తి అనునవి
వివరించితిని వాటినిమించి
మరియొక మార్గము లేనేలేదు

కర్మఫలములు అనుభవించుచు
దుఃఖానుభవముతొ జ్ఞానయోగము -
కర్మఫలముల కారాటమ్మది
కర్మయోగముగ - తెలిపితినీకు

భాగ్యవశమున - నా గాథలువినుచు
నను సేవించు - భోగవిరక్తుడు
భక్తి యోగమున ముక్తినందును
అనన్యభక్తి సాధించవలె

జ్ఞాన కర్మల ఆచరించగను
అర్హతలేనిచొ - భక్తి యోగమున
ముక్తుడగునయా! నిస్సందేహము
నిత్య నైమిత్తక కర్మలు తప్పదు.

నిష్కామకర్మలు చేయుచునుండి
నిషిద్ధకర్మలు ఆచరించనచొ
స్వర్గనరకములు రెండును రాక
జ్ఞానమొ - భక్తియొ ఒకటి పొందును.

మానవజన్మలొ భక్తితొ ముక్తిని
సాధించగల మార్గము చూచి
స్వర్గవాసులు సైతము యిచ్చటి
మానవ జన్మను కోరుకొందురు

నిషిద్ధకర్మలు నరక భయముతో
ఆచరించక ఆగిపోయినటు
స్వర్గవాంఛతో కామ్యకర్మలు
చేయుటయందు విముఖుడు - జ్ఞాని.

అహంకార మమకారమ్ముల మరి
త్రిగుణమ్ములవి చేరును కనుక
ఉత్తమమైనది అనితెలిసియును
తిరిగి మానవ జన్మ కోరడు.

నశించునదియని దహింపబడునని
తిరిగి దానిని కోరుకొనకను
మానవజన్మతొ ముక్తి సాధనకు
దీక్షగ - జ్ఞాని ప్రయత్నించును.

సంసారసాగరము దాటుటకొరకు
శరీరమ్ము ఒక పడవయగునయా!
దానిని నడుపు నావికుడు - గురువగు
అనుకూలవాయువుగ - నేను వుండగా

గట్టుకు చేరెడి యత్నముచేసి
బయట పడనిచో - ఆత్మను కూడా
ముంచి వేసెడి - మూర్ఖుడు అగును
అనుచు తిరిగి-అట పలికె ముకుందుడు

కర్మలు చేయుట మరియు అందలి
దుఃఖము తెలిసిన వాడు తెలివిగా
విరక్తుడై తను ప్రాణాయామాది
సాధనతో తన మనసును కట్టును

కళ్ళెములేని గుఱ్ఱము - మనస్సగు
తేలికగా మరి - లొంగదు అది విను
నాధ్యానముపై లగ్నము చేసిన
అంతసులువుగా ధ్యానము నిలవదు

అట్టి మనస్సును కట్టుటకొరకు
బుద్ధి - ముందు పరిశుద్ధముకావలె
జితేంద్రియత్త్వము ప్రాణాయామము
పట్టుబడినచో బుద్ధి స్వచ్ఛమగు

అట్టిబుద్ధితో సాధనతోను
వశమున నుంచగవచ్చు-మనస్సును
దానితొ ఆత్మను వశపరచుకొన -
తిరుగలేని స్థితి కలుగునప్పుడు

భవసంద్రమును దాటించగల
గురువును - తప్పక ఆశ్రయించవలె
ఆగురువిచ్చిన ఉపదేశముతో
సాధనతో - మరి మనస్సులొంగును

యమ - నియ మాసనాదులవి
యోగ మార్గములు - తత్త్వము-విద్య
శుభకరమైన నాదు మూర్తిని
అర్చించుట యను క్రియతో నంత

నన్నుతెలుసుకొని - చేరుకొనుటకు
ప్రయత్నించవలె-అంతకు మించిన
మరియొక మార్గము - నన్నుజేర్చదు
యోగి చేయడు నిషిద్ధకర్మలు

అటుల నిషిద్ధకర్మలు - చేసిన
అట్టిపాపము - తొలగుట కొరకు
జ్ఞానాభ్యాసముతోడను - లేదా
నాధ్యానములో లగ్నము కావలె

అటులచేయక - ప్రాయశ్చిత్తముకు
ఎంత తిరిగినా ఫలితము శూన్యము-
వ్రతనియమాదుల-పాపముతొలగద?
అన్న ప్రశ్నకు - సమాధాన మది

తనమార్గమున తాను నడువవలె
భక్తుడు భక్తిని గురిగా నెంచి
యోగి - యోగమును వ్రతముగనెంచి
త్రోవమారక చరించవలెను

కృచ్ఛాది - వ్రతములు ఆచరించుట
దోష నివృత్తిని కలుగజేయదు
భక్తి - యోగ - మార్గమ్ముల మాత్రము
వారి దోషములు నివృత్తి అగును

నాయందున మరి మనస్సునిలపి
సుస్థిరమైన భక్తితొ కొలచిన
వారి కోరికలు క్రమముగ తగ్గి
చివరకు కోర్కెలు నశించి పోవును.

జ్ఞానవైరాగ్యసాధన వల్లను
లభించనట్టి ఫలముతప్పక
భక్తి యోగమున అచిరకాలమున
లభించితీరును నిస్సందేహము

అచంచలమ్ముగు భక్తి భావము
నాపైకలిగిన - కుదురుకున్నచో
ఆతని - ఆనందమునకు ఉద్ధవ!
హద్దులుండవు అన్నది తెలియుము

అట్టిభక్తులు నిరంతరమ్ము
నాపై భక్తి కోరుకుందురు
అంతకుమించిన కోర్కెలు వారికి
వుండనె వుండవు - అన్నది నిజము

పంచ భూతముల నెలకొను అగ్ని
కల్పాంతము వరకదియుండినను
ఆశ్రయించిన వస్తువు వలన
వెలుగుట – ఆరుట – జరుగుచున్నది

అటులే జీవుడు – కర్మలవలన
పుట్టుట గిట్టుట అనెడి దశలను
అనుభవించుచు కనబడుచున్నను
నిజముగ – చచ్చుట–పుట్టుటలేదు

ఉత్పత్తి–పెరుగుదల–జన్మించుటయు
బాల్య – కౌమార–యౌవన–నడిమి
జరా–మృత్యువులు–తొమ్మిది దశలు
శరీరమ్మునకు కలుగుచున్నవి

పుట్టుకనుండి ఐదు ఏండ్లుగా
బాల్యము అనుచు చెప్పబడినది
పదహారు వరకును కౌమారమ్ము
నలుబది ఐదుగ యౌవ్వనమగును

ఆపై అరువది మధ్యవయస్సు
అరవైదాటిన – వార్ధక్యమ్ము
జీవుడు వీటిని ఆశ్రయించును
క్రమముగ దేహము వదలుట జరుగును

తనయునిగా మరి పుట్టి–పెరుగుట
తాత – తండ్రిగా–మరణించుటయు
తెలిసిన జీవుడు – పుట్టడు చావడు
కావున జీవుడు వాటి కతీతుడు

విషయము తెలియక అజ్ఞానముతో
కర్మబంధములు కలిగియుండును
శమదమాదికర్మలవలన
దేవత్వఋషిత్వము లందుచుండును

కామాది రజోగుణ కర్మలవలన
అసుర – మానవ – జన్మలనందును
తమః ప్రధాన కర్మలవలన
పిశాచ – జంతు – జన్మలు పొందును

కోర్కెలు లేని జీవుడు కూడా
బుద్ధి గుణములు తనలో నిలపి
ఆవిధముగ ఆడుచుండును
అస్వతంత్రుడు అన్నటు నడచును

పడవ ప్రయాణము చేయువానికి
పరిసరమ్ములు నీళ్ళును కూడా
కదలుచున్నటు అగబడునట్టుగ
జీవునియందు గుణములు కనబడు

కోర్కెలపై ఆసక్తియును మరి
విషయా నుభవము ఆత్మకు లేవు –
కలలో విషయము కరిగిపోవును
నిజానుభవముకు రాదు ఎన్నడును –

ఆవిధముగ సంసారబంధము
ఆత్మకు వుండదు – తెలియుమునీవు!
కలలో కష్టము జీవుడు పొందును
అదిపోవును మరి జాగ్రదవస్థతొ

ఉద్ధవా విను! విషయబంధము
సంసార హేతువు అన్నది తెలిసి
నివృత్తి మార్గము ననుసరించుట
విధిగా - నీవు తెలియగ వలెను

నరక మార్గముకు ఈడ్చుకుపోయే
ఇంద్రియాలకు వశుడవు నీవయి
విషయభోగముల నాశించకుము
జరిగెడిదంతయు భ్రమయని తెలియము

ప్రలోభాలకు - ఉద్రేకములకు
బుద్ధిమంతుడు గురికాకూడదు
దూషణ భూషణలన్నియు వొకటను
ఆత్మనిష్ఠుడు ఉద్ధరించబడు.

శాంతి - సహనములు-అలవరచుకొన
తేలికయిన విషయమ్ముగాదది
కీడుచేసినచొ మరచుట ఎట్లు
వివరించుమయా! విశ్వవందితా!

అనగా పలికెను అనంతమూర్తి
పరుషోక్తులనే - వాడి శరములవి
సాధుజనులను హింసించునయా!
దానికి వినుమొక గాధయిప్పుడు.

॥శ్రీ కృష్ణచరితము॥



## 10 భిక్షుగీత

అవమానములతొ కన్నుతెరచిన
భిక్షువుగాధ తెలిపెద నిపుడు
అవంతిదేశపు బ్రాహ్మణు డొకడు
సిరిసంపదలు కలిగి యుండెను

ఎంగిలిచేతితొ కాకినికొట్టని
క్రూర - లోభి - తన సంతానముకు
చివరకు ఆలికి - ఏవగింపయె
పశువులనైనా - తిననియ్యడయె. -

వర్తక - వ్యవసాయమ్ములతోను
ధనపతి అంతటివాడై నాడు
ధనము దాచుటే పరమావధిగా
లోభిగమారెను - తినడూ పెట్టడు

పండుగ - పబ్బములసలే లేవు
అడిగిన పిల్లల చిదుక కొట్టును
యాచకుడొచ్చిన దూషణలాడును
లోభిగుమ్మమును ఎక్కుట మరచిరి

దైవనివేదన - పితృనివేదన
వృధాఖర్చుయని మానివేసెను
బంధువులెవ్వరు - తననుచూచుటకు
రాకుండగ - జాగ్రత్తనుపడెను

కాలక్రమమున భార్యా పిల్లలు
లోభిగోడు పట్టించుకొనకను
పలుకుట మానిరి - విసిగిపోయిరి
మేతకు - పశువులు అరచుచుండును

జీవితవృక్షము మహోన్నతముగా
విస్తరించుటకు త్యాగ భోగములు
హేతువులయ్యా! అవిలేనిచొ మరి
మొద్దుబారి ఆ తరువు పాడగును

అటుల - లుబ్ధుని బ్రతుకు చెడినది
అందరు విరోధులొకటైనారు
అందినదంతా సంగ్రహించిరి
అయ్యో అనెడి వాడేలేదు

అదే - అదనని - దొంగలుచేరి
దొరికినదంతా - దోచుకు పోయిరి
కొంతసొమ్మును ప్రభువులుగైకొన
చివరకు వాడు బికారి అయ్యెను

పిలిచిన పలికే - దిక్కేలేదు
మనోవ్యాధితో తల్లడిల్లెను
కన్నుమూసినా తెరచినగాని
పోయిన ధనము గుర్తుకువచ్చును.

ధన స్మరణతొ మరి దుఃఖమెగసెను
కంటినీటితో బొంగురుగొంతుతొ
పలికిన వినెడి నాధుడులేక
బ్రతుకుపైననే - విరక్తి కలిగెను

ఆర్జించుటకు కష్టపడితిని
సుఖభోగములు మరచిపోతిని
ఏమిమిగిలినది - చివరకునాకు?
తృప్తిగ తినక - పెట్టక పోతిని

ధర్మకర్మలు ఆచరించక
ధనము దాచుట వృధాప్రయాస
భూతతృప్తి కలిగించనిలోభి
ఆత్మనాశనము చేసిన క్రూరుడు

లోభగుణమది యశోదానముల
చేరనీయక అంతము చేయును
ధనము దాచుటను - మరియొక శ్రమతో
గడ్డివాముకడ కుక్కగ మిగులును

ఆర్జించుటకు ఎన్నిమోసములు
అవలంబించియు చివరకు - దుర్గతి
భేద - స్పర్ధలు పెంచుకున్నటు
బంధువిరోధము కొనుక్కొన్నటే -

తల్లిదండ్రులు - తోబుట్టువులు
కడకు - బిడ్డలే కరకుగ మారి
ప్రబలశత్రువులు - ఐపోయెదరు
ధనముతొ వచ్చు-నసూయ-నిర్దయలు.

ముక్తిలభించేమానవజన్మలొ
అవివేకముతో ధనార్జనమ్ము
త్రోవమరచిన చేరుట నరకము
దానధర్మములు ధనముకు కావలె

ధనార్జనమ్ముకు - బుద్ధి బలములు
అర్పించితిని - ముదుసలినైతిని
రాలిపోయెడి తనువని తెలిసెను
కళ్ళుతెరచెడి జ్ఞానము కలిగెను

పేదరికమ్ముతొ నిజముతెలిసెను
సర్వేశ్వరునికి దయకలిగినది
కావున సంపద హరించినాడు
గమ్యము నాకు చూపించాడు

దైవానుగ్రహమున్నచొ నింక
మానవునికిక తక్కువ వుండదు
అనుచు తలంచి విరాగిగానయి
భిక్షాటనతో మునిగామారెను

ఒడుదుడుకులవి లేనట్టిదియగు
రాచబాటకు - నాజీవిత మన్
శకటమ్మును - తా - నిలబెట్టాడు
ఎంతదయాళువొ - పరంధాముడు

స్వపరదేశభేదము మరచి
శుచి శుభ్రతలు అన్నవి మరచి
భగవానునిపై మనస్సునిలపి
యోగసాధనలొ మునిగిపోయెను

ప్రాణావసాన సమయము వరకు
చెదరని భక్తితొ మనసును నిలపి
పరమేశ్వరుని ధ్యానించెదను
తనువు - మనసు - క్షాళనయగును

దొరికిన తినును లేదా మానును
ధనికుడు పేదా అన్నదిలేదు
శూన్యములోనికి చూచి నవ్వును
కళ్ళుతెరచితిని నీదయ అనును

తపోనియమముల ఇహమును వదలి
ఆత్మజ్ఞానముకు శరీరమ్మును
దహింపజేసెద - ఆపై గతిని
తనువునిచ్చిన దేవుడు చూచును

ఆవేశముతో ఆ పరమాత్మను
కాంచినట్టుగా ఆనందముతో
కంటినీటితో కదలుచుండును
ఆతనిస్థితిని తెలియరెవ్వరును

తనువుపైన మమకారము వదలెద
దేవతలందరు - ఆశీస్సులనిడి
నా గమ్యమునకు - సాయపడవలె
అనుచు - వారికి వందనమిడెను

కాలక్రమమున వృద్ధుడయ్యెను
జనులందరును గేలిచేసిరి
ఈసడించిరి - అవమానించిరి
టక్కరియనుచు పరుషములాడిరి

జీవితాంతము రాజ్యభోగముల
మునిగి తేలిన ఖట్వాంగరాజును
ముహూర్తకాలములోన వేల్పులు
ముక్తిపథమునకు పంపుట జరిగెను.

కొట్టిరి తిట్టిరి నీళ్ళనుపోసిరి
ధనముకొరకు ఈ వేషము అనిరి
దుర్గంధజలమును త్రాగించిరట
విరాగి విషయము తెలియదువారికి

విధివిలాసము అనుభవించవలె
అనుచు బాధలు ఓర్చుకు నిలచెను
ఎందుకింతట హేయపు బ్రతుకు
అనుచు విధిని తా తిట్టనెలేదు.

సాత్వికమైన యోగసాధనతొ
మనఃప్రాణేంద్రియ వ్యాపారమ్ములు
నిలపివేసి మరి సత్వధైర్యముల
అన్నీ ఓర్చుకు – పలికెనిట్టుల

పరులెవ్వరు బాధించుటలేదు
మనసే మూలము సుఖదుఃఖములకు
కావున మనుజులు గ్రహములు వేల్పులు
కల్పించిరన – వట్టిభ్రమయగు

చేసెడిదంతయు మనస్సుఅనుచు
శృతులు చెప్పినవి – గ్రహించవలెను
సాత్విక రాజస తామసగుణములు
వాటిఫలితముగ జన్మలువచ్చును.

పుణ్యపాపముల ఫలితము జన్మలు
సంసార చక్రమటు తిరుగుచుండును
ఆత్మఅనెడి ఆ సర్వేశ్వరుడు
జీవునికెంతో స్నేహితుడగును

జ్ఞానమూర్తిగా ఆత్మ వెలుగును
మనస్సునకు మరి లొంగినజీవుడు
విషయానుభవ మందుచుండును
ఎట్టికాంక్షలులేనిది – ఆత్మ.

కావున మనస్సును నిగ్రహించిన
జీవుని జన్మ చరితార్థమగు
ధర్మానుష్టాన దానధర్మములు
మనోనిగ్రహముకొరకు మాత్రమే –

మనోనిగ్రహము ఉత్తమయోగము
బహ్మేంద్రాదులు దేవతలున్ను
మనస్సునకు మరి లొంగినవారే
స్వాధీన మనస్కుడు పూజనీయుడు

మనస్సు ప్రభావము–స్నేహ–విరోధము
అవివేకముతో – నాది అనుచును
విర్రవీగుచు – తిరిగెడి దేహము
అశాశ్వతమ్మని గ్రహించలేరు.

ఉత్తమ – అధమము లన్నవి కలవు
కావున పవిత్ర–అపవిత్రములున్నవి
శాకములందు – బచ్చలి యోగ్యము
మట్టుబచ్చలి దోషకరమ్మగు.

కొన్నిధర్మములు – కొన్నిచోటుల
ఆచరించక – వదలుట ధర్మము
యాత్రార్థికి మరి కొన్నిసాగవు
అయినా అవ్వి ధర్మములగును

రాజ్యపాలకుడు కొన్నిసమయముల
నడచిన తీరు అధర్మమగును
అయోగ్యమైనవి వ్యవహారికముగ
ఆచరించుట జరిగితీరును

మనువు మొదలగు ధర్మవేత్తలు
చెప్పిరి ధర్మము - దానిని నేను
లౌకికపరముగ తెలుపుచుంటిని
కర్మాచరణ తప్పదు జీవికి

దేశకాలాది భావమ్ములతో
గుణదోషములు కర్మకు కలుగును
నల్లలేడియది తిరిగిననేల
పవిత్రమ్మని చెప్పబడినది

సత్పురుషులు మరి లేనిదేశమది
అపవిత్రముగా చెప్పబడినది
పగటివేళలో పూర్వభాగము
కర్మాచరణకు యోగ్యమైనది

అపవిత్రతయు పవిత్రతయును
ద్రవ్యమ్మునకు కలుగుచుండును
అన్యాయార్జిత విత్తము - చెడ్డది
దానగుణముతో మారదు - మంచిగ

వేదవేత్తలు నిర్ణయించిన
విషయము-చెడ్డ-మంచిగ తలతురు
ప్రోక్షణవలన - పూలు శుద్ధియగు
వాసనచూసిన పూవు - నిషిద్ధము

వర్షాకాలము నందున నీరు
మూడుదినములు శుచిగా నెంతురు
స్నాననియమము - ప్రమాదస్థలమున
ఉల్లంఘించిన దోషమురాదు

దేశకాలద్రవ్య అవస్థలు
తెలుసుకు శౌచము పాటించవలె
ధాన్యమ్మునకు - వాయువు వల్లను
పంటకు - ఎండయు - శుద్ధికలుగును

కట్టెకు శుద్ధి - నీరు - మంటలు
కరిదంతములకు ఎముకలకున్ను
గాలి - ఎండల వలన శుద్ధియగు
నూలుబట్టలకు శుద్ధి - నీటితో

పాలు - నేయి - తేనెకు - వాటిలో
రోమములున్న శ్రద్ధగ తీసి
మరగించుటచే - శుద్ధికలుగును
బంగారము ఆదిగా గల ధాతువులకు.

అగ్నితాపము - శుద్ధి నొసంగును
తోలుకు కలుగును శుద్ధి - తైలముతో
ఇటుకలు మొదలగు వాటన్నిటికి
వాటిని వాడుట శుద్ధిగూర్చును

ఉప్పునీటితో వాసన తొలగును
అహంకారికి - స్నానదాన తపస్సువల్లను
శుద్ధియగునని - చెప్పబడినది
అట్టివాడు మరి కర్మకు అర్హుడు

ఎటుచూచినను నాయందున మరి
అచంచలమ్మగు భక్తిని కలిగి
బుద్ధిని నిలపిన ఎవరైనా మరి
పరిశుద్ధుడగు - నిస్సందేహము

గురుముఖతః మరి ఉపదేశమ్ము
మంత్రమ్మునకు శుద్ధినొసంగును
కర్మలన్నియు ఈశ్వరపరముగ
ఆచరించుట - శుద్ధినొసంగును

దేశకాలముల ననుసరించుచు
ఆరువిధముల శుద్ధి ధర్మమగు -
ఒకోసమయమున-గుణము-దోషమగు
మరియొకచో మరి-దోషము గుణమగు

దానమన్నది దోషమంటిని
ఆపదలోనది దోషముగాదు
ఒకపరి - పరుల దోషము మరొకరి
గుణముగ - లెక్కకు వచ్చుచుండును

వైరాగ్యచింతన - లేనివానికి
కుటుంబత్యాగము - దోషముఅగును
విరాగికి అది గుణముగ భాసిలు
మద్యపానము కొందరి ఎడలను

జాతి గుణముగా పరిగణింతురు
స్త్రీసంగమది - యతికి దోషము
గృహస్థునకు మరి దోషముగాదు
విషయభోగములు ఆసక్తిపెంచును

ఆసక్తివల్లను కామము కలిగి
అది కారణమగు కలహమ్మునకు
కలహము పెరిగి క్రోధము అగును
క్రోధమువల్ల మూర్ఖత్వము పెరుగును

విషయలోలుని బ్రతుకు శూన్యమగు
పరమాత్మను వాడు తెలియగలేడు
బాధలుపెట్టి హింస పెట్టెడి
వాని బ్రతుకది అధ్వాన్నమగు

చేదుమందును మ్రింగుటకొరకు
తీపి ప్రలోభము పెట్టినట్లుగా
స్వర్గప్రలోభము వల్లను - జనులు
యజ్ఞకర్మలు ఆచరింతురు

సత్కర్మలట్టుల ఆచరించగను
మనస్సుదానికి సిద్ధపడి మరి
సత్కర్మల - సద్బుద్ధుల నెలవగు
నరకభయమున దుష్కర్మలు చేయరు

సిరిసంపదలు - ఆలుబిడ్డలు
అస్థిరమైనవి అన్నది తెలియక
అనుభవించుచు ఏవగించుకొని
కొంతకాలముకు విరక్తుడగును

కొందరుమాత్రము వాటిని వదలక
వేదవిహితమగు కర్మలు అనుచు
కర్మలుచేయుచు - తిరిగి పుట్టుచు
జన్మల వలయమునందు పడెదరు

అవివేకముతో వేదార్థమును
తెలియగలేక - వారుచేయునది
వేదవిహితమగు కర్మలు అనుచు
తలచుచుందురు - కర్మల బలమది

వ్యాసుడు మొదలగు మహామునులు మరి
కర్మకాండ పరమార్థమొసగునని
చెప్పనెలేదు - కానీ కొందరు
వివరము తెలియక - ఆచరింతురు

అజ్ఞానములో నున్నవారు - నను
తమలోనున్నను - గమనించరయా!
యజ్ఞముచేయుట మోక్షఫలమునకు
మొదటి మెట్టుగా - తలంచవలెను

పరలోక సుఖమని యజ్ఞముచేసిన
ధన-పశువ్యయము వ్యర్థమే సుమా!
అట్టి సుఖమది భ్రాంతిమాత్రమే
జీవహింసయై దుఃఖభాజకము

సంద్రముకావల వర్తకమ్ముతో
ధనముగడించగ - ఉన్నధనముతో
సంద్రముదాటిన వానికి - ఫలము
ఉన్నది పోవుట - అటులే యజ్ఞము

యజ్ఞకర్మలతొ అమరసుఖములని
ఆరాటముతో చేతురు వాటిని
నా నామ ధ్యానములు మరచిపోతురు
అట్టివారికి - ఫలితము శూన్యము

హృదయాకాశములోన పుట్టి మరి
మనస్సు స్పర్శను పొందినట్టిదై
నాదము - అంతట-ప్రాణమునుండి
వెలువడు ఉద్ధవ - వింటివ తీరుగ

నాదరూపములో. - ఉందును నేను
బ్రహ్మనిష్ఠులది గ్రహించగలరు
అట్టినాదము ప్రణవమంత్రమగు
'ఓం కారమ్మై నిండి యుండును.

అట్టినాదమది ఛందోమయము
ఇరువది నాల్గు అక్షరమ్ములుగ
గాయత్రి మంత్రము ఛందోబద్ధము
ఉష్ణిక్ఛందస్సుకు ఇరువది ఎనిమిది

మరినాల్గు ఎక్కువ అక్షరమ్ములు
గలిగినదయ్యా! అనజ్ఞాఛందస్సు
బ్రహత్ పంక్తి త్రిష్టుప్ పుట్టినవి
అట్టిఛందో వాక్కు వెలయును

సర్వము నేనై మాయామాత్రమగు
జగత్తున - కనబడు చుండుటవలన
జగత్తువేరు - నేను వేరను
భావన కలుగుట - భ్రాంతివల్లనే

నేను కానిది - నేను లేనిది
ఏమియులేదు - తీరుగ వినుము
సమయమునందు - సర్వస్వమును
నాలో - లీనము చేసుకుందును"

అంతట అడిగెను ఉద్ధవుడచట
స్వామీ నీవు దయగొని నాకు
తత్త్వమనగను - వాటిసంఖ్యను
మతమున - పెద్దల నిర్ణయమ్ములు

అడిగినవెంటనే తెలిపితివయ్యా!
స్వామీ దయగొని ప్రకృతి పురుషుల
సంబంధమును విశదపరచుము
సందేహమును తీర్చగ తగుదువు

తనలో నన్ను దర్శించగలిగెడి
శక్తినిగలిగి - తరించగలడు
విషయము తెలియక అంధుని మాదిరి
నరకములో పడిపోదురెందరో

"మహద్రూపముతొ నిండినట్టిది
మార్పు చెందునది ప్రకృతిఅగును
అట్టిమార్పును చెందనివాడు
పురుషుడు అన్నది తెలియగవలెను

పురూరవుండను సార్వభౌముడు
ఊర్వసి - ప్రేమతొ సర్వము మరచి
అవివేకముతో నడచి - చివరకు
విరక్తికలిగి వైరాగ్య మొదవెను"

నాదుమాయతో సంబంధించి
గుణరూపములు మూడుగ నున్నవి
ఆధ్యాత్మము మరి అధిదైవతమ్ము
ఆపైమూడవ అధిభూతమ్ము

అంతట అడిగెను ఉద్ధవుడచట
రూపరహితునకు రూపముకల్పించి
యోగులు - భక్తితొ గొలుచు చుందురు
వారి కోర్కెలు తీర్చెద వెటుల.

దృష్టిఅగును అధ్యాత్మమ్ము
రూపమ్మదియగు అధిభూతమ్ము
చక్షుగోళమున ప్రవేశించిన
తేజో అంశయె - అధిదైవతము

అంతటపలికెను - అనంతమూర్తి
సర్వవర్ణముల సమచితమైన
పూజావిధిని తెలిపెదవినుము
నాదుమూర్తిని చేసుకొనుట విను

సూర్యబింబము కంటికి కనబడు
దృశ్యశక్తి మరి చూపగలుగును
దృష్ట - రూపము - దృశ్యశక్తి యది
మూడు శక్తులని తెలియుచున్నది.

రాయి - మట్టి - కట్టెతొ చేసిన
నాదుమూర్తిని నెలకొల్పి దానిని
శ్రద్ధా భక్తుల పూజచేతురు
లోహ ప్రతిమలు - విశేషమైనవి

నన్నుచూచెడి శక్తిగలిగిన
మానవదేహము ధరించినట్టి
మనుజుడు నన్ను ఆరాధించుచు
నాదు భక్తిలో - లీనము అగుచు

అట్టి ప్రతిమలను పూజ చేసెడి
వారికి నేను ప్రసన్నుడనయ్యెద
ఈలోకములో మనుష్యులకు మరి
ధ్యానము నిలువదు కష్టమైనది

కావున నాదు సుందర ప్రతిమలో
నాదు రూపమును ధ్యానించుచును
పాలకడలిలో - పన్నగశయనుడు
అనుచు నన్ను - మరి మదిలో నిలపి

తెల్లనిస్వచ్ఛ వస్త్రము మరియు
ఆభరణంబులు సుమహారములు
లేపనమ్ములు - నైవేద్యములతో
షోడశపూజను విధిగాచేసి

మనస్సునిండుగా భక్తి ప్రపత్తుల
ప్రియమగు వస్తువు లర్పణచేసి
తృప్తిని - నాకు కలిగించి మరి
నా రూపును తను ధ్యానించవలె

దివ్యాంబరములు దివ్యమాలలు
శంఖ చక్ర కిరీట - మకుట ధారిగా
దివ్యమంగళమూర్తిగ నన్ను
ఏకాగ్రతతో ధ్యానించినచో

నాయందుననే మనస్సుకలిగి
ముక్తిమార్గమును చేకొను తప్పక -
నీవీ విధముగ - నియమనిష్టలతో
యోగ నిష్టునిగ - బదరికాశ్రమము

చేరుము - అచట నేను తెలిపిన
సాంఖ్య యోగము మదిలో నిలపి
కలియుగాంతము వరకు నచ్చట
వసించుమని - శ్రీకృష్ణుడు చెప్పగ

ఆనందముతో ఉద్ధవుడంతట
శ్రీహరి పాదకమలమ్ములను
హృదిలో తాను ప్రతిష్టించుకొని
బదరికా శ్రమము చేరెను వింటివ!

అని శుకయోగి చెప్పగ - రాజు
విష్ణుకథలివి ముక్తి పథములు
మంగళ ప్రదములు - ఓమునిచంద్రా!
నాజన్మమ్మిది చరితార్థమైనది.

అనుచు పలికెను పరవశమ్మున
స్వామీ - కృష్ణుడు - ఏమయ్యెనయా!
యాదవులెటుల ప్రవర్తించిరి
ద్వారక - ఎటుల నున్నదొ తెల్పుము.

॥శ్రీ కృష్ణచరితము॥



## 11 శ్రీ కృష్ణ బలరాములు వైకుంఠమున కరుగుట

అంతట రాజుకు చెప్పెను మౌని
దుష్టశిక్షణ చేసిన కృష్ణుడు
బలరామసహితుడై ద్వారక కొచ్చెను
అచ్చటగాంచెను భీభత్సములను

యాదవులంతట మత్తుగ్రతాగి
మత్సరంబున రోషపు మాటల
ఒళ్ళుతెలియని స్థితిలోనుండి
యుద్ధోన్మత్తులుగానైనారు

వారిలొ వారికి జగడము పెరిగి
రథ గజ తురగ వీరులందరితొ
పోరుచు పోరుచు నేలకొరిగిరి
బలరామకృష్ణుల మాటవినరయె.

అటులా యాదవ సమూహమ్ములు
అంతమగుటది చూచిన వారు
యోగబలమున బలరాముడంతట
వైకుంఠవాసముకై వెడలగను

మనస్సు - క్లేశమునందిన - కృష్ణుడు
ఒక్క ప్రదేశమున గుబురు చెట్లుగల
తావున తాను విశ్రమించుటకు
నడుమును వాల్చి పాదమ్ములను

ఒక్కదానిపై మరియొకటుంచి
మెల్లమెల్లగా ఆడించగను
బోయెవొకడు ఆ కదలెడిపాదము
లేడి చెవియని - మదిలో భ్రమించి

దూరము నుండి శరమును వదలెను
ఆశరమునకు అరగతీసిన
ముసలముకొన యది అమర్చబడినది
అంతట హాహారవము వినబడెను

పరుగున వాడు వచ్చిచూచెను
పరంధాముని గాంచెనచ్చట
రక్తసిక్తమై పాదమున్నది
కట్టలు తెగి వాడేడ్వ సాగెను.

అంతట కృష్ణుడు అనునయించెను
పూర్వజన్మ కృతకర్మనంతను
ఎంతటివారు అనుభవించవలె
నిమిత్త మాత్రుడ వీవు నిషాదా!

అనిపలుకుచును నందకిశోరుడు
ప్రాయోపవేశ దీక్షను వహించి
ప్రాణత్యాగము చేయదలంచెను
వైకుంఠవాసమున కేగ దలంచెను

అంతట సారథి దారుకుండు అట
కృష్ణుని వెదకుచు అచటికివచ్చి
ముకుళిత కరముల పదములనంటి
కంటినీటితో నిలబడి పలికెను

నిన్నుచూడని కన్నులు - నిష్ఫలములు
నిన్ను పొగడని నాలుక - రసవిహీన
నిన్ను తలచని రోజు - నింద్యమగును
నన్ను చూడుము - కరుణించు-నీలవర్ణ

అనుచు వగచుచు దారుకుండు - తా -
విశదపరెచెను - వాసుదేవునికి
యాదవులందరు - సమసిపోయిరని
బంధువు లందరు చెదరిపోయిరని

ద్వారకకేగి ఏమిచెప్పుట
అనిన - దారుకుని చూచి అంతట
పలికెను కృష్ణు - డుద్వేగముతో -
ఆసమయములో - చిత్రము జరిగెను.

దివ్యాయుధములు దివ్య రథంబు
చూచుచుండగనె - మాయమయ్యెను
అంతట పలెకెను వాసుదేవుడు
అక్రూర విదురులకు తెలుపుము అంతయు

కిరీటితోను చెప్పుము యిపుడే
స్త్రీబాల వృద్ధుల నందర జేర్చుకు
హస్తినాపురికి పొమ్మని చెప్పుము
అనగా నాతడు మరలెను వెంటనె

అటుల దారుకుడు వారికి చెప్పెను
అంతటిలోన ద్వారక యంతయు
సంద్రగర్భమున మునిగ పోయినది
కన్నుల కానక - అదృశ్యమైనది

అంతటిలోన నారాయణుడు
చతుర్భుజునిగ అవతరించెను
శతకోటి సూర్యుల తేజముగలిగి
దివ్యాయుధములు మణిహారముల

కౌస్తుభమణితో పీతాంబరముతొ
వెలుగులీనెడి వనమాలతొ మరి
వైకుంఠమునకు బయలుదేరెను
జయజయధ్వానము లెగసెనొక్కపరి

నారదాదిముని గణములు మరియు
బ్రహ్మరుద్రాది దేవత లందరు
జయజయధ్వనులతొ ఆహ్వానించగ
వచ్చిరి - స్వామిని గొనిపోవంగ

వారందరితో వైకుంఠమునకు
విశ్వవంద్యుడు అరుగుదెంచెను
కన్నులుతెరుచుకు - వైకుంఠమ్ము
చూచెను స్వామిని - పులకరించెను

ఈ కథ వినిన - వ్రాసిన వారికి
కలిమి - కీర్తి - భాగ్యము కలుగును
ఆయుర్దాయము పూర్తిగ గలిగి
జనుల పొగడ్తల నందుట - నిజము

చిరునగవుతొ మరి నల్లని మేనితొ
లక్ష్మికినెలవై యురము ఒప్పగా
ఎత్తగుభుజములు కుండలమ్ములతొ
కృపారసము ఒలికించు కృష్ణుడు

కన్నులుమూసిన తెరచిన గాని
కనబడునంతటి భాగ్యమునొసగగ
కమలనాభుని - ప్రార్థించెదను
కరివరదుడు మరి కాదనగలడా!

రాజుల ఏలిక రఘుకులరాజు
రాజీవాక్షుడు శ్యామసుందరుడు
సీతానాధుడు ధర్మస్వరూపము
రాముడు నన్నుగాపాడవలె.

శ్రీ కృష్ణచరితము - కర్ణపేయము
వ్యాసమౌనికే - శాంతినొసగినది
పోతనయ్యా - పులకించి పలికినది
భవ భయ హారిణి - భాగవతమ్ము॥

ఓం శాంతి - శాంతి - శాంతిః





సర్వేజనాస్సుఖినోభవన్తు
లోకాస్సమస్తాస్సుఖినోభవన్తు





**సర్వం శ్రీ సీతారామచంద్ర పాదార్పణమస్తు**



(మకుటం)

శ్రీ కృష్ణచరితము - కర్ణపేయము
వ్యాసమౌనికే - శాంతినొసగినది
పోతనయ్యకు - పులకించి పలికినది
భవ భయ హారిణి - భాగవతమ్ము॥

# శ్రీమద్భాగవత - మకరందము

## (ద్వాదశస్కంధము)

### విషయ సూచిక

సర్గము | పేజీ







శ్రీరామ

ఓం - నమో - వాసుదేవాయనమః

# శ్రీమద్భాగవత - మకరందము

## (ద్వాదశస్కంధము)

శ్రీకరగుణములతో శోభిల్లు
శ్రీలొసంగెడి దయాసింధువు
శ్రీపతి నరుడై దశరథసుతుడై
శ్రీనిగ్రహించెను హరువిలువిరచి

ఆ విధముగను శుకయోగీంద్రుడు
వాసుదేవ నిర్యాణము వరకు
భాగవతమ్మును వినిపించెనని
సూతుడు చెప్పెను మునివర్యులకు

ఆపై రాజు శుకయోగీంద్రుని
అడిగెనిట్టులని పలికెను సూతుడు
ఓ పుణ్యాత్మా-వాసుదేవుని-దివ్యగాధలను-
జీవ - పరమాత్మల వివరమ్ములను

హరిపూజలను చేయువిధానము
జ్ఞాన యోగములు తెలిపితి వీవు
విజ్ఞాన వంతునిగ చేసితి వీవు
భావికాలమును తెలుపుము దయతో -

అంతట పలికెను మౌని చంద్రుడు
రాజా - దానిని చెప్పుట కష్టము
అయినను నేను సామర్థ్యముతో
చెప్పెదనయ్యా! భావికాలమును

భవిష్యత్తులో - రాజుల సంతతి
బృహద్రధునకు - బురంజయుండు
వానికి మంత్రి - శునకుండగును
ఆతడు రాజును - చంపి - ఏలికగు

వానికుమారుడు ప్రద్యోతకుడగు
ప్రద్యోతకుని తనయుడు-విశాఖరూపుడు
వానితనయుడు - నందివర్ధనుడు
నూటముప్పదిఎనిమిది ఏండ్లుగ పాలన -

తదుపరి రాజు శిశునాగుండగు
అతని తనయుడు - కాకవర్ణుడు
వాని తనూజుడు - క్షేమవర్మడు
వాని తనయుడు క్షేత్రజ్ఞుండు

క్షేత్రజ్ఞు తనయుడు విధిసారుండు
వానికి తనయుడు అజాతశత్రుడు
అతని తనూజుడు దర్భకుండగు
వాని కుమారుడు అజయుండగును

అజయుని తనయుడు నందివర్ధనుడు
వాని కుమారుడు మహానంది యగు
శైలనాగులీ పదిమంది పాలన
మూడు వందల అరవై ఏండ్లు -

ఆఖరివాడగు మహానందికి
నీచవనితతో పుట్టిన తనయుడు
మహాపద్మపతి - బలవంతుండగు
వానితొ ఆఖరు - రాజవంశము

అటుపై ఏలిన రాజులందరూ
అధర్మపరులై గుణహీనులగు
మహాపద్మపతి అతి బలాఢ్యుడు
తిరుగులేకను రాజ్యమేలును

వానితనయులు ఎనిమిది మంది
సుమాలి మొదలగు వారాసుతులు
వారి పాలన వంద ఏండ్లగు
మహాపద్మని నందుడందురు

నందవంశముగ పిలతురు దానిని
వారి వంశీయులు కార్మకుడాదిగ
తొమ్మిదిమంది రాజులగుదురు
వారిని - పగతో చాణుక్యుడు చంపి

మౌర్యవంశమున ఉద్భవించిన
చంద్రగుప్తుని రాజుగ చేయును -
చంద్రగుప్తునికి వారిసారుడు
వాని తనయుడు అశోకవర్ధనుడు

వాని సుతుడు సుయస్సుడగును
సంయుతుడాతని తనూజుడగును
వానికుమారుడు శాలిశూకుడు
వాని తనయుడు సోమశర్మయగు

సోమశర్మకు శతధ్వన్వుండు
వానితనయుడు బృహద్రధుండు
వీరందరును మౌర్యులగుదురు
నూటముప్పది ఏండ్ల పాలనము

బృహద్రధుని మరి చంపి ఆతని
సేనాని - శుంగుడు గద్దెనెక్కును
పుష్యమిత్రుడని అతనికి పేరు
అతనితనయుడు అగ్నిమిత్రుడు

అగ్నిమిత్రుని సుతుడు సుజేష్టుడు
వాని తనయుడు వసుమిత్రుండు
భద్రకుడాతని కుమారుడగును
వానికుమారుడు పుళిందుడగు

పుళిందుసుతుడు ఘోషుడనబడు
వానికి సుతుడు వజ్రమిత్రుడు
వజ్రమిత్రునికి సుతుడు భాగవతుడు
వాని తనూజుడు దేవభూతియగు

వీరందరును శుంగవంశజులు
నూటపన్నెండేళ్ళ పరిపాలనము
వీరిలొ ఆఖరి దేవభూతి మరి
స్త్రీలోలుండై చరించుచుండగ

ఆతని మంత్రి - కణ్వామాత్యుడు
అతనిని చంపి రాజ్యమేలును
వానికి సుతుడు భూమిత్రుండు
వాని తనూజుడు నారాయణుడు

కణ్వవంశజులు వీరందరును
మూడువందల నలుబది ఐదు
వత్సరమ్ములు పాలించెదరు
పదవి నిత్యమని తలంచిరందరు

తమ పాలనయది సాగిపోవునని
భూమి తమదని విర్రవీగిరి
గజతురగములు సంపదలన్ని
శాశ్వతమనుచు తలంచరాదు

కణ్వవంశమున ఆఖరివాడగు
సుశర్ముండను రాజును-భృత్యుడు
వృషలుడు చంపి - గద్దెనెక్కును
ఆతడు ఆంధ్రజాతీయుండగు

రాజ్యపాలనము నిర్లక్ష్యపరచగ
వాని తమ్ముడు కృష్ణుడు అంతట
అన్నను జంపి రాజ్యమేలును
కృష్ణుని తనయుడు శాతకర్ణుడు

శాతకర్ణునికి పౌర్ణమాసుడు
వాని తనయుడు లంబోదరుడు
వానికి సుతుడు శిబిలకుండగు
అతని తనూజుడు మేఘస్వాతి

మేఘస్వాతికి దండమానుడు
వానికి సుతుడు హాలేయుండు
హాలేయునికి తిలకుడు కొడుకు
అతనికి సుతుడు పురీషసేతుడు

పురీషసేతునికి సుతుడు సునందుడు
వాని కుమారుడు వృకుడనువాడు
వృకునికి సుతుడు జటాపుడగును
వాని తనూజుడు శివస్వాతియగు

శివస్వాతికి సుతుడు అరిందముడు
అరింద సుతుడు గోమతి యనబడు
గోమతి సుతుడు పురీమంతుడు
వాని కుమారుడు దేవశీర్షుడు

శివస్కంధుడు వాని కుమారుడు
వాని కుమారుడు యజ్ఞశీలుడు
అతని తనయుడు శ్రుతస్కంధుడు
వాని కుమారుడు యజ్ఞ శత్రుడు

యజ్ఞ శత్రునికి సుతుడు విజయుడు
విజయుని సుతుడు చంద్రబీజుడు
వాని తనూజుడు సులోమదియగు
వారి వంశమది పెరుగును అటుల

వీరందరు నిర్విఘ్నముగా
నూటయాబది ఆరు ఏండ్లుగా
భూమిని పరిపాలించెదరయ్యా!
వారి వెనుక మరి అభీరుపాలన

అభీరులొక ఏడుగు రంతట
పదిమంది గర్దభులు ఆపైనంత
కంకవంశజులు పదారుమంది
రాజ్యపాలనము చేసెదరయ్యా!

తదుపరి యవనులు ఎనిమిది మంది
పదునాలుగురు బర్బరులున్ను
ఆపై పదమూడు సంఖ్య-కురుండులు
పదకొండుసంఖ్యలు మౌను లేలెదరు.

బలవంతులుగ కర్కశమ్ముగా
పరిపాలింతురు - వారిపాలన
ఒకవేయి - ఆపై తొమ్మిదివందల
తొమ్మిది ఏండ్లు - సాగిపోవును

మౌనుల వంశజులందరంతట
మూడువందల సంవత్సరమ్ములు
భూపరిపాలన చేసెదరయ్యా!
వారి పాలన - అంతము అగును

అటుపిమ్మటను కిలకిలయనునది
రాజధానిగా భూతనందుడును
భంగిరుడున్ను వంగిర శిశునందులు
యశోనంద - ప్రవీరకులును

రాజులుగా పరిపాలించిరి
వారిపాలన నూట ఆరు వత్సరంబులు
ఆపైరాజుల సంతతి పదమూడు
అనుచు తెలిపెను పరీక్షిత్తునకు

అందులొ ఆర్గురు బాహ్లికదేశము
మిగిలినవారు కోసలదేశము
పరిపాలింతురు - ఆకాలమున
పుష్యమిత్రుడను రాజు ఏలును

పైరాజులందరు సమకాలికులు
వారిలొ ఏడ్గురు ఆంధ్రరాజులు
ఏడ్గురు రాజులు వైడూర్యపతులగు
కొందరు రాజులు నిషధ నాధులగు

పురంజయుండు మగధనాధుడగు
ఆతడు వివేకి హరిభక్తులుండని -
పుళింద-మద్ర-యదు-ప్రదేశముల
జనులను-మార్చును మంచిత్రోవకు

ఆ మహారాజు నిష్కంటకముగ
పద్మావతి నగరమ్మునంతట
రాజధానిగా పరిపాలించును
గంగా. ప్రయాగల మధ్య భూములవి

ఆపై - సౌరాష్ట్ర, అవంతి, అభీర
అర్బుద మాళవ దేశాధిపతులు
ధర్మదూరులై పరిపాలింతురు
బ్రాహ్మణులున్ను త్రోవతప్పెదరు

చంద్రభాగా సింధుప్రాంతములు
క్రూరుల వశమగు - వారిపాలన
అతి కర్కశముగను సాగిపోవును
స్త్రీ బాల వృద్ధుల - హింసించెదరు

ధర్మదూరులై స్వార్ధమునిండి
హింసాయుతముగ పాలనసాగును
కామదాసులై జనులుండెదరు
బలవంతుండే ఏలుచుండును

జార చోరులు స్వేచ్ఛగనుందురు
కలిమిలేకను తిండిచాలకను
శాకమ్ములను భుజించు చుందురు
కొండల కోనల సాగిపోదురు

వినవట్టివగు రోగములొచ్చును
ఆవిధముగను కలికాలములో
అల్పాయుష్యము కలిగియుందురు
అట్లధర్మము సాగుచుండగను

అంతట విష్ణువు దయాసింధువు
ధర్మరక్షణ – దుష్టశిక్షణకు
శంబల–గ్రామమున–విష్ణుయశునకు
ఉద్భవించునది – కల్క్యావతారము

ఆ కల్కి అంతట అశ్వమునెక్కి
కరవాలముతో దుష్టులందరిని
తెగనరకి మరి ధర్మము నిలపును
శుద్ధమనస్కులు జనులయ్యెదరు

అటుపిమ్మట కృతయుగ ధర్మము
అడుగు బెట్టును అవని మీదను
గురుశుక్రులును చంద్రసూర్యులును
ఒక్కరాశియగు – కృతయుగంబున

జరిగిన – జరిగెడి కాలమంతయు
నీవు పుట్టిన నాటినుండియు
నందపాలన ఆరంభమునకు
వేయినూటపదునైదు ఏండ్లగు

అటు పిమ్మటను నారాయణుడు
ధర్మస్థాపన చేసి అంతట
వైకుంఠమునకు సాగిపోవును
అనుచు పలికెను శుకయోగీంద్రుడు.

అంతట పలికెను రాజవరేణ్యుడు
ఏవిధముగను చంద్ర సూర్యులు
గ్రహములతీరులు కాలగతిని మరి
వర్తించునయా విశదపరుచుము!

అనగా పలికెను శుకమహాఋషి
సప్తర్షిమండలమునందున నున్న
పూర్వఋక్షద్వయ మధ్యనందున
అర్ధరాత్రి సమయంబునందున

నక్షత్రమొక్కటి – ఉదయించుకాలము
మనుష్యకాలమున నూరు ఏండ్లయి
ఆసమయములో జనార్దనుండు
స్వస్థానమునకు సాగి పోవును

ఏసమయములో నారాయణుడు
నిజవాసమునకుఅరుగుదెంచెనో
అసమయములో కలిప్రవేశము
అటుల కలి తను పరిపాలించును

ఆపైనంత నాల్గవపాదము
అంతమునందు కృతయుగ ధర్మము
అడుగు బెట్టును అవనియందున
అనుచు వివరముగ తెలిపెను శుకుడు

రాజవరేణ్యా పూర్వపురాజుల
సిరిసంపదలు రాజ్యభోగములు
చెరిగిపోయినను వారి సత్కీర్తి
నిలబడియున్నది శాశ్వతంబుగా

కలియుగమందు చివరిభాగమున
శంతను తమ్ముడు దేవాపియును
ఇక్ష్వాకు వంశజుడు మరుత్తుయున్న
యోగబలమును కలిగినవారై

కలాప - గ్రామమునందున నుండి
వాసుదేవుని ప్రేరణకలిగి
వర్ణాశ్రమధర్మమ్ముల నవనిలో
నెలకొన చేసి - ధన్యులగుదురు

ఓమహరాజా కృతత్రేతా మరి
ద్వాపర కలియుగ వివరములివ్వి -
పోయిన రాజులు భూమికోసమే
తగవులాడిరి మిగలకపోయిరి

రాజును నేనను అహంకారముతొ
భూమినాదను మమకారముతో
జయాభిలాషతొ హింసలు పెట్టిన
రాజు - తప్పక నరకవాసుడగు

అట్టిరాజులను చూచిన భూమి
తనలో తాను నవ్వుకొనునయా!
ఈగర్వాంధులు మిగిలెడివారా!
నిజము తెలియని మూర్ఖులనుకొను

పృధు యయాతి గాధి నహుషులు
భరతార్జున మాంధాత సగర - రామ
ఖట్వాంగ-దుందుమార రఘు తృణబిందులు
పురూరవ-శంతన-గయ-భగీరధులు

కువలాయాశ్వ-కకుత్థ్సు నలుడు నృగుండు
హిరణ్యాక్ష హిరణ్యకశిపులు మరియు
వృత్రుడు-రావణ - నముచి శంబరులు
నరక - తారక వీరవరేణ్యులు

రాజ్యకాంక్షతో మమకారముతో
సాగిపోయిరి ఆగలేదు కద!
ఏఒకరైనా - ఈ భూమిని తమతో
తీసుకుపోగల శక్తిమంతులా!

అంతామిధ్య అన్నది తెలిసి
మిగిలిన యట్టి రెండు దినమ్ములు
ముకుందుస్మరణతొ హరిధ్యానముతో
శాశ్వత పధమును అందుకోవయా!

అనగా అడిగెను రాజవరేణ్యుడు
ఉత్తమ శ్లోకుండనగా నెవ్వరు
సన్నుతుడెవ్వడు అట్టి మహాత్ముని
సద్గుణంబులను వివరించుమయా!

 ॥శ్రీ కృష్ణచరితము॥

# 1 యుగధర్మములు - ప్రళయ చతుష్టయవివేచనము

అంతట అడిగెను ధరణీనాధుడు
యుగములు ఎన్ని కలియుగములో మరి
దోష విముక్తులు అగుట ఎట్లగు?
ప్రళయమెట్టిది హరిగతులెట్టివి?

అంతట పలికెను శుకయోగీంద్రుడు
కృత త్రేతా ద్వాపర కలియను
నాల్గుయుగములు-అందులో మొదటిది
కృతయుగంబది ధర్మనిలయము

నాల్గుపాదముల ధర్మము నడిచే
యుగమది రాజా! కృతయుగమ్ము
సత్యము దయయు తపోదానములు
నాల్గుపాదములు అన్నటు లమరెను.

నిత్యసంతుష్టులు దయా పూర్ణులై
సర్వభూతముల హితమును కోరుచు
ఆత్మజ్ఞానము అలవరచుకొని
ధర్మమార్గమున జీవించెదరు

త్రేతాయుగమున ధర్మము రాజా!
ముడుపాదముల నడచు చుండును
దానగుణమది లోపించునయా!
ద్వాపరమ్మున రెండుపాదములు

వేదాధ్యయనము చేయుచుందురు
శీలవంతులై ద్వాపరమ్మున నుందురు
కలియుగమ్మున ఒంటిపాదమున
ధర్మదూరమై సాగును నడక

కలియుగంబున జనులలో - ఆశ
నిర్దయత్త్వము దురాచారములు
చోటుచేసుకొను అన్యాయమును
చేయుటకెంతయు వెనుకడుగిడరు

చోరభయమ్ము మెండుగనుండును
కట్టుబాటులను లెక్కచేయరు
వేద శాస్త్రముల భక్తి తగ్గును
గురువుల మన్నన చేయతలంచరు

నియమనిష్టలు పాటించకను
పాషండమతమ్మును ప్రోత్సహింతురు
అధికారమదమున రాజులు ప్రజలను
ఎన్నోవిధముల హింసించెదరు

భక్తి విశ్వాసము లంతరించును
పెద్దలదూషణ - ధిక్కరింతతో
క్రూరమనస్కులుగా మారెదరు
స్వార్థచింతన పెరిగిపోవును

వేదధర్మముల వదలివేతురు
అర్థాశతొ మరి యతులుండెదరు
లజ్జాభిమానములంతరించును
సద్గుణమ్ములు సమసిపోవును -

వర్ణాశ్రమముల లెక్కచేయరు
నీచాశ్రయముకు ముందుకువత్తురు
దయాశౌచములు దూరము అగును
అసత్యవాదులై మోసము నేర్తురు

దయాదూరుడగు రాజును కొలతురు
దుర్భరదారిద్ర్యము ననుభవింతురు
యజ్ఞకర్మలు ధనాశతోనే -
హీనజన్మతో నశించిపోదురు

అట్టి కలియుగమునందున భక్తితొ
ముహూర్తకాలము నారాయణస్మరణ
శ్రీనృసింహ వాసుదేవ సంకర్షణులను
అచంచలమ్మగు భక్తితొతలచిన

అట్టివారికి నూరుక్రతువుల
ఫలములభించును - గావున రాజా!
నిరంతరమ్ము హరిని దలంచుము
నామస్మరణే కలిలోముఖ్యము

ద్వాపరయుగమున కృష్ణభక్తితో
హరి కీర్తనతో నర్తనమ్ముతో
ఆటలపాటల ఆనందింతురు
కలిలోతలతురా దివ్యగాధలు

కల్పప్రళయము ఎట్లగుననుచు
రాజు అడుగగా - పలికెను మౌని
నాల్గుయుగముల కాలప్రమాణము
వెయ్యిజరిగిన - బ్రహ్మకు పగలు

ఆవిధముగను బ్రహ్మకు రాత్రగు
అటుల బ్రహ్మకు దినముగడచిన
నైమిత్తిక ప్రళయమ్మందురు రాజా!
అపుడు-బ్రహ్మ అతి తేజోమయుడై

సర్వలోకములు ఆత్మలొ నిలపి
శయనించు సమయది ఓ మహరాజా!
ప్రాకృత ప్రళయముగా చెప్పబడు
ఈరెండు ప్రళయముల కాలము-రోజు

మూడువందల అరవై సంఖ్యలొ
బ్రహ్మకు రోజులు పూర్తియైనచొ
ఒక్క వత్సరముగా చెప్పబడునయా!
అట్టివత్సరము లొక నూరైనచొ

లోకేశులకు ఆఖరిదశయగు
వంద ఏండ్లు మరి వర్షములుండవు
ఆకలిదప్పులు పెరిగిపోవగా
ఒకరినొకరు మరి భక్షించెదరు

వాడి వేడి కిరణమ్ముల - భానుడు
జలరసమ్ములను పీల్చివేయును
ఆసమయములో సంకర్షణుని
ముఖమున వెలువడు విస్ఫులింగములు

అటుల మంటలుఅవిర్భవించి
బ్రహ్మాండమునే కాల్చి వేయును
వేడిగాలులు నిండును సర్వము
సర్వస్వమ్ము భస్మము అగును

అంతట కురియును పెనువర్షమ్ము
ఏకధారగా - భూమికి నింగికి
కురిసెడివర్షము - దిమ్మరించినటు
నూరుఏండ్లుగా కురియును రాజా!

అటుల అంతయు జలమయమగును
భూమి మారును - రసహీనముగా
ఆ రసమంత కలియు తేజమున
ఆ తేజము మరి కలియు వాయువున

స్పర్శగుణమది పోయిన వాయువు
ఆకాశములో కలసిపోవును
నింగి అంతట - శబ్దగుణమ్మును
కోల్పోయి-కలియును భూతజాలముల

అటుపిమ్మటను మహాతేజమది
మహారూపముగ అహంకార రహితమై
ఇంద్రియాలలో లయమై పోవును
త్రిగుణమ్ములు - చేరును ప్రకృతిలోన

అట్టి ప్రకృతి అనాదియైనది
నిత్యమైనది - అవ్యయమైనది
వాక్కుకు అందని గుణరహితమయి
స్వప్నాద్యవస్థల రహితమ్మగును

అట్టిదానిని - మూలభూతమగు
పదమని - చెప్పుదురట్టి సమయము
కాలవిపర్యయమై అంతటను
పురుషావ్యక్తులు విలీనముఅగును

ప్రాకృత ప్రళయంబందురు దానిని
రాజా వినుము! మరో విశేషము
బుద్ధి ఇంద్రియ అర్ధరూపముల
ఆశ్రయమ్ముతో జ్ఞానముండును

బుద్ధివల్లను సంభవించిన
జాగ్రద్స్వప్న సుషుప్తావస్తలు
ఆత్మమయమ్మయి బుద్ధియుక్తమగు
యోగ రూపముగ పరిణమించును

సర్వప్రాణులు ఈశ్వరులయమగు
కావున అంతయు - ఒకే పదార్థము
అన్న విషయము - తెలియగ వలెను
బుద్ధిమంతుడు తెలియగలుగును

ఒకే తేజము - అనేక రంధ్రమ్ముల
కనబడినట్టుగ - ఆపరమాత్మ
అనేక జీవులయందు భాసిలు
అహంకారము వదలగ - కనబడు

ఏకాగ్ర చిత్తమున యోగులందరూ
పరమాత్మ ధ్యానము చేయుచుందురు
కాలవేగము వల్లన జగతికి
అవస్థా భేదములు కలుగుచుండును.

ఈశ్వరరూపము కాలమందున
కల్పావస్థలు కనబడకున్నను
జరిగిపోవుచునుండును రాజా!
పగలుతారలు కనబడనటులుగ

నిత్య-నైమిత్తిక-ప్రాకృతి కాత్యంతిక
అనెడి ప్రళయములు నాలుగు రాజా!
వాటి విశేషము పూర్తిగ చెప్పగ
బ్రహ్మరుద్రులకె సాధ్యము గాదు

నాకుతోచినది మాత్రమె చెప్పితి
సంసార సంద్రమును తరించుటకును
హరియను నావ తోడ్పడినటుల
మరియొక సాధన మేదియు లేదు

రాజా! వినుము పరధ్యానమా!
పరంధాముని యందులగ్నమా!
చావుతప్పదని - భయముగనున్నద!
పుట్టినవారు - చచ్చుట తథ్యము

అట్టి చావుకై భయపడి - చచ్చుట
జీవులకున్న బలహీనతయగు
బ్రతికినంత కాలమ్ము శ్రీహరిని
ధ్యానించుమయా! కలుగు మోక్షము

మానవనాధుడవీవు - నరేంద్రా!
మాధవలోక - సుఖములు స్థిరము
వాటిని పొందగ హరిని తలంచుము
తనువుతొ దొరకనిదా హరి పథము

మరియొక మాట! జరామరణములు
కలిగియుండును ఈశరీరము
ఇందలి జీవుడు కడవలొనున్న
ఆకాశముగా తలంచవలెను

కడవభిన్నముకాగను అందలి
నింగి చేరును - మహదాకాశము
అట్టి శరీరము రాలిపోవగా
జీవుడు కలియును పరమాత్మయందున

కావున ఆత్మను ఆత్మయందున
జేర్చి అంతట హరి రూపమును
ధ్యానించుటది వివేకమగును
అట్టి వివేకము కలిగియుండవలె

కావున రాజా! తక్షకు డెవడు!
కరచుటెవరిని - చచ్చునదెవ్వరు!
పామరబుద్ధితొ ఆలోచించకు
అజ్ఞానములో పడిపోకుమయా!

శోక - మోహములు చంపుకోవయా!
హరిధ్యానమున నిమగ్నుడవయి
నిశ్చలమనసుతొ ధ్యానించుము హరిని
హరించి పోవును దుఃఖ భయములు

చివరి మాటగా ముగించు చుంటిని
పరబ్రహ్మను పరంధాముడను
అని నీకే నీవు - బోధించుకోవయా!
ఆత్మను జేర్చుము - ఆత్మయందున

అటులజేసిన తక్షకు విషము
ఎంత మాత్రము నిను బాధించదు
నీశరీరము - ఆ తక్షకుడును
ఇద్దరు కూడా నీకగబడరు

ఆనంద సీమలో అడుగు బెట్టుటకు
హరి ధ్యానములో లగ్నము కావలె
జరిగిన దంతా చెరిగిపోవలె
తరగని సుఖము అందుకోవలె

రాజా! ఈపురాణ దివ్యసంహితను
నారాయణ ఋషి చెప్పగా విని
నారదుడంతట నాజనకుడగు
వేదవ్యాసునకు చెప్పినాడయా!

నాదుజనకుడు నాకుచెప్పెను
దీనిని తదుపరి సూతమహాముని
శౌనకాదులకు సత్రయాగమున
నైమిశారణ్యము నందున చెప్పును

రాజా! తియ్యగ వాసుదేవుని
తలపుతొ గడిచెను మనయిద్దరకు
పరమానందము నందితిమయ్యా!
సందేహములు తీరిపోయినవ?

అంతట పలికెను రాజవరేణ్యుడు
ముడిచిన కరముల భక్తితొ పలికెను
నాభాగ్యమది ఏమని చెప్పెద
నిను కీర్తించగ మాటలు చాలవు

నిండుమనస్సుతొ నీకు వందనము
అంతకుమించి ఈయగలేను
భోగభాగ్యములు కోరవు నీవు
నీవు కోరునది - నాశ్రేయస్సు

నీ దయవలన హరి స్వరూపము
తెలియ గలిగితి జన్మ తరించెను
నా అజ్ఞాన తిమిరము తొలగెను
జ్ఞానజ్యోతి వెలిగించితి వీవు

తక్షక విషము - మృత్యు భయంబు
సమూలమ్ముగా - అంతరించెను
అంతటి శక్తి కలిగె - నీవలన
ఆ హరి సన్నిధికేగెద తండ్రీ!

అటుల పలికి ఆ రాజవరేణ్యుడు
భక్తిగ పూజలు చేసెను - మౌనికి
హరి కటాక్షము లభించుననుచు
దీవించి వెడలెను శుక యోగీంద్రుడు.

॥శ్రీ కృష్ణచరితము॥



## 2 పరీక్షిత్తు నిర్యాణము - సర్పయాగము

హరిధ్యానముతో నుండె పరీక్షిత్తు
తక్షకుడంతట - విప్రశాపమును
అమలుపరచగా విప్రుని రూపున
రాజును చూడగ బయిలుదేరెను

మార్గమధ్యమున కాశ్యపుడనెడి
బ్రాహ్మణోత్తముడు అగబడెనతనికి
సర్ప విషహరణ సమర్థుడైన
ఆ బ్రాహ్మణుని గాంచె తక్షకుడు

ఆతని మనస్సు తెలిసి తక్షకుడు
కాశ్యపునికి - తా - అధికధనమిడి
సంతృప్తుని చేసి రాజసౌధముకు
రాకుండగను కట్టడి చేసెను.

అటుల తక్షకుడు తనమార్గమును
సుకరము చేసుకు - రాజును చేరి
అచ్చటి వారికి రాజున కిమ్మని
ఫలమునొక్కటి ఒసగెను వారికి

విప్రుని కానుక ఫలము నిచ్చుటకు
సందేహమ్ము కలగని వారు
ఫలము రాజుకిడ దానిని తినగా
క్రిమిరూపమున తక్షకు డంతట

ఫలమునుండి-తా-వెలుపలి కొచ్చి
భయంకరమగు పన్నగ రూపున
పరీక్షిత్తును కాటువేయగా
భస్మమాయెను రాజు క్షణములో

అదిగాంచిన భూమ్యాకాశమందలి
సకలప్రాణులు తల్లడిల్లినవి
హా హా - కారములెగసి పడినవి
ఆశ్చర్యములో మునిగిపోయినవి

తండ్రి దుస్థితికి విచారపడుచు
పరీక్షిత్తు తనయుడు జనమేజయుడు
తక్షకు - భస్మము చేయగనెంచి
సర్పయాగము ఆరంభించెను

క్రోధావేశము లెగసి పడగను
సర్ప ప్రళయము జరుగునట్టుగా
యాగము చేయగ - ఆగుండమున
వేల సర్పముల పడి - మాడినవి

విషయము తెలిసి తక్షకుడంతట
ప్రాణభీతిచే ఇంద్రుని పురమున
ఇంద్ర సింహాసనముకు చుట్టుకు -
బ్రతుకు ప్రయత్నము చేయగ - తెలిసి

క్రోధావేశముతో - జనమేజయుడు
"స ఇంద్ర-తక్షక యానుభ్రూహి" యని
మంత్రము పఠించ దాని బలముకు
ఇంద్రసింహాసనమది కదలినది

కదలిన సింహాసనమది - దానికి
చుట్టుకునున్న తక్షకుని తోడను
వచ్చుచుండెను - అగ్నిలో పడగా
అంతట అంగిరసుడను నొకమౌని

పరీక్షిన్నరేంద్రుని-తనయుని గాంచి
అనేక విధముల శ్లాఘించుచును
ఆమహారాజు ఆవేశమ్మును -
చల్లబరచెను - చల్లని మాటల

రాజా! వినుము చావు అన్నది
జీవకోటికి సహజమైనది
నీయాగముతో అసంఖ్యాకమగు
పన్నగమ్ములు బూడిదైనవి.

ఏదో విధముగ మృత్యువు మ్రింగును
అగ్నివల్లనో - చోరులవల్లనొ
విషక్రిమికాటుకు గురియై యో మరి
మరణించుటది - జీవికి తథ్యము

సర్పద్రష్టుడై నీ తండ్రి సమసినటు
తలంచుటన్నది భ్రమయగునయ్యా!
జీవులు కర్మల ఫలితమ్ములను
అనుభవించక తప్పదు వింటివ

ఒక్క పన్నగము కీడు చేసెనని
వేల పాములను అంతము చేస్తివి!
చంపునదెవ్వడు చచ్చెడి దెవ్వడు
అంతా ఈశ్వరు సంకల్పమయా!

యోగ్యుడైన మహరాజు సుతుడవు
మంచి చెడ్డలు ఆలోచించుము
ఇంద్రుడు పడెను ఆపదలోన
ఆతని నీవు కాపాడవలె

ప్రాణభిక్షకై తక్షుకుడిపుడు
ఇంద్రుని శరణు కోరెను రాజా!
కావున మదిలో శాంతి వహించుము
కాపాడుమయా, తక్షకేంద్రులను!

అనగా నచ్చటి ఋత్విజులందరు
నచ్చజెప్పగా - శాంతినందిన
రాజు - యాగమును ఆపుజేసెను
దక్షిణలిచ్చి సత్కరించెను

అటులజెప్పి అట సూతుడంతట
ఆనందముతో పరవశించెడి
శౌనకుజూచి పలికెనిట్టుల
వేదవిస్తరణ వినిపించెనట

ప్రప్రథమముగా విరించి యొక్క
హృదయమునుండొక నాదము వెలువడె
అటుపిమ్మట అది వ్యక్తము కాగా
దానిని యోగులు ఉపాసించిరి.

ఆనాదములో పుట్టెను ప్రణవము
ఆ ఓంకారము ఆది మూలమై
మంత్రోపనిషత్తుల కాధారమ్మయి
వేదమాతగా పిలువబడినది

'అ' కార 'ఉ' కార 'మ' కారమ్ముల
సంపుటిగా మరి భాసిల్లునది
ఆ ఓంకారము ఆధారముగా
విరించి పలికెను వేదమ్ములను

విరించి నాల్గుముఖములనుండి
వెలువడినట్టి నాల్గు వేదములు
తన కుమారులగు బ్రహ్మావాదులకు
ఉపదేశించెను - విస్తరించుటకు

ఆవేదముల అధ్యయనమ్ముకు
ద్వాపరయుగమున శ్రీహరి తాను
పరాశరునికి సత్యవతి యందున
తనయుడుగాను ఉద్భవించెను

ఆ వేదములను నాల్గు సంఖ్యలో
విభజించెను అవ్వి ఋగ్యజస్సు
సామాధర్వణ వేదములైనవి
తనశిష్యులకు ఉపదేశించెను

పైల - వైశంపాయన జైమిని మరియు
సుమంతులన్న శిష్యులకిడెను
పైలుడు చదివిన ఋగ్వేదమ్ము
అనంతమైన ఋక్కులు గలది

బహ్వృచశాఖ అందురు దానిని
ఆ ఋగ్వేదము పైలుడంతట
ఇంద్రప్రమితికి - భాష్కలునకును
ఉపదేశించెను వ్యాప్తినందుటకు

భాష్కలుడంతట తనభాగమును
నాల్గు భాగములుగా విభజించి
బోధ్య-యజ్ఞవల్క్య-పరాశ రాగ్ని మిత్రులకు
ఉపదేశించెను అభిమానముగా

ఇంద్రప్రమిత తను నేర్చిన వేదము
తనకుమారుడగు మాండుకేయునికి
ఉపదేశించెను - అతడు దానిని
దేవమిత్రునిచె చదివించె భక్తిగా -

దేవమిత్రుడు ఆ సంహితను
సౌభర్యాదుల కుపదేశించెను
సౌభరికొడుకు శాకల్యుండు
ఐదుభాగములుగా విభజించెను

వాత్స్య-మార్గల్య-శాలీయ-గోముఖ
శిశిరులు అనెడి తనశిష్యులకు
ఒక్కొకశాఖ ఉపదేశించెను
జాతకర్ణికి నేర్పిరి వారు

జాతకర్ణి - తా - నేర్చిన దానిని
బలాక - పైంగ - వైతాళు - విరజ
అనువారలచే చదివించగను
వేద ప్రచారము సాగెనట్టుల

భాష్కలు తనయుడు భాష్కలి భక్తిగ
'వాలఖిల్యము' అనుసంహితను
బాలాయన గార్గ్య - కాసారులకు
ఉపదేశించెను అభిమానముగా

ఆవిధముగను బహ్వృచ సంహిత
బ్రహ్మఋషులచే వ్యాప్తినందెను
ఋగ్వేదశాఖ ఉత్పత్తి వ్యాప్తులను
వినిన పాపములు హరించి పోవును

యజుర్వేదాధ్యయనము చేసిన
వైశంపాయుని శిష్యులందరు
యజ్ఞ యాగక్రతు నిర్వాహకులు
పాపనాశకము లాయజ్ఞములు

యాజ్ఞవల్క్యుడు గురువును తాను
ధిక్కరించగ వేదమ్ములను
విడిచి పొమ్మని ఆదేశించగ
వాటిని కక్కెను - యాజ్ఞవల్క్యుడు

కక్కబడిన ఆ వేదసంహిత
రక్తసిక్తమై వెలువడగాను
తిత్తిరిపక్షులుగా ఆ దేవతలు
మారిరి - దానిని భక్షించగను

తైత్తిరీయము అనబడినవవి
అంతట వేదములవి పోవగను
జీవసారము పోయినట్టుగా
యాజ్ఞవల్క్యుడు మారిపోయెను

తిరిగి వేదమును పొందగ నతడు
సూర్యదేవుని ఉపాశించెను
ప్రత్యక్షనారాయణు స్తోత్రమునంత
భక్తిప్రపత్తుల పఠించినాడు

ఉగ్రతపస్సుకు మెచ్చి భాస్కరుడు
హయరూపమున యజుర్వేదమును
ఉపదేశించెను యాజ్ఞవల్క్యునికి
కావున వాజసనేయశాఖ యైనది

యాజ్ఞవల్క్యుడా వేదశాఖను
కాణ్వ - మాధ్యందినాదులకు చెప్పెను
ఆ విధముగను యజుర్వేదము
తిరిగి లోకమున వ్యాప్తినందినది

సామవేద ఉపదేశము పొందిన
జైమిని అంతట దానిని - సుతుడగు
సుమంతున కుపదేశించెను
సుకర్ముడాతని తనయుడు చదివెను

సుమంతుడంతట సామవేదమును
వేయిశాఖలుగ విభజించి అంతట
కోసల తనయుడు హిరణ్య నాభుకు
తన తనయుడగు పౌష్పంజినున కిడె

ఆయిద్దరును బ్రహ్మవేత్తలై
అవంతులు మరి ఉదీత్యులనియెడి
ఐదువందల మందికి దానిని
ఉపదేశించిరి విస్తరించుటకు

ఉదీత్యులంతట కాలక్రమమున
శిష్యులకు మరి ఉపదేశింతురు
ఆ విధముగను సామవేదమది
వ్యాప్తి చెందెను లోకములోన

అధర్వవేదము నేర్చి సుమంతుడు
వేదదర్శుండు - పథ్యుండనెడి
శిష్యులిద్దరికి ఉపదేశించెను
వారిలో దానిని వేదదర్శుండు

శాల్కాయన-బ్రహ్మబలి-నిర్ధోషులకు
పిప్పలాయనుకు ఉపదేశించెను
పథ్యుడు దానిని కుముదు,శునకు,జాబాలి
బభ్రువ-అంగిరస-సైంధవాయులకిడె

ఆ విధముగను అధర్వవేదము
వ్యాప్తినందెను లోకములోన
అనుచపలికి అట సూతమహాముని
పురాణక్రమము తెలియబరచెను

త్రయ్యారుణి-కశ్యప-సావర్ణియును
యకృతవ్రణు-వైశంపాయన-హారీత
అనెడి ఆర్గురు పురాణవ్యాప్తికి
మూలపురుషులుగ చెప్పగవలెను.

స్కాంధ వామన కౌర్మంబులును
మాత్స్య బ్రహ్మాండ-గారుడంబులను
అనుపదునెనిమిదగు మహా పురాణమ్ములు
ఉప పురాణములన్నవి యున్నవి

ప్రప్రథమముగా వ్యాసమునీంద్రులు
ఆరుసంహితలు పలికిరివారు
ప్రియముగ-వాటిని నాదు జనకుడగు
రోమహర్షణుని కెరుక పరచిరి

ఈ పురాణములు వ్రాసిన వారును
వినిన చదివిన వారందరును
పాపరహితులై భాసిల్లెదరు
అనుచు సూతుడు చెప్పగనంత

నాదు జనకుడు వాటిని తిరిగి
పైనచెప్పిన శిష్యులార్గురికి
ఉపదేశించగ - వింటిని - నేను
అనగా - వారికి శిష్యుడ నేను

కరములు ముడిచి నమస్కరించి
శౌనకుడచట పలికె భక్తిగా
బ్రహ్మవేదివి - ధన్యజీవుడవు
హరి మహిమల వ్యాపింపజేస్తివి.

వేద శాస్త్రానుసారముగాను
పురాణమ్మునకు లక్షణములైదని
బ్రహ్మఋషులు మరి నిరూపించిరి
పురాణ సంఖ్యను వివరించెదను

మేమేకాక - సర్వలోకములు
పావనమగును నీదయవలన
శ్రీహరిలీలలు చెప్పగ చాలిన
సమర్థుడవు నీవొక్కడవేను -

బ్రహ్మము-పద్మము-వైష్ణవ-శైవములు
భాగవత భవిష్యోత్తరమ్మును మరియు
నారదీయ-మార్కండేయ-ఆగ్నేయమును
బ్రహ్మవైవర్తము-లైంగ వారాహములు

మహానుభావా! మార్కండేయుడు!
మృత్యువునే మరి జయించి-తాను
చిరంజీవిగా నున్నాడు కదా!
ఆవృత్తాంతము సెలవీయుడన -

ఆనందముతో సూతమహాముని
మార్కండేయుని రమ్యగాథను
మిత్తిని గెలిచిన విశేషంబును
వినిపించెనట పరవశమ్మున



॥శ్రీ కృష్ణచరితము॥

# 3 మార్కండేయోపాఖ్యానము

మార్కండేయుడు అనన్యభక్తితో
హరినే మదిలో ప్రతిష్ఠించుకొని
మృత్యువునే - తా - జయించినాడు
చిరంజీవిగా నిలబడినాడు

జలప్రళయములో శ్రీహరి - తాను
వటపత్రశాయియై వెలుగుపుంజమై
కోటి సూర్య ప్రభాభాసమై
బాలుని హృదయములోన వసించెను

అటుల వేలాది వత్సరంబులు
హరివసియించి - తిరిగి వెలువడి
వటపత్రశాయియై కనుపించెనని
సూతమహాముని చెప్పదొడంగెను

మృకండుమహర్షి బ్రహ్మచర్యమున
బ్రహ్మతేజమున వెలిగిపోవుచు
ఘోరతపంబును ఆచరించగా
హరి హరులిద్దరు ప్రత్యక్షమైరి

మనసునిండుగా వారిని స్తుతించె -
వారంతట వరమడుగమన
గుణాఢ్యుడైన తనయునిమ్మనెను
జన్మకు ధన్యత కలిగించమనె

అంతటవారు సరియని పలికిరి
వారి అనుగ్రహమందిన మౌనికి
పుత్ర సంతతి మార్కండేయుడు
ఉద్భవించెను తపోఫలముచే

వేదశాస్త్రములు నేర్చుటకొరకై
ఉపనయనమ్మును చేసిరంతట
అబాలుడు అతి భక్తి తత్పరతతో
నారాయణ ధ్యానమ్మున నుండెను.

అల్పాయుష్కుడు అయిన బాలుని
అంతముజేయగ మృత్యువురాగా
మృత్యుపాశముల నుండి వెలువడి
వేల ఏండ్లుగా తపస్సుచేసెను

ఆ తపస్సుకు ఇంద్రుడు భయపడి
అప్సరసను మరి పంపగనంత
ఆటలపాటల ప్రయత్నించి - తా -
అలసిపోయినది ఆ అప్సరస

మార్కండేయుని తపముకుమెచ్చి
శ్రీహరి ప్రత్యక్షమైనయంతట
ఆనందించిన మార్కండేయుడు
అనేకయుగముల బ్రతుకు నీయమనె

శరీరమ్ముతో అనేక యుగములు
జీవించునటు వరమునీయుగా
ప్రార్థనచేసి పలికెను భక్తుడు
"జగద్రక్షకా! మాయామయుడవు!

నీదుమాయను తెలియగ వశమా
బ్రహ్మరుద్రులకు అలవిగానిదది
నాకలోకపతి తెలియగలేదు
ఆగమాలలో వసించుదేవుడ!

అట్టిమాయను తెలియగ నాకు
అనుగ్రహించుము అని అడుగగను
ఆనందించి నారాయణుడు
ఆశీస్సులనిడి వెడలగనంత

తిరిగి మౌని తన ఆశ్రమమ్మున
తపోనియమున నుండగ నంత
గిరిజారమణుడు గౌరితొ వచ్చెను
మార్కండేయుని గాంచిరి వారు

మార్కండేయుడు శివపూజతొ మరి
కాలముగడుపగ వంద ఏండ్లుగా
వర్షపాతమది సంభవించగా
జలమయమయ్యెను భూమియంతయు

మునితేజస్సుకు మంగళగౌరి
శివునితొ పలికెను మునిని గురించి
అంతట హరుడు ముని హృదయములో
దివ్యమాయను ప్రసరింపజేయగా

చిమ్మచీకటి అలముకొన్నది
ఆ సమయములో జలమధ్యమున
మఱ్ఱి ఆకుపై కాంతిపుంజమై
పద్మరాగ కాంతుల మెరపుతొ

చతుర్భుజములతొ రుద్రాక్షమాలలతొ
భస్మవిలేపిత శరీరమ్ముతో
నాగాభరణుడు నందివాహనము
నధిరోహించి మునికి తోచెను

కోమలమైన పాదమ్ములతో
కనబడెనొక్క దివ్యశిశువట
ఆశిశువుకు తా మ్రొక్కెను మౌని
అంతటిలోన ఆశ్చర్యముగా

అంతట మౌని ఉమా శంకరుల
భక్తిమీరగా ప్రస్తుతించెను
అంతట హరుడు – భక్తికి మెచ్చి
పరమశైవుడవు అని మెచ్చుకొనె –

తన తేజముతో శిశువు హృదయమున
ప్రవేశించెను – దివ్యజఠరమున
అనేకవత్సరములుండిన యంతట
హరి స్మరణతొ – తా – వెలువడినాడు

తిరిగి పలికెను మార్కండేయుడు
దేవా! నీదు కరుణవల్లను
దుర్లభమైన శ్రీహరి మాయను
గంటిని – చాలును జన్మతరించెను

తిరిగి మౌని – తా – దివ్యబాలుని
కౌగలించుకొన ప్రయత్నించగా
అంతర్ధానము అయ్యెను బాలుడు
అనుచు చెప్పెను – శౌనకుడచట

ఒక్క వరము నాకీయుము దేవా
ముక్కంటీ! నిను ప్రార్థనచేతును
నారాయణ పదధ్యానముతో మరి
మృత్యుంజయునిగ ఆశీర్వదించుము

అంతట ఆనందించిన శివుడు
కృపాసముద్రుడు ఆ వరమిడెను
జరా రోగములు లేకుండగను
కోటికల్పముల ఆయువునిడెను

ఆపై అతనికి పురుషోత్తముని
అనుగ్రహమ్ము కలుగును అనెను
అటుల భక్తుని ఆదుకొనెనట
భక్తసులభుడు పరమేశ్వరుడు

ఈ కథ వినిన - వ్రాసిన వారు
మృత్యువుతొలగి సుఖములందెదరు
మనశ్శాంతియది కల్గును వారికి
ఆరోగ్యవంతులై భక్తులగుదురు

అనుచు పలికెను సూతమహాముని
హరి ధ్యానముతో భాగవతుండై
ఇతర చింతనలు మదిలో వదలి
దుర్జనులను మరి చేరనీయక

నారాయణ గోవింద నామములు
స్మరించు చుండిన ఆ పుణ్యాత్ముడు
వైకుంఠమున వసించగలడు
జన్మనెత్తిన ఫలము దక్కును

కావున శ్రీహరి లీలలు చెప్పగ -
విశ్వరూపుని - విశ్వరూపమును
పొగడగ - తనకు అసాధ్యమైనదనె
తిరిగి పలికెను - సూతమహాముని.



॥శ్రీ కృష్ణచరితము॥

## 4 ద్వాదశా దిత్యుల సంచారక్రమం

చైత్రమునుండి ఫాల్గుణమాసము
సౌరగణ సప్తకము సంచరించును
ఈశ్వర సంకల్పముతో చరించును
దీనిని శుకుడు రాజుకు చెప్పెను

అవిషయమునే వివరించెదనని
ఆరంభించెను సూతమహర్షి
నారాయణరూపమె - సూర్యదేవుడు
అనేక విధములస్తుతుల నందును

చైత్రములో మరి 'ధాత' యందురు
కృతస్థలి - హేతి - వాసుకి రథకృత్
పులస్త్య తుంబురు లనెడివారు మరి
అనెడి రవి పరివారమ్మగు.

వైశాఖములో ఆర్యముడందురు
పులహుడు ఓజుడు ప్రహేతి
పుంజికస్థల మరి నారద కంజనీరులు
సూర్యదేవుని అనుచరులగుదురు

జేష్ఠమాసమున మిత్రుడందురు
అత్రి పౌరుషేయ తక్షక మేనక
హాహా మరియు రథస్వనుండును
సూర్యదేవుని పరిజనులగుదురు

ఆషాఢములో వరుణుడనబడును
వసిష్టుడు - రంభ - సహజన్యులును
హూ హు - శుక్ర - చిత్రస్వనుడు
సూర్యదేవుని సహచరులగుదురు

శ్రావణమందున ఇంద్రుడనబడును
విశ్వావసువు శ్రోతయు మరియు
ఏలాపుత్రుడు అంగిరస ప్రమోచ చర్యులు
అనెడివారు - రవి అనుచరులగుదురు

భాద్రపదములో వివస్వంతుడగు
ఉగ్రసేన - వ్యాఘ్ర ఆసారణ-భృగువు
అనుమ్లోచ-శంఖపాలు డనువారందరు
సూర్యదేవుని - అనుచరులగుదురు

ఆశ్వయుజములో 'త్వష్ట' అందురు
ఋచీక తనయుడు కంబళాశ్వుడు
తిలోత్తమ బ్రహ్మోపేత శరజిత్తు
ధృతరాష్ట్ర-ఇషంభరు లనుచరులగుదురు

కార్తీకములో రవిని - విష్ణువందురు
అశ్వతర-రంభ - సూర్యవర్చసు
సత్యజిత్తు విశ్వామిత్ర మఖాపేతస్సు
భాస్కరదేవుని సఖ్యులగుదురు

మార్గశిరములో - అర్యముడందురు
కశ్యప తార్క్ష్య - ఋతసేనుండు
విద్యుచ్ఛత్ర - ఊర్వసి-మహాశంఖువు
సూర్యనారాయణు అనుచరులగుదురు

పుష్యమాసమున-'భగుడు' అనబడు
స్ఫూర్జుడు,అరిష్టనేమి ఊర్ణుడు మరియు
ఆయువు, కర్కోటక, పూర్వచిత్తి
భాస్కరదేవుని అనుచరులగుదురు

మాఘమాసమున పూషుడందురు
ధనంజయ వాతుడు సుషేణున్ను
సురుచి ఘృతాచి గౌతముడనెడి
అనుచరులుందురు భానుమూర్తికి

ఫాల్గుణమ్ములో 'క్రతువు' - అందురు
వర్చసుడు మరి భరద్వాజుడు
పర్జన్య సేనజిత్ విశ్వ ఐరావతులు
సూర్యదేవుని అనుచరులగుదురు

అటులభానుడు పన్నెండు మాసములు
అప్రమేయమగు విభూతులతో
అఖిల సృష్టిని అలరించునయా!
ఆయన వెళ్ళని చోటేలేదు.

ఉభయసంధ్యలలో ఉపాసించిన
భక్తులందరి పాపమ్ములను
తేజప్రభలతొ మార్తాండుడు
అంతము జేసి - ఆరోగ్యమునిడు

నాల్గువేదములు వర్ణించుచును
ఋషులు భక్తిగా వివస్వంతుని
స్తోత్రముచేయుచునుండ - అచ్చరలు
ఆడుచుందురు - సూర్యునిముందు

గంధర్వులు అతి మధురముగాను
గానము చేయుచునుందురు నిరతము
బ్రహ్మవేత్తలు అరవై వేలు - ఆపై
వాలఖిల్యులు - స్తోత్రము చేతురు

ఊహలకందని బలవేగముతో
సూర్యరథము మరి నాగులు లాగును
బలవంతులగు నైరృతులంతటా
రథమును వెనుకగ నుండి తోసెదరు

భాస్కరదేవుని దేహకాంతియది
వ్యాపించని తావసలే లేదు
తమోమయమగు జీవలోకమును
సమయపాలనతొ - లేపును సూర్యుడు

కాలచక్రము నడిపెడివాడు
ప్రత్యక్ష నారాయణుడా భాస్కరుడు!
శ్రీహరిమయముగ తెలియగవలెను
నమస్కారములనందించవలె

అనుచు శుకుండు పరిక్షిత్తునకు
తెలియజెప్పెనని - సత్రయాగమున
సూత పౌరాణికుడచ్చటి మునులకు
శౌనకునకును - తెలియజెప్పెను.

॥శ్రీ కృష్ణచరితము॥



# 5 పురాణశ్లోక సంఖ్య

బ్రహ్మపురాణములో శ్లోక సంఖ్యయది
పదివేలుగనున్నది - ఆపై మరియొక
పద్మపురాణము-యాభైఐదు వేలసంఖ్యలో
శ్లోకములున్నవి - వ్యాసుని భిక్ష

పదు నాల్గువేల ఐదువందలు
భవిష్యోత్తర - పురాణంబును
పదునెనిమిది వేల శ్లోకసంఖ్యతో
బ్రహ్మకైవర్తము వెలుగుచున్నది.

ఇరవది మూడు వేల సంఖ్యలో
విష్ణుపురాణము - వెలుగుచున్నది
ఇరువదినాల్గు వేలుగా శ్లోకమ్ములతో
శివపురాణము - నిలచియున్నది

పదునొకండు వేల - సంఖ్యలో
లింగపురాణపు శ్లోకములున్నవి
ఇరువదినాల్గు వేలసంఖ్యలో
వరాహ పురాణపు - శ్లోకములున్నవి

శ్రీభాగవతము పదునెనిమిది వేలు
నారదపురాణ - మిరువది ఐదు
తొమ్మిదివేలతొ-మార్కండేయపురాణము
పదునైదువేల నాల్గు వందలాగ్నేయమ్ము

ఎనుబదివేలు ఆపైనూరు
శ్లోకములతో - స్కాందపురాణము
పదివేల సంఖ్యలో శ్లోకమ్ములతో
వెలుగుచున్నది - వామన పురాణము



పదివేలసంఖ్యలో - శ్లోకమ్ములతో
కూర్మపురాణము - వెలసియున్నది
పదునాల్గువేలు మరి మత్స్యపురాణము
పందొమ్మిదివేలు - గరుడపురాణము

పన్నెండు వేల శ్లోకమ్ములతో
బ్రహ్మాండపురాణము వెలుగుచున్నది
మొత్తము పదునెనిమిది పురాణమ్ములు
వాటి శ్లోకములు - వివరములివ్వి

అనుచు పలికిన సూతుడంతట
మరియింకేమి చెప్పమందురన
ఆనందపారవశ్యమునందిన మునులు
సాష్టాంగముగా నమస్సులుంచిరి

జ్ఞాన భాస్కరా! నీదయవలన
వినవలసినది అంతయు వింటిమి
అనుచు యజ్ఞమును పూర్తి చేసిరి
సత్కరించిరి - సూతుని భక్తిగ.



॥శ్రీ కృష్ణచరితము॥

# 6 భాగవతప్రాశస్త్యము

పదునెనిమిది ఈ పురాణమ్ములలో
మధ్యనిలచిన మణిపూస యగు
భాగవతమ్ము భాగ్యపు పంట
నదులలొ భాగీరథిగా వెలుగును

దేవతలందు పద్మగర్భునిగ
తారకలందు కళానిధిగను
సాగరంబులలొ పాలకడలిలా
గిరులయందున మేరుగిరివలె

గ్రహములయందు విభావసురీతిగ
దైత్యులందున ప్రహ్లాదునిగా
మణులయందున పద్మరాగమన
తరువుల హరిచందన మున్నటు

ఋషులయందున నారదునివలె
దేనువులందు కామధేనువుగ
సూక్ష్మములందు జీవుని తీరుగ
దుర్జయంబుల మనస్సువోలె

వసువులయందు అగ్నిహోత్రునిగ
నాదిత్యులలో విష్ణువు తీరుగ
రుద్రులయందు నీలలోహితునిగ
అశ్వములందు ఉచ్ఛైశ్రవముగ

ఉరగములందు వాసుకి వలెను
మృగములయందు సింహమురీతిగ
ఆశ్రమంబుల గృహస్థాశ్రమమ్మన
అక్షరాలలో ఓంకారముగా

ఆయుధాలలో విల్లుతీరుగా
యజ్ఞంబులలో జపయజ్ఞముగ
వ్రతంబులందు అహింస వ్రతముగ
యోగంబులలో ఆత్మయోగమన

ఓషధులందు యవలతీరుగా
పలుకులయందు సత్యమువలెను
ఋతువులయందు వసంతఋతువుగ
మాసములందు మార్గశీర్షముగ

యుగములయందు కృతయుగంబుగా
వెలుగులు చిమ్మెడి భాగవతమ్ము
చదివిన వినినా విష్ణుసాయుజ్యము
లభించగలదు నిస్సంశయము

వేదసారమీ భాగవతమ్మును
సకలగుణాభిరాముడు అయిన
మునిజన వందిత చరణకమలముల
వెలిగెడి శ్రీశుకయోగికి ప్రణతులు

వేదాంతవేద్యుడు విశ్వమయుండు
ఆదిదేవుడు పరమదయానిధి
ఆశ్రితజన మందారము అయిన
ఆద్యంతములు లేని శ్రీహరికి

శ్రీవత్సముతో విలసిల్లుచును
శంఖ చక్ర గదాసి శార్ఙ్గధారియగు
శోభనాకారుడు పీతాంబరధారి
రత్నమకుటముతొ విరాజిల్లెడి

మహనీయుండు పుణ్యదేహుడు
పుండరీకాక్షుడు పుణ్యశ్లోకుడు
దేవకిదేవి ఆనందవర్ధనుని
నిరంతరమ్ము స్మరించుచుందును

వైరాగ్యచింతనతొ భవభయంబును
హరింపజేయును శ్రీహరి కథలు
భాగవతము ఆ దివ్యగాథలతొ
బంధించు మనసును భక్తి బంధముల

విష్ణుసాయుజ్యము జేర్చు సాధనము
సర్వశక్తి సంపన్నుడు శ్రీహరి
అనెడి విషయము - అవగతమగును
సాక్షాత్కారము కలుగు - భక్తులకు

పురాణములలో తలమానికము
భాగవతపురాణము - దీనిని చదివిన
మరేగాథలు చదవరు - వినరు
అంతటి శక్తి - కలిగిన గ్రంథము

దీనిని మొదటగ విష్ణుదేవుడు
నాభికమలమున బ్రహ్మకు చెప్పెను
బ్రహ్మ అంతట - భాగవతమ్మును
నారదునకు మరి ఉపదేశించెను

నారదుడంతట తెలిపె వ్యాసునకు
వ్యాసుడు చెప్పెను శుకునికంతట
శుకయోగీంద్రుడు పరీక్షిత్తునకు
పంచెను భాగవతామృతంబును

శుకుని ముఖమున వెలువడినట్టి
దివ్య భాగవత మకరందమును
తనివితీరగా గ్రోలిన భూపతి
పరీక్షిత్తు - తా - ముక్తినందెను

భువనపావనము దివిజగంగయై
భువికే దిగిన దివ్యవరమిది
భాగవతమ్ము భవభయహారిణి
విష్ణుపదమును సమకూర్చునది

భాద్రపదమాసపు పూర్ణిమనాడు
భాగవతమ్మును సమర్పించిన
భక్తితొయిచ్చిన వారు - శ్రీహరికి
దాసుడుగా - హరిసాయుజ్యమందును

మాధవలోకపు స్థిర నివాసము
ఆనందధామపు మహద్భాగ్యము
లభించగలదు భాగవతమ్మును
చదివిన వినిన - వ్రాయించినను

భూభారమును తీర్చగ - భువికి
దిగినయట్టి పరమాత్మకు అంజలి
కర్మసాక్షియై కాల చక్రమును
త్రిప్పే హరికి - వందనశతములు

భవబంధ విముక్తిని కలిగించుచును
భక్తబంధువై నిలచిన యట్టి
అచ్యుతనకిదె - సాష్టాంగవందనము
అనుచు తలచుట - గతియే జగతిని

కరుణాధాముడు ఆర్త రక్షకుడు
అన్ని సమయముల రక్షణ చేసే
అనంత మూర్తికి - భక్తి వందనము
భవభయహారిణి భాగవతమ్ము -

అభయహస్తముతో నిలచిన వరదుడు
ఆనంద ధామము నొసగే శ్రీహరి
సర్వజగతికి జీవకోటికి
శ్రీరామరక్షనిడి కాచునిరతము

సకలజీవులకు మంగళమొసగి
సకలజగతికి శుభములనొసగే
సర్వమంగళ సమేతుడైన
శ్రీహరి తలపే - సర్వశుభదము.

ఈ విధముగను భాగవతమ్ము
సంపూర్ణముగా తెలిపిన యట్టి
సూతునికంత సంతృప్తినిండిన
మునిపుంగవులు మ్రొక్కిరి భక్తిగ

అటులా భాగవతామృతమ్మును
గ్రోలిన మునులు ముదమునందిరి
హృదయసీమలో శ్రీహరినుంచుకు
సాగిరి వారి నిజవాసములకు

జనకజ మానస సరస్సునందున
విహరించెడి రాజహంసవు నీవు
మునిజనములకు అభయమునిచ్చిన
అరిభయంకరా! ఆశ్రితమందార!

అడిగి భాగవతము అంకితమంది
అలనాడు పోతనను అనుగ్రహించిన
అగణితగుణగణ కరుణాసింధూ!
అమ్మతొ మమ్ముల చల్లగ చూడుము.



॥శ్రీ కృష్ణచరితము॥

మహాలక్ష్మమ్మ కామేశ్వరుల
కడుపున పుట్టిన పుణ్యావశమున
రాధాకృష్ణుడు అనెడి నేను మరి
రామాశీస్సుల ఆరంభించిన

అక్షరమాల భాగవతమ్ము
వ్రాయగలిగితి రామాంకితముగ
వామాంకమున జానకిదేవితొ
శోభిలు దేవుడు నన్నుగావవలె.

శ్రీ కృష్ణచరితము - కర్ణపేయము
వ్యాసమౌనికే - శాంతినొసగినది
పోతనయ్యే - పులకించి పలికినది
భవ భయ హారిణి - భాగవతమ్ము॥

ఓం శాంతి - శాంతి - శాంతిః





సర్వేజనాస్సుఖినోభవన్తు
లోకాస్సమస్తాస్సుఖినోభవన్తు





**సర్వం శ్రీ సీతారామచంద్ర పాదార్పణమస్తు**



# మంగళం

మంగళం మంగళం వాయుపుత్ర మంగళం
రామచంద్ర మంగళం - యదుకిశోర మంగళం
కలిమినిచ్చు తల్లికి - కరుణజూచు శారదకు
ఎల్లగృహములందు వుండి - చల్లగాను చూచేటి
వేణుగానలోలునికి - మంగళం - మంగళం -
జగములేలు ప్రభువుకు - మంగళం - మంగళం

ఓం శాంతి - శాంతి - శాంతిః



సర్వేజనాస్సుఖినోభవన్తు
లోకాస్సమస్తాస్సుఖినోభవన్తు




**సర్వం శ్రీ సీతారామచంద్ర పాదార్పణమస్తు**





# శ్రీరామ పట్టాభిషేక ఘట్టము

## జానకి రాముల పట్టాభిషేకము
## జగమంతటికి నయనానందము.

జానకి సహితుడు రామచంద్రుని
రత్నమయమగు ఆసనమ్మున
అయోధ్య నేలెడు సింహాసనమున
కూర్చొనబెట్టిరి మంగళకరముగ.

వృద్ధుడు వశిష్ఠు డందరి ముందు
ఎందరొ భూసురులుండిరి అందు
సుయజ్ఞుడు మరి కాత్యాయనుడు
వామదేవుడు కాశ్యపు డుండిరి.

ఋషిజాబాలి గౌతము డుండిరి
విజయుడు కలిపి ఎనిమిదిమంది
అష్టవసువులు దేవరాజుకు
అభిషేకించుట తలపుల నిండగ.

పురుషసింహుడగు రామప్రభువును
పరిమళజలముల నభిషేకించగ
తీరుగభూసురు లందరు అపుడు
మంత్రులు యోధులు అభిషేకించిరి.

ఎందరొ ఋత్విక్కులు అందరును
అభిషేకించిరి మంత్రయుక్తముగ
కన్యలుకూడా అభిషేకించిరి
కన్నులపండుగ అయినది పండుగ.

దిక్పాలకులు దేవతలందరు
దివ్యములయిన ఓషధి రసముల
అభిషేకించగ, ఋషులు మంత్రములు
వేదఘోషను నింపిరి అపుడు.

వెల్లగొడుగును శత్రుఘ్నుడందగ
వానరరాజు సుగ్రీవుడంతట
తెల్లని వింజామరతో ప్రభువును
వీచెను, గుండెలు పొంగెను హనుమకు.

అసుర భూపతి విభీషణాఖ్యుడు
మరియొక వింజామరతో వీచెను
వాయుదేవుడు ఇంద్రుని కానుక
స్వర్ణకమలముల మాలను యిచ్చెను.

సర్వరత్నముల సమాయుక్తమగు
మణిమయ శోభితమగు నొక హారము
సురపతి పంపగ వాయుదేవుడు
ప్రభువగు రాముని కిచ్చెను అపుడు.

సుర గంధర్వులు గానము చేసిరి
అచ్చర కన్యలు నాట్యము చేసిరి
పట్టాభిషేక సమయమునందు
నేలనిండుగా నవ్వెనుపంటతో.

॥జానకిరాముల పట్టాభిషేకము॥

..క్ష హయములు లక్ష ధేనువులు
..క్కని వృషభము లున్నవి నూరు
..రుషోత్తముడగు రామచంద్రుడు
..నము చేసెను తీరుగనాటిని.

ముప్పదికోట్ల స్వర్ణనాణెములు
విలువగు బంగరు ఆభరణమ్ములు
వెలగల మేలగు వస్త్రము లెన్నో
భూసురోత్తములు దానములందరి.

వైడూర్యములు రత్నములుండి
వజ్రములందు పొదిగిన దానిని
కాంతులు చిమ్మెడి సుందరహారము
సుగ్రీవునికి రాముడు యిచ్చెను.

మణులు వజ్రములు అమరినయట్టి
..లువగు బంగరు భుజకీర్తులను
వాలిపుత్రునికి రాముడు యిచ్చెను
వేడుక చూడగ వచ్చిరి సురలు.

స్వర్ణభూషలు వజ్రహారములు
విలువగు వలువలు వాతాత్మజునకు
సీతామాత యిచ్చెను అపుడు
ఆనందముతో పొంగెను మారుతి.

కంఠమునున్న వజ్రహారమును
జానకి తీసిప్రభువును చూచెను
ఇంగితజ్ఞుడు విభుడు అప్పుడు
ప్రీతిగ యిమ్మనెతోచినవారికి.

వీరుడుగొప్ప తేజోవంతుడు
గుండెలొ గురుతుగనిలిపినవాడు
అంతటి వేడుక కాతడుముఖ్యుడు
కావునమారుతి కిచ్చెను జానకి.

హారము దాల్చిన ఆంజనేయుడు
వెలుగులు చిమ్మెను భాస్కరు వోలె
చంద్రకాంతితో తెల్లగ మెరసే
మేఘములున్న నగమనిపించెను.

దశరథరాముడు మైందుని కపుడు
ద్వివిదుడు-నీలుడు- కపివీరులకు
వారి అభీష్టములన్నీ తెలుసుకు
ఎన్నో విలువగు కానుకలిచ్చెను.

వృద్ధవానరులు అందరు అపుడు
విలువగు భూషలు వస్త్రములెన్నో
ప్రభువు యివ్వగా అందిరి ముదమున
ఆనందముతో పొంగిపోయిరి.

వానరోత్తములు వేడుక చూచి
తీరుగ కానుకలెన్నో అంది
ప్రభువును చూచిరి తిరుగు యానముకు
చల్లని చూపుల సమ్మతించెను.

విభీషణాఖ్యుడు వేడుక చూచి
విలువగు ఆభరణమ్ములు ఎన్నో-
కులధనమును తాకాన్కగనందు
తిరిగి చేరెను లంక ఏలగా.!

॥జానకిరాముల పట్టాభిషేకము॥

కీర్తిమంతుడు రిపుభయంకరుడు
శ్రీరఘురాముడు సంతోషముతో
తమ్ముడు లక్ష్మణు చూచి తీరుగా
పలికెను ఎంతో ప్రియముగ నపుడు.

''సోదర లక్ష్మణ- యీ భూభారము
పూర్వీకులు బల విక్రమములతో
తీరుగ మోసిరి దానిని యిపుడు
యువరాజుగ నువు మోయుము నాతో''

సౌమిత్రపుడు ముందుకు రాక
సమ్మతి నివ్వక మిన్నకుండగ
రాజు- భరతుని ప్రియముగ పిలచి
అభిషేకించెను యువరాజుగను.

రాజోత్తముడు శ్రీరఘురాముడు
అశ్వమేధమును- పౌండరీకమును
వాజపేయమును తీరుగ చేసి
ఎన్ని యాగములొ అన్నీ చేసెను.

పురుషోత్తముడు పుడమిని ఏలెను
చల్లగ పదివేలగు వర్షములు
భూరిదక్షిణలు రాముడు యిచ్చెను
అశ్వమేధములు నూరు చేసెను.

ఆజానుబాహుడు భుజబల తేజుడు
అతి పరాక్రముడు శ్రీరఘురాముడు
తమ్ముడు లక్ష్మణుడుండగ తోడు
పుడమిని ఏలెను పుణ్యచరితుడు.

రామరాజ్యమున గల స్త్రీలందరు
వైధవ్యము నసలెరుగరు వారు
దుఃఖము లేక రోగములుండక
క్రూరమృగముల బాధలు లేవు.

చోరులు లేరు కష్టములెరుగరు
అకాలమరణము లసలే లేవు
కనుకనె వృద్ధులుపిన్నవారికి
ప్రేతకార్యములు చేయుట ఎరుగరు.

రామరాజ్యము చల్లని రాజ్యము
ఎల్లరి మనసుల దోచెను రాముడు
కావున రాముని తలచుచు జనులు
తమలో తాము స్పర్థలు మరచిరి.

తల్లుల కడుపులు పండగ నపుడు
కలిగిరిఎందరొ సుందర శిశువులు
కడుపు పంటలు దీర్ఘాయువుతో
చల్లగ నుండిరి కడుపు చల్లగా.

ప్రజలందరకూ ప్రభువగు రాముడు
జగమంతటికీ దేవుడు రాముడు
రాముడు- రాముడు- రామచంద్రుడు
నిండెను పుడమి రామనామముతొ.

రామరాజ్యమున తరువులు విరసి
ఫలపుష్పముల శోభలీనగా
వర్షము తప్పక కురిసె క్రమముగా
వాయువు వీచెను సుఖములు కలిపి.

॥జానకిరాముల పట్టాభిషేకము।

చాతుర్వర్ణములందలి జనులు
బ్రాహ్మణ-క్షత్రియ-వైశ్య-శూద్రులు
లోభము విడచి తమ కార్యములను
తృప్తిగ చేయుచు సుఖముగ నుండిరి.

రామరాజ్యమున జనులందరును
భోగభాగ్యముల తులతూగుచును
సత్యసంధులై ధర్మము విడువక
శుభలక్షణముల శోభగ నుండిరి.

యశమునిచ్చుచు ఆయువు పెంచి
ఐశ్వర్యమును కలిగించునదగు
రాజులకందర విజయము కూర్చెడి
ఆదికావ్యమీ రామాయణమును.

కవికోకిల వాల్మీకి మహాఋషి
వ్రాసెను కమ్మగ రాముని కథను
చదివిన నరుల-వినిన అందరి
పాపములన్నీ నాశము అగును.

పుత్రుల కోరిన వారందరికీ
సంతతి చల్లగ కలుగజేయును
ఐశ్వర్యములు అందునందరికి
రాజులు రిపులను గెలుతురు ఎపుడు.

చక్కగ దీనిని వినిన స్త్రీలకు
దాశరథులతో సమమగునట్టి
దీర్ఘాయుష్కులు పుత్రులు కలిగి
తల్లిదండ్రుల యశము పెంచెదరు.

శ్రద్ధతొ, శాంతము నిండగ వినిన
వారందరకగు ఎన్నో శుభములు
కష్టములన్నీ తీరును జనులకు
దీర్ఘాయువును పొందెదరందరు.

శ్రీ రఘురాముని చల్లని చూపులు
ఇచ్చును ఎన్నో వరములు నరులకు
ప్రవాసమేగిన కూరిమివారు
సంతోషముతో తిరిగి వత్తురు.

దేవతలందరు ప్రీతి నొందెదరు
గృహములనున్న ఛిద్రము తొలగి
విఘ్నములన్నీ తొలగిపోవగా
పాపవిముక్తి సుఖములు కలుగును.

రామాయణమిది ఇతిహాసమిది
పూజలనందెడి పుణ్య చరితము
వీనులవిందుగ వినుడందరును,
ఎన్నో శుభములు జయములు కలుగును

రాముని కథను వినినందరకీ
శ్రద్ధగ దీనిని చదివిన వారికి
విష్ణుదేవుడగు శ్రీరఘురాముడు
ప్రీతిగలిగి వారందర బ్రోచును.

కుటుంబవృద్ధి సంపదవృద్ధి
అనుకూలవతి ఆలిగ దొరకి
సౌఖ్యములెన్నో కలుగును వారికి
తలచిన కార్యములన్నీ తీరును.

॥జానకిరాముల పట్టాభిషేకము॥

పుణ్యచరితమును శ్రద్ధగ చదివి
నియమము తప్పక వినినవారికి
కీర్తి కలుగును తేజము కలుగును
సోదరప్రేమ పెరుగును చక్కగ.

కవికోకిల వాల్మీకి వ్రాసిన
రామాయణమును వ్రాయించగను
శ్రద్ధతో ఎవ్వరు ముందుకు వత్తురో
శుభములు- జయములు కలుగును వారికి.

శ్రద్ధాసక్తుల వినినవారికి
అర్థము చక్కగ నేర్చినవారికి
సర్వదేవతలు సుముఖతనుందురు.
పితృదేవతలు దీవనలిడెదరు.

ఇహపరములకు ముక్తిదాయకము
సర్వశుభముల కలుగజేయును
రామాయణమిది పుణ్యచరితము
పూజలు చేయగ దేవుని వంటిది.

జానకి రాముల పట్టాభిషేకము
జగమంతటికి నయనానందము

యుద్ధకాండమున శ్రీరామపట్టాభిషేక ఘట్టము సమాప్తము.



## మంగళం

మంగళం మంగళం – వాయుపుత్ర మంగళం
ఆంజనేయ మంగళం – రామదూత మంగళం
రామచంద్ర మంగళం – జనక సుత మంగళం
సుమిత్ర పుత్ర మంగళం – భరత, శత్రుఘ్న మంగళం
కొలువుతీరు రామునకు – కోదండ ధామునకు
ఎల్ల గృహములందు ఉండి – చల్లగాను చూసేటి
రామచంద్రమూర్తికి – మంగళం – మంగళం
రామబంటు హనుమకు – మంగళం – మంగళం

లోకా స్సమస్తా స్సుఖినో భవన్తు.
సర్వేజనా స్సుఖినో భవన్తు.
శుభం



**సర్వం శ్రీ సీతారామచంద్ర పాదార్పణమస్తు.**

– మంగళం –

బుధకౌశిక మహర్షి విరచిత

# శ్రీరామరక్షా స్తోత్రము

## (తెలుగు రచన)

## ధ్యానమ్

ధ్యాయేదాజాను బాహుం : ధృతశరధనుషం బద్ధపద్మాసనస్థం
పీతం వాసోవసానం, నవకమలదళస్పర్థినేత్రం ప్రసన్నం
వామాంకారూఢ సీతా ముఖకమలమిలల్లోచనం నీరదాభం
నానాలంకారదీప్తం దధతమురుజటామండలం రామచంద్రం

శ్రీరఘురాముని రమ్యచరితము
వందకోట్ల గ్రంధమ్ముల వెలసెను
పలికినట్టి ప్రతి అక్షరమ్మది
మహాపాపముల నాశము చేయును.

నీలికమల మా శ్యామలదేహము
పద్మనయన శరచాప ధరుండు
జటామకుటము కరవాలముతో
దనుజులద్రుంచి జగతిని బ్రోచెను.

సర్వవ్యాపకుడు - పుట్టుక లేకయె
లీలతొ భువిలో అవతరించిన
రామచంద్రుని జానకి సహితుని
లక్ష్మణమూర్తితొ నిలచిన ప్రభువును.

స్మరించుచుండిన సజ్జనులందరి
సర్వపాపముల హరింపజేసే
రామరక్ష - ఈ - స్తోత్రపఠనమున
సర్వకామ్యములు సఫలములగును.

శిరసు - రాఘవుడు రక్షణచేయును
దశరథ తనయుడు నొసటగాచును
కోసలాత్మజా నందనుడెపుడు
నేత్రరక్షణము చేయుచుండును

విశ్వామిత్రుని ప్రియశిష్యుడగు
రాముని రక్షలొ కర్ణములుండును
యజ్ఞ రక్షకుడు నాసిక కాయును
లక్ష్మణాగ్రజుడు ముఖము గాయును.

విద్యానిధి నా జిహ్వను గాయును
భరత వందితుడు కంఠము గాయును
దివ్యాయుధుడు గాయు స్కంధములు
భుజముల గాయును ధనుర్భంజనుడు.

సీతాపతి నా కరములు గాయును
పరశురాముని జయించినట్టి
దశరథరాముడు హృదయ రక్షకుడు
జగద్రక్షకుడు-విజయశోభితుడు.

ఖర రక్కసుని కూల్చిన రాముడు
మధ్యభాగమును రక్షణ చేయును
జాంబవంతునికి ఆశ్రయమిడిన
రఘుపతి-నాభికి రక్షణనిచ్చును.

సుగ్రీవునాధుడు కటిని గాయును
హనుమత్ప్రభువు పిరుదుల గాయును
రాక్షసకుల విధ్వంసకుడైన
రఘుపతి రక్షలొ ఊరువులుండును.

సేతుబంధకుడు కాయు జానువులు
రావణాంతకుడు పిక్కల గాయును
విభీషణాఖ్యుని అభయ ప్రదాత
సిరికారకుడు - పదముల కాయును.

దేహమంతటికి రక్షయె రాముడు -
దీనిని పఠించు పుణ్య తత్పరుడు
చిరాయువై మరి సుఖియైయుండి
వినయ - విజయముల విరాజిల్లును.

రామనామమను రక్ష ధరించిన
పాతాళమున భూతలమందున
గగన చారులలొ కామరూపులలొ
దుష్టులకందక సుఖముగ నుందురు.

రామా-రామ-రామభద్ర రామచంద్ర
నామస్మరణ పాపహరణ చేయుచుండు
భుక్తి-ముక్తి కలుగజేయురామభక్తి
మానవాళి కిదియెనిచ్చు సర్వశక్తి.

జగతి జయించే మంత్రమిదొక్కటె
మంత్రరక్షణ కలిగిన నరుడు
ఈ స్తోత్రము కంఠస్తముచేసిన
సర్వసిద్ధులు సులభ సాధ్యములు.

వజ్ర పంజరము రామకవచము
నామస్మరణము జయమంగళము
సర్వకార్యముల విజయము తథ్యము
మాటకెదురు మరి నిలువరెవ్వరును.

శివుని కరుణచే స్వప్నమునందు
ఏవిధి వినెనో రామరక్షను
ఆ విధముగ-బుధకౌశిక మహర్షి
వ్రాసెను భక్తితొ రామరక్షను.

కల్పవృక్షములు వెలసిన తోట
ఆపదలన్నీ అణగిన చోటు
త్రిలోకముల కభిరామమైనది-
శ్రీమంతుడు-శ్రీరాముడు దేవుడు

రూపసంపదల తరుణవయస్కులు
సుకుమారులు అతిబలవంతులయి
పద్మనేత్రులు విశాలవక్షులు
నారచీరలు కృష్ణాజినముల

ఫలమూలములు తినుతాపసులు
జితేంద్రియులగు బ్రహ్మచారులు
దశరథతనయులు రామలక్ష్మణులు
సకలసాధువుల శరణాగతియగు

# శ్రీరామరక్షాస్తోత్రము

విల్లు ధరించిన వారిలో శ్రేష్ఠులు
రాక్షసకుల విధ్వంసకులైన
రఘువంశమున చందమామలు
రక్షకులగుదురు మాకందరకు

అక్షయ తూణీరమ్ములు నిండి
నారికూర్చిన ధనుసులు కలిగి
రామలక్ష్మణులు  అనవరతము-నే
నడచు మార్గమున రక్షణ నిడెదరు.

కవచధారియై ఖడ్గపాణియై
ధనుర్బాణములు భుజమునదాల్చిన
లక్ష్మణసహితుడు రామచంద్రుడు
ముందు నిలచి నా కోర్కెలు తీర్చును.

దశరథతనయుడు రాముడు-శూరుడు
లక్ష్మణాగ్రజుడు అతిబలవంతుడు
కాకుత్స్థుడు మరి పూర్ణపురుషుడు
రఘూత్తముడు కౌసల్యతనూజుడు.

వేదాంతవేద్యుడు యజ్ఞమూర్తియగు
పురాణపురుషుడు పురుషోత్తముడు
జానకీపతి అతిశ్రీమంతుడు
అప్రమేయ పరాక్రమవంతుడు.

శ్రద్ధాభక్తుల సదాస్మరణము
చేయు భక్తుడు ప్రియతముడగును
అశ్వమేధక్రతు ఫలమునుమించిన
ఫలమునందున నిస్సంశయముగ

నీలనీరదశ్యాముడు రాముడు
పద్మాక్షుడు పీతాంబరధారి
నామస్తోత్రము చేయు నరులకు
భవబంధములు చిక్కులుండవు.

రామచంద్ర! ఓ లక్ష్మణాగ్రజా!
సీతాపతి రఘువంశవర్ధనా!
సుందరమూర్తీ కకుత్స్థరామా!
గుణనిధిసోమా కరుణాసాగర.

విప్రుల హితుడవు ధార్మికమూర్తీ
రాజేంద్రా! ఓ సత్యసంధుడా
దశరథనందన శ్యామలమూర్తీ
మూర్తిగ నిలచిన శాంతస్వరూపా!

లోకాభిరామా రఘుకులతిలకా!
రావణవైరీ దశముఖహారీ
వందనమిదిగో అందుకొనుమయా
సుందరరామా శరచాపధరా!

రామరామ- రామభద్ర- రామచంద్ర
వేదమూర్తి రఘువంశనాథుడ వీవు
వందనమ్ము సీతాపతి- జగతికంతయు
నాథుడవు నమ్మితిమి మమ్ము గావుము

రఘునందనరామా శ్రీరామా!
భరతాగ్రజరామా శ్రీరామా
రణకర్కశరామా రఘురామా!
శరణం- శరణం శ్రీరామా!

రామచంద్ర చరణాలను స్మరణ చేసెద
రామచంద్ర చరణాలను కీర్తించెద
రామచంద్ర చరణాలకు శిరసు వంచెద
రామచంద్ర చరణాలను శరణు వేడెద

తల్లివి నీవే తండ్రివి నీవే
స్వామివి నీవే మిత్రుడు వీవే
అన్నియు నీవే ఆత్మారామా!
అన్యము నెరుగ అంజలి యిదిగో.

లక్ష్మణమూర్తి కుడిభాగమున
వామభాగమున జనకనందినితొ
కన్నులముందర మారుతి కొలువగ
వెలసిన రఘుపతి వందనమిదిగో.

లోకాభిరామా రణరంగధీరా!
రాజీవనేత్రా రఘువంశనాథా
కారుణ్యరూపా కరుణాసముద్రా
శ్రీరామచంద్రా శరణంటినయ్యా!

శ్లో. మనోజవం మారుతతుల్య వేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్టం
వాతాత్మజం వానర యూథ ముఖ్యం
శ్రీరామదూతం శరణం ప్రపద్యే.

రామరామ యను మధురాక్షరములు
కవితాశాఖల కూర్చొని తీయగ
కూసిన 'కోయిల' ముని వాల్మీకి
వందనమిడితిని మునికోయిలకు.

ఆపదలన్నీ హరించునట్టి
సర్వసంపదల నొసంగునట్టి
లోకాభిరాముడు శ్రీరామునికి
తిరిగి తిరిగి నా వందనమిదిగో!

భవబంధముల బీజనాశకము
సర్వసంపదల కాలవాలము
యమదూతలకు గుండెలవియగ
రామగర్జనము చేతము రండు.

రాజశ్రేష్ఠుడు రామచంద్రుడు
సదావిజయమే పొందుచుండును
అట్టి రాముని అహర్నిశము-నే
భజించుచుందును అన్యము నెరుగక.

నిశాచరులగు దనుజుల ద్రుంచిన
రామచంద్రునికి నమస్కరింతును
రాముని మించిన ఆశ్రయమిలలో
లేదు లేదు - నే దాసుడ రామా!

చిత్తము నాది రామాలయము
చిత్తము నిత్యము భజనమందిరము
చిత్తము లగ్నము నీ కీర్తనలో
చిత్త శాంతినిడు శ్రీరఘురామా!

శ్లో. శ్రీరామ రామ రామేతి
రమే రామే మనోరమే
సహస్రనామ తత్తుల్యం
రామనామ వరాననే.

**మంగళం**



సర్వేజనా స్సుఖినో భవన్తు.
లోకా సమస్తా స్సుఖినో భవన్తు.
శుభం



❉ ❉ ❉